శ్రీరామపరబ్రహ్మణేనమః.

## శ్రీమదాంధ్రభాగవతపరిష్కరణప్రకారప్రకాశపీఠిక.

[illegible] నిబర్హణ ప్రవణకర్మాలంకర్మీణాపరిమేయచాతురీమహిమానువర్ణనకృతార్థంమన్యమాననసకసనందనాదిప [illegible] వరేణ్యగుణగణనారాయణాదినారాయణాంశసంభూతుండగువ్యాసుండు నిఖిలలోకులకుధర్మాదిపురు [illegible] లంచిరచియించినభాగవతంబనును త్తమపురాణంబునాంధ్రభాషయందు, గద్యపద్యాత్మకముగానొనర్చిన [illegible] వింవనిష్యందమాన మకరందపానతుందిలమదవదిన్దిందిరాయమానమానసుండైనశ్రీమత్పరమభాగవతుండగు, [illegible] కథావాద్యభివర్ణనంబునిఖిలజనోల్లాసజనకంబుగానుండుననిచెలంచి యీదిగువసంగ్రహముగావివరించెదము. [illegible] లు-౧౬౦౦ గలకాలంబుగతంబైయుండుసమయంబునభగవద్భక్తులకునత్యంతోపయుక్తంబుగావించుట [illegible] సిదదగినసుగుణగణాకరుండైనపోతనామాత్యుండుబమ్మెరవంశప్రసూతుండైన, కేసనమంత్రికిదనూజుం [illegible] ంబునందు,గోసంరక్షణార్థంబుగాస్వగ్రామంబగు నేకశిలానగరంబునకునన్నికృష్ణపర్వతాగ్రంబున నంచ [illegible] స్వజన్మసుకృతపరిపాకాతిశయంబునంజిదానందయోగీంద్రుండనునొక్కఋషిశ్రేష్ఠుండతనికి దృగ్గోచ [illegible] ండమ్మహాత్మునింగాంచియతనిచెంతకుంజనియత్యంతభయభక్తులచేనవనతశరీరుండైయభివందనంబొనర్చిశ [illegible] డుబాలుండగుపోతనామాత్యునియందవ్యాజకరుణనుంచి.శ్రీరామమంత్రరాజంబను గ్రహించి, తదనుష్ఠా [illegible] డపుగమ్మనిపలికియంతర్థానంబయ్యె-నంతనాపోతనామాత్యుండత్యంతనియమనిష్ఠాగరిష్ఠుండు, నేకవారని [illegible] యుండును,బుత్రమిత్రకళత్రాదిరథాసీదానవపసుస్పృహవిత్తార్జ్యానక్తిరహితుండును,ద్వంద్వసహిష్ణుండునుబర [illegible] సుఖముఖుండును,భగవద్గుణవర్ణనైకాయత్తచిత్తుండును,యదృచ్ఛాలాభసంతుష్టమానసుండునునై శుక్లప [illegible] చేంద్రమముగావృద్ధినొంది,విధూతాఖిలభవబంధబంధురుండైఋషివర్యునింబోలిలోకంబునవినుతికెక్కె [illegible] రామప్రసాదంబునననన్యాదృశానవద్యకవిత్వవిద్యావాప్తికలుగుటంజేసి తత్కాలప్రసిద్ధులుగానుండినవిశ [illegible] శ్రీమద్భాగవతంబాంధ్రభాషయందు,గద్యపద్యాత్మకంబుగారచియింపనేవరుసమర్థుండవుగావుననఖిలలోకహితా [illegible] ంపఁబోతనామాత్యుండట్టియుత్తమజనప్రార్థనచేఁబరితుష్టహృదయుండై. యాదుర్ఘటకార్యంబు నెరవేరుట [illegible] సాలీరంబునకరిగియచ్చటసోమోపరాగపుణ్యకాలంబుననానదియందుస్నాతుండై శ్రీరామమంత్రాను [illegible] స్వాభిలషితార్థంబువలంచియాకార్యంబునెరవేరుటకు శ్రీరామానుగ్రహంబునుం బ్రార్థింపన తత్కృపాన [illegible] నికిఁబ్రత్యక్షంబైయతండాంధ్రభాషయందుజేయనుద్యమించినశ్రీభాగవత గ్రంథంబన్మదంకితంబుగాఁజే [illegible] యనియను గ్రహించియంతర్థానంబునొందె-నంతనతండుకృతార్థంమన్యమానసుండైమఱలియేకశిలానగరంబునస్వ [illegible] త్రినిష్ఠాదయంబునభావింపుచుండదనుగ్రహంబుననాంధ్రభాగవతంబునను గ్రంథంబుగారచించినంతసిల్లియుం

### ఆంధ్రభాగవతరచనాక్రమము.

[illegible] నిచేరచితంబగునాంధ్రభాగవతంబునంగలగ్రంథసంఖ్యాసాకల్యంబుగాఁగలంప నరాసరి ముప్పదివేలున్నవి. [illegible] తంబగుసంస్కృతభాగవతంబునంగలగ్రంథసంఖ్య రమారమియిరువదిరెండువేలుగానున్నవి. ఈమీఁదఁజెప్పిన [illegible] యుంచెడిగ్రంథసంఖ్యగలదిగానీగ్రంథరచనచేయుటకు మూలకారణంబెయ్యదియనిన, బ్రహ్మాద్యష్టాదశపు [illegible] వతంబత్యంతరహస్యార్థప్రతిపాదకపరమవేదాంతప్రతిపాద్యభగవద్గుణగణాపాదకంబగుసు త్తమగ్రంథంబై [illegible] బుఁజేటపడునట్లువ్యాఖ్యానరూపముగానభివర్ణించుటవల్లను,భగవద్గుణవర్ణనాదిఘట్టంబుల సంస్కృతభాగవత [illegible] స్వకీయభగవద్భక్త్యతిశయమునస్వానవద్యకవిత్వవిద్యాచాతురీసంప్రాప్తనిరంకుశస్వాతంత్ర్యమును,నకల [illegible] నుభగవద్గుణాదులనువిశేషముగావర్ణించుటవల్లను,భాగవతగ్రంథప్రతిపాదితంబుగాక, విశిష్టశిష్టజనాంగీకా [illegible] శాదిగ్రంథంబులయందుప్రతిపాదితంబులగు కథాశేషంబులఁదెలుపుటవలనను, ఈమీఁదఁజెప్పిన హేతు [illegible] బునందుసరాసరియష్టసహస్రగ్రంథసంఖ్యయధికంబైయున్నదిగాననంతరీత సకలార్థంబులుగలదనియసదు నది [illegible] నయతిశ్లాఘ్యంబుగానుండురీతిసంస్కృతభాగవతగ్రంథప్రతిపాదితార్థావిరుద్ధభగవద్గుణవర్ణనాదులుగల యీ [illegible] శిష్టజనంబులచేనంగీకరింపంబడఁదగినదిగానున్నయది-ఇదియునుంగాకభారతరామాయణవిష్ణుపురాణస్కాం [illegible] సనగద్యపద్యాత్మకంబుగాఁజేసిననన్నయభట్ట,తిక్కనసోమయాజి,భాస్కరకవి ప్రభృతులగుమహాకవులాయా [illegible] మూలగ్రంథపదలక్షణమకుఁదోఁచినట్లుగ్రంథరచనఁగావించినందుననసాదలక్ష గ్రంథపరిమితంబగుమహాభార తత్సహస్రసంఖ్యాకగ్రంథవిస్తృతంబైయున్నది.ఇదేతీరుననిరువదినాల్గువేలగ్రంథపరిమితంబై షట్కాండ [illegible] ణంబుఁదెనుఁగునందుజెప్పినచొవ్వనభాస్కరకవిపంచదశసహస్రగ్రంథవిస్తరంబుగానొనర్చె-నట్లుమూల [illegible] ననుసరించిగ్రంథంబులరచియించుటవలనవ్యాసవాల్మీకాదిమహర్షులయథోక్తార్థంబునముగ్రంబుగాఁ [illegible] సపరంబులుగానుండుటవలనఋషిప్రోక్తసంస్కృతగ్రంథంబులవలెనత్యాదరణీయంబులుగా నేరవు

యద్ధాదికథాభాగములిందుదెలుపఁబడియున్నవి.దీనిమూలగ్రంథంబగుభాగవతమందుదెలుపఁబడలేదు.

నంతనానారాయణకవియదే ప్రకారంబుననత్యంతగురుభక్తినమన్వితుండైగుర్వాజ్ఞానుసారముగానా గ్రంథమునందుసాకల్యంబుగావిభ్రష్టంబులైనఘట్టంబులనవీనముగారచియించి పూర్ణంబులుగానొనర్చితక్కిన గ్రంథభాగమునంతయులెన్స గాఁబరిష్కరించియనేక ప్రతులేర్పడునట్లులిఖియించిలోకంబునం బ్రసిద్ధినొందింపఁజేసెఁగావునఁ బంచమ.షష్ఠ, ఏకాదశ ద్వాదశస్కంధంబులును. బోతనామాత్యునిపదకయ్యాదిసాజాత్యమునొందియుండనివేరేకొన్నిఘట్టములును, వె. నారాయణకవి ప్రభృతులగుపోతనామాత్యశిష్యజనరచితంబులని తెలియఁదగినవి- ఈ విషయమంతయుబమ్మెరపోతనామాత్యునిజన్మకర్మప్రభావాదులఁదెలిపెడువచనరూపంబగు ప్రాచీనపండితజనలిఖిత గ్రంథంబురప్పించియందు దెలిపియుండెడు క్రమముననలిసం గ్రహముగానిందు దెలపడమైనది.

——— శ్రీకృష్ణావతారకాలనిర్ణయవిచారఘట్టము. ———

శ్రీమదాశ్రితజనాపన్నివారణైకపరాయణుండగునాదినారాయణుండు భూభారావతరణార్థంబు బ్రహ్మరుద్రేంద్రాదినిఖిలదేవగణంబుచేనం ప్రార్థితుండై శ్రీకృష్ణావతారంబునొంది యఖిలదుష్టజననిబర్హణశిష్టజనపరిరక్షణాదికృత్యంబులనలిపియమానుషంబులగుననంతవిచిత్రచరిత్రంబులచేనపరిమేయమహిమనశేషభక్తజనావళికిందెలిపిమఱలబ్రహ్మాదిదేవగణప్రార్థితుండైస్వధామంబగువైకుంఠధామంబునకరిగెనట్టియపరిమేయానన్యాదృశానవద్యగుణగణప్రభావవినుతుండగు భగవంతునియవతారకాలనిర్ణయంబునన్యూనానతిరిక్తంబగునట్లు సాకల్యంబుగాఁదెలిపెడుభాగవతవిష్ణుపురాణహరివంశాదిగ్రంథంబులలోఁగొన్నిటియందు శ్రీకృష్ణావతారఘట్టంబునతజ్జననక్షత్రమును. దదావిర్భావప్రతిపాదకనిశీథకాలవిశేషమునుమాత్రముదెలిసియున్నది-మఱికొన్నిగ్రంథంబులయందు-మాస-ఋతు-పక్ష-నక్షత్రముహూర్తములుమాత్రముదెలుపఁబడియున్నవిగానియట్టియభ్యుదయకాలంబునిఖిలభక్తజనులత్యంతానందంబుననిచానించి తెలుసుకొనుటకునుపయుక్తంబగునట్లు,యుగవర్షాదినిర్ణయంబాయవతారఘట్టంబునఁగంఠోక్తిగానెందుందెలుపఁబడలేదు-అయితేతదితరఘట్టంబులయందునాయుగవర్షాదినిర్ణయంబువిద్వజ్జనైకవేద్యంబగునట్లువివిధవచనంబులచేసూచితంబైయుంటున్నది-మఱిన్నియట్టిసూచితార్థంబఖిలభక్తజనగ్రాహ్యంబుగాకబోవుచున్నందున నాకృష్ణపరబ్రహ్మమూర్తియేయుగంబుననేవర్షంబుననవతరించెననియు,నట్టికాలంబుగణుతింపనిప్పటికిగతసంవత్సరములెన్నియనియు. నప్పరమాత్ముండు భూలోకంబునలీలామానుషవిగ్రహంబుదాల్చియుండినవర్షంబులెన్నియనియునీలీరునఁగలిగెడుసందేహసముదయంబుచేనఖిలభగవద్భక్తులునందిగ్ధమానసులగుచున్నారు-కాఁగానట్టిసందేహసముదయనివృత్తిచేయుటచేనఖిలాస్మదీయజనులసుల్లసింపఁజేయందలంచి శ్రీకృష్ణావతారకాలనిర్ణయప్రతిపాదకగ్రంథంబులఁదెలుపఁబడియుండెడుప్రమాణవచనాభిప్రాయములఁబట్టిసర్వగ్రంథసామరస్యంబుఁగలుగునట్లువిశదముగానీదిగువఁదెలుపుచున్నాము. ——— శ్రీకృష్ణావతారకాలనిర్ణాయకప్రమాణవచనార్థవిచారము. ———

శ్రీమద్భాగవతంబునందుదశమంబునంగలతృతీయాధ్యాయమునందుదెలుపఁబడియుండెడు శ్రీకృష్ణమూర్త్యావిర్భావకాలప్రతిపాదకప్రమాణవచనములు.—— ౧శ్లో॥ అథసర్వగుణోపేతః కాలఃపరమశోభనః। యర్హ్యేవాజనజన్మర్క్షంశాంతర్క్షగ్రహతారకమ్॥ ౭॥ మందంమందంజలధరాజగర్జురనుసాగరమ్।నిశీథేతమఉద్భూతేజాయమానేజనార్దనే॥—— ఈశ్లోకద్వయమునందు ప్రథమశ్లోకంబునంగల-అజనజన్మర్క్షం-అనుటచేతరోహిణీనక్షత్రమనియు, రెండవశ్లోకమునసుండెడు-నిశీథేతమఉద్భూతే-అనెడుపదములచేతచీఁకటితోఁజేరియుండెడునిశీథకాలమనియుఁదెలియఁబడుచున్నది-ఈమీఁదఁజెప్పిన- రోహిణీనక్షత్ర-నిశీథకాలములుగాకతక్కిన యుగ-వర్ష-ఋతు-మాస-పక్ష-తిథులుమొదలయినవియేమియునీభాగవతంబునసుండునాయవతారఘట్టంబునఁదెలుపఁబడియుండలేదు.

హరివంశమునందుపూర్వభాగములోఁగల-౫౨-అధ్యాయమునందుసుండే ప్రమాణవచనములు.—— యోగమాయాం ప్రతివిష్ణూక్తిః. ౨౯శ్లో॥తతోహంసంభవిష్యామి దేవకీజఠరేశుభే।గర్భేత్వయాయశోదాయాఃగంతవ్యమవిలంబితమ్॥—— ౨౭॥ ప్రావృట్కాలేచనభసికృష్ణపక్షేమహానిశి।ఉత్పత్స్యామినవమ్యాంచ ప్రసూతింత్వమవాప్స్యసి॥—— ఈశ్లోకద్వయమునందుగల- ప్రావృట్కాలే- అనుటవలనవర్షర్తువనియు,నభసి- అనుటచే శ్రావణమాసమనియు,కృష్ణాష్టమ్యాంనిశి-అనుటవలనఁగృష్ణపక్షాష్టమిలోరాత్రిపూటఅనియుఁ- దెలియఁబడుచున్నది-మఱియు-నవమ్యాంచ ప్రసూతింత్వమవాప్స్యసిఅనువాక్యార్థమునువక్ష్యమాణహరివంశగ్రంథోదాహృతప్రమాణవచనమగు (యామేవరజనీంకృష్ణోజజ్ఞేవృష్ణికులే ప్రభుః। తామేవరజనీంకన్యాంయశోదాదేవ్యజాయత॥ అనువచనార్థమునుసమరసపెట్టియాలోచింపఁగానవమీవిద్ధయగుఅష్టమి శ్రీకృష్ణజననతిథియని తెలియఁబడుచున్నది.

తస్మిన్నేవాధ్యాయే.—— యోగనిద్రాంప్రతిశ్రీమన్నారాయణోక్తిః.—— ౪౨శ్లో॥ అర్ధరాత్రేకరిష్యామిగర్భమోక్షంయథాసుఖమ్। అష్టమస్యతుమాసస్యజాతావాప్యంతరప్రసవమ్॥ ౪౩॥ అహంయశోదాయాస్మిత్వందేవకీయాహిదేవకీమ్।అవయోర్గర్భవత్యాసేకంపోగచ్ఛతిసూథశామ్॥—— అధ్యాయే-౫౩—— ౪౪శ్లో॥ యస్మిన్నహనిదేవేశంగర్భేచాథత్తదేవకీ।యశోదాపినమాదత్తగర్భంతదహరేవహి॥ ౪౫॥విష్ణోశ్శరీరతాంనిద్రాంవిష్ణోర్నిర్దేశకారిణీమ్।గర్భకాలేత్వసంపూర్ణేహ్యష్టమేమాసితేస్త్రియా॥౪౬॥ దేవకీచయశోదాచసుషువాతేసమంతదా।యామేవరజనీంకృష్ణోజజ్ఞేవృష్ణికులేప్రభుః॥ ౪౭॥ తామేవరజనీంకన్యాంయశోదాదేవ్యజాయత। అభిజిన్నామనక్షత్రంజయంతీనామశర్వరీ॥ ౪౮॥ రోహిణ్యామర్ధరాత్రేచసుధాంశావభ్యుదయోన్ముఖే।దేవక్యజనయద్విష్ణుంయశోదాతాంతుకన్యకామ్॥—— ౪౯॥ముహూర్తేభిజితిప్రాప్తేహ్యర్ధరాత్రేసుభావహే॥—— తస్మిన్నేవాధ్యాయే. —— ౬౧శ్లో॥ వసుదేవస్తతోగత్వాదేవకీగర్భవేశ్మతత్।దదర్శదేవదేవేశంరాత్రౌజాతమధోక్షజమ్॥—— ౬౨॥ శయానమాంబుజేపత్రేవటపత్రేయథాపురా। ప్రాచీనశిరసందేవంపశ్యమన్యస్తపాదకమ్॥

ఈవచనార్థపర్యాలోచనసాకల్యముగాఁజేయుటవలన భాగవతవిష్ణుపురాణ ప్రతిపాదితమాసఋతుపక్షనక్షత్రతిథిరాత్రులుముహూర్తమేకాక జననముహూర్తమభిజిత్తనియు, దేవకీయశోదలగర్భంబుననేకరాత్రియందే శ్రీకృష్ణయోగమాయలున్భవించిరనియు,నట్టియుద్భవకాలమసంపూర్ణమగునష్టమమాసముగానుండెదుననియు.నట్లసంపూర్ణకాలంబునజనియించినందుననే శ్రీకృష్ణమూర్తియతనిజననోత్తరకాలంబునలోకములవాడుకప్రకారముపదపత్రముల నుంచఁబడియుండెననియు,నత్తరిసూతిగృహంబునఁదేజఃపుంజమైనా శ్రీకృష్ణుండుప్రాగ్దిక్షిరస్కుఁడును, బశ్చిమదిక్సన్న స్తపాదయుగళుండునైయుండెననియునివిమొదలగువిశేషార్థంబులుదెలియఁబడుచున్నవి.

3 శీఘ్రముబంచమస్కంధము. గంగనకవిచేరచియింపంబడె. షష్ఠస్కంధముసింగనకవిచేరచియింపఁబడె.

శ్రీమద్భాగవతైకాదశస్కంధంబునంగలషష్ఠాధ్యాయమునందు శ్రీకృష్ణమూర్తిజీవితకాలనిర్ణాయక ప్రమాణవచనము.

శ్రీకృష్ణంప్రతి. బ్రహ్మాదిదేవోక్తిః.—— ౨౫శ్లో॥ యదువంశేవతీర్ణస్యభవతఃపురుషోత్తమః।శరచ్ఛతంవ్యతీయాయపంచవింశాధికంవిభో॥ ఈవచనమునందుండు-భవతః,పంచవింశాధికం,శరచ్ఛతం,వ్యతీయాయ,అనుపదములచేత బ్రహ్మాదిదేవతలు శ్రీకృష్ణుని వైకుంఠమునకురమ్మని పిలువవచ్చినకాలమునందునమ్మహాపురుషునికిజననప్రభృతిగతసంవత్సరములు-౧౨౫-అని తెలియఁబడుచున్నవి. విష్ణుపురాణమునందునిదేక్రమంబునఁజెప్పఁబడియున్నది-అదెట్లనిన.——— విష్ణుపురాణము,అంశము-౫. అధ్యాయము-౩౭.—— శ్రీకృష్ణంప్రతి,ఇంద్రప్రేషితదేవదూతోక్తిః.—శ్లో॥ వస్వశ్విమరుదాదిత్యరుద్రసాధ్యాదిభిస్సహ।విజ్ఞాపయతిశక్రస్త్వాంతదిదం శ్రూయతాంప్రభో॥దుర్వృత్తానిహతాదైత్యాభువోభారోవతారితః।త్వయాసనాథాస్త్రిదశాభవంతుత్రిదివేపునః॥ పంచవింశత్యుత్తరకంశతంతుశరదాంగతమ్।ఇదానీంగమ్యతాంస్వర్గోభవతోయదిరోచతే॥ ఈవచనములయందుదెలుపఁబడిన-పంచవింశత్యుత్తరకంశతంతుశరదాంగతం।అనువాక్యముచేత- ౧౨౫-సంవత్సరములుజరిగినవియని తెలియఁబడుచున్నవి. హరివంశాదిగ్రంథములయందునిదేక్రమంబునఁదెలుపఁబడియున్నది. గ్రంథవిస్తరభీతిచేతనాగ్రంథస్థప్రమాణవచనంబులనిచ్చటఁబ్రకాశపరచలేదు.

శ్రీమద్భాగవతైకాదశస్కంధమునంగలసప్తమాధ్యాయములోనుండు - శ్రీకృష్ణమూర్తినిర్యాణకాలప్రతిపాదకప్రమాణవచనములు. ౨॥శ్లో॥ ఉత్తరార్థమారభ్య ॥ సముద్రస్సప్తమేహ్న్యేతాం పురీమాప్లావయిష్యతి ॥ ౩॥ యర్హ్యేవాయంమయాత్యక్తోలోకోయంనష్టమంగళః।భవిష్యత్యచిరాత్సాధోకలినాపినిరాకృతః ॥ ఈప్రమాణవచనార్థపర్యాలోచనవలనఁదెలియఁబడినదేమనిన, బ్రహ్మాదిదేవతలు శ్రీకృష్ణమూర్తినివైకుంఠమునకురమ్మనివిన్నపించివారివారిలోకములకుఁబోయినతోడుతనే శ్రీకృష్ణుండుద్ధవునితోనీద్వారకాపట్టణము నేటికేడవదివసమునందుసముద్రునిచేనావరింపఁబడుననియు, నేనుభూలోకమునువదలఁగానే- కలిప్రవేశించుననియు,నట్టికాలమతిత్వరగానేసంభవించుననియుఁజెప్పినందున, శ్రీకృష్ణనిర్యాణకాలంబుకలియుగప్రవేశదినమునందనియు,నట్టికలియుగాదిదివసమునకునవ్యవహితపూర్వమానంబుననే బ్రహ్మాదిదేవతలు శ్రీకృష్ణాహ్వానముసేయవచ్చిరనియు,సూచనగాఁదెలియఁబడుచున్నది. ఈయర్థమువిష్ణుపురాణమునందుస్పష్టముగాఁదెలుపఁబడియున్నదదెట్లనిన. ———విష్ణుపురాణం,అంశం,౫-అధ్యాయం ౨౪,శ్లో॥ యస్మిన్ కృష్ణోదివంయాతస్తస్మిన్నేవతదాహని।ప్రతిపన్నంకలియుగంతస్యసంఖ్యాంనిబోధత॥ ఈవచనార్థపర్యాలోచనవలన శ్రీకృష్ణనిర్యాణదివసమునందేయీభూలోకమునందుగలిప్రవేశమాయెననిదృఢముగాఁదెలియఁబడుచున్నదిగాన-మీఁదఁదెలుపఁబడినభాగవతవచనసూచితార్థమునకుసామరస్యములెస్సగాఁగలుగుచున్నదని తెలియఁదగ్గది.

బ్రహ్మాదిదేవతలు శ్రీకృష్ణాహ్వానమునందుదెలియఁజేసిన-౧౨౫-సంవత్సరములుదైవసంవత్సరములనిచెప్పెడుదురాక్షేపపరిహారవిచారము.—— విష్ణుపురాణం,అంశం,౫-అధ్యాయం,౨౩ శ్రీకృష్ణంప్రతిముచికుందోక్తిః.-— శ్లో॥ ముచికుందస్సతత్రాసౌవృద్ధగార్గ్యవచస్స్మరన్।సంస్మృత్య.ప్రణిపత్యైనంపరంసర్వేశ్వరంహరిమ్॥ ప్రాహజాతోభవాన్విష్ణోరంశస్త్వంపరమేశ్వర।పురాగర్గేణకథితమష్టావింశత్తమేయుగే॥ద్వాపరాంతేహరేర్జన్మయదువంశేభవిష్యతి। ఈవచనార్థపర్యాలోచనవలన శ్రీకృష్ణావతారముజగత్సృష్టిమొదలుకొనిజరిగే యిరువదెనిమిదవమహాయుగంబునందు ఘటస్థించెడు ద్వాపరయుగంబుననంతిమభాగములో-యదువంశమునందు శ్రీకృష్ణమూర్తియవతరించఁబోవుచున్నాఁడనితొల్లివృద్ధగార్గ్యులుచెప్పినటులముచికుందమహారాజు శ్రీకృష్ణునితోవిన్నపముచేసెనని తెలుపఁబడినందున మును దుదాహరించినప్రమాణవచనములలో శ్రీకృష్ణునితో బ్రహ్మాదిదేవతలు తెలిపినసంవత్సరపరిగణనము-ఐహికవ్యవహారోపయుక్తాస్మత్ప్రభవాదిసంవత్సరములేకాని ఆముష్మికలోకవ్యవహార్యమాణదైవసంవత్సరంబులుకావు-కానమీఁదఁజెప్పినముచికుందోక్తిచొప్పనయిరువదెనిమిదవమహాయుగంబునఘటస్థించినద్వాపరయుగంబీకలియుగంబునకునవ్యవహితపూర్వకముగానుండుద్వాపరయుగమేకానివేరొకద్వాపరయుగమనుటకానేరదదెట్లనిన

సూర్యసిద్ధాంతము-అధ్యాయము. ౧——శ్లో॥ఆయుషోర్థంగతంతస్యశేషాత్కల్పోయమాదిమః।కల్పాదస్మాచ్చమనవష్షడ్వ్యతీతాస్ససంధయః॥ అష్టావింశద్యుగాదస్మాద్యాతమేతత్కృతంయుగమ్।అతఃకాలంప్రసంఖ్యాయసంఖ్యామేకత్రపిండయేత్ ॥ ఈవచనములయందుదెలిపిన-అష్టావింశద్యుగాదస్మాత్।అనుటవలననిదియిరువదెనిమిదవమహాయుగమని తెలియనాయెను. ఇచ్చట యుగశబ్దమువ్యాఖ్యాతృప్రాయానుసారముగామహాయుగపరమని తెలియఁదగినది. అటుకానిపక్షమందీవచనములలోనే-యాతమేతత్కృతంయుగం।అనువచనమువలనఁగృతయుగంబునకునష్టావింశమహాయుగాంతఃపాతిత్వముఘటించకపోయ్యెని; కాఁగానదేక్రమంబునఁగ్రిందటజరిగినకృతయుగము మొదలుకొనియిప్పుడుజరిగెడికలియుగపర్యంతముగలయుగచతుష్టయమునిరువదెనిమిదవమహాయుగంబునఁజేరినదిగాన మునుదువిష్ణుపురాణోదాహృతమగు-ద్వాపరాంతేహరేర్జన్మయదువంశేభవిష్యతి।అనువచనమువలనఁదెలిపినయుగమీకలియుగావ్యవహితపూర్వయుగంబగు ద్వాపరయుగంబేయనుట; సూర్యసిద్ధాంతాదినిఖిలసిద్ధాంతగ్రంథప్రతిపాదితసిద్ధాంతంబుతోనత్యంతసామరస్యమునొందియున్నదిగానమీఁదఁదెలిపినసంవత్సరనిర్ణయముదైవసంవత్సరపరమని కుశంకలుసేయుపురుషులపలుకులకెంతమాత్రమునవకాశముగలుగనేరదదియునుంగాకమీఁదనుదాహరించినగర్గవాక్యానుస్మృతశ్రీకృష్ణజననకాలనిర్ణయవిషయము శ్రీమద్భాగవతమునందునుసూచనగాఁదెలుపఁబడియున్నదదెట్లనిన.

భాగవతం-దశమం-అధ్యాయం-౫౧.—— ౪౪శ్లో॥ఇత్యుక్తస్తంప్రణమ్యాహముచికుందోముదాన్వితః।జ్ఞాత్వానారాయణందేవంగర్గవాక్యమనుస్మరన్॥ ఇచట-గర్గవాక్యమనుస్మరన్।అనుటకుభాగవతవ్యాఖ్యానకర్తలైనసర్వజ్ఞులుగానుండిన శ్రీధరాచార్యులవారు- అష్టావింశతితమేమహాయుగేయదువంశేభగవానవతరిష్యతీతి-గార్గ్యవాక్యమనుస్మరన్నిత్యర్థః-అనిచెప్పియున్నారు. మఱియు నాంధ్రభాగవతకర్తయగు-బమ్మెరపోతనయునుదశమస్కంధపూర్వభాగములోముచికుందపూర్వకథాభివర్ణనంబనుఘట్టమునందునంతిమవచనాంతములో (హరికిముచికుందుండునమస్కరించినారాయణదేవుండగుటనెఱింగియిరువదెనిమిదవమహాయుగంబునందునారాయణుండవతరించుననిమున్నుగర్గుండుసెప్పుటతలంచి) అనివ్యాఖ్యాతృభిప్రాయానుసారముగానే తెలిపియున్నాఁడుగాన-అష్టావింశమహాయుగాంతఃపతితంబగు ద్వాపరయు

* కృతాదియుగచతుష్టయము- ఒకమహాయుగమనబడుచున్నదిగాననొకమహాయుగమునకృతాదినాల్గుయుగములుతదంతస్థములగుచున్నవి.

గంబీకలియుగావ్యవహితపూర్వవృత్తియగనేయదనిదృఢముగానఖిలజనులకుఁదెలుపుటయందత్యంతానందంబునొందుచున్నాము. కాఁగా. శ్రీమద్భాగవత,విష్ణుపురాణ,హరివంశాదిశిష్టజనాంగీకారంబులగుగ్రంథంబులసాకల్యంబుగానంప్రదాయార్థమునకుఁబొరపాటురానటుల పరిశీలించినయెడనఖిలసందేహంబులకు సామరస్యంబతిశ్లాఘ్యతమంబుగాఁగలుగుననుటయందేమియుసందేహము లేదుగాన నఖిలచరాచరపోషణైకాయత్తచిత్తుండగుభగవంతునియవతారాదికృత్యములనుగురించి, కుమతప్రవిష్టులగుకుజనులు సేయుకుల్సితాక్షేపణములంతయునసంప్రదాయాభీతాపరిపూర్ణగ్రంథార్థపరిజ్ఞానప్రయుక్తావివేకమూలకమనిదృఢముగానమ్ముచున్నారము.

నిష్కృష్టాభిప్రాయవివేచన.——— మీఁదఁదెలిపినక్రమంబున భాగవత,విష్ణుపురాణ, హరివంశాదిగ్రంథప్రతిపాదితప్రమాణవచనార్థపర్యాలోచనచేఁగలిగెడు నిష్కృష్టాభిప్రాయంబఖిలజనులకుఁగరతలామలకముగాఁదెలియఁబడేలాగుననీదిగువవివరింపుచున్నాము.

ద్వాపరయుగపరిమితసంవత్సరంబులగు-౮౬౪౦౦౦ లలో-౮౬౩౮౯౪ సంవత్సరంబులును, ౪-నెలలును, ౨౧-దినములును, గతమయియుండుకాలంబునఁదటస్థించియుండినస్వభానుసంవత్సరశ్రావణబహుళంబున, నవమీవిద్ధాష్టమియందు,రాత్రిని నిశీథకాలంబున, వృషభలగ్నములోసంభవించినసర్వోత్తమంబగునభిజిన్ముహూర్తంబున,శ్రీమదాదినారాయణపరబ్రహ్మమూర్తి లీలాగృహీతశరీరుండయిదేవకీదేవిగర్భంబుననర్భకుండయియుదయించె-నట్టియుదయకాలంబునఁబ్రాగ్దిశియమితశిరస్కుండును,పశ్చిమదిగ్విన్యస్తపాదయుగళుండును, చతుర్బాహుండును,శంఖచక్రాద్యాయుధధరుండు,నధికతేజఃపుంజదీపితసూతికాగృహుండునుగా, పద్మపత్రంబులశయనించి తేజరిల్లుచుండె-నమ్మహాత్ముండావిర్భావంబునొందిన (మీఁదఁదెలిపిన) స్వభానుసంవత్సరశ్రావణబహుళాష్టమిమొదలుకొనిలీలామానుషవిగ్రహంబుఁదాల్చిభూలోకంబుననుండినసంవత్సరంబులు-౧౨౫౯ను, నెలలు-౭ను, దినములు-౮౪గానుండుచున్నవి. అప్పురుషోత్తముండు లీలామానుషవిగ్రహంబువదలి మఱల వైకుంఠంబుప్రవేశించినకాలంబు కలియుగాదిమసంవత్సరంబగు ప్రమాదిసంవత్సరచైత్రశుద్ధప్రతిపద్భృగువాసరంబుగానుండుచున్నది. అట్టిజగదీశ్వరుని నిర్యాణానంతరముగతసంవత్సరంబులపరిమితి-౪౯౯౦గానుండుచున్నవి. శ్రీకృష్ణమూర్త్యావిర్భావదినంబునందేనవమీఘటికలలోయశోదాదేవిగర్భంబునయోగమాయజనించెనుగానయోగమాయ,శ్రీకృష్ణానుజన్మయని తెలియందగినది.

ఇదియనుసంగాక నిఖిలాస్మదీయజనులకు నిత్యక్షేమముఁగలుగఁజేసెడు సద్విద్యాభివృద్ధినొందుటకు ముఖ్యసాధనంబులుగానుండు సద్గ్రంథపరిష్కరణ, తత్ప్రకాశనాదిసత్క్రియలయందుప్రవర్తించియుండెడు సస్మత్సజాతీయులగుజనులచేనత్యంతపరిశ్రమంబునం బరిష్కరింపంబడెడు నస్మద్గ్రంథంబులఁబఠించుటవలనఁగలిగెడు నానందంబుననుభవించు సత్పురుషులుగృతజ్ఞులయి యిదేక్రమంబున నస్మదీయసద్గ్రంథంబులభివృద్ధినొందుటకత్యంతసహాయంబుచేయుటయం దపరిమితానక్తినొందియుండవలయునని నిఖిలసజ్జనసద్విద్యావైదుష్యాభివర్ధనైకపరాయణుండగునారాయణుని నిరంతరంబుంబ్రార్థింపుచున్నారము.



## ప్ర క ట న.

ఇందువలనసకలసజ్జనులకుఁ దెలియచేయడమేమనిన; ఈ శ్రీమదాంధ్రభాగవతము, క్రయమునకుకావలసినవారలు- చెన్నపురి; పెద్దినాయడిపేట-సాలవీథిలో-అడిపట్టపిళ్లారిగుడికెదురుగానుండు- ౭౦-నెంబరుగల గృహమునందుస్థాపించియుండు విద్వన్మనోరంజనీముద్రాక్షరశాలాధికారులలోనొకరగు-మద్దాళి.అయ్యపరాజుగారిమూలముగాజాబువ్రాసిక్రయమునుపంపి భంగీచార్జితామేవుంచుకొనిపుచ్చుకొనవలసినది.

శ్రీహయగ్రీవాయనమః.

## శ్రీమదాంధ్రభాగవతపఠనప్రారంభమునకుముందు ప్రతిదినంబును జపవలసిన ప్రార్థనాప్రతిపాదకపద్యంబులయనుక్రమణిక.

### శ్రీ సరస్వతీదేవీ ప్రార్థన.

ఉ॥ శ్రోణితలంబునన్ను మురుసోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత। శ్రోణికిఁ జంచరీకచయసుందర వేణికి రక్షితామర । శ్రేణికిఁ దోయజాతభవచిత్తవశీకరణైకవాణికి। న్వాణికి నక్షదామశుకవారిజపుస్తకరమ్య పాణికిన్॥ శా॥ తల్లీ నిన్నుఁ దలంచి పుస్తకము చేతంబూనితిన్నీవు నా। యుల్లంబందున నిల్చి జృంభణముగా నుక్తుల్సుశబ్దంబుశో,భిల్లంబల్కుము నాదు వాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ। ఫుల్లాబ్జాక్షి సరస్వతీ భగవతీ పూర్ణేందుబింబాననా॥

### శ్రీమద్భాగవతగ్రంథప్రణేతయగు-వ్యాసమహర్షి ప్రార్థన.

ఉ॥ ప్రాంశుపయోదనీలతనుభాసితు నుజ్జ్వలదండధారుఁ బిం। గాంశుసటాచ్ఛటాభరణు నాగమపుంజ పదార్థతత్త్వని। స్సంశయకారుఁ గృష్ణమృగచర్మకృతాంబరు కృత్యభారతీ। వంశవివర్ధనుం త్రిదశవందితు సాత్యవతేయుఁ గొల్చెదన్॥

### భాగవతార్థోపదేష్టయగు-శుకమహర్షి ప్రార్థన.

మ॥ సముఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై సన్న్యాసియై యొంటిఁబో।వ మహాభీతి నొహో కుమార యనుచున్ వ్యాసుండు చీరంగ వృ। క్షములుం దన్మయతం బ్రతిధ్వనులు దిక్కుల్ జేసె యున్నట్టి భూ। తమయున్ మ్రొక్కెద బాదరాయణిఁ దపోధన్యాగ్రణిన్ ధీమణిన్॥

### శ్రీమద్భాగవత ప్రార్థన.

గీ॥ వేదకల్పవృక్షవిగళితమైయిశుక।ముఖసుధాద్రవమున మొనసియున్న। భాగవతపురాణఫలరసాస్వాదన।పదవిఁ గనుఁడు రసికభావవిదులు॥ మ॥ లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం।జులతాశోభితము సువర్ణసుమనస్సుజ్ఞేయము సుందరో।జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబునై। వెలయున్ భాగవతాఖ్యకల్పతరువుర్విన్ సద్ద్విజశ్రేయమై॥ క॥ నిగమములు వేయు చదివిన। సుగమంబులుగావు భక్తి సుభగత్వంబు।ల్సుగమంబు భాగవతమను।నిగమంబు పఠింప ముక్తి నివసనము బుధా॥ గీ॥ అతిరహస్యమైన హరిజన్మకథనంబు। మనుజుఁ డెవ్వఁడేని మాపు రేపు। చాలభక్తితోడఁ జదువుఁ దాసంసార। దుఃఖరాశిఁ బాసి తొలఁగిపోవు॥

### శ్రీభాగవతగ్రంథప్రతిపాద్య శ్రీకృష్ణమూర్తి ప్రార్థన.

మ॥ తరుణాబ్జారుణలోచనద్వయి కృపాధారేయమై యొప్ప సా। గరకన్యాకుచకుంభపాళిఁ బులకల్గన్ స్ప ట్టమహాపీంద్రహృ । త్సరసీజంబులు సంచలింప మురళీసంజాతగీతామృత । స్ఫురణన్ గొల్లరగన్ జరించు హరికై శోరంబు భావించెదన్॥ చ॥ జలనిధికన్యకాఘనకుచస్థలిపచ్చలతాళి గోపికా। విలసితహారమధ్యమణి విశ్వజగద్వలయప్రకాశకో। జ్జ్వలమహనీయరత్న మసివారిత కాళియభోగిభోగమం। డలగిరివజ్రమై వెలయు నందతనూజు భజింతు నామదిన్॥

### గ్రంథనాయకుఁడగు - శ్రీరామమూర్తి ప్రార్థన.

క॥ శ్రీకంఠచాపఖండన। పాకారిప్రముఖవినుతభండనవిలస।
త్కాకుత్స్థవంశమండన। రాకేందుయశోవిశాలరామనృపాలా॥



శుభమస్తు.

శ్రీరుక్మిణీసత్యభామాసమేత శ్రీగోపాలకృష్ణపరబ్రహ్మణేనమః.

# శ్రీమదాంధ్రభాగవతము.

## ప్రథమస్కంధము.

శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోకర। క్షైకారంభకు భక్తపాలనకళాసంరంభకున్ దానవో। ద్రేకస్తంభకుఁ గేళిలోలవిలసద్దృగ్జాలసంభూతనా। నాకంజాతభవాండకుంభకు మహానందాంగనాడింభకున్॥. ఉ॥ వ్రాలినభక్తి మ్రొక్కెద నవారితతాండవకేళికిన్ దయా। శాలికిశూలికిన్ శిఖరిజాముఖపద్మమయూఖమాలికిన్। బాలశశాంకమౌళికిఁ గపాలికి మన్మథగర్వపర్వతో। న్మూలికి నారదాదిమునిముఖ్యమనస్సరసీరుహాళికిన్॥. ఉ॥ ఆతత సేవఁ జేసెద సమస్తచరాచరభూతసృష్టివి। జ్ఞాతకు భారతీహృదయసౌఖ్యవిధాతకు వేదరాశిని। ర్ణేతకు దేవతానికరనేతకుఁ గల్మషజేతకున్ నత। త్రాతకు ధాతకున్ నిఖిలతాపసలోకశుభప్రదాతకున్॥. వ॥ అనినిఖిలభువనప్రధానదేవతావందనంబుఁ జేసి॥. ఉ॥ ఆదరమొప్ప మ్రొక్కిడుదు నద్రిసుతాహృదయానురాగసం। పాదికినోషభేదికిఁ బ్రసన్నవినోదికి విఘ్నవల్లికా। చ్ఛేదికి మంజువాదికి నశేషజగజ్జననందవేదికిన్। మోదకఖాదికిన్ సమదమూషకసాదికి సుప్రసాదికిన్॥. ఉ॥ క్షోణితలంబు నెన్నుదురు సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత। శ్రోణికిఁ జంచరీకచయసుందరవేణికి రక్షితామర। శ్రేణికిఁ దోయజాతభవచిత్తవశీకరణైకవాణికిన్। వాణికి నక్షదామశుకవారిజపుస్తకరమ్యపాణికిన్॥. శా॥ పుట్టంబుట్టశరంబునన్మొలువ నంభోయానపాత్రంబునన్। నేటంగల్గను గాలిఁ గొల్వను బురాణింపన్ దొరంకొంటి మీ। దెట్టే వెంటఁ జరింతుఁ దత్సరణి నాకీవమ్మయోయమ్మమేల్। పట్టున్నాకగుదమ్మ నమ్మితేఁ జుమీ బ్రాహ్మీదయాంభోనిధీ॥. ఉ॥ శారదనీరదేందుఘనసారపటీరమరాళమల్లికా। హారతుషారఫేనరజతాచలకాశఫణీశకుందమం। దారసుధాపయోధిసితతామరసామరవాహినీశుభా। కారతనొప్పు నిన్ను మదిఁ గానఁగ నెన్నఁడు గల్గు భారతీ॥. ఉ॥ అంబ నవాంబుజోజ్జ్వలకరాంబుజశారదచంద్రచంద్రికా। డంబరచారుమూర్తి ప్రకటస్ఫుటభూషణరత్నదీపికా। చుంబితదిగ్విభాగ శ్రుతిసూక్తివివిక్తనిజప్రభావభావాంబరవీథి విశ్రుతవిహారి ననుం గృపఁ జూడు భారతీ॥. ఉ॥ అమ్మలఁగన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాలపె। ద్దమ్మ సురారులమ్మ కడుపాఱడిపుచ్చినయమ్మ నిన్నులో। నమ్మిన వేల్పుటమ్మల మనంబుల నుండెడియమ్మ దుర్గ మా। యమ్మ కృపాబ్ధి యీవుత మహత్త్వకవిత్వపటుత్వసంపదల్॥. మ॥ హరికిం బట్టపురాణి పున్నెముల ప్రోవర్థంపు పెన్నిక్క చం। దురు తోఁబుట్టువు భారతీగిరిసుతల్తో నాడుపూఁబోఁడి తా। మరలం దుండెడు ముద్దరాలు జగముల్మన్నించు నిల్లాలు భా। సురతన్ లేము

---

౧, పంక్తి. శ్రీకైవల్యపదంబు-సర్వోత్కృష్టమైన మోక్షపదము. రెండవయర్థము, శ్రీశబ్దమునకు-ధర్మార్థకామముల నెడి త్రివర్గమర్థము. అట్టి త్రివర్గముతోఁ జేరిన-కైవల్యపదమనఁగా మోక్షము.—౨ మహానందాంగనాడింభకున్-ఉత్తమురాలైన నందుని భార్యయగు యశోదాదేవికు మారునిన్, ఈపద్యమందు-ఆరంభకు, సరంభకు, స్తంభకు, కుంభకు, డింభకు, అనుశబ్దములందుఁ దుదనున్న-క ప్రత్యయము స్వార్థకమనఁబడు. ౩ శిఖరిజాముఖపద్మమయూఖమాలికిన్॥ శిఖరిజా-పార్వతీదేవి యొక్క, ముఖపద్మ-కమలమువంటి ముఖమునకు, మయూఖమాలికిన్-సూర్యునివంటివానికిని.— ౪ నారదాదిమునిముఖ్యమనస్సరసీరుహాళికిన్॥ నారదాదిఋషిశ్రేష్ఠులహృదయకమలమునకుఁ దుమ్మెదవంటివానికిన్.— ౮ మోదకఖాదికిన్॥ కుడుములఁ దినువానికిన్.— ౯ చంచరీకచయసుందరవేణికి॥ తుమ్మెదలగుంపువలె సొబగైన కురులుగలదానికిన్.— ౧౦ పుట్టన్బుట్టన్॥ వల్మీకమందు జనింపలేదు-అనఁగా వాల్మీకిఁ గానసుట. శరంబునన్మొలువన్-రెల్లుదర్భలయందుఁ గలుగలేదు. అనగా స్కందుఁడను గానసుట.— ౧౧ అంభోయానపాత్రంబునన్॥ ఏటన్-కల్గన్-పడవయందు నదిలో నావిర్భవింపలేదు. అనఁగా వ్యాసుఁడను గానసుట.— కాళిన్-కొల్వను-కాళికాదేవిని సేవింపలేదు. అనఁగా-కాళిదాసుఁడఁ గానసుట.— పురాణింపన్॥ శ్రీభాగవపురాణమును రచించుటకు— దొరంకొంటిన్॥ ఆరంభించితి.—౧౨ అగుదమ్మ॥ అగుదు అమ్మ-అనిపదచ్ఛేదము. అగుదు॥ అనఁగా, అవుదువు. బ్రాహ్మీ॥ ఓసరస్వతీ. శారదనీరద॥ శరత్కాలమేఘము. ఇందు॥ చంద్రుఁడు-ఘనసార॥ కర్పూరము. పటీర॥ చందనము. మరాళ॥ హంస. ఫేన॥ నురుగు. కాశ॥ రెల్లుపువ్వులు. మందార॥ కల్పవృక్షము— ౧౩ ముగురమ్మల॥ గౌరీలక్ష్మీసరస్వతులకు, మూలపుటమ్మ॥ ఆదికారణభూతురాలైన మహాశక్తి.— ౧౪ పున్నెముల ప్రోవు॥ సుకృతరాశి. పుణ్యశబ్దతద్భవము-పున్నెము. పెన్నిక్క॥ ముఖ్యస్థానము. ఓకశ్శబ్దమునకు-తద్భవము-ఇక్క.

లుమాపుత్రుల్ సిరియిచ్చుఁ గాత నిత్యకల్యాణముల్ ॥ వ॥ అనియిష్టదేవతలం జింతించి దినకరకుమారప్రముఖులం దలంచి ప్రథమ
కవితావిరచనవిద్యావిలాసాతిరేకి వాల్మీకి నుతియించి హయగ్రీవదనుజకరపరిమిళితనిగమనివహవిభాగనిర్ణయనిపుణ
తాసముల్లాసుండగు వ్యాసునకు మ్రొక్కి శ్రీమహాభాగవతకథాసుధారసప్రయోగికి శుకయోగికి నమస్కరించి మృదు
మధురవచనవర్గపల్లవితస్థాణునకు బాణునకుం బ్రణమిల్లి కతిపయశ్లోకసమ్మోదితసూరు మయూరు నభినందించి మ
హాకావ్యకరణకళావిలాసుం గాళిదాసుం గొనియాడి కవివదనకమలరవిన్ భారవిన్ బొగడి విదళితాఘు మాఘు స్తుతియించి
యాంధ్రకవితాగౌరవజనమనోహారి నన్నయసూరిం గైవారంబు సేసి హరిహరచరణారవిందవందనాభిలాషిం ది
క్కనమనీషిం భూషించి మఱియు నితరపూర్వకవిజనసంభావనంబు గావించి వర్తమానకవులకుం బ్రియంబు వలికి భావిక
వుల బహూకరించి యుభయకావ్యకరణదక్షుండనై ॥ ఉ॥ ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులున్ । సొ
మ్ములుఁ గొన్నిఁ బుచ్చుకొని సొక్కి శరీరము వాసి కాలుచే। సమ్మెట వేటులం బడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పె నీ। బమ్మెరపోత
రాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్ ॥ గీ॥ చేతులారంగ శివునిఁ బూజింపఁ డేని। నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁ డేని।
దయయు సత్యంబులోనుగాఁ దలఁపఁ డేనిఁ। గలుగ నేటికిఁ దల్లుల కడుపు చేటు ॥ వ॥ అని మఱియు మదీయపూర్వజన్మసహస్ర
సంచితతపఃఫలంబున శ్రీమన్నారాయణకథాప్రపంచవిరచనాకుతూహలుండనై యొక్క రాకానిశాకాలంబున సో
మోపరాగంబు రాకఁ గని సజ్జనానుమతంబున నభ్రంకషశుభ్రసముత్తుంగభంగయగు గంగకుం జని క్రుంకులిడి వెడలి మ
హనీయమంజులపులినశోభితప్రదేశంబున మహేశ్వరధ్యానంబు సేయుచుఁ గించిదున్మీలితలోచనుండనై యున్న యెడ ॥
సీ॥ మెఱుఁగు చెంగటనున్న మేఘంబుకై వడి నువిదచెంగట నుండ నొప్పువాఁడు। చంద్రమండలసుధాసారంబు పోలిక మ
ఖమునఁ జిఱునవ్వు మొలుచువాఁడు। వల్లీయుతతమాలవసుమతీజముభంగి బలువిలుమూఁపునఁ బరగువాఁడు । నీలనగా
గ్రసన్నిహితభానునిభంగి ఘనకిరీటము దలఁ గల్గువాఁడు। పుండరీకయుగముఁ బోలు కన్నులవాఁడు। వెడఁదయురము వాఁ
డు విపులభద్రమూర్తియైన రాజముఖ్యుఁ డొక్కరుఁడు నా। కన్నుఁగవకు నెదుఱఁ గానఁబడియె ॥ వ॥ ఏను నా రాజశేఖరుం
దేఱి చూచి భాషింప యత్నంబు సేయు నెడ నతండు దా రామభద్రుండ మన్నామాంకితంబుగా శ్రీమహాభాగవతంబుఁ దె
నుంగు సేయుము నీకు భవబంధంబులు దెగునని యానతిచ్చి తిరోహితుం డైన సమున్మీలితనయనుండనై వెఱఁగుపడి చిత్తం
బున ॥ క॥ పలికెడిది భాగవతమఁట। పలికించెడువాఁడు రామభద్రుండఁట నేఁ। బలికిన భవహర మగునఁట। పలికెద వేఱొం
డు గాథఁ బలుకఁగ నేలా ॥ గీ॥ భాగవతముఁ దెలిసి పలుకుట చిత్రంబు। శూలికైనఁ దమ్మిచూలికైన। విబుధజనులవలన విన్నం
తఁ గన్నంతఁ। దెలియవచ్చినంతఁ దేటపఱతు ॥ క॥ కొందఱికిఁ దెనుఁగు గుణమగుఁ। గొందఱికిని సంస్కృతంబు గుణమగు రెం
డున్ । గొందఱికి గుణములగు నే। నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్ ॥ మ॥ ఒనరన్ నన్నయతిక్కనాదికవులీయు
ర్వింబురాణావళుల్ । దెనుఁగుల్సేయుచు మత్పురాకృతశుభాధిక్యంబు దా నెట్టిదో। తెనుఁగుం జేయరు మున్ను భాగవత
మున్ దీనిన్ దెనుంగించి నా। జననంబున్ సఫలంబు సేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్ ॥ మ॥ *లలితస్కంధము కృష్ణమూల
ము శుకాలాపాభిరామంబు మం। జులతాశోభితము సువర్ణసుమనస్సుజ్ఞేయము సుందరో। జ్జ్వలవృత్తంబు మహాఫలం
బు విమలవ్యాసాలవాలంబునై। వెలయున్ భాగవతాఖ్యకల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై ॥ వ॥ ఇట్లు భాసిల్లెడు శ్రీమహా
భాగవతపురాణపారిజాతపాదపసమాశ్రయంబున హరికరుణావిశేషంబునఁ గృతార్థత్వంబు సిద్ధించెనని బుద్ధి నెఱిం
గి లేచి మఱలి కొన్ని దినంబులకు నేకశిలానగరంబునకుం జనుదెంచి యందు గురువృద్ధబుధబంధుజనానుజ్ఞాతుండనై ॥

---

*లలితస్కంధము॥ భాగవతపక్షమునందు॥ సుందరములగు ద్వాదశస్కంధములు గలది-కల్పతరుపక్షమునందు॥ సుందరమైన ప్రకాండము గలది. ప్రకాండమనఁగా నడుసు మొదలుకొని కొమ్మలు మొదలుపెట్టెడువరకుఁ గల మ్రానిమధ్యభాగము. కృష్ణమూలము॥ కృష్ణ-కృష్ణుఁడు-నలువు॥ భా॥ మూలము-ప్రతిపాద్యవస్తువు. కల్ప॥ మూలము-వేళ్లు. శుకాలాపము॥ భా॥ శుకమహర్షి సల్లాపము. కల్ప॥ చిలుకలపలుకులు. మంజులతా॥ భా॥ ప్రతిపాద్యకథాంశములసొంపుచేతను। కల్ప॥ మంజు॥ సుందరములగు, లతా॥ కొమ్మలచేతను-ఇచట లతాశబ్దము శాఖావాచకము. సువర్ణసుమనస్సుజ్ఞేయము. భా॥ పరమార్థప్రతిపాదకమగుట చేసత్పురుషులకు లెస్సగాఁ దెలియఁదగినది. కల్ప॥ మంచివన్నెలుగల పుష్పములచేత లెస్సగాఁ దెలుసుకొనఁదగినది. సుందరోజ్జ్వలవృత్తంబు॥ భా॥ వృత్తంబు-నానావిధఛందోనిబద్ధములగు-వంశస్థ-పుష్పితాగ్రాదివృత్తములు గలది. కల్ప॥ వృత్తము॥ వినసొంపుగానుండు వర్తులోకప్రసిద్ధమైన ప్రఖ్యాతిగలది-విమలవ్యాసాలవాలంబు. కల్ప॥ పరిశుద్ధమై గుండ్రనైన పాదిగలది. భా॥ స్పష్టము. సద్ద్విజశ్రేయము. భా॥ ద్విజశబ్దవాచ్యులగు బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు, అధ్యయనాదులచే మోక్షరూపమగు క్షేమమును గలుగఁజేయునది. కల్ప॥ ఉత్తమములగు శుకపికాదులకు ఫలప్రధానాదులచేత క్షేమమును గలుగఁజేయునది.

### ⟶ గ్రంథకర్తృవంశానుక్రమణిక. ⟵

సీ॥ కౌండిన్యగోత్రసంకలితుఁడాపస్తంబసూత్రుండు పుణ్యుండు సుభగుఁడైన। భీమనమంత్రికిఁ బ్రియపుత్రుఁడన్నయక లకంఠిదద్భార్య గౌరమాంబ। కమలాప్తువరమునఁ గనియె సోమనమంత్రి వల్లభమల్లమవారితనయుఁ। డెల్లనయతనికి నిల్లాలుమాచమ వారిపుత్రుఁడు వంశవర్ధనుండు। లలితమూర్తి బహుకళానిధి కేసన। దానమాననీతి ధనుఁడు ఘనుఁడు। దనకు లక్కమాంబ ధర్మగేహిని గాఁగ। మనియె శైవశాస్త్రమతముఁ గనియె॥ క॥ నడువదు నిలయము వెలువడి। దడవదు పరపురుషుగుణముఁ దనపతినుడువుల్। గడువదు వితరణకరుణలు। విడువదు లక్కాంబ విబుధవిసరము ప్రెగడల్॥ ఉ॥ మానిను లీడుగారు బహుమాననివారితదీనమానస। గ్లానికి దానధర్మమతి గౌరవమంజులతాగభీరతా। స్థానికి ముద్దసానికి సదాశివపాదయుగార్చనాసుకం। పానయ వాగ్భవానికి నిబ్బమ్మెర కేసయ లక్కసానికిన్॥ క॥ ఆమిథునమునకుఁ బుట్టితి। మేమిరువుర మగ్రజాతుఁ డీశ్వరసేవా। కాముఁడు తిప్పయ పోతయ। నామవ్యక్తుండ సాధునయయుక్తుండన్॥ వ॥ అయిన నేను నాచిత్తంబున నెన్నిధానంబుం బోని శ్రీరామచంద్రుని సన్నిధానంబుఁ గల్పించుకొని॥

### ⟶ షష్ఠ్యంతములు. ⟵

ఉ॥ హారికి నందగోకులవిహారికిఁ జక్రసమీరదైత్యసంహారికి భక్తదుఃఖపరిహారికి గోపనితంబినీమనో। హారికి దుష్టసంపదపహారికి ఘోషకుటీపయోఘృతాహారికి బాలకగ్రహమహాసురదుర్వనితాప్రహారికిన్॥ ఉ॥ శీలికి నీతిశాలికి వశీకృతశూలికి బాణహస్తనిర్మూలికి ఘోరనీరదవిముక్తశిలాహతగోపగోపికా। పాలికి వర్ణధర్మపరిపాలికి నర్జునభూజయుగ్మసంచాలికి మాలికిన్ విపులచక్రనిరుద్ధమరీచిమాలికిన్॥ ఉ॥ క్షుంతకుఁ గాళియోరగవిశాలఫణావలినర్తనక్రియా। రంతకు నుల్లసన్మగధరాజచతుర్విధఘోరవాహినీ। హంతకు నింద్రనందననియంతకు సర్వచరాచరావళీ। మంతకు నిర్జితేంద్రియసమంచితభక్తజనానుగంతకున్॥ ఉ॥ న్యాయికి భూసురేంద్రమృతనందనదాయికి రుక్మిణీమన। స్థాయికి భూతసమ్మదవిధాయికి సాధుజనానురాగసం। ధాయికిఁ బీతవస్త్రపరిధాయికిఁ బద్మభవాండభాండని। ర్మాయికి గోపికానివహమందిరయాయికి శేషశాయికిన్॥ వ॥ సమర్పితంబుగా నే నాంధ్రంబున నొనర్పంబూనిన శ్రీమహాభాగవతపురాణంబునకుం గథాప్రారంభం బెట్టిదనిన॥

### ⟶ శ్రీమద్భాగవతకథాప్రారంభము. ⟵

సీ॥ విశ్వజన్మస్థితివిలయంబు లెవ్వనివలన నేర్పడు *ననువర్తనమున। వ్యావర్తనమునఁ గార్యములందభిజ్ఞుఁడై తాన రాజగుచుఁ జిత్తమునఁ జేసి। వేదంబు లజునకు విదితముల్గావించె నెవ్వఁడు బుధులు మోహింతు రెవ్వ। నికి నెండమావుల నీటఁ గాచాదుల నన్యోన్యబుద్ధి గానడరునట్లు। త్రిగుణసృష్టి యందు మిగిలించు సత్యము। భంగిఁ దోఁచు నట్టి ప్రభు నిరస్త। కుహకుఁ డెవ్వఁ డతనిఁ గోరి చింతించెద। ననఘు సత్యుఁ బరుని ననుదినంబు॥ వ॥ ఇట్లు ॥ సత్యంపరంధీమహి యను గాయత్రీప్రారంభంబున గాయత్రీనామబ్రహ్మస్వరూపంబై మత్స్యపురాణంబులోన గాయత్రి నధికరించి ధర్మవిస్తరంబును, వృత్రాసురవధంబు నెందుం జెప్పంబడు నదియ భాగవతంబని పలుకుటం జేసి యిప్పురాణంబు శ్రీమహాభాగవతంబన నొప్పుచుండు॥

---

*అనువర్తనమునన్॥ అన్వయవ్యాప్తిచేత - అన్వయవ్యాప్తియనఁగా - కార్యసద్భావమువలనఁ గారణసద్భావమును నిశ్చయించుట. వ్యావర్తనమునన్॥ వ్యతిరేకవ్యాప్తిచేత - వ్యతిరేకవ్యాప్తియనఁగా - కారణాభావమువలన - కార్యాభావమును నిశ్చయించుట. ఇందుకుదాహరణము ధూమముండుచోట నగ్ని యుంటున్నదియనుట యన్వయవ్యాప్తి, ఎచ్చోట నగ్ని లేకున్నదో - అచ్చోట ధూమముండదనుట వ్యతిరేకవ్యాప్తి. ఈ వ్యాప్తిద్వయముచేత బ్రహ్మ జగత్కారణమని నిశ్చయింపఁబడుచున్నదనుట. రెండవపక్షము. అనువర్తనమనఁగా॥ ఉపాదానకారణభూతమయి మృత్సువర్ణాదులు - ఘటకుండలాదులందునుండు తెలుఁగున ననువర్తించియుండుట. వ్యావర్తనమనఁగా - ఘటకుండలాదులవలె వికృతిరూపమగు భేదము నొందియుండుట. కాఁగా - మృత్సువర్ణాదులవలె ననువర్తించియుండుటవలన స్వరూపంబగు బ్రహ్మ జగత్కారణమగుచున్నది. వికృతిగానుండుటవలన - జగత్తు ఘటకుండలాదులవలె కార్యరూపమగుచున్నదనుట. కార్యములయందు॥ ఆకాశాదికార్యములయందభిజ్ఞుఁడును, సర్వజ్ఞుఁడు, తానరాజగుచు న్స్వరాట్టుగానుండును. అనఁగా స్వయంప్రకాశమానస్వరూపుఁడగుచు. — ఎండమావులన్॥ జలమరీచికలయందు - నీటన్॥ జలమందును, కాచాదులన్॥ గాజురాళ్లు మొదలైనవానియందును, అన్యోన్యబుద్ధి॥ పరస్పరభ్రాంతి - అనఁగా దేజోరూపమగు నెండమావులయందు జలభ్రాంతి - జలమందు - కాచాదిభ్రాంతి. యనీ తెలుఁగున పరస్పరభ్రాంతికలుగుచున్నదనుట. చిత్తమునఁ జేసి॥ మనస్సువలన నే చతుర్ముఖునకు వేదములను దెలిపెననుట చేత బుద్ధివృత్తిప్రవర్తకుఁడాయెనని యభిప్రాయము. నిరస్తకుహకుఁడు॥ నిరస్త - పోఁగొట్టఁబడిన। కుహకుఁడు - కపటముగలవాఁడు. అనఁగా మాయికమగు ప్రపంచసంబంధము లేనివాఁడనుట. — ॥ సత్యంపరంధీమహి॥ అను గాయత్రీప్రారంభమున్ - అనువచనమునందుఁగల సంగతులన్నియు శ్రీభాగవతమునకు శ్రీధరీయమనెడు నద్వైతవ్యాఖ్యానమునందుఁ దెలియఁజేయఁబడిన విషయములే కాని మూలమునందుఁగలవి కావు, ఇదేతీరున నీగ్రంథమునందుఁ దఱుచుగా వ్యాఖ్యానవిషయంబులతోఁ జేర్చి, మూలమునందుఁగల యావిషయములను సమగ్రముగాఁ దెలియఁజేయుటయె కాక ఆయాస్థలములందు, స్వకపోలకల్పితముగా ననేకవిషయములు రచింపఁబడియున్నవి.

సీ॥ శ్రీమంతమైమునిశ్రేష్ఠకృతంబైనభాగవతంబుసద్భక్తితోడ।వినఁగోరువారలవిమలచిత్తంబులఁజెచ్చెరనీశుండుచిక్కుఁగాఁక।యితరశాస్త్రంబులనీశుండుసిక్కునేమంచివారలకునిర్మత్సరులకుఁ।గపటనిర్ముక్తులై కాంతుఁ సేయకయును దగిలియుండుటమహాతత్త్వబుద్ధిఁ। బరగనధ్యాత్మకాదితాపత్రయంబు। నడఁచిపరమార్థభూతమైయధికసుఖద।మైసమస్తంబుగాఁకయునగుచునుండు।వస్తువెలుఁగంగఁదగుభాగవతమునందు॥ గీ॥ వేదకల్పవృక్షవిగళితమైశుక।ముఖసుధాద్రవమునమొనసియున్న।భాగవతపురాణఫలరసాస్వాదన।పదవిఁగనుఁడురసికభావవిదులు॥ క॥ పుణ్యంబైమునివల్లభాగణ్యంబైకుసుమఫలనికాయోత్థితసా। ద్గుణ్యంబైనైమిశారణ్యంబునుతింపఁదగునరణ్యంబులలోన॥ వ॥మఱియును *మధువైరిమందిరంబునుంబోలె మాధవమన్మథమహితంబై, బ్రహ్మగేహంబునుంబోలెశారదాన్వితంబై, నీలగళసభానికేతనంబునుంబోలెవహ్నివరుణసమీరణచంద్రరుద్రహైమవతీకుబేరవృషభగాలవశాండిల్యపాశుపతజటిపటలమండితంబై, బలభేదిభవనంబునుంబోలెనైరావతామృతరంభాగణికాభిరామంబై, ధనదాగారంబునుంబోలెశంఖకుందముకుందమందిరంబై, మురాసురనిలయంబునుంబోలెనున్మత్తరాక్షసవంశసంకులంబై, రఘురామయుద్ధంబునుంబోలెనిరంతరశరోగ్రానలశిఖాబహుళంబై, పరశురామభండనంబునుంబోలెనర్జునోద్భేదంబై, దానవసంగ్రామంబునుంబోలెనరిష్టజంభనికుంభశక్తియుక్తంబై, కౌరవసంగరంబునుంబోలెద్రోణార్జునకాంచనస్యందనకదంబసమేతంబై, కర్ణకలహంబునుంబోలెమహోన్నతశల్యసహకారంబై, సముద్రసేతుబంధనంబునుంబోలె నలనీలపనసాద్రిప్రదీపితంబై, భర్గుభజనంబునుంబోలెనానాశాఖాలేఖాఫలితంబై, [illegible]కోదండంబునుంబోలెఁబున్నాగశిలీముఖభూషితంబయి,నరసింహరూపంబునుంబోలెఁగేసరకరజకాంతంబయి, నాట్యరంగంబునుంబోలెనటనటీసుషిరాన్వితంబై, శైలజానిటలంబునుంబోలెఁజందనకర్పూరతిలకాలంకృతంబయి - వర్షాగమంబునుంబోలెనింద్రబాణాసనమేఘకరక

---

*మధువైరిమందిరంబు॥శ్రీకృష్ణునిగృహము-మాధవమన్మథమహితంబై॥మాధవ।లక్ష్మీపతియైనశ్రీకృష్ణునిచేతను- మన్మథ।మన్మథునిచేతను-మహితంబై॥పూజితముగనున్నది. అరణ్యపక్షమందు॥మాధవ॥పుప్పొడిగురివిందలు- మన్మథ॥వెలగచెట్లు- వీటిచేతఁగొనియాడఁబడియున్నదియనియర్థము-బ్రహ్మగేహంబు॥సత్యలోకము-శారదాన్వితంబు॥సరస్వతీదేవితోఁగూడుకొనియున్నది. అరణ్య॥శారద॥ఏడాకులఅఁటిచెట్లచేతఁగూడుకొనియున్నది-నీలగళసభానికేతనంబు॥శివునిసభాస్థానము-వహ్ని మొదలగువారలుదిక్పాలకులు-హైమవతీ॥పార్వతి-వృషభాదులు॥ఋషులు-జటిపటలమండితంబు-ఋషిసమూహముచేతనలంకృతంబు-అరణ్య॥వహ్ని॥చిత్రమూలము-వరుణ॥ఉలిమిరిచెట్టు-సమీరణ॥మరువము-చంద్ర॥విలకలీఁగెలు-రుద్ర॥రుద్రజడ-హైమవతీ॥కరకచెట్లు-కుబేర॥కలిగొట్టుచెట్లు-వృషభ॥అడ్డసరపుచెట్లు. గాలవ॥లొద్దుగచెట్లు.శాండిల్య॥మారేడుచెట్లు-పాశుపత॥పాశుపతమనుపుష్పలచెట్లు-జటి॥జువ్విచెట్లు-వీటియొక్క, పటల-సమూహముచేతనుమండితంబై-అలంకృతంబైఅనియర్థము. బలభేదిభవనంబు॥ఇంద్రునిగృహము- ఐరావత॥ఐరావతమనుగజము- అమృత॥సుధ-రంభాగణికా॥రంభయనెడువారాంగన-వీరిచేత-అభిరామంబైయొప్పుచుండునది. అరణ్య॥ఐరావత॥నారదపుచెట్లు-అమృత॥ఉసిరికచెట్లు-రంభా॥అఁటిచెట్లు-గణికా॥అడవిమొల్లలు- వీటివల్లనొప్పుచునుండెడునది. ధనదాగారంబు॥కుబేరునిమందిరంబు-శంఖ,కుంద,కుముదంబులు,నిధిభేదంబులు. అరణ్య॥శంఖ॥నఖమనెడుగంధద్రవ్యపుచెట్లు-కుంద॥మొల్లలు-కుముద॥తెల్లకలువలు-వీటివల్లనలంకృతమైనది. మురాసురనిలయంబు॥మురాసురునిగృహము-ఉన్మత్త॥ఉన్మత్తుఁడనెడిరాక్షసవంశ॥రాక్షసవంశమువల్లను. అరణ్య॥ఉన్మత్త॥ఉమ్మెత్తచెట్లు-రాక్షస॥బలురక్కసిచెట్లు-వంశ॥వెదుళ్లువీటిచేత- సంకులంబై॥వ్యాకులంబుగానున్నది. రఘురామయుద్ధము॥రామయుద్ధము।నిరం——బహుళంబై-ఎల్లప్పుడుబాణములయొక్క భయంకరములగు,అగ్నిజ్వాలలవలననధికముగనుంటున్నది. అరణ్య॥శర॥కాకివెదుళ్లు-ఉగ్ర॥గాటుగానుండెడు-అనల॥చిత్రమూలముయొక్క- శిఖా॥కొమ్మలకొనలవలన-బహుళంబై॥అధికమైయున్నది. పరశురామభండనంబు॥పరశురామునియుద్ధము. అర్జున॥కార్తవీర్యార్జునునియొక్క- ఉద్భేదము॥భేదించుటగలది. అరణ్య॥అర్జున॥మద్దిచెట్లయొక్క-ఉద్భేదము॥ప్రకాశముగలది. దానవసంగ్రామంబు॥రాక్షసులయుద్ధము-అరిష్ట,జంభ,నికుంభులనెడురాక్షసులు. అరణ్య॥అరిష్ట॥కుంకుడుచెట్లు-జంభ॥నిమ్మచెట్లు-నికుంభ॥దంతిచెట్లు-ద్రోణార్జునులు-ప్రసిద్ధులు. కాంచనస్యందనకదంబసమేతంబు॥బంగారుటరదంబులగుంపులతోఁగూడుకొనియున్నది. అరణ్య॥ద్రోణ॥నీలిచెట్లు-అర్జున॥మద్దిచెట్లు-కాంచన॥ఉమ్మెత్తచెట్లు-స్యందన॥నెమ్మిచెట్లు-కదంబ॥కడపచెట్లు-వీటివలనఁగూడుకొనినదై-మహోన్నతంబై॥ఉత్కృష్టుఁడైనశల్యసహాయంబుగలదై. అరణ్య॥మిక్కిలిపొడవుగల-శల్య॥ఘంగచెట్లు-సహకారంబై॥తియ్యనిమామిడిచెట్లుగలదై-నల,నీల,పనసులుప్రసిద్ధవానరులు. అరణ్య॥నల॥వట్టివేరు-నీల॥నీలిచెట్లు-పనస॥పనసచెట్లు-నానాశాఖాలేఖాఫలితంబై॥అనేకవిధములైనయుపనిషత్తులఫలమనఁగాఁదత్ప్రతిపాద్యమగుపరమతత్త్వము-దానింగలదిగానున్నది. అరణ్య॥కొమ్మలవరుసలయందుఫలములఁగలది. పున్నాగ॥పురుషోత్తముండగువిష్ణువు,అతనిరూపమగుబాణమువలననలంకృతంబైనది. అరణ్య॥పున్నాగ॥పొన్నచెట్లు- శిలీముఖ॥తుమ్మెదలు-వీటివల్లనలంకృతంబైనది. కేసర॥సింహముఖమునకుఁజుట్టునుండెడునిడివివెండ్రుకలు-కరజ॥గోళ్లు, అరణ్య॥కేసర॥సురపొన్నలు-కరజ॥కానుగ-వీటితోనొప్పుచున్నది. నటనటీసుషిరాన్వితం॥నటనటీజనులయొక్క- సుషిర॥పిల్లనగ్రోవులచేఁగూడుకొనియున్నది. అరణ్య॥నట॥దుండిగపుచెట్లు-నటీ॥నళియనెడుగంధద్రవ్యము-సుషిర॥గూవగుత్తికలు-చందన॥గంధము-కర్పూర॥కర్పూరము. తిలక॥కుంకుమబొట్టు- అరణ్య॥చందన॥శ్రీగంధవృక్షములు-కర్పూర॥కర్పూరవృక్షములు- తిలక॥ తిలకపుచెట్లు-ఇంద్రబాణాసన॥ఇంద్రధనుస్సు- మేఘ॥మేఘములు-కరక॥వడిగండ్లు. అరణ్య॥ఇంద్ర॥మద్దిచెట్లు- బాణా॥నల్లపూలగోరంటచెట్లు- అసన॥వేగిమ్రానులు-

కమనీయంబయి, నిగమంబునుంబోలె గాయత్రీవిరాజితంబయి, మహాకావ్యంబునుంబోలె సరసమృదులతాకలితంబయి, వినతానిలయంబునుంబోలె సుపర్ణరుచిరంబయి, యమరావతీపురంబునుంబోలె సుమనోలలితంబయి, కైటభోద్యోగంబునుంబోలె మధుమానితంబయి, పురుషోత్తమసేవనంబునుంబోలె నమృతఫలదంబయి, ధనంజయసమీకంబునుంబోలె నభ్రంకషపరాగంబయి, వైకుంఠపురంబునుంబోలె ఖడ్గపుండరీకవిలసితంబై, నందఘోషంబునుంబోలెఁ గృష్ణసారసుందరంబయి, లంకానగరంబునుంబోలె రామమహిషీవంచకసమేతంబయి, సుగ్రీవసైన్యంబునుంబోలె గజగవయశరభశోభితంబయి, నారాయణస్థానంబునుంబోలె నీలకంఠహంసకౌశికశుకభరద్వాజతిత్తిరిభాసురంబయి, మహాభారతంబునుంబోలె నేకచక్రబకకంకధార్తరాష్ట్రశకునినకులసంచారసమ్మిళితంబయి, సూర్యరథంబునుంబోలె నురుతరప్రవాహంబయి, జలదకాలసంధ్యామహావర్తంబునుంబోలె బహువితతజాతిసౌమనస్యంబయి, యొప్పునైమిశంబను శ్రీవిష్ణుక్షేత్రంబునందు శౌనకాదిమహామునులు స్వర్లోకగీయమానుండగు హరిం జేరుకొఱకు సహస్రవర్షంబులనుష్ఠానకాలంబు గాఁగల సత్త్రసంజ్ఞికంబయిన యాగంబు సేయుచుండి యందొక్కనాఁడు వారలు రేపకడ నిత్యనైమిత్తికహోమంబు

## ——శ్రీ శౌనకాదిమహర్షులు సూతమహర్షితోఁ బ్రశ్నసేయుట. శ్రీ——

లాచరించి, సత్కృతుండై సుఖాసీనుండై యున్న సూతుం జూచి॥ క॥ ఆతాపసులిట్లనిరి వి। నీతుఁడ విజ్ఞాతఘోషితనిఖిలపురాణ। వ్రాతుఁడ నుతహరిగుణసం। ఘాతుఁడ సూతుఁడ నితాంతకరుణోపేతుఁడ॥ మ॥ సమతం దొల్లి పురాణపంక్తు లితిహాసశ్రేణులున్ ధర్మశాస్త్రములున్ నాలుగుపన్యసింపుదురు వేదవ్యాసముఖ్యుల్ మునుల్ సమతిం జేసిన వెన్నియన్నియును దోఁచున్ నీ మదిన్ దత్ప్రసాదమునం జేసి యెఱుంగ నేర్తువు సమస్తంబున్ బుధేంద్రోత్తమా॥ క॥ గురువులు ప్రియశిష్యులకుం। బరమరహస్యములు దెలియఁ బలుకుదు రచలా। స్థిరకల్యాణం బెయ్యది। పురుషులకును నిశ్చయించి బోధింపు తగన్॥ క॥ మన్నాఁడవు చిరకాలము। గన్నాఁడవు పెక్కులైన గ్రంథార్థంబుల్। విన్నాఁడవు వినఁదగినవి। యున్నాఁడవు పెద్దలొద్ద నుత్తమగోష్ఠిన్॥ చ॥ అలసులు మందబుద్ధియుతు లల్పతరాయువు లుగ్రరోగసం। కలితులు మందభాగ్యులు సుకర్మము లెయ్యవి సేయఁజాలరీ। కలియుగమందు మానవులు గావున నెయ్యది సర్వసౌఖ్యమై। యలవడు నేమిటం బొడము నాత్మకు శాంతి మునీంద్ర చెప్పవే॥ సీ॥ ఎవ్వనియవతారమెల్లలోకములకు సుఖమును వృద్ధియు సొరిదిఁ జేయు। నెవ్వనిశుభనామ మేప్రొద్దు నుడువంగ సంసారబంధంబు సమసిపోవు। నెవ్వనిచరితంబు హృదయంబుఁ జేర్చిన భయమంది మృత్యువు పరువువెట్టు। ✱నెవ్వనిపదనదినేపారు జలముల సేవింప నైర్మల్యసిద్ధి గలుగుఁ। దపసు లెవ్వనిపాదంబుఁ దగిలి శాంతిఁ। దేఱుచుఁ గాంచిరి వసుదేవదేవకులకు। నెవ్వఁ డుదయించెఁ దత్కథ లెల్ల వినఁగ। నిచ్చ పుట్టెడు నెఱిఁగింపు మిద్ధచరిత॥ క॥ భూషణములు సెవులకు శిన ఘ। పేషణములు మృత్యుచిత్తభీషణములు హృ। త్తోషణములు గల్యాణవి। శేషణములు హరిగుణోపచితభాషణముల్॥ క॥ కలిదోషని

---

గాయత్రీ॥ వేదమాతయగు గాయత్రీదేవతాకమంత్రములచేతను- అరణ్య॥ గాయత్రీ॥ చంద్రచెట్లచేతను- సరసమృదులతా॥ రచనాసౌకర్యముతో నొప్పియుండెడు-మృదుపాకముతోఁ గూడినది. అరణ్య॥ రసవత్తుగానుండెడు మెత్తటి గెతోఁ గూడినది. సుపర్ణ॥ గరుడుఁడు-అరణ్య॥ మంచి యాకులతోఁ జేరినది-సుమనస్సులు దేవతలు. అరణ్య॥ సుమనస్సులు పుష్పములు. మధు॥ మధుఁడనెడు రాక్షసుఁడు. అరణ్య॥ మధు। తేనె, అమృతఫలదంబు, మోక్షఫలమునిచ్చునవి. అరణ్య॥ ఉసిరికపండ్లనిచ్చేది. అభ్రంకషపరాగంబు-ఆకాశమునంటియుండెడు ధూళిగలదై. అరణ్య॥ ఆకాశమునంటెడు శ్రేష్ఠములైన వృక్షములనుగలది. ఖడ్గ। పుండరీకులు, భగవద్భక్తులు. అరణ్య॥ ఖడ్గ। ఖడ్గమృగములు. పుండరీక-వ్యాఘ్రంబులు. కృష్ణసార। శ్రీకృష్ణమూర్తియొక్క బలముచేత. అరణ్య॥ కృష్ణసార। జింకలచేత, రామమహిషీవంచకసమేతంబు శ్రీరామభార్యను మోసపుచ్చెడువానితోఁ జేరియున్నది. అరణ్య॥ రామ। పెద్దమృగములు, మహిషీ। కాసెనుములు, వంచక। నక్కలు. గజ, గవయ, శరభులు, ప్రసిద్ధవానరులు. అరణ్య॥ గజ। ఏనుఁగులు, గవయ। కురుబోఁతులు, శరభ, ఎనిమిది కాళ్లుగలదై సింహమును జంపెడిమృగములు, నీలకంఠ। శివుఁడు, హంస। పరమహంసలు, కౌశిక, శుక, భరద్వాజ, తిత్తిరులు, ప్రసిద్ధమునులు-వీరితోఁ గూడియున్నది. అరణ్య॥ నీలకంఠ। నెమళ్లు, హంస। హంసలు, కౌశిక। గుడ్లగూబలు, శుక। చిలుకలు, భరద్వాజ। భారద్వాజపక్షులు, తిత్తిరి। తీతువపక్షులు. వీటిచేఁ బ్రకాశించుచున్నది. ఏకచక్రబక। ఏకచక్రపురమునందుండిన బకాసురుఁడు, కంక। కంకుఁడను ప్రచ్ఛన్ననామధేయముగల ధర్మరాజు. ధార్తరాష్ట్ర। ధృతరాష్ట్రునిపుత్రులైన దుర్యోధనాదులు, శకుని। శకునియనువాఁడు, నకుల। నకులుఁడు, వీరియొక్క-సంచార। కథావర్ణనాదిప్రస్తావముతో, సమ్మిళితంబై। కూడుకొనియున్నది. అరణ్య॥ ఏక। ముఖ్యములైన, చక్ర। చక్రవాకపక్షులు, బక। కొంగలు, కంక। గద్దలు, ధార్తరాష్ట్ర। ఎఱ్ఱనిముక్కు కాళ్లును గలదై దేహమంతయుఁ దెల్లగానుండు హంసలు, శకుని। పక్షులు, నకుల। ముంగిసలు, వీనియొక్క-సంచార। తిరగడములతో, సమ్మిళితంబై. కూడియుంటున్నది. ఉరుతర। మిక్కిలి గొప్పదైన, ప్రవాహంబై। ఉత్తమాశ్వమును గలదై. అరణ్య॥ ఉరుతర। మిక్కిలి విశేషమైన. ప్రవాహంబై। జలప్రవాహముగలదై, బహువితతజాతిసౌమనస్యంబై। అనేకవిధములైయంతటవిస్తీర్ణములగు జాజిపువ్వులుగలది. అరణ్య॥ అనేకవిధములగు పక్షిసమూహముచే నొప్పియుండునది.

౨౦వం. సొరది-క్రమముగా.— ✱ఎవ్వనిపదనదిని। గంగను, పారు జలములు। ప్రవహించు జలములు. — శ్రీ అఘపేషణములు। పావనాశకములు.

౨

వారణమై యలఘుయశుల్గా గడునట్టిహరికథనమునిర్మలగతిఁ గోరుచుం బురుషుఁడు। వెలయఁగ నెవ్వాఁడు దగిలి వినఁడు మహాత్మా॥ గీ॥ అనఘవినురసజ్ఞులై విను వారికి। మాటమాటకధికమధురమైన। యట్టికృష్ణుకథనమాకర్ణనము సేయఁ దలఁపుగలమమాకుఁ దనివి లేదు॥ మ॥ వరగోవిందకథాసుధారసమహావర్షోరుధారాపరం। పరలంగాఁక బుధేంద్రచంద్రయితరోపాయానురక్తింబ్రవి। స్తరదుర్దాంతదురంతదుస్సహజనుస్సంభావితానేకదు। స్తరగంభీరకఠోరకల్మషకనద్దావానలంబాఱునే॥ సీ॥ హరినామకథనదావానలజ్వాలలఁగాలవే ఘోరాఘకాననములు। వైకుంఠదర్శనవాయుసంఘములచేఁ దొలఁగవే బహుదుఃఖతోయదములు। కమలనాభధ్యానకంఠీరవములచేఁ గూలవే సంతాపకుంజరములు। నారాయణస్మరణప్రభాకరదీప్తిఁ దీరవే షడ్వర్గతిమిరతతులు। నలిననయనభక్తినావచేఁ గాఁక సంసారజలధి దాఁటఁ జనఁగరాదు। వేయు నేలమాకు విష్ణుప్రభావంబు। దెలుపుమయ్య సూత ధీసమేత॥ వ॥ మఱియుఁ గపటమానవుండును గూఢుండునైన మాధవుండు రామసహితుండై యతిమానుషంబులయిన పరాక్రమంబులు సేసెనఁట వివరింపుము. కలియుగంబు రాఁగలదని వైష్ణవక్షేత్రంబున దీర్ఘసత్రనిమిత్తంబున హరికథలు విన *నెడగలిగి నిలిచితిమి దైవయోగంబున॥ క॥ జలరాశి దాఁటఁ గోరెడి। *కలముజనుల్గర్ణధారుఁ గాంచినభంగిన్। గలిదోషహరణవాంఛా। కలితులమగు మేము నిన్నుఁ గంటిమి సూతా॥ క॥ చారుతరధర్మరాశికి। భారకుఁడగు కృష్ణుఁ డాత్మపదమున కేఁగన్। భారకుఁడు లేక యెవ్వనిఁ। జేరెను ధర్మంబు బలుపు సెడి మునినాథా॥

——*సూతుండు నారాయణకథాప్రశంస సేయుట.*——

వ॥ అని యిట్లు మహనీయగుణగరిష్ఠులయిన శౌనకాది మునిశ్రేష్ఠులడిగిన రోమహర్షణపుత్రుండయిన యుగ్రశ్రవసుండను పేర నెప్పుడు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైన సూతుండు॥ మ॥ సముఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై సన్న్యాసియై యొంటిఁబో। వ మహాప్రీతిని నో కుమారయనుచున్ వ్యాసుండు సీఅంగవృ। క్షములుం దన్మయతం బ్రతిధ్వనులు సక్కం జేసెమున్నట్టిభూ। తమయుంగొల్చెద బాదరాయణిఁ దపోధన్యాగ్రణిన్ ధీమణిన్॥ సీ॥ కార్యవర్గంబును గారణసంఘంబు నధికరించి చరించు నాత్మతత్త్వ। మధ్యాత్మమనఁబడు నట్టియధ్యాత్మముఁ దెలియఁ జేయఁగ జాలు దీపమగుచు। సకలవేదములకు సారాంశమై యేకమై యసాధారణమగు ప్రభావ। రాజకంబైన పురాణరాజంబును గాఢసంసారాంధకారపటలి। దాఁటఁ గోరెడివారికి దయదలిర్ప। నేతపోనిధి వివరించె నేర్పడంగ। నట్టి శుకనామధేయు మహాత్ము గేయు। విమలవిజ్ఞానరమణీయు వేడ్కఁ గొలుతు॥ క॥ నారాయణునకు నరునకు। భారతికిని మ్రొక్కి వ్యాసుపదములకు నమస్కారము సేసి వచింతును। దారగ్రంథంబు దళితతనుబంధంబుల్॥ వ॥ అని యిట్లు దేవతాగురునమస్కారంబు సేసి యిట్లనియె. మునీంద్రులారా నన్ను మీరలు నిఖిలలోకమంగళంబైన ప్రయోజనంబడిగితిరేమిటం గృష్ణసంప్రశ్నంబు సేయంబడు నెవ్విధంబున నాత్మప్రసన్నంబగు నిర్విఘ్నయు నిర్హైతుకయునైన హరిభక్తి యే రూపంబునం గలుగు నెద్ది పురుషులకుం బరమార్థంబనిన వాసుదేవునియందుఁ బ్రయోగింపంబడిన భక్తియోగంబు వైరాగ్యవిజ్ఞానంబులం బుట్టించు నారాయణకథల నెయ్యే ధర్మంబులు దగులవవి నిరర్థకంబు ఇలపవర్గపర్యంతం బాచరింపందగిన యాయధికధర్మంబున కర్థంబు ఫలంబు గాదు ధర్మంబునం దవ్యభిచారియైన యర్థంబునకుఁ గామంబు ఫలంబు గాదు విషయభోగంబైన కామంబునకింద్రియప్రీతి ఫలంబు గాదెంతదడవు జీవించు నంతియ కామంబునకు ఫలంబు జీవునకుఁ గర్మములచేత నెయ్యది ప్రసిద్ధియది యనర్థకంబు గాదు తత్త్వజిజ్ఞాసయను నది ధర్మజిజ్ఞాస కొందఱు ధర్మంబె తత్త్వమని పలుకుదురు. తత్త్వవిదులు జ్ఞానమను పేర నద్వయమైనయది తత్త్వమని యెఱుంగుదురా తత్త్వంబు నౌపనిషదులచేత బ్రహ్మమనియు, హైరణ్యగర్భులచేతం బరమాత్మయనియు, సాత్వికులచేత భగవంతుండనియును బలుకంబడు వేదాంతశ్రవణంబున గ్రహింపంబడిన జ్ఞానవైరాగ్యంబులతోడం

౩ పరంపరలన్, శ్రీకృష్ణునికథామృతమను వానయొక్క గొప్పధారలగుంపులు.— ౪ ప్రవిస్తర। దావానలంబు, మిక్కిలి విస్తారమైనదియును। అణగనిదియును, తుదముట్టనిదియును, సహింపఁగూడనిదియునైన జన్మములవలనఁ గలిగినదియును, నానావిధములైనదియును, తరింపఁగూడనదియును, తెలుసుకొనఁగూడనిదియును, కఠినమైనదియునగు-పాపమను రగులుచుండు కాఱుచిచ్చు.— ౭ కంఠీరవములచేన్, సింహములచేతను. *ఎడ, కాలము.— *కలముజనుల్। ఓడలోనుండు మనుజులు.— ౯ అపవర్గంబు। మోక్షము, ఔపనిషదులు, అద్వైతులు, హైరణ్యగర్భులు, చతుర్ముఖోపాసకులు, సాత్వికులు, విశిష్టాద్వైతులు, చిజ్జడగ్రథనరూపంబైన యహంకారము, చిత్తు అనఁగా జ్ఞానము, జడమనఁగాఁ బ్రకృతి, వీటి-గ్రథనమనఁగాఁ జేరియుండుట, అట్టియహంకారమనఁగా-హృదయము. కాఁగా-అహంకారశబ్దము హృదయవాచకమయి నందున-హృదయగ్రంథి భేదింపఁబడుననితాత్పర్యము. ౧. స్కంధము, ౨వ, అ. ౨౧. శ్లో॥ భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః। క్షీయంతే చాస్యకర్మాణి దృష్ట ఏవాత్మనీశ్వరే॥ అను శ్లోకార్థమే తెలుపఁబడియున్నది.

గూడినభక్తిచేఁదత్పరులైన పెద్దలు తేప్రజ్ఞుండైనయాత్మయందుఁబరమాత్మంబొడఁగందురు ధర్మంబునకుభక్తి ఫలం
బుపురుషులువర్ణాశ్రమధర్మభేదంబులంజేయుధర్మంబునకు మాధవుండుసంతోషించుటయెసిద్ధి యేకచిత్తంబునగోవిం
దునాకర్ణింపవర్ణింపందగుఁజక్రాయుధధ్యానంబనుఖడ్గంబునవివేకవంతులహంకారంబనుకర్మంబుఁద్రుంచివైతురుభగవం
తునియందలి శ్రద్ధనపవర్గదంబగుఁదత్కథాశ్రవణామలందత్యంతాసక్తియుఁబుణ్యతీర్థావగాహనమహాత్మసేవాదులచే
సిద్ధించుఁగర్మనిర్మూలనహేతువులైనకమలలోచనుకథలందెవ్వండురతిసేయువిననిచ్చగించువానికితరంబులెవ్వియును
చిపుట్టవుపుణ్యశ్రవణకీర్తనుండైనకృష్ణుండుదనకథలువినువారిహృదయంబులందునిలిచిశుభంబులాచరించునశుభంబు
లునిరసించునశుభంబులునష్టంబులైనభాగవతసేవావిశేషంబుననిశ్చలభక్తియుదయించుభక్తిగలుగరజస్తమోగుణప్ర
భూతంబులైనకామలోభాదులకువశంబుగాకచిత్తంబుసత్త్వగుణంబునఁబ్రసన్నంబగుఁబ్రసన్న మనస్కుండైముక్త
సంగుండైననీశ్వరతత్త్వజ్ఞానంబుసిద్ధించునీశ్వరుండు గానంబడినఁజిజ్జడగ్రథనరూపంబైనయహంకారంబుభిన్నంబగు
నహంకారంబుభిన్నంబైననసంభావనాదిరూపంబులగుసంశయంబులువిచ్ఛిన్నంబులగుసంశయవిచ్ఛేదంబైనఁబ్రారబ్ధ
ఫలంబులైనకర్మంబులునశించుంగావున॥ క॥గురుమతులుదపసులంతః।కరణంబులశుద్ధిసేయఘనతరభక్తిఁ।హరియం
దుసమర్పింతురు।పరమానందమునభిన్నభవబంధనులై॥ తరల॥ పరమపూరుషుఁడొక్కఁడాఢ్యుఁడుపాలనోద్భవనాశ
ముల్।సొరిదిఁజేయుముకుందపద్మజశూలిసంజ్ఞలఁబ్రాకృత।స్ఫురితసత్త్వరజస్తమంబులఁబొందునందుశుభస్థితుల్।హ
రిచరాచరకోటికిచ్చుననంతసత్త్వనిరూఢుఁడై॥ వ॥మఱియునొక్కవిశేషంబుగలదుకాష్ఠంబుకంటెధూమంబుధూమం
బుకంటెఁ ద్రయీమయంబయినవహ్నియెట్లువిశేషంబగునట్లు తమోగుణంబుకంటెరజోగుణంబు రజోగుణంబుకం
టె బ్రహ్మప్రకాశకంబగు సత్త్వగుణంబువిశిష్టంబగుఁ దొల్లిమునులు సత్త్వమయుండని భగవంతుహరినధోక్షజుంగొ
లిచిరి. కొందఱు సంసారమందలి మేలుకొఱకు నన్యులసేవింపుదురు. మోక్షార్థులయినవారలు ఘోరరూపులయిన
భూతపతులవిడిచి దేవతాంతరనిందసేయక శాంతులయి నారాయణకథలయందప్రవర్తింతురు. కొందఱు రాజస
తామసులయి *సిరియునైశ్వర్యంబును బ్రజలనుంగోరి పితృభూతప్రజేశాదుల నారాధింపుదురు. మోక్షమిచ్చ
టంజేసి నారాయణుండు సేవ్యుండు: వేద యాగ యోగ క్రియా జ్ఞాన తపో గతి ధర్మంబులు వాసుదేవపరంబు
లునిర్గుణుండయి నపరమేశ్వరుండు గలుగుచు లేకుండుచుఁ ద్రిగుణంబులతోడంగూడిన తనమాయచేతనింతయు సృ
జియించిగుణవంతునిచందంబుననిజమాయా విలసితంబులయిన గుణంబులలోఁ బ్రవేశించి విజ్ఞాన విజృంభితుండయి
వెలుంగునగ్ని యొక్కరుండయ్యుఁ బెక్కుమ్రాఁకులందుఁదేజరిల్లుచుఁ బెక్కండైతోఁచుతెఱంగున విశ్వాత్మకుం
డయినపురుషుండొక్కండుదనవలనంగలిగిననిఖిలభూతంబులందు నంతర్యామిరూపంబునదీపించునతండుమనోభూత
సూక్ష్మేంద్రియంబులతోడంగూడిగుణమయంబులైనభావంబు లందనచేతనిర్మితంబులైన భూతంబులందుఁదగులువడ
కఁదద్గుణంబులనుభవంబు సేయుచులోకకర్తయైనయతండు దేవతిర్యఙ్మనుష్యాదిజాతులందులీలనవతరించిలోకంబులర
క్షించుననిమఱియుసూతుండిట్లనియె॥ సీ॥మహదహంకారతన్మాత్రసంయుక్తుఁడై చారుషోడశకళాసహితుఁడగుచుఁ।
బంచమహాభూతభాసితుండై శుద్ధసత్త్వుఁడై సర్వాతిశాయియగుచుఁ।జరణోరుభుజముఖశ్రవణాక్షినాసాశిరములునా
నాసహస్రములు వెలుఁగ।నంబరకేయూరహారకుండలకిరీటాదులు పెక్కువేలమరుచుండఁ। బురుషరూపంబుధరియించి

భగవంతునియేకవింశత్యవతారములు.

పరుఁడనంతుఁ।డఖిలభువనైకకర్తయైయలఘుగతిని। మానితోదారజలరాశిమధ్యమమున।యోగనిద్రావిలాసియైయొ
ప్పుచుండు॥ వ॥అదిసకలావతారంబులకు మొదలిగనియైన శ్రీమన్నారాయణదేవుని విరాజమానంబయినదివ్యరూపం

*సిరి।సంపద,శ్రీశబ్దతద్భవము-సిరి।ఐశ్వర్యము,ప్రభుత్వము, వేద యాగ యోగ క్రియా జ్ఞాన తపో గతి ధర్మంబులు. వేద।ఋగ్వాదివేదం
బులు,యాగ।జ్యోతిష్టోమాదియజ్ఞంబులు,యోగ।యోగశాస్త్రంబులు,క్రియా,సంధ్యావందనాదినిత్యకర్మంబులు,జ్ఞాన।జ్ఞానశాస్త్రంబులు, తపః।
జ్ఞానము,గతి।స్వర్గాదిఫలంబులు,ధర్మంబులు।ధర్మశాస్త్రంబులు.— షోడశకళాసహితుఁడు।మనంబుతోఁగూడనింద్రియంబులు ౧౧.
అ౧పం. పంచమహాభూతంబులు।ఐదుచేరి,౧౬కళలు-కళలనఁగాఅంశములు.-ఈ౧౬అంశములతోఁగూడుకొనినవాఁడై.
౩ ౧పం. మొదలిగని।అఖిలావతారంబులకునిధానమైనది,అనఁగా-అవతారకార్యమునెరవేరినపిదపనాయవతారంబులకన్నిటికిఁబ్ర
వేశస్థానముగానుండునదియనుట. భగవదవతారంబులసంఖ్యేయంబులగుటవలననిచ్చటనవతారంబులకుఁబ్రథమద్వితీయాదిసంఖ్యానిర్ణయ
ము. కేవలనిర్దేశసాకర్యార్థకమే కానియావశ్యకమైనదిగాదనితెలియఁదగినది.

బుధానిఁబరమయోగీంద్రులుదర్శింతురప్పరమేశ్వరునాభీకమలంబువలనసృష్టికర్తలలోనశ్రేష్ఠుండయినబ్రహ్మయుదయించెనతనియవయవస్థానంబులయందులోకవిస్తారంబులుగల్పింపంబడియె మొదలనద్దేవుండుకౌమారాఖ్యసర్గంబునాశ్రయించిబ్రాహ్మణుండై దుర్లభంబయినబ్రహ్మచర్యంబుచరియించె. రెండవమారుజగజ్జననంబుకొఱకురసాతలగతయైనభూమి నెత్తుచుయజ్ఞేశుండై వరాహదేహంబుదాల్చె. మూఁడవతోయంబుననారదుండను దేవఋషియైకర్మనిర్మోచకంబయినవైష్ణవతంత్రంబు సెప్పె. నాలవపరిధర్మభార్యాసర్గమునందునరనారాయణాభిధానుండయిదుష్కరంబైనతపంబు సేసెఁ. బంచమావతారంబునంగపిలుండనుసిద్ధేశుండయియాసురియనుబ్రాహ్మణునకుఁదత్త్వసంఖ్యానిర్ణయంబుగలసాంఖ్యంబునుపదేశించె. నాఱవశరీరంబుననసూయాదేవియందునత్రిమహామునికిఁగుమారుండై యలర్కునికిఁబ్రహ్లాదముఖ్యులకునాత్మవిద్యఁదెలిపె. నేడవవిగ్రహంబుననాకూతియందుజన్మించియజ్ఞుండనఁబ్రకాశమానుండై యమాదిదేవతలతోడంగూడిస్వాయంభువమన్వంతరంబురక్షించె. నష్టమమూర్తినిమేరుదేవియందు నాభికిజన్మించియురుక్రముండనంబ్రసిద్ధుండై విద్వజ్జనులకుఁబరమహంసమార్గంబుఁబ్రకటించె. ఋషులచేతంగోరంబడితొమ్మిదవజన్మంబునఁబృథుచక్రవర్తియైభూమి ధేనువుంజేసిసమస్తవస్తువులంబిదికెఁ. జాక్షుషమన్వంతరసంప్లవంబున దశమంబైనమీనావతారంబునొందిమహీరూపమగునావనెక్కించి వైవస్వతమనువునుద్ధరించె. సముద్రమథనకాలంబునం బదునొకొండవమారుగమఠాకృతినిమందరాచలంబుఁదనపృష్ఠకర్పరంబున నేర్పరియైనిలిపె. ధన్వంతరియనుబండ్రెండవతనువునసురాసురమథ్యమానక్షీరపాథోధిమధ్యభాగంబున నమృతకలశహస్తుండై వెడలి మోహినిచేసురలనమృతాహారులంగావించెఁ. బదమూఁడవదియైనమోహినీవేషంబునసురాసురులమోహితులంజేసెఁ. బదునాలుగవదియైననరసింహరూపంబునంగనకకశిపునిసంహరించెఁ. బదునేనవదియైనకపటవామనావతారంబున బలినిఁబదత్రయంబుయాచించిమూఁడులోకంబులనాక్రమించెఁ. బదునాఱవదియైనభార్గవరామాకృతినిఁగుపితభావంబుఁదాల్చిబ్రాహ్మణద్రోహులైనరాజులనిరువదియొకమారువధియించిభూమినిఃక్షత్త్రియశూన్యంబుగావించెఁ. బదునేడవదియైనవ్యాసగాత్రంబుననల్పమతులైనపురుషులంగరుణించి వేదవృక్షంబునకు శాఖలేర్పరచెఁ. బదునెనిమిదవదైనరామాభిధానంబున దేవకార్యార్థంబురాజత్వంబునొందిసముద్రనిగ్రహాదిపరాక్రమంబులాచరించె. నేకోనవింశతివింశతితమంబులైనరామకృష్ణావతారంబులచేయదువంశంబునందుసంభవించి విశ్వంభరాభారంబునివారించె. నేకవింశతితమంబైనకలియుగాద్యవసరంబునరాక్షసవ్యామోహనంబుకొఱకుమధ్యగయాప్రదేశంబునజినసుతుండయిబుద్ధనామధేయంబునందేజరిల్లు యుగసంధియందువసుంధరాధీశులుచోరప్రాయులై సంచరింపవిష్ణుయశుండనువిప్రునికిఁగల్కియను పేరనుద్భవింపంగలండనియిట్లనియె.

మ॥ సరసింబాసినఁబాఱుకాలువలయోజన్ విష్ణునందైనశ్రీ । కరనానాప్రకటావతారములసంఖ్యాతంబులుర్వీశులున్ । సురలున్ బ్రాహ్మణసంయమీంద్రులుమహస్సుల్ విష్ణునంశాంశజుల్ । హరికృష్ణుండుబలానుజన్ముఁడెడలేదావిష్ణుఁడా నేర్పడన్॥

క॥ భగవంతుండగువిష్ణుపు। యుగములకెవ్వేళరాక్షసవ్యథగలుగున్ । దగనవ్వేళలఁదడయక । యుగయుగమునఁబుట్టికాచుసుద్యల్లీలన్॥

గీ॥ అతిరహస్యమైనహరిజన్మకథనంబుఁ । బనుజుఁడెవ్వఁడేనిమాపురేపుఁ । జాలభక్తితోడఁజదివినసంసారదుఃఖరాశిఁబాసితొలఁగిపోవు॥

వ॥ వినుండరూపుండయినజీవుండుచిదాత్మకుండయిపరగుజీవునికిఁబరమేశ్వరుమాయాగుణంబులైనమహదాదిరూపంబులచేతనాత్మాధారస్థానంబుగావిరచితంబైనస్థూలశరీరంబుగగనంబునందుఁబవనాశ్రితమేఘసమూహంబును గాలియందుఁబార్థివధూళిధూసరత్వంబును నేరీతినట్లుద్రష్టయగునాత్మయందు దృశ్యత్వముబుద్ధిమంతులుగానివారిచేతనారోపింపంబడునీస్థూలరూపముకంటెనదృష్టగుణంబై యశ్రుతంబైనవస్తువగుటంజేసివ్యక్తంబుగాకసూక్ష్మంబైకరచరణాదులు లేకజీవునికినెండొకరూపమువిరచితమైయుండుసూక్ష్మండయినజీవునివలననుత్క్రాంతిగమనాగమనంబులంబునర్జన్మంబుదోఁచునపుడీస్థూలసూక్ష్మరూపంబులు రెండునుస్వరూపసమ్యగ్జ్ఞానంబుననిషేధింపంబడుననితెలియనవిద్యంజేసియాత్మకుఁగల్పింపంబడెననియెడిహేతువువలననపుడుజీవుండుబ్రహ్మదర్శనమనుజ్ఞానంబునకధికారియగునట్టిబ్రహ్మజ్ఞానమతివిశారదయైయీశ్వరునిదైక్రీడించునట్టిమతిప్రకాశంబుననవిద్యయనంబడుచున్నమాయయుపరతయైతానువిద్యారూపంబునంబరిణతయగునప్పుడుజీవోపాధియైనస్థూలసూక్ష్మరూపంబునుదహించిజీవుండుగాష్ఠంబులేకఁదేజరిల్లువహ్నిచందంబునఁదానయుపరతుండయిబ్రహ్మస్వరూపంబునంబొందిపరమానందంబునవిరాజమానుండగునిట్లుతత్త్వజ్ఞులుసెప్పుదురనిసూతుండిట్లనియె॥

చ॥ జననములేకగర్మములజాడలఁబోకసమస్త

చిత్తవ।ర్తనుఁడగు చక్రికిఁ గవులుదారపరంబుల జన్మకర్మముల్। వినుతులు సేయుచుండుదురు వేదరహస్యములందు నెందుఁజూ।చినమాటి లేవు జీవునికిఁ జెప్పినకైవడి జన్మకర్మముల్॥ మ॥భువనశ్రేణి నమోఘలీలుఁడగుచుఁ బుట్టించు రక్షించు సం। తవిధిం జేయుము నుంగడం బహుభూతవ్రాతమం దాత్మతం।త్రవిహారస్థితుఁడై షడింద్రియసమస్తప్రీతియుఁ గాచ వ్వులఁ।దవిభంగింగొను జిక్కఁడింద్రియములం ద్రిప్పఁడు నిబంధించుచుఁ॥ చ॥జగదధినాథుఁడైన హరి సంతతలీలల నామరూపముల్।దగిలి మనోవచోగతులఁ దార్కికచాతురి నెంతగల్గినన్। మిగిలి కుతర్కవాదిదగ మేరలు చేసి యెఱుంగ నేర్చునే।యగణితవర్తనక్రమము నజ్ఞుఁడెఱింగి నుతింప నోపునే॥ ఉ॥ఇంచుకమాయలేక మది నెప్పుడుఁ బాయని భక్తితోడ వ।ర్తించుచు నెవ్వఁడేని హరిదివ్యపదాంబుజగంధరాశి సే।వించున తండెఱుంగు నరవిందభవాదుల కైన నచ్ఛభో।దంచితమైనయా హరియుదారమహాద్భుతకర్మమార్గముల్॥ మ॥హరిపాదద్వయభక్తి మీవలన నిట్లారూఢమైయుండునే।తిరుగం బారదు చిత్తవృత్తి హరిపై దీపించి మీలోపలన్।ధరణీదేవతలార మీరలు మహాధన్యుల్ సమస్తజ్ఞులున్। హరిచింతామృతమున్ ముఁజెంద వెన్నఁడును జన్మాంతవ్యథాయోగముల్॥ సీ॥పుణ్యకీర్తనుఁడైన భువనేశుచరితంబు బ్రహ్మతుల్యంబైన భాగవతము। సకలపురాణరాజము దొల్లి లోకభద్రముగఁ బుణ్యముగ మోదముగఁ బ్రీతి। భగవంతుఁడగు వ్యాసభట్టారకుఁ డొనర్చి శుకుఁడనియెడు తనసుతునిచేతఁ।జదివించె నింతయు సకలవేదేతిహాసములలోపల నెల్ల సారమైన। యీపురాణమెల్ల నెలమి నాశుకయోగి।గంగనడుమ వచ్చి ఘనవిరక్తి।యొదవి మునులతోడ నుపవిష్టుఁడగు పరీ।క్షిన్నరేంద్రుఁ డడుగఁ జెప్పవినుఁడు॥ వ॥కృష్ణుండు ధర్మజ్ఞానాదులతోడం దనలోకంబునకుం జనిన పిమ్మటం గలికాలదోషాంధకారంబున నష్టదర్శనులైన జనులకు నిప్పుడీపురాణంబు కమలబంధునిభంగి నున్నది నాఁడందు భూరితేజుండై కీర్తించుచున్న విప్రఋషివలన నేఁ బఠించిన క్రమంబున నామదికి గోచరించినంతయు వినుపించెద ననిన సూతునకు మునివరుండైన శౌనకుం డిట్లనియె॥ శా॥సూతా యే యుగవేళ నేమిటికి నెచ్చోటన్ మునిశ్రేష్ఠునే। శ్రోతల్ గోరిరి యేమి హేతువునకై శోధించి లోకైకవి।ఖ్యాతిన్ వ్యాసుఁడు మున్న భాగవతముం గల్పించె దత్పుత్రుఁడే।ప్రీతిన్ రాజునకీపురాణకథఁ జెప్పన్ జెప్ప వేయంతయున్॥ వ॥ బుధేంద్రా వ్యాసపుత్రుండైన శుకుండను మహాయోగి సమదర్శనుం డేకాంతమతి *మాయాశయనంబువలనం దెలిసినవాఁడు గూఢుండు మూఢునిక్రియ నుండు నిరస్తభేదుం డదియునుం గాక॥ తరల॥శుకుఁడు గోఁచియు లేక బైఁ జనఁ జూచి తోయములందులఁ జకుఁ జలింపకఁ జీరలొల్లకఁ జల్లులాడెడి దేవక।న్యకలు హా శుకయంచు వెన్కఁ జనంగ వ్యాసునిఁ జూచియం।శుకములన్ ధరియించి సిగ్గున స్రుక్కి రందఱు బుద్ధినిద్ధి॥ వ॥మఱియు నగ్నుండు దరుణుండునై చను తనకొడుకుం గని వస్త్రపరిధానం బొనరింపక వస్త్రధారియు వృద్ధుండునైన తనుం జూచి చేలంబులు ధరియించు దేవరమణులం గని వ్యాసుండు కారణం బడిగిన వారలు నీపుత్రుండు స్త్రీపురుషుల నెడు భేదదృష్టి లేక యుండు మఱియు నతండు నిర్వికల్పుండు గాన నీకు నతనికి మహదంతరంబు గల దనిరి యంత శుకుండు కురుజాంగల దేశంబులు సొచ్చి హస్తినాపురంబునఁ బౌరజనంబులచే నెట్లు జ్ఞాతుం డయ్యె నఱియును న్మత్తునిక్రియ మూఢుని తెఱంగున జడునిభంగి నుండు నమ్మహాయోగికి రాజర్షి యయిన పరీక్షిన్మహారాజుతోడ సంవాదం బెట్లు సిద్ధించె బహుకాలకథనీయంబైన శ్రీభాగవతనిగమవ్యాఖ్యాన మేరీతి సాఁగెన యోగిముఖ్యుండు గృహస్థుల గృహంబునఁ గోవునుఁ బిదికిన యంత తడవుగాని నిలువఁడండ్ర తండు గోదోహనమాత్రకాలంబు సంచరించిన స్థలంబులు తీర్థంబులగుఁ బెద్దకాల మేకప్రదేశంబున నెట్లుండె భాగవతోత్తముండైన జనపాలు జన్మకర్మంబు లేప్రకారంబులు వివరింపుము॥ సీ ॥ పాండవవంశంబు బలము మానంబును వర్ధిల్లఁ గలిమి నెవ్వాఁడు మనియెఁ। బరిపంథిరాజులు భర్మాదిధనముల నర్చింతు రెవ్వరి యంఘ్రియుగము।కుంభజకర్ణాదికురుభటవ్యూహంబు సొచ్చి చెండాడె నేశూరుతండ్రి। గాంగేయసైనికాక్రాంతగోవర్గంబు విడిపించి తెచ్చె నేవీరుతాత।యట్టిగాథకీర్తి యగు పరీక్షిన్మహా। రాజు విడువఁదగని రాజ్యలక్ష్మిఁ। బరిహరించి గంగఁ బ్రాయోపవిష్టుఁడై। యసువు లుండ నేయనడఁగి యుండె॥ ఉ॥ఉత్తమకీర్తులైన మనుజోత్తము లాత్మహితంబు లెన్నఁడున్।జిత్తములందుఁ గోరరు హసించియు లోకము లెల్ల నర్థసం।పత్తియు భూతియున్ సుఖము భద్రముఁ గోరుదు రన్యరక్షకా। త్యుత్తమమైన మేను విభుఁ డూరక యేల విరక్తిఁ బాసెనో॥ క॥సారముల నెల్ల నెఱుఁగుదు। శ్రీపారగుఁడవు భాషలందు బహు

---

*మాయాశయనంబువలనం దెలిసినవాఁడు।మాయయనెడు నిద్రనుండి మేలుకాంచినవాఁడనుట, ఉన్నిద్రః। అనుపదార్థవర్ణన మిదియని తెలియఁదగినది.— శ్రీపారగుఁడవు భాషలందు।ఇతిహాసపురాణార్థప్రవచనమందు మిక్కిలి సమర్థుఁడవు. విషయేవాచాం స్నాతం॥ అనుపదము యర్థముఁ దెలుపఁబడెను.

3

## శ్రీ వ్యాసుండు వ్యాకులితచిత్తుండై చింతించుట. శ్రీ

విభక్తకథనో। దారుఁడవు మాకు సర్వముఁ। బారము ముట్టంగఁ దెలియఁ బలుకు మహాత్మా॥ వ॥ అని యడిగిన శౌనకాదిమునిశ్రేష్ఠులకు సూతుం డిట్లనియె. తృతీయంబైన ద్వాపరయుగంబు *దిరుగు సమయంబున నుపరిచరవసువు వీర్యంబున జన్మించి వాసవి నాఁ దగు సత్యవతి యందుఁ బరాశరునికి హరికళం జేసి విజ్ఞానియయిన వేదవ్యాసుండు జన్మించి యొక్కనాఁడు బదరికాశ్రమంబున సరస్వతీజలంబుల స్నానాదికర్మంబు లందీర్చి శుచియై యితరులు లేనిచోట నొంటిఁ గూర్చుండి సూర్యోదయవేళ నతీతానాగతవర్తమానజ్ఞుండయి యా ఋషి వ్యక్తంబుగాని వేగంబుగల కాలంబునం జేసి యుగధర్మంబులకు హితంబుగా భువి సాంకర్యంబు నొందు యుగయుగంబుల భౌతికశరీరంబులకు శక్తిసన్నము గుఁ బురుషులు నిస్సత్త్వులు ధైర్యహీనులు మందప్రజ్ఞులు నల్పాయువులు దుర్బలురు నయ్యెదరని తన దివ్యదృష్టిం జూచి సర్వవర్ణాశ్రమంబులకు హితంబు సేయందలఁచి నలువురు హోతలచేత ననుష్ఠింపందగి ప్రజలకు శుద్ధికరంబులైన వైదికకర్మంబులగు యజ్ఞంబు లెడఁ దెగకుండుకొఱకు నేకంబయిన వేదంబు ఋగ్యజుస్సామాథర్వణంబులను నాలుగు నామంబుల విభాగించి యితిహాసపురాణంబులన్నియుఁ బంచమవేదంబని పల్కెనందు॥ సీ॥ పైలుండు ఋగ్వేదపఠనంబు దొరకొనె సామంబు జైమిని చదువుచుండె। యజువు వైశంపాయనాఖ్యుండు గైకొనెఁ దుది నథర్వము సుమంతుఁడు పఠించె। నఖిలపురాణేతిహాసముల్ మా తండ్రి రోమహర్షణుఁడు నిరూఢిఁ దాల్చెఁ। దమతమ వేదమా తపసులు భాగించి శిష్యసంఘములకుఁ జెప్పిరంత। శిష్యు లొండొరు లాత్మీయశిష్యజనులకుం జెప్ప బహుమార్గములఁ ద్రుంచియను వచింప। బెక్కుశాఖలు గలిగి యీ పృథివిలోన। నిగమ మొప్పారె భూసురనివహమందు॥ వ॥ ఇట్లు మేధాహీనులయిన పురుషులచేత నట్టి వేదంబులు ధరియింపంబడుచున్నవి. మఱియు దీనవత్సలుండైన వ్యాసుండు స్త్రీశూద్రులకుం ద్రైవర్ణికాధములకు వేదంబులు విననర్హంబులు గావున మూఢుల కెల్ల మేలగునని భారతాఖ్యానంబు చేసియు నమ్ముని భూతహితమందుఁ దన హృదయంబు సంతసింపకున్న సరస్వతీతటంబున నొంటి నుండి హేతువు వితర్కించుచుఁ దనలో నిట్లనియె॥ సీ॥ వ్రతధారినై వేదవహ్నులు గురుశ్రేణి మన్నింతు విహితకర్మములఁ గొఱంత। యడకుండ నడుపుచు భారతమిషమునఁ బలికితి వేదార్థభావ మెల్ల। మునుకొని స్త్రీశూద్రముఖరధర్మములందుఁ దెలిపితి నేఁ జెల్ల నీనఁ జేసి యాత్మ సంతసమందదాత్మలో నీశుండు సంతసింపకున్న జాడ దోఁచె। హరికి యోగివరుల కభిలషితంబయిన। భాగవతవి

## శ్రీ వ్యాసునికడకు నారదుండు వచ్చుట. శ్రీ

ధంబుఁ బలుకనైతి। మోసమయ్యెఁ దెలివి మొనయదు మఱచితి। ననుచు వగచుచున్న యవసరమున॥ సీ॥ తన చేతి వల్లకీతంత్రీచయంబున సతత నారాయణశబ్ద మొప్ప। నానన సంభూత హరిగీత రవసుధాధారల యోగీంద్రతతులు సొక్కఁ। గపిలజటాభారకాంతిపుంజంబుల దిశలు ప్రభాతదీధితి వహింపఁ। దనులగ్న తులసికాదామగంధంబులు గగనాంతరాళంబుఁ గప్పికొనఁగ। వచ్చె మింటనుండి వాసవీనందను। కడకు మాటలాడఁ గడఁకతోడ। భద్రవిమలకీర్తి పారగుఁ డారూఢ। నయవిశారదుండు నారదుండు॥ క॥ కని యెన్నారఁ దనుఁ డంతఁ। విన యైకవిలాసు నిగమవిభజనవిద్యా। జనితోల్లాసుఁ భవదుః। ఖనిరాసుఁ గురుమనోవికాసు వ్యాసుఁ॥ వ॥ ఇట్లు నిజాశ్రమంబునకు వచ్చిన నారదు నెఱింగి లేచి వ్యాసుండు వివిధక్రమంబులం బూజించిన నతండు లేనగవు నెగడెడి మొగంబుతో విపంచికాతంత్రి వ్రేల మీటుచు నిట్లనియె॥ ఉ॥ ధాతవు భారతశ్రుతివిధాతవు వేదపదార్థజాలవి। జ్ఞాతవు కామముఖ్యరిపుషట్కవిజేతవు బ్రహ్మతత్త్వని। ర్ణేతవు యోగినేతవు వినీతుఁడ వీవు చలించి చెల్లరే। కాతరుకైవడిన్ వగవఁ గారణమేమి పరాశరాత్మజా॥ అనినఁ బారాశర్యుం డిట్లనియె॥ క॥ పుట్టితి వజుతనువునఁ జే। పట్టితివి పురాణపురుషు భజనము పదముల్। మెట్టితివి దిక్కులందుది। ముట్టితివి మహాప్రబోధమున మునినాథా॥ వ॥ అదియునుం గాక నీవు సూర్యునిభంగి మూఁడు లోకములం జరింతువు వాయువుపగిది నఖిలజనులలోన మెలంగుదువు స

---

*తిరుగు సమయంబున। అనఁగా నా యుగమునకుఁ జరమభాగమునందని యభిప్రాయము.— శక్తిసన్నము। సామర్థ్యము తీఱించునది, నిస్సత్త్వులు। బలహీనులు.—౧౧. దొరకొనె। ఆరంభించెను. ౧౩. ఆతపసులు। ఆ ఋషులు, తపస్విశబ్దతద్భవము. తపసి। పెక్కుశాఖలు గలిగి, అనేకములగు కొమ్మలు గలదై, ఇచట వేదము వృక్షముగా నిశ్చయించియా వేదమునందు నంతర్గతములగు నల్పాంశములకు శాఖలని శిష్టవ్యవహారము గలదు. నిగమము। వేదము.—౧౬. త్రైవర్ణికాధములకు—ద్విజశబ్దవాచ్యులగు। బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులలో నధములకు వీరే ద్విజబంధులని చెప్పఁబడుచున్నారు.—౧౮. మిషమున। చలమున, వ్యాజమున। నెపమున. మునుకొని। పూర్వకాలమునందు. చెల్ల। చెల్లఁబో—అనఁగా—అయ్యో, కటకట అనువానివలె సంతాపార్థకావ్యయము.—౨౨. వల్లకీతంత్రీచయము। వీణయొక్క తంతువుల సమూహము, తంత్రీశబ్దతద్భవము—తంతి. ౨౫. వాసవీనందనుకడకు। వ్యాసునిసమీపమునకు. కడఁకతోడ। ధైర్యముతోను. ౨౮. విపంచికా। ఏడు తంతువులు గల వీణ. ౩౧. కాతరు। భయపడువాని.

ర్వజ్ఞుండవగుటం జేసి॥ క॥ నీ కెఱుఁగరాని ధర్మము। లోకములను లేదు బహువిలోకివి నీవుర్। నా శోకం బేఁ తెఱఁగో వెట్టిదంతయు। నా కెఱుఁగ వివరింపు మయ్యా నారదకరుణన్॥ అనిన నారదుం డిట్లనియె॥ ఉ॥ అంచితమైన ధర్మచయ మంతయుఁ జెప్పితి వందులోన నించుకగాని విష్ణుకథ లేర్పడఁ జెప్పవు ధర్మముల్ ప్రపంచించిన మెచ్చునే గుణవిశేషము లెన్నినఁగాక నీకు నీ। కొంచెము వచ్చు టెల్ల హరిఁ గోరి నుతింపమి నార్యపూజితా॥ మ॥ హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజహంసావళీ। సురుచిభ్రాజితమైన మానససరస్స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ। హరినామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ। కరమై యుండ దయోగ్యదుర్మలిన *కాకోలగర్తాకృతిన్॥ మ॥ అపశబ్దంబులఁ గూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపాపపరిత్యాగము సేయుఁ గావున హరిన్ భావించుచున్ బాడుచున్। జపముల్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబు గీర్తించుచున్। దపసుల్ సాధులు ధన్యులౌదురు గదా తత్త్వజ్ఞ చింతింపుమా॥ వ॥ మునీంద్రా నిర్గతకర్మంబై నిరుపాధికంబయిన జ్ఞానంబు గలిగిననుహరిభక్తి లేకున్న విశేషంబుగ శోభితంబు గాదు ఫలంబు గోరక కర్మ మీశ్వరునకు సమర్పణంబు సేయకున్న నది ప్రశస్తంబై యుండదు భక్తిహీనంబులయిన జ్ఞానవాచాకర్మకౌశలంబులు నిరర్థకంబులు గావున మహానుభావుండవు యథార్థదర్శనుండవు సకలదిగంతధవళకీర్తివి సత్యరతుండవు ధృతవ్రతుండవు నగు నీవు నిఖిలబంధమోచనంబు కొఱకు వాసుదేవుని లీలావిశేషంబులు భక్తితోడ వర్ణింపుము హరివర్ణనంబు సేయక ప్రకారాంతరంబున నర్థాంతరంబులు వివక్షించి తద్వివక్షాకృతరూపనామంబులం జేసి పృథగ్దర్శనుండైనవాని మతి పెనుగాలిం ద్రిప్పనంబడి తప్పంబడు నావ చందంబున నెలవు సేరదు కామ్యకర్మంబులందు రాగంబుగల ప్రాకృతజనులకు నియమించిన ధర్మంబులు సెప్పి శాసకుండవగు నీ నడువడి దగదది యెట్లనిన వారలది యె ధర్మంబని జుగుప్సితంబులగు కామ్యకర్మంబులు సేయుచుఁ దత్త్వజ్ఞానంబు మఱుతురది గావున బుద్ధిమోహంబు జనియింపక దత్త్వప్రముండవై వ్యర్థావియోగంబు సేయుమని మఱియు నిట్లనియె॥ చ॥ ఎఱిఁగినవాఁడు గర్మచయ మెల్లను మాని హరిస్వరూపమున్। నెఱయ నెఱుంగుఁ గాని సుమతి నేరుపుఁ జూపు గుణానురక్తుఁడై। తెలుపవలేక గ్రుమ్మఱుచు దేహధనాద్యభిలాషయుక్తుఁడై। యెఱుఁగనివానికిం దెలియ నీశ్వరలీల లెఱుంగఁ జెప్పుమా॥ చ॥ తనకులధర్మము న్విడిచి దానవవైరిపదారవిందము। ల్వనివడి సేవఁ జేసి పరిపాకము వొందక నెవ్వఁడేనిఁ జచ్చిన మఱి మేననైన నది సిద్ధి వహించుఁ దదీయసేవఁ బాసిన కులధర్మగౌరవము సిద్ధి వహించునె యెన్ని మేనులన్॥ వ॥ అదిగావున నెఱుకగలవాఁడు హరిసేవకు యత్నంబు సేయందగుఁ గాలక్రమంబున సుఖదుఃఖంబులు ప్రాప్తంబులయిన హరిసేవ విడువందగదు దానం జేసి యూర్ధ్వంబున బ్రహ్మపర్యంతంబు క్రిందఁ స్థావరపర్యంతంబు దిరుగుచున్న జీవులకు దుఃఖంబులట్ల సుఖంబులు ప్రాకృతకర్మాధీనంబులై సిద్ధించు నెయ్యది పొందరాదట్టి మేలు సిద్ధించుకొఱకు హరిసేవ సేయవలయు హరిసేవకుండగు వాఁడు జననంబు నొందియు నన్యునిక్రియ సంసారంబునం జిక్కుఁడు క్రమ్మఱ హరిచరణంబుఁ జేరుభక్తిరసవశీకృతుండయి విడువ నిచ్ఛగింపఁడు మఱియు॥ సీ॥ విష్ణుండు విశ్వంబు విష్ణునికంటెను వేఱేమియును లేదు విశ్వమునకు। భవవృద్ధిలయములా పరమేశుచేనగు నీవెఱుంగుదు గాదె నీ ముఖమున। నెఱిఁగింపఁబడ్డ దియేకదేశమున నీ భువనభద్రమునకై పుట్టినట్టి। హరికళాజాతుండవని విచారింపుము కావున హరిపరాక్రమము లెల్ల। వినుతి సేయుము నీ వునికియుఁ జదువును। దానమతులనయముఁ దపముధృతియుఁ। గలిమి కెల్ల ఫలముగా దెపుణ్యశ్లోకుఁ। గమలనాభుఁ బొగడఁ గలిగెనేని॥ . . . . . . . . . . . . . . . . *

## ——⟶ శ్రీ నారదుని పూర్వజన్మవృత్తాంతము. శ్రీ ⟵——

వ॥ మహాత్మా నేను పూర్వకల్పంబునం దొల్లిటి జన్మంబున వేదవాదులయింటి దాసికిం బుట్టి పిన్ననాఁడు వారలచేఁ బంపంబడి యొక వానకాలంబునఁ జాతుర్మాస్యంబున నేకస్థలనివాసంబు సేయ నిశ్చయించిన యోగిజనులకుం బరిచర్య సేయుచు॥ క॥ శ్రీఓటమితో నెల్లప్పుడు। పాటవమునఁ బనులు సేసి బాలురతో నే। యాటలకుఁ బోక నొకజం। జాటంబును లేక భక్తిసలుపుదు ననఘా॥ క॥ మంగళమనుచును వారల। యెంగిలి భక్షింతు వాన కెండకు నోడన్। ముంగలనిలుతును నియతిని। వెంగలి క్రియఁ జనుదు నేవివేకము తోడన్॥ వ॥ ఇట్లు నవర్షాకాలశరత్కాలంబులు సేవించితి వారును నాయందుఁ గృపఁ జేసిరంత॥ శా॥ వారల్ కృష్ణచరిత్రముల్ సదువఁగా వర్ణింపఁగాఁ బాడఁగా। నారావంబు సుధారసప్రతిమమై యశ్రాంతము న్వీనులం। దోరంబై పరిపూర్ణమైన మది సంతోషించి నేనంతటన్। బ్రారంభించితి విష్ణుసేవకితర ప్రారంభదూరుండనై॥ వ॥ ఇట్లు హరి

---

* కాకోలగర్తాకృతిన్ । మాలకాకులుండు పల్లము రీతి.— శ్రీఓటమి। ఓటము। అనఁగా గర్వలేశము లేకున్నందున దనయందు నెల్లపుడుఁ దత్వము నువహించుట.— ౩ గ. తోరంబై। సుందరమై.

సేవామతిం జేసి ప్రపంచాతీతుండనై బ్రహ్మరూపకుండనయిన నాయందు స్థూలసూక్ష్మంబయిన యీశరీరంబు నిజమాయాకల్పితంబనియమ్మహాత్ములగు యోగిజనులమూలంబున రజస్తమోగుణపరిహారిణియయిన భక్తిసంభవించె నంతఁ జాతుర్మాస్యంబు నిండిన నయ్యోగిజనులు యాత్ర సేయువారలై యివ్విధంబున॥ మ॥ అపచారంబులు లేక నిత్యపరిచర్యాభక్తియుక్తుండనై। చపలత్వంబును మాని నేఁగొలువఁగా సంప్రీతులై వారు నిష్కపటత్వంబున దీనవత్సలతతోఁ గారుణ్యసంయుక్తులై। యుపదేశించిరి నాకు నీశ్వరరహస్యోదారవిజ్ఞానముఁ॥ వ॥ ఏను వారియుపదేశంబున వాసుదేవుని మాయానుభావంబుఁ దెలిసితి నీశ్వరునియందు సమర్పితంబయిన కర్మంబు *తాపత్రయంబు మాన్పనౌషధంబగు నే ద్రవ్యంబువలన నే రోగంబు జనియించె నా ద్రవ్యమా రోగంబు మానుప నేరదు ద్రవ్యాంతరంబుల చేతనైన చికిత్సితంబు మానుపనోపు నివ్విధంబునఁ గర్మంబులు సంసారహేతుకంబులయ్యు నీశ్వరార్పితంబులై తా ముందమ్ముఁ జెఱుపుకొన నోపియుండు నీశ్వరునియందుఁ జేయఁబడు కర్మంబు విజ్ఞానహేతుకంబై యీశ్వరసంతోషణంబును భక్తియోగంబునుం బుట్టించు నీశ్వరశిక్షం జేసి కర్మంబులు సేయువారలు కృష్ణగుణనామవర్ణనస్మరణంబులు సేయుచు రుఁ శ్రీప్రణవపూర్వకంబులుగా వాసుదేవ ప్రద్యుమ్న సంకర్షణానిరుద్ధమూర్తినామంబులు నాలుగు భక్తిం బలికి నమస్కారంబు సేసి మంత్రమూర్తియు మూర్తిశూన్యుండు నయిన యజ్ఞపురుషుం బూజించు పురుషుండు సమ్యగ్దర్శనుండగు॥ క॥ ఏనివ్విధమునఁ జేయఁగ। దానవకులవైరి నాకుఁ దనయందలి విజ్ఞానము నిచ్చెను మదనుస్థానమునఁ దెలుఁగు నీవు సలుపు ముదీర్ణ॥ క॥ మునికులములోన మిక్కిలి। వినుకులు గలవాఁడవీవు విభుకీర్తులు నీ। వనుదినముఁ బొగడవినిరొడి। జనములకున్ దుఃఖ మెల్ల శాంతింబొందుఁ॥ వ॥ ఇట్లు నారదు జన్మకర్మంబులు విని బ్రహ్మఱ వ్యాసుండిట్లనియె॥ మ॥ విను మా భిక్షులు నీకు నిట్లు కరుణన్ విజ్ఞానముం జెప్పిపో। యిన బాల్యంబున వృద్ధభావమున నీ కేరీతి సంచారముఁ। జనె నీకిప్పుడు పూర్వకల్పమతి యే జాడం బ్రదీపించెఁ దత్తనువుం బాసిన చంద మెట్లు చెపుమా దాసీసుతత్వంబుతోఁ॥ వ॥ అని యిట్లు వ్యాసుండడిగిన నారదుండిట్లనియె దాసీపుత్రుండనయిన యేను భిక్షులవలన హరివిజ్ఞానంబు గలిగియున్నంత॥ సీ॥ మమ్ము నేలినవారి మందిరంబునఁ గలపను లెల్లఁ గ్రమమున భక్తిఁ జేసి। తనపరాధీనతఁ దలఁపమసొలసితి నలసితి నాఁకొంటి ననుచు వచ్చు। మాపును రేపును మాతల్లి మోహంబు సొంపార ముద్దాడుఁ జుంచుదువ్వు। దేహంబు నివురు మోదించుఁ గౌఁగిటఁ జేర్చు నర్మిలితో నిట్లు నన్ను మనుప। నేను విడిచి పోక నింటనుండితి నయ్యా। మోహిఁ గాక యెఱుక మోసపోక। మాఱు చింత లేక మా నిర్మైనమే నేండ్ల। వాఁడనగుచుఁ గొన్ని వాసరములు॥ క॥ సదనము వెలువడి తెరువున। జెదరక మాతల్లి రాత్రిఁ జీఁకటివేళ। న్మొదవుం బిదుకఁగ నొకఫణి। పదభాగముఁ గఱచె ద్రొక్కఁబడి మునినాథా॥ క॥ నీలాయతభోగఫణి। వ్యాళానలవిషమహోగ్రవహ్నిజ్వాలా। మాలావినిపాతితయై। వ్రాలె న్నన్నుఁ గన్నతల్లి వసుమతిమీఁదన్॥ ఉ॥ తల్లి ధరిత్రిపై నొఱిగి తల్లడపాటును జెంది చిత్తముఁ। బల్లటిలంగఁ బ్రాణములు వాసినఁ జూచి కలంగ కేను నాయుల్లములోన మోహరుచి నొందక సంగము వాసె మేలురా। జిల్లెనటంచు విష్ణుపదచింత యొనర్చుచు బుద్ధిఁ జేర్చుచున్॥ వ॥ ఉత్తరాభిముఖుండనై యేను వెడలి జనపదంబులుఁ బురంబులుఁ బట్టణంబులు గ్రామంబులుఁ బల్లెలు మందలు మహోద్యానంబులుఁ గిరాతపుళిందనివాసంబులు వనంబులుఁ జిత్రధాతువిచిత్రితంబులైన పర్వతంబులు సమదకరికరవిదళితశాఖలు గల శాఖులును నివారితపథికజనశ్రమాతిరేకంబులైన తటాకంబులు బహువిధవిహంగనినదమనోహరంబులై వికచారవిందమధుపానపరవశపరిభ్రమద్భ్రమరసుందరంబులైన సరోవరంబులుఁ దాఁటి చనుచు క్షుత్పిపాసాసమేతుండనై నదీహ్రదంబునఁ గ్రుంకులిడి శుచినై నీరు ద్రావి విగతశ్రముండనై॥ క॥ సాలావృకకపిభల్లుక। కోలేభలులాయశల్యఘూకశరభశార్దూలశశగవయఖడ్గ। వ్యాళాజగరాదిభయదవనమధ్యమునన్॥ వ॥ దుస్తరంబయిన నలవేణుకీచకగుల్మలతాగహ్వరంబుల పొంతనొక్క రావిమ్రానిడగ్గరఁ గూర్చుండి యే విన్నచందంబున నాహృదయగతుం బరమాత్మస్వరూపు హరిం జింతించితి॥ శా॥ ఆనందాశ్రులు గన్నులన్ వెడలరోమాంచంబుతోఁ దత్పదధ్యానారూఢుఁడనైన నాతలఁపులోన న్దేవుఁ డుండొఁ చెనే। నానందాబ్ధిగతుండనై యెఱుఁగ లేనైతి నన్నును నీశ్వరు। న్నానాశోకహమైన యత్తనువుఁ గా

---

* తాపత్రయంబు। ఆధిభౌతికము, ఆధిదైవికము, ఆధ్యాత్మికము, అనెడు మూఁడు తాపంబులు.—— శ్రీ ప్రణవపూర్వకముగా। ప్రణవమనఁగా- ఓంకారము- అది ముందుగాఁ జేరియుండునటుల. ౧౩. వినుకులు। ఆలకించుటలు, అనఁగా- బహుశ్రుతుఁడవనుట.—— ౧౫. సొలసితి। మూర్ఛిల్లితి, సొమ్మసిల్లితి, శోషపోతి, అలసితి, ఆయాసంబు నొందితి.—— ఆఁకొంటి, ఆఁకలిఁగొంటి.—— చుంచు, చిప్పకుంకటి- అనఁగాఁ బిశిబిడ్డలతల లోనుండు చిఱువెండ్రుకలు.—— ౧౮. మనుప। రక్షింపఁగాను.—— ౨౭. కిరాత। పుళిందనివాసంబులు, కిరాతులనఁగా నెమలిపింఛము గట్టుకొను బోయలు. పుళిందులనఁగా- తమభాషఁ దప్ప శేషలోకభాషఁ దెలియని చెంచుబోయలు.

నన్నేరకట్లంతటన్॥ వ॥ లేచినిలువంబడిక్రమ్మఱనద్దేవునిదివ్యాకారంబుఁజూడనిచ్ఛయించి హృదయంబుననిలుపుకొ
నియాతురుంబోలెఁజూచియుఁగానకనిర్మనుష్యంబయినవనంబునంజరియించుచున్ననన్నుద్దేశించి వాగగోచరుండయి
నహారిగంభీరమధురంబులయినవచనంబులశోకంబుపశమింపంజేయుచందంబుననిట్లనియె॥ ఉ॥ పలకుమారశోషిలఁగనీజ
ననంబుననన్నుఁగానఁగాఁజాలవుగానఁ*గామముఖషట్కమునిర్దళితంబుసేసినిర్మూలితకర్ములై నమునిముఖ్యులుగా
నికుయోగిగానఁగాఁజాలఁడునీమకోరికగొనసాఁగుటకై నిజమూర్తిఁజూపితిన్॥ క॥ నావలనికోరికయారక। పోవ
దువిడిపించుదోషపుంజములనుమ। త్సేవంబుట్టునుశీఘ్రైశము। భావింపఁగనాదుభక్తిబాలకవింటే॥ క॥ నాయందుఁగలుగునీ
మది। వాయదుజన్మాంతరములబాలకనీవీ। కాయంబువిడిచిమీఁదట। మాయనుమతిఁబుట్టఁగలవుమద్భక్తుఁడవై॥ మ॥ విను
మీసృష్టిలయంబునొందియుగముల్వెయ్యైనకాలంబుయా। మినియైపోయెడిఁబోవఁగాఁగలుగుఁజుమ్మీమీఁదనాసృష్టియం।
దునిరూఢస్మృతితోడఁబుట్టెదవునిర్దోషుండవై నాకృపన్। ఘనతంజెందెదుశుద్ధసాత్త్వికులలోఁగణ్యుండవై యర్భకా॥
వ॥ అనియిట్లాకాశమూర్తియుఋగ్వేదాదికంబు నిశ్వాసంబుగానొప్పుసర్వనియామకంబయిన మహాభూతంబువలికి
యూరకున్ననేనుమస్తకంబువంచిమ్రొక్కి తత్కరుణకుసంతసించిమదముడిగనాడిమత్సరంబువిడిచికామంబుఁజయించి
క్రోధంబువర్జించిలోభమోహంబులువెడలనడిచిసిగ్గువిడిచి యనంతనామంబులుపఠించుచుఁ బరమభద్రంబులయినత
చ్చరిత్రంబులంజింతించుచునిరంతరసంతుష్టుండనై కృష్ణునిబుద్ధినిలిపినిర్మలాంతఃకరణంబుతోడవిషయవిరక్తుండనై కాల
మునకెదుఱుసూచుచుభూమిందిరుగుచునుండనంతఁగొంతకాలంబునకుమెఱుపుమెఱసినతెఱంగునమృత్యువుదోఁచినఁ
బంచభూతమయంబునుగర్మస్వరూపంబయినపూర్వదేహంబువిడిచిహరికృపావశంబునశుద్ధసత్త్వమయంబైనభాగవత
దేహంబుసొచ్చితియంతంద్రైలోక్యంబుసంహరించిప్రళయకాలపయోరాశిమధ్యంబునశయనించునారాయణమూర్తి
యందునిదురఁబోవనిచ్చగించుబ్రహ్మనిశ్వాసంబువెంటనతనిలోపలంబ్రవేశించితినంత సహస్రయుగపరిమితంబైనకా
లంబుచనినలేచిలోకంబులుసృజియింపనుద్యోగించుబ్రహ్మప్రాణంబువలనమరీచిముఖ్యులగుమునులు నేనునుజన్మించితి
మందునఖండితబ్రహ్మచర్యుండనై యేను మూఁడులోకంబులబహిరంతరంబులందు మహావిష్ణునియనుగ్రహంబునన
డ్డంబులేకయీశ్వరదత్తమై బ్రహ్మాభివ్యంజకంబులయిన సప్తస్వరంబులుదనయంతనమ్రోయుచున్నయీవీణాలాపర
తింజేసినారాయణకథాగానంబుసేయుచుఁజరియించుచుండుదు॥ గీ॥ తీర్థపాదుఁడయినదేవుండువిష్ణుండు। దనచరిత్ర
మేనుదవిలిపాడఁ। జీఱఁబడ్డవానిచెలువుననేతెంచి। ఘనుఁడునామనమునఁగానవచ్చు॥ క॥ వినుమీసంసారంబను। వననిధి
లోమునిఁగికర్మవాంఛలచేవే। దనఁబొందెడువానికివి। ష్ణునిగుణవర్ణనముదేపసుమ్ముమునీంద్రా॥ చ॥ యమనియమాది
యోగములనాత్మనియంత్రితమయ్యుఁగామరోషములఁబ్రచోదితంబయగుశాంతివహింపదువిష్ణుసేవచేఁ। గ్రమమున
శాంతిఁగైకొనినకైవడినామశరీరజన్మక। ర్మములరహస్యమెల్లమునిమండనచెప్పితినీవుగోరినన్॥ వ॥ అనియిట్లుభగవం
తుండగునారదుండువ్యాసమునీంద్రునివీడ్కొనివీణవాయించుచుయదృచ్ఛామార్గంబునంజనియెననిసూతుండిట్లనియె॥
క॥ వాయించువీణనెప్పుడు। మ్రోయించుముకుందగీతములుజగములకు। న్జేయించుఁజెవులపండువు। మాయించునఘాళినిట్టి
మతమఱిగలఁడే॥ వ॥ అనినారదుంగొనియాడినసూతునింజూచినారదుమాటలువిన్నవెనుకభగవంతుండయినబాదరా
యణుండేమిచేసెననిశౌనకుండడిగినసూతుండిట్లనియెబ్రహ్మనదియయినసరస్వతీపశ్చిమతీరంబున ఋషులకుసత్రధ
ర్మవర్ధనంబయినబదరీతరుషండమండితంబయినశమ్యాప్రాసంబని ప్రసిద్ధంబగునాశ్రమంబుగలదందుజలంబులువార్చి
కూర్చుండివ్యాసుండుదనమదిఁదిరంబుసేసికొనిభక్తియుక్తంబైనచిత్తంబునంబరిపూర్ణుండైనయీశ్వరుంగాంచియీ
శ్వరాధీనమాయావృతంబైనజీవుని సంసారంబుఁగనిజీవుండుమాయచేతమోహితుండై గుణవ్యతిరిక్తుండయ్యు మా
యాసంగతిందానుద్రిగుణాత్మకుండననియభిమానించుచుంద్రిగుణత్వాభిమానంబునం గర్తయుభోక్తయునననర్థం
బునొందుననియు నయ్యనర్థంబునకు నారాయణభక్తియోగంబుగాని యుపశమనంబు వేఱొకటిలేదనినిశ్చయించి॥
మ॥ అవనీచక్రములోననేపురుషుఁ¶ డేయామ్నాయమున్విన్నమా। ధవుఁడౌలోకశరణ్యుపైభవములందప్పింపఁగాఁజా
లుభ। క్తివిశేషంబుజనించునట్టిభువనక్షేమంకరంబైనభా। గవతామ్నాయముబాదరాయణుఁడుదాఁగల్పించెనేర్పొప్ప

* కామముఖషట్కము। కామముమొదలైనయాఱింటిని-అనఁగా-అరిషడ్వర్గమునుననుట.— శీఘ్రైశము। త్వర.— ¶ ఏయామ్నాయ
మున్। భగవత్తత్త్వమునులెన్నఁగఁదెలియఁజేసెడువేదతుల్యమయినయేగ్రంథమును.

౧౯॥ వ॥ ఇట్లు భాగవతంబు నిర్మించి మోక్షార్థియైన శుకునిచేఁ జదివించెనని చెప్పిన శౌనకుండు నిర్వాణతత్పరుండును సర్వోపేక్షకుండు నైన శుకయోగి యేమిటికి భాగవతం బభ్యసించె ననవుడు సూతుం డిట్లనియె॥ క॥ ధీరులు నిరపేక్షులు నా। త్మారాములు నైన మునులు హరిభజనము ని। ష్కారణమ చేయుచుందురు। నారాయణుఁ డట్టివాఁ డనవ్యచరిత్రా॥ క॥ హరిగుణవర్ణనరతుఁడై। హరితత్పరుఁడైన బాదరాయణిశుభత। త్పరతం బఠించెఁ ద్రిజగ। ద్వరమంగళమైన భాగవతనిగమంబున్॥ క॥ నిగమములు వేయుఁ జదివిన। సుగమంబులు గావు ముక్తిసుభగత్వంబుల్। సుగమంబు భాగవతమను। నిగమంబుఁ బఠింప ముక్తి నిచ్చు జనులకున్॥

## అర్జునుండు పుత్రఘాతియగు నశ్వత్థామ నవమానించుట.

వ॥ అని పలికి రాజర్షి యైన పరీక్షిన్మహారాజు జన్మకర్మముక్తులును, పాండవుల మహాప్రస్థానంబును, కృష్ణకథోదయంబును జెప్పెదఁ, గౌరవదృష్టద్యుమ్నాదుల యుద్ధంబున వీరులైన వారలు స్వర్గంబునకుం జనిన వెనుక భీముగదాఘాతంబున దుర్యోధనుండు దొడలు విఱిగి కూలిన నశ్వత్థామ దుర్యోధనునకుం బ్రియంబు సేయువాఁడై నిదురం బోవు ద్రౌపదీపుత్రుల శిరంబులు ఖండించి తెచ్చి సమర్పించె నది క్రూరకర్మం బని లోకులు నిందింతురు॥ ఉ॥ బాలుర చావు కన్నులఁ బడ్డ గలంగి యెలుంగెత్తి యోరువం। జాలక బాష్పతోయకణజాలము చెక్కుల రాల నేడ్చె పాం। చాలతనూజ నేలఁ బడి జాలిఁ బడంగని యెత్తి నంజువా। చాలతఁ జూపుచుం *జికురజాలము దువ్వుచుఁ గ్రీడి యిట్లనున్॥ శా॥ ధరణీశాత్మజ నీకు నేల పగ వర్ణధర్మంబె తద్ద్రౌణి ని। ష్కరుణుండై విదళించె బాలకుల నుద్గాండీవనిర్ముక్తభీ। కరబాణంబుల నేఁడు వానిశిరముం ఖండించి నేఁ దెత్తుఁ ద। చ్ఛిరముం ద్రొక్కి జలంబు లాడుమిచటన్ శీతాంశుబింబాననా॥ వ॥ అని యిట్లొడంబఱిచి తనకు మిత్రుండును సారథియు నైన హరి మేలనుచుండంగ కవచంబు దొడిగి గాండీవంబు ధరియించి కపిధ్వజుండై గురుసుతుని వెంట రథంబుఁ దోలించిన॥ శా॥ తన్నుం జంపెద నంచు వచ్చు విజయున్ దర్శించి తద్ద్రౌణి యా। పన్నుండై శిశుహంత గావున నిజప్రాణేచ్ఛఁ బారెన్ వడిన్। మున్నున్ బ్రహ్మ మృగాకృతిం దనయ మున్మోహించి క్రీడింపనా। సన్నుండై హరుఁ జూచి పాఱుపగిదిన్ సర్వేంద్రియభ్రాంతితోన్॥ వ॥ ఇట్లు పోయి నంతదూరంబు బరువిడి వెనుకఁ జూచి రథతురంగంబు లలయుటఁ దెలిసి నిలిచి ప్రాణరక్షకంబునకు నొండుపాయంబు లేమి నిశ్చయించి జలంబులు వార్చి ద్రోణనందనుండు సమాహితచిత్తుండై ప్రయోగంబ కాని యుపసంహారంబు నేరకయ ప్రాణసంరక్షణార్థంబునకై పార్థుని మీఁద బ్రహ్మశిరోనామకాస్త్రంబుఁ బ్రయోగించిన నది ప్రచండతేజంబున దిఙ్మండలంబు నిండి ప్రాణభయంకరంబై తోఁచిన హరికి నర్జునుం డిట్లనియె॥ సీ॥ పద్మలోచన కృష్ణ భక్తాభయప్రద వినుము సంసారాగ్ని వేర్చుచున్న। జనుల సంసారంబు సంహరింపఁగ నీవు దక్క నన్యులు లేరు దలఁచి చూడ। సాక్షాత్కరించిన సర్వేశ్వరుండవు ప్రకృతిపరుండవు పరమపురుష। నీ ప్రబోధము చేత నీ మాయ నంతయు నడఁతువు నిశ్శ్రేయసాత్మ యందు। మాయయందు మునిఁగి మను వారలకుఁ గృపఁ। జేసి ధర్మముఖ్యచిహ్నమయిన। శుభము సేయుచుందు సుజనుల నవనిలోఁ। గావఁ బుట్టుదువు జగన్నివాస॥ క॥ ఇది యొక తేజము భూమియుఁ। ‡చదలును దిక్కులును నిండి సర్వంకషమై। యెదురై వచ్చుచునున్నది। విదితముగా నెఱుఁగఁ జెప్పవే దేవేశా॥ అనిన హరి యిట్లనియె॥ శా॥ జిహ్మత్వంబునఁ బాఱి ద్రోణజుఁడు దుశ్శీలుండు ప్రాణేచ్ఛమై। బ్రహ్మాస్త్రంబదె యేయవచ్చె నిదె తద్బాణాగ్ని బీభత్సనీ। బ్రహ్మాస్త్రంబునఁ గాని దీని మఱలింపన్ రాదు సంహారమీ। బ్రహ్మాపత్య మెఱుంగఁ డేయుము వడిన్ బ్రహ్మాస్త్రముం దీనిపై॥ వ॥ అనిన నర్జునుండు జలంబులు వార్చి హరికిం బ్రదక్షిణంబు వచ్చి ద్రోణనందనుం డేసిన యస్త్రంబు మీఁదఁ దన బ్రహ్మాస్త్రంబుం బ్రయోగించిన॥ మ॥ అవనివ్యోమములందు నిండి తమలోనా రెండు బ్రహ్మాస్త్రము। ల్రవివహ్నిద్యుతిఁ బోరుచుం ద్రిభువనత్రాసంబు గావింపఁగా। వివశభ్రాంతియుఁ గాంతమోయని ప్రజల్వీక్షింపనా వేళ మా। ధవునాజ్ఞన్ విజయుండు సేసె విశిఖద్వంద్వోపసంహారమున్॥ వ॥ ఇట్లస్త్రద్వయంబు నుపసంహరించి ధనంజయుండు ద్రోణనందనుం గూడ నరిగి పట్టుకొని రోషారుణితలోచనుండయి యాజకుండు రజ్జువునఁ బశువుం గట్టిన చందంబున బంధించి శిబిరంబుకడకుం గొనిచని హింసింతునని §తిగిచినఁ జూచి హరి యిట్లనియె॥ ఉ॥ మాలుపడంగ లేని యసమర్థుల సుప్తుల నస్త్రవిద్యలం। దేలని పిన్నపాపల వధించె నిషిద్ధపుఁ గ్రూరకర్ముఁడై। ॥పాఱుఁ డెవీఁడు పాతకుఁడు ప్రాణభయంబున ¶వెచ్చనూర్చుచుం। బాఱెడి వీనిఁ గావకుము పాపమతి న్నర్జున పాపవర్జనా॥ చ॥ వెఱచినవాని దైన్యమున ?వేఁదురు నొందినవాని నిద్రమై। మఱచినవాని సౌఖ్యమున మద్యము ద్రావినవాని భగ్నుఁడై

---

* చికురజాలము। తలవెండ్రుకలగుంపు.— ‡ చదలు। ఆకసంబు, మిన్ను.— § తిగిచి। ఈడ్చి పై కెత్తి.— ॥ పాఱుఁడు। బ్రాహ్మణుఁడు.
¶ వెచ్చనూర్చుచున్। వెచ్చఁగా నూపిరి విడుచుచును.— ? వేఁదురునొందినవానిన్। ఉన్మాదము నొందినవానిని.

*పఱచినవానిఁ సాధుజడభావమువానిని గావుమంచు వా। చఱచినవానిఁ గామినులఁ జంపుట ధర్మము గాదు ఫల్గునా॥ శా॥ స్వప్రాణంబుల నెవ్వఁడేని గరుణాసంగంబు చాలించి య। న్యప్రాణంబులచేత రక్షణము సేయున్వాఁడ ధోలోకదుః। ఖప్రాప్తుండగు రాజదండమున నతఁ డకల్యాణుఁడౌనైన యీ। విప్రున్ దండితుఁ జేయు మేటికి మహావిభ్రాంతి సేనుండఁగన్॥ వ॥ అని యివ్విధంబునఁ గృష్ణుండానతిచ్చిన బ్రాహ్మణుండు గృతాపరాధుండై న నవధ్యుండు గాఁడని ధర్మంబుఁ దలంచి చంపక ద్రుపదరాజపుత్రికిం దన చేసిన ప్రతిజ్ఞం దలంచి బద్ధుండైన గురునందనుం దోడ్కొని కృష్ణుండు సారథ్యంబు సేయ శిబిరంబుకడకు వచ్చి॥ క॥ సురరాజసుతుఁడు సూపెను। దురవధిసుతశోకయుతకు ద్రుపదనిసుతకు। న్సరిచలితాంగశ్రేణికి। న్బరుషపశుపాశబద్ధపాణిన్ ద్రౌణిన్॥

## శ్రీ ద్రౌపది యశ్వత్థామను జూచి సంభాషించుట. శ్రీ

వ॥ ఇట్లర్జునుండు దెచ్చి చూపిన బాలవధజనితలజ్జావనతముఖుండై న గురునికొడుకుం జూచి మ్రొక్కి సుస్వభావయగు ద్రౌపది యిట్లనియె॥ మ॥ పరగన్ మామకవారలందఱును మున్ బాణప్రయోగోపసం। హరణాద్యాయుధవిద్యలన్నియును ద్రోణాచార్యుచే నభ్యసిం। చిరి పుత్రాకృతి నున్న ద్రోణుఁడవు నీచిత్తంబులో లేశముఁ। గరుణాసంగము లేక శిష్యసుతులన్ ఖండింపఁగాఁ బాడియే॥ క॥ భూసురుఁడవు బుద్ధిదయా। భాసురుఁడవు శుద్ధవీరభటసందోహా। గ్రేసరుఁడవు శిశుమారణ। మాసురకృత్యంబు ధర్మమగునే తండ్రీ॥ శా॥ ఉద్రేకంబున రారు నస్త్రధరులై యుద్ధావనిన్ లేరు కిం। చిద్ద్రోహంబును నీకుఁ జేయరు బలోత్సేకంబుతోఁ జీఁకటిన్। న్భద్రాకారులఁ జిన్నపాపల రణప్రౌఢక్రియాహీనుల। న్నిద్రాసక్తుల సంహరింపనకటా నీచేతు లెట్లాడెనో॥ ఉ॥ అక్కట పుత్రశోకజనితాకులభారవిషణ్ణచిత్తనై। పొక్కమనున్న భంగి నినుఁ బోరఁ గిరీటి నిబద్ధుఁ జేసి నేఁ। డిక్కడి కీడ్చి తెచ్చుట సహింపనిదై భవదీయమాత నేఁ। డెక్కడ నెట్టిశోకమున నేక్రియ నేడ్చుచుఁ బొక్కుచున్నదో॥ వ॥ అని కృష్ణార్జునులం జూచి యిట్లనియె॥ ఉ॥ ద్రోణునితో *శిఖింబడక ద్రోణకుటుంబిని యున్న దింటన। క్షీణతనూజశోకవివశీకృతనై విలపించు భంగినీ। ద్రౌణిఁ జెఱల్చి తెచ్చుటకు దైన్యమునొందుచు నెంత పొక్కెనో। ప్రాణవియుక్తుఁడైన నతిపాపము బ్రాహ్మణహింస మానరే॥ క॥ భూపాలకులకు విప్రులఁ। గోపింపఁగఁ జేయఁదగదు కోపించిన నది। కోపానలంబు మొదలికి। భూపాలాటవులఁ గాల్చు భూకంపముగన్॥ వ॥ అని యిట్లు ధర్మ్యంబును సకరుణంబును ‡నిర్వ్యళీకంబును సమంజసంబును శ్లాఘ్యంబును నగు ద్రౌపదిపలుకులకు ధర్మనందనుండు సంతసిల్లె నకులసహదేవసాత్యకి ధనంజయ కృష్ణులు సమ్మతించిరి సమ్మతింపక భీముం డిట్లనియె॥ చ॥ కొడుకులఁ బట్టి చంపెనని కోపము నొందదు బాలఘాతకున్। విడువుమటంచుఁ జెప్పెడిని వెట్టిది ద్రౌపది వీఁడు విప్రుఁడే। విడువఁగ నేలఁ జంపుఁ డిటు వీనిని మీరలు చంపరేని నా। పిడికిటిపోటున న్శిరము భిన్నము సేసెదఁ జూడుఁ డిందఱున్॥ వ॥ అని పలికిన నశ్వత్థామకు ద్రౌపది యడ్డంబు వచ్చె భీముని సంరంభంబు సూచి హరి చతుర్భుజుండై రెండుచేతుల భీముని వారించి కడమ రెంటను ద్రుపదపుత్రికను దలంగించి నగుచు భీమునకిట్లనియె॥ ఉ॥ §అవ్యుఁడు గాఁడు వీఁడు శిశుహంత దురాత్ముఁ డాతతాయి హం। తవ్యుఁడు బ్రహ్మబంధుఁ డగుఁ దప్పదు నిక్కము బ్రాహ్మణో న హం। తవ్య యటంచు వేదము శ్రుతంబగుఁ గావున ధర్మదృష్టిఁ గ। ర్తవ్యము వీనిఁ గాచుట యథాస్థితిఁ జూడుము పాండవోత్తమా॥ వ॥ అని సరసాలాపంబు లాడి పవననందనునొడంబఱచి యర్జునుం జూచి ద్రౌపదికి నాకు భీమసేనునకు సమ్మతంబుగ మున్ను నీ చేసిన ప్రతిజ్ఞయు సిద్ధించునట్లు నా పంపు సేయుమని నారాయణుం డానతిచ్చిన నర్జునుండు దదనుమతంబున॥ శా॥ విశ్వస్తుత్యుఁడు శక్రసూనుఁడు మహావీరుండు ఘోరాసిచే। నశ్వత్థామశిరోజముల్ దఱిఁగి చూడాంతర్మహారత్నమున్। శశ్వత్కీర్తి వెలుంగఁ బుచ్చుకొని పాశవ్రాతబంధంబులన్। విశ్వాసంబున నూడ్చి త్రోచె శిబిరోర్వీభాగముం బాసిపోన్॥ క॥ నిబ్బరపు బాలహంతయు। గొబ్బున దేజంబు మణియుఁ గోల్పడినతుఁడై। ప్రబ్బిన చింతన్ విప్రుఁడు। సిబ్బితితో నొడలిగబ్బు సెడి వడిఁ జనియెన్॥ గీ॥ ధనముఁ గొనుటయొండె దలఁ గొఱుగుటయొండె। నాలయంబు వెడల నడచుటొండె। గాని చంపఁదగిన కర్మంబు సేసినఁ। జంపఁదగదు విప్రజాతిఁ బతికి॥ వ॥ ఇట్లశ్వత్థామం బ్రాణావశిష్టుం జేసి వెడలనడిచి పాండవులు పాంచాలీసహితులై పుత్రులకు శోకించి మృతులైన బంధువులకెల్ల దహనాదికృత్యంబులు సేసి జలప్రదానంబు సేయుకొఱకు స్త్రీల ముందల నిడుకొని గోవిందుండునుం దారును గంగకుం జని తిలోద

---

౩౧పం. పఱచినవానిన్ । యుద్ధరంగంబునఁ బరుగెత్తినవానిని. వాచఱచినవానిన్ । వేఁడుకొనినవానిని.— *శిఖింబడక । అగ్నిప్రవేశము సేయక.— ‡నిర్వ్యళీకము । నిర్మాయికము.— §అవ్యుఁడు గాఁడు । రక్షార్హుఁడు గాఁడు.— ౩౧పం. నిబ్బరపు బాలహంత । దృఢమైన బాలఘాతి-అనఁగా నిస్సందేహముగా-కుఱ్ఱలఁ జంపినవాఁడు.— గొబ్బున । త్వరగాను.— ప్రబ్బిన చింతన్ । పొందిన దుఃఖము చేతను.— ౩౨పం. సిబ్బితితోన్ । లజ్జతోను, సిగ్గుతోను.

కంబులుసేసి క్రమ్మఱవిలపించి హరిపాదపద్మజాతపవిత్రంబులయిన భాగీరథీజలంబుల స్నాతులయియున్నయెడం బుత్ర
శోకాతురులయిన గాంధారీధృతరాష్ట్రులను, గుంతీద్రౌపదులను జూచి మాధవుండు మునీంద్రులుం దానును బంధుమరణ
శోకాతురులయిన వారల వగపుమానిచి మన్నించె నివ్విధంబున॥ శా॥ పాంచాలీకబరీవికర్షణమహాపాపక్షతాయుష్కు
లం జంచద్గర్వులఁ ధార్తరాష్ట్రుల ననిం జంపించి గోవిందుఁ డిప్పించెన్ రాజ్యము ధర్మపుత్రునకుఁ గల్పించె న్మహాఖ్యాతిఁ జే
యించె న్మాఁడు తురంగమేధములు దేవేంద్రప్రభావంబునన్॥ వ॥ అంతవాసుదేవుండు వ్యాసప్రముఖభూసురపూజి
తుండయి యుద్ధవసాత్యకులు గొలువ ద్వారకాగమనప్రయత్నంబునం బాండవులవీడ్కొని రథారోహణంబు సేయ సమ

——⁂ శ్రీకృష్ణుండుత్తరగర్భస్థుండగు నర్భకుని రక్షించుట. ⁂——

యంబునం దత్తరపడుచు నుత్తర సనుదెంచి కల్యాణగుణాత్మకుండైన హరికిట్లనియె॥ మ॥ ఇదె కాలానలతుల్యమైన విశిఖం
బేతెంచె దేవేశ నేఁ। డుదరాంతర్గతగర్భదాహమునకై యుగ్రంబున న్వచ్చుచు। న్నది దుర్లోక్యము మానుపన్మరణమున్యం
బేమియున్లేదు మనీ। పదపద్మంబులె కాని యొండెఱుఁగ నీ బాణాగ్ని వారింపవే॥ క॥ దుర్భరబాణానలమున। గర్భములోనున్న
శిశువు ఘనసంతాపా। విర్భావంబును బొందెడి। నిర్భరకృపఁ గావుమయ్య నిఖిలస్తుత్యా॥ క॥ చెల్లెలికోడలనీ మే। నల్లుఁడు
శత్రువుల చేత హతుఁ డయ్యెను సం। ఫుల్లారవిందలోచన। భల్లాగ్ని నడంచి శిశువు బ్రతికింపఁగదే॥ గీ॥ గర్భమందుఁ గమల
గర్భాండశతములు। నిముడికొని నటించు నీశ్వరేశ। నీకు నొక్కమాని నీగర్భరక్షణ। మెంత బరువు నిర్వహింతు గాక॥ వ॥ అ
నిన నాశ్రితవత్సలుండయిన పరమేశ్వరుండు సుభద్రకోడలి దీనాలాపంబు లాలించి యిది ద్రోణనందనుండు లోకమంత
యు నపాండవంబయ్యెడునని యేసిన దివ్యాస్త్రమని యెఱింగె నంతఁ బాండవులకభిముఖంబై ద్రోణనందను దివ్యాస్త్రని
ర్గతనిశితమార్గణంబు డగ్గఱిన బెగ్గడిలక వారును బ్రత్యస్త్రంబులందుకొని పెనంగు సమయంబున॥ మ॥ తనసేవారతిచిం
తగాని పరచింతాలేశము న్లేని స। జ్జనుల న్పాండుతనూజుల న్మనుపు వాత్సల్యంబుతో ద్రోణనం। దను బ్రహ్మాస్త్రమునడ్డ బె
ట్టఁబని చెన్ దైత్యారి సర్వారిసా। ధననిర్వక్రము రక్షితాఖిలసుధాంధశ్చక్రముం జక్రమున్॥ మ॥ సకలప్రాణిహృదం
తరాళముల భాస్వజ్జ్యోతియైయుండుసూ। త్మకరుండచ్యుతుఁ డయ్యెడన్విరటజాగర్భంబుఁ దాజక్రహ। స్తకుఁడై వైష్ణవ
మాయఁ గప్పెఁ గురుసంతానార్థియై యడ్డమై। ప్రకటస్ఫూర్తినడంచె ద్రోణతనయబ్రహ్మాస్త్రముం లీలతోన్॥ వ॥ ఇట్లు
ద్రోణతనయుండేసిన ప్రతిక్రియారహితంబయిన బ్రహ్మశిరంబనియెడి దివ్యాస్త్రంబు వైష్ణవతేజంబున నిరర్థకంబయ్యెని
జమాయ చే సకలలోకసర్గస్థితిసంహారంబు లాచరించునట్టి హరికి ధరణీసురబాణనివారణంబు విచిత్రంబుగాదు॥ తత్సమ

——⁂ కుంతీదేవి శ్రీకృష్ణదేవుని నుతించుట. ⁂——

యంబున సంతసించి పాండవపాంచాలీసహితయై గొంతి గమనోన్ముఖుండయిన హరిం జేరవచ్చి యిట్లనియె॥ క॥ పురుషుం
డాద్యుఁడు ప్రకృతికిఁ। బరుఁ డవ్యయుఁ డఖిలభూతబహిరంతర్భా। సురుఁడును లోకనియంతుఁడు। బరమేశ్వరుఁడైన నీకుఁ
బ్రణతులగు హరీ॥ వ॥ మఱియు జవనికచాటున నాట్యంబు సలుపు నటుని చందంబున మాయాజవనికాంతరాళంబున ని
లువంబడి మహామంచేఁ బరమహంసలు నివృత్తరాగద్వేషులు నిర్మలాత్ములు నయిన మునులకు నదృశ్యమానుండవయి పరిచ్ఛి
న్నుండవు గాని నీవు మూఢదృక్కులు కుటుంబవతులు నగు మాకు నెట్లు దర్శనీయుండవయ్యెదు; శ్రీకృష్ణ వాసుదేవ దేవకీనం
దన నందగోపకుమార గోవింద పంకజనాభ పద్మమాలికాలంకృత పద్మలోచన పద్మసంకాశచరణ హృషీకేశ భక్తియోగం
బున నం జేసిన నమస్కారించెద నవధరింపుము॥ సీ॥ తనయులతోడ నేదహ్యమానంబగు జతుగృహంబందును జావకుండఁ। గురు
రాజు వెట్టించు ఘోరవిషంబుల మారుతపుత్త్రుండు మడియకుండ। ధార్తరాష్ట్రుఁడు సముద్ధతిఁ జీరలొలువంగ ద్రౌపది మా
నంబు దలఁగకుండ। గాంగేయకుంభజకర్ణాదిఘనుల చే నాబిడ్డలనిలోన నలఁగకుండ। విరటపుత్త్రిక కడుపులో వెలయుచూ
లు। ద్రోణనందనశరవహ్నిఁ ద్రుంగకుండ। మఱియు రక్షించితివి పెక్కుమార్గములను। నిన్ను నేమని వర్ణింతు నీరజాక్ష॥
మత్తకోకిల॥ బల్లిదుండగు కంసుచేతను బాధనొందుచునున్న మీ। తల్లిఁ గాచినభంగిఁ గాచితి ధార్తరాష్ట్రుల చేత నేఁ। ద
ల్లడంబునఁ జిక్కకుండఁగ దేవకీనగుణవ్రజం। బెల్ల సంస్తుతి సేసి చెప్పఁగ నెంతదాన జగత్పతీ॥ క॥ జననము నైశ్వర్యంబు
ను। ధనమును విద్యయును గలమదచ్ఛన్నులకిం। చనగోచరుఁడగు నిన్ను। న్వినుతింపఁగ లేరు నిఖిలవిబుధస్తుత్యా॥ వ॥ మఱి
యు భక్తధనుండును నివృత్తధర్మార్థకామవిషయుండును నాత్మారాముండును రాగాదిరహితుండును గైవల్యదానసమర్థుం
డును గాలరూపకుండును నియామకుండును నాద్యంతశూన్యుండును విభుండును సర్వసముండును సకలభూతనిగ్రహాను

గ్రహాకగుంఠనయున న్నిన్నుఁ దలంచి నమస్కరించెద నవధరింపుము మనుష్యుల విడంబించు భవదీయవిలసనంబు నిర్ణయింప
నెవ్వఁడు సమర్థుండు నీకుం బ్రియాప్రియులు లేరు జన్మకర్మశూన్యుండవైన నీవు దిర్యగాదిజీవులయందు వరాహాదిరూపం
బులను మనుష్యులందు రామాదిరూపంబులను, ఋషులయందు వామనాదిరూపంబులను, జలచరంబులయందు మత్స్యాది
రూపంబుల నవతరించుట లోకవిడంబనార్థంబు గాని జన్మకర్మసహితుండవగుటం గాదు॥ ఉ॥ కోపముతోడ నీవు దధికుంభ
ము భిన్నము సేయుచున్నచో । గోపిక త్రాటఁ గట్టిన నకుంచితసాంజనబాష్పతోయధా । రాపరిపూర్ణవక్త్రముగ రంబు
లఁ ద్రోముచు వెచ్చనూర్చుచుం। బాపఁడవై నటించుట కృపాపర నామదిఁ జోద్యమయ్యెడిన్॥ క॥ మలయమునఁ జందనక్రి
య, వెలయఁగ ధర్మజుని కీర్తి వెలయించుటకై । యిలపైన భవుఁడు హరియదు । కులమున నుదయించె నంద్రు గొందఱనం
తా॥ క॥ వసుదేవదేవకులు దా। పసగతిఁ గత భవమునందుఁ బ్రార్థించిన సం। తసమునఁ బుత్రత నొందితి। వసురుల మృతి కించుఁ
గొందఱంద్రు మహాత్మా॥ క॥ జలరాశిలోన మెలఁగెడు । కలము క్రియన్ భూరిభారకలితయగు నీ । యిలఁ గావ నజుఁడు
గోరినఁ। గలిగితివని కొందఱంద్రు గణనాతీతా॥ గీ॥ మఱచి యజ్ఞానకామకర్మములఁ దిఱుఁగు। వేదనాతురులకుఁ దన్నివృత్తిఁ
జేయ । శ్రవణచింతనవందనార్చనము లిచ్చు । కొఱకు నుదయించితంద్రు నిన్గొందఱభవ॥ సీ॥ నినుఁ జింతింపుచుఁ బాడు
చుం బొగడుచున్న దివ్యచారిత్రము। ల్వినుచుం జూతురుగాక లోకులితరాన్వేషంబులం జూతురే। ఘనసర్జన్మపరంపరాహ
రణదక్షంబై మహాయోగివా। గ్వినుతంబైన భవత్పదాబ్జయుగమున్ విశ్వేశ విశ్వంభరా॥ వ॥ దేవా నిరాశ్రయులమై భవ
దీయచరణారవిందంబు లాశ్రయించి నీవారలమైన మమ్ము విడిచి విచ్చేయ నేల నీ సకరుణావలోకనంబుల నిత్యంబును జూడ
వేని యాదవసహితులైన పాండవులు జీవునిం బాసిన యింద్రియంబుల చందంబునఁ గీర్తిసంపదలు లేక తుచ్ఛత్వంబు నొందు
దురు కల్యాణలక్షణలక్షితంబులైన నీయడుగుల చేత నంకితంబయిన మదీయధరణీమండలంబు నీవు వాసిన శోభితంబుగా
దు నీకృపావీక్షణామృతంబున నిక్కడి జనపదంబులు గుసుమఫలభరితంబులై యోషధితరులతాగుల్మనదనదీసమేతంబు
లై యుండు॥ ఉ॥ యాదవులందుఁ బాండుసుతులందు నధీశ్వర నాకు మోహపా। చ్ఛేదము సేయుమయ్య ఘనసింధువుఁ జేరె
డి గంగభంగి నీ। పాదసరోజచింతనము పై ననిశంబు మదీయబుద్ధి న । త్యాదరవృత్తితోఁ గదియునట్లుగఁ జేయఁగదయ్య యీ
శ్వరా॥ శా॥ శ్రీకృష్ణా యదుభూషణా నరసఖా శృంగారరత్నాకరా। లోకద్రోహినరేంద్రవంశదహనా లోకేశ్వరా దేవ
తా। నీక బ్రాహ్మణగోగణార్తిహరణా నిర్వాణసంధాయకా। నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ॥
వ॥ అని యిట్లు సకలసంభాషణంబుల నుతియించు గొంతిమాటల కియ్యకొని గోవిందుండు మాయానిరూఢమందహాసవిశే
షంబున మోహంబు నొందించి రథారూఢుండై కరినగరంబునకు వచ్చి కుంతీసుభద్రాముల వీడ్కొని తనపురంబునకు విచ్చే
య గమకించిన ధర్మరాజు చేఁ గించిత్కాలంబు నిలువుమని ప్రార్థితుండై నిలిచె నంత బంధువధశోకాతురుండయిన ధర్మజుం
డు నారాయణవ్యాసధౌమ్యాదుల చేతఁ దెలుపంబడియుఁ దెలియక మోహితుండై నిర్వివేకంబున నిట్లనియె॥ సీ॥ తనదే
హంబునకై యనేకమృగసంతానంబుఁ జంపించు మూ। ర్ఖుని భంగిన్ గురుబాలకద్విజతనూజభ్రాతృసంఘంబుని। ట్లని జంపించి
న పాపకర్మునకు రాజ్యాకాంక్షికి న్నాకు హా। యనలక్షావధినైన ఘోరనరకవ్యాసంగముల్ మాను నే॥ వ॥ మఱియుఁ బ్రజా
పరిపాలనపరుండయిన రాజు ధర్మయుద్ధంబున శత్రువుల వధియించినఁ బాపంబు లేదని శాస్త్రవచనంబు గలదైన నది విజ్ఞా
నంబుకొఱకు సమర్థంబు గాదు చతురంగంబుల నేకాక్షౌహిణీసంఖ్యాతంబులం జంపించితి హతబంధులైన సతుల కేను జే
సిన ద్రోహంబుఁ దప్పించుకొన నేర్పు లేదు గృహాశ్రమధర్మంబులయిన తురంగమేధాదియాగంబుల చేతం బురుషుండు బ్ర
హ్మహత్యాదిపాపంబులవలన విడివడి నిర్మలుండగు నని నిగమంబులు నిగమించుఁ బంకంబునఁ బంకిలస్థలంబునకు మద్యంబున
మద్యభాండంబునకు శుద్ధి సంభవింపని చందంబున బుద్ధిపూర్వకజీవహింసనంబులయిన యాగంబుల చేతం బురుషులకుఁ
బాపబాహుళ్యంబు గాని పాపనిర్ముక్తి గాదని శంకించెద॥ క॥ అని యిట్లు ధర్మసూనుఁడు। మొనసి నిరాహారభావమున దేవ

## శ్రీ ధర్మరాజు శ్రీకృష్ణసహితుండయి శరతల్పగతుండయిన భీష్మునికడ కేగుట.

నదీ। తనయుఁడు గూలినచోటికిఁ। జనియెం బ్రజాద్రోహపాపచలితాత్ముండై॥ వ॥ అయ్యవసరంబునం దక్కిన పాండవులు
ఫల్గునసహితుండైన పద్మలోచనుండుఁ గాంచనసమంచితంబులయిన రథంబు లెక్కి ధర్మజుం గూడి చనిన నతండు గుహ్యక
సహితుండయిన కుబేరుని భంగి నొప్పె నిట్లు పాండవులు పరిజనులు గొలువఁ బద్మనాభసహితులై కురుక్షేత్రంబున కేగి ది
వంబుననుండి నేలం గూలిన దేవత తెఱంగున సంగ్రామపతితుండైన గంగానందనునకు నమస్కరించి రంత బృహదశ్వభర

ద్వాజపరశురామ పర్వతనారదబాదరాయణకశ్యపాంగిరసకౌశికధౌమ్యసుదర్శనశుకవసిష్ఠాద్యనేక రాజర్షి దేవర్షి బ్రహ్మర్షులు శిష్యసమేతులై చనుదెంచినం జూచి సంతసించి దేశకాలవిభాగవేదియైన భీష్ముండు వారలకుం బూజనంబుఁ గావించి॥ క॥ మాయాంగీకృతదేహుం, డై యఖిలేశ్వరుఁడు మనుజుఁడై నాఁడని ప్రాజ్ఞాయతచిత్తంబున గాం, గేయుఁడు పూజనము సేసెఁ గృష్ణున్ జిష్ణున్॥ వ॥ మఱియు గంగానందనుండు వినయప్రేమసుందరులయిన పాండునందనులం గూర్చుండ నియోగించి మహానురాగజనితబాష్పసందోహసమ్మీలితలోచనుండై యిట్లనియె॥ గీ॥ ధరణిసురులు హరియు ధర్మంబు దిక్కుగాఁ, బ్రదుకఁ దలఁచి మీరు బహువిధముల, నన్నలార పడితి రాపత్పరంపర, లిట్టిచిత్రకర్మ మెందుఁ గలదు॥ ఉ॥ సంతసమింత లేదు మృగశాపవశంబునఁ బాండుభూవిభుం, డంతమునొందియుండ మిము నర్భకులం గొనివచ్చి కాంతుతో, నింతులువారి గాఁ బెనిచె నెన్నఁడు సౌఖ్యము పట్టుగానదీ, కుంతి యనేకదుఃఖములఁ గుందుచునుండును భాగ్యమెట్టిదో॥ ఉ॥ వాయువశంబులై మొగసి వారిధరంబులు మింటఁ గూడుచుం, బాయుచునుండు కైవడిఁ బ్రపంచము సర్వముఁ గాలతంత్రమై, పాయుచుఁ గూడుచుండు నొకభంగిఁ జరింపదు కాలమన్నియుం, జేయుచునుండుఁ గాలము విచిత్రము దుస్తర మెట్టివారికిన్॥ ఉ॥ రాజఁట ధర్మజుండు సురరాజసుతుండఁట ధన్వి శాత్రవో, ద్వేజితమైన గాండివము విల్లఁట సారథి సర్వభద్రసం, యోజకుఁడైన చక్రియఁట యుగ్రగదాధరుఁడైన భీముఁడ, య్యాజికి దోడువచ్చునఁట యాపద గల్గుట యేమి చోద్యమో॥ గీ॥ ఈశ్వరుండు విష్ణుఁ డెవ్వేళ నెవ్వని, నేమి సేయఁ బురుషుఁ డేమి యెఱుఁగు, నతని మాయలకు మహాత్ములు విద్వాంసు, లడఁగియుండుచుందు రంధులగుచు॥ వ॥ కావున దైవతంత్రంబయిన పనికి వగవం బని లేదు, రక్షకులు లేని ప్రజల రక్షింపఁ బుండరీకాక్షుండు సాక్షాత్కరించిన నారాయణుండు తేజోనిరూఢుండు గాక యాదవులందు గూఢుండై తనమాయచేత లోకంబుల మోహాతిరేకంబుల నొందించు నతని రహస్యప్రకారంబుల భగవంతుండైన పరమేశ్వరుం డెఱుంగు మఱియు దేవర్షి యగు నారదుండును భగవంతుండగు కపిలమునియు నెఱుంగుదురు కృష్ణుండు దేవకీపుత్రుండగు మాతులేయుండని తలంచి, దూతసచివసారథిబంధుమిత్రప్రయోజనంబుల నియమించుదు రిన్నిటం గొఱంత లేదు, రాగాదిశూన్యుండు, నిరహంకారుండు నద్వయుండు సమదర్శనుండు సర్వాత్మకుండు నయిన యీశ్వరునకు నున్నతభావమతివైషమ్యంబు లెక్కడివి లేవైన భక్తవత్సలుండు గావున నేకాంతభక్తులకు సులభుండై యుండు॥ సీ॥ అతిభక్తి నెవ్వని యందుఁ జిత్తముఁ జేర్చి యెవ్వని నామము నూహించి పొగడి, కాయంబు విడుచుచుఁ గామకర్మాదినిర్మూలితుండై యోగిముక్తి నొందు, నట్టి సర్వేశ్వరుం డఖిలదేవోత్తముం డెవ్వేళఁ బ్రాణంబు లేను విడుతు, నంతదాక నిదె మహాహర్షుఁడై వికసితవదనారవిందుఁడై వచ్చె నేఁడు, నాల్గుభుజములు గమలాభనయనయుగము, నొప్పఁగన్నులముందర నున్నవాఁడు, మానవేశ్వర నా భాగ్యమహిమఁ జూడ, నేమి సేసితి నో పుణ్యమితనిఁ గూర్చి॥ వ॥ అని యిట్లు ధనంజయసంప్రాపితశరపంజరుండైన కురుకుంజరు నివచనంబు లాకర్ణించి మునులందఱు వినుచుండ ధర్మనందనుండు, మందాకినీనందను వలన నరజాతిసాధారణంబులగు ధర్మంబులును వర్ణాశ్రమధర్మంబులును రాగవైరాగ్యోపాధులతోఁ గూడిన ప్రవృత్తినివృత్తిధర్మంబులును దానధర్మంబులును రాజధర్మంబులును స్త్రీధర్మంబులును శమదమాదికంబులును హరితోషణంబులగు ధర్మంబులును ధర్మార్థకామమోక్షంబులును నానావిధోపాఖ్యానేతిహాసంబులును సంక్షేపవిస్తారరూపంబుల నెఱింగె నంతర నధికసహస్రంబులకు గమికాఁడైన భీష్ముండు *స్వచ్ఛందమరణులైన యోగీశ్వరుల చేత వాంఛితంబగు నుత్తరాయణంబు సనుదెంచిన నదిదనకు మరణోచితకాలంబని నిశ్చయించి. శా॥ ఆలాపంబులు మాని చిత్తము మనీషాయత్తముం జేసి దృ, గ్జాలంబుల్ హరి మోముపైఁ బఱపి తత్కారుణ్యదృష్టిన్ వినిర్ముక్తీభూతశరవ్యథానిచయుఁడై మోదించి భీష్ముండు సం, శీలం బొప్పనుతించెఁ §కల్మషగజశ్రేణీహరిన్ శ్రీహరిన్॥ వ॥ ఇట్లు పీతాంబరధారియుఁ జతుర్భుజుండు నాదిపూరుషుండుఁ బరమేశ్వరుండును నగు హరియందు నిష్కాముండై విశుద్ధంబగు ధ్యానవిశేషంబు చేత నిరస్తదోషుండగుచు ¶ధారణావతియైన బుద్ధిని సమర్పించి పరమానందంబు నొంది ప్రకృతివలననైన సృష్టిపరంపర

❀ భీష్ముఁడు శ్రీకృష్ణుని స్తుతించుట. ❀

లఁ బరిహరించు తలంపున మందాకినీనందనుం డిట్లనియె॥ మ॥ త్రిజగన్మోహనశీలకాంతితనువు దీపింపఁ బ్రాభాతనీ, రజబంధుప్రభమైన చేలము పయిన్ రంజిల్ల నీలాలక, వ్రజసంయుక్తముఖారవిందమతి సేవ్యంబై విజృంభింపమా, విజయుం జేరెడు వ

* స్వచ్ఛందమరణులైన తమయిచ్ఛ చొప్పున మరణము నొందెడువారలైన.— § కల్మషగజశ్రేణీహరిన్ పాపము లనెడు నేనుఁగులకు సింహము వంటివానిని.— ¶ ధారణావతియైన నిశ్చలత్వమును బొందిన.—

న్నె కాంక్షమదినావేశించు నెల్లప్పుడున్ ॥ మ॥ హయరింఖాముఖధూళిధూసరపరిన్యస్తాలకోపేతమై । రయజాతశ్ర
మతోయబిందుయుతమై రాజిల్లు నెమ్మోముతో । జయముం బార్థున కిచ్చువేడ్క నని నాశస్త్రాహతిం జాలనొ । చ్చియుఁ బో
రించు మహానుభావు మదిలోఁ జింతింతు నశ్రాంతమున్ ॥ మ॥ నరుమాటల్ విని నవ్వుతో నుభయసేనామధ్యమక్షోణిలోఁ ।
బరులీక్షింప రథంబు నిల్పి పరభూపాలావళిం జూపుచుం । బరభూపాయువు లెల్లఁ జూపుల నశుంభత్కేళి వంచించు నా । పర
మేశుండు వెలుంగుచుండెడు సుహృత్పద్మాసనాసీనుఁడై ॥ క॥ తనవారిఁ జంపఁ జాలక । వెనుకకుఁ బో నిచ్చగించు విజయుని
శంకన్ । ఘనయోగవిద్యఁ బాపిన । మునివంద్యుని పాదభక్తి మొనయున్ నాకున్ ॥ సీ॥ కుప్పించి యెగసినఁ గుండలంబుల కాం
తి గగనభాగం బెల్లఁ గప్పికొనఁగ । నుఱికిన నోర్వక యుదరంబులో నున్న జగముల వ్రేఁగున జగతి గదలఁ । జక్రంబుఁ జేఁబట్టి చ
నుదెంచు రయమునఁ బైనున్న పచ్చని పటము జాఱ । నమ్మితి నాలావు నగుఁబాటు సేయక మన్నింపు మని క్రీడి మఱలఁ దిగు
వఁ । గరికిఁ లంఘించు సింహంబు కరణి మెఱసి । నేఁడు భీష్మునిఁ జంపుదు నిన్నుఁ గాతు । విడువు మర్జున యనుచు మద్విశిఖవృష్టిఁ ।
దెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు ॥ మ॥ తనకున్ భృత్యుఁడు వీనిఁ గాచుట మహాధర్మంబు వొమ్మంచు న । ర్జునసారథ్య
ము పూని పగ్గములఁ జేఁ జోద్యంబుగాఁ బట్టుచున్ । మునికోలన్ వడిఁ బూన్చి ఘోటకములన్ మోదించి తాడించుచున్ । జనులన్ మో
హమునొందఁ జేయు పరమోత్సాహుం బ్రశంసించెదన్ ॥ క॥ పలుకుల నగవుల నడపుల । నలుకల నవలోకనముల నాభీరవధూ ।
కులముల మనములు దాలిమి । కొలుకుల వదలించు ఘనునిఁ గొలిచెద మదిలోన్ ॥ గీ॥ మునులు నృపులుఁ జూడ మును ధర్మజుని స
భా । మందిరమున యాగమంటపమునఁ । జిత్రమహిమతోడఁ జెలువొందు జగదాది । దేవుఁ డమరు నా దృష్టియందు ॥
మ॥ ఒకసూర్యుండు సమస్తజీవులకుఁ దా నొక్కొక్కఁడై తోఁచు పో । లిక నే దేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ ।
న్యకదంబంబుల హృత్సరోరుహముల న్నానావిధానూనరూ । పకుఁడై యొప్పుచు నుండు నట్టి హరి నేఁ బ్రార్థింతు శుద్ధుండనై ॥
వ॥ అని యిట్లు మనోవాగ్దర్శనంబులం బరమాత్మయగు కృష్ణుని హృదయంబున నిలిపికొని నిశ్వాసంబు మాని నిరుపాధికంబై
న వాసుదేవబ్రహ్మంబునందుం గలసిన భీష్మునిం జూచి సర్వజనులు దివసావసానంబున విహంగంబు లూఱక యుండు తెఱం
గున నుండిరి. దేవమానవవాదితంబులై దుందుభివాద్యంబులు మొఱసె, సాధుజనకీర్తనంబులు మెఱసెఁ, గుసుమవర్షంబ
లు గురిసె, మృతుండయిన భీష్మునికి ధర్మజుండు పరలోకక్రియలు సేయించి ముహూర్తమాత్రంబు దుఃఖితుండయ్యె నంతన
చ్చటి మునులు గృష్ణునిఁ దమహృదయంబుల నిలిపికొని సంతుష్టాంతరంగులగుచుఁ దదీయదివ్యనామంబుల చేస్తుతియించి ని
స్వాశ్రమంబులకుం జనిరి పిదప నయ్యుధిష్ఠిరుండు గృష్ణసహితుండయి గజపురంబునకుం జని గాంధారీసహితుండైన ధృత
రాష్ట్రునకు నొడంబఱచి వారిసమ్మతంబున వాసుదేవానుమోదితుండయి పితృపైతామహంబైన రాజ్యంబుఁ గైకొని ధర్మమా
ర్గంబునం బ్రజాపాలనంబు సేయుచుండె నని చెప్పిన విని సూతునకు శౌనకుం డిట్లనియె ॥ గీ॥ ధనము లపహరించి తనతోడఁ
జెనకెడు । నాతతాయిజనుల ననివధించి । బంధుమరణదుఃఖభరమున ధర్మజుఁ । డెట్లు రాజ్యలక్ష్మి నిచ్చగించె ॥ అనిన సూతుం
డిట్లనియె ॥ క॥ కురుసంతతికిఁ బరీక్షి । న్నరవరు నంకురము సేసిన నారాయణుఁడీ । ధరణీరాజ్యమునకు నీ । శ్వరుఁ గా ధర్మజుని ని
లిపి సంతోషించెన్ ॥ వ॥ ఇట్లు జగంబు పరమేశ్వరాధీనంబు గాని స్వతంత్రంబు గాదను నది మొదలగు భీష్ముని వచనంబులఁ

---

## ❀ భగవద్భక్తులకుఁ బారాయణోపయుక్తంబగు సంస్కృతభాగవతంబునం గల భీష్మస్తుతి. ❀

శ్లో॥ ఇతిమతిరుపకల్పితా వితృష్ణా భగవతి సాత్వతపుంగవే విభూమ్ని । స్వసుఖముపగతే క్వచిద్విహర్తుం ప్రకృతిముపేయుషి యద్భవప్రవాహః ॥
త్రిభువనకమనం తమాలవర్ణం రవికరగౌరవరాంబరం దధానే । వపురలకకులావృతాననాబ్జం విజయసఖే రతిరస్తు మేనవద్యా ॥ ౨
యుధి తురగరజోవిధూమ్రవిష్వక్కచలులితశ్రమవార్యలంకృతాస్యే । మమ నిశితశరైర్విభిద్యమానత్వచి విలసత్కవచేస్తు కృష్ణ ఆత్మా ॥ ౩
సపది సఖివచో నిశమ్య మధ్యే నిజపరయోర్బలయోరథం ప్రవేశ్య । స్థితవతి పరసైనికాయురక్ష్ణా హృతవతి పార్థసఖే రతిర్మమాస్తు ॥ ౪
వ్యవహితపృతనాముఖం నిరీక్ష్య స్వజనవధాద్విముఖస్య దోషబుద్ధ్యా । కుమతిమహరదాత్మవిద్యయా యశ్చరణరతిః పరమస్య తస్య మేస్తు ॥ ౫
స్వనిగమమపహాయ మత్ప్రతిజ్ఞామృతమధికర్తుమవప్లుతో రథస్థః । ధృతరథచరణోభ్యయాచ్చలద్గుర్హరిరివ హంతుమిభం గతోత్తరీయః ॥ ౬
శితవిశిఖహతో విశీర్ణదంశః క్షతజపరిప్లుత ఆతతాయినో మే । ప్రసభమభిససార మద్వధార్థం స భవతు మే భగవాన్ గతిర్ముకుందః ॥ ౭
విజయరథకుటుంబ ఆత్తతోత్రే ధృతహయరశ్మిని తచ్ఛ్రియేక్షణీయే । భగవతి రతిరస్తు మే ముమూర్షోర్యమిహ నిరీక్ష్య హతా గతాస్స్వరూపమ్ ॥ ౮
లలితగతివిలాసవల్గుహాసప్రణయనిరీక్షణకల్పితోరుమానాః । కృతమనుకృతవత్య ఉన్మదాంధాః ప్రకృతిమగన్ కిల యస్య గోపవధ్వః ॥ ౯
మునిగణనృపవర్యసంకులేంతస్సదసి యుధిష్ఠిరరాజసూయ ఏషామ్ । అర్హణముపపేద ఈక్షణీయో మమ దృశిగోచర ఏష ఆవిరాత్మా ॥ ౧౦
క్షితిభరమవరోపితుం కురూణాం శ్వసన ఇవాన్యజదక్షువంశవహ్నిమ్ । తమిమమహమనువ్రతార్తిహం ప్రేంహృది పరిరభ్య జహామి మర్త్యనీడమ్ ౧౧
తమిమమహమజం శరీరభాజాం హృది హృది ధిష్ఠితమాత్మకల్పితానామ్ । ప్రతిదృశమివ నైకధార్కమేకం సమధిగతోస్మి విధూతభేదమోహః ॥ ౧౨

కృష్ణుసంభాషణంబుల ధర్మనందనుండు ప్రవర్ధమానవిజ్ఞానుండును నివర్తితశోకకలంకుండును నై నారాయణాశ్ర
యుండై నయింద్రుండును బోలె జతుస్సాగరవేలాలంకృతంబగు వసుంధరామండలంబును సహోదరసహాయుండై యే
లుచుండె॥ సీ॥ సంపూర్ణవృష్టిఁ బర్జన్యుండు గురియించు నిలయెల్లఁ గోర్కులనీనుచుండు। గోవులు వర్షించు ఘోషభూము
లఁ బాలు ఫలవంతములు లతాపాదపములు। పండు సస్యములు నప్పక ఋతువుల నెల్లధర్మ మెల్లెడలను దనరియుండు। దైవ
భూతాత్మతంత్రములను రాగాదిభయములు నొందవు ప్రజలకెందు। గురుకులోత్తముండు గుంతీతనూజుండు। దానమా
నఘనుఁడు ధర్మజుండు। సత్యవాక్యధనుఁడు సకలమహీరాజ్య। విభవభాజియయిన వేళయందు॥

## శ్రీకృష్ణుండు ద్వారకానగరంబునకరుగుట.

వ॥ అంతఁ గృష్ణుండు చుట్టాలకు సుభద్రకు శోకంబు లేకుండం జేయుకొఱకుఁ బ్రియంబున గజపురంబునం గొ
న్ని నెలలుండి ద్వారకానగరంబునకుం బ్రయాణంబు సేయం దలంచి ధర్మనందనునకుం గృతాభివందనుండగుచు నతనిచే నా
లింగితుండై యామంత్రణంబు వడసి కొందఱు తనకు నమస్కరింపం గౌఁగిలించుకొని కొందఱు దనుం గౌఁగిలింప నానం
దించుచు రథారోహణంబు సేయు నవసరంబున సుభద్రయు ద్రౌపదియుఁ గుంతియు నుత్తరయు గాంధారియు ధృతరాష్ట్రుం
డును విదురుండును యుధిష్ఠిరుండును యుయుత్సుండుఁ గృపాచార్యుండును నకులసహదేవులును వృకోదరుండును ధౌ
మ్యుండును సత్సంగంబువలన ముక్తసంగుండగు బుధుండు సత్కృతాకలసంకీర్త్యమానంబై రుచికరంబగు నెవ్వని యశం
బు నాకర్ణించి విడువనోపఁడట్టి హరితోడి వియోగంబు సహింపక దర్శనస్పర్శనాలాపశయనాసనభోజనంబులవలన నిమిష
మాత్రంబును హరికి నెడలేనివారలైన పాండవులం గూడికొని హరిని నలవ లెననికోరుచు హరి చనిన మార్గంబు సూచుచు
హరివిన్యస్తచిత్తులై లోచనంబుల బాష్పంబు లొలుకనంతంత నిలువంబడి రయ్యవసరంబున॥ సీ॥ కనకసౌధముల పైఁ గౌ
రవకాంతలు కుసుమవర్షంబులు గోరికురియ। మౌక్తికదామసమంచితధవళాతపత్రంబు విజయుండు వట్టుచుండ। నుద్ధవసా
త్యకులుత్సాహవంతులై రత్నభూషితచామరములు వీవ। గగనాంతరాళంబుఁ గప్పి కాహళభేరిపణవశంఖాదిశబ్దములు
మొఱయ। సకలవిప్రజనులు సగుణనిర్గుణరూప। భద్రభాషణములు వలుకుచుండ। భువనమోహనుండు పుండరీకాక్షుండు।
పుణ్యరాశి హస్తిపురము వెడలె॥ వ॥ తత్సమయంబునం బౌరసుందరులు ప్రాసాదశిఖరభాగంబుల నిలిచి గోపాలసుంద
రుని సందర్శించి మార్గంబు రెండు దెసలం గరారవిందంబులు సాఁచి యొండొరులకుం జూపుచుం దమలోనం దొల్లిటం బ్రళ
యంబున గుణంబులు హడక జీవులు లీనరూపంబులై యుండం బ్రపంచంబు ప్రవర్తింపని సమయంబునఁ బ్రపంచాత్మకుండు
నద్వితీయుండును నగుచు మేలై దీపించు పురాణపురుషుండితండను వారును, జీవులకు బ్రహ్మత్వంబు గలుగ లయంబు సిద్ధించుట
యొల్లను వారును, జీవోపాధిభూతంబులయిన సత్త్వాదిశక్తుల లయము జీవలయమను వారును, గృష్ణుఁ డనప్పరమేశ్వరుండు
నిజవీర్యప్రేరితమైన నిజాంశభూతంబులైన జీవులకు మోహినియగుచు సృష్టి సేయ నిచ్ఛయించి నామరూపంబులు లేని జీవు
లకు నామరూపంబులు గల్పించుకొఱకు వేదంబుల నిర్మించి మాయానుసరణంబు సేయుననువారును, నిర్మలభక్తి సము
త్కంఠావిశేషంబుల నకుంఠితులై జితేంద్రియులగు విద్వాంసు లిమ్మహానుభావు నిజరూపంబు దర్శింతురను వారును, యో
గమార్గంబులం దర్శింపరాదను వారునై మఱియును॥ మ॥ రమణీ మారము వోయెఁ గృష్ణు రథము న్రాదింక వీక్షింపనీ।
కనులాతురుం బొడఁగాన లేనిదినముల్ కల్పంబులై తోఁచు గేహములం దుండఁగ నేలఁ బోయి పరిచర్యల్ సేయుచు న్నెమ్మినుం
డము రమ్మాయ నెనొక్క చంద్రముఖి కందర్పాశుగభ్రాంతయై॥ మ॥ తరుణీ యాదవరాజుగాఁ డితఁడు వేదవ్యక్తుఁడై
యొక్కఁడై। వరుసన్లోకభవస్థితిప్రళయముల్ వర్తింపఁగాఁ జేయుచు। న్తరలీలారతుఁడై నయీశుఁ డితని న్దర్శించితిం బు
ణ్యభా। సురనేనంచు నటించె నెక్కతె మహాశుద్ధాంతరంగంబునన్॥ క॥ తామసగుణులగు రాజులు। భూమిం బ్రభవించి
ప్రజలఁ బొలియింపఁగ సత్త్వాత్ముతనుఁడై యీతఁడు। భామిని వారల వధించుఁ బ్రతికల్పమునన్॥ ఇదియునుం గాక॥
సీ॥ ఈయుత్తమశ్లోకుఁ డెలమి జన్మించిన యాసవకుల మెల్ల ఘనము య్యె। నీపుణ్యవర్తనుఁ డే ప్రొద్దు నుండిన మథురాపుర
ము దొడ్డమహిమఁ గనియె। నీపూరుషశ్రేష్ఠు నీక్షించి భక్తితో ద్వారకావాసులు ధన్యులైరి। యీమహాబలశాలి యెలిఁగి శి
క్షింపంగ నిష్కంటకంబయ్యె నిఖిలభువన। మీరాజకన్మోహనాకృతి నిచ్చయించి। పంచశరభల్లజాలవిభజ్యమాన। విమలమాన
సహుగువల్లవీసమూహ। మితని యధరామృతముఁ గ్రోలు నెల్లప్రొద్దు॥ ఉ॥ ఈకమలాక్షునీ సుభగునీ కరుణాంబుధిఁ బ్రా
ణనాథుఁగాఁ జేకొని వేడ్కఁ గాపురము సేయుచునుండెడి రుక్మిణీముఖా। నేకపతివ్రతల్ని యతినిర్మలమానసలై జగన్ను

తా। స్తోకవిశేషతీర్థములం దొల్లిటిభాముల నేమి నోఁచిరో॥ వ॥ అని యిట్లు నానావిధంబులైన పురసుందరీవచనంబు లాకర్ణించి కటాక్షించి నగుచు నగరంబు వెడలి ధర్మజుండును హార్దిరతుకలై కొలిచి నడువం జతురంగబలంబులం బంపి నంజతురంగసమేతులై తనతోడి వియోగంబునకు నోర్వక దూరంబు వెనుదగిలిన కౌరవుల మఱలించి కురుజాంగల పాంచాల శూరసేన యామున భూములం గడచి బ్రహ్మావర్త కురుక్షేత్ర మత్స్య సారస్వత మరుధన్వ సౌవీరాభీర విషయంబు లతిక్రమించి తత్తద్దేశవాసు లిచ్చిన కానుకలు గొనుచు నానర్తమండలంబు సొచ్చి వచ్చి బంధుండు పశ్చిమసింధునిమగ్నుండైన సమయంబునఁ బరిశ్రాంతవాహుండై చని చని॥

శ్రీ శ్రీకృష్ణుఁడు ద్వారకానగరంబు ప్రవేశించుట. శ్రీ

మ॥ జలజాతాక్షుఁడు శౌరి డగ్గఱె మహాసౌధాగ్రశృంగారకాంచలహారావృత హేమపద్మపరిఖా ప్రాకార కాసారకా దోరణా! వలిసంఛాదిత తారకా! ధరులతావర్గాను వేలోదయాత్ఫలపుష్పాంకుర కోరకవ్రణిమయ ప్రాకారకా ద్వారకన్॥ వ॥ ఇట్లు తన ప్రియపురంబు డగ్గఱి॥ మత్తకోకిల॥ ఆర్యసన్నుతసాహసుండు మురారి యొత్తె ధరాసురోత్తముల్ ధన్యులై వినఁ బాంచజన్యము దారితాఖిలజంతుచైతన్యము న్నవసైన్యమాన్యము దానవాఘనిషేవితాజన్యమున్నరిమూర్ఛితాఖిలశత్రుదానవసైన్యమున్॥ శా॥ శంఖారావము వీనులన్ని నిజసుల్పర్ణాంబరప్రస్యము సంఖ్యాతీతముం గొంచు వచ్చిరి దివ్యదర్పితోత్కంఠన। ప్రేంఖద్ధ్వజ్ఞులు వంశకాహళమహాభేరీగజాశ్వావళీరింఖారావము లుల్లసిల్లఁ దనుజారిం జూడ నాసక్తులై॥ క॥ బంధులు పౌరులు దెచ్చిన గంధేభ హయాదులైన కానుకలు వయోసింధుఁడు గైకొనె నంబుజబంధుఁడు గొను దత్తదీపపఙ్క్తుల భంగిన్॥ వ॥ ఇట్లాత్మారాముండు పూర్ణకాముండునయిన యప్పరమేశ్వరునికి నుపాయనంబు లిచ్చుచు నాగరులు వికసితముఖులయి గద్గదభాషణంబులతోడ నయ్యకుండగనపు నయ్యకు నెయ్యంపుచూపుల నడ్డంబు లేని బిడ్డల చందంబున నిట్లనిరి॥ శా॥ నీపాదాబ్జము బ్రహ్మపూజ్యము గదా నీసేవ సంసారసంతాపధ్వంసిని యాగదా సకలభద్రశ్రేణులం బ్రీతితో నీ పాదింతు గదా ప్రసన్నులకు నంగాలాద్యకాలంబు నిర్వ్యాపారంబు గదయ్య కాలరుని నున్వర్ణింప బ్రహ్మాదులున్॥ క॥ ఉన్నారము సౌఖ్యంబున విన్నాణము నీప్రతాపవిభ్రమకథలన్ మన్నారము ధనికులమై కన్నారము తావకాంఘ్రికమలములు హరీ॥ క॥ ఆరాటము వదిలెను గమ్మోరాటము లిండ్లకడలఁ బుట్టవు పురిలో నీరాటన మెగియదుసీ దూరాట్టన మోర్వలేము తోయజనేత్రా॥ ఉ॥ తండ్రులకెల్లఁ దండ్రియగు ధాతకుఁ దండ్రివి దేవ నీవు మా తండ్రి పితళ్లి వింబతివి దైవము పున్నిమ విస్మరుండవే తండ్రులు నీక్రియం బ్రజలఁ ధన్యులఁ జేసిరి వేల్పులైన నో తండ్రి భవన్ముఖాంబుజము ధన్యతఁ గానరు నానావిధంబులన్॥ క॥ చెచ్చెరఁ గరినగరికి నీ విచ్చేసి ననిమిషమైన వెయ్యేండ్లగు నీ వెచ్చోటికి విచ్చేయక మచ్చికతో నుండుమయ్య మా నగరమునన్॥ గీ॥ అంధకారవైరి యపరాద్రి కవ్వలఁ జనిన నంధమయ్యెను జగము భంగి నిన్నుఁ గానకున్న నీరజలోచన యంధతనొందుదుమయ్య॥ వ॥ అని యిట్లు ప్రజలాడెడి భక్తియుక్త మధుర మంజులాలాపంబులు కర్ణకలాపంబులుగా నవధరించి సకరుణావలోకనంబుల వర్షించుచు హర్షించుచు దనరాక విని మహానురాగంబున సంరంభవేగంబుల మజ్జనభోజనశయనాదికృత్యంబు లొల్లక యుగ్రసేనాక్రూర వసుదేవ బలభద్ర ప్రద్యుమ్న సాంబ చారుదేష్ణ గద ప్రముఖయాదవులు కుంజరులు గుంజర తురగ రథారూఢులై దిక్కుంజరసన్నిభంబయిన యొక్క కుంజరంబు మునుపటిడుకొని సూతమాగధ నటనర్తక వందిసందోహంబులుం గంగ దికులుం భాషణంబులును భూసుర నిశాయాశీర్వాద వేదఘోషంబులును వీణా వేణు భేరీ పటహ శంఖ కాహళ ధ్వానంబులును రథారూఢ విభూషణభూషిత వారయువతీయానంబుల సమానంబులై చెలంగ నెదురుకొని యథోచిత ప్రణామ నమస్కార పరిరంభ కరస్పర్శన సంభాషణ మందహాస సందర్శనాది విధానంబుల బహుమానంబులు సేసి వారలుం దానును భుజగేంద్రపాలితంబయిన భోగవతీనగరంబు చందంబున స్వసమానబల మధు భోజ దాశార్హ కుకురాంధక వృష్ణివీరపాలితంబును సకలకాల సంపద్యమానాంకుర పల్లవ కోరక కుట్మల కుసుమ ఫల మంజరీపుంజభార వినమిత లతా పాదప రాజి విరాజితోద్యాన వనోపవనారామ భాసితంబును వనాంత రాజ రసాల సాల శాఖాంకుర ఖాదన తుష్ణీక పాయక కంఠ కలకంఠ మిథున కోలాహల ఫలరసాస్వాద పరిపూర్ణ శారికా కీరకుల కలకల లక్షల్లార పుష్పమకరంద పాన పరవశ భృంగ భృంగీ కదంబంబులుం గాసారసరోవర కనక కమల మృదుల కాండఖండ స్వీకార మత్త వరటాయుత కలహంస నివహ క్రేంకారసహితంబును మహోన్నత సౌధజాలరంధ్ర నిర్గత కర్పూర ధూప ధూమపటల సందర్శన సంజాత జలధర భ్రాంతి విభ్రాంత సముత్థాపిత పక్ష గగన ప్రవర్తమాన మత్తమయూర కేకారవ మహితంబును నానారూప తోరణ ధ్వజములై ఖయాంతికాదికా యన్నిరుద్ధ తాత కాత్రశా

ప్రకాశంబును ముక్తాఫలవిరచితరంగవల్లికాలంకృతమందిరద్వారగేహళీవేదికాప్రదేశంబులును ఘనసారగంధసారక స్తూరికాసంవాసితవణిగ్గేహగేహళీనికరకనకకలశాంతికావికీర్యమాణసలిలధారాసంసిక్తవిపణిమార్గంబును బ్రతినివాస బహిరంగణసమర్పితరసాలదండఫలకుసుమగంధాక్షతధూపదీపరత్నాంబరాదివివిధోపహారంబును బ్రవాళనీలమరకత వజ్రవైడూర్యనిర్మితగోపురాట్టాలకంబును విభవనిర్జితమహేంద్రనగరాలకంబును నగు పురవరంబు బ్రవేశించి రాజమా ర్గంబున వచ్చు సమయంబున॥ మత్తకోకిల॥ కన్నులారఁగ నిత్యముం హరిఁ గాంచుచున్న వారలయ్యు న న్నీనకుతూహ లోత్సవయుక్తి నాగరకాంతలు త్తున్నతోన్నతహర్మ్యరేఖలనుండి చూచిరి నిక్కిచే। సన్నలందమ లోనఁదద్విభుసౌకుమా ర్యము సూపుచున్॥ సీ॥ కలుములనీనెడుకలికిఁ బరియెలనాగ వర్తించు నెవ్వని వక్షమందు। జనదృక్చకోరకసంఘంబునకు సు ధాపానీయపాత్రమే భవ్యముఖము। సకలదిక్పాలకసమితికి నెవ్వని బాహుదండంబులు పట్టుకొమ్మ। లాశ్రితశ్రేణికే యధిపతి పాదరాజీవయుగ్మంబులు చేరుగడలు। భువనమోహనుఁడు పురుషభూషణుఁ డెవ్వఁ। డట్టి కృష్ణుఁ డరిగె హర్మ్యశిఖ రరాజమానలగుచు రాజమార్గంబున। రాజముఖులు గుసుమరాజిఁ గురియ॥ మ॥ జలజాతాక్షుఁడు చూడ నొప్పె ధవళ చ్ఛత్రంబుతోఁ జామరంబులతోఁ బుష్పపిశంగచేలములతో భూషామణిస్ఫీతుఁడై। నళినీబాంధవుతో శశిద్వయముతోన క్షత్రసంఘంబుతో బలభిచ్చాపముతోఁ దటిల్లతికతో భాసిల్లు మేఘాకృతిన్॥ వ॥ ఇట్లు తలిదండ్రులనివాసంబు సొచ్చి దేవకీ ప్రముఖలయిన తల్లులకేడ్వురకు మ్రొక్కిన॥ క॥ బిడ్డఁడు మ్రొక్కినఁ దల్లులు జడ్డన నంకములను నిచి చన్నులఁ జుదిఁబా లొ

## శ్రీకృష్ణుండష్టభార్య మొదలగువారినిఁ జూడఁబోవుట.

డ్డగిలఁ బ్రేమభరమున జడ్డువడం దడపిరక్షిజలముల ననఘా॥ వ॥ తదనంతరంబ ష్టోత్తరశతషోడశసహస్రసౌవర్ణసౌధశాం తంబయిన శుద్ధాంతంబు సొచ్చి హరి [illegible]॥ మ॥ ఒకభామాభవనంబునన్నఁ జొర వేఱొక్కర్తులోఁ గుందునో। సు కరాలాపములాడనో సొలయునో సూనుప్రీతినీక్షింపదో। వికలత్వంబున నుండునో యనుచు న వ్వేళ న్వధూగేహముల్। ప్రక టాశ్చర్యవిభూతిఁ జొచ్చె బహురూపవ్యక్తుఁడై భార్గవా॥ ఆసమయంబున॥ క॥ శిశువులఁ జంకలనిడి తను కృశతలు విరహా గ్నిఁ దెలుప గృహగేహళులన్। రశనలు జారఁగ సిగ్గుల। శశిముఖులెదు రేఁగిరపుడు జలజాక్షునకున్॥ మ॥ పతి నా యింటికి మున్నువచ్చెనిదె నా ప్రాణేశుఁ డస్మద్గృహాగతుఁ డయ్యె న్ముసుఁ జేరెఁ బోఁ దొలుత మత్కాంతుండు నా శాలకే। నితరాల భ్యసుఖంబుఁ గంటిననితారింటింటన ర్పించిర। య్యతివల్నాలుఁ బదారువేలు నెనమండ్రవ్వేళ నాత్మేశ్వరున్॥ వ॥ వార లంజూచి హరి యిట్లనియె॥ మ॥ కొడుకుల్ భక్తివిధేయులౌదురుగదా కోడండ్రు మీ వాక్యము। ల్గడవంజాలకయుందురా వి బుధసత్కారంబు గావింతురా। తొడవుల్ వస్త్రములుం బదార్థరససందోహంబులుం జాలునా। కడమల్గావు గదా భవన్నిల యముల్ గల్యాణయుక్తంబులే॥ సీ॥ తిలకమేటికి లేదు తిలకినీలాలకమ పువ్వులు దుఱుము వాపువ్వు బోఁడి। కస్తూరియలఁద వా కస్తూరికాగంధితొడవులు దొడవవా తొడవు తొడవ। కలహంసమున్న దే కలహంసగామిని కీరంబు చదువు నే కీరవాణి। లత లపోషింతువా లతికారుచిరదేహ సరసి నోలాడుదే సరసిజాక్షి। మృగికి మేఁతలిడుదె మృగశాబలోచన। గురుల నాదరింతె గురువివేక। బంధుజనులఁ బ్రోతె బంధుచింతామణి। యనుచు సతుల నడిగె నచ్యుతుండు॥ వ॥ అని యడిగిన వారలు హరిం బా సినదినంబులందు శరీరసంస్కారకేళీవిహారహాసమందిరగమనమహోత్సవదర్శనంబు లెల్ల నియల్లాండ్రు గావున॥ ఉ॥ సిరిచాంచల్యము తోడిదయ్యుఁ దనకుంజీవేశ్వరుండంచు నే। పురుషశ్రేష్ఠు వరించు నట్టిపరమున్నబ్ధిన్వలోకంబుల। న్నగర యుగ్మంబులఁ గౌఁగిలించిరి సతుల్ గల్యాణబాష్పంబులా। భరణశ్రేణులుగాఁ బ్రతీక్షణనవప్రాప్తానురాగంబులన్॥ మత్త కోకిల॥ పంచబాణుని నీఱుసేసిన భర్గునిం దనువల్లి వర్జించి మూర్ఛిలఁ జేయఁజాలు విశేషహాసవిలోకనో। దంచితాకృతు లయ్యుఁ గాంతలు దంభచేష్టల మాధవుం। జంచలింపఁగఁ జేయనేమియుఁ జాలరై రి బుధోత్తమా॥ వ॥ ఇవ్విధంబున సంగవిర హితుండైనకంసారి సంసారికై వడి విహరింప నజ్ఞానవిలోకులైన లోకులు లోకసామాన్యమనుష్యుండని తలంతు రాత్మాశ్ర యమైన బుద్ధి యాత్మయందున్న యానందాదులతోఁ గూడని తెఱంగున నీశ్వరుండు ప్రకృతితోడం గూడియు నా ప్రకృతి గుణంబులైన సుఖదుఃఖంబులఁ జెందకయుండుఁ బరస్పరసంఘర్షణంబులచే వేణువులవలన వహ్నిఁ బుట్టించి వనంబుల ద హించు మహావాయువుచందంబున భూమికి భారహేతువులైయనేకాక్షౌహిణులతోడం బ్రవృద్ధతేజులగు రాజులకన్యో న్యవైరంబులు గల్పించి నిరాయుధుండై సంహారంబు సేసి శాంతుండై పిడపం గాంతామధ్యంబునఁ బ్రాకృతమనుష్యుం డున్నంబోలె సంచరించుచుండెనా సమయంబున॥ క॥ మతులీశ్వరుని మహత్త్వము। మిత మెఱుఁగని భంగి నప్రమేయుఁ డ

సుహారిస్థితి నెఱుఁగకఁగాముకుఁడసి। రతములుసలుపుచురుతిగిచిరపుణులుప్రీతిక॥. క॥ఎల్లప్పుడునుమాయింటన్। వల్ల భుఁడువసించు నేమువల్లభలముశ్రీ। వల్లభునకనుచుగోపీ। వల్లభుచేసితులుమమతవలఁబడిరనఘా॥. వ॥అనిచెప్పినవిని

## ——శ్రీ పరీక్షిత్తుజన్మించుట. శ్రీ——

సూతునకుశౌనకుండిట్లనియె॥. సీ॥ గురునందనుండుసక్రోధుఁడై యేసినబ్రహ్మశిరోనామబాణవహ్నిఁగంపించుచు నుత్తర గర్భంబుఁగ్రమ్మఁఱబ్బఁలోచనుచేతబ్రతికెనంట్రు। గర్భస్థుఁడగుబాలుఁగంసారియేరీతిబ్రతికించెమృత్యువుభయమువా పి। జనియించియతఁడెన్నిసంవత్సరములుండెనెట్లుఁగివర్తించెనేమిసేసె। వినుముశుకుఁడువచ్చివిజ్ఞానపద్ధతి। నతనికె ట్లుచూపెనతఁడుపిదపఁ। దనశరీరమేవిధంబునవర్జించె। విప్రముఖ్యనాకువిస్తరింపు॥. వ ॥ అనినసూతుండిట్లనియెధర్మ నందనుండు చతుస్సముద్రముద్రితాఖిలజంబూద్వీపరాజ్యంబు నార్జనంబుసేసియు మిన్నుముట్టినకీర్తిసంగ్రహించి యునంగనాతురంగసుభటకాంచనాదిదివ్యసంపదలుసంపాదించియువీరసోదరవిప్రవిద్వజ్జనవినోదంబులంబ్రమోదించి యువైభవంబులలరించియుఁగ్రతువులాచరించియుదుష్టశిక్షణశిష్టరక్షణంబులొనరించియుముకుందచరణారవిందసేవా రతుండైసమస్తసంగంబులందునభిలాషంబువర్జించియరిషడ్వర్గంబులజయించిరాజ్యంబుసేయుచు॥. గీ॥ చందనామల నాకటస్రగ్గవాఁడు।దనివినొందనికైవడిధర్మసుతుఁడు।సంపదలుపెక్కుగలిగియుఁజక్రిపాద।సేవనంబులఁబరిపూర్తి జెందకుండె॥. వ॥ అంతఁగొన్నిదినంబులకునభిమన్యుకాంతాగర్భంబునందున్నడింభకుండుదశమాసపరిచ్ఛేద్యుండై గ ర్భాంతరాళంబునదురంతంబయినయశ్వత్థామబాణానలంబునదందహ్యమానుండై తల్లడిల్లుచు॥. ఉ॥ కుయ్యిడశక్తిలే దొడలగోళములోపలనున్నవాఁడది। కెయ్యెదిదాననాథననియెవ్వఁడుఁదల్లిగణింపవిందునేఁ।డియ్యెడునుపహ్నివాయ టకునెయ్యదిమార్గమునన్నుఁగావనే।యయ్యగలండుగర్భజనితాపదనెవ్వఁడెఱుంగుదైవమా॥. క॥చిచ్చరకోలవశంబు నఁ।జచ్చిబహిర్గతుఁడఁగావినమయమునను దా।నుచ్చలితగర్భవేదనఁ।జచ్చునుమాతల్లిగర్భసంతాపమునక॥. క॥చెచ్చెర బాణజ్వాలలు।వచ్చినవిష్ణుండుగావవచ్చుననుచుఁదా।ముచ్చటలుసెప్పఁసతులకు। నిచ్చలుమాయవ్వ నేఁడునిజమయ్యెడి నో॥. శా॥ రాఁడాచూడసమస్తభూతములలోరాజిల్లువాఁడిచ్చటక। లేఁడాపారునిచిచ్చరమ్ముఁదొలఁగగ నీలాగతి క్రోఁచినా।కీఁడానేఁడభయప్రదానమతఁడూహింపనన్నత్రాతము।న్నాఁడాయెందటిఁగావఁడీయెడలమత్కర్మంబుదా నెట్టిదో॥. వ॥అనిగతాగతప్రాణుండై శిశువుచింతించుసమయంబున॥. సీ॥ మేఘంబుమీఁదిక్రొమ్మెఱుఁగుకైవడిమేని పైనున్నపచ్చనిపటమువాఁడు।గండభాగంబులఁగాంచనమణిమయమకరకుండలకాంతిమలయువాఁడు।శరవహ్నినడఁ గించునంరంభమునఁజేసికన్నులనునుకెంపుగలుగువాఁడు। బాలార్కమండలప్రతిమానరత్నహాటకవిరాజితకిరీటంబు వాఁడు।గంకణాంగదవనమాలికావిరాజ।మానుఁడసమానుఁడంగుష్ఠమాత్రదేహుఁ।డొకకగదఁజేతఁదాల్చినేత్రోత్సవ ముగ।విష్ణుఁడావిర్భవించెనవ్వేళయందు॥వ॥ఇట్లుభక్తపరాధీనుండైనపరమేశ్వరుండావిర్భవించిమంచువిరియించుమా ర్తాండుచందంబునశిశువునకుదశదిశలందనచేతియఖండితనుహూల్కాజ్వాలాసన్నిభంబైన గదాదండంబుమణ్డలాకా రంబుగజిఱజిఱంద్రిప్పివిప్రునిచ్చఅమ్ము వేడిమిపోడిమిఁజెఱిచిడింభకునిపరితాపవిజృంభణంబునివారించిగర్భంబుగంద కుండనర్భకునికినానందంబుఁగల్పించిన॥.మ॥గదఁజేఁబట్టిపరిభ్రమించుచుగదాఘాతంబులంగ్రూరశుక్రప్రదమైవచ్చుశరా గ్నిఁదుత్తుమురుగాభంజించిరక్షించునీసదయుండెవ్వఁడొకోయటంచుమదిలోఁజర్చించుచున్నాబకుం।డెదుటైచూడనదృ శ్యుఁడయ్యెహరిసర్వేశుండువిప్రోత్తమా॥.వ॥అంతననుకూలశుభగ్రహోదయంబుసర్వగుణోత్తరఫలసూచకంబునై నశుభలగ్నంబునంబాండవవంశోద్ధారకుండైనకుమారుండుజన్మించినధర్మనందనుండుధౌమ్యాదిభూసురవర్గంబురప్పిం చిపుణ్యాహంబుసదివించిజాతకర్మంబులుసేయించి కుమారుజన్మమహోత్సవకాలంబునభూసురులకువిభవానుగుణం బులయినగోమహిషహిరణ్యహయగ్రామంబులునుస్వాదురుచిసంపన్నంబులైనయన్నంబులిడినవారలుధర్మపుత్రునకి ట్లనిరి॥చ॥ప్రకటితదైవయోగమునఁబౌరవసంతతియంతరింపఁగా।వికలతనొందనీకఁబ్రభవిష్ణుఁడువిష్ణుఁడనుగ్రహించి శాబకుఁబ్రతికించెఁగావునన్నృపాలకశాబకుడింకశాత్రవాం।తకుఁడగువిష్ణురాతుఁడనధాత్రిఁబ్రసిద్ధికినెక్కుఁబూజ్యుఁ డై॥. వ॥అనినవినిభూదేవోత్తములకునరదేవోత్తముండిట్లనియె॥. శా॥ఓపుణ్యాత్మకులార నాపలుకుమీరూహింపఁడె మ్మొక్కెదక।మాపెద్దల్ శ్రుతకీర్తులైసదయులైమన్నారురాజర్షులై।యీపిన్నాతఁడువారిఁబోలెడిఁగదాయెల్లప్పు డున్మాధవ।శ్రీపాదాంబుజభక్తియుక్తుఁడగుచుఁజీవించునే చూడరే॥. వ॥ అనినవినినరేంద్రాభవదీయపౌత్రుండుమ

సుతుసుపుత్రుండయినయుధిష్ఠిరుఁడు చందంబున నం ప్రజలరక్షించు, శ్రీరామచంద్రునిభంగి బ్రహ్మణ్యుండు సత్యప్రతిజ్ఞుండు నగు, డేగవెంటనంటిన ఖిన్నతభీతంబై వెనుకకువచ్చిన కపోతంబుఁగాచిన శిబిచక్రవర్తిరీతి శరణ్యుండు వితరణఖనియునగు, దుష్యంతసూనుండయిన భరతుపగిది జ్ఞాతివర్గంబులకు యుధ్ధ్వజ్వాలకు నసర్గళకీర్తి ప్రస్తరించు, ధనంజయ కార్తవీర్యులకరణి ధనుర్ధరాగ్రేసరుండగుఁ, గీలిజ్వాలికెదుర్ధర్షుండగు, సముద్రునికైవడిం గుణసముద్రుండగు, మృగేంద్రంబుకైవడి విక్రమశాలి యగు, వసుమతింబోలె క్షాంతియుక్తుండగు, భానునిబోలె గుణసంప్రతాపవంతుండగు, వాసుదేవుని వడువున సర్వభూతహితుండగుఁ, దల్లిదండ్రులమాడ్కి సహిష్ణుండగు నుతింపఁజాలు … ॥ సీ॥ సమదర్శనంబున జలజాతభవుఁ డన నంబరమున ప్రసన్నతభర్గుఁ డనఁగ । నెల్లగుణంబులనిందిరావిభుఁ డనన ధికధర్మమున యయాతియనఁగ । ధైర్యసంపదబలి దైత్యవల్లభుఁ డనన చ్యుతభక్తి బ్రహ్లాదుఁ డనఁగ । రాజితోదారతరంతి దేవుండతన నాశ్రితపక్షపాత హేమాద్రియనఁగ । యిళము నార్జించుఁ జెర్చలనాథరించు నశ్వమేధంబులొనరించు నాత్మసుతుల। నునుల బుట్టించు ధండించుఁ ఖలులఁ బట్టి। మానధనుఁడు నీ మనుసుఁడు మానవేంద్రు॥ భుజంగప్రయాతము॥ హరించుంగలి ప్రేరితాఘంబులెల్లన్ । భరించున్ ధరిత్రిన్ గ్రామభద్రుండు … జరించున్ సదా వేదశాస్త్రానువృత్తిన్ వరించున్ విశేషించి వైకుంఠుభక్తిన్॥ వ॥ గిరీళ్లుపై కేరులున్ జీవించి భూసురకుమారరక్ష ప్రేతంబయినతక్షకసర్పవిషానలంబున నందనకు మరణంబని మోఱిదెగి సంగవర్జితుండయి ముకుందపదారవిందభజనంబు సేయుచు శుకయోగీంద్రునివలన నాత్మవిజ్ఞానసంపన్నుండై గంగాతటంబున శరీరంబు విడిచి నిర్గతభయశోకుండై సలోకంబు ప్రవేశించుననిజాతకర్మఫలంబు చెప్పి లబ్ధకాములై భూసురులు చనిరంత॥ క॥ తనతల్లికడుపులో పలమున్నఁ జూచిన విభుడు విశ్వమున నెల్లఁగలండను … మునీంద్రా॥ గీ॥ కళలచేత రాజు క్రమమున బెరిపూర్ణుఁడయినభంగిదాతలను దినంబు వోషణంబు సేయఁ బూర్ణుఁడయ్యెను ధర్మ … బాలకుండు॥ వ॥ మఱియు ధర్మజుండు బంధుసంహారదోషంబు వాయుటకై అశ్వమేధయాగంబు సేయందలంచి ప్రజలవలన గరదండంబులను సార్జితంబయిన విత్తంబు చాలకఁ జిత్తంబున జింతించు నెడ నచ్యుత ప్రేరితులై భీమార్జునాదులు దొల్లి మరుత్తుండను రాజు మఖంబుచేసి పరిత్యజించిన … సువర్ణపాత్రాదికంబై నవిత్తము ఉత్తరదిగ్భాగంబువలన బలవంతులై తెచ్చిన నా రాజసత్తముండు సమాయత్తయజ్ఞోపకరణుండై సకలబంధుసమేతంబుగఁ గృష్ణుని నాహ్వానంబుచేసి పురుషోత్తమును ఉద్దేశించి మూఁడు జన్నంబులు గావించె నంతరంబ కృష్ణుండును బంధుప్రియంబుకొఱకుఁ గరిసగరంబున గొన్ని నెలలుండి ధర్మపుత్త్రానుమతంబున నాత్రణంబునవడసి యాదవసమేతుండై ధనంజయుండుతోడ రా నిజనగరంబునకుఁ జనియె నంతకమున్న విదురుండు తీర్థయాత్రకుం జని మైత్రేయమునివలన ధర్మ … ప్రహ్లాదాదివిషయంబులయిన ప్రశ్నలు కొన్నింటిం జేసి యతనివలన నాత్మవిజ్ఞానంబు దెలిసి కృతార్థుండై హాస్తిపురంబునకు వచ్చిన॥ క॥ బంధుఁడు వచ్చెనటంచును గాంధారీవిభుఁడు మొదలుగా నందఱు సంభ్రమము … జేసిరపుడనన్న నలనమ్మా॥ వ॥ అంత ధర్మనందనుండు విదురునికి సజ్జనభోజనాదిసత్కారంబులు సేయించి సుఖాసీనుండై తనవారలం బరుపు విననిల్లనిరమో॥ సీ॥ పక్షనంబుననిగా గాలము మీరు సంచరించితిరయ్య జగతిలోన నేతీర్థములు గంటిరెక్కడ మంత్రిరి భావింప మీవంటి భాగవతులు దీర్ఘపదఘంబుల దిక్కరింతురు గదా మీయందు మవిష్ణుండు మెలఁగుకతన । మీరలే తీర్థంబులు మీకంటె మిక్కిలి తీర్థంబులున్నవె తెలిసిచూడ । వేరె తీర్థంబులనిమైవెదుక వేళ । మిమ్ము బోతగనిభాషించు మేలెన్నాలు । వార్త లేమిఁ బ్రజలోకులున స్తుధలోన । మీమనసర్వంబు నెఱిఁగెదుమేరగలఁడు॥ … కోకిల॥ తండ్రి సచ్చిన మీఁద మా సెద తండ్రి బిడ్డలు దొల్లి … సర్వవిషాగ్ని బాధలఁ దాసి వెట్టఁగ మమ్మును … నంత … వలకుండఁగ లాలనంబున మీరు మా తండ్రిభంగి సమృద్ధి చేసితిరి … రే॥ క॥ పకులుదము … బత్తంబులు దానిపిల్ల పనువుల మాపుత్ర రక్షించిన క్రియ మీరలు పక్షీకరణంబు సేయు బ్రదికితిమి గదే॥ క॥ మన్నాన ద్వారకలోఁ నున్నా రా యదువులంబుజోదర కరుణను గన్నారా లోకులచే … విన్నారా మీరు వారి విధమెట్టిదియో॥ వ॥ అనవిని ధర్మరాజునకు నావిదురుండు సమస్తలోకవర్తనము క్రమంబుతో వివరంబుగఁ జెప్పి యదుకులంబు సె… ప్పననతఁడు గ్రశోకము నబెగ్గిలుచుండెడినచు నే…యు । నన్నను చెప్పఁడయ్యె యదుకులనాశము భార్గవోత్తమా॥ గీ॥ మేలుఁ జెప్పె నేని మేలంద్రు లోకులు చెట్టయరాట్ల కీడుఁ జెప్పవాని సంతనాఁడకూర్ప … నతకత్తంబున శిష్టమరణమతఁడు సెప్పఁడయ్యె॥ వ॥ అది యెట్లనిన మాండవ్యమహామునిశాపంబునం దొల్లి యముండు శూద్రయోనియందు విదురుండై జన్మించియున్నవాఁడు వత్సరంబు

త్యముండు యథాక్రమంబునం బాపకర్మలఁ దండించె నిట్లు యుధిష్ఠిరుండు రాజ్యంబుఁ గైకొని లోకపాలసంకాశులైన త
మ్ములుం దానును కులదీపకుండైన మనుమని ముద్దుసేయుచుఁ బెద్దకాలంబు మహావైభవంబున సుఖియై యుండె॥ క॥ బాలా

### గాంధారీధృతరాష్ట్రులు దేహత్యాగము చేయుట.

జనశాలాధన! లీలావనముఖ్యవిభవలీనమనీషా! లాలసులగు మానవులను! గాలము వంచించు మరవగాహము సుమతీ॥ వ॥ అ
దినిమిత్తంబునం గాలగతి యెఱింగి విదురుండు ధృతరాష్ట్రున కిట్లనియె॥ మ॥ కనకాగారకళత్రమిత్రసుతసంఘాతంబుల
న్మందట! న్గని ప్రాణేచ్ఛలనుండు జంతువుల నేకాలంబు దుర్లంఘ్యమై! యనివార్యస్థితిఁ జంపునట్టి నిరుపాయంబైన కాలం
బు వచ్చె నుపాంతంబున మాకు దీనికి మది క్కెఁ జింతింపు ధాత్రీశ్వరా॥ శా॥ పుట్టంధుండవు పెద్దవాఁడవు మహాభోగంబులా
లేవు నీ! పట్టెల్లం జెడిపోయె మస్సహజరాభారంబు పైఁ గప్పె నీ! చుట్టాలెల్లను బోయి రాలుమగఁడున్ శోకంబునన్ మగ్నులై! గ
ట్టాదాయలపంచ నుండఁదగవే కౌరవ్యవంశాగ్రణీ॥ క॥ పెట్టితిరి చిచ్చు గృహములఁ! బట్టితిరి తదీయభార్యఁ బాండవులకుం!
గొట్టితిరి వారు మనుపఁగ! నెట్టన భరియింపవలెనె యీప్రాణములన్॥ క॥ బిడ్డలకు బుద్ధిసెప్పని! గుడ్డికిఁ బిండంబు వండికొని
పొండిదె పైఁ! బడ్డాడని భీముండా! గొడ్డములాడంగఁ గూడు గుడిచెద వధిపా॥ క॥ కనియెదవో బిడ్డలనిఁక! మనియెదవో తాం
టికం బెమనుమల మాటల్! వినియెదవో యిచ్చెదరో! మ్మనియెదవో దానములకు నవనీసురులన్॥ క॥ దేహము నిత్యముగాద
ని! మోహముఁ దెగఁగోసి సిద్ధమునివర్తనుఁడై! గేహము వెలువడు నరుఁడు! త్సాహముతోఁ జెందు ముక్తిసంపద నధిపా॥
వ॥ అని విదురుండు ధృతరాష్ట్రునకు విరక్తిమార్గం బుపదేశించిన నతండు ప్రజ్ఞాచక్షుండై సంసారంబు దిగనాడి మోహపా
శంబులవలన నూడి విజ్ఞానమార్గంబునం గూడి దుర్గమంబగు హిమవన్నగంబునకు నిర్గమించిన॥ శా॥ అంధుండైన పతిన్వ
రించి పతిభావాసక్తి నేత్రద్వయీ! బంధాచ్ఛాదనముల్ ధరించి నియమప్రఖ్యాతయై యున్న త! ద్గాంధారక్షితినాథుకూఁ
తురును యోగప్రీతిచిత్తంబులో! సంధిల్లం బతివెంట నేగెను దయాత్సాధ్వీగుణారూఢయై॥ చ॥ వెనుకకు రాకఁ జొచ్చు రణవీ
రునికైవడి రాజదండనంబునకు భయంబు లేక వడిఁ బోయెదు ధీరునిభంగి నప్పుడా! వనిత దురంతమైన హిమవంతము పొం
తవనాంతభూమికిం! బెనిమిటితోడ నించుకయు భీతి వహింపక నేగెఁ బ్రీతితోన్॥ వ॥ ఇట్లు విదురసహితులై గాంధారీధృ
తరాష్ట్రులు వనంబునకుం జనిన మఱునాఁడు ధర్మనందనుండు ప్రభాతంబున సంధ్యావందనంబు చేసి నిత్యహోమంబులు
గావించి బ్రాహ్మణోత్తములకు గోహిరణ్యతిలవస్త్రాదిదానంబు లిచ్చి నమస్కరించి గురువందనంబు కొఱకుఁ బూర్వప్ర
కారంబున దండ్రిమందిరంబునకుం జని యందు విదురసహితులయిన తల్లిదండ్రులం గానక మంజుపీఠంబునం గూర్చున్న
సంజయున కిట్లనియె॥ సీ॥ మా తల్లిదండ్రులు మందిరంబున లేరు సంజయ వారెందుఁ జనిరి నేఁడు! ముందఱఁ గానఁడు ముదుస
లి మా తండ్రి పుత్రశోకంబునఁ బొగులు తల్లి! సౌజన్యనిధి ప్రాణసఖుఁడు మా పినతండ్రి మందబుద్ధులమైన మమ్ము విడిచి!
యెందుఁ బోయిరొ మువ్వు రెఱిఁగింపు మాత్మలోఁ దనయపరాధంబుఁ దడవికొనుచు! భార్యతోఁ దండ్రి పరితాపమును బొం
దుఁ! గపటమింత లేదు కరుణగలదు! పాండుభూవిభుండు పరలోకగతుఁడైన! మమ్ముఁ బిన్నవాండ్ర మనిచె నతఁడు॥ వ॥ అని న
సంజయుండు దయాస్నేహంబుల నతికర్శితుండగుచుఁ దన ప్రభువు పోయిన తెఱంగెఱుంగక కొంతదడవూరకుండి తద్వి
యోగదుఃఖంబునఁ గన్నీరు తుడిచికొనుచు బుద్ధిబలంబునం జిత్తంబు ధైర్యాయత్తంబు సేసి తన భర్తృపాదంబుల మనం
బున నెన్నుచు ధర్మజున కిట్లనియె॥ గీ॥ అఖిలవార్తలు మున్ను నన్నడుగుచుండు! నడుగఁడీ రేయి మీ తండ్రి యవనినాథ! మం
దిరములోన విదురుతో మంతనంబు! నిన్న నాడుచునుండెను నేఁడు లేఁడు॥ వ॥ విదురగాంధారీధృతరాష్ట్రులు నన్ను వంచిం
చి యెందుఁ బోయిరో వారల నిశ్చయంబు లెట్టివో యెఱుంగనని సంజయుండు దుఃఖించు సమయంబునఁ దుంబురుసహితుం
డై నారదుండు వచ్చిన లేచి నమస్కరించి తమ్ములుం దానును నారదుం బూజించి కొంతేయాగ్రజుం డిట్లనియె॥ ఉ॥ అక్కట
తల్లిదండ్రులు గృహంబున లేరు మహాత్మ వారు నేఁ! డెక్కడఁ బోయిరో యెఱుఁగ నెప్పుడు బిడ్డలపేరు గ్రుచ్చి తాఁ! బొక్కుచు
నుండుఁ దల్లి యెటువోయెనొకో విపదంబురాశికి! న్నిక్కము కర్ణధారుఁడవు నీవు జగజ్జనపారదర్శనా॥ వ॥ అనిన విని సర్వ
జ్ఞుండైన నారదుండు ధర్మజున కిట్లనియె నీశ్వరవశంబు విశ్వంబీశ్వరుండ భూతంబుల నొకటితో నొకటిఁ జేర్చు నెడఁ బాపు
సూచీభిన్ననాసికలం దరజ్జుప్రోతంబులగుచుఁ గంఠరజ్జువులఁ గట్టంబడిన బలీవర్దంబులం బోలెఁ గర్తవ్యాకర్తవ్య వేదలక్షణ
యగు వాక్తంత్రియందు వర్ణాశ్రమలక్షణంబులుగల నామంబులచే బద్ధులై లోకపాలసహితంబులైన లోకంబు లీశ్వరా
దేశంబు వహించుఁ గ్రీడాసాధనంబులగు నక్షకంతుకాదుల కెట్లు సంయోగవియోగంబు లట్లు క్రీడించు నీశ్వరునకుం గ్రీడా

సాధనంబులైన జంతువులకు సంయోగవియోగంబులు గలుగుచుండు సమస్తజనంబును జీవరూపంబున ధ్రువంబు దేహరూపంబున నధ్రువంబై యుండు మఱియొక్క పక్షంబున ధ్రువంబున ధ్రువంబును గాక యుండు శుద్ధబ్రహ్మరూపంబున ననిర్వచనీయంబుగ రెండును నై యుండు నజగరంబుచేత మ్రింగంబడిన పురుషుం డన్యులరక్షింపలేని లెఱంగునఁ బంచభూతమయంబై కాలకర్మగుణాధీనంబైన దేహంబు పరులరక్షింప సమర్థంబుగాదు కరంబులుగల జంతువులకుఁ గరంబులు లేని చతుష్పదాదులాహారంబులగుఁ జరణంబులుగల ప్రాణులకుఁ జరణంబులు లేని తృణాదులు భక్షణీయంబులగు నధిక జన్మంబులుగల వ్యాఘ్రాదులకు నల్పజన్మంబులుగల మృగాదులు భోగ్యంబులగు సకలదేహి దేహంబులందు జీవుండు గలుగుటం జేసి జీవునికి జీవుండ జీవిక యగు నహస్తసహస్తాదిరూపంబైన విశ్వమంతయు నీశ్వరుండుగా దెలియు మతనికి వేఱు లేదు నిజమాయావిశేషంబున మాయావియై జాతిభేదరహితుండైన యీశ్వరుండు బహుప్రకారంబుల భోగిభోగ్యరూపంబుల నంతరంగబహిరంగంబుల దీపించు గాన ననాథులు దీనులగు నా మతలిదండ్రులు నను బాసి యేమయ్యెదరో యెట్లు వర్తించెదరో యని వగవం బనిలే దజ్ఞానమూలంబగు స్నేహంబున నైన మనోవ్యాకులత్వంబు పరిహరింపు మనిన జీయు నిట్లనియె॥ గీ॥ అట్టి కాలరూపుఁ డఖిలాత్ముఁ డగు విష్ణుఁ డసురనాశమునకు నవతరించి। దేవకృత్యమెల్లఁ దీర్చి చిక్కిన పని। కెదురు చూచుచుండు నిప్పు డధిప॥ మత్తకోకిల॥ ఎంతకాలము కృష్ణుఁ డీశ్వరుఁ డిద్ధరిత్రిఁ జరించు మీ। రంతకాలము నుండుఁ డండ యునవ్వలం బనిలేదు మీ। భ్రాంతి మానుము కాలముం గడుపంగ నెవ్వరు నోపరీ। చింత యేల నరేంద్రసత్తమ చెప్పెదన్ విను మంతయున్॥ వ॥ ధృతరాష్ట్రుండు గాంధారీవిదురసహితుండై హిమవత్పర్వత దక్షిణభాగంబున నొక్క మునివనంబునకుం జని తొల్లి సప్తఋషులకు సంతోషంబు సేయుకొఱకు నాకాశగంగ యేడు ప్రవాహంబులై పాఱిన పుణ్యతీర్థంబునఁ గృతస్నానుండై యథావిధి హోమంబు లొనరించి జలభక్షణంబు గావించి సకలకర్మంబులు విసర్జించి విఘ్నంబులం జెందక నిరాహారుండయి యుపశాంతాత్ముండగుచు శాంతి నంగీకరించి పుత్రార్థదారేషణంబులు వర్జించి *విన్యస్తాసనుండై §ప్రాణంబుల నియమించి మనస్సహితంబైన చక్షురాదీంద్రియంబుల నాఱింటిని విషయంబులఁ బ్రవర్తింపనీక వర్తించి హరిభావనచే ధారణాయోగంబు వహించి రజస్సత్త్వతమోరూపంబులగు మలంబుల మూఁటిని హరించి మనంబున హంకారాస్పదంబైన స్థూలదేహంబువలనం బాపి బుద్ధియందు నేకీకరణంబు సేసి యట్టి విజ్ఞానాత్మను దృశ్యాంశంబువలన వియోగించి క్షేత్రజ్ఞునియందుఁ బొందించి దృష్టంబైన యీశ్వరునివలన క్షేత్రజ్ఞునిం బాపి మహాకాశంబుతోడ ఘటాకాశముం గలుపు కైవడి నాధారభూతంబైన బ్రహ్మమందుఁ గలిపి లోపలి గుణక్షోభంబును వెలుపలి యింద్రియవిక్షేపంబును లేక నిర్మూలితమాయాగుణవాసనుండగుచు నిరుద్ధంబులగు మనశ్చక్షురాదీంద్రియంబులు గలిగి యఖిలాహారంబుల వర్జించి ¶కొఱడు చందంబున॥ మ॥ ఉటజాంతస్థలవేదికన్ నియతుఁడై యున్నాఁడు నేఁడాదిగా। నిటపై నేనవ నాఁడు మేన్విడువఁగా నిజ్యాగ్ని యోగాగ్నితప్తపటుదేహంబు దహింపఁ జూచి నియమప్రఖ్యాత గాంధారి యి। ట్టటు వోనొల్లక ప్రాణవల్లభునితో నగ్నింబడున్ భూవరా॥ క॥ అంతట వారల మరణము। వింతయగుచుఁ జూడఁబడిన విదురుఁడు చింతా। సంతాపమొదవఁ బ్రీతస్వాంతుండై తీర్థములకుఁ జనియెడు నధిపా॥ వ॥ అని విదురాదుల వృత్తాంతంబంతయు ధర్మనందనున కెఱింగించి తుంబురుసహితుండై నారదుండు స్వ

### ధర్మరాజు దుర్నిమిత్తంబులం గని చింతించుట.

ర్గంబునకు నిర్గమించిన వెనుక ధర్మజుండు భీమునిం జూచి యిట్లనియె॥ సీ॥ ఒకకాలమునఁ బండు నోషధీచయము వేఱొక కాలమునఁ బండకుండు నండ్రు। క్రోధంబు లోభంబుఁ గ్రూరత బొంకును దీపింప నరులు వర్తింతు రండ్రు। వ్యవహారములు మహావ్యాజయుక్తము లండ్రు సఖ్యంబు వంచనాసహిత మండ్రు। మగలతో నిల్లాండ్రు మచ్చరించెద రండ్రు సుతులు దండ్రులఁ దెగఁ జూతు రండ్రు। గురుల శిష్యులు దూషించి కూడ రండ్రు। శాస్త్రమార్గము లెవ్వియుఁ జరుగ వండ్రు। న్యాయపద్ధతి బుధులైన నడువ రండ్రు। కాలగతి వింతయై వచ్చెఁ గంటె నేఁడు॥ మ॥ హరిఁ జూడన్నరుఁ డేగినాఁడు నెల లేఁడయ్యెం గదా రారు కా। లరు లెవ్వారును యాదవుల్ సమదలోలస్వాంతు లీవేళను। స్థిరులై యుండుదు రా మురారి సుఖియై సేమంబుతో నుండునా। యెఱవై యున్నది చిత్త మీశ్వరకృతం బెట్లో కదే మారుతీ॥ క॥ మానసము గలఁగుచున్నది। మానవులు బహుదుర్నిమిత్తసుర్యాదలు స। న్మానవదేహక్రీడలు। మానవిచారింప నోపు మాధవుఁ డకటా॥ క॥ మనవులు సెప్పక ముందఱ। మనదాత

* విన్యస్తాసనుండై ॥ యోగశాస్త్రోక్తక్రమంబుగ, స్వస్తిక-సిద్ధ-మయూరాద్యాసనంబులు గలవాఁడై.
§ ప్రాణంబుల నియమించి ॥ రేచక-పూరక-కుంభకములచేఁ బ్రాణాయామము నొనర్చి. — ¶ కొఱడు చందంబున ॥ స్థాణువువలె, మోడువలె.

ప్రాణరాజ్యమాన శ్రీల నెమ్మనుపు మననియా దేవుఁడు మనమునఁ దలఁపోసి మది చెమ నలంగరుణ్క॥ క॥ నారదుఁ డాడినపై
వడిఁ గ్రూరపు కాలంబు వచ్చెఁ గుంభినిమీఁదన్ । ఘోరములగు నుత్పాతము, లారభటిం జూడఁబడియె నని నిజకంఠే॥ సీ॥ ఒ
పపవా ముందు నొక సారమేయంబు మొఱఁగుచున్నది మోరయెత్తి । యాదిత్యుఁ డుదయించ నభిముఖంబై నక్క వాపో
యెమంటలు నాఁతఁగలుగ । మిక్కిలియియన్న వి మెఱసి గృధ్రములు గర్దభములు దీర్ఘక్రమముకొనియెను తత్తమాశ్వములకును
దయించుఁ గన్నీరు మత్తగజంబులమదములుడిగెఁ । గాలు దూతభంగిఁ గదిసెఁ గపోతము । వంశదగ్ని హోమమందిరము
లఁ । జుట్టుఁ బొగలు దిశల సొరదినాచ్ఛాదించెఁ । దరణిమాసెఁ జూడుమ ధరణిగదలె॥ క॥ వాతములు విసరి రేణు । వ్రాతము
లాకసముఁ గప్పె వడిసుడిగొవిని । ర్ఘాతములు వడియె ఘనసం । ఘాతంబులు రక్తవర్షకలితములయ్యెన్॥ క॥ గ్రహములు వో
రాడెడినా । గ్రహములు వినఁబడియె భూతకలకలములు దు । స్సహములగు చు శిఖికీలా । వహములక్రియఁ దోఁచెఁ గగనవసు
ధాంతరముల్॥ క॥ దూడలు గుడువవు చన్నులు । దూడలకున్ గోవులీవు దుగ్ధములాడలం । బీడలు మానవు పశువులు । గూడ వృష
షభములు దరపి కుట్టిలనెక్కెన్॥ క॥ కదలెడు వేల్పుల రూపులు । వదలెడుఁ గన్నీరు వానివలనం జమటల్ । వొదలెడిఁ బ్రతి
మలు వెలిఁ జని । మెదలెడి నెక్కొట్టఁకకఁ గుడిని మేదినియందున్॥ క॥ కాకంబులు వాపోయెడి । ఘూకంబులు నగరఁ బగలు గుం
ఢ్రలు గొలిపెన్ । లోకంబులు విభ్రష్ట । శ్రీకంబుల గతి నశించి శిథిలములయ్యెన్॥ మ॥ యవపద్మాంకుశ చాప చక్ర ఝష రే
ఖాలంకృతంబై నమాధవు పాదద్వయ మింక మెట్టెడు పవిత్రత్వంబు నేఁడాదిగా । నవనీకాంతకు లేదు పోనలిన దీయాం
గంబు వామాక్షి చా । హువులాకంపమునొందుచుండు నిలకే యుగ్రస్థితుల్వచ్చు నో॥ వ॥ మఱియు నుత్పాతంబులు
పెక్కులు పుట్టుచున్న యవి మురాంతకుని వృత్తాంతంబు వినరాదని కుంతీసుతాగ్రజుండు భీమునితో విచారించు సమయంబున.

⟶ శ్రీ అర్జునుండు ధర్మజునకుఁ గృష్ణనిర్యాణంబు సెప్పుట. శ్రీ ⟵

క॥ ఖేదమున నింద్రసూనుఁడు । యాదవపురినుండి వచ్చి యగ్రజుఁ గనితత్పాదములనయనసలిలోత్పాదకుఁడై పడియె దీన
భంగిన రేంద్రా॥ క॥ పల్లటిలిన యుల్లముతోఁ దల్లడపడుచున్న పిన్నతమ్మునిఁ గని వెల్వెల్లనగు మొగముతో జనుఁ డెల్లను
వినధర్మపుత్రుఁ డిట్లని పలికెన్॥ సీ॥ మాతామహుండైన మనశూరుఁడు వాఁడె మంగళమే మన మాతులునకు । మోద మే
నలుగురు ముగురు మేనత్తల కానంద మే వారి యాత్మజులకు । నక్రూర కృతవర్మలాయున్నమేతులే జీవితుఁడే యుగ్రసేనవి
భుఁడు । గల్యాణయుక్తులే గద సారణాదులు మాధవు తమ్ములు మానధనులు । నంద మేమన సత్యకనందనునకు । భద్రమే శంబ
రాసుర భంజనునకుఁ । గుశలమే బాణదనుజేంద్ర కూఁతుఁ బతికి । హర్ష మే పార్థ ముసలికి హలికి బలికి॥ వ॥ మఱియు నంధక మ
ధుయదు భోజ దాశార్హ వృష్ణి సాత్వతులని యెడి వంశంబుల వీరులును హరికుమారులైన సాంబసుషేణ ప్రముఖులును నా
రాయణానుచరులైన యుద్ధవాదులును గృష్ణసహచరులైన సునందనందాదులును నియందలునడిగి ధర్మజుండు గ్రస్మ యనిల్ల
నియె॥ సీ॥ వైకుంఠవాసుల వడువున నెవ్వని బలమున నానందభరితులగుచు । వెఱువక యాదవవీరులు వర్తింతు రమరులు గొ
లువుండునట్టి కొలువు । చవి కెనాకర్షించి చరణసేవకులైన బంధుమిత్రుల పాదయుగము । నెవ్వఁడు ద్రొక్కించె నింద్ర
పీఠము మీఁద వజ్రంబు ఝళిపించి వ్రాలువాని । ప్రాణవల్లభకెంగేలఁ బామ చేసి । యమృతజలముల బోషింపనలరు పారి
జాతమెవ్వఁడు గొని వచ్చి సత్యభామ । కిచ్చె నట్టి మహాత్మునకిపుడు శుభమె॥ శా॥ అన్నా ఫల్గున భక్తవత్సలుఁడు బ్రహ్మ
ణ్యుండు గోవిందుఁ డాపన్నానీక శరణ్యుఁ డీశుఁడు జగద్భద్రానుసంధాయి శ్రీమన్నవ్యాంబుజపత్ర నేత్రుఁడు సుధర్మా
మధ్యపీఠంబునం । దున్నాఁడా బలభద్రుఁ గూడి సుఖియై యుత్సాహియై ద్వారకన్॥ క॥ ఆరామ కేశవులకు । న్నారామలభ
క్తి నీవు సలుపుదువు గదా । గారాములు సేయుదురా । పోరాముల బంధులెల్ల ప్రొద్దుజితారీ॥ శా॥ మున్ను గ్రాటవిలో వరా
హమునకై ముక్కంటితోఁ బోరుచోఁ । సన్నాహంబునఁ గాలకేయుల వడింజక్కాడుచోఁ బ్రాభవస్ఫూర్తిం జైచను కౌర
వేంద్రు పనికై గంధర్వులం దోలుచోఁ । గన్నీ రెన్నఁడు దేవుతండ్రి సెపుమా కల్యాణమే చక్రికిన్॥ అదియునుం గాక॥ క॥ ఓ
డితివో శత్రువులకు । నాడితివో సాధుదూషణాలాపంబుల్ । గూడితివో పరసతులను । వీడితివో మానధనము వీరులనడు
మన్॥ క॥ తప్పితివో యిచ్చెదనని । చెప్పితివో కపటసాక్షి సేసినమేలుం । దప్పితివో శరణార్థుల । రొప్పితివో ద్విజులఁ బసుల
రోగుల సతులన్॥ క॥ అడిచితివో భూసురులను । గుడిచితివో బాలవృద్ధగురువులు వెలిగా । విడిచితివో యాశ్రితులను । ముట్టి
తివో పరుల విత్తములు లోభమునన్॥ వ॥ అని పలికిన నంగన్నీరు కరతలంబున దుడిచికొనుచు గద్గదస్వరంబున మహానిధిం
గోలుపోయిన పేదచందంబున నిట్టూర్పులు నిగుడించుచు నర్జునుఁ డన్నకిట్లనియె॥ క॥ ఘన సారథి మన సచివుఁడు । ఘనవి

య్యామునసఖుండుమనబాంధవుఁడుర్ । మనవిభుఁడుగురుఁడు దేవర । మనలనుదిగనాడిచనియెమనుజాధీశా ॥ క ॥ కం
టకపున్నృపులుసూడఁగ । మింటఁగంపించుయంత్రమీనముఁగోల్తర్ । గెంటించిమనముదగవా । ల్గంటింజేకొంటిమతనికరు
ణనకాదే ॥ క ॥ దండిననేకులతోనా । ఖండలుఁడెదురయినగెలిచిఖాండవవనముం । జండార్చికినర్పించిన । గాండీవమునిచ్చెఁ
జక్రిగెలుపుటనధిపా ॥ క ॥ దిక్కులరాజులనెల్లను । మ్రొక్కించిధనంబుగొనుటమయకృతసభము । నెక్కుటజన్నముసే
యుట । నిక్కముహరిమనకుదండనిలచినఁగాదే ॥ మ ॥ ఇభజిద్వీర్యమఖాభిషిక్తమగునీయిల్లాలిధమ్మిల్లము । సభలోశా
త్రవులీడ్చితెచ్చినపుడాచంద్రాస్యముఃఖింపఁగా । నభయంబిచ్చిప్రతిజ్ఞఁజేసిభవదీయారాతికాంతాశిరో । జభరశ్రీల
హరింపఁజేవిధవలైసౌభాగ్యములీ్వడఁగర్ ॥ శా ॥ వైరుల్గట్టినపుట్టముల్విడువఁగావారింపనావల్లభుల్ । రారీవేళనుప్రే
క్షసేయఁదగవేరావేసివారింపవే । లేరేత్రాతలుగృష్ణయంచుసభలోలీనాంగియైకుయ్యిడం । గారుణ్యంబునభూరివస్త్ర
కలితంగాఁజేయఁడేద్రోవదిర్ ॥ సీ ॥ దూర్వాసుఁడొకనాఁడుదుర్యోధనుఁడువంపఁబదివేలశిష్యులుభక్తిఁగొలువఁ । జను
దెంచిమనముపాంచాలియుఁగుడిచినవెనుకనాహారంబువేడికొనినఁ । బెట్టెదననవుడుఁబెట్టకున్నశపింతుననుచుఁదోయా
వగాహమునకేఁగఁ । గడవలనన్నశాకములుదీరుటఁజూచిపాంచాలపుత్రికపర్ణశాల । లోనఁదలఁచినవిచ్చేసిలోపలిలోని । శి
ష్టశాకాన్నలవముఁబ్రాశించితపసి । కోపముడిగించిపరిపూర్ణకుక్షిఁజేసె । నిట్టిత్రైలోక్యసంతర్పియెందుఁగలఁడు ॥ సీ ॥ పం
దికైపోరాడఫాలాక్షుఁడెవ్వనిబలముననాకిచ్చెఁబాశుపతము । నెవ్వనిలావుననీమేనదేవేంద్రుపీఠార్థముననుండుపెం
పుఁగంటి । గాలకేయనివాతకవచాదిదైత్యులఁజంపితినెవ్వనిసంస్మరించి । గోగ్రహణమునాఁడుగురుకులాంభోనిధిఁగడ
చితినెవ్వనికరుణఁజేసి । కర్ణసింధురాజకౌరవేంద్రాదుల । తలలపాగలెల్లఁదడిచితెచ్చి । యేమహాత్ముబలిమినిచ్చితివిరటు
నిపుత్రియడుగబొమ్మసాత్తికలకు ॥ మ ॥ గురుభీష్మాదులుగూడిపన్నినకురుక్షోణీశచక్రంబులో । గురుశక్తిర్ రథయంత
యైనెగలపైఁగూర్చుండియానేటినా । శరముల్వారకమున్నవారలబలోత్సాహాతిరేకంబున । త్వరతంజూడ్కులసంహ
రించునమితోత్సాహంబునాకిచ్చుచుర్ ॥ మ ॥ అసురేంద్రుండొనరించుకృత్యములుప్రహ్లాదుంబ్రవేశించిగెల్వసమర్థంబు
లుగానికైవడిఁగృపాశ్వత్థామగాంగేయసూర్యసుతద్రోణధనుర్విముక్తబహుదివ్యాస్త్రప్రపంచంబునా । దెసకుర్
రాకఁద్రోలంగుమాధవుఁదయాదృష్టిన్నరేంద్రోత్తమా ॥ చ ॥ వసుమతిదివ్యబాణములవ్రక్కలువాపికొలంకుసేసినా । ర
సములమాటుగాఁబలుపిరథ్యములర్ రిపులెల్లఁజూడసాహసముననీటఁబెట్టితిరణావనిసైంధవుఁజంపునాఁడునా । కసురవి
రోధిభద్రగతినండయివచ్చినఁగాదెభూవరా ॥ సీ ॥ చెలికాఁడరమ్మనిచీరుననొకవేళమన్నించునొకవేళమఱఁదియనుచు ।
బంధుభావంబునఁబాటించునొకవేళదాతయైయొకవేళధనములిచ్చు । మంత్రియైయొకవేళమంత్రమాదేశించుబోధియై
యొకవేళబుద్ధిసెప్పు । సారథ్యమొనరించుఁజనుపిచ్చునొకవేళగ్రీడించునొకవేళగేలిసేయు । నొకకౌఁగయయ్యాసనంబున
నుండుగన్న । తండ్రికైవడిఁజేసినతప్పుఁగాచు । హస్తములువట్టిపొత్తుననారగించు । మనుజవల్లభమాధవుమఱువరాదు ॥
క ॥ విజయధనంజయహనుమ । ద్ధ్వజఫల్గునపార్థపాండుతనయనరమహేం । ద్రజమిత్రార్జునయంచును । భుజములుతలఁగ
డవరాకపొక్కలఁజీఱుర్ ॥ క ॥ వారిజగంధులుదమలో । వారింపఁగరానిప్రేమవాదముసేయర్ । వారిజనేత్రుఁడుననుఁద
గవారింపకకుసుమపునలుకవారింపనృపా ॥ క ॥ నిచ్చలులోపలికాంతలు । మచ్చికఁదనతోడనాడుమాటలునాకుర్ । ముచ్చ
టలుసెప్పమెల్లన । విచ్చలవిడిఁదొడలమీఁదవిచ్చేసినృపా ॥ చ ॥ అటమటమయ్యెనాభజనమంతయుభూవరనేఁడుసూడు
మా । యిటువలెగారవించుజగదీశుఁడుగృష్ణుఁడులేనిపిమ్మటం । బటుతరదేహలోభమునఁబ్రాణములున్నవివెంటఁబోక
నేకటకటపూర్వజన్మమునఁగర్మములెట్టివిచేసినాఁడనో ॥ శా ॥ కాంతారంబుననొంటిఁదోడుకొనిరాఁగాఁజూచిగోవిం
దుశు । ద్ధాంతస్త్రీలఁబధాలువేలమదరాగాయత్తులైతాఁకినా । చెంతర్ బోయలుమూఁగిపట్టికొననాసీమంతినీసంఘ
ముర్ । భ్రాంతిన్స్వామినిభంగిసంటవిడిపింపన్లేకధాత్రీశ్వరా ॥ శా ॥ ఆతేరారథికుండునాహయములాయస్త్రాసనంబా
శరా । వ్రాతంబన్యులఁదొల్లిఁజంపుమఁదుర్ వ్యర్థంబులైపోయెఁబా । జేతోధీశుఁడుచక్రిలేమిభసితక్షిప్తాజ్యమాయాని
మా । యాతంత్రోపరభూమిబీజములమర్యాదన్నిమేషంబునర్ ॥ మ ॥ యదువీరుల్మునినాథశాపమునఁగాలాధీనులై
యందుర్ । మదిరాపానవివర్ధమానమదసమ్మర్దోగ్రదోషాంధులై । కదనంబుల్దమలోనముష్టిహతులంగావించిలేరైరి
న । ష్టుడశంజిక్కిరినల్గురేవురచటన్సర్వంసహావల్లభా ॥ క ॥ భూతములవలననెప్పుడు । భూతములకుజన్మమరణపోషణముల్
వి । ర్ణీతములుసేయుచుండును । భూతమయుండీశ్వరుండుభూతశరణ్యా ॥ క ॥ బలములుగలమీనంబులు । బలవిరహితమీ

ములనుభక్షించుక్రియ। న్బలవంతులయినయదువులు।బలరహితులఁజంపిరహితభావములన్నృపా॥. మ॥ బలహీనాంగుల
కున్బలాధికులకుం బ్రత్యర్థిభావోద్యమం। బులుగల్పించివినాశము న్నెరపియీభూభారముంబాపిని। శ్చలబుద్ధిన్గృతకా
ర్యుఁడై చనియెనాసర్వేశ్వరుండచ్యుతుం।డలఘుండేమనిచెప్పుదున్భగవదీయాయత్తమూర్వీశ్వరా॥. వ॥మఱియుదేశకా
లార్థయుక్తంబులు నంతఃకరణసంతాప శమనంబులునయిన హరివచనంబులం దలంచిచిత్తంబుపరాయత్తంబై యున్న
దనియన్నకుం జెప్పినిరుత్తరుండై గోవిందచరణారవిందచింతామలబుద్ధియై శోకంబువర్జించి సదాధ్యానభక్తివిశేషంబు
లం గామక్రోధాదులజయించితొల్లి తనకుభయసేనామధ్యంబుననంతుండానతిచ్చినగీతంబులుదలంచి కాలకర్మభోగా
భినివేశంబులచేత నావృతంబయినవిజ్ఞానంబు గ్రమ్మఱనధిగమించిశోకహేతువహంకారమమకారాత్మకంబయినద్వై
తభ్రమంబనియును ద్వైతభ్రమంబునకుఁగారణంబు దేహంబనియును దేహంబునకుబీజంబులింగంబనియునులింగంబున
కుమూలంబుగుణంబులనియునుగుణంబునకునిదానంబుప్రకృతియనియును బ్రహ్మోహమనియెడుజ్ఞానంబునలీనయై ప్రకృ
తిలేకుండుటయనైర్గుణ్యంబనియును నైర్గుణ్యంబువలనఁగార్యలింగనాశనంబనియును గార్యలింగనాశనంబుననసంభ
వంబగుననియును బ్రకృతింబాసి క్రమ్మఱస్థూలశరీరప్రాప్తుండుగాక పురుషుండు సమ్యగ్భోగంబునను౦డుననియును
నిశ్చయించియర్జునుండువిరక్తుండై యూరకుండె ధర్మజుండుభగవదీయమార్గంబుదెలిసి యాదవులనాశంబువిని నారదు
వచనంబులఁదలంచినిశ్చలచిత్తుండై స్వర్గగమనంబునకుయత్నంబు సేయుచుండెనాసమయంబున॥. క॥యదువులనాశ
ముమాధవు। పదవియువినికుంతివిమలభక్తిన్ భగవ।త్పదచింతాతత్పరయై। ముదమునసంసారమార్గమునకుంబాసెన్॥.
వ॥ఇట్లుకంటకంబునంగంటకోన్మూలనంబు సేసికంటకంబుల రెంటింబరిహరించువిన్నాణి తెఱంగునయాదవరూపశరీరం
బునంజేసియీశ్వరుండులోకకంటకశరీరంబులుసంహరించినిజశరీరంబువిడిచెసంహారంబునకునిజశరీరపరశరీరంబులు
రెండునీశ్వరునకుసమంబులునిజరూపంబుననుండుచురూపాంతరంబులుధరియించి క్రమ్మఱనంతర్ధానంబునొందునటుని
కైవడిలీలాపరాయణుండైన నారాయణుండుమీనకూర్మాదిరూపంబులధరియించుంబరిహరించుననిచెప్పుమఱియునట్ల
యె॥.క॥ఏదినమునవైకుంఠుఁడు।మేదినిపైఁదాల్చినట్టిమేనువిడిచెనాఁ।డాదినమునననశుభప్రతి।పాదకమగుకలియుగంబు

——శ్రీ ధర్మరాజుపరీక్షిన్మహారాజునకుఁబట్టముగట్టిమహాప్రస్థానంబునకరుగుట. శ్రీ——

ప్రాప్తంబయ్యెన్॥. సీ॥కలివర్తనంబునఁగ్రౌర్యహింసాసత్యదంభకౌటిల్యాద్యధర్మచయము।పురములగృహములభూ
ములఁదనలోనఁగలుగుటఁదలపోసికరిపురమున।మనుమనిరాజువై మనుమనిదీవించిసింధుతోయకణాభిషిక్తుఁజేసి।యనిరు
ద్ధనందనుండైనవజ్రునిఁదెచ్చిమధురఁబట్టముగట్టిమమతఁబాసి । కరులఁదురగములనుగంకణాదికముల । మంత్రిజనుల
బుధులమానవతుల।నఖిలమయినధనములభిమన్యుసుతునకు।నప్పగించిబుద్ధినాశ్రయించి॥. వ॥ విరక్తుండయినధర్మనంద
నుండు ప్రాజాపత్యమనియెడియిష్టిఁగావించి యగ్నులనాత్మారోపణంబు సేసి నిరహంకారుండును,నిర్దళితాశేషబంధ
నుండునై,సకలేంద్రియంబులమానసంబుననడంచి ప్రాణాధీనవృత్తియగుమానసంబుం బ్రాణమందుఁ,బ్రాణమునపాన
మునందు, నుత్సర్గసహితంబయినయపానమునున్మృత్యువందును, మృత్యువును బంచభూతంబులకునైక్యంబయినదేహం
బునందును, దేహమునుగుణత్రయంబునందును, సర్వారోపహేతువగునవిద్యనుజీవునియందు, జీవుండయినతన్నునవ్య
యంబయినబ్రహ్మమందునులయింపఁజేసి బహిరంగవ్యాపారంబులవిడిచి నారచీరలుధరియించిమౌనియునిరాహారుం
డునుముక్తకేశుండునై యున్మత్తపిశాచబధిరజడులచందంబుననిరపేక్షుత్వంబున॥. క॥ చిత్తంబున బ్రహ్మమునా।వృత్త
ముఁగావించుకొనుచువిజ్ఞానధనా।యత్తులుదొల్లి వెలింగెడు।యుత్తరదిశకేగెనిర్మలోద్యోగమునన్॥. సీ॥అంతనాతనిత
మ్ములనిలపుత్రాదులుగలిరాకచేఁబాపకర్ములగుచుఁ।జరియించుప్రజలసంచారంబులీక్షించియఖిలధర్మంబులనాచరించి।
వైకుంఠచరణాబ్జవర్తితహృదయులై తద్భక్తినిర్మలత్వమునఁజెంది। విషయయుక్తులకుఁబ్రవేశింపఁగారాకనిర్ధూతకల్మ
షనిపుణమగుచు ।.బహుళవిజ్ఞానదావాగ్నిభసితకర్ములైనయేకాంతులకులక్ష్యమై వెలుంగు।ముఖ్యనారాయణస్థానము
నకుఁజనిరి।విగతరజస్సైనయాత్మలవిప్రవర్య॥. వ॥ అంతవిదురుండుప్రభాసతీర్థంబునహరియందుఁజిత్తంబు సేర్చిశరీరం
బువిడిచిపితృవర్గంబుతోడదండధరుండగుటంజేసినిజాధికారస్థానంబునకుంజనియె.ద్రుపదరాజపుత్రిపతులవలననుపేక్షి
తయైజగత్పతియైనవాసుదేవునందుఁజిత్తంబుఁజేర్చితత్పదంబుసేరెనిట్లు॥. క॥పాండవకృష్ణులయానము।పాండురమతి
నెవ్వఁడైనఁబలికినవిన్నన్।ఖండితభవుఁడైహరిదా।సుండైకైవల్యపదముసొచ్చునరేంద్రా॥. వ ॥ అంతటంబరీక్షిత్తు-

మారుండును జాతకర్మవిదులైనపెద్దలు చెప్పినచందంబునభూసురోత్తమశిక్షావశంబునమహాభాగవతుండై ధరణీపాలనంబు సేయుచునుత్తరునిపుత్త్రికనిరావతియనుమత్తకాశినింబెండ్లియాడిజనమేజయప్రముఖులయిననలువురుకొడుకులనుత్పాదించిగంగాతటంబునఁగృపాచార్యుండుగురువై యుండయాగభాగంబులకు వచ్చినదేవతలనీక్షించుచుభూరిదక్షిణంబులుగామూఁడశ్వమేధంబులాచరించి దిగ్విజయకాలంబున గోమిథునంబుఁదన్నుచున్నశూద్రుండును రాజచి

### శ్రీ పరీక్షిన్మహారాజుదిగ్విజయంబునభూధర్మదేవతలసంవాదంబాలించుట. శ్రీ

హ్నముద్రితుండునగుకలింబట్టినిగ్రహించెననిచెప్పినశౌనకుండుపౌరాణికునకిట్లనియె॥ క ॥ భూవరరూపపుశూద్రుఁడుఁగోవుండానేలదన్నఁగోరిపరీక్షిద్భూవరుఁడుదిశలఁగెలుచుచు । నేవిధిఁగలినిగ్రహించెనెఱిఁగింపఁగదే॥ మ॥ అరవిందాక్షపదారవిందమకరందాసక్తులైనట్టిస । త్పురుషశ్రేష్ఠులవృత్తముల్వినకదుర్బుద్ధిన్విలంఘించిము । ర్నరవార్తాకథనప్రపంచములుగర్ణప్రాప్తములుసేసివా । సరముల్ వ్యర్థతఁద్రోచుచుండజనదీసంసారమోహంబునన్॥ సీ॥ మనుటనిత్యముగామమరణంబునిజమనియెఱిఁగిమోక్షస్థితినిచ్ఛయించు । నల్పాయులగుమాకునట్టిమర్జనచరిత్రములలోలిఁగర్ణరంధ్రములఁబెట్టి । బంగారువంటియీరాత్రికెడుకాలంబువోనాడఁగానేలపుణ్యచరిత । మాధవపదపద్మమకరందపానంబు సేయింప వేమేము సేయునట్టి । సత్త్రయాగమునకుసన్మునీంద్రులుచీఱ । వాఁడెదండధరుఁడువచ్చెఁజూడు । చంపఁడొకనినైనఁజన్నమయ్యెడుదాఁక । వినుచునుండుఁదగిలివిష్ణుకథలు॥ క ॥ మందునకుమందబుద్ధికి । మందాయువునకునిరర్థమార్గములనుగో । విందచరణారవిందమ । రందముగొనఁదెలిపిలేదురాత్రింబవలున్॥ వ॥ అనిశౌనకుండువలికినసూతుండిట్లనియెఁబరీక్షిన్నరేంద్రుండునిజవాహినీసందోహసంరక్షితంబగుకురుజాంగలదేశంబునంగలిప్రవేశంబునాకర్ణించియుద్ధకుతూహలతనంగీకరించియొక్కనాఁడుసముల్లాసంబునబాణాసనంబుఁగైకొనినీలనీరదనిభతురంగనివహయోజితంబునుఫలితమనోరథంబునైనరథంబునారోహణంబుచేసిమృగేంద్రధ్వజంబువెలుంగరథకరితురంగసుభటసంఘటితచక్రంబునిర్వక్రంబునంగొలువదిగ్విజయార్థంబువెడలిపూర్వదక్షిణపశ్చిమోత్తరసముద్రలగ్నంబులైనయిలావృతరమ్యకహిరణ్మయహరివర్ష కింపురుషభద్రాశ్వకేతుమాలభారతవర్షంబులునుత్తరకురుదేశంబులునుజయించిపుష్కలధన । ప్రధానపూర్వకయగుసపర్యలనభ్యర్చితుండైతత్తద్దేశమంగళపాఠకసంఘాతజేగీయమానపూర్వరాజవృత్తాంతంబులాకర్ణించుచుఁబారకపఠితపద్యంబులంచుఁబాండవులకుభక్తవత్సలుండైనపుండరీకాక్షుండాచరించినసారథ్యసఖ్యసభాపతిత్వసాచివ్యరచనవీరాసనదూతభావాదికర్మంబులునశ్వత్థామాస్త్రతేజంబువలనఁదనురక్షించుటయుయాదవపాండవులందలిస్నేహానుబంధంబునువారలకుఁగలిగినభగవద్భక్తివిశేషంబువిశ్వంభరత్వంబునువినియాశ్చర్యంబునొందుచువందిబృందంబులకుమహాధనంబులగుహారాంబరాభరణసందోహంబులనొసంగుచుఁబద్మనాభపాదపద్మభజనపరతంత్రపవిత్రమానసుండైయుండెనయ్యెడవృషభరూపంబునేకపాదంబునసంచరించుధర్మదేవుండుదనసమీపంబునలేగలేనికుఱ్ఱిచందంబునహతప్రభయైనేత్రంబులసలిలంబులుగురియుచుగోరూపధరయైయున్నధాత్రికిట్లనియె॥ మ॥ నయనాంభఃకణజాలమేలవిశువన్నాతల్లినీమేనుసా । మయమైయున్నదిమోమువాడునదినీమన్నించుచుట్టాలకున్ । భయదుఃఖంబులునేఁడువొందవుగదాబంధించిశూద్రుల్పద । త్రయహీనున్ననుఁబట్టవత్తురనియోతాపంబునీకేటికిన్॥ సీ॥ మఖములలేమినమర్త్యులకిటమీఁదమఖభాగములులేకమానుననియొ । రమణులురమణలరక్షింపరనియొపుత్త్రులఁదల్లిదండ్రులుప్రోవరనియొ । భారతిగుజనులఁబ్రాపించుననియొసద్విప్రులన్నృపులుసేవింపరనియొ । కులిశహస్తుఁడువానగురియింపకుండఁగఁబ్రజలుదుఃఖంబులఁబడుదురనియొ । హీనవంశజాతులేలెదరనియొరా । జ్యములుపాడిగలిగిజరుగవనియొ । మనుజులన్నపానమైథునశయనాస । నాదికర్మసక్తులగుదురనియొ॥ మ॥ జననీనీభరమెల్లడింపుటకునైచక్రాయుధుండిన్నిహా । యనముల్గేలినరాకృతిన్మెలఁగినిత్యానందముంజేసిపో । యిననేనింకననాథనైతిఁగుజనుండెవ్వాఁడుశాసించునో । పెనుదుఃఖంబులఁబొందఁగంటిననియోభీతిల్లిచింతించుటల్॥ క॥ దెప్పరమగుకాలముచే । నెప్పుడుదేవతలకెల్లనిష్టంబగునీ । యొప్పిదముగృష్ణుఁడరిగినఁ । దప్పెఁగదాతల్లినీవుదల్లడపడఁగన్॥ అనినభూదేవియిట్లనియె॥ క॥ ఈలోకంబునఁబూర్వము । నాలుగుపాదములనీవునడుతువునేఁడా । శ్రీలలనేశుఁడులేమిని । గాలముచేనీకునొంటికాలయ్యెఁగదే॥ వ॥ మఱియునుసత్యశౌచదయాక్షాంతిత్యాగసంతోషార్జవంబులునుశమదమతపంబులునుసామ్యంబును బరాపరాధసహనంబునులాభంబుగలయెడనుదాసీనుండైయుండుటయునుశాస్త్రవిచారంబునువిజ్ఞానవిరక్తులునైశ్వర్యశౌర్యప్రభాదక్షత్వంబులునుస్మృతి

యును స్వాతంత్ర్యమును గౌశలకాంతి ధైర్యమార్దవ ప్రతిభాతిశయ ప్రశ్రయశీలంబులును జ్ఞానేంద్రియకర్మేంద్రియమనోబలంబులును సౌభాగ్యగాంభీర్యంబులును స్థైర్యశ్రద్ధాకీర్తిమానగర్వాభావంబులు ననియెడి ముప్పదితొమ్మిది గుణంబులును నవియును నంగాక బ్రహ్మణ్యతా శరణ్యతాది మహాగుణసమూహంబును గృష్ణదేవుని యందు వర్తించుఁ గావున॥ క॥ గణనాతీతములగు సద్గుణములు గలచక్రి సనిన ఘోరకలి ప్రే। రణమునఁ బాపము సేయుచు। ప్రణయయుతులగు జనులఁ జూచి వగచెదఁ దంద్రీ॥ క॥ దేవతలకు ఋషులకుఁ బిత్రు। దేవతలకు నాకు నీకు ధీరులకును నా। నావర్ణాశ్రమములకును। గోవులకును బాధ యనుచుఁ గుందెద నఘా॥ సీ॥ బ్రహ్మమ లెవ్వని భద్రకటాక్షవీక్షణము వాంఛింతురు సత్తపములఁ। గమలాలయము మానికమల యెవ్వని పాదకమలంబు సేవించుఁ గౌతుకమున। భవ్యచిత్తమున నంబరమయోగీంద్రులు నిలుపుదురెవ్వని నియతితోడ। వేదంబు లెవ్వని విమలచారిత్రముల్ వినుతింపఁగా లేక వెగడువడియె। నట్టివాసుదేవు నబ్జవజ్రాంకుశ। చక్రమీనశంఖచాపకేతు। చిహ్నితంబులైన శ్రీచరణములింక। సోఁకవనుచు వగపు సోఁకెనయ్య॥ క॥ హరిపాదంబులు సోఁకెడి। సిరికతమున నఖిలభువనసేవ్యత్వముతో। స్థిరనై తిని న్ని దినములు। హరినాగర్వంబు మాన్పి యరిగె మహాత్మా॥ క॥ లీలాకారము దాల్చెను। శ్రీలలనేశుండు ఖలుల శిక్షించి భవో।న్మూలనము సేయుకొఱకును। నాలుగు పాదముల నన్ను నడిపించుటకున్॥ ఉ॥ ఆమధురోక్తులా నయములా దరహాసములా దయారసం। బామురిపెంబులా తగవులా గమనక్రియలా మనోహర। ప్రేమకరావలోకనము ప్రీతిఁ గనుంగొనలేమి మాధవుం। గామినులేల నిర్దళితకర్ములు యోగులు వాయనేర్తురే॥ క॥ మెల్లన నాపై యాదవ। వల్లభుఁ డడుగిడఁగ మోహవశనై నేరం। జిల్లఁగ రోమాంచముక్రియ। మొల్లములై మొలుచు సస్యములు మార్గములన్॥ వ॥ అని యిట్లు పూర్వవాహిని యైన సరస్వతీతీరంబున ధర్మదేవుండును భూమియు వృష

## ❀. కలిపురుఁడు ధర్మదేవతను దన్నుట. ❀

భధేనురూపంబుల భాషింప రాజఋషి యైన పరీక్షిన్మహీవరుండు డగ్గరియె నాసమయంబున॥ శా॥ కైలాసాచలసన్నిభంబగు మహాగంభీరగోరాజము। న్గాలక్రోధుఁడు దండహస్తుఁడు నృపాకారుండు క్రూరుండు జం। ఘాలుండొక్కఁడు శూద్రుఁడా సురగతిం గారుణ్యనిర్ముక్తుఁడై। నేలం గూలఁగఁ దన్నెఁ బండితిలఁగా నిర్ఘాతపాదాహతిన్॥ శా॥ ఆలోలాంగక నస్రుతతోయకణజాలాక్షిన్ మహాంభారవన్। బాలారూఢతృణావళీకబళలోభవ్యాప్తజిహ్వాగ్రనాం। దోశస్వాంతన జీవవత్సను దయద్దుఃఖాన్వితన్ ఘర్మకీ।లాలాపూర్ణశరీర నా మొదవు నుల్లంఘించితన్నేఁ వడిన్॥ వ॥ ఇట్లా ధేను వృషభంబుల రెంటినిం గంటకుండై తన్నుచున్న రాజలక్షణముద్రితుండైన శూద్రునిం జూచి సువర్ణపరికరస్యందనారూఢుండగు నభిమన్యునందనుండు గోదండంబు సగుణంబు సేసి మేఘగంభీరవచనంబుల నిట్లనియె॥ శా॥ నిన్నుం గొమ్ములఁ జిమ్మె నొక్కదిసెనో నిర్భీతి మై గోవులం। దన్నం గారణ మేమి మద్భుజసనాథక్షోణి నే వేళలం। దున్నేరంబులు సేయరాదెఱుఁగ వా ధూర్తత్వముల్ భూమిభృ। త్సన్నాహంబు నెనర్చె దెవ్వఁడవు నిన్ శాసించెదన్ దుర్మతీ॥ క॥ గాండీవియుఁ జక్రియు భూ। మండలిఁ బెడఁ బాసి చనిన మదమత్తుఁడవై। దండింపఁదగనివారల। దండించెదు నీవ తగుదు దండనమునకున్॥ అని వృషభంబు నుద్దేశించి యిట్లనియె॥ మ॥ కురుధాత్రీశ్వర బాహువజ్రయుగళీగుప్తక్షమామండలిన్। బరికింపన్ భవదీయనేత్రజనితాంభఃశ్రేణి దక్కన్ జనుల్। దొరుఁగంజూడ రధర్మసంజనితజంతుశ్రేణి బాష్పంబులన్। గురుశక్తిన్ విదళింతుఁ జూడు మితనిన్ గోమూర్తి దేవోత్తమా॥ క॥ జాలిఁబడ నేల నాశర।జాలంబుల పాలు సేసి చంపెద వీనిన్। భూలోకంబున నిను నే। నాలుగు పాదముల నిపుడు నడిపింతుఁ జుమీ॥ ఉ॥ వాచవి యైన గడ్డిఁ దినివాహినులందు జలంబు ద్రావఁగా। నీచరణంబులెవ్వఁడిటు నిర్దళితంబుగఁ జేసెవాఁడు దా। ఖేచరుఁడై నవాని మణికీలితభూషణయుక్తబాహులన్। వేచని త్రుంచివైతు విష్ణువీథికి నేగిన నేలడాగినన్॥ అని మఱియు గోరూపయయిన భూదేవితో నిట్లనియె॥ చ॥ అగణితవైభవుండగు మురాంతకుఁ డెక్కఁడవోయె నంచు నెవ్వఁగల నశించి నేత్రముల వారికణంబులు దేకుమమ్మ లో। వెగడకు మమ్మ మద్విశిఖబృందముల న్వృషలు న్వధింతు నా। మగఁటిమిఁ జూడు నీవెలవు మానఁగదమ్మ శుభప్రదాయినీ॥ క॥ సాధువులగు జంతువులకు। బాధలుగావించు ఖలుల భంజింపని రా।జాధము నాయుస్స్వర్గ। శ్రీధనములు వీటిఁబోవు సిద్ధము తల్లీ॥ క॥ దుష్టజననిగ్రహంబును। శిష్టజనానుగ్రహంబు సేయఁగ నృపులన్। స్రష్టవిధించె బురాణ। ద్రష్టలు సెప్పుదురు పురుషధర్మము సాధ్వీ॥ వ॥ అనిన ధర్మనందనపౌత్త్రునకు వృషభమూర్తి నున్నధర్మదేవుండిట్లనియె॥ ఉ॥ క్రూరులఁ జంపి సాధువులకు న్విజయంబొనరించునట్టియూ। పౌరవవంశజాతుఁడవు భాగ్యసమేతుఁడవౌదు తొల్లి మీ। వారిటువంటివారగుట వారిజనేత్రుఁడు మెచ్చి దౌత్యసం।

చారము సేసెఁగాదె నృపసత్తమ భక్తిలతానుబద్ధుఁడై॥ వ॥ నరేంద్రా యేము ప్రాణులకు దుఃఖహేతువులము గాము మావలన నసుఖంబు నొందెడు పురుషుండు లేఁడు వాదివాక్యభేదంబుల యోగీశ్వరులు మోహితులై భేదంబుల నాచ్ఛాదించి తమకు నాత్మ సుఖదుఃఖంబుల నిచ్చు ప్రభు వని చెప్పుదురు దైవజ్ఞులు గ్రహదేవతాదులకుఁ బ్రభుత్వంబు సంపాదింతురు మీమాంసకులు కర్మంబునకుం బ్రాభవంబుఁ బ్రకటింతురు లోకాయతికులు స్వభావంబునకుఁ బ్రభుత్వంబు వలుకుదురు దెవ్వరికిని సుఖదుఃఖప్రధానంబు సేయఁ బ్రభుత్వంబు లేదు పరులవలన దుఃఖంబు వచ్చిన నధర్మంబు పరులు చేసిర ని విచారింపవలను తర్కింపను నిర్దేశింపను రాని పరమేశ్వరుని వలన సర్వము నగుచుండు ననిన ధర్మదేవునికి ధర్మనందనపౌత్రుం డిట్లనియె॥ గీ॥ ధర్మమూర్తి వయ్య ధర్మజ్ఞ వృషరూప। పరమధర్మ మీవు పలుకు త్రోవ। పాపకర్మ సేయు పాపంబు సూచింపఁ। బాపకర్మకుఁ డేగు పథము వచ్చు॥ వ॥ మఱియు దేవమాయవలన భూతంబుల వాఙ్మనంబులకు వధ్యఘాతుకవృత్తి సులభంబు నందెలియరాదు నీవు ధర్మదేవతవు కృతయుగంబునందు తపశ్శౌచదయాసత్యంబులను నాలుగు నీకుం బాదంబులని చెప్పుదురు త్రేతాయుగంబునఁ బూర్వోక్తపాదచతుష్కంబునందొక్క పాదంబు క్షీణం బయ్యె ద్వాపరంబునం బాదద్వయంబు నశించెఁ గలియుగం బందు నివ్వడువు నిప్పుడు నీకుఁ బాదత్రయంబు భగ్నం బయ్యె నవశిష్టంబగు భవదీయ చతుర్థపాదంబు నధర్మంబు గల్యంతంబున నిగ్రహింపఁగ నుకించుచున్నది వినుమది యునుంగాక॥ క॥ భరమున్బాపి రమావిభుండు గరుణం బాదంబులం ద్రొక్కఁగా। స్థిరమై వేడుక నింత కాలము సుఖశ్రీ నొందియీ భూమి ద। చ్చరణస్పర్శము లేని శూద్రకులజుల్కాసింతురంచున్నరం। తరశోకంబున నీరుఁ గన్నుల నిడెఁ ధర్మజ్ఞ వీక్షించితే॥ వ॥ అని యిట్లు పలుకు ధర్మభూదేవతలఁ బుజ్జగించి మహారథుండయిన విజయపౌత్రుండు గ్రొక్కాఱు మెఱుంగు తెఱంగున నధిక్కరించి దిక్కుల వెక్కసంబయిన యడిదంబు బెడిదంబుగ జడిపించి పాపహేతువయిన కలిరూపు మాపను ద్యోగించిన వాఁడు రాజరూపంబుడిగి వాడిన మొగంబుతోడ భయవిహ్వలుండయి హస్తంబులు సాఁచి సత్పాదమూలవిన్యస్తమస్తకుండయి ప్రణామంబు సేసె॥ క॥ గంపించె దేహ మెల్లం। జంపకుమో రాజతిలక శరణాగతుర। క్షింపుము నితనకు మ్రొక్కినఁ। జంపక కలిఁ జూచి నగుచు జనపతి వలికెన్॥ క॥ అర్జునకీర్తిసమేతుం। డర్జునపౌత్రుండు భయరసావృతజనులన్। నిర్జితులఁ జంపనొల్లఁడు। దుర్జనభావంబు విడిచి తొలఁగు దురాత్మా॥ వ॥ నీవు పాపబంధుండవు మదీయ బాహుపాలితంబయిన మహీమండలంబున నిలువవలవదు రాజదేహంబులందు వర్తించు నిన్ను ననస్త్యలోభచౌర్యదౌర్జన్యదురాచారమాయా కలహకపటకలుషాలక్ష్మ్యాదిధర్మేతరసమూహంబు లాశ్రయించు సత్యధర్మంబులకు నివాసంబగు బ్రహ్మావర్తదేశంబున యజ్ఞవిస్తారనిపుణులయిన వారు యజ్ఞేశ్వరుండయిన హరిం గూర్చి యాగంబు సేయుచున్న వారు యజించువారలకు సుఖప్రదానంబు సేయుచు సకలభూతాంతర్యామియై భగవంతుండయిన హరి జంగమస్థావరంబులకు నంతరంగబహిరంగంబుల సంచరించు వాయువుచందంబున నాత్మరూపంబున మనోరథంబుల నిచ్చుం గావున నిం దుండవలవదనుచు దండహస్తుండయిన జమునికైవడి మండలాగ్రంబు సాఁచిన రాజునకుం గలి యిట్లనియె॥ క॥ జగతీశ్వర నీయడిదము। ధగధగితప్రభలతోడఁ దఱుచుగ మెఱయన్। వెగడెం జిత్తము సుండెలు। వగిలెడి నీకెనెందుఁ జొత్తు భావింపఁగదే॥ వ॥ నరేంద్రా నిను నారోపితశరశరాసనునిఁగ సర్వప్రదేశంబులందును విలోకించుచున్నవాఁడ నే నెక్కడ నుండుదు నానతిమ్మనిన రాజన్యశేఖరుండు ప్రాణివధస్త్రీద్యూతపానంబులని యెడు నాలుగు స్థానంబుల నిచ్చి మఱియు నడిగిన సువర్ణమూలంబగు నసత్యమదకామహింసావైరంబులని యెడు పంచప్రదేశంబుల నొసంగి యితరస్థలంబుల స్పృశియింపకుండ నియమించె నిట్లు కలి నిగ్రహంబు సేసి హీనంబులయిన తపశ్శౌచదయలని యెడి మూఁడు పాదంబులు వృషభమూర్తియయిన ధర్మదేవునికిచ్చి రత్నగర్భకు నిర్భరంబయిన సంతోషంబు సంపాదించి॥ క॥ గజనామధేయపురమున। గజరిపుపీఠమున ఘనుఁడు గలిమర్దనుఁడై। గజవైరిపరాక్రముఁడై। గజిబిజి లేకుండఁ దాల్చెఁ గౌరవలక్ష్మిన్॥ వ॥ ఇట్లు కృష్ణుని యనుగ్రహంబున నశ్వత్థామ బాణపావకంబువలన బ్రతికి పరీక్షిన్నరేంద్రుండు బ్రాహ్మణశాపప్రాప్తతక్షకభయంబువలనఁ బ్రాణంబులు వోవు నని యెఱింగి సర్వసంగంబులు వర్జించి శుకునకు శిష్యుండై విజ్ఞానంబు గలిగి గంగాతరంగిణీతీరంబునం గళేబరంబు విడిచె వినుఁడు॥ క॥ హరివార్త లెఱుఁగువాకిరి। హరిపదములు దలఁచువారి కనవరతంబున్। హరికథలు వినెడు వారికి। మరణాగత మోహసంభ్రమము లేదనఘా॥ క॥ శుభచరితుఁడు హరి యరిగినఁ। బ్రభవించి ధరిత్రి నెల్లఁ బ్రబ్బియుఁ గలి దా। నభిమన్యుసుతుని వేళను। బ్రభవింపక యడఁగియుండె భార్గవముఖ్యా॥ వ॥ ఇవ్విధంబునఁ జతుస్స

## శ్రీ పరీక్షిన్మహారాజు కలిపురుషుని నిగ్రహించి ధర్మపరిపాలన సేయుట. శ్రీ

ముద్రముద్రితాఖిలమహీమండల ప్రాజ్యసామ్రాజ్యంబు పూజ్యంబుగాఁ జేయుచు నాయభిమన్యుపుత్త్రుండు॥. ఉ॥ చేసినఁగాని పాపములు సెందవు చేయఁదలంచినంతటన్। జేసెదనన్న మాత్రమునఁ జెందుఁగదా కలివేళ పుణ్యముల్। మోసము లేదటంచు నృపముఖ్యుఁడు గాచెఁ గలిన్ మరందముల్లాసముతోడ గ్రోలి విరులం దెగఁ జూడని తేఁటికైవడిన్॥. వ॥ మతియుం బ్రమత్తులై యధీరులగు నరులయందు వృకంబు చందంబున నొదిగిలియాచుకొనియుండి చేష్టించుఁగాని ధీరులైన వారికిం గలివలని భయంబు లేదని కలి నంతంబు నొందింపఁడయ్యె ననిన విని ఋషులు సూతున కిట్లనిరి॥. సీ॥ పౌరాణికోత్తమ బ్రతుకుము పెక్కేండ్లు దామరసాప్తునిధవళయశము। మరణశీలుర మయిన మా కెటంగి గించితి కల్పితంబగు క్రతుకర్మమందుఁ। బొగలచేఁ బొగిలియ బుద్ధి విశ్వాసులమము హరిపదపద్మమధురరసముఁ। ద్రావించితివి నీవు ధన్యుల మైతిమి స్వర్గ మేనియు నపవర్గ మేని। భాగవతసంగలవభాగ్యఫలముకీడె। ప్రకృతిగుణహీనుఁడగు చక్రి భద్రగుణము। లీశకమలాసనాదులు నెఱుఁగ లేరు। వినికి విన్నఁ జాలము నిను నెడి వెత్తి గలఁడె॥. క॥ శ్రీపంబులు ఖండితసం। తాపంబులు గల్మషాంధతమసమహాదృద్దీపంబులు పాషండదు। రాపంబులు విష్ణువందనాలాపంబుల్॥. క॥ పావనములు దురితలతా। లావనములు నిత్యమంగళప్రాభవసం। జీవనములు లక్ష్మీసం। భావనములు వాసుదేవపదసేవనముల్॥. గీ॥ పరమభాగవతుఁడు పాండవపౌత్త్రుండు। శుకమునిభాషణముల శుద్ధబుద్ధియై విరాజమానుఁడై ముక్తియగు విష్ణుపాదమూల మెట్టుపడ సెనసఘ॥. వ॥ మహాత్మా విచిత్రయోగనిష్ఠాకలితంబు విష్ణుచరితలలితంబు పరమపుణ్యంబు సకలకల్యాణగుణగణ్యంబు భాగవతజనాపేక్షితంబునయిన పారీక్షితంబగు భాగవతాఖ్యానంబు వినుపింపుమనిన సూతుం డిట్లనియె॥. క॥ మిము బోఁటి పెద్దవారలు। గమలాక్షుని చరితను డుగఁగాఁ జెప్పెడి భాగ్యముఁ గలిగె నేఁడు మాజన్మము సఫలంబయ్యె వృద్ధమాన్యులము గుటన్॥. క॥ కులహీనుఁడు నారాయణ। విలసత్కథనములు దగిలి వినుపించినఁ దత్కులహీనతఁ బాసి మహా। జ్వలకులజత్వమును బొందు సన్మునులారా॥. సీ॥ ఎవ్వని గుణజాల మెన్న జిహ్వలు లేక నళినగర్భాదులనంతుఁ డండ్రుఁ। గోరెడు విబుధేంద్రకోటి నొల్లక లక్ష్మి ప్రార్థించె నెవ్వని పాదరజము। బ్రహ్మ యెవ్వని పాదపద్మంబు గడిగిన జలము ధన్యతఁ జేసె జగము నెల్ల। భగవంతుఁడని యెడి భద్రశబ్దమునకు నెవ్వఁ డర్థాకృతి నేపు మిగిలె। నేమహాత్ము నాశ్రయించి శరీరాది। సంగకోటి నెల్ల సంహరించి। ప్రాభవమున ముసలుపార మహంస్యంబు। నొందితిరిగి రాక యుందు రెలమి॥. చ॥ క్రమముననింటికై యెగయఁగాక విహంగము మింటి దైనపా। రముగన నేర్చునే హరిపరాక్రమ మోపిన యంతగాక స। ర్వము వివరింప నెవ్వఁడు ప్రవర్తకుఁ డార్యములార

## శ్రీ పరీక్షిన్మహారాజు వేఁటాడి శమీక మహామునిపై మృతసర్పము నెత్తి వైచుట. శ్రీ

నా నుచిత్తమునకు నెంతఁ గానఁబడెఁ దప్పక చెప్పెద మీకు నంతయున్॥. క॥ వేదండపురాధీశుఁడు। గోదండము చేతఁ బట్టికొని గహనములో। వేదండాదుల నెకనాఁ। డేదండలఁ బోవనీక యెగిచెన్ బలిమిన్॥. క॥ ఒగ్గములు ద్రవ్వి వసువునఁ। నొగ్గము పెనుదెరలవలలను గ్రమ్మృగములున్। డగ్గరి నఁజలపు వేడుక। వెగ్గలమై చిత్తమందు వేఁటాడింపన్॥. క॥ కోలముల గవయవృక శార్దూలములఁ దరక్షు ఖడ్గ రోహిత హరిణీ। జాలముల శరభ చమర। వ్యాలముల వధించె విభుఁడు పవడి నోలములన్॥. క॥ మృగయులు మెచ్చ నరేంద్రుఁడు। మృగరాజపరాక్రమమున మెఱసి హరించెన్। మృగధరమండలముఁ గల। మృగమొక్కటి దక్క సర్వమృగముల నెల్లన్॥. వ॥ ఇట్లు వాటంబయిన వేఁటతమకంబున మృగంబుల వెంటందగిలి బుభుక్షాపిపాసమిగులం బరిశ్రాంతుండయి ధరణీకాంతుండు చల్లనినీటి కొలంకులు గానక కలంగెడు చిత్తంబుతోఁ జనిచని యొక్క తపోవనంబుగని యందు॥. సీ॥ మెలఁగుటఁ జాలించి మీలితనేత్రుఁడై శాంతుఁడై కూర్చుండి జడత లేక। ప్రాణమనోబుద్ధి పంచేంద్రియంబుల బహిరంగవీధులఁ బారనీక। జాగరణాదికస్థానత్రయము దాటి పరమమైయుండెడి పదముఁ దెలిసి। బ్రహ్మభూతత్వసంప్రాప్తివిశ్రాంతుఁడై యతిదీర్ఘజటలు దన్నావరింప। నలఘురురుచర్మధారియై యలరుచున్న। తపసిఁ బొడఁగని శోషితతాలుఁడగుచు। నెండితడి లేని కుత్తుక నెలుఁగుడింప। మందభాషల డగ్గరి మనుజవిభుఁడు॥. క॥ తోయములు దెమ్ము మాకీ। తోయము వేఁటాడు వేళఁ దొల్లి వ్రేడమదీ। తోయము క్రియ జలదాహము। తోయము వారలును లేరు నుస్సహమనఘా॥. వ॥ అనిభావరుండు శమీక మహాముని సమాధినిష్ఠుండును విస్మృతబాహ్యాంతరింద్రియకృతసంచారుండును హరిచింతాపరుండు నయి యుండుటఁ జింతింపక॥. ఉ॥ కన్నులు మూసి బ్రాహ్మణుఁడు గర్వముతోడుత నున్నవాఁడు చే। సన్నలనైన రమ్మనఁడు చాలజలంబులుఁ దెచ్చిపోయఁడే। మన్ననలైనఁ జేయఁడు మసగ్రఫలంబులు వెట్టఁడింతసం। పన్నత నొందెనే తేనతపశ్చరణాప్రతిమప్రభావముల్॥. గీ॥ వారిఁ గోరుచున్న వారికి శీతల। వారి నిడుట యొట్టి వారికయిన। వారితంబుగాని వ

లసినధర్మంబు। వారియెడఁ దుదాహవారి గాఁడు॥ చ॥ అనిమనుజేశ్వరుండు మృగయావసరాయతతోయదాహసం।జని
తదురంతరోషమున సంయమికన్నుఁ దిరస్కరించి పూ।జనములు సేయఁడంచు మృతసర్పము నొక్కటి వింటికోపునం। గొనివ
డిఁ దెచ్చి వైచె నటు బ్రహ్మమునీంద్రుని యంసవేదికన్॥ వ॥ ఇట్లు తండు ప్రత్యాహృతబాహ్యాంతరింద్రియుండగుచు మీలిత
లోచనుండగు నొప్పునో యట్లు గాక గతాగతులగు క్షత్రబంధులచే నేమియని మృషాసమాధినిష్ఠుండగునోపునో యనివిత
ర్కించుచు వృథారోషదర్పంబున మునిమూఁపున గతాసువయిన సర్పంబునిడి నరేశ్వరుండు దనపురంబునకుం జనియె నంత
సమీపవరులైన మునికుమారులు చూచి శమీకనందనుండయిన శృంగికడకుం జని॥ క॥ నరగంధగజస్యందన।తురగంబుల నే

### శ్రీ శమీకమహామునిపుత్రుండగు శృంగిముని పరీక్షిత్తుని శపించుట. శ్రీ

లురాజు దోయాతురుఁడై।పరగన్నిజజనకుని మెడ।నురగముఁ దగిలించిపోయె నోడకఁ దండ్రీ॥ వ॥ అనిపలికిన సమానవయో
రూపమునికుమారలీలాసంగియయిన శృంగి శృంగంబులతోడి మూర్తిధరియించినట్లు విజృంభించి రోషసంరంభంబున నద
రిపడి బల్యన్నంబుల భుజించి పుష్టంబులగు పరపుష్టంబులం బోలి బలిసి యద్వారంబులం గాచికొని యుండు సారమేయంబు
లపగిది దాసభూతులగు సత్క్షత్రియాభాసులెల్ల బ్రాహ్మణోత్తములచే స్వరక్షకులుగ నిరూపితులయిరి యట్టివారలెట్లు త
ద్గృహంబుల భాండసహితంబగు నన్నంబు భుజింపనర్హులగు మఱి తత్కృతంబులయిన ద్రోహంబులెల్ల నిజస్వామిం జెం
దుననిమఱియు నిట్లనియె॥ ఉ॥ ఆఁడుతన్ను దూషణములాశ్రమవాసులఁ గాని వైరులం।గూడఁడు కందమూలములు గూడు
గఁదించు సమాధిచిత్తుఁడై।వీఁడుపులోని చూడ్కులను విష్ణునిఁ దక్కఁ బరప్రపంచముం।జూడఁడు మద్గురుండు ఫణిఁ జుట్టఁగ
నేఁటికి రాచవానికిన్॥ ఉ॥ పోము హిరణ్యదానములఁ బుచ్చుకొనం గథనంబు లేమియుం।దేమును వంచనంబులుగదీ వెనలి
చ్చుచు వేసరింపఁగా।రామవనంబులన్ గృహవిరాములమై నివసింపఁ జెల్లరే। పామును వైవఁగాఁదగునె బ్రహ్మమునీం
ద్రు భుజాగ్రశంబునన్॥ క॥ పుడమిఁగల జనులు వొగడఁగఁ।గుడుతురు గట్టుదురుఁగాక కువలయపతులై। యడవులనిడుమ
లఁబడి యెడి బడుగుల మెడనిడఁగఁ దగునె పన్నగశవమున్॥ క॥ భగవంతుఁడు గోవిందుఁడు।జగతిం బెడవాసి చనిన శాసింపం
గాఁదగువరులు లేమి దుర్జను।లెగసి మహాసాధుజనుల నేచెదరకటా॥ క॥ బాలకులార ధరిత్రీ।పాలకు శపియింతు నను చుబ
లువడి నివిలో।లాలకుఁడగు మునికుంజర।బాలకుఁ డరిగెం ద్రిలోకపాలకులదరన్॥ వ॥ ఇట్లు రోషించి కౌశికీనదికిం జని జలో
పస్పర్శనంబు చేసి॥ ఉ॥ ఓడక వింటికోపున మృతోరగముం గొనివచ్చి మారుమా।టాడక యున్న మజ్జనకునంసతలంబునఁ బె
ట్టిమర్మద। శ్రీకఁ జరించు రాజు హరకేశవులొడ్డినఁ గానఁ జచ్చుఁబో। నేఁడవనాఁడు తక్షకఫణీంద్రవిషానలహేతిసంహ
తిన్॥ వ॥ అని శమీకమహామునికుమారుండయిన శృంగి పరీక్షిన్నరేంద్రుని శపియించి నిజాశ్రమంబునకుం జని తండ్రికంఠ
లగ్నకాకోదరుండయిన తండ్రిం జూచి॥ క॥ ఈ మెడనీకంఠమునకు। నీయురగశవంబుఁ దెచ్చి యిటు సేర్చినయా।యయ్యో
సికి నేమి సేయుము। నెయ్యంబులు లేవు సుమ్ము నృపులకుఁ గండ్రీ॥ శా॥ ప్రారంభంబున వేఁటవచ్చి ధరణీపాలుండు మాతం
డ్రిపై। నేరంబేమియు లేమ సర్పశవము న్నేఁ డుగ్రుఁడై వైచినాఁ। డీరీతిన్ ఫణి క్రమ్మఱన్ బ్రతుకు నోహింసించునో కో
అలన్।రారే తాపసులార దీనుఁ దినరే రక్షింపరే మ్రొక్కెదన్॥ వ॥ అని సర్పంబు దిగుచు నేర్పులేక మెలుంగెత్తి విలపించు
చున్న కుమారకు రోదనధ్వని విని యాంగీరసుండయిన శమీకుండు సమాధిఁ జాలించి మెల్లన కన్నులు దెఱచి మూఁపున వ్రే
లుచున్న మృతోరగంబు నీక్షించి పారవైచి కుమారకుం జూచి॥ క॥ ఏకీడు నాచరింపము।లోకులకున్ మనము సర్వలోకస
ములమున్।శోకింప నేల పుత్రక।కాకోదర మేల వచ్చెఁ గంఠంబునకున్॥ వ॥ అనియడిగినఁ దండ్రికిఁ గొడుకు రాజు వచ్చి స
ర్పంబు వైచుటయుం దాను శపించుటయును వినిపించినఁ దండ్రి కొడుకు వలన సంతసింపక యిట్లనియె॥ క॥ బెట్టిదమగు శాప
మునకు।దట్టపు ద్రోహంబుగాదు ధరణీకాంతుం।గట్టా యేల శపించితి।పట్టీ తక్షకవిషాగ్నిపాలగు మనుచున్॥ గీ॥ తల్లికడు
పులోన దగ్ధుఁడై క్రమ్మఱఁ।గమలనాభు కరుణఁ గలిగినాఁడు।బలిమిగలిగి ప్రజలఁ బాలించుచున్నాఁడుఁ। దిట్టవడుగ రాజుఁ
దిట్టఁ దగునె॥ ఉ॥ కాపరిలేని గొఱ్ఱియలకైవడిఁ గంటకచోరకోటిచే। నేపరియున్నదీ భువన మీశుఁడు కృష్ణుఁడు లేమి నిట్టిచో।
భూపరిపాలనంబు సను బుద్ధి నితం డొనరింపఁ జెల్లరే।యీపరిపాటి ద్రోహమున కిట్లు శపింపఁగ నేల బాలకా॥ సీ॥ పాపంబు
నీ చేతఁ బ్రాపించె మునికింక రాజు నశించిన రాజ్యమందు। బలవంతుఁడగు వాఁడు బలహీను పశుదారహయసువర్ణాదులప
హరించు।జారచోరాములు సంచరింతురు ప్రజ కన్యోన్యకలహంబు లతిశయిల్లు।వైదికంబై యున్న వర్ణాశ్రమాచారధర్మ
మించుక లేకఁ దప్పిపోవు। నంతమీఁద లోకు లర్థకామంబులకుఁ దగిలి సంచరింప ధరణి నెల్ల।వర్ణసంకరములు వచ్చును మఱట।

రింపం జూచి నిశ్చింతతఁ। భరితధ్యానతపఃప్రభావనిరతిం బాటించి నిష్కాములై॥ క॥ క్రోధము దపముల కెల్లను। బాధక
మగుటెఱిఁగి దివిజభామలపైనన్। మేధాత్మకు లోకయింతయుఁ। గ్రోధము దేరైరి సత్త్వగుణయుతులగుటన్॥ క॥ నారా
యణుఁ డప్పుడు తన। యూరువు వెసఁ జీల్పనందు నుదయించె నుబెం। పారంగ నూర్వశీముఖ। నారీజనకోటి దివిజనారులు మె
చ్చన్॥ క॥ ఊరువులందు జనించిన। కారణమున నూర్వశియన ఘనతకు నెక్కెన్। వారలరూపవిలాసవి। హారములకు నో
డిరంత నమరీజనముల్॥ వ॥ అంతఁ దాము నరనారాయణులు తపోవిఘ్నంబుగా వింపంబూని చేయు విలాసంబులు మానసిక
సంకల్పమాత్రంబున సృష్టిస్థితిసంహారంబు లొనర్పంజాలు నమ్మహాత్ముల దెసం బనికిరాక కృతఘ్నునకుం జేయు నుపకృతి
యుంబోలె నిష్ఫలంబులైన సిగ్గునం గుందుచు నూర్వశిం దమకు ముఖ్యురాలిఁగాఁ గైకొని తమవచ్చిన జాడనే మఱలిరంత॥
క॥ కాముని దహించెఁ గ్రోధమ। హామహిమను రుద్రుఁ డట్టి యతికోపమునా। ధీమంతులు గెలిచిరనినం। గామము గెల్చుటకుఁ
జెప్పఁగా నేమిటికిన్॥ వ॥ అట్టి నరనారాయణావతారంబు జగత్పావనంబై విలసిల్లె వెండియు ధ్రువావతారంబు వివరిం
చెద వినుము॥ సీ॥ మానితచరితుఁ డుత్తానపాదుండను భూవరేణ్యునకు సత్పుత్త్రుఁడనఁగ। నుదయించి సుహిమఁ బెంపొం
దు బాల్యంబున జనకునికడ నుండి సవతితల్లి। దను నాడు వాక్యాస్త్రతతిఁ గుంది మహితతపంబుఁ గావించి కాయంబుతోడఁ। జ
నిమీఁద ధ్రువపదస్థాయియై యట మీఁద నర్థి వర్తించు భృగ్వాదిమునులు। చతురగతిఁ గ్రిందవర్తించు సప్తఋషులు। పెంపు
దీపింపఁ దన్ను నుతించుచుండ। ధ్రువుఁడనా నొప్పు నవ్విష్ణుతుల్యుఁడగుచు। నున్న పుణ్యాత్ముఁ డిప్పుడు నున్నవాఁడు॥ పృథు
నియవతారంబు వినుము॥ ఉ॥ వేనుఁడు విప్రభాషణ *పవిచ్యుతభాగ్యవిహీనపౌరుషుం। డై నిరయంబునం బడిన నాత్మజ
నూభవుఁడై పృథుండునాఁ। బూని జనించి తజ్జనకుఁ బున్నరకంబును బాపె మేదినిన్। ధేనువు సేసి వస్తువితతిం బితికెన్ మహా
సత్త్వశౌర్యుఁడై॥ వ॥ అనిమఱియు వృషభావతారంబు నెఱింగింతు వినుమాగ్నీధ్రుండను వానికిని దేవివలన నాభియను
వాఁ డుదయించె నతనికి మేరుదేవియందు హరి వృషభావతారంబు నొంది జడస్వభావంబైన యోగంబు దాల్చి ప్రశాంతాం
తఃకరణుండును విముక్తసంగుండును నై †పరమహంసాభిగమ్యంబైన పదంబిది యని మహర్షులు వలుకుచుండం జరించె. మ
ఱియు హయగ్రీవావతారంబు సెప్పెద వినుము॥ చ॥ అనఘచరిత్ర మన్మఖమునందు జనించె హయాననాఖ్యతన్। వినుతసు
వర్ణవర్ణుఁడును వేదమయుం డఖిలాంతరాత్మకుం। డనుపమయజ్ఞపూరుషుఁడునై భగవంతుఁడు దత్సమస్తపావనమగు నా
సికాశ్వసనవర్గములం దుదయించె వేదముల్॥ మఱియు మత్స్యావతారంబు వినుము॥ సీ॥ ఘనుఁడు వైవస్వతమనువునకు గ
పడియరుదెంచునట్టి యుగాంతసమయ। మందు విచిత్రమత్స్యావతారము దాల్చి యఖిలావనీమయంబగుచుఁ జాల। సర్వ
జీవులకు నాశ్రయభూతుఁడగుచు నేకార్ణవంబైన తోయములనడుమ। మన్ముఖ ¶శ్లథవేదమార్గంబులను జిక్కువడకుండ శాఖ
లేర్పడఁగఁ జేసి। దివ్యులర్థింపనాకర్థిఁ దెచ్చియిచ్చి। మనువునెక్కించి పెన్నావ వననిధి నడుమ। మునుఁగకుండఁగ నరసినయని
మిషావ। తారమేరికిను దెలియింపఁ దరమె వత్స॥ మఱియుఁ గూర్మావతారంబు వినుము॥ మ॥ అమృతోత్పాదనయత్నులై విబుధ
దైత్యానీకమున్మందరా। గముఁ గవ్వంబుగఁ జేసి యబ్ధి దఱువం గాఁ గవ్వపుంగొండ వా। ర్థిమునుంగన్ హరి కూర్మరూపమున
నద్రిం దాల్చెఁ దత్పర్వత। భ్రమణవ్యాజత వీఁపు తీఁట శమియింపం జేయఁగా నారదా॥ వ॥ వెండియు నృసింహావతారంబు వి
నుము॥ మ॥ సురలోకంబుఁ గలంచి దేవసమితిన్ ప్రక్కించి యుద్యద్గదా। ధరుఁడై వచ్చు నిశాచరుం గనికనద్దంష్ట్రాకరాళా
స్యవిస్ఫురితభ్రూకుటితో నృసింహగతి రక్షోరాజవక్షంబు భీ। కరభాస్వన్నఖరాజిఁ ద్రుంచె ద్రిజగత్కల్యాణసంధాయి
యై॥ ఆదిమూలావతారంబు సెప్పెద వినుము॥ మ॥ కరినాథుండు జలగ్రహగ్రహణదుఃఖాక్రాంతుఁడై వేయువత్సరము
ల్వాయుమనుండ వేల్పులకు విశ్వవ్యాప్తి లేకుండుటన్। హరి నీవే శరణంబు నాకనినఁ గుయ్యాలించి వేవేగ వా। శ్చరము
క్రుంచి కరీంద్రుఁ గాచె మహితోత్సాహంబునం దాపసా॥ మఱియును వామనావతారంబు వినుము॥ సీ॥ యజ్ఞేశ్వరుండును
నదితిపుత్త్రుఁడు దితిసంతానంబునకు నెల్లఁ దమ్ముఁడయ్యుఁ। బెంపారు గుణములఁ బెద్దయై వామనమూర్తితో బలిచక్రవర్తిఁ జేరి
యిచ్చు భూమి మూఁడుపాదమ్ములనడిగి పదత్రయంబున నుజగత్త్రయంబు। వంచించికొనియెను వాసవునకు రాజ్యమందింపనీ
శ్వరుఁడయ్యు మొఱఁగి। యర్థిరూపంబు గైకొని యడుగవలసె। ధార్మికుల సొమ్ము వినయోచితముననగాని। వెడఁగుతనమున
నూరక విగ్రహించి। చలనమందింపరాదు నిశ్చయము పుత్త్ర॥ చ॥ బలినిజమౌళి నవ్వటునిపాదసరోరుహభవ్యతీర్థముం। దా
లికధరించి తన్ను నుజగత్త్రయముం హరికిచ్చి కీర్తులన్। న్నిలిపె వసుంధరాస్థలిని నిర్జరలోకవిభుత్వహానికిన్। దలఁకక శుక్ర

*పవిచ్యుత-జారిన. †పరమహంసాభిగమ్యంబైన-శ్రేష్ఠులగు యోగులచేతఁ బొందఁదగిన. ¶శ్లథ-వడలిన.

మాటలకుఁ దారక భూరివదాన్యశీలుఁడై॥. వ ॥ మఱియు నప్పరమేశ్వరుండు నారదానకు హంసావతారంబు నొంది య
తిశయభక్తియోగంబున సంతుష్టాంతరంగుండగుచు నాత్మతత్త్వప్రదీపకంబగు భాగవతమహాపురాణం బుపదేశించె
మన్వవతారంబు నొంది స్వకీయ తేజఃప్రభావంబున నప్రతిహతంబైన చక్రంబు ధరియించి దుష్టవర్తను లైన రాజుల దం
డించుచు శిష్టపరిపాలనంబు సేయుచు నాత్మీయకీర్తిచంద్రికలు సత్యలోకంబున వెలింగించె. మఱియు ధన్వంతరి యన నవ
తరించి తన నామస్మరణంబున భూజనంబులకు సకలరోగనివారణంబు సేయుచు నాయుర్వేదంబు గల్పించె. వెండియు పరశు
రామావతారంబు వినుము॥. మ॥ ధరణీకంటకులైన హైహయనరేంద్రవ్రాతముఁ భూరివి। స్ఫురితోదారకుఠారధారఁ
గలనన్ మ్రయ్యేడుమాఱులు ప్పొరిం। బొరిమర్దించి సమస్తభూతలము విప్రుల్వేడఁగా నిచ్చితాఁ। జిరకీర్తిన్ జమదగ్నిరాముఁ
డనమించె నాదాప సేంద్రోత్తమా॥. వ ॥ మఱియు శ్రీరామావతారంబు సెప్పెద వినుము॥. సీ ॥ తోయజహితవంశదుగ్ధ
పారావారరాకావిహారకైరవహితుండు। గమనీయకోసలక్ష్మాభృత్సుతాగర్భశుక్తిసంపుటలసన్మౌక్తికంబు। నిజపాద
సేవకవ్రజమఘౌఘనిబిడాంధకారవిస్ఫురితపంకరుహసఖుఁడు। దశరథేశ్వరకృతాధ్వరవాటికాప్రాంగణాకర దేవతా
నోకహంబు। చటులదానవగహనవైశ్వానరుండు। రావణాటోపశైలపురందరుండు। నగుచు లోకోపకారార్థ మవత
రించె। రాముఁడై చక్రి లోకాభిరాముఁడగుచు॥. క॥ చిత్రముగ భరతలక్ష్మణ। శత్రుఘ్నులకర్థి నగ్రజన్ముండగుచుఁ। ధా
త్రిఁ రాముఁడు వెలసెం బ। విత్రుఁడు మమ్మృతలతాలవిత్రుండగుచుఁ॥. అంత॥. సీ॥ కిసలయఖండేందుబిసకుందపద్మా
స్త్రబదఫాలభుజరదపాణి నేత్రఁ। గాహాళకరభచక్రవియత్పులినశంఖజంఘోరుకుచమధ్యజఘనకంఠ। ముకురచందన
బింబశుకగజశ్రీకారగండగంధోష్ఠవాగ్గమనకర్ణఁ। జంపకేందుమస్వర్ణశంపాధనుర్నీలనాసికాస్యాంగదృగ్భ్రూశిరోజ। న
లిసుధావర్తకుంతలహాసనాభి। కలితజనకావనీపాలకన్యకాలలామఁ బరిణీతుఁడయ్యె లలాటనేత్ర। కార్ముకధ్వంసమం
కువగాఁ గనతఁడు॥. అంత॥ క॥ రాముఁ న్మేచకజలద। శ్యాముఁ న్సుగుణాభిరాము సద్వైభవము। త్రాముఁ దుష్టనిశాటవి। రా
మం బొమ్మనియెం బ త్రిక్రి-రఘుఁడ డవులకుఁ॥. చ॥ అరుదుగ లక్ష్మణుండు జనకాత్మజయుఁ దనతోడ నేగుదే। నరిగి రఘూత్త
ముం డుముదమారఁగఁ జొచ్చెఁ దరక్షుసింహసూ। కరకరిపుండరీకకపిఖడ్గకురంగవృకాహిభల్లకా। నరముఖసత్త్వవన్య
చయచండతరాటవి దండకాటవిఁ॥. క॥ ఆవనమున వసియించి న్న। పావననయశాలి యిచ్చె నభయము లుజగ। త్పావనము
నిసంతతికిఁ గృ। పావననిధియైన రామభద్రుఁ డెలమిఁ॥. క॥ ఖరకరకులజలనిధిహిమ। కరుఁడగు రఘురాముఁ విభుఁడు గఱక
టితోడఁ। ఖరునివధించె నుఘనభీ। కరశరముల నఖిలజనులు గరమరుదందఁ॥. క॥ *హరిసుతుఁ బరిచరుఁగాఁ గొని। హరిసు
తుఁ దును మాడి పనిచె హరిపురమునకుఁ। హరివిభునకు హరిమధ్యను। హరిరాజ్యపదంబు నిచ్చె హరివిక్రముఁడై॥. వ॥ అం
తసీతానిమిత్తంబున న్ద్రిలోకకంటకుండగు దశకంఠుం డనుమానుటకు నైకపిసేనాసమేతుండై చనిదుర్గమంబయిన సము
ద్రంబు దెరువుఁ జూపకున్న నలిగి ॥. మ ॥ వికటభ్రూకుటిఫాలభాగుఁడగుచు న్వీరుండు గ్రోధారుణాం। బకుఁడై చూచిన
యంతమాత్రమున నప్పాథోధిసంతప్తతో। యకణగ్రాహతిమింగిలప్లవఝుళీవ్యాళప్రవాళోర్మికా। వరకారండవచక్ర
ముఖ్యజలసత్త్వశ్రేణితో నింకినఁ॥. వ ॥ అయ్యవసరంబున సముద్రుండు గరుణాసముద్రుండగు శ్రీరామభద్రు నిశ్శరణం
బు సొచ్చి నం గరుణించి యప్పటియట్ల నిలిపిన లునిచే సేతువు బంధించి తన్మార్గంబునం జని ॥. మ॥ పురముల్మూఁడును నొక్క
బాణమున నిర్మూలంబుగా వించు శం। కరుచందంబున నేర్చె రాఘవుఁడు లంకాపట్టణం బిద్ధగో। పురశాలాంగణహర్మ్యరా
జభవనప్రోద్యత్ప్రతోళీకవా। టరథాశ్వద్విపశస్త్రమందిరనిశాటశ్రేణితో వ్రేల్మిడిఁ॥. క॥ రావణునఖిలజగద్వి। ద్రా
వణుఁ బరిమార్చి నిలిపె రక్షోవిభుఁగా। రావణు ననుజన్ముని నై। రావణసితకీర్తి మెఱసి రాఘవుఁ డెలమిఁ॥. సీ॥ శ్రీధర్మసంర
క్షకత్వప్రభావుండయ్యు ధర్మవిధ్వంసకత్వమునఁ బొదలి। †ఖరదండనాదిముఖ్యతఁ బొందకుండియు ఖరదండనాదిముఖ్య
తను మెఱసి। ¶పుణ్యజ §నావనస్ఫూర్తిఁ బెంపొందియుఁ బుణ్యజనాంతకస్ఫురణఁ దనరి। సంతతాశ్రిత ?విభీషణుఁడుగా
కుండియు సంతతాశ్రితవిభీషణత నొప్పి। మించి తనకీర్తి చేత వాసించె దిశలు। దరమెను తియింప రాము నెవ్వారికైనఁ। జా

---

*హరిసుతుఁ। సూర్యపుత్రుఁడగు సుగ్రీవుని-పరిచరుఁగాఁ గొని। సహచరునిఁగాఁ జేకొని-హరిసుతుఁ। ఇంద్రపుత్రుఁడగు వాలిని-తునుమాడి
చంపి-హరిపురమునకుఁ। యమపురమునకు-పనిచెఁ। పంపెను-హరివిభునకుఁ। వానరరాజగు సుగ్రీవునకు- హరిమధ్యను। సింహపు నడుమువం
టి నడుముగలతారను-హరిరాజ్యపదంబు నిచ్చెఁ। వానరరాజ్యము నిచ్చెను-హరివిక్రముఁడై। విష్ణుస్వరూపుఁడగు శ్రీరాముఁడు పరాక్రమవంతుఁడై
యి.—— శ్రీధర్మ। న్యాయము-విల్లు.—— †ఖర। తీక్ష్ణము-ఖరాసురుఁడు.—— ¶పుణ్యజన। పుణ్యపురుషులు-రాక్షసులు.—— §అవన। రక్షణము
?విభీషణుఁడు। వెరపుగలవాఁడు-రావణునితమ్ముఁడు.

రుతరమూర్తియవనీశచక్రవర్తి। ప్రకటగుణసాంద్రుదశరథరామచంద్రు ॥ వ ॥ అట్టిరామావతారంబుజగత్పావనం
బునస్మత్ప్రసాదకారణంబునై నుతికెక్కె నింకఁగృష్ణావతారంబువివరించెదవినుము॥ సీ॥ తాపసోత్తమవినుదైత్యాంశ
ములఁబుట్టిననరనాథులతులసేనాసమేతు। లగుచుధర్మేతరులై ధాత్రిఁబెక్కుబాధలనలయించుటధరణివగలఁ।బొందుచు
వాపోవభూభారముడుపుటకై హరిపరుఁడునారాయణుండు। చెచ్చెరఁదనసితాసితకేశయుగమునబలరామకృష్ణరూప
ములఁదనరి। యదుకులంబునలీలమైనుదయమయ్యె। భవ్యయశుఁడగువసుదేవుభార్యలైన। రోహిణియుదేవకియునను
రూపవతుల। యందునున్మత్తదైత్యసంహారియగుచు॥ వ॥ ఇట్లుపుండరీకాక్షుండగునారాయణుండుసమస్తభూభారని
వారణంబుసేయందనమేనికేశద్వయంబచాలుననియాత్మప్రభావంబుఁదెలుపుకొనుచునిజకళాసంభవులైనరామకృష్ణ
దేహవర్ణంబులుశ్వేతకృష్ణంబులనినిర్దేశించుకొనుచుసితాసితకేశద్వయవ్యాజంబునరామకృష్ణాఖ్యలనలరియవతరించె
నందుభగవంతుండుసాక్షాద్విష్ణుండునైనఁ గృష్ణుండుజనమార్గవర్తియయ్యునతిమానుషకర్మంబులనాచరించుటంజేసి
కేవలపరమేశ్వరుండయ్యెనమ్మహాత్ముండాచరించుకార్యంబులులెక్కవెట్టనెవ్వనికిననలవిగాదయినను నాకుగోచరించినం
తయునెఱింగించెదవినుము॥ క॥ నూతనగరళస్తనియగు।పూతనఁబురిటింటిలోనఁబొత్తులశిశువై। చేతనములహరియించి
ప। రేతనగరమునకుననిచెఁగృష్ణుఁడుపెలుచన్॥ క॥ వికటముగనిజపదాహతిఁ।బ్రకటముగామూఁడునెలలబాలకుఁడై యా।
శకటనిశాటునినంతక।నికటస్థునిఁజేసెభక్తనికరావనుఁడై॥ క॥ ముద్దులకొమరునిద్రేతెల। రద్దులకై తల్లిరోలరజ్జునఁగ
ట్టం।బద్దులకుమిన్నుముట్టిన।మద్దులవడిఁగూల్చెఁజనసమాజమువొగడన్॥ మ॥ మదిఁగృష్ణుండుయశోదబిడ్డఁడనినమ్మం
జాలయోగీంద్రత।ద్వదనాంభోజములోఁజరాచరసమస్తప్రాణిజాతాటవీ।నదనద్యద్రిపయోధియుక్తమగునానా
లోకజాలంబుభా।స్వదనూనక్రియఁజూపెఁదల్లికిమహాశ్చర్యంబువాటిల్లఁగన్॥ చ॥ వరయమునానదీప్రదనివాసకుఁ
డై నిజవక్త్రనిర్గత।స్ఫురితవిషాంబుపానమునభూజనులన్మృతిఁబొందఁజేయుభీ। కరగరళద్విజిహ్వుఁడగుకాళియప
న్నగునాప్రదంబుఁజె।చ్చెరవెడలించికాచెయదుసింహుఁడుగోపకగోగణంబులన్॥ మ॥ తనయాగోపకులాకృరాతి
రినినిద్రంజెందఁగార్చిచ్చువ।చ్చినఁగృష్ణామమునగ్నిపీడితులరక్షింపందగుంగావవే।యనినంగన్నులుమీరుమోడ్పుఁడిదె
దావాగ్నిన్వేసనార్తునే। ననవారట్లమొనర్పమ్రింగెశిఖిఁబద్మాక్షుండులీలాగతిన్॥ క॥ మందునిగతియమునాం
బువులందునిశింగ్రుంకిబద్ధుఁడై చిక్కినయా।నందునివరుణునిబంధన।మందునివృత్తునిఁగఁజేసెహరిసదయుండై॥ మ॥ హ
యసూనుండగుదానవుండునిజమాయన్గోపరాజిన్గుహా।శ్రయయానల్లొనరించితత్పథమునీరంధ్రంబుగావించినన్।
రయమొప్పన్గుటిలాసురాధమునిఁబోరన్ద్రుంచిగోపావళిన్ ।దయతోఁగాచినకృష్ణుసన్మహిమ మేతన్మాత్రమేతా
పసా॥ క॥ దివిజేంద్రప్రీతిగవ।ల్లవజనులేటేటఁజేయులాలితసవనో।త్సవముహరిమాన్పినగో।పవరులుగావింపకున్న
బలరిపుఁడలుకన్॥ గీ॥ మందగోందలమందనమందవృష్టిఁ।గ్రందుకొనుఁడంచునింద్రుండుమందలింపఁ। జండపవనసము
ద్ధూతచటులవిలయ।సమయసంవర్తకాభీలజలధరములు॥ శా॥ సప్తస్కంధశిఖాకలాపరుచిమత్సౌదామనీవల్లికా। దీ
ప్తోదగ్రముహుర్ముహుస్తనితధాత్రీభాగనీరంధ్రమై।సప్తాశ్వస్ఫురదిందుమండలనభస్సంఛాదితాశాంతర।వ్యాప్తాం
భోదనిరర్గళస్ఫుటశిలావార్గపూరధారాళమై॥ వ॥ అట్లుగురియువానజల్లుపెల్లునరిమ్మలుగొనిసొమ్మలువోయిసొమ్మసిలు
గోపగోకులంబాకులంబునొందికృష్ణకృష్ణరక్షింపుమనియార్తింబొందికుయ్యిడనయ్యఖండకరుణారససముద్రుండుభ
క్తజనసురద్రుముండునగుపుండరీకాక్షుండు॥ శా॥ సప్తాబ్దంబులబాలుఁడై నిజభుజాస్తంభంబునన్లీలతో। సప్తాహం
బులుశైలరాజములసచ్ఛత్రంబుగాఁదాల్చిసం। గుప్తప్రాణులఁజేసెమాధవుఁడుగోగోపాలకవ్రాతమున్। సప్తాం
భోధిపరీతభూధరునకాశ్చర్యంబెచింతింపఁగన్॥ సీ॥ సాంద్రశరచ్చంద్రచంద్రికాధవళితవిమలబృందావనవీథియందు।
రాసకేళీమహోల్లాసుఁడై యుత్ఫుల్లజలజాక్షుఁడొకనిశాసమయమునను। దనరారుమంద్రమధ్యమతారకలనింపు
దళుకొత్తరాగభేదములఁజెలఁగి। రైవతఋషభగాంధారనిషాదపంచమషడ్జమధ్యమస్వరములోలిఁ। గళలుజాతులు
మూర్ఛనల్ గలుగవేణు।నాళవివరాంగుళిన్యాసలాలనమున। మహితగతిఁబాడెనవ్యక్తమధురముగను। బంకజాక్షుం
డుదారువులంకురింప॥ మ॥ హరివేణూద్గతమంజులస్వననినాదాహూతలై గోపసుం। దరులేతేరథనాధిపానుచరగం
ధర్వుండుగొంపోవఁద। త్తరుణుల్గుయ్యిడశంఖచూడునిభుజాదర్పంబుమాయించితాఁ। బరిరక్షించినయట్టికృష్ణునినుతిం
పన్శక్యమేయేరికిన్॥ చ॥ నరకమురప్రలంబయవనద్విపముష్టికమల్లకంసశం। బరశిశుపాలపంచజనపౌండ్రకపిప్పల

దంతవక్త్రివా। నరఖరసాల్వవత్సబకనాగవిదూరకరుక్మికేశిద। ర్దురవృషధేనుకప్రముఖ దుష్టనిశాటులఁద్రుంచెఁద్రెళ్ళి డిఁ॥. మఱియును॥ మ॥బలభీమార్జునముఖ్యచాపధరరూపవ్యాజతంగ్రూరులఁ।ఖలులఁదుష్టధరాతలేశ్వరులసంగ్రామైకపారీణదో।ర్బలకేళిందునుమాడిసర్వధరణీభారంబుమాయించిసా।ధులరక్షించినయట్టికృష్ణుని ననంతుంగొల్తురె ల్లప్పుడుఁ॥.వ॥అట్టిలోకోత్కృష్టుండైనకృష్ణునియవతారమాహాత్మ్యంబెఱింగించితి-నింకవ్యాసావతారంబువినుము॥ చ॥ ప్రతియుగమందుసంకుచితభావులునల్పతరాయులౌనన।ల్గతికులునైనమర్త్యులకగమ్యములైస్వకృతంబులైసుశాశ్వతములునైనవేదతరుశాఖలుదావిభజించినట్టిస।న్నుతుఁడుపరాశరప్రియతనూజుఁడనఁ హరివుట్టెనర్మిలిఁ॥. మఱియుబుద్ధావతారంబువినుము॥. మ॥ అతిలోలాత్మ్మలసూనృతోక్తులును వేదాచారసంశీలురు। ర్ధతపాషండమతౌపధర్మ్యులుజగత్సంహారులైనట్టియా।దితిసంజాతులధర్మవాసనలవర్తింపందదాచారసం। హతిమాయించిహరించెఁదానవులఁబద్మాక్షుండుబుద్ధాకృతిఁ॥. మఱియుంగల్క్యవతారంబువినుము॥. మ॥వనజాక్షుస్తవశూన్యులైమఱివషట్స్వాహాస్వధావాక్యశో। భనహీనులగ్గలినానృతోక్తిపరులైపాషండులైనవి।ప్రనికాయంబునుశూద్రభూపులుగలిఁ భాసిల్లినంగల్కి-యై!జననంబందియధర్మమెల్లనడఁచుఁ స్థాపించుధర్మంబిలఁ॥.వ॥ అనిమఱియుఁబితామహుండునారదునకిట్లనియె.మునీంద్రా పుండరీకాక్షుండంగీకరించులీలావతారకథావృత్తాంతంబు నేనీకు నెఱింగించునంతకుమున్నహరివరాహాదియవతారంబులంగీకరించితత్ప్రయోజనంబులుదీర్చె. మన్వంతరావతారంబునంగీకరించినవియునంగీకరింపంగలయవియునైయున్నవి.వర్తమానంబునధన్వంతరిపరశురామావతారంబులుదాల్చియున్నవాఁడు;భావికాలంబునశ్రీరామాద్యవతారంబులనంగీకరింపంగలవాఁడమ్మహాత్ముండుసృష్ట్యాదికార్యభేదంబులకొఱకుమాయాగుణావతారంబు నొందుబహుశక్తిధారకుండైనభగవంతుండుసర్గంబునందపంబేను ఋషిగణంబులు నవప్రజాపతులునై యవతరించివిశ్వోత్పాదనంబుగావించువిష్ణుండుధర్మంబుయజ్ఞంబులుమనువులింద్రాదిదేవగణంబులుధాత్రీపతులునయి యవతరించిజగంబులరక్షించుచుండు;అధర్మంబురుద్రుండుమహోరగంబులురాక్షసానీకంబులునై విలయంబునొందించునిత్తెఱంగునంబరమేశ్వరుండుసర్వాత్మకుండునైనహరివిశ్వోత్పత్తిస్థితిలయహేతుభూతుండైవిలసించుధరణీరేణువులనైనగణుతింపనలవియగుంగానియమ్మహాత్మునిలీలావతారాద్భుతకర్మంబులులెక్కవెట్టనెవ్వరికినశక్యంబైయుండునీకుసంక్షేపరూపంబులనుపన్యసించితిసవిస్తరంబుగానెఱింగింపనాకుందరంబుగాదన్యులంజెప్పనేలవినుము॥. చ॥అమరఁద్రివిక్రమస్ఫురణనందినయమ్మహితాత్మ్మపాదవే।గమునహతంబులైనత్రిజగంబులకావలనెప్పసత్యలో।కముచలియించినంగరుణగైకొనికాచిధరించుపాదప।ద్మముతుదినున్నయప్రతిహతంబగుశక్తిగణింపశక్యమే॥. మ॥హరిమాయాబలమేనెఱుంగనటశక్యంబేసనందాదిస। త్పురుషానీకినికైనబుద్ధినితరంబుఁమానిసేవాధిక। స్ఫురణందచ్చరితానురాగగుణవిస్ఫూర్తిఁ సహస్రాస్యసుం। దరతఁబొల్పగు శేషుఁడున్నెఱుఁగఁడన్నఁ జెప్పలేరొండొరుల్॥. చ॥ ఇతరముమానితన్నుమదినెంతయునమ్మిభజించువారినా।శ్రితజనసేవితాంఘ్రిసరసీరుహుఁడైనసరోజనాభుఁడం। చితదయతోడనిష్కపటచిత్తమునంగరుణించునట్టివా। రతులదురంతమైతనరునవ్విభుమాయఁదరింతురెప్పుడుఁ॥. వ॥మఱియునుసంసారమగ్నులయిదివసంబులుగడపి యంతంబునశునకసృగాలభక్ష్యంబులయిన కాయంబులందుమమత్వంబుసేయకభగవదర్పణంబుసేసినపుణ్యాత్ములుకొందఱుగలరెఱింగింతువినుమేను నీబ్రహ్మత్వంబునంజెందురాజసంబువిడిచియమ్మహాత్మునిపాదారవిందంబులభక్తినిష్ఠుండనైశరణాగతత్వంబునభజియించునప్పుడు దెలియుదు; రాజసగుణుండనైనఁదెలియఁజాల; శాస్త్రంబులుప్రపంచింపక కేవలభక్తిజ్ఞానయోగంబునసేవింతు;మఱియుసనకాదులగుమీరును, భగవంతుండైనరుద్రుండు,దైత్యపతియైనప్రహ్లాదుండు,స్వాయంభవమనువు,నతనిపత్నియగుశతరూపయు,దత్పుత్రులగుప్రియవ్రతోత్తానపాదులనువారలు,దత్పుత్రికలు,ప్రాచీనబర్హియు, ఋభువు, వేనజనకుండగునంగుండు,ధ్రువుండును,గడువంజాలుదురువెండియు॥. సీ॥ గాధిగయానులిక్ష్వాకుదిలీపమాంధాతలు భీష్మయయాతిసగర। రఘుముచుకుందైళరంతి దేవోద్ధవసారస్వతోదంకభూరిషేణ। శ్రుతదేవమారుతిశతధన్వపిప్పలబలివిభీషణశిబిపార్థవిదురు। లంబరీషపరాశరాలర్క-సౌభరిదేవలమిథిలేశ్వరేంద్రదత్త। లార్ష్టిషేణాదులైనమహాత్మ్ములెలమిఁ।దవిలియర్థవుభక్తిఁజిత్తములనిలిపి।తత్పరాయణభక్తిదుర్దాంతమయిన।విష్ణుమాయఁదరింతురువిమలమతులు॥. మ॥అనఘావీరలనెన్ననేమిటికిఁదిర్యగ్జంతుసంతానపక్షినిశాటాటవికాఘజీవనివహస్త్రీశూద్రహూణాదులై।ననునారాయణభక్తియోగమ

సీతానందాత్ములై రేనివా।రనయంబుఁ దరియింతురవ్విభునిమాయా వై భవాంభోనిధిఁ॥. కావున॥క॥శశ్వత్ప్రశాంతు నభయుని।విశ్వాత్ముఁబ్రబోధమాత్రు విభుసంశుద్ధుఁ।శాశ్వతుసదసత్పూరుషు।నీశ్వరుఁజి త్తముననిలుపు మెపుడుమునీంద్రా॥.వ॥అస్లైననస్పుణ్యాత్ములనవద్యశీలురనవిద్యలజ్జావనతవదనయైపొందంజాలక వై ముఖ్యంబునం దవ్వుదవ్వులందలంగిపోవుమఱియు॥.చ॥హరిఁబరమాత్మునచ్యుతుననంతునిఁజి త్తములోఁదలంచిను।స్థిరతవిశోక సౌఖ్యములఁజెందినధీనిధులన్యకృత్యముల్। మరులునఁజేయనొల్లరుతలంచినన్టదయాసు రేంద్రుఁడుం।బరువడినుయ్యిఁగ్ర వ్వేడు *నిపాన శ్రీఖనిత్రముమానుకై వడిఁ॥.ఉ॥సర్వఫలప్రదాతయునుసర్వశరణ్యుఁడుసర్వశ క్తుఁడు।న్సర్వజగత్ప్రసిద్ధుఁడునుసర్వగతుండనుచక్రపాణియా।సర్వశరీరులున్విగమసంగతిఁజెందివిశీర్యమాణులై।పర్విననచోనభంబుగతిబ్రహ్మముదాఁజెడకుండునెప్పుడుఁ॥.ఉ॥కారణకార్యహేతువగుకంజదళాతునికం టెనన్యులె। వ్వారును లేరుతంద్రిభగవంతుననంతునివిశ్వభావనో। దారునిసద్గుణావళులుదా త్తమతిన్గొనియాడకుండినఁ। జేరవుచి త్తముల్ ప్రకృతిఁజెందనినిర్గుణమైనబ్రహ్మముఁ॥ ష॥ నిగమార్థ§ప్రతిపాదక ప్రకటమైనిర్వాణసంధాయిగా। భగవంతుండురచింపభాగవతకల్పక్ష్మాజమైశాస్త్రరా। జి గనిక్షంబునునీపురాణకథసంక్షేపంబుగాఁజెప్పితిఁ।జగతిన్నీవురచింపుదీనినతివిస్తారంబుగాఁబుత్రకా॥. చ ॥ పురుషభవంబునొందుటయుఁబూర్వపుజన్మములందునందుభూ। సురకులమందుఁబుట్టుటలుచోద్యములిట్లగుటన్మనుష్యుల। స్థిరమగుకార్యమద్దశలచేతనశింపకవిష్ణుసేవనా।పరతఁదనర్చినిత్యమగుభవ్యపథంబునునొందుటొప్పదే॥. మ ॥ ఉపవాసవ్రతశౌచశీలమఖసంధ్యోపాసనాగ్నిక్రియా। జపదానాధ్యయనాదికర్మములమోతుప్రాప్తి సేకూరద । చ్చపుభక్తిఁహరిఁబుండరీకనయనుఁసర్వాతిశాయిఁరమా।ధిపుఁబాపఘ్నుఁబరేశునచ్యుతునినర్థింగొల్వ లేకుండినఁ॥. క॥ వనజాత్ముమహిమనిత్యము। వినుతించుచునొరులు వొగడవినుచున్మదిలో। నను మోదించుచునుండెడు।జనములువన్మాయవశతఁజనరేంద్రా॥. క॥ అనివాణీశుఁడునారద।మునివరునకుఁజెప్పినట్టిముఖ్యకథాసూ।చనమతిభక్తిఁబరీక్షి।జ్జనపాలునితోడ

### ——శ్రీ పరీక్షిన్మహారాజుశుకయోగినిఁబ్రపంచోద్భవాదిప్రశ్నలడుగుట. శ్రీ——

యోగిచంద్రుఁడునుడివెఁ॥. సీ ॥ వినుశుకయోగికిమను జేశుఁడిట్లనుమునినాథదేవదర్శనముగలుగు । నారదమునికిఁబంకేరుహభవుఁడెఱిఁగించిన తెఱఁగుసత్కృపదలిర్ప।గణుతింపసత్త్వాదిగుణశూన్యుఁడగుహరిగమలాక్షులోకమంగళములయినకథలునాకెఱిఁగింపఁగైకొనినిస్సంగమైననాహృదయాబ్జమందుఁగృష్ణు।భవ్యచరితునినాద్యంతభావశూన్యుఁ। జిన్మయాకారుననఘులక్ష్మీసమేతు।నిలిపియస్థిరవిభవంబునిఖిల †హేయ।భాజనంబై నయీకళేబరమువిడుతు॥. వ॥ అదియునుంగాకయెవ్వఁడుశ్రద్ధాభక్తియుక్తుండైకృష్ణుగుణకీర్తనంబులువినుచుంబలుకుచుండునట్టివానిహృదయపద్మంబునందుఁగర్ణరంధ్రమార్గంబునంబ్రవేశించికృష్ణుండువిశ్రమించిసలిలగతంబైనకలుషంబునుశరత్కాలంబు నివారించుచందంబుననాత్మగతంబైనమాలిన్యంబునపకర్షించుఁగావున॥. మ॥భరితోదగ్రనిదాఘతప్తుఁడగునప్పాంథుండరణ్యాదిసం। చరణక్లేశసముద్భవంబగుపిపాసంజెందియాత్మీయమం। దిరముంజేరిగతశ్రముండగుచునెందేనిన్జనఁ లేనిభంగిరమాధీశుపదారవిందయుగసంగీభూతుఁడై మాను నే॥.వ॥అదియునుంగాకసకలభూత ¶సంసర్గశూన్యంబయినయాత్మకుభూతసంగమంబేప్రకారంబుగలిగెనదినిర్నిమిత్తంబునంజేసియో,కర్మంబునంజేసియో,యాక్రమంబునాకెఱింగింపుము॥. సీ॥ ఎవ్వనినాభియందెల్లలోకాంగసంస్థానకారణపంకజంబువొడమె। నందుదయించిసర్వావయవస్ఫూర్తిఁదనరారునట్టిపితామహుండు।గడఁగియెవ్వనియనుగ్రహముననిఖిలభూతములసృజించెనుతత్క్రమంతతోడ।నట్టివిధాతయేయనుపునసర్వేశురూపంబుగనుఁగొనెరుచిరభంగి।నాపరంజ్యోతియైనపద్మాక్షునకును।నళినజునకుఁబ్రతీకవిన్యాసభావ।గతులవలననుభేదంబుగలదెచెపుమ।యతిదయాసాంద్రయోగికులాబ్ధిచంద్ర॥. వ॥మఱియునుభూతేశ్వరుండయినసర్వేశ్వరుండుత్పత్తిస్థితిలయకారణంబైనతనమాయనువిడిచిమాయానియామకుండై యేయేప్రదేశంబులశయనంబు సేసెనదియునుంగాకపురుషావయవంబులచేఁబూర్వకాలంబునలోకపాలసమేతంబులైనలోకంబులుగల్పితంబులయ్యెననియు,లోకంబులుపురుషావయవంబులనియుంజెప్పంబడియె-నదియునుంగాకమహాకల్పంబులు,నవాంతరకల్పంబులును,భూతభవిష్యద్వర్తమానకాలంబులు,స్థూలదేహాభిమానులైజనియించినదేవపితృమనుష్యాదులకుంగలుగునాయుర్ప్రమాణంబు,మహత్స్వాత్మకాలానువర్తనంబు, నేయేకర్మంబులంజేసిజీవులేయేలోకంబులనొందుదురు. మఱియు నేయేకర్మంబు

*నిపాన।నీళ్లతొట్టి.— శ్రీఖనిత్రము।త్రవ్వేసాధనము.— §ప్రతిపాదక।తెలుపునట్టిది.— †హేయ।నింద్యము.— ¶సంసర్గ।సంబంధము.

లంజేసి దేహాదికర్మశరీరంబులం బ్రాపింతురట్టికర్మమార్గప్రకారంబు,*సత్త్వాదిగుణంబులపరిణామంబులగు దేవాదిరూ
పంబులంగోరుజీవులకు నేయేకర్మసముదాయంబెట్టు సేయందగు, నెవ్వనికినర్పింపందగునవియెవ్వని చేతఁ గ్రహింపంబడు
భూపాతాళ ‡కకుబ్వ్యోమ గ్రహనక్షత్రపర్వతంబులు,సరిత్సముద్రద్వీపంబులు నేప్రకారంబున సంభవించె, నాయాస్థా
నంబులంగలవారిసంభవంబు లేలాటివి,§బాహ్యాభ్యంతరంబులంగలుగు బ్రహ్మాండప్రమాణం బెంత,మహాత్ములచరిత్రంబు
లెట్టివి,వర్ణాశ్రమవినిశ్చయంబులు,ననుగతంబులై యాశ్చర్యావహంబులగుహరియవతారచరిత్రంబులు, యుగంబులు,
యుగప్రమాణంబులుఁ,బ్రతియుగమందును మనుష్యులకే యేధర్మంబు †లాచరణీయంబులు, మనుష్యకర్తవ్యంబులగుసా
ధారణధర్మంబులు,విశేషధర్మంబులు,జాతివిశేషధర్మంబులు,రాజర్షిధర్మంబు,లాపత్కాలజీవనసాధనభూతంబులగుధర్మం
బులుమహదాదితత్త్వంబులసంఖ్యయు,సంఖ్యాలక్షణంబు,నాతత్త్వంబునకు హేతుభూతలక్షణంబు, భగవత్సమారాధనవి
ధంబు,నష్టాంగయోగక్రమంబు,యోగీశ్వరులయణిమాద్యైశ్వర్యప్రకారంబు,వారలయర్చిరాదిగతులు,లింగశరీరవిల
యంబు,ఋగ్యజుస్సామవేదంబులు,నుపవేదంబులైనయాయుర్వేదాదులు,ధర్మశాస్త్రంబులు,నితిహాసపురాణంబులసం
భవంబు,సర్వభూతంబులయవాంతరప్రళయంబు,స్థితిమహాప్రళయంబులు,నిష్టాపూర్తంబులను,యాగాదివైదికకర్మజా
లంబును,వాపీకూపతటాకదేవాలయాదినిర్మాణంబులన్నదానంబారామప్రతిష్ఠ మొదలగుస్మార్తకర్మంబులుఁ గామ్యం
బులైనయగ్నిహోత్రంబులయనుష్ఠానప్రకారంబు,జీవసృష్టియు,ధర్మార్థకామంబులనియెడుత్రివర్గాచరణప్రకారం
బు,మలినోపాధికపాషండసంభవంబు,జీవాత్మబంధమోక్షప్రకారంబు,స్వరూపావస్థానవిధంబు,సర్వస్వతంత్రుండైన
యీశ్వరుండాత్మమాయంజేసిసర్వకర్మసాక్షియై క్రీడించుటయు, మఱియు మాయ నెడఁబాసియుదాసీనగతివిభుండై
క్రీడించు తెఱంగు,నివియెల్లఁ గ్రమంబున నాపన్నుండనయిన నాకు నెఱింగింపుము. బ్రాహ్మణశాపంబునంజేసి శోక
వ్యాకులితచిత్తుండనై యనశనవ్రతుండనై ననీవువినుటయెట్లనిసందేహింపవలవదు; త్వదీయముఖారవిందవినిస్రుతనా
రాయణకథామృతపానకుతూహలినయిన నాకునింద్రియంబులువశంబులై యుండునదిగావున నేనడిగినప్రశ్నంబులకు
నుత్తరంబులుసవిస్తరంబుగానానతిచ్చికృతార్థునిఁ జేయఁ బరమేష్ఠితుల్యుండవగునీవపూర్వసంప్రదాయానురోధంబు
ననర్హుండవగుదువనివిష్ణురాతుండయినపరీక్షిన్నరేంద్రుండు బ్రహ్మరాతుండయినశుకయోగినడిగిననతండు బ్రహ్మనా
రదసంవాదంబు నేకసంప్రదాయానుగతంబుగ తాగలిక ప్రకారంబునై తొల్లి సర్వేశ్వరుండు బ్రహ్మకల్పంబున బ్రహ్మ
కుపదేశించినభాగవతపురాణంబు వేదతుల్యంబునీకెఱింగింతువినుమని చెప్పెననిసూతుండు శౌనకాదిమహామునులకుం
జెప్పినట్లుశుకయోగీంద్రుండుపరీక్షిన్నరేంద్రునకిట్లనియె॥ సీ॥ భూపాలకోత్తమ భూతహితుండు సుజ్ఞానస్వరూపకుఁడై
నయట్టి। ప్రాణికి దేహసంబంధమెట్లగునన్న మహినెప్పునీశ్వరమాయ లేక। కలుగమి నిద్రవోఁ గలలోనఁ దోఁచిన దేహబం
ధంబుల తెఱఁగు కరణి। హరియోగమాయామహత్త్వంబునం బాంచభౌతిక దేహసంబంధుఁడగుచు। నట్టిమాయాగుణంబు
లనాత్మలోన। బాల్యకౌమారయౌవనభావములను। నరసుపర్వాదిమూర్తులఁ బొరసియేసు। నాయదిదియనుసంసారమా
యఁదగిలి॥ వ॥ వర్తించుచునిట్లున్నజీవునికిభగవద్భక్తియోగంబునముక్తిసంభవించుటయెట్లనిన నెప్పుడేనిజీవుండు ప్రకృ
తిపురుషాతీతంబగు బ్రహ్మస్వరూపంబునందుమహితధ్యాననిష్ఠుండగునప్పుడువిగతమోహుండై యహంకారమమకా
రాత్మకంబయినసంసరణంబుం దొరంగిముక్తుండై యుండు; మఱి జీవేశ్వరులకు దేహసంబంధంబులు గానంబడుచుండున
ట్టి దేహధారియైనభగవంతునందుభక్తింజేసిజీవునకుముక్తిరా తెఱంగునంగలుగుననియడిగితివి జీవుండవిద్యామహిమం
జేసికర్మానుగతంబయినమిథ్యారూప దేహసంబంధుండుభగవంతుండు నిజయోగమాయామహిమంబున స్వేచ్ఛాపరిక
ల్పితచిద్ఘనలీలావిగ్రహుండుగానభగవంతుండగునీశ్వరుండు స్వభజనంబు ముక్తిసాధనంబని చతుర్ముఖునకుఁ దదీయని
ష్కపటతపశ్చర్యావిశేషంబయిననిజజ్ఞానానందఘనంబయినస్వరూపంబుసూపుచు నానతిచ్చెనదిగావున జీవునికిభగవ

### ❋ శ్రీమన్నారాయణుండు బ్రహ్మతపంబునకు మెచ్చివరంబులిచ్చుట. ❋

ద్భక్తి మోక్షప్రదాయకంబగు నిందులకొకయితిహాసంబుగలదెఱింగింతు నాకరఁగొనుము; దానభవదీయసంశయని
వృత్తియయ్యెడుననిశుకయోగీంద్రుండురాజేంద్రునకిట్లనియె॥ సీ॥ హరిపాదభక్తిరహస్యోపదిష్టయునఖిలదేవతలకు

---

*సత్త్వాదిగుణంబులు॥ సత్త్వగుణ-రజోగుణ-తమోగుణములయొక్క పరిణామంబులగువికారంబులైన.— ‡కకుబ్వ్యోమ॥ కకుప్। దిక్కు-వ్యోమ।ఆకాశము.— ¶సరిత్।నది.— §బాహ్యాభ్యంతరంబులం। వెలుపలలోపల.— †ఆచరణీయంబులు।ఆచరింపఁదగినవి.

నధివిభుండు। నైనవిధాతకల్పాదియందునునిజాశ్రయపద్మమునకధిష్ఠానమరయ। నర్థించిజలములనన్వేషణము సేసినతి నంబు మొదలుగానంగలేక। విసివిబ్రహ్మ యనుదబ్జసరుహాసీనుఁడై సృష్టినిర్మాణేచ్ఛఁజిత్తమందుఁ।జాలనూహించితత్త్వ విజ్ఞానమహిమ। సరణిమనమునఁదోఁపకజడనుపడుచు। లోకజాలంబుపుట్టింపలేక మోహి। తాత్ముఁడై చింత నొందునయ్యవసరమున.వ॥జలమధ్యంబుననుండియక్షరసమామ్నాయంబునస్పర్శంబులందుషోడశాక్షరంబుమఱియు నేకవింశాక్షరంబునైననీయక్షరద్వయంబువలననగుచుమహామునిజనధనంబయినతపయనుశబ్దంబు రెండుమాఱులుచ్చరింపంబడి వినంబడిననట్టిశబ్దంబువలికినపురుషునివీక్షింపంగోరినలుదిక్కులకుం జని వెదకియెందునుంగానక మఱలినిజస్థానంబయినపద్మంబునందాసీనుండై యెక్కించుకచింతించి యట్టిశబ్దంబుదన్నుఁదపంబు సేయుమనినియమించుటగాఁదలంచి-ప్రాణాయామపరాయణుండై జ్ఞానేంద్రియకర్మేంద్రియంబులఁజయించివియేకాగ్రస్వాంతుండై సకలలోకసంతాపహేతువగు తపంబు వేయిదివ్యవత్సరంబులుగావింప నీశ్వరుండుప్రసన్నుండై పొడసూపిననక్కమలసంభవుండుదక్షిణంబరాజసతామసమిశ్రసత్త్వగుణాతీతంబు,శుద్ధసత్త్వగుణావాసంబు,నకాలవిక్రమంబు,సర్వలోకోన్నతంబు,సకలసురగణస్తుత్యంబు,లోభమోహభయవిరహితంబు,నపునరావృత్తిమార్గంబు,ననంతతేజోవిరాజితంబునైనవైకుంఠపురంబుంబొడగని యందు॥సీ॥సూర్యచంద్రానలస్ఫురణలఁజొరనీకనిజదీధితిస్ఫూర్తినివ్వటిల్ల। దివ్యమణిప్రభాదీపితసౌధవిమానగోపురహర్మ్యమంటపములఁ।బ్రసవగుచ్ఛస్వచ్ఛభరితకామితఫలసంతానపాదపసముదయములఁ।గాంచనదండసంగతమారుతోద్ధూతతరళవిచిత్రకేతనచయముల। వికచకైరవదరదరవిందగతమ। రందరసపానమోదితేందిందిరప్రభూతమంజులనినదప్రబుద్ధరాజ। హంసశోభితవరకమలాకరముల॥ సీ॥ వలనొప్పఁగానదైవంకేశవాత్సరంబనిపల్కు-రాజకీరావళియును।మహిమసర్వంవిష్ణుమయముజగత్తనిచదివెడుశారికాసముదయంబు। నేపారఁగాజితంతేపుండరీకాక్షయనిలీలఁబాడుపికావళియును। లలిమీఱఁగామంగళమధుసూదనయనిపల్కు-కేకులనారతంబు।తవిలిశ్రీషడ్వషట్స్వధేత్యాతిశబ్దకలితముగబ్రాయుమధుపనికాయములును।గలిగియఖిలైకదివ్యమంగళవిలాస।మహిమఁజెన్నొందువైకుంఠమందిరంబు॥ వ॥ మఱియుంబయోధరావళీవిభాసితనభంబుంబోలె వెలుంగుచున్నయద్దివ్యధామంబునందు॥ సీ॥ సలిలతేందీవరశ్యామాయమానోజ్జ్వలాంగులునవ్యపీతాంబరులును। ధవళారవిందసుందరపత్రనేత్రులుసుకుమారతనులుభాసురవినూత్న।రత్నవిభూషణ*గ్రైవేయకంకణహారకేయూరమంజీరధరులు। నిత్యయావనులువినిర్మలచరితులురోచిష్ణులు నుహరిరూపధరులు। నగుసునందుండునందుఁడునర్హణుండు। ప్రబలుఁడును మొదలగునిజపార్శ్వచరులు।మఱియు వైదూర్యవిద్రుమామలమృణాళ। తుల్యగాత్రులుదనుభక్తితోభజింప॥ సీ॥ తూలితాఖిలకల్మషవ్రజామరనదీజనకకోమలపదాబ్జములవాని। నఖిలసంపత్కారణాపాంగలక్ష్మీవిలాసితవక్షస్థలంబువానిఁ। బద్మమిత్రామిత్రభాసురలోచనునలినసుందరవదనంబువాని। భువననిర్మాణనైపుణభవ్యనిజజన్మకారణనాభిపంకజమువాని। నహిహితాహితశయనవాహనమువాని। సేవితామరతాపసశ్రేణివాని।నఖిలలోకంబులకుగురుఁడయినవానిఁ।గాంచెఁబరమేష్ఠిగన్నులకఱవుదీఱ॥ క॥ కమనీయరూపరేఖా। రమణీయతఁజాలనొప్పరమణీమణియ। క్కమలాలయదనమృదుకర।కమలంబులవిభునిపాదకమలములొత్తఁ॥వెండియు॥ శా॥ శ్రీకాంతాతిలకంబురత్నరుచిరాజిప్రేంఖితస్వర్ణడోలా కేళిన్విలసింపఁదక్కచభరాలంకృత్సిగామోదలో। భాకీర్ణప్రచరన్మధువ్రతమనోజ్ఞాలోలనాదంబుల।స్తోకానుస్వరలీలనొప్పఁగనిజేశుస్వేచ్ఛతోఁబాడఁగా॥ అట్టినిత్యవిభూతియందు॥ మ॥ సతతజ్ఞానరమాయశోబలమహైశ్వర్యాదియుక్తుఁజగత్పతియక్షేశుననంతునచ్యుతుదళత్పంకేరుహాక్షుఁశ్రియః। పతినాద్యంతవికారదూరుఁగరుణాపాథోనిధింసాత్వతాం।పతివర్ధిష్ణుసహిష్ణువిష్ణుగుణవిభ్రాజిష్ణురోచిష్ణునిఁ॥మ॥ దరహాసామృతపూరితాస్యునిజభక్తత్రాణపారాయణుం।దరుణాంభోరుహపత్రలోచనునిఁబీతాచ్ఛాదనుఁలోకసుం। దరుమంజీరకిరీటకుండలముఖోద్యద్భూషుయోగీశ్వరే।శ్వరులక్ష్మీయుతవక్షుఁజిన్మయుదయాసాంద్రుఁజతుర్బాహునిఁ॥ వ॥ మఱియు శీననర్ఘరత్నమయసింహాసనాసీనుండు,సునందనందకుముదాది సేవితుండుఁ,బ్రకృతిపురుషమహదహంకారంబులును,జతుశ్శక్తులుఁ,గర్మేంద్రియజ్ఞానేంద్రియమనోమహాభూతంబులనుషోడశశక్తులుఁ,బంచతన్మాత్రంబులును బరివేష్టింపఁగోట్యర్కప్రభాభాసితుండునై స్వేతరాలభ్యస్వాభావికసమస్తైశ్వర్యాతిశయుండునై స్వస్వరూపంబునంగ్రీడించుసర్వేశ్వరుండైనపరమపురుషుంబుండరీకా

* గ్రైవేయము।కంఠాభరణము-హార।ముత్యాలహారము-కేయూర।భుజకీర్తులు-మంజీర।అందెలు.— అనర్ఘ।వెలలేని.

డును నారాయణుం జూచి సాంద్రానందకందళితహృదయారవిందుండు రోమాంచకంచుకితశరీరుండు నానందబాష్పధారా*సిక్తకపోలుండగుచు॥ క॥ వరపరమహంసగమ్యా। స్ఫురణం దనరారు పరమపురుషుని పదపం। కరుహములకు నజుఁడు చతు। శ్శిరములు సోఁకంగ నతులు సేసిన హరియున్॥ చ॥ ప్రియుఁడగు బొడ్డుదమ్మితొలుబిడ్డఁడు వేలుపుపెద్ద భూతసం। చయములఁ జేయు కర్త నిజశాసనపాత్రుఁడు ధాత మ్రొక్కినన్। దయదళుకొత్తఁ బల్కె ¶ప్రమదస్మితచారుముఖారవిందుఁడై। నయమునఁ బాణిపంకజమునన్ హరి యాతని దేహమంటుచున్॥ ఇట్లనియె॥ గీ॥ కపటమునులకెంతకాలంబునకు నైన। సంతసింప నేను జలజగర్భ। విరతపస్సమాధిఁ జెందివిసర్గేచ్ఛ। మెలఁగు నిన్నుఁ బరిణమింతుఁ గాని॥ గీ॥ భద్రము గాక నీకు నో పద్మగర్భ। వరము నిపుడిత్తు నెఱిఁగింపు వాంఛితంబు। దేవదేవుఁడనగు నస్మదీయపావ। దర్శనంబవధి విపత్తిదశలకనఘ॥ చ॥ సరసిజగర్భ నీ యెడఁ బ్రసన్నత నొందిమదీయలోకమే। నిరవుగఁ జూపు టెల్లను నహేతుకభూరిదయాకటాక్షవి। స్ఫురణను గాని నీదగు తపోవిభవంబునఁ గాదు నీ తప। శ్చరణము నాదువాక్యముల సంగతిఁ గాదె సరోజసంభవా॥ క॥ తపమనఁగ నాదు హృదయము। దపమన మద్రూపమనఘ ధర్మముఁ దపమా। దపమున నే జననస్థి। త్యుపసంహరణములొనర్చుచుండుదుఁ దనయా॥ క॥ కావున మద్భక్తికిఁ దప। మే విధమున మూలధనము నిది నీ మది రా। జీవభవ యెఱిఁగి తపమిటు। గావించుట విగతమోహకర్ముఁడవింకన్॥ క॥ అనియానతిచ్చి కమలజ। యొనయఁగ భవదీయమానసేప్సితమేమై। నను నిత్తు వేఁడుమనినను। వనరుహసంభవుఁడు వికచవదనుండగుచున్॥ చ॥ హరివచనంబులాత్మకుఁ బ్రియంబొనరింపఁ బయోజగర్భుఁడో। పరమపదేశ యోగిజనభావనయీ నిఖిలోర్వియందు నీ। వరయ నియట్టియర్థమొకఁడైనను గల్గునె యైన నామది। స్వైరసినకోర్కి దేవ వినుపింతుఁ దయామతిఁ జిత్తగింపవే॥ వ॥ దేవా సర్వభూతాంతర్యామివై భగవంతుండవైన నీకు నమస్కరించి మదీయవాంఛితంబు విన్నవించెద నవధరింపుమవ్యక్తరూపంబులై వెలుంగు భవదీయస్థూలసూక్ష్మరూపంబులు నానాశక్త్యుపబృంహితంబులయిన బ్రహ్మాదిరూపంబుల నీయంత నీవె ధరియించి జగదుత్పత్తిస్థితిలయంబులందంతు కీటంబునుం బోలెఁ గావించుచు నమోఘసంకల్పుండవై లీలావిభూతిం గ్రీడించు మహిమంబుఁ దెలియునట్టి పరిజ్ఞానంబుఁ గృపసేయుము భవదీయశాసనంబున జగన్నిర్మాణంబుఁ గావించునపుడు బ్రహ్మాభిమానంబునం జేసి యవశ్యంబును మహదహంకారంబులు నా మదిం బొడముం గావునఁ దత్పరిహారార్థంబు వేఁడెద నన్నుం గృపాదృష్టి విలోకించి దయసేయుమని విన్నవించిన నాలించి పుండరీకాక్షుండతనికిట్లనియె॥ క॥ వారిజభవ శాస్త్రార్థవి। చారజ్ఞానమును భక్తిసమధికసాక్షా। త్కారములను నీమూఁడును। దారతనీ మనమునం దుధరియింపనగున్॥ సీ॥ పరికింప మత్స్వరూపస్వభావములును మహిమావతారకర్మములు దెలియు। తత్త్వవిజ్ఞానంబు దలకొని మత్ప్రసాదమునఁ గల్గెడి నీకుఁ గమలగర్భ। సృష్టిపూర్వమునఁ జర్చింప నే నొక్కరుండ గలిగి యుండుదు వీతకర్మ నగుచు। సమధికస్థూలసూక్ష్మస్వరూపములుఁ దత్కారణప్రకృతియుఁ దగ మదంశ। మందు లీనమైన నద్వితీయుండనై। యుందునాకునన్యమొకటి లేదు। సృష్టికాలమందు సృష్టినాశంబున। జగము మత్స్వరూపమగును వత్స॥ క॥ అరయఁగఁ గల్పప్రళయాం। తరమున నాద్యంతవిరహితక్రియతోడన్। బరిపూర్ణనిత్యమహిమం। బరమాత్ముఁడనై సరోజభవ యేనుందున్॥ వ॥ అదియునుం గాక నీవు నన్నడిగిన యీ జగన్నిర్మాణమాయాప్రకారం బెఱింగింతు లేనియర్థంబు శుక్తిరజతభ్రాంతిని యేమిటి మహిమం దోఁచి క్రమ్మఱం దోఁచక మానునదియె మదీయమాయావిశేషంబని యెఱుంగుమదియునుం గాక లేనియర్థంబు దృశ్యంబగుటకుం, గలయర్థంబు దర్శనగోచరంబు గాకుండుటకును, ద్విచంద్రాదికంబును, దమఃప్రభాసంబును దృష్టాంతంబులుగాఁ దెలియుమే ప్రకారంబున నేమి ‡మహాభూతంబులు §భౌతికంబులయిన ఘటపటాదులందుం బ్రవేశించి యుండు నా ప్రకారంబున నేను నీ భూతభౌతికంబులయిన సర్వకార్యంబులందు సత్త్వాదిరూపంబులం బ్రవేశించి యుండుదు భౌతికంబులు భూతంబులయందుఁ గారణావస్థం బొందుచందంబున భూతభౌతికంబులు గారణావస్థం బొందిన వాయందు నభివ్యక్తంబులై యుండవు సర్వదేశంబులయందు సర్వకాలంబులయందు నేది బోధితంబై యుండు నట్టిదయ పరబ్రహ్మస్వరూపంబు తత్త్వంబెఱుంగ నిచ్ఛయించిన మిముబోఁటి వారలకు నీ చెప్పినది మదీయతత్త్వాత్మకంబయిన యర్థంబని యెఱుంగుదురీయర్థంబుత్కృష్టంబయిన యదియే కాగ్రచిత్తుండవై యాకర్ణించి భవదీయచిత్తంబున ధరియించిన నీకు సర్గాదికర్మంబులందు మోహంబు చెందకుండెడినని భగవంతుండయిన పరమేశ్వరుండు చతుర్ముఖున కాజ్ఞాపించి నిజలోకంబు

---

* సిక్తకపోలుండు। తడుపఁబడిన చెక్కిళ్లు గలవాఁడు.——¶ ప్రమదస్మితచారు॥ ప్రమద। సంతోషముతోఁ గూడిన-స్మిత। చిఱునవ్వుతోఁ గూడిన-చారు। సుందరమైన.——‡ మహాభూతంబులు। భూమి-జలము-అగ్ని-వాయువు-ఆకాశము.——§ భౌతికంబులైన। ఆ భూతములవల్లఁ గలిగిన.

తోనంతర్ధానంబు నొందెనని చెప్పి శుకుండు వెండియు నిట్లనియె॥ సీ॥ అవనీశ బ్రహ్మ యిట్లంతర్హితుండైనఁ బుండరీకాక్షుని
బుద్ధి నిలిపి। యానందమును బొందియంజలిఁ గావించి తత్పరిగ్రహమునఁ దనదు బుద్ధిఁ। గైకొని పూర్వప్రకారంబునను సమస్త
ప్రపంచంబెల్లఁ దగ సృజించి। మఱియొకనాఁడు ధర్మప్రవర్తకుఁడౌచు నఖిలప్రజాపతియైన కమల।గర్భుఁ డాత్మహితార్థమై
కాక సకల।భువనహితబుద్ధి నున్నతస్ఫురణ మెఱసి। మానితంబైన యమనియమముల రెంటి। నాచరించెను సమ్మోదితాత్ముఁ
డగుచు॥ అయ్యవసరంబున॥ క॥ *ఆనలినాసననందను। లైన సనందాదిమునుల కగ్రేసరుఁడు। న్నానుగఁ బ్రియతనుజుండగు।
నానారదముఁ డేగుదెంచె నబ్జజుకడకున్॥ క॥ చనుదెంచి తండ్రికిం బ్రియ। మొనరఁగ శుశ్రూషణంబు లొగిఁ జేసినచోఁ। దనదె
సఁ బ్రసన్నుఁ డగుటయుఁ। గని భగవన్మాయఁ దెలియఁగా నుత్సుకుఁడై॥ సీ॥ అవనీశ నీవు నన్నడిగిన పగిదిన తఁడు దండ్రి నడుగఁ
బితామహుండు। భగవంతుఁ డాశ్రితపారిజాతము హరి కృపతోడఁ దన కెఱింగించినట్టి। లోకమంగళ చతుశ్శ్లోకరూపంబును
దశలక్షణంబులఁ దనరు భాగ।వతము నారదున కున్నతిఁ జెప్పె నాతఁడు చారుసరస్వతీతీరమునను। హరిపదధ్యానపారీణుఁ
డాత్మవేది। ప్రకటతేజస్వియగు ‡శ్రీబాదరాయణునకుఁ। గోరి యెఱిఁగించె నమ్మహోదారుఁ డెలమి। నాకు నెఱిఁగించె నెఱిఁ
గింతు నీకు నేను॥ వ॥ అదియునుం గాక యిపుడు విరాట్పురుషుని వలన నీజగంబు లేవడువునఁ బొడమెనని యడిగిది మొదలయిన
కొన్ని ప్రశ్నలు నన్నడిగితివి యేను నన్నింటికి నుత్తరంబగునట్లుగా నమ్మహాభాగవతం¶బుపన్యసించెద నాకర్ణింపుము మహా
పురాణంబు చతుశ్శ్లోకరూపంబును, దశలక్షణంబుల సంకుచితమార్గంబుల నొప్పు; నందు దశలక్షణంబు లెయ్యవి యనిన స
ర్గంబు, విసర్గంబు, స్థానంబు, పోషణంబు, ఊతులు, మన్వంతరంబు, ఈశానుచరితంబు, నిరోధంబు, ముక్తియు, నాశ్రయంబు,
ననంబది తెఱంగులయ్యె. దశమవిశుద్ధ్యర్థంబునకుఁ దక్కిన తొమ్మిది లక్షణంబులు సెప్పంబడునవి యెట్టివనిన॥ గీ॥ మహదహం
కార§పంచతన్మాత్ర గగన।పవన శిఖి తోయ భూభూతపంచకేంద్రి।య ప్రపంచంబు భగవంతునం దుగనుట।సర్గమందురు దీని
నిజనవరేణ్య॥ క॥ సరసిజగర్భుండు విరా।ట్పురుషుని వలనన్ జనించి భూరితర చరా।చర భూతసృష్టిఁ జేయుటఁ। బరువడి నివిసర్గ
మండ్రు భరతకులేశా॥ శా॥ లోకద్రోహినరేంద్రా।నీకము బరిమార్చి జగము నెఱి నిల్పిన యా। వైకుంఠనాథకృతవిజ।యా
కల్పము స్థానమయ్యె నవనీనాథా॥ క॥ హరి సర్వేశుఁ డనంతుఁడు। నిరుపమశుభమూర్తి చేయు నిజభక్తజనో।ద్ధరణము పో
షణమవనీ। వరయూతులనంగఁ గర్మవాసనలరయన్॥ గీ॥ జలజనాభదయాకటాక్షప్రసాద।లబ్ధి నఖిలైకలోకపాలకవి
భూతి। మహిమఁ బొందిన వారి ధర్మములు విస్త।రమునఁ బలుకుట మన్వంతరములు భూప॥ క॥ వనజోదరు నవతారక। థన
ముఁ దదీయానువృత్తిఁ దచ్చారిత్రం।బును విస్తరించి పలుకం।జను నవి యీశానుకథలు సౌజన్యనిధీ॥ సీ॥ వసుమతీనాథ సర్వ
స్వామియైన గోవిందుండు చిదచిదానందమూర్తి। సలలితస్వోపాధిశక్తిసమేతుఁడై తన రారు నాత్మీయధామమందు। ఫణి
రాజమృదులతల్పంబుపై సుఖలీలయోగనిద్రారతి నున్న వేళ। నఖిలజీవులు నిజవ్యాపారశూన్యులై యున్నత తేజంబు
లుడుగుగొనఁగ। జంగమస్థావరాది చేష్టాదులెల్ల। విదితమగునట్లు వలుకుట యది నిరోధ। మననిది యవాంతరప్రళయంబ
నంగఁ బరగు నిఁక ముక్తిగతి విను పార్థివేంద్ర॥ సీ॥ జీవుండు భగవత్కృపావశంబునఁ జేసి దేహధర్మంబులై ధృతి ననేక।
జన్మానుచరితదృశ్యములైన యజ్జరామరణంబు లాత్మధర్మంబులయిన। ఘనపుణ్యపాపనికాయనిర్మోచన స్థితి నొప్పి పూ
ర్వసంచితములైన। యపహతపాప్మవత్త్వాదృష్టతద్గుణవంతుఁడై తగ భగవచ్ఛరీర।భూతుఁడై పారతంత్ర్యాత్మబుద్ధి నె
ప్పి। దివ్యమాల్యానులేపన భవ్యగంధ।కలిత మంగళ దివ్యవిగ్రహ విశిష్టుఁ।డగుచు హరిరూప మొందు టేయనఘ ముక్తి॥ వ॥ మ
ఱియు నుత్పత్తిస్థితిలయంబు లెందుననగుచుఁ బ్రకాశింపఁబడు నదియాశ్రయంబనఁబడు నదియ పరమాత్మ బ్రహ్మశబ్దవా
చ్యంబు- నదియ ప్రత్యక్షానుభవంబున విదితంబు సేయుకొఱకు నాత్మ కాధ్యాత్మ్యాది విభాగంబు సెప్పంబడియె నది యె
ట్లనిన నాత్మయాధ్యాత్మికాధిదైవికాధిభౌతికంబులఁ ద్రివిధంబయ్యె నందు నాధ్యాత్మికంబు చక్షురాదిగోళకాంతర్వర్తి
యై యెఱుంగఁబడుఁ జక్షురాదికరణాభిమానియై ద్రష్టయైన జీవుండె యాధిదైవికుండనఁదగుఁ జక్షురాద్యధిష్ఠానాభిమాని
దేవతయైన సూర్యాది తేజోవిగ్రహుండునగుచు నెవ్వనియందు నీయుభయవిభాగంబును గలుగు నతండె యాధిభౌతికుఁ
డు, విరాడ్విగ్రహుండునగుం గావున †ద్రష్టయు దృక్కు- దృశ్యంబు ననందగు నీమూఁటియందు నొకటి లేకున్న నొకటి గా
రాదీత్రితయంబు నెవ్వఁ డెఱుంగు నతండు సర్వలోకాశ్రయుండై యుండు నతండె పరమాత్మ యనమ్మహాత్ముండు లీల

*ఆనలినాసన। ఆ బ్రహ్మయొక్క.— అగ్రేసరుఁడు। పెద్దవాఁడు.— ‡శ్రీబాదరాయణుఁడు। వ్యాసుఁడు.— ¶ఉపన్యసించెదన్। చెప్పెద
ను.— §పంచతన్మాత్ర। శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములు.— †ద్రష్టయు। చూచేవాఁడు-దృక్కు। చూపు-దృశ్యం। చూడఁదగిన విషయము.

ర్థంబై జగ*త్సర్జనంబు సేయుతలంపున బ్రహ్మాండంబుని ర్భేదించి తనకుసుఖస్థానంబున పేక్షించి మొదలశుద్ధంబులగుజలం బులసృజియించె, స్వతఃపరిశుద్ధుండుగావునస్వసృష్టంబగు నేకార్ణవాకారంబైనజలరాశియందు, శయనంబు జేయుటం జేసి॥ శ్లోకము. ఆపోనారాఇతిప్రోక్తాఆపోవై నరసూనవః। తాయదస్యాయనంపూర్వం తేననారాయణస్మృతః ॥ అను ప్రమాణముచొప్పున నారాయణశబ్దవాచ్యుండుగావున నతనిప్రభావంబువర్ణింపనుర్లభం బుపాదానభూతంబయిన ద్రవ్యంబు,ద్రివిధంబయినకర్మంబు,కళాకాష్ఠాద్యుపాధిభిన్నంబయినకాలంబు,జ్ఞానాదికంబగుజీవస్వభావంబు,భోక్త యగుజీవుండు నెవ్వనియనుగ్రహంబునం జేసివర్తింపుచుండు, నెవ్వనియుపేక్షం జేసివర్తింపకుండు-నట్టిప్రభావంబుగల సర్వేశ్వరుండుదా నేకమయ్యు నానేకంబుగాఁదలంచియోగతల్పంబునం శిప్రబుద్ధుండై యుండు-నటమీఁదస్వసంకల్పం బునం జేసితనహిరణ్మయంబైనవిగ్రహంబు,నధిదైవంబు,నధ్యాత్మకంబు,నధిభూతంబుననుసంజ్ఞాయుతంబై త్రివిధంబు గాసృజియించి॥. సీ॥ అట్టివిరాడ్విగ్రహాంతరాకాశంబువలన నోజస్సహోబలములయ్యెఁ। బ్రాణంబుసూక్ష్మరూప క్రియాశక్తిచేజనియించిముఖ్యా †సువనఁగఁబరఁగె। వెలువడిచనుజీవి వెనుకొని ప్రాణముల్ చనుచుండునిజనాథునను సరించు। భటులచందంబునఁబాటిల్లుక్షుత్తునుభూరితృష్ణయుమఱిముఖమువలనఁ। దాలుజిహ్వాదికంబులుద్భవము నొందె। నందునుదయించెజిహ్వయనందురసము। లెల్లనుదయించిజిహ్వచే నెఱుఁగఁబడును। మొనసిపలుకనపేక్షించుముఖమువల న॥. వ॥ మఱియువాగింద్రియంబుపుట్టె- దానికి దేవత యగ్ని- ఆరెంటివలన భాషణంబు వొడమె-నాయగ్నికి సుహాజల వ్యాప్తంబగుజగంబుననిరోధంబుగలుగుటం జేసి యాజలంబె ప్రతిబంధకంబయ్యె-దోధూయమానంబయినమహావాయు వలనఘ్రాణంబుపుట్టెం గావునవాయుదేవతాకంబయిన ఘ్రాణేంద్రియంబు గంధగ్రహణసమర్థంబయ్యె-నిరాలోకంబ గునాత్మనాత్మయందుఁజూడంగోరి తేజంబువలననాదిత్య దేవతాకంబయి రూపగ్రాహకంబైనయక్షియుగళంబుపుట్టె ఋషిగణంబులచేతబోధితుండగుచు భగవంతుండు దిగ్దేవతాకంబును,శబ్దగ్రాహకంబునైన శ్రోత్రేంద్రియంబువు ట్టించె-సర్జనంబు సేయుపురుషునివలన మృదుత్వకాఠిన్యంబులులఘుత్వగురుత్వంబులు నుష్ణత్వశీతలత్వంబులునుం జేసె డు త్వగింద్రియాధిష్ఠానంబగుచర్మంబుపుట్టె- దానివలనరోమంబులుదయించె- వానికిమహీరుహంబులధిదేవతలయ్యె- నంమనధిగతస్పర్శగుణుండగు వాయువంతర్బహిర్గ్రప్రదేశంబులనావృతుండగు- బలవంతంబులునింద్రదేవతాకంబులు నాదానసమర్థంబులునానాకర్మకరణదక్షంబులునగుహస్తంబులుదయించె-స్వేచ్ఛావిషయగతిసమర్థుండగు నీశ్వరుని వలనవిష్ణుదేవతాకంబులగుపాదంబులుదయించెఁ-బ్రజానందామృతార్థియగు భగవంతునివలనఁబ్రజాపతిదేవతాకం బై స్త్రీసంభోగాదికామ్యసుఖంబులుగార్యంబులుగాఁగల శిశ్నోపస్థంబులుదయించె-మిత్రుండధిదైవతంబుగాఁగలిగి భుక్తాన్నాద్యసారాంశత్యాగోపయోగంబగుపాయువనెడిగుదంబుద్భవించె-దానికృత్యం బుభయమలమోచనంబు-దే హంబుననుండి దేహాంతరంబుఁజేరంగోరిపూర్వకాయంబువిడుచుటకుసాధనంబగు నాభిద్వారంబుసంభవించె, నట్టినా భియప్రాణాపానబంధస్థానంబనంబడుఁ, దద్బంధవిశ్లేషంబెమృత్యువగు, నదియ యూర్ధ్వాధోదేహభేదకంబనియుం జె ప్పంబడు,నన్నపానాదిధారణార్థంబుగ §నాంత్రకుక్షి నాడీనిచయంబులుఁగల్పింపఁబడియె-దానికినదులుసముద్రంబులు నధిదేవతలయ్యెఁదుష్టిపుష్టులనునుదర ¶భరణరసపరిణామంబులునుగలిగియుండు,నాత్మీయమాయాచింతనంబొనర్చున పుడుకామసంకల్పాదిస్థానంబగుహృదయంబుగలిగె, దానివలనమనంబుచంద్రుండుకాముండుసంకల్పంబునుదయించె, నంతమీఁదజగత్సర్జనంబు సేయువిరాడ్విగ్రహంబువలనసప్తధాతువులును,పృథివ్యప్తేజోమయంబులయినసప్తప్రాణం బులును, వ్యోమాంబువాయువులచేసుత్పన్నంబులయి గుణాత్మకంబులయినయింద్రియంబులు, నహంకారప్రభవంబు లయినగుణంబులును,సర్వవికారస్వరూపంబగుమనస్సును,విజ్ఞానరూపిణియగుబుద్ధియును, వివిధంబగునివియంతయుస ర్వేశ్వరునిస్థూలవిగ్రహంబునంబుట్టునుమఱియును॥ క॥వరుసఁబృథివ్యాద్యష్టా। వరణావృతమైనసమగ్రవైభవములఁబం।క రుహభవాండాతీత।స్ఫురణఁజెలువొందునతివిభూతిదలిర్పన్॥క॥పొలుపగుసకలవిలక్షణ। ములుగలయాద్యంతశూన్య మునునిత్యమునై।లలిసూక్ష్మమైమనోవా।క్కులకుందలపోయఁగానగోచరమగుచున్॥ సీ॥అలఘుతేజోమయంబైనరూ పంబిదిక్షితినాథనాచేతఁజెప్పఁబడియె।మానితస్థూలసూక్ష్మస్వరూపంబులవలననొప్పెడుభగవత్స్వరూప।మస్మహాత్మ కునిమాయాబలంబునఁజేసిదివ్యమునీంద్రులుదెలియలేరు। వసుధేశ వాచ్యమైవాచకంబైనామరూపముల్ గ్రియలును

---

* సర్జనంబు।సృష్టి.— శిప్రబుద్ధుండై।మేలుకొనినవాఁడయి.— †అసువు।ప్రాణము.— §ఆంత్రము।ప్రేగు.— ¶భరణ।నిండించుట.

రూఢిఁదాల్చి।యుండునట్టియీశ్వరుండు నారాయణుం।డఖిలధృతిజగన్నియంతయైన। చిన్మయాత్మకుండు సృజియించునీ ప్రజాపతులనృషులఁబితృతతులనపుడు॥ మఱియును॥సీ॥ సురసిద్ధసాధ్యకిన్నరవరచారణగరుడగంధర్వరాక్షసపిశాచ। భూతభేతాళకింపురుషకూశ్మాండగుహ్యకఢాకినీయక్షయాతుధాన। విద్యాధరాప్సరోవిషధరగ్రహమాతృగణవృకహరి *ఘృష్టిఖగమృగాళి।భల్లూక§రోహితపశువృక్షయోనులవివిధకర్మంబులు వెలయఁబుట్టి।జలనభోభూతలంబులసంచరించు। జంతుచయములసత్త్వరజస్తమోగుణములఁదిర్యక్సురాసురనరధరాది।భావములభిన్నులగుచురుఫార వేంద్ర॥ మ॥ఇరవొందఁగ ద్రుహిణాత్మకుండయిరమాధీశుండువిశ్వంబును।స్థిరతంజేసిహరిస్వరూపుఁడయిరక్షించుస్వసృష్టప్రజో। త్కరసంహారముసేయునప్పుడుహరాంతర్యామియైయింతయుఁ। హరియించుఁబవనుండు మేఘములమాయంజేయుచందంబునన్॥క॥ఈపగిదినిబిశ్వముసఁ।స్థాపించునుమనుచునడఁచుధర్మాత్మకుఁడై।దీపితతిర్యఙ్నరసుర। రూపంబులుదానై తాల్చిరూఢిదలిర్పన్॥సీ॥హరియందునాకాశమాకాశమున వాయువనిలంబువలనహుతాశనుండు।హవ్యవాహనునందునంబువులుదకంబువలనవసుంధరగలిగెధాత్రివలనబహుప్రజావళియుద్భవంబయ్యెనింతకుమూలమైయెసఁగునట్టి।నారాయణుఁడుచిదానందస్వరూపకుండవ్యయుఁడజుఁడునంతుఁడాఢ్యుఁ। డాదిమధ్యాంతశూన్యుండనాదినిధనుఁ। డతనివలననుసంభూతమైనయట్టి।సృష్టిహేతుప్రకారమీక్షించితెలియఁ।జాలరెంతటిమునులైసజనవరేణ్య॥ అదియునుంగాక ॥ మ ॥ ధరణీశోత్తమభూతసృష్టినిటుసంస్థాపించిరక్షించునా।హరికర్తృత్వముసెల్లఁడాత్మగతమాయారోపితంజేసితా।నిరవద్యుండునిరంజనుండుపరుఁడుర్విసిష్కించనుండాఢ్యుఁడున్। నిరపేక్షుండునునిష్కళంకుఁడగుచున్నిత్యత్వముంబొందెడిన్॥ వ॥ బ్రహ్మసంబంధియగునీకల్పప్రకారంబవాంతరకల్పంబుతోడసంకుచితప్రకారంబున నెఱింగించితి,నిట్టిబ్రహ్మకల్పంబుననొప్పుప్రాకృతవైకృతకల్పప్రకారంబులు,తత్పరిణామంబులు,గాలకల్పలక్షణంబులు, నవాంతరకల్పమన్వంతరాదిభేదవిభాగస్వరూపంబునతివిస్తారంబుగముందు నెఱింగింతువినుమదియునుంబద్మకల్పంబనందగునని భగవంతుఁడైనశుకుండుపరీక్షిత్తునకుఁజెప్పెననిసూతుండుమహర్షులకు నెఱింగించిన॥ క ॥ వినిశౌనకుండుసూతుం।గనుఁగొనియిట్లనియెసూతకరుణోపేతా।జనసుతగుణసంఘాతా।ఘనపుణ్యసమేతవిగతకలుషశ్రోత్రా॥వ॥పరమభాగవతోత్తముండైనవిదురుండుబంధుమిత్రజాతంబులవిడిచిసకలభువనపావనంబులుగీర్తనీయంబులునైనతీర్థంబులు నగణ్యంబులైనపుణ్యక్షేత్రంబులునుదర్శించిక్రమ్మఱవచ్చి ¶కౌషారవియగుమైత్రేయుంగనియతనివలననధ్యాత్మబోధంబువడసెననివినంబడునదియంతయు నెఱింగింపుమనిననతండిట్లనియె॥క॥ వినుమిపుడుమీరునన్నడి।గినతెఱఁగునశుకమునీంద్రుఁగేయుఁబరీక్షి।జ్జనపతియడిగిననతఁడా।తనికెఱిఁగించినవిధంబుఁదగనెఱిఁగింతున్॥ సావధానులై వినుండు॥ . . . . . . .

ఉ॥రామగుణాభిరామదినరాజకులాంబుధిసోమతోయదశ్యామదశాననప్రబలసైన్యవిరామసురారిగోత్రసు। త్రామసుబాహుబాహుబలదర్పతమఃపటులీప్రథామని।ష్కామకుభృల్లలామగరకంఠనతీసుతనామరాఘవా॥ క॥ అమరేంద్రసుతవిదారణ।కమలాప్తతనూజరాజ్యకారణభవనం।తమనదినేశ్వరరాజో।త్తమదైవతసార్వభౌమదశరథరామా ॥ మాలినీ ॥ నిరుపమగుణజాలానిర్మలానందలోలా। దురితఘనసమీరాదుష్టదైత్యప్రహారా।శరధిమదవిశోషాచారుసద్భక్తపోషా।సరసిజదళనేత్రాసజ్జనస్తోత్రపాత్రా ॥ ..................

గద్య॥ ఇది శ్రీకరుణాకలితకవితావిచిత్రకేసనమంత్రిపుత్రసహజపాండిత్యపోతనామాత్యప్రణీతంబయిన-శ్రీమహాభాగవతంబనుపురాణంబునందు బరీక్షిత్తుతోడశుకయోగిభాషించుటయు, భాగవతపురాణవైభవంబు, ఖట్వాంగుమోక్షప్రకారంబు, ధారణాయోగవిషయంబైనమహావిష్ణుని శ్రీపాదాద్యవయవంబులసర్వలోకంబులున్నతెఱంగు,సత్పురుషవృత్తియు, మోక్షవ్యతిరిక్తసర్వకామ్యఫలప్రదదేవతాభజనప్రకారంబు,మోక్షప్రదుండుశ్రీహరియనుటయు,హరిభజనావిరహితులైనజనులకుహేయతాపాదనంబు,రాజప్రశ్నంబుశుకయోగిశ్రీహరిస్తోత్రముసేయుటయు, వాసుదేవప్రసాదంబునంజతుర్ముఖుండుబ్రహ్మాధిపత్యంబువడయుటయు, శ్రీహరివలనబ్రహ్మరుద్రాదిలోకప్రపంచంబుపుట్టుటయు, శ్రీమన్నారాయణదివ్యలీలావతారపరంపరావైభవవృత్తాంతసూచనంబు, భాగవతవైభవంబు, పరీక్షిత్తు శుకయోగినడిగినప్రపంచాదిప్రశ్నలు, అందు శ్రీహరిప్రధానకర్తయని తద్వృత్తాంతంబుసెప్పుటయు, భగవద్భక్తివైభవంబు, బ్రహ్మతపశ్చరణంబునకుంబ్రసన్నుండైహరివైకుంఠనగరంబుతోడఁ బ్రసన్నుండైన స్తోత్రంబుసేసి తత్ప్రసాదంబునందన్మహిమవినుటయు, వాసుదేవుండానతిచ్చినప్రకారంబునబ్రహ్మనారదునికిభాగవతపురాణప్రధానదశలక్షణంబులువన్యసించుటయు, నారాయణవైభవంబు, జీవాదితత్త్వసృష్టియు. శ్రీహరినిత్యవిభూత్యాదివర్ణనంబుగల్పప్రకారాదిసూచనంబు,శౌనకుండువిదురమైత్రేయసంవాదంబుచెప్పుమనిసూతునడుగుటయునను కథలంగలద్వితీయస్కంధముసంపూర్ణము......శ్రీకృష్ణార్పణమస్తు. ...

* ఘృష్టి।పంది.—— §రోహిత।కేసరియనుమృగము.—— ‖ప్రాత।సమూహము.—— ¶కౌషారవి।కుషారవియనువానికుమారుఁడయిన

## తృతీయస్కంధప్రారంభము.

శ్రీమహితవినుతదివిజ|స్తోమయశస్సోమరాజ *సోమా సుమేరు| ⁑స్థేమవినిర్జితభార్గవ| రామాదశాననవిరామ రఘుకు
లరామా॥ వ॥ మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైన సూతుండిట్లనియె
నట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండిట్లనియె॥ ఉ॥ పాండునృపాలనందనులు బాహుబ
లంబున ధార్తరాష్ట్రులన్|భండనభూమిలో గెలిచి పాండురశారదచంద్రచంద్రికా|ఖండయశఃప్రసూనకలికావళిఁ గౌ
రవరాజ్యలక్ష్మినొం|డొండ యలంకరించుచు జయోన్నతి రాజ్యము సేయుచుండఁగన్॥ క॥ మనుజేంద్ర విదురుఁ డంతకు|ము
సువనమున కేగి యచట మునిజనగేయున్|వినుతతపోధౌరేయున్|ఘను ననుపమగుణవిధేయుఁ గనె మైత్రేయున్॥ క॥ కనుఁ
గొని తత్పాదంబులు|ననఘా లమునోఁక మ్రొక్కి తగనిట్లనియెన్|మునివర సకలజగత్పా| వనచరితుఁడు కృష్ణుఁడఖిలవం
ద్యుండెలమిన్॥ క॥ మండితతేజోనిధియై|పాండవహితమతిని దూతభావంబున †వే|దండపురి కేగి కురుకుల|మండనుఁడ
గు ధార్తరాష్ట్రుమందిరమునకున్॥ గీ॥ చనఁగ నెల్లకవార గృహంబునకు భక్త|వత్సలుండగు కృష్ణుండు వచ్చుటేమి| కతము
నాకది యెఱిఁగింపు కరుణతోడ|ననుచు విదురుండు మైత్రేయు నడిగె ననిన॥ క॥ విని వెఱఁగంది పరీక్షి|న్మనుజవరేణ్యుం డవి
మలమతి ¶నిస్తంద్రున్|మునికులజలనిధిచంద్రున్| సునిశితహరిభక్తిసాంద్రు శుకయోగీంద్రున్॥ క॥ కనియిట్లనె
మైత్రేయుని|ననఘుండగు విదురుఁ డేరహస్యము లడిగెన్|మునియేమి సెప్పె నేపగి| దిని దీర్థములాడె నెచటఁ దిరుగుచు నుం
డెన్॥ గీ॥ ఇన్ని దెలియంగ నానతీయిచ్చి నన్ను|నర్థి రక్షింపవే పవలాఁతరఁగ| ఘనదయాపాంగ హరిపాదకమలభృంగ|
మహితగుణసంగ పాపతమఃపతంగ॥ చ॥ అనవుడు బాదరాయణి ధరాధిపుతోననుఁ బూరువంశవ| ర్ధన వినుకష్టుఁడైన
ధృతరాష్ట్రనృపాలుఁడు పెంపుతో సుయోధన ✠ముఖపుత్రులంగడు ముదంబునఁ బెంచుచుఁ బాండురాజు దప్పిన పిదపన్
దదాత్మజులు §వెల్కుఱితన్నని చేరవచ్చినన్॥ వ॥ ఇట్లు వచ్చిన పాండవులయెడ నసూయానిమగ్నులై సుయోధనాదు
లు॥ క॥ పెట్టిరి విషాన్నమంటం|గట్టియు ఘనపాశములను గంగానదిలో| నెట్టిరి రాజ్యము వెడలం| గొట్టిరి ధర్మంబు విడిచి కుటి
లాత్మకులై॥ క॥ క్రూరాత్ములగుచు లాక్షా|గారంబున వారు నిద్రఁ గైకొనియుండన్|దారుణశిఖఁ దరికొలిపిరి|మారణకర్మ
ముల కప్రమత్తులగుచున్॥ గీ॥ సూరిజనగేయమగు రాజసూయయజ్ఞ|విలసదవభృథసేకపవిత్రమైన|ద్రౌపదీచారువేణీ
భరంబు వట్టి|కొలువులోపల నీడ్చిరి కుచ్చితమున॥ క॥ కావున వారలకపకృతి| గావింపని దొక దినంబు గలుగదు తమజ|న్మావధి
నిజనందనులను| వావిరి నయ్యంధనృపతి వలదనఁడయ్యెన్॥ గీ॥ మాయజూదంబు వన్నిదుర్మార్గవృత్తిఁ| బుడమిఁగొని యడ
వులకు బోనడువ నచటఁ| దిరిగి వారలు ※సమయంబు దీర్చి యేగు| దెంచి తమయంశ మడిగినఁ బంచియిడక| ఉన్నయెడ॥ చ॥ స
కల ❖నియంతయైన హరి సర్వశరణ్యుఁడు మాధవుండు సే|వకనవకల్పకంబు భగవంతుఁ డనంతుఁ డనంతశక్తి నం|దకధరుఁ
డబ్జలోచనుఁడు ధర్మతనూభవు చేసి యుక్తుఁడై| యకుటిలభక్తియోగమహితాత్మకుఁడై ధృతరాష్ట్రుపాలికిన్॥ క॥ చనియ
చట భీష్మగురుత|త్తనయకృపాచార్యనిఖిలధాత్రీపతులున్|వినియను మోదింపఁగనిట్లనియెన్ ధృతరాష్ట్రుతోడ నవనీ
నాథా॥ క॥ కౌరవపాండవులిరువురు|నారయ నీకొక్క సమము యవనీవరనీ| వేరీతినైనఁ బాండుకు|మారులపాలొసఁగితే
నిమను నుభయంబున్॥ క॥ అని ధర్మబోధమునఁ బలి| కిన మాటలఁ జెవులనిడమిఁ గృష్ణుఁడు విదురున్| ఘననీతిమంతుఁ బిలు
వన్|బనిచినఁ జనుదెంచెఁ గురుసభాస్థలమునకున్॥ వ॥ చనుదెంచి యచటి జనంబులచేత నుపస్థితంబయిన కార్యంబు దెలుపం
బడినవాఁడై ధృతరాష్ట్రు నుద్దేశించి యిట్లనియె॥ మ॥ ధరణీనాయక పాండుభూవిభుఁడు నీతమ్ముండు తత్పుత్రులన్| బరిర
క్షించిన ధర్మమందగవునుం బాటిల్లు వంశంబును |స్థిరసౌఖ్యోన్నతిఁ జెందు శత్రుజయమున్ జేకూరు గోపాలశే| ఖరుచి
త్తంబును వచ్చు నట్లగుటయుఁ గౌరవ్యవంశాగ్రణీ॥ గీ॥ వారి తండ్రిపాలు వారికి నొసఁగినీ| పాలు సుతులకెల్లఁ బంచియిచ్చి
చలము విడిచి ధర్మములవడనీబుద్ధిఁ| జొనుపుమయ్య కులము మనుపుమయ్య॥ చ॥ వినుము నృపాల నా పలుకు వేయననేల ?స
మీరసూతినీ|తనయులపేరు విన్నఁ బదతాడితదుష్టభుజంగమంబు చా|ప్పునఁ గనలొందు నింతయును మున్నునుఁ జెప్పితి గా
దె వానిచే|తనభవదీయపుత్రులకుఁ దప్పదు మృత్యువదెన్ని భంగులన్॥ అదియునుంగాక॥ క॥ నీపుత్రుల శౌర్యంబును|జా

*సోమా|శ్రేష్ఠుఁడా.— ⁑స్థేమ|దృఢముగలవాఁడా.— †వేదండపురి|హస్తినాపురము.— ¶నిస్తంద్రుఁడు|ప్రకాశించునట్టి.— ✠ముఖ|మొదలగు.— §వెల్కుఱి|చింతనొంది.— ※సమయంబు|ప్రతిజ్ఞ.— ❖నియంత|నియమించువాఁడు.— ?సమీరసూతి|భీముఁడు.

పాచార్యాపగాత్మజాతకృపభుజా।టోపంబునుగగ్గుమురా।లాపంబునునిజముగాఁదలంతెమనమునన్॥ అశ్లేనివినుము॥ ఉ
ఏపరమేశుచేఁజగములీసచరాచరకోటితోసము।ద్దీపితమయ్యెనేవిభునిదివ్యకళాంశజులబ్జగర్భగౌ। రీపతిముఖ్యదేవముని
బృందములెవ్వఁడనంతుఁడచ్యుతుం।డాపురుషోత్తముండుగరుణాంబుధికృష్ణుఁడువోనరేశ్వరా॥ ఉ॥ అట్టిజగన్నివాసుఁడు
మురాసురభేదివరావసుండుచే।పట్టిసఖుండువియ్యమునుబాంధవుఁడున్ గురుఁడున్ విభుండునై।*నిట్టలమైనప్రేమమున
నెప్పుడుఁజొప్పడుచుండువారలన్।§జుట్టనవ్రేలనెవ్వరికిఁజూపఁగవచ్చునుబార్థివోత్తమా॥ ఉ॥ కావునఁబాండునందను
లఁ†గారియఁబెట్టకరాజ్యభాగమున్।వావిరినిచ్చిరాజ్యమునువంశముఁబుత్రులబంధువర్గమున్। గావుముకాకలోభియ
గుకష్టసుయోధనుమాటవింటివే।భూవరనీయపేతునగుఁబోకులనాశముబంధునాశమున్॥ గీ॥ ఒకనికైయిట్లుకులమెల్ల
నుక్కడంప।నెత్తుకొనఁజూచెదిదినీతియేనృపాల।వినుమునామాటనీసుయోధనునివిడిచి। కులమురాజ్యంబుదేశంబునిలు
పుమయ్య॥ క॥ అనియిట్లుఁదరమిచెప్పిన। వినిదుర్యోధనుఁడురోషవివశుండయితా।నినతనయశకునిమశ్నా।సనులనిరీక్షిం
చితామసంబునఁబలికెన్॥ క॥ దాసీపుత్రునిమీరలు।దాసీనుంజేయకిటకుఁదగునెపిలువఁగా। నాసీనుండై ప్రేలెడు।గాసి
లిచెడిపోవవెడలఁగానడువుఁడనన్॥ వ॥ అనియిట్లుదుర్యోధనుండాడినదురాలాపంబులుచనకుమనస్తాపంబులుసేయంగా
ర్యంబువిచారించిధైర్యంబవలంబించియొండుపలుకనెల్లకశరశరాసనంబులువిడిచిక్రోధంబునడఁచి వనంబునకుం జని
యెనందు॥ సీ॥ విష్ణుస్వయంవ్యక్తవిమలభూములనుబవిత్రంబులగుహరిక్షేత్రములను। నెలకొనిదేవతానిర్మితహరిదివ్య
భూములగంగాదిపుణ్యనదుల। సిద్ధపురాణప్రసిద్ధపుణ్యాశ్రమస్థలముల నుపవనస్థలములందు। గంధమాదనముఖశ్మా
భృత్తటంబులమంజులగిరికుంజపుంజములను వికచకైరవపద్మహల్లకమరంద।పానపరవశమధుకరగాన¶బుద్ధ।రాజహం
స‖విలోలవిరాజమాన।మగుచుఁజెలువొందుపంకేరుహాకరముల॥ క॥ వఃటియనుఋష్యాశ్రమవన।సరిదుపవననదపు
ళిందజనపదగిరిగ।హ్వరగోష్ఠియజ్ఞశాలా।పురశ్రీదేవాయతనపుణ్యభూములయందున్॥ క॥ కూరలుఁగాయలునీళ్లా।హార
ముగాఁగొనుచునియమమలవడఁగనసం।స్కారశరీరుండగుచును।ద్వారతనవధూతవేషధరుఁడైవరుసన్॥ క॥ హర్షముగ
దురఁగభారత। వర్షమునంగలుగుపుణ్యవరతీర్థములు।‡ఉత్కర్షంజూచువిగతా।మర్షుండైసంచరించెమనుజవరేణ్యా॥
వ॥ ఇట్లుసంచరించుచుఁబ్రభాసతీర్థమ్మునకువచ్చునప్పుడు॥ చ॥ అరుగుచుదైత్యభేదనదయాపరిలబ్ధసమస్తమేదినీ।భరణధు
రంధరుండగుచుఁబాండుసుతాగ్రజుఁడొప్పుచుండభూ।వరవిదురుండుదన్నికటవర్యతమాలరసాలమాధవీ। కురువకమాల
తీవకుళకుంజలసత్తటమందునున్నెడన్॥ చ॥ నరవరవేణుజానలవినష్టమహాటవిమాడ్కిఁబాండుభూ। వరధృతరాష్ట్రసూ
నులనివార్యనిరూఢవిరోధమెత్తియొం।డొరులజయింపఁగోరికదనోగ్రపుఁగురుక్షితిపాదులెల్లన।వ్వరుసవినష్టులౌటవినివా
విరిశోకనిమగ్నచిత్తుఁడై॥ ఉ॥ ఆయెడఁ♦గాలుదన్నకరయంబుననేగిసరస్వతీనదీ।తోయములందుఁగ్రుంకిమునితుల్యుఁడు
వేచనియొందనూనపా।త్రోయరుహాప్తభార్గవపృథుత్రితసోమసుదాసగోగ్నిభూ। వాయుయమాభిధానయుతవాహిను
లందనురక్తిఁగ్రుంకుచున్॥ ఉ॥ వెండియుఁబుణ్యభూములఁబవిత్రసరిత్తులఁజూచుచున్ రమా। మండనుఁడుండుదివ్యరుచి
మన్మణిచారుకవాటగేహళీ।మండితసౌధగోపురవిమానములున్నతభక్తిఁజూచుచున్।నిండినివేడ్కఁగృష్ణపదనీరజచింత

## ➡ విదురుండుద్ధవుంగనికృష్ణాదులవృత్తాంతంబడుగుట. ⬅

నుఁడైక్రమంబునన్॥ చ॥ చనిచనితొంటిమత్స్యకురుజాంగలభూములతిక్రమించిచ।య్యనయమునానదింగడచియచ్చట
భాగవతున్ సరోజలో।చనదృఢభక్తిసద్గుణవిశారదుశాంతునిదేవమంత్రిశి।ష్యునిమహితప్రసిద్ధుఁబరిశోషితదోషుఁబ్రబు
ద్ధునుద్ధవున్॥ క॥ కనియనురాగవికాసముఁ।దనమనమునఁదొంగలింపఁదగగాఢాలిం।గనమాచరించినెయ్యం।బునఁగుశ
లప్రశ్నసేసిముదమునఁబలికెన్॥ క॥ హరిభక్తులుపుణ్యాత్ములు।దురితవిదూరులువిరోధిమర్దనబలులున్।గురుకులతిలకులు
గుంతీ।వరసూనులుగుశలులేయవారితభక్తిన్॥ చ॥ హరిదననాభిపంకరుహమంచుజనించినయట్టిభారతీ। శ్వరుఁడతిభక్తి
వేఁడయదువంశమునన్ బలకృష్ణమూర్తులై।పరగఁజనించిభూభరమువాపినశూరులురేవతీందిరా। వరులటశూరసేనుని
నివాసమునన్ సుఖమున్నవారలే॥ చ॥ కురుకులులాదరింపఁగసఖుండునునాప్తుఁడునైతనర్చిసో। దరతరుణీజనంబులనుద
త్పుతులంగడుగారవంబునన్।గరుణఁదలిర్పనాత్మజులకంటెఁబ్రియోన్నతిఁబ్రోచువాఁడుసు। స్థిరమతినున్నవాఁడెవసు

---

*నిట్టలమైన।నిష్కపటమయిన.— §జుట్టనవ్రేల।తర్జనిచేత.— †కారియ।బాధ.— ¶బద్ధ।మేలుకొనిన.— ‖విలోల।సంచరించుచున్న.— ** దేవాయతన।దేవాలయము.— ‡ఉత్కర్షము।అతిశయము.— ♦అమర్షము।క్రోధము.— ♦కాలుదన్ను।కాలునిలుపక.

దేవుఁడువృష్ణికులప్రదీపకా॥ శా॥ కందర్పాంశమునందనూజుఁబడయంగామించిభూదేవతా।బృందంబుల్ భజియించిత
త్కారుణదీపింపన్ బ్రభావంబుపెం। పొందన్ రుక్మిణిగన్ననందనుఁడుప్రద్యుమ్నుండుభాస్వచ్ఛమూ। సందోహంబులుద
న్నుఁగొల్వమహితోత్సాహంబునన్మించునే॥క॥సరసిజలోచనకరుణా।పరిలబ్ధసమస్తధరణిపాలనమహిమం। బరమప్రీ
తిసుఖించునె। చిరవిభవోదారుఁడుగ్రసేనుఁడుజగతిన్॥చ॥లలితపతివ్రతామణివిలాసవతీతిలకంబుపార్వతీ।లలనకుమా
రుఁగన్నగతిలక్షణజాంబవతీలలామని।గ్మలగతిఁగన్నపట్టిసుకుమారతనుండువిరోధిభంజనో। త్కాలికసుఖించునేగుణక
దంబుఁడుసాంబుఁడువృష్టిపుంగవా॥క॥హరిపదసేవకుఁడరిభీ।కరుఁడర్జునువలనమిగులఁగార్ముకవిద్యల్। దిరముగఁగఱచి
నసాత్యకి।వరసుఖవిభవములనున్నవాఁడెధరిత్రిన్॥ మ॥ జలజాతాంకుశచక్రచాపకులిశచ్ఛత్రాదిరేఖాంకితో। జ్జ్వల
గోవిందపదాబ్జలక్షితవిరాజన్మార్గధూళిచ్ఛటా। కలిదాంగుండువిధూతకల్మషుఁడునిష్కామైకధన్యుండుస। త్కులజా
తుండననొప్పునట్టిఘనుఁడక్రూరుండుభద్రాత్ముఁడే॥క॥శ్రుతులును గ్రతుజాతములు।న్మతిఁదాల్చినయట్టివేదమాతగ
తిన్ శ్రీ।పతిఁదనగర్భంబునర।క్షితుఁజేసినగరితదేవకీసతిసుఖమే॥వ॥ మఱియుమహాత్మామహితోపాసకులగు వారలకో
ర్కులునిండింపంజాలినపరమేశ్వరుండుశబ్దశాస్త్రంబునకుంగారణంబనితన్నునఖిలదేవతాజనంబులగ్గింపంగల మేటి
యగుటంజేసిమనోమయుండునుసకలజీవ చతుర్విధాంతఃకరణంబులకుంజిత్తాహంకారబుద్ధిమనంబులకుఁగ్రమంబున
వాసుదేవసంకర్షణప్రద్యుమ్నానిరుద్ధులధిదైవతంబులగుదురట్టిచతుర్విధతత్త్వంబులకుం‡దుర్యంబయినతత్త్వంబగునని
రుద్ధకుమారుండుసంతోషచిత్తుండగునేయని॥మ॥ఇతరారాధనబుద్ధిమానికమలాధీశుంబయోజాసనా। ర్చితుఁగృష్ణున్
నిజనాథుఁగాసతతమున్ సేవించుపుణ్యుల్ జగ।న్నుతులధ్యాత్మవిదుల్మహాభుజులుమాన్యుల్ ధర్మమార్గుల్సము। న్నతిస
త్యాత్మజచారుధేష్ణగములానందాత్ములేయుద్ధవా॥గీ॥క్రోధమాత్సర్యధనుఁడుసుయోధనుండు।వోలుచునెవ్వనిసభఁజూ
చికలుషమొదవి।మనములోననసూయానిమగ్నుఁడయ్యె।నట్టిధర్మజుఁడున్నాఁడెయనఘచరిత॥ గీ॥ఘనగదాభ్యాసచిత్ర
సంగతులమెఱసి।కురుకుమారులభూరిసంగరములోన।హతులఁగావించివెలసినయట్టిజెట్టి। వాయుతనయుండుఁగుశలియై
వఱలునయ్యె॥ చ॥ హరికరుణాతరంగితకటాక్షనిరీక్షణలబ్ధశౌర్యవి। స్ఫురణదనర్చితన్ను *ననిబోయగతింగిరిశుండెదిర్చి
న।న్బరవసమొప్పఁగాగెలిచిపాశుపతాస్త్రముఁగొన్నశత్రుభీ।కరుఁడుధనంజయుండుసుభగస్థితిమోదమునొందుచుం
డునే॥మ॥ తెరఁగొప్పన్ జననీవియోగమునఁగుంతీస్తన్యపానంబుసో।దరసంరక్షయుఁగల్గి దేవవిభవక్ష్రీథామృతంబుల్
ఖగేశ్వరుఁడర్థింగయికొన్ననాఁడెకురువంశశ్రేణినిర్జించిత।ద్ధరణీరాజ్యముఁగొన్నమాద్రికొడుకుల్ధన్యాత్ములే యుద్ధ
వా॥గీ॥పాండుభూమీశ్వరుండుసంప్రాప్తమరణుఁ।డైనశిశువులఁబ్రోచుటకైనిజేశు। గూడిచనకున్నయట్టియాకుంతి
భోజ।తనయజీవించునేనేఁడుమనుచరిత్ర॥అనివెండియు॥మ॥అనుజాతుండగుపాండుభూవిభుఁడు§నిర్యాణంబునుంబొం
దనా।తనిపుత్రుల్ దనుఁజేరవచ్చిననుమధ్యస్థంబుఁబోఁదట్టిమొ।గ్గొనరించెన్ ధృతరాష్ట్రభూమివిభుఁడట్లూహింపఁగానె
గ్గునేసినవాఁడెయసుఁగాకమేలుగలదేచింతింపఁగానుద్ధవా॥క॥అనుజుఁడనియనకతననిజ। తనయులుననువెడలనడువఁ
దానూరకయుం। డినధృతరాష్ట్రుఁడునరకం। బునఁబడునాదైనదుఃఖముననఘాత్మా॥వ॥అదియునుంగాకపరమశాం
తుండవైననీమనంబునదుఃఖంబుకర్తవ్యంబుగాదంటివేని॥క॥ నరలోకవిడంబనమున। హరిపరమపరుండుమానవాకృతి
తోని।ద్ధరఁబుట్టియాత్మమాయా।స్ఫురణన్మోహింపఁజేయుభూజనకోటిన్॥ఉ॥కావుననమ్మహాత్మునివికారవిదూరునిసర్వ
మోహమా। యావిలమానసుండనగునప్పుడుసంసృతిదుఃఖనౌచన । ద్దేవునిసత్కృపామహిమఁదేరినవేళసుఖింతునేన
కా।దావిధిశంకరప్రభృతులవ్విభుమాయఁదరింపనేర్తురే॥వ॥అయిననమ్మహాత్మునికరుణాతరంగితాపాంగ పరిలబ్ధవిజ్ఞా
నదీపాంకురనిరస్తసమస్తదోషాంధకారుండనగుటచేమదీయచిత్తంబుహరిపరాయత్తంబై తన్మార్గంబుసతతంబునిరీక్షిం
పుచునుండుమఱియును॥సీ॥అట్టిసరోజాక్షుఁడాత్మీయపదభక్తులడవులనిడుములగుడుచుచుండ।¶దౌత్యంబుసేయఁగొం
దలువిరోధులుహరిబద్ధునిఁజేయసన్నద్ధులైన।బలహీనుమాడ్కి—మార్పడఁగలేఁడసమర్థుఁడనితలంచెదవేనియచ్యుతుండు।
పరులఁజయింపనోపకకాదుమిథ్యాభిజాత్యధనంబులజగతిఁబెక్కు।బాధలఁగలంచుదుష్టభూపతులనెల్ల। సైన్యయుక్తులుగా
ననిసంహరించు।కొఱకుసభలోననప్పుడాకురుకుమారు।లాడుదుర్భాషణములకునలుఁగఁడయ్యె॥మ॥ జననంబందుటలేని
యీశ్వరుఁడుదాజన్మించుటెల్లన్విరోధి†నిరాసార్థమువీతకర్ముఁడగునద్దేవుండుగర్మప్రవ। ర్తనుఁడౌటెల్లఁజరాచరప్ర

‡తుర్యంబు।అతీతము— *అని।యుద్ధము— §నిర్యాణము।మరణము— ¶దౌత్యము।దూతకృత్యము— †నిరాసార్థము।సంహారనిమిత్తము.

చరణారవిందభజనాత్మకులుం డెడుగొందినారయా॥ వెండియు॥ చ॥ హరిఁబరమేశుఁ గేశవుననంతుభజింపఁగధర్మతత్త్వధీపరిణతిసాధనంబగుస్వభావముఁ దాల్చినయట్టిమర్త్యులా। సరసిజనేత్రుమాయను*భృశంబుగ మోహితులైతదంఘ్రిపంకరుహములర్థిమైఁ గొలువఁగానమిఁబొందరుతత్పదంబునుర్॥ చ॥ మఱియుసరోరుహోదరునిమంగళదివ్యకథాసులాపనిర్భరపరితోషబాష్పకణబంధురచారుకపోలగద్గదస్వరపులకీకృతాంగులగువారలునిస్పృహచిత్తులత్యహం। కరణవిహారులుంచరుసుకర్ములునుం డెడుపుణ్యభూములర్॥ అందు॥ మ॥ వరవైకుంఠము¶సారసాకరముదివ్యస్వర్ణశాలాంకగోపురహర్మ్యావృతమైనతద్భవన**మంభోజంబుదన్మందిరాం। తరవిభ్రాజితభోగికర్ణికదముద్యద్భోగపర్యంకమం। దరనొందన్వసియించుమాధవుఁడుదానేఫారుభృంగాకృతిర్॥ అంత॥ మ॥ హరిచేఁబాలితమైనకాంచనవిమానారూఢమైసట్టిస। త్పురుషానీకముచేఁదనర్చివిభవాపూర్ణప్రభావోన్నతి। న్గరమొప్పారుతదీయధామముజగత్కల్యాణమూర్తుల్మునీశ్వరులర్థిన్నిజయోగశక్తిఁబరితోషస్వాంతులై చెచ్చెరర్॥ డాయంజని॥ చ॥ మరకతరత్నతోరణసమంచితకుడ్యకవాటగేహళీ। విరచితషట్సుకక్ష్యలరవిన్దదళాక్షువిలోకనోత్సవా। దరమతినన్యమంగనకదాఁటియనంతరకక్ష్యయందుని। ర్దరసుధదీయపాలురనుదారసమానవయోవిశేషులర్. సీ॥ కాంచననవరత్నకటకాంగులీయకహారకేయూరమంజీరధరులఁ। గమనీయసౌరభాగతమత్తమధుకరకలితసద్వనమాలికావిరాజి। తోరస్థలులగదాధరులనుఘనచతుర్బాహులనున్నతోత్సాహమతుల। నారూఢరోషానలారుణితాక్షుల భ్రూలతాకౌటిల్యఫాలతలుల। వేత్రదండాభిరాముల వెలయునమ్ము। కుందశుద్ధాంతమందిరాళిందభూమి। నున్నయిద్దరసనకాదియోగివరులు। చూచుచునువృద్ధులయ్యునాసుభగమతులు॥ క॥ ధీరతఁబంచాబ్దములకు। మారకులైకానఁబడుచుమనమునశంక। న్గూరకచతురాత్ములని। వారితగమనములఁడాయవచ్చిననెడుఅర్॥ క॥ శ్రీలలనేశ్వరదర్శన। లాలసులైయేగుబుధ**లలాములనతిదు। శ్శీలతఁదద్వచనప్రతి। కూలమతిన్బ్వకుండఁగుటిలాత్మకులై॥ క॥ వారించినవారలుశిబృం। దారకులీక్షించుచుండదారుణపటురో। షారుణితాంబకులైరొద। వారించుచువారునచటివారునువినఁగర్॥ ఇట్లనిరి॥ చ॥ పరముననంతుభక్తపరిపాలుసుహృత్తమునిష్టునీశ్వ. రేశ్వరుభజియింపఁగోరియనివారణనిందరుదేరనిచ్చలు। న్సరితముదాత్ములైకొలువఁబాయకతద్భజ**నాంతరాయత। త్పరమతిమాకునిప్పుడరిపడ్డవరాత్ములనేఁడుగంటిరే॥ వ॥ అనిమఱియుసనకసనందనాదులిట్లనిరిమీమనంబులస్వామిహితార్థంబై నిష్కపటవర్తనులమైనమాబోఁటులఁగూహకవృత్తింగలయితరజనంబులుభగవత్సదనంబుఁబ్రవేశింతురోయనుశంకంజేసికొండఱుంబ్రవేశింపంజేయుటయుఁ,గొందఱవారించుటయు ‡దౌవారికస్వభావంబనివారింపందలంచితిరేనిఁ ప్రశాంతదివ్యమంగళవిగ్రహుండు,గతవిగ్రహుండు,భగవంతుండు, విశ్వగర్భుండునైనయీశ్వరుండు† ప్రాప్యంబుఁ బ్రాపకంబుఁ బ్రాప్తియునను భేదశూన్యుండుగావున మహాకాశంబునందు ఘటపటాద్యాకాశంబులు వేఱులేకయేకంబయితోఁచుచందంబున విద్వాంసులగువారమ్మహాత్మునిసకలాత్మభేదరహితునింగాఁబొడఁగందురదియునుంగాకలోకమందురాజులుసాపరాధులైనకింకరజనంబులనాజ్ఞాపించుచందంబున నీశ్వరుండుదండించునోయనుభయంబునంజేసి వారించితిమనితలంచితిరేనిభూసురవేషధారులమైనమాకువైకుంఠనాయకుండైనసర్వేశ్వరునకు భేదంబులేకుండుటంజేసి శంకసేయఁబనిలేదిట్లగుటనెఱింగిమందబుద్ధులై మమ్మువారించినయనుచితకర్ములగుమీరలుమదీయశాపార్హులగుచురుగానభూలోకంబునంగామక్రోధలోభంబులనుశత్రువులుబాధింపంబుట్టుండనిపలికిన॥ క॥ వారలువినితమమనముల। భూరిస్ఫుటచండ**కాండపూగంబులచే। వారింపరానిభూసుర। దారుణవాక్యములకులికితల్లడపడుచుర్॥ క॥ పరితాపంబునుబొందుచు। సరసిజలోచనునిభటులుసనకాదిమునీ। శ్వరులపదాంబుజములకు। న్గరమర్థిఁ మ్రొక్కినిటలఘటితాంజలులై॥ ఇట్లనిరి॥ మ॥ వరయోగీశ్వరులారమమ్ముఁగుదినెవ్వన్మీరలిట్లన్నని। ష్ఠురవాక్యంబులకింకమామనములన్శోకింపఁగారాదుస। త్పురుషశ్రేణిఁబరాభవించినవృథాభూతాత్ములమ్మమ్ముమా। చరితంబింతకుఁదెచ్చెమీఁదశుభముల్ దూకొందుమేమారయర్॥ అదియెట్లంటిరేని॥ ఉ॥ మీకరుణావలోకనసమేతులఁగామముఁజేయఁజిత్తము। •ల్దూకొనెనేనిమాచనువుఁ గ్రోయకనీఁదగుఁగామలోభముల్। గైకొనిపుట్టుచోటనవకంజదళాక్షునినామవిస్మృతిర్। బైకొనకుండఁజేయుటశుభంబగుమీఁదిమదీయజన్మ

* భృశంబుగర్। అత్యంతముగాను— ¶ సారసాకరము। కొలను— ** అంభోజము। పద్మము— ** లలాములర్। శ్రేష్ఠులను— శిబృందారకులు। దేవతలు— ** అంతరాయము। విఘ్నము— ‡ దౌవారిక। ద్వారపాలకుఁడు— † ప్రాప్యంబు। పొందఁదగినది- ప్రాపకంబు। పొందేవాఁడు. ప్రాప్తి। పొందుట— ** కాండపూగంబులచేర్। బాణసమూహములచేత— • దూకొనెనేని। ప్రవేశించినట్టులాయెనేని.

ముల్ ॥ఆసమయంబున॥మ॥హరిసర్వేశుఁడనంతుఁడాకలకలంబాలించి✻పద్మాలయా।సరసాలాపవినోదసౌఖ్యరచన ల్చాలించిశుద్ధాంతమం।దిరమాణిక్యపుగేహళుల్గడచియే తెంచెం బ్రపన్నార్తిసం।హరుఁడై నిత్యవిభూతిశోభనకరుండై మానితాకారుఁడై ॥మఱియును॥ చ॥ శరనిధికన్యకామణియుసంభ్రమమొప్పఁగఁదోడరామనో।హరనిజలీలమైపరమ హంసమునీంద్రగవేషపాదపం।కరుహములన్వినూత్నమణికాంచననూపురమంజుఘోషము।ల్వొరుసఁజెలంగనార్యజన వంద్యుఁడుయోగిజనైకసేవ్యుఁడై ॥ చ॥ కరమణిహేమకంకణనికాయఝణంకృతులుల్లసిల్లనౌ।చ్చరలిడుహంసపక్షసిత చామరగంధవహోచ్చలత్సుధా। కరరుచిరాతపత్రసుభగప్రవిలంబితహారవల్లరీ।సరసగళత్తుషారకణజాలవిరాజిత మంగళాంగుఁడై ॥మఱియు॥సీ॥నిఖిలమునీంద్రవర్ణితసస్మితప్రసన్నాననాంబుజముచేనలరువాఁడు।విస్మృతస్నేహార్ద్రవీక్షణనిజభక్తజనసుహాశయుఁడనఁదనరువాఁడు। మానితశ్యామాయమానవక్షమునసంచితవైజయంతిరాజిల్లువాఁడు। నతజనావనకృపామృతతరంగితములై భాసిల్లులోచనాబ్జములవాఁడు।నఖిలయోగీంద్రజనసేవ్యుఁడైనవాఁడు। సాధు జనములరక్షింపఁజాలువాఁడు।భువనచూడావిభూషనైఁభూరిమహిమ।మించి వైకుంఠపురముభూషించువాఁడు॥సీ॥కటి విరాజితపీతకౌశేయశాటితోవితతకాంచీగుణద్యుతినటింప। నాలంబికంఠహారావళిప్రభలతోఁగౌస్తుభరోచులుగ్రందు కొనఁగ।నిజకాంతిజితతటిద్వ్రజకర్ణకుండలరుచులుగండద్యుతులొప్పిదిసేయ। మహనీయనవరత్నమయకిరీటప్రభానిచ యంబుదిక్కులునిండఁబర్వ।వైనతేయాంసవిన్యస్తవామహస్త।కలితకేయూరవలయకంకణములొప్ప।నన్యకరతలభ్ర మణీకృతానుమోద।సుందరాకారలీలారవిందమమర॥ వ॥మఱియుఁజరణారవిందమంజుకింజల్కపుంజప్రభారంజితతు లసీమరందబంధురగంధానుబంధసుగంధిగంధవహాస్వాదకలితసేవాతత్పరులై చనుదెంచుయోగీంద్రులమానసానంద కారియుబహిఃకరణాంతఃకరణపరితోష§ప్రకీర్ణరోమాంచరుచిదాయకంబుఁబ్రభాపూర్తియుక్తంబగుమూర్తితోడనిజ సౌందర్యవరకళావినిర్జితశ్రీరమణీసౌందర్యభాసమానుండగుచుఁబాదచారియైయఖిలవిశ్వగురుండైన సర్వేశ్వరుండు వేంచేసెనప్పుడు॥చ॥స్థిరశుభలీలనల్లరుగుదెంచినయవ్విభువిద్రుమారుణా।ధరనవపల్లవస్ఫురదుదంచితకుందరుచిస్మితైకసుం।దరవదనారవిందముముదంబునఁదప్పకచూచియమ్మునీ।శ్వరులునిజాత్మలందనివిసాలకవెండియుఁజూచిరిమ్ములన్॥ చ॥సునిశితభక్తిదన్ముఖముఁజూచినచూడ్కులఁద్రిప్పలేకయుం।గనుఁగొని✻రెట్టకేలకునకల్మషభక్తవిధూతఖేదము।ల్మనిజనచిత్తమోదములుముక్తినివాసకవాటభేదము।ల్వినుతవినూత్ననూపురితవేదములన్మహనీయపాదముల్ ॥చ॥కనిన ఖపద్మరాగమణికాంతివిభాసితపాదపద్మము।ల్మనములయందుఁగీల్కొలిపిలబ్ధమనోరథయుక్తులై పునః। పునరభివందనం బులువిభూతిదలిర్పనొనర్చియోగమా।ర్గనిరతచిత్తులున్వెదకికానఁగలేనిమహానుభావునిన్॥ క॥ మానసముననిలిపిరిత।ద్ధ్యానాస్పదుఁడైనవానిఁదత్వజ్ఞులకున్। గాననగువానిభక్తజ।నానందకరైకమూర్తినలరినవానిన్॥ వ॥ మఱియుం

## ✻ సనకసనందనాదులు నారాయణదేవునినుతించుట. ✻

జతురింద్రియగ్రాహ్యంబగు దివ్యమంగళ విగ్రహంబు ధరియించియున్న పురుషోత్తమును దాత్తతేజోనిధిం జూచి సనకాదులిట్లనిస్తుతియించిరి ॥ చ॥ వనజదళాక్షభక్తజనవత్సలదేవభవత్సుతుండుమ । జ్జనకుఁడునయినపంకరుహజా తుఁడునాకురహస్యమొప్పఁజెప్పినభవదీయమంగళగభీరపరిగ్రహవిగ్రహంబుమే। మనయముఁజూడఁగంటిమిఁగృతా ర్థులమైతిగమంటిమీశ్వరా॥ సీ ॥ దేవదుర్జనులకుభావింపహృదయసంగతుఁడవైయుండియుఁగానఁబడవు।కడఁగిమీదివ్య మంగళవిగ్రహంబునఁజేసిసమంచితాశ్రితులనెల్లఁ। జేకొనిసంప్రీతచిత్తులఁగాఁజేయుదతిశయకారుణ్యమతిఁదనర్చి।క మలాక్షసర్వలోకైకనాయకభవదనుసరణాభిలాషానులాప। విదితదృఢభక్తియోగప్రవీణులగుచు । నర్థిమైవీతరాగు లైనట్టియోగి।జనమనఃపంకజాతనిషణ్ణమూర్తి।వనియెఱుంగుదురయ్యనిన్నాత్మవిదులు॥క॥యుక్తిందలఁపభవద్వ్యతి।రిక్తములైనట్టియితరదృఢకర్మంబు।ల్ముక్తిదములయినమీపద।భక్తులుదత్కర్మములనుబాటింపరిలన్॥ ఉ॥ కావునఁగీర్తనీయగ తకల్మషమంగళతీర్థకీర్తిసు। శ్రీవిభవప్రశస్తసుచరిత్రుఁడవైనభవత్పదాబ్జసే।వావిమలాంతరంగబుధవర్గమనర్గళభంగి నన్యము।న్భావమునందలంచునెకృపాగుణభూషణపాపశోషణా॥ చ॥ పరమతపోవిధూతభవపాపులమైచరియించుమా కునేఁ।డరయభవత్పదాశ్రితులనగ్గిశపించినభూరిదుష్కృత। స్ఫురణనసత్పదైకపరిభూతులమైనిజధర్మహానిగా। నిరయ ము నొందఁగావలసెనేరమువెట్టకమమ్ముఁగావవే॥చ॥కరమనురక్తిషట్పదము¶గన్రుసుగంధమరందవాంఛచేఁ।దరుచుగ

✻పద్మాలయా।లక్ష్మి— §ప్రకీర్ణ।వృద్ధిబొందించుచున్న— ✻ఎట్టకేలకున్।కొంతతడవునకు— ¶క్రమ।మనోహరమయిన—

శాతకంటకవృతస్ఫుటనవ్యతరప్రసూనమం। జరులనుడాయుపోలిక నిభృశంబగువిఘ్నములంజయించుమీ। చరణసరోజ
ముల్గొలువసమ్మతివచ్చితిమయ్య కేశవా॥ చ॥ అలరుభవత్పదాంబుజయుగార్పితమైపొలుపొందునట్టియా। తులసిపవిత్రమై
నగతిందోయజనాభభవత్కథాసుధా। కలితములైనవాక్కులనకల్మషయుక్తినివిన్నఁగర్ణము। ల్విలసితలీలమైభువింబవిత్ర
ములైవిలసిల్లుమాధవా॥ చ॥ మహితయశోవిలాసగుణమండనసర్వశరణ్యయింద్రియా। స్పృహులకుఁగానరాక *యతసీ
కుసుమద్యుతినెప్పుచున్నమీ। సహజశరీరమిప్పుడుభృశంబుగఁజూచిమదీయదృక్కులిం। దహహకృతార్థతంబొరసెనచ్యు
తమ్రొక్కెదమాదరింపవే॥ క॥ అనిసనకాదులుదత్పద। వనజములకుమ్రొక్కిభక్తివశమానసులై। వినిపించినశ్రీగోవిందుఁ
డు। మునివరులంజూచిపలికెముదితాత్ముండై॥ వ॥ ఈయిరువురుజయవిజయాభిధానంబులుగలమదీయద్వారపాలకులువీ
రుమిమ్ముంగైగొనకమదీయాజ్ఞాతిక్రమణులయిచేసిన యపరాధంబునకుఁదగినదండంబుఁగావించితిరదియునాకునభిమ
తంబయ్యెనదియునుంగాకభృత్యవర్గంబుచేయునపరాధంబుస్వామిదియకానమాననీయుండనయిననన్నుమన్నించిప్రస
న్నులగుదురుగాకయనివెండియు॥ చ॥ తనువునఁబుట్టినట్టిచెడిదంబగుకష్టమహా ✠గదంబుచే। వనరితదీయచర్మమువివర్ణత
నొందినరీతిభృత్యులొ। ప్పనిపనిఁజేసినన్విభులుబన్ధురచారుయశంబుపేరుపెం। పునుఁజెడిపోయిదుర్యశముఁబొందుచునుం
దురు ✠విష్టపంబులన్॥ చ॥ అలవడమీకునావలననబ్బినతీర్థసుకీర్తనీయస। ల్లలితవినిర్మలామృతవిలాసయశోవిభవాభిరా
మమై। వెలయువికుంఠనామమపవిత్రమనశ్శ్వపచాధమాదిలో। కులచెవిసోఁకదక్షణమకోరి ✠పునీతులఁజేయువారలన్.
గీ॥ అట్టినేనుదలంపమీయట్టిసాధు। జనులకపకారమర్థిఁజేసినమదీయ। బాహుసములైనఁద్రుంతునుత్సాహలీల। నన్నునిత
రులమీఁదమ్రోలనెన్ననేల॥ క॥ ధరణిసురోత్తమసేవా। పరిలబ్ధంబైనయట్టిపాతకనాశం। కరనిఖిలభువనపూత। స్ఫురితాం
ఘ్రిసరోజతోయములుగలనన్నున్॥ క॥ అలఘుమతివిరక్తునిగాఁ। దలఁపకనిజశుభకటాక్షదామకలితా। ఖిలసంపద్విభవ
శ్రీ। లలనారత్నంబురస్థలంబునుజెందెన్॥ చ॥ క్రతువులుసేయుచోశిఖిముఖంబునవేలుచునట్టితద్ఘృత। ప్లుతచరుభక్ష
ణమ్ముదముఁబొందదునిస్పృహధర్మమార్గసం। గతుఁడగుభూసురోత్తమముఖంబునవేడ్కభుజించునయ్యవి। స్రుతకబళం
బునన్మనముదృప్తివహించినరీతినిచ్చలున్॥ సీ॥ సతతంబునప్రతిహతయోగమాయావిభూతిచేఁబ్రఖ్యాతిఁబొందునేను।
నేనుమహీసురులసమిద్ధనిర్మలపాదనలినరజోవితానములుభక్తి। హాటకనవరత్నకోటీరమునఁదాల్తునట్టినాచరణాంబుజాం
బువులను। దవిలిధరించినసద్యఃపునీతాత్ములైరర్థిఁ ✠జంద్రావతంసాదిదేవ। చయములెవ్వాఁడుబ్రాహ్మణజనులుదమకుస
పకృతులేసిరేనిమారలుగఁడతఁడువిప్రులనునన్నుఁగాఁగభావించునతఁడు। ధర్మపథ్థితినాప్రియతముఁడువాఁడు॥ ఉ॥ గో
వితతిన్ధరాదివిజకోటిననన్నునుదీనవర్గము। న్వావిరిభేదబుద్ధిఁగనువారలధోగతిఁబొందనందు§నా। శీవిషరోషవిస్ఫురణఁ
జెందిక్రృతాంతభటుల్మహోగ్రగృ। ధ్రావళిఁబోలిఁ✠జంచువులనంగములుద్ధతినెంతురెప్పుడున్॥ చ॥ ధరణిసురోత్తము
ల్బహువిధంబులఁదమ్ముఁబరాభవించినన్। దరహసితాస్యులై యతిముదంబుననిచ్చలుపూజసేయుచు। న్సరసవచోవిలాస
ములసన్నుతిసేయుచుఁదండ్రినాత్మజుల్గరమనురక్తిఁబిల్చుగతిఁగైకొనిపిల్చినవారునాసముల్॥ క॥ వినుఁడయ్యనఘచరి
త్రులు। కనయముఁబ్రియతముఁడనగుచునమ్మడువోదు। స్మునునన్నుభృగువుదన్నినఁ। గనలకపరితోషవృత్తిఁగైకొంటిఁగ
దే॥ సీ॥ పొలుచునామానసాంభోజాతభావంబుదెలియంగలేకయుద్వృత్తులగుచుఁ। గడఁగిమాయానతిఁగడచినఁదద్దోష
ఫలమువీరలకుసంప్రాప్తమయ్యె। మునులారనాచిత్తమునసున్నరీతియునిట్టివభూమిపైఁబుట్టివీర। లచిరకాలమునస
✠యంతికంబొనర్కోలినరుదెంచునట్లుగాననుమతింప। వలయుననియమ్ముకుందుఁడువలుకుటయును। వినిమనంబునసనక
దిమునివరేణ్యు। లమ్మహాత్ముని మృదులభాషామృతంబుఁ। దవిలిగ్రోలియురోష✠సందష్టులగుచు॥ సీ॥ మునివరుల్దమచిత్త
ములఁదృప్తిఁబొందకపంకజాతాక్షుఁడుపలికినట్టి। పరిమితగంభీరబహుళార్థమధురవగాహములనువిస్ఫురదమృతతుల్య
మాధుర్యసుగుణసమన్వితమ్ములువినిర్గతశబ్దదోషనికాయయుతము। లైనవాక్యములకునాత్మలఁబరితోషమందియుట్టినిరీ
నెయ్యములమనల। కొడయఁడిప్పుడునందించియోతలంప। నర్థినిందించియోమతిక్రాలైకదండ। మునకుసంకోచమంది
రోయనుచసంశ। యాత్ములగుచువిలోకించియంతలోన॥ క॥ నలినాక్షుఁడుదమదెసఁగృప। గలిగినభావంబుఁదెలిసిక

*అతసీకుసుమ। నల్లగిసెపుష్పము—— శ్రీగోవిందుఁడు॥ గో అనఁగాభూమి-దానినుద్ధరించినవాఁడు—— ✠గదంబు। వ్యాధి—— ✠విష్టపము। లో
కము—— ✠పునీతులన్। ధన్యులను—— ✠చంద్రావతంసాది। చంద్రుఁడెశిరోభూషణముగాఁగలశివుఁడుమొదలయిన—— §ఆశీవిష। సర్పము——
✠కృతాంత। యముఁడు—— ✠చంచువు। పక్షిముక్కు—— ✠అంతికము। సమీపము—— ✠సందష్టులు। పండ్లుకొరుకుచున్నవారు.

తుకమొలయ నుబ్బలకీకృతాంగులై యుత్కలికన్ హర్షించినిటలఘటితాంజలులై ॥ క॥ భరితనిజయోగమాయా స్ఫురణం
దనరారునతివిభూతియుబలము న్బరమోత్కర్షముగలయీశ్వరునకునిట్లనిరిమునులుసద్వినయమునన్ ॥ గీ ॥ పొలుపుదీ
పింపనిత్యవిభూతినాయ। కుఁడవుభగవంతుఁడవునసఘుఁడవునీవు। మత్కృతంబిప్డునీకభిమతమటంటె। వీశభవదీయచారి
త్రమెఱుఁగఁదరమె॥ ఉ॥ దేవగణాలికెల్లఁబరదేవతలై తనరారునట్టివి। ప్రావలికాత్మనాయకుఁడవై పెనుపొందిననీకునీ
ధరా। దేవతలెల్ల నెన్ననధిదేవతలై రటయెట్టిచోద్యమో। దేవసమస్తపావనసుధీజనతావనవిశ్వభావనా॥ చ॥ కమలదళా
క్షునీవలనఁగల్గినధర్మముదావకావతా। రములనురక్షితంబగుఁ జిరంబగునీశ్వరనిర్వికారత। త్వమునఁదనర్చునిన్నరయఁద
త్ఫలరూపముతత్ప్రిధానగో। ప్యమునఁనిపల్కుచుందురుకృపామయలోచనపాపమోచనా॥ చ॥ మహిఁదలపోయనెవ్వని
సహగ్రపరిగ్రహముల్లభింపని। స్పృహమతులై మునీశ్వరులుమృత్యుభయంబునఁ *బాతురట్టిస। న్మహితవివేకశాలిగుణ
మండననీకిలనన్యసత్పరి। గ్రహమదియెట్టిచోద్యముజగత్పరిపాలననిత్యఖేలనా॥ సీ॥ సతతంబునర్థార్థిజనశిరోలంకారపదరే
ణువులుగలపద్మమనెడు। జలజకింజల్క శీనిష్యందమకరందలోభాగతభ్రమరనాయకునిపగిది। ధన్యజనార్పితోదంచితతుల
సికాదామంబునకునిజధామమగుచు। భాసిల్లుభవదీయపాదారవిందముల్విలసితభక్తిసేవింపుచుండి। కమలనయనకృ
పావలోకనములాలయ। నర్థిఁబొడఁజూపుభాగవతానురక్తిఁ। జేసిభవదీయమహిమంబుచిత్రమరయ। చిరశుభాకార
యిందిరాచిత్తచోర॥ మ॥ చిరభాగ్యోదయదేవదేవలలితశ్రీవత్సలక్ష్మాంగయీ। వరవిప్రానుపదైకపుణ్యరజమేవర్ణింపనీ
మేనికా। భరణంబంటెవిసర్వలోకులకువిప్రశ్రేణిమాహాత్మ్యమీ। వరయంజెప్పుటకైభరించితిగదామెన్నన్బనీతాకృతీ॥
సీ॥ ధర్మమూర్తివిజగత్కర్తవునగునీవుప్రోవంగఁదగువారిఁబ్రోవవేని। నవిరళవేదోక్తమగుధర్మమార్గమసన్మార్గమగుఁ
గానసత్వగుణవి। శిష్టుండవగుచునీజీవసంఘముసేమమరసిరక్షించునీదైనశక్తి। చేతనుధర్మవిఘాతులదండించునీకునంచి
తమైననిగమధర్మ। మార్గనాశకరంబులుమదికినింపు। గావువిప్రులయందుసత్కరుణమెఱసి। ఘనతఁబలికినవినయవాక్య
ములునీకు। యుక్తమగుచుండుసతతంబుభక్తవరద॥ వ॥ అట్లయినంబరులయెడవినయంబులువలికినం బ్రాభవహానియగున
నితలంచితివేని॥ గీ॥ విశ్వమునకెల్లఁగర్తవువిశ్వనిధివి। విశ్వసంరక్షకుండవై వెలయునీకుఁ। గడఁగి ప్రాభవహానియెక్కడిది
దలఁప। వినయములునీకులీలలై వెలయుఁగాన॥ గీ॥ మునులమగుమమ్మునతిమోదముననునీవు। సత్కరించుటలెల్లసజ్జనపరి
గ్రహార్థమైయుండుగాదెమహాత్మయొకటి। విన్నవించెదమీజయవిజయులకును॥ గీ॥ అలిగిమేముశపించితిమంతకంటె।
బెడిదమగునాజ్ఞసేయనభీష్టమేని। జేయుమదిగాకసమధికశ్రీదనర్పఁ। జేసిరక్షించెదేనిరక్షింపుమీశ॥ వ॥ అట్లయినమా
కుం బ్రియంబగుంగావునననపరాధులునతినిర్మలాంతఃకరణులునైనవీరలకునన్యతంబులువలికితిమేనిమమ్మైనంజిత్తంబుకొ
లఁదినాజ్ఞాపింపుమనికరకమలంబులుమొగిచికృతాంజలులైయున్నమునులంగరుణార్ద్రదృష్టింగనుంగొని॥ క॥ అనఘుఁడు
భగవంతుండిట్లనియెమ్మునులారవీరలలరన్బవికి। న్ననియచటనసురయోని। న్జనియింతురులోభమోహసంగతులగుచున్॥
క॥ దేవజనావళిక్షుపహతిఁ। గావింపుచునిఖిలభువనకంటకవృత్తిన్। జీవించుచునాయెడసం। భావితవైరానుబంధభావులు
నగుచున్॥ క॥ ఆహవముఖముననమునతి। సాహసముననెదిరిపోరిచక్రనిశితధా। రాహతిఁదెగివచ్చెదరు। త్సాహమెలర్పం
గనాముసన్నిధికంతన్॥ అదియునుంగాక॥ క॥ ననువైరంబుననైనను। మనమునఁదలఁచుటయునాసమక్షమునసుదా। ననమీ
క్షింపుచునీల్గుట। ననఘాత్మకులైవసింతురస్మజ్జగతిన్॥ క॥ వినుమిలమీఁదనికెన్నటి। కినిబుట్టువులేదువీరికినిమీరలువ। లిక్షన
యట్లనాచుచిత్తము। ననుదలఁతుంగాననీమనంబులనింకన్॥ ఉ॥ దీనికిఁజింతఁదక్కుఁడుసుధీజనపుంగవులన్నఁబ్రీతులై।
యానలినాసనాత్మజులనంతునిభావముఁదామెఱింగిపెం। పూనినవేడ్కఁదేలితెలివొందినచిత్తములన్నుతించిరం। భోనిధి
శాయినార్తజనపోషణభూషణుఁబాపశోషణున్॥ ఉ॥ ఆసనకాదులప్డుపులకాంకురముల్ననలొత్తబాష్పధా। రాసుభగా
క్షులైమునిశరణ్యావరేణ్యునగణ్యుదేవతా। గ్రేసరుదివ్యమంగళశరీరముఁజారుతదీయధామము। న్భాసురలీలఁజూచినవ
పద్మదళాక్షునకున్వినమ్రులై॥ క॥ తమపలికినభాషణములు। గమలోదరుభాషణములుగాఁదలఁపుచునెయ్యమునన్వైష్ణ
వలక్ష్మిన్। బ్రమదంబునఁబ్రస్తుతించిపరమేశ్వరుచేన్॥ క॥ ⁽¹⁾ఆమంత్రితులైతగనిజ। ధామములకుఁజనిరివారుతడయకల
క్ష్మీ। కాముఁడుజయవిజయులనభి। రామంబుగఁజూచిపలికెరయమొప్పారన్॥ క॥ మీరసురయోనియందని। వారితులైజనన
మందవలసెనునేను। ర్వారబలాఢ్యుఁడనయ్యును। వారింపఁగనోపవిప్రవచనములెంతున్॥ క॥ అదిగానదనుజయోనిం। బ

* పాతురు। తొలఁగుదురు— శీనిష్యంద। స్రవించుచున్న— క్షుపహతి। పీడను-బాధను— ⁽¹⁾ఆమంత్రితులై। సెలవుగొనినవారలై.

దపడిజనియించిమద్విపక్షులరై మీ। మది నెపుడున న్నెతలఁపుచు। వదలక నాచేతఁ జచ్చి వచ్చెద రిటకున్ ॥ఉ॥ పొండనియా
నతిచ్చి హరి ఫుల్లసరోరుహపత్రనేత్రుఁ డా। ఖండలముఖ్యదిగ్వరనికాయకిరీటలసన్మణిప్రభా। మండితపాదపీఠుఁ డురమా
రమణీమణితోడ నేసు దేఁ। వెండిన వేడ్క నేగెనిజనిర్మలపుణ్యనివాసభూమికిన్ ॥అంత ॥క॥ నిజతేజోహానిగ జయ। విజయులుధ
రఁ గూలి రపుడు విహ్వలురగుచున్। త్రిజగములసురవిమాన। వ్రజములహాహారవంబు గ్రందుగఁ జెలఁగెన్ ॥క॥ వారలునా
దితిగ*ర్భా। గారంబుననున్న వారు గడఁగి తదీయో । దారఘనతేజమిపుడ§ని । వారణమీ తేజమెల్ల ‡వమ్ముగఁ జేసెన్॥
ఉ॥ ఇంతకు మూలమా హరి రమేశ్వరుఁ డర్థినొనర్చు కార్యముల్ వింతలె। సర్వభూతభవవృద్ధివినాశనహేతుభూతుఁ డా।
ద్యంతవికారశూన్యుఁ డుదయానిధి మీ యెడ మేలుసేయుని । చింతఁ దొరంగి వేఁ జనుఁడు చేకురుమీకు మనోరథార్థముల్॥
క॥ అని వనజాసనుఁ డాడిన। వినిత ద్వృత్తాంత మెఱిఁగి విబుధులు నాకం। బున కేగిరి దితి నిజనా। థుని మాటలు దలఁచి యపరితో

—— శ్రీ జయవిజయులు దితిగర్భంబున హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగాఁ బుట్టుట. శ్రీ ——

షముతోడన్॥ గీ॥ తనసుతులు సురల హరింతు రనుచు నాత్మఁ। దలఁచుచుండంగ నంతవత్సరశతంబు। సనఁగ నటమీఁదఁ గనియెఁ
గశ్యపుని దేవి। యఖిలలోకైకకంటకులై న సుతుల॥ అయ్యవసరంబున॥ గీ॥ ధరణి గంపించెఁ గులపర్వతములు వడఁకె। జడనిధిక
లంగె దారకావళులు డుల్లె। గగనమగలెను మ్రొగ్గె దిక్కరులు దిశల। మిడుగురులడరెఁ బిడుగులు పుడమిఁ బడియె॥ సీ॥ హో
మ్యానలంబుల ధూమంబులడరెను బ్రతికూలవాయువుల్ బలసి వీఁచెఁ। దరువులెల్లెడ¶ విటతాటంబులై కూలె గ్రహతారకా
వళికాంతి మాసె। బెరసి మొగుల్లు నెత్తురువాన గురిసెను మెఱుఁగులు దెసల మిర్మిట్లు గొలిపె। శ్రీస్వర్భానుఁ డొగిన పర్వమున
భానుని బట్టెఁ గైకొని చిమ్మచీఁకట్లు పర్వె। మొనసి కుక్కలు మొఱఁగెను మోరలెత్తి। పగలు నక్కలు వాపోయె ఖగములార్త
రవములిచ్చెను దేవతాప్రతిమలూరఁ గెఁ। గన్నులను నశ్రుకణములు గ్రందుకొనఁగ॥ క॥ మొదవులు నెత్తురుఁ జీమును। బిదికె
న్గార్దభరవంబు భీషణమయ్యె। న్మదముడిగెఁ గరులకటములఁ। బొడమెదురంగములవాలముల నిప్పులొగిన్॥ క॥ గుహలు రొద
లిచ్చెఁ బాప। గ్రహమిత్రతఁ జెందివక్రగతులను సౌమ్య। గ్రహములు వర్తించెను దు। స్సహతేజో దితితనూజసంభవవేళన్॥
మ॥ భయదప్రక్రియ నట్టు దోఁచిన మహోత్పాతంబు లీక్షించి సం। క్షయకాలంబని కాని సాధుహననోగ్రక్రూరదేవాహి
తోదయసంక్షోభముగా నెఱుంగక సమస్తప్రాణిజాతంబులు। ద్భయమందెన్ సనకాదియోగిజనముల్ దక్కన్ బ్రధేంద్రోత్త
మా॥ వ॥ అట్లావిర్భవించిన యనంతరంబ॥ మ॥ కులశైలాభశరీరముల్ దనరరక్షోనాథులత్యుగ్రదో। ర్బలమొప్పన్ బదఘట్టనన్ ధ
రచలింపన్ రత్నకేయూరకుం। డలకాంచీకటకాంగుళీయకకిరీటస్వర్ణమంజీరని। ర్మలకాంతుల్ దురఁగింపనాత్మరుచిచే మం
దీకృతార్కాంశులై॥ వ॥ ఉన్నసమయంబున గశ్యపుండు నిజతనూభవులఁ జూడం దలంచి దితిమందిరంబునకుం జనుదెంచిన
తులం గనుంగొని వారలకు నామకరణంబు సేయం దలంచి॥ చ॥ దితిజఠరంబునందుఁ దన తేజము మున్నిడినట్టి పుత్రున। ద్భుత
చరితున్ హిరణ్యకశిపుండను పేరఁ బ్రసూతివేళ నా। దితి మును గన్నపట్టి రవితేజునిఁ గాంచనలోచనుండనా। హితమతిఁ బే
రు వెట్టి చని యెన్నిజనిర్మలపుణ్యభూమికిన్॥ వ॥ అయ్యవసరంబున నతులతేజోవిరాజితుండై న హిరణ్యకశిపుండు హిరణ్యగ
ర్భవరదానగర్వంబున దుర్వార†పరిపంథిగర్వనిర్వాపణాఖర్వభుజావిజృంభణంబున నఖిలలోకపాలాదుల జయించి స్వ
వశంబొనర్చి సంతుష్టాంతరంగుండై యెందు నుందనకు మృత్యుభయంబు లేక నిర్భయుండై సుఖంబున నుండెఁ దత్సోదరుం
డై న హిరణ్యాక్షుండు ప్రతిదినంబుఁ జండవేదండశుండాదండమండితభుజాదండంబున గదాదండంబు ధరియించి తన్నె
దిరి§కదనంబు సేయంజాలిన యరివీరునిం గానక భూలోకంబెల్లఁ గ్రుమ్మరి దివంబునకు దాడి వెట్టి యందు సమరవిముఖులై
న బర్హిర్ముఖులం గనుంగొని వనజాసనవరప్రదానంబు జింతించి హితులు సెలంగ నహితులు గలంగ మహితవైజయంతికా
దామంబభిరామంబై వెలుంగం జరణంబుల మణినూపురంబులు మొఱయ నిజదేహద్యుతి దిక్కులం బిక్కటిల్లం జనుదెంచు
వానిం గని భీతచిత్తులై దేవతాగణంబులు గరుడునిం గని పరచు నురగంబులుం బోలె నిజనివాసంబుల§అర్క కాంచననివాసం
బులు గనొనర్చి యెక్కడికేని యుం జనిన॥ ఉ॥ శౌర్యము వోవఁదట్టి నిజసాధనముల్ దిగనాడి విక్రమా। దార్యపరాక్రమక్రమ
ముదప్పఁగ భీతిలి పారి రక్కటా। క్రౌర్యముఁ దక్కి నాకులని గైకొని యార్చి సుమేరుపర్వత। స్థైర్యుఁడు వార్ధిఁ జొచ్చెనతిదర్పి

---

*అగారము। ఇల్లు — §అనివారణన్। నివారణలేనిదగుటవలన — ‡వమ్ముగన్। వ్యర్థముగాను — ¶విటతాటంబులై। తారుమారై — శ్రీస్వ
ర్భానుఁడు। రాహువు — †పరిపంథి-ఖనన్॥ శత్రువులగర్వము నడఁగించుటయందు కొఱఁతపడని బాహుబలపరాక్రమముచేత — §కదనము। యు
ద్ధము — §దాడివెట్టి। యుద్ధమునకు బయలుదేరి — §అర్క-కాంచన॥ అర్క। జిల్లేడుచెట్లకు, కాంచన। ఉమ్మెత్తచెట్లకు.

తభూరిభుజావిజృంభియై॥ఇట్లుచొచ్చిన॥ క॥వరుణునిబలములుదనుజే।శ్వరుతేజముఁ దేరిచూడఁజాలక శౌర్య।స్ఫురణము
చెడియెందేనియుఁ।బరచెందజ్జలధిమధ్యభాగమునందున్॥ క॥అమరారివిపులనిశ్వా।సములంబ్రభవించినట్టిజలనిధికల్లో।
లములనువిపులగదాదం।డమునంబోనడఁచెనతిదృఢంబగుశక్తిన్॥ చ॥ మఱియునునమ్మహాజలధిమధ్యమునన్సురవైరిపె
క్కువ।త్సరములుగ్రీడసల్పిరిపుసైన్యవిదారణశౌర్యఖేలనా। పరతఁజరించియవ్వరుణపాలితమైనలసద్విభావరీ। పురము
నకేగియందుఁబరిపూర్ణతనున్నపయోధినాథునిన్॥మఱియును॥సీ॥యాదోగణాధీశుఁడగుచుఁబాతాళభువనపరిపాలుఁ
డై తనర్చుచున్న। వరుణునిఁగనుఁగొనిపరిహాసితోక్తులనిట్లనువిశ్వమందెన్నఁగలుగు।సకలలోకైకపాలకులలోనతిబలాధి
కుఁడనిజగమునుతింపఁదగిన।శూరుండవిపుడునీపౌరుషమొప్పంగఁగదనరంగముననన్నెదిరిచూడు। నీభుజావిక్రమంబును
బ్రాభవంబు।నడఁతుననిపలుకఁటయువినియబ్ధివిభుఁడు।పగరజయమునువృద్ధియుబలమునాత్మ।బలముఁదలపోసిదనుజుతో
బవరమునకు॥క॥సమయముగాదనితనచి।త్తమునంగలరోషవహ్నిఁదాలిమియనుతోయములందగనార్చుచునుప।శమితో
క్తులఁబలికెదనుజసత్తముతోడన్॥చ॥మనమునశాంతిఁబూనినియమంబునసంగరముజ్జగించియే।ననయమునున్నవాఁడని
పుడాహవకేళిఁజరింపరాదునీ। ఘనభుజవిక్రమస్ఫురితగాఢవిజృంభణమున్జయింపఁజా। లినప్రతివీరులెవ్వరునులేరుము
కుందుఁడుదక్క నెక్కడన్॥చ॥గొనకొనియమ్మహాత్ముఁడువికుంఠపురంబుననున్నవాఁడుదా।నని మొనఁబెక్కుమారు *ల
భియాతులనోలిజయించిశక్తిసెం।పునసడిగన్నవీరుఁడనిభూజనకోటినుతించునంచువేచను।మతఁడిచ్చునీకుననిసర్వమదీ
తెడుపునంతమీఁదటన్॥ ఉ॥నిందకునోర్చియాజిమొననిల్వఁగనోపక వీఁగిపారునీ। పందలవెంటఁబడ్డఁ దగపంతమెసర్వశ
రణ్యుఁడైనగో। విందుఁడుదీర్చునీపనివివేకవిహీనచనంగనోపుదే। నందులకేగుమాతఁడమరారులఁబోరజయించునిచ్చ
లున్॥అదియునుంగాక॥క॥పురుషాకృతిఁబ్రతియుగమునఁ।బురుషోత్తముఁడవతరించిభూరిభుజావి।స్ఫురణస్ఫుటనిశాటుల
సూరియించుచునుండుమునిగణార్చితపదుఁడై॥ఉ॥కావుననావిభుందొడరికయ్యముదయ్యమెఱుంగఁజేసిర । శ్రీవరనీభు
జాబలముసొంపరిమేదినిఁగూలి §సారమే। యావళికాశ్రయంబగుదువచ్చటికిప్పుడు నేగుదేనినీ। చేవయులావునేర్పడును
జెప్పఁగనేటికిమీఁదికార్యముల్॥చ॥అనివరుణుండువల్కనదురాగ్రహమెత్తిహిరణ్యలోచనుం।డనయముమానసంబున
భయంబొకయించుకలేకసంగరా। వనినెదిరింతునేఁడమరవర్గనుదుష్టవిమర్దనుంజనా।ర్దనుననుచున్వికుంఠనగరస్ఫుటసం
చితమార్గవర్తియై॥క॥చనునవసరముననారద।మునివరుఁడెదురేగుదెంచిముదముదలిర్ప।న్దనుజేంద్రయెందుఁబోయెద।వని
యడిగిననారదునకునతఁడిట్లనియెన్॥ చ॥సరసిరుహోదరుందొడరిసంగరమేనొనరించియిందిరా।వరునినసంతుఁద్రుం
చిసురవైరికులంబులకెల్లమోదవి।స్ఫురణఘటింపఁజేయుటకుఁబూనివికుంఠపథానువర్తినై। యరిగెదనన్ననమ్మునికులా
గ్రణిదానవనేతకిట్లనున్॥చ॥గురుభుజుఁడమ్మహాత్ముఁడువికుంఠపురంబుననేఁడులేఁడుభూ। భరమువహింపనాదికిటిభా
వముఁదాల్చిరసాతలంబునం।దిరవుగనున్నవాఁడచటికేగఁగనోపుదువేనిమేగుమం। దరయఁగఁగల్గునీకునసురాంతకుతో
డిరణంబవశ్యమున్॥

## § హిరణ్యాక్షుఁడుయజ్ఞవరాహంబగుహరినెదిరించియుద్ధముచేయుట.§

చ॥ అనవుడుదానవేంద్రుఁడుహుతాశనుకైవడిమండిపద్మలో। చనునెదిరించువేడుకలుసందడిఁగొల్పననల్పతేజుఁడై।
ఘనగదఁగేలఁబూనిత్రిజగద్భయదాకృతిఁదాల్చిప్రేల్మిడి।న్జనియెరసాతలంబునకుఁజండభుజాబలదర్పమేర్పడన్॥చనిజల
మధ్యంబున॥ క॥ దివిజారియెదుఱఁదగఁగనె।నవిరళదంష్ట్రాభిరామునమరలలామున్। @కువలయభరణోద్దాము।న్నవన
మయస్తబ్ధరోముజలదశ్యామున్॥అయ్యవసరంబునసూకరాకారుండైనహరియు॥ క ॥ వనజనిభసన్నిభములగు।తనలో
చనయుగళదీప్తిఁదనరఁదదాలో।కనములదనుజాధీశుని।తనుకాంతిహరింపఁజేసెఁదక్షణమాత్రన్॥వ॥మఱియునయ్యా
దివరాహంబవార్యశౌర్యంబునమారులేనివిహారంబునంజరియించునట్టియెడ॥సీ॥ తుదమొదళ్లకుఁజెక్కుచునిసిపారఁగ
మోరఁగులశైలములఁజిమ్ముఁగొంతతడవు।బ్రహ్మాండభాండంబువగిలిచిల్లులువోవఁగొమ్ములఁదాడించుఁగొంతతడవు। జ
లధులేడునుబంకసంకులంబై యింక ¶ఖురములమట్టాడుఁగొంతతడవు। ‡ఉడురాజుసూరుండునొక్కమూలకుఁబోవఁ
గురుచవాలముఁద్రిప్పుఁగొంతతడవు। **గునియుఁగుప్పించులంఘించుఁగొప్పరించు। నెగయుధరఁద్రవ్వుఁబొరియఁగానే
పుతేఁగి।దానవేంద్రునిగుండెలుదల్లడిల్లఁ।బంధిమెల్లనరణపరిపంథియగుచు॥మఱియు॥ క॥కనుఁగవనిప్పులురాలఁగ।సుని

---

*అభియాతులక।శత్రువులను— §సారమేయావళికి।కుక్కలగుంపులకు— @కువలయ।భూమండలము— ¶ఖురములమట్టాడున్।
గిరిజలతోఁద్రొక్కను— ‡ఉడురాజు।సూరుండు-చంద్రసూర్యులు— **గునియున్।గొణుగును.

శితదంష్ట్రాగ్రయుతవసుంధరుఁడగుచుఁ । దన కెదుతే తేరఁగఁగని । *వనచర మేరీతినిపుడు వనచరమయ్యెఁ ॥ క ॥ అనియా
శ్చర్యభయంబులు దనమనమునఁ దొంగలింపఁ దనుజాధిపుఁడి । ట్లనియె న్నీకరసూకర । తను వొందిచరించు దనుజదర్పహారున్ని
తోఁ ॥ క ॥ ఘనసూకరమూర్ధాత్మక । వనరుహసంభూతదత్తవరదానమునన్ । గనినరసాతలగతభువి । యనయంబును నాయధీ
నమైవర్తించుఁ ॥ క ॥ గొనకొని నీవీధరణిం । గొనిపోకుము విడువు కాక కొనియెద వేనిన్ । గొనియెద నీ ప్రాణముఁ గై । కొను నావచ
నములు చలముఁ గొన నేమిటికిన్ ॥ క ॥ మాయావివగుచు నిప్పుడు । పాయక యీపుడమిఁ జోరభావముతో నీ । వీయెడఁ గొనిపోఁ
జూతు నె । యాయతభుజబలము చేత నడఁపక యనుచుఁ ॥ సీ ॥ అవిరళ యోగమాయాబలంబునఁ జేసి యల్పపౌరుషములన
రునిన్ను నర్థి సంస్థాపించి యస్మత్సుహృద్భృత్యకులుల కెల్లను మోదమొలయఁ జేయఁ । జెలు వేదిమార్గదాశీర్ణుఁడవగు నిన్నుఁ
గనుఁగొని దేవతాగణములెల్ల । నిర్మూలులై చాల నెటిన శించెదరన్న విని యజ్ఞపోత్రియై వెలయుచున్న । హరి సరోజజసుర
మునివరుల కెల్ల । వచ్చు దురవస్థ కాత్మలో వంత నొంది । నిశితదంష్ట్రాగ్రలసితమైన తనరుధరణి । దేవితో నెప్పె నా దేవదేవుఁ
డపుడు ॥ క ॥ సురరిపు వాక్యాంకుశములఁ । గురుకుపితస్వాంతుఁడయ్యుఁ గోమరారెవసుం । ధరతోడ భీతి నొందిన । కరణిం గలక
రికులేంద్రు కరణిం బెలుచన్ ॥ గీ ॥ నిశితసితదంతరోచులు నింగిఁ బర్వఁ । గంధి వెడలి భయంకరాకారలీల । నరుగ భీషణమైవరా
హావతార । మొనరఁ దాల్చిన పద్మలోచనుని వెనుక ॥ క ॥ కరి వెనుకఁ దగులు నక్రము । కరణిం జని దైత్యవిభుఁడు గదిసెట్లనియెన్ ।
చరితపయోనిధితరికిన్ । గిరికిన్ ఖురదళితమేరుగిరికిన్ హరికిన్ ॥ క ॥ నిందకు రోయక లజ్జన్ । జెందక వంచననురణము సేసిజ
యంబున్ । బొందెదనని మదిఁ దలఁచిటు । పందగతిం బారఁ బంటుపంతమె నీకున్ ॥ అనియాక్షేపించినఁ బుండరీకాక్షుండు
గోపోద్దీపితమానసుండై ॥ క ॥ తోయములమీఁద భూమిన । నాయాసత నిల్పి దానికాధారముగాఁ । దోయజనాభుఁడు దనబల
మాయతమతిఁ బెట్టె సురలు హర్షము నొందన్ ॥ గీ ॥ కుసుమముల వృష్టి భోరునఁ గురిసెనంత । విభవ మొప్పార దేవదుందుభు
లు మొఱసెఁ । గడకవీతెంచె గంధర్వగానరవము । నందితములయ్యె నప్సరోనర్తనములు ॥ వ ॥ అయ్యవసరంబున నయ్యజ్ఞవరా
హమూర్తిధరుండై నకమలలోచనుండు గనకకుండల కేయూరగ్రైవేయకటకాంగుళీయకభూషణరోచులు నింగిఁ బర్వ స
మరసన్నద్ధుండై ॥ చ ॥ ఘనగదఁ గేలఁ బూని మణికాంచననవ్యవిచిత్ర†వర్మముం బొనరఁగఁ దాల్చి దానవనియుక్తదురుక్తని
శాతబాణముల్ దనఘనమర్మముల్ గలఁపఁ దానవహంత నితాంతశౌర్యుఁడై । కనలుచు వచ్చు నద్దనుజుఁ గన్గొని రోషవిభీషణాకృ
తిన్ ॥ ఒప్పినగుచు నిట్లనియె ॥ మ ॥ వినరా యోరి యమంగళాచరణ యుద్వృత్తిన్న నున్నీదుధీ । ననయంబున్ వనగోచరంబగు
మృగంబంచున్ దలంతౌర నే । నెనయన్ వన్యమృగంబ నౌదు బలిమి న్నెంతెంచు నీబోటి యీ । శునకశ్రేణి వధింతు నేఁడని మొన
న్నోసీ కోర్చి వర్తించినన్ ॥ క ॥ బలిమిగలదేని నాతోఁ । గలన న్నెదిరించి పోరఁ గడఁగుము నీకో । ర్కులు నేఁడుదీర్తు నారక । తలపో
య ‡వికత్థనములు దగదుచు రాత్మా ॥ చ ॥ వినుమది గాక సంగరవివేకవిశారదులైన యట్టిస । జ్జనములు మృత్యుపాశములఁ జా
లనిబద్ధులునయ్యు నీవలె న్గొనకొని యాత్మసంస్తుతులకున్ముదమందిరె యేల యీ వికత్థనములు బంటుపంతములె దైత్యకులా
ధమ యెన్నిచూడఁగన్ ॥ మ ॥ ధృతిఁ బాతాళమునందు నీవనెడి సందీప్తోగ్రనిక్షేపమే । నతిదర్పంబునఁ గొంచుఁ జూడుమి దెదే
వారాతి నన్నెన్నెదొ । గతలజ్జుండన దాగియుండి రణముం గావింతు యుష్మద్గదా । వితతద్రావితు నన్ను నేఁడెదుటు మాపే
దీర్తు నీ కోరికల్ ॥ ఉ ॥ ఎన్నఁబదాతి యూథముల కెల్ల విభుండవు పోటుబంటవై । నన్నురణోర్వి నేఁడెదిరి నన్భవదీయబలం
బు నాయువు న్మిన్నకఁ గొందుఁ జూడుమిదె మేరఁగ మేదినివీత దైత్యనై । వన్నెకు నెక్కఁ జేసెద నవార్యపరాక్రమవిక్ర
మంబునన్ ॥ చ ॥ నను నెదుఱింగఁ జాలిన ఘనంబగు శౌర్యము ధైర్యమున్బలం । బును గలదేని నిల్వు రణభూమి నినీహితులైన వా
రికి న్గనుఁగవ బాష్పపూరములు గ్రమ్మఁగ మాన్పఁగ నోపు దేని స । య్యనఁ జనఁ బొమ్ము దానవకులాధమ యూరకరజ్జులేటికిన్ ॥
క ॥ నను నిటసంస్థం జేసెద । ననిపలికితివంత వాఁడ నౌదువు నీకు । న్నెనరైన చుట్టములఁ బొడఁ । గని రాయిదెయముని పురికిఁ గొ
పురమరుగన్ ॥ మ ॥ అని యిబ్భంగి సరోరుహాక్షుఁడు హిరణ్యాక్షున్ విడంబించి పల్కిన వాసోక్తులకుల్కి రోషమదసంగీభూ
తచేతస్కుఁడై । కనుగ్రేవన్ మిడుగుర్లు చాలఁ బొడమంగాఁ గినుకమైఁ దోఁకఁ ద్రొ । క్కిన కృష్ణోరగరాజు మాడ్కి మదిలోఁ గి
ట్పాటు వాటిల్లఁగన్ ॥ క ॥ చలితేంద్రియుఁడై నిట్టూ । ర్పులు నిగుడింపుచును బొమలు ముడివడ రోషా । కులమానసుఁడై గదఁ గొ
ని జలజాక్షున కెదుఱనడిచె సాహసమొప్పన్ ॥ వ ॥ అత్తఱి హిరణ్యాక్షుండతిభయంకరాకారుండై ॥ మ ॥ గదసారించి మహా
సురేంద్రుఁడు సముగ్రక్రోధుఁడై మాధవుం । గుఱియన్ వ్రేసిన వ్రేటు గైకొనక రక్షోహంతశౌర్యోన్నతి । న్గదఁ గేలం ధరి

*వనచరము। అడవియందు సంచరించునది-నీళ్లలోఁ దిరుగునది. — †వర్మ। కవచము — ‡వికత్థనము। ఆత్మస్తుతి--కాలయాపనము.

యించి దానిఁ దునుకఁగ్లావించినం దైత్యుఁడు। న్మమదై యొండుగదన్రమావిభునిభీమ ప్రక్రియ న్వేసినన్॥ చ॥అదివనుఁ
దాఁకకుండనసురారిగదారణకోవిదక్రియా। స్పదకరలాఘవక్రమముఁబైకొనిచూపి విరోధి పేఱురం। బదరఁగ వ్రేయ
వాఁడు వివశాంసలభావము నొందియంతలో। మదిఁ దెలివొంది వ్రేసె రిపుమానవిమర్దను నాజనార్దనున్॥ వ॥ ఇట్లు దలపడి
యన్యోన్యజయకాంక్షులనితరేతరతుంగతరంగతాడితంబులగు దక్షిణోత్తరసముద్రంబులవడువున రౌద్రంబునం బరస్ప
రశుండాదండఘట్టితమదాంధగంధసింధురయుగంబుచందంబునరోషభీషణాటోపంబులం దలపడు బెబ్బులులగబ్బునన
లిగి దర్పాతిరేకంబున నెదిర్చి రంకెలు వైచు మదవృషభంబుల రభసంబున నసహ్యసింహపరాక్రమంబున విక్రమించి పోరు
నెడ హిరణ్యాక్షుండు సవ్యమండలభ్రమణంబునం బరివేష్టించినం బుండరీకాక్షుండు దక్షిణమండలభ్రమణంబునం దిరిగి
విపక్షువక్షంబశనిసంకాశంబగు గదాదండంబునం బగిల్చిన వాఁడు దెప్పిరి తెలివొంది దనుజపరిపంథిఫాలంబు నొప్పించె న
మ్మేటివీరులు శోణితసిక్తాంగులై పుష్పితాశోకంబులం బురణింపుచుం బాయుచు డాయుచు వ్రేయుచుఁ ద్రోయుచు నొండొ
రుల రుధిరంబులాఘ్రాణించుచుఁ దిరస్కారపరిహాసోక్తులనిచ్చుచుఁ బోరుసమయంబున నమ్మహాబలుల సమరంబుఁ జూచువే
డ్కఁ బద్మసంభవుండు నిఖిలమునీంద్రసిద్ధసాధ్యదేవగణంబులతోడం జనుదెంచి ధరిత్రీనిమిత్తంబ సురతోడం బోరు యజ్ఞ
వరాహునకిట్లనియె॥ ఉ॥ అంచితదివ్యమూర్తి పరమాత్మక యీ కలుషాత్ముఁడైనన। క్తంచరుఁడస్మదీయవరగర్వమునన్
భువనంబులెల్లఁ గా। రించు మదించి యిట్టి విపరీతచరిత్రు నిఁ దృంపకిట్లు పే। క్షించుట గాదు వీని బలిసేయు వసుంధరకున్ శు
భంబగున్॥ క॥ బాలుఁడు గరమున సుగ్ర। వ్యాలము ధరియించి యాడునడువున రక్షః। పాలుని దృంపక యూరక। పాలా
ర్చుట నీతియే శుభప్రదయింకన్॥ అదియునుం గాక॥ మ॥ అనఘా యీ *యభిజిన్ముహూర్తమున దేవారాతి మర్దింప వే। య
నయంబున్ మఱి దైత్యవేళ యగు సంధ్యాకాలమే తెంచినన్। ఘనమాయాబలశాలియైన దనుజున్ ఖండింపఁగా రాదు కా।
వున నీవేళ నడంపు సజ్జనహితోద్యోగానురక్తుండవై॥ క॥ అని సరసిజగర్భుఁడు వ। లికిన వచనములర్థి విని §నిలింపులుగుం
పుల్ గొని చూడ సస్మితానన। వనజము చెలువొందనసురవరునకు నెదురై॥ గీ॥ ‡పుండరీకాక్షుఁడయ్యనుభూరిరోష। ని
రతిఁ దరుణారుణాంభోజనేత్రుఁడగుచు। ఘనగదాదండమెత్తి రాక్షసుని ¶హనువు। నుగ్రగతి మొత్తవాఁడును ||ఓసరిం
చె॥ క॥ పరువడి దితిసుతుఁడతిభీ। కరగదఁ జేఁబూని చిత్రగతులం బద్మో। దరుఁ డాసి చేతిగద సా। గరమునఁ బడ నడఁచె బాహు
గర్వ మెలర్పన్॥ అంత॥ గీ॥ హరి నిరాయుధుఁడై నసురారి సమర। ధర్మమాత్మను దలఁచి యుద్ధంబుఁ దక్కి। నిలిచి చూచుచునుం
డెను నింగినమర। వరుల హాహారవంబులు భరితమయ్యె॥ క॥ సరసిజనేత్రుఁడు దనుజే। శ్వరు సంగరధర్మమునకు సమధిక శౌ
ర్యస్ఫురణకుఁ దన చిత్తంబునఁ। గరమాశ్చర్యంబు నొంది కడఁకఁ దలిర్పన్॥ మ॥ కుతలోద్ధర్తమనంబునం దలఁచె రక్షో
ద్వాధార్థంబుగా॥ క్షితిసంతానకులాటవీమహితసందీప్తప్రభాశుక్రమున్। †సతతోద్యజ్జయశబ్దసమ్ముఖరభాస్వచ్చక్ర
మున్ సంతతా। శ్రితనిర్వక్రముఁ బాలితప్రకటధాత్రీచక్రముం జక్రమున్॥ వ॥ అదియునుం బ్రచండమార్తాండమండల
ప్రభాపటలచటుల విద్యోతమానంబుఁ, బటునటజ్వాలికాపాస్తసమస్తకుపితారాతిబలాఖర్వదుర్వారబాహాగర్వాం
ధకారంబు, ననహ్యకహకహనినదాధరీకృతసాగరఘోషంబు, సకలదేవతాగణజేగీయమానంబు, ననంతతేజోవిరాజి
తంబు, నిజప్రభాపటలపూరితబ్రహ్మాండకటాహంబునై, రయంబునం జనుదెంచి, దనుజారిదక్షిణకరసరోజంబలంకరించిన
నాశుభాంగుండు రథాంగపాణియై దివంబున నమరగణంబులు జయజయశబ్దంబులు వలుక ననురవిభున కెదురుగా నడిచిన॥
క॥ పొడగని దనుజుఁడు పెదవులఁ। గడుపుచుఁ బొలివోని బంటుతనమున బీరం। బుడుగక భీషణగదఁ గొని। యడచెన్మఖమయ
వరాహునమితోత్సాహున్॥ క॥ త్రిదశారి దన్ను వ్రేసిన। గదఁ బదమునఁ బోవఁ దన్ని కమలాక్షుఁడు పెం। పొదవఁగ మన మున
మోదము। గదురఁగ లేనవ్వు వదనకమలము వొదువన్॥ వ॥ ఇవ్విధంబునఁ గదఁ బోవం దన్ని యసురవిభునితో నిట్లనియె॥ చ॥ ఘ
నగదఁ గేలఁ బూని భుజగర్వ మెలర్పఁగ నన్ను సంగరా। వని నెదురింతు రారయనివారణ దైత్యకులేశ్వరాధమా। యనవుడు
వాఁడు నుబ్బి గదనంబుజనాభుని నేసె నేసినం। దనుజవిరోధి పట్టికొనెఁ దార్క్ష్యుఁడు పాముఁ దృంచి నిఁబట్టు కైవడిన్॥ క॥ దితిజుఁడు
తనబలము ప్రతి। హతతేజుండసు సరోరుహాక్షుని శౌర్యో। న్నతి మీఁదఁ బెట్టకుండుట। మతి నెఱిఁగియుఁ బెనఁగె దురభిమానము

* అభిజిన్ముహూర్తమువన్। మధ్యాహ్నకాలమందు.—— § నిలింపులు। దేవతలు —— ‡ పుండరీక। తెల్లదామర —— ¶ హనువు। నేత్రముక్రింది ప్రదేశము మొదలుకొని చెక్కిలిపార్శ్వభాగమువరకు.—— || ఓసరించెన్। తొలఁగెను —— ¶ దితిసం-శుక్రమున్॥ రాక్షసవంశమను నడవికి జాజ్వల్యమానము గా మండుచున్న అగ్నివంటిదియైన—— † సతతో-భాస్వచ్చక్రమున్॥ సార్వకాలము జయజయయని శబ్దించుచుండు దేవతాసముదాయము గలది.

పేర్మిన్॥అంత॥ సీ॥కాలానలజ్జ్వలజ్జ్వాలావిలోలకరాళమై పెంపొందుశూలమంది।సురవైరియజ్ఞసూకరరూపధరుఁడైన
వనజనాభునిమీఁదవైవనదియు।సద్ద్విజోత్తముమీఁదఁజపలతగావించునభిచారకర్మంబునట్లుబెండువడిపరతేఁగనిష్ఫల్మ
దనుఁడుదానిఁజక్రధారాహతిఁజండవిక్ర।మమునసడుమనవడిఁద్రుంచెనమరభర్త।నుపహితదంభోళిచేగరుత్మంతుపక్ష।
మతిరయంబునఁద్రుంచినగతిఁజెలంగి।సురలుమోదింపనసురులుసొంపుడింప॥వ॥అయ్యవసరంబుననయ్యసురదనశూలం
బుచక్రంబుచేతనిహతంబగుటంగని॥ క॥దితిజుఁడురోషోద్ధతుఁడై।యతినిష్ఠురముష్టిఁబొడిచెహరినాలోకో।న్నతుఁడొప్పె
గుసుమమాలా।హతిదిగ్గజరాజుఁబోలియతిదర్పితుఁడై॥ మ॥హరిమీఁదన్దితిసంభవుండుఘనమాయాకోట్లుపుట్టించినన్।
ధరణీచక్రముభూరిపాంసుపటలధ్వాంతంబునంగప్పెభీ। కరపాషాణపురీషమూత్రఘనదుర్గంధాస్థిరక్తావళుల్గురిసె
న్మేఘములభ్రవీధినిమహాక్షోభక్రియాలోలమై॥ మఱియు॥ చ॥తవిలివిముక్తకేశపరిధానములుగ్రకరాళదంతతా। లు
వులునరక్తలోచనములుంగలభూతపిశాచఢాకినీ।నివహములంతరిక్షముననిల్చినిజాయుధపాణులై మహా। రవముగయ
క్షుదైత్యచతురంగబలంబులఁగూడితోఁచినన్॥అంత॥క॥త్రిసవనపాదుండగునా।బిసరుహనేత్రుండులోకభీకరమగునా
యసురాధిపుమాయావిని।రసనకరంజైనశస్త్రరాజముఁబనిచెన్॥క॥ఆచక్రభానుదీప్తిధ।రాచక్రముసంచునిండిరయము
ననమ్మా।యాచక్రమునడఁగించెను।నీచక్రముఁడైనయామినీచరునెమున్॥అంతనిక్కడ॥క॥దితితనవిభువాక్యంబుల।గని
దప్పనయనుచుఁదలఁపఁగాఁజన్నులశో।ణితధారలాలికెరక్షః।పతియగుకనకాక్షుపతనభావముదోఁపన్॥ వ॥అయ్యవస
రంబుననసురవిభుండుదానుఁజేసినమాయాశతంబులుగృతఘ్నునకుంగావించినయుపకారంబులుంబోలెహరిమీఁదఁబ్ర
సేయకవిఫలంబులైనంబొలివోవనిబంటుతనంబునంబుండరీకాక్షుఁజేరంజనుదెంచి బాహుయుగళంబుసాఁచియాఁలిం
పొడిచిరక్షోవైరివక్షంబుఁబీడించినయయ్యధోక్షజుండుతప్పించుకొనితలంగినఁజెలంగిదైత్యుంజునిష్ఠురంబగుముష్టింబొడి
చిననసురాంతకుండు * మిసిమింతలులేకరోషభీషణాకారంబునవాసవుండువృత్రాసురుందెగటార్చుచందంబునవజ్ర
సన్నిభంబగునజచేతంగటకటసుర * కటతటంబుఁజటులగతిఁవ్రేసిననాహిరణ్యాక్షుండుదిర్దిరందిరిగిమీలితాక్షుండై
సోలియెట్టకేలకునెమలనిలువంబడెనంత॥క॥దిటచెడిలోఁబడెదైత్యుఁడు * సటికిన్దంష్ట్రావిభిన్నశత్రుమహోదారస్త
కిన్ఖరఖురపుటికి।న్గటితటహతకమలజాండఘటికిన్గిటికిన్॥ఇట్లులోఁబడిన॥మ॥దివిజేంద్రాదులుసంతసింపహరిమొత్తెంగ
ర్ణమూలంబునన్। బవిసంకాశకఠోరహస్తమునశుంభల్లీలమైదానవా।నవలోకేశుఁడురక్తనేత్రుఁడగుచున్దైన్యంబు
వాటిల్లగా।భువిమీఁదంబడిసోలెమారుతహతోన్మూలావనీజాకృతిన్॥ క॥ బుడబుడనెత్తురుఁగ్రక్కుచు। వెడరూపముఁ
డాల్చిగ్రుడ్లువెలికుఱికనిలం।బడిపండ్లుగీటుకొనుచు।న్విడిచెన్ప్రాణంబుదైత్యవీరుండంతన్॥ గీ॥పడినదనుజేశ్వరునిఁజూ
చిపద్మసంభ।వాదిదివిజులువెఱగందిరాత్మలందు।నితఁడువొందుటయెట్లకోయీయవస్థ।ననితలంచుచుమఱియునిట్లనిరిదె
సను॥మ॥వరయోగీంద్రులుయోగమార్గములనెవ్వానినెమ్మనోవీధిను। స్థిరతల్లింగశరీరభంగమునకైచింతింతురావంకజో
దరుపాణ్యాహతిఁదన్ముఖాంబురుహమున్దర్శింపుచున్జచ్చెదు।ర్భరితోత్తంసునిదైత్యవల్లభునిసౌభాగ్యంబుదానెట్టిదో॥చ॥స
మనుతివీరుదైత్యకులశాసనుపారిషదుల్సునీంద్రశా।పమునునికృష్టజన్మమునఁబైకొనిపుట్టియునేఁడువిష్ణుచే। సమయుట
జేసిమీఁదనగుజన్మములన్జలజాక్షునిత్యవా।సమునవసింతురెన్నటికిఁజావునుబుట్టువులేదువీరికిన్. క॥అనివెఱఁగునొందిత్రి
సవన।తనువొందినయట్టివికచతామరసాక్షు।న్మునియోగిజనత్రిదశా।వనదక్షు * న్దనుజకరటివరహర్యక్షున్॥ కనుంగొ
ని॥చ॥వనజదళాక్షయీజగతివారలమర్మమునీవెఱింగియీ।సునఁబగఁబట్టినీదివిజసూదనుఁజంపితిగాననింకశో।భనమున
నంచుహస్తములుఫాలములంగదియించియందఱు।న్వినమితులైనుతించిరివివేకవిశాలునిఁబుణ్యశీలునిన్॥అంత॥ చ॥సవన
వరాహమూర్తిసురశాత్రవుఁద్రుంచినమీఁదభారతీ।ధవముఖదేవతామునికదంబముదన్నునుతించునట్టిసం। స్తవమునదా
త్మలోనఁబ్రమదంబునుబొందిసమగ్రమంగళో।త్సవముదలిర్పనందఱఁబ్రసాదవిలోకనమొప్పఁజూచుచున్॥చ॥అరిగె
కుంఠధామమునకప్పుమహోత్సవసూచకంబుగా। మొరసెసుపర్వదుందుభులమోఘములైధరణీతలంబున। న్గురిసెసు
సూనవృష్టిశిఖికుండములెల్లెడఁదేజరిల్లెభా।స్కరశశిమండలంబులునిజద్యుతితోవెలుగొందెనత్తఱిన్॥ క॥అనియీపుణ్య

* మిసిమింతలు।సుక్కుటలు— * కటతటంబున్।కణతను— * సటికిన్।జడలుగలదానికి— * దంష్ట్రా-మహోదారస్తటికిన్॥కోరలచేత
భిన్నములుచేయఁబడినశత్రువులవిశాలములైనవక్షఃస్థలములుగలదానికి,ఖరఖురపుటికిన్।వాడిగలగొరిజలుగలదానికి,కటితట-ఘటికిన్॥పిరుదుల
తాకులుచేయఁబడినబ్రహ్మాండభాండముగలదానికి,కిటికిన్।ఆదివరాహమూర్తికి— * కరటివరహర్యక్షున్।ఏనుఁగునకుమహాసింహమైన

చరిత్రము వనరుహసంభవుఁడు *త్రిదివవాసులకుం జెప్పినయది మైత్రేయుఁడు విదురునకెఱిఁగించినవిధంబు రూఢము గాఁగ ॥ క ॥ శుకయోగి పరీక్షిత్తునకు కుటిలమతి నెఱుఁగఁ జెప్పెనని సూతుఁడు శౌనకముఖ్యులైనమునివరులకుఁ దెలియఁ గఁ జెప్పె మఱియు లాలన మెప్పఁ ॥ వ ॥ ఇవ్విధంబున మైత్రేయుండు సెప్పిన విని విదురుండు సంతసిల్లెనని ॥ క ॥ అనఘంబగు నీచరితము విని నఁ బరించిన లభించు విశ్రుతకీర్తుల్ వనజోదరు పదభక్తియు మును కొని యిహపరసుసౌఖ్యములు జనములకున్ ॥ వ ॥ అని చెప్పి వెండియు సూతుండు నుహస్తులకిట్లనియెం బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని మునీంద్రా హిరణ్యాక్షువధానంతరంబున వసుంధర సమస్థితిం బొందినవిధంబు స్వాయంభువమనువు దిర్యగ్జాతిజంతుసృష్టినిమిత్తంబులై నమార్గంబులెన్ని సృజించె, మహాభాగవతోత్తముండయిన విదురుండు గృష్ణున కపకారంబు దలంచిన పాపవర్తనుల గుధృతరాష్ట్రపుత్రులం బాసి జనకుండగు కృష్ణద్వైపాయనునకు సముండగుచు మనోవాక్కాయకర్మంబులు గృష్ణునందచేర్చి భాగవతజనోపాసకుండయి పుణ్యతీర్థసేవాసమాలబ్ధయశోవిగతకల్మషుండగుచు మైత్రేయమహామునినేమి ప్రశ్నలడిగె

——శ్రీ చతుర్ముఖుండొనర్చు యక్షాది దేవతాగణసృష్టిఁ దెలియఁజేయుట. శ్రీ——

నవియెల్లం దెలియ నానతిమ్మనిన రాజేంద్రునకు శుకయోగీంద్రుండిట్లనియె ॥ సీ ॥ విమలాత్ముఁడైనయవ్విదురుండు మైత్రేయమునివరుఁ జూచి యిట్లనియెఁ బ్రీతిఁ । జతురాత్మ సకలప్రజాపతియైనట్టి జలజగర్భుఁడు ప్రజాసర్గమందు । మునుఁ బ్రజాపతులను బుట్టించి వెండియుఁ జిత్తరుం దేమి సృజింపదలఁచె । మును సృజింనయట్టి మునులమ్మరీచ్యాదులబ్జజునాదేశమాత్మనిలిపి యర్థినెట్లు సృజించిరియఖిలజగము । మెఱసి మఱి వారు భార్యాసమేతులగుచు । నేమి సృజియించిర దిగాక కామినులను । బాసియేమి సృంజించిరో భద్రయశులు ॥ క ॥ అందరుదమలో నైక్యముఁ జెందినచో నేమిదగ సృజించిరి కరుణాకందళితహృదయ యున్నియుఁ బొందుగ నెఱిఁగింపుమయ్య బుధనుత నాకున్ ॥ సీ ॥ అనినమునీంద్రుఁ డిట్లనియె జీవాదృష్టపరుఁడు మాయాయుక్తపురుషవరుఁడు । గాలాత్మకుఁడు ననుకారణంబున నిర్వికారుఁడైనట్టి జగన్నివాసుఁ । డాదిజాతక్షోభుఁడయ్యు నమ్మేటి వలనను గుణత్రయంబును జనించె । నాగుణత్రయమునందయ్యె మహత్తత్త్వ మదిరజోగుణహేతువైనదాని । యందహంకారమొగిఁ ద్రిగుణాత్మకమునఁ । బొడమె నది దానివలనఁ బ్రభూతమయ్యెఁ । బంచతన్మాత్రలందు సంభవము నొందె । భూతపంచకమీ సృష్టిహేతువగుచు ॥ వ ॥ అవి మఱియును దమలోనఁ బ్రత్యేకంబుగ భువననిర్మాణకర్మంబునకు సమర్థంబులు గాక యున్నయన్నింటి సంఘాతంబునఁ బాంచభౌతికంబైన హిరణ్మయాండంబు సృజియించెనదియును జలాంతర్వర్తియై వృద్ధిఁ బొందుచుండెనందు ॥ సీ ॥ నారాయణాఖ్యనున్నతి నొప్పు బ్రహ్మంబు । సాహస్రదివ్యవర్షంబులోలి । వసియించియుండె నాశ్రీవాసుదేవుని నాభియందు సహస్రసూర్యప్రదీప్తిఁ । దనరుచు సకలజీవనికాయయుతమగు పంకజాతంబు సంభవము నొందెఁ । బరగంగనందులో భగవదధిష్ఠితుఁడగు స్వరాట్టగు చతురాననుండుఁ । జననమొందెను దత్పద్మసంభవుండు । నామరూపగుణాదిసంజ్ఞాసమేతుఁ । డగుచు నిర్మాణమొనరించె నఖిలజగము । వనజజుండు నిజచ్ఛాయవలన మఱియు ॥ సీ ॥ తామిస్రమును నంధతామిస్రమును దమంబును మోహమును మహామోహనంబు । ననుపంచమోహరూపాత్మకమైనయవిద్యఁ బుట్టించియవ్వేళఁ దనకు । నదిద మోమయ దేహమని ధాత రోసి తత్తనువు విసర్జించె ధాతృముక్త । మూర్తియు క్షుత్తృట్సముద్భవంబగు రాత్రిమయమయ్యె నప్పుడు మఱి తలంప । నందులో యక్షరక్షస్సులను జనింప । వారికప్పుడు క్షుత్తృషల్ వారలగొంద । ఱా చతుర్ముఖు భక్షింతమనిరి కొంద । ఱతని రక్షింపుఁడనితగ నాడిరంత ॥ వ ॥ ఇట్లు పలుకుచు ధాతసన్నిధికి నతని భక్షించు వారలయి చనిన నతండు భయవిహ్వలుండై యేను మీ జనకుండ మీరలు మత్పుత్రులరు నన్ను హింసింపకుండనుచు ¶మామాం జక్షతరక్షత యనుశబ్దంబులు వలుకం దన్నిమిత్తంబున వారలకుం గ్రమంబున యక్షరక్షోనామంబులు ప్రకటంబులయ్యె వెండియుం బ్రభావిభాసితంబైన యొక్క కాయంబు ధరించి సత్త్వగుణగరిష్ఠులుఁ బ్రభావంతులును నగు †సుపర్వాణుల ముఖ్యంబగునట్లు సృజియించి తత్ప్రభామయగాత్రవిసర్జనంబు చేసెనదియ హాయారూపంబై దేవతావళికి నాశ్రయంబయ్యె మఱియు ‡జఘనంబు వలన §నతిలోలుపులైనయసురలం బుట్టింప వారలతి కాముకులగుటం జేసి యయ్యజు నింజేరి ‖మిథునకర్మంబ

---

* త్రిదివవాసులు । దేవతలు — శ్రీవాసుదేవః । వసనివాస ఇత్యస్మాద్ధాతోః - వసత్యస్మిన్ సర్వం వసత్యసౌ సర్వత్రేతివాసుః - దీవ్యతే ప్రకాశత ఇతి దేవః - సచాసౌ సచేతివాసుదేవః - అనఁగాఁ జతుర్దశభువనములెవనియందున్నవో, వాటియం దెవఁడు వసించి ప్రకాశించుచున్నాఁడో, వాఁడు వాసుదేవుఁడని యర్థము. — ¶ మామాంజక్షతరక్షత । వలదు వలదు విడువుఁడు రక్షింపుఁడు — † సుపర్వాణులు । దేవతలను — ‡ జఘనము । పొత్తికడుపు. — § అతిలోలుపులు । అత్యాశగలవారు — ‖ మిథునకర్మంబు । మైథునము.

పేక్షించినవిరించినగుచునిగ్గజ్జులయినయసురులుధనవెంటనంటిదగులంబరచిత్రపన్నార్తిహరుండుభక్తజనానురూపసం
దర్శనుండునైన*నారాయణుంజేరితత్పాదంబులకుం బ్రణమిల్లియిట్లనియె॥క॥రక్షింపుమురక్షింపుము। పేక్షింపకవినుత్సని
ఖిలబృందారకవిశ్వక్షేమంకరవినుమిటుదక్షుతనీయాజ్ఞ నేనుదలనిడివరుసన్॥గీ॥ఈప్రజాసృష్టికల్పనంబేనొనర్ప।నంచుఁ
బాపాత్ములయినయీయాయసురలిపుడు।ననురమింపఁగడాయవచ్చినఁగలంగి।యిటకువచ్చితిననుగావుమిద్ధచరిత॥వ॥అదియు
నుంగాకలోకంబువారలకుం గ్లేశంబులొనరింపం గ్లేశంబునంబొందినవారలక్లేశంబు లపనయింపనునీవకాకయని స్తుతి
యించినఁబ్రహ్మజుకార్పణ్యంబెఱుంగనవధరించివివిక్తాధ్యాత్మదర్శనుండగుచునిట్లనియెఁగమలసంభవభవద్ఘోరతనుత్యాగం
బుసేయుమనియానతిచ్చిననతండునట్లచేసిననదియును॥ సీ॥§నవ్యకాంచనరణన్మణినూపురారావవిలసితపాదారవింద
యుగళ।కాంచీకలాపసంకలితదుకూలవస్త్రస్ఫారపులిననితంబబింబ।రాజితాన్యోన్యకర్కశపీనకరికుంభపృథుకుచభార
కంపితవలగ్న।మదిరారసాస్వాదమదవిఘూర్ణితచారుసితనవవికచరాజీవనయన।యపరపక్షాష్టమీశశాంకాభనిటల।షు
దవదలికులరుచిరోపమానచికుర।లలితచంపకకుసుమవిలాసనాస।హాసలీలావలోకనయబ్జపాణి. క॥ అనఁదగిసంధ్యారూ
పం। బునలలనారత్నమపుడుపుట్టినదాని।న్గనుఁగొనిదానవు¶లుపగూ।హనమొగిఁగావించిపలికిరందఱుదమలోన్॥క॥ఈ
సౌకుమార్యమీరయ।నీసౌందర్యక్రమంబునీధైర్యంబో।రాసౌభాగ్యవిశేషము। నేసతులకుఁగలదుచూడనిదిచిత్రమగున్॥
చ॥అనివెఱఁగందియద్దనుజులందఱునిట్లనిరీతలోదరిం।గనిమనమింతనిప్పుడతికాముకవృత్తిఁజరింపుచుండఁగా।మనయెడదీని
చిత్తమునమక్కువలేమికినేమిహేతువో।యనిబహుభంగులంబలికిరాప్రమదాకృతియైనసంధ్యతోన్॥క॥ఓకదళీస్తంభో
రువ।యేకులమేజాడదానవెవ్వరిసుతవి।క్లేకాంతంబుననిచ్చట। నేకారణమునఁజరించెదెఱిఁగింపుతగన్॥క॥భవదీయచా
రురూపద్రవిణలసత్పణ్యభూమిఁదగుమోహమున।న్దవిలినదుర్భరులనుమముఁ।గవయవుపుష్పాస్త్రబాధఘనమయ్యెఁగదే.
వ॥మఱియుఁదదీయసౌన్దర్యంబుగ్గడింపనలవిగాకచింతింపుచు॥ సీ॥గురుకుచభారసంకుచితావలగ్నంబుదనరారునాకాశ
తలముగాఁగ।లలితపల్లవపాణితలమునఁజెన్నొందుచెండు†పతత్పతంగుండుగాఁగ।సలలితనీలపేశలపృథు‡ధమ్మిల్లబంధం
బుఘనతమఃపటలిగాఁగ।బ్రవిమలతరకాంతభావవిలోకనజాలంబుదారకాసమితిగాఁగఁ।గడఁగిమైపూఁతసాంధ్యరాగం
బుగాఁగ।నంగనాకృతినొప్పుసంధ్యావధూటిఁ।గదిసిమనముల మోహంబుగడలుకొనఁగ। నసురలందఱుఁగూడియిట్లనిరిమ
ఱియు॥క॥ వెలయఁగఁబద్మంబేక।స్థలమున నేయొప్పుఁగానిత్వన్ముఖపద్మం।బిలబహుగతులనేక।స్థలములఁదనరారెనిపుడు
తరుణాబ్జముఖీ॥క॥అనిదనుజులుదమమనమున।ననురాగములుప్పతిల్లనందఱునాసం।ధ్యనుబట్టికొనిరివనజా।సనుఁడప్పుడు
హృదయమందుసంతసమందెన్॥ క॥సరసిజభవుఁడయ్యెడఁదనుఁ। గరమాఘ్రాణింపనపుడుగంధర్వులునప్సరసలుపుట్టిరి
ధాతయుఁ। బరువడినాత్మీయతనువుఁబాసిననదియున్॥ వ॥ ※చంద్రికారూపంబైనతద్గాత్రంబువిశ్వావసుపురోగముల
గుగంధర్వాప్సరోగణంబులుగైకొనిరి వెండియుంగమలగర్భుండుదంద్రోన్మాదజృంభికానిద్రారూపంబైనశరీరంబుఁదా
ల్చిపిశాచగుహ్యకసిద్ధభూతగణంబులఁబుట్టించినవారలుదిగంబరులుముక్తకేశులునయినంజూచిధాతలోచనంబుల ము
కుళించి తద్గాత్రంబువిసర్జనంబుగావించిననదివారలుగైకొనిరి వెండియు నజుండుదన్నునన్నవంతునింగాఁగైకొనిచిం

---

*నారాయణ।నారమనఁగావిజ్ఞానము-అదిఆశ్రయముగాఁగలవాఁడునారాయణుఁడు—§నవ్య-యుగళ॥నవ్య।నూతనములైన-కాంచ
న।బంగారుమయములైన-రణత్।మ్రోయుచున్న-మణినూపుర।రత్నఖచితములైనఅందెలయొక్క- ఆరావవిలసిత।ధ్వనులచేనొప్పుచున్న-పా
దారవిందయుగళ।పద్మములవంటిరెండుపాదములుగలది. కాంచీ-బింబ॥కాంచీకలాప।కాంచిఅనుఆభరణముతో-కాంచిఅనఁగా-ఒంటిసర
పుమొలనూలు-సంకలిత।కూడుకొనిన- దుకూలవస్త్ర।తెల్లపట్టుపుట్టముచేత-స్ఫార।ప్రకాశించుచున్న- పులిన।ఇసుకదిబ్బలవంటి-నితంబబింబ।
గుండ్రనిపిరుఁదులుగలది. రాజితా-వలగ్న॥రాజిత।ప్రకాశించుచున్న-అన్యోన్యకర్కశ।ఒకటినొకటినొఱయుచున్న-పీన।బలిసిన-కరికుంభ।ఏ
నుఁగుకుంభమువలె-పృథు।గొప్పలైన-కుచభారకంపిత।స్తనములబరువుచేత-అసియాడుచున్న-వలగ్న।నడుముగలది-మదిరా-నయన॥మదిరార
సాస్వాద।కల్లుద్రాగుటవలనఁగలిగిన-మదవిఘూర్ణిత।మదముచేతఁద్రిప్పఁబడుచున్న-చారు।సుందరములైన- సిత।తెల్లనైన-నవవికచ।నూతన
ముగాఁబుష్పించిన-రాజీవనయన।తామరలవంటికన్నులుగలది. అప-నిటల॥కృష్ణపక్షమందలి, అష్టమినాఁటిచంద్రునివంటినొసలుగలది. మద
వ-చికుర॥మదపుటళుమ్మెదలగుంపువలెతేజరిల్లుచున్నవెండ్రుకలుగలది. లలిత-నాస॥ మనోహరమగుకనకసంపెగపుష్పమువంటిముక్కుగల
ది. హాస-కన॥విలాసములైనచూపులుగలది-అబ్జపాణి।కమలములవంటిహస్తములుగలది.—¶ఉపగూహనము।ఆలింగనము— ◊రూపద్రవిణ
లసత్పణ్యభూమిన్।చక్కదనమనుధనముచేతనొప్పుచున్నవెలనేలయందు అనఁగామర్మస్థానమందు— †పతత్పతంగుండుగాఁగన్।జారుచు
నుండెడుసూర్యుఁడగుచుండఁగాను— ‡ధమ్మిల్ల।కొప్పు—※చంద్రిక।వెన్నెల.

తిం బియయదృశ్యదేహుండగుచుఁ బితృసాధ్యగణంబులం బుట్టించినవారలు దమ్ముం బుట్టించిన యదృశ్యశరీరంబునకుం గార్యంబగు దేవభావంబుఁ గైకొనినం దత్కారణంబునం బితృసాధ్యగణంబుల నుద్దేశించి శ్రాద్ధంబుల *హవ్యకవ్యంబు లాచరింతురనుటయును॥ సీ॥ సజ్జనస్తుత వినుచఁ జతురతఁ బంకజాసనుఁ డుదిరోధానశక్తివలన। నరసిద్ధవిబుధకిన్నరులను బుట్టించి తపిలి వారికిఁ దిరోధాననామ। ధేయమైనట్టి యా దేహంబు నిచ్చెను వెండియు భారతీవిభుఁడు దనకుఁ। బ్రతిబింబమగు శరీరమునఁ గిన్నరులఁ గింపురుషులఁ బుట్టింపఁ బూని వారు। ధాతృప్రతిబింబదేహ ముద్దాల్చి వరుస। నిద్దరిద్దరుగ వఁగూడి యింపులొదవ। బ్రహ్మపరమైన గీతము లాడుచుండి। రంతఁ బంకజసంభవుఁ డాత్మలోన॥ క॥ తనసృష్టివృద్ధి లేమికిఁ। గనలుచు శయనించి చింతఁ గరచరణాదుల్ లోనకొని కదలింపఁగ రాలిన రోమములు గ్ర‡కుండలివ్రజము లయ్యెన్॥ క॥ వనజజుఁడు దన్నుఁ గృతకృత్యునిఁగా భావించి యాత్మఁ దుష్టివహింప। న్మనమున నిఖిలజగత్పావనుల గుమునులఁ ద్రిలోకవరుల సృజించెన్॥ సీ॥ పుట్టించి వారికిఁ బురుషరూపంబైన తనదేహ మిచ్చినఁ దగిలి వారు। గనుఁగొని మున్ను పుట్టించినవారలా వనజసంభవునకిట్లనిరి దేవ। యఖిలజగత్సృష్టమైన నీచేతఁ గావింపంగఁ బడిన యీ వితతసుకృత। మాశ్చర్యకరము యజ్ఞాదిక్రియాకాండమీమనుసర్గము *ఈద్యమయ్యెఁ। దద్ధవిర్భాగములు మాకుఁ దవిలి జిహ్వ। లందు నాస్వాదనములు సేయంగఁ గలిగె। ననుచు మనముల హర్షంబులతిశయిల్ల। వినుతిఁ జేసిరి భారతీవిభుని మఱియు॥ వ॥ వరతపోవిద్యాయోగసమాధియుక్తంబగుచు నృషివేషధరుఁడు §హృషీకాత్ముండునై ఋషిగణంబులం బుట్టించి సమాధియోగైశ్వర్యతపోవిద్యావిరక్తియుక్తంబగు నాత్మీయశరీరాంశంబు వారికిం గ్రమంబున నొక్కొక్కనికి నిచ్చెనని మైత్రేయుండు సెప్పిన విని విదురుండు పరమానందంబును బొంది గోవిందచరణారవిందం

## కర్దమప్రజాపతి భగవదనుజ్ఞ వడసి దేవహూతియను కన్యకం బెండ్లియాడుట.

బులు డెందంబునం దలంచి వెండియు మైత్రేయునిం జూచి యిట్లనియె॥ సీ॥ వరగుణ స్వాయంభువమనువంశంబు లఁబరమసమ్మతము దప్పకుడలంప। గొనకొని తద్వంశమున మిథునక్రియఁ జేసి ప్రజావృద్ధిఁ జెప్పితీవు। నదిగాక స్వాయంభువమనువునకు నెగిఁ బూని ప్రియవ్రతోత్తానపాదులనునందనులు గలరంటివి వారు సప్తద్వీపవతియైన ధాత్రి నెల్ల। ధర్మమార్గంబు లేమియుఁ దప్పకుండ। ననఘులై యెట్లు పాలించిరయ్య వారి। చరిత మెల్లను సత్కృపానిరతబుద్ధి। నెఱుఁగ వినుపింపు నాకు మునీంద్రచంద్ర॥ వ॥ అదియునుం గాక తన్మనుపుత్రియు యోగలక్షణసమేతయునగు దేవహూతి యను కన్యకారత్నంబును స్వాయంభువుండు గర్దమునకు నేవిధంబునం బెండ్లి చేసె నా దేవహూతియందు మహాయోగియయిన కర్దముండు ప్రజల నేలాగునం బుట్టించెనదియునుం గాక కర్దముండు రుచియను కన్యను దక్షప్రజాపతికి నిచ్చెనని చెప్పితివి యా రుచియందు నమ్మహాత్ముం డీసృష్టి యేలాగునం బుట్టించె నవి యన్నియుం దెలియనానతీవలయునని యడిగిన విదురునకు మైత్రేయుండిట్లనియె॥ క॥ వినుమనఘ కృతయుగంబున। మునినాథుండయిన కర్దముఁడు ప్రజలసృజిం। పను వనజసంభవుని చేఁ। దనియుక్తుండగుచు మదిముదమున। సంధిల్లన్॥ గీ॥ ధీరగుణుఁడు సరస్వతీతీరమందుఁ। బదివిపది వేలు దివ్యవత్సరములోలిఁ। దపము సేయుచు నొక నాఁడు జపసమాధినుండి యేకాగ్రచిత్తుఁడై నిండువేడ్క॥ క॥ వరమఁ బ్రసన్ను మనోరథ। వరదానసుశీలు నమరవంద్యు రమేశున్। దురితవిదూరు సుదర్శనకరుఁ బూజించిన నతఁడు గరుణాకరుఁడై॥ వ॥ అంతనంతరితంబునం బ్రత్యక్షంబైన॥ సీ॥ తరణిసుధాకరకిరణోదరాంచితసరసీరుహోత్పలస్రగ్విలాసుఁ। గంకణనూపురగ్రైవేయముద్రికాహారకుండలకిరీటాభిరాముఁ। గమనీయసాగరకన్యకాకౌస్తుభమణిభూషణోద్భాసమానవక్షు। సలలితదరహాసచంద్రికాధవళితచారుదర్పణ విరాజిత్కపోలు। శంఖచక్రగదాపద్మచారుహస్తు। నళికులాలకరుచిభాస్వదలికఫలకుఁ। బీతకౌశేయవాసు గృపాతరంగి। తస్మితేక్షణుఁ బంకజోదరుని హరిని॥ వ॥ మఱియు శబ్దబ్రహ్మశరీరవంతుండు, సదాత్మకుండు, జ్ఞానైకవేద్యుండు, వైనతేయాంసవిన్యస్తచరణారవిందుండు నయిన, గోవిందునిం గనుంగొని సంజాతహర్ష ¶లహరీపరవశుండు లబ్ధమనోరథుండునగుచు సాష్టాంగదండప్రణామంబు లాచరించి తదనంతరంబ॥ క॥ ముకుళితకరకమలుండై। యకుటిలసద్భక్తిఁ బరవశాత్మకుఁడగుచున్। వికచాంభోరుహలోచను। నసునిట్లని యెంద దాననముఁ గనుఁగొనుచున్॥ సీ॥ అజ్ఞాతసకలభూతాంతరాత్మఁ డవనఁ దనరుచుండెడి నీదు దర్శనంబుఁ దలకొని సుకృతసత్ఫలభరితంబులైనట్టి యనేకజన్మానుసరణిఁ। బ్రకట యోగక్రియాభ్యాసని

---

*హవ్యకవ్యంబులు॥ హవ్య। దేవతలకొఱకు నియమించిన అన్నము-కవ్యము। పితృదేవతలకు నియమించినయన్నము.— ‡కుండలివ్రజము। సర్పసమూహము— *ఈద్యము। మతింపఁదగినది.— §హృషీకాత్ముండు। చతుర్దశేంద్రియస్వరూపుఁడు— ¶లహరీ। ప్రవాహము.

౨౭

రూఢులైనట్టి యోగీశ్వరులాత్మఁ గోరి యెంతురు యోగీశ్వరేశ్వర యే భవత్పాదారవిందముల్పరగనిపుడు। గంటి భవవా
ర్ధిఁ గడువఁ గఁ గంటిమంటిఁ. గడఁగి నాలోచనంబుల కలిమి నేఁడు। దవిలి సఫలతనొందె మాధవముకుంద। చిరదయాకార్ణ
త్యలక్ష్మీవిహార॥ వ॥ అవియునుంగాక దేవా భవదీయమాయావిమోహితులై హతమేధస్కులై సంసారపారావారోత్తార
కంబులయిన భవదీయపాదారవిందంబులు తుచ్ఛవృత్తికాములయి సేవించి నిరయగతులైన వారికిం దత్తామయోగ్యంబు
లగు మనోరథంబుల నిత్తువట్టి సకాములయిన వారి నిందించు నేను గృహమేధధేనువున శేషమూలయుం, త్రివర్గకారణయు స
మానశీలయునయిన భార్యం బరిణయంబు సేయనపేక్షించి కల్పతరుమూలసదృశంబులయిన భవదీయపాదారవిందంబు
లు సేవించితి నయిన నొక్కవిశేషంబు గలదు విన్నవించెద నవధరింపుము- బ్రహ్మాత్మకుండయిన నీదువచస్తంతునిబద్ధులయి
లోకులు కామహతులయిరి యేనును వారల ననుసరించిన వాఁడనయి కాలాత్మకుండవైన నీకు నభిమతంబగునట్లు గాఁ
గర్మమయంబైన భవదాజ్ఞాచక్రంబున ననుసరించుట గాని మదీయకామంబు కొఱకుగాదు భవదీయమాయావినిర్మితంబుఁ
గాలాత్మకభూరివేగసమాయుక్తంబు *నక్షరంబునయిన బ్రహ్మంబునందు †భ్రమణశీలంబు ‡నధిమాససమేత త్రయో
దశమాస§సారంబు షష్ట్యుత్తరశతత్రయాహోరాత్రమయ¶పర్వంబు ఋతుషట్కసమాకలిత **నేమియుం జాతు
ర్మాస్యత్రయవిరాజితనాభియు నపరిమితక్షణలవాదిపరికల్పితపత్రశోభితంబుఁ గాలాత్మకభూరివేగసమాయుక్తంబున
యిన కాలచక్రంబు సకలజీవనికాయాయుర్గ్రసనతత్పరంబగుం గాని కామాభిభూతజనానుగతపశుప్రాయులగు లోకుల
విడిచి భవపరితాపనివారణకారణంబయిన భవదీయతరుణాతపత్రచ్ఛాయాసమాశ్రయులై తావకీనగుణకథనసుధా
స్వాదనరుచిరలహరీనిరసిత సకలదేహధర్ములయిన భవద్భక్తజనాయుర్హరణసమర్థంబుగాకుండునని॥ మ॥ అనఘా
యొక్కఁడవయ్యు నాత్మకృతమాయాజాతసత్త్వాదిశక్తిని కాయస్థితిని జగజ్జననవృద్ధిక్షోభహేతుప్రభావని రూఢిందగు
††ఊర్ణనాభిగతి విశ్వస్తుత్య సర్వేశ నీఘనలీలామహిమార్ణవంబుఁ గడువం గా వచ్చునే యేరికిన్॥ వ॥ దేవా శబ్దాదివిషయ
సుఖకరంబగు రూపంబు విస్తరింపఁ జేయుటెల్ల నస్మదనుగ్రహార్థంబు గాని నీకొఱకుంగాదాత్మీయమాయాపరివర్తితలో
కతంత్రంబు గలిగి మదీయమనోరథసుధాప్రవర్షివయిన నీకు నమస్కరించెద॥ మ॥ అనియిబ్భంగిన్ నుతించిన న్వనిసరోజా
క్షుండు మోదంబున న్వినతానందనకంధరోపరిచరద్విభ్రాజమానాంగకుం డనురాగస్మితచంద్రికాకలితశోభాలోక
నుండై మునీంద్రునిఁ గారుణ్యమెలర్పఁ జూచి పలికెన్ రోచిష్ణుఁడై ప్రేల్మిడిన్॥ క॥ మునివర యే కోరిక నీ మనమునఁ గా
వించిననుసమంచితభక్తిన్నెనరునఁ బూజించితి నీకనయము నాకోర్కె సఫలమయ్యెడుఁ జుమ్మీ॥ వ॥ అనియానతిచ్చి ప్రజా
పతిపుత్రుండు ‡‡సామ్రాట్టువునయిన స్వాయంభువమనువు బ్రహ్మావర్తదేశంబునందు సప్తార్ణవమేఖలామండితమహీ
మండలంబుఁ బరిపాలించుచున్నవాఁ డమ్మహాత్ముం డపరదివసంబున నిందులకు శతరూపయను భార్యాసమేతుండై భర్తృ
కామయగు కూఁతుం దోడ్కొని భవదీయసన్నిధికిం జనుదెంచి నీకు ననురూపవయశ్శీలసంకల్పగుణాకరయైన తనపుత్రిం బ
రిణయంబుగావించు భవదీయమనోరథంబు సిద్ధించు ననుం జిత్తంబున సంస్మరింపుచుండుమమ్మనుకన్యను వరించి భవద్వీ
ర్యంబువలన నతిసౌందర్యవతులయిన కన్యలం దొమ్మండ్రఁ గనును నాకన్యకౌనవకంబునందు మునీంద్రులు పుత్రోత్పాదనం
బులు సేయంగలరు నీవు మదీయశాసనంబును ధరియించి మదర్పితాశేషకర్ముండవగుచు నైకాంతికస్వాంతంబున భూతాభ
యదానదయాచరితజ్ఞానివై నాయందు జగంబులు గలవనియు నీయందు నేగలననియెఱింగి సేవింపుము ❋చరమకాలంబున
ననుం బొందఁగలవు భవదీయవీర్యంబువలన నేను నీభార్యాగర్భంబుఁ బ్రవేశించి మత్కళాంశంబున సంభవించి నీకుం దత్త్వ
సంహితనుపన్యసింతునని జనార్దనుండు గర్దమునకెఱింగించి యతం డుగనుంగొనుచుండ నంతర్హితుండై॥ చ॥ అతులసరస్వతీ
సరిదుదంచితబాలరసాలసాలశో। భితతటతుంగరంగము గుబిందుసరంబు వినిర్గమించి యం। చితగరుడావరోహణము చేసె
దదీయగరుత్ప్రభూతరుక్ప్రతతివిలక్షణక్రమవిరాజితనాదము వించు మోదియై॥ చ॥ అరిగె వికుంఠధామమునకంతసకా
మనుఁడయిన కర్దముం డరయ విమోహియై మనమునందును ముందటవచ్చు కోరికల్ వీరిఁ గొనుచుండఁ దత్క్షణమ బిందుసరం
బున కేగియుండి రా। వరుఁ దలపోయుచుండె జనవంద్యుఁడు భక్తినిశాంతచిత్తుఁడై॥ వ॥ అంత స్వాయంభువుండు గనకరథా

*అక్షరంబు। నశింపనిది-క్షరమనఁగా నశించునది—†భ్రమణశీలంబు। తిరుగుచుండుటయే స్వభావము గాఁ గలది—‡అధిమాన। అధికమాసము...§అరము। అంచు...¶పర్వము। కణుపు...**నేమి। చక్రపంచు...††ఊర్ణనాభి। సాలెపురుగు... ‡‡సామ్రాట్టువు। రాజసూయయాగము చేసినవాఁడును, హిమవత్సేతుమధ్యమందుగల సహస్రయోజనపరిమితమయిన సకలభూమండలమునకు రాజైనవాఁడును, సకలరాజులను తనయాజ్ఞచే తవశపరుచుకొనినవాఁడును సమ్రాట్టువనంబడును. అట్టి సమ్రాట్టుధర్మముగలవాఁడు-సామ్రాట్టువు... ❋చరమకాలము। అంత్యకాలము.

గలపారమహంస్యధర్మంబుపదేశింపంగలవాఁడగుచుఁ బుత్త్రశతంబునందగ్రజుండు పరమభాగవతుండు భగవజ్జనపరాయణుండునగు భరతుని ధరణీపాలనంబునకుఁ బట్టంబుగట్టి తానుగృహమందె దేహమాత్రావలంబనంబుఁ జేసి దిగంబరుండై యున్మత్తాకారుండగుచుం ‡‡ప్రకీర్ణ కేశుండై యగ్నులనాత్మారోపణంబుఁ జేసి బ్రహ్మావర్త దేశంబును బాసి జడాంధ *బధిర †మూక పిశాచోన్మాదులఁ బోలెనవధూత వేషంబునొంది జనులకు మాఱుపలుకకమౌనవ్రతంబునంబుర గ్రామాకర జనపద ఆరామ శిబిర వ్రజ ఘోష సార్థ గిరి వనాశ్రమాదులయందు వెంటంజనుదెంచు మర్జన తర్జన తాడనావమాన ‡మేహన ‖నిష్ఠీవన పాషాణ శకృ ద్రజః ప్రక్షేపణ పూతివాత దురుక్తులం *పరిభూతుండై ననుగడనం బెట్టక వనమదేభంబు మాఱి కాదికృతోపద్రవంబును బోలెంగైకొనక దేహాభిమానంబునంజిత్తచలనంబు నొందక యేకాకియై చరియించుచుండ నతిసుకుమారంబులగు కరచరణోరస్థలంబులు విపులంబులగు బా †హ్వంస కంఠ వదనాద్యవయవ విన్యాసంబులుంగలిగి ప్రకృతి సుందరంబగు చున్న స్వతస్స్నిగ్ధదరహాసరుచిర ముఖారవిందంబై నవనళినదళంబులఁ బోలి శిశిర ‡‡కనీనికలఁ జెలువొందియరుణాయతంబులగు నయనంబులచేనొప్పియన్యూనాధికంబులగు కపోల కర్ణ కంఠ నాసాదండంబులచేఁ దేజరిల్లుచు విగూఢస్మితవదన విభ్రమంబులఁ బ్రకాశించు తనదివ్యమంగళ విగ్రహంబుచేఁ బురసుందరుల మనంబులనతి మోహంబు గలుగఁ జేయుచు॥ గీ॥ ధూళిచేత మిగుల ***ధూసరితంబునై జడలుగట్టి కడుఁ బిశంగవర్ణ మునగు కేశపాశమును వెలిఁగించుచు నితరు లెవరుఁ దన్ను నెఱుగకుండ. క॥ అవధూతవేషమునను ట్లవనిన్మలినంబులైన యవయవములతోఁ దవిలి చరించుచునుండును భువిభూతాక్రాంతుఁడైన పురుషుని మాడ్కి ౯॥ గీ॥ జనులకిట్లు యోగసంచారమెల్ల విరుద్ధమనుచు నాత్మబుద్ధిఁ జూచి ¶యజగరంబు మాడ్కి నవనిపై నుండె భీభత్సకర్మమునకుఁ జాలువడుచు॥ వ॥ ఇట్లు భీభత్సరూపంబున వసుంధరంబండియుండి యన్నంబు భుజియించుచు నీరు ద్రావుచు మూత్ర పురీషంబులు విడుచుచు నవిశరీరంబున నంటం బొరలుచుండు-మఱియు దత్పురీష సౌగంధ్యయుక్తంబగు వాయువు దశదిశలదశయోజన పర్యంతంబు పరిమళింపంజేయుచుండ గో మృగ కాక చర్యలం జరియించుచు భగవదంశంబైన ఋషభుండు మహానందంబున ననుభవించుచుఁ దనయందు సర్వభూతాంతర్యామియగు వాసుదేవుని బ్రత్యక్షంబుగాఁ గనుంగొనుచు సిద్ధింబొందిన వైహాయస మనోజవ పరకాయప్రవేశ అంతర్ధాన దూరగ్రహణ శ్రవణాది యోగసిద్ధులు దనంతవచ్చినం గైకొనక యుండె నని పలికిన శుకయోగీంద్రునకుం బరీక్షిన్నరేంద్రుండిట్లనియె॥ క॥ మునివర యోగజ్ఞానంబునఁ జెరుపంబడ్డ కర్మములుగల పెద్దలు నియిండెడి యైశ్వర్యంబును ఋషభుండెఱిఁగి యేల పొందకయుండె౯॥ అనిన శుకుండిట్లనియె॥ మ॥ ధరణీవల్లభ నీదువాక్యములు తథ్యంబింతయుం దప్ప దెట్లరయ న్వన్యమృగంబు పట్టువడి తా నావేళ నాలుబ్ధకు న్దరవంచించిన మాడ్కి నింద్రియములందండించి చిత్తంబు నిర్భర కామాదుల కాస యిచ్చుఁ గడుసంరంభంబుతోఁ గ్రమ్మఱ౯॥ క॥ చిరకాల తపమునైనను హరియింపఁగ నోపుఁజిత్తమని పెద్దలు నమ్మరు జారులకును జారిణి కరణి నియడరించు మనసు కామాదులకు౯॥ క॥ కామ క్రోధాదులు దాఁ భూమీశ్వర కర్మబంధములు మఱియును జేతోమూలములగుటను దాఁ నీమహిలో మనమునమ్మ రెప్పుడు పెద్దల్॥ సీ॥ అదిగాన నెన్నఁడు నైశ్వర్యములను జేపట్టఁ జూడఁడు లోకభవ్యులైన వారలచేన భివందనంబులు వొందివెలయంగ నవధూత వేషభాషణంబుల నెఱిఁగికొనఁగరాని భగవత్స్వరూపంబుగలిగి యారూపమందుఁ బరమయోగధ్యానపరులకు నెల్లదేహత్యాగసమయంబునంతలోనఁ జూపుచుండియు దేహంబుఁ బాపనిచ్ఛయించెనచ్చట దివ్యయోగీంద్రుఁడాద్యుఁ డతుల దివ్యప్రకాశకుఁడమరవరుఁడు పరమపురుషుండు ఋషభుండు పార్థివేంద్ర॥ వ॥ అంత విముక్తలింగుండు భగవంతుండునగు ఋషభుండు మనంబున దేహాభిమానంబు విసర్జించి §కులాల చక్రంబు కులాలునిచే భ్రమియింపఁబడి విసృష్టంబైనను భ్రమియించుగతిం బ్రాచీన సంస్కారవిశేషంబగున భిమానాభాసంబున దేహచలనాదికంబుల నొప్పియుండియు యోగమాయావాసనచేయుక్తుండయ్యె మఱియు నా ఋషభుండొక్క దినంబునం గొంకవంక పటకంబులను దక్షిణకర్ణాటక దేశంబులకు యదృచ్ఛచేఁ జని కుటకాచలోపవనంబున నిజాస్యకృత శిలాకబళుండగుచు నున్మత్తుని చందంబున వికీర్ణకేశుండు దిగంబరుండునై సంచరింప వాయువేగ విధూత వేణు సంఘర్షణ సంజాతంబగు నుగ్ర దావానలంబు దద్వనంబు దహింపనందు దగ్ధుండయ్యె నంత నతని కృత్యంబులు దద్దేశవాసులగు జనంబులు సెప్ప నర్హన్నామకుండగు తద్రాష్ట్రాధిపతి విని నిజధర్మంబులం బరిత్యజించి స్వదేశస్థులతోడం గూడి దానాయాచారంబుల నంగీకరించి

‡‡ ప్రకీర్ణ విరిసియున్న. *బధిర చెవిటివాఁడు. †మూక మూఁగ, అవధూత దిగంబరుఁడు, ‡మేహన శిశ్నము, అనఁగా లాక్షణికము చేత మూత్రమర్థము. ‖నిష్ఠీవన ఉమియుట. *పరిభూతుండై అవమానింపఁబడినవాఁడై, గడన లెక్క-లక్ష్యము. †అంస భుజశిరస్సు. ‡‡కనీనిక నల్లగ్రుడ్డు. ***ధూసరితంబు కొంచెము తెల్లబారినది, పిశంగ పచ్చనైన. ¶అజగర కొండచిలువ. §కులాల కుమ్మరవాఁడు.

యధర్మబహుళంబగు కలియుగంబున *భవితవ్యతచేవి మోహితుండై మనుజులనసమంజసంబగు పాషండమతాభిని వేశు లం జేసె మఱియును గలియుగంబునందు మనుజాధములు దేవమాయా మోహితులై శాస్త్రోక్త శౌచాచారంబులు విడిచి నిజేచ్ఛం జేసి దేవతా †హేళనంబులు సేయుచు నస్నానానాచమనాశౌచ‡ కేశోల్లుంఛనాదికాపవిత్రవ్రతంబులం జేయుచు నధర్మబహుళంబగు కలియుగంబునం జెరుపంబడ్డ బుద్ధిధర్మంబులు గలిగి వేదబ్రాహ్మణయజ్ఞపురుషులదూషించుచు లోకంబులం దమతమమతంబులకుం దామె సంతసించుచున వేదమూలంబగు స్వేచ్ఛం జేసి ప్రవర్తించియంధపరంపర చేవిశ్వాసంబుఁ జేసి తమంతనంధతమంబునం బడుచునుండుదురీ ఋషభుని యవతారంబు రజోవ్యాప్తులగు పురుషులకు మోక్షమార్గంబును పదేశించుటకునయ్యెనదియునుం గాక సప్తసముద్రపరివృతంబులగు నీభూద్వీపవర్షంబులందలి జనంబులు దివ్యావతార ప్రతిపాదకంబులతి శుద్ధంబులునగు నెవ్వని కృత్యంబులం గీర్తింతురు మఱియు నెవ్వనివంశంబున నతికీర్తిమంతుండగు ప్రియవ్రతుండు గలిగె నెందు జగదాద్యుండగు పురాణపురుషుండవతారంబు నొంది కర్మహేతుకంబుగాని మోక్షధర్మంబులం దెలిపె వెండియు నెవ్వండు యోగమాయాసిద్ధులనసద్భూతంబులగుటం జేసి నిరసించె నట్టి ఋషభునితోడఁ దత్సిద్ధికృతప్రయత్నులగు నితరయోగీశ్వరులు మనోరథంబుననైన నెట్లు సరియగుదురిట్లు సకలవేదలోకదేవబ్రాహ్మణులకు గోవులకుం బరమగురుండు భగవంతుండునగు ఋషభుచరిత్రంబు విని నవారలమశ్చరితంబులుదోలంగు మంగళంబులు సిద్ధించుటకు-లిశ్రద్ధతో నెవ్వండు విను వినిపించువానికి హరిభక్తి దృఢంబగు నట్టి హరిభక్తి తాత్పర్యంబునం బెద్దలు భాగవతులగుటం జేసి సంప్రాప్తసర్వపురుషార్థులగుచు వివిధ§వృజినహేతుకంబగు సంసారతాపంబును బాసి యవిరతంబు దద్భక్తియోగామృతస్నానంబుఁ జేసి పరమపురుషార్థంబైన మోక్షంబును జెందుదురని సప్తద్వీపంబులవారు నేఁడునుం గొనియాడుచుండుదురు॥గీ॥ యాదవులకు మీకు నత్యంతకులగురు। వైనకృష్ణుఁడె చటనైనగలఁడు। కొలుచువారి కెల్లసులభుఁడై మోక్షంబు।నిచ్చుఁ జింత సేయనేల నీకు॥ సీ॥నిత్యానుభూతమానిజరూపలాభనివృత్తమైతగు మహాతృష్ణ గలిగి।యతులిత విపులమాయారచితంబైనలాభంబునకుఁ దగులంబులేని।మతిగల్గి లోకులనతివేడ్కఁ గరుణించి యభయదానంబిచ్చి యందఱకిల। నవ్యయంబై దివ్యమై మహానందమై యత్యంత సేవ్యమై యతులమైన। తనదు లోకంబు చూపంగఁ దగిన యట్టి। మోక్షమార్గంబు నెఱిఁగించి ముక్తదేహుఁ।డగుచుఁ దా దాత్మ్యమొందె బ్రత్యక్షవిష్ణు।వైన ఋషభుండు జనులకు నద్భుతముగ॥మ॥భ

## —— భరతోపాఖ్యానముఁ దెలుపుట. ——

రతుండంత ధరాతలంబుఁ గడఁకం బాలించుచున్ ధారుణీ। శ్వరచంద్రుండగు విశ్వరూపునకు మున్సంజాతమై యుండిన।ర్భరకాంతిన్విలసిల్లు పంచజని పేరం గల్గు కాంతామణిం। గరమర్థిన్ధరఁ బెండ్లియాడె శుభలగ్నంబందు భూవల్లభా॥వ॥ ఇట్లు వివాహితుండై యా పంచజని వలన నహంకారంబునం బంచతన్మాత్రలు జనియించిన తెఱంగున సుమతి రాష్ట్రభృత్సుదర్శనాచరణ ధూమ్రకేతువులను నేవురుపుత్రులం బుట్టించె నటమున్న నజనాభంబను పేరం బరగు వర్షంబు భరతుండు పాలించుకతంబున భారతవర్షంబు నాఁ బరగె నంత॥ క॥ భరతుఁడు నిజపితృ లేలిన। కరణిని గర్మముల నెల్లఁ గైకొని ప్రజలన్। హరికృప నొందుచు నేలెను।ధరణీసురవరులు వొగడ ధరణీనాథా॥సీ॥భగవంతుఁడగు జగద్భరితు నల్పంబులు నధికంబులైన పెక్కధ్వరములు। దర్శపూర్ణిమల చేఁ దగను జాతుర్మాస్యముల నగ్నిహోత్రము వలనఁ గడఁకఁ।బశుసోమముల చేతఁ బలుమాఱుఁ బూజించి వేదోక్తమైన యా విమలకర్మ।ములఁ గల్గు ధర్మంబుఁ బురుషోత్తమార్పణంబుగఁ జేయుచును మఖంబులను మంత్ర।ములను బలికెడు నా దైవములను శ్రీశు। నవయవంబులుగాఁ గ భూధవుఁడు ప్రేమ। ననుదినంబును బాయక ఘనతఁ దలఁచి।యఖిల రాజ్యానుసంధానుఁడగుచు నుండె॥క॥ఈరీతిఁ గర్మసిద్ధుల।నారయ నత్యంత శుద్ధమగు చిత్తముతో।నారాచపట్టి భరతుఁడు।ధారుణిఁ బాలించె నధికధర్మాన్వితుఁడై॥ వ॥మఱియు నా భరతుండు శ్రీవత్సకౌస్తుభవనమాలాలంకృతుండు సుదర్శనాద్యాయుధోపలక్షితుండు, నిజభక్తజనహృదయారవిందవాసుండుఁ, బరమపురుషుండును నైన వాసుదేవుని యందు నధికభక్తి ననుదినంబును సేయుచు నేఁబదిలక్షల వేలేండ్లు రాజ్యంబుఁ జేసి ¶పితృపితామహోద్యాయాతంబగు నాధనంబును యథార్హంబుగఁ బుత్రులకుఁ బంచియిచ్చి బహువిధసంపదలు గల గృహంబును బాసి పులహాశ్రమంబునకరిగె నంత॥సీ॥ ఏయాశ్రమంబున నిందిరాధీశ్వరుఁ డచ్చటి వారల నాదరించి। ప్రత్యక్షమున నుండుఁ బాయక యెప్పుడు నట్టి రమ్యంబైన యాశ్రమమున।నిలిచి సాలగ్రామములు గల గండకీనది యొండు నెంతయుఁ గదిసియుండు। నచ్చోట నేకాకియగుచును భరతుండు

---

* భవితవ్యతచేన।కాగలకాలప్రమాదములచే, అసమంజసంబగు।యోగ్యముగాని. † హేళనము।నిందన-తిరస్కారము. ‡ కేశోల్లుంఛన।వెంట్రుకలు కత్తిరించుట. § వృజిన।పాపము, అవిరతంబు।విరామము లేని. ¶ పితృపితామహోద్యాయాతంబగు।పితృపితామహక్రమముగా వచ్చిన.

బహువిధనవపుష్పపల్లవముల।నతులతులసీదళంబులనంబువులను। గందమూలాదిఫలములఁగంజములను।ఘనతనర్పించి ని
శ్చలుఁడనివిలేక। సేవసేయుచునుండె నా శ్రీశుహరిని॥ వ॥ ధ్యానంజేసివిగతవిషయాభిలాషుండై శమదమాదిగుణంబులఁగ
లిగియథేచ్ఛంజేసియెడతెగకపరమపురుషునిపరిచర్యాభక్తిభరంబునశిథిలీకృతహృదయగ్రంథిగలిగిసంతోషాతిశయం
బునంబులకితాంగుండునానందబాష్పనిరుద్ధావలోకనయనుండునగుచు నిజస్వామియైనహరిచరణారవిందానుధ్యానపరి
చితభక్తియోగంబునంబరమానందగంభీరహృదయంబనునమృతహ్రదంబుననిమగ్నుండగుచుఁదానపుడుపూజించుపూ
జనెఱుంగకనిట్లుభగవద్వ్రతంబుధరియించి యేణాజినవాసస్త్రిషవణస్నానంబుల నార్ద్రకుటిల §కపిశవర్ణజటాకలా
పంబులుగలిగి☼మార్తాండాంతర్గతుండయినపరమేశ్వరునిహిరణ్మయపురుషునింగాఁదలంచుచునిట్లనియె॥ సీ॥ కర్మఫలంబు
లఁగ్గడఁకనిచ్చుచుమనోవ్యాపారముననిట్టి యఖిలలోక। ములఁజేసియాలోకములకునంతర్యామియగుచుఁ బ్రవేశించి
యంతమీఁద। నానందరూపమైనట్టిబ్రహ్మముఁగోరుచున్నజీవునిఁదనలోనియోగ। శక్తిచేఁదగననిశంబుఁబాలనసేయు
చుండియంతటను☼మార్తాండమధ్య।వర్తియగుచునిట్లువరలుచుజగముల। యందునుండిప్రకృతిఁబొరయకంత।నతులదివ్య
మూర్తియైనయానందరూ।పమునుశరణమొందెభరతవిభుఁడు॥ వ॥ అంతనాభరతుండొక్కనాఁడామహానదిం గృతాభిషే
కుండయిముహూర్తత్రయంబంతర్జలంబులందుఁబ్రణవోచ్చారణంబుసేయుచుండుసమయంబుననిర్భరగర్భిణియగుహ
రిణిజలార్థినియైయొంటిజలాశయసమీపంబునకువచ్చిజలపానంబుసేయునెడనాసమీపంబునమృగపతిగర్జించిలోకభయం
కరంబుగనాదంబుసేయహరిణిస్వభావంబునభీతయగుటంజేసిబెగ్గడిలిహరివిలోకనవ్యాకులచిత్తయైదిగ్గననదరిగగనం
బునకునెగిరియగతతృషయగుచునదినుల్లంఘించునెడనధికభయంబునంజేసియాగర్భంబుయోనిద్వారంబున ●గళితం
బయిజలంబులంబడియెనాహరిణియుల్లంఘనాదిభయంబునంజేసిదత్తీరంబుననుండుగిరిదరింబడి శరీరంబుఁబాసెనంత
నాహరిణపోతంబుజలంబులందేలుచున్నభరతుండుఁగనువిచ్చిచూచికరుణార్ద్రచిత్తుండయి మృతజననియగు *హరిణపో
తంబునుదనయాశ్రమంబునకుంగొంపోయిమిక్కిలిప్రీతింజేసియుపలాలనంబుసేయుచుంబోషణపాలనప్రీణనలాలనా
నుధ్యానంబులభరతునకునాత్మనియమంబులైనయష్టాంగయోగంబులునుబరమపురుషపూజాపరిచర్యాదులునొక్కొ
క్కటిగఁగ్రమక్రమంబునంగొన్నిదినంబులకుసమస్తంబులుత్సన్నంబునొందెనంత॥ క॥ ఘనతపముచలనమొందుట।యు
నుభరతుండెఱుఁగకాత్మయోగంబునుజ।య్యనఁబాసెహరిణపోతముఁ। దనమదిలోనిల్పిప్రీతిఁదప్పకపలికెఁ॥ ఉ॥ అక్క
టతల్లిఁబాసిహరిణార్భకమా పుత్రులులేమిఁజేసియే।దిక్కునులేకయున్ననిటఁదెచ్చితినాయెడనీమృగార్భకం।బెక్కుడుప్రే
మఁజేసిచరియించుచునున్నదినామసన్నిధి।న్మక్కువఁజేసిదీనిగడుమన్ననలందగఁబ్రోతునెంతయుఁ॥ క॥ శరణమనివచ్చు
జంతువుఁ।గరుణంగనువిచ్చిచూచికాచినఁబుణ్యం।బరయఁగనధికంబనిము।న్నరమెఱిఁగించెనుమునీంద్రగణములుప్రేమన్॥
వ॥ అనియిట్లుహరిణపోతంబుందనయాశ్రమంబుననత్యాసక్తింజేసియాసనశయనాటనస్నానసమిత్కుశకుసుమఫలప
లాశమూలోదకాహరణదేవపూజాజపాదులయెడందనయొద్దనయునిచికొనుచు✻వృకసాలావృకాదిక్రూరమృగంబుల
వలనిభయంబునవనంబులవెనువెంటందిరుగుచునధిక♣ప్రణయభరపరీతహృదయుండగుచునతిస్నేహంబునంజేసికొంత
సేపు†స్కంధంబులవహించుచుమఱికొంతదడవురంబుననుత్సంగంబుననునుంచికొనిలాలించుచుసంతసంబునొందుచుమఱియునా
భరతుండునిత్యనైమిత్తికాదిక్రియాకలాపంబునిర్వర్తించునెడనంతనంతలేచిహరిణ¶కుణకంబుఁజూచుచుఁగించిత్స్వ
స్థహృదయుండైదాని☸ఆశీఃపరంపరలనభినందించుచుఁజుంబనాదులంబ్రీతిఁజేయుచునతిమోహంబునఁబెంచుచుండు
నెడ॥ గీ॥ గరిమనీరీతిమెల్లనఁ❋కెరలువొడిచి। చెలఁగియాడంగభరతుండుచిత్తమందు। సంతసిల్లుచునుండెనాశ్రమముఁ
బాసి।హరిణడింభకమంతలోనుఱికిచనిన॥ వ॥ భరతుండంతఁదన్మృగ✱శాబకంబుగానంబడకుండునప్పుడుమిక్కిలివ్యాకులి
తచిత్తుండగుచునష్టధనుండువోలెనతిదీనుండైకరుణతోడంగూడితద్విరహవిహ్వలమతియైదానినతలంచుచునతిశోకంబు
తోమనంబునమఱిఁగించియిట్లనియె॥ గీ॥ హరిణపోతంబనీవనాంతమందుఁ।గ్రూరమృగబాధలేకుండఁగోరుచుండఁ। దలఁ
గిపోయితెయనుచుఁజిత్తంబునందు। రాజఋషభుండుభరతుఁడారాటమందె॥ గీ॥ తల్లిచచ్చినహరిణపోతంబువచ్చి। పుణ్య
హీనుండనగునన్నుఁబొందిపాసె।నేమిసేయుదునేనింకనెట్లుగందుఁ। జేరినేరీతిఁగాంచిరక్షించువాఁడ॥ క॥ ✿కట్టా

§ కపిశ।మర్కటవర్ణము. ☼మార్తండ।సూర్యుఁడు. ●గళితంబై।జారినదై. *హరిణపోతంబు।లేడిపిల్ల. ✻వృక।తోడేలు, సాలావృకాది। కోఁతి-నక్క-కుక్క మొదలగు. ♣ప్రణయభరపరీతహృదయుండు।అతిప్రీతిసహితమగుహృదయముగలవాఁడు. †స్కంధము।భుజశిరస్సు. ¶కుణకము।శిశువు. ☸ఆశీఃపరంపర।ఆశీర్వచనపఙ్క్తి. ❋కెరలువొడిచి।పులకాంకితమై. ✱శాబకము।శిశువు. ✿కట్టా।అయ్యో. *రాజఋషభుండు।రాజశ్రేష్ఠుఁడు.

యీయాశ్రమమునఁ బుట్టినతృణచయము మేసి పొదలినహరిణం బిట్టట్టు దిరుగుచుండఁగఁ బట్టి మృగేంద్రుండు గొట్టి బాధించె నొకో॥ వ॥ ఇట్లు భరతుండు హరిణశాబకంబుఁ గోరుచు నెప్పుడు వచ్చిన న్నన్సంతోషపడుచు నానాప్రకారంబులైన తనగతులచేత నెప్పుడానంద మొందించు ధ్యానసమాధిసున్నప్పుడు నన్నుం గొమ్ములఁ ద్రోచుచునుండు నట్టి వినోదంబు లెప్పుడు గనుఁగొందు దేవపూజాద్రవ్యంబులు ద్రొక్కి మూర్కొనినం గోపించి చూచినఁ గుమారుండువోలె దూరంబున కుంజనినిలిచిన నన్నుఁ బిలిచిన వెనుకనిలిచియుండు నట్టి మెలఁకువ స్వభావంబు గలుగుట యెట్లు లీభూదేవి యెంత తపంబుఁ జేసినదియో హరిణపాదస్పర్శంబులం బవిత్రంబైన భూమి స్వర్గాపవర్గ కాములైన మునుల కుపయజ్ఞాగ్రంబగు నట్టి హరిణపోతంబు నెట్లు గనుఁగొందు నదియునుం గాక భగవంతుండగు చంద్రుండు మృగపతిభయంబున మృతజననియు స్వాశ్రమపరిభ్రష్టంబునైన మృగశాబకంబును గొనిపోయి పెంచుచున్నవాఁడో మున్ను పుత్త్రవియోగతాపంబును జంద్రకిరణంబులం బాపుమలి పుడుహరిణపోతంబు నశరీరస్పర్శంజేసి చంద్రకిరణంబులకన్న నధికంబగుచుం బుత్త్రవియోగతాపంబు నిర్వర్తింపంజేసెననుచుం బెక్కుభంగుల హరిణనిమిత్తంబులైన మనోరథంబులచేతం బూర్వకర్మవశంబున యోగభ్రష్టుండగు భరతుండు భగవదారాధనంబువలన *విభ్రంశితుండగుచు నితరజాతింబుట్టినహరిణపోతంబుమీఁది మోహంబ గ్గలంబగుచుండెనని పలికి శుకయోగీంద్రుండు మఱియు నిట్లనియె॥ సీ॥ జననాథ మున్ను మోక్షవిరోధములని పాయఁగారాని పుత్త్రాదికంబు లెల్లఁ బాసి తపస్వియై భరతుండు హరిణశాబకపోషణంబునఁ బాలనమున నటలాలన ప్రీణనానుషంగంబుల మూషకబిలముకై రోషమునను సర్పంబు సొచ్చినచందంబునను యోగవిఘ్నంబు మిక్కిలి విస్తరిల్లెఁ గాన నెంతవానికైనను గాలంబు గడువరామి నిట్లుగాకపోదు పరమమునులకైనఁ బాయదు కర్మంబు నరులనంగ నెంత నరవరేణ్య॥ వ॥ ఇట్లు భరతుండు మృగవియోగతాపంబు నొందుచుండు నెడ నామృగశాబకంబు వనుదెంచిన సంతసిల్లుచుండె నంత నొక్కనాఁడు॥ మ॥ భరతుం డల్లన నంత్యకాలము వెసం బ్రాపింపఁగా నప్పుడా హరిణంబుం గడు భక్తిఁ బుత్త్రగతి నత్యాసక్తి వీక్షింపనా హరిణంబుం దనయాత్మలో నిలిపి దేహం బంతటం బాసి తా హరిణీగర్భమునన్ జనించి హరిణంబై యొప్పెఁ బూర్వస్మృతిన్॥ వ॥ ఇట్లు భరతుండు హరిణీగర్భంబునం బుట్టియు భగవదారాధనసామర్థ్యంబున నందనమృగకారణంబుఁ దెలిసికొని తాపంబు నొందుచు నిట్లనియె॥ ఉ॥ రాజులు ప్రస్తుతింప సురరాజసమానుఁడనై తనూజులన్ రాజులఁ జేసి తాపసులు రాజఋషీంద్రుఁడటంచుఁ బల్కఁగాఁ దేజము నొందియా హరిణదేహమునందులఁ బ్రీతిఁ జేసి నా †యోజ చెడంగ నేఁ జెడితి యోగిజనంబులలోన బేలనై॥ వ॥ ఇట్లు శ్రీహరిశ్రవణ మనన సంకీర్తనారాధనానుసరణాభియోగంబులం జేసి యశూన్యసకలయామంబగు కాలంబు గల నాకు హరిణపోతస్మరణంబుకతంబున యోగవిఘ్నంబు ప్రాప్తంబయ్యె మోక్షమారుండనైతినని స్త్రీనిగూఢనిర్వేదుండగుచుఁ దల్లిం బాసి క్రమ్మఱ నుపశమశీల మునిగణసేవితంబై భగవత్క్షేత్రంబయిన సాలగ్రామసమీపపులస్త్యపులహాశ్రమంబునకుం గాలాంజనపర్వతంబువలనఁ జనుదెంచి యమ్మృగదేహత్యాగావసానంబు గోరుచు సంగంబు విడిచి యేకాకియగుచు శుష్కపర్ణతృణ§వీరుదాహారుండై మృగత్వనిమిత్తంబగు నావసానతీర్థంబునందు నవసానంబు గోరుచు దత్తీర్థోదకక్లిన్నంబగుచుండు శరీరంబు విడిచెనని శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకు వినిపించి మఱియు నిట్లనియె॥

——→ భరతుండు హరిణజన్మంబు విడిచి, ఆంగిరసుండను బ్రాహ్మణునకుఁ బుట్టుట. ←——

సీ॥ హరిణదేహముఁ బాసియంత నాంగిరసాహ్వయుండు శుద్ధుఁడు పవిత్రుండు ఘనుఁడు శమదమఘనతపస్స్వాధ్యాయనిరతుండు గుణగరిష్ఠుఁడు నీతికోవిదుండునైన బ్రాహ్మణునకు నాత్మజుండై పుట్టి సంగంబువలన నుజకితుఁడగుచుఁ గర్మబంధంబుల ఖండింపఁజాలు నీశ్వరుని నచ్యుతుని జుశ్రవణమనన ములను హరిచరణధ్యానముల ను విఘ్నభయమునను జేసి మనమునం దుఁబాయనీక నిలిపి సంస్తుతి సేయుచు నిలిచియుండె భగితయనునైన భరతుండు పార్థివేంద్ర॥ వ॥ ఇట్లాంగిరసుండు ప్రథమభార్యయందుఁ బుత్త్రనవకంబుఁ గనిద్వితీయభార్యయందు స్త్రీపురుషుల నిద్దఱను గలుగఁ జేసిననందుఁ బురుషుండు పరమభాగవతుండు రాజర్షిప్రవరుండు నుత్సృష్టమృగశరీరుండుఁ జరమశరీరంబునఁ బ్రాప్తవిప్రశరీరుండును నగుభరతుం డయ్యె నతం డాజన్మంబున నన్యజనసంగంబు జన్మపరంపరలకుఁ గారణంబని యత్యంతభయంబు నొంది కర్మబంధవిధ్వంసన శ్రవణస్మరణాముల శ్రీహరియనుగ్రహంబునం బూర్వజన్మపరంపరలను స్మరించుచుఁ దనస్వరూపంబున్మత్తజడాంధబధిరరూపంబున లోకులకుం జూపుచుండె నంత॥ మ॥ జనకుం డంగిరసుండు నాత్మజునివాత్సల్యం

---

* విభ్రంశితుండు=జాఱినవాఁడు. ‡ఓజ=తేజస్సు-బలము. బేల=మూఢుఁడు. †నిగూఢనిర్వేదుఁడు=ఇతరులకెఱుఁగరాకుండ వ్యసనపడుచున్నవాఁడు. § వీరుదాహారుండై=లతానస్సాహారముగగలవాఁడయి.

బునంబెంచుచుం। దనరంజౌలముఖాగ్ర్యకర్మములచేతన్సంస్కృతుంజేసిపా। యనిమోహంబుననిచ్చలుంగడఁక శౌచా
చారములెస్సెప్పినన్ ।ఘనుఁడా భాగవతుండసమ్మతినిదత్కర్మంబులంగైకొనెన్ ॥వ॥ఇట్లు బ్రాహ్మణకుమారుండు గర్మంబు
లయందునిచ్చ లేకయుండియును బిత్రునియోగనిర్బంధంబునం బిత్రుసన్నిధియందెయసమీచీనంబుగా వ్యాహృతిప్రణవ
శిరస్సహితంబగు నట్లుగాయత్రీమంత్రంబు జపియించుచుఁ జైత్రాది చతుర్మాసంబులను వేతంబుగ వేదంబులనధ్య
యనంబు సేయుచుండె జనకుండాత్మజుని శిష్టాచారంబు చే శిక్షింప వలయుననులోకాచారంబునను వర్తించియాత్మభూ
తుండగునాత్మజునందునభినివేశితచిత్తుండగుచు శౌచాచమనాధ్యయనవ్రతనియమగుర్వనలశుశ్రూషణాదికంబులనభి
యుక్తంబులయినం బుత్రుని చేనొనరించుచున ప్రాప్తమనోరథుండయ్యెనంత॥క॥ ఈరీతిని గొడుకునకా।చారంబులుగఱ
పిచింతసద్గృహమునసం।సారియగుచుండివిప్రుఁడు।ఘోరునదేహంబుఁబాసిపోయినమీఁదన్ ॥ గీ॥తల్లితండ్రితోడఁ దాన
గ్నిఁజొచ్చిన।నతనిమహిమ లెఱుఁగకంతలోన।సవతితల్లికొడుకులవినీతులగుచును।శాస్త్రవిద్యలతనిఁ జదువనీక॥వ॥ఇట్లు
బ్రాహ్మణకుమారునిసవతితల్లికొడుకులు వేదవిద్యలవలనం బాపిగృహకర్మంబులనతనినియమించిన ॥ క ॥ ధరణీసురోత్త
ముఁడు దా।నరుదుగఁదమవారు సెప్పినవియెల్లను నే।మఱకందుఁ బ్రీతిసేయక।నిరతముగృహకర్మమట్లు నెఱపుచునుండెన్.
వ॥ఇట్లుగృహకర్మప్రవర్తనుండగుచునుండమూఢులగుద్విపాత్పశువులచేనున్మత్తజడబధిరయని*యాహూయమానుం
డగునపుడుతదనురూపంబులగు సంభాషణంబుల నొనర్చుచుఁ బరేచ్ఛాయదృచ్ఛలంజేసి విష్టివేతనయాచ్ఞాదులవలనని
యుక్తకర్మంబులంబ్రవర్తించుచు॥ గీ॥అతులదివ్యాన్నమైనమృష్టాన్నమైన। నెద్ది వెట్టినజిహ్వాకుహితముగానె।తలఁచిభ
క్షించుఁగాకొండుఁదలఁచిమిగులఁ బ్రీతిసేయఁడురుచులందుఁబెంపుతోడ.వ॥మఱియునావిప్రుండొకనిత్యానందసుఖలా
భంబుగలిగిబాహ్యసుఖదుఃఖంబులయందు దేహాభిమానంబు సేయక శీతోష్ణవాతవర్షాతపంబులకునోడి పైఁజీరఁగప్పకవృ
షభంబునుంబోలెఁబీనుండుగరినాంగుండునగుచు *స్థండిలశాయియైరజోపటలంబునంగప్పంబడినదివ్యమాణిక్యంబువో
లెన ?నభివ్యక్తబ్రహ్మవర్చసుండైమలినాంబరపరీతకటితటుండునై‡మషీలిప్తయజ్ఞోపవీతుండునగుటంజేసియజ్ఞజనంబు
లతఁడుబ్రాహ్మణాభాసుండుమందుండు ననిపలుకసంచరించుచుండంగర్మమూలంబునంబరులవలననాహారంబుగొనున
పుడుదమవారువ్యవసాయకర్మంబునందునియమించిన క్షేత్రవిహితసమవిషమన్యూనాధికంబుల నెఱుంగకప్రవర్తించు
చునూకతవుడు తెలకపిండిపొట్టునిప్పటిమాడుదబ్బెడయాదిగాఁ గలద్రవ్యంబులయందునమృతంబుపగిదిరుచిచేసిభక్షిం

—— శ్రీ వృషలరాజభృత్యులు కాళికిబలియిచ్చుటకుభరతునిఁగొనిబోవుట. శ్రీ ——

చుచుంజనికావలియుండు నెడనొక్కనాఁడు॥ క॥పురిలోనవృషలపతిదా।నరుదుగసంతానకాముఁడై వేడుకతోఁ।బురుషప
శువుఁగాళికి వే।దరముకగొనిపోవఁబశువుదలఁగినభృత్యుల్ ॥గీ॥అరసికానలేకయారాత్రివీరాస।నమునఁజేసికాఁపువిమ
లబుద్ధినున్నవిప్రయోగినొక్కనిఁబొడగాంచి। పశువుమంచిదనుచుఁబట్టిరతని॥ క॥ఆరీతినిభూసురవరు।నారయనాకాళి
గృహమునకుఁదగభృత్యుల్ ।ఘోరునగొనిచనిసల్పిరి।చారుతరాభ్యంగనాదిసంస్కారంబుల్ ॥వ॥ఇట్లభ్యంగనాదికృత్యం
బులుదీర్చినూతనశ్రీవసనంబుగట్టనిచ్చిగంధపుష్పాభరణాద్యలంకృతునింజేసిమృష్టాన్నంబులుభుజియింపంబెట్టిధూపదీ
పమాల్యలాజకిసలయాంకురఫలోపహారాదులుసమర్పించి మహావాద్యఘోషంబుతోడనాపురుషపశువుంగాళికాదేవి
సమ్ముఖంబుననాసీనుంగావించి యావృషలపతిపురుషపశువురక్తంబునంభద్రకాళిసంతోషపెట్టం దలంచికాళికామం
త్రాభిమంత్రితంబునతికరాళంబునైనఖడ్గంబందినిజాభీష్టసిద్ధికిహింసింపందలంచిన॥ సీ॥ సర్వభూతములకుసఖుఁడును
బ్రహ్మభూతాత్ముఁడునిర్వైరుఁడయినబ్రహ్మ। సుతునితేజంబంతఁజూడదుస్సహమైనభయమందివడఁకుచుభద్రకాళి।
క్రోధంబుముమ్మడిగొనఁగహుంకారంబుసలుపుచునట్టహాసంబుఁజేసి । పాపాత్ములునుదుష్టపరులునురాజసతామసక
ర్మసంధానులగుచు।విప్రవరునట్లుహింసించువృషలపతిని।భృత్యవర్గంబుతోఁదలబృథ్విఁగూల్చి।యపుడువృషలాధిపునిశిర
మందిలీలఁ।బాడియాడుచునందందఁగ్రీడసలిపె॥ క॥ధరలోననెవ్వరేనియు।ధరణీసురవరులకెగ్గుదగఁదలఁచినవా।రరయగ
ఁజెడుదురునిక్కము।హరిధరణీసురవరేణ్యులందుండుటయున్ ॥మఱియు॥ఉ॥అచ్చటవిప్రసూనుఁడుభయంబొకయించు
కలేకచంపఁగా।వచ్చినవారియందుఁగరవాలమునందునుగాలియందుఁదా । నచ్యుతభావముంచిహృదయంబునఁబర్మద
శాత్తునెంతయు।న్మచ్చికతోడనిల్పియనుమానమునొందకయుండెనెంతయున్ ॥వ॥మఱియునావిప్రవరుండుచండికాగ్ర

*ఆహూయమానుండు।పిలువఁబడుచున్నవాఁడు. *స్థండిలశాయియై।పరిశుద్ధస్థలమందుశయనించుచున్నవాఁడై. ?అభివ్యక్తబ్రహ్మవర్చసుండై।తెలియఁగూడనిబ్రహ్మతేజస్సుగలవాఁడై. ‡మషీలిప్త॥మషీ–కాటుక–దీనిచేత–లిప్త।పూయఁబడిన. శ్రీవసనము।వస్త్రము.

హంబు వెలువడి క్రమ్మరం జనికావలియందు నేడ॥సీ॥అంతటఁ గొన్నిహాయనములు సనసింధు భూపాలనము సేయుభూప
రుండు। ధీరత నిక్షుమతీతీరమున నున్న కపిలమహాముని గాంచి తత్త్వ। విజ్ఞానమెఱిఁగెడు వేడ్కతోడుత శిబికారోహణ
ముఁ జేసి యరుగుచుండ। నాలోన నా శిబికారోహకులు చేనికాపున్న విప్రుని గాంచి తెచ్చి। శిబిక మోపింప నీతని చేతనను
చుఁ। బట్టి మూఁపున బల్లకిఁ బెట్టి మోవుఁ డనుచు మోపించు నంత ధరావరుండు। శిబిక మూఁపున నిడి యొంచ జింత లేక॥ క॥తన
మనసు కోలఁది నప్పుడు। మునుకొని యట్లు ప్రయత్నమున నడువఁగ నా। జనపతి నిమ్నోన్నతమై। చనుటయెఱిఁగి శిబిక మోచు
జనులకు ననియె॥గీ॥ మీరలిప్పుడిచటఁ జేరి మిక్కిలి ప్రయ। త్నంబుతోడఁ దగిలి నడుచుచుండ। విషమమగుచు గమన వేగంబు
నను బాధఁ। బెట్టుచున్నదనిన బెస్తలనిరి॥ వ॥ దేవా యీ విషమగమనంబు మావలన నైనది గాదీ తురీయవాహకుండు సుఖగ
మనంబు గా నడువనేరం డితనితోడ మేము నడువనేరమని నరహూగణుండను రాజుపాసితవృద్ధజనుండై నను బలాత్కారం
బునం బుట్టిన కోపంబునం గోపించి విమర్శఁ దప్పి నీఱు గప్పిన నిప్పువోలె నెఱుంగరాని బ్రహ్మతేజంబుగల బ్రాహ్మణునికిం గం
టకంబుగా నిష్ఠురవాక్యంబుల నిట్లనియె॥ చ॥ అలసితి వెంతయున్మసలి వాఁకటఁ డస్సితి మేను మిక్కిలిం। బలచన యున్నదీ శిబిక
భారము దూరము మోసితే గతిం। నిలిచెద వంచు భూవరుఁడు నిష్ఠురముల్దగఁ బల్క నా యెడం। బలుకక మోసె నా శిబిక బ్రా
హ్మణవర్యుఁడు పార్థివేశ్వరా॥ వ॥ అప్పుడా విప్రవరుండు దనకుం గడపటిదియగు కళేబరంబునందు నహంకారమమకారం
బులం బొందనీక మిథ్యాజ్ఞానరహితుండై బ్రహ్మభూతుండై మౌనవ్రతంబున నా శిబిక మోయుచున్న విషమగమనంబుఁ
జూచి యతికుపితుండగుచు భూవరుండు వెండియు నిట్లనియె॥ సీ॥ ఓరి దుర్మదవినరోరి జీవన్మృత నా యాజ్ఞఁ దప్పుచు నడచెదీ
వు। నీ వక్రమార్గంబు లిన్నియు విడిపించి నడిపింతు నిన్ను సన్మార్గమందు। నని రాజగర్వాంధుఁడగుచు గుణత్రయంబున వృద్ధిఁ
బొందిన భూవరుండ। బద్ధప్రలాపముల్పలుకుచుండినఁ జూచి శమదమాదులచేఁ బ్రశస్తుఁడగుచు। జగతి బ్రహ్మస్వరూపమైన స
కలభూతములకు నత్యంతహితుఁడైన భూసురుండు। యోగివర్తన దెలియక యున్న రాజు। నంత వీక్షించి మఱియు నిట్లనుచుఁ బ

❧ భరతుండు రహూగణుని మాటలకుఁ బ్రత్యుత్తరంబు లిచ్చుట. ❧

లికె॥ వ॥ నరేంద్రా నీవు చెప్పినది సత్యంబు భారంబీ శరీరంబునకే కాని నాకుం గలుగనేరదయినను స్థౌల్యకార్శ్యంబులు వ్యా
ధులు నాధులు క్షుత్తృష్ణలు నిచ్ఛావిరోధభయంబులు జరామరణంబులు రోషనిద్రాజాగరణంబు లహంకారమమకారమద
శోషణాదులును దేహంబుతోడన జనియించుం గాని నాకుం గలుగనేరవు జీవన్మృతుండనేన కాదాద్యంతంబులు గలుగుటం జే
సి యందఱియందును గలిగియుండు స్వామిభృత్యసంబంధంబులు వివిధకృత్యంబులగుచు వ్యవహారంబులం జేసి శరీరంబుల
కుం గలుగుం గాని జీవునికి లేకయుండు నదియునుం గాక రాజాభిమానంబున నీవు నన్నాజ్ఞాపించెదవేని యుం బ్రమత్తుండవై
న నీకుం బూర్వస్వభావం బెట్లుండెనట్లు గాక నే నేమి సేయుదు నెఱింగింపుమున్మత్త మూకాంధ జడులఁ బోలె సహజస్వ
భావంబునుం బొందిన నాయందు నీ శిక్ష యేమి లాభంబుఁ బొందింప నేర్చు నదియునుం గాక స్తబ్ధుండు మత్తుండునైన నాకు
నీ శిక్ష వ్యర్థంబగు నని పలికి యుపశమశీలుండై మునివరుండు పూర్వకర్మశేషంబునం గల్గు భారవాహకత్వంబును దలంగం దో
లుటకు భారంబు వహించి శిబిక మోచుచుం జను నెడ నా రాజవల్లభుండు దత్త్వజ్ఞానాపేక్షితుండై చనియెడివాఁడగుటం దన
హృదయగ్రంథివిమోచకంబులు బహుయోగగ్రంథసమ్మతంబులు నగు బ్రాహ్మణవాక్యంబులు విని యా శిబిక దిగ్గనడిగ్గను
రికి యా విప్రునికి సాష్టాంగదండప్రణామంబు లాచరించి గర్వవర్జితుండై ముకుళితహస్తుండగుచు నిట్లనియె.సీ॥ ధరణీసురుల
లోనఁ దలఁప నెవ్వఁడవీవు నవధూతవేషివై యవనియందు। నేమిటికై చరియింపఁగ వచ్చితిచటికి నొక్కఁడవో। టెఁజనుట నేఁ
డు। నను గృతార్థునిఁ జేయ ననుకూలుఁడగుచున్న యట్టి యా కపిలమహామునీంద్రుఁ। డవో నీమహత్త్వంబు దపిలి విచారింప నె
ఱుఁగక చేసితిఁ గరుణఁ జూడు। తప్పు సైరింపు నేయమదండమునకు। హరుని శూలంబునకును వజ్రాయుధమున। కనలచంద్రా
ర్కధనదశస్త్రాస్త్రములకు। వెఱవ విప్రున కేనిట్లు వెఱచినట్లు॥ వ॥ మఱియు నిస్సంగుండవై జడుండవుం బోలెని గూఢవిజ్ఞానం
బు గలిగి చరియించుచున్నవాఁడవు నీ వచనంబులు యోగశాస్త్రసమానంబులై వాఙ్మనంబులకు నభేద్యంబులయి యున్న
వి యేను విష్ణుకళావతీర్ణుండు సాక్షాద్ధరియునగు కపిలమహాముని వలనఁ బ్రహ్మవిద్యఁ దెలియం గోరి జనుచున్నవాఁడ లోక
నిరీక్షణార్థం బవ్యక్తలింగుండవై చరియించుచున్న కపిలమహామునీంద్రుండవు గాఁబోలుదువు మందుండైన గృహస్థుం
డు యోగీశ్వరచరిత్రంబు లెట్టు లెఱుంగ నేర్చుఁ గర్మవశంబున దృష్టంబైన భ్రాంతి వహించుచు నడుచుచున్న యీ యాత్ర
మంబు నా కనుంబోలె నీకు నగునని తోఁచుచున్న దదియెట్లనిన ఘటంబు లేక జలంబులు దేనేరని తెఱంగున లేనిది గలుగనేర

❀ శిబికారోహణము చేసి। పల్లకి మీఁద నెక్కి, శిబికారోహకులు। పల్లకి మోయువారు.

ఁ గావునం బ్రమాణమూలంబయిన లోకవ్యవహారంబు సత్పథంబున సమ్మతంబై యుండుటం జేసి మీరలాడు వాక్యంబు
లు నాకు సమ్మతంబుగా నేరవని సింధుదేశాధీశ్వరుండు వినిపించిన నావిప్రుండు లోకవ్యవహారంబునకు నిత్యత్వంబౌపా
ధికంబు గాని నిత్యంబుగా నేరదని వృత్తాంతనిదర్శనంబున నిట్లనియె॥ సీ॥ పావకశిఖలచే భాండంబు దాఁ దప్తమగు దప్తమ
టము చేనంబు సన్న। జలము దపించు నా జలముచేఁ దండులంబులు దప్తమొందియప్పుడు విశిష్ట। మైనయన్నంబగు నాచంద
మునను దా దేహేంద్రియంబులఁ దెలివితోడ। నాశ్రయించుక యున్నయట్టి జీవునకు దేహంబునఁ బ్రాణేంద్రియాదికము
న। జరుగుచుండు నిట్లు సంసారఘటవృత్తి। మంఠుఁడైన రాజు మస్తమైన। కర్మములను బాసి కంజాక్షుపదసేవఁ। జేసెనేని
భవముఁ జెందకుండు॥ గీ॥ అనుచు ధారుణీసురాత్మజుఁ డీరీతిఁ। బల్కుటయును రాజు పరిణమించి। వినయవాక్యములను వి
నుతించి కృష్ణుఁ। బుణ్యుఁడైన సింధుభూవరుండు॥ వ॥ మహాత్మా యేను రాజనని యెడి యభిమానమదాంధుండనై మహా
త్ములం దిరస్కరించిన నన్ను ననుగ్రహింపుము నీ వార్తబంధుండవు నీకృపాదృష్టిం జేసి మహాత్ముల నవమానంబుఁ జేసిన మరి
తంబువలన విముక్తుండ నయ్యెద విశ్వసుహృత్తవైన నీకుం గోపంబు గలుగ నేరదు సమర్థులయిన మాబోటి వారలు మహాజనా
వమానంబున శీఘ్రంబె నశింతురు గాన నీవు దయాళుండవై నన్ను మన్నింపుమనిన నావిప్రుండిట్లనియె॥ క॥ కడు వేడ్క నీవు వి
ద్వాంసుండవై యుండియును మిగులఁ జోద్యము విద్వాంసుండు నో లేను బలికెదవి ప్పుడు మేలనవచ్చుఁ గొంత పురుషులలో
నన్॥ గీ॥ పరఁగఁ బెద్దలీ ప్రపంచమంతయుఁ దథ్య। మనరు నీవు దథ్యమనుచుఁ బలికి। తట్లు గాన నిన్ను నధికుండవనవచ్చు। గాదు మనా
కుఁ జూడ రాజచంద్ర। సీ॥ యజ్ఞాదికములందు నామ్నాయములయందుఁ దెలుచుగాఁ దత్త్వవాదంబు లేదు। స్వప్నంబునందు మ
లసౌఖ్యమాకారంబునందు లనిత్యమై యంత లేని। యట్టిచందమున వేదాంతవాక్యంబులు దత్త్వంబు నెఱింగించి తలఁగుఁగా
ని। నిత్యంబులై యుండ నేరవు పురుషుని చిత్తంబు గుణములఁ జెందియెంత। కాలముండును మఱియంత కాలమందు। నరయవి
జ్ఞానకర్మేంద్రియములచే। మఱిగి ధర్మంబు మఱియధర్మంబు నట్లు। దగిలి పుట్టించుచుండు నత్యంతమహిమ॥ వ॥ మఱియు ధ
ర్మాధర్మవాసనాయుక్తంబు విషయానురక్తంబునైన చిత్తంబు గుణప్రవాహంబులచేత వికారంబు నొంది దేవతిర్యఙ్మను
ష్యరూపంబులైన దేహంబులం బుట్టించుచుఁ గాలప్రాప్తంబులైన సుఖదుఃఖతమభయఫలంబుల ననుభవించుచు ననవరతం
బు జీవునికిం బ్రత్యక్షంబగు చు స్థూలసూక్ష్మరూపంబులనుండు స్వాంతంబు గుణరహితంబైన ముక్తికారణంబగు ఘృతవస్తు
లు గలదీపంబు సధూమశిఖలం బుట్టించు ఘృతవస్తులు నాశంబు నొందిన స్వరూపంబుఁ బొందిన తెఱంగున మనంబు గుణకర్మా
నుబంధంబైన జన్మములం బుట్టించు గుణకర్మంబులం బాసె నేని యుం బరతత్త్వంబు నొందు జ్ఞానేంద్రియంబులేను విష
యంబులమీఁదఁ దోఁచు బుద్ధి లేను నభిమానంబునను నేకాదశవృత్తులం గూడిన మనంబు జీవునికి నసంఖ్యంబులైన జన్మంబు
లం బొందించు మనోవృత్తుల నతిక్రమించిన జీవుండు పరంజ్యోతిర్మయమైన నారాయణస్వరూపంబుగా నెఱుంగుము- స్థావర
జంగమంబులైన జీవులకుం బవనుండు ప్రాణంబై యున్నచందంబున నీశ్వరుండు సర్వభూతాంతర్యామియగుచు జీవాత్మ
స్వరూపంబున నుండు జీవాత్మ జ్ఞానోదయంబునం జేసి మాయ నెంత కాలంబునం గెలువకుండు నంత కాలంబు ముక్తసం
గుండు గాఁ డరిషడ్వర్గంబును జయించి పరతత్త్వంబు నెఱింగిన నీశ్వరుండు-చిత్తంబెంత కాలంబు విషయాసక్తంబగు నం
తతడవు సంసారచక్రంబునం దుసంచరించుం గావున మహావీరుండైనను దనకు శత్రువైన మనంబున ప్రమత్తుండయి యి
చ్ఛావిహారంబు జరుగనీక పరమగురుండైన శ్రీహరిచరణోపాసనాస్త్రంబునం జిత్తంబు గెలిచినం బరతత్త్వంబు నొందు
నని విప్రుండు పలికిన నతని మహిమకు వెఱఁగంది బ్రాహ్మణునకు నమస్కారంబు సేయుచు భూవరుం డిట్లనియె॥ ఉ॥ కారణవి
గ్రహంబును గు కాయము నీయవధూతవేషమున్ బ్రాభిధరామరత్వమును బూర్వసమాగమమాత్మభావమున్। జారువిహార
మత్యకు శాంతిగుణంబును మాధవ గ్తదం। బారయఁ గల్గు నీకు వినయంబున మ్రొక్కెదఁ బెక్కు భంగులన్॥ మ॥ జ్వరితా
ర్తుండు సరోగి కౌషధమభీష్టంబైన చందంబునన్। కరలోనాతపతప్తదేహికి సుశీతంబైన తోయంబునుం। గరిమం గ్రోలినరీ
తి నేఁ దయు మహంకారాహిదష్టుండనై। పరగు న్నాకును నీవచోమృతము దప్పన్మందు వేఁడున్నదే॥ గీ॥ విప్రవర్య నేను వేడ్క
తో నాసంశయంబులెల్ల నిన్ను నడిగి తెలియ। గలఁ డియున్న వాఁడఁ గష్టపెట్టెఱిఁగింపు। ముచితవృత్తిఁ దత్త్వయోగమెల్ల॥ అ
ని యడిగిన యా రాజునకు విప్రుం డిట్లనియె॥ గీ॥ కానవచ్చిన ఫలములు కర్మమూల। ములగుటను జేసి సంసారములను జిత్త। మె
పుడు వర్తించుచుండుగా నెఱుఁగ లేవు। తత్త్వయోగంబు మిగుల నిత్యంబటంచు॥ వ॥ నా జీవుని యీ సుంధరమున్న చరణంబు
లకు నెక్కుడు జంఘులు నామీఁద జానువులా పైడవున నూరువులం దులకు పరిప్రదేశంబున మధ్యంబటని హాఁకనురమందుమకు
నెక్కువ కంఠంబు మీఁద స్కంధంబందుల దారు వాదారువున శిబికయందు రాజనని యెడి యభిమానంబు గలిగి నీవున్న

వాఁడవిట్టిచోద్యంబయినకష్టదశంబొందిననీవుప్రజాపాలనంబు సేయుచున్నవాఁడననుగర్వంబునమావంటిమహాత్ములసభలో నంబూజ్యుండవుగాక యున్నవాఁడవీస్థావరజంగమంబులకునివాసస్థానంబువసుంధరయైనచందంబునసత్క్రియలచేత నెఱుఁగందగినజగత్కారణంబై నతత్త్వంబు నెఱింగించెదపరమాణుసముదయంబీ ధరిత్రియైనచందంబునఁనవిద్యామనంబులచేతంగల్పితంబై నకృశస్థూలబృహదణుసదసజ్జీవాజీవద్రవ్యస్వభావాశయకాలనామబుద్ధిరూపంబై నమాయచేజగత్తు రెండవదియైకల్పింపంబడియె బాహ్యాభ్యంతరంబులంగలిగిస్వప్రకాశంబై భగవచ్ఛబ్దవాచ్యంబువిశుద్ధంబుపరమార్థంబుజ్ఞానరూపంబునై బ్రహ్మంబొకటియసత్యంబుజగత్తసత్యంబగుననిపలికిమఱియు॥సీ॥ధరలోన బ్రహ్మంబుదపమునదానంబులనుగృహధర్మంబులనుజలాగ్ని। సోమసూర్యులచేత శ్రుతులచే నైననుబరమభాగవతులపాదసేవఁ। బొందినమాడ్కినిబొందంగరాదనిపలుకుదురార్యులుపరమమునులు। ఘనతపోబాహ్యసౌఖ్యములకువిముఖులునై పుణ్యులుహరిగుణానువాద। మోదితాత్ములునగుబుధపాదసేవ।ననుదినంబును జేసిననంతమీఁద। మోక్షమార్గంబునకునుబద్ధాత్మునంనుఁ।బట్టువడియుండు నెప్పుడుపరగబుద్ధి॥వ॥నరేంద్రా యేనుపూర్వంబునభరతుండనురాజను సర్వసంగపరిత్యాగంబుఁ జేసి,భగవదారాధనంబు సేయుచు, మృగంబుతోడి స్నేహంబుకతన,మృగంబునై పుట్టియు, నంమనుహరిభక్తిఁదప్పకుండియుపుడు,మనుష్యుండనై,జనసంగంబునశంకితుండనగుచు,మనుష్యసంసర్గంబును బాసియేకాకినై చరియించుచున్నవాఁడనరుఁడువృద్ధసంసేవంజేసి, సంసారమోహంబును బాసిహరిధ్యానకథలచే, లబ్ధజ్ఞానుండై పుండరీకాక్షునింబూజింపుచుం,బరలోకంబునుంబొందుననిపలికి,విప్రుండుమఱియునిట్లనియె॥సీ॥ధరణీశ మాయ చేతను దాఁటఁగా రానిపదమునఁబట్టంగబడ్డజీవుఁ। డెలమి మైగుణకర్మములఁజేయుచునులాభమాశించితిరిగెడు*నర్యమాడ్కి। ఫలమపేక్షింపుచుఁబాయకజీవుండుసంసారగహనసంచారియగుచు।ననవరతమునుండు నామహావనమందుఁగామలోభాదితస్కరులుగూడి। ధరణివిజితేంద్రియుఁడుగానినరునిఁబట్టి। ధర్మమనియెడియామహాధనము నెల్ల। నరసిగొనిపోవుచుండుదురనుదినంబుఁ। గాన సంసారమందునాకాంతువలము॥క॥అరయఁగసంసారాటవిఁ। దరలకయాపుత్రమిత్రదారాదులనం।బరగిన†స్మగాలవృకములు। పరువడినరబస్తములనుభక్షించువడిఁ॥తరల॥మలసిసంసృతిఘోరకాననమందిరంబులనెల్లనుం। జెలఁగిగుల్మలతాతృణాదులచేతగహ్వరమైననిశ్చలనికుంజములందుచుర్జనసంజ్ఞలంగలమక్షికం। బులనిరోధముదన్ను సోఁకినఁబొందుచుంచువిపద్దశ॥గీ॥మఱియునీగృహస్థమార్గంబునందెల్ల। విషయములనుబొందివిశ్వమెల్ల। గడఁకతోడనిట్లుగంధర్వలోకంబుఁ। గాఁదలంచిమిగులమోదమందు॥గీ॥మఱిగికాననమునఁగొఱవిదయ్యముఁగాంచి। యగ్నిఁగోరి వెంటనరుగుమాడ్కిఁ।గాంచనంబుగోరికలవారియిండ్లఁబం।చలనుదిరుగునరుఁడుచలనమంది॥గీ॥బహుకుటుంబియగుచుబహుధనాపేక్షుల। నెండమావులఁగనియేగుమృగము। కరణిఁద్రేమఁజేసిపరువులువారుచు। నొకకచోటనిలువకుండు నెపుడు॥గీ॥ మఱియు నొక్కచోటను త్తుఁడై పవనగ। జోహతాక్షుఁడగుచుఁజూపుదప్పి।దిక్కెఱుంగకొండుదిశకేగుపురుషుని। కరణిఁదిరుగునరుఁడునరవరేణ్య॥ వ॥మఱియు నొక్కచోట§నులూకఝిల్లీస్వనంబులతోడసమానంబులయినశత్రురాజితిరస్కారంబులకుదుఃఖపడుచునొక్కచోటక్షుధార్దితుండై యపుణ్యవృక్షంబులనాశించుమాడ్కిఁబాపకర్ములుద్రవ్యహీనులునగువారినాశ్రయించుచునొక్కయెడంబిపాసాపరుండై జలహీనంబయిననదిఁజనినరీతినిహపరదూరులైనపాషండులసేవింపుచు మఱియునొక్కప్రదేశంబునందగ్నిచేతందప్తుండయినవాఁడు దావాగ్నింజేరివ్యథనొందురీతినన్నార్థియగుచుదాయాదులంజేరిదుఃఖింపుచుమఱియునొక్కచోటపరబాధంజేసిమున్నగానకరాజ్యాభిలాషఁబ్రాణసఖులైపితృపుత్రభ్రాతృజ్యేష్ఠులనైనసువధియింపుచుమఱియుచోరులచేతంగొట్టుఁబడిసర్వధనంబునుబోనాడిచింతాపరవశుండై దుఃఖింపుచునున్నంత ¶గంధర్వనగరప్రాయంబైన సంసారసుఖంబులనుభవించిమోదింపుచు మఱియు ‡నగారోహణంబు సేయునరుండుగంటకపాషాణాదులవలనంబాడిపీడితుండగుచుదుఃఖించుచందంబున గృహాశ్రమోదితమహాకుటుంబుష్టానంబునకునుపక్రమించి వ్యసనకంటకశర్కరాపీడితుండై దుఃఖింపుచు నొక్కచోటంజఠరాగ్నిపీడితుండై కుటుంబంబుమీఁదనాగ్రహింపుచువనంబుననజగరగిళితుండై జీర్ణితుండైనచందంబున రాత్రిగృహాటవియందుసిద్రాపరవశుండై యెఱుంగక యుండుచుమఱియునువనంబునం※తృణచ్ఛన్నకూపపతితుండగుచు సర్పదష్టుండయిన తెఱంగునసంసారియగుచుండుమఱియు నొక్కయెడజుంటితేనియకునైమమోహగ్రస్తులచేతవ్యాకులితహృదయుండగుచునంధుండై యజ్ఞానాంధకూపంబునంబడుచు

---

*అర్యమాడ్కి—కోమటివలె. †స్మగాల।నక్క. ‡బస్తము।మేఁకపోతు. §ఉలూక।గుడ్లగూబ. ఝిల్లీ।చిమట-ఈలపురుగు. ¶గంధర్వనగరప్రాయంబైన।మాయాపట్టణసదృశమైన. ‡నగ।కొండ. ※తృణచ్ఛన్నకూపపతితుండగుచు।గడ్డిచేఁగప్పఁబడినబావియందుఁగూలినవాఁడయి.

క్షికాబాధనత్యంతదుఃఖితుండయినవాఁడిట్లని సంసారకాముండై పరదారద్రవ్యాభిలాషియగుచు భూపాలకులచేతన యినను గృహపతిచేతనయినను దాఁడితుండయినరకంబునంబడుచుండు; యౌవనంబున సంపాదించిన ద్రవ్యంబులుపరులచే తంబోనాడినవిధంబున శీతవాతాద్యనేక ప్రయాసలబ్ధంబైన ధనంబులువోనాడి సంసారి యతిచింతాక్రాంతుండై యుండు మఱియును వనంబునలుబ్ధకులు సంస్పృష్టంబయిన యల్పామిషంబునకు నన్యోన్యవైషమ్యంబు నంగలఁపించిన విధంబున సంస్పృష్టవ్యవహారిరైసల్పద్రవ్యంబులకుం బోరాడుచుండునని భూపాలునకు విప్రుండు సంసారాటవి తెఱంగెఱింగించి వెండియు నిట్లనియె॥ గీ॥ అల్పధనుఁడు విశ్రమస్థానముల దృష్టిఁ। బొందకోరుల ధనముఁ బొందఁ గోరి। యరిఁగి వారివలన నవమానములఁ బొంది। యధికనయిన దుఃఖమనుభవించు॥ గీ॥ అంతఁ గొండ తెల్లన న్యోన్యవిత్తాది। వినిమయమున గడుఁ బ్రవృద్ధమయిన। వైరములనుబొంది పోరాట మొందుదు। రాత్మచింత లేక యనుదినంబు॥ సీ॥ సంసారమార్గ సంచారుడై యధిక ప్రయాసంబుననుగూర్చ్పనర్థములను। విహరింపుచును గొంద రిహలోక ఫలములఁ గోరి మోక్షంబును గోరకంతఁ। జెడిపోవుచుందు రెప్పుడు గాని యందుకుఁగడపటి యోగంబుఁ గానలేరు। మానవంతులున సమాన శౌర్యులున గువారు మిక్కిలియైన వైరబుద్ధి। నాహవంబున నడియుదురంతె కాని। మోక్షమార్గంబుఁ గానరు మూఢవృత్తి। ననుచు సంసారగహనవిహారమెల్లఁ। దెలిపి క్రమ్మఱ ననియె ధాత్రీసురుండు॥ వ॥ మఱియుం గాలచక్రనియంత్రితుండై చక్రాయుధునిం గొల్వక కాకగృధ్రబకసమానులైన పాషండసఖ్యంబునం జేసి వారల చేత వంచితుండై బ్రాహ్మణకులంబునం జేసి శ్రౌతస్మార్తకర్మానుష్ఠానపరుండై విషయసుఖంబులం దుఁదగులంబడి కాలంబు తుద నెఱుంగక వృక్షంబులుం బోలె నైహికార్థంబులయందుఁ దృష్ణగలిగి మైథుననిమిత్తంబు సుతదారాదులయందు స్నేహంబు సేయుచు పథికుఁడు మాతంగంబులయందు భయంబున దీర్ఘసిమ్నకూపంబునంబడిన తెఱంగున సంసారమృత్యుగజభయంబున గిరికంధరప్రాయంబయిన యజ్ఞానతమంబునఁ బడుం గావున మాయచేత సంసారమార్గంబైన రాజభావంబు విడిచి సర్వభూతమైత్రి గలిగి జితేంద్రియుండవై జ్ఞానాసిచే మార్గంబు కడపలఁ గనుమని పలికిన భూపాలుండిట్లనియె॥ క॥ అక్కటమానుషజన్మం। బెక్కువ నైయుండు నెపుడభేదమతిం బెం। పెక్కిన యోగిసమాగమ। మక్కజము గలిగె నేనియఖిలాత్మలకున్॥ క॥ ధరణీసురవరనీ శ్రీ। చరణాంబుజయుగళ రేణుసంస్పర్శమునా। దురితంబులడఁచె నింతట। హరిభక్తియు ననంతకంతనధికంబయ్యెన్॥ వ॥ మఱియు విప్రవరులయందు యోగీశ్వరులవధూతవేషంబునం జరియింపుచుందురు గావున విప్రులు పిన్న పెద్దలనక నందఱికిని నమస్కారంబ నిస్తుతియించిన నా యోగీశ్వరుండును సింధుపతికి గరుణాన్వితుండగుచుఁ దత్త్వజ్ఞానంబుపదేశించి యారాజు చేత వందితచరణుండై పూర్ణార్ణవంబునుం బోలె సంపూర్ణ కరుణారసపూరపూరితస్వాంతుండై వసుంధరం జరియింపుచుండె సింధుభూపతియును సుజనసమాగమంబునలబ్ధతత్త్వజ్ఞానుండై దేహాత్మభ్రమంబాసెనని పలికి శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకిట్లనియె॥ చ॥ అరయఁగ మక్షికంబు వినతాత్మజుఁ గూడఁగలేని రీతియా। భరతుని సచ్చరిత్రము ప్రస్తుతి సేయఁగనీవసుంధర। న్నరపతులెల్ల నోపరు మనంబుననైనను నింకనిట్టియా। భరతుని పుణ్యవర్తనముఁ బ్రస్తుతి సేయఁగ నాకు శక్యమే॥ వ॥ నరేంద్రా భరతుండు సుతదారరాజ్యాదులనుబూర్వకాలంబునందు విడిచి భగవత్పరుండగుచు యజ్ఞరూపంబును ధర్మస్వరూపంబును సాంఖ్యయోగంబును బ్రకృతిపురుషస్వరూపంబునైన నారాయణునకు నమస్కారంబను చుమృగరూపంబునుం బాసెనట్టి భరతుని చరిత్రం బెవ్వరు సెప్పిన నెవ్వరు వినిననట్టి వారలఁ బుండరీకాక్షుండు రక్షించు నాయురభివృద్ధియగు ధనధాన్యసమృద్ధియునగు చుస్వర్గోపభోగంబులం బొందుదురని॥

మ॥ నరదేవాసురయక్షరాక్షసమునీంద్రస్తుత్యదివ్యాంబరా। భరణాలంకృత భక్తవత్సలకృపాపారీణవైకుంఠమం। దిరబృందావనభాసురప్రియధరిత్రీనాథ గోవింద శ్రీ। కరపుణ్యాకరవాసుదేవ త్రిజగత్కల్యాణగోపాలకా॥ క॥ పరమపదవాసదుష్కృత। హరకరుణాకరమహాత్మహతదితిసుతభా। సురగోపికామనోహర। సరసిజదళనేత్ర భక్తజననుతగాత్రా॥ మాలిని॥ సరసహృదయవాసా చారులక్ష్మీవిలాసా। భరితశుభచరిత్రా భాస్కరాబ్జారినేత్రా। నిరుపమఘనగాత్రా నిర్మలజ్ఞానపాత్రా। గురుతరభవదూరా గోపికాచిత్తచోరా॥............

గద్య. ఇది సకలసుకవిజనానందకరబొప్పనామాత్యపుత్ర గంగనార్యప్రణీతంబైన శ్రీమహాభాగవతపురాణంబునందు ప్రియవ్రతునిసుజ్ఞానదీక్షయు, బ్రహ్మదర్శనంబు, నాగ్నీధ్రాదుల జన్మంబు, నుత్తమతామసరైవతుల జన్మంబును, బ్రియవ్రతుండు వనంబునకుఁ జనుటయు నాగ్నీధ్రుండప్సరసం బరిగ్రహించుటయు, వర్షాధిపతులజన్మంబు నాగ్నీధ్రుఁడు వనంబునకుం జనుటయు నాభి ప్రముఖుల రాజ్యంబును నాభియజ్ఞంబును ఋషభుని జన్మంబును, ఋషభుని రాజ్యాభిషేకంబును, భరతుని జన్మంబును, ఋషభుండు తపంబునకు జనుచు నతులజ్ఞానంబుపదేశించుటయు, భరతుని పట్టాభిషేకంబును, భరతుండు వనంబునకుఁ జనుటయు. భరతుండు హరిణపోతంబునందుఁ బ్రీతిఁ జేసి హరిణగర్భంబున జనియించుటయు, మఱల విప్రసుతుండై జనియించుటయు, విప్రుండు చండికాగృహంబునఁ బ్రతికివచ్చుటయు, సింధుపతివిప్రసంవాదంబును నను కథలుగల పంచమస్కంధమునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీగోపాలకృష్ణపరబ్రహ్మణేనమః.





## ద్వితీయాశ్వాసము.

శ్రీకాంతాహృదయప్రియ। లోకాలోకప్రచారలోకేశ్వరను। శ్లోకభవభయనివారక। గోకులమందారనందగోపకుమారా॥
వ॥ సకలపురాణార్థజ్ఞానవిఖ్యాతుండగు సూతుండిట్లనియె॥ క॥ మునులార*బాదరాయణి।యనఘాత్ముం డైన యుత్తరా
త్మజునకుఁ। ద్వినయో క్తిభరతుచరితము। వినిపించుచు మఱియునిట్లు వినిపించెఁ దగన్॥ గీ॥ పార్థివేంద్ర యిట్లు భరతాత్మ
జుండైన।సుమతి ధర్మవర్తనమునఁ దిరుగ।నదియె చేరింగి కష్టులయిన పాషండులు। దనమతంబుమిగుల దలఁచి పొగడి॥ క॥ ధ
రణీవల్లభ నిన్నును।నిరతంబును బుద్ధదేవునిం గొలిచిన యా। తెఱఁగునఁ గొలిచెద మని భా।సురమతిబోధించిరపుడు సుమతిం
బ్రీతిన్॥ వ॥ ఇట్లు పాషండబోధితుండైన సుమతికి వృద్ధసేనయందు దేవతాజిత్తను పుత్త్రుండు జనించె వానికి దేవద్యుమ్నుం
డను సత్పుత్త్రుండాసురియందుదయించె నమ్మహాత్మునకు ధేనుమతియందుఁ బరమేష్ఠి జనియించె నతనికి సువర్చలయందుఁ
బ్రతీహుండను వాఁడు సుతుండయ్యె నప్పరమపురుషుండు సకలజనులకు బ్రహ్మోపదేశంబుఁ జేసి తాను శుద్ధాత్ముం
డై హరిస్మరణసేయుచు యజ్ఞకరణనిపుణులగు ప్రతిహర్త్ర ప్రస్తోత్ర ఉద్గాతయను సత్పుత్త్రులఁ గాంచె నా ప్రతిహర్తకు స్తు
తియందు వ్యోమభూమ యను పుత్త్రద్వయంబుత్పన్నంబయ్యె నందు భూమునకు ఋషికుల్యయందు నుద్గీథుండను సుతుండు జ
నించె నతనికి దేవకుల్యయందుఁ బ్రస్తోతగలిగె నా ప్రస్తోతకు వరత్సయందు విభుండను తనయుండుద్భవించె నతనికి రతియం
దుఁ బృథుషేణుండుదయించె నతనికి నాకూతియందు నక్తుండు గలిగె నా నక్తునకు రాజర్షి శ్రేష్ఠుండగు గయుఁ డను మహాకీర్తి
సంపన్నుండుదయించె॥ గీ॥ అట్టి గయుని వలన నఖిలజీవులఁ బ్రోవఁ।దలఁచి సాత్త్వికప్రధానమయిన।యట్టి నేను దాల్చి యాత్మ
తత్త్వజ్ఞానుఁ।డగుచు నుండె హరినిజాంశమనను॥ వ॥ ఇట్టి మహనీయ సుగుణాకరుండగు గయు॥గాథానువర్ణనంబు పురాత
ములగు మహాత్ముల చేనీతెలంగున నుతింపఁబడుచున్నది సావధానమనస్కుండవై యాలకింపు మని యిట్లనియె॥ సీ॥ ధర్మమా
ర్గంబున ధారుణిజనులను ప్రేమతోఁ బోషణ ప్రేషణోప।లాలన శాసనలక్షణాముల చేతఁ బోషింపుచును యజ్ఞములను య
జ్ఞ।పురుషు నీశ్వరుఁ జిత్తమున నిల్పి సేవించి స్వాంతమందున్న యీశ్వరుని గాంచి। యఖిలజీవతతికి నానందమొసఁగుచుని
రభిమానంబున ధరణి నేలె।సత్యమందు మిగుల సత్సేవయందును।ధర్మమందు యజ్ఞకర్మమందు।గయుఁడు వసుధలోనఁ గంజా
క్షుఁడే కాని।మానవుండు గాఁడు మానవేంద్ర॥ వ॥ అట్టి మహాపురుష సుగణగణపరిపూర్ణుండగు గయునికి దక్షుకన్యకలగు శ్ర
ద్ధా మైత్రి దయాదులు కనుయంతవచ్చి కోరికలొసఁగ నతని ప్రజలకు వసుంధర కామధేనువై పితుకవేదంబులు సకలకామం
బులనిచ్చుచుండ సంగరంబున భంగంబు నొందిన రాజులప్పనంబులొసంగ విప్రులు ధర్మంబొప్ప పాలుపంచియిడ నిరంతర
సోమపానంబును శ్రద్ధాదిశుద్ధభక్తియోగంబును గలిగి యొనర్చు యజ్ఞంబుల నింద్రాది దేవతలు తృప్తులయి యజ్ఞఫలం
బుల నొసంగ బ్రహ్మాదితృణగుల్మలతాంతంబుగా సకలలోకంబుల వారిని తృప్తింబొందింపుచు శ్రీహరిం దృప్తిం బొందఁజే
యుచు గయుండు పెక్కుకాలంబు రాజ్యంబు నేలె నట్టి గయునికి జయంతియందుఁ జైత్రరథ స్వాత్యవరోధనులను మువ్వురు
కొడుకులు పుట్టిరి యా చిత్రరథునికి నూర్ణయందు సామ్రాట్టు వానికి నుత్కళయందు మరీచి యా మేటికి బిందుమతియందు
బిందుమంతుండను వాఁడు నా బిందుమంతునకు సరఘయందు మధువు మధువునకు సుమనస్సను దానియందు వీరవ్రతుఁడా
వీరవ్రతునకు భోజయందు మన్యు ప్రమన్యువులను నిరువురందు మన్యువునకు సత్యయందు భువనుండు నతనికి దోషయందుఁ ద్వ
ష్టయు నా ద్వష్టకు విరోచనయందు విరజుండను వాఁడును జనించె నంత॥ క॥ ఆ విరజునకు దయించిరి।భూవినుత విషూచియందుఁ
బుత్త్రశతంబు।న్నావల నొక కన్యకయు।న్నా వేళ సమస్తజనులు హర్షంబందన్॥ క॥ ఘనుఁడు ప్రియవ్రతువంశం।బునకుం
దగయైన విరజభూవిభువంశం।బును దానలంకరించెను।పనుశీ మింద్రావరజుఁడైన విష్ణువిమాడ్కిన్॥ క॥ అని పలికిన శుకయోగిం।
గని గొని యభిమన్యుసుతుఁడు గడు మోదముతో।వనజదళాక్షుని మహిమలు।వినిసంతసమందియనియె వేడుక మఱియున్॥
వ॥ మునీంద్రా సూర్యరశ్మియందాఁకం బ్రవర్తిల్లు నక్షత్రయుక్తంబయిన చంద్రకిరణంబు లెంత నేరందిరుగు నంతదూరం
బు ప్రియవ్రతుని రథనేమి ఘట్టనలచేత సప్తద్వీపంబులును సప్తసముద్రంబులును నయ్యె నని పలికితివి వాద్వీపసముద్రంబుల ప
రిమాణంబులు సవిస్తరంబులుగా నెఱింగింపుము గుణమయంబును స్థూలరూపంబును నైన శ్రీహరిశరీరంబగు నీలోకంబు
నందు నిలిపిన చిత్తంబు గుణంబును సూక్ష్మంబు నాత్మజ్యోతియు బ్రహ్మంబు నైన వాసుదేవుని యందు నిల్చుం గావున ద్వీపవ
ర్షాదివిస్తారంబు వినుపింపు మనిన శుకయోగీంద్రుండిట్లనియె॥ క॥ ధరణీవల్లభ వినుము శ్రీహరిమాయాగుణవిభూతులగు జలనిధు

* బాదరాయణి।శుకుఁడు. § గాథ।చరిత్రము. ‡ ప్రేషణ।భృత్యాదులను పనులకు పంపుట. ¶ ఇంద్రావరజుండైన।ఇంద్రునకు తమ్ముఁడైన.

లు।న్బరగినదీవులువర్షము।లరయంగాఁగొలఁది వెట్టినలవియెజగతిన్॥గీ॥ తెలిసినంత నేను దెలిపెదసంక్షేప।మునను జిత్తగిం చివినుము దెలియ।ననుచుఁజెప్పఁదొడఁగెనభిమన్యసుతునకు।నింపుగానుశుకమునీంద్రు డిట్లు॥ వ॥నరేంద్రా జంబూద్వీపం

——శ్రీ శుకయోగివరుండుపదేశరూపముగాఁ దెలుపుభూగోళస్వరూపాదినిర్ణయము.శ్రీ——

బుభూపద్మంబునకుమధ్యప్రదేశంబునలక్షయోజనంబుల వెడల్పునంతియనిడుపునుం గలిగికమలపత్రంబునుంబోలెవ ర్తులాకారంబై నవసహస్రయోజనపరిమి*తాయామంబుగలనవవర్షంబులనష్టమర్యాదాగిరులునుంగలిగివిభక్తంబై యుండునందుమధ్యమవర్షంబిళావృతవర్షంబగునందుమధ్యమప్రదేశంబునసువర్ణమయంబయి॥ క॥భూపద్మమునకుమే రువు।నీపించుచుఁగర్ణికాకృతినిబెంపసుచుం।బ్రాపైకులగిరిరాజుఁగఁ।జూపట్టునుసురగణాళిచోద్యంబందన్॥సీ॥మఱియును వన్నెసుగిరిలక్షయోజనోన్నతమగుచుండియానడిమిదళము। విదితమైపదియాఱువేలయోజనములునంతియపాతునై యతిశయిల్లు।నామీఁదవిస్తారమరయ ముప్పదిరెండు వేలయోజనములవెలసియుండు।నాగిరికుత్తరంబందునీలశ్వేతశృం గపర్వతములునింగిముట్టి। యుండు రెండు వేలయోజనంబులదనుకఁ।బరపుగలిగిపూర్వపశ్చిమాయ।తంబుదక్షిణోత్తరం బునువిస్తార। మగుచుమిగులరమ్యమైన రేంద్ర॥వ॥ఇట్లుపూర్వపశ్చిమంబులులవణసాగరాంతంబులై యున్ననీలపా ర్వతంబులయందునీలశ్వేతశృంగవత్పర్వతంబులునిడివినియథాక్రమంబునదశమాంశన్యూనప్రమాణయోజనములుగ లవిగానుండువీనిమధ్యప్రదేశంబునరమ్యక, హిరణ్మయ,కురువర్షంబులను నామంబులుగలవర్షంబులుండువానివిస్తారం బులునవసహస్రయోజనంబులుగలిగిలవణసముద్రాంతంబులయిక్రమంబుననీలాదిపర్వతదీర్ఘపరిమాణంబులనుండుని ళావృతవర్షంబునకుదక్షిణంబుననిషధ,హేమకూట,హిమవత్పర్వతంబులను సీమాపర్వతంబులును బూర్వపశ్చిమంబు లునిడుపునుదక్షిణోత్తరంబులువిశాలంబునానీలాదిపర్వతములతీరుననుండునాగిరులమధ్యప్రదేశంబు నహరివర్షకింపు రుషవర్షభారతవర్షంబులను నామంబులుగలవర్షంబులుండునాయిళావృతవర్షంబునకుఁబశ్చిమంబునమాల్యవత్పర్వతం బుఁబూర్వభాగంబునగంధమాదనంబునుసీమాపర్వతంబులుపూర్వపశ్చిమంబులునిడుపునుదక్షిణోత్తరంబులువిశాలం బులునగుచునీలపర్వతనిషధపర్వతంబులంగదిసిద్విసహస్రయోజనంబుల విస్తారంబయియుండు మాల్యవత్పర్వతంబుప శ్చిమసముద్రాంతంబయి కేతుమాలవర్షంబునుగంధమాదనపర్వతంబునకుఁ బూర్వభాగంబునసముద్రాంతంబగుచు భద్రాశ్వవర్షంబును మేరువునకుందూర్పున మందరపర్వతంబుదక్షిణంబున మేరుమందరపర్వతంబులను పడమటిపా ర్శ్వంబులనుత్తరమునంగు ముదపర్వతంబులను నామంబులుగలిగియయుతయోజనోన్నతంబులయి మేరునగంబునుమ ధ్యోన్నతమేధిస్తంభంబునకుంజతుర్ముఖంబులహ్రస్వస్తంభంబులనుబోలియుండునాచతుస్తంభంబులయందునుబర్వ తశిఖరంబుల వెలుగొందుకేతువులునుంబోలెఁజూతజంబూకదంబ‡న్యగ్రోధంబులనువృక్షరాజంబులు క్రమంబుననొం డొంటికినేకాదశశతయోజనాయతంబునుశతయోజనవిస్తారంబునుగలిగియుండు మఱియు నాపర్వతశిఖరంబులఁగ్ర మంబునంబయోమధ్విక్షురసమృష్టజలంబులుగలిగిశతయోజనవిస్తారంబులయినసరోవరంబులు దేజరిల్లు నందుసుస్నా తులగువారలకుయోగైశ్వర్యంబులుస్వభావంబునంగలుగుమఱియునందనచైత్రరథవైభ్రాజికసర్వతోభద్రంబులను నామంబులుగలదేవోద్యానంబులుపర్వతశిఖరంబులవెలుగొందుచుండునందుదేవతాగణంబులుదేవాంగనలంగూడిగం ధర్వులగీతనృత్యంబులుగనుంగొనుచువిహరింతురంత॥ఉ॥మందరపర్వతంబుతుదిమామిడిపండ్లమృతోపమానమై। మంద రశైలశృంగసుసమానములై గిరిమీఁదనట్టిమా।కందఫలామృతంబుగలగంబడిజారిమహాప్రవాహమై। యందరుణోద నామముననద్భుతమైవిలసిల్లు నెంతయున్॥ చ॥కడుమధురంబునన్సురభిగంధముచేనరుణప్రకాశత।న్వడిఁగొనిమందరా చలమువంతలఁజెంతలజారియంతలోఁ। §దొడితొడినానిళావృతముఁద్రోచుచువింతగఁబూర్వవాహియై । నడుచుఁద రంగసంతతులనందరినచ్చటఁజేయుధన్యులన్॥గీ॥ఆనదీజలంబులానినయచ్చటి।యంబికానుచరులయంగగంధ।మందిపవ నుఁడంతమను జేశపదియోజ।నములుసుట్టుపరిమళములనింపు॥గీ॥ మేరుమందరాద్రిమీఁదజంబూఫలం। బులుమహాగజో పములుగ వ్రాలియవిసియంతత్రసామృతంబల్లన।యమ్మహానగంబునందుఁబొడమి॥క॥అనుపమమగుజంబూనది। య ను పేరను వెలసిలీలనరుగుచునంత।ఘునతనిళావృతవర్షము।పనుపడఁదమపుచునుధరణిఁ బ్రవహించుఁదగన్॥ఉ॥ ఆనదీ టఁదోగిపకనై యటుమృత్తనిలార్కసంగతిన్।బూనికడున్విపాకమునఁబొందుచుశుద్ధసువర్ణజాతిజాం । బూనదనామ మొందిసురముఖ్యులకెల్లను భూషణార్హమై।మానుగవన్నెమించికడుమందిదివ్యమైవిలసిల్లు నెంతయున్॥వ॥మఱియుసుపా

*ఆయామంబు।నిడివి. †సీమ।పొలిమేర-హద్దు. ‡న్యగ్రోధ।మఱ్ఱిచెట్టు. §తొడితొడిన్।అతివేగముగ. ద్రోచుచున్।తడుపుచు.

ర్ణ్వనగాగ్రంబునందుఁ బంచవ్యాసపరీణాహబంధురంబులగు నైదుమధుధారాప్రవాహంబులు పంచముఖంబుల వెడలిసుపార్శ్వనగశృంగంబులం బడియిళావృతవర్షంబు పశ్చిమభాగంబుఁ దడుపుచుం బ్రవహించు నా తేనియ ననుభవించు వారలముఖమారుతసుగంధంబు శతయోజనపర్యంతంబు పరిమళించు॥ సీ॥ కుముదపర్వతశిఖాగ్రమున నుత్పన్నమైకనుపట్టువటతరుస్కంధముధ్య|ను దయించు నట్టిపయోదధిఘృతమధుగుడవిశిష్టాన్నంబు లధికమయిన|యంబరశయ్యాసనాభరణాదివస్తువులు గోరి కెలుదీర్చుచును గుముద|పర్వతాగ్రంబునఁ బడియిళావృతవర్షమునిజనులకు నెల్లభోగ్యములను| వడలకొనఁగువారి*వళిపలితంబులు| దొలఁగుదుష్టగంధములును బాయు| మరణభయము మొదిమి వొరయదెన్నఁడును శీ|తోష్ణబాధఁ జెందకుందురధిప॥ గీ॥ దేవదానవులును దివ్యమునీంద్రగం|ధర్వులాదిగాఁగఁ దగిలి యాశ్ర| యించియుందు రాగిరీంద్రమూలమునందు| హర్షమందిఘునవిహారలీల॥ వ॥ నరేంద్రా మేరునగేంద్రంబునకుఁ బూర్వభాగంబున జఠరదేవకూటంబులుపశ్చిమంబున సంబవనపారియాత్రలునను పర్వతంబులు నాలుగు దక్షిణోత్తరంబులొండొంటికి నష్టాదశసహస్రయోజనంబులనిడుపును, బూర్వపశ్చిమంబులు ద్విసహస్రయోజనంబుల వెడల్పును, దక్షిణంబునఁ గైలాసకరవీరంబులు, నుత్తరంబునఁ ద్రిశృంగమకరంబులను నామంబులు గల దక్షిణోత్తరంబుల పర్వతంబులు నాలుగును బూర్వపశ్చిమంబుల నష్టాదశసహస్రయోజనంబుల నిడుపును, దక్షిణోత్తరంబుల ద్విసహస్రయోజనంబుల వెడల్పుగుచు నగ్నిపురుషునకుం బ్రదక్షిణంబగుచున్న †పరిస్తరణలచందంబున మేరువునకుం బ్రదక్షిణంబుగా నష్టనగంబులు నిలిచియుండు మేరుశిఖరంబున దశసహస్రయోజనంబుల నిడుపునంతియ విస్తారంబునగుచు సువర్ణమయంబైన బ్రహ్మపురంబు దేజరిల్లుచుండు నాపట్టణంబునకు నష్టదిక్పాలయందును లోకపాలురపురంబు లుండు॥ క॥ పరమేష్ఠిపట్టణంబున|హరి మున్ను త్రివిక్రమణములందన్నర్వో|శ్వరచరణాగ్రనఖాహతిఁ|బరువడి నూర్ధ్వాండమంతఁ బగిలెన రేంద్రా॥ వ॥ ఇట్లు చరణనఖస్పర్శం జేసి భేదింపంబడ్డయూర్ధ్వకటాహవివరంబువలన నంతఃప్రవేశంబు సేయుచున్న బాహ్యజలధార శ్రీహరిపాదస్పర్శం జేయుచుం జను దెంచి సకలలోకజనంబుల దురితంబులు వాపుచు భగవత్పాదియను పేరం దేజరిల్లుచు దీర్ఘకాలంబు స్వర్గంబున విహరించుచు విష్ణుపదంబున నుత్తానపాదపుత్రుండును బరమభాగవతుండు నయిన ధ్రువుండు తనకులదేవతయైన శ్రీహరిపాదోదకంబుఁ బ్రతిదినంబును భక్తియోగంబున నిమీలితనేత్రుండై యానందబాష్పంబుల రోమాంచితగాత్రుండై యత్యాదరంబున నేఁడును శిరంబున ధరియించుచున్నవాఁడతనికి నధోభాగంబున నుండు మండలాధిపతులైన సప్తర్షులును హరిపాదోదకప్రభావంబు నెఱింగి తాము నొండు తపస్సిద్ధియాకాశగంగాజలంబుల స్నాతులగుటయే యని సర్వభూతాంతర్యామియగు నీశ్వరునియందు భక్తి సలిపియితరపదార్థాపేక్ష సేయక మోక్షార్థిముక్తిమార్గంబు బహుమానంబు సేయు తెఱంగున బహుమానయుక్తంబుగాఁ దమజటాజూటంబులయందు నేఁడును ధరించుచుండుదురు॥ సీ॥ అంతనసంఖ్యంబులైన దివ్యవిమానసంకులంబులను విశాలమైన|దేవమార్గంబున దిగివచ్చి చంద్రమండలముఁ దోఁచుచు మేరునగశిఖాగ్ర|మునను నా బ్రహ్మదేవుని పట్టణమునకు వచ్చి యందుల చతుర్ద్వారములను|వరుసతో దీర్ఘప్రవాహంబులగుచును బ్రవహించియమల ప్రభావములను|నరుగు లవణసాగరాంతంబులుగ నాల్గు| మోములందు నాల్గు నామములను| తన్నుఁ గన్నవారి తనవారిఁ దోఁగిన| వారికెల్ల నమృతవారియగుచు॥ వ॥ ఇట్లు సితయను పేర వినుతి నొందిన యమ్మహానదీప్రవాహంబు బ్రహ్మసదన పూర్వద్వారంబున వెడలి కేసరావలయంబుఁ దడుపుచు గంధమాదనాద్రికింజని భద్రాశ్వవర్షంబుం బావనంబు సేయుచుఁ బూర్వలవణసాగరంబునం బ్రవేశించుఁ జక్షువను పేరఁ దేజరిల్లెడు దీర్ఘప్రవాహంబు పశ్చిమద్వారంబున వెడలి మాల్యవత్పర్వతంబునం బడి కేతుమాలవర్షంబుఁ బవిత్రంబు సేయుచుఁ బశ్చిమలవణార్ణవంబునం గలయు భద్రయను పేర వెలుఁగొందిన యతుల ప్రవాహంబుత్తరద్వారంబున వెడలి కుముదనీలశ్వేతాఖ్యపర్వతశిఖరంబులం గ్రమంబునఁ బ్రవహించుచు శృంగనగంబునకుం జని మానసోత్తరంబులగు కురుభూములఁ బవిత్రంబు సేయుచు నుత్తరలవణసాగరంబుఁ జేరు-నలకనందయను ప్రఖ్యాతిఁ గాంచిన యమ్మహానదీప్రవాహంబు బ్రహ్మసదన దక్షిణద్వారంబున వెడలి యత్యంతదుర్గమంబులైన భూధరంబులఁ గడచి హేమకూటహిమకూటనగంబుల నుత్తరించి యతివేగంబునఁ గర్మక్షేత్రంబగు భారతవర్షంబుఁ బావనంబు సేయుచు దక్షిణలవణాంబుధిం గలయు నంత॥ సీ॥ జగతిలో మేరువాదిగఁ బర్వతములకుఁ బుత్రికలైనట్టి పుణ్యతీర్థ| ములు వేలసంఖ్యలు గలవు జంబూద్వీపమందు భారతవర్షమరయఁ గర్మ| భూమిఁ దక్కినవర్షముల దివంబుననుండి భువికి వచ్చినవారు పుణ్యశేష| ములు భుజింపనునంద్రు భూస్వర్గమనఁదగు నా వర్షమునను నుండునట్టి వార| లయుతసంఖ్యవత్సరాయువులయుతమా| తంగబలులు దేవతా

---

* వళితపలితంబులు॥ వళిత|శరీరము ముడతలుపడుట, పలిత|తల నెఱయుట. † పరిస్తరణంబులు|అగ్ని చుట్టునుండు దర్భలు.

సమానులతులవజ్రదేహులధికప్రమోదితులప్రమత్తులార్యులనఘులధిప॥ వ॥మఱియుసురతసుఖానందంబున మోహంబునైనంగైకొనకసకృత్ప్రసూతులగుచుననవరతంబును త్రేతాయుగకాలంబుగలిగి ప్రవర్తింతురీయష్టవర్షంబులయందు దేవతాగణంబులుతమభృత్యవర్గంబులత్యుపచారంబులు సేయుచుండ నెల్లఋతువులయందుంగిసలయకుసుమఫలభరితంబులయినలతామలశోభితంబులగువనంబులుగలవర్షనిధిగిరిద్రోణులయందుఁగమలామోదితంబులగు రాజహంసకలహంసలుగలసరోవరంబులయందును జలకుక్కుటకారండవసారసవినోదంబులుగలిగి మత్తాళి ఝుంకృతిమనోహరంబులైనానావిధంబులయిన కొలంకులయందు దేవాంగనలకామోద్రేకజంబులయినవిలాసహాసలీలావిలోకనంబులందివియంబడినమనోవృష్టిగలదేవగణంబులువిచిత్రవినోదంబులుగలిగియిచ్ఛావిహారంబులుసలుపుచుండుదురు॥ క॥ఈ నవవర్షంబులయం। దానారాయణుఁడువచ్చియనవరతముఁలో। కానుగ్రహమునకైను। జ్ఞానంబీవలఁదిలీలఁజరియింపుఁదగఁ॥ సీ॥ వసుధనిళావృతవర్షాధిపతియైనపురహరుండావర్షమునవనంబు। నందునుండుటకునాయంబికాశాపవశంబుననావనస్థలమునందు। నెవ్వరువచ్చిననింతులైయుందురావననుండుపార్వతియనుదినంబు।నంగనాజనసహస్రార్బుదంబులతోడనసమలోచనుగొల్చునతులభక్తి॥*నట్టిశివునిగోరియాయిళావృతవర్ష। మునఁజరించుజనులుమోదముననునుగదిసితత్ప్రకాశకములైనమంత్రతం। త్రములఁబూజఁజేసితలఁతు రెపుడు॥ క॥ భద్రాశ్వవర్షమందులభద్రశ్రవుఁడనెడి పేరఁబరగుచుదపనీ। యాద్రిసమధైర్యుఁడగుచున।ముద్రాంతంబైనజగతిఁబొలుపుగనేలుఁ॥క॥ఆనరవరునకుఁబ్రియతముఁడైనహయగ్రీవమూర్తిననవరతంబుఁ। ధ్యానస్తోత్రజపానుష్ఠానాదులఁబూజఁజేసెసజ్జనులంతఁ॥గీ॥తత్ప్రకాశకృత్ప్రధానమంత్రార్థసం। సిద్ధిఁజేసిముక్తిఁజెందిరప్పు।డట్టివర్షమందునాహయగ్రీవునిఁ।దలఁచికొలిచిమిగులధన్యులగుచు॥సీ॥హరివర్షపతియైననరహరినినిశంబునందున్నజనులుమహాత్ములయిన। దైత్యదానవకులోత్తములుప్రహ్లాదాదిపెద్దలుగూడిసంప్రీతితోడ।సుస్నాతులయిభక్తిఁజూచుచునుందురురవ్యధకూలాంబరములుదాల్చి। తత్ప్రకాశకమంత్రతంత్రజపస్తోత్రపాఠకధ్యానతపఃప్రధాన। మయినసత్పూజలనుజేసియచలబుద్ధి। శ్రీనృసింహునిఁజేరిపూజింతురియతనిక।రుణనెంచుచునతులప్రకాశులగుచు। భుక్తిముక్తులఁగైకొంద్రుభూపవర్య॥వ॥మఱియు కేతుమాలవర్షంబునందుభగవంతుండుశ్రీదేవికిసంతోషంబునొసఁగుటకుఁగామదేవరూపంబుననుండు నమ్మహాపురుషునియస్త్రతేజఃప్రకాశంబునఁబ్రజాపతిదుహితలగురాత్ర్యధిదేవతలగర్భంబులుసంవత్సరాంతంబుననిర్జీవంబులైస్రవించునాకామదేవుండునుదనగతివిలాసలీలావలోకనసుందరభ్రూమండలసుభగవదనారవిందకాంతులంజేసిశ్రీరమాదేవినిరమింపంజేయుభగవన్మాయారూపిణియగుశ్రీదేవియుఁబ్రజాపతిపుత్రికలునుబుత్రులునైనరాత్రింబగళ్లంగూడి కామదేవస్తోత్రపాఠకపూజాధ్యానాదులంబూజించుచుండునంత॥ క॥విమలమతిఁజిత్తగింపుము।రమణీయంబైనవిమలరమ్యకమనువర్షమునకునధిదైవతదా।నమరంగామత్స్యరూపమగుహరిదలఁపఁ॥గీ॥అట్టివర్షమునకునధిపతియగుచున్న।మనువుపుత్రపౌత్రమంత్రివరులఁగూడిమత్స్యమైనకుంభినీధరుచిత్త।మతులభక్తియుక్తిహత్తుకొలుపు॥గీ॥ తత్ప్రకాశకృత్ప్రధానమంత్రస్తోత్ర।ములనుధర్మకర్మములనుహోమ। ములనుజనులుసేసిపుణ్యులైభుక్తి। ముక్తులనుబొందుచుందురెలమితోడ॥ క॥ వినుమహిరణ్మయవర్షం।బునకుంగూర్మావతారమునుదాల్చినయా।వనజోదరుఁడధిదేవత।యనఘుఁడుపితృపతిమహాత్ముఁడర్యముఁడున్నృపా॥క॥ఆవర్షమందునర్యముఁ। డావర్షజనంబుగూడిహరిఁజిత్తములో।భావింపసంస్తవంబులు।గావించుచుగాంతురతనికైవల్యంబుఁ॥క॥అరయఁగసీతాలక్ష్మణ। పరివృతుఁడైవచ్చి రామభద్రుఁడుగడిమిం। బరగనధిదేవతగుకిం।పురుషమహావర్షమునకుభూపవరేణ్యా॥ గీ॥ అట్టిరామభద్రునంజనీసుతుఁడుకిం।పురుషగణముఁగూడిపూజఁజేసి। తత్ప్రకాశకప్రధానమంత్రస్తోత్ర।పఠనములనుదగనుపాస్తిఁజేయు॥ సీ॥భారతవర్షాధిపతియైనబదరికాశ్రమముననున్ననారాయణుండు।భూనాథయామహాత్ముని నారదాదులుభారతవర్షంబుప్రజలుప్రేమఁ।బాయకచేరియుపాస్తిఁజేయుచుసాంఖ్యయోగంబునుపదేశముచితవృత్తి। నందియందఱునుగృతార్థులై యట్టినారాయణదేవునారాధనంబు।చేసియాత్మఁజాలఁజింతించితత్ప్రకా। శకములయినమంత్రసంస్తవములఁ। బూజఁజేసిముక్తిఁబొందుచునుందురు। రచలమైనభక్తినసుదినంబు॥క॥భారతవర్షమునందుల।సారాంశములైనపుణ్యశైలంబులుగం।భీరప్రవాహములుగల।వారయనెఱిఁగింతువానినవనీనాథా॥వ॥మలయపర్వతమును,మంగళప్రస్థమును,మైనాకంబును,త్రికూటంబును,ఋషభపర్వతంబును, గూటర

* ఈఘట్టముమొదలుకొని ఆయావర్షములయందువర్షాధిదేవతలనారాధించెడువారలుపాసించుమంత్రంబుల నాంధ్రమునందు వదిలియున్నదిగానవాటినిసంస్కృతభాగవతమునందుఁజూచితెలుసుకొనవలయును.

లసూయ్యం। డసునుగఁ బెనుసుంచుపింఛసుడఁచినభంగిన్ ॥ క ॥ దంతిపురనాథవినుమొక। *మంతనమెఱిఁగింతు శమదమంబులు శీనం †బాపావంతుశుభవంతుఁ జేయవు। ‡కంతునిగురుభక్తిముక్తిగలిగించుగతిన్ ॥ సీ॥ హరికినర్థముఁ బ్రాణమర్పితంబుగనుంచువానికైవల్య మెవ్వనికి లేదు। వనజలోచనుభక్తవరుల సేవించినవానికైవల్య మెవ్వనికి లేదు। వైకుంఠనిర్మలవ్రతపరుండైనట్టివానికైవల్య మెవ్వనికి లేదు। సరసిజోదరుకథాశ్రవణలోలుండైనవానికైవల్య మెవ్వనికి లేదు। లేదు తపముల బ్రహ్మచర్యాదినియతి। శమదమాముల సత్యశౌచముల దాన। ధర్మసుఖముల సుస్థిరస్థానమైన। వైష్ణవజ్ఞానజనితనిర్వాణపదము॥ గీ॥ అరయనెన్నఁడుఁ జేటులేనట్టిముక్తి। వర్మ మీలోకమందు నెవ్వనికిఁ గలదు। సాధులును బుణ్యశీలురుసజ్జనులును। హరిపరాయణతత్పరులగుటఁ గాక॥ క॥ అనుమగనరహరిభక్తిం। బొరయనియాపురుషుసుకృతపుంజంబులు వే। మఱఁ బుణ్యుఁ జేయ నేరవు। నరవరమధుఘటముఁ బెక్కునదులుం బోలెన్॥ చ॥ సతతముఁ గృష్ణపాదజలజంబులయందుమనంబు నిల్పునం। ప్రతులుఁ దదీయశుద్ధగుణరాగులుఁ గాలునియుగ్రపాశసం। హతులధరించుతత్సుభటవర్గములం గలలోనఁ గానరే। గతులనుమస్తకర్మములు గైకొనివారలఁ జెందనేర్చునే॥ వ॥ కావున నీయర్థంబునకుం బురాతనంబగు నొక్కయ్యి

## ⇒ శ్రీ అజామీళోపాఖ్యానము. శ్రీ ⇐

తిహాసంబు గలదది విష్ణుదూతయమదూతసంవాదంబనం బడు దాని నెఱింగింతు నాకర్ణింపుము॥ సీ॥ నరనాథ వినుము కన్యాకుబ్జపురమునఁ గలఁడు బ్రాహ్మణుఁ డజామీళుఁ డనఁగ। పాతకుండతులనిర్భాగ్యుండవజ్ఞుండు నష్టసదాచారకష్టరతుఁడు। జూదంబులందు దుర్వాదంబులందును జౌర్యంబునందు మచ్చరముగలిగి। ‡తొత్తాత్మపత్నిగా మత్తుఁడై వరియించి కొడుకులఁ బదుగురఁ బడసి చాల। మోహజలధిలోన మునిఁగి ముచ్చటఁ దీఱ। బాలలాలనాదిలీలఁ దగిలి। పెద్దగాల మతఁడు పెంపారసుఖియించి। ఫలితమెల్ల వదలి పతితుఁ డయ్యె॥ సీ॥ నిర్మలంబనఁ జాల నెఱయు చిత్తంబున నల్లని వెండ్రుకలెల్ల నయ్యెఁ। దగుమోహపాశబంధంబు జాఱినమాడ్కిఁ §పొదలిన యంగంబు వదలవ్రాలె। నింద్రియంబులకోర్కెలిక నెల్లనను భంగి నుడుగక తలచాలవడఁకఁ జొచ్చెఁ। దమకంబు ప్రాయంబుఁ దగిలిపోయిన మాడ్కిఁ లోచనంబుల చూడ్కి నీచమయ్యె। వగరుపుట్టినంతఁ బెకలె దంతంబులు। నుక్కసయును దగ్గు పిక్కటిల్లె। శిరసు నెవ్వఁ దోడఁ గెఁ జెదరెను నంబంతఁ। గడిదియైన ముప్పుకాలమునను॥ గీ॥ ఎనయ నతని కెనుబదెనిమిదివర్షంబులంతనరుగుటయును భ్రాంతుఁ డగుచుఁ। గోరి పిన్నకొడుకు నారాయణాఖ్యుండు। బాలుఁ డగుట మిగుల భక్తిఁ జేసి॥ క॥ తనసతియుఁ దానుఁ గూరిమి। మనమునఁ బెనఁగొనఁగ నక్కుమారుని ననిశంబును ముద్దు సేయుచుండెను। జనవర వాత్సల్యమాత్మ సందడిగొనఁగన్॥ క॥ బాలునిఁ గల భాషణ జన। పాలుని నిజజనక బంధుపరిణామకళా। శీలుని లోలతఁ గనుఁగొని। ‖యాలరి బ్రాహ్మణుఁడు నంది తాత్ముండగుచున్॥ క॥ అత్యంతపానభోజనకృత్యంబులఁ బొత్తు గలిగి క్రీడలఁ దత్సాం। గత్యంబు వదలకాగత। మృత్యువుఁ గన నేరఁ డయ్యె మిక్కిలి జడుఁడై॥ గీ॥ తెలియక కీర్తినతఁడు వర్తించుచుండ। భయదమగు మృత్యుకాలంబు ప్రాప్తమయిన। భూరివాత్సల్యవృత్తి నప్పుత్త్రుఁ దలఁచి। యాత్మఁ ¶ప్రలపించె నారాయణాయటంచు॥ అప్పుడు॥ క॥ కింకరుల ధర్మరాజవ। శంకరుల దురంతదురితసమధిక జననా। శంకరుల సకలలోకభ। యంకరులం గనియె నింద్రియాకులుఁ డగుచున్॥ క॥ ఘాతుకుల దండదండిత। పాతకుల నుపాగ్రకర్మభరనిష్ఠురుణా। జాతకులఁ బ్రేతనాయక। దూతక సంతతుల నతఁడు దూరమునందున్॥ మ॥ కనియెన్ బ్రాహ్మణుఁ డంత్యకాలమునవీక్షారోషనిష్ఠ్యూతలన్। ఘనపీనోష్ఠవికారవక్త్రవిలసద్దర్శ్వేక్షణోపేతులన్। జనసంత్రాసకరోద్యతాయతసుపాశశ్రేణికాపాతులన్। హననవ్యాప్తిపిభీతులన్ స్మృదుర ¶నాత్మానేతలన్ దూతలన్॥ వ॥ ఇట్లతివిశ్రుతతుండగండభాగవిభాగవిషమవివృత్తనేత్రులును అతిపుష్టనిష్ఠురతనుయష్టిసంవేష్టితమహోర్ధ్వరోములును అభ్యస్తసమస్తజీవాపహరణకరణప్రశస్తహస్తవిన్యస్తపాశధారులునగు యమభటుల మువ్వురం గనుంగొని యజామీళుండు వికలేంద్రియుండును వికంపితప్రాణుండును వికృతలోచనుండును విహ్వలాత్ముండునై॥ క॥ దూరమున నాడు బాలుఁడు। ఘోరనఁదనచిత్తసీమఁ బొడఁగట్టిననో। నారాయణ నారాయణ। నారాయణ యనుచు నాత్మనందను నెడివెన్॥ చ॥ మరణపువేళ సద్గుణజనార్దనుసంస్మరణంబు సేయఁ దత్పరిసరవర్తులాత్మపరిపాలకు నామము నాలకించిరి। త్వరగతినేగుదెంచి సొడఁ జూపియదల్చిరి కాలుదాసులన్। ఘనతరభాషులన్ వికటకల్పితవేషుల దీర్ఘరోషులన్॥ క॥ దాసీభర్తన జామిళ। భూసురుఁ దత్తనువు వలన భోరు

---

* మంతనము। రహస్యము. † అంహోవంతులన్। పాపముగలవాని. ‡ కంతునిగురుభక్తి। మన్మథునకు తండ్రియైనవిష్ణుభక్తి. § సంహతి। సమూహము, ‡ తొత్తాత్మపత్నిగాన్। దాసినిభార్యనుగా, § పొదలిన। వృద్ధిఁబొందిన-బలిసిన, తమకంబు। వలపు-మోహము, ఉక్కసము। ముట్టుట. ముప్పుకాలమునన్। ముసలితనమునందు. ‖ ఆలరి। స్వేచ్ఛాప్రవర్తనములుగల. ¶ ప్రలపించెన్। వాపోయెను. ¶ ఆత్మానేతలన్। జీవులఁగొనిపోవుచున్నవారైన,

నవెలికిం। దీసుయమభటులఁజారఁ ౹ ద్రో॥ సిరి శ్రీవరునికూర్మిదూతలు కడిమిన్॥ వ॥ ఇట్లు విష్ణుదూతలవలన నిర్ధూత ప్రయ

## విష్ణుదూతయమదూతలసంవాదము.

త్నులై యమదూతలిట్లనిరి॥ క॥ ఎవ్వని వారలు మీరో। *జివ్వకుఁ గత మేమి యిట్లు చిక్కినవానిం। గ్రొవ్వున విడిపించితిరిఁ
క। నవ్వులకో యమునిశాసనంబులు జగతిన్॥ సీ॥ ఎవ్వరు మీరయ్య యీ భవ్యరూపములు గన్నులకద్భుత క్రమము నెరపె। దివిజు
లో భువిజులో దేవతాప్రవరులో సిద్ధులో సాధ్యులో చెప్పరయ్య ౹ దళితపాండురపద్మదళదీర్ఘనేత్రులు వరపీతకౌశేయ
వాసులరయ। గండమండలనటత్కుండలీయుతులును బటుకిరీటప్రభాభాసితులును। భూరిపుష్కరమాలికాహారవత్సులు। ల
మితకోమలనవయౌవనాధికులును। బాహుకేయూరమణిగణభ్రాజమాన। ఘనచతుర్భుజులభ్రసంకాశరుచులు॥ క॥ ధను
వులు §నిషంగచయములు। కనదంబుజశంఖచక్రఖడ్గగదాసా। ధనములు ధరియించితిమీ। తనువులు లోకములకద్భుతంబొ
నరించెన్॥ క॥ శాంతంబులయ్యెను మీ తను। కాంతులు జగములను దిశలఁ గలిగిన బహుళ। ధ్వాంతములఁ బారఁదోలుచు। సంతస
మొనరించె నిపుడు సర్వంకషమై॥ వ॥ ఇట్లఖిలలోకానందకర¶క్రమాకారులు నఖిలవిభ్రాజమాన తేజోదుర్నిరీక్ష్యమాణు
లును నిఖిలధర్మపాలురును నగు మీరు ధర్మపరిపాలుర మమ్ము నడ్డపెట్టం గతంబేమి యనినఁ దారు ధర్మరాజానుచరులు గారను
తలంపున నమందస్మితకందళితముఖారవిందులై గోవిందునికందువమందిరంపు కావలివారలు వారివాహగంభీరనిర్ఘోషపరి
పోషణంబులైన విశేషభాషణంబుల నిట్లనిరి॥ ఉ॥ మీరుపరేతనాయకుని మేలిమిదూతల లేనిఁ బల్కఁడా। తోరపుపుణ్యులక్షు
ణము దుష్కృతభావము దండకృత్యముల్। బీరముతోడ నాతనికభీష్టనివాసముఁ బూని దండ్యులె। వ్వారలు సర్వభూతము
లో వారక కొందఱు పాపకర్ములో॥ అనిన యమభటులిట్లనిరి॥ క॥ వేదప్రణిహిత మేయను। మోదంబుగ ధర్మమను వ్యోమ
న్నతదన్యం। బేదియగు నదియధర్మం। బాదియు హరిరూపు వేదమని వినుకతనన్॥ సీ॥ ఎవ్వని చేఁదనయిర వొంచు త్రిగుణస్వ
భావమైనట్టి యీ ప్రాణిచయము। లను గుణనామక్రియారూపముల చేత నేర్పడుఁ గతిదాన నెఱుఁగఁబడును। నర్యముండన
లంబు నాకాశమును ✡ప్రభంజనుఁడు గోచయమును శశధరుండు। సంధ్యలు దివములు శర్వరీచయములు కాలాంబువసుమతీ
జాలములును। దేహధారికి సాక్షులై తెలుపుచుండు దండనస్థానవిధము సద్ధర్మగతియుఁ। దగుల మీరి క్రమానురోధనముఁ జే
సి। యఖిలకర్ములు దండార్హులరయ నెపుడు॥ గీ॥ కోరికర్మంబు నడపెడు వారికెల్లఁ। గలితశుభములు నశుభములు గలుగుచుం
డు। నరయఁగా దేహి గుణసంగియైన యపుడె। పూనికర్మంబు సేయక మానరాదు॥ క॥ ప్రకృతము నందాననర్చిన। సుకృత
ము దుష్కృతము నెంతఁ జూడఁగ నంతే। వికృతిఁ గని యనుభవించు। న్నకృతమతిన్ దత్ఫలంబున నతినిపుణుండై॥ వ॥ మఱియు
వినుండు జన్మంబు శాంతఘోరమూఢగుణంబుల చేతనైనను సుఖదుఃఖగుణంబుల చేతనైనను ధార్మికాదిగుణంబుల చేతనై
నను సకలభూతంబులు త్రైవిధ్యంబు నేప్రకారంబున బొందు నాప్రకారంబున జన్మాంతరంబునం బొందుచుండు దేవుం
డైన యముండు సర్వజీవాంతర్యామియై ధర్మాధర్మయుక్తంబైన పూర్వరూపంబుల విశేషరూపంబుల చేతం జూచుచుండి
వానికనురూపంబులఁ జింతించుచుండును విద్యోపాధి జీవుండు తమోగుణయుక్తుండై ప్రాచీనకర్మంబుల చేత నేర్పడిన వర్త
మానదేహంబు నేననితలంచుచుండి నష్టజన్మస్మృతిగలవాఁడై పూర్వాపరంబు లెఱుంగం జాలకుండు మఱియుఁ గర్మేంద్రి
యంబుల చేతఁ గర్మంబులఁ జేయుచుండి జ్ఞానేంద్రియంబుల చేతఁ దమోవిషయంబులైన శబ్దస్పర్శరూపరసగంధంబుల నె
ఱుంగుచుండి పదియాఱవదియైన మనంబుతోఁ గూడి పదియేడవవాఁడగుచుండి షోడశోపాధ్యంతర్గతుండయి యొక్కరుం
డైన జీవుండు సర్వేంద్రియవిషయప్రతిసంధానంబుకొఱకు జ్ఞానేంద్రియకర్మేంద్రియమనోవిషయంబులం బొందుచుం
డి షోడశకళలుగలిగి లింగశరీరంబనం బరగి గుణత్రయకార్యంబను నిమిత్తంబున హర్షశోకభయంబుల నిచ్చుచున్న సంసా
రంబు ధరియించుచుండు విజితషడ్వర్గుండైన దేహి కర్మంబులొల్లనిబుద్ధి నెఱింగియు వీనికర్మంబులు సేయుచుండి తనసంచా
రకర్మంబున జుట్టుకొన్న పసిరికాయపురువునుంబోలె నిర్గమోపాయంబెఱుంగక నాశంబునొందుచుండు వర్తమానవ
సంతాదికాలంబు భూతభావివసంతకాలయోగ్యంబైన పుష్పఫలాదులు తత్తజ్జ్ఞాపకంబు లెట్లు సేయునట్లు భూతభావిజ
న్మంబులకు ధర్మాధర్మంబులు నిదర్శనంబులు సేయుచుండు నెక్కనరుండు నొకక్షణంబును గర్మంబుఁ జేయకుండువాఁడు
లేఁడు పూర్వసంస్కారంబులం గలగుణంబుల చేతఁ బురుషుండు వశుండు గావున బలిమిఁ గర్మంబు సేయింపంబడుచుండు నవ్య
క్తనిమిత్తంబు నొందితదనురూపంబులై నస్థూలసూక్ష్మశరీరంబులు మాతాపితృసదృశంబులగుచుండు నిట్టివిపర్యయంబు

---

*చివ్వకుఁ గత మేమి। కలహమునకు నిమిత్తమేమి. జముని శాసనంబులు। యముని ఆజ్ఞలు. ‡పుష్కర।పద్మము. §నిషంగచయములు। అమ్ము
లపొదులు. ¶క్రమ।మనోహరములైన. †అర్యముఁడు। సూర్యుఁడు. ✡ప్రభంజనుఁడు। వాయుదేవుఁడు. శశధరుఁడు। చంద్రుఁడు.

పురుషునికిఁ బ్రకృతిసంగమంబునంగలుగుచుండు నా ప్రకృతిపురాణపురుషుండైనయప్పరమేశ్వరుని సేవించినఁదలంగు చుండు॥సీ॥ కావుననితఁడు సత్కర్మవర్తనమున భూదేవకులమునఁబుట్టినాఁడు। దాంతుఁడై శాంతుఁడై ధర్మసంశీలుఁడై సకలవేదంబులఁజదివినాఁడు। ననయంబుగురువులనతిథులఁబెద్దలఁజేరిశుశ్రూషలఁజేసినాఁడు। సర్వభూతములకుసను బుద్ధియైచాలబహుమంత్రసిద్ధులఁబడసినాఁడు।సత్యభాషణనియమంబుజరిపినాఁడు।నిత్యనైమిత్తికాదులనెఱపినాఁడు। దండిలోభాదిగుణములఁదరిమినాఁడు।మంచిగుణములుదనయందుమఱపినాఁడు॥క॥ సతతాచారసమంచిత।మతియైసుజ్ఞానమునకుమఱిగెడుతఱినా। యతగతినాతనికంగజ।మతమైనవయోవనాగమంబెడసొచ్చెన్॥సీ॥కడకంటయావనగర్వం బువోడగట్టెమదిలోననుద్రేకమదముదోట్టెఁ।గడుమేనఁగామవికారంబుదలసూపెముఖమునఁజిఱునవ్వు మొలకలెత్తె నతిపుష్టినిష్ఠురంబయ్యెదేహంబెల్లఁగచభారమున నెఱిఁగప్పుమెఱసెఁ।గటిభారముననూరుకాండముల్ జిగిమీఱెబాహు శాఖలుదీర్ఘభంగిఁదోఁచె।నురమువిపులమయ్యెనుల్లసద్వరకాంతి।పూరమంగకమునఁబొందుపడియె।భూరితేజుఁడయిన భూసురాన్వయునకు।నభినవీనయావనాగమమున॥క॥హృదయమునఁబొడముయావన। మదము వెలిందోఁచుభంగిమాని తరుచిత। ద్వదనమునఁనూఁగుమీసలు। పొదలుచుఁగప్పడరిచూడఁబొంకంబయ్యెన్॥మఱియును॥క॥తమ్మివిరిమీఁదఁవ్రాలిన। తుమ్మెదపజ్క్తియునుబోలెఁదోరపులీలం।గ్రమ్మకొనివిప్రతనయుని। నెమ్మొగమునఁగానఁబడియెనెఱిమీసంబుల్॥వ॥ అం తననంగబ్రహ్మతంత్రంబునకువసంతుండొనర్చునంకురార్పణారంభంబునుంబోలెనసితకిసలయవిసరప్రసారభాసురబ హుపాదపాదిపురోపవనపవనజననప్రభావపరికంపితవిటవిటీజనహృదయప్రఫుల్లపల్లవభల్లంబు,ననూనప్రసూననిర్ఝ రగర్భావిర్భూతసురభిపరాగపటలపటఘటిత నభోమండలంబు,ననుందనిష్యందమరందబిందుసందోహకందళితచిత్తమ త్తమధుపసంకులఝుంకారముఖరితసకలదిశావలయంబును, నిరంతరధారాళరసభరితపరిపక్వఫలఫలానుభవప్రభవస మ్మోదవాదశుకప్రముఖపతంగకోలాహలంబునై,మధుమాసంబు,సర్వజనమనోహరంబునై నిఖిలవనపాదపంబులన లంకరించెనయ్యవసరంబున, నజామిళుండుపితృనిర్దేశంబునం,గుశసమిత్పుష్ప ఫలార్థంబువనంబునకరిగితిరిగివచ్చుసమ యంబుననొక్కలతాభవనంబున॥క॥బద్ధానురాగమైస్మర।యుద్ధంబునకలరుబుద్ధినుద్ధతకేళిన్।బద్ధయగు*వృషలితోఁబ్రి యు।వృద్ధిందగఁగూడియున్నవిటునొరుఁగాంచెన్॥క॥భటునిఁ రతిశాస్త్రకళా। ర్భటునిఁ వరయావనానుభవుమదివిభ వో। ద్భటునిఁ సురతేచ్ఛాసం। ఘటునిఁ విగతాంబరోరుకటునిఁ విటునిన్॥శా॥హాలాఘూర్ణితనేత్రతోమదనతంత్రా రంభసంరంభతో।ఖేలాపాలనయోగ్యభూవిభవతోఁగీర్ణాలకాజాలతో।హేలాలింగనభంగివేషవతితోనిచ్ఛావతీమూర్తి తోఁ।గేళిందేలుచునున్నవానిఁగనెఁబుంఖీభూతరోమాంచుఁడై॥క॥కలికివగమదనకదనపు।పలుకులకలకలము బెడగుఁబడు మేఖలము।వ్వలరవళిఁదగిలిగతిగొనఁ। గలకంఠిరతంబుసలుపుగమకముఁగనియెన్॥క॥కవకవనై పదనూపుర।రవరవమైగు బ్బుకొన్నరతిపతిగతులం। జివచివనై విటుచెవులకు।రవళిన్ రతిసల్పురతులరవరవగనియెన్॥చ॥కురులళికంబుపై నెగయఁ గ్రొమ్ముడివీడఁగగుబ్బదోయిపై। సరములుచౌకళింపఁగటిసంగతిమేఖలతాళగింపస। త్కరగవకంకణావళులుగర్జిలఁగొ నసియాడమీఁదుగా।మరునివినోదముల్సలిపెమానినియావనగర్వరేఖతోన్॥క॥✻మవ్వపుసుకుమారాంగిని।జవ్వనినుప గూహనాదిసముచితరతుల।న్నివ్వటిలుదానిఁగనిమది।నువ్విళ్లూరంగమన్మథోద్దీపనుఁడై॥తరల॥బహుళదృక్పరిపాకమో హనిబంధుఁడౌచుమనంబులో। సహజకర్మము వేదశాస్త్రముసాత్వికంబుఁదలంచిత। న్నిహితచిత్తమువట్టిపట్టఁగనేరఁడ య్యెసదామనో। గహనమందుమరుండుపావకుకైవడిన్ జరియింపఁగాన్॥శా॥ ఆలీలావతిగండపాళికలపైహాసప్రసా దంబుపై। నాలోలాలకపజ్క్తిపైనళికపైనాకర్ణదృగ్భూతిపై। హేలాపాదికుచద్వయోరుకటిపైనిచ్చల్పిసాలింపఁగా। జాలింబొందుచునాత్మఁగుందుచుమనోజాతానలోపేతుఁడై॥గీ॥మఱిఁగులాచారవర్తనమాటుఁజేసి। పరగుపిత్రర్థములు దానిపాలుఁజేసి।సాధులకుఁణగుణవృత్తిఁజాలుచేసి।లోలలోచనపసఁజెందిలోలుఁడయ్యె॥క॥✻శ్యామస్గనుమాస్త్రఖేల న। కామన్సుగుణాభిరామఁ గమనీయగుణ। స్తోమనిజభామనెల్లక। ధామముననటించెఁ ¶గ్రించుతనమునఁజడుఁడై॥ ఉ॥బందుగులట్టిసజ్జనులబాధలఁబెట్టియనాథకోటిఁబెన్।బందెలుసుట్టి✻యీరములుపట్టిపథంబులుగొట్టిదిట్టయై।నిందలకో ర్చిసాధులకునిందితుఁడై గడియించువిత్తమా। సుందరికిచ్చిమచ్చికలుసొంపెనఁగూర్చివసించెఁదత్కృపన్॥ సీ॥ సముచిత శ్రుతి§చర్చఁజర్చింపనెల్లకసతికుచద్వయచర్చఁజర్చసేయుఁ।దర్కకర్కశపాతర్కంబుగాదనికలికితోఁ బ్రణయత

*వృషలి।శూద్రస్త్రీ. ✻మవ్వపు।సుందరమైన. నివ్వటిలు।ఒప్పుచున్న. ఉవ్విళ్లూరంగన్।కోరికలతిశయించుచుండఁగాను. ✻శ్యామ।దృఢమై నయావనముగలది. ✻పిసాళింపఁగాన్।అధికములగుచుండఁగాను. ¶క్రించుతనమునన్।దుష్టత్వముచేత. ✻ఈరములు।పొదరిండ్లు. §చర్చ।సంఖ్య-విచారణ.

రక్షంబు సేయు।స్మృతిపదవాక్యసంగతిగాక తత్సతిపదవాక్యసంగతిపరగఁ జేయు।నాటకాలంకారనైపుణంబుడిగి తన్నా
టకాలంకారపాటిదిరుగుఁ।బరగఁ జిరకాలమీరీతిఁ బాపనియతి।రమణదాసీకుటుంబభారమువహించి।యదిగుటుంబిని గాఁ
గఁ బాపాత్ముఁడగుచు।నశుచియనుదుష్టవర్తనుఁడగుటఁ జేసి॥ క॥అటుగానఁ బాపకర్మునిఁ । గుటిలుని సుజనార్తుథూర్తుఁ
గ్రూరుని నేమా।రటమునఁ గొనియే గెదమం।తటదండమువలన నితఁడు ధన్యత నొందున్॥ వ॥ ఇట్లుపలుకుచున్న యమదూత
లవారించి నయకోవిదులయిన భగవద్దూతలిట్లనిరి॥ క॥అవురా ధర్మవివేక।ప్రవరుల సభగానఁ బడియెఁ బాపముపుణ్యో।ద్భ
వులనదండ్యులదండన।వివరంబొనరింపఁబడియెవిధి నెఱుఁగమి చేన్॥ చ॥సములును సాధులున్ విహితశాసనులున్ సదయా
ళురున్ శుభో।త్తముగుణులైనయట్టితలితండ్రులు బిడ్డలకెగ్గు సేయుచోఁ। గ్రమమున వారలెవ్వరికిఁ గైకొని కుయ్యిడఁ జా
లువారు సం।భ్రమమున మీమనంబులఁ దిరంబుగఁ జర్చయొనర్చి చూడుఁడా॥గీ॥ఎఱుకగలుగు వారలేదియొనర్చిన।నదియ
చేతురితరమయిన వారు।నలరి సత్యమిట్టిదని రేని లోకంబు।తత్ప్రవర్తనమునఁ దగిలియుండు॥గీ॥ నెమ్మిఁ దొడలమీఁద నిద్రిం
చు చెలికాని।నమ్మఁ దగినవాఁడు నయము విడిచి।ద్రోహబుద్ధిఁ జంపఁ దొడరునే యెందైనఁ।బ్రీతి లేక ధర్మదూతలార॥ గీ॥ చి
త్తమెల్లనిచ్చి చెలితనంబున వచ్చి। నచ్చికలయ నెచ్చినమ్మువానిఁ। గరుణగలుగువాఁడు కడు సౌమ్యుఁడగువాఁడు। చింత
సేయ కెట్లు చెరుపనేర్చు॥అదియునుంగాక॥ఉ॥ఈతఁడు కోటిసంఖ్యలకు నెక్కుడుపుట్టువులందుఁ బుట్టియా।యాతములైన
నపాపనివహంబుల నన్నిటిఁ బారఁదోలి ప్ర। ఖ్యాతమతిన్ మహామరణకాలమునన్ హరిపుణ్యనామసం। భూతసుధామ
యాచ్యుతవిభూతికి రాతురసంగ్రహంబునన్॥సీ॥బ్రహ్మహత్యానేకపాపాటవులకగ్నికీలలు హరినామకీర్తనములు। గు
రుతల్పకల్మషక్రూరసర్పములకుఁ గేకులు హరినామకీర్తనములు।తపనీయచౌర్యసంతమసంబునకు సూర్యకిరణముల్ హరి
నామకీర్తనములు।మధుపానకిల్బిషమదనాగసమితికిఁ గేసరుల్ హరినామకీర్తనములు। మహితయోగోగ్రనిత్యసమాధి
విధుల।నలరు బ్రహ్మాదిసురులకు నందరాని।భూరినిర్వాణసామ్రాజ్యభోగభాగ్య।ఖేలనంబులు హరినామకీర్తనములు॥ సీ॥
ముక్తికాంతైకాంతమోహనకృత్యముల్ కేలిమై హరినామకీర్తనములు।సత్యలోకానందసౌభాగ్యయుక్తముల్ కేలిమై
హరినామకీర్తనములు।మహితనిర్వాణసామ్రాజ్యాభిషిక్తముల్ కేలిమై హరినామకీర్తనములు।బహుకాలజనితతపఃఫ
లసారముల్ కేలిమై హరినామకీర్తనములు।పుణ్యమూలంబులనపాయపోషకంబు।లభిమతార్థంబులజ్ఞానహరణకరము।
లాగమాంతోపలబ్ధంబులమృతసేవ।లార్తశుభములు హరినామకీర్తనములు॥క॥కామంబుఁ బుణ్యమార్గ।స్థేమంబు మునీం
ద్రసాంద్రచేతోసరసీ।ధామంబు జిష్ణునిర్మల।నామంబుఁ దలంచువాఁడు నాథుఁడుగాఁడే ॥క॥ డెందంబు పుత్త్రువలనం।
జెందినదని తలఁపవలదు శ్రీపతిపేరే।చందమున నైనఁ బలికిన।నందకధరుఁడందె కలఁడు నాథుండగుచున్॥గీ॥బిడ్డపేరుఁ బెట్టి
పిలుచుట విశ్రామ। కేలినైన మిగుల గేలినైనఁ।బద్యగద్యగీతభావార్థములనైనఁ।గమలనయనుఁ దలఁపఁ గలుషహరము॥
ఉ॥కూలినచోటఁ గొట్టువడి కుందినచోట మహోజ్జ్వరాదులం।బ్రేలినచోట సర్పముఖపీడలనందినచోట నార్తులై।తూలినచో
ట విష్ణుభవదూరునిఁ బేర్కొని రేని మీఁదన।క్కాలుని యాతనావితతిఁ గానరు పూనరు దుఃఖభావముల్॥సీ॥అతిపాపముల
కుఁ బ్రయత్నపూర్వకమునఁ దనుపాపములకమితంబుగాఁగ।సన్మునివరులచే సంపాద్యమైయుండు నిర్మలంబగు పాప✿ని
ష్కృతములు। క్రమరూపమున నుపశమనంబులగుఁ గాని తదఘచయములఁ డుపలేవు। సర్వకర్మంబులసంహారమొన
రించి చిత్తంబునకుఁ దత్త్వసిద్ధి నెపుడు।నొసఁగునట్టి పుణ్యయోగమానససరో।వాసుసేవ⚘హేమవాసుసేవ। వేదవేద్యుసే
వ వేదాంతవిభుసేవ।బరమపురుషపాదపద్మసేవ॥ క॥హరినెఱుఁగనియాబాలుఁడు । హరిభక్తులతోడఁ గూడి హరియను
వాఁడు।న్సరియై దోషములడఁచును।✻గరువలితో నగ్నితృణముఁ గాల్చిన భంగిన్॥ఉ॥ ఆరయ వీర్యవంతమగు నౌషధమెట్లు
యదృచ్ఛఁ గొన్నఁ ద।చ్చారుగుణంబు రోగములఁ జయ్యనఁ బాపినమాడ్కిఁ బుణ్యవి।స్ఫారుని నంబుజోదరునిఁ బామరుఁడజ్ఞ
ుఁడవజ్ఞఁ బల్కినన్।వారకఁ దత్ప్రభావము ధ్రువంబుగ నాత్మగుణంబుఁ జూపదే॥క॥ధృతిఁ దప్పినతటినిఁ బురా।కృతమునఁ గా
కెట్లు దోఁచుఁ గేశవుఁడు మది।న్మితిలేని జగముఁ దాల్చిన।యతఁడొక్కని మనములోన నడఁగెడువాఁడే॥ మ॥నిరతంబై నిరవ
ద్యమై నిఖిలచిన్నిర్మాణమై నిత్యమై।నిరహంకారగుణాఢ్యమై నియమమై నిర్దోషమైనట్టి శ్రీ।హరినామస్మరణామృతంబితఁ
డు ప్రత్యక్షంబు సేవించెఁ దా।మరణాంతంబుననిట్టి సజ్జనుని ధర్మం బేల వ్యర్థంబగున్॥ వ॥అనియిట్లు భగవద్దూతలు భాగవత
ధర్మంబు నిర్ణయించి బ్రాహ్మణుని నతిఘోరంబైన మృత్యుపాశబంధనజనితభీతిచే విముక్తునింగావించి రంత నాయమదూ
తలా భగవద్దూతలసంభాషణప్రభావంబులఁ దమమనంబుల శాంతినొంది భగవత్తత్త్వజిజ్ఞాసితులయి చేయునది లేక *నిరా

---

✿నిష్కృతములు।ప్రాయశ్చిత్తములు. ⚘హేమవాసు।బంగరుపట్టుపుట్టముగలవిష్ణువుయొక్క. ✻కరువలిలోన్।వాయువుతో. *నిరాకృతు

కృతులై యమలోకంబునకుంజని పితృపతికి సర్వంబును నెఱింగించిరంత॥ క॥ అతఁడును బాశచ్యుతుఁడై। గతభయుఁడై ప్రకృతి నొందికడు నుత్సవసంగతిఁ జూచి మ్రొక్కె మదిలో। నతులితముద మొదవి పొదలి హరిదాసులకున్॥ గీ॥ నిలిచి కేలు మొగిచి పలుక నుద్యోగించి। చెలఁగుచున్నలోని తలఁపుఁ దెలిసి। చక్రధరుని కూర్మి సహచరులరిగిరి। దృశ్యులగుచు దేవదేవు కడకు॥ క॥ వేదత్రయసంపాద్యము। మోదంబుగ నాశ్రయంబు మును భగవద్ధర్మాదేశంబగు తద్భట। వాదంబున జామిళుండువదలక వినుచున్॥ క॥ శ్రీమన్నారాయణపద। తామరసధ్యానసలిల *ధౌతమహౌఘ। స్తోమకుఁడై సద్భక్తికి। ధామకుఁడగుచుండెఁ దెలిసి తత్క్షణమాత్రన్॥ క॥ *బరవసమున నరికట్టిన। దురితంబులఁ దలఁచి తలఁచి తుదిఁ దాపమునన్। హరినీశు నాశ్రయించుచు బరితాపము నొంది పలికె బ్రాహ్మణుఁ డాత్మన్॥ సీ॥ వృషలియందను రాగవృద్ధి బిడ్డలఁ గని కులము గోదావరిఁ గూలఁద్రోచి। రచ్చలకెక్కె పెఁరజ్జు సేతల సరివారిలోపలఁ దలవంపుఁ జేసి। కట్టడి ముదుకనై కర్మబంధంబుల పుట్టనై నిందల ప్రోవనగుచుఁ। దరుణుల రోఁతలఁ దవిలి భోగించినకడిది యీజన్మంబు గాలిపోయెఁ। జదువు చట్టువడియె శాస్త్రంబు సున్నయ్యె। బుద్ధి పురువు మేసెఁ బుణ్యమడఁగె। నీతి మట్టువడియె నిర్మలజ్ఞానంబు। మొదలికుడిగె బోధము ఱివోయె ॥ క॥ చిక్కనిచక్కనిచన్నుల మక్కువ యిల్లాలి విడిచి మాయలుగల యీ। వెక్కసపు మద్యపానపుఁ। డొక్కపసన్దగిలి దుర్విటుఁడనై చెడితిన్॥ ఉ॥ అక్కట ఘోరదుష్కృతమహానలకీలలు నన్ను ముట్టి పే। లుక్కడఁగింపకిట్లు ధృతినుండఁగనిచ్చెన హూహాముగాత్మనిన్। గ్రక్కనఁ దల్లిదండ్రుల నకల్మషచిత్తులఁ బెద్దలన్ మతే। దిక్కును లేనివారిఁ బెనుతీఁపులఁ బెట్టుచుఁ బారఁదోలితిన్॥ క॥ అకృతజ్ఞుఁడనై విడిచితిఁ। బ్రకృతింగల బంధువులను బాల్యముననను। న్స్వీకృతిఁ జనకుండఁ బెంచిన। సుకృతుల మజ్జనకవరుల శోభనకరులన్॥ అప్పుడు. గీ॥ పెక్కుపాతకముల భృశదారుణంబైన। దొడ్డనరకమందుఁ బడ్డనన్ను। నాపదలకుఁ బాపి యరికట్టి రక్షించి। రిట్టి ధర్మపురుషు లెందువారో॥ శా॥ చోద్యంబై కలవో లెనీక్షణమునం జూడంగఁ బ్రత్యక్షమై। వేద్యంబయ్యెను నన్ను నీడ్చిన మహావీరుల్ భృశోదగ్రులా। యుద్యోగంబులవారు పాశధరు లీయుత్సాహముల్మానిసం। పాద్యానేకవికారరూపకుటిలప్రఖ్యాతు లెవ్వారలో॥ ఉ॥ దారుణపాశబంధనవిధానముల న్నరకార్ణవంబులోఁ। గూరిన నన్ను నేఁడు సెడకుండ నొనర్చిన పుణ్యమూర్తులం। భోరుహనేత్రు లుజ్జ్వలనభోమణితేజులు లోచనోత్సవు। ల్చారుదయాసమంచితవిచారులు నల్వురు నెందు కేగిరో॥ మ॥ ననురక్షించిన పుణ్యవంతులు *కనన్నాళీకపత్రాక్షులం। జనసంకాశులు శంఖచక్రధరులాజానూరుబాహుల్ స్మితా। ననులాలంబితకర్ణవేష్టనసువర్ణచ్ఛాయదివ్యాంబరు। ల్ఘనకారుణ్యరసైకపూర్ణులు సమగ్రస్ఫూర్తి నెవ్వారలో॥ వ॥ పాతకుఁడనగు నాకు నివ్విబుధోత్తమదర్శనంబు పురాకృతమదీయపుణ్యవిశేషంబునం గాని పొంద శక్యంబు గాదు తత్సందర్శనంబాత్మకు నతిసుప్రసన్నంబై యొప్పునట్లు గాకుండె నేనిఁ గలుషవర్తనంబుల వృషలీభర్తనై యుండి మృతిఁ బొందుచున్న నాదుజిహ్వకు శ్రీమన్నారాయణనామగ్రహణంబు సంభవింప నేరదు మఱియును॥ గీ॥ పాతకుఁడను జడుఁడ బ్రహ్మఘాతకుఁడను। మానలోభమోహమత్సరుండ। నాకు నెట్లు దొరుకు నారాయణుని దివ్య। నామవిమలకీర్తనంబు మదికి॥ సీ॥ దారుణమోహాంధకారపూరితుఁడను హరివిస్మయస్మరణార్హమతినె। పంచమహాతీవ్రపాతకోపేతుఁడ హరివిస్మయస్మరణార్హమతినె। కౌటిల్యకితవవికారపారీణుండ హరివిస్మయస్మరణార్హమతినె । యఖిలదుఃఖైకఘోరార్ణవమగ్నుండ హరివిస్మయస్మరణార్హమతినె। నిందలకు నెల్ల నెలవైన నిర్గుణుండ। మందభాగ్యుండ నే నేడ మధువిదారి। దివ్యగుణనామకీర్తనఁ దెలుఁగ నేడఁ। బూర్వసుకృతంబు లేకెట్లు పొందఁగలుగు॥ అని వితర్కించి॥ మ॥ †యతచిత్తేంద్రియమారుతుండనగుచున్ యత్నంబొనర్తున్ హరి। వ్రతసంపత్తికిఁ బుణ్యవృత్తికిఁ జిదావాసోన్ముఖాసక్తికిన్। యతనిర్వాణపదానురక్తికి సుఖోద్యోగక్రియాశక్తికిన్। ధృతిలబ్ధోత్తమమూర్తికిన్ సకలధాత్రీఘుర్యసద్భక్తికిన్॥ క॥ విడిచితి భవబంధంబుల। నడిచితి మాయావిమోహమైన తమంబు। *నొడిచితి నరివర్గంబులఁ। గడిచితి నాజన్మదుఃఖకగ్గార్ణవమున్॥ క ॥ *యోషిద్రూపంబుననను। నేషణముఖగహ్వరమున నెగమ్రింగికడు। ద్వేషమునఁ గోఁతఁ జేసిన। దోషదయగు నాత్మమాయ తొలఁగఁగంటిన్॥ వ॥ అని యిట్లు వైష్ణవజ్ఞానదీపంబు *బాత్మస్నేహంబునం బ్రోచిన బ్రాహ్మణుండు॥ మ॥ భగవద్ధర్మపరాయణోత్తముల సంభాషైకమంత్రంబుల। న్మిగులన్ జ్ఞానము పుట్ట మోహభవసమ్మిశ్రాత్మబంధంబుల । న్నెగ ఖండించి సబంధుమిత్రసుతప

---

లై। తిరస్కరింపఁబడినవారై. *ధౌతమహౌఘస్తోమకుఁడై। పోఁగొట్టఁబడిన ఘనపాపసమూహముగలవాఁడై. *బరవసమునన్। అతినమ్రతచేత. *కనన్నాళీకపత్రాక్షులు। ప్రకాశమానములగు తామరరేకులవంటి నేత్రములుగలవారు. అంజనసంకాశులు। కాటుకకాంతివంటి శరీరకాంతిగలవారు. స్మితాననులు। చిఱునవ్వుతోఁ గూడినముఖములుగలవారు. ఆలంబితకర్ణవేష్టన। మిగుల వ్రేలాడుచున్న కుండలములుగలవారు. †యతచిత్తేంద్రియమారుతుండనగుచున్। నిశ్చలములుగఁ జేయఁబడిన మానసేంద్రియప్రాణములుగలవాఁడనై. *ఒడిచితిన్। గెలిచితిని. అరిషడ్వర్గములన్। కామక్రోధాదులను. *యోషిద్రూపంబునన్। స్త్రీరూపముచేత. *ఆత్మస్నేహంబునన్। అంతఃకరణయనెడు తైలముచేత.

తీవ్రమోహవిభ్రాంతుఁడై । జగతీనాథుర మేశుఁ గృష్ణునిదనైశ్వర్యంబులం గోరుచున్ ॥ క ॥ హరిభక్తులతో మాటలు । హరినే న్నఁడుఁ జెడనిపుణ్యధనములమూట । ల్వరముక్తికాంత తేటలు । నరిషడ్వర్గంబు చొరనియరుసులకోటల్ ॥ సీ ॥ అనుచు నా బ్రాహ్మణుం డతితత్త్వవేదియై భవబంధముల నెల్లఁ బారఁదోలి । మొనసి గంగాద్వారమున కేఁగి యచ్చటఁ *బ్రబ్బిన దేవతా భవనమందు । నాసీనుఁడై యోగమాశ్రయించి వెలుఁగు దేహేంద్రియాదుల తెరువులన । దనుఁ బాపుకొని పరతత్త్వం బుతోఁ గూర్చి మానుగాఁ †నాత్మసమాధిచేత । గుణగణంబుఁ బాసి కోమరొప్పిన భగవ । దనుభవాత్మయందు నాత్మఁ గలిపి । ర వణఁ దన్ను మొదల రక్షించినట్టి యా పురుషవరులఁ గాంచి పొసఁగ మ్రొక్కె ॥ వ ॥ అట్లజామీళుండు యోగమార్గంబున దే హంబు విడిచి పుణ్యశరీరుండై యగ్రభాగంబునం బ్రాపుపలబ్ధులైన మహాపురుషకింకరులం గాంచి సకంచితరోమాంచిత చలచ్ఛటాపింజరిత స్వేదబిందుసందోహమిషనిష్యందమహానందవల్లికా నుతల్లికాంకురసంకులపరిశోభితతమండును, హ ర్షనికర్షమాణమానసోన్యోగయోగప్రభానోత్సాహవిస్మయమందస్మితముఖారవిందకందళితుండును, నిఖిలజగజ్జేగీయ మానాఖండశుభప్రసంశుభాకారసందర్శనసమాసాదితకుతూహలమానసుండై ప్రణామంబులాచరించుచు భాగీరథీతీ రంబునఁ గళేబరంబు విడిచి తత్క్షణంబున హరిపార్శ్వవర్తనులైన దాసవరులస్వరూపంబుఁ దాల్చి యా విష్ణుసేవకులతోఁ గూడి దివ్యమణిగణఖచితంబగు సువర్ణమయంబైన యసమానవిమానం బెక్కి నిఖిలానందభోగభాగ్యానుభవాకుంఠితంబ యిన వైకుంఠంబున శ్రీమన్నారాయణపాదారవిందసేవాచరణపరిణామస్థితికిం జనియె నిట్లు ‡విప్లావితసర్వధర్ముండైన దాసీపతి గర్హితకర్మంబులచేతఁ బతితుండును హతవ్రతుండునై నరకంబునం గూలుచుండి భగవన్నామగ్రహణంబున స ద్యోముక్తుం డయ్యెఁ గావున ॥ క ॥ కర్మంబులెల్ల బాయను । మర్మము దలఁపంగ లేదు మధురిపు పేరే । పేర్మిని నోడువుటకం టె ను । మర్మగమునఁ జిత్తమెన్ని త్రోవలనున్నన్ ॥ ఉ ॥ పాండవవంశపాలన నృపాలక యీ యితిహాసమెవ్వఁడే । నొండొకభ క్తిలేక విననొప్ప మెయిం బఠియించు నాతఁడున్ । దండతముక్తికామినికి దానకమైదను జారిలోకమం । దుండు మహావిభూ తియమదూతల చూడ్కికి గోచరాకృతిన్ ॥ గీ ॥ అరయ పుత్రోపచారితమైన విష్ణు । నామము వసానకాలంబున భజించి । శౌ రినిలయంబుఁ జేరెనజామిళుండు । నిట్లు సద్భక్తిఁ దలఁచిన నేమి సెప్ప ॥ క ॥ కోరినవారలకెల్లను । జేరువకై వల్యపదము సిరివ రునిమాదిం । గోరనివారలకెల్లను । దూరము మోక్షాప్తి యన్నిత్రోవలనైనన్ ॥ వ ॥ అని నంబరీక్షిన్నరేంద్రుండిట్లనియె ము నీంద్రా యాజ్ఞాభ్రష్టుండై యమధర్మరాజు శ్రీవిష్ణునిర్దేశకులచేత విహతులైన భటులచేత వర్ణింపంబడిన నారాయణుని నామప్రభావంబాకర్ణించి వారల కేమనియె నటియు నెన్నఁడేని యమయముదండంబు విఫలంబై పోయిన తెఱంగు గలదే నివి నవలయు నీ సందేహంబుఁ బాపను మహాత్మా నీవు దక్కఁ దక్కిన వారలు సమర్థులుగారని తలంచుచున్నవాఁడఁ జిత్తంబున ప్ర సాదాయత్తంబుగా భవదీయవచనసుధాధారలఁ బ్రసాదింపవలయునని నకు నిట్లనియె ॥ క ॥ శ్రీకృష్ణభటులచేత ని రాకృతులై యామ్యభటులు యమునకు నాత్మ । స్వీకృతవిప్రకథాక్రమ । మేక్రియ నుం దెలిపి రయ్యా నెఱిఁగింపుతగన్ ॥ గీ ॥ చేరి త్రివిధకర్మలఁ జేయు జీవతతికిఁ । గర్మఫలములఁ దెలిపెడు కారణులుగ । నగుచు శిక్షించు వారలీయవనిమీఁద । దేవ యం దఱుగలరయ్య తెలియవలయు ॥ క ॥ దక్షిణదిశాధినాయక । శిక్షుం దగఁ జేయువారు శికిరి పెక్కండ్రే । నిక్షుయమున్న క్షయను సు । సాక్షాత్తుగ రెండునెందు సంపన్నములున్ ॥ గీ ॥ దట్టమైనట్టి కర్మబంధముల నెల్ల । నాజ్ఞఁ బెట్టెడు వారు పెక్కైన చోట । య కటశాస్త్రార్థ ముపచారమయ్యెఁ గాదె । ఘోరులైనట్టి మండలేశులకుఁ బోలె ॥ ఉ ॥ కావున నీవ యొక్కఁడవ కర్తవు మూఁడు జగంబులం దసం । భావితభూతకోటిఁ బరిపాకవశంబున శిక్ష సేయఁగా । నీవరశాసనంబు ఖిలనిర్ణయమై తనరారుచుండ నేఁ డీవల గ్రమ్మరింప మఱి యెవ్వఁడు శక్తుఁడు ధర్మపాలనా ॥ క ॥ చండకరతనయ యొరులకు । దండధరత్వంబుగల దెలగ జగము నను । గ్దండధరవృత్తి నొత్తిగి । దండింతువు నిన్ను దండధరుఁ డని పొగడన్ ॥ సీ ॥ ఇట్టి నీ దండంబు నీ మూఁడు జగములఁ దెసువనై నేఁడు వర్తించుచుండు । మనుజలోకంబున మహాదద్భుతాకారసిద్ధులమిగులఁ బ్రసిద్ధులైన । వారు నల్వురు వేగవచ్చి నిర్దేశం బు భంగించి మమ్ముం తఁ బారఁదోలి । మీ శాసనంబున మేమీడ్చి కొనివచ్చు క్రూరచిత్తుని పువ్చికొనియదల్చి । పాశబంధంబు ?లీసునఁ బట్టి తెంచి బలిమిమిగులం గమమ్మునఁ బారఁదోలి । యిచ్చఁ జనినారు వారు దామెచటి వార । లాదరమ్మున మాకు సేఁ డానతిమ్ము ॥ వ ॥ అనిన నిమ్మడియు శుకుండిట్లనియె నట్లు యమూతలు పరితాపసమేతులై పలికిన దండధరుండు పుండరీకాక్షుని చర ణకమలంబులు మనమాన సంబున సన్నిహితంబులుగఁ జేసి వందనంబాచరించి పరమభక్తిపరుండై వారలకిట్లనియె ॥ సీ ॥ కలఁ

*ప్రబ్బిన । ప్రాప్తమైన-లేక-శ్రేష్ఠమైన. †ఆత్మసమాధిచేతన్ । బ్రహ్మసమాధిచేత-సమాధియనఁగా-కా ॥ మనః ప్రచారశూన్యం పరమాత్మనిలీ నంభవతి-మనస్సంచారము లేనిదియై పరమాత్మయందు లీనమగుచున్నది-అదియనమాధి. ‡విప్లావిత । ఎగరఁగొట్టఁబడిన. ? ఈసునన్ । కోపముతో.

డెమదన్యుం డుఘనుఁ డొక్కఁ డతనుండు వెలికిఁ గానఁగ రాక విశ్వమెల్ల। నతిలీనమై మహాద్భుతసమగ్రస్ఫూర్తినుండుఁ గోఁ
కం డనునూలున్న భంగి। దా మెనఁ బశువులు దగిలియుండెడు మాడ్కి నామసంకీర్తన స్థేమమతుల। విహరించు నెవ్వఁడు విలసిత
నత్స్వజ రెవ్వని పదముల నివ్వటిల్లుఁ। గనుట మనుట చనుట గల్లు నెవ్వని లీల। లంచు లోక మెవ్వ నంచుఁ బొంచు। నెన్నఁ బఱచు
పుడమి నెవ్వని నామము। ల్గర్మబంధనములఁ జేర్మి నడఁచు॥ తరల॥ వినుఁడు నేను మహేంద్రుఁ*డప్పతి వీతిహోత్రుఁడు రా
క్షసుం డనిలుఁ డర్కుఁడు చంద్రుఁడుం గమలాసనుండు మరుద్గణం। బును మహేశుఁడు రుద్రవర్గము భూరిసంయమి సిద్ధ
లు। మానసికన్గొనఁజాల రెవ్వని మూర్తి విశ్రుతకీర్తిమై॥ క॥ సత్త్వేతరగుణపాశవశత్వంబునఁ బొందవీరు జలజాతుసదై। క
త్వంబుగాననోపరు। సత్త్వప్రాధాన్యులితరజనులకు సరియే॥ చ॥ అభవు నమేయు నవ్యయు ననంతు ననారతుఁ బూని మేనిలో।
నుభయమునై వెలుంగు పురుషోత్తముఁ గానరు చిత్తకర్మవా। గ్విభవగరిష్ఠులై వెదకి వీఁడి ప్రాణులు సర్వవస్తువు। ల్సుభగ
తిఁ జూడ నేర్చి తనుఁ జూడఁగ నేరనికంటి పోలికన్॥ చ॥ పరమునిభక్తలోకపరిపాలునిశీలునిదుష్టలోకసం। హారుఁ బతంగపుం
గవవిహారుని మారిమిమాతలామనో। హరులు సురేంద్రవందితులు నా హరిరూపగుణస్వభావులై। తిరుగుచునుందు రెల్లెడ
లఁ దిక్కులఁ దేజము పిక్కటిల్లఁగన్॥ ఉ॥ లెక్కకు నెక్కువై కసటులేని మహాద్భుత తేజమెల్లెడం। బిక్కటిలంజరింతురతి
భీమబలాఢ్యులు విష్ణుభూతము। ల్చక్కనిధర్మశాంతులతి సాహసవంతులు దేవపూజితు। ల్గ్రిక్కిటిసీజగంబునను గేశవసేవ
కరత్సుణార్థమై॥ క॥ నావలనను మీవలనను। దేవాసురగణమువలనఁ ద్రిజగంబులలో। నేవగలఁ బొందకుండఁగఁ। గావంగల
వారు పుడమిఁ గల వైష్ణవులున్॥ క॥ భగవత్ప్రణిహితధర్మం। బగపడ దెవ్వారి మతికి ననిమిషగరుడో। రగసిద్ధసాధ్యనరసుర।
ఖగతాపసయక్షదివిజఖచరులకైనన్॥ క॥ ఎన్నఁడుఁ దెలియఁగ నేరరు। పన్నగపతిశాయి తత్త్వభావము¶ మేనం। గన్నులవే
ల్పును డాపల। సన్నుతిగల వేల్పు ముదురుచదువుల వేల్పున్॥ సీ॥ వరమహాద్భుతమైన వైష్ణవజ్ఞానంబుఁ దిరముగా నెవ్వారు తె
లియఁగలరు। దేవాదిదేవుండు త్రిపురసంహరుఁ డొండెఁ గమలసంభవుఁ డొండెఁ గార్తికేయ। కపిలనారదులొండెఁ గంగా
త్మజుం డొండె మనువొండె బలియొండె జనకుఁ డొండెఁ। బ్రహ్లాదుఁ డొండె నేర్పాటుగా శుకుఁ డొండె భాసురతరమతి వ్యా
సుఁ డొండెఁ। గాకయన్యులతర మెయ్యాలోకమందు। నీసుబోధంబు సద్బోధమీ పదార్థ। మీసదానందచిన్మయమీ యగమ్య।
మీవిశుద్ధంబు సుహ్యంబు నీశుభంబు॥ క॥ ఈపన్నిద్దరుఁ దక్కఁగ। నోపరు తక్కొరులు దెలియ నుపనిషదుచిత। శ్రీహరి నామమ
హాద్భుత దీపిత భాగవతధర్మ దివ్యక్రమమున్॥ గీ॥ పదిజపియింపనమృతమై యొసఁగుచుండు। నేదిసద్ధర్మపథమని యెఱుఁగఁ
దగిన। దదియె సద్భక్తియోగంబు నావహించు। మూర్తివంతంబుతో హరికీర్తనంబు॥ గీ॥ కంటిరే మీరు సుతులార కమల నే
త్రు। భవ్యమగు నామకీర్తనఫలము నేఁడు। తవిలి మృత్యుపుపాశబంధములవలన। జాణతనమున వీడె నజామిళుండు॥ ఉ॥ పటి
కిఁ జాలిఁ బొందనరు లేక్రియఁ గృష్ణునికీర్తనంబు పా। పాటవులందహింపఁగలపాటుకు సందియమేల యిప్పుడీ। తూటరిదోస
కారి పెను దోసియజామిళుఁడంత మొందుచుం। బాటిగ విష్ణునామమును బల్కుచుఁ గేవలముక్తిఁ గేఁగఁడే॥ క॥ ఇంతయును దత్య
మని మది। నెంతయుఁ దెలియంగ లేరు హీనాత్ములును। ద్ధాంతతరఘటితమాయా। క్రాంతాత్యంతప్రకాశ గౌరవజడులై॥
మంగళమహాశ్రీవృత్తము॥ ఈవిధమునన్విబుధులేక తముచిత్తముల నేకతములేక హరినీశు। న్భావమున నిల్పి తగు భాగవత
యోగపరిపక్వమున నెందుదురు వారిన్। దేవలచుదండనగతిన్ జనదు మాకు గురిదిప్పరఘముల్దలఁగు మీఁదన్। శ్రీవరునిచ
క్రముని శేషగతిఁ గాఁచు సురసేవితులు ముక్తిఁ గడుపెద్దల్॥ ఉ॥ ఎవ్వరు సిద్ధసాధ్యఖచరేశులసత్పరిగీతగాథలం। దెవ్వరు
ముక్తిభోగతల హేమమనోహరచంద్రశాలలం। దెవ్వరు శంఖచక్రగురు హేతిగదారుచిరోగ్రపాణులా। మవ్వపురూప
వంతులసమానులు వోధరలోని వైష్ణవుల్॥ సీ॥ ప్రత్యంతవిశ్రాంతమత్యనుక్రమణీయ భగవత్ప్రసంగతుల్ భాగవతులు।
సకలసన్ముఖయోగిజనసదానందైకపరమభాగ్యోదయుల్భాగవతులు। కృష్ణపదధ్యానకేవలామృతపానపరిణామయుతు
లు శ్రీభాగవతులు। బహుపాతకానీక పరిభవప్రక్రియాపరుషాగ్ర్యమూర్తులు భాగవతులు। భావతత్త్వార్థవేదులు భాగవ
తులు। బ్రహ్మవాదానువాదులు భాగవతులు। సిరులు దనరంగ నెన్నఁడుఁ జేటులేని। పదవి నొప్పారు వారు వో భాగవతులు॥
క॥ అది గాన విష్ణుభక్తులఁ। గదియఁగ జనవలదు మీరు కరివరదుల స। త్పదపద్మ వినతి విముఖులఁ। దుదినంటఁగఁ గట్టి తెండు ధూ
ర్తులు వారల్॥ సీ॥ ఏకసక్కెమునకైనను నిందిరారమణునిఁ బలుకంగ లేని దుర్భాషితులను। గలలోననైన శ్రీకాంతుని సత్పా
దకమలముల్ సూడని కర్మరతుల। నవ్వుచునైనఁ గృష్ణప్రశంసకుఁ జెవిడాల వేయని దుష్కథాభిరతుల। యాత్రోత్సవంబు

*అప్పతి। వరుణుఁడు. వీతిహోత్రుఁడు। అగ్ని. మరుద్గణంబును। దేవసమూహమును. రుద్రవర్గము। ఏకాదశరుద్రులు. ¶మేనంగన్నులవేల్పును। ఇం
ద్రుఁడును. డాపలసన్నుతిగలవేల్పు। అర్ధనారీశ్వరుఁడగుటవలన నేకభాగస్తుతి శివునకు, అవరభాగస్తుతి పార్వతీదేవికి గావున నిక్కడ శివుఁడని-అర్థ.
ముదురుచదువులవేల్పున్। బ్రహ్మదేవుని.

లనైననీశునిఁగుడి త్రోవఁద్రొక్కఁగ లేనిదుష్కృతులను। బరమభాగవతులపాదధూళిసమస్త। తీర్థసారమనుచుఁ దెలియలేని వారివారివారివారిఁ జేరినవారిఁ। దోలుఁడు గట్టి తెండు దూతలార॥ గీ॥ ఎల్ల పాపములకు నిల్లయినయింటిలోఁ। బద్ధతృష్ణులగుచు బుద్ధిఁ దగిలి। పరమహంసకులముగుఱిఁ దప్పి వర్తించు। ధూర్తజనులఁ దెండు దూతలార॥ గీ॥ అరయఁ దనదుజిహ్వ హరిపేరునుడువదు। చిత్తమతనిపాదచింతఁ జనదు। తలఁపఁ దమకుముక్కిఁ తంగేటిజున్నెకో। సకలవిష్ణుభక్తులకును బోలె॥ గీ॥ పద్మనయనమీఁది భక్తియోగంబెల్లఁ। ముక్తియోగమనుచు మొదలెఱుంగు। వారివారివారివారిఁ జేరినవారి। త్రోవఁ బోవవలదు దూతలారా॥ వ॥ అని పలికె నని చెప్పి మఱియు శుకుండిట్లనియె, శ్రీకృష్ణనామకీర్తనంబు, జగన్మంగళంబనియును, జగన్మోహనంబనియును, జగజ్జేగీయమానంబనియును, నిఖిలపాపైకనిష్కృతియనియును, నిఖిలదుఃఖనివారణంబనియును, నిఖిలదారిద్ర్యనిర్మూలకంబనియు, నఖిలమాయాగుణవిచ్ఛేదకంబనియు, నుద్దామంబులగు, హరివీర్యంబుల నాకర్ణించు, వారలచిత్తంబులతినిర్మలంబులగు భంగిం దక్కిన వ్రతాచరణంబులం గావనియును, శ్రీకృష్ణపదపద్మంబులు హృత్పద్మంబులఁ దలఁచువారలన్యపాపకర్మంబులగు నవిద్యావ్యసనంబులం బొరయనేరరనియును, నిజస్వామియైనయమధర్మరాజుచేతఁ గీర్తింపంబడినభగవన్మహత్త్వంబు నాకర్ణించి విస్మితులై కాలకింకరులు నాఁటనుండియు, వైష్ణవజనంబులం దేరి చూడ వెరతురు నరేంద్రా పరమగుహ్యంబగు నీయితిహాసంబును, బూర్వకాలంబున సకలవిజ్ఞానగోచరుండైన కుంభసంభవుండు సకలదుఃఖవిలయంబును, సకలపుణ్యనిలయంబైన మలయంబునఁ బురాణపురుషుండైన పురుషోత్తము నారాధనంబు సేయుచుండి నాకెఱింగించెనని చెప్పిన విని విస్మయానందహృదయుండై పరీక్షిజ్జనపాలుండిట్లనియె॥ క॥ స్వాయంభువమను వేళల। నోయయ్య సురాసురాండజోరగనరవ। ర్గాయతసర్గముఁ దెలిపితి। పాయక నది విస్తరించి పలుకంగదవే॥ క॥ ఉత్తరకొడుకిల్లడిగిన। యుత్తరమున కమ్మునీంద్రుఁ డుత్తమచేతో। వృత్తిముదమంది పలికెను। దత్తరపాటుడిగి వినుఁడు తాపసులారా ॥ సీ ॥ పూని ప్రచేతసపుత్రులు పదుగురు ప్రాచీనబర్హిష ప్రాఖ్యగలుగు । వారు మహాంభోధి వలన వెల్వడి వచ్చి తగ వృక్షవృతమైన ధరణిఁ జూచి । మేదినీజములపై మిక్కిలి కోపించి మదిలోన దీపితమన్యులగుచు । వక్త్రంబులను మహావాయుసంయుతమయినయనలంబుఁ గల్పించి యవనిజములఁ । బెల్లువడఁ గాల్పఁ దొడఁగినఁ దల్లడిల్లి । వారి కోపంబు వారించు వాఁడపోలెఁ । బలికెఁ జంద్రుండు యోమహాభాగులార । దీనమగు వృక్షముల మీఁదఁ దెగుట దగునె ॥ గీ ॥ మొదల వర్ధిష్ణులగు మిమ్ము సదయహృదయు । లగు ప్రజాపతులనుచు సర్వాత్ముఁ డనియె । నట్టి మీరు ప్రజాసృష్టికైనవార । లీవనస్పతీతతుల దహింపఁ దగునె ॥ సీ ॥ ఆదికాలంబున నా ప్రజాపతిపతియైన లోకేశ్వరుం డచ్యుతుండు । పద్మనేత్రుఁడు వనస్పతులనోషధిముఖ్యజాతంబు నిషమునూర్జంబుఁ గోరి । కల్పించె నందు ముఖ్యంబైన యన్నంబు యచరంబులైనట్టి యపదమెల్లఁ । బాదచారణులకుఁ బావ్వెట్టి యిరుగాళ్ళ చేతులు గలిగిన జీవతతికి । హస్తములు లేని యా చతుష్పాదులెల్ల । నన్నముగఁ బూనికావించె నదియుఁ గాక । నామహాభాగుఁ డచ్యుతుఁ డాదరమున । మీకు ననఘాఖ్య విఖ్యాతి జోకపరచె॥ క॥ నిజముగ దేవాధీశ్వరుఁ। డజుఁడు ప్రజాసర్గమునకు ననఘుల మిమ్ముఁ । సృజియించె నట్టివారికిఁ । గుజదహనము సేయనెట్లు కోరిక వొడమెన్॥ చ॥ సతతమహత్త్వసత్త్వగుణసత్పురుషస్రుతిఁ బొందిరయ్యమి । పితరులును బితామహులు పెద్దలు నెన్నఁడుఁ బొందనట్టిదు। ష్కృతమతమైనకోపమునఁ గిల్బిషభావము మానరయ్య సం। భృతకరుణావలోకమున భీతతరుప్రకరంబుఁ జూచుచున్॥ ఉ॥ తప్పక నర్భకావళికిఁ దల్లియుఁ దండ్రియు నేత్రపక్ష్మ కిన్। తెప్పలు నాతికిం బతి నరేంద్రుఁడు లోకుల కెల్ల నర్థికి। న్నెప్పు గృహస్థముఖ్యులకు నుత్తము లెన్నఁగ వీరు బంధువు। ల్మప్పునఁ గావలేనికడు మూర్ఖులు సుమ్మి సమస్తబంధువుల్॥ సీ॥ అఖిలభూతముల దేహాంతస్థమగు నాత్మ యీశుఁ డచ్యుతుఁ డని యెఱుఁగవలయు। నెఱిఁగి సర్వంబైనయిందిరారమణుని లోఁజూపు దనివిగాఁ జూడవలయుఁ। జూచిన చిద్రూపశుద్ధాత్ములగు మిమ్ము నెఱసిన వేడ్కతో నిచ్చ మెచ్చు మెచ్చిన సర్వాత్ము మీ రెఱింగిన చోటఁ గోపగుణంబులఁ బాపవలయుఁ। బాపి దగ్ధశేషపాదపజాలంబు। దియ్యమెసఁగఁ బ్రతుకనీయవలయు। ననఘులార మీరలస్మదీయ ప్రార్థ। నంబు సరగఁ జేకొనంగవలయు ॥ క ॥ ఇది వృక్షసముద్భవయగు। మదిరేక్షణ నాప్సరసఁ గుమారిక నిత్తు। న్వదలక పత్నిగఁ జేకొని। ముదమందుఁడు పాదపముల మోసము వాయన్॥ వ॥ అని యిట్లామంత్రణంబు సేసి మారిష యను కన్యకను వారలకిచ్చి చంద్రుండు చనియె నప్పుడు ॥ క ॥ వారలు పర్యాయంబున । నీరజముఖి నిన్వరించి నెఱిరమియింపన్। ధీరుఁడు ప్రాచేతసుఁడై । వారకఁ దక్షుండు పుట్టె వనజజసముఁడై॥ క ॥ ఎవ్వని సంతానంబులు। నివ్వటిలెన్వసుధ నెల్ల నెఱి నాదక్షుం । డివ్వలన జగములన్నిటఁ। బ్రవ్వ జలము నిలిపి సత్ప్రజఁ బుట్టించెన్॥ ఉ॥ వారని వేడ్క తోడ సుహితత్వవత్సలదక్షుఁ డుదక్షుఁ డాత్మచేఁ। గోరి సృజించెఁ గొన్నిటిన కుంఠితవీర్యము చేతఁ గొన్నిటిన్।

భూరుహఖేచరంబులను భూచరముఖ్యవనేచరంబులన్। నీరచరవ్రజంబు రజనీచరజాలదివాచరంబులన్. క॥ నరసురగరుడో
రగకిన్నర దానవయక్షపక్షినగవృక్షములం। దరమిడి సృష్టి యొనర్చెను। దిరముగ దక్షప్రజాపతిస్ఫుటకీర్తిన్॥ క॥ బహు
విధములబహుముఖములు బహురూపములైన ప్రజలబహులోకములన్। స్పృహణీయముగం జేసి మదిలో। బహుమానముం
దండమ్యెం బ్రఖ్యాతముగన్॥ గీ॥ ఆ ప్రజాసర్గ బృంహితంబయిన జగము। దక్షుండీక్షించి మదిలోనం దాపమొంది। సంటియు
జననంబు నొందించు మతము పోసి। పరమపురుషుని నాశ్రయింపంగ దలంచె॥ వ॥ ఇట్లు దక్షప్రజాపతి ప్రజాసర్గంబు చాలక
చింతించి మంతనంబున లక్ష్మీకాంతుని సంతుష్టుం జేయువాండై॥ క॥ మోదంబై పరిమాషిత। ఖేదంబై శాబరీర్ఘకలికిం చితవ్య।
గ్ఛేదంబై బహుసౌఖ్యా। పాదంబై యొప్పు వింధ్యపాదంబునకున్॥ వ॥ ఇట్లు వింధ్యపాదంబునకరిగి యందఘమర్షణంబను
తీర్థంబు సర్వదురితహరంబయి యొప్పు దానినను సవనంబు సేవించి యతిఘోరంబయిన తపంబు సేయుచు హరిం బ్రసన్నుం

శ్రీ దక్షుండు స్తుతియించిన హంసగుహ్యంబను స్తవరాజము. శ్రీ

జేసి హంసగుహ్యంబను స్తవరాజంబున నిట్లని స్తుతియించె॥ గీ॥ పరమునికి వందనము సేతుం బరిఢవించి। మును నవితథానుభూ
తికి మ్రొక్కి కొంచు। మెఱయ గుణములం దేలు నిమిత్తమాత్ర। బంధుండై నట్టివానికిం బ్రణుతి సేతు॥ గీ॥ తవిలి గుణముచేతం ద
త్త్వబుద్ధుల చేత। నిగిడి కానరాని నెలవువాని। మొదలందాన కలిగి ముక్తిమానావధి। రూపమైనవాని ప్రాపుం గొందు॥ గీ॥ ఎల్ల
తనువులం మనిలవొందిత నతోడం। బొందు సేసినట్టి పొందు కాని। పొందు వొందలేండు పురుషుండు గుణముదా। గుణిని బోలు
నట్టి గుణిభజింతు॥ ఉ॥ పూని మనంబు నున్న నువు భూతములున్ మఱియుం గ్రియంబులున్। బ్రాణములున్ వివేకగతిం బాయక న
న్యమువంబు నెమ్మెయిం। గానంగ నేరవా గుణనికాయము లంబరికించునట్టిస। ర్వానుగతున్ స్వతహితునాదిమ పూరుషు
నాశ్రయించెదన్॥ వ॥ మఱియు ననేకవిధనామరూపనిరూప్యంబగు మనంబునకు దృష్టస్మృతుల నాశంబువలనం గలిగెడు ను
పరామంబగు సమాధియందుం గేవలజ్ఞానస్వరూపంబునం దోంచు నిర్మలప్రతీతిస్థానుండై న హంసస్వరూపి కిన మస్కరింతు
దారువందు నతిగూఢంబైన వీతిహోత్రుని బుద్ధిచేతం బ్రకాశంబు నొందించు భంగి బుద్ధిమంతులు హృదంతరంబున సన్ని
వేశుండయిన పరమపురుషుని నాత్మశక్తిత్రయంబుల చేతం దేజరిల్లం జేయుచు రట్టి దేవుండు సకలమాయావిచ్ఛేదకంబయి
న నిర్వాణసుఖానుభవంబులం గూడియు వ్వరింపం గొలంది గాని శక్తిగల విశ్వరూపి నాకుం బ్రసన్నుండగుం గాక వాగ్బుద్ధీం
ద్రియమానసంబుల చేతం జెప్పనిట్టిది నిరూపింపనలవిగాక యెవ్వని గుణరూపంబులు వర్తించు నెవ్వండు నిర్గుణుండు సర్వం
బు నెవ్వని వలన నుత్పన్నంబగు నెవ్వని వలన స్థితిం బొందు నెవ్వని వలన లయంబగుం బరాపరంబులకుం బరమంబై యనన్యం
బై ప్రాక్ప్రసిద్ధంబై సర్వవ్యాపకంబై యాదికారణంబై యున్న తత్త్వంబు నాశ్రయింతు నెవ్వని ప్రభావంబు మాటలా
డెడు వారలకు వాదంబు సేయువారలకు వివాదస్థలంబులగుచు నప్పటప్పటికి మోహంబు నొందించుచుండు నట్టి యనంతగు
ణంబుగల మహాత్మునకుం బ్రణామంబు సేయుచు నస్తినాస్తి యను వస్తుద్వయనిష్ఠలం గలిగి యొక్కటనగలిగియుండి విరుద్ధ
ధర్మంబులు గనుంగొను పాసనా శాస్త్ర సాంఖ్యశాస్త్రంబులకు సమంబై వీక్షింపందగిన పరమంబు నాకు ననుకూలంబగుం
గాక నెవ్వండు జగదనుగ్రహంబు కొఱకు జన్మకర్మంబుల చేత నామరూపంబు లెఱుంగంబడుచుండు నట్టి నామరూపంబులు
గలిగి తేజరిల్లు ననంతుండయిన భగవంతుండు ప్రసన్నుండగుం గాక యెవ్వండు జనులపురాకృతజ్ఞానపదంబుల చేత నంతర్గ
తుండై మేదినిం గలుగు గంధాది గుణంబుల నాశ్రయించిన వాయువు భంగి మెలంగుచుండు నా పరమేశ్వరుండు మదీయమ
నోరథంబు సఫలంబు సేయుం గాక యను చు భక్తిపరవశుండై యుక్తివిశేషంబున స్తుతియించుచున్న దక్షునికి భక్తవత్స
లుండైన శ్రీవత్సలాంఛనుండు ప్రాదుర్భావంబు నొంది ప్రత్యక్షుండయ్యె నంత॥ సీ॥ భగ్నాచలేంద్ర ప్రపాతద్వయంబు
నం గలిగిన నీలంపు గనుల నంగ। మొనసి తార్క్ష్యుని యురమూంపు పైం బడ్డట్లు పదముల కాంతులు పరిఢవింపం। జయదిక్కుండల
శుండాలకరముల కై వడి నెనిమిది కరములమరం। జక్రకోదండాసి శంఖనందక పాశ చర్మ గదాముల సరవిం బూని। నల్లమే
ను మెఱయ నగుమొగంబలరంగం। జల్లచూపు విబుధసమితిం బ్రోవం। బసిండి కాశంబూని బహుభూషణ కిరీట। కుండలముల
కాంతి మెండుకొనంగ॥ సీ॥ కుండలమణిదీప్తి గండస్థలంబులం బూర్ణేందు రాగంబుం బొందుపరప। దివ్యకిరీటప్రదీప్తులంబర
రమాసతికిం గౌసుంభవస్త్రంబు గాంగ। వక్షస్థలంబున వనమాలమాలికల్ శ్రీవత్సకౌస్తుభ శ్రీల మెఱయ। నీలాద్రిం బెనం
గొని నిలిచిన విద్యుల్లతల భాతి కనకాంగదంబు మెఱయ। నఖిలలోక మోహనాకారయుక్తుండై। నారదాది మునులు సేరి సొ
గడం। గదిసి మునులుం బొగడ గంధర్వ కిన్నర। సిద్ధ గానగవము సెవ్వులనలర॥ క॥ సర్వేశుండు సర్వాత్ముండు। సర్వగతుండచ్యు
తుండు సర్వమయుండై। సర్వంబు చేరి కొలువంగ। సర్వగుండై దక్షునకుం బ్రసన్నుండయ్యెన్॥ వ॥ ఇట్లు ప్రసన్నుండయిన స

ర్వేశ్వరునిసర్వంకషంబయి,మహాదాశ్చర్యధుర్యంబయి తేజరిల్లుదివ్యరూపంబుఁగాంచి, భయంబును,హర్షంబును,విస్మయంబును,జిత్తంబునముప్పిరిగొని,చొప్పఁదప్పింపం దెప్పిరికప్పురపాటునంబుడమిపై,నిడుసాగిలంబడిదండప్రణామంబులాచరించికరకమలంబులుమొగిడ్చి సెలయేరులతోఁగొట్టుపడియిట్టట్టుపట్టుచాలక నిట్టవోడిచిమునీన్నరుఁడన్ని నిలిచినపెన్నీరునుంబోలెసర్వాంగంబులుందొంగలించిచిత్తంబునాత్మాయత్తంబుసేసిపిక్కటిల్లినసంతోషంబుచేతభగవంతుంబలుకకను,నత్యంతమంగళసందోహాపాదకంబులైనతన్నామంబులుగ్గడింపనతినిర్మలంబులైన తదీయకర్మంబులుదడువను,విబుధహర్షకరంబులైన,తత్పౌరుషంబులుపొగడను,నాత్మీయమనోరథంబువాక్రువ్వనోపక,ప్రజాకాముండైయూరకున్న,ప్రజాపతింజూచిసర్వజీవదయాపరుండును,సర్వసత్వహృదంతరస్థుండును, సర్వజ్ఞుండునుంగావున,నతనిభావంబుదెలిసి,జగన్నాథుం,డార్తపోషణంబులైనభాషణంబులనిట్లనియె॥ క॥ మెచ్చితిప్రాచేతసతప।మిచ్చటఫలసిద్ధియయ్యెనిట్లతిభక్తిన్। హెచ్చగుమద్వరవిభవము।నచ్చుపడంబొందనెవ్వఁడర్హుఁడుజగతిన్॥గీ॥తపముచాలునింకఁదగభూతతతికివిభూతులొనరుగాకపొందుపడఁగ।నిదియసుమ్ముమాకునిచ్చలోఁగలకోర్కి।పొసఁగనీదువలనఁబొందుపడియె॥వ॥వినుముబ్రహ్మయు,భర్గుండును,బ్రజాపతులు,నింద్రులును,వీరలునిఖిలభూతంబులకుభూతిహేతువులయిన, మద్భూతివిభవంబులు,మఱియునాకు,యమనియమాదిసహితసంధ్యావందనాదిరూపంబగుతపంబుహృదయంబు,సాంగజపవద్ధ్యానరూపంబగువిద్యశరీరంబు,ధ్యానాదివిషయపుంవ్యాపారంబుగానుండు,భావనాదిశబ్దవాచ్యంబగుక్రియ యాకృతియుఁ,గ్రతుజాతంబులంగంబులు,ధర్మంబాత్మ,దేవతలుప్రాణంబులు,నిగమంబునుత్స్వరూపంబు,జగదుత్పత్తికినాదియందునేనొకఁడనతేజరిల్లుచుంటి,బహిరంతరంబులవేఱొక్కటిలేదు, సుషుప్త్యవస్థయందుసర్వంబులీనం బగుటంజేసి, సంజ్ఞానమాత్రుండునవ్యక్తుండునుగానుండుజీవునిభంగినొక్కఁడనయుండుదు,ననంతుండనై,యనంతగుణంబులుగలమాయాగుణంబువలన,గుణవిగ్రహంబగుబ్రహ్మాండంబును, నయోనిజుండుస్వయంభువుండగు బ్రహ్మయును,నుదయించిరి,మదీయవీర్యోపబృంహితుండయి,మహాదేవుండగునాబ్రహ్మయసమర్థునిఁబోలెనకృతార్థంమన్యమానమనస్కుండయి,సృష్టింపనుద్యమించుతఱి; తపంబాచరింపుమనినాచేతబోధితుండయి, యఘోరంబైనతపంబాచరించి, తొలుతసృష్టికర్తృత్వంబువహించినమిమ్ముసృజియించె,నంతపంచజనుండగుప్రజాపతితనూజయగు, యసిక్నియనుపేఱటవినుతినొందియున్నయిక్కన్యకనునీకిచ్చితి,దీనింబత్నిగాఁగైకొని,మిథునవ్యవాయధర్మంబుగలవాఁడవై,మిథునవ్యవాయధర్మంబుగలయీనాతియందుఁ,బ్రజాసర్గంబు,నతివిపులంబుగఁగావింపంగలవాఁడవుమఱియునీకు,బిదపనీక్రమంబుననిఖిలప్రజలును,మన్మాయామోహితులయి,మిథునవ్యవాయధర్మంబునఁబ్రజావృద్ధినొందించి,మదారాధనపరులైయుండఁగలవారనిపల్కి-విశ్వభావనుండైనహరి,స్వప్నోపలబ్ధార్థంబునుంబోలె,నంతర్ధానంబునొందెనప్పుడు, దక్షుండువిష్ణుమాయోపబృంహితుండై,పాంచజనియగునసిక్నియందు,హర్యశ్వసంజ్ఞలవినుతిఁజెందియున్నయయుతసంఖ్యాపరిగణితులైనపుత్త్రులంగాంచె,నప్పుడాధర్మశీలురైన,దాక్షాయణులు,పితృనిర్దేశంబునం,బ్రజాసర్గంబుకొఱకుఁ,దపంబుసేయువారైపశ్చిమదిశకుంజని,యచ్చటసింధుసముద్రసంగమంబున,సమస్తదేవమునిసిద్ధగణసేవితంబైదర్శనమాత్రంబున,నిర్ధూతకల్మషులను, నిర్మలచిత్తులంజేయుచున్న,నారాయణసరస్సనంబరగు,తీర్థరాజంబున, నవగాహనంబుఁజేసి,నిర్మలాంతరంగులై,పరమహంసధర్మంబునందు,నుత్పన్నమతులైప్రజాసర్గంబుకొఱకుఁదండ్రియనుమతంబున, నుగ్రతపంబుసేయుచుండవారికడకునారదుండువచ్చియిట్లనియె॥ సీ॥మీరలిమూఢులుమీఁదటిగతిగానరెన్నంగఁబసిబిడ్డలన్నలార।పుడమిఁదానింతనికడఁబరికింపరుప్రజలబుట్టింపనేప్రతిభగలదు।అక్షైననొక్కఁమహాత్ముఁడుపురుషుండుబహురూపములుగలభామయొకతె। పుంశ్చలిగర్తయుఁబురణింపనుభయప్రవాహంబుగలనదివరలఁగడల।నంచయొకటియిరువదైదింటిమహిమలఁగలిగియుండుతెరువుగానరాక । వజ్రనిబిడముగుచువరుసదనంతన। తిరుగుఁగాష్ఠబిలముచేటపడఁగ॥క॥ వినుఁడందులననురూపము। ననువొందగనెఱుఁగకాత్మనాత్మగురూక్తిం। గొనసాగించెదమనుమి। మ్మననేమియులేదుమూఢులనితెలిసితగన్ ॥ వ ॥అనినారదుండుబోధించినహర్యశ్వులు సహజబుద్ధిచేత నారదవాక్యంబులఁదమలో నిట్లనివితర్కించిరి॥ గీ ॥ సొరదిక్షేత్రజ్ఞుఁడననతి సూక్ష్మమంది । యరయ నజ్ఞానబంధనం బగుచులింగ । దేహమున నెద్దిగలదదిదెలియకున్నఁ । గలదెమోక్షంబు దుష్కర్మగతులచేత ॥ గీ ॥ కలఁడుజగదేకసన్నుతకారణుండు। స్వామిభగవంతుఁడభవుండు స్వాశ్రయుండు । పరముఁడాతనిఁజూడక బ్రహ్మకైనఁ । గలుగునేముక్తిపదము దుష్కర్మగతుల॥ గీ॥ పురుషుఁడెట్లయేనిఁబూనిబిలస్వర్గ । గతుఁడువోలెవర్తకంబుమాను। నట్టిబ్రహ్మమెఱుఁగునయ్యకుస్వర్లోక । కర్మగతు

లనేమి కానఁబడును॥ శా॥ తన్నిష్ఠాగతి లేని వానికి నసత్కర్మప్రచారంబుచే। మున్నేమయ్యెడి నాత్మబుద్ధిగుణసమ్మోహం
బునం దోఁచుచు।నవ్వన్నెల్వెట్టుక వింతబాగులతఱిన్వర్తించు దౌర్గుణ్యసం।పన్న స్త్రీయును బోలె నెల్లగతులం బ్రఖ్యాతిమై
యుండఁగన్॥ సీ॥ అనువొందసృష్టి నవ్యయముగఁ జేయుచుఁ బ్రచురప్రవాహసంపతితమైన। నెఱియఁగూలంబను నిర్గమ
స్థానంబునందు వేగముగల క్రందుమాయ। కడలియహంకారగతివశంబునఁ జాలవివశుఁడై బోధకువిపరీతమైన। వానికి నీరీ
తి వలవంతకర్మప్రచారంబులను మీఁదఁ జకటనైన।జన్మమరణముఖ్యజాడ్యంబుతోఁ బాసి। యఖిలసౌఖ్యపదవి నరసికప్ర।
మార్గమైన యట్టి మహనీయధామంబు। ధిత్తమార నెట్లు చేరఁగలఁడు ॥గీ॥ దానిసంసర్గగుణములు దప్పినఁచుచుఁ। సుచ్చితపు
భార్యఁ జేకొన్నకుమతి వోలెఁ।దివిరి సుఖదుఃఖములఁ గూడి తిఱుగుజీవ।రూపమెఱుఁగని వారికిఁ బ్రాపుగలదె ॥మత్తకోకిల॥
పంచవింశతితత్త్వరాశిక పారదర్పణమయ్యెఁడాఁ। గొంచమైపురుషుండు తత్త్వముఁ గోరిపట్టగ నేరకే। మంచుఁదలఁచుచు
నుండి హేయకుమార్గకర్మము సేయఁగా।మంచిలోకము వానికేటికి మానుగా సమకూరెడిన్॥క॥బంధాను మోక్షణక్ర
మ।సంధానైశ్వర్యధుర్య శాస్త్రప్రసమగ్ర। గ్రంథంబు మాను చిద్రూ।పాంథునకు సుకర్మగతులనగు నేశుభముల్ ॥మత్తకో
కిల॥ చూడనీజగమంతయున్వెసఁ జుట్టిపట్టుక లీలనే।జోడు లేక రయంబునం సుడిచుట్టినట్టి స్వతంత్రముఁ।గూడియుండిన కా
లచక్రముఁ గోరిచూడని వారికే।జాడఁ గల్గును కర్మసంగతిఁ జారు మోక్షపదంబిలన్ ॥గీ॥ జన్మహేతువైన జనకనిర్దేశంబు।
తనకుఁ జేయరానిదనుచుఁ దెలిసి। గుణమయప్రవృత్తి ఘోరాధ్వనిశ్వాస। నిరతుఁడగుచుఁ జేయ నేరఁడతడు॥వ॥అనితమ
లో వితర్కించి యామమారులప్పుడు॥ సీ॥ వినవయ్య భూపాల మునివరేణ్యుని మాటలను వొందఁదలపోసి వినయమలర।పల
గొని యతనికి వందనంబొనరించి తిరిగి యొన్నఁడు రాని తెరువుపట్టి। చయ్యన నేగి రిసహజసత్త్వబ్రహ్మమయమైన పంకజన
యను పాద। పద్మమరందంబు పానంబు సేయుచుమత్తిల్లి నిలిచిన మానసాళి। పరిణమింపవిష్ణుఁ బాడుచుఁ దలీకర్తి। సరణి
మ్రోయు మహాలి సంఘటిరిది। నారదుండు గుణవిశారదుండెందేనిఁ।జనియె జగము దన్ను సన్నుతింప॥క॥అప్పుడు దక్షుఁడు
తనయులు।దప్పిమహాపథముగనుటఁ దగ నారదుఁడే।చెప్పినఁ గప్పిన శోకము।ముప్పిరిగొని చిత్తవృత్తి మూఱింబోవన్॥చ॥అ
డలుచునున్న వద్మికమలాసనుఁ డూరడిలంగఁ బల్కె।ముస్నడసిన లీలపుత్త్రులన పారగుణాఢ్యులఁ గాంచుమన్నన। పడఁతు
కయందుఁ గ్రమ్మరను బల్వురఁ దాశబళాశ్వసంజ్ఞులం।బెడఁగగువారిఁ బుణ్యములఁ బేర్చినవారిసహస్రసంఖ్యలన్॥ క॥పు
ట్టించిన జనకుని మదిఁ।బుట్టిన తలఁ పెఱిఁగి వారు పూని కెఁ బ్రజలం। బుట్టించు వ్రతముఁ గైకొని। గట్టిగఁ దపమాచరింపఁ గాఁ
జనిరి వెసన్॥వ॥ఇట్లు శబళాశ్వులు ప్రజాసర్గంబుకొఱకుఁ దండ్రి పంపునం దపంబు సేయువారై యే తీర్థంబు తీర్థరాజంబై
సకలతీర్థఫలంబుల నాలోకనమాత్రంబున ననుగ్రహించు సకలపాపంబులని గ్రహించు నే తీర్థప్రభావంబున నగ్రజన్మ
లుఫలసిద్ధిం బొందుదురట్టి నారాయణసరస్సను పుణ్యతీర్థంబునకుం జని తదుపస్పర్శమాత్రంబున నిర్ధూతమలాపహాత్ములై॥
శా॥ బ్రహ్మేంద్రాదులు నంద నేరని పరబ్రహ్మంబుఁ జింతించుచున్। బ్రహ్మానందముఁ బొంది జిహ్వకలపై బ్రహ్మణ్యమం
త్రంబుసద్బ్రహ్మలోకననాంఛతో నిలుపుచున్ బ్రహ్మంబితండంచుమున్। బ్రహ్మజ్ఞానగురున్ హరిం దపమునం బాటిం
చిరబ్బాలకుల్ ॥సీ॥ఏకపాదాంగుష్ఠమిలమీఁద సవరించి నిశ్చలకాయులై నిక్కి నిలిచి। కరములు గీలించి సరవిమీఁదికి నెత్తి
గురుతుగాఁ బెనుబయల్గుట్టిపట్టి। నిడివిగాఁ గ్రూరమైనిగిడిన చూడ్కులఁ గడుతీవ్రభానునిఁ బొదివిపట్టి।వడిఁ గొంత కాలంబు
వాయువు భక్షించి యంతనుండియు నిరాహారులగుచు। సకలలోకములకు సంహారకరమును। బేర్చి దేవతలకు భీతికరము।
గాఁగ ఘోరతపముఁ గావింపఁ దొడగిరి। మహిత చిత్తులకుమారవరులు ॥వ॥ ఇట్లతిభయంకరంబయిన తపంబు సేయుచు

### శ్రీ నారదుండు శబళాశ్వులకు నివృత్తిమార్గంబు నుపదేశించుట. శ్రీ

నెడ తెగక భగవన్మంత్రంబులనొడువుచుఁ బ్రజాసర్గకాములైయున్న యచ్చిన్నబాలురకడకు నారదుండు సను దెంచి పూ
ర్వవిధంబునం బలుకుచు నిట్లనియె భ్రాతృవత్సలులై యున్న మీరలు వేదాంతసారంబుఁ బలుకుచున్న నావచనంబు లాదరిం
చి తోఁబుట్టువులు సనిన మార్గంబునఁ జనుం డెవ్వరేనియుఁ దనయగ్రజులు గన్నమార్గంబునందానును దప్పక వర్తించునట్టి
వాని విశేషధర్మం బెఱింగినవాఁడండ్రు సతతంబును బుణ్యబంధుండై దేవతలం గూడి సుఖంబుండుఁడని పల్కి నారదుండు స
నియె వారలు సర్వకర్మంబులయందు నిర్మోహితులై పరమపదంబునకు నాస్పదంబులయిన దేవర్షివాక్యంబుల నాశ్రయించి॥
ఉ॥అప్పుడు లజ్జతో డశబళాశ్వులు పూర్వజులేగినట్టియా। చొప్పున నెన్నఁడుం దిరిగి చూడని త్రోవవిశేషపద్ధతిం।దప్పకఁ బో
యిరయ్య గుణధాములు నేఁడును మళ్లరేమి నేఁ। జెప్పెదఁ గాక రాక కడఁ జేరిన రాత్రులఁ బోలి భూవరా॥ క॥దక్షుని కాకా
లంబున।లక్షితమైయుండెఁ బెక్కులాగులను త్పా।తక్షోభంబుల వారికి।రూక్షవ్యధనొందియా పురుష నాశమునన్॥క॥నా

రపకృతమని యెంతేఁగినఁ। హారోషముతోడ నేగి యాతనిఁగని దుఃఖారూఢచిత్తుఁడై మది। నూరడిలం దెరువు లేక నుగ్రుండగుచున్॥ గీ॥ మోము జేవురింప ముడివడ బొమదోయి। చూపు వెంట మంట సుడిగొనంగ। బెదవులదరఁ బండ్లు పెటపెటఁ గొఱుకుచు। దక్షుఁ డాగ్రహించి తపసిఁ బలికె॥ చ॥ నెఱయఁగ సాధురూపమున నీవతిబాలుర నాత్మజాలికిం। గఱపున భిక్షుమార్గ మసుకందువ సెప్పితి వేల ధూర్తవై। మఱగక యుండవచ్చునె కుమారకు లీచరితంబు నేఁడు ని। న్నెరలఁగ ద్రోతు నాదుసమ

➡ శ్రీ దక్షుండు నారదుని శపియించి ప్రజాసర్గం బొనరించుట. శ్రీ ⬅

ద్రోగ్ర మహోగ్రహ శాపవహ్నులన్॥ వ॥ అదియెట్లంటేని దేవర్షి పితృఋణంబులు దీర్పక కర్మవిచారంబు సేయని బాలురవునంబులకు నైహికేచ్ఛలయందు నైరాశ్యముఁ గలుగం జేసి నివృత్తిమార్గంబు పదేశించి వారలకు నుభయలోకంబులయందుఁ జెందఁగల శ్రేయోహాని నొనర్చితి విట్టి పాతకంబున భాగవతోత్తములలో లజ్జాహీనుండవై యశోహానిం బొంది చరింపుము వుగాక నిరపరాధులై వైరంబు లేని నా పుత్రులపట్ల ద్రోహకృత్యం బొనర్చినని న్నుదప్పఁ దక్కన భాగవతోత్తములు సకలభూతానుగ్రహపరవశులు గావున నిరంతరంబును లోకసంచారివైన నీకు నేలోకంబునను నికిప్పట్టు లేకుండుఁగాక యని నిర్దయుండై శాపం బిచ్చె నంత నారదుండు తత్తీక్ష్ణవాక్యంబులకలుగక యట్ల కానిమ్మని సమ్మతించి చనియె నిట్టి శాంతభావంబు నెవ్వనివలనం గలుగు నతండు సర్వాతీతుండై సర్వేశ్వరుండనంబడు మఱియు దక్షుండు తన మనోరథంబు విఫలంబగుటం జేసి యతిదుఃఖితమనస్కుండై పొగులుచున్నఁ బితామహుండు చనుదెంచి మఱియుఁ బ్రజాసర్గోపాయంబు పదేశించిన నా ప్రజాపతి ప్రియభామయైన యసిక్నియందుఁ బితృవత్సలలైన పుత్రికల నరువదింటినిం బుట్టించి వారిలో ధర్మునకుం బదుగురను, గశ్యపునకుం బదమువ్వురను, జంద్రునకు నిరువదేడ్వురను, భూతునకు నాంగిరసునకుఁ గృశాశ్వునకు నిద్దరేసి చొప్పున నార్వురను దార్క్ష్యుఁడను నామాంతరంబుఁ దాల్చిన కశ్యపునకు మఱి కడమ నలుగుర నీక్రమంబున నిచ్చె వారి నామంబు లాకర్ణింపుము॥ గీ॥ ఎట్టి పుణ్యవతులొ నీ చేడియలు సెప్ప। సవతులేని యట్టి సవతులయ్యుఁ। గడుపు వడసి రెట్టి కడుపునఁ బుట్టిరో। కడిది త్రిజగమెల్ల కడుపుగాఁగ॥ వ॥ వారలెవ్వరనిన, భానువు, లంబయుఁ, గకుప్పు, జామియు, విశ్వయు, సాధ్యయు, మరుత్వతియు, వసువును, ముహూర్తయు, సంకల్పయు, ననంబరగు రుధర్మునకుఁ బత్నులై కొడుకులం బడసిరి. వారలెవ్వరంటేని, భానువుకు వేదఋషభుండు పుట్టె, నతనికి నింద్రసేనుం డుదయించె లంబకు విద్యోతుండు గలిగె నతనికి స్తనయిత్నుండు వులను వారు పుట్టిరి, కకుబ్దేవికి సంకటుండు పుట్టె, సంకటునకుం గీకటుండు పుట్టెఁ, గీకటునకు దుర్గాభిమానులయిన దేవతలు జన్మించిరి, జామిదేవికి దుర్గభూముల కధిష్ఠానదేవతలు జనియించిరి, వానికి స్వర్గుండును, నందియు జన్మించిరి, విశ్వయను దానికి విశ్వేదేవతలు జన్మించిరి, వారలపుత్రకులనంబరగిరి. సాధ్యయను దానికి సాధ్యగణంబులు పుట్టె, వానికి నర్థసిద్ధి యను వాఁడు పుట్టె, మరుత్వతియను దానికి మరుత్వంతుఁడు జయంతుఁడను వారలుదయించిరి, యందు జయంతుండు, వాసుదేవాంశజుండైన యుపేంద్రుఁడనంబడి వినుతి నొందె, ముహూర్తయను దానికి సకలభూతంబులకు నాయా కాలంబులఁ గలిగెడు, నాయా ఫలాఫలంబుల నిచ్చు మౌహూర్తికులనియెడు దేవగణంబులు పుట్టిరి, సంకల్పయను దానికి, సంకల్పజుండయిన కాముండు జనించె, వసువను దానికి, ద్రోణుండును, బ్రాణుండును, ధ్రువుండు, నర్కుండు, నగ్నియును, దోషుండును, వస్తువును, విభావసుండు, నను నెనమండ్రు వసువులుదయంబు నొందిరందు ద్రోణునకు నభిమతియను భార్యయందు, హర్షశోకభయాదులు పుట్టిరి, ప్రాణునకు భార్యయైన, యూర్జస్వతియందు సహుండు, నాయువును, బురోజవుఁడను వారు గలిగిరి, ధ్రువుని భార్యయగు ధరణియందు వివిధులగు పురులను వారు జనించిరి యర్కునికి భార్యయగు వాసనయందుఁ దర్షాదులుదయించిరి, యగ్నికి భార్యయైన వసుధారయందు ద్రవిణకాదులు పుట్టిరి మఱియుఁ గృత్తికకు స్కందుండు గలిగె నా స్కందునకు విశాఖాదులుదయించిరి దోషునకు శర్వరియను భార్యయందు హరికళ యగు శింశుమారుం డుదయించె వస్తువునకు నాంగిరసయందు విశ్వకర్మయను శిల్పాచార్యుం డుదయంబందె నా విశ్వకర్మునకు నాకృతియను సతియందుఁ, జాక్షుషుండను మనువు జనించె, నా మనువువలన విశ్వులు సాధ్యులను వారలు పుట్టిరి, విభావసునకు నుషయను భార్యయందు, వ్యుష్టియు, రోచిస్సు, నాతపుండును జనించిరి, యందు నాతపునికిఁ, బంచయాముండను దివసాభిమాన దేవత జనించె, శంకరాంశజుండయిన భూతునకు సురభియను భార్యయందుఁ గోట్లసంఖ్యలైన రుద్రగణంబులుదయించిరి, రైవతుం, డజుండు, భవుండు, భీముండు, వాముం, డుగ్రుండు, వృషాకపియు, నజైకపాత్తు, నహిర్బుధ్న్యుండును, బహురూపుండును, మహాత్ముండు, నను వారలనతి భయంకరులగు రుద్రపారిషదులయిన ప్రేతలును, వినాయకులును, బుట్టిరంగిరస్సను ప్రజాపతికి, స్వధయను భార్యయందుఁ, బితృగణంబులు పుట్టిరి, సతియను భార్యకు, నథర్వణ వేదాభిమాన దేవతలు పుట్టి

బృకృశాశ్వునకునర్చిస్సను భార్యయందు, ధూమ్ర కేశుండనుపుత్త్రుండుదయించె, వేదశిరస్సునకుధిషణయను భార్యయం
దు, దేవలుండును,వయునుండును,వసువునుంబుట్టిరి, తార్క్ష్యునకువినత,కద్రువు,పతంగి,యామినియనునలువురుభార్యలం
దు, బతంగికిఁబక్షులుపుట్టె,యామినికిశలభంబులుపుట్టె,వినతకుసాక్షాత్కరించిన యజ్ఞాధిపతికివాహనంబై నగరుడుం
డును,సూర్యునకుసారథియైనయనూరుండునుజనియించిరి, కద్రువునకుఁబెక్కు తెఱంగులగుభుజంగమంబులుపుట్టెఁ,జం
ద్రునకుఁగృత్తికాదినక్షత్రంబులుభార్యలు,వారలయందుఁజంద్రుండు, రోహిణియందుమాత్రము, మోహితుండగుటం
జేసి,దక్షు శాపంబున,క్షయరోగగ్రస్తుండై, సంతానంబువడయ నేరఁడయ్యె,నంతదక్షు ప్రసాదంబునక్షయపీడితంబులగు
కళలమఱలంబొందెమఱియును॥ సీ॥ కామితప్రదుఁడైనకశ్యపుఁగౌఁగిటముచ్చటదీర్తు రేముద్ద రాంద్రు। అఖిలలోకములు
కునవ్వలైజగమెల్లఁబూజింపసుందరేపూవుబోంట్లు। బలియులైపుత్త్రులుపౌత్త్రులుత్రిజగంబు లేలంగఁజూతు రేయింపు
ముఖులు। ముంగొంగుపసిడియైమూల్గుపుణ్యంబులవిట్టిపీగెదరెట్టివింతరాంద్రు। వావిగలగంపకడుపుల నేరుపరుల। సరిజబి
డ్డలఁబడసినబిరుదసతుల। నామములునన్వయంబులునీమనంబు। పూనఁజెప్పుదువినవయ్యమానవేంద్ర॥ తరల॥ అదితియుద్ది
తి కాష్ఠయనర్దనువయ్యరిష్టయుఁదామ్రయు। న్నరయఁగ్రోధవశాఖ్యయున్సురసాఖ్యయున్సురభిన్మునిస్మృదలుగాఁదిమియు
న్నిళప్రియముఖ్యయాసరమాదిగా। ముదితలెన్నఁగఁగన్నసంతతిముజ్జగంబులభావరా॥ సీ॥ చాలంగఁదిమికినిజలచరంబు
లుపుట్టెమఱికిరాతులుసరమకునుబ్రజలు। సురభికిమహిషాదిసుగభులుజనియించెఁదామ్రకుశ్యేనగృధ్రములుగలిగె। ము
నికినప్సరసలమూఁకలుజనియించెనిళగనెభూరుహములును గ్రోధ। వశకుదృవిల్లెముర్వారసర్పంబులుసరియాతుధానులు
సురసకరయ। నుప్పతిల్లిరిగంధర్వులొక్క మొగిన। రిష్టకుదితంబునొందిరిక్రిదశముఖులు। పదియునేనుబంద్రులయినట్టివిది
తబలులు। వారినామాన్వయంబులఁగోరివినుము॥ వ॥ ద్విమూర్ధుండు,శంబరుండు,నరిష్టుండు,హయగ్రీవుండు,విభావసుం
డు,నయోముఖుండు,శంకుశిరస్సు,స్వర్భానుండుఁ,గపిలుండు,నరుణియుఁ,బులోముండు,వృషపర్వుండు, నేకచక్రుం,డను
తాపకుండు,ధూమ్ర కేతుండు,విరూపాక్షుండు,విప్రచిత్తియు,దుర్జయుండు,నను వారలువీరలలోనస్వర్భానునకుసుప్ర
భయనుకన్యకపుట్టె, దానినముచివివాహంబయ్యె, వృషపర్వునకు శర్మిష్ఠయనుకూఁతురుపుట్టె,దానినహుషపుత్త్రుండై
న,యయాతి పెండ్లియయ్యె,వైశ్వానరునకు,నుపదానవి,హయశిర,పులోమ,కాలకయను,నలువురుపుత్రికలుదయించిరం
దునుపదానవి,హిరణ్యాక్షునకుఁబత్నియయ్యె, హయశిరయును,గ్రతువువివాహంబయ్యెఁ,బులోమకాలకలనునిరువుర
ను,గశ్యపప్రజాపతిచతుర్ముఖునివాక్యంబునంగయికొనియె,నాయిరువురకును,సమరకోవిదులయినదానవులు,పౌలోమ
కాలకేయులనంబుట్టిరి,మఱియునాయిరువురకు,నరువదివేలరాక్షసులుజన్మించిరి,వారుయజ్ఞకర్మంబులకువిఘాతకులైవ
ర్తింపవారినింద్రునకుఁబ్రియంబుగానీపితామహుండగునర్జునుండువధించెనుఱియువిప్రచిత్తిసింహికయనుదానియం
దు,రాహుప్రముఖంబుగాఁగలకేతుశతంబునుబడసె, వారలుగ్రహత్వంబుఁగైకొనిరి, మఱియుంబురాణపురుషుండై
న,శ్రీమన్నారాయణుండు,తనయంశంబుననే,పరమభాగ్యవతియయిన,యదితిగర్భంబుననుదయించె, నాయదితివంశం
బును,విదితంబుగావినుపించెద,సావధానుండవయివినుము-వివస్వంతుండు,నర్యముండును, బూషయుఁ, ద్వష్టయు,సవిత
యు, భగుండును,ధాతయు, విధాతయు, వరుణుండును, మిత్త్రుండును,శక్రుండు, నురుక్రముండును, నను మనువులుజ
న్మించిరందు,వివస్వంతునకు,శ్రాద్ధదేవుండను, మనువుసంజ్ఞాదేవియందునుదయించె, మఱియుయముండు, యమియన
ను,నిరువురుమిథునంబుగానుదయంబునొందిరి,మఱియునాసంజ్ఞాదేవి,బడబాస్వరూపంబునొంది,యశ్వినీదేవతలంగనె
ఛాయాదేవియందు,శనైశ్చరుండును,సావర్ణియు,మనువును,దపతియను,కన్యకయుంబుట్టిరి, యాతపతినిసంవరుండును
వరియించె,నర్యమునకు,మాతృకయనుపత్నియందుఁజర్షణులుదయించిరివారిమూలంబునమనుష్యజాతియాలోకంబున
స్థిరంబుగానుండునట్లుబ్రహ్మదేవునిచేఁగల్పింపంబడెఁ,బూషుండుభగ్నదంతుండయి,పిష్టాదులంభక్షించుచుండెఁ
డు క్రోధించిదంతంబులూడనడచిన,నాఁటనుండియు,భగ్నదత్తుండయి, యనపత్యుండయి, పిష్టాదులంభక్షించుచుండెఁ
ద్వష్టకుదైత్యానుజయైన,రచనయనుకన్యకకు, నధికబలాఢ్యుండగు,విశ్వరూపుండు పుట్టెనంతనాదేవతలుబృహస్పతిం
గోపింప,నతఁడుతలఁగిపోయినం దమకునావిశ్వరూపునినాచార్యునింగావరియించిరనిచెప్పనవిని,శుకయోగీంద్రునకుం
బరీక్షిన్నరేంద్రుండిట్లనియె॥ సీ॥ అరయంగయోగీంద్రయచ్యుతంబయ్యెడు సురలపైనేటికిసురగురుండు। కోపించెనీతండు
గురుభావమున దేవతలకేమియాపదఁదలఁగఁజేసె। నెఱిఁగింపుమనవుడునింద్రుండుత్రిభువనైశ్వర్యమదంబునసత్పథం
బు। గానకవసురుద్రగణములునాదిత్యనురుదశ్వినీముఖ్యమండలములు। సిద్ధచారణగంధర్వజిహ్మగాది। సురలుమునులును

రంభాదిసుందరాంగు।లాడఁబాడంగవినుతి సేయంగఁగొలువ ।నొక్కభద్రాసనంబుననుక్కుమీఱి ॥సీ॥ నిండుపున్నమ
నాఁడుగండరించినచంద్రమండలశ్రీలతోమారుమలయ।భద్రవిద్యోతాతపత్రంబుగ్రాలంగమిన్నేటితరగలమేలుకొలు
పఁ।గలితదివ్యాంగనాకరతలచాతుర్యచామీకరశ్రేణిజాడపఱపఁ।జింతామణిస్ఫటికాంతరత్నానేకఘటితసింహాసనా
గ్రంబునందు। నూఱుపీఠంబులోశచియుండనుండి।వరుసదిక్పాలకాదిదేవతలుగొలువ।సాటిఁజెప్పంగరానిరాజసముతో
డ।నింద్రుఁడొప్పారె వైభవసాంద్రుఁడగుచు॥అయ్యవసరంబున॥క॥గురుతరధర్మక్రియనయ।గురుఁడుగురుఁడుమంత్రవి
షయగురుఁడువచశ్శ్రీ।గురుఁడుసమస్తామరగణ।గురుఁడుగురుండరుగుదెంచెఁగొల్వునకునృపా॥చ॥అమితతపఃప్రభావు
ఁగరుణాత్మునిగీష్పతిఁజూచిరాజ్యదు।ర్దమమదరేఖనింద్రుఁడువృథాతనగద్దియ లేవకుండెనే। య్యమున నెదుర్కొనంజన
కయాసనమీయకగౌరవోపచా। రములఁబ్రసన్నుఁజేయకతిరంబుగదివ్యసభాంతరంబునన్॥ క॥ అప్పుడుసురపతిగన్న
లఁ।గప్పినసురరాజ్యమదవికారంబునకుం। జప్పుడుసేయకగృహమున। కప్పుణ్యుఁడుదిరిగిపోయెనతిఖిన్నుండై॥ చ॥ఎఱు
గమిఁజేసినట్టిగురుహేళనమంత నెఱింగియింద్రుఁడ। చ్చెరుపడిభీతినొందియతిచింతితుఁడై తలపోసిపల్కెన। ప్పరమపవి
త్రులోకనుతభవ్యచరిత్రువిశేషపాదపం । కరుహముఁబూజసేయక యకర్మముఁజేసితినప్రబుద్ధినై ॥క॥ త్రిభువనవిభ
వమదంబున। సభలోమద్గురువునకుఁబ్రసన్నునకులస। త్ప్రభువునకు నెగ్గుఁజేసితి । శుభములుదొలఁగంగ నేనసురభావ
మునన్॥గీ॥ పారమేష్ఠ్యమయినపదవినొందినభూపు। లెట్టివారికైన లేవవలదు। విబుధులిట్లు సెప్పవిధమెన్న వారలు। ధ
ర్మవేత్తలనుచుఁదలపఁబడరు॥గీ॥ కుపథవర్తులగుచుఁగుత్సితచర్యచో। నిపుణులయినవారునిడివిదెలిసి।తొలఁగలేకవార
ధోగతిఁబడుదురు।తప్పలేకఱాతి తెప్పభంగి॥ఉ॥కావునలోకవందితునిఁగార్యవిచారునియింటికేఁగిత।త్పావనపాదపద్మము
లపైమకుటంబుఘటిల్ల మ్రొక్కన। త్సేవయొనర్చిచిత్తమువసించిప్రసన్నునిఁజేతునంచున।ద్దేవవిభుండువోయెనతితీవ్ర
గతిన్గురుధామసీమకున్॥సీ॥ ఈరీతిఁదనయింటికే తెంచు దేవతాపతిరాకయాబృహస్పతియెఱింగి। యధ్యాత్మమాయచే
నడఁగియదృశ్యుఁడై పోయెనప్పుడు దేవపుంగవుండు।సకలంబుఁబరికించిజాడఁగానకగురుఁజింతించితలపోసిచిన్నవోయెఁ।
బోయినవిధమెల్లదాయలురాక్షసవీరులువేగులవారివలనఁ । దెలిసిమిక్కిలితమలోనఁదెలివినొంది। యందఱునుగూడి
భార్గవునాశ్రయించి। తత్కృపాదృష్టిఁదమశక్తిదట్టమైన। దేవతలమీఁదిదాడికిఁదెరువువెట్టి॥క॥ ధూర్తులుసమస్తకిల్బి

## దేవాసురయుద్ధము.

ష।మూర్తులువరధర్మకర్మమోచితమార్గావర్తులుదుర్ణయనిర్మిత। కీర్తులుదానవులుసనిరిగీర్వాణులపై॥స్రగ్ధర॥ దండిం
గోదండకాండోద్ధతరథహయవేదండతండంబుతోడన్ । దండెత్తెన్ మెండుగానద్దనుజనికరముద్దేవతాకోటిమీఁదం।జం
డబ్రహ్మాండభేదోద్యచ్ఛ్రియజయరవముల్చండదిక్కుంభగాను । ద్దండప్రఖ్యాతలీలన్ దలపడిరిసురల్దర్పులై వారితోడన్॥
చ ॥ మదమునదేవదానవులుమచ్చరముల్గడుఁబిచ్చలింపసం।పదలనుగోరిపోరునెడభార్గవమంత్రకళావిశేషులై ।యెదు
రులువ్రాలియస్త్రముల నేయమహాసురులేచియేసి పెన్।గుములుగఁగ్రువ్వదేవతలుకోల్తలకోర్వక పాఱిరయ్యెడన్॥గీ॥ద
నుజవీరులేయుదారుణదివ్యాస్త్ర।దళితదేహులగుచుఁదలలువీడ। నోడిపాఱిరచ్యుతోపేతబలులైన।త్రిదశవరులుబిట్టుఁ
దిట్టినట్లు॥క॥ ఒకమొగముగాకదివిజులు। తికమకఁగొనివైరులెల్లడీకొనఁదమ్ముం।బకపకలైకనకనలై। లుకలుకఁబరువె
త్తిరోడిలోఁగొనుభీతిన్॥చ॥దనుజులగర్వరేఖయునుదానవవీరులయంపజోఁకయు।న్మనుజవిశేషభోజనులమచ్చటికంబు
నిశాటకోటియే । చినబలశౌర్యముందమకుసిగ్గనుహానిమహాభయంబుని।ర్గుణకముఁజేయనుమ్మలికఁగోల్తలకోపకపా
ఱిరార్తులై॥ క॥అమరులువిస్పష్టదానవ।సమరులుశరభిన్నదేహసంతాపగుణ।భ్రమరులుదైత్యకిరాతక।చమరులుకమల
జునికడకుఁజనిరిభయార్తిన్॥ఉ॥ ధాతకుదేవతావిభవదాతకుఁబుణ్యజనానురాగసం। ధాతకుసర్వలోకహితతాతకు
వైదికధర్మమార్గని।ర్ణేతకునుల్లసద్విభవనీతకుసర్వజగజ్జయాంగజ।భ్రాతకుఁబుణ్యయోగిజనభావవిధాతకుమ్రొక్కిర
య్యెడన్॥క॥ఆఖండలుండుమొదలుగ। లేఖానీకములబ్రహ్మ లేనగవునని।త్యాఖండలసత్కృపారస। శేఖరవాక్యములవా
రిసేవలుదేర్చెన్॥ వ॥ ఇట్లుబ్రహ్మదేవుండుదేవేంద్రప్రముఖులయినదేవతలకనుకంపాతివిభవంబుననభయంబొసం
గియిట్లనియె॥ఉ॥ నెట్టనఁబాపకర్మమున నేరమిఁజేసితిరేమిచెప్పమీ। పుట్టిననాఁటనుండియునుబుద్ధులుసెప్పిజగంబులేలఁ
గాఁ।బట్టముఁగట్టిపెంచినకృపానిధిబ్రహ్మకళావిధిజ్ఞుఁజేఁ। బట్టకగుట్టుజాఱిసిరిపట్టునఁదొట్టినపొట్టక్రొవ్వునన్॥వ॥బ్ర
హ్మిష్ఠుండైనబ్రాహ్మణునాచార్యుంగైకొనకగురుద్రోహంబుఁజేసితిరి తద్దోషంబిపుడుమీకుఁజేఁజేతశత్రుకృతంబై
యనుభవింపంజేసెనతిబలవంతులయిన మిమ్ముననతిక్షీణులయినరాక్షసులుజయించుట తమయాచార్యుండైనశుక్రునా

రాధించితన్మంత్రప్రభావంబునంబునర్లబ్ధవీర్యులై యిప్పుడుమదీయంబయిననిలయంబునాక్రమింపంగలవారునై మదో
ద్రేకంబుననేమియుఁ దెలియక వర్తిల్లుచున్నరత్నో నాయికులకుంద్రిదివంబుఁగొనుటతృణప్రాయంబభేద్యమంత్రబలంబుగలభా
ర్గవునకువారుశిష్యులగుటం జేసి విప్రగోవిందగవేశ్వరానుగ్రహంబుగలవారలకుఁ దక్కందక్కన రాజులకరిష్టంబగుం
గావునమీరిప్పుడుత్వష్టయనుమునిపుత్త్రుండగువిశ్వరూపుండనుమునినిశ్చలతపోమహత్వసత్వస్వభావుండతనినారాధిం
చినమీకునభీష్టార్థంబులనతండుసంఘటిల్లఁజేయునిట్టిమహద్గుణశీలతండడంచుననిచెప్పినదిక్పాల కాదులుడెందంబులుడిందుప
డికమలగర్భునివీడ్కొనివిశ్వరూపుకడకుంజనియిట్లనిరి॥ గీ॥ అన్న మేలగునీకునిన్నడుగఁగోరివచ్చినారముభవదీయవన
మునకును।సంద్రులకునేఁడుసమయోచితంబులయిన।కోర్కెలొడఁగూడఁజేసిచేకొనుముయశము॥క॥ సుతులకుఁబితృశు
శ్రూషణ। మతిపుణ్యముసేయుచుండునాత్మజులుగుణోన్నతిబ్రహ్మచారులైనను। మతితోగురుసేవకన్నమతియేయుం
గలదే॥ అదియునుంగాక॥సీ॥ అరయనాచార్యుండుపరతత్వరూపంబుదండ్రితలంపంగధాతరూపు। రూపింపభ్రాతమరు
త్పతిరూపంబుదెలియంగతల్లిభూదేవిరూపు। భగినిదయారూపుభావంబుధర్మస్వరూపంబుదానార్థిరూపు మొదలనభ్యాగ
తుఁడున్నయగ్నిదేవునిరూపుసర్వభూతములుగేశవునిరూపు।గానఁదండ్రివేగఁగడునార్తులగుపితృ।జనులమైనమమ్ముఁ
జల్లఁజూచి।పరభయంబువాపినిరుపమంబగుతపో। మహిమచేతమెఱసిమనుపుమయ్య॥వ॥ ఇప్పుడుబ్రహ్మనిష్ఠుండవై
ననిన్నాచార్యునిఁగా వరించి భవదీయ తేజోవిశేషంబుచేత వైరివీరులంబరిమార్చెదమా ర్త్మీయార్థంబయినయుష్మ
త్పాదాభివందనంబునిందితంబుగాదనివేదవాక్యంబుగలదుగావుననీకునమస్కరించుచున్న దేవతలంగైకొనిపౌరోహి
త్యంబుసేయుమనినంబ్రహసితవదనుండై యమ్మునీశ్వరుండిట్లనియె॥గీ॥బ్రహ్మవర్చస్సువోయెడిప్రార్థనంబు। ధర్మగుణ
గర్హితంబనితానెఱింగి।సౌరదిననుబోటితపసియాసురలచేతఁ।బ్రకటమధురోక్తినేటికిఁబలుకఁబడియె॥విశేషించి॥క॥గు
రుధనముఁగూర్చనేటికి। గురుశిక్షుందగిలిమంత్రకోవిదులై సద్గురుధర్మనిరతులేనియు। గురువులకునుశిష్యవరులెకూర్చి
నధనముల్॥సీ॥ అరయనకించనులై నట్టివారికిఁదగుశిలోంఛనవృత్తిధనమునుమ్ము। దానిచేనిర్వర్తితప్రియసాధుసత్క్రి
యగలవారలైప్రీతినొందెదరుగాననసద్గర్హితాచారమైనయాచార్యత్వమిపుడుమీశాసనమునఁ। గైకొంటిగురువు
లకామంబుప్రాణార్థవంచనములులేక్కవడినొనర్తు। ననుచువిశ్వరూపుఁడనియెడిమునిప్రతిజ్ఞోక్తిఁబలికెవారినూరడిం
చిమహితమైనతత్సమాధిచేగురుభావ। మమరఁజేసెఁదేవసమితికపుడు॥క॥ భార్గవవిద్యాగుప్త। స్వర్గశ్రీద్విగుణదను
జసమధికసంప।ద్వర్గములవిష్ణుమాయా। నర్గళగతిఁదెచ్చియింద్రునకునిచ్చెనృపా॥క॥ఏవిద్యచేతరక్షితుఁ।డైవజ్రిదురం
బులోననసురులఁద్రుంచెక్। భావింపనట్టివిద్య।శ్రీహరిమాయామతంబుఁచెచ్చెరఁజెప్పెక్॥ఉ॥నావుడుపాండవాన్వ
యుఁడునమ్మినభక్తిజగన్నివాసురా। జీవదళాక్షుఁగృష్ణుఁదనచిత్తమునన్భజియించిపల్కెనో। దేవగణార్చితాంఘ్రి
యుగదివ్యమునీశ్వరవిశ్వరూపుఁడ।ప్పావనమైనవిద్యసురపాలునకేక్రియనిచ్చెఁజెప్పవే॥ఉ॥ ఎందునరక్షితుండగుచు
నింద్రుఁడులీలయవోలెవైరిసే। నందునుమాడిదేవతలునమ్మిసుఖింపఁగనిష్టసంపదం।జెందిసమస్తలోకములఁజేకొనియే
లెమునీంద్రదానినే।విందుసుఖంబుఁగందునఁకవీనులుసంతసమందఁబల్కవే॥క॥ వరనారాయణకవచము।నరిభీకరవజ్ర

———— శ్రీమన్నారాయణకవచప్రారంభము. ————

కవచమాశ్రితసంప।త్పరిణామకర్మసువచము। పురుహూతునకెట్లుమౌనిబోధించెఁదగక్॥ అనినంబరీక్షిజ్జనపాలునకు
మునినాథుండిట్లనియె॥సీ॥ వినవయ్యనరనాథమునినాథుఁడింద్రునకనువొందనారాయణాఖ్యమైన। కవచంబువిజ
యసంకల్పంబునప్రమేయస్వరూపంబుమహాఫలంబు। మంత్రగోప్యముహరిమాయావిశేషంబుసాంగంబుతోడనెఱుం
గఁజేసె। దానినేవినుపింతుఁబూనితదేకాగ్రచిత్తంబుతోడుతఁజిత్తగింపు। మొనరధౌతాంఘ్రిపాణియైయుత్తరంబు।
ముఖముగానుత్తమాసనమునవసించి।కృతనిజాంగకరన్యాసమతిశయిల్ల।మహితనారాయణాఖ్యవర్మమునెనర్చె॥వ॥ఇ
ట్లునారాయణకవచంబుఘటియించి పాదంబులను జానువులనూరువులనుదరంబునహృదయంబున నురంబునముఖం

---

శ్రీనారాయణకవచప్రారంభః

రాజా॥యేనగుప్తస్సహస్రాక్షస్సవాహాన్నరిపైనికాన్। క్రీడన్నివవినిర్జిత్య త్రిలోక్యాబుభుజేశ్రియమ్॥ భగవంస్తన్మమాచక్ష్వవర్మనారాయ
ణాత్మకం।యథాతతాయినశ్శత్రూన్ యేనగుప్తోజయన్మృధే॥ శ్రీశుకః॥వృతఃపురోహితస్త్వాష్ట్రోమహేంద్రాయానుపృచ్ఛతే। నారాయణా
ఖ్యంవర్మాహతదిహైకమనాశ్శృణు॥ విశ్వరూపః॥ ధౌతాంఘ్రిపాణిరాచమ్యసపవిత్రఉదఙ్ముఖః। కృతస్వాంగకరన్యాసోమంత్రాభ్యాంవా
గ్యతశ్శుచిః॥నారాయణమయంవర్మసన్నహ్యేద్భయఆగతే। దైవభూతాత్మకర్మభ్యోనారాయణమయఃపుమాన్॥పాదయోర్జానునోరూర్వోరుద

బునశిరంబుననిట్లష్టాంగంబులం బ్రణవపూర్వకంబై నయష్టాక్షరమంత్రరాజంబు న్యాసంబుఁ జేసి ద్వాదశాక్షరవిద్యచే తఁగరన్యాసంబుఁ జేసి మంత్రమూర్తినై ప్రణవాదియకారాంతమగు మహామంత్రంబుచేత నంగుళ్యంగుష్ఠపర్వసంధుల యందుపన్యసించి మఱియు హృదయంబున నోంకారంబు వికారంబు మూర్ధయందు షకారంబు భ్రూమధ్యంబునందు ణకారంబు శిఖయందు వేకారంబు నేత్రంబులయందు నకారంబు సర్వసంధులయందు మఱియు నస్త్రము నుద్దేశించి మకారంబు నున్యసించి నేని మంత్రమూర్తియగు మఱియు నస్త్రాయ ఫట్, అను మంత్రంబున దిగ్బంధనంబుఁ జేసి పరమేశ్వరునిఁ దన భావంబున నిల్పి విద్యామూర్తియుఁ దపోమూర్తియు నగు షట్ఛక్తిసంయుతంబయిన నారాయణకవచాఖ్యమైన నీమంత్ర రాజంబు నిట్లని పఠించె॥ చ॥ గరుడుని మూఁపుపైఁ బదయుగంబు ఘటిల్లఁగ శంఖచక్రవ । ర్మరుచిరశార్ఙ్గఖడ్గశరరాజితపాశగదాదిసాధనోత్కరనికరంబులాత్మకరకంజములన్ రహియించు భూతిసం । భరితమహాష్టబాహుఁడు కృపామతితో ననుఁ గాచుఁగావుత॥ గీ॥ ప్రకటమకరవరుణపాశంబులందుఁ । జలములందు నెందుఁ బొలయకుండఁ । గాచుఁగాక నన్ను ఘనుఁ డొకఁడైనట్టి । మత్స్యమూర్తి విద్యమానకీర్తి॥ క॥ వటుఁడు సమాశ్రితమాయా । నటుఁడు బలిప్రబలశోభనప్రతిఘటనోద్భటుఁడు త్రివిక్రమదేవుఁడు । చటులస్థలమందు నన్ను సంరక్షించున్॥ చ॥ అడవుల సంకటస్థలుల నాజిముఖంబుల నగ్నికీలలం । దెడరుల నెల్ల నాకు నుతికెక్కఁగ దిక్కగుఁగాక శ్రీనృసిం । హుఁడు కనకాక్షరాక్షసవధోగ్రుఁడు విస్ఫురితాట్టహాసవ । క్త్రుఁడు ఘనదంష్ట్రపావకవిధూతదిగంతరుఁ డప్రమేయుఁడై॥ చ॥ అరయఁగ నెల్ల లోకములు నంకిలినొంద మహా

---

రేఖృద్యథోరసి।ముఖేశిరస్యానుపూర్వ్యాదోంకారాదీని విన్యసేత్॥ ఓం-నమో నారాయణాయేతి విపర్యయమథాపివా। కరన్యాసం తతఃకుర్యాద్ద్వాదశాక్షరవిద్యయా।ప్రణవాదియకారాంతమంగుళ్యంగుష్ఠపర్వసు॥న్యసేద్ధృదయఓంకారం వికారమనుమూర్ధని।షకారంతు భ్రువోర్మధ్యే ణకారం శిఖయాన్యసేత్॥ వేకారం నేత్రయోర్యుంజ్యాన్నకారం సర్వసంధిషు।మకారమస్త్రముద్దిశ్య మంత్రమూర్తిర్భవేద్బుధః।సవిసర్గం ఫడంతం తు సర్వదిక్షువినిర్దిశేత్ ॥ ఓం విష్ణవేనమః ॥ ఇత్యాత్మానం పరం ధ్యాయేద్ధ్యేయం షట్ఛక్తిభిర్యుతం।విద్యాతేజస్తపోమూర్తిమిమం మంత్రముదాహరేత్॥ఓం-హరిర్విదధ్యాన్మమసర్వరక్షాం-న్యస్తాంఘ్రిపద్మఃపతగేంద్రపృష్ఠే।దరారిచర్మాసిగదేషుచాప-పాశాన్దధానోష్టగుణోష్టబాహుః॥ జలేషుమాం రక్షతు మత్స్యమూర్తి-ర్యాదోగణేభ్యో వరుణస్యపాశాత్।స్థలేషుమాయావటువామనోవ్యా-త్త్రివిక్రమఃఖేవతు విశ్వరూపః॥ దుర్గేష్వటవ్యాజిముఖాదిషు ప్రభుః-పాయాన్నృసింహోసురయూథపారిః। విముంచతోయస్యమహాట్టహాసం-దిశోవినేదుర్న్యపతంశ్చగర్భాః॥ రక్షత్వసౌమాధ్వనియజ్ఞకల్ప-స్స్వదంష్ట్రయోన్నీతధరోవరాహః।రామోద్రికూటేష్వథ విప్రవాసే-సలక్ష్మణోవ్యాద్భరతాగ్రజోమామ్॥ మాముగ్రధర్మాదఖిలాత్ప్రమాదాన్నారాయణఃపాతునరశ్చహాసాత్।దత్తస్త్వయోగాదథయోగనాథః-పాయాద్గుణేశఃకపిలఃకర్మబంధాత్॥ సనత్కుమారోవతుకామదేవా-ద్ధయాననోమాంపథిదేవహేళనాత్।దేవర్షివర్యఃపురుషార్చనాంతరా-త్కూర్మోహరిర్మాంనిరయాదశేషాత్॥ధన్వంతరిర్భగవాన్పాత్వపథ్యాద్ద్వంద్వాద్భయాదృషభోనిర్జితాత్మా। యజ్ఞశ్చలోకాదవతాజ్జనాన్తా - బలోగణాత్ క్రోధవశాదహీంద్రః॥ ద్వైపాయనోభగవానప్రబోధా-ద్బుద్ధశ్చ పాషండగణాత్ప్రమాదాత్।కల్కిఃకలేఃకాలమలాత్ప్రపాతు ధర్మావనాయోరుకృతావతారః॥ మాంకేశవోగదయాప్రాతరవ్యాద్గోవిందఆసంగవమాత్తవేణుః। నారాయణఃప్రాహ్ణఉదాత్తశక్తిర్మధ్యందినే విష్ణురరీంద్రపాణిః॥ దేవోపరాహ్ణేమధుహోగ్రధన్వా-సాయంత్రిధామావతుమాధవోమాం। దోషేహృషీకేశఉతార్ధరాత్రే-నిశీథఏకోవతుపద్మనాభః॥ శ్రీవత్సధామాపరరాత్రఈశః-ప్రత్యూషఈశోసిధరోజనార్దనః।దామోదరోవ్యాదనుసంధ్యం ప్రభాతే విశ్వేశ్వరోభగవాన్ కాలమూర్తిః॥ చక్రంయుగాంతానలతిగ్మనేమి-భ్రమత్సమంతాద్భగవత్ప్రయుక్తం।దందగ్ధిదందగ్ధ్యరిసైన్యమాశు-కక్షంయథావాయుసఖోహుతాశః॥గదేశనిస్పర్శనవిస్ఫులింగే-నిష్పిండినిష్పిండ్యజితప్రియాసి।కూష్మాండవైనాయకయక్షరక్షో-భూతగ్రహాంశ్చూర్ణయచూర్ణయారీన్॥ త్వంయాతుధానప్రమథప్రేతమాతృపిశాచవిప్రగ్రహఘోరదృష్టీన్।దరేంద్రవిద్రావయకృష్ణపూరితో-భీమస్వనోరేర్హృదయానికంపయ॥ త్వంతిగ్మధారాసివరారిసైన్యమీశప్రయుక్తోమమఛింధిఛింధి।చక్షూంషిచర్మన్ శతచంద్రఛాదయద్విషామఘోనాం హరపాపచక్షుషాం॥ యన్నోభయం గ్రహేభ్యోభూత్కేతుభ్యోనృభ్యఏవచ। సరీసృపేభ్యోదంష్ట్రిభ్యోభూతేభ్యోఘేభ్యఏవచ॥సర్వాణ్యేతానిభగవన్నామరూపాస్త్రకీర్తనాత్। ప్రయాంతుసంక్షయంసద్యోయేనశ్శ్రేయఃప్రతీపకాః॥గరుడోభగవాన్ స్తోత్రస్తోభశ్ఛందోమయఃప్రభుః।రక్షత్వశేషకృచ్ఛ్రేభ్యోవిష్వక్సేనస్యవాహనమ్॥సర్వాపద్భ్యోహరేర్నామరూపయానాయుధానినః।బుద్ధీంద్రియమనఃప్రాణాన్పాంతుపార్షదభూషణాః॥ యథాహిభగవానేవవస్తుతస్సదసచ్చయత్।సత్యేనానేననస్సర్వేయాంతునాశముపద్రవాః॥ యథైకాత్మ్యానుభావానాంవికల్పరహితస్స్వయం। భూషణాయుధలింగాఖ్యాధత్తేశక్తీస్స్వమాయయా॥ తేనైవసత్యమానేనసర్వజ్ఞోభగవాన్హరిః।పాతుసర్వైస్స్వరూపైర్నస్సదాసర్వత్రసర్వగః॥ విదిక్షుదిక్షూర్ధ్వమధస్సమంతాదంతర్బహిర్భగవాన్నారసింహః।ప్రహాపయన్లోకభయంస్వనేనస్వతేజసాగ్రస్తసమస్తతేజాః॥ శ్రీ విశ్వరూప ఉ॥ మఘవన్నిదమాఖ్యాతంవర్మనారాయణాత్మకం। విజేష్యస్యంజసాయేనదంశితోసురయూథపాన్॥ఏతద్ధారయమాణస్తుయంయంపశ్యతిచక్షుషా।పదావాసంస్పృశేత్సద్యస్సాధ్వసాత్సవిముచ్యతే॥నకుతశ్చిద్భయంతస్యవిద్యాంధారయతోభవేత్। రాజదస్యుగ్రహాదిభ్యోవ్యాధ్యాదిభ్యశ్చకర్హిచిత్॥ ఇమాంవిద్యాంపురాకశ్చిత్కౌశికోధారయన్ద్విజః।యోగధారణయాస్వాంగంజహౌసమరుధన్వని॥ తస్యోపరివిమానేనగంధర్వపతిరేకదా। యయౌచిత్రరథస్స్త్రీభిర్వృతోయత్రద్విజక్షయః॥గగనాన్న్యపతత్సద్యస్సవిమానోహ్యవాక్శిరాః। సవాలఖిల్యవచనాదస్థీన్యాదాయవిస్మితః॥ ప్రాస్యప్రాచీసరస్వత్యాంస్నాత్వాధామస్వమన్వగాత్।యఇదంశృణుయాత్కాలేయోధారయతిచాదృతః। తంనమస్యంతిభూతానిముచ్యతేసర్వతోభయాత్॥ శ్రీశుకః॥ఏతాంవిద్యామధిగతోవిశ్వరూపాచ్ఛతక్రతుః।త్రైలోక్యలక్ష్మీంబుభుజేవినిర్జిత్యమృధేసురాన్॥........

ఇతి, శ్రీభాగవతే, షష్ఠస్కంధే, నారాయణవర్మోపదేశో నామాష్టమోధ్యాయః.

ర్ణవంబులో, నొరిగినిమగ్నమైనధరనుద్ధతిఁగొమ్మున నెత్తినట్టియా । కిరిపతియగ్నికల్పుఁడురుఖేలుఁడునూర్జితమేదినీమ
నో, హరుఁడుగృపావిధేయుఁడుసదాధ్వములన్ననుఁగాచుఁగావుతన్ ॥క॥ రాముఁడురాజకులైకవి, రాముఁడుభృగు
సత్కులాభిరాముఁడుసుగుణస్తోముఁడుననురక్షించును, శ్రీమహితోన్నతుఁడునద్రిశిఖరములందున్ ॥సీ॥ తాటకిమర్దిం
చితపసిజన్నముఁగాఁచిహరువిల్లువిఱిచి ధైర్యమున మెఱసి, ప్రబలులైనట్టివిరాధకబంధోగ్రఖరదూషణాది రాక్షసులచు
నిమి, వానరవిభునేలి వాలిఁగూల్చఁగ నేసిజలరాశిగర్వంబుఁ జక్కఁజేసి, సేతువుబంధించి చేరి రావణకుంభకర్ణాదివీరులఁ
గడిమిఁద్రుంచి, యలవిభీషణులంకకునధిపుఁ జేసి, భూమిసుతఁగూడిసాకేతపురమునందు, రాజ్యసుఖములుగైకొన్నరామ
విభుఁడు, వరుసననుఁబ్రోచుచుండుఁబ్రవాసగతుల ॥వ॥ మఱియునఖలప్రమాదంబులైనయభిచారకర్మంబులవలననా
రాయణుండునుగర్వంబువలననరుండును యోగభ్రంశంబువలన యోగనాథుఁడయిన దత్తాత్రేయుండునుగర్మబంధం
బువలనగణేశుండైనకపిలుండును గామదేవునివలనసనత్కుమారుండునుమార్గంబులదేవహేళనంబుఁ జేయుటవలన శ్రీ
హయగ్రీవమూర్తియును దేవతానమస్కారతిరస్కార దేవపూజాచ్ఛిద్రంబులవలన నారదుండును శేషనిరయంబువల
నఁగూర్మంబునపథ్యంబువలన భగవంతుండైనధన్వంతరియునుజనాపవాదంబువలనయజ్ఞదేవుండునుజననమగణాచలం
గలుగఁజేయుకర్మంబులవలనబలభద్రుండును గాలంబువలనయముండును సర్పగణంబులవలన శేషుండునప్రబోధంబువ
లనద్వైపాయనుండును పాషండసమూహంబువలనబుద్ధదేవుండును శనైశ్చరునివలనఁగల్కియనుధర్మరక్షణపరుండయి
నమహావతారుండునన్నురక్షించుగాత ప్రాహ్ణమధ్యాహ్నాపరాహ్ణసాయంకాలంబులను బ్రదోషార్ధరాత్రాపరరాత్ర
ప్రత్యూషానుసంధ్యలనుగదాద్యాయుధంబులధరియించి కేశవనారాయణగోవిందవిష్ణుమధుసంహారత్రివిక్రమవామ
నహృషీకేశపద్మనాభశ్రీవత్సధామసర్వేశ్వరయీశజనార్దనవిశ్వేశ్వరకాలమూర్తియను నామరూపంబులుగల దేవుం
డునన్నురక్షించుఁ బ్రళయకాలానలతీక్ష్ణసంభ్రమభ్రమణనిర్వక్రవిక్రమక్రమవక్రీకృతదనుజ చక్రంబైనసుదర్శన
నామచక్రంబమహావాయుప్రేరితంబై హుతాశనుండు నీరసతృణాటవులభస్మీభూతంబుసేయు భంగిభగవత్ప్రయు
క్తంబవైమద్వైరిసైన్యంబులదగ్ధంబుగావింపుము జగత్సంహారకాలఘటితచటులమహోత్పాత గర్జారవపర్జన్యది
శాభివర్జితఘనఘనాంతరనిష్ఠ్యూతనిష్ఠురకోటిశతకోటిసంస్పర్శస్ఫురద్విస్ఫులింగనిర్గమానర్గళభుగభుగాయమానమూ
ర్తివిస్ఫూర్తినారాయణకరకమలవర్తిగదాయుధోత్తమమదీయవైరితండోపతండంబుల భండనంబులం జండగతింబిం
డిగాఁగూశ్మాండవైనాయకరక్షోభూతగ్రహంబులంజూర్ణంబులుగాఁగొండొకవినోదంబుసలుపుముదరేంద్రుండవైన
పాంచజన్యంబసర్వలోకజిష్ణుండయినశ్రీకృష్ణునినిఖిలపుణ్యైకసదనవదననిష్ఠ్యూతనిశ్వాసాధరవేణుపరిపూరితంబవై
యున్మత్తభూతప్రేతపిశాచవిప్రగ్రహాదిక్రూరదుర్గ్రహంబులవిద్రావణంబుగానస్మత్పరవీరమండలంబుల గుండియ
లతోఁదదీయమాననీదుర్భరగర్భంబులుగర్భస్థార్భకవివర్జితంబులుగానవియబ్రహ్మాండభాండభీకరంబయినభూరినాదం
బునమోమమతితీవ్రధారాదళితనిశాటకోటికఠోరకంఠకరాళరక్తధారాధౌతమలీమసవిసరంబవైన నందకమహాసి శే
ఖరంబజగదీశప్రేరితంబవయిమద్విద్విషవిషమవ్యూహంబులమేండు ఖండములుగఖండించి చెండాడుమునిష్కళంకని
రాతంకసాంద్రచంద్రాకారమండలపరిమండితసర్వాంగలక్షణవిచక్షణ ధర్మనిర్మితంబవైనచర్మంబదుర్మదమద్వైరి
లోకంబులకుసమాకులనిబిడనీరంధ్రనిష్ఠురతమఃపటలపటుఘటనంబులంగుటిలపరుపుము నిఖిలపాపగ్రహంబులవలనస
కలనరమృగసర్పక్రోడభూతాదులవలననగుభయంబులువొందకుండభగవన్నామరూపయానదివ్యాస్త్రంబులురక్షిం
చుఁగాకబృహద్రథంతరాదిసామంబులచేతస్తోత్రంబుసేయంబడుచున్నఖగేంద్రుండు రక్షణదక్షుండయినన్నురక్షిం
చుఁగాకశ్రీహరినామరూపవాహనదివ్యాయుధపారిషదోత్తమప్రముఖంబులస్మదీయ బుద్ధీంద్రియమనఃప్రాణంబు
లసంరక్షించుభగవంతుండైనశేషుండు సర్వోపద్రవంబులనాశంబుసేయుజగదైక్యభావంబైనధ్యానంబుగలవానికివి
కల్పరహితుండై భూషణాయుధలింగాఖ్యలగుశక్తులందనమాయచేత ధరియించి తేజరిల్లుచుండులక్ష్మీకాంతుండువికల్ప
విగ్రహంబులవలననన్నురక్షించుఁగాకలోకభయంకరాట్టహాసభాసురవదనగహ్వరుండగుచుసమస్తతేజోహరణధురీ
ణతేజఃపుంజసంజాతదివ్యనృసింహావతారుండగునప్పరమేశ్వరుండుసర్వదిగ్భాగంబులవలననను రక్షించుచుండుఁగాక
యని నారాయణాత్మకకవచప్రభావంబితిహాసరూపంబుననింద్రుండు దెలిసికొని ధ్యానంబుఁ జేసితద్విద్యాధారణమహి
మవలననరాతులనిర్జించెంగావుననెవ్వరేని నిర్మలాత్ములగువారలేతద్విద్యాధారణులై యనుదినంబునుబఠియించిననతి
ఘోరరణంబులనత్యుత్కటసంకటంబులనుసర్వగ్రహానిగ్రహకర్మమారణకర్మాదిదుష్కర్మజన్యక్లేశంబులనువదిలియ

వ్యాకులమనస్కులై విజయంబునొందుదురు మఱియును సర్వరోగంబులకు నగమ్యశరీరులై సుఖంబునొందుదురదియునుం
గాక॥ సీ॥ అతిభక్తిం గౌశికుండను బ్రాహ్మణుండు దొల్లి యీవిద్య ధరియించి యెలమి మించి। మరుభూమియందు నిర్మలచిత్తుం
డై యోగధారణంబున బిట్టు తనువు విడిచె। దాని పై నొకండు గంధర్వవరేణ్యుండు చిత్రరథాఖ్యుండ జేయుండొంటి। జదలం
జనంగం దచ్ఛాయ దగస్థి పైంగదిసిన నాతండు గళవళించి। యువిదపిండుతోడ నవవిమానముతోడం। దనదు విద్యతోడ ధరణిం
ద్రెళ్లి తిరిగి లేవలేక తికమకగుడువంగ। వాలఖిల్యమాని వానిం జూచి॥ క॥ నారాయణకవచసమా। ధారణపుణ్యాస్థిదీని డగ్గ
ర నీకుం। గూరెడి నెవిష్ణుభక్తుల। వారక చేరంగ నెట్టి వారికిం దరమే॥ ఇంద్రవజ్రం॥ సంధించి నీయంగక సంధులెల్ల। స్బంధిం
చి తన్మంత్ర బలంబు పేర్మిం। అందంబు మాన్పింపం దదన్యమేదీ। సింధుప్రవాహోన్నతి చేతం దీరున్॥ వ॥ కావున నీ పుణ్యాశ
ల్యంబులు భక్తియుక్తుండవై కైకొని సోయి ప్రాఙ్ముఖంబునం బ్రవహించెడు సరస్వతీ జలంబుల నిక్షేపణంబు జేసి కృతస్నా
నుండవై యాచమనంబు చేసిన నీ సర్వాంగబంధనంబులు డుగు ననిన నతం డట్ల చేసి తన విమానం బెక్కి నిజస్థానంబునకరిగెం
గావున॥ క॥ అనుదినము దీని నెవ్వరు విని రేనిం బఠించిరేని విస్మయమొదవ। న్ననభూతజాలమెల్లను। మునుకొని వారలను గాంచి
మ్రొక్కుచునుండున్॥ గీ॥ విశ్వరూపువలన నైశ్వర్యకరమైన। యిట్టి విద్యం దాల్చి యింద్రుండపుడు। మూండు లోకములకు ము
ఖ్యమైనట్టి శ్రీ। ననుభవించి మించె నధికమహిమ॥ సీ॥ భూపాలయా విశ్వరూపునకరుదైన తలలు మూండను నొందదగిలి
యుండు। సొరదిసురాపాన సోమపానంబులు నన్నాదమునంగనున మరవరుల। తోంగూడి భుజియించి తూకొని వారితో యజ్ఞ
భాగంబు ప్రత్యక్షమొంది। కైకొనుచుండి మప్కర్మడైయా యజ్ఞ భాగంబు రాక్షసప్రవరులకును। దల్లి మీందంగలుగు
తాత్పర్యవశమున। దివిజవరుల మొఱంగి తెచ్చియిచ్చు। నదియెఱింగి యింద్రుడతిభీతచిత్తుడై। తనకుం గానియతని తలలుద్రుం
చె॥ క॥ భాసురుండనక మహోత్సా। గ్రేసరుడనక మరవిభుండు ప్రియకర్మగతి। న్వేసరుండనక మహేంద్రుండు భూసురుతలలపు
డురోషమునం దెగనడచెన్॥ వ॥ ఇట్లయ్యింద్రుండు క్రోధంబు సహింపంజాలక విశ్వరూపు తలలు ఖడ్గంబునం దెగనడిచిన సోమ
పానంబు సేయుశిరంబు కపింజలంబయ్యె సురాపానంబు సేయుశిరంబు కలవింకంబయ్యె నన్నంబు భక్షించు శిరంబు తిత్తిరి
యయ్యె నిట్లు త్రివిధపక్షిస్వరూపంబు దాల్చి బ్రహ్మహత్యయే తెంచి యింద్రునిం జుట్టుకొని తమ్ముంబరిగ్రహింపుమని నిర్బం
ధింపనపుడింద్రుండతిభీతచిత్తుండయి త్రిలోకనాయకుండయి నందానిం దప్పించుకొనంజాలక యంజలిమొగ్గి యమ్మహాదో
షంబుం గైకొని మోందద్దోషంబొక్క సంవత్సరంబనుభవించి యంతం బాపుకొనువాండై భూజలవృక్షస్త్రీలం బ్రార్థించి త
ద్దురితంబు చతుర్విధంబులం బుచ్చికొమ్మనిన భూమి తనయందుం జేయంబడిన ఖాతంబు తనంతన పూడునట్టి వరంబును, జలం
బులు సర్వంబు దనయందుం బ్రక్షాళితంబయినం బావనంబగు ననువరంబును, వృక్షంబులు భేదింపంబడియును బ్రరోహంబు
గలుగు ననువరంబును, స్త్రీలెల్లపుడుం దమకుం గామసుఖంబు గలుగు ననువరంబును గోరిన నతండట్లకాకయని యొసంగిన న
తని మహాపాతకంబు ధరణి నెఱియ, యూషరక్షేత్రంబుల విధంబున నుదకంబు, బుద్బుదఫేనరూపంబునను, మహీరుహంబు
లు, నిర్యాసభావంబున, నింతులు రజస్వలవికారంబున, నిట్లు చతుర్భాగంబులం బంచికొనిరంత॥ మ॥ హతపుత్రుండగు వి
శ్వరూపజనకుండా త్వష్ట దుఃఖాయతో। ద్ధతరోషానలదహ్యమానుండగుచుం దానింద్రు పైమారణ। క్రతుహోమంబు
నొనర్పనందుం బొడమెం గల్పాంతకాకారవి। శ్రుతకీలానలనిష్ఠురేక్షణ గుణక్షుభ్యత్త్రిలోకోగ్రుండై॥ సీ॥ యుగము
గ్రుంగెడు నాండు జగములు వొలియించు నంతకు మూర్తిపైనింతయగుచుం। బరపు నిడుపు బ్రతిదినంబును నొక్కశర
పాతమంగంబు విరివిగొనుచుం। గడుదగ్ధశైలసంకాశదేహమునందుం గరము సంధ్యారాగకాంతి మెఱయ। మును గాంకరా
గి చేంగను మించు మంచులక అకుమీసలు కచాగ్రములు మెఱయం। జండమధ్యాహ్నమార్తాండమండలోగ్ర। చటులనిష్ఠుర
లోచనాంచలవిధూత। దశదిశాభాగుండుజ్జ్వలతరకరాళ। భిదురసునిశితదంష్ట్రోరువదనగుహుండు॥ ఉ॥ నింగికి నేలకుం బో
డవు నిట్టలమై శిఖలందుం బర్వను। త్తుంగతరాగ్నిజాలములం దొట్రిలుచున్న రిహపజ్జాచారని। స్సంగకరాళశాతఘనసఘృ
ణిమండలచండశూలము। ప్పొంగుచుం గేలలీలం గొని భూమి చలింపంగసోలియాడుచున్॥ సీ॥ పదంపడి విరివిగా వదనంబుం దె
రచుచు నాకాశమంతయు నప్పళించుం। గడు నాల్కనిగుడించి గ్రహతారకంబుల నయ్యెల్లం దిగజారనాకికొనుచు। నలవో
క యనుబోలెనట్టహాసమునకు మెఱసి లోకము లెల్లం ద్రిప్పంగం జూచుం। దనరు దిగ్దంతిదంతములు చెక్కులు వారసు గ్రదం
ష్ట్రిలు ద్రిప్పుసుక్కు మిగిలి। త్వష్టబలితంపు తపమున సృష్టి నొంది। యఖిలలోకంబులెల్లం దానాక్రమించి। వృత్రనామాఖ్య
దేవతాశత్రుండనుచు। దారుణాకారుండఖిల దుర్దముండు మెఱసె॥ మత్తకోకిల॥ అట్టివృత్రుని మీంద దేవతలల్కతోం జెను
మూంకలై। చుట్టుముట్టి మహాస్త్రవిద్యలు సూపి మేపున నేయనా। గొట్టువీరుండు వారలేసిన క్రూరశస్త్రములన్నియుం।

జుట్టిపట్టుక త్రుంగి శూరత జోకనార్చె మహోగ్రుండై ॥ క॥ భక్షితదివ్యాస్త్రిండగు। రక్షోనాయకుని నమరరాజప్రము
ఖు। లీక్షింప వెఱచి పఱచిరి। రక్షకుఁ జింతించికొనుచు రయమొప్పారన్ ॥ వ॥ ఇట్లు సర్వసాధనంబులతోడ సాధుజనంబుల,
వృత్రాసురుండు మ్రింగిన, నచ్చెరువడి, చేయునది నేరక, తత్తేజోవిశేషవిభవంబునకు, భయంబు నొంది, కందిన డెందంబు
నం గుందుచుఁ బురందరప్రముఖులార్తరక్షకుండగు, పుండరీకాక్షునకుం, గుయ్యిడువారలై ॥ లయగ్రాహి॥ వీఁడు కడుచ
ర్ద్రముఁడు వాఁడి మనకైదువులు వాడిచెడఁగా మెసవి యీడుఁ గనకున్నాఁ। డేడ బ్రతుకింకఁ బెనుకీడు వొడమె న్మనకుఁ దో
డుపడ నెక్కరుఁడు లేఁడు హరిదక్క । న్వేఁడుదము శ్రీధరునిఁ గూడుదము సద్భటులఁ బాడుదము గీతములఁ జాడపడునంత,
న్వాడిచెడు త్రోవ దయతోడ నెఱిగించు ఘనుఁ డోడక సురాలయము పాడువడదింకన్ ॥ క॥ అనితలపోయుచుఁ దనలో। ము
నుకుచుఁ దికమకలుగొనుచు మురరిపు కడకున్ గునుకుచుఁ దినుకుచు నేగిరి। ఘనరాక్షసుఁ గన్నఁ గన్నుగవ బెగ్గిలఁగన్ ॥ వ॥ ఇట్లు
భయార్తులై యమర్త్యవ్రాతంబు, చని చని ముందట, నభంగభంగరంగదుత్తుంగ, డిండీరమండలసముద్దండాడంబర, విడం
బితనారాయణనిరంతరకీర్తిలతాకుసుమ, గుచ్ఛస్వచ్ఛంబు, ననవరతగోవిందచరణారవిందసేవాసమాకుల, కలకలఫలి
తమహాపుణ్యఫలాయమాన, సముద్దీపితావర్తవర్తితదక్షిణావర్తరుచిరశంఖమండలమండితంబును, నతినిష్ఠురకఠినపా
ఠీనపృథురోమరాజిసంకుల, తిమితిమింగిలకర్కట, కమఠకచ్ఛప, మకరనక్రవక్రగ్రహగ్రహణ। ఘుమఘుమారావదారు
ణగమన, విషమితవిషమతరంగఘట్టనఘట్టితసముత్తుంగశీకరనికర, నీరంధ్రతారకిత, తారాపథంబును, సముచ్ఛ్రాయ
శైలోచ్ఛ్రయశిఖరాగ్రప్రవహిత, దుగ్ధనిర్ఝరసమ్మార్జిత, పురాణపురుషవిశుద్ధ, శుద్ధాంతవిహరణధురీణ, నవసుధాధౌతధా
వళ్యధగద్ధగాయమాన, రమ్యహర్మ్యనిర్మాణకర్మంబు, నతిపవిత్రగుణవిచిత్రనిజకళత్ర, ప్రేమానందసందర్శిత, ముకుందపరి
స్రవదంతరంగకరుణారసపరిమిళితభావబంధురవిద్రుమవల్లీసుతల్లికాంకురశోభితంబును బ్రసిద్ధసిద్ధరసాంబువాహసంగమ
సముత్థితగంభీరఘోషపరిదూషితసకలరోదోంతరాళంబును సముద్రమేఖలాఖిలప్రదేశవిలసితనవీనదుకూలాయమానం
బును హరిహరప్రముఖదేవతానిచయపరిలబ్ధామృతమహదైశ్వర్యదానధౌరేయమహానిధానంబును వైకుంఠపురపారవత
కామ్యఫలఫలితమందారపారిజాతసంతానకల్పవృక్షహరిచందనఘనవనానుకూలకూలంబునై యొప్పుచుఁ గుబేరుభాం
డాగారంబునుంబోలెఁ బద్మమహాపద్మశంఖమకరకచ్ఛపముకుందకుందనీలవరసమగ్రంబై విష్ణుకరకమలంబునుంబోలె
సుదర్శనావర్తప్రగల్భంబై కైలాసమహీధరంబునుంబోలె నమృతకళాస్థాన శేఖరపదార్పణంబై యింద్రవైభవంబు
నుంబోలె కల్పవృక్షకామధేనుచింతామణిజనితంబై సుగ్రీవసైన్యంబునుంబోలె నపరిమిత నిబిడహరిసంచారంబై నారా
యణోదరంబునుంబోలె నిఖిలభువనభారభరణసమర్థంబై శంకరుజటాజూటంబునుంబోలె గంగాతరంగిణీసమాశ్ర
యంబై బ్రహ్మలోకంబునుంబోలెఁ బరమహంసకులసేవ్యంబై పాతాళలోకంబునుంబోలె ననంతభోగిభోగయోగ్యం
బై నందనవనంబునుంబోలె నైరావతమాధవీరంభాదిసంజననకారణంబై సౌదామినీనికరంబునుంబోలె నభ్రంకషంబై వి
ష్ణునామకీర్తనంబునుంబోలె నిర్మలస్వభావంబై క్రతుశతగతుండునుంబోలె హరిపదభాజనంబై యొప్పుచున్న దుగ్ధవా
రాశిడాసి శ్వేతద్వీపంబున వసియించి యందు సకలదిక్పాలకాది దేవతలు దేవదేవు నాశ్రయించి యిట్లని స్తుతియించిరంత॥
సీ॥ పంచమహాభూతపరినిర్మితంబైన ముజ్జగంబుల కెల్ల నెజ్జయైన। బ్రహ్మయు నేమును బరఁగ నందఱుఁ గూడి యెవ్వని కైపూ
జలిత్తు మెపుడు। నట్టి సర్వేశ్వరుం డాగమవినుతుండు సర్వాత్మకుఁడు మాకు శరణమగును। అతిపూర్ణకాము నహంకారదూ
రు సముని శాంతునిఁ గృహాస్పదుని గురుని। మానియన్యుని సేవింపఁ బూనునట్టి। కపటశీలుని యతిపాపకర్మబుద్ధి। శునకవాలం
బు వట్టుక ఘనతరాబ్ధిఁ। దరియఁ జూచుటగాదె తాఁ దామసమున॥ చ॥ ఉదకమయంబునన్వసుధ నోడగఁ జేసి తనర్చు కొమ్ము
న। న్వదలక నంటఁ గట్టి మనువల్లభుఁ గాచిన మత్స్యమూర్తి సం। మదమున మమ్ముఁ బ్రోచు ననుమానము మానఁగ వృత్రుఁ జే
తియా। పదఁ దొలఁగించి నేఁడు నరపాలుర పాలిటి భాగ్యదేవతై॥ మత్తకోకిల॥ వంతు సేయుచు వాతధూతకరాళభంగురభం
గదుర్గ్రాంతసంతతసాగరోదకతల్పమొంది వసించు బ్ర। హ్మాంతవాసిని బొడ్డుదమ్మిని నాచి కాఁచిన నేర్పరిం। తంతవాఁడన
రాని యొంటరి యాదరించుమ ముంగృపన్ ॥ గీ॥ దేవతలమైన మే మిట్టి దేవదేవు। సర్వలోకశరణ్యుని శరణుఁ జొచ్చి। బలిత
మైనట్టి యీ నియాపదలఁ బాసి। మీఱశుభములఁ జేకొను వారమిపుడు॥ వ॥ ఇట్లు స్తుతియించుచున్న దేవతలకు భక్తవత్సలుండై
న వైకుంఠుండు ప్రసన్నుండయ్యె నప్పుడు॥ సీ॥ తగు శంఖచక్రగదాధరుండగు వాని। శ్రీవత్సకౌస్తుభచిహ్నవానిఁ। కమనీయ
మాణిక్యఘనకిరీటము వాని దివ్యవిభూషణదీప్తివాని। మండితకేయూరకుండలంబులవాని సిరియురస్థలమునఁ జెలఁగువా
ని। దనుఁ బోలు సేవకతండంబుగలవాని జిలుగైన పచ్చనివలువవానిఁ। దెల్లదమ్మివిరులఁ దెగడు కన్నులవాని। నవసుధాద్ర

వంబునవ్వు వానిఁ గనియె వేల్పుపిండు కప్పురపాటుతోఁ గన్నులందునున్న కఱవుదీఱ॥ సీ॥ తన సేవకులలోనఁ దడబడు రూపంబు శ్రీవత్సకౌస్తుభ శ్రీలు దెలుప । వికచాబ్జములతోడ వీడ్వడు కన్నులకడలదై వారెడు కరుణఁ దెలుప । నెల్లలోకములకు నిల్లయిన భాగ్యంబు కాపురంబుండెడు కమలఁ దెలుప । మూఁడుమూర్తులకును మొదలయిన తేజంబు ధాతఁ బుట్టించిన తమ్మి దెలుప । బుద్ధిఁ బోల్పరాని పుణ్యంబుఁ దత్పాద । కమలజనితమైన గంగ దెలుప । నప్రమేయుఁ డభవుఁ డవ్యక్తుఁ డవ్యయుఁ । డాదిపురుషుఁ డఖిల మోదియొప్పె॥ వ॥ ఇట్లు జగన్మోహనాకారుండయిన నారాయణుని కృపావలోకనాహ్లాదస్వభావచరితులై సాష్టాంగదండప్రణామంబు లాచరించి ఫాలభాగపరికీలితకరకమలులై యిట్లనిరి॥ గీ॥ దుర్గమంబులయిన స్వర్గాదిఫలములఁ బుట్టఁ జేయఁ జాలునట్టి గుణముఁ గలిగి మెలఁగుచున్న ఘనుఁడవై నట్టి నీకు రయ మ్రొక్క వారమాదిపురుష॥ సీ॥ దండంబు యోగీంద్రమండలనుతునకు దండంబు శార్ఙ్గకోదండునకును । దండంబు మండితకుండలద్వయునకు దండంబు నిష్ఠురభండనునకు । దండంబు మత్తవేదండరక్షకునకు దండంబు రాక్షసఖండనునకు । దండంబు పూర్ణేందుమండలముఖునకు దండంబు తేజఃప్రచండునకును । దండమచ్యుతపుణ్యప్రధానునకును । దండముత్తమవైకుంఠధామునకును । దండమాశ్రితరక్షణతత్పరునకు । దండము సుభోగినాయకతల్పునకును॥ ఉ॥ చిక్కిరి దేవతావరులు చిందరవందరలైరి ఖేచరుల్ । స్రుక్కిరి సాధ్యసంఘములు సోలిరి పన్నగులాజిభూమిలో । గ్రక్కిరి దివ్యకోటి గడు గ్రుగ్గిరి యక్షులు వృత్రు చేత నీ । చిక్కిన వారి నైనదయ సేయుము మెవ్వక యుండ మోహరీ॥ క॥ మొదలాఁటి నరక్కసులకు మొదలై మాకాపదలకు మూలంబగుచుం । దుదమొదలు లేని రక్కసుఁ । డుదిచూపఁగ దయ్యెఁ దుదకుఁ దుదియైన హరీ॥ గీ॥ అకటదిక్కుల కెల్లదిక్కైన మాకు । నొక్కదిక్కును లేము కాలూననైన । దిక్కుగావయ్య నేఁడు మాదిక్కుఁ జూచి । దిక్కు లేకున్న వారలదిక్కు నీవ॥ క॥ నీదిక్కు గానివారికి । నేదిక్కును వెదుకనుండ దిహపరములకు । న్మోదింపఁ గలఁచు వారికి । నీదిక్కే దిక్కు సుమ్ము నీరజనాభా॥ గీ॥ అరయ మా తేజములతోడ నాయుధములు । మ్రింగి భువనత్రయంబును మ్రింగుచున్న । భీకరాకారు వృత్రు నిపీఁచ మడఁచి । యెల్ల భంగుల మాభంగమీసుచు భవ॥ గీ॥ పరమపురుష దుఃఖభంజన పరమేశ । భక్తవరద కృష్ణ భవవిదూర । జలరుహాక్ష నిన్ను శరణంబు వేడెద । మభయమిచ్చి కావుమయ్య మమ్ము॥ వ॥ మఱియు నో భగవన్నారాయణ వాసుదేవ యాదిపురుష మహానుభావ పరమమంగళ పరమకల్యాణ దేవ పరమకారుణికులైన పరమహంసలగు పరివ్రాజకుల చేత నాచరితంబులగు పరమసమాధిభేదంబుల పరిస్ఫుటంబైన పరమహంసధర్మంబునను వాదితంబగు పరమకపాలద్వారంబున నావృతంబైన యాత్మలోకంబున నుపలబ్ధమాత్రుండవై నిజసుఖానుభవుండవై యున్న నీ వాత్మసమవేతంబులై నయపేక్షింపంబడని శరీరంబులకు నుత్పత్తిస్థితిలయకారణుండవై యుండుదువు గుణసర్గభావితుండవై యపరిమితగుణగణంబులున్న నీవు దేవదత్తుని మాడ్కిఁ బరతంత్రంబునునిచ్చిన కుశలఫలంబులననుభవించి చింతింతువు షడ్గుణైశ్వర్యసంపన్నుండవైన నీ వాత్మారాముండవై యుండుదువు గుణసర్గభావితుండవై యపరిమితగుణగణంబుల ర్వాచీనవికర్తవిచారప్రమాణభావంబులగు తర్కశాస్త్రంబులఁ గర్కశంబైన ప్రజ్ఞలుగలిగి దురాగ్రహవాదములైన విద్వాంసుల వివాదానుసరణంబులయందును పరతంబులగున స్తినాస్తీత్యాది వాక్యంబుల సమస్తమాయామయుండవై నిజమాయ చేతఁ గానంబడక యుక్తిగోచరుండవై సమస్తవిషయరూపంబులఁ బ్రవర్తింతువు దేవా రజ్జువునందు సర్పభ్రాంతి గలుగునట్లు ద్రవ్యాంతరంబుల చేత బ్రహ్మంబైన నీయందుఁ బ్రపంచభ్రాంతి గలిగెననియిట్లతి మనోహరచతురవచనంబుల భక్తిపరవశులయి వినుతి సేయుచున్న దేవతలం జూచి యప్పరమేశ్వరుండమృతప్రాయంబులగు గంభీరభాషణంబుల నిట్లనియె॥ క॥ మదుపస్థానంబున మీ । సదమలసుజ్ఞానమునకు సంతోషమునం । బొదలె మదిఁ బ్రీతి నొందితి । వదలక నా భక్తి వోడమి వ్యర్థంబగునే॥ వ॥ మఱియు నతిప్రీతుండనైన నాయందు భక్తులకుం బొందరాని యర్థంబు లేదు విశేషించి నాయందు నేకాంతమతియైన తత్త్వవిదుండన్యంబులం గోరకుండు గుణంబులయందుఁ దత్త్వజ్ఞానగోచరుండయినవాఁడు విషయనిర్వృత్తుండై సంసారమార్గంబు నిచ్ఛయింపఁడు గాన మీకు శుభంబయ్యెడు మీరలు దధీచియను ఋషిసత్తముండు గలండతని శరీరంబు సద్విద్యాతిశయమహత్త్వంబునందేజోవిశేషంబున సారంబయియున్నయది యతని నడిగి తచ్ఛరీరంబుఁ బుచ్చికొనుండు పూర్వకాలంబున నశ్వినీదేవతలకు నశ్వశిరోనామంబను బ్రహ్మస్వరూపంబగు నిష్కళంకంబైన విద్యయుపదేశించిన వారలు జీవన్ముక్తిత్వంబు నొందిరి మఱియుఁ ద్వష్ట్రపుత్రుండయిన విశ్వరూపునకు మదాత్మకంబయిన యభేద్యకవచనంబు నిచ్చెఁ గావున నతండతివదాన్యుండు దేహంబు పంచింపక మీకిచ్చు నతని శల్యంబులు విశ్వకర్మనిర్మితంబులయి శతధారలుగల యాయుధశ్రేష్ఠంబై మత్తేజోబృంహితంబయి వృత్రాసురశిరోహారణకారణంబయి యుండు దానం జేసి మీరు పునర్లబ్ధతేజోస్త్రాయుధసంపదలు గలిగి వెలింగెదరు విశేషించి యుమద్భక్తవరు

లయినవారలే లోకంబుల నెవ్వరికిని జేయలు గావున మీకుభద్రంబయ్యెడు నని భూతభావనుండయిన భగవంతుం డదృ
శ్యుండయ్యె నప్పుడు దేవతలు దధీచిమునికడకుం జనిన నత్తటియుం ద్రుండిట్లనియె॥ గీ॥ దేహి సుఖము గోరు దేహంబు ఘటి
యించి। దేహి విడువలేఁడు దేహ మెప్పుడు। దేహియస్మదీయదేహంబు కొఱకునై। దేహ మీఁగ దయ్యె దేవతలకు॥ ఉ॥ ఎక్కడ నె
ల్లలోకముల నెవ్వరు గోరని కోర్కె నేఁడు మా। తెక్కలిపాటుకై తివిరి దేహము వేఁడఁగ వచ్చినార మే మెక్కడఁ దీవ్రకర్మగ
తి మెక్కడ దైవకృతంబు గాక నీ। త్రొక్కుడు దాన మీవరుసఁ దోయక వేఁడుదురే జగంబులన్॥ క॥ నీచగతి మెల్లభంగుల। యా
చకమని తెలిసి తగ నిదడుగుదు వేనిన్। యాచకవర్గములోపల। నీచకులనఁ బడరె యెంత నేర్పరులైనన్॥ క॥ అడుగంగ రానివ
స్తువులడుగ గురుబతిమాలి మెట్టియర్థులు నిను నేఁ। మడిగితిమి దేహ మెల్లను। గడునడిగెడువాని కేడఁ గరుణ మహాత్మా॥ ఉ॥ నావు
డు నాదధీచియను నాతని సంతసమందిన వ్విసం। భావితవాక్యపద్ధతులఁ బల్కుచునిట్లనె భేర్మితోడనో। దేవతలార ప్రాణుల
కుఁ దెక్కలి మృత్యుభయంబు పూను టే। భావములందలం పరు కృపామతి నెన్నఁడు మీకు నంబులన్॥ గీ॥ ఎలమిఁ బ్రతుకనిచ్ఛ
యించినవారికి। దేహ మెల్లభంగిఁ దీపుగాదె। యచ్యుతుండు వచ్చియర్థించె నేనియుఁ। దన్ను నిచ్చునట్టి దాత గలఁడె॥ అదియు
నుం గాక॥ సీ॥ అర్థంబు వేఁడెడు నర్థులు గలరు గాకంగంబు వేఁడెడి నర్థి గలఁడె। తగఁ గోరికల నిచ్చు దానశీలురు గల్గుఁదన దేహ
మీ నేర్చు దాత గలఁడె। యీ నేర్చువాఁడు దన్నిచ్చినరో యకచంపెడునట్టి యాచకుఁడు గలఁడె। చంపియుఁ బోవక శల్యంబు
లన్నియు నేటి పంచుక పోవువారు గలరె। రమణ లోక మెల్ల రక్షించువారికి। హింస సేయబుద్ధి మెట్టువోడమె। భ్రాంతిరైన
యట్టి ప్రాణంబు పైఁ దీపి। తమకుఁ బోలి నెదిరిఁ దలఁపవలదె॥ అనిన యింద్రుం డిట్లనియె॥ గీ॥ సర్వభూతదయాపరస్వాంతులకు
ను। బుణ్యావర్తనులగు మిమ్ముఁ బోటివారి। కమితసత్కీర్తికాములకు లఘుమతులకి। యియ్యరానిపదార్థంబు లెవ్వి గలవు॥ గీ॥ అడుగరా
ని సొమ్ములడుగ రాదని మాన। డడుగువాని మాటలడుగ నేల। భ్రాంతి నడుగుచోటఁ బ్రాణంబు లేనియు। నిచ్చువాఁడు దా పడిచ్చుఁ
గాని॥ వ॥ అని పరసంకటంబు దలంపక నిలింపులు కార్యపరతన్వవినయవాక్యపరంపరలఁ బ్రార్థించిన నతండు దరహసితవదనుం
డై యఖిలలోకధర్మం బెఱింగియు నొక్కింతగాలంబు ప్రతివాక్యం బిచ్చితి దీనిసహింపం దగుదురు మీయట్టివారలకుం బ్రియం
బుసనేని నెప్పుడైన విడువందగిన శరీరంబు విడుచుటయేమి దుర్లభంబు యధ్రువంబైనయీ దేహంబు చేతం గీర్తిసుకృతంబు
ల నెవ్వండార్జింపకుండునతండు పాషాణాదులకంటె నతికరీనుండు మీయట్టి పుణ్యశ్లోకుల చేత నాకాంక్షింపంబడిన శరీరంబ
ప్రమేయధర్మార్జితంబె దేహంబు చేతనైనను సకలభూతంబులు శోకానుభవంబున శోకించు హర్షానుభవంబున హర్షించు
నట్టి మహాకష్టదైన్యాకరంబైన శరీరంబు కాకశునకసృగాలాదుల పాలుగాకుండ మేలయ్యెనని నిశ్చితాత్ముండయి దధీచి త
త్త్వావలోకనంబు చేత నిరసితబంధనుండై బుద్ధీంద్రియమానసంబులతోఁ గూడిన క్షేత్రజ్ఞుని పరబ్రహ్మస్వరూపంబైన భగ
వంతునందు నేకీభూతంబుఁ జేసి యోగజ్ఞానంబున శరీరంబు విడిచెనప్పుడింద్రుండతని శల్యంబుల విశ్వకర్మనిర్మితంబైన నిశి
తశతధారాసమావృతంబై వెలుంగు వజ్రాయుధంబుఁ గైకొని భగవత్తేజోపబృంహితుండయి యైరావతారూఢుండై సక
లదేవోత్తమగరుడగంధర్వఖచరకిన్నరకింపురుషసిద్ధవిద్యాధరపరిసేవితుండై సకలమునిజనంబులు వినుతింపఁ ద్రిలోకహ
ర్షకారియైన భగవదనుగ్రహసంప్రాప్తసుమహోత్సాహవికసితవదనారవిందుండయి వృత్రాసురు పైనడిచెనప్పుడు॥ ఉ॥ వృ
త్రుఁడు మానవాన్వయపవిత్రుఁడు లోకజిఘాంసకక్రియా। సూత్రుఁడు నిగ్రహాగ్రహణసుస్థిరవాక్యవివేకమానచారి
త్రుఁడు దేవతోరగదరీకృతవక్త్రుఁడు రోషదూషితామిత్రుఁడు శత్రురాకఁ గని మిక్కిలియైన యుగాంతకాకృతిన్॥ క॥ మెం
డుగల దనుజనాయక। మండలములు గొల్వ నడిచె సుహిమోద్ధతి వే। దండములన ఘుమఁ జనునడ గొండయునుం బోలె నిబిడకో
పోద్ధతుఁడై॥ క॥ కాలగళుఁడడరిక వడిఁ। గాలుని పైఁ గవయు మాడ్కి ఖరతరరవసం। చాలితపూర్వదిగంతరుఁ। డైలీలను హేం
ద్రుమీఁద నతఁ డరిగె నృపా॥ వ॥ ఇట్లు రుద్రగణంబులు మరుద్గణంబులు నాదిత్యగణంబులశ్వినీదేవతలు పితృదేవతలు విశ్వేదే
వులు వహ్నియు ఋభువులు వరుణ వాయు కుబేరేశానాదులు సిద్ధసాధ్యకిన్నర కింపురుష గరుడగంధర్వ ఖేచర ప్రముఖం
బులు సురేంద్రసైన్యంబులతోడ నముచియు శంబరుండ నర్వుండును ద్విమూర్ధుండును వృషభుండును హయగ్రీవుండును
శంకుశిరుండును విప్రచిత్తియు నయోముఖుండును బులోముండును వృషపర్వుండును హేతియుఁ బ్రహేతియు నుత్కటుం
డును ధూమ్రకేశుండును విరూపాక్షుండును గపిలుండును విభావసుండును నిల్వలుండును బల్వలుండును దందశూకుండును
వృషధ్వజుండును గాలనాభుండును మహానాభుండును భూతసంతాపనుండును వృకుండును సుమాలియు మాలియు మున్న
గు దైతేయదానవయక్షరాక్షసాద్యసంఖ్యలగు వృత్రాసురు బలంబులుఁ దలపడి సమరంబుఁ జేసిరప్పుడు॥ చ॥ అసురులకున్న
-శావలికి నయ్యమహారణమునప్పుడొండొరుల్ ముసలగదాసికుంతశరముద్గరతోమరభిండివాలపట్టిసపటుశూలచక్రములడం

బము జూపియపల్కి యార్చుచున్న పలకకప్పిర శస్త్రములమారొ్క నినాంటలుమింటనంటఁగ॥ క॥ ఒండొరులగడువనేసి నే
కాండములాకాశపథముఁగప్పిన చెూలాొ। తండములువోలినిప్పులు। భండనముఖమొప్పెఁ జూడఁ బ్రళయోచితమై॥
వ॥ సురవసులేయు బాణములుసూడిక్రొకగోచరమైనభస్థలం। బటియిటిఁగప్పి రేనిదివసాంతముఁ జేసెనలీల వాసురేశ్వరబ
లయూథవీరులుగుసాయకపఙ్క్తులచేతవారిరూ। పరశతధూళిఁజేసిపరపైనతమఃబొనరించిరార్చుచు॥ చ॥ సమరము
నందులై సురనిశాచరవీరులుసైనికాఁ క్రమసం। క్రమితమహోపశాగములు క్రమ్మిసుమ్మలికఁపుడీకటు। ల్దనాకనుదోయి
కడ్డముకఁడారొ్కనినంజలమేఘపోనిరా। క్రమితనిజాంగరంగపరిఘట్టిత రోషమహాగ్నిపెంపునన్॥ క॥ అటఁగళితరక్తధా
రాతురములతోఁగానఁబడిరిసైనికులును చెూపా ధ్వరరోషవహ్నికీలలుపికలఁబైవెల్లగిల్లి వెలికుబుభంగిన్॥ సీ॥ రణిం
చుశింజినీటంకారరవములుభటసింహనాదంబుపరిఢవింప। భీషణో త్తమహయహేషాపిఘోషంబు కరిబృంహితసూ్ఫ
ర్తిఁగ్రమ్మకొలుప। సమరవిస్ఫారకాంకశంఖనినాదంబు నేమిస్వనంబులనిహ్నాపింప। ముములనైచెలఁగెడుచండభిధ్వా
నంబులట్టహాసంబులనాక్రమింప। ఘటితశస్త్రాస్త్రనిష్ఠుర ఘట్టనోత్థ। బరరథోరోరుపిస్ఫులింగంబులడరి। దివ్యకోటీర
మణిఘృణిఘర్షింపసమర మొనరించిరసురులు నమరవరులు॥ వ॥ ఇట్లు ప్రళయసంరంభభీమ్మభీషణసమస్తాంగరంగతరం
గితభైరవారావక్షుబ్ధాసమహార్ణవంబునుంబోలెయుగాంతసంక్రాంత ఝంఝూపవనపరికంపితదిగ్ఘుదిఘాతజనితడిస్తు
రవీరదంబులుంబోలెనుభయసైన్యంబులుంగలసినరంబులుపుసమయంబున యుగాంతకృతాంతసకలప్రాణిసంహా
రకారణలీలయుంబోలెఁబదాతిరాహుత్తమావంతరథికమహారథికవీరులొండొరులఁజండగతింగాడంబులఁబరపుచుఁగ
దలంజముపుచుఁగత్తులఁగప్తళంబులఁ జినఁగంబొడుచుచు నడిదంబులనడఁచుచుఁ గుంతంబులఁగ్రుచ్చుచుఁగుఠారంబు
లవ్రచ్చుచుముసలంబులమోదుచుముద్గరంబులంబాదుచుఁజక్రంబులఁద్రుంచుచుఁబరిఘంబులనొంచుచుసురియలమే
లుముచుశూలంబులఁగ్రుమ్ముచువాలంబులనటకేయుఁదొడలుతుండించియుఁదుండంబులఖండించియునురరు లెడలించి
యు మెడల్లుగెడలించియు నఖములుద్రుంచియునాసికలఁద్రెంచియుఁబకంబులవిరిచియుఁబార్శ్వంబులంగలయజఁఅచి
యుగజంబులఁబఅపియుగాత్రంబులనుటెపియుఁగుంభంబులఁబగిలించియుఁగొమ్ములుపెకలించియుహస్తంబులుతుండిం
చియునంగంబులఁజించియురథంబులనలయించియురథికులఁబొలియించియుసారథులఁజంపియుసైంధవంబులడంపియుశి
రంబులనొగిలించియు సీసకంబులంగలంచియుఛత్త్రంబులనుఖండియుఁజామరంబులంబనుమాడియుసైన్యంబులఁజది
పియుసాహసులమెదపియునఖములుద్రుంచియుచటియునుబరస్పరమునపిచ్ఛేగనంబునన్యోన్యకోదండఖండనపటుత్వం
బునుభయసైంధవధ్వజసారథిరథికరథపికలంబు నొండొరులపాదజానుజంఘాహస్తమస్తకనిర్దళనంబును రక్తమాంస
మేదఃపంకసంకలితసమరాంగణంబును నైయతిఘోరభంగింజెనంగిరప్పుడు॥ చ॥ సమరజయమున్నమ్మ ప్రజయసౌహృపరి
శ్రమమున్నమోఘవిక్రమముసమస్తశస్త్రబలగర్వము నైకటఘోరంభంగిని। నముచిపురోగసైన్యగణనాథులలోడ
నిశాచరేశ్వరోత్తములునురంబు సేసిరొగిఁడారొ్కనిర్మలబలంబుప్రాపునన్॥ అప్పుడు॥ లయగ్రాహి। మొత్తములఁబా
ఱుపెనునెత్తురునుహీనసులమొత్తములతోనుటికినుత్తులు మోపన్। జిత్తములనుబ్బిపెసనెత్తుకొనుభూతముల నెత్తకని
శాకినులుచొత్తిలుచుమాంసముల మత్తులతో మెసఁగినృత్యములు సేయుమిడిమత్తమగుఢాకినులు ల్త్తగసఁద్రేవ్వు। క్షేత్ర
ములందిగిదిమెత్తమెదడుఁగ్రోనసినుత్తగొనుచుండభయసృత్తిఁగలనొప్పెన్॥ వ॥ ఇట్లు దేవదానవులన్యోన్యదారుణంబునఁగృ
తయుగంబునందలపడిత్రేతాయుగంబొచొచ్చునంతకాలంబుపోరుదారుణంబుగాఁజేయుచుండనంతనప్పరాసురభుజబ
లంబుపెంపునందెంపుఁజేసి పిపక్షనిలింపులసైరికుసులుగుంపులై పెంపుచూపినహోమ్మకు పాషాణగిరిశిఖరంబులువ
ర్షించిన॥ క॥ గిరిపాషాణహతిజమిల్లుకియఁగాగిర్వాణులన్నిటన్। స్థిరనాదాసరఁపరల్లఁజప్పుచక్రజ్వాలంబుఁగా
వింపని। ర్భరలీలందమచేయుసత్త్వములుదోర్బలంగంబులైపోవఁగాఁ। దెంటఁదాకి రాక్షసతతియోధవీరులనదోర్దండంబులనఁభి
న్నమై॥ క॥ ప్రచురముగరాక్షసావళి। ఖచరులపై నేయుశిబిడకాండావళి। ద్రవ్వచనుఁడెడనాడమాటలుసుచ్ఛ్రియాం
చుఁబోలిచౌరవమ్యోన్యపా॥ అప్పుడు॥ వనమయూరము॥ అంతసురలేయుశిబిడాస్త్రములుసౌనై। పంతములుదక్కి హతిపా
రుషముతోని। శ్చింతగతిరక్కసులుసిగ్గడిగిభూమిం। గంటుఁగొనిపాఱిరసకౌరపములార్వన్॥ క॥ కొండలఁబోలెడురక్కసు
లొండొరులంగడవఁబాటిరుక్కసటిపటుకో। పండముఖసాధనంబులు। భండనమునవైచిపిఱుపఱులార్వంగన్॥ వ॥ ఇట్లుసమ
రతలంబువాసితనస్త్రాపుకుసిపఱచుచుండు దండనాయకులఁజూచి యుకుటిలమతింబకపకనగివృత్రాసురుండిట్లనియె॥
ఉ॥ తుల్లకవృత్తిమీకుగురువెంపుమలకిమ్మెముఁగీర్తిభోగముల్గ్లొల్లగఁజేయుఁజావునుదిఁగొరినవారలకైనఁగల్గునేటిట్లుడినం

దియాసమరధర్మముమానితలంగఁ బాడియే। మల్లుఁడుమద్దమప్రథనమత్తునివృత్రునిపాటెఱుంగరే॥ క॥ చావు ధ్రువమైన
ప్రాణికిఁ। జావులు రెండరసికొనుఁడుసమరమునంచు। న్భావింపయోగమందును। జావంగాలేనిచెడుగు చావుంజావే॥ వ॥ అ
నివాసు దేవ తేజోవిశేషవిశేషితులై దవానలకీలలంబోలె వెలుంగుచు వెఱచి వెన్నిచ్చిపాఱెడు నసురుల వెనుకొనితఱుము
సురవీరులంజూచిహుంకరించి స్వర్గానుభవంబుననిచ్చ లేకుండె నేనిమదవలోకనస్పర్శనమాత్రంబు ముందరనిలుతురు గా
కయనియేచికల్పాంతానల్పఘనఘనాటోపంబునుంబోలెఁ గఠోరకంఠహుంకారతర్జనంబులంగద్దిల్లుచుఁ బ్రళయకాలప
వనపరిభావితమహాశిఖిశిఖావళులం ద్భృణీకరించుకుటిలావలోకనంబులనాలోకించుచుంగాలపరిపక్వలీలాలోలుండయిన
శూలిపోలికెనాఖిలమూర్తియైనసకలజీవభారభరణమర్భరభగ్నబ్రహ్మాండభాండమహాధ్వానంబుభంగినాస్ఫోటించిన॥
ఉ॥ కూడెజగంబులన్నియునుగ్రుంకిరిసూర్యసుధాంసులద్రులూటాడెనభస్థలంబగిలెనంబుధులింకెనుదగ్గ్రిహాళిపట్టూ
డెవడిద్దిశల్వగిలెనుర్వరగ్రుంగెనజాండభాండమల్లాడెవిధాతబెగ్గడివెనార్చుచువృత్రుఁడుబొబ్బవెట్టినన్॥ లయగ్రా
హి॥ కూలిరివియచ్చరులుసోలిరిదిశాధిపులువ్రాలిరమరవ్రజముదూలిరురగేంద్రుల్। వ్రేలిరిసురుగ్గణముజాలిఁగొనిర
శ్వినులుకాలుడిగిరుద్రులవలీలఁబడిరార్తిన్। వ్రీలిరిదినేశ్వరులుకీలెడలినట్లుసురజాలములుపెన్నిమరపాలగుచుధారా।
ఖీలగతితోఁడఁదముకేలిధనువుల్విడిచినేలఁబడిమూర్ఛలనుదేలిరిమహాత్మా॥ వ॥ ఇట్లుకఠోరకంఠనాదంబొనర్చిననశనిపా
తంబునంగూలుప్రాణిచయంబుభంగినంగంబులెఱుంగక రణరంగంబునంబడి బెట్టుమూర్ఛిల్లినదివిజరాజసైన్యంబుల
వృత్రాసురుండుసంగరరంగమర్దమండై మహీవలయంబుపదాహతంబులగజగజవడంకనిశితశూలంబుకేలనంకించుచు
మదించినభద్రమాతంగంబుకమలవనంబు సొచ్చి మట్టిమల్లాడువిధంబుననిమీలితాక్షుండగుచుఁ బడతలంబులరూపంబు
లుమాయంజమురుచువెక్కసంబునఁగ్రీడించువానింగనివజ్రివజ్రశతోపమనిష్ఠురగదాదండంబాభీలభంగిఁబ్రళయకా
లమార్తాండచండపరివేషప్రేరితంబుగాఁద్రిప్పివైచిన॥ మ॥ అదిమింటంబెనుమంటలంటఁబరపైయాభీలవేగంబునంగది
యన్వచ్చినలీలతోఁడఁగరసంగ్రాహంబుగావించిబెట్టిదమైచేరిసురారిదానిఁగొనికారిన్యోరుపాతంబునం। జదియన్మో
దెగజేంద్రమస్తకమునుత్సాహైకసాహాయ్యుఁడై॥ గీ॥ అగ్గజంబుకులిశహతిఁగూలుకులమహీధ్రంబువోలెరక్తధారలు
రుఁలమస్తకంబువగిలిమదమటిజిరజిరఁదిరిగిపిలుగుసూపితెరలిపఱచె॥ ఉత్సాహవృత్తము॥ గజముదెరలిడానికొరలిగర్జ
లిడుచుఁబాఱఁగా। బలిమినింద్రుఁడంకుశమునఁబట్టిబిట్టునిల్పుచున్నిజసుధారసైకపాననిర్ణయార్ద్రకరమునన్। ఋ
జువుమీఱనిమిరెనపుడురూఢిమెరసిక్రమ్మఱన్॥ వ॥ ఇవ్విధంబుననైరావతంబునుసేదదేర్చుచునెదురనిలుచున్నభిదుర
పాణింగనితోఁబుట్టువుఁజంపినతెంపుఁదలంచిమోహశోకంబునవిపర్యాసంబుగానవ్వుచునాహవకామ్యార్థియైవృత్రుం
డిట్లనియె॥ శా॥ నాకుంబెద్దయునీకుసద్గురువుదీనవ్రాతరక్షున్మభా। లోకుంజంపితివిట్లుపాపమతివైలోభంబుతోనియ్యో
డన్। లోకుల్నవ్వఁగమచ్ఛుజాబలిమికిన్లోనైతివీశూలమం। దాకంపింపఁగనిన్నుగ్రుచ్చిఋణముక్తాత్ముండనై పేర్చె
దన్॥ క॥ ఎట్టితులువైనగానీ। నెట్టనఁదనబ్రదుకుకొఱకునీవలెగురువుం। జుట్టమునుబుణ్యుబ్రాహ్మణుఁ। బట్టివధింపంగఁగలఁ
డెపశువుంబోలెన్॥ చ॥ దయయునుసత్యమున్విడిచిధర్మముమానియశంబుమాసి శ్రీ। జయములఁబాఱఁదోలిపురుషత్వము
గానకలోకనిందితా। హ్వాయుఁడగువానిచావునకునార్యులుగుందుచురేస్పగాలము। ల్ప్రియమునఁనంటునేశవముఁ బ్రేల
కచేరునెకంకగృధ్రముల్॥ క॥ నిక్కమగుపాపములచేఁ। జిక్కితివినిశాతశూలశిఖరాగ్రమున। న్మక్కించినీదుమాంసము।
నక్కలుఁగుక్కలును జేరినమలఁగఁజేతున్॥ ఉ॥ డీకొనినీకునేఁడిచటదిక్కనివచ్చినవారుగల్గిరే। యేకమతింబిశాచములకె
ల్లనుదృప్తిగమన్నిశాతశూ। లైకమహాగ్నికీలలననేకవిధంబులసోమయాజినై। మేకలఁజేసివ్రేల్చెదనమేయమదోద్ధతి
వ్రాలినియ్యనిన్॥ క॥ కాకననుఁగులిశధారల। దీకొనినిర్జింపఁగలిగితేనియభూతో। ద్రేకంబుఁజేసిశూరులు। ప్రాకటపదప
ద్మధూళిభాగంబగుదున్॥ సీ॥ సందేహమేటికిజంభారివేవేగభిదురంబువ్రేయుమాభీలభంగి। నతిలోభినడిగినయర్థరాశి
యుఁబోలెఁగడవలేనిదివృథగాదుసుమ్ము। మురమర్దనునితేజముననాదధీచివీర్యాతిశయంబుననధికమయిన। యదిగానహ
రిచేనియంత్రితోన్నతుఁడవైగెలువుముశత్రులగీటడంచి। యెందుఁగలఁడువిష్ణుఁడందుజయశ్రీలు। వెంపుఁదానవచ్చి
పొందుచుండుఁ। గానభక్తవరదుఁగమలాక్షునర్వేశు। పదములందుమనముఁబదిలపఱుతు॥ వ॥ ఇట్లువజ్రధారలం దెంపంబ
డినవిషయభోగంబులుగలవాఁడనై శరీరంబువిడిచిభగవద్ధామంబుఁబొందెదనారాయణునిదాసుండనైననాకుస్వర్గమ
ర్త్యపాతాళంబులంగలసంపద్భోగంబులునిచ్ఛయింపంబడవుత్రివర్గికాయాసరహితంబైనమహదైశ్వర్యంబుప్రసా
దించుటంగావుననేననుపమేయంబైనభగవత్ప్రసాదంబన్యులకగోచరంబద్దేవునిపాదైకమూలంబుగానుండుదాసుల

కుదాసానుదాసుండనై యున్నవాఁడ ననియప్పరమేశును ద్దేశించి॥ చ॥ అరయఁగభక్తపాలనములైనభవద్గుణజాలమాత్మ
సంస్మరణము సేయ వాక్కు నినుసన్నుతి సేయ శరీర మెల్లఁగిం। కరపరివృత్తి సేయనుదిఁగాంతు మొనర్చెదఁగాని యెుల్ల
నే నరివిధ్రువోన్నతస్థలమునబ్జజుపట్టణమింద్రభోగముల్॥ ఉ॥ ఆఁకలిగొన్న క్రేపులురయంబుననీకెలురానిపక్షులు।స్త్రీ
కోనితల్లికిన్నఁటివి దేశగతుండగు భర్తకుం గజ।వ్యాకులచిత్తరైన జవరాలును దత్తరమందు భంగినో। శ్రీకరపంకజాక్షుని
సుఁజేరఁగ నామదిగోరెడుం గదే॥ క॥ నాకును సఖ్యము పుణ్య।శ్లోకులతోఁ గాని తత్త్వశూన్యులు సంసా।రైకవిమోహులతో
డం। గాకుండ నొనర్పవయ్య కంజదళాక్షా॥ మహాస్రగ్ధర॥ హరిపై సర్వాత్ముపై నత్యగణితగుణుపై నంతరంగంబు పర్వ।న్స
రిమేను ప్పొంగఁ జాపుం జయమును సరిగా సంతసంబందుచున్ స్ఫీ।కరుఁడై కాలాగ్నివోలెన్ గనలుచుఁ గపిసెన్ ఖర్వగర్వోన్న
తిస్ఫుర్ఘరలీలన్ భూమి గంపింపఁగ దిశలద్రుల్ ఖండనోద్దండవృత్తిన్॥ క॥ దొరఁకొని ప్రళయోదకమున।హరిపైఁ గైటభుఁడు
గవియుహంకారమున।స్సురనాథుమీఁద వృత్రా।సురుఁడు మదోద్వృత్తినడిచె శూలాయుధుఁడై॥ శా॥ కల్పాంతాగ్నియుఁ
బోలెను ల్కలెగయంగా ద్రిప్పుచున్ దీనమో।రల్పా పొల్పిలి వంచు శూలమురయం బారంగఁ బై వైచినం। బోల్పంగోటిరవి
ప్రకాశతదివిం బోవంగ వీక్షించి యా। వేల్పుల్ ప్పొంగఁగ వజ్రధారమని మెన్నిన్నాణ మొప్పారఁగన్॥ గీ॥ శూలమప్పుడతఁ
డు ప్రుక్కఁగ ఖండించి।పూని శోనకదిసి భుజముఁ ద్రుంచె నసురగనలి యేకహస్తుఁడై పరిఘంబు।గొని సుహేంద్రుఁ గిట్టి హ
నువులడఁచె॥ వ॥ ఇట్లు ప్రళయకాలభీషణపరివేషపోషంబుగా రోషంబున నంబరిఘంబుఁ ద్రిప్పికుప్పించి గజకుంభస్థలంబు భ
గ్నంబు సేసి యింద్రుహనుప్రదేశంబులు నిష్ఠురాహతి నొప్పించిన॥ క॥ గజము హదముడిగి తిరుగుచు। గుజగుజనై ఘీంక వెట్టఁ
గులిశము నేలన్ బలిమి చెడి విడిచె నింద్రుఁడు।గజిబిజితోఁ బెగడెనసురకడిమి జగంబుల్॥ క॥ గరుడుఁడు ప్రేదివిన నాగము।క
రణిన్ వృత్రాసురేంద్రుకడిమికి లోనై।తిరుగుడు వడ్డహరింగని।పురపుర నాహాయటంచుఁ బొగిలె జగంబుల్ ॥ అప్పుడు॥
గీ॥ గజముపాటుఁ జూచి కడుదీనగతిఁ జూచి।పరికరంబు జారిపడుటఁ జూచి।యుద్ధధర్మమెఱిఁగియున్న శత్రుని జూచి।సిగ్గుతో
డవజ్రి శిరము వంచె॥ వ॥ ఇట్లు యుద్ధంబున శత్రుసన్నిధిం గరంబు జారి పడిన వజ్రంబుఁ బుచ్చికొనక నిర్వీణుండై యున్న పా
కశాసనుం జూచి వృత్రుండిట్లనియె॥ క॥ మరమునఁ గైదువు వదలిన।శరణన్నను వైరిజనులఁ జంపరు వైరి। వెరగొందనేలను
లిశము।కరమరుమగఁ బుచ్చికొనుము కాచితి నింద్రా॥ సీ॥ వజ్రంబుఁ గైకొని వైరి నిర్జింపుమిట్లడలంగ వేళగాదమరనాథ।
యమరదేహాధీనులైన మూర్తులకెల్ల నీశులక్ష్మీశు సర్వేశుఁ బాసి। కడతేఁ జయములు గల్గునే యెంతైన దలపోసి చూడు
మా తత్త్వదృష్టి।నీలోకపాలురు నెవ్వని వశగతి వలఁబడ్డ పక్షుల వర్తనమున।జిక్కి చేష్టలు సేయుచుఁ జింతసేకు। రట్టి మృ
త్యుబలంబులనాత్మ జయము।తమదిగాఁ గోరి యజ్ఞానతంత్రులగుచుఁ।గములలోచనులీలా వికారములను॥ గీ॥ మెరయయం
త్రమయంబైన మృగము భంగి।దారునిర్మితమైనట్టి తరణిపోల్కి।శక్ర యెఱుఁగుమిలభూతజాలమెల్ల।దళితపంకేరుహాక్షు
తంత్రంబుగాఁగ॥ వ॥ మఱియు భూతంబులచేత నింద్రియంబులచేత వశుండై నపురుషుండు ప్రకృతిచేత వేఱుసేయంబడిన
యాత్మం బరమేశ్వరానుగ్రహంబు వాసి సుఖియించుచుండునవిద్వాంసుండై నవాఁడనవరతంబు తన్నుస్వతంత్రుం డ
గాఁ దలంచుచుండు భూతంబులవలన భూతంబులు పుట్టుచుండు నా భూతంబులు భూతంబులవలన భక్షించుచుండుఁ బు
రుషునకాయువు శ్రీయును గీర్తియు నైశ్వర్యంబు మొదలయినవియనుభవింప నెంతగాలంబు ప్రాప్తం బంతగాలంబుని
వసించుఁ బ్రాప్తంబు దీఱినఁ బురుషుండు జాలిం బొందిన నదియుండక పోవుచుండుఁ గావున గుణంబున వగుణంబుఁ గీ
ర్త్యపకీర్తులును, జయాపజయంబులును, సుఖదుఃఖంబులును, జావు బ్రతుకులును, సమంబులయి కలుగుచుండు నజ్ఞానిమైన
వానికి సత్త్వరజస్తమోగుణంబులు గలిగియుండునట్టి వానికి గుణమయంబులైన యింద్రియాదులే యాత్మయని తోఁచు
చుండుం గావున వాఁడా గుణంబులచేత బద్ధుండగు నా గుణంబులకు సాక్షిమాత్రంబయిన శరీరంబు వేఱని యెవ్వఁడెఱుంగ
నోపు వాఁడా గుణంబులచేత బద్ధుండు గాఁడు గావున గుణంబులు గుణియును భోక్తయును భోగంబును జయంబు నపజ
యంబును హర్తయును హన్యంబు నుత్పత్తిస్థితిలయకర్తయైన సర్వోత్కృష్టుండైన యప్పరమేశ్వరుండె కాని యన్యంబులే
దిప్పుడొక్క హస్తంబు నాయుధంబువోయిన నేను భవత్ప్రాణాపహరణంబునకు సమర్థుండనగుచున్న నన్నుం జూడుమ
నిమఱియునిట్లనియె॥ గీ॥ వాహనంబులు సారెలు వాడి శరము।లూర్జితాక్షములను వులు నొడ్డణములు। గాఁగఁ బోరెడి నీ
ద్యూతకర్మమందు। నెసఁగ జయమును నపజయమెవ్వఁడెఱుఁగు॥ చ॥ అనవుడు వృత్రుమాటలకు నచ్చెరువంది సురేంద్రుఁ
డెంతయుం।దనమదిఁ గుత్సితంబుడిగి దైవముగా నతనిన్ భజించి కైకొని యెగరంబున న్దిగువఁ గూలిన వజ్రము నవ్వుచాత్మ
లోఁ।దనరెజగంబులన్నియు ముదంబును బొందిరి ఖేచరావళుల్॥ క॥ రాహుగ్రహవక్త్రిమహా।గేహాంతము వాసి వచ్చి

రణావళిస న్నాహుల్యై మొప్ప వెలిగెను. యాహరిదత్త్వంబునవో లేహరి మొప్పెప్పెపో ॥ వ ॥ ఇట్లు కరకలితవజ్రాయుధరు
డైన యింద్రుండు దిగ్భ్రమ మొంది యుండుటయు నంతట ఘోరగంభీర వాక్యంబుల విస్మయమంద స్మిత ముఖారవిందుండయి వృత్రుం డిట్లని
యె. ॥ ఓదానవేంద్ర నీకు నీ వేదాంతముచో లేదే తత్త్వవిజ్ఞానకళా మోదము నీవలి భక్తుండ. వాదినఁ బురుషుని కహరికిన
జ్ఞానముకున్ ॥ ఉ ॥ లోకము లెల్ల నిండిత నలోనుగ సర్వముఁ జేసి ప్రాణుల । న్దీపులఁ బెట్టి యెల్లెడలఁ దీపులు సూపెడి విష్ణు
మాయ నే । దే నిలిపింపలం దిత్తిచయే లను మానుసుర రూపు నానిను । శ్లోకుఁ బురాణపూరుషుని శోభనమూర్తి ధరింపు మింపు
నన్ ॥ ఉ ॥ ఏయనుబుసల్పి నావొయెట్టిన హేతవమాచరించితో । పూని రజోగుణాభిరతిఁ బొందిన నీవు తిశాంత దాంతసన్మా
ననమాన సానుభవనుస్తను రాశ నిరోధభావన । న్మానున మేయు నాడనుజనా ర్దనుభక్తి మెసంగి యింతియన్ ॥ క ॥ నారాయ
ణరూపా న్వృత । పారావారమున ఁ జేలుభక్తుండు దాభూ । దారక రఖాత కోడక । ఘోరంబుల నేలత్వ స్తిఁ బొందుమహోత్సా ॥
వ ॥ ఇట్లు పలుకుచున్న నింద్రునుపలక్షించి వృత్రాసురుండా యోధన మగ్నగ్న ణసంఘుర్ష మాణమానసుండై వైరింబురి కొల్పు
కొని వామహస్తంబునం బరిఘుంబుఁ ద్రిప్పుచు నుప్పరంబునం గుప్పించుచు బ్రహ్మాండకర్పరంబు స్ఫురకై రవారావంబునం
బగిలించుచు సముత్తుంగమత్తమాతంగపుంగవంబు వృషభంబుపైఁ గడియుభంగి సురవృషభు పై నుగ్గవుపలకించి భీషణాశ
నినిపాత వేగంబునం గొట్టిన నింద్రుండు కులిశధారనప్పరిఘుంబుఁ దునిమి తోడన శేషఫణాప శేషంబై న బాహుదండంబు
ఖండించె నప్పుడవ్వృత్రుండు భిన్నబాహుద్వయమూలుండై రక్తధారలం దోఁగుచు వజ్రిచే తపక్షహతిం బై దివంబున నుం
డిజారుచున్న కులపర్వతంబునుం బోలెఁ జూపట్టి ప్రళయ కాలసంహారనిటలచ్చటచ్చటార్భటక ఘోర కీలాభీలాగ్నిసమాన
ప్రాగకుటిలనిరీక్షణ మర్ని రీక్షణుండై భూనభోమండలంబులఁ గిందిమీఁదిదౌడలహత్తించి నభోమండలంబునుం బోలెఁ దు
దిమొదలెఱుఁగరాక వికృతంబుగా వక్త్రంబుఁ దెరిచి మందరమథనమథ్యమానవిషధరవిషమజిహ్వాభీలంబగు నాలుకన
భంబు నాకుచుఁ గాలసంహారకారణుండయిన కాలుని భుజదండమండిత కాలదండంబునుం బోలెడి దంష్ట్రలచేత జగత్త్రి
యంబును మ్రింగెడువానిం బోలెనతిమాత్రమహాకాయుండయి పర్వతంబులం దలంగ మీటుచు నడగొండయుం బోలె న
భోభాగభూభాగంబుల నాక్రమించి యప్పుడు ॥ ఉ ॥ కాలము నాఁటి మృత్యువుముఖంబును బోలుచు విస్ఫులింగములు గ్రాలఁగ
దేవసంఘములు కంపము నొంద జగంబులెల్ల నాహాలురి తారవంబెసఁగ నభ్రగజంబును నాయుధంబుతో న్నాలుకఁ జుట్టి పట్టి
సురనాథుని మ్రింగె మహోన్నతాకృతిన్ ॥ గీ ॥ లోకమెల్ల నప్పుడు చీఁకాకుపడెఁ దనంగ బడలెను మునిగణంబులవని నాఁడ । సోన
వానసురి సెసూర్యచంద్రాగ్నులు రస్ములుడిగె నిశలు రభసమయ్యె ॥ అప్పుడు ॥ ఉ ॥ కందఁడు భీతిగుందఁడు ప్రకంపిత మొందఁ
డు పెద్దనిద్దురం జెందఁడు తత్తరింపఁడు విశేషముఁ జెప్పఁడు వైష్ణవీజయా । నందపరైక విద్యయు మానంబునఁ దాల్చుచునుం
డెఁ గాని సంక్రందనుఁ డానిశాచరుని గర్భములో హరిరక్షితాంగుఁడై ॥ వ ॥ ఇట్లు కవచరూప శ్రీనారాయణకృపాపాలితుం
డై యోగబలంబున బలభేదియతని యుదరంబు వజ్రాయుధంబున భేదించి వెడలి రావణసహితుండై యతని కంధరంబు తెగన
డువవజ్రంబుఁ బ్రయోగించిన నతినిష్ఠుర వేగంబున వృత్రహరణార్థంబు నందిరుగుచు సూర్యాదిగ్రహనక్షత్రంబులకు దక్షి
ణోత్తరగతిరూపంబయిన సంవత్సర సంధియందు నహోరాత్రమధ్యంబున వృత్రు శిరంబు పర్వతశిఖరంబునుం బోలెఁ
ద్రుంచి భూతలంబునం ద్రోచె నప్పుడు ॥ మ ॥ మొరసెం దుందుభులంబరంబునఁ గడుం గ్రోడించి గంధర్వులు న్సురలున్సాధ్యులు సిద్ధులు
న్మునివరుల్సొంపార వృత్రఘ్ను భీకర తేజోవిభవప్రకాశకరవిఖ్యాతైక మంత్రంబులం దిర మొప్పం బఠియించుచుం గురిసి
రెం తేఁ గ్రొత్తపూసోనలన్ ॥ గీ ॥ ఏమి చెప్పనప్పుడింద్రారితనువున నొక్క దివ్యతేజముద్భవించి వెడలి లోకమెల్లఁ జూడ లోకులు
సూడని లోకమరసి విష్ణులోని సొచ్చె ॥ వ ॥ ఇట్లు లోకభీకరుండైన వృత్రాసురుండు కూలిన నఖిలలోకంబులు పరితాపంబులు
డిగి సుస్థితిం బొందె దేవఋషి పితృగణంబులు దానవులతోడం గూడి యింద్రున కుం జెప్పక తమతమ స్థానంబులకుం జనిరని న
విని పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె ॥ గీ ॥ ఏమి కారణమున నింద్రుతోఁ బలుకక సురలు వోయి రట్టి సురగణం
బు లెంచ చేతసుఖముఁ జెందిరి వజ్రికిఁ జేటు గలుఁగు టెట్లు చెప్పుమయ్య ॥ వ ॥ అనిన శుకుం డిట్లనియె వృత్రపరాక్రమ చకితు
లయిన నిఖిలదేవతలును మహర్షిగణంబులును మున్ను వృత్రవధార్థంబిం ద్రుని ప్రార్థించిన నతండు బ్రహ్మహత్యఁ జేయఁ
జాలక తొల్లి విశ్వరూపునిం జంపిన పాపంబు స్త్రీలయందును, భూమియందును, జలంబులందును, ద్రుమంబులందును, విభ
జించి పెట్టితి నిపుడీ హత్యయే రీతిం బాపుకొను వాఁడ నాకశక్యంబనిన మహర్షులశ్వమేధయజ్ఞంబు సేయించి యజ్ఞపురుషుం
డైన శ్రీనారాయణదేవుని సంతుష్టునిం జేసి యాహత్యాపాపంబు గలవారము స్వభావంబున బ్రాహ్మణపితృగోమాతృసజ్జనహం
తలైనవారలే దేవునిం గీర్తించి శుద్ధాత్ములగుదురు దేవుని నశ్వమేధమహామఖంబున శ్రద్ధాన్వితుండవై సేవించిన నీమఖలుం

డై నయిద్దు రాత్మునిహింసించినహత్యయేమి సేయంగలదని యొడంబరచిననింద్రుండు వల్లెయనియివ్విధంబున మారుతుం
బరిమార్చి బ్రహ్మహత్యంబొందియత్తాపంబు భరియింపనోపక దుర్దశంబొందెనప్పుడు॥సీ॥ పాపంబు చండాలరూపంబు గ
లదానిముదిమి చేనొడలెల్లఁ గదలుదాని। క్షయకుష్ఠరోగసంచయకృతంబగుదానినురురక్తపూరంబు దొరుగుదాని। నెఱసి
నవెంట్రుకల్బెరసినతలదానినటపోకుపోకుండును నేడుదానిఁ। గమరుకంపునఁ బ్రేవులదరఁ జేసెడుదానిఁ దానెందుఁ బా
ఱినఁ దరుముదాని। నాగుణంబులెల్ల భోగింపకేరీతి। నరుగ నెంతవాఁడవ నెడుదాని। బిట్టు తిరిగి చూచి భీతిల్లి సిగ్గుతో। దేవనా
యకుండు దెరలిపఱచె॥ వ॥ ఇట్లతివికృతంబుతో బ్రహ్మహత్య వెనుదగులనింద్రుండు నభోభాగభూభాగదిగ్భాగంబులెల్లం
దిరిగి చొరం దెరువులేక దీర్ఘనిశ్వాసతాటోపనిశ్వాసచూషితుండై యీశాన్యభాగంబునకుం బఱచియద్దైసనమేయపుణ్యాగ
ణ్యంబైన మానససరస్సునం బ్రవేశించియందునొక్క కనులనాళంబు సొచ్చియందుఁ దంతువుంగలసి రూపంబులేక నలబ్ధభో
గుండై బ్రహ్మహత్యాపిమోచనంబుఁ జింతించుకొనుచు సహస్రవర్షంబులుండె నాచండాలియదివరమేశ్వరదిగ్భాగంబ
గుటం జేసియందుం జొరరాకకాచియుండెనంతగాలంబు త్రిదివంబున నహుషుండు విద్యాబల తపోబలయోగబలంబు
లం బాలించుచుండె సంపదైశ్వర్యమదాంధుండై యింద్రపత్నిం గోరియింద్రుండు వచ్చునందాఁక నాకుం బత్నివిగమ్మనిన
నాశచీదేవి బృహస్పతి ప్రేరితయై బ్రహ్మర్షి వాహ్యాశిబికంబు నెక్కి వచ్చినన్ను భోగింపుమనిననతండట్ల చేసి కుంభసంభవ
శాపహతుండై యజగరయోనియందుఁ బుట్టెనంతనింద్రుండు బ్రహ్మర్షిగణోపహతుండై త్రిదివంబున కువచ్చెనంతగాలం
బు నారాయణచరణారవిందధ్యానపరుండై యుండుటం జేసి దిశాధినాయకుండై నశంకరు చేతరక్షింపంబడ్డవాఁడై యుం
డుటం జేసి తద్దోషబలంబుడఁటిగి సహస్రాక్షుం బీడింప లేదయ్యె నప్పుడింద్రుండు నైశ్వర్యంబునుం బొంది బ్రహర్షి పరివృ
తుండై మహాపురుషారాధనంబుఁ జేసి హయమేధాధ్వరంబునకుం దీక్షితుఁడై కొని బ్రహ్మర్షుల చేతఁ జేయింపంబడుచున్నవా
ఁడయి సర్వదేవతామయుండైన నారాయణుం బరితృప్తుం జేసి మంచువిరియించు మార్తాండుని చందంబునఁ ద్వాష్ట్రవధ
రూపపాపంబు నాశంబు నొందించి సకలదివిజయక్షగంధర్వసిద్ధమునిజనసంస్తూయమానుండై త్రిభువనైశ్వర్యభోగభా
గ్యంబులం గైకొనియెనప్పుడు॥ చ॥ సతతమరీచిముఖ్యమునిసంఘము చేత యథోచితంబుగాఁ। గృతఘనవాజిమేధమునఁ
గేశవునీశుఁ బురాణపూరుషుఁ। హితుజగదీశుయజ్ఞపతినిష్ఫలప్రమనంతరంగసం। గతుభజియించి వజ్రిగతకల్మషుఁ
డై నెగడెన్మహీశ్వరా॥ సీ॥ మఱియుఁ బుట్టింపంగ మనసు వెట్టినయట్టి క్రూరకర్మాంభోధికుంభజుండు। అంగారములు సే
య నాహుతిగననోపు బహుపాపకాననపావకుండు। కందకడిగ ద్రిం౦గగల్గునంద్రేపంగఁ గల్మషగరళగంగాధరుండు।
ఘనగుహాంతరములకాలూననియ్యనికలుషదుస్తరతమోగ్రహవిభుండు। సకలముక్తిలోకసామ్రాజ్యసమధిక। సహజ
భోగభాగ్యసంగ్రహైక। కారణాప్రమేయకంజాక్షసర్వేశ। కేశవాదినామకీర్తనంబు॥ సీ॥ అఖిలమఃఖైకసంహారా
దికారణంబఖిలార్థసంచయాహ్లాదకరము। విమలభక్త్యుద్రేకవిభవసందర్శనంబనుపమభక్తవర్ణనరతంబు। విబుధహ
ర్షానేకవిజయసంయుక్తంబు గ్రస్తామరేంద్రమోక్షక్రమంబు। బ్రహ్మహత్యానేక పాపనిస్తరణంబు కమనీయసజ్జన
క్షాంతితంబు। నైనయీయితిహాసంబునధికభక్తి। వినినఁ జదివిన వ్రాసిననను దినంబు। నాయురారోగ్యభాగ్యభోగాభివృ
ద్ధికర్మనాశముసుగతియుఁ గలుగునసఘ॥ సీ॥ నావుడు యోగీంద్ర నామనంబీవృత్రు వివరంబు నీ చేత విన్న మొదలు। కడున
ద్భుతంబునఁ గళవళంబందెడుఁ గోరి రజస్తమోగుణములందు। వర్తించు నీపాపవర్తికి నేరీతి మాధవపదభక్తి మదివసించె।
సత్వస్వభావులై సముబుద్ధులైతపోనియమప్రయత్నులై సిద్ధ చేత। నిర్మలాత్మకులైనట్టి ధర్మపరుల। కమరులకుఁ బుణ్యాము
నులకునంబుజాక్షు। భూరికైవల్యసంప్రాప్తిమూలమైన। భక్తివీనికిఁ బోలె నేర్పాటు గాదు॥ సీ॥ ఉర్వరఁ గల రేణువులక
న్నదట్టమైకడు నొప్పుజీవసంఘములుగలవు। ఆజీవములలోన నరయధర్మాయతనువివసించిన వారు మనుజజాతి। యామను
ష్యులలోనఁ గామంబు లెడవాసి మోక్షార్థులగువారు మొదలనరిది। మోక్షమార్గంబాత్మమూలంబుగానుండు వారిలో
ముక్తులు లేరు తరుచు। ముక్తులయినట్టి వారిలో యుక్తిసలఁప। జాలమగ్లభుఁడమిత ప్రశాంతిపరుఁడు। పరమసుజ్ఞానసిర
తుండు భద్రగుణుఁడు। రమణశ్రీవాసుదేవపరాయణుండు॥ గీ॥ సకలలోకాపకారి దుస్సంగతుండు। వృత్రుఁడే క్రియ
సుజ్ఞాననిరతుఁడయ్యె। సమరమునఁ బౌరుషంబు చేనమరవిభుని। నెట్లు మెప్పించెదీనినా కెఱుఁగఁ జెపుము॥ వ॥ అనిపరీక్షిన్న

## ——⟹ శ్రీ చిత్రకేతూపాఖ్యానకథా ప్రారంభము. శ్రీ ⟸——

రేంద్రుండు శుకయోగీంద్రునడిగెనని సూతుండు శౌనకాదిమునులకుం జెప్పి మఱియునిట్లనియెనట్లు గజపురవల్లభుండు సం
ప్రశ్నంబు సేసిన బాదరాయణి హరిస్మరణశ్రద్ధాపరుండై యిట్లనియెఁ దొల్లి కృష్ణద్వైపాయన నారద దేవలమహర్షులు

ళాదిత్యనరాదిజంతుకలహవ్యాప్తిన్ననస్త్రాస్త్రశస్త్రాళిన్మృత్యువులేనిజీవనములోకాధీశ యిప్పింపవే॥ వ॥ మఱియుర
ణంబులందెదురులేనిశౌర్యంబును లోకపాలురనతిక్రమించు మహిమయును భువనత్రయజయంబును హిరణ్యకశి
పుండుగోరిననతనితపంబునకుసంతోషించి దుర్లభంబులయినవరంబులన్నియునిచ్చి కరుణించి విరించియిట్లనియె॥ శా॥ అ
న్నా కశ్యపపుత్ర దుర్లభములీయర్థంబు లెవ్వారికిన్ మున్నెవ్వారలు గోరరీవరములన్మోదించితిన్నిమ్మెడన్ నన్నుం గోరిన
వెల్లనిచ్చితిం బ్రవీణత్వంబుతో బుద్ధిసంపన్నత్వంబున నుండుమీ సుమతివై భద్రైకశీలుండవై॥ వ॥ అనియిట్లమోఘంబు
లయినవరంబులిచ్చి దితినందను చేతం బూజితుండయి యరవిందసంభవుండు బృందారకసందోహవంద్యమానుండగుచు నిజ
మందిరంబునకుం జనియె నివ్విధంబున నిలింపారాతి వరపరంపరలు సంపాదించుకొని॥ క॥ సోదరుజంపిన పగకై।
యాదరమించుకయు లేక యసురేంద్రుడు కంజోదరు పై వైరముచు న్మోదరతుండగుచు జేసె మనుజాధీశా॥ సీ॥ ఒక
నాడు గంధర్వయూథంబు పరిమార్చు దివిజుల నొకనాడు దెరలదోలు। భుజగుల నొకనాడు భోగంబులకు బాపు గ్రహ
ముల నొకనాడు గట్టివైచు। నొకనాడు యతులనుగ్రతదండించు నొకనాడు విహగుల నొడిసిపట్టు। నొకనాడు సిద్ధుల
నోడించి బంధించు మనుజుల నొకనాడు మదమడంచు। గడిమినొకనాడు కిన్నర ఖచర సాధ్య। చారణ ప్రేత భూత పి
శాచవన్య। సత్త్వ విద్యాధరామల సంహరించు। దితితనూజుండు మస్సహతేజుడగుచు॥ క॥ అట్టుల్లతోడగోటలు
గట్టలు కంగాల ద్రోచి క్రవ్యాదులతో జుట్టువిడిసి దిక్పాలుర పట్టణములు గొనియె నతడు బలమున నధిపా॥ క॥ కృశలై
సంత్రాపితమద్దశలై సర్వంకషోగ్రదైతేయాజ్ఞావశలై నిశలును దివములు దిశలెల్లను గట్టువడియె దీనత ననఘా॥ వ॥ మ
ఱియు నద్దానవేంద్రుండు విద్రుమసోపానంబులును, మరకతమణిమయప్రదేశంబులును, వైడూర్యరత్నస్తంభసము
దయంబులును, జంద్రికాసన్నిభస్ఫటికసంఘటితకుడ్యంబులును, బద్మరాగపీఠకనకకవాటగేహళీవిటంకవాతాయనంబు
లును, విలంబమానముక్తాఫలదామవితానశోభితధవళపర్యంకంబులును, వివిధవిచిత్రవిమానంబులును, నిరంతరసురభికు
సుమఫలభరితపాదపసమూహోద్యానంబులును, హేమారవిందసౌగంధికబంధురసరోవరంబులును, రమణీయరత్నప్రా
సాదవిశేషంబులును, మనోహరపరిమళశీతలమందమారుతంబులు సమ్మదమధురనినదకీరకోకిలకులకోలాహలంబులును
గలిగి విశ్వకర్మనిర్మితంబై త్రైలోక్యరాజ్యలక్ష్మీశోభితంబైన మహేంద్రభవనంబుజొచ్చి॥ మ॥ దితిపుత్రుండు జగత్త్రయై
కవిభుండై దేవేంద్రసింహాసనోద్ధతుండై యుండ హరాచ్యుతాంబుజభవుల్దప్పంగ భీతిన్సమాగతులై తక్క నయక్షకిన్నర
మరుద్గంధర్వసిద్ధామలానతులై కానుకలిచ్చి కొల్తురతని న్నానాప్రకారంబులన్॥ శా॥ ఏ దిక్పాలురజూచి నేడలుగునో
యే దేవు బంధించునో। యే దిగ్భాగముమీద దాడిచనునో యే ప్రాణులంజంపునో। యీదైత్యేశ్వరుడంచు నొండొరులు
దారింద్రాదులాస్థానభూవేదిన్మెల్లన నిక్కిచూతురు భయావిర్భూతరోమాంచులై॥ సీ॥ కోలాహలము మాని కొలువుడీ
సురలార తలగి దీవింపుడు తపసులార। ఫణలెత్తకుడు నిక్కి పన్నగేంద్రములార ప్రణతులై సనుడు దిక్పాలురార। గానం
బు సేయుడు గంధర్వవరులార సందడిం బడకుడీ సాధ్యులార। యాడుడు నృత్యంబు లప్సరోజనులార చేరి క్రొమ్ముక్కుడు
సిద్ధులార। శుద్ధకర్పూరవాసితసురభిమధుర। భవ్యనూతన*మైరేయపానజనిత। సుఖవిలీనతనమరారిసొక్కినాడు। శాం
తిలేదంద్రు నిచ్చలు చారులధిప॥ శా॥ లీలోద్యానలతానివాసములలో లీలావతీయుక్తుడై। హాలాపానవివర్ధమానమదలో
లావృత్తతామ్రాక్షుడై। కేళిం దేలగ నేను దుంబురుడు సంగీతప్రసంగంబులన్ హ్వాలాయంబుగ రంగ జేయుదుము
దేవద్వేషి నుర్వీశ్వరా॥ క॥ యాగములు బుధులు ధరణీభాగములం జేయుచుండ బరతెంచి హవిర్భాగములు దానకైకొ
ను జాగింపడు దైత్యుడనుగ సంఘుంబునకున్॥ సీ॥ సకలమహాద్వీపసహితవిశ్వంభరాస్థలి నిదున్నక పండు సస్యచయము
కామధేన్వాదులకరణి గ్గులు గోరికోర్కులుగగనంబు గురియుచుండు। వననిధులేడును వాహినీసందోహములును వీచుల
రత్నములు వహించు। నుర్వీరుహంబులు నొక్కకాలంబున నఖిలర్తుగుణములనతిశయిల్లు। నంబుసంపూరితద్రోణులగుచు
నొప్పు। బర్వతంబులు పర్వదిక్పాలపివిధ। గుణము లెల్లను దానెకైకొనుచు దైత్య। విభుడు త్రైలోక్యరాజ్యసంవృద్ధి నెం
ది॥ వ॥ ఇట్లు సకలదిక్కులు నిర్జించి లోకైకనాయకుండై తనయిచ్ఛాప్రకారంబున నింద్రియసుఖంబుల ననుభవించుచుం దని
యక శాస్త్రమార్గంబు నతిక్రమించి విరించివరజనితమహైశ్వర్యగర్వాతిరేకంబున సుపర్వారాతి యైశ్వర్యవంతుండై పెద్ద
కాలంబు రాజ్యంబు సేయు నెడ॥ ఉ॥ ఎన్నడు మాకు దిక్కుగలదెన్నడు దైత్యునిబాధమానుమే। మెన్నడు వృద్ధిబొంద
గలమెన్నడు మా రక్షకుడంచు దేవతా। కిన్నర సిద్ధ సాధ్యముని ఖేచర నాయకులాశ్రయించిరా। పన్నగతల్పు భూరిభవబంధవి

* మైరేయపానజనిత॥ మైరేయ। ఆరెపువ్వు-బెల్లము-కడుగునీళ్లచేతం జేసినకల్లు యొక్క, పానజనిత। త్రాగుటవలనం బుట్టిన.

మోచనుఁ బద్మలోచనుఁ॥ వ॥ ఇట్లు దానవేంద్రుని యుగ్రదండంబులకు వెఱచి యనన్యశరణ్యులై రహస్యంబున నందఱుంగూ
డికొని॥ ఉ॥ ఎక్కడ నున్నవాఁడు జగదీశ్వరుఁ డాత్మమయుండు మాధవుం। డెక్కడి కేగి శాంతులు మునీశులు భిక్షులు రారు
క్రమ్మఱం। దిక్కులు నెల్ల నెక్కడఁ జూచెదిం జోరదిక్కగునట్టిదిక్కుకై। మ్రొక్కెద మే మహస్తయుగ మల్మికలించి మదీయ
రక్షకున్॥ వ॥ అని మఱియు నాహారనిద్రలు మానిచిత్తంబులు పరాయత్తంబులు గానీక సమాహితబుద్ధులై భగవంతుం డు
ను మహాపురుషుండును, మహాత్ముండును, విశుద్ధజ్ఞానానందమయుండును నైన హృషీకేశునకు నమస్కరించుచున్న యెడ
మేఘరవసమానగంభీరనినదంబున దిశలు మ్రోయించుచు, సాధులకు నభయంబు గావించుచు, దృశ్యమానుండును గాక
పరమేశ్వరుండైన హరి యిట్లనియె॥ మ॥ భయముం జెందకుఁ డయ్య నిర్జరవరుల్ భద్రంబు మీకయ్యెడు। న్జయము న్లాభము భ్రా
తసంతతికి మత్సందర్శనప్రాప్తిన। వ్యయమై చేరు నెఱుంగుచుంటి తిసుతవ్యాపారభాషావిప। ర్యయముం గాలముగూడఁ జం
పెదఁ జనుండం దాఁక మీత్రోవలన్॥ గీ॥ శుద్ధసాధులందు సురలందు శ్రుతులందు। గోవులందు విప్రకోటియందు। ధర్మపదవి
యందుఁ దగిలి నాయందు వాఁ। డెన్నఁడలుగు నాఁడె హింసఁ జెందు॥ క॥ కన్నకొడుకు శమదమసం। పన్నుఁ డసురవైరుఁడన
క ప్రహ్లాదుని వాఁ। డెన్నఁడు రోషంబున నా। పన్నతనొందించు నాఁడె పట్టివధింతున్॥ శా॥ వేధోదత్తవరప్రసాదగరిమన్వీఁ
డింతవాఁడై మిము। న్బాధం జేయుచునున్నవాఁడని మదిన్భావింతు భావించి నే। సాధింపం దఱికాదు కావునఁ గడున్సైరించి
తెల్మీఁద। న్సాధింతున్ సురలార నేఁడు సనుఁ డాశంకింపమీ కేటికిన్॥ వ॥ అని యిట్లు దనుజమర్దనుండు నిర్దేశించిన నిలింపులు
గుంపులుగొని మ్రొక్కి రక్కసుండు ద్రుగ్గుటనిక్కంబని తమతమ దిక్కులం జనిరి- హిరణ్యకశిపునకు విచిత్రచరిత్రులు నలు

## శ్రీ ప్రహ్లాదచరిత్ర ప్రారంభము. శ్రీ

వురుపుత్రు లుద్భవించిరందు॥ సీ॥ తనయందు నిఖిలభూతములందు నొకభంగి సమహితత్వంబున జరుగువాఁడు। పెద్దలఁ బొ
డగన్న భృత్యునికైవడిఁ జేరి నమస్కృతుల్ సేయువాఁడు। కన్నుదోయికి నన్యకాంతలడ్డంబైన మాతృభావముఁ జేసి మఱలు
వాఁడు। తల్లిదండ్రులభంగి ధర్మవత్సలతను దీనులఁ గావఁ జింతించువాఁడు। సఖులయెడ సోదరస్థితి జరుపువాఁడు। దైవతము
లంచు గురువులఁ దలఁచువాఁడు। లీలలందును బొంకులు లేనివాఁడు। లలితమర్యాదుఁడైన ప్రహ్లాదుఁ డధిప॥ మఱియును॥
సీ॥ ఆకారజన్మవిద్యార్థవరిష్ఠుఁడై గర్వసంస్తంభసంగతుఁడు గాఁడు। వివిధమహానేకవిషయసంపన్నుఁడై పంచేంద్రియ
ములచేఁ బట్టువడఁడు। భవ్యవయోబలప్రాభవోపేతుఁడై కామరోషాదులఁ గ్రందుకొనఁడు। కామినీప్రముఖభోగము లె
న్నిగలిగిన వ్యసనసంసక్తి నావంకఁ బోఁడు। విశ్వమందుఁ గన్నవిన్నయర్థములందు। వస్తుదృష్టిఁ జేసి వాంఛనిడఁడు। ధరణినా
థ దైత్యతనయుండు హరిపరతంత్రుఁడై హతాన్యతంత్రుఁడగుచు॥ గీ॥ సద్గుణంబు లెల్ల సంఘంబులై వచ్చి। యసురరాజత
నయునందు నిలిచి। పాసి చనవు విష్ణుఁ బాయని విధమున। నెపుడుఁ దగిలియుండు నిర్మలాత్మ॥ మ॥ పగవారైన సురేంద్రులున్సభ
లలోఁ బ్రహ్లాదసంకాశుల। న్సుగుణోపేతుల నెందు మే మెఱుఁగ మంచున్వృత్తబంధంబులం। బొగడంజొత్తురు సత్కవీంద్రు
ల క్రియన్భూనాథ మీ బోటి స। ద్భగవద్భక్తులు దైత్యరాజతనయుం బాటించి కీర్తింప రే॥ క॥ గుణనిధియగు ప్రహ్లాదుని। గుణము
లనేకములు గలవు గురుకాలమున। న్గణుతింపన శక్యంబులు। ఫణిపతికి బృహస్పతికి నిభాషాపతికిన్॥ వ॥ ఇట్లు సద్గుణగరిష్ఠుండై
న ప్రహ్లాదుండు భగవంతుండైన వాసుదేవుని యందు సహజసంవర్ధమాననిరంతరధ్యానరతుండై॥ సీ॥ శ్రీవల్లభుఁడు ద
న్నుఁ జేరిన యట్లైనఁ జెలికాండ్ర నెవ్వరిఁ జేరమఱచు। నసురారి దన మ్రోలనాడిన యట్లైన నసురబాలురతోడ నాడమఱ
చు। భక్తవత్సలుఁడు సంభాషించిన ట్లైనఁ బరభాషలకు మారుబలుక వెఱచు। సురవంద్యుదనలోనఁ జూచిన యట్లైనఁ జొక్కి
సమస్తంబుఁ జూడమఱచు। హరిపదాంభోజయుగచింతనామృతమున। నంతరంగంబు నిండిన ట్లైన నతఁడు। నిత్యపరిపూర్ణుఁ
డగుచు నన్నియును మఱచి। జడత లేక యయ్యుండును జడునిభంగి॥ శా॥ పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్ హా
సలీలా నిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షించుచున్ సంతత। శ్రీనారాయణపాదపద్మయుగళీచింతామృతాస్వాదనం।
ధానుండై మఱచున్ సురారిసుతుఁ డేతద్విశ్వమున్ భూవరా॥ సీ॥ వైకుంఠచింతావివర్జితచేష్టుఁడై యొక్కెడ నేడుచు నొక్క
చోట। నశ్రాంత హరిభావనారూఢచిత్తుఁడై యుద్గతుఁడై పాడు నొక్కచోట। విష్ణుఁ డింతియ కాని వేఱొండు లేదని యొత్తి
లి నగుచుండు నొక్కచోట। నలినాక్షుఁ డను నిధానముఁ గంటి నేనని యుబ్బి గంతులువైచు నొక్కచోటఁ। బలుకు నొక్కచో
టఁ బరమేశుఁ గేశవుఁ। బ్రణయహర్షజనితబాష్పసలిల। మిళితపులకుఁడై నిమీలితనేత్రుఁడై। యొక్కచోట నగుచు నూర
కుండు॥ వ॥ ఇట్లు పూర్వజన్మపరమభాగవతసంసర్గసమాగతంబైన ముకుందచరణారవిందసేవాతిరేకంబున నఖర్వనిర్వా
ణభావంబు విస్తరించుచు నప్పటప్పటికి దుర్జనసంసర్గనిమిత్తంబునం దనచిత్తంబ న్యాయత్తంబు గానీక నిజాయత్తంబు సే

యమునప్రశస్తుండును, సంసారనివృత్తుండును, బుధజనవిధేయుండును, మహాభాగధేయుండును, సుగుణమణిగణగరిష్ఠుండును, బరమభాగవతశ్రేష్ఠుండును, గర్మబంధలతాలవిత్రుండును, బవిత్రుండు నైనపుత్రు నియ్యమవిరోధిం దిసురవిరోధియనుకంపలేక చంపం బంపెనని పలికిన నారదునకు ధర్మజుం డిట్లనియె॥ శా॥ పుత్రుల్ నేర్చిన నేరకున్న జనకుల్ పోషింతు రెల్లప్పుడు। మిత్రత్వంబున బుద్ధిఁ జెప్పి మరితో స్నేహంబు వారింతురే। శత్రుత్వంబుఁ గలంపరిట్టియెడ నా సౌజన్యరత్నాకరుం। బుత్రుం డ్లోకపవిత్రుఁ దండ్రి మిగులన్ బాధింప నెట్లోర్చెనో॥ ఉ॥ బాలుఁ బ్రభావిశాలు హరిపాదపయోరుహచింతనక్రియా। లోలుఁ గృపాళు సాధు గురులోకపదానతఫాలు నిర్మల। శ్రీలు సమస్తసభ్యనుతశీలు విఖండితమోహవల్లికా। జాలు సదేలతండ్రి వడిఁ జంపఁగఁ బంపె మునీంద్ర చెప్ప వే॥ అనిన నారదుం డిట్లనియె॥ శా॥ లభ్యంబై నసురాధిరాజపదముల్లక్షింపఁడశ్రాంతము। న్సభ్యత్వంబున నున్నవాఁడ బలుఁడై జాడ్యంబుతో వీఁడు మీ। ద్వ్యాభ్యాసంబునఁ గాని తీప్రమతిగాఁ డంచున్ విచారించి దై। త్యేభ్యుం డొక్కదినంబునం బ్రియసుతున్ వీక్షించి సోత్కంఠుఁడై॥ క॥ చదువనివాఁ డజ్ఞుండగు। జదివిన సదసద్వివేకచతురత గలుగుం। జదువఁగ వలయును జనులకు। జదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ॥ వ॥ అని పలికి యసురలోకపురోహితుండగు శుక్రాచార్యు కొడుకులఁ బ్రచండవితర్కులైన చండామర్కుల రావించి సత్కరించి యిట్లనియె॥ శా॥ అంధప్రక్రియనున్నవాడు పలుకం డస్మత్ప్రతాపక్రియా। గంధం బించుక లేదు మీరసురపుల్ గారుణ్యచిత్తుల్మనో। బంధుల్మాన్యులు మాకుఁ బెద్దలు సముం బాటించి యీ బాలకుం। గ్రంథంబుల్ చదివించి నీతికుశలుం గాఁ జేసి రక్షింపరే॥ వ॥ అని పలికి వారలకుం బ్రహ్లాదు నప్పగించి తోడ్కొని పొండనిన వారును దనుజరాజకుమారునిం గొనిపోయి యతనికి సవయస్కులగు సహశ్రోతలయిన యసురకుమారులం గొందఱం గూర్చి॥ ఉ॥ అంచితభక్తితోడ దనుజాధిపగేహసమీపమునం బ్రనే। శించి సురారిరాజసుతుఁ జేకొని శుక్రకుమారకుల్ ప్రతిం। పించిరి పాఠయోగ్యములు పెక్కులు శాస్త్రములా కుమారుఁడా। లించి పఠించె నన్నియుఁ జలింపని వైష్ణవభక్తిపూర్ణుఁడై॥ క॥ పలికిదివారు చెప్పిన। నా పగిదిం జెప్పఁగాని యిట్టిట్టనియా। త్రేపింపఁడు తానన్నియు। రూపించిన మిథ్యలని నిరూఢమనీష॥ శా॥ అంతం గొన్నిదినంబు లేగిన సురేంద్రారాతి శంకాన్విత। స్వాంతుండై నిజనందను న్గురువు లేజాడన్ బఠింపించిరో। భ్రాంతుండే మిపఠించెనో పిలిచి సంభాషించి విద్యాపరి। శ్రాంతిం జూచెదఁ గాక నేఁడని మహాసౌధాంతరాసీనుఁడై॥ ఉ॥ మోదముతోడ దైత్యకులముఖ్యుఁడు రమ్మని చీరఁబంచె బ్ర। హ్లాదకుమారకున్ భవమహార్ణవతారకుఁ గామరోషలో। భాదివిరోధివర్గపరిహారకుఁ గేశవచింతనామృతా। స్వాదకఠోరకుం గలుషజాలమహాగ్రపనీకుతారకుం॥ వ॥ ఇట్లు చారులచేత నాహూయమానుండై ప్రహ్లాదుండు సనుదెంచిన॥ శా॥ ఉత్సాహప్రభుమంత్రశక్తియుతమేయుద్యోగమారూఢసం। విత్సంపన్నుఁడవై తివేఁ చదివితే వేదంబులున్ శాస్త్రముల్। వ్యత్సా రమ్మని చేరఁజీటి కొడుకున్వాత్సల్యసంపూర్ణుఁడై। యుత్సంగాగ్రముఁ జేర్చి దానవవిభుం డుత్కంఠ దీపింపఁగన్॥ క॥ అనుదినసంతోషణములు। జనితశ్రమతాపదుఃఖసంశోషణముల్। తనయులసంభాషణములు। జనకులకుం గర్ణయుగళసద్భూషణముల్॥ వ॥ అనిన యాటియఁ బుత్రా నీ కెయ్యది భద్రంబై యున్నది చెప్పుమనినఁ గన్నతండ్రికిఁ బ్రియనందనుం డిట్లనియె॥ చ॥ ఎల్లశరీరధారులకు నిల్లను చీఁకటినూతిలోపలం। ద్రెళ్లక వీరు నేమను మతిభ్రమణంబున భిన్నులై ప్రవ। ర్తిల్లక సర్వము న్నతనిదివ్యకళామయమంచు విష్ణునం। దుల్లముఁ జేర్చి తా రడవినుండుట మేలు నిశాచరాగ్రణీ॥ వ॥ అని కుమారుం డాడిన ప్రతిపక్షసంస్తవరూపంబు లైన సల్లాపంబులు విని దానవేంద్రుండు నగుచు నిట్లనియె॥ క॥ ఎట్టాడిన నట్టాడుదు। రిట్టట్టని పలుక నెఱుఁగ రెల్లశిశువులు। దట్టించి యెవ్వరే నియుఁ। బట్టించిరొ బాలకునకుఁ బరపక్షంబుల్॥ శా॥ నాకుం జూడఁగఁ జోద్యమయ్యెడుఁ గదా నాతండ్రి యీ బుద్ధి దా। నీకున్లోపలఁ దోఁచెనో పరులు మర్మజ్ఞుల్ ప్రతిష్ఠింపిరో। యేకాంతంబున భార్గవుల్ పలికిరో యీ దానవశ్రేణికిన్। నైవ్వసంతుండుఁ గృతాపరాధుఁడ వినన్ వర్ణింప నీ కేటికిన్॥ మ॥ సురలం దోలుట యోసురాధిపతులన్ శిక్షించుటో సిద్ధులం। బరిదేవించుట యోమునిప్రవరులన్ బాధించుటో యక్షకి। న్నరగంధర్వవిహంగనాగపతులన్ నాశంబు నొందించుటో। హరియంచున్ హరియంచు నేలచెడ మోహాంధుండవై పుత్రకా॥ వ॥ అనినఁ దండ్రి మాటలకుఁ బురోహితు నిరీక్షించి ప్రహ్లాదుం డిట్లనియె - మోహనిర్మూలనంబుఁ జేసి యెవ్వని యందుఁ దత్పరులయిన యెఱుక గల పురుషులకుఁ బరులు దారను యెడ స్వమాయాకల్పితంబయిన యసద్గ్రాహ్యంబగు భేదంబు గానంబడ దట్టి పరమేశ్వరునకు నమస్కరించెద॥ శా॥ అజ్ఞుల్గొందఱు నే ముదారసుచుమాయం జెంది సర్వాత్మకుం। బ్రజ్ఞాలభ్యు వరాన్వయక్రమములన్ భావింపఁగా నేరరా। జిజ్ఞాసాపథమందు మూఢులు గదా చింతింప బ్రహ్మాదివేదజ్ఞుల్ దత్పరమాత్మ విష్ణు నితరుల్ దర్శింపఁగా నేర్తురే॥ గీ॥ ఇనుమయస్కాంతసన్నిధి నెట్లు భ్రాంత। మగుచు హృషీకేశు సన్నిధి నాపిధమునఁ। గరఁగుచున్నది దైవయోగమున జేసి। బ్రాహ్మణోత్తమ చిత్తంబు భ్రాంతమగుచు॥ సీ॥ మందారమక

రందమాధుర్యమునఁ దేలు మధుపంబు వోవునే మదనములకు। నిర్మలమందాకినీవీచికలఁ దూఁగు రాయంచ చనునె తరంగిణు
లకు। లలితరసాలపల్లవఖాదియై చొక్కు కోయిల సేరునే కుటజములకుఁ। బూర్ణేందుచంద్రికాస్ఫురితచకోరక మరుగునే
సాంద్రనీహారములకు। నంబుజోదరదివ్యపాదారవింద। చింతనామృతపానవిశేషమత్త। చిత్తమేరీతి నితరులఁ జేరనేర్చు। వి
నుతగుణశీల మాటలు వేయునేల॥ వ॥ అనిన విని రోషించి రాజసేవకుండయిన పురోహితుండు ప్రహ్లాదుం జూచి తిరస్కరించి
యిట్లనియె॥ ఉ॥ పంచశరద్వయస్కుఁడవు బాలుఁడ వించుక గాని లేవు భా। షించెదు తర్కవాక్యములఁ జెప్పిన శాస్త్రములో
నియర్థ మొకించుకైనఁ జెప్పవసురేంద్రుని ముందట మూఢ నాదల। ల్వంచుకొనంగఁ జేసితివి వైరివిభూషణ వంశదూష
ణా॥ చ॥ తనయుఁడు గాఁడు శాత్రవుఁడు దానవభర్తకు వీఁడు దైత్యచం। దనవనమందుఁ గంటకయుతక్షితిజాతము భంగిఁ బు
ట్టినాఁ। డనవరతంబు రాక్షసకులాంతకుఁ బ్రస్తుతి సేయుచుండుఁ దం। డనమునఁ గాని శిక్షలకు డాయఁడు పట్టుఁడు కొట్టుఁ డుగ్ర
తిన్॥ క॥ నీ పాపనిఁ జదివింతుము। నీ పాదములాన యింక నిపుణత తోడం। గోపింతుము దండింతుము। కోపింపకుమయ్య దనుజ
కుంజర వింటే॥ వ॥ అని మఱియు నా రాచపాపనికి వివిధోపాయంబులం బురోహితుండు వెఱపుఁ జూపుచు రాజసన్నిధిం బాపి
తోడుకొనిపోయి యేకాంతంబున॥ క॥ భార్గవనందనుఁ డతనికి। మార్గము సెడకుండఁ బెక్కుమారులు నిచ్చల్। వర్గత్రితయ
ముఁ జెప్పెన। నగ్గళమగు మతివిశేష మమర నరేంద్రా॥ వ॥ మఱియు గురుండు శిష్యునకు సామదానభేదదండోపాయంబుల
నెఱింగించి నీతికోవిదుం డయ్యె నని నిశ్చయించి తల్లికి నెఱింగించి తల్లిచేత నలంకృతుండయిన కులదీపకు నవలోకించి॥
ఉ॥ త్రిప్పకుమన్న మామతము దీర్ఘములైన త్రివర్గపాఠము। ల్దప్పకుమన్న నేఁడు మన దైత్యవరేణ్యుని మ్రోల నేమము।
ఁ జెప్పిన నీతిఁ గాని మఱి సెప్పకుమన్న విరోధిశాస్త్రము। ల్విప్పకుమన్న దుష్టమగు విష్ణుచరిత్రకథార్థజాలముల్॥ వ॥ అని బు
జ్జగించి దానవేశ్వరుని సన్నిధికిం దోడి తెచ్చిన॥ సీ॥ అడుగడ్డునకు మాధవానుచింతనసుధామాధుర్యమున మేను మఱచువా
ని। నంభోజగర్భాదు లభ్యసింపఁగలేని హరిభక్తిపుంభావమైనవాని। మాతృగర్భముఁ జొచ్చియున్నది మొదలుగాఁ జిత్తమ
చ్యుతుమీఁదఁ జేర్చువాని। నంకించి తనలోన నఖిలప్రపంచంబు శ్రీవిష్ణుమయమని చెలఁగువాని। వినయకారుణ్యబుద్ధివివేక
లక్షణాదిగుణములకాటపట్టైనవాని। శిష్యు బుధలోకసంభావ్యుఁ జెఱిచి గురుఁడు। ముందటికిఁ ద్రొబ్బెఁ దండ్రికి మ్రొక్కుమ
నుచు॥ క॥ శిక్షించితి మన్యములగు। పక్షంబులు మాని నీతిపారఁగుఁ డయ్యె। న్రక్షోవంశాధీశ్వర। వీక్షింపుము నీకుమారు విద్యా
బలమున్॥ వ॥ అని పలికిన శుక్రకుమారకు వచనంబు లాకర్ణించి దానవేంద్రుండు దనకు దండప్రణామంబుఁ జేసి నిలుచున్న
కొడుకును దీవించి బాహుదండంబులు సాఁచి దిగ్గున డగ్గఱం దిగిచి పెద్దతడవు గాఢాలింగనంబు సేసి తనతొడమీఁద నిడుకొని
చుంచు దువ్వి చుబుకంబుఁ బుడికి చెక్కిలి ముద్దుఁగొని శిరంబు మూర్కొని ప్రేమాతిరేకసంజనితబాష్పబిందుసందోహంబు
లన తనివదనారవిందంబుఁ దడుపుచు మందమధురాలాపంబుల నిట్లనియె॥ శా॥ చోద్యంబయ్యెడు నింతగాల మరిగెన్ శోధిం
చి యేమేమిసం। వేద్యాంశంబులు సెప్పిరో గురువులే వెంటం బఠింపించిరో। విద్యాసార మెఱుంగఁగోరెద భవద్విజ్ఞాతశా
స్త్రంబులోఁ। బద్యంబొక్కటి జెప్పి సార్థముగఁ దాత్పర్యంబు భాషింపుమా॥ శా॥ నిన్నున్ మెచ్చరు నీతిపాఠమహిమన్ నీతోడి
దైత్యార్భకుల్ నన్నారన్నియుఁ జెప్ప నేర్తురుగదా గ్రంథార్థముల్ దక్షులై। యన్నా యెన్నఁడు నీవు నీతిమతివై వాదంచు నమ్మహో
వాంఛతో। నున్నాఁడన్ననుఁ గన్నతండ్రి భవదీయోత్కర్షతన్ జూపవే॥ వ॥ అనినం గన్నతండ్రికిఁ బ్రియనందనుం డైన ప్ర
హ్లాదుం డిట్లనియె॥ క॥ చదివించిరి నను గురువులు। చదివితి ధర్మార్థముఖ్యశాస్త్రంబులు నేఁ। జదివినవి గలవు పెక్కులు। చదువు
లలో మర్మమెల్లఁ జదివితిఁ దండ్రీ॥ మ॥ తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా। ర్చనముల్ సేవయు నా
త్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం। బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స। జ్జనుఁడై యుండు
టభద్రం బంచుఁ దలంతు సత్యంబు దైత్యోత్తమా॥ శా॥ అంధేందూదయముల్ మహాబధిరశంఖారావముల్ మూకస। ద్గ్రం
థాఖ్యానపముల్ నపుంసకవధూకాంక్షల్ కృతఘ్నావళీ। బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడస।
ద్గ్రంథంబుల్ హరిభక్తివర్జితుల రిక్తవ్యర్థసంసారముల్॥ సీ॥ కమలాక్షు నర్చించు కరములు కరములు। శ్రీనాథు వర్ణించు జి
హ్వ జిహ్వ। సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు। శేషశాయికి మ్రొక్కు శిరము శిరము। విష్ణు నాకర్ణించు వీనులు వీను
లు మధువైరిఁ దవిలిన మనము మనము। భగవంతు వలగొను పదములు పదములు। పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి। దేవదేవునిఁ
జింతించు దినము దినము। చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు। కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు। తండ్రి హరిఁ జే
రుమనియెడి తండ్రి తండ్రి॥ సీ॥ కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే పవనకుంభిత చర్మభస్త్రి గాక। వైకుంఠుఁ బొగడ
నివక్త్రంబు వక్త్రమే ఢమఢమధ్వనితోడి ఢక్క గాక। హరిపూజనము లేని హస్తంబు హస్తమే తరుశాఖ నిర్మిత దర్వి గాక।

కమలేశుఁ జూడని కన్నులు కన్నులే తనుకుడ్యజాలరంధ్రములు గాక । చక్రిచింత లేని జన్మంబు జన్మమే । తరళసలిలబుద్బు
దంబు గాక। విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే। పాదయుగముతోడి పశువు గాక॥ సీ॥ సంసారజీమూతసంఘంబు విచ్చునే
చక్రిదాస్యప్రభంజనము లేక। తాపత్రయాభీలదావాగ్నులాఱునే విష్ణుసేవామృతవృష్టి లేక। సర్వాంకషాఘౌఘజలరా
సు లింకునే హరిమనీషా బడబాగ్ని లేక । ఘనవిపద్గాఢాంధకారంబు లడఁగునే పద్మాక్షునుతిరవిప్రభలు లేక। నిరుపమాపు
నరావృత్తినిష్కళంక। ముక్తినిధిఁ గానవచ్చునే ముఖ్యమైన। శార్ఙ్గకోదండచింతనాంజనము లేక । తామరసగర్భునకునైన
దానవేంద్ర॥ వ॥ అని యివ్విధంబున వెఱపు మఱపు నెఱుంగక నుఱుకుఁ జెడి పలికెడి కొడుకు నుడువులు సెవులకు ములుకులక్రి
య నొకవినఁ గటములదరఁ బెదవులఁ గఱచుచు నదరిపడి గురుసుతు నింగనుంగొని విమతకథనంబులు గఱపినాఁడవని దానవే
శ్వరుం డిట్లనియె॥ చ॥ పటుతరనీతిశాస్త్రచయపారగుఁ జేసెద నంచు బాలునీ। వటుఁ గొనిపోయి వానికి ననర్హములైన విరో
ధిశాస్త్రము। ల్గుటిలతఁ జెప్పినాఁడవు భృగుప్రవరుండవటంచు నమ్మితిం। గటకట బ్రాహ్మణాకృతివి గాక యథార్థపు బ్రా
హ్మణుఁడవే॥ క॥ ధర్మేతరవర్తనులును। మర్మంత్రులు నైన జనులు దురితములొందు। న్మర్మములు గలఁచి కల్మష। కర్ములరోగము
లు నొందు కైవడి విప్రా॥ అనిన రాజునకుం బురోహితుం డిట్లనియె॥ ఉ॥ తప్పులు లేవు మావలన దానవనాథ విరోధిశాస్త్రము।
ల్సెప్పము క్రూరులై పరులు సెప్పరు మీ చరణంబులాన నీ। మ్మెప్పరు నీకుమారునకు నింతయు నైజమనీష యెవ్వరుం। జెప్పెడి
పాటిగాదు ప్రతిచింతఁ దలంపుము నేర్పు కైవడిన్॥ క॥ మిత్రులము పురోహితులము। పాత్రుల మేము దియ గాక భార్గవుల
మునిపుత్రుల నిటువలెఁ జేయఁగ। శత్రుల మే దైత్యజలధిచంద్రమ వింటే॥ వ॥ అనిన గురునందను గోపింపక దైత్యవల్లభుం
డు గొడుకు నవలోకించి యిట్లనియె॥ క॥ ఒజ్జలు సెప్పని యీమతి। నుజ్జాతుఁడవైన నీకు మతి యెవ్వనిచే। సుజ్ఞాతమయ్యె బాలక
తజ్జనులం బేరుఁగొను ముతగ నా మ్రోలన్॥ వ॥ అనినఁ దండ్రికిఁ బ్రహ్లాదుం డిట్లనియె॥ ఉ॥ అచ్చపుఁ జీఁకటిం బడి గృహవ్రతు
లై విషయప్రమత్తులై। చచ్చుచుఁ బుట్టుచున్న మఱలఁ జర్వితచర్వణులైన వారికిం। జెచ్చెరఁ బుట్టునే పరులు సెప్పిన నైన నిజే
చ్ఛనైన నే। మిచ్చిన నైనఁ గానలకు నేగిన నైన హరిప్రబోధముల్॥ ఉ॥ కానని వానినూఁతఁ గొని కానని వాఁడు నభీష్టవస్తు
వుల్గానని భంగిఁ గర్మములు గైకొని కొందఱు కర్మబద్ధులై। కానరు విష్ణుఁ బొందగటఁ గందురకించన వైష్ణవాంఘ్రిసం। స్థాన
రజోభిషిక్తులగు సంహృతకర్ములు దానవేశ్వరా॥ శా॥ శోధింపంబడె సర్వశాస్త్రములు రక్షోనాథ వేయేటికిన్। గాథల్మాధ
వశేముషీతరణిసాంగత్యంబునం గాక దు। ర్మేధం దాఁటఁగవచ్చునే సుతవధూమీనోగ్రవాంఛామద। క్రోధోల్లోలవిశా
లసంసృతిమహాఘోరామితాంభోనిధిన్॥ వ॥ అని పలికిన కొడుకును ధిక్కరించి మక్కువసేయక రక్కసుల ఱేఁడు దనతొడ
లపైనుండ నీక గొబ్బున దిగఁద్రొబ్బి నిబ్బరంబగు కోపంబు దీపింప వేఁడిచూపుల మింట మంట లెగయ మంత్రులం జూచి యిట్ల
నియె॥ శా॥ క్రోడంబై పినతండ్రిఁ జంపెనని తాఁ గ్రోధించి చిత్తంబులో। వీడం జేయఁడు బంటుభంగి హరికిన్ ద్వేషికిన్ భక్తుఁ
డై। ఘోరాడండకటా ప్రాణవాయువులు వీఁడొప్పించుచున్నాఁడు నా। తోడన్ వైరము పట్టెనిట్టి జనకద్రోహిన్ మహిం గంటి

## శ్రీ హిరణ్యకశిపుండు ప్రహ్లాదుని వధాదివివిధోపాయంబుల శిక్షించుట. శ్రీ

రే॥ అని రాక్షసవీరుల వీక్షించి యిట్లనియె ॥ శా ॥ పంచాబ్దంబుల వాఁడు తండ్రి నగు నాపక్షంబు నిందించి యు। త్కించిద్భీ
తియు లేక విష్ణునహితుం గీర్తించుచున్నాఁడు వా। ల్గించుం జెప్పిన మానఁ డంగమునఁ బుత్రాకారతన్వ్యాధి జ। న్మించె న్వీని వ
ధించి రండు దనుజుల్మీ మీ పటుత్వంబులన్॥ శా॥ అంగవ్రాతములోఁ జికిత్సకుఁ డుదుష్టాంగంబు ఖండించి శే। షాంగశ్రేణికి
రక్ష సేయు క్రియ నీ యజ్ఞుం గులద్రోహిదు। స్సంగుం గేశవపక్షపాతి నధముం జంపించి వీరవ్రతో। త్తుంగఖ్యాతిఁ జరించెదం
గులము నిర్దోషంబు గావించెదన్॥ క॥ హంతవ్యుఁడు రక్షింపను। మంతవ్యుఁడు గాఁడు యమునిమందిరమునకున్। గంతవ్యుఁ
డు వధమునకుప । రంతవ్యుం డనకఁ జంపి రండీ పసుచున్॥ వ ॥ అని దానవేంద్రుం డానతిచ్చిన వాఁడికోఱల రక్కసులు పె
క్కండ్రు శూలహస్తులై వక్త్రంబులు దెఱచికొని యుబ్బి బొబ్బలిడుచు ధూమసహిత దావదహనంబునుం బోలెఁ దా
మ్రసంకాశంబులయిన కేశంబులు మెఱయ భేదనతాడనచ్ఛేదనంబులు సేయుచు ॥ చ ॥ బాలుఁడు రాచబిడ్డఁడు కృపా
ళుఁడు సాధుఁడు లోకమాన్యసం । శీలుఁడు వీఁడవధ్యుఁడని చిక్కక స్రుక్కక క్రూరచిత్తులై । శూలములం దదంగముల
సుస్థిరులై ప్రహరించిరుగ్రవా। చాలత నందఱున్ దివిజశత్రుఁడు వల్దనఁ డయ్యె భూవరా ॥ చ ॥ పలువురు దానవుల్ పొడు
వ బాలుని దేహము లేశమాత్రము । న్నొలియదు లోపలన్ రుధిరము బ్బదు కందదు శల్యసంఘము। న్నలియదు దృష్టి
వైభవము నష్టము గాదు ముఖేందుకాంతియుం। బోలియదు నూతనశ్రమముఁ బుట్టదు మోమున దీనభావమున్ ॥ ఉ॥ తన్నె
నిశాచరుల్ పొడువ దైత్యకుమారుఁడు మాటిమాటికిన్। పన్నగశాయి యో దనుజభంజన యో జగదీశ యో మహా। పన్నశ

రణ్యు మొనిఖిలపావనయంచు నుతించుఁగాని తాఁ। గన్నులనీరుఁ జేఁడు భయకంపసమేతుఁడు గాఁడు భూవరా ॥ ఉ॥ పాం
ఱఁడు లేదిదిక్కులకు బాహువులొడ్డఁడు బంధురాజిలో। మాఱఁడు ఘోరకృత్యమని జేఱఁడు తండ్రి నిమిత్రవర్గముం। జీ
ఱఁడు మాతృసంఘము వసించు సువర్ణగృహంబులోనికిం। దాఱఁడు కావరేయనఁడు తాపము నొందఁడు కంటగింపఁగన్॥
వ॥ ఇట్లు సర్వాత్మకంబై యిట్టిదట్టిదని నిర్దేశింపరాని పరబ్రహ్మంబు దానయై శ్రీమహావిష్ణునియందుఁ జిత్తంబుఁ జేర్చి తన్మ
యుండై పరమానందంబుననున్న ప్రహ్లాదునియందు రాక్షసేంద్రుండు తనకింకరుల చేతఁ జేయించు మారణకర్మంబులు
పాపకర్మునియందుఁ బ్రయుక్తంబులైన సత్కారంబులుం బోలె విఫలంబులగుటం జూచి॥ మ॥ శూలములన్నిశాచరులు ప్ర
క్కకదేహము నిగ్రహింపఁగా। బాలుఁడు నేలపైఁ బడఁడు పాఱఁడు చావఁడు దండ్రి నైననా। పాలికి వచ్చి చక్రధరుపక్షము
మానితిఁ గావుమంచుఁ దాఁ। ఫాలము సోఁక మ్రొక్కఁడన పాయతనుం కుట కేమి హేతువో॥ అని శంకించుచు॥ సీ॥ ఒకమాటు
దిక్కుంభియూథంబుఁ దెప్పించి కెరలిడింభకుని ద్రొక్కింపఁబంపు। నొకమాటు విషభీకరోరగశ్రేణులఁ గఱువడి నర్భకుఁ గ
ఱవఁబంపు। నొకమాటు హేతిసంఘోగ్రానలములలోన విసరి కుమారుని వ్రేయఁబంపు। నొకమాటు కూలంకషోల్లోలజల
ధిలో ముంచి శాబకు ముంపఁబంపు। విషముఁ బెట్టఁబంపు విదళింపఁగాఁబంపు। దొడ్డకొండచరులఁ ద్రోయఁబంపుఁ। బట్టిక
ట్టఁబంపు బాధింపఁగాఁబంపు। బాలుఁగినిసి దనుజపాలుఁ డధిప॥ సీ॥ ఒకవేళ నభిచారహోమంబు సేయించు నొకవేళ నెం
డలనుండఁబంపు। నొకవేళ వానలను పహతి నొందించు నొకవేళ రంధ్రంబులు కట్టఁబట్టు। నొకవేళఁ దనమాయ నెదవించి బె
గడించు నెకవేళ మంచున నొంటినిలుపు। నొకవేళఁ బెనుగాలికున్ముఖుఁ గావించు నొకవేళఁ బాలించు నుర్వియందు। నీరున
న్నంబు నిడనీక నిగ్రహించుఁ। గశలనడిపించు బుర్వించు గండశిలల। గదల మొత్తించు వ్రేయించు ఘనశరములఁ। గొడుకు
నెకవేళ నమరారి క్రోధియగుచు॥ వ॥ మఱియు ననేకమారణోపాయంబులఁ బాపరహితుండైన పాపని రూపుమాఁపలేక
యేకాంతంబున మరంతచింతాపరిశ్రాంతుండై రాక్షసేంద్రుండు దనమనంబున॥ ఉ॥ ముంచితి వార్ధులన్గదల మొత్తితి
శైలతటంబులందు ద్రొ। బ్బించితి శస్త్రరాజిఁ బొడిపించితి మీఁదని భేంద్రపఙ్క్తి రొ। ప్పించితి ధిక్కరించితి శపించితి ఘోర
దవాగ్నులందుఁ ద్రోయించితిఁ బెక్కుబాధనలయించితిఁ జావఁడి దేమి చిత్రమో॥ చ॥ ఎఱుఁగఁడు జీవనౌషధము లెవ్వరు
భర్తలు లేరు బాధలందఱుఁగఁడు నైజతేజమునఁ దథ్యము జాడ్యము లేదు మిక్కిలి। న్నెఱయుచునున్నవాఁ డొకని మేపము దై
న్యము నొందఁ డింక నే। తెఱఁగున ద్రుంతు వేసరితి దివ్యము వీని ప్రభావ మెట్టిదో॥ వ॥ అదియునుం గాక తొల్లి శునశ్శేఫుండను
మునికుమారుండు దండ్రి చేత యాగపశుత్వంబునకు దత్తుండై తండ్రి దనకు నపకారియని తలంపక బ్రతికినచందంబున॥ క॥ ఆ
గ్రహమున నేఁ జేసిన। నిగ్రహములు పరులతోడ నెఱిఁ నొకనాఁడు। న్విగ్రహములను చుఁబలుకఁడు। నుగ్రహములుగా స్మరిం
చునొవ్వఁడు మదిలోన్॥ వ॥ కావున వీఁడు మహాతపః ప్రభావసంపన్నుండు వీని కెందును భయంబు లేదు వీనితోడి విరోధంబు
నఁ దనకు మృత్యువు సిద్ధించునని విన్నంబోయి ఖిన్నుండై ప్రసన్నుండు గాక క్రిందుఁ జూచుచు విషణ్ణుండై చింతనంబు సేయు
చున్న రాజునకు మంతనంబునఁ జండామర్కులిట్లనిరి॥ శా॥ శుభ్రఖ్యాతి వినీ ప్రతాపము మహాచోద్యంబుదై త్యేంద్ర రో।
షభ్రూయుగ్మ విజృంభణంబున దిగీశవ్రాతముం బోరులన్। విభ్రాంతంబుగఁ జేసి యేలితి గదా విశ్వంబు వీఁ డెంతయా। ద
భ్రోద్రిక్తుల్గుణదోషహేతువులు చింతం బొందనీ కేటికిన్॥ శా॥ వక్రుండై నజనుండు వృద్ధగురుసేవం జేసి మేధానయో। ప
క్రాంతిన్ విలసిల్లు మీఁదటవయఃపాకంబుతో బాలకున్నక్రద్వేషణబుద్ధిఁ జేయుము మహాదిం జాలింపు మీ రోషము। స్వక్రాచా
ర్యులు వచ్చునంతకితఁడున్సుశ్రీయుతుండయ్యెడున్॥ వ॥ అని గురుపుత్త్రులు వలికిన రాక్షసేశ్వరుండు గృహస్థులైన రాజుల
కుపదేశింపఁదగిన ధర్మార్థకామంబులు ప్రహ్లాదునకు నుపదేశింపుఁడని యనుజ్ఞ చేసిన వారు నతనికిఁ ద్రివర్గంబు నుపదేశిం
చిన నతండు రాగద్వేషంబుల చేత విషయాసక్తులైనవారలకు గ్రాహ్యంబులైన ధర్మార్థకామంబులుఁ దనకు నగ్రాహ్యం
బులని యును వ్యవహారప్రసిద్ధికొఱకైన భేదంబు గాని యాత్మభేదంబు లేదని యును నర్థంబులయందర్థకల్పన సేయుటదిగ్భ్రాం
మంబని నిశ్చయించి గురూపదిష్ట శాస్త్రంబులు మంచివని తలంపక గురువులు తమ గృహస్థకర్మానుసంధానంబునకుం జని
న సమయంబున॥ క॥ ఆటలకుఁ జన్నురమ్మని। పాటించి దనిశాటసుతులు భాషించిన దో। సాటకు లేంద్రకుమారుఁడు। పాటవము
న వారిఁ జీఁ చి ప్రజ్ఞాన్వితుఁడై॥ క॥ చెప్పెడి నొకచదువు మంచిది। చెప్పెడిఁ దగులములు చెవులు విందురఁ గొనఁగా। నెప్పుడు మన
యెడ నొజ్జలు। సెప్పెద నెకచదువు వినుఁడు చిత్తములలరన్॥ వ॥ అని రాజకుమారుండు గావునఁ గరుణించి సంగడికాండ్రతో
నగియెడు చందంబునఁ గ్రీడలాడుచు సవయస్కులైన దైత్యదానవకుమారులకెల్ల నేకాంతంబున నిట్లనియె॥ ఉ॥ బా
ల్యకులారరండు మునప్రాయపు బాలురు కొండ బుర్విలోఁ। గూలుటఁ గంటిరే గురుఁడు గ్రూరుఁడు నర్థచయంబు నమ్మఁడు।

శ్రీలతనర్థకల్పనముఁ జెప్పెడిగ్రాహ్యముగాదుశాస్త్రముల్త్మే లెట్టేఁగించెదన్న నినమీరు నిరంతరభద్రమహోద్యోగ్డి॥వ॥వినుం
డుసకలజన్మంబులందునుధర్మార్థాచరణ కారణంబయినమానుషజన్మంబుదుర్లభం బందుఁబురుషత్వంబు దుర్లభంబది
యుశతవర్షపరిమితంబయినజీవితకాలంబుననియతంబై యుండునందు సగమంధకారబంధురంబయి రాత్రిరూపంబునని
ద్రాదివ్యవహారంబులనిరర్థకంబయి చనుఁజిక్కి నపంచాశద్వత్సరంబులందును బాల్యయౌవనకౌమారకైశోరవయోవిశే
షంబులవింశతిహాయనంబులుగడచుఁగడపనుప్పదియబ్దంబులునింద్రియంబులచేతఁబట్టువడి దురవగాహంబులైనకా
మక్రోధలోభమోహమదమత్సరంబులను పాశంబులఁగట్టువడివిడివడసమర్థుండుగాక ప్రాణంబులకంటెమధురాయ
మానమైనతృష్ణకులోనైభృత్యతస్కరవణిక్కర్మంబులఁబ్రాణహానినైననంగీకరించిపరార్థంబుల నర్థించుచు రహస్య
సంభోగచాతుర్యసౌందర్యవిశేషంబులకైర్యవల్లి కాలవిత్రంబులయినకళత్రంబులనుమహనీయమంజులమధురాలాపం
బులుగలిగి నవ్వులయినశిశువులనుశీలవయోరూపధన్యలగుకన్యలనువినయవివేకవిద్యాలంకారులయినకుమారులనుగామి
తఫలప్రదాతలగుభ్రాతలనుమనుత్వప్రేమకైన్యజనకులయినజననీజనకులనుసకలసౌజన్యసింధువులయినబంధువులను
ధనకనకవస్తువాహనసుందరంబులైనమందిరంబులనుసుకరంబులైనపశుభృత్యనికరంబులనువంశపరంపరాయత్తంబు
లయినవిత్తంబులనువర్జింపలేకసంసారంబునిర్జింపనుపాయంబుఁగానక తంతువర్గంబున నిర్గమద్వారశూన్యంబయిన
మందిరంబుఁజేరిచిక్కువడి వెడలెడిపాటవంబుచాలకతగులువడుకీటకంబుచందంబునగృహస్థుండుస్వయంకృత కర్మబ
ద్ధుండయిశిశ్నోదరాదిసుఖంబులఁబ్రమత్తుండై నిజకుటుంబపోషణపారవశ్యంబునవిరక్తిమార్గంబుఁదెలియనేరక స్వకీ
యపరకీయభిన్నభావంబుననంధకారంబునంబ్రవేశించుఁగావునఁగౌమారసమయంబునమనీషాగరిష్ఠుండై పరమభాగ
వతధర్మంబనుష్ఠింపవలయు దుఃఖంబులువాంఛితంబులుగాకచేకురుభంగి సుఖంబులుగాలానుసారంబులై లబ్ధంబుల
గుంగావునవృథాప్రయాసంబుననాయుర్వ్యయంబుసేయందగదుహరిభజనంబునమోక్షంబుసిద్ధించు విష్ణుండుసర్వ
భూతంబులకునాత్మేశ్వరుండుప్రియుండుసుహృత్తుండగు దేహికిదేహావసానపర్యంతంబునారాయణచరణారవిందసే
వనంబుకర్తవ్యంబు॥సీ॥కంటిరే మానవారుఘనులుగృహస్థులై విఫలులైరై కొన్నవెట్టితనము। భద్రార్థులైయుండిపాయ
రుసంసారపద్ధతినారకపట్టువడిరి। కలయోనులందెల్ల గర్భాద్యవస్థలఁబురుషుండు దేహియైపుట్టుచుండుఁ। దన్నెఱుంగక
కర్మతంత్రుఁడై కడపటముట్టఁడుభవశతములకునైన। పీనశుభములేదు దివ్యకీర్తియులేదు। జగతిఁబుట్టిపుట్టిచచ్చిచచ్చి। పౌ
రలనేలమనకుఁబుట్టనిచావని। త్రోవ వెదకికొనుటదొడ్డబుద్ధి॥శా॥హాలాపానవిజృంభమాణమదగర్వాతీతదేహోల్లస।
ద్బాలాలోకనశృంఖలానిచయసంబద్ధాత్ముఁడై లేశము। న్వేలానిస్సరణంబుఁగానకమహావిద్వాంసుఁడుంగామినీ। హే
లాకృష్టకురంగశాబకముగుఁహీనస్థితిన్వింటిరే॥గీ॥విషయసక్తులయినవిబుధాహితులతోడి । సంగతివలదుముక్తిమార్గ
వాంఛ। నాదిదేవువిష్ణునాశ్రయింపుఁడుముక్త। సంగజనులఁగూడి శైశవమున॥వ॥కావునవిషయంబులఁజిక్కువడినరక్క
సులకుహరిభజనంబుశక్యంబుగాదురమ్యమయ్యునుబహుతరప్రయాసగమ్యమనితలంచితిరేనిఁజెప్పెదసర్వభూతాత్మ
కుండై సర్వదిక్కాలసిద్ధుండయి బ్రహ్మకడపలఁగాఁగల చరాచరస్థూలసూక్ష్మజీవసంఘంబులందును నభోవాయుకుం
భినీసలిలతేజంబులనియెడుమహాభూతంబులందునుభూతవికారంబులయినఘటపటాదులందును, గుణసామ్యంబైనప్ర
ధానమందును,గుణవ్యతిరిక్తంబైనమహత్తత్త్వాదియందును,రజస్సత్త్వతమోగుణంబులయందును,భగవంతుండవ్యయుం
డీశ్వరుండుపరమాత్మపరబ్రహ్మమనియెడువాచకశబ్దంబులంగేవలానుభవానందస్వరూపకుండు, నవికల్పితుండు, నిర్దే
శ్యుండు,నని ర్దేశ్యుండునైనపరమేశ్వరుండుద్రిగుణాత్మకంబైనతనదివ్యమాయచేతనంతర్హితైశ్వర్యుండై వ్యాప్యవ్యాపక
రూపంబులంజేసిదృశ్యుండును,ద్రష్టయు,భోగ్యుండును,భోక్తయునైనిర్దేశింపఁదగివికల్పితుండై యుండుఁదత్కారణంబున
నాసురభావంబువిడిచిసర్వభూతంబులందునుదయాసుహృద్భావంబులుగర్తవ్యంబులు-దయగలిగినసధోక్షజుండుసంత
సించుననంతుండాద్యుండుహరిసంతసించిననలభ్యంబెయ్యదియులేదుజనార్దనచరణసరసీరుహయుగళస్మరణసుధారస
పానపరవశులమైతిమేనిమనకుదైవవశంబుననకాంక్షితంబులైసిద్ధించు-ధర్మార్థకామంబులుకాంక్షితంబైసిద్ధించు-మో
క్షంబననేలఁద్రివర్గంబును,నాత్మవిద్యయుందర్కదండనీతిజీవికాదులన్నియుఁదైగుణ్యవిషయంబులైనవేదంబులవలనం
బ్రతిపాద్యంబులునిస్త్రైగుణ్యలక్షణంబగుచుంబరమపురుషుండైనహరికినాత్మసమర్పణంబుసేయుటమేలుపరమాత్మతత్త్వజ్ఞా
నోదయంబునంజేసిస్వపరభ్రాంతిఁజేయకపురుషుండుయోగావధూతత్వంబుననాత్మవికల్పభేదంబునంగలలోఁగన్న
విశేషంబుభంగిఁదథ్యంబుగాకమిథ్యయనితలంచునని మఱియుఁబ్రహ్లాదుండిట్లనియె॥మ॥నరుఁడుందానును మైత్రితో మెలఁ

సుహో నారాయణుండింతయు| న్వరుస న్నారదసంయమీశ్వరునకు న్వ్యాఖ్యానముం జేసె ముం| హరిభక్తాంఘ్రిపరాగ
శుద్ధులను లేకాంతులు మహోకించను| ప్రతతత్త్వజ్ఞులుగాని నేరరు మహదన్వ్యాపింపనీజ్ఞానముల్॥ వ॥ తొల్లి నే న్వ్యాకృష్టి గలనారద
మహామునివలనవిశేషంబైన యీజ్ఞానంబును, బరమ భాగవతధర్మంబును వింటిని నిన వెలి నైన న్బాలకులు దనుజ
రాజకుమారునకిట్లనిరి॥ ఉ॥ నుంటిమి మూఁడి భార్గవకుమారకు నొద్దన నే శాస్త్రములు| న్వింటిమి లే సుబుద్ధుఁడు వేల్పొఁడె
న్నఁడు రాజశాలము| కెంటికి నైన రామసారఁగా వెలికింజన రామనీకు నీ| మంటకవృత్తి నెవ్వఁడ ప్రగల్భుఁడు సెప్పెగు
ణాఢ్య సెప్పుమా॥ క॥ సేవింతుము నిన్నెప్పుడు| భావింతుము రాజననుచు బహుమానంబుల్| గ్లావింతుము తెలియ మునీ| కీసింత
మతి ప్రకాశమే క్రియఁగలిగెన్॥ వ॥ అని యిట్లు దైత్యనందనులుదన్నడిగిన బరమ భాగవతకులాలంకారుండైన ప్రహ్లాదుం
డు సగితనకుఁ బూర్వంబున నంమపినంబడిన నారదుమాటలు వలందియిట్లనియె. శా॥ అక్షీణోగ్రతపంబునుం దరము పైనగ్గింది
మాతం డ్రిసు| ధ్వాంతింజనియుండఁ జీమగమి చేత న్ఫ్రోఁగి చందంబున| న్భక్షింపం బడెఁ బూర్వపాపముల చేఁ బాపాత్మకుం
డంచును| న్రక్షుస్సంఘము మీఁదని ర్జరులు సంరంభించి యుద్ధార్థులై॥ శా॥ ప్రస్థానోచిత భేరిభాంకృతులతోఁ బాకారి యుం
దారుశౌ| ర్యస్థైర్యంబున నేసుడెందిన ఁపదీయాటోపవిభ్రాంతులై| స్వస్థేమార్దిగ నాడి పుత్రధనయోషామిత్రసంపద్గృశౌ|
ప్రస్థానంబులు డించి పాఱిరసురుల్ప్రాణావనోద్యుక్తులై॥ మత్తకోకిల॥ ప్రల్లదంబున వేల్పులుద్ధతిఁ బాఱి రాజనివాసము|
న్గొల్లవెట్టిసమస్తవిత్తముఁ గ్రూరతం గొనిపోవఁగా| నిల్లుఁ జొచ్చి విశంకుఁడై యమరేశ్వరుండు దలించి మా| తల్లిఁ దాఁ జెఱఁ
బట్టె సిగ్గున దప్తయై విలపింపఁగాన్॥ వ॥ ఇట్లు సురేంద్రుండు మాతల్లిం జెఱఁగొని పోవుచుండ నమ్మగువ కురరియనుపులుఁ
గుక్రియ మొఱలిడి నెఁ దెరువున దైవయోగంబున నారదుండు వొడగని యిట్లనియె॥ ఉ॥ స్వర్భువనాధినాథ సురసత్తము వే
ల్పులలోన మిక్కిలి| న్నిర్భరపుణ్యమూర్తివి పసునీతివి మానినిఁ బట్టనేలయీ| గర్భిణి నాతురన్విడువు కల్మషమూనకు రాలుగా
దుసీ| మద్భరరోషమున్నిలుపు మగ్జయుఁడైన నిలింపవైరిపై॥ అనిన వేల్పుతపసికి వేయిగన్నులతవరయిట్లనియె॥ ఉ॥ అంతని దా
నమైన దివిజాధిపు వీర్యము దీని కుక్షిన| త్యంతసమృద్ధి నొందెడి మహాత్మక కావునఁ దత్ప్రసూతిప| ర్యంతము బద్ధఁ జేసి జనితా
ర్భకు వజ్రపు ధారఁ ద్రుంచి నిశ్చింతుఁడనై తుదిన్విడుతు సిద్ధము దానవరాజవల్లభన్॥ వ॥ అని పలికిన వేల్పుఱేనికిఁ దపసియి
ట్లనియె॥ శా॥ నిర్భీతుం డుప్రశస్తభాగవతుఁ డున్నిర్వైరి జన్మాంతరా| విర్భూతాచ్యుతపాదభక్తిమహిమావిష్టుండు దై
త్యాంగనా| గర్భస్థుండగు బాలకుండు బహుసంగ్రామమృత్యుపాయంబులన్| మర్భావంబునఁ బొందిచావఁడు భవద్దోర్దర్ప
విక్రాంతుఁడై॥ వ॥ అని దేవముని నిర్దేశించిన నతని వచనంబులు మన్నించి తానును హరిభక్తుండు గావున దేవేంద్రుండు భ
క్తిభావంబున మాయవ్వను విడిచి వలగొని సురలోకంబునకుం జనియె- మునీంద్రుండు నజ్జననియం బుత్రికాభావంబుఁ
జేసి యూరడించి నిజాశ్రమంబునకుం గొనిపోయి నీవు పతివ్రతవు నీయుదరంబునఁ బరమభాగవతుండైన ప్రాణి యున్న
వాఁడు తపోమాహాత్మ్యంబునం గృతార్థుండై నీ పెనిమిటి రాఁగలండందాఁక నీవిక్కడనుండుమనిన సమ్మతించి॥ శా॥ యో
షారత్నము నాథదేవత పిశాలోద్యోగ మాతల్లి ని| ర్దోషత్వంబున నాథు రాక మదిలో వాంఛించి నిర్దోషయై| యీషద్భీతి
యు లేక గర్భపరిరక్షేచ్ఛన్విచారించి శు| శ్రూషల్సేయుచునుండె నారదునకున్సువ్యక్తశీలంబునన్॥ వ॥ ఇట్లు తనకుఁ బరిచ
ర్యఁ జేయుచున్న దైత్యరాజకుటుంబినికి నాశ్రితరక్షావిశారదుండైన నారదుండు నిజసామర్థ్యంబున నభయంబిచ్చి గర్భ
స్థుండైన నన్నునుద్దేశించి ధర్మతత్త్వంబును, నిర్మలజ్ఞానంబు నుపదేశించిన నమ్ముద్దియ తద్దయుం బెద్దకాలంబునాఁటి పినికి గావు
న నాఁడు దియ గుటం జేసి పరిపాటిఁ దప్పి సూటి లేక మఱచె నారదుండు నాయెడఁ గృపగలనిమిత్తంబున॥ క॥ వెల్లిగొని నాఁట
నుండియు| సుల్లసితంబైన దైవయోగంబున శో| భిల్లెడు మునివచనమంతయు| నుల్లంబున మఱపుపుట్టదొక నాఁడైనన్॥ గీ॥ పి
నుఁడు నామపలుకు విశ్వసించితి రేని| సతులకైన బాలజనులకైనఁ| దెలియవచ్చు మేలు దేహాద్యలంకార| దళననిపుణమైనత
పసిమతము॥ వ॥ అని నారదోక్త ప్రకారంబున బాలురకుఁ బ్రహ్లాదుండిట్లనియె నీశ్వరమూర్తియైన కాలంబునం జేసి వృక్షంబు
గలుగుచుండ ఫలంబునకు జన్మసంస్థానవర్ధనాపక్షీణత్వపరిపాకనాశంబులు ప్రాప్తంబులయిన తెఱంగున దేహంబునకుం
గాని షడ్భావవికారంబులాత్మకులే వాత్మ నిత్యుండు, మయరహితుండు, శుద్ధుండు, క్షేత్రజ్ఞుండు, గగనాములకునాశ్ర
యుండుఁ, గ్రియాశూన్యుండు, స్వప్రకాశుండు, సృష్టిహేతువు, వ్యాపకుండు, నిస్సంగుండుఁ, బరిపూర్ణుండు, నొక్కండనివి వే
కసమర్థంబులగు నాత్మలక్షణంబులు పండ్రెండు నెఱుంగుచు దేహాదులందు మోహజనకంబులగు నహంకారమమకారం
బులు విడిచి పసిఁడి గసులుగల నేలవునం బ్రాపమానకనకలేశంబుల పాషాణాదులందుఁ బుటంబు వెట్టిహిన్నయోగంబునఁ
గఱఁగనూది హేమకారకుండు పాటవంబున హాటకంబు వడయుభంగి నాత్మకృత కార్యకారణంబుల నెఱింగెడి నేర్పరిదే

హంబునందాత్మసిద్ధికొఱకు నైనయుపాయంబులం జేసి బ్రహ్మభావంబునం బడయు మూలప్రకృతియు మహదహంకారం
బులుం బంచతన్మాత్రంబులును నెనిమిదియుం బ్రకృతులనియును, రజస్సత్త్వతమంబులు మూఁడును బ్రకృతిగుణంబులనియు
ను, గర్మేంద్రియంబులైన వాక్పాణిపాదపాయూపస్థలును, జ్ఞానేంద్రియంబులైన శ్రవణనయనరసనాత్వగ్ఘ్రాణంబులు
ను, మనంబును మహీసలిలతేజోవాయుగగనంబులు నిపదియాఱును వికారంబులనియును, గపిలాదిపూర్వాచార్యులచేతం జె
ప్పంబడియె సాక్షిత్వంబునవీని నిరువదియేడింటి నినాత్మఁ గూడియుండుం బెక్కింటికిఁ గూటువ దేహమదియు జంగమస్థావరరూ
పంబుల రెండువిధంబులయ్యె మూలప్రకృతి మొదలైన వర్గంబునకు వేఱైన మణిగణంబులం జొచ్చియున్న సూత్రంబు చందం
బున నాత్మయిన్నింటియందును జొచ్చి దీపించు నాత్మకు జన్మస్థితిలయంబులు గలవంచు మిథ్యాతత్పరులు గాక వివేకశుద్ధ
మైన మనంబున విచారించి దేహంబునందాత్మ వెదుకవలయు నాత్మకు నవస్థలు గలయట్లుండుఁ గాని యవస్థలు లేవు జాగరణ
స్వప్నసుషుప్తులనువృత్తు లెవ్వనిచేత నెఱుంగంబడు నతం డాత్మయండ్రు కుసుమధర్మంబులయిన గంధంబులచేత గంధా
శ్రయుండైన వాయువు నెఱింగెడు భంగిం ద్రిగుణాత్మకంబులై కర్మజన్యంబులైన బుద్ధిభేదంబుల నాత్మ నెఱుంగందగునని
చెప్పి॥సీ॥ సంసారమిది బుద్ధిసాధ్యము గుణకర్మగణబద్ధమజ్ఞానకారణంబు। కలవంటిదింతియ కాని నిక్కము గామసర్వార్థ
ములు మనస్సంభవములు। స్వప్నజాగరములు సమములు గుణశూన్యుఁడగు పరమునికి గుణాశ్రయమున। భవవినాశంబులు
పాటిల్లినట్లుండు పట్టి చూచిన లేవు బాలురార। కడఁగి త్రిగుణాత్మకములయిన కర్మములకు। జనకమైవచ్చు నజ్ఞానసముదయ
మును। ఘనతరజ్ఞానవహ్నిచేఁ గాల్చిపుచ్చి। కర్మవిరహితులై హరిఁ గనుట మేలు॥వ॥ అదిగావున గురుశుశ్రూషయు సర్వలా
భసమర్పణంబును సాధుజనసంగంబు నీశ్వరప్రతిమాసమారాధనంబును హరితత్పరత్వంబును వాసుదేవునియందలి ప్రే
మయు నారాయణగుణకర్మకథానామకీర్తనంబును వైకుంఠచరణకమలధ్యానంబును విశ్వంభరమూర్తివిలోకనపూజ
నంబులు మొదలైన విజ్ఞానవైరాగ్యలాభసాధనంబులయిన భాగవతధర్మంబులవలయిరతిగలిగి సర్వభూతంబులయందునీ
శ్వరుండు భగవంతుండాత్మగలండని సన్మానంబుసేయుచుఁ గామక్రోధలోభమోహమదమత్సరంబులం గెలిచి యింద్రి
యవర్గంబును బంధించి భక్తిసేయుచుండ నీశ్వరుండైన విష్ణుదేవునియందుల గతి సిద్ధించు॥సీ॥ దనుజారిలీలావతారంబులం
దలి శౌర్యకర్మంబులు సద్గుణములు। వినిభక్తుఁడగువాఁడు వేడ్కతోఁ బులకించుఁ గన్నులహర్షాశ్రుకణములొలుక। గద్గద
స్వరముతోఁ గమలాక్షు వైకుంఠ వరద నారాయణ వాసుదేవ। యనుచు నెత్తిలి పాడు నాడు నాక్రోశించు నగుఁ జింతనము
సేయు నతిమొనర్చు। మఱులుకొని యుండుఁ దనలోన మాటలాడు। వేల్పుసోఁకిన పురుషునివృత్తిఁ దిరుగు। బంధములు వాసి
యజ్ఞానపటలిఁ గాల్చి। విష్ణుఁ బ్రాపించుఁ దదిభక్తివివశుఁడగుచు॥వ॥ కావున రాగాదియుక్తమనస్కుండైన శరీరికి సంసార
చక్రనివర్తకంబైన హరిచింతనంబు బ్రహ్మమందలి నిర్వాణసుఖంబని బుధులు దెలియుదురు హరిభజనంబు దుర్గమంబు గాదు
హరి సకలప్రాణిహృదయంబులయందు నంతర్యామియై యాకాశంబు భంగినుండు విషయార్జనంబుల నయ్యెడిది లేదు నిమి
షభంగురప్రాణులైన మర్త్యులకు మమతాస్పదంబులు చంచలంబులయిన పుత్రమిత్రకళత్రపశుభృత్యబలబంధురాజ్య
కోశమణిమందిరమంత్రిమాతంగమహీప్రముఖవిభవంబులు నిరర్థకంబులు యాగప్రముఖపుణ్యలబ్ధంబులైన స్వర్గాదిలో
కభోగంబులు పుణ్యానుభవక్షీణంబులు గాని నిత్యంబులు గావు నరుండు విద్వాంసుండనని యభిమానించి కర్మంబులాచరించి
య మోఘంబులయిన విపరీతఫలంబుల నొందు గర్మంబులు గోరక చేయవలయుఁ గోరి చేసిన దుఃఖంబులు ప్రాపించుఁ బురు
షుండు దేహంబుకొఱకు భోగంబుల నపేక్షించు దేహంబు నిత్యంబు గాదు తోడరాదు మృతంబయిన దేహమును శునకాదు
లు భక్షించు దేహి కర్మంబులాచరించి కర్మబద్ధుండయి కర్మానుకూలంబైన దేహంబుఁ దాల్చు నజ్ఞానంబునం జేసి
పురుషుండు గర్మదేహంబుల విస్తరించు నజ్ఞానతంత్రంబులు ధర్మార్థకామంబులు జ్ఞానలభ్యంబు మోక్షంబు మోక్షప్రదా
తయగు హరి సకలభూతంబులకు నాత్మేశ్వరుండుఁ బ్రియుండుఁ దనచేత నైన మహాభూతంబులతోడ జీవసంజ్ఞితుండయి
యుండు నిష్కాములై హృదయగతుండయిన హరిని నిజభక్తి నిభజింపవలయు॥క॥ దానవదైత్యభుజంగమ। మానవగంధర్వ
సురసమాజములోపల। లక్ష్మీనాథుచరణకమల। ధ్యానంబున నెవ్వఁడైన ధన్యత నొందుఁ॥క॥ చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ
జిక్కఁడు దానముల శౌచశీలతపములం। జిక్కఁడు యుక్తిని భక్తిని। జిక్కిన క్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ॥క॥ చాలదు భూ
దేవత్వము। చాలదు దేవత్వమధిక శాంతత్వంబుం। జాలదు హరి మెప్పింపవి। శాలోద్యములార భక్తి చాలిన భంగిన్॥గీ॥ ద
నుజ ఖుజగ యక్ష దైత్య మృగాభీర। సుందరీ విహంగ శూద్ర శబరు। లయినఁ బాపజీవులైన ముక్తికిఁ జోదు। రఖిలజగము విష్ణుఁ
డను చుఁ దలంచి॥క॥ గురువులు మనకును లోఁబడు। తెరువులు సెప్పెదరు విష్ణుదివ్యపదవికిం। దెరువులు సెప్పరు చీఁకటిఁ బరువు

లు వెట్టంగ నేల బాలకులారా॥ క॥ తెండెల్ల పుస్తకంబుల। నిండాచార్యునకు మాఱల నేకతమునఁ గూర్చుండుము శేషముఁ జెప్పె
డఁ। బొండొల్ల నివారు కర్మపుంజము పాలై॥ క॥ ఆడుదము మనము హరిరతిఁ। బాడుదమే ప్రొద్దు విష్ణుభద్రశయంబుల్। వీడుద
ము దనుజసంగతిఁ। గూడుదము ముకుంద భక్తకోటిన్ సూటిన్॥ క॥ విత్తము సంసృతిపటలము। వృత్తము కామాదివైరివర్గంబు
లనేఁ। డిత్తము చిత్తము హరికిని। జొత్తము నిర్వాణపదము శుభమగు మనకున్॥ వ॥ అని యిట్లు రహస్యంబున బ్రహ్లాదుండు
నయ్యా వేళల రాక్షసకుమారులకు నపవర్గమార్గం బెఱింగించిన వారును గురుశిక్షితంబైన చదువులు సాలించి నారాయణభ
క్తిఁ జిత్తంబుల నంగీకరించియుండుటం జూచి వారల మేకాంత భావంబుఁ దెలిసి వెఱచి వచ్చి శుక్రాచార్యనందనుండు శక్రవై
రికిట్లనియె॥ శా॥ రక్షోబాలుర నెల్ల నీకొడుకు చేరం జీరి లోలోన నా। శిక్షామార్గము లెల్లఁ గల్లలని యాక్షేపించి తానంద ఱ।
న్మోక్షాయత్తులఁ జేసినాఁడు మనకున్మోసంబు వాటిల్లె సీ। దక్షత్వంబునఁ జక్కఁ జేయవలయున్ దైతేయవంశాగ్రణీ॥ క॥ ఉల్ల
సితవిష్ణుకథనము। లెల్లప్పుడు మానఁ జెప్పఁ డీ కుఱ్ఱఁడు నన్నుల్లంఘించి కుమారకు। లొల్లరు చదువంగ దానవోత్తమ విం
టే॥ క॥ ఉడుగఁడు మాధురిపుకథనము। విడువఁడు జడుపగిదిఁ బలుకు వికసనమున నే। నొడివిన నొడువులు నొడువఁడు। దుడుక
నిఁ జదివింప మాకు దుర్లభ మధిపా॥ క॥ చొక్కపు రక్కసకులమునఁ। బెక్కురు జన్మించి రింటఁ బీతాంబరునిన్। నిక్కపు మక్క
వఁ గొలిచెడు। నెక్కడి సుతుఁ గంటి రాక్షసేశ్వర వెఱ్ఱిన్॥ వ॥ అని యిట్లు గురుసుతుండు సెప్పిన కొడుకువలని విరోధవ్యవహా
రంబులు కర్ణరంధ్రంబులం దసిఖడ్గప్రహారంబులయి సోఁకిన బిట్టుమిట్టిపడి పాదతాడితం బైన భుజంగంబు భంగిఁ బవనప్రే
రితం బైన దవానలంబు చందంబున దండతాడితం బైన కంఠీరవంబు కైవడి భీషణరోషరసావేశ జాజ్వల్యమాన చిత్తుండును,
బుత్రసంహారోద్యోగయుక్తుండును గంపమానగాత్రుండును నరుణీకృత నేత్రుండు నై కొడుకును రప్పించి సంమానకృత్యం
బులు దప్పించి నిర్దయుండయి యశనిసంకాశ భాషణంబుల నదల్చుచు॥ శా॥ సూనున్నాంతగుణప్రధాను నతిసంశుద్ధాంచిత
జ్ఞానున్ జ్ఞానారణ్యకృశానున్ అంజలిపుటీసంభ్రాజమానున్ సదా। శ్రీనారాయణపాదపద్మయుగళీ చింతామృతాస్వాదనా।
ధీనున్ ధిక్కరణంబుఁ జేసి పలికెన్ దైవాహితుం డుగ్రతన్॥ సీ॥ అస్మదీయంబగు నాదేశమునఁ గాని మిక్కిలి రవి మింట మెఱయ వె
ఱచు। నన్ని కాలములందు ననుకూలుఁడై కాని విద్వేషమున గాలి వీవ వెఱచు। మత్ప్రతాపానలమందీకృతార్చియై విచ్చలవి
డి నగ్ని వెలుఁగ వెఱచు। నతితీక్ష్ణమైన నా యాజ్ఞ నుల్లంఘించి శమనుండు ప్రాణులఁ జంప వెఱచు। నింద్రుఁ డాదలనా మ్రోల
నెత్త వెఱచు। నమరకిన్నర గంధర్వ యక్షవిహగ। నాగవిద్యాధరావలి నాకు వెఱచు। నేల వెఱవవు పలువ నీ కేది
దిక్కు। నాప్రజ్ఞావంతులు లోకపాలకులు శుంభద్ద్వేషులయ్యున్మదీ। యాజ్ఞాభంగము సేయనోడుదురు రోషాపాంగదృ
ష్టిన్ సేవే। కజ్ఞానచ్యుతమై జగత్త్రితయముం గంపింపనీ విట్టిచో। నాజ్ఞోల్లంఘన మెట్లు చేసితివి సాహంకారగ తన్దుర్మతీ॥ శా॥ కం
ఠక్షోభము గాఁగ నెత్తిలి మహాగాఢంబు గాడింభ వై। కుంఠుం జెప్పెదు దుర్జయుండనుచు వైకుంఠుండు వీరవ్రతో। త్కం
ఠాబంధురుఁ డేని నేనమరులన్ఖండింపఁ దండింపఁగాఁ। గుంఠీభూతుఁడు గాక రావలదె మద్ఘోరాహవక్షోణికిన్॥ శా॥ ఆచా
ర్యోక్తము మాని బాలురకు మోక్షాసక్తిఁ బుట్టించితీ। వాచాలత్వముఁ జూపి విష్ణునహితున్వర్ణించితీ ద్వైధ్యవం। శాచారం
బులు నీఱుఁ జేసితివి మూఢాత్ముం గులద్రోహివి। న్నీచుం జంపుట మేలు చంపకుల మున్న ద్దోషముం జేసెదన్॥ క॥ దిక్కులు గె
లిచితి నన్నియు। దిక్కెవ్వఁడు రోరి నీకు దేవేంద్రాదుల్। దిక్కుల రాజులు వేల్పొక। దిక్కెఱుఁగక కొలుతు రితఁడె దిక్కని నిన
న్నున్॥ క॥ బలవంతుఁడ నే జగముల। బలములతో జనక వీరభావమున మహా। బలులఁ జయించితి నెవ్వని। బలమున నాఁడెదవు నా
కుఁ బ్రతివీరుఁడవై॥ అనినఁ దండ్రి మెల్లన వినయంబుతోఁ గొడుకిట్లనియె॥ క॥ బలయుతులకు దుర్బలులకు। బలమెవ్వఁడు నీ
కు నాకు బ్రహ్మాదులకు। న్బలమెవ్వఁడు ప్రాణులకును। బలమెవ్వం డట్టి విభుఁడు బలము సురేంద్రా॥ క॥ దిక్కులు కాలము
తో నే। దిక్కున లేకుండుఁ గలుగు దిక్కుల మొదలై। దిక్కుగల లేని వారికి। దిక్కెయ్యది యది యనాకుఁ దిక్కు మహాత్మా॥
సీ॥ కాలరూపంబులఁ గలవిశేషంబుల నలఘుగుణాశ్రయుండైన విభుఁడు। సత్త్వాఖిలేంద్రియసహజప్రభావాఢ్యుఁడై వినో
దంబున నఖిలజగంబుఁ గల్పించు రక్షించు ఖండించు నవ్యయుఁ డన్నిరూపములందున తాఁ గలఁడు। చిత్తంబు సమముగాఁ జే
యుము మార్గంబు దప్పిన చిత్తంబుకంటె। వైరు లెవ్వరు చిత్తంబు వైరి గాక। చిత్తమును నీకు వశముగాఁ జేయుమ
య్య। సదయు [illegible] మానుసయ్య। యయ్య నీ మ్రోల మేలాడరయ్య జనులు॥ ఉ॥ లోకములన్నియున్ గడియలో
న జయించిన వాఁడ [illegible] త్త [illegible] గెలువనేరవు నిన్ను నిబద్ధుఁ జేయు నీ భీకరశత్రులార్వుర బ్రభిన్నులఁ జే
సినఁ బ్రాణికోటిలో నీకు [illegible] నేర్పునఁ జూడుము దానవేశ్వరా॥ క॥ పాలింపుము శేముషిని। న్మాలింపుము క
ర్మబంధముల సమదృష్టిన్। జా[illegible]పుము సంసారముఁ। గీలింపుము హృదయమందుఁ గేశవభక్తిన్॥ వ॥ అనినఁ బరమభాగవత

శేఖరునకు దోషాచర శేఖరుండిట్లనియె॥ క॥ చంపినఁ జచ్చెదననుచును। గంపింపక యోరి పలుచకత్తిన నోక్తులనర్భ। నంపించెదవే చావునకుం। దెంపరి వై పలుకు వాని తెలఁగుననఁగుచునే॥ శా॥ నాతోడం బ్రతిభాషలాడెదు జగన్నాథుండు నాకంటెనే। భూతశ్రేణికి రాజు లేఁడొకఁడు సంపూర్ణప్రభావుండు నా। ద్యాశ్రితం జంపినయున్న నే వెదికితిన్ సర్వమ్ముల నా నారాయణుం। డేతద్విశ్వములోన లేఁడు నుతి వాఁడెందుండు రా దుర్మతీ॥ క॥ ఎక్కడఁ గలఁడే క్రియనే। చక్కటి వర్తించు నెట్టి జాడను వచ్చుం। ఇక్కడఁ గనుని నిన్ను పిన్ననిఁ। జెక్కులు వ్రేలెదవు వాని భృత్యు నిపగిది॥ వ॥ అనిన హరికింకరుం డసురశంకింపక హర్షపులకాంకురసంకలితవిగ్రహుండై యాగ్రహంబు లేక హృదయంబున హరిం దలంచి నమస్కరించి బాలవర్తనంబున నర్తనంబు సేయుచునిట్లనియె॥ మ॥ కలఁ డంభోధిఁ గలండు గాలిఁ గలఁ డాకాశంబునం గుంభినిం। గలఁ డగ్నిన్ దిశలం బగళ్ల నిశలన్ ఖద్యోతచంద్రాత్ములం। గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దంతటం। గలఁ డీశుండు గలండు తండ్రి వెదకం గా నేల నీ నా యెడన్॥ క॥ ఇందుఁ గలఁ డందు లేఁడని। సందేహము వలదు చక్రి సర్వోపగతుం। డెం దెందు వెదకి చూచిన। నందందే గలఁడు దానవాగ్రణి వింటే॥ ఇవ్విధంబున॥ మ॥ హరి సర్వాకృతులం గలం డనుచుఁ బ్రహ్లాదుండు భాషింపఁ। త్వరుఁడై యెందును లేఁడు లేఁడని సుతున్ దైత్యుండు దర్జింప శ్రీ। నరసింహాకృతినుండె నచ్యుతుఁడు నానాజంగమస్థావరో। త్కరగర్భంబుల నన్ని దేశములనుద్దండప్రభావంబునన్॥ వ॥ అయ్యవసరంబున నద్దానవేంద్రుండు॥ క॥ డింభక సర్వస్థలములనంభోరుహనేత్రుఁ డుండు ననుచు మిగులసం। రంభంబునఁ బలికెదవీ। స్తంభంబునఁ జూపఁ గలవె చక్రిన్ గిక్రిన్॥ క॥ స్తంభమునఁ జూపవేని యుఁ। గుంభిని నీ శిరముఁ ద్రుంచి కూల్పఁగ రంతూ। రంభమున వచ్చి హరి వి। స్రంభంబున నడ్డపడఁగ శక్తుండగునే॥ వ॥ అనిన భక్తవత్సలు నిభటుండిట్లనియె॥ శా॥ అంభోజాసనుఁ డాదిగాఁ గఁ దృణపర్యంతంబు విశ్వాత్ముఁడై। సంభావంబున నుండు ప్రౌఢవిపుల స్తంభంబునం దుండఁడే। స్తంభాంతర్గతుఁ డయ్యునుండుటకు నేసందేహముల్ లేము నిర్దంభత్వంబున నేఁడు గానఁబడుఁ బ్రత్యక్షస్వరూపంబునన్॥ వ॥ అనిన విని కరాళించి గ్రద్దన లేచి గద్దియ డిగ్గనురికి యొఱఁ బెఱికి ఖడ్గంబు కేలనర్బిఝళిపించుచు మహాభాగవతశిఖామణియైన ప్రహ్లాదుని ధిక్కరించుచు॥ మ॥ వినరా డింభక మూఢచిత్త గరిమన్ విష్ణుండు విశ్వాత్మకుం। డని భాషించెదవైన నిందుఁ గలఁడే యంచున్ మదోద్రేకియై। దనుజేంద్రుండు చేత వ్రేసెను మహోదగ్ర

## శ్రీహరి నరసింహరూపం బెత్తుట.

ప్రభాశుంభము న్నగ్నదృగ్భీషణదంభమున్ హరిజనుస్సంరంభమున్ స్తంభమున్॥ వ॥ ఇట్లు దానవేంద్రుండు పరిగృహ్యమాణవైరుండును, వైరానుబంధజాజ్వల్యమానరోషానలుండును, రోషానలజఘన్యమానవిజ్ఞానవినయుండును, వినయగాంభీర్యధైర్యజేగీయమాన హృదయుండును, హృదయచాంచల్యమాన తామసుండును, తామసగుణచంక్రమ్యమాణస్థైర్యుండునై విస్రంభంబున హుంకరించి బాలుని ధిక్కరించి హరిసింహుఁ జూపుమని కనత్కనకమణిమయకంకణక్రేంకారశబ్దపూర్వకంబుగా దిగ్దంతిదంతభేదనపాటవప్రశస్తంబగు హస్తంబున సభామంటప స్తంభంబు వ్రేసిన వ్రేటుతోడన దశదిశలమిణుంగురులు చెదరఁ జిటిలి పెటిలిపడి బంభజ్యమానంబగు నమ్మహాస్తంభంబునఁ బ్రళయవేళాసంభూతసప్తస్కంధబంధురసమీరసంఘటితరజోఘుష్యమాణమహాబలాహకవర్గనిర్గతనిబిడనిష్ఠురమహానిర్ఘాతసంఘనిర్ఘోష నీకాశంబులయిన ఛటచ్ఛటస్ఫుటస్ఫుటధ్వనిప్రముఖభయంకరారావపుంజంబులు జంజన్యమానంబులయి యెగసి యాకాశకుహరాంతరాళంబు నిరవకాశంబుఁ జేసి నిండిన నంబట్టు చాలక దోధూయమానహృదయంబులై పరవశంబులై నపితామహమహేంద్రవరుణవాయుశిఖిప్రముఖచరాచరజంతుజాలంబులతోడ బ్రహ్మాండకటాహంబు పగిలి పరిస్ఫోటితంబుగాఁ బ్రఫుల్లపద్మయుగళసంకాశభాస్వరచక్రచాపహలకులిశజలచర రేఖాంకిత చారుచరణతలుండును, చరణచంక్రమణఘనవినమితవిశ్వవిశ్వంభరాభారధౌరేయదిక్కుంభికుంభీనసకుంభినీధర కూర్మకుల శేఖరుండును, దుగ్ధజలజాత తుండాలతుండాకాండమండితప్రకాండప్రచండమహోరుస్తంభయుగళుండును, ఘణఘణాయమాన మణికింకిణీగణముఖరితమేఖలావలయవలయితపీతాంబరశోభితకటిప్రదేశుండును, నిర్జరనిమ్నగావర్తవర్తులకమలాకరగంభీరనాభివివరుండును, ముష్టిపరిమేయవినుతతనుతరస్నిగ్ధమధ్యుండును, కులాచలసానుభాగ [illegible] విశాలవక్షుండును, దుర్జనదనుజభటధైర్య [illegible] యమానరక్షోరాజవక్షోభాగవిశంకటక్షేత్ర [illegible] నుంచు లాంగలాయమాన ప్రతాపజ్వాలనజ్వా [illegible] నయనచకోరచంద్రరేఖాయమానవజ్ర [illegible] మాన భాసమాన నిశాతనఖరసముఖన [illegible] క్ర [illegible] నాఖడ్గ [illegible] తోమర ప్రముఖనానాయుధ [illegible] మహోత్తుంగమహీధరశృంగసన్నిభవీరసా [illegible] కావిరాజమాన సవిరగ్ద శానేకశతభుజాగ్గలు [illegible] మంజుమంజీరమణిపుంజరంజితమంజుల

హారకేయూరకంకణకిరీటమకరకుండలాదిభూషణభూషితుండును, త్రివళీయుతశిఖరిశిఖరాభపరిణద్ధబంధురకంధరుండును, ప్రకంపనకంపితపారిజాతపాదపపల్లవప్రతీకాశకోపావేశసంచలితాధరుండును, శరత్కాలమేఘజాలమధ్యమదగద్ధగాయమానతటిల్లతాసమాన దేదీప్యమానదంష్ట్రాంకురుండును, కల్పాంతకాలసకలభువనగ్రసనవ్యసనవిజృంభమాణసప్తజిహ్వాజిహ్వాతులితతరలతరాయమానవిభ్రాజమానజిహ్వుండును, మేరుమందరమహాగుహాంతరాళవిస్తారవిపులవక్త్రనాసికావివరుండును, నాసికావివరనిస్సరన్నిబిడనిశ్వాసనికరసంఘట్టనసంక్షోభితసంతప్యమానసప్తసాగరుండును, పూర్వపర్వతవిద్యోతమానఖద్యోతమండలసదృశసమంచితలోచనుండును, లోచనాంచలసముదీర్యమాణవిలోలకీలాభీలవిస్ఫులింగవితానరోరుధ్యమానతారకాగ్రహమండలుండును, శక్రచాపసురుచిరోదగ్రమహాభ్రూలతాబంధబంధురభయంకరవదనుండును, ఘనతరగండశైలతుల్యకమనీయగండభాగుండును, సంధ్యారాగరక్తధారాధరమాలికాప్రతిమమహాభ్రంకషతంతన్యమానపటుతరసటాచ్ఛటుండును, సటాజాలసంచాలన సంజాతవాతడోలాయమానవైమానికవిమానుండును, నిష్కంపితశంఖవర్ణమహోర్ధ్వకర్ణుండును, మంథదండాయమానమందరవసుంధరాధరపరిభ్రమణవేగసముత్పద్యమానవియన్మండలమండితసుధారాశికల్లోలశీకరాకార భాసుర కేసరుండును, పరార్ధ్యఖర్వశిశిరకిరణమయూఖగౌరతనూరుహుండును, నిజగర్జననినాదనిర్దళితకుముదసుప్రతీకవామనైరావణసార్వభౌమప్రముఖదిగిభరాజకర్ణకోటరుండును, ధవళధరాధరదీర్ఘదురవలోకనీయదేహుండును, దేహప్రభాపటలనిర్మథ్యమానపరిపంథియాతుధాననికురంబగర్వాంధకారుండును, ప్రహ్లాదహిరణ్యకశిపురంజనభంజననిమిత్తాంతరంగబహిరంగజేగీయమానకరుణావీరరససంయుతుండును, మహాప్రభావుండునైన శ్రీనృసింహదేవుండావిర్భవించినం గనుంగొని॥ క॥ నరమూర్తిగాదు కేవలహరిమూర్తియుఁగాదు మానవాకారము కే। సరియాకారమునున్నది। హరిమాయారచితముగుయథార్థముసూడన్॥ ఉ॥ తెంపునబాలుఁడాడినసుధీరతసర్వగతత్వముంబ్రతి। ష్ఠింపఁదలంచియిందునరసింహశరీరముఁదాల్చిచక్రి శి। క్షింపఁగ

## శ్రీనృసింహదేవుండు హిరణ్యకశిపుని వధించుట.

వచ్చినాఁడుహరిచేస్పృలియంచుఁదలంతునైననా। సొంపునుబెంపునందఱునుజూడఁజరింతుహరింతుశత్రువున్॥ వ॥ అని మెత్తంబడనిచిత్తంబునగదయెత్తికొనితత్తరంబుననార్చుచునకుంఠితకంఠీరవంబుడగ్గఱుగంధసింధురంబుచందంబుననక్తంచరకుంజరుండునరసింహదేవునకెదురునడచి, తదీయదివ్యతేజోజాలసన్నికర్షంబునం జేసిదవానలంబుడగ్గఱినఖద్యోతంబునుంబోలెఁగర్తవ్యాకర్తవ్యంబులుదెలియకనిర్గతప్రభుండయ్యెనప్పుడు॥ మ॥ ప్రకటంబై ప్రళయావసానమునసర్వబ్రహ్మాండభాండావరో। ధకమైయున్నతమిస్రముంజగమునుద్రావించుచో ద్రావిసా। త్త్వికతేజోనిధియైనవిష్ణునెడనుద్దీపించునే నష్టమై। వికలంబై చెడకుండఁగాక తామసులప్రావీణ్యంబురాజోత్తమా॥ వ॥ అంతనద్దానవేంద్రుండుమహోగ్రదండంబునుగదాదండంబుగిరగిరంద్రిప్పినరవృగేంద్రునిప్రేసిననతండుదర్పంబునసర్పంబు నెడిసిపట్టుసర్పపరిపంథి నేర్పునదితిపట్టిం బట్టికొనినమిట్టిపడిధట్టించిబిట్టుకట్టలుకనయ్యసురపరివృఢుండుదృఢబలంబుననిట్టట్టుమిడిసిపట్టుఁదప్పించుకొనివిడివడిదిట్టతప్పకకుప్పించియుప్పరంబునకెగసివిహంగకులరాజచరణనిర్గళితభుజంగంబు తెఱంగునం దలంగనుఱికి తనభుజాటోపంబునరకంఠీరవుండుకుంఠితుండయ్యెడిననిదలంచికలంగక చెలంగుచుఁదన్నునిబిడనీరదనికరంబులమాటుననిలింపులుసంపులుగొనిడాఁగిమూఁగిక్రమ్మఱనాత్మీయజీవనశంకాకలంకితులై మంతనంబునఁజింతనంబుసేయుచు నిరీక్షింపనక్షీణసమరదక్షతావిశేషంబువరియించిఖడ్గవర్మంబులుధరియించి భూనభోభాగంబులవివిధవిచిత్రలంఘనలాఘవంబులఁ బరిభ్రమణభేదంబులంగరాళవదనుండై యంతరాళంబునఁదిరుగుసాళ్వపుడేగవడువునసంచరించినసహింపక॥ సీ॥ పంచాననోద్ధూతపావకజ్వాలలుభూనభోంతరమెల్లఁబూరితముగ। దంష్ట్రాంకురాభీలధగధగాయితదీప్తినసురేంద్రునేత్రములంధములుగఁ। గంటకసన్నిభోత్కరకేసరాహతినభ్రసంఘముభిన్నమైచలింపఁ। బ్రళయాభ్రచంచలాప్రతిమభాస్వరములైఖరనఖరోచులుగ్రమ్ముదేఱ। సటలుఝళిపించిగర్జించిసంభ్రమించి। దృష్టిసారించిబొమలుబంధించి కెరలి। జిహ్వయాడించిలంఘించిచేతనొడిసి। పట్టెనరసింహుఁడాదితిపట్టినధిప॥ క॥ సరకుఁగొనకలీలాగతి। నురగేంద్రుఁడుమూషకంబునొడిసినభంగి। న్నరకేసరిదనునొడిసిన। సురవిమతుఁడుప్రాణభీతిసుడివడియెన్నృపా॥ క॥ సురరాజవైరిలోఁబడెఁ। బరిభావితసాధుభక్త*పటలాంహునకు। న్నరసింహునకునుదంచ। త్ఖరతరజిహ్వునకునుగ్రతరశీరంహునకున్॥ అంత॥ మా॥ విహగేంద్రుండహిఁబ్రచ్చుకైవడిమహోగ్రస్ఫూర్తిన్నృసింహుండుసా। గ్రహుఁడై యూరువులందుఁజేర్చినఖసంఘాతంబు

*పటలాంహునకున్। సమూహముయొక్క పాపములుగలవానికిని — శీరంహునకున్। వేగముగలవానికిని.

లక్షఃప్రచ్ఛేదు । స్సహుదంభోళికఠోరదేహు నచలోత్సాహున్మహాబాహునిం । గ్రహుతాశాంతకభీకరున్ఖనకరున్ దైత్యాన్వయశ్రీకరున్ ॥ శా॥ చించున్ హృత్కమలంబు శోణితము వర్షించున్ ధరామండలిం । ద్రెంచుం గర్కశనాడికావలులు భేదించున్మహోవక్షముం । ద్రుంచున్మాంసము సూక్ష్మఖండములుగా దుష్టాసురున్ వ్రచ్చిదు । ర్వ్రించుం ద్రేవులు కంఠమాలికలుగల్పించున్నభోద్భాసియై ॥ సీ॥ వక్షఃకవాటంబు వ్రక్కలు సేయుచో ఘనకుఠారంబుల కరణి నొప్పు । గంభీరహృదయపంకజము భేదించుచో గుద్దాలములభంగి గొమరుమిగులు । *ధమనీవితానంబు దవిలి ఖండించుచో బటులవిత్రంబుల పగిది మెఱయు । జఠరవిశాలాంత్రజాలంబు ద్రెంచుచో †క్రకచసంఘంబుల గరిమ జూపు । నంకగతుండైన దైత్యుని నాగ్రహమున । శస్త్రచయముల నొంపక సంహరించి । యమరు నరసింహు నఖరంబు లతివిచిత్ర । సమరముఖరంబులై యుండె జనవరేణ్య ॥ క॥ స్ఫురిత విబుధజనముఖములు । పరివిదళితదనుజనివహపతితనుముఖముల్ । గురువిజితశిఖిశిఖములు । నరహరికరనఖములమరు నతజనసఖముల్ ॥ వ॥ ఇట్లు కేవలపురుషరూపంబును మృగరూపంబునుం గాని నరసింహరూపంబున రేయినుం బవలునుం గాని సంధ్యాసమయంబున నంతరంగంబును బహిరంగంబునుం గాని సభాద్వారంబున గగనంబును భూమియుం గాని నిజోరుమధ్యంబున బ్రాణసహితంబును బ్రాణరహితంబునుం గాని నఖంబులం ద్రైలోక్యజనహృదయభల్లుండైన దైత్యమల్లుని వధించి మహాదహనకీలాభీలదర్శనుండును, గరాళవదనుండును, లేలిహానభీషణజిహ్వుండును, శోణితపంకాంకితకేసరుండునై ప్రేవులు మాలికలుగ ధరించి కుంభికుంభవిదళనంబు జేసి చనుదెంచు పంచాననంబునుం బోలె దనుజకుంజర హృదయకమలవిదళనంబు జేసి తదీయరక్తసిక్తంబులయిన నఖంబులు సంధ్యారాగరక్తచంద్రరేఖల చెలువు వహింప సహింపక లేచి తన కట్టెదుర నాయుధంబు లెత్తికొని తత్తరంబున రణంబునకు నురువడించు రక్కసులం బెక్కుసహస్రంబులం జక్రాదినిర్వక్రసాధనంబుల నొక్కని జిక్కకుండం జక్కడిచె నివ్విధంబున ॥ శా॥ రక్షోవీరుల నెల్లం ద్రుంచి రణసంరంభంబు చాలించి దృష్టిక్షేపంబు భయంకరంబుగ సభాసింహాసనారూఢుండై । యక్షీణాగ్రహుండై నృసింహుండు కరాళాస్యంబుతో నొప్పెడు । న్వీక్షింపం బరికింపనోడి రసురుల్ విభ్రాంతులై డాగఁగన్ ॥ క॥ సురచారణవిద్యాధర । గరుడోరగయక్షసిద్ధగణములలోనొక్కరుండైన డాయవెఱచును । నరహరి నయ్యవసరమున నరలోకేశా ॥ క॥ §తర్షంబుల నరసింహుని । హర్షంబులఁ జూచి నిర్జరాంగనలు మహోత్కర్షంబులఁ గుసుమంబుల । వర్షంబులు గురిసి రుత్సవంబుల నధిపా ॥ వ॥ మఱియు నయ్యవసరంబున మింటను నేకదేవతావిమానంబులును, గంధర్వగానంబులు, నప్సరోగణనర్తనసంవిధానంబులును, దివ్యకాహళభేరీపటహమురజాదిధ్వానంబులును, ప్రకాశమానంబులయ్యె సనందకుముదాదులైన హరిపార్శ్వచరులును, మహేశ్వరవిరించిమహేంద్రపురస్సరులగు త్రిదశకిన్నరకింపురుషపన్నగసిద్ధసాధ్యగరుడగంధర్వచారణవిద్యాధరాదులును, బ్రజాపతు

## శ్రీ బ్రహ్మాది దేవతలు శ్రీనృసింహమూర్తిని వేర్వేఱుగా స్తుతించుట.

లును నరకంఠీరవదర్శనోత్కంఠితులయి చనుదెంచి ॥ క॥ కరకమలయుగళకీలిత । శిరులై డగ్గఱక భక్తిఁ జేసిరి బహుసం । సరణార్తితరికి నఖరికి । నరభోజనహస్తిహరికి నరకేసరికిన్ ॥ వ॥ ఆసమయంబున దేవతలందఱు వేఱు వేఱ వినుతించి రందుఁ గమలాసనుండిట్లనియె ॥ మ॥ ఘనలీలాగుణచాతురిన్ భువనముల్ గల్పించి రక్షించి భే । దనముం జేయు దురంతశక్తికి ననంతజ్యోతికిం జిత్రవీర్యునికి నిత్యపవిత్రకర్మునికి నేనుత్కంఠతో నవ్యయా । త్మునికిన్ వందనమాచరించెదఁ గృపాముఖ్యప్రసాదార్థినై ॥ రుద్రుం డిట్లనియె ॥ చ॥ అసురవరేణ్యు మీఁద టసహస్రయుగాంతము నాఁడు గానికో । పమునకు వేళ గాదు సురబాధకుఁడైన తమస్వినీచరు న్సమరమునన్ వధించితివి చాలుఁ దదాత్మజుఁడైన వీఁడు స । ద్వినయుఁడు నీకు భక్తుఁడు పవిత్రుఁడు గావుము భక్తవత్సలా ॥ ఇంద్రుం డిట్లనియె ॥ సీ॥ ప్రాణిసంఘముల హృత్పద్మమధ్యంబుల నివసించి భాసిల్లు నీవ యెఱుఁగు । దింతకాలము దానవేశ్వరుచే బాధపడి చిక్కియున్న యాపన్నజనుల । రక్షించితివి నమ్మురాత్మ సేశ్వరుఁ జంపి క్రతుహవ్యములు మాకుఁ గలిగె మఱల । నంటిమి నీసేవ మరిగినవారలు కైవల్యవిభవంబు గాంక్ష సేయ । రితరసుఖము లెల్ల నిచ్చయింపఁగ నేల । నస్థిరంబు లివి యనంతభక్తిఁ । గొలువ నిమ్ము నిన్ను ఘోరదైత్యానీక । చిత్తభయదరంహ శ్రీనృసింహ ॥ ఋషులిట్లనిరి ॥ మ॥ భవదీయాదరలీల లోకములను త్పాదించి రక్షింపనే । డవి దైత్యేశుని చేత భేదితములై హ్రస్వంబులై యుండ నీ । యవినీతున్నరసింహరూపమున సంహారంబు నొందించి వే । దవిధిం గ్రమ్మఱ నుద్ధరించితిగదా ధర్మానుసంధాయివై ॥ పితృదేవతలిట్లనిరి ॥ శా॥ చండక్రోధముతోడ దైత్యుఁడు వడిన్ శ్రాద్ధంబులన్ మత్సుతు । ల్పిండంబుల్ స్తిలోదకంబులు గనర్పింపంగ మాకీక యు । ద్దండత్వంబున దాన కైకొనుము హాబాద గ్రుండు వీఁడిక్కడన్ । ఖండింపంబడె నీ నఖంబులను దుల్గావింతుమాత్మేశ్వరా ॥

* ధమనీవితానంబు । నాడీసమూహము — † క్రకచ । రంపము — § తర్షంబుల । అధికాభిలాషలతో.

సతి యుండానును గాన కేగి శతవర్షంబుల్సునందానది। న్వ్రాలిమైయేకపదస్థుఁడై నియతుఁడై వాచంయమిస్ఫూర్తితో।గర దోషుండుదపంబు సేసె భువనఖ్యాతంబు గాభూవరా॥వ॥ఇట్లుతపంబు సేయుచుస్వాయంభువమనువుడనమనంబులోన॥ సీ॥సృష్టిచే నెవ్వఁడు చేతనపడకుండుసృష్టి యెవ్వనిచేత చేజనించు।జగములునిద్రింపజాగరూకతనుండియెవ్వఁడు బ్రహ్మెం డ మెఱుఁగుచుండు। నాత్మకాధారంబునఖిలంబు నెవ్వఁడు నెవ్వనినిజధనంబింతవట్టు।పొడఁగానరాకుండుఁబొడఁగను నె వ్వఁడు నెవ్వనిసృష్టికి నెమలు లేమ।జననవృద్ధివిలయసంగతిఁజెందక।యెవ్వఁడెడపకుండు నెల్ల యెడలఁ।దనమహత్వసంజ్ఞ తత్వ మెవ్వఁడుదాన।విశ్వరూపుఁడనఁగవి స్తరించు॥వ॥అనిమతియునిరహంకృతుండును,నిరాశయపరిపూర్ణుండు,ననన్య ప్రేరితుండును,నృశిక్షాపరుండును,నిజమార్గసంస్థితుండును,నిఖలధర్మభావనుండునై నపరమేశ్వరునకునమస్కరించెద ననియుపనిషదర్థంబుల్పలుకుచున్న మనువుంగనుంగొని.క॥రక్కసులుదినఁగఁగడఁగిన। వెక్కసముగయజ్ఞనామవిష్ణుఁడు వారిం।జక్కడ. చెఁజక్రధారల।మిక్కుటముగ వేల్పులెల్ల మేలనిపొగడన్॥వ॥ ఇదిప్రథమమన్వంతరంబింక రెండవమను వువినుము॥సీ॥స్వారోచిషుండనసప్తార్చిబిడ్డఁడుమనువు వానికినాద్యుమత్సుషేణ।రోచిష్మదాద్యులా రూఢపుత్రులుధా త్రి నేలిరిరోచనుఁడింద్రుఁడయ్యె। నధికులుతుషితాదులమరులూర్జస్తంభముఖ్యులాఢ్యులుసప్తమునులునాఁడు। వేదశి రుండనువిప్రునిదయితతుఁదుషితకుఁబుత్రుఁడైతోయజాక్షుఁ।డవతరించెనువిభుఁడనునశీత్యష్టసహస్రమునులునధికుల యినవారు।ఘనులనుగ్రహింపఁగౌమారకబ్రహ్మ।చారియగుచునతఁడుసలిపెవ్రతము॥ తదనంతరంబ॥సీ॥మనువుమూఁ డవవాఁడునునుజేంద్రయుత్తముండనఁబ్రియవ్రతునకునాత్మజుండు। పాలించెనిలయెల్లపవనసృంజయయజ్ఞహోత్రాదులాతనిపుత్రులధిక।గుణులువసిష్ఠునికొడుకులుప్రముఖాదులైరిసప్తఋషులునమరవిభుఁడు।సత్యజిత్తనువాఁడు సత్యభద్రాద్యులుసురలుధర్మునికినిసూనృతకును।బుట్టినసత్యనియతిఁబురుషోత్తముఁడుసత్య। సేనుఁడనఁగమస్తశీలయుతు ల।దనుజయక్షపతులదండించెసత్య। జిన్మిత్రుఁడనఁగజగము మేలనంగ॥ వ॥ చతుర్థమనువుకాలప్రసంగంబువివరించెద॥

## గజేంద్రమోక్షణకథాప్రారంభము.

సీ॥మానవాధీశ్వరమనువు నాలవవాఁడుదామసుండనఁగనుత్తముని భ్రాత।పృథ్వీపతుల కేతు *పృథునరఖ్యాతాదులతని పుత్రులుపదుపురధికబలులు।సత్యకహరివీరసంజ్ఞులు వేల్పులుత్రిశిఖనామమువాఁడు దేవవిభుఁడు। మునులుజ్యోతిర్వ్యోమ ముఖ్యులుహరిపుట్టెహరిమేధునకుఁబ్రీతిహరిణియందు।గ్రహనిబద్ధుఁడయినగజరాజువిడిపించి।ప్రాణభయమువలనఁబా పి కాచె।హరిదయాసముద్రుఁడఖిలలోకేశ్వరుఁ।డనినశుకునిఁజూచియనియెవిభుఁడు॥క§నీరాటవనాటులకుం।ఘోరాటం బెట్లుగలిగెఁబురుషోత్తముచే।నారాట మెట్లుమానెను। ఘోరాటవిలోనిభద్రకుంజరమునకున్॥క॥ మునినాథయీకథా స్థితి। వినిపింపుమువినఁగనాకు వేడుకపుట్టెన్।వ్వనియెదఁగణ్ణేంద్రియములఁ। బెనుపండువుసేయమునముప్రీతింబొందన్॥ క॥ఏకథలయందుఁబుణ్య।శ్లోకుఁడుహరిసెప్పఁబడును సూరిజనముచే।నాకథలుపుణ్యకథలని।యాకర్ణింపుదురు పెద్దలతిహ ర్షమునన్॥వ॥ఇవ్విధంబునఁబ్రాయోపవిష్టుండయినపరీక్షిన్నరేంద్రుండు¶బాదరాయణినడిగెననిచెప్పిసభాసదులయిన మునులనవలోకించిసూతుండుపరమహర్షసమేతుండై చెప్పెనట్లుశుకుండురాజునకిట్లనియె॥ సీ॥ రాజేంద్రవినుశీసుధా రాశిలోనొకపర్వతముత్రికూటంబనఁదనరుచుండు। యోజనాయుతమగుసున్నతత్వంబును నంతియ వెడలుపునతిశయి ల్లుఁ। గాంచనాయసస్సారకలధౌతమయములై మూఁడుశృంగంబులు మొనసియుండుఁ। దటశృంగబహురత్నధాతుచిత్రిత ములైదిశలుభూనభములు దేజరిల్లు।భూరిభూజలతాకుంజపుంజములును।మ్రోసిపడి తెంచు సెలయేటిమొత్తములును।నుతిఁ గితిరిగెడుదివ్యవిమానములును।జరులఁగ్రీడించుకిన్నరచయముగలిగి॥వ॥అదిమఱియును శ్రీమాతులుంగలవంగలుంగచూత కేతకీభల్లాతకామ్రాతకసరళపనసబదరీవకుళవంజుళవటకుటజకుందకురువకకురంటకకోవిదారఖర్జూరనారికేళసింధువా రచందనపిచుమందమందారజంబూజంబీరమాధవీమధూకతాలతక్కోలతమాలహింతాలరసాలసాలప్రియాళుబిల్వా

* పాఠాంతరమందుఁబృధువనునతనికివృషాఁడను పేరుగలదదివిష్ణుపురాణసమ్మతమైనపాఠము. §నీరాట।జలమందుసంచరించు మొసలి, వనాట।అడవియందుసంచరించెడు ఏనుఁగు, ఘోరాటవి।భయంకరమైనఅరణ్యము, భద్రకుంజరము। మదపుటేనుఁగు. ¶బాదరాయణిశీ। వ్యాసపుత్రుఁడైనశుకుని. ‡క్షీసుధారాశి।పాలసముద్రము,అయుత।పదివేలు,అయస్సార।శ్రేష్ఠమయినయినుము,కలధౌత।వెండి, శృంగము। శిఖరము. ‖మాతులుంగ।మాదీఫలవృక్షములు,లుంగ।పుల్లమాదీఫలవృక్షము,చూత।మామిడిచెట్లు, కేతకీ।మొగలి,భల్లాతక।జీడిచెట్లు, ఆమ్రాతక। అంబాళపుచెట్లు,సరళ।వేగిమాకులు,బదరి।రేఁగుచెట్లు.వకుళ।పొగడమాకులు,వంజుళ। నెమ్మిమాఁకులు,వట।మఱ్ఱివృక్షము,కుటజ।కొడిసెచెట్లు కుంద।మొల్లచెట్లు.కురువక।ఎఱ్ఱపువ్వులుగలగోరింటచెట్లు,కురంటక।పచ్చపువ్వులుగలగోరింటలు,కోవిదార।ఎఱ్ఱకాంచనపుచెట్లు, సింధువా ర।వావిలిచెట్లు.పిచుమంద।వేఁపచెట్లు,జంబూ।నేరేడుచెట్లు,జంబీర।నిమ్మచెట్లు,మాధవీ।వసంతకాలమందుపూచెడుమల్లెచెట్లు,మధూక। ఇప్ప

మలకక్రముకకదంబకరవీరకదళీకపిత్థకాంచనకందరాళశిరీషశింశుపాశోకపలాశనాగపున్నాగచంపకశతపత్రమరువకమల్లికా ప్రముఖనిరంతరవసంతసమయసౌభాగ్యసంపదంకురితపల్లవితకుసుమితఫలిత లలితవిటపవిటపివీరుత్తతులకు వాలుకానేకవిమలపులినతరంగిణీసంగతవిచిత్రవిద్రుమలతామహోద్యానశుకపికనికరన్నినదాలంకృతంబును, మణివాలుకానేకవిమలపులినతరంగిణీసంగతవిచిత్రవిద్రుమలతామహోద్యానశుకపికనికర

నిశితసముచితచంచూపుటనిర్దళితశాఖిశాఖాంతరపరిపక్వఫలరంధ్రప్రవర్షితరసప్రవాహబహుళంబును; గనకమయసలిలకాసారకాంచనకుముదకల్హారకమలపరిమళమిళితకబళాహారసంతతాంగీకారభారపరిశ్రాంగకాంతాసమాలింగిత సమీరమత్తమధుకరవిటసముదయసమీపసంచారసముదంచితశకుంత కలహంస కారండవ జలకుక్కుట చక్రవాకకలకంఠబకబలాహకకోయష్టికముఖరజలవిహంగవిసరవివిధకోలాహలబధిరీభూత భూనభోంతరాళంబును, తుహినకరకాంతమరకతకమలరాగవజ్రవైదూర్యనీలగోమేధికపుష్యరాగమనోహరకనకకలధౌత మణిమయానేక శిఖరతటదరీవిహరమాణ విద్యాధరవిబుధసిద్ధచారణ గంధర్వగరుడకిన్నరమిథునసంతతసరససల్లాపసంగీతప్రసంగ మంగళాయతనంబును, గంధగజగవయగండభేరుండఖడ్గకంఠీరవశరభశార్దూలచమరశల్యభల్లసారంగసాలావృకవరాహమహిషమర్కటమహోరగమార్జాలాదినిఖిలమృగనాథసమూహసమరసన్నాహసంరంభసంచకితశరణాగతశమనకింకరంబునునై యొప్పునప్పర్వతసమీపంబునందు ॥ క ॥ *ఝిల్లీభల్లులులాయక । భల్లుకఫణిఖడ్గగవయబలిముఖచమరీ। ఝిల్లీహరిశరభకరికిటి। మల్లాద్భుతకాకఘూకమయమగు నడవిన్ ॥ శా॥ అన్యాలోకనభీకరంబులు జితాశానేకపానేకమల్ । వన్యేభంబులు గొన్ని మత్తతఁ జనున్ వజ్యావిహారాగతో। దన్యత్వంబున భూరిభూధరదరీద్వారంబులందుండి సో। త్కన్యక్రీడల నీరుగాలి వడిఁగాసారావగాహార్థమై ॥ గీ ॥ అంధకారమెల్ల నద్రిగుహాంతర। వీథులందుఁబగలు వెఱచి డాఁగి। ¶ఎదురు వేచి సంధ్య నినుఁడు వృద్ధతనున్న। వెడలె ననఁగ గుహలు వెడలెఁ గరులు॥ క ॥ ‡తలఁగవు కొండలకైనను। మలఁగవు సింగములకైన మార్కొనుఁ గడిమిం। గలఁగవు పిడుగులకైనన్। నిలబలసంపన్నవృత్తి నేనుఁగు గున్నల్ ॥ సీ॥ పులుల మొత్తంబులు పొదరిండ్లలో దూఱు ఘోర †భల్లూకముల్ గుహలు సొచ్చు। భూదారములు నేలబోఱియలలో డాఁగు హరిదంతముల కేగు హరిణచయము। మడువులఁ జొరఁబాఱు మహిషసంఘంబులు గండశైలంబులఁ గపులు ప్రాఁకు। వల్మీకములు సొచ్చు వనభుజంగంబులు నీలకంఠంబులు నింగి కెగయు। వెఱచి చమరీమృగంబులు విసరువాల। చామరంబుల విహరణశ్రమము వాయ। భయదపరిహేలవిహరించు భద్రకరుల। గాలివారిన మాత్రాన జాలిఁ బొంది ॥ క ॥ మదగజదానామోదము । కదలని తమకమునఁ ద్రావి కడుపులు నిండన్। సొదలుచుఁ దుమ్మెదకొదమలు। కమపులు జుంజుమ్మటంచు గానము సేసెన్ ॥ క ॥ ¶తేఁటి యొమ్మెద త్రావిక దుఫులు నిండన్। శబొదలుచుఁ దుమ్మెదకొదములు। కమపులు జుంజుమ్మటంచు గానము సేసెన్ ॥ క ॥ తేఁటికి నందిచ్చు నిండు బోటితకటి యొరుప్రియకును। మాటికి మాటికిని నాగమదజలగంధం। బేఁటికియనితనుఁ బొందెడి। బోఁటికి నందిచ్చు నిండు బోటిత

నమునన్ ॥ క ॥ అంగీకృతరంగన్మా। తంగీమదగంధమగుచుఁ దద్దయు వేడ్కన్। సంగీతవిశేషంబుల। భృంగీగణ మొప్పె మ్రానుమన్ ॥ క ॥ వల్లభులు వారు మున్నడ। వల్లభయని మూసరి రేని వారణదానం। బొల్లక మధుకరవల్లభు। లుల్లంబుసు పెట్టెడి మాడ్కిన్ ॥ క ॥

భూరిభూజలతాకుంజపుంజములును ॥ భూరి। అనేకములైన. భూజ। వృక్షములయొక్క. లతా। తీఁగెలయొక్క, కుంజ। పొదరిండ్లయొక్క, పుంజములును। సమూహములును; ప్రవహించు। వచ్చుచున్న, అనఁగా ప్రవహించుచున్న. దివ్యవిమానములును। దేవతారథములును, హింతాల। గిఱకతాడిచెట్లు, రసాల। తియ్యమామిడిచెట్లు, సాల। ఏపెచెట్లు, ప్రియాళ। మొరటిచెట్లు, తాల। తాటిచెట్లు, తక్కోల। తక్కోలవృక్షము, తమాల। కానుగుచెట్లు, కంద

రాళ। ప్రేంకణపుచెట్లు, ఆమలక। ఉసిరికెచెట్లు, క్రముక। పోఁకచెట్లు, కరవీర। గన్నేరుచెట్లు, కపిత్థ। వెలగచెట్లు, కాంచన। సంపెగచెట్లు, కందరాళ। కలజువ్వి, శిరీష। దిరిసెన, శింశుప। ఇరుగుడుచెట్లు, పలాశ। మోదుగుచెట్లు, నాగ। సురపొన్న, పున్నాగ। పొన్నచెట్లు, చంపక। కనకసంపెగ, శతపత్ర। తామరతీఁగెలు, మల్లికా। శ్రేష్ఠము, పల్లవిత। చిగిర్చినట్టి, కుసుమిత। పుష్పించినట్టి, ఫలిత। ఫలించినట్టి, లలిత। కోమలములైన, విటప। కొమ్ములుగల, విటపి। వృక్షములయొక్క, నివహ। గుంపుచేత, తరంగిణి। నది, సంగత। కూడుకొనిన, విద్రుమలతా। పగడపుతీఁగెలు, శుక। చిలుక, పిక। కోకిల, నికర। గుంపు, నిశిత। వాడిగల, సముచిత। మిగుల నొప్పుచున్న, చంచూపుట। ముక్కులచేత, నిర్దళిత। బ్రద్దలు చేయబడిన, శాఖి। వృక్షములయొక్క, శాఖ। కొమ్మలయొక్క, అంతర। మధ్యప్రదేశములయందున్న, బహుళంబును। అధికమైనదియును, సలిల। జలము, కాసార। కొలను. తుహినకరకాంత। చంద్రకాంతమణులు. భల్ల। ఖడ్గమృగములు, సారంగ। లేడి, సాలావృక। అడవికుక్కలు। లేక నక్కలు, సమర। యుద్ధము, సంరంభ। సంభ్రమము; సంచకిత। భయపెట్టబడిన, శమనకింకర। యమదూతలు. *ఝిల్లీ। అడవిపిల్లులు, భల్లు। ఒకజాతియెలుగుబంటి, లులాయక। అడవిదున్నలు, భల్లుక। ఎలుఁగుగొడ్డు, గవయ। కురుబోతు, బలిముఖ। కోఁతులు, ఝిల్లి। చిమ్మటలు-కిటి। పంది, మల్ల। శ్రేష్ఠము. జితాశానేకపానేకముల్। జయింపఁబడిన దిగ్గజములుదా నముగల, వన్యేభంబులు। అడవియేనుఁగులు. అవ్వ్రజ్యావిహార। అనుసరణరూపమయిన విహారముచేత- ఆగత। వచ్చిన- ఉదన్యత్వంబునన్। దప్పిచేత. దరీ। గుహ, కాసారావగాహార్థమై। కొలఁకునందు స్నానము చేయుటకొఱకై.— అద్రి। పర్వతము. ¶ఎదురు వేచి। సమయముచూచి. ‡తలఁగవు। తొలఁగవు, మలఁగవు। వెనుకఁదియవు, కడిమి। పరాక్రమము. †భల్లూక। ఎలుగుమంటి, భూదారము। పంది, హరిదంతములు। దిక్కులచివరలు, హరిణచయము। లేడిగుంపు- వల్మీకము। పుట్ట- భుజంగము। సర్పము- నీలకంఠము। నెమలి- నింగికెగయున్। ఆకాశమున కెగురును- దానామోదమున్ - మదధారలవాసనను. శసొదలుచున్। బలిసినవై, కొదమ। శిశువు, కదుపు। గుంపు, తేఁటి। తుమ్మెద, బోఁటితనమునన్। జాణతనముచేత. శ్రీమ్రాను పెట్టెడు మాడ్కిన్। నిశ్చేష్టులగునట్లు.

నఁ బొంది రెల్లయెల్లాసంబుల్॥ అప్పుడు॥ మ॥ *కలభంబుల్ చెరలాడుఁ బల్వలములా ఘ్రాణించి మట్టాడుచున్। ఫలభూజంబు
లు రాయుచుం జివురుజొంపంబుల్ వడిన్ మేయుచుం। బులులన్ గాఱెనుపోతులన్ మృగములన్ బోనీక శిక్షించుచున్। గొలఁకుల్ సొ
చ్చి కలంచుచున్ గిరులపైఁ గొబ్బిళ్ళు గోరాడుచున్॥ క॥ తొండంబుల మదజలవృత। గండంబుల గుంభములను ఘట్టన సేయం।
గొండలు దలక్రిందై పడు। బెండుపడున్ దిశలు సూచి బెగడున్ నగముల్॥ క॥ ఎక్కడఁ జూచిన లెక్కకు। నెక్కువ యై యడవి నడు
చు నిభయూథములో। నొక్క కరినాథుఁ డెడ తెగి। దిక్కులనొక §కరేణుకోటి సేవింపంగన్॥ వ॥ ఇట్లు వెనుక ముందట నుభయపా
ర్శ్వంబులం ¶దృషార్దితంబులై యరుగుదెంచు నేనుంగుగములం గూడికొని తెఱంగుదప్పి తొలంగుపడి యాశ్వ
రాయత్తంబునం జిత్తంబు సంపిత్తంబుగా నుండుటం జేసి తాను దనకరేణు సముదయంబును నొక్క తెరువై పోవుచు।
సీ॥ పల్వలంబుల లేఁతపచ్చిక మచ్చికఁ జెలులకందిచ్చు శీనచ్చికము లేక। చివురుజొంపములఁ గ్రొవ్వేలయుపూఁ గొమ్మలఁ బ్రా
ణవల్లభలకుఁ బాలువెట్టు। ఘనదానశీతలకర్ణతాళంబుల దయితల చెమటార్చు తనువు లరసి। మృదువుగాఁ గొమ్మల మెల్లనె
గళములు నివురుచుఁ బ్రేమతో నెఱపుగ అవుపిలుచు చక్కట్ల డగ్గరి ప్రేమతోడ। డాసి మూర్కొని దివికిఁ దొండంబు సాఁచు। వె
దవివేకించుఁ గ్రీడించు విశ్రమించు। మత్తమాతంగమల్లంబు మహిమతోడ॥ సీ॥ తనకుంభముల పూర్ణతకు డిగ్గియువతుల కు
చములపయ్యెద కొంగులీవ। తనయానగంభీరతకుఁ జాలక బలలయానంబులం దెలనండఁ గొనఁగ। దనకర శ్రీఁ గనితలఁగి బా
లలు విఱుదొడలు మేఖలదీప్తిఁ దోఁచఁబిలువ। దనదంతరుచికోటి తరుణులనగవులు ముఖచంద్రదీప్తులమూసుకుడువ। దనదు
లావణ్యరూపంబుఁ దలఁచి చూడ। నంజనాభ్రముకపిలాదిహరిదిభేంద్ర। దయితలందఱుఁ దన వెంటఁ దగిలి నడువ। కుంభివిభు
డొప్పె నొవ్వాలకుప్పఁ బోలి॥ వ॥ మఱియు నానాగహనవిహారణమహిమతో మదగజేంద్రంబు మార్గంబుఁ దప్పి †పిపాసాప
రాయత్తచిత్తంబున మత్తకరేణువుల మొత్తంబునుం దానును జని చని॥ మ॥ అటఁ గాంచెన్ ‡కరిణీవిభుండు నవఫుల్లాం
భోజకల్హారముం। న్నటదిందిందిరవారముం గమఠమీనగ్రాహమాత్సారముం। న్వటహింతాలరసాలసాలసునవోవల్లీకుటీతీ
రముం। న్జటులోద్ధూతమరాళచక్రబకసంచారంబుఁ గాసారమున్॥ వ॥ ఇట్లు నన్యపురుషసంచారంబును నిష్కళంకంబైన
యప్పంకజాకరంబుఁ బొడగని॥ సీ॥ ॥తోయజగంధంబు దోఁగినచల్లని మెల్లని గాడ్పుల మేనులలరఁ। గమలనాళాహారవిమల
వాక్కలహంసరవములు సెవులపండువులు సేయ। ఫుల్లదిందీవరాంభోరుహామోదంబు ఘ్రాణరంధ్రంబుల గారవింప। ని
ర్మలకల్లోలనిర్గతాసారంబు వదనగహ్వరముల వాడుదీర్పఁ। ద్రిజగదఖినవసౌభాగ్యదీప్తమైన। విభవమీక్షణములకును విం
దు సేయ। నఱిగి పంచేంద్రియవ్యవహారములను। మఱచి మత్తేభయూథంబు మడుఁగుఁ జొచ్చె॥ క॥ తొండంబులఁ బూరించు
చు। గండంబులఁ జల్లుకొనుచు గళగళరవముల్। మెండుకొన §వలుదకడుపులు। నిండ న్వేదండకోటి నీరుం ద్రావెన్॥ అప్పుడు॥
మ॥ ‖ఇభలోకేంద్రుఁ డుహస్తరంధ్రములనీ రెక్కించి పూరించి చం। డభమార్గంబున కెత్తి నిక్కి వడి నుడ్డాడించి పైఁ జిం
దు నా। రభటిన్ నీరములోనఁ బెల్లెగసిన న్గ్రాహపాఠీనముల్। నభమందాడెడు మీనకర్కటములన్ బట్టెన్ సురల్ మ్రాన్ప
డన్॥ మఱియు నగ్గజేంద్రంబు నిరర్గళవిహారంబున॥ సీ॥ ‖కరిణీకరోజ్ఝితకంకణచ్ఛటఁ దోఁగి సెలమేటి నీలాద్రి చెలువుఁ దెగ
డు। హస్తినీహస్తవిన్యస్తపద్మంబుల వేయుగన్నులవాని వెఱపు సూపుఁ। గలభసముత్కీర్ణకల్హారరజమునఁ గనకాచలేం
ద్రంబు ఘనతఁ దాల్చుఁ। గుంజరీపరిచితకుముదకాండంబుల ఫణిరాజమండనప్రభ వహించు। మదకరేణులమత్తమాత్రికఘ

*కలభంబుల్।ముప్పదియేండ్లయేనుఁగులు. చరలాడున్।సంచరించుచు, పల్వలంబులు।పడియగుంటలు, మట్టాడుచున్।చెల్లాచెదరు సేయు
చు, భూజంబులు।వృక్షములు- జొంపము।సమూహము- గ్రొబ్బిళ్లగోరాడుచున్।ఉన్నతప్రదేశములను కొమ్ములతోఁ జిమ్ముచు. §కరేణుకోటి।
ఆఁడుయేనుఁగులగుంపు. ¶తృషార్దితంబులై।దప్పిచేత తొందరపెట్టఁబడినవై- తెఱంగుదప్పి।దారిదప్పి- తొలంగుపడి।చెదిరిపోయి. శీనచ్చి
కము।తక్కువ- దయిత।ప్రియురాలు. †పిపాసాపరాయత్త॥ పిపాస।దప్పికి-పరాయత్త।మిగుల నధీనమైన. ‡కరిణీవిభుండు।గజేంద్రుఁడు-
నవఫుల్లాంభోజకల్హారమున్॥ నవఫుల్ల।క్రొత్తగాఁ బూచిన- అంభోజ।పద్మములును- కల్హారమున్।కలువలును గలదియును- నటదిందిందిరవార
మున్॥నటత్।నృత్యమాడుచున్న-ఇందిందిర।తుమ్మెదలయొక్క-వారమున్।సమూహము గలదియును-కమఠ।తాబేళ్లు- గ్రాహ।మొసలి-దుర్వా
రమున్।నివారింపఁగూడనదియును-వల్లీకుటీ।పొదరిల్లు. కాసారము।కొలను. ॥తోయజ।పద్మము-తోఁగి।మునిఁగి. §వలుద।గొప్ప. ‖ఇభలోకేం
ద్రుండు।గజేంద్రుఁడు- భమార్గము।ఆకాశము. నక్ర।ఏనుఁగును భక్షించెడు జలజంతువు- గ్రాహ।ఏఁగెవలె శరీరమునకుఁ జుట్టికొని ప్రాణిహిం
సఁ జేయు మహామత్స్యము- పాఠీనము।మత్స్యము- మ్రాన్పడన్।నిశ్చేష్టితులగుచుండఁగాను. ‖కరిణీకరోజ్ఝితకంకణచ్ఛటఁ దోఁగి॥కరిణీ।ఆఁ
డుయేనుఁగులయొక్క-కర।తొండములనుండి- ఉజ్ఝిత।బయలు దేరిన-కంకణ।జలబిందువులయొక్క-ఛటన్।సమూహమందు- తోఁగి।మునిఁగి-
హస్తినీహస్తవిన్యస్త॥ హస్తినీ।ఆఁడుయేనుఁగులయొక్క-హస్త।తొండములచేత-విన్యస్త।ఉంచఁబడిన-కలభ।ఆఁడుయేనుఁగులచేత- సముత్కీ
ర్ణ।వెస్నగఁ జల్లఁబడిన- కల్హారరజమునన్।కలువపూవులపుప్పొడిచేత- కుంజరీ।ఆఁడుయేనుఁగు పరిచిత।ఉంచఁబడిన-కుముద-కాండంబులన్।క
లువతీఁగలచేత- ఫణిరాజమండన।శివునియొక్క- ప్రభవహించున్।కాంతివహించును.

మేలమాడు। నెదుఱు లేనిగరిమనిభరాజమల్లంబు।వనజగేహాకేళి వ్రాలుచపుడు॥వ॥మఱియు స్తుల। మెఱుఁగు మొగులతోడ మేలమాడు। నెదుఱు లేనిగరిమనిభరాజమల్లంబు ... మేకతోడ మేలమాడు॥ వనజగేహాకేళి వ్రాలుచపుడు॥ వ॥మఱియు నానరోవరలక్ష్మినుదగజేంద్రవివిధవిహారవ్యాకులితనూతనలక్ష్మీవిభవయై *యనంగవిద్యానిరూఢపల్లవప్రబంధపరికంపితశరీరాలంకారయగుకుసుమకోమలియునుంబోలె వ్యాకీర్ణచికురమత్తమధుకరనికరయు, విగతరసవదనకమలయు,నిజస్థానచలితకుచరథాంగయుగళయు,లంపటితజఘనపులినతలయునై యుండెనంత॥సీ॥భుగభుగాయతభూరి ‡బుద్బుదచ్ఛటలతోఁగదలుచుదివికిభంగంబులెగయ।భువనభయంకరఫూత్కారరవమున ఘోరనక్రగ్రాహకోటిబెగడ। వాలవిక్షేపనగ్రాహరజంఝానిలవశమునఘుమఘుమావర్తమడరఁ।గల్లోలజాలసంఘట్టనంబులతటీతరులుమూలంబుతోధరణిఁగూలఁ।¶సరసిలోనుండిపొడగనిసంభ్రమించి। యదరికుప్పించిలంఘించిహుంకరించి।భానుఁగబళించిపట్టుస్వర్భానుపగిది। నెగడివడఁగినకరిఁబట్టె। ¶బొడవడఁగిన కరిఁబట్టె॥ క॥వడిఁదప్పించికరీంద్రుఁడు।నిడుదకరంబెత్తివైవనీరాటంబుం। ¶బొడవడఁగినకరేంద్రుఁడిభరాజు నొడిసిపట్టె॥ క॥వడిఁదప్పించికరీంద్రుఁడు ... ప్లుజలములఁబడికడువడిఁబట్టెఁబూర్వపదయుగళంబుల్॥ చ॥ పదములఁబట్టినందలకుపాటొకయింతయు లేకశూరతన్మగజవల్లభుండుధృతిమంతుఁడుదంతయుగాంతఘట్టనల్।జెదరగఁజిమ్మెనమ్మకరిచిప్పలుపొనులుదప్పనుప్పరల్।వదలి §జలగ్రహంబుకరివాలముమూలముఁజీరెగోరులన్॥ క ॥ కరిఁదిగుచుమకరిసరసికిఁ। గరిదరికినిమకరిఁదిగుచుఁగరకరిబెరయన్।గరిమకరిమకరికింగరి।భరమననిట్లతలకుతలభటులదిరిపడన్॥వ॥ఇట్లుకరిమకరంబులు రెండును నొండొండసమగ్రండతండంబులై తలపడినిఖిల ⑩లోకాలోకనభీకరంబులయియన్యోన్యవిజయశ్రీవశీకరంబులై సంక్షోభితకమలాకరంబులై హరిహరియునుగిరిగిరియునుందాకిపిఱుతివియక పెనంగు తెఱంగుననీరాటంబయినపోరాటంబెట్టుచు వెలికిలోనికిందిగుచుఁగొలంకుకలంకంబందఁగడువడినిట్టట్టుపడితడఁబడకబుడబుడానుకారంబులై భుగులుభుగుల్లనుచప్పళ్లతోనురువులుగట్టుచుజలంబులుప్పరంబునకెగయంజప్పరించుచుఁదప్పకవదనగహ్వరంబులనప్పళించుచునిశితనితాంతమురతదంతకుంతంబులనింతింతలుదునియలై నప్పళంబునఁ బునుకచిప్పలుకుదుళ్లుదప్ప రక్తంబులు గ్రమ్ముదేర హుమ్మనియొక్కొమ్మడింజిమ్ముచునితరేతరసమాకర్షణంబులంగదలక పదంబులు మొదలిపట్టువదలకకుమరైయుండుచుఁ బరిభ్రమణవేగంబునజలంబులందిఱుగుచుమకరకమఠకర్కటగండకమండూకాది సలిలనిలయంబులుప్రాణంబులు క్షీణంబులుగానొకటొకటిందాఁకరభసంబున నికరులువడమ్రగ్గంద్రొక్కుచు మెండుచెడిబెండుపడినాచుగుల్లచిప్పతండంబులఁబరస్పరతాడనంబులకునడ్డంబుగానొడ్డుచునోలమానఁగొనక గెలుపుతలంపులుబెట్టిదంబులై రెట్టింపనహోరాత్రంబులుంబోలెఁగ్రమక్రమవిజృంభమాణంబులై బహుకాలకలహవిహారంబులై నిర్గతనిద్రాహారంబులై యవక్రపరాక్రమఘోరంబులై పోరుచున్నసమయంబున॥క॥‖జవమునుజలమునుబలమును। వివిధములుగఁబోరుకరటివీరతకుభువిన్। దివిమకరమీనకర్కట।నివహములొక్కటనమిత్రనిలయముబొందెన్॥ శా॥‖ఆటోపంబునఁజిమ్మురొమ్మగలవజ్రాభీలదంతంబులన్।దాటించున్ మెడజుట్టిపట్టిహరిదోర్దండాభశుండాహతిన్। నీటన్ మాటికిమాటికిందిగువఁగానీరాటము న్నేటిపోరాటందోటమిపాటుఁజూపుటకరిన్యాటంబువాచాటమై॥అప్పుడు॥గీ॥మకరితోడఁబోరుమాతంగవిభునినో। కరుణింపఁబోవఁగాల్లురాక।కోరిచూచుచుండెఁగుంజరీయూథంబు।మగలుతనులుగారెమగువలకును॥అంత॥గీ॥‖జీవనంబుతనకుజీవనంబై యుంట।నలవుబలమునంతకంతకెక్కి।మకరమొప్పెడస్సెమత్తేభమల్లంబు।బహుళపక్షసీతభానుపగిది॥మ॥ఉరుకుంగుం భయుగంబుపైహరిక్రియన్ హుమ్మంచుఁబాదంబులం।దిఱుగుంగంఠము వెన్నుఁదన్నునెగయున్ హేలాగతిన్వాలముం।జఱుచున్నుగ్గుగఁదాఁకు ముంచుమునుగున్ శల్యంబులుందంతము।ల్వ్రేయుచుఁబొంచిపొంచికదియున్ దండయాధోత్తమున్॥మ॥పొడగానంబడకుండడాఁగు వెలికింబోవంగఁదానడ్డమై। పొడచూపుంజరణంబులంబెనఁగొన్నేదండయాధోత్తమున్॥

* అనంగవిద్యానిరూఢ।కామశాస్త్రమునందు నేర్పరియయిన-పల్లవ।విటకానియొక్క- ప్రబంధ।నాగరాఖ్యమకుట్టాదిబంధములచేత-పరికంపితశరీరాలంకారయగు।చలింపఁజేయఁబడినశరీరాలంకారముగల-కుసుమకోమలియుంబోలెన్। స్త్రీవలెనే- వ్యాకీర్ణచికురమత్తమధుకరనికరయు।అంతటవ్యాపించియున్నమదించినతుమ్మెదగుంపుల నెడువెండ్రుకలుగలదియును- రథాంగ।చక్రవాకపక్షి- లంపటితజఘనపులినతలయును॥ లంపటిత।గాసిపెటఁబడిన- జఘన।పిఱుదులను-పులిన।ఇసుకదిబ్బలయొక్క-తలయున్।ప్రదేశముగలదియును. ‡బుద్బుదఛటలతోన్।బుగ్గలగుంపులతో- దివికిన్।ఆకాశమునకు- భంగంబులు।అలలు. ¶సరసి।కొలను- స్వర్భాను।రాహువు. ¶పొడవడఁగినట్లు।చచ్చినట్లు. §జలగ్రహంబు।మొసలి. †కరకరిబెరయన్।బలాత్కారముగాను. ⑩లోకాలోకన।లోక।జనులయొక్క-ఆలోకన।చూపులకు-పిఱుతివియక।వెనుకఁదీయక-కుంత।బల్లెము-పునుకచిప్పలు।తలపుఱ్ఱెలు-పరిభ్రమణ।సవ్యాపసవ్యములుగాఁ దిరిగెడు-రభసంబున।వేగముచేత- ఓలమానఁగొనక।వెనుకఁదీయక. ‖జవము।వేగము-చలము।హఠము-ఆటోపము।గర్వము-ఱొమ్మగలన్।వక్షముబద్దలగునట్లుగాను- అభీల।భయంకరము. ‖జీవనంబు।జలము-బ్రతుకడము- అలవు।యుక్తి- సీతభానుపగిది।చంద్రునివలె.

నుంబోరాక రా రాక బెగ్గడిలంగూలఁగ దాఁటు లేచుచు జెనుద్ఘాటించుచు లంఘించుచు బ్బెడిజిఁబుందలఁగున్నలంగునొడియున్నే థింమఁగ్రోధించె ముదర్॥ వ॥ ఇట్లు విస్మితవక్రచక్రంబై నిర్వక్రవిక్రమంబున నల్పహృదయజ్ఞానదీపంబు నతిక్రమించు మహామాయాంధకారంబునుం బోలె ననంతకంతకును నుత్సాహకలహసన్నాహబహువిధజలావగాహంబయిన గ్రాహంబును మహాసాహసంబున॥ శా॥ పాదద్వంద్వము నేల మోపి పవనున్ బంధించి పంచేంద్రియోన్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకున్ మారాకుహత్తించి నిష్ఖేదబ్రహ్మపదావలంబనగతిన్ గ్రీడించు యోగీంద్రు మర్యాదన్ నక్రము విక్రమించెఁ గరిపాదాక్రాంతనిర్వక్రమై॥ గీ॥ *వనగజంబు నెగుచు వనచారిఁ బొడగని వనగజంబ కాన వజ్రిగజము వెల్లనైన సురేంద్రు వైచి సుధాంధులఁ బట్టు పట్టనీక బయలు వ్రాకె॥ ఉ॥ ఊహ కలంగి జీవనపు‡ఓలమునం బడి పోరుచున్ మహా మోహలతానిబద్ధపదమున్ విడిపించుకొనంగ లేక సందేహముఁ బొందు దేహిక్రియ దీనదశన్ గజముం డెభీషణ గ్రాహదురంతదంతపరిఘట్టితపాదఖురాగ్రశల్యమై॥ ఇవ్విధంబున॥ క॥ అలయక ¶సొలయక వేసట నొలయక కరి మకరితోడ నుద్దండత రాత్రులు సంధ్యలు దివసంబులు సలిపె నొబ్బరొక్క వేయు సంవత్సరముల్॥ మ॥ పృథుశక్తిన్ గజ మా జలగ్రహముతోఁ బెక్కేండ్లు పోరాడి సంశిథిలంబైతన లావు వైరిబల ముర్జింతింతి దిమిఘ్యామనోరథ మింకేటికి దీని గెల్వ సరిపోరం జాలరాదంచు న వ్యథమై యిట్లనుఁ బూర్వపుణ్యఫలదివ్యజ్ఞానసంపత్తితోన్॥ శా॥ ఏ రూపంబున దీని గెల్తు నిటమీఁ దే వేల్పుఁ జింతింతు నె వ్వారిం జీరుదు నెవ్వ రడ్డ మిఁక నివ్వారిప్రచారోత్తము న్వారింపం దగువార లెవ్వ రఖిలవ్యాపారపారాయణుల్ లేరే మ్రొక్కెదఁ దిక్కుమాలిన మొఱాలింపం బ్రపుణ్యాత్మకుల్॥ శా॥ నా †నానేకపయోధముల్ వనములో నం బెద్దకాలంబునన్ స్నానింపన్ దశలక్షకోటికరిణీనాథుండనై యుండి మద్దానాంభఃపరిపూర్ణచందనలతాంతచ్ఛాయలం దుండలే కీనీరాశికి నేల వచ్చితి భయం బెట్లోకదే యీశ్వరా॥ ఉ॥ ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపల నుండు ‖లీనమై యెవ్వని యందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వముఁ దానయైన వాఁ డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్॥ క॥ §ఒకపరి జగములు వెలినిడి యొకపరి లోపలికిఁ గొనుచు నుభయముఁ దానై సకలార్థసాక్షి యగు న య్యకలంకుని నాత్మమూలు నర్థిఁ దలంతున్॥ క॥ లోకంబులు లోకేశులు లోకస్థులుఁ దెగినతుదిని లోకంబగు పెంజీఁకటికవ్వల నెవ్వఁడు నేకాకృతి వెలుఁగు నతని నే సేవింతున్॥ క॥ నర్తకుని భంగిఁ బెక్కగు మూర్తులతో నెవ్వఁ డాడు మునులున్ దివిజుల్ కీర్తింప నేర రెవ్వని వర్తన మొరు లెఱుఁగ రట్టివాని నుతింతున్॥ గీ॥ ముక్తసంగులైన మునులు ‡దిదృక్షులు సర్వభూతహితులు సాధుచిత్తు లసదృశవ్రతాఢ్యులై కొల్తు రెవ్వని దివ్యపదము వాఁడు దిక్కు నాకు॥ సీ॥ ¶భవము దోషంబు రూపంబు కర్మంబు నాహ్వయమును గుణము లెవ్వనికి లేక జగములఁ గలిగించు సమయించు కొఱకునై నిజమాయ నెవ్వఁ డిన్నియును దాల్చు నా పరేశునకు ననంతశక్తికి బ్రహ్మకిద్ధరూపికి రూపహీనునకును జిత్రచారునకు సాక్షికి నాత్మరుచికిని బరమాత్మునకుఁ బరబ్రహ్మమునకు। మాటల నెఱుకల మనముల జ్జేరంగఁ గాని శుచికి సత్త్వగమ్యుఁడగుచు నిపుణుఁడైనవాని నిష్కర్మతకు మెచ్చు వానికే నొనర్తు వందనములు॥ సీ॥ శాంతున ‖కపవర్గసౌఖ్యసంవేదికి నిర్వాణభర్తకు నిర్విశేషునకు ఘోరునకు మూఢునకు గుణధర్మికి సౌమ్యున కధికవిజ్ఞానమయున కఖిలేంద్రియద్రష్టకధ్యక్షునకు బహుక్షేత్రజ్ఞునకు దయాసింధుమతికి మూలప్రకృతి కాత్మమూలున కఖిలేంద్రియజ్ఞాపకునకు దుఃఖాంతకృతికి నెఱిన సత్యము నెడినీడతో వెలుఁగుచు నుండు నేకటికిని నుత్తమునకు। నిఖిలకారణునకు నిష్కారణునకు నమస్కరింతు నన్ను మనుచు కొఱకు॥ క॥ యోగాగ్నిదగ్ధకర్ములు యోగీశ్వరులే మహాత్ము నొండెఱుఁగక సద్యోగవిభాసితమనములఁ బాగుగ వీక్షింతు రట్టి పరము భజింతున్॥ సీ॥ సర్వాగమామ్నాయజలధికి నపవర్గమయునికి నుత్తమమందిరునకు సకలగుణారణిచ్ఛన్నబోధాగ్నికిఁ దనయంతఁ రాజిల్లు ధన్యమతికి గుణలయోద్దీపితగురుమానసునకు సంవర్తితకర్మనిర్వర్తితునకు దిశలేని నాబోఁటి పశువుల పాపంబు లడఁచు వానికి సమస్తాంతరాత్ముఁడై వెలుంగు వాని కచ్ఛిన్నునకు భగవంతునకుఁ దనూజపశుదేశదారసక్తులయినవారికిఁ గందఁగరాని వానికాచరింతు వందనములు॥ మఱియును॥ సీ॥ వరధర్మకామార్థవర్జితకాములై విబుధు లెవ్వాని సేవించి యిష్టగతిఁ బొందుచుందురు చేరి కాంక్షించు వారి కవ్యయదేహ మిచ్చు నె

* వనగజంబున్ = అడవియందు సంచరించెడు గజేంద్రమును - ఎగుచు వనచారిన్ = బాధించుచున్న మొసలిని - పొడగని = చూచి - వజ్రిగజము = ఐరావతము - వనగజంబ కానన్ = జలమందుద్భవించిన యేనుఁగు గాఁబట్టి - వెల్లనై = భయముచేత తెలతెలపోయినదై - సురేంద్రు వైచి = ఇంద్రునిఁ గ్రిందఁబడఁద్రోసి - సుధాంధులన్ = దేవతలయొక్క - పట్టుఁబట్టనీక = బంధనమునకులోఁబడక - బయలు వ్రాకె = నలుదిక్కులకుఁ బరుగెత్తెను. ‡ఓలము = మడుఁగు - చాటు ¶సొలయక = నిస్త్రాణపడక. †అనేకపయాధములు = ఏనుఁగులగుంపులు, లతాంత = పుష్పము. ‖లీనమై = కనుపడనిదై. డిందున్ = లయమగును. §ఒకపరి = ఒకతేప. ‡దిదృక్షులు = భగవంతునిఁ జూడనిచ్ఛగలవారు. ¶భవము = జన్మము. ‖అపవర్గసౌఖ్యసంవేదికిన్ = మోక్షసుఖము నెఱిఁగినవానికి, నిర్వాణభర్తకున్ = మోక్షనాయకునికి.

ష్వాఁడు గరుణ। ముక్తాత్ము లెవ్వని మునుకొని చింతింతు రానందవార్ధి మగ్నాంతరంగు। లేకాంతు లెవ్వని నేమియుఁ గోరక భద్రచరిత్రంబుఁ బాడుచుండు। రానుపేక్షు నాద్యు నవ్యక్తు నతిసూక్ష్మధ్యాత్మ। యోగగమ్యుఁ బూర్ణు నున్న తాత్ము। బ్రహ్మమయిన వానిఁ బరుని నతీంద్రియు। నీశు స్థూలసూక్ష్ము నేభజింతు॥ అని మఱియు నిట్లని వితర్కించె॥ సీ॥ *పావకుం డర్చుల భానుండు దీప్తుల నెట్లు పింగి నిగుడించు రెట్లడంచు। రాక్రియ నాత్మకరావళి చేత బ్రహ్మాదుల వేల్పుల నఖిలజంతు। గణముల జగముల ఘన నామరూప భేదములతో మెఱయించి తగనడంచు। నెవ్వఁడు మనము బుద్ధీంద్రియములుదాన యైగుణ సంప్రవాహంబుఁ బర పుఁ(స్త్రీ)నపుంసకపురుషమూర్తియును గాక। తిర్యగమర నరాదిమూర్తియును గాక। కర్మగుణభేదసదసత్ప్రకాశి గాక। వెనుకఁ నన్నియుఁ దానగు విభుఁ దలంతు॥ క॥ కలఁ డందురు దీనులయెడఁ। గలఁ డందురు పరమయోగిగణముల పాలం। గలఁ డందుర న్నిదిశలను। గలఁడు గలం డనెడువాఁడు గలఁడో లేఁడో॥ సీ॥ కలుగఁడే నాపాలి కలిమిసందేహించి కలిమి లేములు లేక గలుగువాఁడు। నాకడ్డపడ రాఁడె నలిన సాధువుల చేఁబడిన సాధుల కడ్డపడెడువాఁడు। చూడఁడే నాపాటుఁ జూపులఁ జూడక చూచువారల కృపఁ జూచువాఁడు। లీలతో నా మొఱాలింపఁడే మొఱఁగుల మొఱ లెఱుంగుచుఁ దన్ను మొఱఁగువాఁడు। నఖిలరూపులు దనరూపమైనవాఁడు। నాదిమధ్యాంతములు లేక నడరువాఁడు। భక్తజనములదీనుల పాలివాఁడు। వినఁడె చూడఁడె తలఁపఁడె వేగరాఁడె॥ క॥ విశ్వకరు విశ్వదూరుని। విశ్వాత్ముని విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్। శాశ్వతు నజు బ్రహ్మప్రభు। నీశ్వరు సింబర మపురుషు నే భజియింతున్॥ వ॥ అని పలికి తన మనంబున నగ్గజేంద్రుం డీశ్వర సన్నిధానంబు గల్పించుకొని యిట్లని యె॥ శా॥ లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులుం। ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడి। నీ వే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపందగున్ దీనునిన్। రావే యీశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా॥ క॥ వినుదటఁ జీవుల మాటలఁ। జనుదటఁ జనరాని చోట్ల శరణార్థులకో। యనుదటఁ బిలిచిన సర్వముఁ। గనుదటఁ సందేహ మయ్యెఁ గరుణావార్ధీ॥ మ॥ ఒకపుఁ బూజకు యోవరద యోప్రతిపక్ష విపక్షదూరకు। యో కవియోగివంద్య సుగుణోత్తమ యోశరణాగతామరా¶నోకహ యోమునీశ్వర మనోహర యోవిమలప్రభావ రా। వే కరుణింప వే తలఁప వే శరణార్థి ననుం గావవే॥ వ॥ అని పలికి మఱియు నరక్షితరక్షకుండయిన యీశ్వరుం డాపన్నుండయిన నన్నుం గాచుఁ గాక యని నింగి(నిక్కి) చూచుచు నిట్టూర్పులు నిగుడించుచు బయలాలకించుచు నగ్గజేంద్రుండు మొఱసేయుచున్న సమయంబున॥ గీ॥ విశ్వమయత లేమి వినియు నూరకయుండి। రంబుజాసనాదు లడ్డపడక। విశ్వమయుఁడు విభుఁడు విష్ణుండు జిష్ణుండు। భక్తియుతున కడ్డపడఁ దలంచి॥ మ॥ అల వైకుంఠపురంబులో నగరిలో నామూల సౌధంబు దా। పల మందారవనాంతరామృతసరఃప్రాంతేందుకాంతోపలో।త్పల పర్యంక రమావినోది యగు నాపన్నప్రసన్నుండు వి।హ్వల నాగేంద్రము పాహిపాహి యనఁ గుయ్యాలించి సంరంభియై॥ మ॥ సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁడే। పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁడా కర్ణికాంతరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాదప్రోద్ధత శ్రీకుచోపరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై॥ వ॥ ఇట్లు భక్తజనపాలనపరాయణుండును, నిఖిలజంతుహృదయారవిందసదనసంస్థితుండును నగు నారాయణుండు కరికులేంద్ర విజ్ఞాపిత నానావిధ దీనాలాపంబు లాకర్ణించి లక్ష్మీకాంతావినోదంబు లందని పిసాలించి సంభ్రమించి దిశలు నిరీక్షించి గజేంద్రరక్షాపరత్వంబు నంగీకరించి నిజపరికరంబు మఱల నవధరించి గగనంబున కుద్గమించి వేంచేయునప్పుడు॥ మ॥ తన వెంటన్ సిరి లచ్చి వెంట నవరోధవ్రాతము న్దాని వె।న్కను బక్షీంద్రుఁడు వాని పొంతను ధనుఃకౌమోదకీ శంఖచక్రనికాయంబును నారదుండు ధ్వజినీకాంతుండు దావచ్చిరొ। య్యన వైకుంఠపురంబునం గలుగువారాబాలగోపాలమున్॥ వ॥ తదనంతరంబ ముఖారవిందమకరందబిందుసందోహపరిష్యందమానానందదిందిందిరయగు నయ్యిందిరాదేవి గోవిందకరారవిందసమాకృష్యమాణసంవ్యానచేలాంచలయై పోవుచు॥ మ॥ తన వేంచేయుపదంబుఁ బేర్కొనఁడనాథస్త్రీజనాలాపముల్ వినెనో మ్రుచ్చులు మ్రుచ్చిలించిరొ ఖలుల్ వేదప్రపంచంబుల। న్దనుజానీకము దేవతానగరిపైదండెత్తెనో భక్తులం। గనిచక్రాయుధుఁ డేడి చూపుఁడని ధిక్కరించిరో దుర్జనుల్॥ అని వితర్కించుచు॥ శా॥ తాటంకాచల

---

అధ్యాత్మయోగగమ్యున్। జ్ఞానయోగగోచరుఁడైన వానికిని. *పావకుండర్చులన్॥ పావకుండు। అగ్నిహోత్రుఁడు, అర్చులన్। జ్వాలలను. ¶అమరానోకహ। కల్పవృక్షము. నింగి। ఆకాశము. అభ్రగపతిం బన్నింపఁడు। గరుత్మంతుని గమనమునకాయత్తునిఁగా జేయఁడు. ఆకర్ణికాంతరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు। కర్ణాభరణపర్యంతము వ్రేలాడుచున్న కొప్పును చక్కఁగనవరించికొనఁడు— అనగా వేలాడు సిగను ముడివేసికొనఁడు, వివాదప్రోద్ధత శ్రీకుచోపరిచేలాంచలమైనవీడఁడు। ప్రణయకలహము చేతఁబట్టుకొనఁబడిన లక్ష్మీదేవి స్తనములమీఁది వస్త్రము నైన వదలఁడు— అనఁగా లక్ష్మీదేవి పైఁట నైనవిడువఁడు, గజప్రాణావనోత్సాహియై। ఏనుఁగు యొక్క ప్రాణరక్షణమందు సంతోషము గలవాఁడై. అవరోధవ్రాతమున్। అంతఃపుర స్త్రీజనమును. ధ్వజినీకాంతుండు। సేనానాయకుండైన విష్వక్సేనుఁడు. తాటంక। కమ్మలు,

నంబుతో భుజనటద్ధమ్మిల్లబంధంబుతో । శాటీముక్తకుచంబుతో నదృఢచంచత్కాంచితో శీర్ణలా । లాటాలేపముతో మనో
హరకరాలగ్నోత్తరీయంబుతోఁ । గోటీందుప్రభతో నురోజభరసంకోచద్విలగ్నంబుతోన్ ॥ క ॥ అడిగెదనని కడువడిఁ జను । న
డిగినఁ దను మగుడ నుడువఁడని నడయుడుగున్ । ||| వెడ వెడఁ జిడిముడిఁ దడఁబడ । నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్ ॥
సీ ॥ ¶ నిటలాలకములంటి నివురు జుంజుమ్మని ముఖసరోజము నిండ ముసరు తేంట్లు । నళులఁ జోపఁగఁ జిల్కలల్లనల్లనఁ జేరి యోష్ఠ
బింబద్యుతులు డాయ నులుకు । శుకములఁ దోలఁ జకోర్మి నములకు మందాకినీపాఠీనలోక మెసఁగు । మీనపక్షులు దాఁటి మెయి
దీఁగె తోఁ రాయ శంపాలతలు మింట సరణిగట్టు । శంపలను జయింపఁ జక్రవాకంబులు । కుచయుగంబుఁ దాఁకి క్రొవ్వుఁ జూపు । మె
లఁత మొగులపిఱుఁది మెఱుఁగుదీఁగె యుఁబోలె జలదవర్ణు వెనుకఁ జరుగునపుడు ॥ వ ॥ వినుపీధిం జనుదేరఁ గాంచి గరుడుల్ విష్ణు
స్సురారాతిజీవనసంపత్తినిరాకరిష్ణుఁ గరుణావర్ధిష్ణు యోగీంద్రహృ । ద్వనవర్తిష్ణు సహిష్ణు భక్తజనబృందప్రాభవాలం
కరిష్ణు నవోఢోల్లసదిందిరాపరిచరిష్ణున్ జిష్ణు రోచిష్ణునిన్ ॥ ఇట్లు పొడగని ॥ మ ॥ చనుదెంచెన్ ఘనుఁ డల్లవాఁడె హరి పజ్జం
గంటిరే లక్ష్మి శంఖనినాదంబదె చక్రమల్లదె భుజంగధ్వంసియున్ వాఁడె † క్ర । న్నన నేతెంచె నటంచు వేల్పులు నమో నా
రాయణాయేతి నిస్స్వనులై మ్రొక్కిరి మింట హస్తిపురవస్థావక్రికిం జక్రికిన్ ॥ వ ॥ అయ్యవసరంబున (§) కుంజరేంద్రపాల
నపారవశ్యంబున దేవతానమస్కారంబు లంగీకరింపక మనస్సమాన సంచారుండై పోయిపోయి కొంతదూరంబున శింశు
మారచక్రంబునుం బోలె గురుమకరకులీరమీనమిథునంబై కిన్నరేంద్రుని భాండాగారంబునుం బోలె స్వచ్ఛవర కచ్ఛపం
బయి భాగ్యవంతుని భాగధేయంబునుం బోలె సరాగజీవనంబయి వైకుంఠపురంబునుం బోలె శంఖచక్ర కమలాలంకృతం
బై సంసారచక్రంబునుం బోలె ద్వంద్వసంకులపంకసంకీర్ణంబయి యొప్పు నప్పంకజాకరంబుఁ బొడగని ॥ మ ॥ కరుణాసిం
ధుఁడు శౌరి వారిచరమున్ ఖండింపఁగాఁ బంపె నత్వరితాకంపితభూమిచక్రము మహోద్యద్విస్ఫులింగచ్ఛటా । పరిభూ
శితాంబరశుక్రమున్ బహువిధబ్రహ్మాండభాండచ్ఛటాం । తరనిర్వక్రముఁ బాలితాఖిలసుధాంధశ్చక్రముం జక్రమున్ ॥
ఇట్లు పంచిన ॥ శా ॥ అంభోజాకరమధ్యనూతననళిన్యాలింగనక్రీడనా । రంభుండైన వెలుంగుఱేని చెలువారన్ వచ్చి
నీటన్ గుభుల్గుంభధ్వానముతోఁ గొలంకువు కలంకంబొందఁగా జొచ్చి దుష్టాంభోవర్తి వసించు * చక్కటికి డాయంబోయి
హృద్వేగమై ॥ శా ॥ భీమంబై తలఁ ద్రుంచి ప్రాణములఁ బాపెం జక్రమాశుక్రియన్ । ‡ హేమక్ష్మాధరదేహముం జకితవన్యే
భేంద్రసందోహముం । గామక్రోధనగేహమున్ గరటిరక్తస్రావగాహంబుని । స్సీమోత్సాహము వీతదాహము జయశ్రీ
మోహమున్ గ్రాహమున్ ॥ వ ॥ ఇట్లు నిమిషస్పర్శనంబున సుదర్శనంబు మకరి తలఁ ద్రుంచు నవసరంబున ॥ క ॥ మకర మొకటి ర
విఁ జొచ్చెను । మకరము మఱియొకటి ధనదు మాటున డాఁగెన్ । మకరాలయమున దిరిగెడు । మకరంబులు కూర్మరాజు మఱు
వునకరిగెన్ ॥ మ ॥ తమముం బాసిన రోహిణీవిభుక్రియన్ దర్పించి సంసారమః । ఖము వీడ్కొన్న విరక్తచిత్తుని గతిన్ గ్రా
హంబు పట్టూడ్చి పాదములల్లార్చి కరేణుకావిభుఁడు సౌందర్యంబుతో నొప్పెసం । భ్రమదాశాకరిణీకరోజ్ఝితసుధాంభ
స్స్నానవిశ్రాంతుఁడై ॥ శా ॥ పూరించెన్ హరి పాంచజన్యముఁ గృపాంభోరాశిసౌజన్యము । న్భూరిధ్వానచలాచలీకృతమ
హాభూతప్రచైతన్యము । న్సారోదారసితప్రభాచకితపర్జన్యాదిరాజన్యమున్ । దూరీభూతవిపన్నదైన్యము నిర్ధూతద్వి
షత్సైన్యమున్ ॥ మ ॥ మొఱసె న్నిర్జరదుంధుభుల్ జలరుహామోదంబులై వాయువుల్ । దిరిగెన్ పువ్వుల వాన జల్లుగురిసెన్ దేవాంగ
నాలాస్యముల్ వరగెన్ దిక్కరియందు జీవజయఘేలధ్వానముల్ నిండె సా । గరముప్పొంగెఁ దరంగచుంబితనభోగంగాము
ఖాంభోజమై ॥ క ॥ నిడుదయగు కేలఁ గజమును । మడువున వెడలంగఁ దిగిచి మదజలరేఖల్ । దుడుచుచు మెల్లనఁ బుడుకుచు । నుడిపె
న్విష్ణుండు దుఃఖ ముర్వీనాథా ॥ క ॥ శ్రీహరిసంస్పర్శనమున । దేహము దాహంబుమాని ధృతిఁ గరిణీసం । దోహము నుదానుగజ
పతి । మోహనఘీంకారశబ్దములతో నొప్పెన్ ॥ క ॥ కరమున మెల్లన నివురుచుఁ । గరమనురాగమున మెఱసి కలయన్ బడుచున్

---

నటత్ । కదలుచున్న, శాటీముక్తకుచంబుతోన్ । వస్త్రము చేత విడువఁబడిన స్తనములతోడను, అదృఢచంచత్కాంచితోన్ ॥ అదృఢ । వీడిపోవు
చున్న, చంచత్ । కదలుచున్న, కాంచితోన్ । ఒడ్డాణముతోడను, శీర్ణలాలాటాలేపముతోన్ ॥ శీర్ణ । చెదరిన, లాలాట । నొసటియందలి, ఆలేప
ముతోన్ । తిలకముతోడను, లగ్న । తగులుకొనిన, ఉరోజభరసంకోచద్విలగ్నంబుతోన్ ॥ ఉరోజ । స్తనముల యొక్క. భర । బరువుచేత, సంకోచత్ ।
వంగుచున్న, విలగ్నంబుతోన్ । నడుముతోడను. ||| వెడవెడన్ । తిన్నతిన్నఁగా, చిడిముడి । తొందరపాటుచేత. ¶ నిటల । నొసలు. అళులన్ । తుమ్మె
దలను, పాఠీన । మత్స్యము, శంపాలత । తీఁగె మెఱుపు, శంపలన్ । మెఱుపుతీఁగెలను. మొగులు । మేఘము, పిఱుఁది । వెనుకనుండెడు. † క్రన్నన్ । వేగ
ముగా. (§) కుంజరేంద్ర । గజేంద్రము. శితాంబరశుక్రమున్ । సూర్యుఁడు గలదియును. * చక్కటి ॥ దిక్కు । డాయన్ - సమీపించునట్లు ‡ హేమ
క్ష్మాధర । మేరుపర్వతము, చకితవన్యేభేంద్రసందోహమున్ ॥ చకిత । భయపెట్టబడిన, వన్యేభేంద్ర । శ్రేష్ఠములయిన అడవియేనుఁగుల యొక్క,
సందోహమున్ । గుంపు గలదియును. రోహిణీవిభుక్రియన్ । చంద్రునివలె.

గనిహరిక్షతమున బ్రకుసుచుఁ|గరపీడనమాచరించెఁ గరిణులనుఅలర॥ సీ॥ జననాథ దేవలశాపవిముక్తుఁడై పటుతరగ్రాహ
రూపంబుమాని| ఘనుఁడు హాహా నామగంధర్వుఁడప్పుడు తనతొంటి నిర్మలతనువుఁ దాల్చి|హరికి నవ్యయునకు నతిభక్తి
తో మ్రొక్కి గవిలిగీర్తించి గీతములఁ బాడి|యా దేవు కృపనొంది యందంద మఱియును వినతశిరస్కుఁడై వేడ్కతోడ|దళితపా
పుఁడగుచుఁ దనలోకమున కేగె| నపుడు శౌరి కేలనంటనడువ|హస్తిలోకనాథుఁ డజ్ఞానరహితుఁడై|విష్ణురూపుఁడగుచు వెలు
ఁగుచుండె॥ ము॥ అవనీనాథ గజేంద్రుఁ డామకరితో నాలంబు గావించె ము॥ ద్రవిళాధీశుఁడతండు పుణ్యతముఁ డింద్రద్యు
మ్న నాముండు వై|ష్ణవముఖ్యుండు గృహీతమౌననియతిన్ సర్వాత్మునారాయణు| న్నవిశేషంబుగఁ బూజఁ జేసెను మహాశై
లాగ్రభాగంబునన్॥ ము॥ ఒకనాఁ డానృపుఁ డచ్యుతున్మనములో నూహించుచున్ మౌనియై|యకలంకస్థితినున్నచోఁ గలశ
జుండవ్వేటికిన్ వచ్చి లేవక పూజింపక యున్నమానిఁ గని నవ్యక్రోధుఁడై మూఢలు|బ్ధ రీంద్రోత్తమయోనిఁ బుట్టుమనిశా
పంబిచ్చె భూవల్లభా॥ క॥ మునిపతి నవమానించిన| ఘనుఁ డింద్రద్యుమ్నవిభుఁడు కుంజరయోనిం| జననంబందెను విప్రు
లఁ|గని యవమానింపఁదగదు ఘనపుణ్యులకున్॥ క॥ కరినాథుఁ డయ్యె నాతఁడు| కరులైరి భటాము లెల్ల గజమైయుండిన్|హ
రిచరణసేవకత్వమునఁ|గరివరునకు నధికముక్తి గలిగె నరేంద్రా॥ గీ॥ కర్మతంత్రుఁడగుచుఁ గమలాక్షుఁ గొల్చుచు|నుభయని
యతవృత్తినుండ నేనిఁ|జెడును గర్మమెల్ల శిథిలమై మెల్లనఁ|బ్రబలమయిన విష్ణుభక్తి చెడదు॥ క॥ చెడుఁ గరులు హరులు ధనము
లు| చెడుదురు నిజసతులు సుతులు చెడుచెనఁటులకు| నైడక మను నెఱసుగుణులకుఁ|జెడనిపదార్థములు విష్ణుసేవానిరతుల్॥
వ॥ అప్పుడు భుజగజ్జనకుండగు నప్పరమేశ్వరుండు దరహసితముఖకమలయగు నకమలకిట్లనియె॥ క॥ బాలా నా వెనువెంటను|
హేలన్ విను వీధినుండియేతెంచుచు నీ| చేలాంచలంబుఁ బట్టుట| కాలో నేమంటి నన్ను నంభోజముఖీ॥ క॥ మెఱుఁగుదు తెర
వా యిప్పుడు|మఱువను సకలంబు నన్ను మఱచినయెడల|న్మఱుఁగు నని యెఱిఁగి మొఱఁగక| మఱువక మొఱయిడిరి యేని మఱి
యన్యములన్॥ వ॥ అనిపలికిన నరవిందమందిరయగు నయ్యిందిరాదేవి మందస్మితచంద్రికావదనారవిందయగుచు ముకుందు
నకిట్లనియె॥ క॥ దేవా దేవర యడుగులు|భావంబున నిలిపికొలుచు పని నాపని గా|కోవల్లభ యేమనియెద| నీ వెంటన వచ్చు
చుంటి నిఖిలాధిపతీ॥ క॥ దీనులకు య్యాలింపను|దీనుల రక్షింప మేలు దీవెనఁ బొందన్|దీనావన నీకొప్పును|దీనపరాధీన దేవ దే
వను హేశా॥ వ॥ అని మఱియును సముచితసంభాషణంబుల నంకించుచున్న పరమవైష్ణవీరత్నంబును సాదర సరససల్లాప
మందహాసపూర్వకంబుగా నాలింగనంబు గావించి సపరివారుండై గంధర్వసిద్ధవిబుధగణ జేగీయమానుండై గరుడారూ
ఢుండగుచు నిజసదనంబునకుం జనియెనని చెప్పి శుకయోగీంద్రుండిట్లనియె॥ సీ॥ నరనాథ నీకును నాచేత వివరింపఁబడిన యీ
కృష్ణానుభావమైన|గజరాజమోక్షణకథ విను వారికి యశము లిచ్చును గల్మషాపహంబు| దుస్స్వప్ననాశంబు దుఃఖసంహా
రంబు ప్రొద్దున మేల్కాంచి పూతవృత్తి|నిత్యంబుఁ బఠియించు నిర్మలాత్మకులైన విప్రులకును బహువిభవ మమరు| సంపద
లుగల్గుఁ బీడలు శాంతిఁ బొందు|సుఖము సిద్ధించు వర్ధిల్లు శోభనములు| మోక్షమఱచేతిదయ్యెండు ముదము చేరు ననుచు విష్ణుం
డు ప్రీతుఁడై యానతిచ్చె॥ వ॥ అనిమఱియు నప్పరమేశ్వరుండిట్లని యానతిచ్చె నెవ్వారేనియు నపరరాత్రంబున మేల్కాం
చి సమాహితమనస్కులై శ్వేతద్వీపంబును, నాకుం బ్రియంబైన సుధాసాగరంబును, హేమనగంబును, నిగ్గిరికందర కాన
నంబులను; వేత్రకీచక వేణులతాగుల్మ సురపాదపంబులను, ఏనును బ్రహ్మయు ఫాలలోచనుండును నివసించియుండు ని
క్కొండశిఖరంబులను, కౌమోదకీకౌస్తుభసుదర్శనపాంచజన్యంబులను, శ్రీదేవిని శేషగరుడవాసుకిప్రహ్లాదనారదాది
ఋషులను, మత్స్యకూర్మవరాహాద్యవతారంబులను, తదవతారకృత కార్యంబులను, సూర్యసోమపావకులను, ప్రణవంబు
ను, ధర్మతపస్సత్యంబులను, వేదంబును, వేదాంగంబులను, శాస్త్రంబులను, గోభూసురసాధుపతివ్రతాజనంబులను, చంద్ర
కాశ్యపజాయాసముదయంబును, గౌరీగంగాసరస్వతీకాళిందీసునందాప్రముఖపుణ్యతరంగిణీనిచయంబును, నమరుల
ను, నమరతరువులను, నైరావతంబును, నమృతంబును, ధ్రువుని, బ్రహ్మర్షినివహంబును, బుణ్యశ్లోకులయిన మానవులను, స
మాహితచిత్తులై తలంచువారలకుఁ బ్రాణావసానకాలంబున మదీయంబగు విమలగతి నిత్తునని హృషీకేశుండు నిర్దేశించి శం
ఖంబు పూరించి విహగపరివృఢవాహనుండయి వేంచేసె విబుధానీకంబు సంతోషించె నని చెప్పి శుకుండు రాజునకిట్లనియె॥
క॥ గజరాజమోక్షణంబును|నిజముగఁ బఠియించునట్టి నియతాత్ములకున్|గజరాజవరదుఁ డిచ్చును|గజతురగస్యందనములు
గైవల్యంబున్॥ క॥ తామసుతమ్ముఁడు రైవత|నామకుఁడై వెలసె మనువు నలువుర మీఁద|న్భూమికిఁ బ్రతివింధ్యార్జున|నామా
దులు నృపులు మనువునందనులు నృపా॥ సీ॥ మునులు హిరణ్యరోముఁడు నూర్ధ్వబాహుండు వేదశీర్షుండును వీరు మొదలు| న

* కలశజుఁడు|అగస్త్యమహర్షి. † అంకించుచున్న|ఊనిపలుకుచున్న. ‡ సమాహితమనస్కులై|నిశ్చలచిత్తులై,

మరులుభూతరధామములుశుభ్రనివత్ని వైకుంఠాఖ్యపరమసాధ్వి। యాయుద్ధరకుఁబుత్రుఁడైతనకళలతో నైకుంఠుడనఁబు ట్టివారిజాక్షుఁ। డవనిపై వైకుంఠమునియెడిలోకంబుఁగల్పించె నెల్లలోకములు మ్రొక్క । రమయెమరోక్తులుచేకొనె రాజముఖ్య। తదను భావగుణంబులుదలఁపఁదరమె। యీధరారేణుపటలంబు నెఱుఁగవచ్చుఁగానిరాదయ్యహరిగుణగణ ముసంఖ్య॥తదనంతరంబ॥సీ॥ చక్షుస్తనూజుండుచాక్షుషుండనువీరుఁడాఱవమనువయ్యెనవనినాథ। భూమీశ్వరులుపు రుఃపురుషసుద్యుమ్నాదులాతనినందనులమరవిభుఁడు। మంత్రద్యుమాఖ్యుఁడమర్త్యులాప్యాదికులాహవవృషభీకరాది ఘనులు। మునులంనువిభుఁడుసంభూతికి నాత్మజుండై పుట్టి యజితుండు నాఁగనొప్పె। నతడకాఁడెకూర్మమైమందరాద్రి నినుదధిజలములోననుండిమోసె।నతఁడమువ్వేదిపిజులర్థింపనమృతాబ్ధిఁ।ద్రచ్చియిచ్చెనాసుధారసంబు॥వ॥అనిపలికినం

——⊰ శ్రీ క్షీరసాగరమథనకథాప్రారంభము. శ్రీ ⊱——

బరీక్షిన్నరేంద్రుండమునీంద్రునకిట్లనియె॥ వ ॥ వినుమున్నేటికిఁద్రచ్చెపాలకడలిన్విష్ణుండుగూర్మాకృతి। న్వనధింజొ చ్చియదెట్లుమోసెబలుకవ్వంబైన శైలంబుదే। వనికాయంబమృతంబు నెట్లువడసెన్వారాశినేమేమిసం। జనితంబయ్యె మునీంద్రచోద్యముగదాసర్వంబుఁజెప్పంగదే॥క॥అప్పటినుండిబుధోత్తమ। చెప్పెడుభగవత్కథావిశేషంబులనా। కెప్ప డుడదనివిజనింపము। సెప్పఁగదేచెవులునిండశ్రీహరికథలన్॥ వ॥ అనిమఱియునడుగంబడినవాఁడై యతనినభినందించి హరి ప్రసంగంబుచెప్పనుపక్రమించెననిసూతుండుద్విజులకిట్లనియెనట్లుశుకుండురాజుంజూచి॥క॥ *కసిమసఁగియసురవిసర ము।లసిలతికలసురలనెగువనసువులువెడలం।బసచెడిరిపడిరిగెడసిరి।యసమసమరవిలసనములనసమెడలిన్నృపా॥ క॥ సుర పతివరుణామలతో।సురమునులుంగొలువఁగడలిసురశైలముపై।సురనుతుఁడగునజుఁగాంచిరి। సురచుమ్మృతిఁజెప్పిరపు డుసొలయుచునతులై॥క॥ దుర్వాసుశాపవశమున।నిర్వీర్యతజగములెల్లనిశ్శ్రీకములై।పర్వతరిపుతోఁగూడజ్ఞాన।పర్వతమై యుండెహతసుపర్వావళులై॥గీ॥ నెలవువెడలియున్ననిస్తేజులైనట్టి। వేల్పుగములఁజూచి వేల్పుపెద్ద।పరమపురుషుఁదలఁచి ప్రణతుఁడైసంఫుల్ల।పద్మవదనుఁడగుచుఁబలికెఁదెలియ॥క॥ ఏనునుమీరును గాలము।మానవతిర్యఙ్నరద్రుమస్వేదజము। ల్మానుగనెవ్వనికళలము। వానికిమ్రొక్కెదముగాకవగవఁగనేలా॥క॥ ఆద్యుండురక్షకుండున। నాద్యుఁడుమాన్యుం డులోకసర్గత్రాణాం।తాద్యాదులొనర్చనతం।డాద్యంతవిధానములకునర్హుఁడుమనకున్॥క॥వరదునిఁబరముజగద్గురుఁ। గరుణాపరతంత్రుమనముగనుఁగొనదుఃఖ।జ్వరములుచెడుననిసురలకుఁ।బగగఁగఁబద్మజుఁడుసెప్పిపరమప్రీతిన్॥వ॥ అం తఁదానును,దేవతాసమూహంబును,నతిరయంబునంజనిపినయంబునఁగానంబడనియవ్విభునుద్దేశించిదైవికంబులగువచ నంబులనియతేంద్రియులయియిట్లనిస్తుతియించిరి ॥ సీ ॥ ఎవ్వనిమాయకునింతయుమోహించుఁదరిమియెవ్వనిమాయ దాఁటరాదు। తనమాయనెవ్వఁడింతయుఁగెల్చెనెవ్వాఁడునెవ్వనిఁబొడగానరెట్టిమునులు। సర్వభూతములకుసమ వృత్తినెవ్వఁడుచరియించునతఁడెపోజనితమయిన। ధరణిపాదములుచిత్తముసోముఁడగ్నిముఖంబునుగన్నులుకమలహి తులు। చెవులుదిక్కులురేతంబుసిద్ధజలము।మూఁడుమూర్తులపుట్టిల్లుమొదలినెలవు। గర్భమఖిలంబుమూర్ధ్నంబుగగన మగుచు। మలయునెవ్వనివానినమస్కరింతు ॥ వ ॥ మఱియునెవ్వనిబలంబున మహేంద్రుండును, బ్రసాదంబునదే వతలును, గోపంబునరుద్రుండును, బరుషంబునవిరించియు,నింద్రియంబులవలన వేదంబులుమునులును, మేఢ్రంబునఁ బ్రజాపతియు, వక్షంబునలక్ష్మియు,ఛాయవలనఁబితృదేవతలుస్తనంబులవలనధర్మంబును, బృష్ఠంబువలననధర్మంబును, శిరంబువలననాకంబును, విహారంబువలన నప్సరోజనంబులును, గుహ్యంబువలన బ్రహ్మంబును, ముఖంబువలనవిప్రులు భుజంబులవలనరాజులునూరువులవలన వైశ్యులును, బదంబులవలనశూద్రులునధరంబునలోభంబునుసుపర్వరంధ్రంబు వలనఁబ్రీతియు, నాసాపుటంబువలనధృతియు, స్పర్శంబునఁగామంబును, భ్రూయుగళంబుననియమంబును, వక్షంబునఁ గాలంబును, సంభవించెనెవ్వనియోగమాయానిర్మితంబులుద్రవ్యవయోగ్ధకర్మగుణవిశేషంబులుచతుర్విధసర్గంబెవ్వని యాత్మతంత్రంబెవ్వనివలనసిద్ధించులోకంబులును, లోకపాలురుంబ్రతుకుచుండుగుపెరుగుచుండురుదివిజులకునాయు వుబలంబునైన జగంబులకునీశుండై పరమమహాభూతియగు నప్పరమేశ్వరుండు మాకుం బ్రసన్నుండుగాకయనిమఱి

* నృపా।రాజా,అసమసమరవిలసనములన్॥అసమ।సమానరహితమైన,సమర।యుద్ధముయొక్క,విలసనములన్।నేర్పులచేతను. కసిమసఁగి। విజృంభించి, అసురవిసరములు।రాక్షససమూహములు, అసిలతికలన్।తీఁగెలవలెపొడవులైనకత్తులచేత, సురలనెగువన్।దేవతలనుబాధింపఁ గాను, అసమెడలిఁఉద్రేకమువిడిచినవారై, అసువులువెడలన్।ప్రాణములుశరీరమునువిడిచిబయలుదేరగాను, పసచెడిరి। నవకముచెడినవా రైరి,పడిరి।కూలిరి,కెడసిరి।చచ్చిరి. †హతసుపర్వావళులై।దేవతాసమూహముగలవై-

యును॥క॥ మొసలజలమిడినభూజము। దుదినడుమనుజల్లదనము దొరకొనుమాడ్కిన్।మొదలనుహరికిని మ్రొక్కిన। ముగ
మొంచును రెల్ల వేల్పుమూఁకలు నేమఱ॥క॥ఆపన్నులగుదిదృక్షులకో పుణ్యాభవమ్మఖాబ్జ మెయ్యానతనితోఁ। బ్రాపింపఁజే
యుసంపద। నోపరమదయానివాసయుజ్జ్వలతేజా॥వ॥ అనియిట్లు దేవగణసమేతుండై యనేకవిధంబులంగీర్తించుచును
న్నపరమేష్ఠియందుఁగరుణించిదయాగరిష్ఠుండగువిశ్వగర్భుం డావిర్భవించె॥మ॥ ఒకవేయర్కులుగూడిగట్టికముపైయు
న్నత్ప్రభాభూతితో। నొకరూపైచనుదెంచుమాడ్కి హరిదానొప్పారెయావేల్పు। లెవ్వకలాలోకనులై విపన్నమతులై వి
భ్రాంతులై మ్రోలఁగానకశంకించిరికొంతప్రొద్దువిభుగానంబోలునేవారికిన్॥అప్పుడు॥సీ॥ హారకిరీటకేయూరకుండల
పాదకటకకాంచనరత్నకంకణాది। కౌస్తుభోపేతంబుఁగౌమోదకీశంఖచక్రశరాసనసంయుతంబు। మరకతశ్యామంబు
సరసిజనేత్రంబుఁగర్ణాభరణకాంతిగండయుగముఁ।గలితకాంచనవర్ణకౌశేయవస్త్రంబు।శ్రీవనమాలికాసేవితంబు।నై
మనోహరంబునై దివ్యసౌభాగ్యమయినయతనిరూపుహర్షమెసఁగఁ। జూచిబ్రహ్మేంద్రాదిసురలును దానును। బొంగిన
మ్రులసుచుఁబొగడఁదొడఁగె॥క॥జననస్థితిలయదూరుని।మునినుతునిర్వాణసుఖసముద్రునిసుగుణుం।దనుతనుసూక్ష్మఘులపృ
థులుని।ననఘుఁడసుమహానుభావునభినందింతున్॥క॥పురుషోత్తమ నీరూపము।పరమశ్రేయంబుభువనపఙ్క్తులకెల్లన్।స్థి
రవైదికయోగంబున।వరుసనునీయందుఁగానవచ్చెనుమాకున్॥క॥ మొదలనునీలోఁదోఁచెను।తుదియున్నటఁదోఁచెన
డుముదోఁచెనునాపై। మొదలునడుముతుదిసృష్టికిఁ।గదియఁగఘటమునకుమన్నగతియగుమాడ్కిన్॥క॥నీమాయచేతవి
శ్వము। వేమారుస్సృజింతువనుచువిష్ణుఁడవనుచున్। ధీమంతులుగుణపదవిని। నేమంబుననసగుణుఁడైననినుఁగాంతురో
గిన్॥గీ॥అన్నమవనియందునమృతంబుగోవులయందువహ్నిసమిధలందునమరు। యోగవశతఁబొందు నోజనుబుద్ధిచే।
నగుణునినిన్నుఁగాంతురధికగుణులు॥మత్తకోకిల॥ పట్టులేకబహుప్రకారవిపన్నచిత్తులమైతిమే। మెట్టకేలకునిన్నుఁగంటి
మభీప్సితార్థమువచ్చెబె। న్నెట్టయైనదవానలంబునవేగునేనుఁగుమొత్తము।న్నిట్టలేచినగంగలోపలనీరుఁగాంచినచాడ్పు
నన్॥మత్తకోకిల॥నీకునేమనివిన్నవింతుమునీవుసర్వమయుండవై।లోకమెల్లనునిండియుండఁగలోకలోచననీపదా।లోక
నంబుశుభంబుమాకునులోకపాలకులేనునీ।నాకవాసులునీపవహ్నిఁదనర్చులాతితతిక్రియన్॥ వ॥ అనికమలసంభవప్ర
ముఖులువినుతిసేసిరనిచెప్పినరేంద్రునకుశుకుండిట్లనియె॥శా॥ ఈరీతింజతురాననాదినుతుఁడై గంభీరజీమూతగం।భీ
రంబైనరవంబునంబలికె సంప్రీతాత్ముఁడై యీశ్వరుం। డారోమాంచితకాయులన్నవవిముక్తాపాయులన్ శ్రేయులం।
బ్రారబ్ధోగ్రసుధార్ణవోన్మథనవాంఛానల్పులన్ వేల్పులన్॥క॥ఓనలువ యోసురేశ్వర।యోనిటలతటాక్ష యోసురోత్త
ములారా।దానవులతోడనిప్పుడు।మానుగఁబోరామిగలిగిమనుటయొప్పున్॥ అదియెట్లంటిరేని॥క॥ ఎప్పుడుదనకునుస
త్త్వము।చొప్పడునందాఁకరిపులఁజూచియుఁదనమైఁ। గప్పికొనియుండవలయు। న్నెప్పుగనహిమూషకమునకొదిగినభం
గిన్॥క॥అమృతోత్పాదనయత్నము।విశదమతింజేయుటొప్పువేల్పులువినుఁడీ। యమృతంబుఁద్రావిజంతువు। లమృతగతిం
బ్రతుకుచుండు రాయుర్వృద్ధిన్॥సీ॥పాలమున్నీటిలోపలసర్వతృణలతౌషధములుదెప్పించిచాలవైచి। మందరశైలంబు
*మంథానముగఁజేసితనరవాసుకిఁదరిత్రాడుఁజేసి।నాసహాయంబుననెలమినందఱుమీఱుతరువుఁడు వేగనతంద్రులగు
చు।ఫలముమీఁదన్యోదుబహుళదుఃఖంబులఁబడుచురుదైత్యులుపాపమతులు। అలసటయును లేకయఖిలార్థములుగల్గు।వి
షధిలోననొక్కవిషముపుట్టుఁ।గడఁగిచెలుపలేవుకామదోషంబులు।వస్తుచయమునందువలయుఁజేయ॥ అనియుపదేశిం
చి॥క॥అంతాదిరహితుఁడచ్యుతుఁ। డంతర్ధానంబునొందెనజఫాలాక్షు। ల్సంతోషంబునఁదమతమ। కాంతాలయము
లకుఁజనిరిగౌరవమొప్పన్॥క॥ కయ్యంబుసేయనొల్లక। §నెయ్యంబు ననతులు వెట్టినిర్జరనికరం। బియ్యప్పనము
లువెట్టుచుఁ। దియ్యంబునఁగొల్చెబలినిదేవద్వేషిన్॥క॥పసచెడితనకునువశమై। ‡నుసరముతోఁగొల్చుచున్నసురసం
ఘములఁగసిమసఁగిచంపఁబూనిన।నసురులవారించెబలియునతినయయుక్తిన్॥ వ॥అట్లువారించి¶వైరోచనిరాక్షససము
దయంబునకిట్లనియె॥క॥ పగవారుశరణుఁజొచ్చిన।నుగతనములునెఱపఁదగదుమగవారలకున్।దగుసమయమెఱుఁగవల
దేనుగట్టిమిఁబొటింపవలదమర్త్యులతోడన్॥వ॥ అనిపలికికొలువుకూటంబునసురనికరపరివృతుండై నిఖిలలోకరాజ్యల
క్ష్మీసహితుండై యఖిలవిబుధవిజయాహంకారనిజాలంకారుండై సుఖంబునంగొలువున్న విరోచననందనుంగని శచీవి

---

*మంథానము।కవ్వము- విషధి।సముద్రము. §నెయ్యము।ప్రేమ- నతులువెట్టి।నమస్కారములుచేసి-ఇయ్యప్పనము।కానుక. తియ్యంబునన్।ప్రీతితో. ‡నుసరముతో।చిన్నదనముతో- కసిమసఁగి।విజృంభించి. ¶వైరోచని।విరోచనపుత్రుఁడైనబలిచక్రవర్తి. ‖సచివ।మంత్రి- సాంత్వవచనంబులన్।మిగులమంచిమాటలచేత.

భుజఁగోత్తముఁ శేషవిభుండునుంబోలె సాంత్వవచనంబుల శాంతిం బొందించి పురుషోత్తమ శిక్షితంబైన నీతిమార్గంబున శంబరునకుం బ్రియంబు సెప్పి, యరిష్టనేమి ననునయించి, త్రిపురవాసులగు దానవుల నెడం బఱచి, జంభుని సమ్మతంబు చేసికొని, హయగ్రీవుని విగ్రహంబు మాన్చి, నముచి తారక బాణాసురులతో సఖ్యంబు నెఱపి, విప్రచిత్తునకుం బొత్తు హత్తించి, శకునివిరోచన ప్రతి హేతులకుం బోరామిం జూపి, మయమాలి సుమాలి ప్రముఖులకు మైత్రి యెఱింగించి, కుంభనికుంభులకు సౌజన్యంబు గైకొలిపి, పౌలోమ కాలకేయ నివాతకవచాదులయెడ బాంధవంబు ప్రకటించి, వజ్రదంష్ట్రికి నశక్తుండై యితరదానవదైత్యసమూహంబువలన నతిస్నేహంబు సంపాదించి మనకు నక్కచెలియలిబిడ్డలకు *నొడ్డారంబు లేమిటికి యేక కార్యపరత్వంబున నడ్డంబు లేక బ్రతుకుదము న్యోన్యవిరోధంబు లేలఁ దొల్లి నన్యోన్యవిరోధంబున నలంగితి మిది మొదలు దనుజదివిజసముదయంబులకు రాజు విరోచననందనుం డనుమంద మతనిపంపునఁ జేయంగలవార ముభయకులంబును వర్ధిల్లునట్టి యుపాయం బెఱింగింతు నని యమృతజలధిమథనప్రారంభకథనంబు దెలియం జెప్పినట్లు సురాసురయూథంబులు బలారాతిబలిప్రముఖంబులై పరమోద్యోగంబున సుధాసంపాదనాయత్తచిత్తులై సఖ్యంబు నొంది మందరగమనంబున మందరనగంబునకుం జని॥ సీ॥ †వాసవవర్ధకి వాడిగాఁ జఱచిన కుద్దాలముఖములఁ గొంతఁ ద్రవ్వి। ముసలాగ్రములు సొన్పి మొదలి పాతగలించి దీర్ఘపాశంబుల దిండు సుట్టి। పెకలించి బాహుల పీడించి కదలించి పెల్లార్చి తమతమ పేరువాడి। పెఱికి మీఁదికి నెత్తి పృథుల హస్తంబులఁ దలల భుజంబులఁ దరలకుండ। నాని మెల్ల నెకుఱు తప్పుటడుగు లిడుచు। భారమధికంబు మఱువక పట్టుడను చు। మందరనగంబుఁ దెచ్చిర మందగతిని। దేవదైత్యులు జలరాశి తెరువుపట్టి॥ క॥ మందరము మోవ నోపమి। నందఱిపైఁబడియె నదియు నతిచోద్యముగాఁ। గొందఱు నేలం గలసిరి। కొందఱు నుగ్గయిరి చనిరి కొందఱు భీతిన్॥ క॥ ఏలా హరి కడ కేగితి। మేలా దొరఁకొంటి మధిక ‡హేలన శైలోన్మూలనము చేసి తెచ్చితి। మేలా పెక్కండ్రు మడిసి రేలా నడుమన్॥ క॥ పటికి మముఁ బనిబంచె। న్నేఁటికిఁ దగుబోటి వారికింతలు పనులిం। కేటికి రాఁడు మహేశ్వరుఁ। డేటికి పేక్షించె మఱవ నేటికి మునలన్॥ వ॥ అని §కులకుధరపతనజన్యంబగు వేదన సహింపనోపక పలవించుచున్న దివిజదితిజుల భయంబు మనంబున నెఱింగి సకలవ్యాపకుండగు హరి దత్సమీపంబున॥ మ॥ గరుడారోహకుఁడై గదాదిధరుఁడై కారుణ్యసంయుక్తుఁడై। హరికోటిప్రభతో నెసఁగా వెలసఁడీ యంచుం బ్రదీపించి త। ద్గిరిఁ గేలన్నవకుండ కందుకము మాడ్కిం బెట్టెఁ బక్షీంద్రుపైఁ। గరుణాలోకసుధన్ సురాసురుల ప్రాణంబుల్ సమర్థించుచున్॥ క॥ వారలు గొలువఁగ హరియును। ¶వారధిదరికడకు నేగె వసుధాధరము। న్వారిజనయనుని గొంచున। వారితగతిఁ జనియె విహగవల్లభుఁ డరిగెన్॥ క॥ చని జలరాశితటంబున। వనజాక్షుని గిరినిడించి వందనములు స। ద్వినతులు సేసి ఖగేంద్రుఁడు। ‖పనివినియె న్నాత్మభక్తిభవనంబునకున్॥ అప్పుడు॥ సీ॥ భూనాథ విను మయ్య భోగీంద్రు వాసుకిఁ బిలిపించి యతనికిఁ బ్రియము సెప్పి। ఫలభాగమీనొడఁబడి సమ్మతునిఁ జేసి మెల్లనఁ జేతుల మేను నివిరి। నీవ కాకెవ్వరు నేర్తురీపని ‖కియ్యకొమ్మని యతని కైకోలువడసి। కవ్వంపు గొండని మఱంటకంబుగఁ జేసి గర్జించుచున తని భోగంబుఁ జుట్టి। కడఁగి యమృతజలధిఁ గలశంబుఁ గావించి। త్రచ్చునవసరమునఁ దలఁపులమర। బద్ధవస్త్రకేశభారులై యారెండు। గములవారు తరువఁగదిసిర చట॥ తదనంతరంబ॥ క॥ హరియును ¶దేవానీకము। ‡ఉరగేంద్రుని తలలు పట్టనుద్యోగింపన్। హరిమాయాపరవశులై। సురవిమతులు గూడి పలుకఁ జొచ్చిరి కడిమిన్॥ మత్తకోకిల॥ స్వచ్ఛమైన ‡ఫణంబు మీఱలు చక్కఁ బట్టి మథింపఁగాఁ। బుచ్ఛమేటికి మాకుఁ బట్టను బూరుషత్వము గల్గి మే। మచ్ఛమైన తపోబలాఢ్యయనాన్వయంబులవారమై। యిచ్ఛయింతు మెతుచ్ఛవృత్తికి నిందుమాకు ఫణాగ్రముల్॥ అనిపలుకు దనుజులం జూచి॥ క॥ విస్మయముఁ బొంది ()దానవ। ఘస్మరుఁడహిఫణము విడువఁ గైకొని యసురుల్ విస్మితముఖులై యార్చియ। విస్మితముగఁ గొలువ మేటి వీఁకం దొడఁగెన్॥ వ॥ ఇట్లు సమాకర్షణస్థానభాగనిర్ణయంబు లేర్పఱచుకొని దేవతలు పుచ్ఛంబును బూర్వదేవతలు ఫణంబులం బట్టి పయోరాశిమధ్యంబునం బర్వతంబు వెట్టి పరమాయత్తచిత్తులై యమృతార్థంబు త్రచ్చుచున్న సమయంబున. క॥ విడువిడుఁ డని ఫణిపలుకఁగఁ। గడుభరమున మొదలఁ గుదురు గలగమి వెడఁగై। బుడబుడరవమున నఖిలము। వడవడవడఁకఁగ మహాద్రి వనధిమునింగెన్॥ ఉ॥ గౌరవమైన భారమునఁ గవ్వపుఁ గొండ ధరింపలేక దోః। స్సారవిహీనులై

* ఒడ్డారము। విరోధము. †వాసవవర్ధకి। విశ్వకర్మ, త్వష్ట. కుద్దాల। గుద్దలి- ముసలాగ్రములు। రోఁకటి చివరలు. ‡హేలన। విలాసము §కులకుధరపతనజన్యంబగు। కులపర్వతము తమమీఁదఁ బడుటవలనఁ గలిగిన- పలవించుచున్న। దుఃఖించుచున్న. ¶వారధి। సముద్రము- వసుధాధరము। పర్వతము. ‖పనివినియెన్। పోయెను. ‖ఇయ్యకొమ్మని। సమ్మతించుమని- కైకోలువడసి। సమ్మతమును పొంది- భోగము। శరీరము- కడఁగి। ప్రయత్నపడి- త్రచ్చు నవసరంబునన్। చిలికెడి సమయమందు. ¶దేవానీకము। దేవతాసముదాయము. ‡ఉరగేంద్రుని। సర్పరాజగు ఆదిశేషుని- సురవిమతులు। రాక్షసులు. ‡ఫణంబు। పడగ- పుచ్ఛము। తోఁక. ()దానవఘస్మరుఁడు। విష్ణువు- వీఁక। ధైర్యము.

యుభయసైనికులున్నడుసిగ్గుతో(*)నకూపారతటంబునంబడిరిపౌరుషముంజెడిపాండవేయరో। వ్వారికి నేరఁబోలుబల
వంతపుదైవమునాక్రమింపఁగ॥ క॥ వననిధిజలములలోపల। మునిఁగెడుగిరిఁజూచిముఖమునఁజింతాబ్ధిన్। మునిఁగెడి వేల్పు
లఁగనుఁగొని। వనజాక్షుఁడు వార్ధినడుము వారలుసూడన్॥ సీ॥ సవరనైలక్షయోజనముల వెడలుపైకడుఁగఠోరంబైన(*)క

## ※ కూర్మావతారకథాప్రారంభము. ※

ర్పరము। నదనైనబ్రహ్మాండమైననాహరించుఘనతరంబగుముఖగహ్వరంబు। సకలచరాచరజంతురాసులనెల్లమ్రింగి
లోఁగొనునట్టిమేటికడుపు। విశ్వంబుపై వేఁబువిశ్వంబుపైఁబడ్డనాగినఁగదలనియట్టికాళ్లు। వెలికిలోనికిఁజనుదెంచువిపుల
తుండ।మంబుజంబులఁబోలెడునక్షియుగము । సుందరంబగువిష్ణుండుసురలతోడి। కూర్మిచెలువొందనొకమహాకూర్మము
య్యె॥ మ॥ కమఠంబై జలరాశిఁజొచ్చి లఘుముక్తాశుక్తిచందంబున। న్నమదద్రీంద్రము నెత్తి వాసుకిమహానాగంబుతోలీల
తో। నసురేంద్రాదులుమౌళికంపములతోనానాఁగ దేబాపురే। కమలాక్షాశరణంబుభూదిశలునాకాశంబునన్ మ్రోయ
గన్॥ ఇవ్విధంబున॥ క॥ తరికాండ్రలోననొకఁడఁట। తరికడవకుఁగుదురు (*)నాఁకత్రాడఁట చేతు। ల్దరిగవ్వంబును దానట। హ
రిహరిహరిచిత్రలీలహరియేయెఱుఁగున్॥ గీ॥ జలధిఁగడవ సేయ శైలంబుకవ్వంబు। సేయభోగిఁద్రాడు సేయఁదరువ। సిరి
యుసుధయుఁబడయశ్రీవల్లభుఁడుదక్క। నెవ్వఁడుశక్తిమంతుఁడొకఁడుగలఁడె॥ గీ॥ గొల్లవారిబ్రతుకుగొఱ్ఱతనవచ్చునె
గొల్లరీతిఁబాలకుప్పద్రచ్చి। గొల్లలైరిసురలుగొల్లయ్యెవిష్ణుండు। చేతులేనివాండుసిరియుఁగనిరి॥ వ॥ ఇట్లుసురాసురయూ
థంబులు(*)హరిసనాథంబులైకవచంబులునెట్టంబులువెట్టికొనిపుట్టంబులుపిరిచుట్లుచుట్టికొనికరంబులుగరంబులనప్పళిం
చుచు, భుజంబులుభుజంబులనొఱయుచు, లెండులెండుదరవఁదొడంగుఁడురండనియమందగతిఁబెరుగుఁద్రచ్చుమందగొ
ల్లలచందంబుననుమహార్ణవమధ్యంబునమంథాయమానమందరమహీధర విలగ్నభోగిభోగాద్యంతంబులంగరంబులందె
మల్చుచుఁజెనుబొబ్బలబ్రహ్మాండకటాహంబునిర్భరంబైగుబ్బుగుబ్బనియురులుకొండకవ్వంబుగుత్తిజిఱజిఱందిఱుగువే
గంబునఘటచ్చటాయమానంబులైభుగులుభుగుల్లనుచప్పుళ్లనుప్పరంబెగసి లెక్కకుమిక్కిలిచుక్కలకొమ్మలచెక్కులనిక్కలువ
డుమిసిమిగలమీఁదిమీఁగడపాలతేటనిగ్గుతుంపరలపరంపరలవలననిజకరక్రమక్రమాకర్షణపరిభ్రాంత ఫణిఫణాగర్భస
ముద్భూతనిర్భరవిషకీలికీలాజాలంబులప్పటప్పటికినుప్పతిల్లినదప్పినొందకమందగతింజెందకనకూపారవేలాతటకుటజకు
సుమగుచ్ఛపుచ్ఛస్వచ్ఛమకరందసుగంధిగంధవహావహనంబునంగ్రొంజెమటకొపిటిలిపెనువరదగములొడళ్లనిగుడనెం
డొరులంబరిహసించుచుఁబేలువాడివిలసించుచుమేలుమేలనియగ్గించుచుఁగాదుకాదనిభంగించుచునిచ్చమెచ్చనిమచ్చ
రంబులవలన వనధివలమానవైశాఖవసుంధరాధరప్రవర్తనసంజనితఘుమఘుమారావంబును, మథనగుణాయమానమ
హాహీంద్రప్రముఖముహుర్ముహురుచ్చలిత భూరిఘోరఫూత్కారఘోషంబును, కులకుధరపరిక్షేపణక్షోభితసముల్లం
ఘనసమాకులితంబులై వెఱచిచఱచి గుబురుగుబురులైయొరలు కమఠకర్కటకాకోదరమకరతిమితిమింగిలమరాళచ
క్రవాకబలాహక భేకసారసానీకంబులమొఱలునుంగూడికొని ముప్పిరిగొనిదనుజదివిజభటాట్టహాస తర్జనఘర్జనధ్వ
నులనలుపురియై మొత్తినక్లైనదశదిగంతభిత్తులునుబేడెత్తిపెల్లగిల్లంద్రుళ్లుచు గికురుపొడుచుచునొకనినొకనికంటెవడి
యునుండడవునుంగలుగఁద్రచ్చుచుఁ, బంతంబులిచ్చుచుసుధాజననంబుఁజింతించుచు, నూతనపదార్థంబులకు నెదుళ్లుసూ
చుచు, నెంతదడవుద్రచ్చినహరినడుగుచు, నెడపడనితమకంబులనంతకంతకు మురువుడింపక ద్రచ్చుసమయంబున॥
క॥ అప్పాలవెల్లిలోపల। నప్పటికప్పటికిమందరాగముదిఱుగం। జప్పుడునిండెనజాండము। చెప్పెడిదేవజునిచెవులుదింద
ఱఁగొనియెన్॥ అంతనప్పయోరాశిమధ్యంబున॥ క॥ ఎడమఁగుడిమునుపు దిరుగుచుఁ। గుడినెడమనువెనుకఁదిరుగుకులగిరి
కడలి। న్నడవెడలసురలునసురులు। నొడితొడిఫణిఫణముమొదలుతుదియునుదిగువన్॥ క॥ వడిఁగొనికులగిరిదరువఁగ। జడనిధి
ఖగమకరకమఠఝషఫణిగణముల్పుడిపడుఁదడఁబడుఁగెలఁకులఁ। బడుభయపడినెగసిబయలఁబడునురిలిపడున్॥ క॥ అమ
రాసురకరవిపరిభ్రమణధరాధరథరేంద్రభ్రమణంబునఁదాఁ। గమఠేంద్రువీపుతీఁటను। శమియింపఁగఁజాలదయ్యెజగ
తీనాథా॥ తదనంతరంబ॥ క॥ ఆలోనజలధిలోపల। నాలోనహివిడిచిసురలునసురులుబఱవం। గీలాకోలాహలమై। హాలా

(*)అకూపారతటంబునన్। సముద్రపుగట్టున - పాండవేయ। పరీక్షిత్తుఁడా. (*)కర్పరము। తాఁబేటివీఁపుచిప్ప ॥ (*)నాఁకత్రాడు - అనఁగా గవ్వము పొరలకుండఁగుంజకుఁగట్టియుండుపాశము. (*)హరిసనాథంబులై। విష్ణువుతోఁగూడికొనినవై - (నెట్టంబు। నెట్టెంబు) తలపాగ - మంథదండాయమాన। కవ్వమైఆచరించుచున్న - విలగ్న। తగులుకొనిన - వననిధివలమానవైశాఖవసుంధరాధర॥ సముద్రమునందుదిరుగుచున్న మందరపర్వతముయొక్క, భేక। కప్ప - సారస। బెగ్గురుపక్షి - కికురుపొడుచుచు। మోసపుచ్చుచు. తమకము। మోహము - మురువు। గర్వము.

### ✽ పాలకడలిఁ ద్రచ్చ నెడహాలాహలము జనించుట. ✽

హాలవిషము పుట్టెనవనీనాథా॥ వ॥ అదియుం బ్రళయకాలాభీలఫాలలోచనలోచనానలశతంబుచందంబున నమందంబై, విలయదహనసహస్రంబులకై వడివడి నైపై, కడపటిపట్టపగటింటి వెలుంగులకు తెఱంగునదుర్లక్షితంబై, తుదిరేయి వెలింగిన మొగులుగములు నంబడు బలుపిడుగుల వడువున బెడిదంబై, పంచభూతంబులు దేజోరూపంబులై నచాట్పున దుస్సహంబై, భుగభుగాయమానంబులైన పొగలును, జిటచిటాయమానవిస్ఫులింగంబులును, దగద్ధగాయమానంబులైన నెఱమంట లుంగలిగి మహార్ణవమధ్యంబున సుందరనగంబు నుందరంబునందిఱుగు నెడ జనియించి, పెటపెటాయమానంబై నింగికిం బొంగి దిశలకుం గెలుసాఁచి, బయల్లు ప్రబ్బికొని, తఱిగవ్వంపు కొండనండఁగొనక నలుగడలకుం బఱచి, దరులకుఁ దాఁకి, సురాసురసమువయంబులం దఱికొని, గిరివరగుహాగహ్వరంబుల నుడివడక, కులశిఖరిశిఖరంబుల నెఱగలివడి గహనంబుల దహించి, కుంజఘుంజరీపుంజంబుల భస్మంబు చేసి, జనపదంబు లేర్చి, నదీనదంబు లెఱియించి, దిక్కుంభికుంభంబులు నిక్కలువడని క్కి, తరణితారామండలంబుల పైమిట్టించి, మహర్లోకంబు దఱికొని, యుపరిలోకంబునకు మూఁగొనలిడి, సుడివడి ముసరుకొని బ్రహ్మాండగోళంబు విటిలిపడం దాఁటి, పాతాళాదిలోకంబులకు వేల్లు వారి సర్వాధిక్యంబై శక్యంబుగాక యొక్కెడం జూచినం దాననైకురంగంబు క్రియం గ్రేళ్లుఱుకుచు భుజంగంబువిధంబున నోడియుచు సింగంబు భంగిలంఘించుచు, విహంగంబుపగిది నెగయుచు, మాతంగంబు పోలి కెరలు వంబడుచు, నిట్లు హాలాహలదహనంబు జగంబులం గోలాహలంబు సేయుచున్న సమయంబున✽ మెలకు సెగల మిడుకంజాలక నీఱైన దేవతలును, నేలం గూలిన రక్కసులును, డుల్లిన తారకంబులును, గీటడంగిన కిన్నరమిథునంబులును, గమలిన గంధర్వవిమానంబులును, జీకాకుపడిన సిద్ధచయంబులును, జిక్కువడిన గ్రహంబులును, జిందఱవందఱలైన వసుగ్రాసంబులు, నిగిరిన నదులు, నింకిన సముద్రంబులును, గాలిన కాననంబులును, బొగిలెడు పురంబులును, ¶పొనుఁగువడిన పురుషులును, సొక్కి పడిన పుణ్యాంగనాజనంబులును, బగిలిన పర్వతంబులును, భస్మంబులైన ప్రాణిసంఘంబులును, వేఁగిన లోకంబులును, ‡వివశలైన దిశలును, నడ్డగెడపులైన భూజచయంబులును, నఱవఱలైన భూములును నై యకాలవిలయకాలంబై తోఁచుచున్న సమయంబున॥ క॥ ఒడ్డారించి విషంబున కడ్డము చనుదెంచి కావనధిపులు లేమి న్గొడ్డేసఱ్ఱుం దిరాలన బిడ్డన నెడ లేక జనులు పృథ్వీనాథా॥ అప్పుడు॥ మ॥ చని కైలాసముఁ జొచ్చి శంకరుని వాసద్వారముం జేరి యి నాశునిద వ్వారికులడ్డపడ్డఁ దలనుంచుం జొచ్చికు యొమ్యాయెంటో, వినుమాలింపు ముచిత్తగింపుము దయన్వీక్షింపు మంచంబుజాసనముఖ్యులెల్ల నిరార్తరక్షణకళాసంరంభునిన్ శంభునిన్॥ క॥ వారలు దీనత వచ్చుటఁ గూరిమితో నెఱిఁగి దక్షుకూఁతురుదానున్ ఽపేరోలగమున నుండిద యారతుఁడై చంద్రచూడుఁ డవసరమిచ్చెన్॥ వ॥ అప్పుడు భోగిభూషణునకు సాష్టాంగదండప్రణామంబులు గావించి ప్రజాపతిముఖ్యులిట్లని స్తుతియించిరి॥ సీ॥ భూతాత్మ భూతేశ భూతభావనరూప దేవ మహాదేవ దేవవంద్య యీ లోకముల కెల్లనీశ్వరుండవు నీవ బంధమోక్షములకుఁ బ్రభుఁడ వీవ యార్తశరణ్యుండ వగుగురుండవు నిన్నుఁ గోరి భజింతురు కుశలమతులు సకలసృష్టిస్థితిసంహారకర్తవై బ్రహ్మవిష్ణుశివాఖ్యఁ బరగుదీవు పరమగుహ్యమయిన బ్రహ్మంబు సదసత్తమంబు నీ శక్తి మయుఁడవీవ శబ్దయోని వీవ జగదంతరాత్మవు నీవ ప్రాణమరయ నిఖిలమునకు॥ క॥ నీయందసంభవించును నీయందవసించియుండు నిఖిలజగంబుల్ నీయందలయముఁ బొందును నీయుదరము సర్వభూతనిలయము రుద్రా॥ సీ॥ అగ్నిముఖంబు పరాపరాత్మకమాత్మకాలంబు గతి రత్నగర్భపదము శ్వసనంబు నీయూర్పు రసనజలేశుండు దిశలు కర్ణంబులు దివము నాభి సూర్యుండు గన్నులు శుక్లంబు సలిలంబు జఠరంబు జలములు చదలు శిరము సర్వౌషధులు రోమచయములు శల్యంబులద్రులు మానసము చంద్రుఁడు ఛందములు ధాతువులు ధర్మసమితి హృదయ మాస్యపంచకము పనిషదాహ్వయంబు లయిన నీ రూపు పరతత్త్వమై శివాఖ్య మైస్వయంజ్యోతియై యొప్పు నాద్యమగుచు॥ క॥ కొందఱు కలఁడందురు నినుఁ గొందఱు లేఁడందు రతఁడు గుణి గాఁడనుచుం గొందఱు కలఁడని లేఁడని కొందఱు మందుదురు నిన్నుఁ గూర్చి మహేశా॥ సీ॥ తలఁపఁ బ్రాణేంద్రియద్రవ్యగుణస్వభావుఁడవు కాలక్రతువులును నీవ సత్యంబు ధర్మమక్షరము ఋతంబును నీవ ముఖ్యుండవు నిఖిలమునకు ఛందోమయుండవు సత్త్వరజస్తమశ్చక్షుండవై యుండు సర్వరూప కామపురాధ్వర కాలగరాదిభూతద్రోహభయము చోద్యంబు గాదు లీలలోచనవహ్నిస్ఫులింగశిఖల నంతకాములఁ గాల్చిన యట్టి నీకు రాజఖండావతంస పురాణపురుష దీనరక్షక కరుణాత్మ దేవదేవ॥ గీ॥ మూఁడుమూర్తులకును మూఁడులోకములకు మూఁడుకా

---

✽ మెలకు జాజ్వల్యమానముగ మండుచున్న. మిడుకం జాలక దుఃఖపడుట కోర్వక. ¶ పొనుఁగువడిన మండిన - కాలిన. ‡ వివశలైన స్మైమరచిన. అడ్డగెడపు అడ్డదిడ్డము. అఱవఱలు తునకలు తునకలు. † చదలు ఆకాశము. ఽ పేరోలగము పెద్దసభ.

లములకు మూలమనుచు। భేదముగుచు మదీన భేదమై యొప్పారు। బ్రహ్మమనఁగ నీవ ఫాలనయన॥ క॥ సకలతత్త్వచరాచర।స
జనంబగు నిన్నుఁ బొగడ జలజభవాదుల్। పెదవులు గదలుప వెఱతురు। వదలక నినుఁ బొగడ నెంతవారము దేవా॥ ఉ॥ …కోశ
ల॥ బాహుశక్తి సురాసురుల్ సనిపాలవెల్లి మథింప హాలాహలంబు జనించె నేరికలంఘ్యమై భువనంబులో హాలాహలంబు గఁజే
య విచ్చను లాలనంగొని ప్రాణిసం। దోహముం బ్రతికింప వేదయతాం గలింపఁగ నీశ్వరా॥ క॥ లంపటల నివారింపను। సంప
దఁ గృపఁజేయ జయము సంపాదింపన్। జంపెడివారి వధింపను। సొంపారఁగ నీకె చెల్లు సోమార్ధధరా॥ క॥ నీకంటె నొండెఱుం
గము। నీకంటెం బరులు గావ నేరరు జగముల్। నీకంటె నొడయఁ డెవ్వఁడు। లోకంబుల కెల్ల నిఖిలలోకస్తుత్యా॥ వ॥ అని మఱి

॥ ఈశ్వరుండు దేవబృంద ప్రార్థితుండై హాలాహలమును పానము చేయుట. ॥

యు నభినందించుచున్న ప్రజాపతిముఖ్యులం గని సకలభూతసముండగు నద్దేవుండు దన ప్రియసతి కిట్లనియె॥ క॥ కంటే జగ
ములదుఃఖము। వింటే జలజనితవిషము వేఁడిమిఁ బ్రభులై। యుంటకు నార్తుల యాపదఁ। గెంటించుట ఫలము గాదె కీర్తిమృగా
క్షీ॥ క॥ ప్రాణేచ్ఛ వచ్చి చొచ్చిన। ప్రాణుల రక్షింపవలయుఁ బ్రభువుల కెల్లన్। ప్రాణుల కత్తురు సాధులు। ప్రాణంబులు నిఖి
లభంగురములని నగువా॥ క॥ పరహితము సేయ నెవ్వఁడు। పరమహితుండగును భూతపంచకమునకుం। బరహిత మెపరమ
ధర్మము। పరహితునకు నెపుడు లేదు పర్వేందుముఖీ॥ క॥ హరిమది నానందింపిన। హరిణాక్షీ జగంబు లెల్ల నానందించున్। హ
రియును జగములు మెచ్చఁగ। గరళము వారించు టొప్పుఁ గమలదళాక్షీ॥ క॥ శిక్షింతు హాలహలమును। భక్షింతును మధురసూ
క్ష్మఫలరసము క్రియన్। రక్షింతుఁ బ్రాణికోట్లను। వీక్షింపుము నీవు నేఁడు వికచాబ్జముఖీ॥ వ॥ అని పలికిన ప్రాణవల్లభునకు వ
ల్లభ యిట్లనియె- దేవా చిత్తంబు కొలంది నవధరింపుమని పలికె నని చెప్పిన నమ్మునీంద్రునకు నరేంద్రుం డిట్లనియె॥ మ॥ అమ
రుల్ లోకహితార్థమంచు నభవుండౌఁ గాక యంచాడెబో। యమరుల్ భీతిని మ్రింగుమీ యనిరివో యంభోజగర్భాదు
లుం। దమఁ గావన్ హర తెమ్ము లెమ్మనిరివో తాఁ జూచి గన్గొంటన। య్యుమ ప్రాణేశ్వరు నెట్లు మ్రింగుమనె నయ్యుగ్రానల
జ్వాలలన్॥ అనిన శుకుం డిట్లనియె॥ క॥ మ్రింగెడువాఁడు విభుండని। మ్రింగెడునది గరళమనియు మేలని ప్రజకున్। మ్రింగుమ
నె సర్వమంగళ। మంగళసూత్రంబు నెంతమది నమ్మినదో॥ మ॥ తన చుట్టున్ సురసంఘముల్ జయజయధ్వానంబులన్ బొబ్బిడన్। ఘ
నగంభీరరవంబుతో శివుఁడు లోకద్రోహి హుంపోకురా। య్మని కెంగేలఁ దెమల్చి కూర్చి కడిగా నంకించి జంబూఫలం। బని స
ర్వంకషమున్ మహావిషము నాహారించె హేలాగతిన్॥ అతిఘోరంబుగ నాపానసమయంబున॥ మ॥ కదలం బారవు పాపపే
రులొండలన్ ఘర్మాంబుజాలంబు పుట్టదు నేత్రంబులు నెఱ్ఱగావు నిజజూటార్ధేందుఁడు గందఁడు। న్వదనాంభోజము వాడదా
విషము నాహ్వానించుచో డాయుచోఁ। బదిలుండై కడిసేయుచోఁ దిగుచుచో భక్షించుచో మ్రింగుచోన్॥ క॥ ఉదరము లోకం
బులకును। సదనంబగు టెఱిఁగి శివుఁడు చటులవిషాగ్ని। న్గొమరుకొనఁ గంఠబిలమునఁ। బదిలంబుగ నిలిపె సూక్ష్మఫలరసము
క్రియన్॥ క॥ మెచ్చిన మచ్చిక గలిగిన। నిచ్చిన నీవచ్చుగాక నిచ్చెనె రులకుం। జిచ్చుఁ గడిఁగొనఁగ వచ్చునె। చిచ్చఱ రూపచ్చు
పడిన శివునకుఁ దక్కన్॥ గీ॥ హరుఁడు గళమునం దమహాలాహలము వెట్టఁ। గప్పుగలిగి తొడవుకరణి నొప్పె। సాధురక్షణంబు స
జ్జనులకు నెన్న। భూషణంబు గాదె భూవరేంద్ర॥ తదనంతరంబ॥ క॥ గరళంబు కంఠబిలమున। హరుఁడు ధరించుటకు మెచ్చి
యానొనసుచున్। హరియు విరించియు నుమయును। సురనాథుఁడు వొగడి రంత సుస్థిరమతితోన్॥ క॥ హాలాహలభక్షణకథ।
హేలాగతి విన్నఁ జదువ నెలమి లిఖింపన్। వ్యాళానలవృశ్చికముల। పాలై చెడ రెట్టిజనులు భయవిరహితులై॥ వ॥ మఱియు

॥ పాలకడలి తఱచు నెడ నైరావతాదులు జనియించుట. ॥

నా రత్నాకరంబు సురాసురులు దఱచు నెడ॥ క॥ తెల్లని మేనును నమృతము। జల్లున జల్లించు పొదుగు శితశృంగములుం। న్బెల్లుగ
నర్థులకోర్కులు। వెల్లిఁ గొలుపు మొదవు పాలవెల్లినిఁ బుట్టెన్॥ గీ॥ అగ్నిహోత్రి యనుచు నాసురభిని దేవ। మునులు పు
చ్చుకొని రిమ్ముదముతోడ। విబుధసంఘములకు వెరవుతో నధ్వర। హవులు వెట్టుకొఱకు నవనినాథ॥ మఱియు నాజలరాశి
యందు॥ క॥ సచ్చంద్రపాండురంబై। యుచ్చైశ్శ్రవమనఁగ నురగ ముదయించెన్। బుచ్చికొనియె బలిదైత్యుం।
డిచ్చఁ గొనం డయ్యె నింద్రుఁ డీశ్వరుశిక్షన్॥ క॥ ఒఱపగు నురమును బిఱుదును। నెఱిదోఁకయు ముఖము సిరియు ని
త్మలఖురముల్। కుఱుచ చెవులుఁ దెలిగన్నులుఁ। దఱుచగు కందంబు చూడఁదగు నాహరికిన్॥ అంత నాపాలకుప్పయందు॥
క॥ దంతచతుష్టాహతిశై। లాంతంబులు విఱిగిపడఁగ నవదాతకుభృ। త్కాంతంబగు నైరావణ। దంతావళ ముద్భవించె ధ
రణీనాథా॥ క॥ తడలేని నడుపు వడిగల। యొడలును బెనుసిడుదుకరము నురుకుంభములున్। బెడఁగై యువతుల మురి
పెపు। నడతలకున్ మూలసురువనం గజ మొప్పెన్॥ మఱియు నత్తరంగిణీవల్లభు మథించు నయ్యెడ॥ గీ॥ ఎల్ల ఋతువులందు నల

రారె పుసవనై యుంద్రు విరులతోఁట కేగుదెంచి । కోరివచ్చువారి కోర్కెలనీనెడు । వేల్పుటావు పాలవెల్లిఁ బుట్టె॥
మఱియును గొండగవ్వంబునం గడలి మథింప నప్సరోజనంబు జనించె నంత॥ క॥ క్రొక్కారు మెఱుఁగు మేనులుఁ । గ్రిక్కిఱిసి
న చన్నుఁగవలుఁ గ్రుస్సిన నడుములు । బిక్కటిలియున్న తుఱుములు । జక్కని చూపులును దివిజసతులకు నొప్పెన్ ॥ వ॥ మఱియు
నారత్నాకరంబునం దసుధాకరుండుద్భవించి విరించియనుమతంబున యథాస్థానంబునం బ్రవర్తించుచుండె నంత॥
క॥ తొలుకారు మెఱుఁగు కైవడిఁ । దళతళయని మేను మెఱయ ధగధగయనుచున్ । గలుములలేనగు చూపుల । చెలువంబుల మొ
దలిటెంకి సిరి పుట్టె న్నృపా॥ సీ॥ పాలమున్నీటిలో పలిమీఁది మీఁగడమీసమిజిడ్డునఁ జేసి మేను వడసి । క్రొక్కారు మెఱుఁగుల
కొనలతళ్కుల సాన మేని చేఁగల సిగ్గు మెఱుఁగుఁ జేసి । నాఁడు నాఁటికిఁ బోదనవకంపుఁ దీఁగెల నునుఁబోర నెయ్యంబు నాలుకొలిపి ।
క్రొన్నాఱు కెందమ్మి క్రొవ్వులఁ బ్రొద్దునఁ బొలసిన వలపులఁ బ్రోదిపెట్టి । పసిఁడి చంపక దామంబు బాగుఁ జెట్టి । వ్రాలు క్రొన్నెల
చెలువు నవాడిదీర్చి । జాణతనమునఁ జేతుల జాడఁదీర్చి । నలువ యీ కొమ్మ నొగిఁ జేసి నాఁడు నేఁడు ॥ క॥ కెంపారెడు నధరంబు
ను । జెంపారెడి నళికులంబు సిరి కుచయుగముం । సొంపారు మోముఁగన్నులు । పెంపారుచు నొప్పఁగప్పఁ బిఱుఁదును గుచముల్ ॥
అని జనులు వొగడుచుండ. సీ॥ తరుణికి మంగళస్నానంబు సేయింతు ననిపెట్టె నింద్రుఁ డనర్ఘమైన । మణిమయపీఠంబు మంగ
ళవతులైన వేలుపుగరితలు విమలతోయపూర్ణంబులై యున్న పుణ్యాహకలశంబులిడిరి పల్లవములనిచ్చె భూమి । గడిమి గో
వులు పంచగవ్యంబులను నిచ్చె నులసి వసంతుండు మధువొసంగె । మునులు గల్పంబుఁ జెప్పిరి మొనసి నిగమములు । పణవ గోముఖ
కాహళ పటహ మురజ శంఖ వల్లకి వేణునిస్వనము నిచ్చెఁ । బాడిరాడిరి గంధర్వపతులు సతులు ॥ క॥ పండితసూక్తులతోడుతఁ ।
దుండంబులు సాఁచి తీర్థతోయము లెల్లం । గుండములు ముంచి దిగ్వే । దండంబులు జలక మార్చెఁ దరుణీమణికిన్ ॥ సీ॥ కట్టంగ ప
చ్చనిపట్టుపుట్టము దోయి ముదితకుఁ దెచ్చి సముద్రుఁ డిచ్చె । మత్తాళి నికరంబు మధువాసమూఁగిన వైజయంతిక మాలవరు
ణుఁ డిచ్చెఁ । గాంచన కేయూర కంకణ కింకిణీకటకాదులను విశ్వకర్మ యిచ్చె । భారతి యొక మంచి తారహారంబిచ్చెఁ బాణిఁ
బద్మము నిచ్చెఁ బద్మభవుఁడు । కుండలీంద్రుఁ డంబుకుండలములనిచ్చె । శ్రుతులు భద్రమైన నుతులు సేసె । నెల్ల లోకములకు నేలి
కసాని వై । బ్రతికెదను చు దిశలు పలికెన ధవ ॥ మఱియును ॥ సీ॥ పలుకుల నమృతంబు చిలుక నెవ్వానితో భాషింపు మనతఁడే పో
బ్రహ్మయనఁగ । నెలయించి కెంగేల నెవ్వాని వరియించె వాఁడె లోకములకు వల్లభుండు । మైదీఁగె నెవ్వాని మేనితోఁ గదియిం
చె వాఁడె పో పరమసర్వజ్ఞమూర్తి । నెలఁతుక యెవ్వఁడు నే యింట వసియించె నాయిల్లు పరమగు నమృతపదము । నెలఁతచూ
పు బారు నెచ్చోటి కచ్చోటు జిష్ణుధనదధర్మజీవితంబు । కొమ్మపిన్ననగవు గురుతరదుఃఖని । వారణంబు సృష్టికారణంబు ॥
మఱియు నక్కొమ్మ నెమ్మనంబున ॥ సీ ॥ భావించి యొకమాటు బ్రహ్మాండములయెల్ల నాటలబొమ్మ రిల్లని తలంచుఁ ।
బోల్చించి యొకమాటు భువనంబులన్నియుఁ దనయింటిలో నొంతులని తలంచుఁ । బ్రాపించి యొకమాటు బ్రహ్మాది సుర
లను నాయింటిలో బొమ్మలని తలంచుఁ । గొనకొని యొకమాటు కుంభినీచక్రంబు నలవడబొమ్మపీటని తలంచు । సొల
సి యొక్కమాటు సూర్యేందురోచుల । నచటి దీపకళికలని తలంచు । భాసి యొక్కమాటు భారతీదుర్గల । నాత్మస
ఖులటంచు నాదరించు ॥ తదనంతరంబ ॥ గీ ॥ చంచరీకనికరఝంకారనినదంబు । చనరు నుత్పలముల దండ వెట్టి । మేఘకోటి న
డిమి మెఱుఁగు పుత్తడిమాడ్కి । సురలనడుమ నిల్చె సుందరాంగి ॥ క॥ ఆకన్నులు నా చన్నులు । నాకురులా పిఱుఁదు నడుము నా
ముఖమాన । వ్యాకారము గని వేల్పులు । చీకాకుఁ బడిరి కలఁగి శ్రీహరి దక్కన్ ॥ వ॥ అట్లు నిలిచి దశదిశలం బరివేష్టించియున్న
యక్ష రక్షస్సిద్ధ సాధ్య దితిజ గరుడ గంధర్వ చారణ ప్రముఖయూథంబులం గనుంగొని పురాణ ప్రార్థకన్యకారత్నంబు దనమ
నంబున నిట్లని వితర్కించె ॥ సీ॥ ఐదువనై యుండ నలవడదొకచోట నొకచోట సవతితో నోర్వరాదు । తగ నొకచోట సంతతమై
భవంబు గాదొకచోట వేడిమినుండఁ బోల । దొకచోటఁ గరుణ లేదొక్కచెంత వెదకిన నొకచోట దగ్గరియుండఁ బట్టు । నెఱయం
గ నొకచోట నిలుకడ చాలమి చర్చింప నొకచోట జడతగలదు । కొన్నిచోట్లు కామగుణగరిష్ఠంబులు క్రోధసంయుతములు కొన్ని
యెడలు । కొన్ని మోహలోభకుంఠితంబులు కొన్ని । ప్రమదమత్సరానుభావకములు ॥ వ॥ అని సకల సత్పురుషజన నవర్తనంబులు
మానసించి పరిహరించి ॥ సీ॥ అనఘుని త్తైమవనైయుండవచ్చును వరుసను సవతులెవ్వరును లేరు । వెలయంగ నశ్రాంతవిభవమీ
తని యిల్లు శృంగారచందన శీతలుండు । గలఁగఁడెన్నఁడు శుద్ధకారుణ్యమయమూర్తి విమలుండు గదిసి సేవింపవచ్చు । నెఱినా
థుఁడు గఁడు నిలుకడ గలవాఁడు సకల కార్యములందు జడత లేదు । సాధురక్షకుండు షడ్వర్గరహితుండు । నాథుఁడయ్యె నేని
నడువ మోపు । నితఁడె భర్తయనుచు నింతి సరోజాక్షుఁ । బుష్పదామకమునఁ బూజసేసె ॥ క॥ ఇందీవర దామమునను । కుంద
నిఁ బూఱించి చితనకుఁ గూడి వసింపన్ । మందిరముఁ గదవ్వతుము । నందనలజ్జాసుదృష్టి నాలోకించెన్ ॥ గీ॥ మోహదుచులవలస

ముద్దియతలయెత్తు। సిగ్గువలనవాలశిరమువంచు।నింతి వెఱపువలన నెత్తమువంపదు। తనదుముఖము ప్రాణదయితుఁజూచి॥
క॥ హరిసూచినసిరిచూడదు।సిరిసూచినహరియుఁజూడసిగ్గునుబొందుఁ।హరియునుసిరియునుదమలో।సరిచూపులఁజూ
డమఱుఁడుసంవడిఁజేసెన్॥ చ॥ జగములతండ్రివైదవరుశౌరిజగంబులతల్లినిందిరందగనురమందుఁదాల్చెనఁటదక్కరు
ణారసవృష్టిచేఁబ్రజల్। మగుడఁగఁదొంటిభంగినతిమంగళసాధ్విపతిత్వసంపద।న్నెగడినలోకముల్లనిరనేకశుభంబులఁ
బొందిరర్తిజన్॥ వ॥ అటమున్నయబ్ధిరాజుననయంబునున్నయమూల్యంబైనకౌస్తుభంబుపేరిటియనర్ఘ్యమణిరాజంబున
య్యంబుజాతునకుసమర్పించినఁదనవక్షఃస్థలంబున ధరియించెనప్పుడయ్యాదిలక్ష్మియు శ్రీవత్సకౌస్తుభ వైజయంతీవన
మాలికాదితారహారాలంకృతంబైనపుండరీకాక్షునివక్షఃస్థలంబునవసియించెనయ్యవసరంబున. శా॥ మ్రోసెన్శంఖమృదం
గవేణురవముల్మున్నాడిపెంజీఁకటుల్వాసెన్నర్తనగానలీలలసురల్వాసిల్లి రార్యుల్జగ। ద్వ్యాసుల్విష్ణుని బ్రహ్మదేవముఖ
సుల్లల్లింగమంత్రంబులం।బ్రాసక్తిన్వినుతింపిరుల్లసితపుష్పశ్రేణివర్షించుచున్॥ క॥ ఆపాలవెల్లికూఁతురు। తీఁపులచూపు
లకుఁదోఁగితిలకింపఁబ్రజ।ల్పేర్పట్టిరిసంపదలను।బ్రాపించెను మేలుజగము బ్రతికెనరేంద్రా॥ క॥ పాలేటిరాచకన్నియ। మే
లారెమచూపులేకమిన్నుమినుకంచుం।జాలింబురపురఁబొక్కుచుఁ।మూలిరిరక్కసులుకీడుదోఁచిననధిపా॥ క॥ వారిధిఁదరు
వఁగనంతట।వారుణియనునొక్కకన్యవచ్చిననసురు।ల్వారిజలోచనసమ్మతి।వారైకైకొనిరిదానివారిజనేత్రన్॥ సీ॥ తరు
ణుండుదీర్ఘదోర్దండుండుకంబుకంధరుఁడు పీతాంబరధారిస్రగ్వి। లాలితభూషణాలంకృతుండరుణాక్షుఁ డున్నతోర
స్కుఁడత్యుత్తముండు। నీలకుంచితకేశనివహుండుజలధరశ్యాముండుమృగరాజసత్త్వశాలి।మణికుండలుఁడురత్నమంజీ
రుఁడచ్యుతునంశాంశసంభవుండమలమూర్తి।భూరియాగభాగభోక్తధన్వంతరి।యనఁగనమృతకలశహస్తుఁడగుచు।నిఖి
లవైద్యశాస్త్రనిపుణుఁడాయుర్వేది। *వేల్పువెజ్జుకడలివెడలివచ్చె॥ తదనంతరంబ॥ గీ॥ అతనిచేతనున్నయమృతకుంభము
సూచి। †కెరలుపొడిచిసురలఁగికురువెట్టి।పుచ్చికొనిరియసురపుంగవులెల్లను।మాఱులేకబలిమిమానవేంద్ర॥ వెండియు॥
గీ॥ చావులేనిమందుచక్కనమునకబ్బె। ననుచుఁగడవనసురులడఁచికొనిన। వెఱచిసురలుహరికిమొఱలువెట్టిరిసుధా।పూ

## శ్రీ శ్రీవిష్ణుమూర్తి మోహినీస్వరూపంబునొందుట. శ్రీ

ర్ణఘటముపోయెఁబోయెననుచు॥ వ॥ ఇట్లుశరణాగతులైనవేల్పులదైన్యంబువొడగని భృత్యజనకాముండగు నప్పరమే
శ్వరుండుమీరలుదుఃఖింపవలవదేను నామాయాబలంబునంజేసి మీయర్థంబుమఱలసాధించెదననిపలికినసమయంబునన
య్యమృతపూరంబునేముంద్రావుదుమనినితమకించుదైత్యదానవజనంబులలోపలనమంగళంబగు‡కలిసంభవించినకతం
బునఁబ్రబలురసురక్కసులుపలోకించిసత్త్రయాగంబునందునడచుచందంబునఁదుల్యప్రయాసహేతువులగుసురలును
సుధాభాగంబున కర్హులగుదురుగావునఁబంచికుడుచుటకర్తవ్యంబిదిసనాతనంబగుధర్మంబగుటంజేసి యయ్యమృతకుం
భంబువిడువుండనిమగ్నులగునిశాచరులుజాతమత్సరులైతమవారలవారించుచున్నసమయంబున॥ గీ॥ ఒక్కనిచేతనుండనొ
కఁడుబలిష్ఠుఁడై। పుచ్చికొనినవానిఁబొదుగఁబట్టి। యంతకంటెనధికుఁడమృతకుంభమునెత్తి। కొంచుపాఱెఁబరులును
య్యడంగ॥ సీ॥ మెత్తనియడుగులు మెఱుఁగారుజానువు లంటికంబములఁబోలైనతొడలు।ఘనమగుజఘనంబుఁగడులేతన
డుమునుబల్లవారుణకాంతిపాణియుగముఁ।గడుదొడ్డపాలిండ్లుఁగంబుకంఠంబునుబింబాధరముఁజంద్రబింబముఖముఁ। దె
లికన్నుఁగవయునునళికుంతలంబులుబాలేందుసన్నిభఫాలతలము। నమరకుండలకేయూరహారకంకణాదులేపారమంజీర
నాదమొప్ప।నల్లనవ్వులఁబద్మనాభుఁడసుర।పతులనడఁగింపనాఁడురూపంబుఁదాల్చి॥ అయ్యవసరంబునజగన్మోహనాకా
రంబున॥ సీ॥ పాలిండ్లపైనున్నపయ్యెదజాఱించుజాఱించిమెల్లనఁజక్కనొత్తుఁ। దళుక్కుతళుక్కునుగండఫలకంబులోలయిం
చునెలయించికెంగేలనుజ్జగించుఁ।గడుమెఱుంగులువారుకడకన్నులల్లార్చునల్లార్చిఱెప్పలనండఁగొలుపు।సవరనిదరహా
సచంద్రికఁజిలికించుఁజిలికించికెమ్మోవిఁజిక్కపఱచు।వళితధమ్మిల్లకుసుమగంధమ్ము నెఱపుఁ।గంకణాదిఝణంకృతుల్ గ
డలుకొలుపు।నొడలికాంతులుపట్టులేకులుకఁబాఱు।సన్నవలిపెంపుపయ్యెదచౌకళింప॥ వ॥ ఇవ్విధంబుననక్కపటయువతీర
త్నంబుజగన్మోహనదేవతయునుంబోలె నెమ్మొగంబుదావికిమత్తిల్లిన తేఁటిమొత్తంబులంగెలిచి చిగురుజొంపంబులనె
డగలుఁగజడియుచుమురియుచుండరాక్షసవరులుగనుంగొని॥ సీ॥ ఓఁగదెలావణ్యమాఁగదేమాధుర్య మాఁగదేసతినవ
యౌవనాంగి।యెటనుండివచ్చితివేమిచ్చయించెదునీనామమెయ్యదినీరజాక్షి।యమరగంధర్వసిద్ధాసురచారణమనుజక

* వేల్పువెజ్జు।దేవతావైద్యుఁడు. † కెరలుపొడిచి।కోరికలతిశయించి. గికురువెట్టి।లాలనముచేసి. ‡ కలి। కలహము. § దోయి।జత, జఘనము।పిఱుఁదు. పల్లవ।చిగురు, పాణి।హస్తము, పాలిండ్లు।స్తనములు, కంబుకంఠము।శంఖమువంటికంఠము, బింబాధరము।దొండపండువంటిపెదవి, కవ।జంట, మంజీర।కాలిఅందె

న్యులకునీసుహిమగలదె। ప్రాణచిత్తేంద్రియపరిణామదాయియైననిర్మించెఁబో విధినిన్నుఁగరుణ। వనితకశ్యపుసంతతివార
మేము। భ్రాతలముసురలకేమిద్ధపౌరుషులము।జ్ఞాతులకుమాకు నేకార్థసంగతులకుఁ। బాలుదీఱనియర్థంబుపంచియిమ్ము॥
క॥సభయైయుండెదనిందఱ।నుభయంబునవచ్చుకొలఁదినమృతంబునునీ।విభరాజగమనతప్పక।విభజింపువిపక్షపక్షవిర
హితమనమై॥ వ॥అనిమంత్రించినదైత్యులంగనిమాయామువతీరూపుండగుహరిఁగనవాడిచూపుటంపరలవలనవారలతా
లుములనించుచిఱునగవులెగయమొగమెత్తియిట్లనియె॥క॥సుందరులగుపురుషులఁగని।పొందెడునాయందుబుద్ధిపుట్టునె
మీకుఁ।బృందారకరిపులారా।చెందరుకామినులవిశ్వసింపరుపెద్దల్॥క॥ పలుకులుమధురసధారలు।దలఁపులునానాప్ర
కారదావానలము। లైలుములుసాలావృకములు।చెలువలనమ్ముటలు వేదసిద్ధాంతములే॥క॥నానేర్చుకొలఁదిమీకును।మాను
గవిభజించియిత్తుమానుఁడుశంకం।గానిండనవుడునిచ్చిరి।దానవులమృతంపుఁగడవఁదరుణీమణికిన్॥క॥ ఆశాంతాలోకన
ములు।నాశీతలభాషణములునాలాలితము।ల్రాశిపరంపరలగుచుం।బాశములైవారినోళ్లుబంధించెన్నృపా॥వ॥ ఇట్లుసు
ధాకలశంబుకేలనందికొని మందస్మితభాషణంబులసుందరీరూపుండగు ముకుందుండు మేలుకీడనక నేనుపంచియిచ్చినతె
అంగుననంగీకరించుటకర్తవ్యంబనవుడునగుంగాకయనిసురాసుర దైత్యదానవసమూహంబుపవసించి కృతస్నానులై
హోమంబులాచరించివిప్రులకుగోభూహిరణ్యాదానంబులుసేసితదాశీర్వ్రవచనంబులుగైకొని ధవళపరిధానులై
గంధమాల్యధూపదీపాలంకృతంబగు కనకరత్నశాలామధ్యంబునఁ బ్రాగగ్రకుశపీఠంబులఁ బూర్వదిశాభిముఖులైప
ఙ్క్తులుగొనియున్నసమయంబున॥క॥శ్రోణీభరకుచయుగభర।వేణీభరములసుడస్సివివిధాభరణ।క్వాణయయియువిదవ
చ్చెను।పాణిసరోజమునమృతభాండముఁగొంచున్॥క॥భాసురకుండలభాసిత। నాసాముఖకర్ణగండనయనాంచలయై।
శ్రీపతియగుసతిఁగనిదే।వాసురయూథంబుమోహమందెనరేంద్రా॥అప్పుడు॥క॥అసురులకమృతమువోయుట। పామఁగ
ముపాములకుఁబాలువోసినమాడ్కిన్।దోసఁగగునంచునువేఱొక।దెసనుంగూర్చుండఁబెట్టెదేవాహితులన్॥ ఇట్లు రెం
డుపఙ్క్తులుగానేర్పఱించి॥సీ॥వేగిరపడకుఁడీవినుఁడుదానవులారతడవుసేయకవత్తుదైత్యులార।యటుచక్కఁగూర్చుం
డుఁడనికన్నులల్లార్చుచనుగవపయ్యెదఁజాఱదిగిచి।వది నేమ బందలి వాపులుగల్పించిమార్గంబు లెడలించిమఱుఁగుఁజేసి।మె
ల్లనినగవులమేనులుమఱపించికడుజాణమాటలఁగాకుపఱచి।యసురవరులనెల్లనడఁగించిసురలను। దడవుసేయవలదు
ద్రావుఁడనుచు।వచ్చుకొలఁదినమృతవారివిభాగించెఁ।దరుణిదివిజులెల్లఁదనిసిపొగడ॥అయ్యవసరంబున॥సీ॥మనకువేల్పు
లకునుమారాటములురాకపంచిపెట్టెదననిపడఁతిపూనెఁ। దానేలతప్పునుదప్పుచుతరళాక్షిగాకరమ్మనుచునుగడఁకఁబి
ల్చె।మఱుమాటలాడదోమఱిచూడకుండునోచనుగవఁగప్పనోచాలుననుచు।నొండాడకలగుచునొక్కింతసొలయునోమన
మెడఁగందునోమగువయనుచు।నెలఁతచూట్కిగములనీరైకలంగుచుఁ।బ్రణయభంగభీతిబద్ధులగుచుసూరకుండ్రిగానియు
విదతేతెమ్మని।యడుగఁజాలరైరియసురవరులు॥అప్పుడు॥మ॥ అమరవ్రాతములోనఁజొచ్చిదివిజుండై రాహువీయూష
పానముసేయంగనిచంద్రభాస్కరులుసన్నల్సేయనారాయణుం।డమరారాతిశిరంబుచక్రహతిఁనుమ్మాడెన్సుధాసిక్త
మై।యమరత్వంబునుజెందెమూర్ధ్నముతదన్యాంగంబునేలంబడెన్॥గీ॥అజుఁడువానిశిరమునంబరవీథిని।గ్రహముసేసి
పెట్టిగారవించె।వాఁడుపర్వములనువైరంబుదప్పక।భానుచంద్రులనుబట్టుచుండు॥క॥ఒకబొట్టుదిక్కఁకుండఁగ। సకల

## దేవాసురయుద్ధము.

సుధారసముననమరసంఘంబులకుం।బ్రకటించిపోసిహరిదన।సుకరాకృతిఁదాల్చెనసురశూరులుబెగడన్॥మ॥ అమరుల్ప్ర
క్రమసులుం బ్రయాసబలహేత్వర్థాభిమానంబులున్సములైలబ్ధవికల్పులై రిసురలున్సఁ శ్రేయసంయుక్తులై।రమరారుల్బ
హుదుఃఖముంగనిరితామత్యంతదోర్గర్వులై।కమలాక్షున్శరణంబువేడనిజనుల్కల్యాణసంయుక్తులే॥క॥ దానవులమృత
ముఁద్రావం।బూనిపయోరాశిఁద్రచ్చిపొగిలినమాడ్కిన్।శ్రీనాథపరాఙ్ముఖులగు। హీనులుపొందంగఁజాలరిష్టార్థము
లన్॥క॥శోధించిజలధినమృతము।సాధించినిలింపవైరిచతురుగ్రతులన్।రోధించిసురలకిడిహరి। బోధించిఖగేంద్రునెక్కిపో
యెనరేంద్రా॥ క॥ శుద్ధులగుసురలకమృతము।సిద్ధించిననసురవరులుసిడిముడిపడుచున్।గ్రుద్ధులునానాయుధసన్నద్ధ
లునై యుద్ధమునకునడిచిరిబలిమిన్॥క॥ధన్యులువైరోచనిశత।మన్యుప్రముఖులుమతాభిమానులుదమలో। నన్యోన్యరణ
ముచాఙ్।విన్యాసంబులనుబేర్చివెలసిరికడిమిన్॥మ॥అరుదైకామగమైమయాసురకృతంబైలోకితాలోక్యమై। వరశ
స్త్రాస్త్రసమేతమైతరళమైవైహాయసంబైమహా।సురయోధాన్వితమైనయానమునసంశోభిల్లెఁబూర్ణేందుసు।స్థిరకాం
తిన్బలిచామరధ్వజచమూదీప్తస్థితిన్మండటన్॥వ॥మఱియు,నముచి,శంబర,బాణ,ద్విమూర్ధ,కాలనాభ,శకుని,నికుంభ,

కుంభ, అయోముఖ, ప్రహేతి, హేతి, భూతసంతాప, హయగ్రీవ, కపిల, మేఘదుందుభి, మయ, త్రిపురాధిప, విప్రచిత్తి, విరోచన, వజ్రదంష్ట్ర, తారక, అరిష్ట, రిష్టనేమి, శుంభ, నిశుంభ, శిరోముఖ, ప్రముఖులును, పౌలోమ, కాలకేయులును, నివాతకవచప్రభృతులును, నక్కనదండయోధులును గూడుకొని యరదంబులం, దురగంబుల, మాతంగంబుల, హరిణంబుల, హరి, కిరి, కీట, జలచరంబులను, శరభ, మహిష, గవయ, ఖడ్గ, గండభేరుండ, చమరీ, జంబుక, శార్దూల, గోవృషాదిమృగంబులను, గంక, గృధ్ర, కాక, కుక్కుట, బక, శ్యేన, హంసాదివిహంగంబులను. దిమి, తిమింగిలాది, జలచరంబులను, నరులను, నసురసురనికరవికృతవిగ్రహరూపంబులగు జంతువుల నారోహించి తమకునడియాలంబులగు గొడుగులు, *పడగలు, జోడు, కైదువ, పక్కెర, బొమిడికంబులు, మొదలగు పోటుమట్టాయితంబులగైకొని వేలువేలు §మొనలై విరోచననందనుండగు బలి ముందట నిలువంబడిరి దేవేంద్రుండు నైరావణారూఢుండై వైశ్వానరవరుణవాయుదండధరాద్యనేకనిర్జరవాహినీసందోహంబులును దాను నెమఱువడిపిలుతివియక మోహరించెనట్లు సంరంభసన్నాహసముత్సాహంబుల రెండుదెఱంగులవారుం బోరాడు వేడుకలమీటగుమాటల సందడించుచున్న సమయంబున॥ సీ॥ వజ్రదంష్ట్రాంచితవ్యజనంబులును బర్హచామరంబులు సితచ్ఛత్రములును। జిత్రవర్ణధ్వజచేలంబులును వాతచలితోత్తరోష్ణీషజాలములును। జప్పళ్లనొసఁగుకంకణభూషణంబులుఁ జండాంశురోచులశస్త్రములును। వివిధఖేటకములు వీరమాలికలును బాణపూర్ణములైన తూణములును। నిండి పెచ్చురేఁగి నిర్జరాసురవీర। సైన్యయుగ్మకంబు చాల నొప్పె। గ్రాహతతులతోడఁ గలహంబునకు వచ్చు। సాగరముల భంగి జనవరేణ్య॥ క॥ భేరీభాంకారంబుల। వారణఘీంకారములను వర†హరిహేషల్। భూరథనేమీరవముల। ఘోరములై పెల్లగిల్లెఁ గులశైలంబుల్॥ వ॥ ఇవ్విధంబున నుభయబలంబులు మోహరించి యింద్రునితో బలియుఁ, దారకునితో గుహుండును, హేతితో వరుణుండును, బ్రహేతితోడ మిత్రుండును, గాలనాభునితోడ యముండును, మయునితో విశ్వకర్మయుఁ, ద్వష్టతో శంబరుండును, సవితతోడ విరోచనుండును, బరాజిత్తుతో నముచియు, వృషపర్వునితో నశ్వినీదేవతలును, బలిశతబాణాదిపుత్రశతంబుతో సూర్యుండును, రాహువుతో సోముండును, బులోమతో ననిలుండును, నిశుంభశుంభులతో భద్రకాళీదేవియు, జంభునితోడ వృషాకపియును, మహిషునితో విభావసుండును, బ్రహ్మపుత్త్రులతోడ నిల్వలవాతాపులును, గామదేవునితోడ మర్మగ్నుండును, మాతృగణముతోడ నుత్కలుండును, శుక్రునితోడ బృహస్పతియును, నరకునితో శనైశ్చరుండును, నివాతకవచులతో మరుత్తులును, గాలేయులతోడ వసువులు, నమరులును, క్రోధవశులైన పౌలోములతో రుద్రవిశ్వేదేవగణంబులు, నివ్విధంబున గలసి పెనంగి ద్వంద్వయుద్ధంబు సేయుచు మఱియు రథికులు రథికులను బదాతులు పదాతులను వాహనారూఢులు వాహనారూఢులం దాఁకి సింహనాదంబులు సేయుచు, నట్టహాసంబు లిచ్చుచు, నాహ్వానంబులొసంగుచు, నన్యోన్యతిరస్కారంబులు సేయుచు, బాహునాదంబుల విజృంభించుచుఁ, బెనుబొబ్బలను బ్బిరేఁగుచు, హుంకరించుచు, నహంకరించుచు, ధనుర్గుణంబుల టంకరించుచు, శరంబుల నాటించుచుఁ, ‡బరశువుల నఱుకుచుఁ, జక్రంబులం జెక్కుచు, శక్తులం దునుముచుఁ, గశలం బెట్టుచుఁ, గుఠారంబులం బొడుచుచు, గదల నడుచుచుఁ, గరంబులఁ బొడుచుచుఁ, గరవాలంబుల ద్రెయుచుఁ, బట్టసంబుల నొంచుచుఁ, బ్రాసంబులం ద్రెంచుచుఁ, బాశంబులం గట్టుచు, పరిఘంబుల మొత్తుచు, ముసలంబుల మోఁదుచు, ముద్గరంబులం జదియుచు, ముష్టివలయంబుల ఘట్టించుచుఁ, దోమరంబులను ఱుముచు, శూలంబులఁ జిమ్ముచు, నఖంబులం జీరుచు, దరుశైలంబుల రువ్వుచు, నుల్ముకంబులం జెండుచు, నిట్లు బహువిధంబులం గలహవిహారంబులు సలుపు నవసరంబున భిన్నంబులైన శిరంబులును, విచ్ఛిన్నంబులయిన కపాలంబులును, వికలంబులయిన కపోలంబులును, జిక్కువడిన కేశబంధంబులును, భగ్నంబులయిన దంతంబులును, గృత్తంబులయిన భుజంబులును, ఖండితంబులయిన కరంబులును, విదళితంబులయిన మధ్యంబులును, వికృతంబులయిన వదనబింబంబులును, వికలంబులయిన నయనంబులును, వికీర్ణంబులయిన కర్ణంబులును, విశీర్ణంబులయిన నాసికలును, విఱిగిపడిన యూరుమధ్యంబులును, విశథంబులయిన పదంబులును, జినిగినకం ¶కంకటంబులును, వ్రాలిన కేతనంబులును, కూలిన ఛత్రంబులును, మ్రొగ్గిన గజంబులును, నుగ్గిన రథంబులును, నుఱుమైన

---

*పడగలు।జండాలు, జోడు।కవచము, కైదువ।ఆయుధము, పక్కెర।ఏనుఁగునకుఁ దొడిగెడు చొక్కా, బొమిడికము।శిరోకవచము. §మొన।సైన్యము. †హరిహేషల్।గుఱ్ఱముల సకిలింతలు. ‡పరశువు।గండ్రగొడ్డలి, తునుము।చంపు, కశ।జాటి-చిల్లగోల, కుఠారము।గొడ్డలి, గద।ఇనుపగుదియ, కరవాలము।ఖడ్గము-పెద్దకత్తి. పట్టసము।ఆయుధవిశేషము. ప్రాసము।ఈటె-బల్లెము, పరిఘ।ఇనుపకట్లగుదియ. ముద్గర।కుఱుచయినపరుద్ధు, ముష్టి।పిడికిలి, తోమరము।నేజా-చబుకు, ఉల్ముకము।కొఱవి, భిన్న।బద్దలైన, విచ్ఛిన్న।నరకఁబడిన, భగ్న।విరిగిన, కృత్త।నఱుకఁబడిన, విదళిత।కొట్టఁబడిన. ¶కంకటంబు।కవచము.

హయంబులును, జిందరవందరలయినభటసమూహంబులును, పొఱలెడు మేనులును, నుబ్బియాడెడుభూతంబులును, బా
ఱెడురక్తప్రవాహంబులును, గట్టలుగొన్నమాంసంబులును, నెగసితిఱిగెడికళేబరంబులును, గలకలంబులు సేయుకం
కగృధ్రాదివిహంగంబులునై యొప్పునప్పోరతిఘోరంబయ్యె నప్పుడు॥ శా॥ నాకాధీశుఁ బదింటమూఁటగజమున్నాల్గిం
టగుఱ్ఱంబుల। నేన్నికాస్త్రంబున సారథిం జోనిపె దైత్యేంద్రుండు వీఁకన్నవ। ల్లోకాధీశుఁడు ద్రుంచెనన్నిటిని దోర్దర్పోన్నన్ని
భల్లంబులన్। రాకుండన్రిపువర్గముం దునిమెఁ గీర్వాణారి యగ్గింపఁగన్॥ సీ॥ తనతూపులన్నియుఁ దరమిడి శక్రుండు నడికిన
జోడుపవిన్నఁగ మెఱసి। బలిమహాశక్తిఁ జేఁబట్టిననదియును నతఁడు ఖండించెనత్యద్భుతముగ। మఱిప్రాసశూలతోమరము
లుగైకొన్నఁ దోర్దోడనవియును దునిమివైచె। నంతటఁ బోక యెయ్యెది వాఁడు సాధించెఁ దొడరి తానదియును దుదముసేసె
నసురభర్తవిరథుఁడై తనపగరిచేఁ। గానఁబడక వివిధకపటవృత్తి। నేర్పు మెఱసిమాయనిర్మించెమింటను। వేల్పుగములుసూచి
వెఱఁగుపడఁగ॥ వ॥ ఇట్లు దానవేంద్రునిమాయావిశేషవిధానంబున సురానీకంబులపైఁ బర్వతంబులుపడియె, దావాగ్నిదం
దహ్యమానతరువిస్ఫులింగంబులు గురిసె, శిఖిశిఖాసారంబులు గప్పె, మహోరగదందశూకంబులు గఱచె, వృశ్చికంబు
లుమీఁటె, వరాహవ్యాఘ్రసింహంబులు కదిసి విదళింపం దొరఁకొనియె, వనగజంబులు మట్టిసల్లాడం జొచ్చె, శూలహస్తులు
దిగంబరులునై బలురక్కసులు శతసహస్రసంఖ్యలు భేదనఛేదనభాషణంబులాడం దొడంగిరి వికృతవదనులు గదాదండధా
రులు నాలంబితకేశభారులునైయనేకరాత్రించరీరులు పోనీకుపోనీకు తునుముండని వెనుతగిలిరి వర్షగంభీరనిర్ఘాతసమేతంబు
లైనజీమూతసంఘాతంబు వాతాహతంబై యుప్పతిల్లి నిప్పులకుప్పలు మంటలప్రోవులం గురిసె- మహాపవనవిజృంభితంబు
లైనకాఱిచ్చు ప్రళయానలంబుచందంబునం దఱికొనియెఁ బ్రచండజంఝానిలప్రేరితసముత్తుంగతరంగావర్తభీషణం
బైనమహార్ణవంబు చెలియలికట్ట దాఁటి వెల్లివిరిసినట్లయ్యె నాసమయంబునం బ్రళయకాలసమేతంబులై యుండె మిన్నుమ
న్నురేయుం బగలనియెఱుంగరాదయ్యె నయ్యవసరంబున॥ క॥ ఆయసురేంద్రుని బహుతర। మాయాజాలంబులకును మాఱె
ఱుఁగక *వజ్రాయుధముఖరాదిత్యుల। పాయంబును బొంది చిక్కుపడిరి నరేంద్రా॥ అప్పుడు॥ క॥ ఇయ్యసురుల చేఁ జిక్కితి।
మెయ్యది దెరువెఱుఁగఁ జోత్తుమిటు వ్రేలయఁగ దే। యయ్యా దేవజనార్దన। కుయ్యో మొఱ్ఱోయటంచుఁ గూయిడిరమరుల్॥ అ
నిమొఱయిడు నవసరంబున॥ మ॥ విహగేంద్రాసనరూఢుఁడై మణిరమావిభ్రాజితోరస్కుఁడై। బహుశస్త్రాస్త్రరథాంగ
సంకలితుఁడై భాస్వత్కిరీటాదిమత్స్వహుఁడై నవ్యపిశంగచేలధరుఁడై సంఫుల్లపద్మాక్షుఁడై। విహితాలంకృతితోడమా
ధవుఁ డుద్భావించె సేనచ్చోటికిన్॥ చ॥ అసురులమాయలన్నియును నబ్జదళాక్షుఁడు వచ్చినంతటన్। గసిబిసియైనిరర్థము
న గ్రక్కునఁబోయెను నిద్రవొందిసం। తసమున మేలుకొన్నగతిఁ గాంచి చెలంగిరి వేల్పులందఱుం। బసచెడ కేలయుండు
హరిపాదపరిష్కృతి సేయ నాపదల్॥ అయ్యెడ॥ గీ॥ కాలనేమి ఘోరకంఠీరవము నెక్కి। †తార్క్ష్యశిరముశూలధారఁ బొడ
వ। నతని పోటుముట్టి హరి కేలనంకించి। దానఁ జావఁ బొడిచె దానవునిని॥ క॥ పడపడి మాలిసుమాలులు। బెదరించినఁ దలలు
ద్రుంచెఁ బృథుచక్రహతిన్। గదఁగొని గరుడుని ఱెక్కలు। చెదరించిన మాల్యవంతు శిరము న్వ్రేసెన్॥ వ॥ ఇట్లు పరమపురు
షుండగు హరికరుణాపరతత్వంబునఁ బ్రత్యుపలబ్ధమనస్కులయిన వరుణ వాయు వాసవ ప్రముఖులు పూర్వంబున నెవ్వారె
వ్వారితోఁ గయ్యంబు సేయుదురు వారు వారలం దలపడి నొప్పించి రయ్యవసరంబున॥ క॥ బాహుబలంబున నింద్రుఁడు। సా
హసమునఁ బలిని గెలువ సమకట్టి సస। న్నాహముననవజ్రమెత్తిన। హాహా నినదంబు సేసి రఖిలజనంబుల్॥ వ॥ ఇట్లు సము
ద్యతభిదురహస్తుండై యింద్రుండు తనపురోభాగంబునం బరాక్రమించుచున్న విరోచననందనునుపలక్షించి యిట్లనియె॥
మ॥ జగతిన్ వైరి‡మొఱంగి గెల్చుటయ సీశౌర్యంబె ధైర్యంబె తా। మగవాఁడయ్యును దన్నుఁ దానెఱిఁగిసామర్థ్యంబు
నుం గల్గియున్బగవానిన్న నిడాఁగె నేని మెయిసూపం జాలఁ డేనింగటా। నగరే బంధులు దిట్టరే బుధులు కన్యల్లూర్తు రేదానవా॥
ఉ॥ మాయలు సేయఁగ రాదుపోనగవు లేమాతోడి పోరాటము। ద్దా యాచిక్కితి వ్రక్కలించెదఁగనద్దంభోళిధారాహతి। న్నీ
యిష్టార్థము లెల్లఁ జూడుము వెసన్నీవారలం గూడుకో। నీయాటోపము నిర్జరేంద్రుఁ డడఁచున్నేఁ డాజిలో దుర్మతీ॥ అనిపలి
కిన వజ్రితో విరోచననందనుండిట్లనియె॥ శా॥ నీవే పోటరివే సురేంద్ర తెగడన్నీకేలగోల్పోటము। ల్లేవే యెవ్వరిపాలఁ బో
యిన దిమేల్కీడుల్విరించాదులున్। ద్రోవం జాలుదురెవ్విధానమునసంతోషింప శోకింపనా। దైవంబేమి కరస్థలామలకమే
దర్పోక్తులుం బాడియే॥ గీ॥ జయములపజయములు సంపదలాపద। లనిలచలితదీపికాంచలములు। చంద్రకళలు మేఘచయఘ
ఉతరగలు మెఱుఁగులమరవర్యమిట్టిపడకు॥ అనియిట్లాక్షేపించి॥ క॥ వీరుఁడు దానవనాథుఁడు। నారసములు నింద్రు మేననా

---

* వజ్రాయుధముఖరాదిత్యులు। ఇంద్రుఁడు మొదలగు దేవతలు. †తార్క్ష్యశిరము। గరుత్మంతుని శిరస్సును. ‡ మొఱంగి। మోసపుచ్చి.

టించిమహో। ఘోరాయుధకల్పములగు।శూరాలాపములు సెవులఁజొని పెన్మఱలన్॥ఇట్లు తథ్యవాదియైనబలి చే*నిరాలంకృతుండై॥క॥శత్రువునాక్షేపంబునఁ। ¶దోత్త్రాహతగజముభంగిఁద్రుళ్లుచుబలి నా।వృత్రారిపీఁచివైచిన। గోత్రాకృతినతఁడు నేలఁగూలెన రేంద్రా॥ క॥చెలికానిపాటుఁగనుఁగొని।బలిసఖుఁడగుజంభుఁడతులబాహాశక్తిన్।జెలితనముసాలనెఅపుచు।నిలునిలుమనిపీఁకఁదాఁకెనిర్జరనాథున్ ॥ క॥‡పంచాననవాహనుఁడై చంచద్గదజంభుఁడెత్తి శైలారినిఁదా।కించిసురేభంబును నొప్పించివిజృంభించియార్చి పేర్చెంగడిమిన్ ॥క॥పీఁక చెడిఘనగదాహతిఁ।దోఁకయుఁగదలింప లేకదుస్సహపీడన్।మ్రోఁకరిలఁబడియె నేలను।సోఁకోర్వకదిగ్గజంబుసుడిసుడిగొంచున్॥అయ్యెడ॥క॥సారథి వేయుహయంబుల। తేరాయత్తంబు సేయదే వేంద్రుఁడుదా।నారోహించెను దైత్యుఁడు।దారతమాతలినిశూలధారంబొడిచెన్॥గీ॥శూలనిహతినొందిస్రుక్కుచునోర్చిన। సూతు వెఱకుమంచుసురవిభుండు।వానిశిరముఁదునిమె వజ్రఘాతంబున।దైత్యసేన లెల్లఁదల్లడిల్ల॥ చ॥ చనిసురనాథు చేఁగలనజంభుఁడుసచ్చుటనారదుండుచె। ప్పినవినివానిభ్రాతలుగభీరబలాధికుఁడాబలుండుపాఁకనముచులాపురందరునిఁగాంచిఖరోక్తులఁదూలనాడుచు। న్ఘనజలధారలన్నగముఁగప్పినచాడ్పునఁగప్పిరమ్ములన్॥ సీ॥ విబుధలోకేంద్రుని వేయుసుట్టింబులనన్నికోలలబలుండదర నేసి।యిన్నూటమాతలినిన్నూటరథమును నారీతినింద్రుప్రత్యంగకములు। వేధించెఁబాకుండు వింటవాఁడస్త్రంబు లేయుటఁదోడుసుట నెఱుఁగరాదు।కనకపుంఖంబుల కాండంబులొకపదియేనింటనముచిదా నేసియార్చె। బలిమినిట్లు ముసుగుపగ వానిరథసూత।సహితముగనుశస్త్రజాలములను।వనజలోకసఖునివానకాలంబున। మొగులగములుమునుఁగమూఁగినట్లు॥అయ్యవసరంబున॥మ॥అమరారాతులబాణజాలములపాలై పోయి తేచెల్ల రే। యమరాధీశ్వరయంచుఖిన్నతనులై యంభోధిలోఁజంచలత్వమునంగ్రుంకువణిగ్జనంబులక్రియందైత్యాధిపవ్యూహమధ్యమునఁజిక్కి రివేర్పులందఱువిపద్ధ్వానంబులం జేయుచున్ ॥ శా॥ ఓహోదేవతలారరకుయ్యెడఁకుఁ డేనున్నాఁడనంచంబుభృ।ద్వాహుండాశరబద్ధపంజరమునంతంజించి తేజంబున।న్వాహోపేతరథంబుతోడవెలికిన్వచ్చెన్నిశాంతోల్లస।న్మాహాత్మ్యంబునఁదూర్పునంబొడుచునామార్తాండుచందంబునన్॥ ఇట్లు వెలువడి॥చ॥విఱిఁగినసేనఁగాంచిసురవీరుఁడొహోయనిబిట్టుఁజీఁటిక్రమ్మఱఁబురికొల్పిపాకబలమస్తకమున్నిశితాస్త్రధారల। న్నెఱపినతీక్ష్ణవజ్రమున నేలకువ్రాల్చెనువానిచుట్టము। ల్వెఱచిరితచ్చమూపతులువిహ్వలులై చెడిపాఱిరార్తితోన్॥అప్పుడునముచినిలువంబడి॥మ॥ తనచుట్టంబులఁజంపెవీఁడనుచునుద్యత్క్రోధశోకాత్ముఁడై।కనకాంతంబును§నశ్మసారమయమున్ఘంటాసమేతంబునై।జనదృగ్దుస్సహమైనశూలమునొగి। న్సారించివైచెన్సురేం। ద్రునిపైదీనహతుండనౌదనిమృగేంద్రుంబోలిగర్జించుచున్॥శా॥ఆకాశంబునవచ్చుశూలమునుజంభారాతిఖండించినా।నాకాండంబులవానికంఠముదెగన్దంభోళియున్వైచెన।స్తోకేంద్రాయుధమున్సురారిగళమున్ద్రుంపంగలేదయ్యెవాఁ।డాకంపింపకనిల్చె దేవనిభుఁడత్యాశ్చర్యముంబొందఁగన్॥వ॥ఇట్లు నిలిచియున్ననముచింగనుంగొనివజ్రంబుప్రతిహతంబగుటకుశంకించిబలభేది యనమనంబున॥ సీ ॥ కొండలఱెక్కలుఖండించివైచుచోవజ్రమెన్నఁడునింతవాడిచెడదు। వృత్రాసురాదులవిదళించెని †పవిదిఱుగదెన్నఁడుపగఁదీర్చికాని।యింద్రుఁడగానకోయేనుదంభోళియుఁగాదకోయిది ప్రయోగంబుచెడెను। దనుజాధముఁడుమొనత్రాకుఁదప్పించెనోభిమరంబు నేఁడేల బెండువడియె।ననుచువజ్రివగవనార్ద్రశుష్కంబులఁ। జావకుండఁదపముసలిపెనకట।యితరమెద్దియైననింద్రప్రయోగింపు। వైశమనుచుదివ్యవాణివలికె॥ఇట్లుపదేశించినదివ్యవాణిపలుకులాకర్ణించియిట్లనియె॥ గీ॥ ఆత్మబుద్ధిఁదలఁచెనార్ద్రంబుశుష్కంబు। గానసాధనంబుఫేనమగును। నదియవైచిదాననమరులుమెచ్చంగ।నముచిశిరముద్రుంచెనాకవిభుఁడు॥ అయ్యవసరంబున॥ సీ॥ పురుహూతునగ్గించిపుష్పాంజలులు సేసిమునులుదీవించిరిముదముతోడ।గంధర్వముఖ్యులుఘనులువిశ్వావసుఁడునుపరావసుఁడునింపెనయఁబాడి।రమరాంగనాజనులాడిరిదేవతాదుందుభులునుమ్రోసె❀దురములోన।వాయువహ్నికృతాంతవరుణాదులునుబ్రతిద్వంద్వులఁగెల్చిరుద్దండవృత్తినల్పమృగములసింహంబులట్లదోలి।రమరవర్యులుదనుజుల¶నదటువాయ।నజుఁడువుత్తేరనారదుఁడఱుగుదెంచె।దైత్యహరణంబువారింపధరణినాథ॥వ॥వచ్చిసురలకునారదుండిట్లనియె॥ శా॥సిద్ధించెన్సురలారమీకమృతమున్శ్రీనాథసంప్రాప్తులై। వృద్ధింబొందితిరెల్లవారలునువిద్వేషుల్మృతిఁబొందిరీ।యుద్ధంబేటికినింకఁజాలుపనిలేదో హో ?పురేయం

---

*నిరాలంకృతుండై।తిరస్కరింపఁబడినవాఁడయి. ¶తోత్త్రములు కోల-ఈటె, గోత్రాకృతిన్।పర్వతమువలె. ‡పంచానన।సింహము. §అశ్మసారమయమున్।ఇనుముచేతఁజేయఁబడినదిన్ని. †పవి।దంభోళి-భిదురంబు-వజ్రాయుధము. వైశము।వేగము. ❀దురము।యుద్ధము. ¶అదటు।గర్వము. ?పురేయంచు।భళీయనిపలుకుచు.

చుసంబంధాలాపములాడి మాన్పె సురలం బాండవ్యవంశాగ్రణీ॥ వ॥ ఇట్లు నారదవచననియుక్తులై రాక్షసులతోడి సంగ్రామంబు సాలించి సకలదేవముఖ్యులును త్రివిష్టపంబునకుం జని రిహతశేషులైన దైత్యదానవులు విపన్నులై నబలిం దోడ్కొని పశ్చిమశిఖరిశిఖరంబుఁ జేరిరి విధ్వంసమానకంధరులయి వినష్టదేహులగు యామినీచరుల నెల్లను శుక్రుండమృతసంజీవని యైన తనవిద్యా పెంపునం జేసి బ్రతికించె బలియును భార్గవానుగ్రహంబున విగతశరీరవేదనుండై పరాజితుండయ్యును లోకకాలవిచక్షణుండగుటం జేసి దుఃఖింపకయుండె నని చెప్పి రాజున కిట్లనియె॥ సీ॥ కైలాసగిరిమీఁద ఖండేందుభూషణుం డొకనాఁడు కొలువున్నయున్నవేళ నంగనయై విష్ణుఁ డసురులవంచించి సురలకమృతంబు చూఱలిడుట విని దేవియును దానువృషభేంద్రగమనుఁడై కడువేడ్క భూతసంఘములు గొలువ మధుసూదనుం డున్న మందిరంబున కేగి పురుషోత్తముని చేతఁ బూజలొంది తానుఁ గూర్చుండి పూజించె దనుజవైరి గుశలమే మీకు మాకును గుశలమనుచు మధురభాషలహరి మీఁద మైత్రి నెఱపి హరుఁ డుపేంద్రుఁ జూచి యిట్లనియెం బ్రీతి॥ సీ॥ దేవ జగన్మయ దేవేశ జగదీశ కాలజగద్వ్యాపకస్వరూప యఖిలభూతములకు నాత్మహేతువునైన యాదియీశ్వరుఁడ వాద్యంతములకు మధ్యంబు బయలును మఱి లోపలయు లేక పూర్ణమై యమృతమై భూరిసత్యమానందచిన్మాత్రమవికారమాద్యమనన్యమశోకంబు నఖిలగుణము సంభవస్థితిలయముల సంగరహితమైన బ్రహ్మంబు నీవ నీయంఘ్రియుగము నుభయసంగవిసృష్టులై యున్నమునులు గోరి కైవల్యకాములై కొల్తు రెపుడు॥ సీ॥ భావించి కొందఱు బ్రహ్మంబు నీవని తలపోసి కొందఱు ధర్మమనియుఁ జర్చించి కొందఱు సదసదీశ్వరుఁడని పరఁగఁ గొందఱు శక్తిసహితుఁ డనియుఁ జింతించి కొందఱు చిరతరుం డవ్యయుఁ డాత్మతంత్రుఁడు పరుం డధికుఁ డనియుఁ దొడరి యూహింతురు తుది నద్వయద్వయ సదసద్విశిష్ట సంశ్రయుఁడవీవు తలఁపనొక్క యంతవస్తుభేదంబు గలదె కంకణావలుల పసిఁడి యొక్కటియుఁ గాదె కడలు పెక్కైన వార్ధి యొక్కటియ కాదె భేదమంచును నిను వికల్పింపవలదు॥ సీ॥ యద్విలాసము మరీచ్యాదులెఱుంగరు నిత్యుఁడనై యున్న నేనెఱుంగ యన్మాయనంధులై యమరాసురాదులు •వనరెదరటయున్నవారలెంత నేరూపమునఁ బొందకే పారుచువు నీవు రూపివై సకలంబు రూపుసేయ రక్షింపఁ జెఱుపఁ గారణమైన సచరాచరాఖ్యమై విలసిల్లు నంబరమున నిలుఁ జేరీతి విహరించు నట్ల నీవు గలసి వర్తింతు సర్వాత్మకత్వమొప్ప జగములకు నెల్ల బంధమోక్షంబు నీవ నీవ సర్వంబు దలపోయ నీరజాక్ష॥ మ॥ ఘనతన్నీమగపోడుముల్పలుమఱుం గన్నారఁగన్నారమే నిను విన్నారము చూడ మెన్నఁడును మున్నీయాహుచందంబు మోహినివై దైత్యులకన్నుఁ బ్రామి యమృతంబింద్రాదిదేవాళికిచ్చిన నీరూపముఁ జూపుమా *కుతుకమ్ముఁ జిత్తంబునం బుట్టెడిన్॥ క॥ మగవాఁడవై జగంబులఁ దగిలి చివిక్కులను బెట్టుదంటవు నీకున్ మగువతనంబున జగములఁ దగులముఁ బొందింప నెంతదడవు ముకుందా॥ వ॥ అని పలుకుచున్న శూలపాణిచేన పేక్షితుండై విష్ణుండు భావగంభీరంబుగ నవ్వి నివ్వటిల్లనవ్వామదేవున కిట్లనియె॥ శా॥ శ్రీకంఠా నినునీవ యేమఱక మీ చిత్తంబు రంజించెద నాకద్వేషుల డాగురించుటకునై నాఁ డేను గైకొన్నకాంతాకారంబు జగన్నిమజ్జన మునీకేఁ జూచెదే చూపెదన్ గైకోనర్హములం త్రికాముకులు సంకల్పప్రభావంబులన్॥ వ॥ అని పలికి కమలలోచనుండంత

## శ్రీహరి తనమోహినీరూపంబు చేత నీశ్వరుని మోహింపఁ జేయుట.

ర్హితుండయ్యె నయ్యుమాసహితుం డయిన భవుండు విష్ణుం డెడబోయెనో యెందుఁ జొచ్చెనో యని దశదిశలుం గలయ నవలోకించి చూచుచుండం దనపురోభాగంబున॥ సీ॥ ఒకయెలదోఁటలో నొకవీథి నొకనీడఁ గుచకుంభములమీఁదికొంగుదలఁగఁ ¶కబరికాబంధంబు గంపింప నుమ్మటి పైఁ జికురజాలంబులు చిక్కువడఁగ నునుమానమైన మధ్యము వల్లాడఁ జెక్కులఁ గర్ణకుండల కాంతి గంతులిడఁగ నారోహభరమున నడుగులు వడఁబడ దృగ్దీప్తిసంచులు దిశలు గప్ప వామకరమున జారిన వలువ వట్టి కనకనూపురయుగళంబు ఘల్లనంగఁ గంకణంబులు ఝుణఝుణత్కార మెసఁగ బంతి చేనాడు ప్రాయంపు టింతిఁ గనియె॥ వ॥ కని మున్ను నాఁగువన జిగిసగమయిన మగవాఁడమ్ము సువవ యోరూపగుణవిలాసంబులు మన్ననూటింపంగను వెట్టక తప్పక చూచి మెత్తనైన చిత్తంబున॥ శా॥ ఈ కాంతాజనరత్న మెవ్వరిదొకో యీయాకృతి రూపంబును నేకల్పంబులయందుఁ గానమజుఁడీ యింతి సృజింపఁ గడా లేకుంటెల్ల నిజంబువల్ల భత నీలీలావతిం జేరఁగా నేకాంతుండుఁ గలండొ క్రీడలకు నాకీయింతి సిద్ధించునే॥ వ॥ అనితలఁచియుం జెలువవిలుకుని కోలలు మేనఁ గీలింప ననుచు నెఱవిలుకు నెఱుంగుపడం దెలుపమఱిమిన ‡కురులుమ కొగిలిం పుడివదలి కదలి భుజముల మెడలనదిటి చెదరిన కుఱులు నొసలి మృగమదతిలకంపుటసలనం సలపిసవిసనను మొగము మెఱుంగులు దశదిశలంబసలుగొలుపఁ జెలువున గవు మెఱయను నుజమాటఁగడఁ బడి పులకలు గొన హృదయానంద కందకం

---

•వనరెదరు దుఃఖించుచున్నారు. *కుతుకము సంతోషము. ¶కబరికాబంధము కొప్పు. ఆరోహ పిఱుఁదు. ‡కురులు కొప్పు.

జనుకంచుకంబు కరారవిందంబునం దెమల్చి యక్కునం జేర్చి చెక్కునహత్తించి చుబుకంబు మోఁపి చూచుకంబులం గది
యించి నఖంబుల మీటుచు మెల్ల మెల్లనఁ గెల్లాడుచుఁ గరకమలములకనకమణివలయములు ఘుణఘుణంబనం గుచకలశ
ములు నొక్కటొకటి నెఱయ నెడనుకుడినించడంబడఁ గ్రమ్మున నెగరఁ జిమ్ముచు నెగరఁ జిమ్మితనకుఁదా నెకొన్ని చిన్నిపన్ని
దంబులు చేసుకొని బడుగునడుము జెడఁగి వడవడవడంక నరుతిసరులు కలయంబడఁ దిఱుగుచుఁ బెనుకువలుగొనఁ జెవులతొ
డవులరుచులు గటములనటనములు సలుపఁ బవిరిఖిఱిగి యొడయుచు, నొడిసి కెలంకులకుం జడియుచు, జడిసి జడను పడకవలు
వ నెలవు వదలి దిగంబడం గటిస్థలంబునం గాంచీకనకమణికింకిణులు మొఱయఁ జరణకటకమ్ములు ఘల్లుఘల్లనంగ మితిదప్పి
న మోహాతిరేకంబు నుప్పొంగ వెనుకొని యుఱికి పట్టుచుఁ బట్టి పుడమిఁ బడవైచి పాటు వెంట నెమింటి కెగసినం గెంటకఁ గరం
బునం గరంబు దిరంబై పలుమఱు నడఁచుచు, నెగయు నెడ దిగంబఱతఁజెనీలంపు మెఱుంగునిగ్గుసోగపగ్గంబులు వలలువై దిరా
దిగిచినపగిది వెనుకొనంగ విలోకనజాలంబులు నిగుడించుచుఁ, గరలాఘవంబున నొకటి పదినూఱు వేయి సేసి నేర్పువాటిం
చుచు, నరుణచరణకమలరుచుల నుదయశిఖరిశిఖరతరణికరణి సేయుచు ముఖచంద్రచంద్రికలు మండలంబులుగావించుచు
నెడనెడ నురోజమర్గనిర్గతచేలాంచలంబుఁ జక్కనొత్తుచుఁ, గపోలఫలకాలోలఘర్మజలబిందుబృందంబులు నఖాంతంబుల
నోసరించుచు, నధరబింబారుణసంభ్రాంత సమాగతరాజకీరంబులం జోపుచు, ముఖసరోజపరిమళాసక్తమత్తమధుపం
బుల నివారించుచు, మందగమనాభ్యాసకుతూహలాయత్తను రాళయుగ్మంబులకుం దలంగుచు, విలాసవీక్షణానందితమ
యూరమిథునంబులకు నెడగలుగుచుఁ, బొదరిండ్లయారంబులకుం బోకమలంగుచుఁ, గరకిసలయాస్వాదకాముకకలకంఠ
దంపతులకు దూరించుచుఁ, దీఁగెయుయ్యేలల నూఁగుచు, మాధవీమంటపంబు లెక్కుచుఁ, గుసుమరేణుపటలంబుల గుబ్బల్లు
వ్రాకుచు, మకరందస్యందబిందుబృందంబు త్తరించుచుఁ, గృతకశైలంబుల నారోహించుచుఁ, బల్లవపీఠంబులం బరిశ్రమం
బువుచ్చుచు, లతాసౌధభాగంబులఁ బొడఁజూపుచు నున్నతకేతకీస్తంభంబుల నెఱుఁగుచుఁ, బువ్వుదళఖచితవాతాయనం
బులఁ దొంగిచూచుచుఁ, గమలషండపాలికల నాలంబించుచుఁ, జంపకగేహాళీమధ్యంబుల నిలువంబడుచుఁ, గదళికాపత్రవా
తంబుల నొఱయుబరాగనిర్మితసాలభంజికానివహంబుల నాదరించుచు, మణికుట్టిమంబుల మురియుచుఁ, జంద్రకాంతవేదిక
ల నెలయించుచు, రత్నపంజరశారికానివహంబులకుం జదువుఁ జెప్పుచుఁ, గోరినక్రియం జూచుచుఁ, జూచినక్రియ మెచ్చుచు
మెచ్చినక్రియ వెఱఁగుపడుచు, వెఱఁగుపడినక్రియ మఱచుచు, మఱవకనేకాంతంబగు నవ్వానాంతఁబున ననంతవిభ్రమంబు
లఁ జగన్మోహినియై విహరించుచున్న సమయంబున॥ గీ॥ వాలుగంటి వాఁడివాలారుచూపుల। శూలిధైర్యమెల్లఁ గోలుపోయి।
తఱలిమొఱుక లేక మఱచెఁ గుణంబుల। నాలి మఱచె నిజగణాళి మఱచె॥ అప్పుడు॥ గీ॥ ఎగరవైచి పట్టనెడ లేమి చేదప్పి। వ్రాలు
బంతిఁ గొనఁగ వచ్చునెడను। బడఁతివలువ వీడిపడియె మారుతహతిఁ। జంద్రధరుని మనము సంచలింప॥ మ॥ రుచిరాపాంగిసివ
స్త్రబంధనపరర్ణరోమాంచవిభ్రాజితం। గుచభారానమితం గరద్వయపుటీగూఢీకృతాంగింజల। తక్కచబంధంగని మన్మథా
తురతనాకంపించి శంభుండుల। జ్జచలింపందన కాంతసూడఁగదిసెం జంద్రాస్యకేల్దమ్మికిఁ॥ గీ ॥ పదము సేరవచ్చు ఫాలా
క్షుఁ బొడఁగని। చీరవీడిపడిన సిగ్గుతోడ। ముసువనగుచుఁ దరులమాటున డాఁగెను। వేల్పుఱేఁడు నబల వెంటఁబడియె॥ వ॥ ప్ర
బలోద్యత్కరిణింగరీంద్రుఁడు రమింపన్వచ్చు లీలన్మృపుం। డబలా పోకుము పోకు వేయనుచు డాయంబాఱి కెంగేలఁ దాఁ। గ
బరీబంధము వట్టి సంభ్రమముతోఁ గౌఁగిల్లనూరార్చెనం। తబహిగ్గిప్రక్రియ నెట్టకేలఁ గదియం దద్బాహునిర్ముక్తయై॥
సీ॥ వీడివెన్నునవాడు వేణీభరంబుతో జఘనభారాగతశ్రాంతితోడ। మాయావధూటియై మఱలిచూచుచుఁ బాఱు విష్ణున
చ్యుతకర్ము వెంటఁదగిలి। యీశానుమఱలజయించె మరుండనఁ గరిణి వెన్నను కరికరణిఁ దాల్చి। కొండలు నేఱులు కొలఁకులు
వనములు దాఁటి శంభుఁడు సనందన్మహాత్మ। నిర్మలామోఘవీర్యంబు నేలమీఁదఁ। బడినచో నెల్ల వెండియుఁ బైఁడియయ్యె।
ధరణి వీర్యంబు పడఁదన్నుఁదా నెఱింగి। దేవమాయాజడత్వంబు దెలిసె హరుఁడు॥ క॥ జగదాత్మకుఁడగు శంభుఁడు। మగిడెను
హరి నెఱిఁగి తనదు మాహాత్మ్యమున। న్విగతత్రపుఁడై నిలిచెను। మగువతనంబుడిగి హరియు మగవాఁడయ్యెన్॥ గీ॥ కాముఁ
గెలువవచ్చుఁ గాలారిగావచ్చు। మృత్యుంజయము గలిగి మెఱయివచ్చు। నాఁడువారిచూపుటంపఱ గెలువంగ। వశముగాదు
త్రిపురవైరికైన॥ వ॥ ఇట్లు పురుషాకారంబు వహించిన హరిహరునకిట్లనియె॥ సీ॥ నిఖిలదేవోత్తమ నీవొక్కరుఁడు దక్క నె
వ్వఁడు నా మాయ నెఱుఁగ నేర్చు। మానినియైన నా మాయ చే మునుఁగక ధృతి మోహితుండవై తెలిసితీవు। కాలరూపంబునఁ
గాలంబుతోడుత నాయంశమని మాయనధివసించు। నీమాయ నన్ను జయింప నేరదు నిజమకృతాత్ములకు నెట్లు మనుపలభ్య।
మిపుడు నీనిష్ఠ పెంపున నిలిచితనుచు। సత్కరించిన సఖ్యంబు చాల నెఱపి। దక్షతనయగణంబులుఁ దన్నుఁ గొలువ। భవుఁడువి

చ్చె సెఁదన నిజభవనమునకు॥ శా॥ పారావారముఁ ద్రచ్చుచో గిరిసముద్యద్భారమైకచ్ఛపా।కారుండై నరమేశువర్తనము నాకర్ణింపఁ గీర్తింపసం।సారాంభోనిధిలో మునుంగు కుజనుల్ సంశ్రేయముం బొందివి। స్తారోదారసుఖంబుఁ జెందుదురు తథ్యం బెంతయు న్భావరా॥ మ॥ ఎలమి న్దైత్యులనాఁడు రూపమున మోహింపించి పీయూషముం। జలితాపన్నులకున్సురోత్తములకుం జక్కన్విభాగించి నిర్మలరేఖన్విలసిల్లు శ్రీవిభుని దన్మాయావధూరూపముం। దలఁతున్మ్రొక్కుదు నాత్మలోన దురితధ్వాంతోగ్రరూపంబుగ న్॥ అని చెప్పి శుకుండిట్లనియె॥ గీ॥ నరవరాధీశ యిప్పుడు నడుచుచున్న। వాఁడు సప్తమమనువు వైవస్వతుండు। శ్రాద్ధదేవుండనందగు జనవరేణ్య। పదురు నందనులతనికిఁ బ్రకటబలులు॥ వ॥ వారలిక్ష్వాకుండును, నభగుండును, ధృష్టుండును, శర్యాతియు, నరిష్యంతుండును, నాభాగుండును, దిష్టుండును, గరూశకుండును, బృషధ్రుండును, వసుమంతుండునను వారు పదుగురు రాజులు- పురందరుండను వాఁడింద్రుండు, నాదిత్యమరుదశ్వినీవసురుద్రసంజ్ఞలు గలవారు దేవతలుఁ-గౌతమకశ్యపాత్రివిశ్వామిత్రజమదగ్నిభరద్వాజవసిష్ఠులను వారు సప్తర్షులై యున్నవారందుఁ గశ్యపునకదితిగర్భంబున విష్ణుండు వామనరూపుండై జనియించి యింద్రావరజుండయ్యె నిప్పుడేడు మన్వంతరంబులు సెప్పంబడియె-రాఁగల మన్వంతరంబులును, శ్రీహరిపరాక్రమంబుం జెప్పెద దత్తావధానుండవై వినుమని శుకుండిట్లనియె॥ సీ॥ జననాథ సంజ్ఞయు ఛాయయు నను వారు గలరర్కునకు విశ్వకర్మతనయ। లిరువురు వల్లభలిటమున్న చెప్పితిఁ బరగఁ దృతీయయు బడబయనఁగ। సంజ్ఞకు యముఁడును శ్రాద్ధదేవుండును యమునయుఁ బుట్టిరి హర్షమెసఁగ। ఛాయకుఁ దపతియు సావర్ణియను శనైశ్చరుఁడును గలిగిరి సంవరుణుఁడు। దపతి నాలుగఁ గైకొని తా వరించె। నశ్వియుగళంబు బడబకు నవతరించె। వచ్చు నష్టమ వసువు సావర్ణి వాఁడు। తపము సేయుచునున్నాఁడు ధరణినాథ॥ క॥ ఒకపరిఁ జూచిన వెండియు। నొకపరిఁ జూడంగ లేకనుండు సిరులకు। న్నొక న్నొకని చేటు వేళకు। నొకఁడొక్కఁడు మనువుగా చియుండు నరేంద్రా॥ వ॥ సూర్యసావర్ణి మన్వంతరంబున నతనితనయులు నిర్మోహవిరజస్కాద్యులు రాజులును, సుతపోవిరజామృతప్రభులను వారు దేవతలును, గాఁగలుగు గాలవుండును, దీప్తిమంతుండును, పరశురాముండును, ద్రోణపుత్రుండగు నశ్వత్థామయు, గృపుండును, మజ్జనకుండగు బాదరాయణుండును, ఋశ్యశృంగుండను వారు సప్తర్షులయ్యెదరు వారలిప్పుడు దమతమ యోగబలంబుల నిజాశ్రమమండలంబులం జరియించుచున్నవారు విరోచననందనుండగు బలి యింద్రుండయ్యెనని చెప్పి శుకుండిట్లనియె॥ సీ॥ బలిమున్న నాకంబు బలిమిమైఁ జేకొన్న వామనుండై హరి వచ్చి వేడఁ।బాదత్రయం బిచ్చి భగవన్నిబద్ధుఁడై సురమందిరముకంటె సుభగమైన। సుతలలోకంబున సుస్థితి నున్నాఁడు వెతలేక నిట మీఁద వేదగుహికి। నాసరస్వతికిఁ దానఁట సార్వభౌముండు నా ప్రభువై హరి నాకవిభునిఁ।బదవిహీనునిఁ జేసి బలి దెచ్చి నిలుపును।బలియు నిర్జరేంద్రపదము నొందు। నింద్రపదము హరికి నిచ్చిన కతమున। దానఫలము చెడదు ధరణినాథ॥ వ॥ అటమీఁదటి కాలంబున వరుణనందనుండగు దక్షసావర్ణి దొమ్మిదవ మనువయ్యెడి నతనికొడుకులు, ధృతకేతుదీప్తకేతుప్రముఖులు రాజులును, బరమరీచిగర్గాదులు నిర్జరులును, నద్భుతుండను వాఁడింద్రుండును, ద్యుతిమత్ప్రభృతులగు వారలు ఋషులునయ్యెదరందు॥ గీ॥ దనుజహరణుఁడంబుధారకాయుష్మంతు। నకు జనించి రక్షణంబు సేయ। మూఁడులోకములను మోదంబుతో నేలు। నద్భుతాఖ్యనొప్పు నమరవిభుఁడు॥ వ॥ మఱియు నుపశ్లోకసుతుండగు బ్రహ్మసావర్ణి దశమమనువయ్యెడిఁ దత్పుత్రులు భూరిషేణాదులు భూపతులును, హవిష్మత్ప్రముఖాదులు మునులును, శంభుండను వాఁడింద్రుండును, విబుద్ధాద్యులు నిర్జరులునయ్యెదరందు॥ గీ॥ విశ్వజిత్తునింటవిభుఁడు విషూచికిఁ సంభవించు నంశసహితుఁడగుచుఁ। జెలిమి శంభుతోడఁ జేయు విష్వక్సేనుఁ। డనఁగ జగము గాఁచు నవనినాథ॥ వ॥ మఱియుం దదాగమిష్యత్కాలంబున ధర్మసావర్ణి పదనొకొండవ మనువయ్యెడి మనుతనూజులు సత్యధర్మాదులు పదుండ్రు ధరణిపతులును, విహంగమ కామగమన నిర్వాణరుచులను వారు సురలును, వైధృతుండను వాఁడింద్రుండు, నరుణాదులు ఋషులయ్యెదరందు॥ గీ॥ అంబుజాతనేత్రుఁడా సూర్యసూనుఁడై। ధర్మసేతువనఁగఁ దగఁ జనించి। వైభవాఢ్యుఁడగుచు వైధృతుఁ డలరంగఁ। గరుణఁ ద్రిజగమును గావఁగలఁడు॥ వ॥ మఱియుఁ దద్భవిష్యత్సమయంబున భద్రసావర్ణి పండ్రెండవ మనువయ్యెడి-నతని నందనులు దేవవదుపదేవదేవజ్యేష్ఠాదులు వసుధాధిపతులును, ఋతుధాముండను వాఁడింద్రుండును, హరితాదులు వేల్పులును, దపోమూర్తితపాగ్నీధ్రకాదులు ఋషులయ్యెదరందు॥ గీ॥ జలజలోచనుండు సత్యతపస్సూనృతలకు సంభవించుఁ దనయుఁడగుచు। ధరణిఁ గాఁచు నంచితస్వధామాఖ్యుఁడై। మనువు సంతసింప మానవేంద్ర॥ వ॥ మఱియుం దదేష్యత్కాలంబున నాత్మవంతుండగు దేవసావర్ణి పదమూఁడవ మనువయ్యెడి-మనుకుమారకులు చిత్రసేనవిచిత్రాదులు జగతీనాయకులు-సుకర్మసుత్రామసంజ్ఞలు గలవారు బృందారకులును, దివస్పతియను వాఁడింద్రుండును, నిర్మోహతత్త్వదర్శాద్యులు ఋషు

ఏర్యోదరంబు॥ గీ॥ అవని దేవ కుమారు(డై నగీప్పలికిని। యోగవిభుండు నా(గనుద్భవించి। వనజనేత్రు(డాదివస్పతి కెంత
యుసఖ్యమాచరించు జగతినాథ॥ వ॥ మఱియు నటవచ్చు కాలంబున నింద్రసావర్ణి పదునాలుగవ మనువయ్యెడి- మనునంద
నులురుగంభీరవస్వామలురాజులును, బవిత్రచాక్షుషులను వారు దేవగణంబులును, శుచియను వా(డింద్రుండును, అగ్ని, బా
హు, శుచి, శుక్ర, మాగధామలు ఋషులునయ్యెదరందు॥ గీ॥ తనరసత్రాయణునకు వితానయందు। భవమునొందెడి హరిబృ
హద్భానుడన(గ। విస్తరించు(గ్రియాతంతువిసరములను। నాకవాసులు ముదమొందన రవరేణ్య॥ క॥ జగదీశ త్రికాలముల
ను। బొగడొందు మనుప్రకారములు సెప్ప(బడె। న్దగ(బదునలువురు మనువులు। దెగయుగములు వేయునడువ దివసమునకగు‌ర్
వ॥ అనిన(బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె॥ గీ॥ ఈపదంబులందు నీమనుప్రముఖుల। నెవ్వరను పువారలేమి
కతన। నధికవిభవులైరి హరి యేలజనియించె। నెఱుగ(బలుకుమాకు నిద్ధచరిత॥ వ॥ అనినం బారాశర్యకుమారుండిట్లనియె॥
సీ॥ మనువులు మునులును మనుసుతులింద్రులు నమరులు హరియాజ్ఞ నడ(గువారు। యజ్ఞాదులందు హరి పౌరుషాకృతులా
మనువులు దత్సహాయశక్తి। జగములు నడుపుచు రోగి నాల్గుయుగములక డపట(గాలసంగ్రస్తమైన। నిగమచయంబును నిజ
తపోబలముల మఱల(గాంతురు ఋషివరులు దొంటి। పగిది ధర్మంబు నాలుగుపాదములను। గలిగి వర్తించు మనువులు కమల
నేత్రు। నాజ్ఞ(దిరుగుదు రేలు మరవనిపతులు। జగతి భాగించి తమతమసమయములను॥ వ॥ మఱియుం బ్రాప్తులైన వారలనిం
ద్రపదంబులను, బహుప్రకారంబుల దేవపదంబులను, హరి ప్రతిష్ఠించుచుండు- వారలు విహితకర్మంబుల జగత్త్రియం బు
నుంబరిపాలింతురు- లోకంబులు సుష్టంబులై యుండు॥ సీ॥ యోగీశరూపు(డై యోగంబు(జూపుచు మౌనిరూపమున(గ
ర్మంబు దాల్చు। సర్గంబు సేయు(బ్రజాపతిరూపు(డై యింద్రు(డై దైత్యుల నేపడంచు। జ్ఞానంబు నెఱిగించు(జతురసిద్ధాకృ
తి(గాలరూపమున(బాకంబు సేయు। నానావిధాకార నామరూపంబుల(గర్మలోచనులకు(గాన(బడు(డు। చనినరూపము
లను జనురూపములనింక(। జన(గనున్న రూపచయమునతడు। వివిధు(డైయనేకవృత్తి వెలుంగును। విష్ణు(డవ్యయుండు విను

## ⟹ శ్రీ వామనచరిత్రకథాప్రారంభము. శ్రీ ⟸

లచరిత॥ అనిన భూవరుండిట్లనియె॥ మ॥ బలినంభోరుహనేత్రు(డేమికొఱకై పాదత్రయి న్వే(డెని। శ్వలు(డు న్పూర్ణు(డుల
బ్ధకాము(డు రమాసంపన్ను(డై దా(బర। స్థలికిన్ దీనునిమాడ్కి- నేలచని యోర్ దప్పేమియున్ లేకని। మ్మలుషుం బంధన మే
లచేసెను వినం గౌతూహలంబయ్యెడిన్॥ అనిన శుకుండిట్లనియె॥ సీ॥ పురుహూతు చే నెద్దిపోయి భార్గవుల చేబలి యెట్ట కేల
కు బ్రతికి వారి। చిత్తంబు రా(గొల్చి శిష్యు(డై వర్తింప వారు నాతని భక్తివలన మెచ్చి। విశ్వజిద్యాగంబు విధితోడ(జేయిం
పభవ్యకాంచనపట్టబద్ధరథము। నరక- వాజుల(బోలు హరులు కంఠీరవధ్వజము మహాదివ్యధనువు(బూర్ణ। తూణయుగళంబు(
గవచంబు(దొలుత కుహూను। పావకుండిచ్చె* నన్లానపద్మమాల(। గలుషహరు(డగు తన తాతకరుణనొస(గె। సోమసంకా
శశంఖంబు శుక్రు(డిచ్చె॥ ఇవ్విధంబున॥ క॥ పాణియు రథియు(గృపాణియు(। దూణియు ధన్వియును బ్రగ్వితురగియు దేహ।
త్రాణియు ధిక్కృతవిమత। ప్రాణియు మణికనకవలయపాణియు నగుచున్॥ మ॥ పలుదానంబుల విప్రులం దనిపి తద్భద్రో
క్తులం బొందిపె। ద్దలకున్ మ్రొక్కి- విశిష్టదేవతలనంతర్భక్తి(బూజించి ని। ర్మలు(బ్రహ్లాదుని(జీఱి నమ్రశిరు(డై రాజద్రథా
రూఢు(డై। వెలి(గెన్ దానవభర్తశైలశిఖరోద్వేలద్ధవాగ్ని ప్రభన్॥ క॥ దండితమృత్యుకృతాంతులు। ఖండితసురసిద్ధసాధ్య
గంధర్వాదు। ల్పిండితదిశలమరాహిత। దండాధీశ్వరులు సములు దన్నుం గొలువన్॥ క॥ చూపుల(గదనము ద్రింగుచు। నేపు
నదివిభువియునావలీవల సేయన్। రూపించు చదను జేంద్రు(డు। ప్రాపించెను దివిజనగరపథమున రేంద్రా॥ వ॥ ఇట్లు బలవం
తుండగు బలి సురేంద్రుని సాధింపసమ ట్టిద డగమనంబు సేసి నిడుదపయనంబుల(జనిచని॥ మ॥ కనియె న్పుణ్యజనౌకము
న్విగతరోగస్వప్నపీడాన్యుఖా। దనసంకేతము(బుష్పపల్లవఫలోద్దామద్రుమానీకము। న్స్వనితోద్ధూతపతాకమున్బ్రవిచర
ద్వైమానికానీకము। న్ఘనగంగాసలిలైకమున్మఘవయుక్తశ్రీకమున్నాకమున్॥ వ॥ కనిరక్క సులతేఁడు వెక్కసంబైచా
ల్పుగల వేల్పుల నెలవు డరియంజొచ్చి చెచ్చెరముందటకుంజని చనిముందట నెడపడక మొనమొగ్గయిగురు చిగురుతలిరాకు
జొంపంబునన మొగుడ మొగ్గయ లవిరి నెఱవిరిగుత్తిపిందె పూ(పదోరగాయపండు గెలంకతండంబుల వ్రేగున వ్రేగులాగ
వేకమూ(గి వీగి నేకలగు మ్రాకుల ప్రోకల కు(జెంటలగు పెందోటలును, తో(టలగాలంబులై నివ్వటిల్లువవ్వంపుగ్రొ
వ్విరులకు(గవ బువివ్వ కక సిమసలుగలిగి ముసరికొసరి పూని పొకొని తేనియలాని విసరుగలిగి మసరుగ విసిక్రొవ్వి తుమ్మె
గొంజిఝుమ్మఝుమ్మనుచు ఝుంఝాటించు తేటిదాటులును, దాట్లువడక నాటుకొని కూడిజోకుపడువక క్రొమ్మావుల
కమ్మ మ్మల నిమ్ముల ముసరి పసిమిగలకిసలయంబులు పొస(గ మెసంగికిసరువడక సరుకొంగొట్టుపెట్టడిత నంబులమించిక

పాలించుకోయిలలమొత్తంబును, మొత్తంబులై దిత్తంబులుమత్తంబులుగఁద త్తరంబునందీయనిపండ్లకుఁ గదియంబడిక
య్యంబు సేసియాపరేఁగి బేసంబులు గాసంబులుగొని వాసికెక్కి పలుబాసలాడుచు బహుప్రకారంబులగు కీరంబులును
కీరంబులకు నలిగడచిమింటవంట నెగసి పిట్టలపట్టుఁ జేరినయిట్టట్టు దనక నెట్టువ్రాలుచు నింపుగలరవమ్ములుగలుగు కలరవ
మ్ములును, కలరవంబులలరంగలంకనికొలంకుల కెలంకులకడపలం బ్రియలనిడుకొని క్రమ్మిదొమ్ముఁజేసి మొలతమ్మితూండ్ల
వాండ్లు చంచువులంజించి మెక్కి చొక్కి రెక్కలమిక్కిలికలకలపడుచు* నలబలంబులు సేయుహంసంబులును, హంసరుచి
జనితవిసనసములవికవికననగుచుంబనగలిగిమిసమిసమెఱచుపసిఁడికెందమ్ములిందిరాసుందరమ్ముల చందమ్ములగు కొలంకు
లును, కొలంకులకరుల్లఁదడిసి వడవడవడంకుచునల్లిబిల్లులుగొని సాగినతీఁగెయిండ్లఁ గండ్ల యీరములందరుమములు నెడిపలు
పువులకమ్మవలపుల గ్రేగునంచూరలేకయీడిగలఁబడుగాడ్పులును, గాడ్పులవలన నెగసిగగనమునవిరిసిపలువన్నెలం జె
న్నగు మేలుకట్టుపుట్టంబులతెఱంగులకట్టంబులయిన కుసుమపరాగంబులును, పరాగంబుల సరాగంబులగు ప్రాస్తవంతల
శోభలసంపులుగొని నెమ్మగ్గ వెట్టుచు నెడవుగలపాదువులుగదలవాడలజాడలంబడుచుగులిసమాడల క్రీడల నేడుకలంగూడు
కొనియుండ్లవాకిళ్లకుం జేరిపొదులకోరి కెలుసారి కెలకుచునమృతంబుగురియుకామధేనువులును, కామధేనువులకునిలువ
నీడలగుచునడిగినజనమ్ములకుధనమ్ములుఘనమ్ముగఁబొసఁగుకల్పతరువులును, కల్పతరువులపల్లవపుంజములగుంజనులకుపిటీ
చియుమ్మచుమచ్చికలకలిమిని మెచ్చుచుఁ జరమగిరిచరులనడుమడంతులనడలకుగురువులగుమత్తేభంబులును, భంబులసరస
మెసరుకొనివరుసఁబడుసదనము వెడలిసుకరములగుమకరతోరణస్తంభంబులును, తోరణస్తంభంబులచేరువచేరువనిలిచి
చెలువుమీఱుచుండొఱవెలికిన బెడినములగునవకంపుమెఱుఁగుచిగురుటడిదముల తెఱంగునవలుకడసంపదలుగలుగుశంప
లసొంపునంగరచరణాదిశాఖలుగలచంద్రరేఖలపోడిమినివాహినిగలమోహినీవిద్యలగ్రద్దనఁజూపులకుందీపులొడవించు
చుసర్మకర్మంబులయశంబులవశంబుగలిగియనూనంబులగు విమానంబులెక్కి చక్కవచ్చినసచ్చరిత్రులకుంజెచ్చెరనె
డుఱుసనిఘూకొనితోకొనిపోవురంభాదికుంభికుంభకుచలకలకలంబులును, కలహంసకారండవకోకసారసబృందసుందర
సుందరియు నిందీవరారవిందనందదిందిందిరయు, నభంగయు సభంగయునగుగంగనింగికిఁబొంగిమిగులదిగులువడఁబొగ
డ్తల కెక్కినయగడ్తలును, నగడ్తలమిన్నేటితేఁటనీటనీఁటులేనిపాటిసూటిచల్లులాటలమేటికూటువలుగొనుచునేచినఖే
చరకన్యకావారంబులును, వారవనితాసుపూజితదేహళీపాటవంబులగుగోపురకనకకవాటంబులును, కవాటవేదికాఘు
టితమణిగణకిరణోదారంబులగు నింద్రనీలస్తంభగంభీరంబులును, మీరరసజలధివేలాకారంబులగుశుద్ధస్ఫటికబద్ధను
పొకాత్మానంబులగుసోపానసుకుమారంబులును, గంభీరవిశులకనులదాగసాలికామాలికోవారంబులగుచతుర్ద్వారం
బులును, ద్వారదేశంబులసావళ్లంగావళ్లుండి ప్రొద్దున్నోకరక్కసులవేల్పులకయ్యంబులు నెయ్యంబులు సెప్పికొనుచున్న
యస్త్రశస్త్రధారులును, శూరులైనమహాద్వారపాలకవీరులును, మహారజతప్రదీపంబులగువజ్రవజ్రంబులును, వప్రోప
రివజ్రమద్యశిరోభాగచంద్రకాంతకాంతారుణహిమకరకిరణముఖరంబులగుసాలశిఖరంబులును, శిఖరస్తోమధామనిక్కం
తతారకంబులును, తారతారమణిశిలాకారకకోరంబులగుచుమిగులగరితయగు నగరిసిరిమీఁజనమరమొగులుపొడగనిచి
లుకడలకునలువనడిగికొనిపడసినపసిఁడితెరవలవమవునబెడంగునందోరంబులగుప్రాకారంబులును, ప్రాకారకాంచనాం
చితయుద్ధసన్నద్ధమహాఖర్వగంధర్వవాహినీపాలకంబులగుమారకతాట్టాలకంబులునట్టాలకోత్తుంగవజ్రమయస్తంభో
దంచనంబులును, బరభటప్రాణవంచనంబులును, సముదంచనంబులనగునుదంచనంబులకుపలురథంబులయిలుసులొఱసి
కొనంగోటయీవలావలకావలిదివియలకరణిపు దిరములగుచున్న దినకరహిమకరమండలంబులును, హిమకరమండలం
బునిద్దంపుటద్దంబనిమూగితొంగిచూచుచునళికఫలకఫలములగుకలములుగొనునలకములందరమిటిలకములందెరసపరచు
కొనిసమయిఘ్నులవెనుకనొవిగికదిసిముకురమునం బ్రతిఫలితులైనపతులితరసతులరతులకనుమతులనికన్నుచెన్నుమరల
నీడతలంగికలంగిచనికాంతులుసొలయమునుదలపనేకాంతంబులై గగనసముచ్ఛేదనంబులయినరాజసౌధంబులును, సౌ
ధంబులసిరులమెత్తియపుసరులతోడినిబ్బరపుగుబ్బచన్నులచెన్నులంబ్రక్కలంజుక్కలసమువులుండమండితసౌధశిఖరం
బులకుశృంగారంబులైనభృంగారంబులును, భృంగారశయనజాలకడోలికానిశ్రేణికాదివిశేషరమ్యంబులైనహర్మ్యం
బులును, హర్మ్యకనకగవాక్షరంధ్రనిర్గతకర్పూరకుంకుమాగరుధూపధూమంబులును, ధూమంబులుజీమూతస్తోమంబుల
నిభ్రమంబునగొబ్బునపాటువబ్బులబ్బెననిపురులుగొనిపురులువన్నియలసిరులుగొనంగుటవిటపములంగటవెటనటించు

* అలబలము, వ్యాకులము - లేక - కలఁత. అల్లిబిల్లులుగొని, దట్టముగానల్లినవై. ఈరము, పొదరిల్లు. మిన్నేటి, ఆకాశగంగయొక్క.

చుఁబురుజువిడిసికికురువోఁడుచుచవలతేనిమారుపుచదువులటీకలంగేకలిడునెమళ్లను, నెమళ్లపుఱులనాఱలునాఱులగు
వింధ్యనినదములందలంపులుగఁదోఁకలువడసివీఁకలుమెఱసిమూఁకలుగొనిదిపికెగరిరవికింగపిసినరాహువుక్రియందవిఁ
దడఁబడుపడగలును,బడగలును,గొడుగులును,దమకుమోరంబులగునడియాలంబులుగదోరంబులైనసారంబులబీరంబులు
మెఱసిబెబ్బులులగ్రబ్బునంగరులసిరులసింగంబుల భంగంబులశరభంబులరభసంబులధూమకేతువులరీతులవైరింజీటి
కింగొనకశంకలుడిగిఱంకెలిడుచు అంకెలై లెక్కకుమిక్కిలగుచు రక్కసులచక్కటియెక్కటికయ్యములదయ్యము లె
ఱుంగందిఱుగువీరభటులకదంబంబులును,కదంబకరవాలశూలాదులమెఱుంగులుమెఱుపులతెఱంగులదిశలచెఱంగులం
మఱుంగలింపనేమీనినదంబులుతుఱుములగునుఱుములుగనడమొగుళ్లపెల్లునంబ్రవర్షితరథికచనోరథంబులగు రథంబుల
గములును, గములుగొనిగమనవేగములవలనహరిహయులనగి, గాలింజాలింబడగేలిగొని, ఘనంబులగుమనంబులందెగడి, నె
గడుసురంగంబులగుతురంగంబులును,రంగదుత్తుంగవిశదమదకలకరికటతటజనితమదసలిలకణగణవిగణితదశశతనయన
భుజసరళమిళితలలితనిఖిలదిగధిపతిశుభకరకరకనకకటకఘటితమణిసముదయి సముదితరేణువర్గదుర్గమంబులయిన ని
ర్వక్రమార్గంబులును,మార్గస్థలోకపరిగతాగతశతాయుతానేకగణనాతీతరోహణాచలతటవిరాజమానంబులగువిమా
నంబులును, విమానవిహారమాణసుందరసుందరీసందోహసంపాదితభూరిభేరీవీణాపణవమృదంగ కాహళశంఖాదివాద
నానూనగానసాహిత్యనృత్యవిశేషంబులును, విశేషరత్నసంఘటితశృంగారశృంగాటకవాటికాగేహదేహళీప్రదీపం
బులును, దీపాయమానమానితసభామంటపఖచితరుచిరచింతారత్నంబునుంగలిగిరత్నాకరంబునుంబోలె ననిమిషకాశి
కవాహినీవిశ్రుతంబయిశ్రుతివాక్యంబునుంబోలె నకల్మషసువర్ణప్రభూతంబయిభూతపతికంఠంబునుంబోలెభోగిరా
జకాంతంబైకాంతాకుచంబునుంబోలెసువృత్తంబైవృత్తజాతంబునుంబోలెసదాగురులఘునియమాభిరామంబయిరా
మచంద్రుని తేజంబునుంబోలె ఖరదూషణాదిదోషాచరానుపలబ్ధంబయి లబ్ధవర్ణచరిత్రంబునుంబోలె విమలాంతరంగ
ద్యోతమానంబయిమానధనునినడువడియునుంబోలెసన్మార్గఖ్యాతిసుందరంబైసుందరోద్యానంబునుంబోలెరంభాంచితా
శోకపున్నాగంబయిపున్నాగంబునుంబోలెసురభిమనోమానవిశేషంబయి శేషాహిమతంబునుంబోలెనున్నతక్షమావి
శారదంబై శారదసముదయంబునుంబోలె ధవళజీమూతప్రకాశితంబై సితేతరాజినదానంబునుంబోలె సరసతిలోత్త
మంబైయుత్తమపురుషవచనంబునుంబోలెననేకసుధారసప్రవర్షంబై వర్షాదియునుంబోలెనుల్లసదింద్రచాపంబై గోప
తిమూపురంబునుంబోలెవిచతురార్యాలంకృతంబైకృతార్థంబైనయమరావతినగరంబుచేరంజనికోటచుట్టునుంబట్టుగ
లుగబలంబులజవంబునవిడియించిపొంచిమార్గంబులెల్లనఱికట్టుకొనియేమఱకయుండెనంత॥ క॥ మాయరునగవులకునుగ
ను। మాయరుకాలంబుకతనముదియరుఖలులం। డాయరుపుణ్యజనంబులఁ। బాయరుసురరాజువీటిప్రమదాజనముల్ ॥ అ
ప్పుడు॥ క॥ దుర్బలదానవశంఖా। విర్భూతధ్వనులునిండివిబుధేంద్రవధూ। గర్భములువగిలిలోపలి। యర్భకతతులావురనుచు
నాక్రోశించె॥ అంత ॥ సీ॥ బలివచ్చివిడియుటబలభేదివీక్షించి గట్టిగాఁగోటకుఁగాఁపువెట్టి। దేవవీరులుదాను దేవతామం
త్రినిరప్పించిసురవైరిరాకఁజెప్పి। ప్రళయానలునిభంగిభాసిల్లుచున్నాఁడు ఘోరరాక్షసులనుగూడినాఁడు। మనకోడిచ
ని నేఁడుమఱలవీఁడేతెంచెనేతపంబునవీనికింతవచ్చె। నీమహాత్మకునకునెవ్వఁడుదోడయ్యె। నింకవీనిఁగెల్వనేదిత్రోవ। యే
మిచేయువారమెక్కడిమగటిమి। యెదురుమోహరింపనెవ్వఁడోపు॥ క॥ మ్రింగెడునాకాశంబును। బొంగెడునమరాద్రి
కంటెఁబొడవై వీఁడుర్వ। మ్రింగెడుకాలాంతకుక్రియ। భంగించునుమరలఁబడ్డఁ బంకజగర్భున్॥ క॥ ఈరాదురాజ్యమెల్ల
ను। బోరాదురణంబుసేయఁబోయితిమేని। రారాదుదనుజుచేతను। జారాదిటమీఁదనేమిజాడమహాత్మా॥ అనినసురరా
జునకునాచార్యుండిట్లనియె॥ సీ॥ వినుమయ్యదేవేంద్రవీనికిసంపదబ్రహ్మవాదులుభృగుప్రవరులెల్ల। నిచ్చిరిరాక్షసునెదు
రింపవాదింపహరియీశ్వరుఁడుదక్కనన్యజనులు। నీవునునీసముల్నీకంటెనధికులుచాలరు రాజ్యంబుసాలునీకు। విడిచిపో
పుటనీతివిబుధనివాసంబువిమతులువెలిఁగెడువేళసూచి। మఱలిమఱునాఁడువచ్చుటమామతంబు। విప్రబలమునవీనికివృ
ద్ధివచ్చె। వారిఁగైకొనకిటమీఁదవాఁడుచెడును। దలఁగుమందాఁకరిపుపేరుదలఁపవలదు॥ క॥ పరుగెలువవలయునొండెను। స
రిపోరఁగవలయునొండెఁజావలెనొండెఁ। సరిగెలుపువృత్తియుదొరకమి। సరసంబుగమున్నెతొలఁగిచనవలెనొండెఁ॥
వ॥ అనికార్యకాలనిదర్శియగుబృహస్పతివచనంబులువిని కామరూపులైదివిజులుత్రివిష్టపంబువిడిచితమతమపొందుపట్లు
కుంజనిరిబలియునుంబ్రతిభటవివర్జితయగుదేవధానినధిష్ఠించిజగత్త్రయంబునుందనవశంబుచేసుకొనివిశ్వవిజయుండై
పెద్దకాలంబురాజ్యంబుసేయుచుండె శిష్యవత్సలురగుభృగ్వాదులతనిచేతశతాశ్వమేధంబులుసేయించిరి తత్కాలం

బున॥ శా॥ అర్థుల్వేఁడరు దాతలుం జెడుట సర్వారంభముల్వుండుఁ బ్రత్యర్థుల్లేరు మహోత్సవంబులను దేవాగారము ల్వ్రే ల్వుఁబూఁగ్రాగ్గుల్విప్రులువర్షముల్ గురియఁగాలార్హంబులై ధాత్రికి। న్స్వార్థంబయ్యె వసుంధరత్వమసురేంద్రాధీశురా జ్యంబునన్॥ అంత॥ సీ॥ తనతనూజుల ప్రోలు దనుజులు గొనుటయు వేల్పులెల్లను డాఁగి వెడలుటయును। భావించి సురమాతప రితాపమును బొంది వగ నాథాకృతి వసరుచుండ। నాయమ్మ పెనిమిటి యగు కశ్యపబ్రహ్మ మతి యొక నాఁడు సమాధిమాని। తనకుటుంబినియున్న ధామంబునకు నేగి నాతిచే విహితార్చనములు వడసి। వంద్రాలి కుంది వాడిన యిల్లాలి। వదనవారి జంబు వడువుఁ జూచి। చేఁదిగి చివఁగువ చుబుకంబు పుడుకుచు। వారిజాక్షి యేల వగచెదనుచు॥ అమ్మహాత్ముం డిట్లనియె॥ మ॥ తె అవా విప్రులు పూర్ణులే చెలఁగునే దేవార్చనాచారము। ల్తతితో వేలుదురే గృహస్థులు సుతుల్ధర్మానుసంధానులే। నెటిన భ్యాగత కోటికన్నమిడుదే నీరంబును బోయుదే। వఃఅలేక గ్రస్థుల దాసులన్ సుజనులన్మన్నింపుదే పైదలీ॥ గీ॥ అన్న మైనఁ దోయమైన ద్రవ్యంబైన। శాకమైనఁ దనకు జరుగుకొలఁది। యతిథిజనులకడ్డమాడక యిడరేని। లేనివారు పుడమి లేనివారు॥ వ॥ మఱియు॥ గీ॥ నెలఁత విష్ణునకును నిఖిల దేవాత్మున। కానసంబు శిఖియు నవనిసురులు। వారు దనియ దనియు వనజాతలోచనుఁ। డతఁడు దనియ జగములన్ని దనియు॥ క॥ బిడ్డలు వెఱతురె నీకఱ। గొడ్డంబులు సేయరెల్ల కోడండ్రు నుమా। రొడ్డారింపక నడుతురె। యడ్డముగా కున్న దేవ్యగేహిణ యింటన్॥ అని పలికిన నంబతికి సతి యిట్లనియె॥ ఉ॥ ప్రేమ మొకింత లేక దితి బిడ్డలు బిడ్డల బిడ్డలున్ మహా। భీమబలాఢ్యులై తనమ బిడ్డలనందఱఁ దోలి సాహస। క్రామిత వైరులయ్యు నమరావతి నేలుచునున్నవారునీ। కేమనివిన్నవింతు హృదయేశ్వర మేలుఁ దలంచి చూడవే॥ క॥ అక్కా చెల్లెండ్రయ్యును। దక్కరు నాతోడి పోరు దనుజులు దితియున్। రక్కసులు సురల మొత్తఁగ। నక్కటవలదనదు చూచు నౌ నౌ ననుచున్॥ సీ॥ ఎండకన్నెఱుఁగని యింద్రు నియిల్లాలు పలుపంచలను జాలిఁబడియె నేఁడు। త్రిభువన సామ్రాజ్యవిభవంబుఁ గోల్పోయి దేవేంద్రుఁ డడవులఁ దిఱిఁగె నేఁడు। కలిమిగారాబు బిడ్డలు జయంతాదులు శబరాగ్రకుల వెంటఁ జనిరి నేఁడు। నమరుల కాధారమగు నమరావతి యసురుల కాటపట్టయ్యె నేఁడు। బలిజగముల నెల్ల బలియుచునున్నాఁడు। వాని గెలువరాదు వాసవునకు। యాగభాగమెల్ల నతఁడాహరించును। గడఁగి సురల కొక్కడియు నీఁడు॥ క॥ ప్రజలకు నెల్లను సముఁడవు। ప్రజలను గడుపారఁగన్న బ్రహ్మవు నీవుం। బ్రజలందు దుష్టనుతులను। నిజముగ శిక్షింపవలదె నీవు మహాత్మా॥ మ॥ సురలన్ సభ్యుల నార్తులన్ విరథులన్ శోకంబు వారించి నిర్జ్జరధామన్నిలుపం గరాత్రిచరులన్ మాసింపన తార్క్ర్యమే। వెరవేరీతి ఘటించునట్టిక్రమము న్వే వేగఁ జింతింపవే। కరుణాలోకసుధాఝరిం దనుపవే కల్యాణసంధాయకా॥ వ॥ అని నమనోవల్లభి పలుకులాకర్ణించి ముహూర్తమాత్రంబు చింతించి విజ్ఞానదృష్టి నవలంబించి భావికాలకార్యంబు విచారించి కశ్యపబ్రహ్మ యిట్లనియె॥ మ॥ జనకుం డెవ్వఁడు జాతుఁ డెవ్వఁడు జనస్థానంబు లెచ్చోటుసం। జననంబెయ్యది మేను లేకొలఁది సంసారంబు లేరూపము। ల్వినుమాయంతయు విష్ణుమాయ దలఁపన్ వేఱేమియున్ లేదు మోహనిబద్ధంబది మూలమింతటికి జాయా విన్నఁబోనేటికిన్॥ వ॥ అగునైనం గాలోచిత కార్యంబు సెప్పెద॥ మ॥ భగవంతుం బరము జ్జనార్దనుఁ గృపాపారీణు సర్వాత్మకు। న్జగదీశున్ హరి సేవ సేయుమతఁడు న్సాంగత్యముం బొంది నీకగు నిష్టార్థము లెల్ల నిచ్చు నిఖిలార్థావాప్తి చేకూరెడి। న్భగవత్సేవలఁ బొందరాదె బహుసౌభాగ్యంబులం బ్రేయసీ॥ అనిన గృహస్థునకు గృహిణి యిట్లనియె॥ క॥ నారాయణుఁ బరమేశ్వరు। నేరీతిఁ దలంతు మంత్రమెయ్యది విహితా। చారంబు లేప్రకారము లారాధనకాల మెద్ది యానతియీవే॥ వ॥ అనినం గశ్యపప్రజాపతి సతికిఁ బయోభక్షణంబను వ్రతంబు పదేశించి తత్కాలంబును, దన్మంత్రంబును, దద్విధానంబును, దదుపవాసదానభోజనప్రకారంబు లెఱింగించిన-నదితియును ఫాల్గునమాసంబున శుక్లపక్షంబునఁ బ్రథమదివసంబునం దొరఁకొని పండ్రెండు దినంబులు హరిసమర్పణంబుగా వ్రతంబు సేసి వ్రతాంతంబున నియతయై యున్న యెడ- జతుర్బాహుండును, బీతవాసుండును, శంఖచక్రగదాధరుండునై నేత్రంబులకగోచరుండైన నారాయణదేవుండు ప్రత్యక్షుంబైనం గనుంగొని॥ క॥ కన్నుల సంతోషాశ్రులు। చన్నుల పైఁ బరవఁ బులకజాలము లెసఁగ। న్సన్నుతులు సన్నుతులు। న్నున్నతరుచిఁ జేసె నిటలయుక్తాంజలియై॥ క॥ చూపుల శ్రీపతి రూపము। నాపోవకఁ ద్రావి త్రావి హర్షోద్గతయై। వాపుచ్చి మందమధురా। లాపంబులఁ బొగడె నదితి లక్ష్మీనాథున్॥ సీ॥ యజ్ఞేశ విశ్వంభ రాచ్యుత శ్రవణమంగళ నామధేయ లోకస్వరూప। యాపన్నభక్తజనార్తివిఖండన దీనలోకాధార తీర్థపాద। విశ్వోద్భవస్థితివిలయ కారణభూత సంతతానంద శశ్వద్విలాస। యాయువు దేహంబు ననుపమలక్ష్మియు వసుధయు దివము ద్రివర్గములను। వైదికజ్ఞానయుక్తియు వైరిజయము। నిన్నుఁ గొలువని నరులకు నెఱయఁగలదె। వినుతమందారగుణహార వేదసార। ప్రణతవత్సల పద్మాక్ష పరమపురుష॥ గీ॥ అసురవరులు సురల నదలించి బెదరించి। నాకమేలుచున్న నాఁటనుండి। కన్నకడుపు గానఁ

గంటఁగూఁతుర రాము।కడుపుపొక్కు_మాన్పి కావుమయ్య॥ వ॥ అనిన విని దరహసితవదనుండనాశ్రితకామధేను వైనయప్ప
రమేశ్వరుండిట్లనియె॥ శా॥ నీకోడండ్రు మునీకుమారవరులున్నాథుండు మున్నీవును।ల్లోకింపన్సుఖులున్సుఖుల్మికులసంతోషిం
పరాత్రించవు।ల్లోకింపన్భవదీయగర్భమునఁదేజోమూర్తిజన్మించెదన్। న్నాకున్నేఁసుకపుట్టునీసుతుఁడనై వర్తించిన త్రిం
పఁగాక॥ మ॥ బలిమిన్దైత్యులఁ జంపరాదు వినయోపాయంబులంగానిసం।దలనంబొందదు నేను నీనియతికిన్సంతుష్టికిన్నై
చ్చితిన్బలిపిద్వేషుఁడు నానిలింపగణమున్బౌలోమిముఖ్యన్నెచ్ఛ్రదై। త్యులరాజ్యంబుహరింతునింద్రునికినిస్తుల్ దుస్సఖమిం
కేటికిన్॥ క॥ నీరమణుని సేవింపుము।నారూపమమానసించి దనలినీగర్భా।గారంబు వచ్చి చొచ్చెదఁ। గారవమునఁ బెంపు సు
మ్మకరుణన్నమ్మన్॥ క॥ పలింతు దివమునసురలను।బాలింతు మహేంద్రయువతిభాగ్యశ్రీలన్।మాలింతు దానవులసిరు ల్మాలిం
తు రిపుప్రియాంగములభూషణముల్॥ వ॥ అనియిట్లుభక్తజనపరతంత్రుండగుపురాణపురుషుండానతిచ్చి తిరోహితుండ
య్యె నయ్యదితియుఁ గృతకృత్యయై సంతోషంబునఁ దనమనోవల్లభుండగు కశ్యపునాశ్రయించి సేవించుచుండెనంత నొ
క్క దినంబున॥ గీ॥ ఘనసమాధినుండి కశ్యపుఁడచ్యుతు।నంశమాత్మఁ గొలయనదితియందుఁ।దనదువీర్యమధికతరము సేర్చె
ను గాలి।శిఖిని దారువందుఁ జేర్చినట్లు॥ వ॥ ఇట్లు కశ్యపచిరతరతపస్సంభృతవీర్యప్రక్షిప్తగర్భయై సురలతల్లి యుల్లంబునను
ల్లసిల్లుచునుండె నంత॥ క॥ చలచలనై పికపికనై।గలలంబై కరుడుగట్టి గళనాళముతోఁ।దలమోపఁడిగర్భంబై। నెలమసలం జీ
ఁజీక్రె నెంతకునదిపా॥ క॥ నెలంతకుచూలై నెలరె।న్నెలలై మఱి మూఁడు నాల్గు నెలలై వరుస।న్నెలలంతకంతకెక్కఁ
గ।నెలలును డగ్గరియె నసురనిర్మూలతకున్॥ క॥ మహితతరమేఘమాలా।పిహితాయుత చండభానుబింబప్రభతోఁ।విహి
తాంగంబులఁ గశ్యపు।గృహిణీగర్భమున శిశువు క్రీడించె నృపా॥ క॥ తనకడుపున నొక వేలుపు।వనరుహగర్భాండభాండవన
ధిచయంబుల్లోనకొని జగములు నిడుకొని। దనుగతిఁ గడునడఁగి మునిఁగి తనరెడు బెగడై॥ వ॥ అంతనక్కాంతాతిలకంబు
గ్రమక్రమంబున॥ మ॥ నిలిపె న్రెప్పలబృందిమన్నిశదము ల్నేత్రంబులుం జూచుకం।బులనాకాళినుమేఖలంగ్రథిమన
న్మోమున్సుధాపాండిమ।న్వలిమింజన్నులశ్రోణిపాలిగరిమన్మధ్యంబునం బృంహిమ।న్వలితాత్మన్ లఘిమన్మహామహిమ మే
నన్గర్భమర్వారనై॥ క॥ పెట్టుమరునుమటభూతిన।బొట్టిడుదురు మేనఁ బట్టుపుట్టము దోయి।న్వెట్టుదురు వేల్పుటమ్మకుఁ।
గట్టుదురా గిరకుపడఁతి గర్భంబునకున్॥ ఇవ్విధంబున॥ గీ॥ విశ్వగర్భుఁడు దనగర్భవివరమందుఁ।బూఁటపూఁటకుఁ బూర్ణుఁ
డై పొటకరింప।॥ వ్రేఁకఁ జూలాలి తనమున వేల్పుపెద్ద।పొలఁతికంతటనిల్లాడు ప్రొద్దులయ్యె॥ వ॥ తదనంతరంబునం జతురా
ననుండును గుఱెంచి యదితిగర్భపరిభ్రమవిభ్రముండగునప్పరమేశ్వరునుద్దేశించి యిట్లని స్తుతించె॥ సీ॥ త్రిభువనమయరూ
పదేవ త్రివిక్రమ పృథులాత్మ శిపివిష్ట పృశ్నిగర్భ। ప్రీతత్రిణాభ త్రిపృష్ఠ జగంబుల కాద్యంతమధ్యంబులరయ నీవ। జంగమ
స్థావరజననాదిహేతువు నీవ కాలంబవై నిఖిలమాత్మ। లోపలధరియింతు లోనిజంతులనెల్ల స్రోతంబులోఁ గొనిసుందరత
ను।బ్రహ్మలకునెల్ల సంభవభవనమీవ। దివమునకుఁ బాసిదుర్దశ దిక్కులేక। శోకవారిధి మునిఁగిన సురలకెల్లఁ। దెలియనా
ధారమగుచున్న తెప్పనీవ॥ క॥ విచ్చేయుమదితిగర్భము।చెచ్చెర వెలువడుము మహాత్మ చిరకాలంబు।న్విచ్చలవిడి లేక మరులు।

## —— శ్రీ వామనమూర్త్యావిర్భావఘట్టము. శ్రీ ——

ముచ్చటపడియున్న వారు ముదమందింపన్॥ వ॥ అనియిట్లు కమలసంభవుండు వినుతిసేయ నయ్యవసరంబున॥ మ॥ రవిమ
ధ్యాహ్నమునం జరింప గ్రహతారాబద్ధచంద్రస్థితిన్।శ్రవణద్వాదశినాఁడు శ్రోణన భిజిత్సంజ్ఞాతలగ్నంబున।న్భువనాధీ
శుఁడుపుట్టె వామనగతిం బుణ్యవ్రతోపేతకున్।దివిజాధీశ్వరుమాతకుం బరమపాతివ్రత్యవిఖ్యాతకున్॥ వ॥ మఱియునద్దే
వుండు శంఖచక్రగదాకమలకలితచతుర్భుజుండును, పిశంగవర్ణవస్త్రుండును, మకరకుండలమండితగండభాగుండును,
శ్రీవత్సవక్షుండును, నలినచక్షుండును, నిరంతరశ్రీవిరాజితరోలంబకదంబచుంబితవనమాలికాపరివృతుండును, కనక
కంకణకాంచివలయాంగదనూపురాలంకృతుండును, కమనీయకంఠకౌస్తుభాభరణుండును, నిఖిలజనమనోహరుండునై
యవతరించినసమయంబున॥ శా॥ చింతంబాసిరి యక్షులా గ్రహములున్ సిద్ధోరగాధీశ్వరు।ల్సంతోషించిరి సాధ్యచారణమ
నీశబ్రహ్మవిద్యాధరుల్గాంతింజెందిరి భానుచంద్రములు రంగద్గీతవాద్యంబుల।న్గంతుల్వై చిరి మింటఁ గింపురుషులున్గంధ
ర్వులుంగిన్నరుల్॥ క॥ దిక్కులకావిరివాసె।న్నెక్కువ తక్కువలు లేక నేడు పయోధుల్।ద్రిక్కవ యునిలిచె ధరణియుఁ।జుక్కల
త్రోవయును విప్రసురసేవ్యంబై॥ క॥ ముంపుగొని విరుల వానల।జొంపంబులు గురియ సురలు సుమనోమధువు।ల్తుంపరలెగ
యఁబరాగపు।రొంపుల భూభాగమతి నిరూపితమయ్యెన్॥ తదనంతరంబ॥ గీ॥ ఈ మహానుభావుఁ డెట్లకో యీకాల।ముదర
మందునిలిచియుండెననుచు।నదితి వెఱఁగువడియె నానందభయశబ్ద।ములను గశ్యపుండు మొగినుతించె॥ వ॥ అంతనవ్విభుం

౧. వేఁకట్టులుపు-భారము.

డు సాయుధసాలంకారంబగు తనదివ్యరూపంబు నుజ్జగించి రూపాంతరం బంగీకరించి కపటవటుని చందంబున నుపనయనవయస్కుండై బాలసుండై తల్లి ముందర సముచితాలాపంబు లాడుచుం గ్రీడించు సమయంబున నదితియుం దనయవిలోకనపరిణత పారవశ్యంబున॥ గీ॥ నన్నుఁ గన్నతండ్రి నాపాలిదైవమ। నాతపఃఫలంబ నాకుమార। నాదు చిన్నివడుగ నాకులదీపక। రాగదయ్య భాగ్యరాశివగుచు॥ క॥ అన్నాతమ్ముని డగ్గరి। చన్నులపాలేఱు వాఱ సంశ్లేషిణియై। చిన్నారి మొగము నివురుచుఁ। గన్నారం జూచెఁ గన్నకడుపై యుండన్॥ క॥ పురుడీబోటికి నిందిర। పురుడంబిక గాక యొరులు పురుడే యనుచున్। బురుటాలికి పదిదినములు। పుసు ప్రవర్తించి రెలమిఁ బుణ్యపు గరితల్॥ వ॥ అంతన బ్బాలునకు సంతసంబున మహర్షులు గశ్యపప్రజాపతిం బురస్కరించుకొని సముచితోపనయనకర్మకలాపంబులు సేయించిరి సవిత సావిత్రి నుపదేశించె బృహస్పతి యజ్ఞోపవీతంబును, గశ్యపుండు ముంజియుఁ గోపీనంబు నదితియు, ధరణి కృష్ణాజినంబును, దండంబు సోముండును, గగనాధిష్ఠానదేవత ఛత్రంబును, గమండలంబు బ్రహ్మయు, సరస్వతి యక్షమాలికయు, సప్తర్షులు కుశపవిత్రంబులు నిచ్చిరి మఱియును॥ క॥ భిక్షాపాత్రిక నిచ్చె సుయక్షేశుఁడు వామనునకు నక్షయ యనుచు। న్సాక్షాత్కరించి పెట్టెను। భిక్షునకు భవాని పూర్ణభిక్ష నరేంద్రా॥ క॥ శుద్ధబ్రహ్మర్షి సమా। రాధ్యుండై విహితమంత్రరాజితుఁడగుచు। నిద్ధంబగు ననలంబున। వృద్ధాచారమున వటుఁడు వ్రే

## శ్రీ బలిచక్రవర్తికడకు వామనమూర్తి యేతెంచుట. శ్రీ

ల్చెం గడిమిన్॥ వ॥ ఇట్లు కృతకృత్యుండై మాయామాణవకుండు దేశాంతరసమాగతులగు బ్రాహ్మణులం గొందఱ నవలోకించి యిట్లనియె॥ క॥ వత్తురె విప్రులు వేడ। న్నిత్తురె దాతలును వేఁడ నిష్టార్థములం। దెత్తురె మీరును సంపద। లిత్తెఱఁగున దానవీరుఁ డెవ్వఁడొ చెప్పుఁడా॥ వ॥ అనిన నఖిలదేశీయులగు భూసురు లిట్లనిరి॥ మ॥ కలరుద్దాతృవరుల్పె సద్ధనములుం గామ్యార్థముల్గాంచు విప్రులు నేతెంతురుగాని యీవిని బలింబోల న్వదాన్యుండు లేఁ। డలఘుండై యొనరించు నధ్వరశతంబా భార్గవానుజ్ఞతో। బలి వేఁడన్బడయంగవచ్చు బహుసంపల్లాభముల్వామనా॥ వ॥ అని తెలియఁ జెప్పిన బ్రాహ్మణవచనంబు లాలకించి లోకంబులకుం బ్రీతిపుట్టింపం బయనంబై లాభవచనంబులు గైకొని తల్లిదండ్రుల వీడ్కొని శుభముహూర్తంబున నంగదలి॥ క॥ ప్రక్షీణదివిజవల్లభ। రక్షాపరతంత్రుఁడగుచు రాజీవాక్షుం। డక్షీణమునఁ బలియింటికి। భిక్షాగమనంబు సేసెఁ బేదఱికముతోన్॥ క॥ హరిహరిసిరియుర మునఁగల। హరిహరిహయుకొఱ కనుఁ దనుజు నడుగంజనియెం। బరహితరతమతియుతులగు। దొరలకు నడుగుటయు నొడలి తొడవులు పుడమిన్॥ క॥ సర్వప్రపంచగురుభర। నిర్వాహకుఁడగుటఁ జేసి నెఱిఁ జను దేవ। ర్వీని క్రేఁగు సహింపక। నుర్వీస్థలి క్రుంగె మ్రొగ్గె నురగేంద్రుండున్॥ ఇట్లు చనిచని॥ క॥ శర్మదయమదండజేతు। శర్మద నదిక రీనముక్తివనితాచేతో। నర్మదనంబు నివారిత। దుర్మదనర్మదఁ దరించె ద్రోవన్వటుఁడున్॥ దాఁటి తత్ప్రవాహంబున కుత్తరతటంబున నంచు॥ శా॥ చండస్ఫూర్తివటుండు గాంచె బహుధాజల్పన్నిశాటంబును। ద్దండాహూతమునీభ్యభిభ్యదమృతాంధస్సిద్ధహూటంబువే। దండాశ్వధ్వజినీకవాటమును హోమవ్యగ్రధూమసంఛన్నమా। ర్తాండస్యందనఘోటమున్బలిమఖాంతర్వేదికావాటమున్॥ వ॥ కని దానవేంద్రుని హయమేధవాటికఁ దాఁటి దరియం జొచ్చు నయ్యవసరంబున॥ శా॥ శంభుండో హరియో పయోజభవుఁడో చండాంశుఁడో వహ్నియో। దంభాకారత వచ్చెఁ గాక ధరణిం ధాత్రీసురుం డెవ్వఁడీ। శుంభద్ద్యోతనుఁ డీను నొజ్జతనుఁడంచు న్విస్మయభ్రాంతులై। సంభాషించిరి బ్రహ్మచారిఁ గని తత్సభ్యుల్ రహస్యంబునన్॥ క॥ గుజగుజలువోవు వారును। గజిబిజిఁ బడువారుఁ జాలఁ గలకలపడుచు। న్గజిబిజియైరి సభాస్థలిఁ। బ్రజ లెల్లను బొట్టివడుగు పావనిరాకన్॥ ఆ సమయంబున బలిసభామంటపంబుఁ దఱియం జొచ్చి॥ సీ॥ చవులుగాఁ జెవులకు సామగానంబులు సదివెడు హోతల చదువు వినుచు। మంత్రతంత్రార్థసంబంధభావంబులు గొని యాడు యాజులఁ గూడికొనుచు। హోమకుండంబులందమన్న త్రేతాగ్నుల వెలిఁగించు యాజకవితతిఁ గనుచు। దక్షులై బహువిధాధ్వరవిధానంబులు సెప్పెడు సభ్యులఁ జేరఁ జనుచుఁ। జెట్టు గో రెక్షు నేడుకప్పపలప। నదిపిపుట్టువుల చ్చికినాటపట్టు। కోరి చరియించె సభలోనఁ గొంతతడవు। పుట్టు వెన్నఁడు నెఱుఁగని పొట్టివడుగు॥ మఱియును॥ క॥ వెఱచుచు వంగుచు వ్రాలుచు। నఱిముఱి గుబురులకుఁ జనుచు హరిహరి యనుచున్। మఱుగుచు నులుకుచు డిఱ్ఱడిఱ్ఱఁ। గుఱుచట్టపు పొట్టివడుగు కొంతనటించెన్॥ క॥ కొందఱితోఁ జర్చించును। గొందఱితోఁ జటులు సెప్ప గోష్ఠిం జేయుం। గొందఱితోఁ దర్కించును। గొందఱితో ముచ్చటాడుఁ గొంకక వర్ణీ॥ వ॥ మఱియు ననేకవిధంబుల ననేకన్నిరూపులై వినోదించుచు॥ క॥ వెడ వెడ నడకలు నడుచుచు। నెడనెడ నడుగిడక నడరియులదిగఁ బడఁగ। న్బుడిబుడి నొడువులు నొడువుచుఁ। జిడిముడిఁ దడఁబడఁగ వడుగు సేరెన్ రాజున్॥ వ॥ ఇట్లు డగ్గరి మాయాభిక్షుకుండు రక్షోవల్లభుం జూచి యిట్లనియె॥ మ॥ ఇతఁ డేదానవచక్రవర్తి సురలోకేంద్రాగ్నికాలాదిది। క్పతిగర్వాపనయప్రవర్తిగత లోభస్ఫూర్తి వానా

ముఖ। వ్రతదానప్రవణానువర్తిసును మోరామామనో భేదనో। ధృతచంద్రాతపకీర్తిసత్యకరుణాధర్మోల్లసన్మూర్తిదా॥ వ॥ ఇట్లు కుశపవిత్రాక్షతసంయుతంబగు దక్షిణహస్తంబు సాఁచి యిట్లనియె॥ ఉ॥ స్వస్తి జగత్త్రయీభువనశాసనకర్తకు హాసమాత్రవి। న్యస్తనిలింపభర్తకును దారపదవ్యవహర్తకుస్సమీం। ప్రస్తుతమంగళాధ్వరవితానవిహర్తకు నిర్జరీగళ। న్యస్తసువర్ణసూత్రపరిహర్తకు దానవలోకభర్తకున్॥ వ॥ అని దీవించి కరచరణాద్యవయవంబులు ధరియించిన వేదరాశియుం బోలె, ముండనకుటిలుండును, జటిలుండును, సదండఛత్త్రుండును, గతులంబితభిక్షాపాత్రుండును, గరకలితజలకమండలుండును, మనోహరవదనచంద్రమండలుండును, మాయావాదనవటుండును నగు వటునిం గని దినకరకిరణపిహితంబులైన గ్రహంబుల చందంబునఁ దిరోహితులై భృగువులు గూర్చున్నయెడ లేచి సేమంబడిగి తియ్యని మాటల నాదరించిరి - బలియును నమస్కరించి తగిన గద్దియ నునిచి పాదంబులు కడిగి తన ప్రాణవల్లభ పసిండికలశంబున నుదకంబులు వోయ వటుసుకోమరుని చరణంబులు గడిగి తడి మొత్తి తత్పయంబున॥ గీ॥ వటుని పాదశౌచవారి శిరంబునఁ। బరమభద్రమనుచు బలి వహించె। నేజలము గిరీశుఁ డిందుజూటుఁడు దేవ। దేవుఁ డుద్వహించె ధృతి శిరమున॥ మఱియు నయ్యజమానుండు భాగ్యగుణంబునకిట్లనియె॥ మ॥ వడుగా యెవ్వరివాఁడ వెవ్వఁడవు సంవాసస్థలం బెయ్యది। య్యెడ కున్నీవరుదెంచుటల్ సఫలమయ్యెన్ వంశము న్నస్మముం। గడు ధన్యాత్ముఁడనైతి నీ మఖము యోగ్యంబయ్యె నాకోరికెల్। గడ తేరెన్ సుహుతంబులయ్యె శిఖులుం గల్యాణమెన్నాలముల్॥ మ॥ వరచేలంబులొ మాడలో ఫలములో వన్యంబులో గోవులో। హరులో రత్నములో రథంబులొ విశిష్టార్థంబులో కన్యలో। కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో। ధరణీఖండమొ కాక యేమడిగెదో ధాత్రీసురేంద్రోత్తమా॥ వ॥ అని ధర్మయుక్తంబుగాఁ బలికిన వైరోచని వచనంబులు విని సంతోషించి యీశ్వరుఁ డిట్లనియె॥ సీ॥ ఇది నాకు నెలవని యేమని పలుకుదు నొకచోటనక నిండియుండ నేర్తు। నెవ్వనివాఁడ నంచేమని పలుకుదు నాయంతవాఁడనై నడుప నేర్తు। నీనడువడి యని యెట్లు వక్కాణింతుఁ బూని ముప్పోకలఁ బోవ నేర్తు। నది నేర్తు నిది నేర్తు ననియేలఁ జెప్పంగ నేరుపులన్నియు నేన నేర్తు। నెరులుగారు నాకు నెరులకు నే నౌదు। నొంటివాఁడ చుట్ట మొకఁడు లేఁడు। సిరియుఁ దొల్లి గలదు చెప్పెదనాయింకి। సుజనులందుఁ దలఁచుఁ జొచ్చియుందు॥ అది యట్లుండనిమ్ము॥ సీ॥ జననాథ నీమాట సత్యంబు సత్కీర్తిదంబుఁ గులార్హంబు ధర్మయుతము। గరుణానువర్తులు ఘనసత్త్వమూర్తులుగా నీకులమందుఁ గలుగరొరులు। రణభీరువులు వితరణభీరువులు లేరు ప్రత్యర్థులర్థులు ప్రబ్బికొనిన। దానశౌండులగుచుఁ దనుపుదురథికులై మీ తాతలందఱు మేటిమగలు। మీకులంబునందు మెఱయఁ బ్రహ్లాదుండు। మింటిచందమ్ము మాడ్కి మేలిరుచులఁ। బ్రథితకీర్తితోడ భవదీయవంశంబు। నీరరాశిభంగి నెగడుచుండు॥ వ॥ తొల్లి మీ మూఁడవ తాత హిరణ్యాక్షుండు విశ్వజయంబు సేసి గదాయుధుండై భూతలంబునఁ బ్రతివీరులం గానక సంచరింప విష్ణుండు వరాహరూపంబున నతని సమయించెఁ దద్భ్రాతయగు హిరణ్యకశిపుండు విని హరి పరాక్రమంబునకు నాశ్చర్యంబు నొంది తన జయంబును బలంబును బరిహసించి గ్రద్దన నుద్దవిడి నద్దనుజమర్దను మందిరంబునకుం జనియె నప్పుడు॥ క॥ శూలాయుధహస్తుండై। కాలాకృతి వచ్చు దనుజుఁ గని విష్ణుండున్। గాలజ్ఞతమాయాగుణ। శీలత నిట్లని తలంచెఁ జిత్తములోనన్॥ మ॥ ఎదురై పోర జయింప రాదితనిగాఁ గెందేనియుంబోవఁ భీ। ప్రదుఁడై ప్రాణులఁ దోలు మృత్యువు క్రియం బైపచ్చునంచుం గ్రియా। విదుఁడన్ జ్ఞాతుఁడు సూక్ష్మరూపమున నావేశించి నిశ్వాసరం। ధ్రదిశన్ దైత్యుహృదంతరాళమునఁ బ్రత్యక్షక్రియాభీరుఁడై॥ వ॥ అంతన దైత్యవల్లభుండు వైష్ణవాలయంబు సొచ్చి వెదకి హరిం గానక మిన్నుమన్ను నన్వేషించి త్రిదివంబున నరసి దిశలం బరికించి భూవివరంబులు వీక్షించి సముద్రంబులు వెదకి పురంబులు శోధించి వనంబులు విమర్శించి పాతాళంబు పరీక్షించి జగంబున నదృష్టశత్రుండై మార్గణంబు సాలించి తనలో నిట్లనియె॥ క॥ పగవాఁడు మడియనోపును। దెగఁడేని యునెదుముపడఁడె తెగువనరులకుం। దెగినయెడఁ బగర మీఁదను। పగఁగొనఁ దగదనుచు మానెఁ బ్రాభవశక్తిన్॥ అతండు మీ ప్రపితామహుండతని గుణంబులనేకంబులు గలవది యట్లుండనిమ్ము॥ క॥ ఆతురభూసురగతిఁ బురు। హూతాదులు దన్ను వేఁడ నెగిఁ గొమ్మనుచు। న్నీతండ్రి యిచ్చె నాయువు। నేతన్మాత్రుఁడవె నీవు నీలోకమునన్॥ క॥ ఏలితి వి మూఁడుజగములు। దోలితి పింద్రాదిసురలఁ దొల్లిటివారిం। బోలితి విదానగుణముల। సోలితి విపిశాచరాక్షసులరక్షింపన్॥ అదియునుం గాక॥ క॥ రాజ్యంబు గలిగె నేనియు। బూజ్యులకును యాచకులకు భూమిసురులకుం। న్యాజ్యముగఁ బ్రదుకఁడేనియుఁ। ద్యాజ్యంబులు వాని జన్మధనగేహంబుల్॥ క॥ మున్నెన్నఁడు దురువదాన్యుల। నెన్నెడు చో నిన్నుఁ ద్రిభువనేశుఁడ వనుచున్। నిన్ని దినంబులనుండియు। నెన్నఁజుని నుఁ బెట్టు మనుచు నీంద్రము సేయన్॥ గీ॥ ఒంటివాఁడ నాకు నొకటి రెండడుగుల। మేర యిమ్ము సొమ్ము మేరనొల్లఁ। గోర్కెలఁ బ్రహ్మకైనఁ గటిముట్టెద। దానకుతుకసాంద్ర దానవేంద్ర॥ అనినఁ బరమయాచకునకుఁ బ్రదాత యిట్లనియె॥ గీ॥ ఉన్నమా

టలెల్ల నొప్పును విప్రుఁడు। సత్యగతుల వృద్ధసమ్మతంబు। లడుగఁదలఁచి కొంచెమడిగితివో చెల్ల। దాత పెంపు సొంపుఁ దలఁప
లదె॥ మ॥ వసుధాఖండము వేఁడితో జగములన్వాంఛించితో వాజులన్ వెసనూహించితొ కోరితో యువతులన్వీక్షించి కాం
క్షించితో। పసిబాలుండవు నేరవీవడుగ నీభాగ్యంబు లీపాటిగా। కసురేంద్రుండు పదత్రయంబడుగ నీయల్పంబు నీ నేర్చునే॥
వ॥ అనిన మొగంబునం జిఱునగవు మొలకలొత్త గృహమేధికి మేధావి యిట్లనియె॥ మ॥ గొడుగో జన్నిదమో కమండలమొ
నాకున్ముంజియో దండమో। వడుగే నెక్కడ భూము లెక్కడ కరుల్ వామాక్షు లశ్వంబులె। కడ నిత్యోచితకర్మ మెక్కడ
మదాకాంక్షామితంబైన మూఁడడుగుల్మేరయద్రో యకిచ్చుటయె బ్రహ్మాండంబు నాపాలికిన్॥ అదియునుంగాక॥ క॥ వ్యా
ప్తిం బొందక వగవకఁ। బ్రాప్తంబగు లేశమైనఁ బదివేలనుచుం। దృప్తిం జెందని మనుఁజుడు। సప్తద్వీపములనైనఁ జక్కంబడు
నే॥ శా॥ ఆశాపాశము దాఁగడున్నిడుపు లేదంతంబు రాజేంద్ర వారాశిప్రావృత మేదినీవలయ సామ్రాజ్యంబు చేకూడి
యుం। గాసింబొందిరి గాక వైన్యగయభూకాంతాదులున్నర్థకా। మాశన్బాయఁగ నేర్చిరే మును నిజాశాంతంబుఁ జూచి
రే॥ సీ॥ సంతుష్టుఁ డీమూఁడు జగములఁ బూజ్యుండు సంతోషి కెప్పుడుఁ జరుగు సుఖము। సంతుష్టి గాకున్న సంసారహేతువు సం
తసంబున ముక్తిపతి యదొరుకుఁ। బూఁటపూఁటకు జగంబున యదృచ్ఛాలాభతుష్టిని దేజంబుతోన పెరుగుఁ। బరితోషహీ
నతఁ బ్రభ చెడిపోవును జలధారననలంబు సమయునట్లు। నీవు రాజవనుచు నఖిలంబు నడుగుట। తగవుగాదు నాకుఁ దగినకొల
ఁది। యేను వేఁడికొనిన యీపదత్రయమును। చాలదనక నిమ్ము చాలుఁజాలు॥ వ॥ ఇట్లు పలుకుచున్న ఖర్వునకు నుర్వీశ్వరుండు
ర్వీదానంబు సేయందలంచి కరకలితసలిలకమండలుండైన వితరణగుణముఖరుం గని నిజవిచారయుక్త దనుజరాజ్యచక్రుం
డగు శుక్రుండిట్లనియె॥ సీ॥ దనుజేంద్ర యీతఁడు ధరణీసురుఁడుగాఁడు దేవకార్యంబు సాధించుకొఱకు। హరి విష్ణుఁ డవ్య
యుండదితిగర్భంబునఁ గశ్యపసూనుఁడై గలిగెనకట। యెఱుఁగవీతనికోర్కె నిచ్చెదనంటివి దైత్యసంతతికుపద్రవము వచ్చు।
నీలక్ష్మి తేజంబు నెలవు నైశ్వర్యంబు వంచించి యిచ్చును వాసవునకు। మొనసి జగములెల్ల మూఁడు పాదంబుల। నఖిలకాయుఁ
డగుచు నాక్రమించు। సర్వధనము విష్ణుసంతర్పణము సేసి। బడుగుపగిది నెట్లు బ్రతికెదీవు॥ క॥ ఒక్కపదంబున భూమియు। నొ
క్కటఁ ద్రిదివంబుఁ ద్రొక్కియున్నతమూర్తిన్। దిక్కులు గగనము దానై। వెక్కసమై యున్న నెట్లు వెడలెదు చెపుమా॥ సీ॥ ఇచ్చె
దననిపల్కి యీకున్న నరకంబు ద్రోవ నీవును సమర్థుఁడవె దేవ। యేదానమున నాశమేతెంచు నదియును దానంబు గాదండ్రు
తత్వవిదులు దానంబు యజ్ఞంబు దపముఁ గర్మంబులుఁ దావిత్తవంతుఁడై గలఁపవలయుఁ। దనయింట గల సర్వధనమెల్ల నైదుభాగ
ములుగా విభజించి కామమునకు। నర్థములకు ధర్మయశములకాశ్రిత। బృందములకు సమతఁ బెట్టునట్టి। పురుషుఁ డిందు నందుఁ
బూర్ణుఁడై మోదించుఁ। దన్ను మాని చేత దగవుగాదు॥ వ॥ అదియునుంగాక నర్థంబునందు బహ్వృచగీతార్థంబు గ
లదొక్కటి సావధానుండవై యాకర్ణింపుము॥ సీ॥ అంగీకరించిన నఖిలంబు బోవుచో ననృతంబుగాదు లేదనిన నధిప। యాత్మ
వృక్షము మూలమనృతంబు నిశ్చయ మాత్మమూలము గల్గ నాత్మ చెడదు। పుష్పఫలంబాత్మ భూజంబునకు సత్యమామ్రాను బ్రతుక
మి నదియుఁ జెడును। ఫలపుష్పములు లేక పసచెడి వృక్షంబు మూలంబుతో వృద్ధిఁ బొందుగాదె। చేటుగొఱఁతయు లఘిమయుఁ
జెందకుండ। నిచ్చు పురుషుండు చెడకుండు నిద్ధచరిత। కాక నంచితసత్యసంగతి నటంచు। నిజధనంబర్థికిచ్చిన నీకు లేదు॥ గీ॥ సర్వ
మయినచోట సర్వధనంబులు। నడుగ లేదటంచు ననృతమాడు। చెనఁటి పందనేమి చెప్పఁ బ్రాణముతోడి। శవము వాఁడు వాని
జన్మమేల॥ మఱియు నొక్కవిశేషంబు గలదు వివరించెద॥ గీ॥ వారిజాక్షులందు వైవాహికములందుఁ। బ్రాణవిత్తమానభం
గమందుఁ। జకితగోకులాగ్రజన్మరక్షణమందు। బొంకవచ్చు నఘము పొందదధిప॥ మ॥ కులమున్ రాజ్యము దేజమున్నిలుపు
మీకుబ్బుండు విశ్వంభరుం। డలఁతింబోఁడు త్రివిక్రమస్ఫురణవాఁడై నిండు బ్రహ్మాండముం। గలఁడే మాన్పనొకండు నాపలు
కులాకర్ణింపు కర్ణంబులన్। వలదీదానము గీనముం బనుపుమా వర్ణిన్ వదాన్యోత్తమా॥ వ॥ అని యిట్లు హితంబు పలుకుచున్న
కులాచార్యునకు క్షణమాత్ర నిమీలితలోచనుండై యశస్వి యిట్లనియె॥ సీ॥ నిజమానతిచ్చితి నీవు మహాత్మక మహిని గృహస్థ
ధర్మంబు నిదియు। యర్థంబుఁ గామంబు యశము నువృత్తియు నెయ్యది ప్రార్థింప నిత్తునని యు। నర్థలోభంబున నర్థిఁ బొమ్మను
నెట్లు పలికి లేననుకంటెఁ బాపమెద్ది। యెట్టిమర్త్యుని యేభరించెదఁ గాని సత్యహీనుని మోవఁజాలననుచుఁ। బలుకదే తొ
ల్లి భూదేవి బ్రహ్మతోడ। సమరమందడుగుఁదిరుగక చచ్చుకంటెఁ। బలికి బొంకక నిజమునఁ బఱఁగుకంటె। మానధనులకు భ
ద్రంబు మఱియుఁ గలదె॥ క॥ ధాత్రి నిహాలికునకు సుక్షేత్రము బీజములు లెస్సఁ జేకుఱుభంగిం। జిత్రంబుగ రాజునకును। బా
త్రము సమకూరునట్టి భాగ్యము గలదే॥ శా॥ కారే రాజులు రాజ్యముల్గలుగవే గర్వోన్నతిం బొందరే। వారేరీ సిరిమూటఁగ
ట్టికొని పోవంజాలిరే భూమిపైఁ। బేరైనం గలదే శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై। యీరే కోర్కులు వారలున్మఱచిరే

యుక్కాలమున్నార్గవా॥ క॥ ఉడుగని క్రతువుల వ్రతములఁ । బొడగనఁజన నిట్టిపొడవు పొడవునఁ గుఱుచై । యడిగెడినఁట నను
బోఁటికి నిడరాదె మహానుభావ యిష్టార్థంబుల్ ॥ శా॥ ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ । బాదాబ్జం
బులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్నమర్యాదం జెందు కరంబు గ్రిందగుట మీఁదై నా కరంబుంట మేల్గాదే రాజ్యము
గీజ్యమున్ సతతమె కాయంబు నాపాయమే॥ మ॥ నిరయంబైన నిబద్ధమైన ధరణిన్నిర్మూలనంబైన దుర్మరణంబైన కులాంతమై
ననిజమున్ రానిమ్ము కానిమ్ము పో । హరుఁడైనన్ హరియైన నీరజభవుండభ్యాగతుండైన నౌఁ । దిరుగన్నేరదు నాదు జిహ్వ విను
మా ధీవర్య వెయ్యేటికిన్ ॥ గీ॥ నుడివినంత వట్టును సలుకనిచ్చుచో । నేలకట్టు విష్ణుఁ డేటిమాటఁ । గట్టె నేనిఁ దానఁ గరుణించి విడు
చును విడువకుండ నిమ్ము విమలచరిత॥ క॥ మేరువు తలక్రిందైనను । బారావారంబు లింకఁ బారిన లోలో । ధారుణి రజమై పో
యినఁ । చారధ్వరఖండమైనఁ దప్పక నిత్తున్ ॥ మత్తకోకిల॥ ఎన్నఁడుం బరు వేఁడఁ బోఁడఁట యేకలంబఁట కన్నవా । రన్నదమ్ము
లునైన లేరఁట యన్నివిద్యలమూలగో । ష్ఠి న్నెఱింగిన ప్రోడ గుజ్జఁట చేతులొగ్గి వసింపనీ । చిన్నపాపని ద్రోసిపుచ్చఁగఁ జి
త్తమొల్లదు సత్తమా॥ వ॥ అని యిట్లు సత్యపదవీప్రమాణతత్పరుండును, వితరణకుతూహలసత్వరుండును, విమలయశస్కుం
డును, దృఢమనస్కుండును, నియతసత్యసంధుండును, నర్థిజనకమలబంధుండును నైన బలిం జూచి శుక్రుండు కోపించి మదీయ
శాసనంబతిక్రమించుటం జేసి శీఘ్రకాలంబునఁ బదభ్రష్టుండవు గమ్మని శపించిన బలియును గురుశాపతప్తుండయ్యును సూ
నృతమార్గంబున కభిముఖుండై యుండె నప్పుడు॥ గీ॥ బ్రతుకవచ్చుఁగాక బహుబంధనములైన । వచ్చుఁగాక లేమి వచ్చుఁగా
క । జీవధనములైనఁ జెడుఁగాక పడుఁగాక । మాటఁ దిరుఁగ లేరు మానధనులు॥ అనునయ్యవసరంబున॥ గీ॥ దనుజలోకనాథు
దయిత వింధ్యావళి । రాజవదన మదమరాళగమన । వటుని కాళ్లుఁ గడుగ వరహేమఘటమున । జలముఁ దెచ్చె భర్తసన్నయె
ఱిఁగి॥ వ॥ అయ్యవసరంబునఁ గపటవటునకు దానవేంద్రుండిట్లనియె॥ క॥ రమ్మా మాణవకోత్తమ । లెమ్మా నీ వాంఛితంబు
లేదనకిత్తుం । దెమ్మా యడుగులనిటు రా । నిమ్మా కడుగంగవలయు నేటికిఁ దడయన్ ॥ మ॥ బలిదైత్యేంద్రకరద్వయాకృతజల
ప్రక్షాళనవ్యాప్తికి । న్జలజాక్షుండు సాఁచె యోగిసుమనస్సంప్రార్థిత శ్రీపదము । గలితానమ్ర రమాలలాటపదవీకస్తూ
రికాశాదము । న్నలినామోదమురత్ననూపురిత నానావేదముం బాదమున్ ॥ క॥ సురలోకసముద్ధరణము । నిరత శ్రీకరణము
బలనిగమాంతాలంకరణము భవసంహరణము । హరిచరణము నీటఁ గడిగె నసురోత్తముఁడున్ ॥ వ॥ ఇట్లు ధరణీసురదక్షిణ
చరణప్రక్షాళనంబు సేసి వాని పాదంబు గడిగి తత్పావనజలంబు శిరంబునం జల్లుకొని వార్చి దేశకాలాదిపరిగణనంబు సే
సి॥ శా॥ విప్రాయప్రకటాయ విశ్వభవతే విష్ణుస్వరూపాయ వే । దప్రామాణ్యవిధేత్రిపాదధరణీం దాస్యామి యంచుం
గ్రియాశిష్టుండై దనుజేశ్వరుండు వడుగుం జేచాఁచి పూజించె బ్ర । హ్మప్రీతంబని ధారవోసె భువనంబాశ్చర్యమున్బొం
దఁగన్ ॥ తత్కాలంబున॥ గీ॥ నీరధారఁ బడఁగనీక నడ్డంబుగాఁ । గలశరంధ్రమూవఁగాను దెలిసి । హరియు కావ్యునేత్రమటఁ గు
శాగ్రంబున నడవ నొక్క నేత్రుఁ డయ్యె నతఁడు॥ అంత॥ ఉ॥ అమరారాతికరోద్ధురోజ్ఝితపవిత్రాంభఃకణశ్రేణికిం । గ
మలాధీశ్వరుఁడొడ్డె ఖండితదివౌకస్స్వామిచిన్యస్తముం । గమలాకర్షణసుప్రశస్తము రమాకాంతాకుచోపాస్తము । న్విమ
లశ్రీకుచ*శాతచూచుకతటీవిన్యస్తమున్ హస్తమున్ ॥ క॥ మునిజననియమాధారను । జనితాసురపతిసునేత్రజలకణధార ।
దనుజేంద్రనీరధారను । వనజాక్షుఁడు గొనియె బలివివర్జితధారన్ ॥ గీ॥ కమలనాభు నెఱిఁగి కాలంబు దేశంబు । లెఱిఁగి శుక్రు
మాట లెఱిఁగి నాశ । మెఱిఁగి పాత్రమనుచు నిచ్చె దానము బలి । మహివదాన్యుఁ డొక్కఁడు మాఱియఁగలఁడె॥ క॥ క్షితిదానమి
చ్చునతఁడును । నతికాంక్షఁ బరిగ్రహించునతఁడును దురితచ్యుతులై శతవత్సరములు । శతముఖలోకమునఁ గ్రీడసలుపుదు
రెలమిన్ ॥ వ॥ అట్లుగావున నే దానంబును భూదానంబునకు సదృశంబుగా నేరదు గావున వసుంధరాదానం బిచ్చితి నుభయ
లోకంబులం గీర్తి సుకృతంబులు వడయుమని పలికి యమ్మాయావర్ణి వటుండిట్లనియె॥ క॥ ఇది యేమి వేఁడితని నీ । మదివగవక
ధారఁ బోయు మహాసజ్జనుఁ డెం । పొదవఁగఁ గోరికె యర్థం । బిదియిచ్చుట ముజ్జగంబు లిచ్చుట మాకున్ ॥ వ॥ అని పలికిన పలుకుల
కుహర్షనిర్భరచేతస్కుండై వైరోచనుండు॥ గీ॥ పుట్టి నేర్చుకొనెనొ పుట్టక నేర్చెనో । చిట్టిబుద్ధులిట్టిపొట్టివడుగు । పొట్టను
న్నవెల్ల భూములు నని నవ్వి । యెలమి ధరణిదానమిచ్చెనపుడు॥ క॥ బలిచేసిన దానమునకు । నలినాక్షుఁడు నిఖిలభూతనాయ
కుఁడగుటం । గలకలనై దశదిక్కులు । భళిభళియని వొగడె భూతపంచకమనఘా॥ గీ॥ గ్రహమునీంద్రసిద్ధగంధర్వకిన్నర । య
క్షపక్షిదేవతాధిపతులు । పొగడి రతని పెంపుఁ బుష్పవర్షంబులు । గురిసె దేవతూర్యకోటి మొరసె॥ ఇట్లు ధారాపరిగ్రహం

## శ్రీ వామనమూర్తి విశ్వరూపము నొంది విజృంభించుట.

బు చేసి॥ శా॥ ఇంతింతై వటుఁడింతయై మఱియుఁ దానింతై నభోవీథిపైఁ । నంతై దోయదమండలాగ్రమునకల్లంతై ప్రభా

*శాతచూచుకతటీవిన్యస్తమున్ । వాడియయిన చను మొనలయొక్క ప్రదేశములయందుంచఁబడునట్టి.

రాశిపైనంతై చంద్రునికంతమై ధ్రువునిపైనంతై మహర్వాటిపైనంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంతసంవ
ర్ధియై॥ మ॥ రవిబింబం బుపమింపఁ బాత్రమగుఛత్రంబై శిరోరత్నమై శ్రవణాలంకృతమై గళాభరణమై సౌవర్ణకేయూర
మై ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్వస్త్రమై నూపుర ప్రవరంబై పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండమున్నిండుచోన్॥
వ॥ ఇట్లు విష్ణుండు గుణత్రయాత్మకంబగు విశ్వరూపంబు ధరించి నభంబును, దివంబును, భువనంబును, దిశలును, సముద్రంబు
లును, జలచరచలదఖిలభూతనివహంబులుం దానయై యేకీభవించి క్రమక్రమంబున భూలోకంబునకుం బొడవై భువర్లోకం
బు నతిక్రమించి సువర్లోకంబు నుందలకడచి మహర్లోకంబు దాఁటి జనోలోకంబునకు మీఁదై తపంబునకునుచ్ఛ్రాయుం
డై సత్యలోకంబుకంటె నౌన్నత్యంబు వహించి యెడలిరుములు సంధులు రంధ్రంబులు లేకుండ నిండి మహాదేహసహితుం
డై చరణతలంబున రసాతలంబును, పాదంబుల మహియును, జంఘల మహీధ్రంబులును, జానువుల బతత్త్రిసముదయంబు
లును, నూరువుల నింద్రసేన మరుద్గణంబులును, స్కంధంబున సంధ్యయు, మానంబునఁ జంద్రుండును, గుహ్యంబునఁ బ్రజాప
తులును, జఘనంబున దనుజులును, నాభిని నభంబును, నుదరంబున నుదధిసప్తకంబును, నురంబునఁ దారకానికరంబును, ను
రోజంబుల ఋతుషట్కంబును, హృదయంబున ధర్మంబును, వక్షంబునఁ గమలహస్తయగు లక్ష్మియుఁ, గంఠంబున వేదము
లును, భుజంబులఁ బురందరాది దేవతలును, గర్ణంబుల దిశలును, శిరంబున నాకంబును, శిరోజంబుల మేఘంబులును, నాసాపు
టంబున వాయువులును, నయనంబుల సూర్యుండును, వదనంబున వహ్నియు, వాణి నఖిలఛందస్సముదయంబును, బృష్ఠంబు
న నధర్మంబును, రసనంబున జలేశుండును, భ్రూయుగళంబున విధినిషేధంబులును, ఱెప్పల నహోరాత్రంబులును, లలా
టంబునఁ గోపంబును, నధరంబున లోభంబును, స్పర్శంబునఁ గామంబును, రేతంబున జలంబును, గ్రమణంబున యజ్ఞంబును
ఛాయవలన మృత్యువు, నగవువలన ననేకమాయావిశేషంబులును, రోమంబుల నోషధులును, నాడీప్రదేశంబుల నదులును,
నఖంబుల శిలలును, బుద్ధి నజుండును, బ్రాణంబుల దేవర్షిగణంబులును, గాత్రంబున జంగమస్థావరజంతుసంఘంబులును గల
వాఁడై - జలధరనినదశంఖ శార్ఙ్గ సుదర్శన గదాదండ ఖడ్గాక్షయబాణతూణీర విభ్రాజితుండును, మకరకుండల కిరీట కేయూ
ర హార కటక కంకణ కౌస్తుభమణి మేఖలాంబర వనమాలికా విరాజితుండును, సునంద నంద జయ విజయ ప్రముఖ పరిచర
వాహినీసందోహపరివృతుండును, నసమాన తేజోవిలసితుండును నై, బ్రహ్మాండంబుదన మేనికప్పు తెఱంగున నుండ విజృం
భించె॥ మ॥ ఒకపాదంబున భూమిఁ గప్పె నతి వేడ్కొంటన్ విరోధించి యొం డొకట న్మీఁది జగంబులెల్ల వడి నొండొంటన్ విలం
ఘించి పట్టక బ్రహ్మాండకటాహమున్ బగిలి వేంద్రంబై పరుల్లానరా నెక్కుఁడై వాగ్దృగలభ్యుఁడై హరివిభుండొప్పారె విశ్వా
కృతిన్॥ గీ॥ ఒకపదంబు గ్రింద నుర్వి పద్మమునంటి కొనినఁ బంకలవము గొమరుఁ దాల్చె నొకటి మీఁది దమ్మి కొదిగిన తేఁటినా
వెలసె మిన్న నృపత్రివిక్రముమున॥ తత్సమయంబున॥ గీ॥ జగములెల్ల దాఁటి చనిన త్రివిక్రము చరణనఖరచంద్రచంద్రికల
ను బొనరువడియె సత్యమున బ్రహ్మ తేజంబు దివసకరుని రుచుల దివియుభంగి॥ సీ॥ భవబంధములఁ బాసి బ్రహ్మలోకంబునఁ
గాపురంబులు సేయు ఘనులు రాజు లామరీచ్యాదులు నాసనందాదులు నాదివ్యయోగీంద్రు లచట నెపుడు మూర్తివంతం
బులై మొఱయు పురాణతర్కామ్నాయ నియమేతిహాసధర్మ సంహితాములు గురుజ్ఞానాగ్నినిర్దగ్ధకర్ములై మఱియును గలు
గునట్టి వారలెల్లఁ జొచ్చి వచ్చి సర్వాధిపు నంఘ్రిఁ జూచి ముక్కిరధికభక్తిఁ దమ మనంబులం దుమఁ దలఁచు నిధానంబుఁ
గంటి మనుచు నేఁడు మంటి మనుచు॥ మ॥ తనపుట్టిల్లి దె సొమ్ము టంచు నజుఁడుం దన్నాభిపంకేరుహంబు నిరీక్షించి నటించి యు
న్నతపదంబుం జూచి తత్పాదసేచనముం జేసెఁ గమండలూదకమునం జల్లించి తత్తోయము ల్వినువీథిం బ్రవహించె దేవనది
నా విశ్వాత్ముఁ గీర్తిప్రభన్॥ తత్సమయంబున॥ సీ॥ యోగమార్గంబున నూహించి బహువిధపుష్పదామంబులఁ బూజసేసి
దివ్యగంధంబులు దెచ్చి సమర్పించి ధూపదీపములఁ దోడ్తోడ నిచ్చి భూరిలాజాక్షతంబులు సల్లి ఫలములు గానుక లిచ్చి రాగ
ములఁ బొగడి శంఖాదిరవముల జయఘోషములు సేసి కరుణాంబునిధి త్రివిక్రముఁ డటంచు బ్రహ్మ మొదలు లోకపాలురు
గొనియాడి రెల్లదిశల వనచరేశ్వరుండు జాంబవంతుఁ డరిగి చాటె భేరిధ్వని వెలయఁ జేసె విష్ణువిజయ మనుచు॥ క॥ అన్నిజ
గంబులదానై యున్న జగన్నాథుఁ జూచి నొగిభావింపం గన్నం డక మనమందక సన్నుతులుం జేసి రపుడు సభ్యులు బలియున్॥
వ॥ అంత నయ్యైనఁ బూర్వప్రకారంబున నున్న వామనుని నంగనిపదత్రయవ్యాజంబున నితండు సకలమహీమండలంబు నా
క్రమించెఁ గపటవటురూపతిరోహితుండగు విష్ణుండని యెఱుంగక మన దానవేంద్రుండు సత్యసంధుండు గావున మాటడిబు
గక నిచ్చె నతనివలన నేరంబు లేదీ కుబ్జుండ ప్రతిహత తేజః ప్రభావంబున నిజ్జగంబులఁ బరిగ్రహించి వాసవునకు నీయఁదలం
చియున్నవాఁ డీవటుని నిందూరిపాలక నిర్జించుట కర్జంబని తర్జనంబుల గర్జనంబులఁ జేయుచు విప్రచిత్తి రాహు హేతిముఖ్యు

ఁగురక్కసులు మిగిలి యుద్ధసన్నద్ధులై పరశుపట్టసభల్లాదిసాధనంబులు ధరియించి కసిమసంగి ముసరికొని దశదిశలం బ్రసరించినం జూచి హరిపరిచరులగు సునందనందజయజయంతవిజయప్రబలోద్బలకుముదకుముదాక్షు తార్క్ష్యపుష్పదంతవిష్వక్సేనశ్రుతదేవసాత్వతులను దండనాథులయుత వేదండసనుబలులై తమతమ యూథంబులనాయుధంబులతోఁ గూడుకొని దానవానీకంబులం బరలోకంబున కనుపువారలై యుండ వారలెదుటఁ గని కదనంబునకుం బరవసంబు సేయుచున్నం గనుంగొని శుక్రశాపంబుఁ దలంచి దనుజవల్లభుం డిట్లనియె॥ సీ॥ రాక్షసోత్తములార రండు పోరాడక కాలంబు గాదిది కలహమునకు। సర్వభూతములకు సంపదాపదలకుఁ బ్రభువైన దైవంబు పరిభవింప। మన మోపుదుమె తొల్లి మనకు రాజ్యంబును సురలకు నాశంబు సారిది నిచ్చి। విపరీతముగఁ జేయు వేల్పు నేమందుము మన పాలిభాగ్యంబు మహిమ గాక। వెఱవిపలుమారు బారెడి విష్ణుభటులు। మిమ్ము గెలుచుట దైవంబు మేర గాదె। మనకు నెప్పుడు దైవంబు మంచిదగును। నాఁడు గెలుతము పగవారి నేఁడు వలదు॥ అదియునుం గాక॥ క॥ బలుమర్గంబులు సదివులు। బలములు మంత్రౌషధంబు బహు శేముషియుం। గలిగియు సామోపాయం। బులకాల మెఱింగి నృపుఁడు పోరుట యొప్పున్॥ వ॥ అట్లుగావున రణంబునకిప్పుడు శత్రుల మోహరించుట కార్యంబు గాదు మనకుం దగు కాలంబున జయింత మనలం గకతలంగుండనినఁ దలంగి భాగవతభటభీతులై దిక్కు రక్కసులు రసాతలంబునకుం జనిరప్పుడు హరిహృదయం బెఱింగి తార్క్ష్యనందనుండు యాగసుత్యాహంబున వారుణపాశంబులనసురవల్లభుని బంధించెనంత॥ క॥ బాహులు పదములు గట్టిన। శ్రీహరికృప గాక నేమి సేయుదు ననిసం। దేహింపక బలి నిలిచెను। హాహారవమెసఁగె దశదిగంతములందున్॥ క॥ సంపద చెడియును దైన్యముఁ। గంపంబును లేకఁ దొంటి కంటెను బెంపుం। బెంపును నెఱుకయు ధైర్యము। వంపని సురవైరిఁ జూచి వటుఁ డిట్లనియెన్॥ సీ॥ దానవ త్రిపద భూతలమిత్తునంటి విధరణిఁ జంద్రార్కులెందాఁక నుండు। రంత భూమియు నొక్క యడుగయ్యె నాకు నుస్వర్లోకమును నొక్క చరణమయ్యె। నీ సొమ్ము సకలంబు నేఁడు రెండడుగులు గడను పాదమునకుఁ గల దె భూమి। యిచ్చెదనన్నర్థ మీనిదురాత్ముండు నిరయంబు నొందుట నిజము గాదె। కాన దుర్గతికిఁ గొంత కాలమరుగుఁ। గాక నిచ్చెద వేని వేగంబు నాకు। నిపుడు మూఁడవపదమునకిమ్ముఁ జూపు। బ్రాహ్మణాధీనములు ద్రోవ బ్రహ్మవశమె॥ వ॥ అని యిట్లు వామనుండు వలుక సత్యభంగసందేహవిషదిగ్ధశల్యనికృత్తహృదయుండయ్యును భీతుండు గాక వైరోచని ప్రసన్నవదనంబుతోడఁ జిన్ని ప్రోడవడుగునకిట్లనియె॥ గీ॥ సూనృతంబు గాని నుడియదు నా జిహ్వ బొంకఁ జాలనాకు బొంకు లేదు। నీ తృతీయపదము నిజము నా శిరమున। నెలవు సేసి పెట్టు నిర్మలాత్మ॥ గీ॥ నిరయమునకుఁ బ్రాప్తనిగ్రహంబునకును। బదవిహీనతకు నిబంధమునకు। నర్థభంగమునకు నఖిలదుఃఖమునకు। వెఱవ దేవ బొంక వెఱచినట్లు॥ అదియునుం గాక॥ సీ॥ తల్లిదండ్రులు నన్నదమ్ములు చెలికాండ్రు గురువులు శిక్షింపఁ గొఱత వడునె। పిదప మేలగుఁ గాక పృథుమదాంధులకును దానవులకు మాకుఁ దలఁటియెఱింగి। విస్రంభ చక్షువుల్వెలయ నిచ్చుటఁ జేసి గురువులలోన నాదిగురువవీవ। నీవు బంధించిన నిగ్రహమో లజ్జయో నష్టియో బాధయో తలంప। నిన్ను నెదిరించి పోరాడి నిర్జరారులాదియోగీంద్రులం దెనుచుట్టి టెంకి। నందరే తొల్లి పెక్కండ్రు హర్షమూర్తి। వైరిభక్తులు గట్టిగావలయు గాక। నీశ నీ యెడను గ్లభ నేమికలదు॥ మ॥ చెలియే మృత్యువు చుట్ట మేయముఁడు సంసేవార్థులే కింకరుల్। నలలం జేసెనె బ్రహ్మదన్నదృఢమె జీవంబునో చెల్లరే। చలితం బౌట నెఱుంగరీ కపట సంసారంబు నిక్కంబుగాఁ। దలచున్మాధుఁడు సత్యదానకరుణాధర్మాదినిర్ముక్తుఁడై॥ సీ॥ చుట్టాలు దొంగలు సుతులు బుణస్థులు గాంతలు సంసారకారణములు। ధనములస్థిరములు దనువతిచలనంబు గార్యార్థులన్యులుగడఁచుఁ గాల। మాయుష్య మైశ్వర్య మతిశీఘ్రమని గాదె యనఘుండు దమతండ్రి నధికరించె। మా తాత సాధుసమ్మతుఁడు ప్రహ్లాదుండు నీ పాదకమలంబు నియతిఁ జేరె। భద్రుఁడతనికి మృతి లేని బ్రతుకు గలిగె। వైరులై కాని తొల్లి మా వారు గాన। రర్థివై వచ్చి నీవు నన్నడుగు టెల్లఁ। బద్మలోచన నా పుణ్యఫలము గాదె॥ అని యిట్లు పలుకుచున్న యవసరంబున॥ శా॥ అద్దైత్యేంద్రుఁకు పీనవక్షు నవపద్మాక్షుఁ బిశంగాంబరా। చ్ఛాదున్ నిర్మలసాధువాదు ఘనసంసారాదివిచ్ఛేదు సం। శ్రీదున్ భక్తిలతాతిరోహితుహరిశ్రీపాదు నిఃక్షేముఁ బ్రహ్లాదుండు న్బోధకళావినోదుఁ గని మోహర్షంబుతో ముందటన్॥ వ॥ ఇట్లు సమాగతుండైన తమ తాతం గనుంగొని విరోచననందనుండు వారుణపాశబద్ధుండు గావునఁ దనకుం దగిన నమస్కారంబు సేయరామిం జేసి సంతాపాశ్రువిలోలలోచనుండై సిగ్గువడి నతశిరస్కుండై నమ్రభావంబున మ్రొక్కు చెల్లించె నంతఁ బ్రహ్లాదుండు సుఖమంటపంబున సునందాదిపరికరసమేతుండై కూర్చున్న వామనదేవునిం గనియానందబాష్పజలంబులుం బులకాంకురంబులు నెఱయ దండప్రణామంబు లాచరించి యిట్లని విన్నవించె॥ సీ॥ ఇతనికి మున్ను నీ వింద్రపదం బిచ్చి నేఁడు ద్రిప్పుటయును నెఱయ నేలు। మోహనాహంకృతిమూలంబు గర్వాంధతమసవికారంబు దానిమాన్పి। కరుణ రక్షించుట గాక బంధించుటే తత్వజ్ఞ

కుమ హేంద్రత్వ మేల। నీపాదకమలంబు నియతిఁ గొల్చిన దానఁ బోలు నే సురరాజ్యభోగపరత। గర్వ మే పారఁగన్నులు గా
న రావు। చెవులు వినరావు చిత్తంబు దిక్కుపఱును। మఱచు నీ సేవలన్నియు మహిమ మాన్పి। మేలు చేసితి నీ మేటి మేఱసూపి॥
వ॥ అనిపల్కి జగదధీశ్వరుండును నిఖిలలోక సాక్షియును నగు నారాయణ దేవునకు నమస్కరించి ప్రహ్లాదుండు పలుకుచున్న స
మయంబున॥ మ॥ తతమత్తద్విపయానయై కుచనిరుంధద్వ్యోళసంవ్యానయై। ధృతబాష్పాంబువితానయై కరయుగాధీనాళిక
స్థానయై। పతిభిక్షాంగన దేహి కోమలమతే పద్మాపతే యంచుఁ దత్ స్తుతి వింధ్యావళి సేరవచ్చెఁ ద్రిజగత్త్రాణానుస్వా
నున్॥ వ॥ వచ్చి యచ్చేడియ తచ్చరణసమీపంబునం బ్రణతయై నిలుచంబడి యిట్లనియె॥ క॥ నీకుం గ్రీడార్థములగు లోకంబు
లఁ జూచి పరులు లోకులు కనుతు । ల్లోకాధీశుల మందురు । లోకములకు రాజవీవ లోకస్తుత్యా ॥ క ॥ కాదనఁడు పా
మ్ము లేదీ । రాదనఁడు జగత్త్రయైక రాజ్యము నిచ్చె । న్నాదయితుఁ గట్ట నేటికి । శ్రీదయితా చిత్తచోర శ్రితమందారా॥
వ ॥ అని యిట్లు వింధ్యావళియుఁ, బ్రహ్లాదుండు విన్నవించు నవసరంబున హిరణ్యగర్భుండు సనుదెంచి యిట్లనియె॥
సీ ॥ భూతలోకేశ్వర భూతభావన దేవ దేవజగన్నాథ దేవవంద్య । తన సొమ్ము సకలంబు దప్పక నీ కిచ్చె దండయోగ్యుఁడు
గాఁడు దానపరుఁడు। గరుణింపనగ్గ్రాంశుగమలలోచన నీకు విడిపింపు మీతని వెఱపుదీర్చి। తోయపూరము చల్లి దూర్వాంకు
రంబులఁ జేరి నీపదము లర్చించునట్టి। భక్తియుక్తుఁడు లోకేశ పదమునందు। నీవు ప్రత్యక్షముగ వచ్చి నేఁడు వేడ। నెఱిఁగి తనరా
జ్యమంతయు నిచ్చినట్టి। బలికిఁ దగునయ్య దృఢపాశబంధనంబు॥ అనిపలికిన బ్రహ్మవచనంబులు విని భగవంతుం డిట్లనియె॥ సీ॥ ఎ
వ్వనిఁ గరుణింప నిచ్ఛయించితి వాని నఖిలవిత్తంబు నే నపహరింతు। సంసారగురుమదస్తబ్ధుఁడై యెవ్వఁడు దెగడి లోకము మన
న్నధిక్కరించు । నతఁడెల్ల కాలంబు నఖిలయోనులయందుఁ బుట్టుచుఁ దుర్గతిఁ బొందుచుఁ బిదప। విత్తవయోరూపవిద్యాబ
లైశ్వర్యకర్మజన్మంబుల గర్వముడిగి। యేకవిధమున విమలుఁడై యెవ్వఁడుండు । వాఁడు నాకూర్చి రక్షింపవలయువాఁడు।
స్తంభలోభాభిమానసంసారవిభవ। మత్తుఁడై చెడనొల్లఁడు మత్పరుండు॥ శా॥ బద్ధుండై గురుశాపతప్తుఁడయి తా బంధుప్ర
జత్యక్తుఁడై। సిద్ధైశ్వర్యముఁ గోలుపోయి విభవక్షీణుండునై పేదయై। శుద్ధత్వంబును సత్యముం గరుణయున్ సొంపేమియుం
దప్పఁడు। వృద్ధుండై యజయాఖ్యమాయ గెలిచెం బుణ్యుండితం డల్పుఁడే॥ గీ॥ అసురనాథుఁ డనుచు నఘుని మర్యాద। యేను
చూత మనుచు నింతవలుక। నిజము వలికె నితఁడు నిర్మలాచారుండు। మేలు మేలు నాకు మెచ్చువచ్చు॥ క॥ సావర్ణి మనువు వేళను।
దేవేంద్రుండగు నితండు దేవతలకు సం। భావితమగు నాచోటికి। రావించెద నంతమీఁద రక్షింతుదయన్॥ క॥ వ్యాధులు దప్పులు
నొప్పులు। బాధలు చెడి విశ్వకర్మభావిత దనుజా। రాధిత సుతలాలయమున। నేధిత విభవమున నుండు నితఁ డందాఁకన్॥ అనిప
లికి బలిం జూచి భగవంతుం డిట్లనియె॥ సీ॥ సేమంబు నీకింద్రసేన మహారాజ వెఱవకు మేలు నీ వితరణంబు। వేలుపులందుఁడ వే
డుకఁ బడుము రుజదుఃఖంబు లిడుములును దుర్మరణము। లాఁగు రతలు నొప్పులందుఁ డుండు వారికి నొందవు సుతలమం దుండుము నీవు। నీ సం
పు సేయ నిర్జరారాతుల నా చక్రమే తెంచి నరుకుచుండు। లోకపాలకులకు లోను గావక్కఁడ। నన్యు లెంత వారి నచట నిన్ను।
నెల్ల ప్రొద్దు వచ్చి యేను రక్షించెదఁ। గరుణతోడ నీకుఁ గానవత్తు॥ క॥ దానవదైత్యుల సంగతిఁ। బూనిన నీ యసురభావమును దో
త్రోచు। ధ్యానమునఁ దలఁగిపోవును। మానుగ సుతలమున నుండు మా మాయాజ్ఞన్॥ అని యిట్లు పలుకుచున్న ముమ్మూర్తులము
నుకవేల్పు తియ్యని నెయ్యంపుపలుకులు చెఱుకురసంబు సోనలు వీనుల తెరువులం జొచ్చి లోబయలు నిండి తెప్పలకప్పు తప్పం
గ్రోఁచికొని కనుఁగవ కొలంకుల నలుగులు వెడలిన చందంబున సంతసంబునం గన్నీరు మున్నీరై పఱవ సురశిఖల కంబునంబుల
కంబులు పులకంబులై తిలకంబులొత్తఁ గేలు మొగిడ్చి నెక్కొన్న వేడుకం దొట్రుపడుచుఁ జిక్కని చిత్తంబునఁ జక్కని మాట
లర క్కసులతేఁ డిట్లనియె॥ ఉ॥ ఎన్నఁడు లోకపాలకుల నీ కృపఁ జూడని నీవు నేఁడు నన్నున్నతిఁ జేసి నా బ్రతుకు నోజయు నా
నతియిచ్చి కాచితీ। మన్ననలీ దయారసము మాటల పెద్దఱికంబు చాలదే। పన్నగతల్పని న్నెఱిఁగి పట్టిన నాపద గల్గ నేర్చునే॥
వ॥ అనిపలికి బంధవిముక్తుండై హరికి నమస్కరించి బ్రహ్మకుం బ్రణామంబు సేసి యిందుధరునకు వందనం బాచరించి తనవార
లతోఁ జేరికొని బలి సుతలంబునకుం జనియె నంత హరి కృపావశంబునం గృతార్థుండై కులోద్ధారకుం డయిన మనుమనిం గనిసం
తోషించి ప్రహ్లాదుండు భగవంతున కిట్లనియె॥ సీ॥ చతురాననుఁడు నీ ప్రసాదంబు గానఁడు శర్వుఁ డీ లక్ష్ములజాడఁ బొందఁ। డ
న్యుఁ డెక్కడి దసురులకును మాకును బ్రహ్మాదిపూజితపదుఁడవైన। దుర్లభుండవు నీవు దుర్గపాలుఁడవైతి పద్మజాదులు భవ
త్పాదపద్మ। మకరంద సేవన మహిమనైశ్వర్యంబులందిరి కాక మేమల్పమతుల। మధికదుర్యోధులము కుత్సితాత్మకులము। నీ
కృపాదృష్టిమార్గంబు నెలవు సేర। నేమి తప మాచరించితి మెన్నఁగలమె। మమ్ముఁగాచుట చిత్రంబు మంగళాత్మ॥ అదియు
నుం గాక॥ గీ॥ సర్వగతుఁడ వయ్యు సమదర్శనుఁడ వయ్యు। నొకట విషమవృత్తి నుండు దరయ। నిచ్చ లేని వారికీవు భక్తులు గోరు।

తలఁపులిత్తుకల్పతరువుమాడ్కి॥ వ॥ అనివిన్నవించుచున్నప్రహ్లాదుంజూచిపరమపురుషుండిట్లనియె॥ గీ॥ వత్సప్రహ్లాద మేలు నీవారునీవు।పౌత్రునిమనమునఁదోడ్కొనిసుతలమునకుఁ, బ్రీతిమైనమెహమ్ము నేగఁదాపాణినగుచుఁ। జేరిరక్షింపమఱితంబు చెంద వచట॥ వ॥ అనియిట్లునియమించినంబరమేశ్వరునకునమస్కరించి వలగొనికరకమలపుటఘటితనిటలతటుండై వీడ్కొనిబ లిందోడ్కొనిసకలాసురయూథంబునుం దానునొక్కమహాబిలద్వారంబుసొచ్చి ప్రహ్లాదుండు సుతలలోకంబునకుంజని యెనంత బ్రహ్మవాదులయినయాజకులసభామధ్యంబునంగూర్చున్నశుక్రునిం జూచి నారాయణుండిట్లనియె॥ గీ॥ ఏమికా ఱతవడియెనీతనియాగంబు।విస్తరింపుమీవు విప్రవర్య।విషమమయినకర్మవిసరంబు బ్రాహ్మణ।జనులుసూచినంతశమతఁ బొందు॥ అనినశుక్రుండిట్లనియె॥ సీ॥ అఖిలకర్మంబులకధినాథుఁడవునీవుయజ్ఞేశుఁడవునీవుయజ్ఞపురుష।ప్రత్యక్షమున నీవు పరితుష్టినొందినఁగడమేలగల్గు నేకర్మములకు। ధనదేశకాలార్హతంత్రమంత్రంబులఁగొఱతలునిన్నుఁ జేరోకొనినమా ను।నైనఁగావింతునీయానతిభవదాజ్ఞ మెలఁగుటజనులకు మేలుగాదె।యింతకంటెనుశుభము నాకేచటఁగలుగు। ననుచు హ్యారిపంపుశిరముననావహించి। కావ్యుఁడసురేంద్రుజన్నంబుకడమదీర్చె। మునులువిప్రులుసాహాయ్యమునఁజరింప॥

వ॥ ఇవ్విధంబున వామనుండై హరిబలినడిగిమహిఁబరిగ్రహించితనకునగ్రజుండగునమరేంద్రునకుం ద్రిదివంబు సద య్యుండై యొసంగెనత్తఱి దక్షభృగుప్రజాపతులును, భవుండును, గుమారుండును, దేవర్షిపితృగణంబులును, రాజులును, ద్నానునుగూడికొని చతురాననుండు గశ్యపునకునదితికిసంతోషంబుగా లోకంబులకు, లోకపాలురకు, వామనుండు వల్ల భ్నుండనినియమించె- ధర్మంబునకు, యశంబునకు, లక్ష్మికి, శుభంబులకు, దేవతలకు, వేదంబులకు, స్వర్గాపవర్గంబులకును పేం - ద్రుండుప్రధానుండనిసంకల్పించిరాసమయంబున॥ క॥ కమలజుఁడులోకపాలురు।నమరేంద్రునిఁగూడి దేవయానంబున న।య్యమరావతికిని వామను।నమరంగొనిపోయిరంతనటమీఁదనృపా॥ గీ॥ బల్లిదంపుతోడఁబ్రాపుననింద్రుని।కింద్రపద ము చేరుటిట్లుగలిగెఁ।దనకునాద్యుఁడైనతమ్ముఁడుగలిగినఁ।గోరుకొలన్న కేలఁగొఱతనొందు॥ క॥ పాలడుగఁడు మేలడుగం। డేలఁడుభిక్షించియన్నకిచ్చెఁద్రిజగము। న్వేలుపులతల్లికడపటి।చూలునొప్పెలంగఁగల రెసౌలయనితమ్ముల్॥ గీ॥ కడుపుబరు వుగాఁగఁగొడుకులఁగనుకంటెఁ। దల్లికొక్కఁడెచాలుబల్లిదుండు। త్రిదశగణముఁగన్నయదితికానువుఁదీర్చె।చిన్ని మేటివడు గుఁగన్నయట్లు॥ వ॥ ఇట్లు దేవేంద్రుండు వామనభుజపాలితంబగు త్రిభువనసామ్రాజ్యవిభవంబుల నలనంగీకరించెనప్పు డు బ్రహ్మయుశర్వుండును, గుమారుండును, భృగుప్రముఖులైనమునులును, పితృదేవతలును, దక్షాదిప్రజాపతులును, సిద్ధ లును, వైమానికులును, మఱియుందక్కినవారలునచ్యుతపరాక్రముండైనవిష్ణుప్రభావంబులకు నాశ్చర్యంబునొందుచుఁ బ్రశంసించుచు నాడుచుం బాడుచుం దమతమనివాసంబులకుంజనిరని చెప్పి శుకుండిట్లనియె॥ గీ॥ మనుజనాథ త్రివిక్రమము హిమకొలఁది।యెఱిఁగితఱిగింప లెక్కింప నెవ్వఁడోపుఁ।గుంభినీరేణుకణములు గురుతువెట్టు। వాఁడునేరఁడు దక్కినవాని వశమె॥ క॥ అద్భుతవర్తనుఁడగుహరి।సద్భావికమైనవిమలచరితముఁ విను వాఁ।డుద్భటవిక్రముఁడై తుది।నుద్భావితలీలఁ బొం దును త్తమగతులన్॥ గీ॥ తగిలిమానుషపైతృకదైవకర్మ।వేళలందుఁ ద్రివిక్రమవిక్రమంబు। లెక్కడెక్కడఁగీర్తింతు రెవ్వ రేని।బొందుదురునిత్యసౌఖ్యంబుభూవరేంద్ర॥ వ॥ అనియిట్లుశుకుండు రాజునకు వామనావతారచరితంబు సెప్పెనని

## శ్రీ మత్స్యావతారకథాప్రారంభము. శ్రీ

సూతుండుమునులకుం జెప్పినవినివారలతనికిట్లనిరి॥ సీ॥ విమలాత్మవినమాకు వేడుకయ్యెను మున్ను హరిమత్స్యమైనవృత్తాం తమెల్లఁ।గర్మబంధునిభంగిఘనుఁడీశ్వరుఁడు లోకనిందితంబై తపోనిలయమైన।మీనరూపము నేలమేదినిధరియించె నెక్క డవర్తించె నేమిచేసె।నాద్యమై వెలయునయ్యవతారమునకు నెయ్యదికారణంబుగార్యాంశమెట్లు।నీవువసుదుమాకునిఖి లంబు నెఱిఁగింపఁ।దెలియఁజెప్పవలయు దేవదేవు। చరితమఖిలలోకసౌభాగ్యకరణంబు। గాదెవిస్తరింపుక్రమముతోడ॥

వ॥ అనిమునిజనంబులుసూతునడిగిననతండుమీరలడిగినయీయర్థంబుఁబరీక్షిన్నరేంద్రుండడిగినభగవంతుండగు బాదరా యణియిట్లనియె॥ సీ॥ విభుఁడీశ్వరుఁడు వేదవిప్రగోసురసాధుధర్మార్థములుగావఁదనువుఁదాల్చె।గాలిచందంబునఘనరూ పములయందుఁదనురూపములయందుఁదగిలియుండు। నెక్కువతక్కువ నెన్నఁడు నొందక నిర్గుణత్వంబున మెఱయుఘనుఁడు। గురుతయుఁగొఱతయుగుణసంగతివహించుమమ జేశచోద్యమే మత్స్యమగుట। వినుముపోయినకల్పాంతవేళఁదొల్లిఁ। ద్ర విడదేశపురాజుసత్యవ్రతుండు।నీరుఁద్రావుచుహరిఁగూర్చినిష్ఠతోడఁ।దపముఁగావించెనొకమేటిదటమునందు॥ వ॥ అని మఱియునొక్కనాఁడమ్మేదినీకాంతుండుకృతమాలికయను నేటిపొంతహరిసమర్పణంబుగా జలతర్పణంబు సేయుచున్న సమయంబుననారాజుదోయిటనొక్క మీనుపట్టిదవిలివచ్చిననులిక్కిపడి నలందరంగిణీజలంబునం దుశకులశాబకంబుఁ విడి

చేపడి వడి నీటితోఁ బుండి* జలపోతంబు భీతలేశ్వసనకిట్లనియె॥ మత్తకోకిల॥ పాటువచ్చిన జాతిఘాతులు పాపజాతిఝషం
బులీ। యేటఁ గొండొక మీనుపిల్లల నేఁచిపట్టి వధింపవ। నోట్లుటనుండక నీకుదోసిలి వచ్చి చొచ్చిన నన్ను నీ। ట్టేటఁ ద్రోవంగఁ బాడి
యే కృపయింత లేక దయాళిధీ॥ గీ॥ వలలఁ దారుణింక వచ్చి జాలరి§ వేఁట। కాఱు కేలుగలఁ దితారు పెట్టి మిడిసిపాటనీక మెడఁ
బట్టుకొనియెడ। రప్పడెం మఁ జొత్తు¶ నఘ వరిశ॥ క॥ భక్షింతు రొండె ఝషములు। శిక్షింతురు కష్టులుగుచుఁ జెడకుండననుం। ర
క్షింపు దీనవత్సల। పక్షీశ్వరగమన చక్రపాణి భాగ్యము గలదే॥ వ॥ అని పలికిన కనికరుండగు నవ్విభుండు మెల్లన నంభోజపింభ
కంబును, కమండలుజలంబునం బెట్టి తన నెలవునకుం గొనిపోయె నదియును నొక్క రాత్రంబునం గుండికా నిండి నినుకునుండ నిమ్ము
చాలక రాజన్యునకిట్లనియె॥ క॥ ఉండ నిది గొంచె మెంతయు। నొండొక టిం డెమ్ము భూవరోత్తమ యనుడుం। గ్గుండికమఁ దెచ్చి విడి
చెను గుండపుఁ బ్రతికలశ సలిలమున్న మునంచున్॥ వ॥ అదియును ముహూర్తమాత్రంబున కుమూఁడు చేతులనిడుపై ‖ యునంచ
నంబు నిండిన బట్టులేక వేఁడికొండు దెమ్మనవుడా రాచపట్టి కరుణాగుణంబులకు నాటపట్టుగావున గండకంబు నొక్క చిఱుత
సుడుగు నను నిచెనదియును నా సరోవర జలంబులకు నగ్గలంబై తనకు సంచరింపనదికొంచంబని పలికిన బుడమి ఱేఁడు మంది వాఁ
డు పుటంజేసి యాఘటకచరంబును వందితజలాస్పదంబైన ప్రహ్రకంబునం దునిడియె నదియు జలాశయంబునకునధికంబై పె
లుగ నిమ్ము లేదని చెప్పికొనిన నప్పుణ్యుండొప్పెడినడు వడిఁ దప్పని వాఁడై నకతంబున నమ్మహామీనంబును మహార్ణవంబున వి
డిచెనదియును మకరాకరంబునం బడి పెనుమొసళ్లు మునురికొనిక సిమసంగిత్రిం గెడి నింత కాలంబు నడపిక డపట విగవి డువ
క వెడలం దిగుచు మనియె తింగింపనన్నిటిఁ ద్రోడసుం బుడమి ఱేఁడు దెలిసి యిట్లనియె॥ సీ॥ ఒక దినంబున శతయోజనమాత్ర
ము విస్తరించెన నీ పువిన ముచూచ। మిటువంటిశిరషువముల నెన్నఁడు నెఱుఁగము నిగాన జాతులకిట్టి మేను గలదె। యేమిటికై
వ్వఁడ వేఁలఁ ద్రబ్బించెము కరుణ నాపన్నులఁ గావ వేఁడి। యంభశ్చరంబైన హరివి నే నెఱింగితి నవ్యయ నారాయణాభిధాన।
జననసంస్థితిసంహారచతురచిత్త। దీనులను భక్తులకుమాను దిక్కు నీవ। నీమహీ నావతారంబు నిఖిలభూత। భూతిహేతువు
ప్రోక్తదంబు సువచర్య॥ క॥ ఇతరులమునగాము దిత్సం। గతులమమాపాల నీవు గలిగితి భక్తస్థితుఁడవగు నిన్నునెప్పుడు। నుతి
చేసిన వారికేల నాశము గలుగున్॥ క॥ శ్రీలలనాకుచపీఠీ। కేళీపరతంత్రబుద్ధి క్రీడించు సుఖా। లోలుఁడవు దావసాక్ష్యతి। నే
లా మత్స్యంబవైతి వెఱిఁగింపు హరీ॥ వ॥ అని పలుకు సత్యవ్రతుం డను మహారాజునకు నయ్యుగంబు కడపటఁ బ్రళయవేళస
ముద్రంబున నేకాంతజనప్రియుండై విహరింపనిచ్చయించు మీనరూపుండైన హరియిట్లనియె॥ సీ॥ ఇటమీఁద నేఁడ రాత్రి కేవ
వదినమునఁ బద్మగర్భునకొక్క పగలు నిండు। భూర్భువాదిక జగంబులు మూఁడు విలయాబ్ధిలోన మునుఁగు నాలోనఁ బెద్ద।
నావ చేరఁగవచ్చు నా పంపుఁ బెంపున దానిపై నౌషధతతులు బీజ। రాసులునిడి పయోరాశిలో విహరింపఁ గలవు సప్తర్షులుఁ
గలిసి తిమిరంగ। మ్రోఁగాన రాకముంచు పెంజీఁకటి। మునుఁగుచుండు మునుల మేను వెలుఁగు। దోలుచుండు జలధి ద్రోవఁ
ధూయమానమై। నావ తేలుచుండు నరవరేణ్య॥ వ॥ మఱియు న న్నావ మున్నీటి కెరట్ల ఘట్లోను గాకుండ నిరుగెలంకుల వెనుక
ముందఱ నేను ఱాకుండఁ బెన్నెఱులుగు నాగఱులం జడియుచుఁ బొడువ వచ్చిన బలుగ్రాహంబుల నోడియుచు సంచరించెద
నొక్క పెను పాము చేరువనాయమ సంలింబొడ చూపెడు దానం జేసి సుడిగాఁడ్పుల కతంబున నావ వడిఁ దిరుగకుండ నాకొ
మ్ముకు దిఁబదిలంబుగఁ జేసి నీకును మునులకును వలజడి చెందకుండ మున్నీట నిప్పాటం దమ్మిచూలి రేయి వేగునంతకు మెలంగెదన
దికారణంబుగా జలచరరూపంబుఁ గైకొంటి మఱియునంబ్ర యోజనంబుగలను నా మహిమాపర బ్రహ్మంబని తెలియుము ని
న్నను గ్రహింతువని సత్యవ్రతుం డుసూడ హరి తిరోహితుండయ్యె నయ్యవసరంబున॥ గీ॥ మత్స్యరూపియైన మాధవుని సు
గుణుఁ దలఁచికొనుచు రాచతపసి యొక్క। దర్భశయ్యఁ దూర్పుతలకడగాఁ బడి। కాదియుండె నాఁటి కాలమునను॥ అంతక
ల్పాంతంబు డాసిన॥ క॥ ఉల్లసితమేఘపఙ్క్తులు। జల్లించినచో నుగ్రవృష్టి జడిఁ గొనికురియ। న్వెల్లిపిరిసి జలరాసులు సెల్లె
లికట్టలను దాఁటి సీమల ముంచెన్॥ తదనంతరంబ॥ గీ॥ మున్ను నోయినకల్పాంతమున నశేంద్ర। బ్రాహ్మమనఁగ నైమిత్తిక ప్ర
ళయవేళ నింగిపై నిట్టి తొలఁకు మున్నీటిలోనఁ గూలె భూతాళి జగములకొలఁది చెడవి॥ అంత నమ్మహాగాత్రియం ముహూ॥ నె
టి నెల్లప్పుడు సల్పి ప్రాణచయము సీమ్మిలింపనిమ్మించి పి। పెటియన్నీల్గుచు నావులించుచు నజుండీస్ప్రష్టియ మున్నాని వే। నొఁ
రిగె తెప్పలుమూసి కేల్దలగడైయుండఁగ నిద్రించుచున్॥ గుఱు వెట్టం దొడఁగెన్గబల్లను మంకోషించుచున్న్వాసరా॥ గీ॥ అ

---

* జలపోతంబు-గండకము।చేఁపపిల్ల. § వేఁటకాఱు।వేఁటకాండ్రు. ¶ ఉదంచనము।కుండ-కాఁగు, హ్రదము।లోఁతుగలమడుగు. మ
హార్ణవము।సముద్రము మకరాకరసముద్రము. ‖ శిరషము-అంభశ్చరము।మత్స్యము. ‡‡ నోధూయమానమై।మిగుల గదలింపఁబడుచున్న
దై. ‡ నెఱులుగు।వెంట్రుకలుగల, గఱులు।ఱెక్కలచేత, అలజడి।దుఃఖము, మున్నీటికా।సముద్రమునందు, ఇప్పాట।ఈరీతిని.

లసిసొలసినిదురనందినపర మేష్ఠి!ముఖమునందు వెడలె మొదటిశ్రుతులు!నపహరించెనొకహయగ్రీవుఁడను దైత్యభటుఁ
డుదొంగఁదొడ్డఁబరులవశమె॥ క॥ చదువులుదనచేఁబడెనని!చదువుచుఁబెన్బయలనుండశంకించివిడన్!జనవులముదుక
డుగూరుకఁ!జదువులతస్కరుఁడుసొచ్చెజలనిధికడుపున్॥ వ॥ ఇట్లు వేదంబులుదొంగిలిదొంగరక్కసుండు మున్నీటమునిం
గినవానిజయింపవలసియు మ్రానుదీఁగెలయందు విత్తనంబుల పెన్నీటనాని చెడకుండనునుపవలసియు నెల్లకార్యంబులకుఁ
గావలియగునాపురుషోత్తముండొప్పెను* రేయిబోరువలయందు॥ క॥ కఱుఁగఱులువలుదవీసలు!చిఱుదోఁకయుఁబసిఁడి
యొడలుసిరిగలపొడలు!న్నెఱిమొగము నొక్కకొమ్మును!మిఱుచూపులుగలిగివిభుఁడుమీనంబయ్యెన్॥ వ॥ ఇట్లులక్షయో
జనాయతంబై విశ్వంభరుండుజలధిఁజొచ్చి॥ సీ॥ ఒకమాటుజలజంతుశీయాధంబుతోఁగూడనొకపటిదరులకునుఱికివచ్చు!
నొకమాఱెమింటికినుదిరియుల్లంఘించు నొకపారిలోపలనొదిగియుండు!నొకసారివారాశినొడలుముంపమిసూపునొకతే
పబ్రహ్మాండమెఱయఁదలఁచు!నొకతూరిఝషకోటినొడిసియాహరించునొకతూఱుజలములనుమిసివైచు! గఱులుసా
రించుమీసలుగడలుకొలుపు!బొడలుమెఱపించుఁగన్నులపొలుపుమార్చు!నొడలుఝళిపించుఁదళతళనొలయుమీన! వేషి
పెన్నీట‡నిగమగవేషియగుచు॥ వ॥ అంతకుమున్నసత్యవ్రతుండుమహార్ణవంబులుమహీవలయంబుముంచునవసరంబు
నభక్తపరాధీనుండగుహరిందలంచుచునుండ నారాయణప్రేరితమై యొక్కనావవచ్చినంగనుంగొని॥ మ॥ చనిసత్యవ్ర
తమేదినీదయితుఁడోజంబూని మ్రాన్దీఁగెవి!త్తనములెక్కుడునావపైనిడి హరిధ్యానంబుతోఁదానిపై! మునిసంఘంబులు
దానునెక్కి వెఱతోమున్నీటిపైఁదేలుచుఁ!గనియెన్ముందట §భక్తలోకహృదలంకర్మీణముమీనమున్॥ వ॥ కనిజలచరేంద్రు
నికొమ్మునవొక్కపెనుపాముత్రాటననావఁగట్టిసంతసించి దండంబునివిరికొనితపస్వులతోడఁగూడికొనియాఁగాచపె
ద్దమీనాకారుండగువేల్పుఁ దెలిసినిట్లనిపొగడెనప్పుడు॥ మ॥ తమలోఁబుట్టునవిద్యగప్పికొనఁగన్నమ్మాలసంసారవి! భ్రములై
కొందఱుదేలుచున్ గలఁచుచున్ బల్వెంటలందైనయోగమునందేపరమేశుఁగొల్చిఘనులైకైవల్యసంప్రాప్తులై! ప్రమ
దంబందెదరట్టినీవుగరుణన్ బాలింపుమమ్మీశ్వరా॥ ఉ॥ కన్నులులేనివాఁడుమఱికానని వానికిఁద్రోవఁజూపఁగాఁ!జన్నతె
ఱంగు మూఢునకసన్మతిఁదాగురుఁడౌటసూర్యుఁడే!కన్నులుగాఁగభూతములఁగాంచుచునుండురమేశ మాకును! త్వన్మ
యమూర్తివై గురువవై యలసద్గతిజాడఁజూపవే॥ క॥ ¤ఇంగలముతోటిసంగతి!బంగారమువన్నెగలుగుభంగిని నీసే! వాం
గీకృతులయఘంబులు!భంగంబులఁబొందుముక్తి ప్రాపించుహరీ॥ క॥ హృదయేశ నీప్రసన్నత!పది వేలవపాలిలేశభాగము
కతనం!త్రిదశేంద్రత్వముగలదఁట!తుదినిను మెప్పింపనేదిదొరకదు శ్రీశా॥ క॥ పెఱవాఁడుగురుఁడటంచును! గొఱగానిప
దంబుసూపఁగుజనుండునునీ!నెఱత్రోవనడువనేర్చిన!నఱమఱలేనట్టిపదమునందుదయాబ్ధీ॥ మ॥ చెలివై చుట్టమవై మనస్థి
తుఁడవై చిన్మూర్తివై యాత్మవై!వలనై కోర్కెలపంటవై విభుఁడవై వర్తిల్లు నిన్నొల్లకీ! పలువెంటంబడిలోకులక్కటవృ
థాబద్ధాశులైపోయెడి! న్నిలువన్నేర్చునెహేమరాశిఁగనియున్నిర్భాగ్యుఁడంభశ్శయా॥ గీ॥ నీరరాశిలోననిజకర్మబద్ధ
మై!యుదితనిద్రఁబొందియున్నలోక! మేమహాత్ము చేత నెప్పటిమేల్కాంచు!నట్టినీవుగురుఁడవధిపమాకు॥ క॥ ఆలింపుము
విన్నపమిదె! వేలుపుగమిఱేని నిన్నువేఁడికొనియెద!నాలోనిచిక్కుమానిచి!నీలోనికిఁగొంచుపొమ్మునిఖిలాధీశా॥ వ॥ అ
ని యిట్లుసత్యవ్రతుండుపలికిన సంతసించి మత్స్యరూపంబునమహాసముద్రంబున విహరించు- హరిపురాణపురుషుండగు
టంజేసిసాంఖ్యయోగక్రియాసహితయగుపురాణసంహితనుపదేశించెనమ్మహారాజుమునిసమేతుండై భగవన్నిగదితం
బైనసనాతనంబగు బ్రహ్మస్వరూపంబుదెలిసికొనికృతార్థుండయ్యెనిమ్మహాకల్పంబున వివస్వతుండనంబరగినసూర్యునకు
శ్రాద్ధదేవుఁడనజన్మించి శ్రీహరికృపావశంబున నేఁడవమనువయ్యెనంతనవ్విధంబునం బెనురేయినిండునంతకుసంచరించి
జలచరాకారుండగునారాయణుండు¶ దన్నిశాంతసమయంబునందు॥ మ॥ ఉఱుఁడంభోనిధిరోసి వేదములనొయ్యన్
దైత్యముంజూచివే! గఱులాడించిముఖంబుసాఁచి బలువీఁకందోఁకసారించిమే! న్మెఱయన్ దౌడలుగీఁటి మీసలదరన్
మీనాకృతిన్విష్ణుఁడ†క్కఱటిందాఁకివధించెముష్టిదళితగ్రావున్ హయగ్రీవునిన్॥ అంతప్రళయావసానసమయంబు
న॥ సీ॥ ఎప్పుడు వేఁగునం చెసలుసూచుచునుండుమునులడెందంబులుముదమునొందఁ!దెలివితోఁబ్రక్కనిద్రించుభారతి
లేచిమోరపయ్యెదఁజక్కనొత్తికొనఁగ! మలినమైపెనురేయిమ్రక్కినతేజంబుతొంటిచందంబునఁదొంగలింపఁ! బ్రా

* రేయిబోరువలయందున్|రాత్రికాలములయందు. శీయాధము|గుంపు. ‡నిగమగవేషి|వేదములవెదుకుచున్నవాఁడు. §భక్తలోకహృదలంకర్మీణమున్|భక్తజనహృదయములనలంకరించునట్టిస్వభావముగల. ¤ఇంగలము|అగ్ని. ¶తన్నిశాంత|ఆరాత్రికడపటియొక్క. †అక్కఱటిన్|దుష్టుడైనహయగ్రీవుఁడనురాక్షసుని. ముష్టిదళితగ్రావున్|పిడికిటిపోటులచేతబద్దలుగాఁజేయఁబడినపర్వతములుగల.

ణులసంచితభాగధేయంబులుగన్నులకొలఁకులఁగానఁబడఁగ। నవయవంబులుగదలించియావులించి। నిదురఁదెప్పిటిమే ల్కాంచినీర్గి హుటిగి। యొడలువిలుచుచుఁగనుఁగవనుదురుకొనుచు। ధాతగూర్చుండెసృష్టిసంధాతయగుచు ॥ అయ్యవసరంబున॥ గీ॥*వాసవారిఁజంపివానిచేఁబడియున్న। వేదకోటిచిక్కవిచ్చి తెచ్చి।నిదురమానియున్ననీరజాసనునకు।నిచ్చెఁగరుణతోడనీశ్వరుండు॥క॥జలరుహనాభునికొఱకై।జలతర్పణమాచరించిసత్యవ్రతుఁడా।జలధిఁబ్రతికిమనువయ్యెను।జలజాక్షునిఁగొలువకెంతసంపదగలదే॥గీ॥జనవిభుండుతపసిసత్యవ్రతుండును।మత్స్యరూపియైనమాధవుండు। సంచరించినట్టి శ్రీసదమలాఖ్యానంబు।వినినవాఁడుబంధవిరహితుండు॥క॥హరిజలచరావతారముఁ।బరువడిఁబ్రతిదినముచదువఁబరమపదంబు। న్నరుదంను వారికోర్కులు। ధరణీశ్వరసిద్ధిఁబొందుదక్ష్యముసుమ్మీ॥వ॥ప్రళయాంభోనిధిలోన మేన్మఱచినిద్రంజెందువాణీశుమో।ముల వేదంబులుగొన్న దైత్యునిమృతింబొందించిసత్యవ్రతుం। డలరం బ్రహ్మముమాటఁదానిలిపెనర్వాధారుఁడైమీనమై।జలధింగ్రుంకుచుఁదేలుచున్నెలఁగురాజన్మాత్రికిఁ గ్రమ్మొక్కెదన్॥ అనిచెప్పి॥ ... ... ...

క॥ రాజేంద్ర దైత్యదానవ। రాజమహాగహనదహనరాజస్తుత్యా। రాజావతంసమానిత। రాజధరార్చనగుణాఢ్యరాఘవరామా॥

మాలిని ॥ దివిజరిపువిదారీదేవలోకోపకారీ । భువనభరనివారీపుణ్యరక్షానుసారీ।
ప్రవిమలశుభమూర్తీబంధుపోషప్రవర్తీ।ధవళబహుళకీర్తీధర్మనిత్యానువర్తీ॥

గద్య. ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్యపోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతపురాణంబనుమహాప్రబంధంబునందు స్వాయంభువస్వారోచిషోత్తమతామసమనువులచరిత్రంబును, కరిమకరియుద్ధంబును, గజేంద్రరక్షణంబును, రైవతచాక్షుషమనువులవర్తనంబును,సముద్రమథనంబును,కూర్మావతారంబును,గరళభక్షణంబు,నమృతాదిసంభవంబును,దేవాసురకలహంబును,హరికపటకామినీరూపంబుననసురులవంచించిదేవతలకమృతంబువోయుటయు,రాక్షసవధంబును,హరిహరసల్లాపంబును, హరికపటకామినీరూపవిభ్రమణంబును, వైవస్వత సూర్యసావర్ణిదక్షసావర్ణి బ్రహ్మసావర్ణి భద్రసావర్ణి దేవసావర్ణి యింద్రసావర్ణి మనువులవృత్తాంతంబును, బలియుద్ధయాత్రయును, స్వర్గవర్ణనంబును, దేవపలాయనంబును,వామనావతారంబును, శుక్రబలిసంవాదంబును,త్రివిక్రమవిస్ఫురణంబును, రాక్షససుతలగమనంబును,సత్యవ్రతోపాఖ్యానంబును,మీనావతారంబుననుకథలుగలయష్టమస్కంధము.    శ్రీకృష్ణార్పణమస్తు.

---

## శ్రీమదాంధ్రభాగవతము—నవమస్కంధప్రారంభము.



శ్రీరాజితమునిపూజిత।వారధిగర్వాతిరేకవారణబాణా।సూరిత్రాణమహోజ్జ్వల।సారయశస్సాంద్రరామచంద్రనరేంద్రా॥

వ॥ మహనీయగుణగరిష్ఠులగునమ్మునిశ్రేష్ఠులకునిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైనసూతుండిట్లనియెనట్లుప్రాయోపవిష్టుండైనపరీక్షిన్నరేంద్రుండుశుకయోగీంద్రుంగనుంగొని॥సీ॥మనువులనువర్గ్లమర్యాదలనువింటిమన్వంతరంబులమాధవుండు।దిరిగినజాడలువెలిసెసత్యవ్రతుఁడనురాజు ద్రవిళదేశాధిపుండు।పోయినకల్పాంతమునవిష్ణుసేవించివిజ్ఞానమునఁబొందివెలుఁగుచుండెని।కతఁడువైవస్వతుండైపుట్టిమనువయ్యెనతనికినిక్ష్వాకుఁడాదిగాఁగఁ।బదురుకొడుకులుగలరందుఁబరగవారి। వంశమేరీతివర్తించెవారిలోనఁ।జనినవారినిఁజనువారిఁజనెడువారిఁ। జెప్పవేవ్యాసనందనచిత్తగించి॥క॥చెవులారనేఁడువినియెద।రవివంశమునందుఁగలుగురాజులకీర్తుల్।వివరింపువరుసతోడను।భువిపుణ్యులచరితవినినఁబుణ్యముగాదే॥వ॥అనినంబరాశరమునిమనుమండిట్లనియె.గీ॥వినుముమనువుకులమువేయినూరేండ్లును।బరగవిస్తరించిపలుకరాదు।నాకుఁదోఁచినంతనరనాథవేగంబ।యెఱుఁగఁబడఁగఁబ్రీతినేర్పరింతు॥క॥ఎక్కువతక్కువపాడవుల। నెక్కడమొదలైనపురుషుఁడింతయుఁజెడఁడా। నొక్కఁడుగల్పాంతంబున।నక్కజమైనిల్చెవిశ్వమతఁడైయుంటన్॥సీ॥ భూమీశయమ్మహాపురుషునినాభిమధ్యమునబంగారుకెందమ్మి మొలిచె।నాతమ్మిపూవులోనటమీఁదఁదనయంతనాలుగుమోములనలువపుట్టె।నాబ్రహ్మమనముననటమరీచిజనించెఁగశ్యపుండతనికిఁగలిగెనంత।నాకశ్యపునికిదక్షాత్మజయదితికిఁగొమరుఁడైశ్రీచీఁకటిగొంగవొడమె।జలజబంధునిపెండ్లామసంజ్ఞయందు।శ్రాద్ధదేవుండుమనువుసంజాతుఁడయ్యె।మనువునకుశ్రద్ధయనియెడిమగువయందుఁ।బదురుకొడుకులుగలిగిరిభద్రయశులు॥ వ॥ వారలిక్ష్వాకుండును,నృగుండును,శర్యాతియు,దిష్టుండును,ధృష్టుండును,కరూశకుండును,నరిష్యంతుండును,పృషధ్రుండును,నభగుండును, కవియుననఁబెగడిరటమున్నమనువుకొడుకులులేనివాఁడైమిత్రావరుణులనుద్దేశించి॥సీ॥మనువుబిడ్డలుపుట్టమఖమాచరించుచోనతనిభార్యయుచాలా

---

*వాసవారిఁ।రాక్షసుని. శ్రీసదమలాఖ్యానము।నిర్మలమయినకథ. శ్రీచీఁకటిగొంగ।సూర్యుఁడు. శ్రాద్ధదేవుఁడు।యముఁడు.

డపిడియించి చుట్టు నేమఱకనుఁడె। నడవి మెకములు సోఁకకుండ నరసికొనుచు॥ అంత॥ క॥ *ప్రబ్బికొనిన పెంజీకటి। నిబ్బరమైన నడికినడికి నింగికి వడితోఁ। గొబ్బున నెగసి తటాలునఁ। బెబ్బులి సందావుఁ బట్టెఁ బెల్లుబిచియ బవరా॥ క॥ ఉల్లములు గలఁగి †మొదవుల। వెల్లువలన్నియును లేదివిచ్చలవిడితోఁ। జెల్లాచెదరై పాతెను। బెల్లుగ నంభాయటంచుఁ బెబ్బులి గాలిన్॥ అయ్యవసరంబున॥ శా॥ ఆ పెంజీఁకటి మ్రోలఁగానక డిపంబుఁ గ్రింది శార్దూలమం। చావుల్లావు శిరంబుఁ ద్రుంచి తెగఁద్రోయంచుం బులి న్వేండియు। న్వావోవం దెగ వ్రేసె భూవరుఁడు ద్రోవక్షద్ధరక్తంబు చేఁ। బైఁబై గీయుచుఁ జేరి చూచెఁ దలద్రెవ్వం బడ్డయద్ధేనువున్॥ వ॥ చూచి మరిఖిన్నుండై యున్న నృపద్రుణిఁ గని కులగురుండగు వసిష్ఠుండు గోపించి నీవు రాజత్వంబు వాసి యీయపరాధంబున శూద్రుండవు గమ్మని శపియించె నతండును గృతాంజలియై తనకులాచార్యునివలన నలంగై కొలువడసి యతని యనుమతంబున॥ సీ॥ అఖిలాత్ముఁడగుచున్న హరియందు మహనీయుండు భక్తితోఁ జాలఁ దత్పరత మెఱసి। యూర్ధ్వరేతస్కుఁడై యున్న ప్రాణులకెల్ల నార్యుఁడై సర్వేంద్రియములు గెల్చి। సంగంబునకుఁ బాసి శాంతుండు నపరిగ్రహుండు నై కోరకనుండుఁ దనకు। వచ్చినయది యజీవనముఁ గావించుచుఁ దనుఁ దాన నిలుపుచు ధన్యబుద్ధి। జడుని తెఱఁగున మందుని చందమునను। జెవిటిభంగి నిమహినెల్లఁ జెల్లఁ దిరిగి। యడవులకు నేగి కార్చిచ్చులందుఁ జొచ్చి। దిక్కునియతుఁడై బ్రహ్మంబుఁ జెందె నతఁడు॥ క॥ కవియనుకడపటికొమరుఁడు। భవనము రాజ్యంబు విడిచి బంధులతోనే। గి వనమునఁ బరమపురుషునిఁ। బవిమలమతిఁ దలఁచి తలఁచి పరమముం బొందెన్॥ వ॥ మఱియుఁ గరూశకుండను మానవుని వలనం గొందఱు కారూశులు గలిగి ధర్మంబుతోడి ప్రియంబున బ్రహ్మణ్యులై యుత్తరాపథంబునకు రక్షకులైరి- ధృష్టునివలన ధార్ష్టకంబను వంశంబు గలిగి భూతలంబున బ్రహ్మభావంబు నొంది నెగడె- నృగుమూలంబున సుమతి గలిగె- నతనికి భూతజ్యోతి పుట్టె- నతనికి వసువు జనియించె- వసువునకుం బ్రతీకుండు గలిగెఁ- బ్రతీకునికి నోఘవతుండతని కూఁతురోఘవతి యను కన్యకను సుదర్శనుండు వివాహంబయ్యె నరిష్యంతుండను మనుపుత్రునికిఁ జిత్రసేనుండా ఘనునకు దక్షుండా పుణ్యునకు మీఢ్వాంసుండా సుజనునికి శర్వుండమ్మహాత్మునికి నింద్రసేనుండా శాజునకు వీతిహోత్రుండా సుమతికి సత్యశ్రవుండా ఘనునికి నురుశ్రవుండా వీరునకు దేవదత్తుండా పండితునకు నగ్నివేశుండు సుతుండయి జనియించి ‡కానీనుండన నెగడి జాతకర్ణుండను మహర్షియై వెలసె నతనివలన నాగ్నివేశ్యాయనంబను బ్రహ్మకులంబుఁ గలిగె నివ్విధంబున॥ క॥ తెలుపఁబడె నరిష్యంతుని। కులమెల్లను నీకు దిష్టకులము నై దెలియ। నై దెలిపెద గాజేంద్రోత్తమ। తెలియుము సర్వంబు నీవుఁ దేటపడంగన్॥ వ॥ దిష్టునికొడుకు నాభాగుండను వాఁడు కర్మవశంబున వైశ్యత్వంబు నొందె- నాభాగునికి హలంధనుండు గలిగె- నతనికి వత్సప్రీతి- వత్సప్రీతికిఁ బ్రాంశువు- నతనికిఁ బ్రమితి- ప్రమితికి ఖమిత్రుఁడు- ఖమిత్రునికిఁ జాక్షుషుండు- నతనికి వింశతి- వింశతికి దంభుండు- దంభునికి ఖనినేత్రుండు- నతనికిఁ గరంధనుండు- గరంధనునకవిక్షిత్తు- నాయవిక్షిత్తునకు మరుత్తుం డుజనించి చక్రవర్తి యయ్యె నతని చరిత్రంబు వినుము॥ సీ॥ అంగిరస్సుతుఁడు మహాయోగి సంవర్తుఁడతని యాగమునకు యాజకుండు। తరిగియుండెడి మరుదాఖ్యగణంబులో వారు విశ్వేదేవులు చటిసభ్యు। లధికలక్షణుల బ్రాహ్మణకోటిఁ దనిపెను సోమపానంబున సురవరుండు। సుంత్రియై బంగారుమయము గావించె సు యాగవస్తువు లెల్ల నధికసియతి। నామరుత్తుఁడు సేసిన యట్టిభంగి। నీరభావంబున మఱంగఁ దెంపు గలిగి। మఖము సేసిన వారిని మఱియు నెఱుఁగ। మెల్లలోకములందు నరేంద్రముఖ్య॥ వ॥ ఆమరుత్తునకు దముండును, దమునకు రాజవివర్ధనుండును, రాజవివర్ధనునకు సుధృతి, సుధృతికి సౌధృతేయుండును, సౌధృతేయునకుఁ గేవలుండును, గేవలునకు బంధుమంతుఁ, డతనికి వేగవంతుండును, వేగవంతునికి బన్ధుండు సంభవించె॥ క॥ అచ్చరకన్య యలంబుస। గ్రచ్చర నాబంధుఁ జూచి కామించి తుది। న్వచ్ఛవిలు కానియమ్ముల। ముచ్చిచ్చున వచ్చి పొందె మోహాతురయై॥ వ॥ ఆదంపతులకుఁ దృణబిందుండను మహారాజు సంభవించె- నిలబిల యనుకూఁతురు జన్మించె నాకొమ్మను విశ్రవసుండు పొందిన నైలబిలుండను కుబేరుండు పుట్టె- నా తృణబిందునకు విశాలుండును శూన్యబంధుండును ధూమ్రకేతుండునను వారు ముగ్గురు కొడుకులు గలిగిరి- యందు విశాలుండు వంశవర్ధనుండై వైశాలి యను నగరంబు నిర్మించె- నారాజునకు హేమచంద్రుం- డా నరేంద్రునకు ధూమ్రాక్షుం- డా పుడమి ఱేనికి సుతలుఁ- డా మనుజపాలునకు సహదేవుం- డా బలిష్ఠునకుఁ గృశాశ్వుం- డాతనికి సోమదత్తుండు జనించె నంత॥ గీ॥ అమరవిభుఁడు మెచ్చ నశ్వమేధముఁ జేసి। భూరిపుణ్యగతికిఁ బోయె నేలమి। సోమదత్తుకొడుకు సుమతికి జనమేజ। యుండనంగఁ గొమరుఁడుప్పతిల్లె॥ వ॥ వీరలు వైశాలులనం బరగి తృణబిందునికీర్తి వహించి రాజ్యంబు సేసిరి మఱియును॥ సీ॥ శర్యాతియను రాజు జనియించె బ్రహ్మవరుండై నమనువుకుఁ బ్రీతితోడ నతఁడంగిరసు సత్రమందు రెండవనాటి విహితకర్మములెల్ల వెలయఁ జెప్పె। నతని కూఁతురు సుకన్యక యను వనజాక్షి తండ్రి

---

* ప్రబ్బికొనిన। దట్టముగ నావరించిన. నడికినడికి। పొంచిపొంచి. † మొదవుల వెల్లువలు। ఆవుల గుంపులు. ‡ కానీనుండు। కన్యకకు జనించినవాఁడు,

త్రోడుతఁ దపోవనికి నరిగి। చ్యవనాశ్రమముఁ జేరి సఖులును దానును ఫలపుష్పములు గోయఁ బాఱి తిరిగి। యొక్కపుట్టలోన నొప్పారుజ్యోతులు। రెంటిఁ గాంచి వాటి ముంటఁ బొడిచెఁ। గన్యముగుదముజ్జ్వలదిఖద్యోతయుగమంచు। దైవవశముకతనఁ ?లమకియగుచు॥క॥జ్యోతులు ముంటం బొడిచిన। వాతల నెత్తురులు సురిసె వసుధీశుభట। వ్రాతముల కెల్ల నచ్పట। నాతటిమల మూత్రబంధమయ్యె నరేంద్రా॥వ॥ వారలం జూచి రాజర్షి యగు శర్యాతి విస్మితుండై మీరలియ్యాశ్రమము నూషణంబు సేయ నోపుమరది కారణంబుగా మీకు విరోధంబు సిద్ధించెనని పలుకు నవసరంబునఁ దండ్రికి సుకన్యక యిట్లనియె॥గీ॥అయ్యయో పుట్టచేరువ నాడియాడి। యిందుఁ బోరెండుజ్యోతుల నేను గాంచి। §కంటకంబునఁ బొడువ రక్తంబు సురిసె। నేవిధంబునఁ గరిసెనో యెఱుఁగుమీవు॥వ॥అనిన విని శర్యాతి భీతుండై కూఁతుం దోడ్కొని వల్మీకంబు కడకుం జని యందులోఁ దపంబు సేయుచున్న చ్యవనునిం గని తన నేర్పున నతని వలనఁ బ్రసన్నత వడసి తపసి చిత్తంబు నెఱింగి తనపుత్రిక నిచ్చి యొట్టకేలకుం బ్రతికినవాఁడై మునీశ్వరుని వీడ్కొని పురంబునకుం జనియె నంత॥గీ॥పరమకోపుఁ డయిన భార్గవుఁ బతిఁ జేరి। మిగులఁ బనులయెడల మెచ్చఁ దిటెఁగి। యతని పర్ణశాల నా సుకన్యక యను। మనువ గొన్నియేండ్లు మనువు మనియె॥వ॥ అంత నొక్కనాఁ డయ్యాశ్రమంబునకు వేల్పువెజ్జులయిన యశ్వినులిద్దఱు వచ్చిన వారలం బూజించి తనముదిమి సూపి చ్యవనుం డిట్లనియె మీకు మున్ను యాగభాగంబు లేని సోమపానంబు నేను గల్పించి యిచ్చెద సోమపానసమయంబునఁ బానపాత్ర మీకు నందిచ్చెద నాముదిమి మాన్పుఁడని యిట్లనియె॥క॥నవకంబగు ప్రాయంబును। జవరాండ్రగరంచు మేని చక్కదనంబు। న్నివతరముగఁ గృప సేయుఁడు। దివిజాధిపవైద్యులార దీవింతు మిమ్ముఁ॥అనిన నశ్వినీ దేవతలు సంతోషించి సిద్ధనిర్మితంబయిన యీమడుఁగున మునుఁగుమని పలికి॥సీ॥ముసలితాపసిఁ బట్టి మునిఁగి నెత్తికొనిపోయి ముగురు నామడుఁగున మునిగి లేచి। వనితాజనుల నెల్ల వలపించు వారలై సుందరమూర్తులై సుభగులగుచుఁ। గమలమాలికలతోఁ గనకకుండలులు గాఁ బుష్పసాయకు తోడఁ బోలి తుల్యు। లై సూర్యతేజస్కులై యున్నవారల మువ్వురఁ బొడగాంచి ముగుద చాల। నంచఁ బెనిమిటి వీఁడని యెఱుఁగలేక। గరిత గావున నిజనాథుఁ గానఁగోరి। సుభగవతులార నానాథుఁ జూపుమనుచు। నశ్వినీ దేవతలకు నయ్యబల మ్రొక్కె॥వ॥ వారలా పతివ్రత నిజగరితనంబునకు మెచ్చి వయోరూపసంపన్నుండైన చ్యవనుం జూపి దంపతుల వీడ్కొని విమానారూఢులై వేలుపుల ప్రోలికిం జని రంత॥సీ॥యాగంబు సేయంగ నర్థించి శర్యాతి చ్యవనమునీంద్రు నాశ్రమముకడకుఁ। గూఁతురు నల్లునిఁ గొనిపోవు వేడుక వచ్చి పుత్రి కెకుఁ బార్శ్వంబున నుమ। సూర్యతేజంబునఁ బొంపారువరుఁ గని వీఁ డెవ్వఁడో దీనివిభుఁడు గాఁడు। చెల్ల రే యని పుత్రి సేసిన ప్రియములు మ్రొక్కులు నొల్లక మోము వాంచి। మాఱుమాటాడ దీవింప మనసు రోసి। చ్యవనుఁ డతిఁకుండు మునిజనసత్తముండు। భువనసన్నుతుఁ డతఁ డెందుఁ బోయె నాతఁ। డెట్లు వంచింపఁబడియె వీఁ డెవ్వఁ డబల॥మ॥ తగవే ధర్మమె శీలమే కులజవై దర్పించి నోదింపనా। జగదారాధ్యునిఁ బుణ్యశీలుఁ దపసిన్ సాధ్వీమనస్సమ్మతు। న్మగనిన్ మాని *భుజంగుఁ బొందఁ దగునే మానంబు వాటింపఁగాఁ। దగదే దుర్గతిఁ ద్రోచితే కటికవై తండ్రిం బతిం గూఁతురా॥గీ॥పద్మనయనముగఁ బ్రాయంపువాఁడమునఁ। గావుఁబెట్టికొంతెఁ గావనేర్చెఁ। గపటిముసలి తపసి గావంగ నేర్చునే। యువతి ముసలిఁ గూర్పు టొప్ప దెందు॥వ॥అనిపలికిన నప్పరమపతివ్రతాలలామంబు చిఱునగవు చెక్కుటద్దంబుల సిడిముడిపడం దండ్రికిట్లనియె॥క॥ నీయల్లుఁ డితఁడు భార్గవుఁ। డయ్యా జారుండు గాఁడు హర్షముతోడ। న్నెయ్యంబు నిల్పుమంచును। దొయ్యలి సర్వంబుఁ దండ్రితో వినుపించెన్॥ వ॥ అంత శర్యాతియు నప్రమత్తుండై కూఁతురిం గౌఁగిలించికొని గారవంబున నైదువు గమ్మని దీవించె నంత భార్యాసహితుండై చ్యవనుండు సనితనమామకు యాగంబు సేయించి యొక్కపాత్రంబున సోమభాగంబుఁ బట్టి నిజతపోబలంబున నశ్వినీ దేవతలకిచ్చినం జూచి॥క॥కోపముతోడుత వాసవుఁ। డేపున మునివైవ వజ్రమెత్తిన మఱలన్। దాపసుఁడు వజ్రి భుజమున। నాపవి నిలిపెఁ జగంబు లాశ్చర్యపడన్॥వ॥ఇవ్విధంబున నశ్వినీ దేవత లిద్దఱు సోమపానంబు లేనివారయ్యుఁ జ్యవను సామర్థ్యంబునఁ బ్రాప్తభాగులై చనిరి శర్యాతికి నుత్తానబర్హియు నానర్తుండును భూరిసేనుండును నను మువ్వురు కొడుకులు గలిగి రందు॥సీ॥ఆనర్తునకు రైవతాహ్వయుం డుదయించె నతఁడు కుశస్థలి యను పురంబు। నీరధిలోపల నిర్మించె బెంపుతో నానర్తముఖ‡విషయంబు లేలెఁ। గనియెఁ గకుద్మిముఖ్యంబయిన నందనశతముఁ గకుద్మి విశాలయశుఁడు। దనకూఁతు రేవతి ధాతముందటఁ బెట్టి తనువరు సడిగెడి తలఁపుతోడఁ। గన్యఁ దోడ్కొని బ్రహ్మలోకమున కేగి। యచట గంధర్వకిన్నరుల జుని మ్రోల। నాటపాటలు సలుపఁగ నవసరంబు। గాక నిలుచుండె నతఁ డొక్క క్షణము దడవు॥అంత నవసరంబయిన నజునికి నమస్కరించి కకుద్మి యిట్లనియె॥గీ॥చాల ముద్దరాలు జవరాలుఁ గోమరాలు। నీశుభాత్మురాలి కెవ్వఁ డొక్కొ। మగఁడు సెప్పుమనిన ముదిఁ జూచి పకపక। నవ్వె

?లమకియగుచు।భ్రమగలదయి. §కంటకము।ముల్లు. *భుజంగుఁడు।జారపురుషుని. ‡విషయంబులు।దేశములను.

భూమిపతికినలువపలికె॥ సీ॥ మనువేశదిశకై మదిలోనఁదలఁచినవారలెల్లను గాలవశతఁజనిరి। వారలబిడ్డలవారలమనుమల
వారలగోత్రంబువారినైన। వినము మేదినిమీఁదవినుము నీవచ్చినయాలోననిరువదియేడుమార్లు। నొండొండ నాలుగుయుగ
ములుసనియెనీవటుగానధరణికిసరుగుమిపుడు। దేవదేవుండుహరిబలదేవుఁడనఁగ। భూమిభారంబుమాన్పంగఁబుట్టినాఁడు
సకలభూతాత్మకుఁడునిజాంశంబుతోడ। యువతిమణినిమ్ముజనమణికున్నతాత్మ॥ వ॥ అనియానతిచ్చినబ్రహ్మకునమస్కరిం
చిభూలోకంబునకుంజనుదెంచిసోదరస్వజనహీనంబగుతననగరంబునకారాజువచ్చి బలభద్రుంగాంచి రేవతీకన్యనతనికి
చ్చినారాయణాశ్రమంబగుబదరికావనంబునకునియమంబునఁదపంబుసేయుటకుంజనియె॥ క॥ నభగుఁడనుమనుజపతికిని।
శుభమతినాభాగుఁడనఁగసుతుఁడుదయించెన్। ప్రభుఁడై వెలయుచుఁగాలంపున। విభజించిరిభ్రాతలతనివిత్తమునధిపా॥ వ॥ అం
తనాభాగుండును బ్రహ్మచారియైతనతోడంబుట్టువులనుధనంబుపాలడిగినవారలు దండ్రి చెప్పినక్రమంబుననిచ్చెదమని
ననాభాగుండుతండ్రియగునభగుకడకుంజనివిభాగంబుసేయుమనిపలికిననతండిమ్మనంగిరస్సులు మేధగలవారలయ్యును
సత్త్రయాగంబుసేయుచున్నారువారదినంబుననగృహకర్మంబులుదోఁపక మూఢులయ్యెదరువారలకునీవువైశ్వదేవసూక్తం
బులు రెండెఱింగించినఁగనియనంబ్రసిద్ధికెక్కెదవువారలుదానంబుసేసికృతకృత్యులైస్వర్గంబునకుంబోవుచుసత్త్రావ
శిష్టంబైనధనంబునీకిచ్చెదరనిపలికినందండ్రివీడ్కొనినాభాగుండునియట్లుసేసిననంగిరస్సులుసత్త్రపరిశేషధనంబుల
తనికిచ్చినాకంబునకుంజనిరంత॥ క॥ అంగిరసులిచ్చుపసిఁడికిమంగళమతిఁజేరునృపునిమానిసియొకఁడు। ఉత్తుంగుఁడుజలదని
భాంగుఁడు। ముంగలనిలుచుండివిత్తముంజేకొనియెన్॥ వ॥ వానింజూచినాభాగుండుదనకుమునులిచ్చుటంజేసితనధనంబని
పలికిననమ్మహాపురుషుండుమీతండ్రి సెప్పినక్రమంబకర్తవ్యంబనిననాభాగుండునభగునడిగిన నతండుయజ్ఞపరిశిష్టంబ
గుధనంబుదొల్లి మహామునులురుద్రునకిచ్చిరదికారణంబుగానాదిదేవుండుసర్వధనంబులకునర్హుండనినవినివచ్చి నాభా
గుండుమహాదేవునకునమస్కరించిదేవాయీధనంబునీయధీనంబనిమాతండ్రి సెప్పె నేనపరాధంబుసేసితి సహింపుము
నవుడుభక్తవత్సలుండగునమ్మహాపురుషుండునభగుసత్యవచనంబులకునాభాగునినిజంబునకుమెచ్చినీవుదప్పక పలికితివి
కావునసత్త్రపరిశేషితంబగుధనంబునీకునిచ్చితిననిపలికియంతర్దర్శిత్వంబునుసనాతనంబగుబ్రహ్మజ్ఞానం బుపదేశించితి
రోహితుండయ్యెనివ్విధంబున॥ క॥ భువిలోనాభాగునికథ। ధవళమతిన్ రేపుమాపుఁదలఁచినమాత్రన్। గవియగుమంత్ర
జ్ఞుండగుఁ। బ్రవిమలగతిఁబొందునరుఁడుభద్రాత్మకుఁడై॥ వ॥ అంతనాభాగునకునంబరీషుండుజనియించె- నతనియందుజ

॥ అంబరీషోపాఖ్యానము. ॥

గదప్రతిహతంబైనబ్రాహ్మణశాపంబునిరర్థకంబయ్యె నేమికారణంబునదురంతంబైన బ్రహ్మదండంబువలన నితండువి
ఘువంబడియెనననినప్పుడమిఱేనికిశుకుండిట్లనియె॥ శా॥ సప్తద్వీపవిశాలభూభరముదోస్స్తంభంబునంబూనిసంప్రాప్తశ్రీ
యుతుఁడై మహావిభవసంపచ్చాతురింగల్గియు। ర్వ్యాప్తింజెందకవైష్ణవార్చనలమేరంగాలముంబుచ్చుచున్। సుప్తిం
బొందకనెప్పెసద్గుణగరిష్ఠుండంబరీషుండిలన్॥ సీ॥ చిత్తంబుమధురిపుశ్రీపాదములయందపలుకులుహరిగుణపఠనమంద।
కరములువిష్ణుమందిరమార్జనములందశ్రవములుహరికథాశ్రవణమంద। చూపులుగోవిందరూపవీక్షణమందశిరముకేశ
వనమస్కృతులయంద। పదములీశ్వరగేహపరిసర్పణములందకామంబుచక్రికైంకర్యమంద। సంగమచ్యుతనిజగుణసంగ
మంద। ఘ్రాణమసురారిభక్తాంఘ్రికమలమంద। రసనతులసీదళములందరతులుపుణ్య। సంగతులయందయారాజచంద్ర
మునకు॥ మఱియునమ్మహీపతిభుండు॥ సీ॥ ఘనవైభవంబునఁగల్మషదూరుఁడై యజ్ఞేశునీశునజ్ఞాతుఁగూర్చి। మొనసివసిష్ఠాది
మునివల్లభులతోడఁగదిసిసరస్వతీతటమునందు। మేధతోబహువాజిమేధంబులొనరించిగణుతింపరానిదక్షిణలువెట్టి। సమ
మలోష్టహేముఁడై సర్వకర్మంబులుహరిపరంబులుగాఁగనవనియేలె। విష్ణుభక్తులందువిష్ణువునంచుఁగ। లంకమొదలమను
సులంకెపెట్టి। విహితరాజ్యవృత్తివిడువనివాఁడునై। యతఁడురాజతపసియనఁగనొప్పె॥ వెండియునమ్మహాభాగవతుండు॥
క॥ హరియనిసంభావించును। హరియనిదర్శించునంటునాఘ్రాణించున్। హరియనిరుచిగొనఁదలఁచును। హరిహరిమనునం
బరీషునలవియెపొగడన్॥ వ॥ ఇట్లుపుణ్యచిత్తుండీశ్వరాయత్తుండునై యెల్లనల్లనరాజ్యంబుసేయుచున్నసమయంబున॥
గీ॥ అతనికీహమానెహరులందుఁగరులందు। ధనములందుఁగేళివనములందుఁ। బుత్త్రులందుబంధుమిత్త్రులయందును। బుర
ములందునంతిపురమునందు॥ వ॥ అంతఁగొంతకాలంబునకక్షోణీమేదినీకాంతుండుసంసారంబువలనితగులంబువిడిచినిర్మలుం
డై యేకాంతంబునభక్తిపరవశుండై యుండనారాచతపసికిభక్తలోకవత్సలుండగు పురుషోత్తముండుప్రతిభటశిక్షణం

* రేపుమాపు। రాత్రిందివములు. సమలోష్టహేముఁడై। మంటిగడ్డను-బంగారును తుల్యముగఁదలఁచినవాఁడై. మేదినీకాంతుండు। రాజు.

బును,నిజజనరక్షణంబును, నిఖిలజగదవక్రంబగుచక్రంబిచ్చి చనియె నంత॥ క॥ తనతోడినీడకైవడి। ననురూపగుణాఢ్యయై
నయాత్మ*మహిషితో। జనవిభుఁడు ద్వాదశీవ్రత। మొనరఁగ హరిఁ గూర్చి చేసె నొకయేటిదరిన్॥ వ॥ ఇట్లు వ్రతంబు సేసి యా
వ్రతాంతంబున గార్తికమాసంబున మూఁడు రాత్రు లుపవసించి కాళిందీజలంబుల సుస్నాతుండయి మధువనంబున మ
హాభిషేకవిధానంబుల విహితపరికరసంపన్నుండై హరి నభిషేకంబు సేసి మనోహరంబులైన గంధంబులు సమర్పించి యి
భిన వామోదంబులైన పుష్పంబుల నంబుజాక్షుఁ బూజించి॥ తదనంతరంబ॥ శా॥ పాలేతైప్రవహింపఁ దగ్గ రుచులే ప్రాయంబులున్ రూప
ముల్। హేలన్ ధూర్తలుగాక వెండిగొరిజల్ హేమోరుశృంగంబులున్। గ్రాలం గ్రేపులనట్లు నాఁకుచును నంగచ్ఛాయలై
యున్నమందాలన్న్యర్బుదషట్కమిచ్చె విభుఁడు ద్వ్యష్టైకవిప్రశ్రేణికిన్॥ క॥ పెక్కండ్రు విప్రవరులకు। గ్రక్కున నన విభ
క్తిత్రోడఁ గడుపులు నిండన్। జొక్కపుటన్నంబిడి యిభ। డొక్కాడఁ బారణము సేయ నుద్యోగింపన్॥ అయ్యవసరంబున॥
క॥ భాసురనిగమపదోప। న్యాసుఁడు సుతపోవిలాసుఁ డనుపమ యోగా। భ్యాసుఁడు రవిభాసుఁడు దు। ర్వాసుండేతెంచె నెగ
న్నివాసంబునకున్॥ వ॥ వచ్చిన నమ్మునివల్లభునకుఁ బ్రత్యుత్థానంబు సేసి కూర్చుండ గద్దియ యిడి పాదంబులు గడిగి పూజించి
సేమంబరసి తనయింట నన్నంబు గుడువుమని నమస్కరించిన నమ్మహాత్ముండు సంతసించి భోజనంబున కునంగీకరించి నిర్మ
లంబగు కాళిందీజలంబుల నంబరమధ్యానంబు సేయుచు మునిఁగి లేచి రాక తడవు సేసిన ముహూర్తావశిష్టయగు ద్వాదశియం
దుఁ బారణ సేయవలయుటఁ జింతించి బ్రాహ్మణాతిక్రమదోషంబునకు శంకించి విద్వజ్జనంబుల రావించి వారల నుద్దేశించి॥
క॥ ముని నీరుసొచ్చి వెడలఁడు। చనియెను ద్వాదశియు నింత చనని దెయ్యాలో। మునుపారణ యున్వలయును। వినుఁడర్హంబైన ధ
ర్మవిధ మెట్టిదియో॥ అని పలికిన నా రాజునకు బ్రాహ్మణజను లిట్లనిరి॥ గీ॥ అతిథి వోయి రామి నధిపయా ద్వాదశి। పారణంబు
మానఁ బాడిగాదు। గుడువకుండఁ గాదు గుడుచుటయును గాదు। సలిలభక్షణంబు సమ్మతంబు॥ వ॥ అని ధర్మసందేహంబు వా
పిన నా రాజర్షిశ్రేష్ఠుండు మనంబున హరిం దలంచి నీరు పారణంబు సేసి జలంబుల మునిఁగిన తపసి రాక కెదురుసూచుచు
న్న సమయంబున॥ సీ॥ యమునలోఁ గృతకృత్యుఁడై వచ్చి రాజుచే సేవితుండై। రాజచేష్టితంబు। బుద్ధిలో నూహించి బొమముడి
డి మొగముతో నదరెడి మేనితో నాగ్రహించి। రెట్టించి యాఁకలి కోట్లు మిట్టాడంగ నీసంపదున్మత్తు §నీనృశంసు। నీమురహం
కారు నిండఁగంటిరే విష్ణుభక్తుఁడు గాఁడు వీఁడు నన్ను। గుడువరమ్మని మును ముట్టఁ గుడిచినాఁడు। ధర్మభంగంబు సేసి మ
హాత్ముఁడయ్యె। నైన నిప్పుడ నూపెద నన్ని దిశల। నేను కోపింప మాన్ప వాఁడెవ్వఁ డనుచు॥ చ॥ పెటపెటఁ బండ్లు గీఁటు
చును భీకరుఁడై కనుఁగ్రేవ నిప్పుకల్। పొటపొట రాల గండములు పొంగ మునీంద్రుఁడు హుంకరించుచున్। జటమొదలం
టఁగాఁ బెఱికి చక్కనదానన కృత్యనాయుధో। త్కటవనమాలహస్తయను కానొనరించి వికవించె రాజుపైన్॥ క॥ కా
లానలసన్నిభయై। శూలాయుధహస్తయగుచు నసురాస్త్రక[illegible]బదంబులఁ ద్రొక్కుచు। వాలమహాకృత్య
మనుజవల్లభుఁ జేరెన్॥ గీ॥ ఆప్రకారమెఱిఁగి హరి విశ్వరూపుండు। పెట్టి తపసి సేయు ¶వేడబంబుఁ। జక్కఁబెట్టు మనుచుఁ జ
క్రంబుఁ బంచిన। వచ్చె నదియుఁ బ్రళయవహ్నిపగిది॥ వ॥ వచ్చి ముని పంచిన కృత్యను దహించి తనివి సనక ముని వెంటంబడిన ము
నియు మేరుగుహ సొచ్చిన నదియు ‖వ్యాళంబు వెనుకొను దవానలంబు చందంబునఁ దోన సొచ్చె మఱియును॥ మ॥ భువి దూఱ
న్భువి దూఱు నబ్ధి సొర నబ్ధుల్సొచ్చు నుద్వేగియై। దివిఁ బ్రాఁకన్ దివిఁ బ్రాఁకు దిక్కులకుఁ బోదిగ్వీధులం బోవుఁ జీ। కిక్కువెసన్ గ్రుం
కినఁ గ్రుంగు నిల్వ నిలుచున్ ☐గేడింపఁ గేడించు నో। కక్కవడిన్ జాపము వెంటనంటి హరిచక్రంబన్యదుర్వక్రమై॥ శా॥ ఏలోకం
బునకైన వెంటఁబడి తో నేతెంచు చక్రానల। జ్వాలల్మానుపువారు లేమి జని దేవశ్రేష్ఠులోకేశు వాఁ। డాలోకించి విధాత
☐విశ్వజననవ్యాపారపారీణరేఖాలీలేక్షణ కావవే కరుణఁ జక్రంబున్నివారింపవే॥ అనిన బ్రహ్మ యిట్లనియె॥ మ॥ కరమర్థి
ద్విపరార్థసంజ్ఞ గల యీకాలంబుఁ గాలాత్ముఁడై। ☐సొరది న్నిండఁగఁ జేసి లోకముల నాచో టున్విభుం డెవ్వఁడో। పరిపూర్తి
న్గనుఁ ద్రెవ్వఁ గెంపు లొలుకన్ స్వప్నంబుగాఁ జేయు నా। హరిచక్రాకృతి వహ్నికి న్యుఁడొకరుండడ్డంబుగా నేర్చునే॥ గీ॥ ఏను భ
వుఁడు దక్షుఁ డింద్రాదులును బ్రజా। పతులు భృగుఁడు భూతపతులు శిరము। లందు దాల్తుమతని యాజ్ఞ జగద్ధితం। బంచు భూరి
కార్యమతుల మనుచు॥ వ॥ కావున సుదర్శననివారణంబునకు నోపన నివిరించి పలికిన దుర్వాసుండు కైలాసంబునకుం జను దెం
చి శర్వు నాలోకించి చక్రానలంబు తెఱంగెఱింగించిన నమ్మహాదేవుం డిట్లనియె॥ సీ॥ వినుమయ్య తండ్రి యీ విశ్వేశ్వరుని

---

* మహిషి।పట్టపుదేవి. § ఈనృశంసున్।ఈఘాతుకునిని. ¶వేడబంబు।ఆడంబరము. ‖వ్యాళము।దుష్టయేనుఁగు-సర్పము. ☐కేడింపన్। మఱలింపఁగా. ☐విశ్వజననవ్యాపారపారీణరేఖాలీలేక్షణ॥ విశ్వ।ప్రపంచముయొక్క- జనన।ఉత్పత్తియొక్క- వ్యాపార।క్రియయందు- పారీణ।సమర్థమయిన- రేఖా।రేఖారూపమయిన- లీలేక్షణ।విలాసదృష్టిగలవాఁడా. ☐సొరది।క్రమముతో.

యంచుఁ జతురాస్యజీవకోశములు పెక్కు ల్వేలసంఖ్యలు గూడి వేళతో నిబ్బంగి నగుచుండుఁ జనుచుండు నవియుఁ గాక । నెవ్వా
నిచే భ్రాంతి నేమందుచున్నార మేను దేవలుఁడను రేంద్రసుతుఁడు । నారదుండ జుఁడు సనత్కుమారుఁడు ధర్ముఁడు కపిలుఁ
డు మరీచ్యాదులఖిల । నిర్జరులును సిద్ధనివహ మెవ్వని మాయ । నెఱుఁగ లేము మూల మిట్టిదనుచు । నట్టి యఖిలనాథు నాయుధశ్రే
ష్ఠంబు దోలఁగఁ జేయ మాకు దుర్లభంబు ॥ వ ॥ మునీంద్రా నీవు నమ్మహాత్ముని శరణంబు వేడుము తండు మేలు సేయంగలవాఁడ
ని పలికిన నీశ్వరుని వలన నిరాశుండై దుర్వాసుండు వైకుంఠనగరంబునకుం జని ॥ శా ॥ ఆ వైకుంఠములో నిభర్మమణిసౌధా
గ్రంబు పైలక్ష్మీదా । గ్రేవ నెల్లన నర్మభాషణములన్ క్రీడింపఁ బుణ్యున్ హరి౯ । దేవాధీశ్వరుఁ గాంచి యో వరదయో దేవేశ
యో భక్తర । త్యావిద్యాపరతంత్రమానసుఁగ దేచ క్రానలజ్వాలల౯ ॥ ఉ ॥ నీమహిమార్ణవంబు మది నిక్కముఁగా నెఱుఁగం
గలేక నీ । ప్రేమకు వచ్చు దాసునకుఁ బిచ్చతనంబున నెగ్గుఁ జేసితి । న్నామఅపున్సహింపుము టనారకుఁడై నమనంబులో భవ ।
న్నామము చింత సేసిన ననంతసుఖస్థితి నొందకుండునే ॥ వ ॥ అని పలికి పాదకమలంబులకు మ్రొక్కి లేవకయున్న దుర్వాసు
నింగని హరి యిట్లనియె ॥ చ ॥ చలమున బుద్ధిమంతులగు సాధులు నా హృదయంబు లీలదొం । గిలిగొని పోవుచుందురు కిల్బిషభ
క్తిలతాచయంబుల । న్నిలుపఁగఁ బట్టి కొట్టుమదు నేరుపుతో మదకుంభికైవడి । న్వలలకుఁ జిక్కి భక్తజనవత్సలతం జనుచుం
దుఁ దాపసా ॥ గీ ॥ నాకు మేలుగోరు నాభక్తుఁడగు వాఁడు । భక్తజనులకేను పరమగతియు । భక్తుఁ డెందుఁ జనినఁ బఱతెంతు వె
నువెంట । గోవు వెంటఁ దగులు కోడెభంగి ॥ అదియునుం గాక ॥ గీ ॥ తనువు మనువు విడిచి తనయులఁ జుట్టాల । నాలి విడిచి సంపదా
ళి విడిచి । నన్నె కాని యన్య మెన్నఁడు నెఱుఁగని । వారి విడువ నెట్టి వారి నైన ॥ క ॥ పంచేంద్రియముల తెరువుల । వంచించి మనం
బునం దమ వరమతులు ప్రతిష్ఠించి వహింతురు నన్నును । ఘుంచివరున్బణ్య సతులు మఱఁగిన భంగి౯ ॥ క ॥ సాధుల హృదయము
నా యది । సాధుల హృదయంబు నేను జగముల నెల్ల౯ । సాధుల నే నెఱుంగుదు । సాధు లెఱుంగుదురు నాదు చరితము విప్రా ॥
గీ ॥ ధారుణీసురులకుఁ దపము విద్యయు రెండు । ముక్తి చేయుచుండు ముదముతోడ । దుర్వినీతులైన దుర్జనులకు నీకు । నిదియుఁ
గీడు గాక నేలయుండు ॥ క ॥ నా తేజము సాధులలో । నాతతమై యుండు వారి నలఁచు జనులకు౯ । హేతిక్రియ భీతినిచ్చును । జే
తోమోదంబు చెఱుచు సిద్ధము సుమ్మీ ॥ క ॥ అదె పో బ్రాహ్మణ నీకును । సదయుఁడు నాభాగసుతుఁడు జనవినుతగుణా । స్పదుఁడి
చ్చు నభయమాతని । మది సంతసపఱచి వేఁడుమా శరణంబు౯ ॥ మ ॥ అని శ్రీవల్లభుఁ డానతిచ్చిన మహోత్సాహాద్యచ్చక్రకీలావ
ళీ । జనితాయాసుఁడు నిర్వికాసుఁడు దితస్వాంతుండు దుర్వాసుఁడ । ల్లన నేతెంచి నభక్తిఁ గాంచెఁ గరుణాలావణ్యపేషున్ని
దోషు నయోదారమనీషు మంజుమితభాషు న్నంబరీషున్ నృప౯ ॥ వ ॥ కని మర్గితుండై మహీవల్లభు పాదంబులు వట్టి విడువ
కున్న నా నరేంద్రచంద్రుండు చరణస్పర్శనంబునకు నోడుచుఁ గరుణారసభరితహృదయుండై హరిచక్రంబు హృదయం
బున నిట్లని స్తుతియించె ॥ సీ ॥ నీవ పావకుఁడవు నీవ సూర్యుండవు నీవ చంద్రుండవు నీవ జలము । నీవ నేలయు నింగి నీవ సమీరంబు
నీవ భూతేంద్రియనికరములును । నీవ బ్రహ్మంబును నీవ సత్యంబును నీవ యజ్ఞంబును నీవ ఫలము । నీవ లోకేశులు నీవ సర్వాత్మ
వు నీవ కాలంబును నీవ జగము । నీవ బహుయజ్ఞభోజివి నీవ నిత్య । మూల తేజంబు నీకు నే మ్రొక్కువాఁడ । నీరజాక్షుండు చాల
మన్నించునట్టి । శస్త్రముఖ్యము కావవే చాలు మునిని ॥ మ ॥ హరిచే నీవు విసృష్టవై చనఁగ మున్నాలించి నీ ధారల । న్దర్శణి ప్రా వ
లుటనిక్కంచుమును పేదైత్యేంద్రమధ్యంబుల । న్శిరముల్ పాదములున్ భుజాయుగళముల్ ఛేదింపనంగంబులు । న్నెరలుం
బ్రాణసమీరముల్ గదలు నీ యుద్ధంబులం జక్రమా ॥ గీ ॥ కలఁగి నిద్రవోవఁ గలలోన వచ్చిన । నిన్నుఁ జూచి దీర్ఘనిద్రవోదు । రసుర
వరులు శయ్యలందు మన్న సతులు ప్ర । ఖాతమందు లేచి పలువరింప ॥ ఉ ॥ చీఁకటి వాపుచున్ వెలుఁగు సేయుచు సజ్జనకోటి నెల్లన ।
శ్రీకులఁ జేయు నీ రుచులు చెల్వుగ ధర్మసమేతులైనను । న్నాకున నిట్టి దట్టిదని వర్ణనసేయ విధాత నేరఁడ । స్తోకము నీ మహామ
హిమ దోషని వారి పరాపరాద్యమే ॥ గీ ॥ కమలలోచనుం డఖిలుల శిక్షింపంగ । బాగు సేయ నీవు పాలువడితి । వైనసింకఁ జాలు
నాపన్నుఁడై యున్న । తపసిఁ గావుమీవు ధర్మవృత్తి ॥ వ ॥ అని వినుతించి కేలు వమ్మిదోయి నొసటం బొసఁగించి యిట్లనియె ॥
గీ ॥ ప్రణమస్కరింతు నింద్రశాత్రవధూమ । కేతువునకు ధర్మసేతువునకుఁ । విమలరూపమునకు విశ్వదీపమునకుఁ । జక్రమునకు
సుప్తశక్రమునకు ॥ అని మఱియు నిట్లనియె ॥ గీ ॥ విహితధర్మమందు విహరింతు నేనియు । నిష్టమైన ద్రవ్యమిత్తు నేని । ధరణీసురుఁ
డు మాకు దైవతంబగు నేని । విప్రునకు శుభంబు వెలయుఁ గాక ॥ క ॥ అఖిలగుణాశ్రయుఁడగు హరి । సుఖియై నా కొలువువలనఁ
జొక్కెడి నేని । న్నిఖిలాత్మమయుం డగుటకు । సుఖమందుం గాక భూమిసురుఁ డీ వేళ౯ ॥ వ ॥ అని యివ్విధంబున నాభాగసు
పుడమిఱేని వలన మన్నించి తపసికి దాహంబు నొందింపక రక్కసులగొంగ చక్రంబు తిఱిగి చని యెనంత దుర్వాసుండు శాం
తింబొంది మెల్లని మాటల నా రాజుం దీవించి యిట్లనియె ॥ మ ॥ నరనాథోత్తమ మేలు సేసితిక దా నాతప్పు సైరించి శ్రీహరి

పాదాబ్జములెంతముట్టఁగొలుతేయాశ్చర్యమానైనచో। ననుఁదండ్రీనినుబోటిసాధులకుఁదానైయిచ్చుటల్గాచుట।ల్నా
రదినైన్నిజగుణంబులై సరసవచ్చుంగాదెమిత్రాకృతిన్॥ అదియునుంగాక॥ మ॥ ఒకమాటెవ్వనిపేరుకర్ణములలోనె
య్యారమైసోఁకిన।న్సకలాఘంబులు *పల్లటిల్లితొలఁగున్న భ్రాంతితోనట్టిస।త్సుకరున్మంగళతీర్థపాదుహరివిష్ణున్దేవదేవే
శుఁదా।నకలంకస్థితిఁగొల్చుభక్తులకులేదడ్డంబురాజాగ్రణీ॥మత్తకోకిల॥తప్పులోఁగొనిచక్రపావకదాహముంబెడఁబా
పితౌ।నెప్పునొప్పుభవద్దయారసమోనరేశ్వరప్రాణము।ల్సెప్పుమున్మనువోయిక్రమ్మఱఁజేరెధన్యుఁడనైతినీ।కెప్పుడున్మ
భమేనుగోరెదనింకఁబోయెదభూవరా॥క॥అనినవినిరాజముఖ్యుఁడు। మునివల్లభుపాదములకుమ్రొక్కి-కడున్మ।న్ననసే
సియిష్టభోజన।మనువుగఁబెట్టింపఁదృప్తుఁడయ్యెనతండున్॥మఱియునమ్మునీంద్రుండిట్లనియె॥ శా॥కంటి న్నేఁటికినిన్నునీవ
చనముల్లగ్ణద్వయింశ్రీతిగా।వింటిన్నన్నముఁగొంటినీగృహమున న్వేడ్కా న్ఫలంబందెనే।మింటంబోయెదనీచరిత్రముఁను
రుల్మర్త్యుల్సుఖాసీనులై।మింటన్మేదినిసన్నుతింపఁగలరీమీఁదన్నరేంద్రాగ్రణీ॥వ॥అనిచెప్పిదుర్వాసుండంబరీషునిదీవించి
కీర్తించిమింటితెరువునబ్రహ్మలోకంబునకుంజనియెమునీశ్వరుండు మగుడంజనువేళకునొక వత్సరంబునిండివ్రతంబుపరి
పూర్ణంబైన॥గీ॥అవనిసురుఁడుగుడువనతిపవిత్రంబైన।వంటకంబుభూమివరుఁడుగుడిచెఁ।దపసియెగులుమాన్పఁదానెంత
వాఁడను।హరికృపామహత్వమనుచుఁదలఁచి॥మఱియు॥ క॥హరిఁగొల్చుచుండువారికిఁ।బరమేష్ఠిపదంబుమొదలుపరభో
గంబు।ల్నరకసమంబనుతలఁపున।ధరణీరాజ్యంబుతోడితగులముమానెన్॥ఇట్లువిరక్తుండై॥గీ॥తనకుసదృశులైనతనయుల
రావించి।ధరణిభరమువారిఁదాల్పఁబంచి।కాననంబుసొచ్చి కామాదివిజయుఁడై।నరవిభుండుహరిసమానుఁడగుచు॥ క॥అ
య్యంబరీషుచరితముఁ।దియ్యంబునవిన్నఁజదువధీసంపన్నుం।డయ్యుండునుభోగపరుం।డయ్యుండునునరుఁడుపుణ్యుఁడై
యుండున్నృపా॥వ॥వినుమయ్యంబరీషునకువిరూపుండును,గేతుమంతుండును,శంభుండను,వారుమువ్వురుకొడుకులందుఁ
గేతుమంతుండును,శంభుండును,హరింగూర్చితపంబుసేయువారై వనంబునకుంజనిరివిరూపునికిఁబృషదశ్వుఁడును, బృష
దశ్వునకురథీతరుండమ్మహాత్మునికిసంతతిలేకున్న నంగిరస్సనుమునీంద్రుండతనిభార్యయందుబ్రహ్మతేజోధనులయిన కొ
డుకులంగనియెవారలురథీతరగోత్రులునాంగిరసులను, బ్రాహ్మణులునై యితరులందుముఖ్యులైప్రవర్తిల్లిరనిచెప్పిశు

## ఇక్ష్వాకువంశానుక్రమము.

కుండిట్లనియె॥క॥ఒకనాఁడుమనువుతుమ్మిన। వికలుఁడుగాకతనిఘ్రాణరంధ్రమువెంటం।బ్రకటయశుండిక్ష్వాకుఁడు।న
కలంకుఁడువుట్టెరవికులాధీశుండై॥సీ॥ఇక్ష్వాకునకుఁబుత్రులెలమిఁబుట్టిరినూఱ్వురమరవికుక్షియునిమియుదండ।కుండు
నాతనిపెద్దకొడుకులుమువ్వురార్యావర్తమంచుహిమాచలంబు।వింధ్యాద్రిమధ్యమూర్వీమండలముఁగొంత నేలిరియిరువ
దియేగురొక్క-।పాఁడుగనాతూర్పుభూమిపాలించిరియందఱుపడమటికధిపులైరి। యున్ననలువదియేన్వురునుత్తరోర్వి।
దక్షిణోర్వియుఁగాచిరితండ్రియంత।నష్టకాశ్రాద్ధమొనరింతుననుచునగ్ర।సుతువికుక్షినిరీక్షించిశుద్ధమయిన।మాంసఖం
డంబుదెమ్మనెమహితయశుఁడు॥మ॥ అగుఁగాకంచువికుక్షి వేఁటఁజనిఘోరారణ్యభూమిందగ।న్మృగసంఘంబులఁజంపి
బిట్టలసితామేనొల్లఁబోనాఁకట।న్సగమైయొక్క-శశంబువట్టితెనిశేషంబయినమాంసంబుశీ।ఘ్రగతిందండ్రికిఁదెచ్చియి
చ్చెనకలంకస్ఫూర్తివర్తిల్లఁగాన్॥తరల॥కులగురుండువసిష్ఠుఁడంతవికుక్షికుందెలుదింటలో।పలనెఱింగియనర్హమెంగిలి
పైతృకంబొనరింపఁగా।వలదువీఁడుదురాత్మకుండనవానితండ్రియువానిఁజెం।తలనుజేరఁగనీకదేశముదాఁటిపోనడఁచె
న్వడిన్॥గీ॥కొడుకువెడలఁగొట్టిగుణవంతుఁడిక్ష్వాకుఁ।డావసిష్ఠుఁడేమియానతిచ్చె।నదియుఁజేసియోగినై వనంబునఁగ
లేఁ।బరమువిడిచిముక్తిపదమునొందె॥చ॥జనకుఁడుముక్తిఁబొందనయశాలివికుక్షిశశాదుఁడంచుభూ।జనులునుతింపనీధర
ణిచక్రముశేషమునేలియాగము।ల్ఘనకొనిచేసెఁబ్రీతిహరిఁగూర్చిపురంజయపుత్రుఁగాంచెఁబే।ర్కొనెయమరేంద్రవా
హుఁడుకకుత్స్థుఁడునంచునువానిలోకముల్ ॥సీ॥ కృతయుగాంతంబునదితిసుతాసురులకురణమయ్యెనందులరాక్షసుల
కు।నమరవల్లభుఁడోడిహరితోడఁజెప్పినజలజనేత్రుఁడుపురంజయునియందు। వచ్చినేనుండెదవాసవవృషభంబవైమోపు
మనిపల్కె-నమరవిభుఁడు।గోరాజమూర్తికకుత్ప్రదేశంబునఁబురంజయుమోచెనంతనతఁడు। విష్ణుతేజంబుదనయందు
విస్తరింప।దివ్యచాపంబుచేపట్టిదీర్ఘనిశిత।బాణములఁబూనివేల్పులుప్రస్తుతింప। నంతఁగాలాగ్నిచాడ్పుననరికినడిచె॥చ॥
నడిదిశరావళింద్రనుజనాథులమేనులుదించికంఠము। ల్తొడితొడిఁద్రుంచికాలుపురిత్రోవకుఁగొందఱఁబుచ్చికొందఱ।న్వె
డినురగాలయంబునకువాసముసేయఁగఁద్రోలియంతమా।రడకనిశాచరేంద్రులపురంబులుగాల్చెఁబురంజయాఖ్యతన్॥
వ॥ఇవ్విధంబునశశాదపుత్రుండురాక్షసులపురంబులుజయించినకతనంబునంబురంజయుండును,వృషభరూపుండైనయిం

* పల్లటిల్లి।దుఃఖపడి.    ఎగులు।కష్టము.

త్రుంఁడు వాహనంబగుటం జేసి యింద్రవాహనుండ తనిమూపురంబెక్కి రణంబు సేసిన కారణంబునఁ గకుత్స్థుండన నీమూఁ
డు నామంబులఁ బ్రసిద్ధి కెక్కి దైత్యులధనంబుల నింద్రునకిచ్చె నప్పురంజయుని పుత్త్రుండనేనస్సతని పుత్త్రుండు పృథుండు, పృథున
కు విశ్వగంధుండు, విశ్వగంధునకుఁ జంద్రుండు చంద్రసుతుండు యువనాశ్వుండు- యువనాశ్వతనూభవుండు శబస్తుం-డతం
డు శాబస్తినామనగరంబు నిర్మించె-శబస్తతనయుండు బృహదశ్వుండు, బృహదశ్వునకుఁ గువలయాశ్వుం-డా నరేంద్రచం
ద్రుండు॥ క॥ లావు మెఱసి యిరువదియొక। వేవురు నన్దనులుఁ దాను వీరుఁడ తఁడు భూ। దేవుఁ డుదంకుఁడు పనుపఁ। రావహుఁ
డై చంపె దుంధు ననురాబన్ధున్॥ వ॥ అది కారణంబుగా దుంధుమారుండన నెగడె నయ్యసురముఖానలంబునఁ గువలయాశ్వ
కుమారులందఱు భస్మంబులైరందు దృఢాశ్వుండును, కపిలాశ్వుండును, భద్రాశ్వుండును నను వారలు ముగ్గురు చిక్కిరందు దృ
ఢాశ్వునకు హర్యశ్వుండును, హర్యశ్వునకు నికుంభుండును, నికుంభునకు బర్హిణాశ్వుండును, బర్హిణాశ్వునకుఁ గృతాశ్వుం
డును, కృతాశ్వునకు సేనజిత్తు, సేనజిత్తునకు యువనాశ్వుండు జనించె-నతండు గొడుకులు లేక నూర్వురు భార్యలుం దాను
ను నిర్వేదపడియుండె-నా రాజునకు మునులు కృపఁ జేసి యింద్రునిఁ గూర్చి సంతతికొఱకై నైంద్రయాగంబు సేయించిరందు॥
సీ॥ భూమీశు భార్యకుఁ బుత్త్రలాభమునకై పోయు తలంపున భూమిసురులు। జలమును మంత్రించి జలకలశము దాఁచి నియమం
బుతోఁ గూడి నిద్రవోవ। ధరణీశ్వరుఁడు నీరుదప్పితో నా రాత్రి ధృతిలేక యజ్ఞమందిరముఁ జొచ్చి। యానీరు ద్రావిన నంత మేల్కని
వారలెవ్వఁడు ద్రావెనీ రెంచుఁ బోయె। ననుచు రాజు ద్రావుటంతయు భావించి। యెఱిఁగి చోద్యమందియీశ్వ రాజ్ఞ। యెవ్వఁ
డోపుఁ గడువ నీశ్వరునకు నమస్కారమనుచు నేది కార్యమనుచు॥ వ॥ వారలు దుఃఖించుచుండ నంతఁ గొంత తడవునకు యువనా
శ్వుని కడుపు వ్రక్కలించుకొని చక్రవర్తిచిహ్నంబులు గలకుమారుండు జన్మించి తల్లి లేనికతంబునఁ గుడుపునది లేక నేడ్చుచుం
డ నింద్రుండు వచ్చి శిశువునకు నాఁకలిదీరుకొఱకు వాసనోటం దన వ్రేలిడి నం ద్రావెడికతంబున వాని పేరు మాంధాత యనిని
ర్దేశించి చని యెనివ్విధంబున॥ గీ॥ కడుపువగల ముద్దుకొడుకు జన్మించిన। ధీరుఁడయ్యెఁ దండ్రి దేవవిప్ర। కరుణ యట్లకాదె కడిఁది
దైవములావు। గలుగువాఁడు బ్రతుకుఁ గాక చెడునె॥ వ॥ ఇట్లు బ్రదికియున్న యువనాశ్వుండు గొంతకాలంబునకుఁ దపంబు
సేసి సిద్ధిం బొందె నంత॥ సీ॥ పడమట నెద వెలుఁ బాలచంద్రుని మాడ్కిఁ బూఁటపూఁటకు వృద్ధిఁ బొందె బాలుఁ। డల్ల సంబరిపూ
ర్ణ యౌవనారూఢుఁడై రావణాదిరిపుల రాజవరుల। దండించి తను త్రసదస్యుఁడంచు సురేంద్రుఁ డంకింప శూరుఁడై యఖి
ల దేవ। మయు నతీంద్రియు విష్ణు మాధవు ధర్మాత్ము నజుని యజ్ఞాధీశు నాత్మఁ గూర్చి। చేసి క్రతువులు భూరిదక్షిణలనిచ్చి। ద్ర
వ్యయజమానవిధిమంత్రధర్మయజ్ఞ। కాల ఋత్విక్ప్రదేశ ముఖ్యంబులెల్ల। విష్ణురూపంబులనుచు భావించె నతఁడు॥ క॥ బలి
మి నడంచుచు నరులం। జలి వెలుఁగు న్వేఁడి వెలుఁగుఁ జనుచోటెల్లన్। జలరుహనయనుని కరుణను। జెలువుగ మాంధాత యేలె
సిదినిం డార్నన్॥ వ॥ అంత రాజు నకుశశిబిందు కూఁతురగు బిందుమతి యందుఁ బురుకుత్సుండు నంబరీషుండును ముచుకుందుం
డునను వారు ముగ్గురు కొడుకులు నేబండ్రు కూఁతులుం జనించి పెరుగుచున్న యెడ॥ సీ॥ యమునాజలములోన నధికుఁడు సౌభ
రి తపము సేయుచు జలస్థలములందుఁ। బిల్లలుఁ దన ప్రాణవల్లభయును గూడి మెలఁగ నానందించు మీనరాజుఁ। గనుఁగొని సం
సారకాంక్షియై మాంధాత నొకకన్య నడుగ నృపోత్తముండు। తరుణి నిత్తు నుస్వయంవరమునఁ జేకొను మనవుడు నసుఁ జూచి
యౌవనాంగి। యేల ముసలిఁ గోరు నిట్లట్టువడఁ కెడి। వాఁడఁ జాల నెఱసి నాఁడ నొడలు। జిగియు బిగియు లేని శిథిలుండఁ గరగిం
పఁ। జాలఁ దిగిచికొనును పాయమెట్లు॥ అదియునుం గాక॥ గీ॥ బాలపువ్వుబోఁడి ప్రాయంపు వానిని। జెన్నువాని ధనముఁ జే
ర్పువాని। మఱిగె నేనిఁ గొంత మఱుఁగుఁ గాకెదిరిఁద। న్నెఱిఁగి ముసలితపసి నేల మఱుగు॥ వ॥ అని విచారించి సౌభరి తన తపోబ
లంబునం జేసి ముసలితనంబు విడిచి యెలప్రాయంపు కొమరుండయి యలంకరించికొని ముందట నిలువంబడిన మాంధాత
యుఁ గన్నియల నగరుఁ గాఁచికొని యున్నవారికి సెలవుసేసిన వారమ్మునీంద్రుని నా రాజపుత్త్రికలున్న యెడకుం గొనిపో
యి చూపిన॥ ఉ॥ కోమలులార వీఁడు నలకూబరుఁడో మరుఁడో జయంతుఁడో। యేమఱి వచ్చె వీనిఁ దడవేల వరింతము నేము
నేమయం। చా మునినాథుఁ జూచి చలితాత్మకులై సొరిదిన్వరించిరా। భామినులందఱుం గుసుమబాణుఁడు ఘీయనిఘం
టవ్రేయఁగన్॥ వ॥ ఇట్లు రాజకన్యకలనందఱిం జేకొని సౌభరి నిజతపః ప్రభావంబున నేక లీలావినోదంబులు గల్పించియుం
డు॥ సీ॥ గృహారాజములయందుఁ గుసుమవల్లులయందుఁ గోలాహలంబైన కొలఁకులందుఁ। గలకంఠశుకహంసఘుకరనినాదము
లచే వర్ణనీయములైన వనములందు। మణివేదికలయందు మహనీయపర్యంకపీఠలీలాశైలబిలములందు। శృంగారవతులగు
చెలువలు పలువురు తనపంపు సేయు సుస్థలములందు। వస్త్రమాల్యానులేపసువర్ణహార। భూరిసంపదనిష్టాన్నభోజియగు
చుఁ। బూఁటపూఁటకు నొకకొంత పొలుపుఁ దాల్చి। రాజకన్యలనందఱ రతులఁ దేల్చె॥ క॥ పెక్కండ్రు రాజముఖులకు। నొక్క

ఁడుమగఁడయ్యెఁదనియకుండెమునీంద్రుం|డొక్కఁడుఘృతధారలచే|నక్కజమైతృప్తిలేనియనలునిభంగిన్॥ ఇవ్విధంబున॥ క॥ ఆరామంబునమునివరుఁ|డారామలతోడబహువిహారమయుండై|గారాములఁదనకిట్లటు|సోరాములు సేసికొన్ని ప్రొద్దులువుచ్చెన్॥ వ॥ అంత నొక్కనాఁడు మేదినీవల్లభోత్తముండగు నామాంధాతమునీశ్వరుం డెందునోయెఁగూఁతు రెక్కడనలజడిపడుచున్న వారలోయని తలంచి వెదకవచ్చి యొక్కమహానగంబున మణిమయసౌధంబులం జక్రవర్తియుం బోలెం గ్రీడించుచున్న తాపసరాజుం గని సంతసించి వెఱఁగుపడి మన్ననలం బొంది మెల్లనఁ గూఁతులం బొడగని సత్కరించి యిట్లనియె॥ క॥ నాతోడులారమీపతి|మీతోడిదపనులయొకల మేలేయనుఁడు|న్నాతోడిదె నాతోడిదె|తా తా మేలనుచు ననిరి తరుణులు వరుసన్॥ వ॥ అంతఁ గొంతకాలంబున సభార్యాచర్యుండగు సౌభరి యేకాంతంబునఁ దన్నుఁదానె చింతించికొని మీనమిథునసంగదోషంబున నంగాఁపురంబు దనకునగుపడుట యెఱింగి పశ్చాత్తాపంబున నిట్లనియె॥ మ॥ ఉపవాసంబులఁ డయ్యుటో విషయసంయోగంబు వర్జించుటో|తపమున్ బూని చరించుటో హరిపదధ్యానంబునన్నిల్చుటో|యపలాపంబున నేలఁ బొందితి హతంబయ్యెం దపంబెల్లనీ|కపటస్త్రీపరిరంభముల్ మునులకుం గైవల్యసంసిద్ధులే॥ చ॥ మునియఁట తత్త్వవేదియఁట మోక్షముగానిసుఖంబు లెవ్వియుం|జనదఁట కాంతలేఁబదఁట సౌధచయంబఁట వాసదేశముం|దనయులునైదువేలఁట నిదానము మీనకుటుంబి సౌఖ్యముం|గనునఁట చెల్లరే నగవుగాక మహాత్ములు సూచి మెత్తురే॥ గీ॥ తపము సేయువాఁడు దత్త్వజ్ఞుఁడగువాఁడు|నెలమి మోక్షమిచ్ఛయించువాఁడు|నేకతంబు విడిచి యేర్పడ నేరఁడు|కాఁపురంబు సేయఁగఁ బటితపసి॥ వ॥ అని మగ్గి ఖంచితనుఁ దాన చింతించుకొని తన వేడబంబు వివేదించుచు నిహపరసాధకుండై కాఁపురంబు విడిచి సతులుం దానును వానప్రస్థధర్మంబున నడవికిం జని ఘోరతపంబు సేసి శరీరముఁ గుదియించి యగ్నిసహితుండై పరబ్రహ్మంబు సొచ్చె నంత॥ క॥ మునిపతివనమునకరిగిన|వనితలుతోనరిగి ప్రాణవల్లభుగతికిం|జనిరి వెనుదగిలి విడువక|యనలునితో శిఖలు నిలువకరిగిన భంగిన్॥ వ॥ అంత మాంధాత పెద్దకొడుకగు నంబరీషుండు వానిపితామహుండగుటం జేసి యువనాశ్వుండు దనకుఁ బుత్త్రుండుగావలయునని కోరి పుచ్చికొనియె- నయ్యంబరీషునకు యౌవనాశ్వుం, డతనికి హారివరుండు జనియించె నది కారణంబున నంబరీషయౌవనాశ్వహారితులు మాంధాతృగోత్రంబునకుం బ్రవరులైరి- మాంధాత రెండవకొడుకు పురుకుత్సుండ తని నురగలోకంబునకుం గొనిపోయి భుజంగకుమారులు దమ చెల్లెలగు నర్మదయను కన్యకను వివాహంబు చేసిరి- పురుకుత్సుండునక్కడ ననేకగంధర్వనాథుల వధించి తన నాగలోకసంచరణంబు దలంచు వారికి నురగభయంబు లేకుండ వరంబు వడసి తిరిగివచ్చెఁ- బురుకుత్సునకుఁ ద్రసదస్యుండు, త్రసదస్యునకు నరణ్యుం, డాయరణ్యునకు హర్యశ్వుండు, హర్యశ్వునకు నరుణుండు, నరుణునకుఁ ద్రిబంధనుండు, ద్రిబంధనునకు సత్యవ్రతుండు, సత్యవ్రతునకుఁ ద్రిశంకుండు జన్మించె నతండు॥ సీ॥ గురుశాపవశమునఁ గూలి చండాలుఁడై యనఘాత్ముఁ గౌశికు నాశ్రయించి|యతని లావున దివిజాలయంబున కేగ మున్నింపక మరులు మఱలఁ ద్రోయఁ|దలక్రిందుగాఁ బడి దైన్యంబుతోఁ గూఁగఁ గౌశికుం డప్పుడు ఘనత మెఱసి|నిలిపె నాకసమున నేఁ డునున్నట్టి త్రిశంకుఁ డాతఁడు హరిశ్చంద్రుఁ గనియె|నా హరిశ్చంద్రుఁ గౌశికుఁ డర్థిఁ జేరి|యాగదక్షిణమిషమున నఖిలధనముఁ|గొల్లఁగొని మీఁదఁ గులహీనుఁ గొలువఁ బెట్టె|బొంకకలజడిఁ బొందె నా భూవరుండు॥ వ॥ ఇట్లు విశ్వామిత్రుండు హరిశ్చంద్రు నెగులుపఱచుటఁ బివసిష్ఠుండు విశ్వామిత్రు నిగ్రహమ్ముగమ్మ నిశపించె-విశ్వామిత్రుండును వసిష్ఠుని బకంబుగమ్మని శపించె- బకరూపులయ్యును నాయిరువురు యుద్ధంబు సేసి రంత, హరిశ్చంద్రుండు పుత్త్రులులేక నారదునుపదేశంబున వరుణోపాసనన భక్తితోఁ జేయ నా వరుణుండు ప్రత్యక్షుండయిన నతనికి మ్రొక్కి యిట్లనియె॥ గీ॥ వరుణదేవ నాకు వరదిరగుణముల|కొడుకు పుట్టె నేని కొడుకుఁ బట్టి|పశువుఁ జేసి నీవు పరిణమింపఁగ వేల్తుఁ|గొడుకు నీగదయ్య కొఱఁత లేక॥ వ॥ అనిపలికినం గుమారుండు గలిగెడు నని వరుణుండు వరంబిచ్చె నియ్యెనంత హరిశ్చంద్రునకు వరుణప్రసాదంబున రోహితుండను, కుమారుండు జన్మించె వరుణుండును, హరిశ్చంద్రకుమారును ద్దేశించి॥ సీ॥ పుట్టిటలోపలవచ్చి పుత్త్రు వేలువుమన్నఁ బుట్టి పది వెళ్లినఁగాని సొరఁగదనియెఁ|బలురాకమును వచ్చి పాలు వేలువుమన్నఁ బండ్లు లేకున్న నభావ్యుఁడనియెఁ|బండ్లు రాఁ జూచి డింభకుని వేలువుమన్నఁ బడిపండ్లు రామి నభావ్యుఁడనియెఁ|బడిపండ్లు వొడమినఁ గొడుకు వేలువుమన్నఁ బోరులకోమిగ కసొరఁగదనియెఁ|దొడరి యిట్లు కొడుకుతోడి మోహంబునఁ|బ్రొద్దుఁగడుపుచుండె భూవరుండు|దండ్రితలఁపుకొలఁదిఁ దనలోనఁ జింతించి|యింటనుండక డవికేగె వెఱచి॥ వ॥ ఇట్లు వనంబునకుం జని శరశరాసనధరుండై రోహితుండు దిరుగుచుండె నవరుణగ్రస్తుండై హరిశ్చంద్రుండు మహోదరవ్యాధిచేఁ బీడితుండుగానుండుట విని పురంబునకుం దిఱిగి రాఁగమకింపనింద్రుండు ముసలితపసియై వచ్చి యిట్లనియె॥ గీ॥ పుణ్యభూములరుగు పుణ్యతీర్థంబులఁ|గ్రుంకు పుణ్యజనులఁ గోరి చూడు|పు

ణ్యకథలువినుము భూపాలపుత్రక। మేలుగలుగునట్టి మేరగలదు॥ వ॥ అనియిట్లుమగుడించినందిరిగిచనిరోహితుండొక్క-యేఁడవ్వనంబునందిరిగిక్రమ్మఱఁజను దేరనింద్రుండువచ్చితొంటియట్లనివారించెనివ్విధంబున॥ సీ॥ ఐదేండ్లువఱలించెననురేంద్రుఁడాబాలునాఅవయేఁటవాఁడడవినుండి। యింటికివచ్చుచునెలమితోనజగర్తుమధ్యమపుత్రుసన్మాన్యచరితు। ఘనుశునశ్శేఫునిఁగొనియాగపశువుగనాహరిశ్చంద్రునకాతఁడిచ్చెఁ। బురుషమేధముసేసిభూపాలవర్యుఁడువరుణుఁడాదిగదేవతలనుదనిపి। హోతకౌశికుఁడధ్వర్యుఁడౌనరభృగుఁడు। బ్రహ్మజమదగ్నిసామంబుపాడువాఁడు। మునివసిష్ఠుండుమఖమునముదముఁబొంది। కనకరథమిచ్చెనింద్రుఁడామనుజపతికి॥ వ॥ శునశ్శేఫునిప్రభావంబువెనుకవివరించెదనంత భార్యాసహితుండయినహరిశ్చంద్రువలనంబ్రీతుండై విశ్వామిత్రుండతనికిముఖ్యజ్ఞానంబుకృపసేసిన మనంబన్నమయంబుగావునమనంబునన్నరూపియైనపృథివినెఱిఁగిపృథివినిజలంబువలననడంచిజలంబుదేజంబువలననింకించి తేజంబువాయువువలనంజేర్చివాయువునాకాశంబునంగలిపియాకసంబుదామసాహంకారంబునందులయంబుసేసి యహంకారత్రయంబుమహత్తత్వంబునణఁగించిపరతత్వంబునకులోకంబునుసృజించెద ననుతలంపైనమహత్తత్వంబునంచుల విషయాకాశంబునిర్వర్తించివిషయవివర్జితుండై మహత్తత్వంబునుబరతత్వంబుగానెఱుంగుచు నయ్యెఱుకవలన సంసారహేతువైనప్రకృతినిభస్మంబుసేసినయ్యెఱుకనునిర్వాణసుఖపారవశ్యంబునంబరిహరించిసకలబంధవిముక్తుండై హరిశ్చంద్రుండవాఙ్మానసగోచరంబయిననిజరూపంబుతో వెలుంగుచుండె నతనికుమారునకుహరితుండు, హరితునకుఁజంపనామధేయుండతండు, దనపేరజంపానగరంబునిర్మించెఁ, జంపునికిసుదేవుండు, సుదేవునికివిజయుండు, విజయునకురురు

## శ్రీ సగరచక్రవర్తికథాప్రారంభము. శ్రీ

కుండు, రురుకునకువృకుండు, వృకునకుబాహుకుండు, జనియించెనతండు॥ సీ॥ దండించిపగవారుదనభూమిఁ జేకొన్ననంగనలునుదానునడవికేఁగి। యడవిలోముసలియైయాతఁడుసచ్చిననాతనిభార్యదానునుగమింపఁ। గదియుచో నాస్త్రీకి గర్భంబుగలుగుటయౌర్వమునీశ్వరుఁడాత్మ నెఱిఁగి। వారించెనంతనవనజాక్షిసవతులునూలునిండారినఁజూడఁజాల। కర్థినన్నంబుగుడుచుచోనందుఁగలిపి। విషమువెట్టిరి పెట్టినవిడకగుడువ। గరముతోఁగూడసగరుండు ఘనుఁడుపుట్టి। వరయశస్స్ఫూర్తితోఁజక్రవర్తియయ్యె॥ శా॥ చండస్ఫూర్తినతండుదండ్రిపగకైసంగ్రామరంగంబులన్। జెండెన్ హైహయబర్బరాదులవధించెన్ దాళజంఘామలన్। ముండీభూతులుగానిరంబరులుగామూర్తుల్సభీభత్సులై। యుండంజేసెనిజారులన్సగరనామోర్వీవిభుండల్పుఁడే॥ క॥ ఖగరాజరుచులుగలయల। పగరాజులనడఁచియేలెబాహాశక్తిన్। నగరాజధీరుశూరున్। సగరున్ హతవిమతున్ భుజనులునుతింపన్॥ సీ॥ ఔర్వుండుసెప్పఁగనమరవేదాత్మకుహరినీశునచ్యుతుననంతుఁగూర్చి। వాజిమేధంబులువసుధీశ్వరుఁడుసేసెనందొక్క-మఖమునహయమువిడువ। నగభేదిగొనిపోయినాగలోకంబునఁగపిలునిచేరువఁగట్టితొలఁగె। నంతగుఱ్ఱముగానకారాజుదనపుత్రనివహంబుదిశలకువెదుకఁబంప। వారునీయేడుదీవులువరుసవెదకి। మఖతురంగంబులేకున్నమగుడిగాక। ప్రాభవంబునఁదోర్దండబలముమెఱసి। క్రొచ్చికోరాడిత్రవ్విరిక్షితలమెల్ల॥ వ॥ ఇట్లుసుమతికొడుకులునేలఁద్రవ్వి పాతాళంబునందూర్పుమట్టియున్నయుత్తరభాగంబునఁగపిలమునిపొంతనున్నతురంగంబుగని॥ చ॥ ఎఱిఁగితిమద్దిరయ్యెడవేఁటికిగుఱ్ఱపుదొంగయీతఁడే। గుఱుతుగఁబట్టిచంపుఁడటఘోరమునీంద్రుఁడువోలె నేత్రముల్। దెఱవకనున్నవాఁడిఁకనిఁదెంపుగఁబైసిగవట్టివంచుడం। చఱువదివేవురున్నిజకరాయుధముల్ఝళిపించిడాయుచోన్॥ చ॥ కపిలుఁడునేత్రముల్దెఱవఁగాఁదనుమేనులమంటపుట్టితా। రపగతధైర్యులైపడియహంకరణంబునమూఢచిత్తులై। నృపసుతులందఱున్ ధరణిసీఱయిరక్షణమందసాధులం। దపసులఁగాసివెట్టెడిమదస్ఫురితాత్ములునిల్వనేర్తురే॥ సీ॥ కొండలుకపిలునికోపానలంబునఁ బ్రుందిరిసగరకుమారులనుచు। నందురామునిశాంతుఁడానందమయమూర్తి తోడరికోపించునేమవ్వనేల। గాకజన్మించునేగగనస్థలంబుననేసాంఖ్యమతమునసిద్ధమతులు। భవసముద్రముమృత్యుపదమునులంఘింతు రాబుద్ధిఁజేయుపరాత్మభూమిఁ। దఖలబోధమందజ్ఞానకినరసిచూడ। సఖులుమిత్రులునెవ్వరుసగరసుతులు। చామతనుచేయునేరమిఁదనుపులంమ। నలకీలలువుట్టినీతైరిగాక॥ వ॥ మఱియుసగరుంకును కేశినియందుఁగన్నపుత్రుండసమంజసుండనువాఁడుసమంజసగుణంబులులేకపూర్వజన్మంబునయోగీశ్వరుండై యుండిసంగదోషంబువలనయోగభ్రష్టుండై సగరునకుజన్మించిజాతిస్మరణజ్ఞానంబుగలిగిలోకులకప్రియంబగువర్తనంబునండెఱుగుచుమెక్క-నాఁడు॥ చ॥ వరుసనయోధ్యలోనఁగలవారలనాడెడుపిన్నవాండ్రనా। సరయువులోననైచిజనసంఘముఁనంద్రియఁదిట్టుచుండవాఁ। డురుమతిఁగొన్నిప్రొద్దులకుయోగబలంబునఁజేసిబాలురం। దిరిగిపురంబులోపలికిఁదెచ్చిననివ్వెఱఁగందిరందఱున్॥ వ॥ అంతసగరుండుద

నామనుమఁ డివంశుమంతుని నశ్వంబు వెదకి తెమ్మని పంచిన నతండు దనతండ్రుల చొప్పునం జని వారలు త్రవ్విన మహాఖాతంబు సొచ్చి యందు భస్మరాసుల పొంతనున్న హయంబుం గని హయసమీపంబునందున్న కపిలాఖ్యుండైన విష్ణునికి దండప్రణామంబు సేసి యిట్లని స్తుతించె॥ సీ॥ మతి దిక్కఁ బట్టి సమాధిగౌరవమున వాసి గాంచినకు నవ్వల వెలుంగు। నిను నొక్కఁడు నాఁడైన నెఱుఁగ నేయా బ్రహ్మ యజుని మనంబున నవయవములఁ। బుట్టి జన్మించిన భూరిజంతువులఁ గను హీనుల మైన మా కెఱుఁగవశమె। తమలోన నీవుండఁ దా మెఱుంగరు నిన్ను గుణములఁ జూతురు గుణము లైనఁ। గాన నొకచోటఁ జీఁకటిఁ గందు రాత్మ। లందుఁ దెలియరు వేలుపు లరయఁ బొందు। లరయుదురు దేహధారు లత్యంధులగుచుఁ గడిఁది నీమాయ నెన్నఁడుఁ గడువలేక. వ॥ అని నుతి సేయుచు హయంబు విడువుమని చెప్పక తనతండ్రులు నీఱగుటం దడవక మ్రొక్కి నిలుచున్న యంశుమంతునికిఁ గరుణావిపులుండగుచుఁ గపిలుం డిట్లనియె॥ క॥ గుఱ్ఱముఁ గొనిపో బుద్ధుల। కుఱ్ఱఁడ మీతాత యొద్దకు నీ తండ్రు। ల్వెఱ్ఱులు నీఱైర దెయ్యా। మిఱ్ఱున గంగాజలంబు మెలఁగు శుభమగున్॥ వ॥ అని పల్కిన నమస్కరించి తురగంబుఁ గొనివచ్చి యాగ గరునికిచ్చిన సగరుండా పశువు వలన జన్నంబు కడనిండించి యంశుమంతునకు రాజ్యంబిచ్చి ముక్తబంధనుండై యౌర్వుండు సెప్పిన మార్గంబున నుత్తమగతికిం జనియె నంత॥ క॥ జనకులు గ్రగ్గిన చోటికి। ననిమిష నది దెత్తునని చనటవీస్థలికిం। జని తపము సేయఁజాలక। మనమున వగలూలయ నంశుమంతుఁడు దీఱెన్॥ క॥ ఆతనికొడుకు దిలీపుఁడు। భూతలమున గంగఁ దెచ్చి పొందించుటకై। ప్రీతిం దపంబు సేయుచు। ఖ్యాతిగఁ దేలేక కాలపరవశుఁ డయ్యెన్॥ క॥ అతని సుతుండు భగీరథుఁ। డతితపమొనరించి కనియె నమృతాపాంగన్నుతతరంగన్ముఖవనరుహ। రతభృంగన్నిజజటాగ్రరంగద్గంగన్॥ వ॥ కని నమస్కరించిన గంగ కృపఁ జేసి వరంబు వేఁడుమనిన నా రాచపట్టి యిట్లనియె॥ క॥ మావారి భస్మరాసుల। నీవాఱిం గలిపి కొనుము నేఁటి మావారల్। సేనారిఁ గలయ నాకము। మావారికిఁ గలుగు నిది ప్రమాణము తల్లీ॥ ఇంద్రవజ్రము॥ చెల్లమ్మ దిన్నన్ను భజింతు గంగన్। ఫుల్లాంతరంగన్ బహుపుణ్యసంగన్। కల్లోలలక్ష్మీజితకాశవల్లిన్। వల్లిన్ సుధీకల్పలతామతల్లిన్॥ అని వినుతులు సల్పుచున్న రాజకుమారునకు లోకపావని యిట్లనియె॥ మ॥ వినువీథిం బరతెంచి నేలఁ బడనా వేగంబు మున్నిల్పనో। పిన వాఁడెవ్వఁడు మేదినీతలము నే భేదించి పాతాళముం। జనుమన్న ద్విధినే నినాజలములన్ స్నాతులై మానవుల్। నను బొందించు నఘవ్రజంబెచట నే నాశంబుఁ బొందించెదన్॥ వ॥ అది గారణంబుగా విచారించెద నని పలుకుచున్న లోకమాతకు రాజన్యవర్యుండగు భగీరథుం డిట్లనియె॥ మ॥ పరతత్త్వజ్ఞులు శాంతచిత్తులు దపఃపారీణులార్యుల్ సనుల్పురుషశ్రేష్ఠులు వచ్చి తల్లి భవదంభోగాహము ల్సేయఁగా। నరసంఘౌఘమునిన్నుఁ బొందు నెజగన్నాథుండు నానాఘసం। హరుఁడా విష్ణుఁడు వారిచిత్తములదానై యుంట మందాకినీ॥ మ॥ తనలోనిన్నిజగంబులుం గలుగుటం దానిన్నిటం జెందుటన్। జననీతంతువులందుఁ జీరగలయాచందంబునన్ విశ్వభా। వనుఁడై యొప్పు శివుండు గాక మఱి నీవారిన్ని వారింప నేర్చిన వారెవ్వరు నీఁ ధరించుకొనుటకై శ్రీకంఠునిం గొల్చెదన్॥ వ॥ అని యొఱింగించి వీడ్కొని చని భగీరథుండు మహేశ్వరునుద్దేశించి గ్రద్దనఁ దపంబు సేసిన॥ గీ॥ భక్తవత్సలుండు ఫాలాక్షుఁడా భగీ। రథుని మెచ్చి నిజశిరంబునందు। శౌరిపాదపూతసలిలమై దివినుండి। ధరకు వచ్చు గంగఁ దాల్చెనపుడు॥ వ॥ ఇట్లమ్మహాన

## ॥ శ్రీపరమేశ్వరజటాజూటనిర్గతగంగానదీప్రవాహమహిమానువర్ణనము. ॥

దిపురారాతి జటాజూటరంధ్రంబు వలన దిగంబడి నిరర్గళప్రవాహంబై నిలకుజల్లించి నెఱసినిండి పెల్లు వెల్లువం గొని పెచ్చు పెఱఁగి విచ్చల విడిఁ గ్రేపు వెంబడినుఱక గ్రేళ్లుఱుకు మరక ప్రాయంపు కామధేనువు చందంబున నముండజెఱికి నిగుడుచు, ముద్దు చందురుతోడి నెయ్యంబునఁ గ్రయ్యన వెడలి చొప్పు దప్పక సాగి చను దెంచు సుధార్ణవంబుకై వడిం బెంపు గలిగి, మహేశ్వరు వదనగహ్వరంబు వలన నోంకారంబు పిఱుంద వెలువడు శబ్దబ్రహ్మంబు భంగిన దభ్రవిభ్రమంబున నమ్మహీపాలశిలకంబు తెరువు వెంటనంటి వచ్చు వెలియేనుఁగు తొండంబులను కరించి పఱచు వఱద మొగంబులు పిఱుంద నందంద గ్రందుకొని పొడచూపి తొలంగు బాలశారదాపుచకుంభంబులకు నగ్గలంబైన బుగ్గలును, బుగ్గల సంగడంబున పారిజాతకుసుమస్తబకంబుల చెలువంబులం దెగడు వెలినురువులును, వెలినురువుల చెంగల నర్ధోన్మీలిత కర్పూరతరుకిసలయంబులం గేలిఁ గొనుసుళ్లును, సుళ్ల కెలంకుల ధవళజలధర రేఖాకారంబుల బాగుమెచ్చని నిడుదయేఱులును, నేఱులం గలసి వాయువశంబున నెంతొంటిం దాఁకి బిట్టు మిట్టించి మీఁది కెగయు చుఱితభంగంబులైన భంగంబులును, భంగంబుల కొనల భిన్నభిన్నంబులై కప్పించియుప్పరం బెగయు ముత్తియంపు సరుల సరణి, మల్లికాదామంబుల తెఱంగునఁ గర్పూరఖండకదంబంబుల కరణి, నిందుశకలంబుల తేజంబునఁ దార కానికరంబుల పొలుపున, మెఱయుచు మౌక్తికన్యావశీకరంబులైన *శీకరంబులును గలిగి మధ్య

*శీకరంబులు। నీటితుంపురులు. మధ్యమలోక। మనుష్యలోకము.

మలోకశ్రీకరంబై, శ్రీకరంబు తెఱంగున *విష్ణుపదంబుముట్టి విష్ణుపదంబు భాతినుల్లసితహంసరుచిరంబై, సితపక్షంబురీతి నతిశోభితకువలయంబై, కువలయంబు చెన్నున బహుజీవనంబై, జీవనంబులాగున సుమనోవికాసప్రధానంబై, ప్రధానపర్వతంబుపోలుపున ననేకచక్రబకభీమమహాభంగసుభద్రార్జునచరితాభిరామంబై, రామచిత్తంబు మెలుపునం దనవారి లోఁజొచ్చిన దోషాచరాభయప్రదానచణంబై, మృత్యుంజయుపోలికె విభూతిసుకుమారంబై, కుమారచరిత్రంబు తేవను క్రౌంచప్రముఖవిజయంబై, విజయురథంబు భాతిహరిదయాసుందరంబై, సుందరవిచారంబు గ్రద్దనమహారామగిరివనప్రవేశకామంబై, కామకేతనంబు పెల్లుననుద్దీపితమకరంబై, మకరకేతను బాణంబుపైవడి నిలీనపరవాహినీకలితశంబరంబై, శంబరారాతిచిగురుగొంతంబు సూటి నద్వగవేదనాశమనంబయి, శమనదండంబుజాడని మోన్నన్నతసమవృత్తంబై, వృత్తశాస్త్రంబువిధంబున వడిఁగలిగి సదా గురులఘువాక్యచ్ఛటాపరిగణితంబయి, గణితశాస్త్రంబుకొలఁదిఁ ఘనఘనమూలవర్గసంకలితభిన్నమిత్రప్రకీర్ణఘాతభీష్మంబయి, భీష్మపర్వంబు పెంపున ననేకభగవద్గీతంబయి, గీతశాస్త్రంబు నిలుకడను మహాసుషిరతనుఘననానాశబ్దంబయి, శబ్దశాస్త్రంబును గ్యాదనచ్చువడిహల్లుగలిగి మహాభాష్యరూపావతారవృత్తివృద్ధిగుణసమృద్ధంబై, యర్థశాస్త్రంబుమహిమను బహుప్రయోజనప్రమాణదృష్టాంతరంబయి, దృష్టాంతరంబు తెఱంగున సర్వసామాన్యగుణవిశేషంబై, ఈషావ్యాపారంబు కరణి సుస్థిరోద్ధరణతత్పరంబయి, పరబ్రహ్మంబుగరిమ నతిక్రాంతానేకనిగమంబయి, నిగమంబునడువడి బ్రహ్మవర్ణసపక్రమసంగ్రహంబయి, గ్రహశాస్త్రంబుపరిపాటినిగర్కటమీనమిథునమకరసుందరంబై, సుందరీముఖంబు సోడిమి నిర్మలచంద్రకాంతంబయి, కాంతాధరంబు రుచిని శోణితచ్ఛాయావిలాసంబై, విలాసవతీకొప్పుచొప్పునఁ గృష్ణాలకాధికంబయి, యధికమతిశాస్త్రసంవాదంబు సొంపున నపారసరస్వతీవిజయవిభ్రమంబై, విభ్రమవతిచనుదోయిపగిది నిరంతరపయోవ్యాప్తాఖిలలోకజీవనప్రదతుంగభద్రాతిరేఖాసంకలితంబయి, లలితవతీనగవు మించున నపహసితచంద్రభాగధేయంబై, భాగధేయవంతుని వివాహంబు లీల మహామేఖలాకన్యకావిస్తారంబై, తారకెంగేలి మొడికంబున నతిక్రాంతసూర్యతనయంబయి, సూర్యతనయశరవర్షంబు పోలిక భీమరథ్యాటోపవారణంబయి, వారణంబు బిరుసున నంబుపూరోన్నతసంరంభంబై, రంభ నెమ్మోముడాలున సురతనాతిశయదశంబై, దశరథతనయుబానుముడిచాడ్పున సింధుగర్వప్రభంజనంబై, ప్రభంజనతనయుగదపెట్టుమాడ్కి నిసమీపగతదుశ్శాసనదుర్మదనివారకంబై, వారకన్యకముంజేతిగతిని ముహుర్ముహురుచ్చలితకంకణాలంకృతంబయి, కృతయుగంబునోజ నపంకంబై, పంకజాసనముఖంబునెఱపున ప్రభూతముఖ్యవర్ణంబై, వర్ణగుణితంబు తెరకువను బహుదీర్ఘబిందువిసర్గంబై, సర్గబంధకావ్యంబు విన్ననువున గంభీరభావమధురంబై, మధురాపురంబు సొబగున మహానందంబై, నందనవనంబు పొందువున విహారమాణకౌశికంబై, కౌశికహయంబు రీతినుదరధ్రువంబై, ధ్రువుతలంపుక్రియను పరికీలితవిశ్వంభరంబై, విశ్వంభరుని శంఖంబు రూపున దక్షిణావర్తోత్తరంబై, యుత్తరావివాహంబు చందంబునం బ్రముదితనలవరంబై, నరసింహనఖరంబుల భాతి నాశ్రితప్రహ్లాదగురువిభవప్రధానంబై, దానకాండంబు సిరిం గామధేనుకల్పలతాద్యభినవంబయి, నవసూతికాకుచంబు పేర్మి నిరంతరపయోవర్ధనంబై, ఘనమునిలయంబు తూనిక సంగతమకరమహాపద్మకచ్ఛపంబై, కచ్ఛపకర్పరంబు బలిమి నిపతితశైలసముద్ధరణంబై, ధరణీధరంబు సాటినుత్తుంగతటముఖ్యంబయి, ముఖ్యవరాహంబు గరిమ నున్నతక్షమంబై, క్షమాసురహస్తంబు గఱగఱికెను సత్పవిత్రమనోరామంబై, రామచంద్రు బాణంబు కడిందిన ఖ్యాగతఖరదూషణమదాపహరముఖరంబయి, ముఖరరామకుతారంబురీతి నిభూభృన్మూలభేదనప్రబలంబయి, బలరామహలంబు భాతినిం బ్రతికూలసన్నికర్షణప్రవర్ధంబయి, బుద్ధదేవుని మేనిమెఱుపున నభియాతివటూదారమనోహరంబయి, హరతాండవంబు మేలునుల్లసితానిమిషంబై, యనిమిషావతారంబు కీర్తిని శ్రుతిమంగళప్రదంబయి, ప్రదాతయాగిసూటి నర్థపరంపరావామనంబై, వామనచరణరేఖను బలివంశవ్యపనయంబై; నయశాస్త్రంబుమార్గంబున సామభేదమాయోపాయచతురంబై, చతురాననాండంబు భావంబుననపరిమితభువనజంతుజాలసేవ్యమానంబై, మానినియన లోఁతుమాపక గరితయన నలిచప్పుడు సేయక ముగుదయన బయలుపడక ప్రమదయనఁ గ్రొయ్యాంబుఁ బాఱుచుఁ బతివ్రతయన నిట్టట్టుసనక తల్లియన నెవ్వియైన లోఁగొనుచు దైవంబనభక్త

*విష్ణుపదము|ఆకాశము-విష్ణుదేవుని పాదము. భాతి|వలె. హంస|అంచ-సూర్యుఁడు. సితపక్షము|శుక్లపక్షము. కువలయము| భూమండలము. జీవనము|జలము-బ్రతుకు. సుమనః|దేవత|పుష్పము. తనవారిలోన|స్వజనములలో-తనజలములలో. దోషాచర|రాక్షసులు-పాపాత్ములు. చణంబై|నేర్పుగలదై. శంబరంబై|బురదగలదై-శంబరాసురుఁడుగలదియయి. శంబరారాతి|మన్మథుఁడు. గొంతము|బాణము. కంకణ|జలబిందువు-కడియము, అనిమిష|దేవత|మత్స్యము, మానిని|ప్రణయకోపముగలది, గరిత|గంభీరముగలది. ముగుద|ముగ్ధ-మాధురాలు. ప్రమద|మిక్కిలిమదముగలది.

మనోరథం బెవ్వరికిం గడచియ వాఙ్మానసగోచరంబయి ప్రవహించె॥ మ॥ జగతీనాథురథంబు వెంట బహుదేశంబుల్ వడిం దాటి సగరాత్మజకుమారభస్మములమీఁదన్ ముంచి పాఱన్ మరున్నగరావాసము వారు పొందిరి నవీనశ్రీలతోఁ గంగకున్। సుగతిం గాంగ మహాప్రవాహోదంతసుజన ద్రోహానలం బాఱునే॥ వ॥ హరు మెప్పించి మహాతపోనియతుఁడై యాకాశగంగా నదిన్ ధరకుం దెచ్చి నితాంతకీర్తిలతికాస్తంభంబు గా నవ్వసు। స్థిరలీలం బితృకృత్యమంతయు నొనర్చెన్ వారితానేకదుస్తరవంశవ్యథుఁడా భగీరథుఁడు నిత్యశ్రీకరుండల్పుఁడే॥ క॥ హరిఁ దన మనమున లోనిడి। హరిపాదాంభోజజనిత మైన నదిన్ సుస్థిరులై శ్రుతకీర్తిమునీంద్రులు। హరిఁ గలసిరి త్రిగుణరహితులై యవ్వేళన్॥ వ॥ అంత నా భగీరథునకు శ్రుతుండును, శ్రుతునకు నాభాఖ్యుండును, నాభావునకు సింధుద్వీపుండు, సింధుద్వీపునకు నయుతాయువు, నయుతాయువునకు ఋతుపర్ణుండును, జనియించె నంతం॥ గీ॥ నయవిశాలబుద్ధి నలచక్రవర్తితోఁ। జెంగిడీని తనము చాలఁ జేసి। యక్షహృదయ మనఁగ నిక వ్యస్తము గని చి। యశ్వవిద్య నేర్చె నతని వలన॥ వ॥ ఆ ఋతుపర్ణునకు సర్వకాముండును, సర్వకామునకు మదయంతీవల్లభుండైన సుదాసుండు పుట్టె, నా రాజశేఖరుని మిత్రసహుండనియుఁ, గల్మాషపాదుండనియు నని చెప్పుదురా భూవరుండు వసిష్ఠుని శాపంబున రాక్షసుండై తనకర్మంబున ననపత్యుండయ్యె ననిన విని పరీక్షిన్నరేంద్రుం డేమి కారణంబున సుదాసునకు గురుశాపంబు ప్రాప్తం బయ్యె నానతిమ్మని యడిగిన శుకుండిట్లనియె॥ సీ॥ ఆ సుదాసుఁడు వేఁటకై వనంబున కేగి గర్వించి యొక రక్కసునిఁ జంపి। వానితోఁ బుట్టిన వానిఁ బోవిడిచిన వాఁడును వగతోఁటి వానిన్ స్మరించి। పతితుఃఖితుండునై యా రాజగృహమున సూదభావంబున సొంపునొంది। యొకనాఁడు వసిష్ఠునకు ఋషులకుఁ దొరకొనాఁడ నన్నంబు సేయంగ నతనిఁ బనుప। వాఁడు మానవమాంసంబు వండి తెచ్చి। మునికిడ న్డిపఁ గోపించి ముని నరేంద్రుఁ। బిల్చి మానవమాంసంబుఁ బెట్టితనుచు। పలుకతోఁ రాక్షసుఁడవు గమ్మని శపించె॥ వ॥ ఇట్లు రాక్షసుండు వండి తెచ్చుటయు సుదాసుండెఱుఁగమిఁ దన మానంబున నెఱిఁగి వసిష్ఠుండు పండ్రెండేండ్లు రక్కసుండవై యుండుమని శపియించె నయ్యవసరంబున॥ క॥ గురువున్నామ్ము శపింతునంచు జలముల్ గోపంబుతో దోయిటన్ నరనాథుం డుధరింపఁ దత్సతి నివారించి మిమ్ముం దిశల్ ధరయుం జీవమయంబు గా నిఖిలముం దాఁ జూచి చల్లెన్ ధరా। వరుఁడాత్మీయ పదంబులం గరపుటీ వారిపూరము న్వేగమైన్॥ వ॥ ఇట్లు మిత్రసహుండు గావునఁ గళత్రానుకూలుండయి శపియింపనొల్లక సుదాసుండు రాక్షసభావంబు నొంది *కల్మాషవర్ణంబులయిన పాదంబులతో నడవులందిరుగుచు॥ క॥ ఆఁకటఁ దటఁ దటమాఁడుచు। వీఁక నతఁ డడవిని నున్న విప్రమిథునమున్। దాఁకి తటాలున విప్రుని। తూఁకటి చేపట్టి మ్రింగఁగా నిపోపు తర్జిన్॥ వ॥ అంత నా బ్రాహ్మణుని భార్య మోఁదికొనుచుం బెగ్గడిల్లి డగ్గుత్తికతోఁ బతికి డ్డంబు వచ్చి యేడ్చుచు రాచరక్కసునకిట్లనియె॥ క॥ మానుషదేహము గలుగుట। భూనాయక దుర్లభంబు పుట్టినమీఁదన్। దానము పరోపకారము। భూనుతకీర్తియును వలదె పురుషున కెందున్॥ మ॥ రవివంశాగ్రణివై సమస్తధరణీరాజ్యానుసంధాయివై। భువనస్తుత్యుఁడవై పరార్థరతివై పుణ్యానుకూలుండవై। వివరం బేమియు లేక నా పెనిమిటిన్ విప్రుం దపశ్శీలునిన్। న్శివరున్ బ్రహ్మవిదగ్రగణ్యుని న్భక్షింపఁగాఁ బాడియే॥ శా॥ తండ్రీ నీవును నేను వంశజులకున్ గావంబనా బ్రాహ్మణుం। డంద్రా మాటలు లేవె భూమిసురగోహత్యాభిలాషంబుకై। క్రౌర్యే మీ యటువంటి సాధువులు రక్షోభావముం జెల్లునే। తండ్రీ దాతలఁ బూర్వులం దలఁప వేధర్మంబునం బోఁగదే॥ శా॥ అన్నా చెల్లెల నయ్యె నన్ని దుపు నీకన్నంబు వెట్టింతు నా। ప్రాణనాథుని ద్విజుఁ గంగికి స్త్రీ నకటా హింసింప నేలయ్య నీ। వెన్నం డింతుల తోడఁ బుట్ట వె సజం బిట్టయిన మున్నుట్టనా। పన్నన్నన్ను శిరంబుఁ ద్రుంచి మహిజేశ త్వ్రిణేశు భక్షింపవే॥ క॥ అనికరుణపుట్ట నాపుచు। వనితా వాణిపలు వరింప వసుధాదేవుఁ। డనిమొన తఁడు పులిపసువుం। దిను క్రియ శాపంబుకె తనధీరహితుండై॥ వ॥ అంత నా బ్రాహ్మణి కోపించి కామార్తనైన నాదు పెనిమిటిన్ భక్షించితి వీగావున నీవు నెలఁతలం బొందఁ జేసిన వేళ మరణంబుఁ బొందుమని కల్మాషపాదుని శపించి పతిశల్యంబులతో నగ్నిప్రవేశంబు సేసి సుగతికిం జనియె నంతఁ బండ్రెండేండ్లు సనిన నా రాజు మునిశాపనిర్ముక్తుండై॥ గీ॥ రతులకొఱకు భార్య రావింపనదియును। బెదరి విప్రసతి శపించు టెఱిఁగి। మగని డగ్గఱిల్లి మైథునకర్మంబు। మాన్పె సతులగోష్ఠి మానె నతఁడు॥ క॥ అది కారణమునఁ బుత్రాభ్యుదయము లేదా సుదాస భూపాలునకుం। దనుమతిన వసిష్ఠుఁడు। మదయంతికిఁ గడుపుఁ జేసె మదనక్రీడన్॥ వ॥ ఇట్లు సుదాసుని భార్యయగు మదయంతి వసిష్ఠువలన గర్భిణియై యేడేండ్లు గర్భంబు ధరించి నీళ్లాడ సంకటపడుచున్న వసిష్ఠుండు వాఁడి యగు నశ్మమున నా గర్భంబుఁ జీఱి వనశ్మకుండను కుమారుండు పుట్టె నతనికి నారీకవచుండు పుట్టె నా సమయంబున॥ క॥ భీకరుఁడగు పరశురాముఁడు ఘోరకుఠారమున నృపులఁ గూలుచు వేళన్। నారీజనములు దాఁచిన। నారీకవచుండనం గనరనుతికెక్కెన్॥ వ॥ ఆ నారీకవచుండు నిర్మూలంబైన రవివంశంబునకు మూలంబగుటం జేసి మూలకుండయ్యె మూలకునకు విశ్వసహుండును విశ్వ

* కల్మాషవర్ణంబు। చిత్రవర్ణము. శిల అశ్మము। రాయి.

సహునకు ఖట్వాంగుండు పుట్టి చక్రవర్తియయ్యె నతండు॥ సీ॥ అమరులు వేడిన నసురనాథులఁ జంపి త్రిదశులతోఁ దన తెగడు కాల మెంతని యడిగిన నిదె నిండుచున్న దితఁడవు లేదే మైన నడుగుమనిన వరములు గోరక వరవిమానం బెక్కి తనపురికే తెంచి తత్పబుద్ధిఁ బరమేశ్వరుని యందభావంబుఁ గీలించి కులదైవతద్విజకులముకంటె నంగనాప్రాణరాజపుత్రాదులెల్లఁ గావు ప్రియములు ధర్మంబు గడచి నాదు మతి ప్రవర్తింప దెన్నఁడు మది నెఱుంగ నన్యమాయీశ్వరునిఁ దక్క ననుచు మఱియు॥ మ॥ ఇలమీఁదన్ బ్రతుకేల వేల్పులవరం బేలా ధనం బేల చంచలగంధర్వపురీవిడంబనము లైశ్వర్యంబు లేలా జగంబులఁ బుట్టించు తలంపునం బ్రకృతితోఁ బొత్తై తుదిం బాసి నిర్మలమై వాఙ్మనసామితంబగు పరబ్రహ్మంబు నేఁ జెందెదన్ ॥ అని నిశ్చయించి॥ మ॥ కలసె న్సంగము లెల్లఁ బాసి నియతి న్ఖట్వాంగుఁ డశ్రాంతమై కలిగెం దన్మతి పైన లేద నెడిదై కల్యాణమై సన్నుతిం దలఁపం బక్కఁగ రాని దై పరమమై తత్త్వజ్ఞు లూహించి హృజ్జలజాతంబుల వాసుదేవుఁడని సంస్థాపించు నాబ్రహ్మమున్॥

## శ్రీరామచరిత్రము.

వ॥ అట్టి ఖట్వాంగునకు దీర్ఘబాహుండు, దీర్ఘబాహునకు రఘువు, రఘువునకుఁ బృథుశ్రవుండుఁ, బృథుశ్రవునకు నజుండు, నజునకు దశరథుండు, దశరథునకు సురప్రార్థితుండై పరబ్రహ్మమయుండయిన హరి నాల్గువిధంబులై శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్న నామంబుల నిజాంశసంభూతుండై జన్మించె, దచ్చరితంబు వాల్మీకిప్రముఖులైన మునులచేత వర్ణితంబై నది యైనం జెప్పెద సావధానమనస్కుండవై యాకర్ణింపుము॥ మ॥ *అమరేంద్రాశకుఁ బూర్ణచంద్రుఁ డుదితుండైనట్టు నారాయణాంశమునం బుట్టెను దాంత రావణశిరస్సంఘాతసంఛేదనక్రమణోద్దాముఁడు రాముఁ డాగరితకుం గౌసల్యకున్ సన్నుతా । సమనైర్మల్యకతుల్యశ్రీకంచితజనుస్సంసారసాఫల్యకున్ ॥ మ ॥ సవరక్షార్థము దండ్రి వంపఁ జని విశ్వామిత్రుఁడుం దోడరా నవలీలం దనుమాడె రాముఁ డదయుండై బాలుఁడై కుంతలచ్ఛవిసంపజ్జితహాటకన్ గపటభాషావిస్ఫురన్నాటకన్ జవభిన్నార్యమఘోటకన్ గరవిరాజత్ఖేటకన్ దాటకన్॥ క॥ శ్రీగారామునఁ గౌశికముఖ మా రాముఁడు గాచి దైత్యు నధికు సుబాహున్ ఘోరాజిఁ ద్రుంచి తోలెను మారీచున్నీచుఁ గపటమంజులరోచున్॥ మ॥ ఒకమున్నాఁ గదల్చి తెచ్చిన లలాటోగ్రాక్షుచాపంబు బాలకరీంద్రంబు సలీలమైఁ జెఱుకుఁ గోలం ద్రుంచు చందంబునన్ సకలోర్వీశులు సూడఁగా విఱిచె దోశ్శక్తిన్ ※విదేహక్షమాపక గేహంబున సీతకై గుణమణిప్రస్ఫీతకై లీలతోన్॥ క॥ భూతలనాథుఁడు రాముఁడు ప్రీతుండై పెండ్లియాడెఁ †బృథుగుణమణిసంఘాతన్ భాగ్యోపేతన్ సీతన్ ముఖకాంతివిజితశితఖద్యోతన్॥ క॥ రాముఁడు నిజబాహుబల ※శ్లాఘనమున భంగపఱిచె దీర్ఘకుఠారోద్దాము న్నిర్దళీకృతనృపభామున్ రణరంగభీము భార్గవరామున్॥ క॥ దశరథుఁడు మున్ను కైకకు వశుఁడై తా నిచ్చినట్టి వరముకతన వాగ్దశ చెడక యడవికని చెను దశముఖముఖకమల ※తుహినధామున్ రామున్॥ క॥ జనకుఁడు పనిచిన మేలని జనకజయును లక్ష్మణుండు సంసేవింపన్ జనపతి రాముఁడు వెడలెను జనపాలారాధ్య ※ద్విషదసాధ్యన యోధ్యన్॥ క॥ భరతు న్నిజపదసేవానిరతున్ రాజ్యమున నునిచి నృపమణి యెక్కెన్ సురుచిరరుచిపరిభావిత గురుగోత్రాచలముఁ జిత్రకూటాచలమున్॥ ఉ॥ పుణ్యుఁడు రామచంద్రుఁ డటఁ బోయి ముదంబునఁ గాంచె దండకారణ్యము ※తాపసోత్తమశరణ్యము నుద్ధతబర్హిబర్హలావణ్యము గౌతమీవిమలవాఃకణపర్యటనప్రభూతసాద్గుణ్యము నుల్లసత్తరునికుంజవరేణ్యము నగ్రగణ్యమున్॥ సీ ॥ ఆవనంబున రాముఁ డనుజసమేతుఁడై సతితోడ నొకపర్ణశాల నుండ రావణు చెల్లెలు రతిఁ గోరి వచ్చిన ※ముగి లక్ష్మణుఁడు దాని ముక్కు గోయ నది విని ఖరదూషణాదులు పదునాల్గువేవు

---

*అమరేంద్రాశకున్ । తూర్పుదిక్కునకు, ※అంచితజనుస్సంసారసాఫల్యకున్ ॥ అంచిత । పూజ్యమైన, జనుః । పుట్టుకయొక్కయు, సంసార । కుటుంబముయొక్కయు, సాఫల్యకున్ । సఫలత్వముగల. సవ । యజ్ఞము. కుంతలచ్ఛవిసంపజ్జితహాటకన్ ॥ కుంతలచ్ఛవి । వెండ్రుకలకాంతియొక్క, సంపజ్జిత । కలిమిచేత జయింపఁబడిన, హాటకన్ । స్వర్ణముగలదియును, కపటభాషావిస్ఫురన్నాటకన్ ॥ కపటభాషా । మోసపుమాటలచేత, విస్ఫురత్ । ప్రకాశించుచున్న, నాటకన్ । చర్యలుగల, జవభిన్నార్యమఘోటకన్ ॥ జవ । వేగముచేత, భిన్న । తిరస్కరింపఁబడిన, ఆర్యమ । సూర్యునియొక్క, ఘోటకన్ । అశ్వముగలదియును, కరవిరాజత్ఖేటకన్ ॥ కరవిరాజత్ । హస్తమునందు ప్రకాశించుచున్న, ఖేటకన్ । కేడెముగలదియును, అనఁగా డాలుగలది. శ్రీగారామునన్ । ప్రీతితో, కపటమంజులరోచున్ । కపటముచేత మనోహరమయిన ప్రకాశముగలవాఁడు. ※విదేహక్షమాపక । జనకరాజు. †పృథు । అనేకములయిన, విజితశితఖద్యోతన్ । జయింపఁబడిన చంద్రుఁడుగల ※శ్లాఘనంబునన్ । సామర్థ్యముచేత, ఉద్దామున్ । మీఱుచున్న. ※తుహినధామున్ । చంద్రుఁడైన. ※ద్విషదసాధ్యన్ । శత్రువులకు సాధ్యము గాని. ※తాపసోత్తమశరణ్యమున్ । ఋషిశ్రేష్ఠులకు నునికిపట్టయినట్టి, ఉద్ధతబర్హిబర్హలావణ్యమున్ ॥ ఉద్ధత । మదించిన, బర్హి । నెమళ్లయొక్క, బర్హ । పింఛములచేత, లావణ్యమున్ । ఒప్పుచున్నదియును, గౌతమీ-సాద్గుణ్యమున్ ॥ గౌతమీ । గోదావరియొక్క, విమలవాఃకణ । నిర్మలములగు నుదకబిందువులయొక్క, పర్యటన । సంచారములచేత, ప్రభూత । పుట్టిన, సాద్గుణ్యమున్ । సద్గుణసంపత్తిగలది. ఉల్లసత్తరునికుంజవరేణ్యమున్ ॥ ఉల్లసత్ । తేజరిల్లుచున్న, తరు । వృక్షములచేత, నికుంజ । పొదరిండ్లచేత. వరేణ్యమున్ । శ్రేష్ఠమైనదియును, అగ్రగణ్యమున్ ॥ అగ్ర । ముందరను, గణ్యమున్ । ఎంచఁదగినదియును.

※ముగిన్ । ఒక్కసారిగానే.

రునా రామవిభుఁడు *కలనఁ బాణానలంబున భస్మంబు గావింప జనకనందన మేనిచక్కఁదనము విని దశ గ్రీవుఁ డంగజవివశుఁ
డగుచు నర్థిఁ బంచినఁ బసిఁడిజింకయై నటించు నీచమారీచు రాముఁడు నెఱి వధించె. నంతలో సీతఁ గొనిపోయె నసురవిభుఁడు॥
ఉ॥ ఆయసురేశ్వరుం డవ్వడి నంబరవీథి ‡ఇలాతనూజ న న్యాయము సేసి నిష్ఠురుఁడై కొనిపోవఁగ నడ్డమైన ఘో రాయ
త హేతిఁ ద్రుంచె నసహాయత రామనరేంద్ర కార్యసత్త్రాయువుఁ బక్షవేగపరిహాసిత వాయువు నజ్జటాయువున్॥ వ॥ అంత
నా రామచంద్రుండు లక్ష్మణసహితుండై సీత వెనుక నరుదెంచి నిజకార్యసహితుండైన జటాయువునకుం బరలోకక్రియ
లు గావించి ఋశ్యమూకంబునకుం జని॥ క॥ నిగ్రహము నీకు వలదీ కానగ్రజు వాలిన్ వధింతు నని నియమముతో నగ్రేసరుఁ
గా నేలెను సుగ్రీవున్ ◊చరణఘాతచూర్ణ గ్రావున్॥ క॥ లీల న్రామవిభుం డొక కోలం దూలంగ నేసె ◊గురునయశాలిన్
శీలిన్ సేవితశూలిన్ మాలిన్ వాలిన్ దశాస్యమానోన్మాలిన్॥ క॥ ఇలమీఁద సీత వెదకఁగ నలఘుఁడు రాఘవుఁడు వనిచె హ
నుమంతున్ †అతిచ్ఛలవంతున్ మతిమంతున్ బలవంతున్ శౌర్యవంతుఁ బ్రాభవవంతున్॥ క॥ ◊అలవాయిఁ గొనక మారుతి
లలితామితలాఘవమున లంఘించెను శై వలినీగణసంబంధిన్ జలపూరితధరణిగగనసంధిన్ గంధిన్॥ వ॥ ఇట్లు సముద్రంబు
దాఁటి సీతం గని హనుమంతుండు తిరిగి చనుదెంచు చనత్తు సమారాముల వధియించి॥ క॥ సముద్రగ్రత ననిలసుతుఁ ¶డమరా
హితదత్తవాలహస్తాగ్న్యులబ్ధ స్మము సేసె నిరాతంకన్ సదాసురసుభటవిగతాశంకన్ లంకన్॥ వ॥ ఇట్లు లంకాదహనం
బు సేసి వచ్చి వాయుజుండు సీతాకథనంబు సెప్పిన విని రామచంద్రుండు వనచరనాథయూథంబులుం దానును జనిచని॥ శా॥
ఆ రాజేంద్రుఁడు గాంచె ◊భూరివిధరత్నాగారము న్మీనకుం భీరగ్రాహకఠోరముం బవిపులగంభీరంబు నభ్రభ్రమ ద్ఘో
రాన్యోన్యహతిభిన్నభంగభవనిర్ఘోషచ్ఛటాంభఃకణ ప్రారుద్ధాంబరపారము న్లవణపారావారము న్దూరుపన్॥ వ॥ కని తనకుఁ
ద్రోవ యిమ్మని వేఁడిన నదియు మార్గంబు సూపకమిన్నందిన నారాచపఙ్క్తి రేఁగించిన కోపంబున॥ క॥ మెల్లనిన గవులనయనము
లల్లార్చి శరంబు విల్లునందిన మాత్ర న్గుల్లలు నాఁచులు చిప్పలుఁ బెల్లలునై జలధి పెద్దబీటై యుండెన్॥ వ॥ ఇట్లు విపన్నుండగు
సముద్రుండు నదులతో మూర్తిమంతుండై చనుదెంచి రామచంద్రుని చరణంబులు శరణంబుగఁ జేసి యిట్లని స్తుతియించె॥
శా॥ ఓ కాకుత్స్థకులేశ యోగుణనిధీ యో దీనమందార నే నీ కోపంబున కెంతవాఁడ జడుఁడన్ నీ వేమి ◊భూపుంగవే లో
కాధీశుఁడ వాదినాయకుఁడ వీ లోకంబు లెల్లప్పుడున్ నీ కుక్షిన్ బ్రభవించు నుండు నడఁగు న్నిక్కంబు సర్వాత్మకా॥ క॥ ◊ధా
తలరజమున దేవ। ప్రాణము సత్త్వమున భూతరాశి దమమునన్। జాతులుగా నెనరించుచు। ఆతీతుఁడ వీవు గుణగణాలం
కారా॥ క॥ కట్టుము సేతువు లంకం। జుట్టుము నీ బాణశిఖల సురవైరితలల్। గొట్టుము నేలంబడఁ జే। పట్టుము నీ యబల
నధికభాగ్యప్రబలన్॥ గీ॥ హరికి మామనగు మనటమీఁద శ్రీదేవి తండ్రి నార కేలఁ ◊తాగడింపఁ। గట్టఁ గట్టి దాఁటు కమలాప్త
కులనాథ నీ యశోలతలకు నెలవుగాఁగ॥ అని విన్నవించిన రామచంద్రుండు సముద్రుని పూర్వప్రకారంబున నుండు పొమ్మ
ని వీడుకొల్పె నంత॥ క॥ ఘనశైలంబులు దరువులు ఘనజవమునఁ బెఱికి తెచ్చి కపికులనాథుల్ ఘనజలరాశిం గట్టిరి ◊ఘనవా
హప్రముఖదివిజగణము నుతింపన్॥ వ॥ ఇట్లు సముద్రంబు దాఁటి రామచంద్రుండు రావణుతమ్ముండైన విభీషణుండు శరణం
బు వేఁడిన నభయం బిచ్చి కూఁకుకొని లంకకుం జని విడిసి ¶వెడవెట్టించి లగ్గలు పట్టించిన॥ సీ॥ ప్రాకారములఁ ద్రవ్వి పరిఘలనిం
డించి కోటకొమ్మల నేలఁగూలఁ ద్రోచి వప్రంబులఁ గలించి వాకిండ్లఁ బెకలించి తలుపుల విఱిచి యంత్రములఁ ద్రుంచి సునవిటం

---

*కలనన్ = యుద్ధమందు. గ్రీవము = కంఠము. ‡ఇలాతనూజన్ = భూపుత్రియైన సీతను. హేతి = ఆయుధము. ◊చరణఘాతచూర్ణగ్రా వున్ = పాదతాడనములచేఁ బొడిగాఁ జేయఁబడిన పర్వతములుగల. ◊గురునయశాలిన్ = అతివినయసంపదచేత నొప్పుచున్న. శీలిన్ = సత్స్వభావము గల. సేవితశూలిన్ = సేవింపఁబడిన శివుఁడు గల. మాలిన్ = కనకపద్మమాలిక గల. దశాస్యమానోన్మాలిన్ = రావణుని గర్వమును నడఁగించిన. †అతిచ్ఛ లవంతున్ = మహామాయావియైన. ప్రాభవవంతున్ = ప్రభావముగల. ◊అలవాయిఁగొనక = అలసటనొందక. మారుతి = ఆంజనేయుఁడు. శైవలినీ గణసంబంధిన్ = నదీసమూహమునకు బంధువైన. గంధిన్ = సముద్రమును. ¶అమరాహితదత్తవాలహస్తాగ్నులన్ = అమరాహిత = రాక్షసులచేత, దత్త = అర్పింపఁబడిన, వాలహస్త = తోఁకయందలి, అగ్నులన్ = చిచ్చులచేతను, నిరాతంకన్ = అడ్డులేనిది. ◊భూరివిధరత్నాగారమున్ = అనేకవిధ ములైన మణులకు స్థానమైన. మీనకుంభీరగ్రాహకఠోరమున్ = మీన = మత్స్యములచేత, కుంభీర = పెనుగు = భక్షించెడు జలజంతువులచేత, గ్రా హా = తిఁగవలె శరీరముఁ జుట్టుకొని హింసించు మత్స్యములచేత, కఠోరమున్ = కఠినమైనది. అనఁగాఁ బొందనశక్యముగానిది. విపులగంభీరంబున్ = మిగుల లోఁతుగలది. అభ్రపారమున్ = అభ్రభ్రమత్ = ఆకాశమందు తిరుగులాడుచున్న. ఘోర = భయంకరములైన. అన్యోన్య = పరస్పరము, ని భిన్న = బద్ధిపడిగల. భంగ = అలలవలన. భవ = పుట్టిన, ర్ఘోష = ధ్వనులయొక్క. ఛట = సమూహముగల, అంభఃకణ = జలబిందువులచేత. ప్రారుద్ధ = అడ్డగిం పఁబడిన అంబర = ఆకాశముయొక్క. పారమున్ = గట్టుగలది. అనఁగాఁ బదేశముగలది. పారావారము = సముద్రము. ◊భూపుండవే = రాజమా త్రుఁడవా. ◊ధాతలన్ = బ్రహ్మలను. రజము = రజోగుణము ◊తాగడింపన్ = ఆలస్యము చేయుట ◊ఘనవాహ = సముద్రవిజగణము = మేఘవా హనుఁడగు నింద్రుఁడు మొదలగు దేవతాసమూహము. ¶వెడవెట్టించి = ఏర్పాటుచేసి, లగ్గలు పట్టించిన = కోటసెకిపాకింపఁగాను. పరిఘలు = అ గడ్తలు. కోటకొమ్మలు = కోటబురుజులు. వప్రము = పుట్టకోట. యంత్రములు = కీలుబొమ్మలు మొదలైనవి. విటంకములు = కపోతపాలికలు.

ళంబుల ఖండించి గోపురంబుల విప్పి *వలభుల పొంచు జెఱిచి నానా కరతోరణముల వాపి హేమగూళ్లిక కేతనంబులం జించి సోపానము లం గదల్చి గృహము లెల్ల వ్రచ్చి గృహరాజములం గ్రొచ్చి భర్మకుంభచయము పాలైచి కిగులుకోలను జొచ్చి కలంచిన కై వడి గపులు లంకం జొచ్చి కలంచిరపుడు. వ. అంతనయ్యసురేంద్రుం డు పంచినం గుంభ నికుంభ ధూమ్రాక్ష విరూపాక్ష సు రాంతక నరాంతక దుర్ముఖ ప్రహస్త మహాకాయ ప్రముఖులగు దనుజవీరులు శరశరాసన తోమర గదా ఖడ్గ శూల భిండివాల పరశు పట్టిస ప్రాసముసలాది సాధనంబులు ధరియించి మాతంగ తురంగ స్యందన సందోహంబుతో బవరంబు సేయ సుగ్రీవప వనతనయ పనస గజ గవయ గంధమాదన నీలాంగదకుముద జాంబవదాదు లారక్కసులు నెక్కటికయ్యంబులం దదరులగి రులకరాఘాతంబుల నుక్కడంచి రంత. క. ఆయెడ లక్ష్మణుఁ డుజ్జ్వల సాయకములఁ ద్రుంచెఁ గైలసత్కాయు సురా జేయు నరగ్గళి నా యో పాయున్ నయగుణపధేయు నయ్యతికాయున్. గీ. రామచంద్రవిభుఁడు రణమున ఖండించె నేటికడిమి నీలమేఘవర్ణు బాహుశక్తి పూర్ణుఁ బటుసింహనాదసంకుచితదిగిభకర్ణుఁ గుంభకర్ణు. క. *అలవున లక్ష్మణుఁ డాజి స్థలిఁ గూల్చె న్మేఘనాదుఁ జటులాస్త్రోదగ్రు బలభేదిజయపినోదగ్రు బలజనితసుపర్వసుభటభావవిషాదగ్రు. అంత. క. తన వారం దలఁ ద్రుంగినఁ గని మిషపతి నై రిపుప్పకారూఢుం డై యని కేగి నడచి రాఘవునితో ఘనరౌద్రముతోడఁ జౌంపకయ్యము సేసెన్. అయ్యవసరంబున. క. సురపతి పంపున మాతలి గురుతరమగు దివ్యరథముఁ గొనివచ్చిన నా ధరణీవల్లభుఁ డెక్కెను ఖరకరుఁ డుదయాద్రి నెక్కు కైవడిఁ దోఁపన్. ఇట్లు దివ్యరథారూఢుం డై రామచంద్రుండు రావణునికిట్లనియె. చ. చపలత్వంబున డాఁగి హేమమృగమున్ సంప్రీతిఁ బుత్తెంచి కాపట బ్రాహ్మణమూర్తివై యబలనాకాంతారమధ్యంబునన్ ‖‖ వపలాపించుట యోమదీయ శితదివ్యామోఘబాణాగ్నిసంతపనంబే గతి నోర్చువాఁడవు మరంతం బెంగయు న్రావణా. క. నీ చేసిన పాపములకు నీ చాత్మక యముఁడు వలదు నేఁ డిట నా నా రాచములఁ ద్రుంచి పై చెద ఖేచరభూచరులుగూడఁ గ్రీడ సూడన్. అని పలికి. మ. బలుపింబ ౘగుణ బంకృతంబు నిగుడన్ బ్రహ్మాండభీమంబుగా జ్వలదుగ్రానలసన్నిభంబగు మహాబాణంబు సంధించి రాఘులలాముండగు రాముఁడే సె ¶ఖరభాషాశ్రావణుం దేవతా బలవిద్రావణు వైరిదారజనగర్భస్రావణున్ రావణున్. క. దశరథసూనుం డేసిన విశిఖము హృదయంబు దూఱ వివశుండగుచున్ దశకంధరుండు గూలెను దశవదనంబు లనురక్తధారలు దొరుగన్. అంత నా రావణుండు దెసుట విని. సీ. కొప్పులు బిగిపీడి కుసుమమాలికలతో †నంసభాగంబుల నావరింప సేసముత్యంబులు చెదరఁ గర్ణికలూడఁ గంఠహారంబులు గ్రంచుకొనఁగ వదనపంకజములు వాడి వాతెఱ లెండగఁ గన్నీళ్ల వలిపలంగములు దడుప సన్నపు నడుములు జవ్వాడఁ జాలిఁ బ్లబరువులు నడుములఁ బ్రబ్బికొనఁగ నెత్తి మోదికొనుచు నెఱిఁ బయ్యెదలు జార నట్టునిట్టుఁ దప్పటడుగులిడుచు నసురసతులు వచ్చి రటభూతభేతాళసదనమునకు ఘోరకదనమునకు. వ. ఇట్లు వచ్చి తమతమ నాథులం గని శోకించి రందు మండోదరి రావణుం జూచి యిట్లనియె. ఉ. హా దనుజేంద్ర హా సురగణాంతక హా హృదయేశ నిర్జరేంద్రాదుల గెల్చి నీవు కుసుమాస్త్రునికోలలకోర్వలేక ‖సీతోన్మాదమునన్ రఘుప్రవరు మానిని నేటికిఁ దెచ్చితప్పుడున్ గాదని చెప్పి నన్నినకఁగాలవశంబునఁ బొందితక్కటా. గీ. ఎండఁ గాయ వెఱచు ‖ఇనుఁడు వెన్నెలఁ గాయ వెఱచు విధుఁడు గాలి వీవ వెఱచు లంకమీఁద నిట్టి లంకాపురికి మా కు నధిపవిధవభావ మడరె నేఁడు. క. దురితముఁ దలఁపరు గానరు జరుగుదురెట్లైన నిమిషసౌఖ్యంబులకై పరవనితాసక్తులకును బరధనరక్తులకు నిహముఁ బరముం గలదే. వ. అని విలపింప నంత విభీషణుండు రామచంద్రుని పంపువడసి రావణున కుదహనాదిక్రియలు గావించె నంత రాఘవేం ద్రుండు నశోకవనంబున కేగి శింశుపాతరుసమీపంబునందు. శా. ‖దైతేయప్రమదాపరీత నతిభీః సగ్రంథిబంధాలకన్ వ్రాతన్ నిశ్వసనానిలాశ్రుకణజీవంజీవదారామభూ జాతన్ శుష్కకపోలకీలితకరాబ్జాతన్ బ్రభూతద్యుతిన్ భూతత్రాణసమేత సీతఁ గనియెన్ భూమీశుఁ డామ్ముంగిటన్. వ. కని రామచంద్రుండు దాపంబు నొందిభార్యవలన దోషంబు లే

---

*వలభులు=ముంజూరుపలకలు. భర్మకుంభచయము=బంగరుకుండలగుంపు. అలవు=అనాయాసము. ‖అంపకయ్యము=బాణయుద్ధము. ‖అపలాపించుట యో=మోసపుచ్చి యెత్తుకొనిపోవడమా. ౘగుణ=అల్లెత్రాడు, ¶ఖరభాషాశ్రావణున్=కాఠిన్యవచనములవినువాఁడును. వి ద్రావణున్=నాశనముజేయుచున్నట్టి. స్రావణున్=స్రవింపఁజేయునట్టి. †అంసభాగములన్=భుజములమీఁద. సేస=సాసట. కర్ణిక=కర్ణాభర ణములు ‖సీతోన్మాదమునన్=వెఱ్ఱితనముచేత. ‖ఇనుఁడు=సూర్యుఁడు, విధుఁడు=చంద్రుఁడు. ‖దైతేయప్రమదాపరీతన్=దైతేయప్రమ దా=రక్కసస్త్రీలచేత, పరీతన్=చుట్టఁబడియున్నదియు, సగ్రంథిబంధాలకవ్రాతన్=గ్రంథి=ముడులుగొన్న, బంధ=పెనచుకొన్న, అలక=వ్రా తన్=ముంగురులుగలదియు, నిశ్వసనానిలాశ్రుకణజీవంజీవదారామభూజాతన్=నిశ్వసనానిల=నిట్టూర్పుగాడ్పుతోఁ గూడిన, అశ్రుకణ= కన్నీళ్లచేత, జీవంజీవత్=మిగులవృద్ధిఁ బొందింపఁబడిన, ఆరామ=ఉద్యానవనమునందలి, భూజాతన్=వృక్షములుగలదియు, శుష్కకపోల కీలితకరాబ్జాతన్=చిక్కిపోయిన చెక్కిళ్లయందుఁ జేర్పఁబడినహస్తపద్మములుగలదియు, ప్రభూతన్=ప్రసిద్ధురాలైనదియు.

కుంటవహ్నివలనం బ్రకటంబుసేసి దేవతలపంపున దేవిం జేకొని॥ ఉ॥ శోషితదానవుండు నృపసోముఁడు రాముఁడు రా
త్మ సేంద్రతా। శేషవిభూతిఁగల్పన మజీవివిగమ్మనినిల్పె నర్థిసం।తోషణుఁ బాపశోషణు నదూషణు శశ్వదరోషను ర్నమిత్రా।
భాషణు నార్యపోషణుఁ గృపాగుణభూషణు నవ్విభీషణున్॥ వ॥ ఇట్లు విభీషణసంస్థాపనుండై రామచంద్రుండు సీతాలక్ష్మ
ణసమేతుండై సుగ్రీవహనుమదాదులం గూడికొని పుష్పకారూఢుండై వేల్పులు గురియు పువ్వులసోనలం దడియుచుఁ దొల్లి
వచ్చినజాడలు సీతకు నెఱింగించుచు మఱి నందిగ్రామంబునకు వచ్చె నయ్యవసరంబున॥ గీ॥ రామచంద్రవిభుని రాక వీనులవి
ని భరతుఁ డుత్సహించి పాదుకలను। మోఁచికొనుచు వచ్చె ముదముతోఁ బురజను।ల్గొల్చుచుండ నన్న కెదురువచ్చె॥ వ॥ వచ్చి
పాదుకలు ముందర నిడికొని యెడనెడ సాష్టాంగదండప్రణామంబులు సేయుచు మెల్లన డాసి రామచంద్రుని పాదంబుల నా
సలంగదియించి తచ్చరణరేణువులు మడిచి శిరంబునం జల్లికొని తనివిలేక మఱియు నప్పదకమలంబు *లక్కున మోపికొనుచు
సంతసంబునం గన్నీటం గడిగి సేమంబుల రయుచుండ సీతాలక్ష్మణసహితుండై విభుండును వనకేమంబు వచ్చిన బ్రాహ్మణ
జనంబులకు నమస్కరించి తక్కిన వారల చేత మన్ననలు వొంది వారల మన్నించె నయ్యవసరంబున॥ చ॥ నృపవర పెక్కునా
ళ్లగొలె నిన్న నసుండినయట్టి నేఁడు మా।తపములు పండె నిందఱ ముధన్యుల మైతిమటంచుఁ †బుట్టము। ల్చపలతఁ ద్రిప్పి పువ్వుల
వసంతములాడుచుఁ బాడుచున్నత।త్రపులయిఁ యూడుచుం బ్రజలు దగ్గఱయుఁ బండువుఁ జేసిరెల్లెడన్॥ సీ॥ కవగూడియిఱు
దెసఁ గపిరాజు రాక్షసరాజు నెక్కైడఁ జామరములు వీవ।హనుమంతుఁ డతిధవళాతపత్రము వట్టఁ బాదుకల్భరతుండు భక్తి
దేర।శత్రుఘ్నుఁ డమ్ములు చాపంబు గొనిరాఁగ సౌమిత్రి భృత్యుఁడై చనువు సూప।జలపాత్ర చేపట్టి జనకజఁ గూడి రాఁగాం
చనఖడ్గమంగదుఁ డుమోవఁ।బసిఁడి గద్దె పెద్దభల్లూకపతి మోవఁ।గొలువఁ బుష్పకంబు నెలమి నెక్కి।గ్రహములెల్ల వెలయ
గడునొప్పు సంపూర్ణ।చంద్రు పగిది రామచంద్రుఁ డొప్పె॥ వ॥ ఇట్లు పుష్పకారూఢుండై కపిబలంబులు చేరికొలువ శ్రీరా
ముండ యోధ్యకుం జని యెనంతకమున్న యప్పురంబునందు॥ సీ॥ వీధులు సక్కఁగావించి శీతోయంబులు సల్లి రంభాస్తంభచ
యము నిలిపి।పట్టుచీరలు చుట్టి బహుతోరణంబులు గలువడంబులు మేలుకట్టు గట్టి। వేదికలలికించి వివిధరత్నంబుల ముగ్గులుప
లుచందములుగఁ బెట్టి।కలయ గోడల రామకథలెల్ల వ్రాయించి ప్రాసాదములు దేవభవనములను। గోపురంబుల బంగారు
కుండలెత్తి।మెల్ల వాకిండ్లఁ గాసుకలేర్పరించి।జనులు ‡కై సేసి తూర్యఘోషములతోడ। నెదురునడిచిరి యారాఘవేం
ద్రుకడకు॥ క॥ సమదగజదానభారః।క[illegible]చులై యున్న పెద్దత్రోవలతోడన్।రమణీయమయ్యెనప్పురి।రమణుఁడు వచ్చి
నగరంగు రమణియుబోలెన్॥ గీ॥ రామభూపేంద్రు రాకదూర్యములతో।రథగజాశ్వసుభటరాజితోడ। నమరెఁ బురము
చంద్రుఁడురు దేర §ఘూర్ణిల్లుజంతుభంగమిళితజలధిభంగి॥ వ॥ ఇట్లొప్పుచున్నయప్పురంబు ప్రవేశించి రామచంద్రుండరు
గుచున్నసమయంబున॥ మ॥ ఇతఁడే రామనరేంద్రుఁ డీయబలకాయిం ద్రారిఖండించెన। ల్లితఁడే లక్ష్మణుఁ డాతఁడే కపివ
రుండా హొంతవాఁడే మరు।త్సుతుఁ డా చెంగట నా విభీషణుఁ డటంచుం జేతులం జూపుచున్। సతులెల్లన్ వరికించి చూచిరి పురీ
సౌధాగ్రభాగంబులన్॥ వ॥ ఇట్లు జనులు చూచుచుండ రామచంద్రుండు రాజమార్గంబునం జనిచని॥ సీ॥ పటికంపుగోడలు పవ
డంపు వాకిండ్లు నీలంపుటరుగులు నెఱయఁ గలిగి।కమనీయవైదూర్యకస్తంభచయముల మకరతోరణముల మహితమగుచుఁ
బడగల మాణిక్యబద్ధ చేలంబులఁ జిగురుతోరణములఁ జెలువు మీఱి।పుష్పదామకముల భూరివాసనలను బహుతరధూపదీప
ముల మెఱసి।మారు వేల్పుల భంగి నిమలయుచున్న।సతులుఁ బురుషులు నెప్పుడు సందడింపఁ। గుఱుతులిడరాని ధనముల కుప్ప
లున్న।రాజసదనంబునకు వచ్చె రామవిభుఁడు॥ ఇట్లు వచ్చి॥ ఉ॥ తల్లుల కెల్ల మ్రొక్కి తమతల్లికి వందనమాచరించి యి।ల్లిల్లబు
ధాళికి న్వినతుఁడై చెలికాండ్రను దమ్ములం బ్రసం।పుల్లతఁ గౌఁగిలించుకొని భూవరుఁ డోలి గృపారసంబురం।జిల్లఁగఁ జాల
మన్ననలు సేసె నమాత్యులఁ బూర్వభృత్యులన్॥ తత్సమయంబుల॥ చ॥ కొడుకులుఁ బెద్దకోడలును గొబ్బున మ్రొక్కిన నే
త్రిచేతులం।బుడుకుచు మోమునుం దలలు భోరన ముద్దులుగొంచు నవ్వులన్।డొడలకు వారి రాఁదిగిచి తోఁగఁగఁ జేసిరి నేత్రధా
రలన్। వెడలిన ప్రాణముల్దగఁ బ్రతిష్ఠములయ్యె నటంచు నుబ్బుచున్॥ వ॥ అంత వసిష్ఠుండు శ్రీరామచంద్రుని జటాబంధంబు
విడిపించి, కులవృద్ధులుం దానును, సమంత్రంబుగ దేవేంద్రుని మంగళస్నానంబు సేయించు బృహస్పతిచందంబున సముద్ర

---

*అక్కు। వక్షస్థలము. †పుట్టములు। వస్త్రములు. నతత్రపులై। లజ్జాహీనులై. శీతోయము। జలము. రంభాస్తంభచయము। అఁటిచెట్ల గుంపులను. కలువడంబులు। చిఱుటెక్కెములు. మేలుకట్లు। చాందినీలను. వేదిక। తిన్నెలను. ప్రాసాదములు। రాజగృహములు. ‡కైసేసి। అలంకరించుకొని, తూర్యఘోషములతోడన్। వాద్యవిశేషములధ్వనులతో. §ఘూర్ణిల్లుజంతుభంగమిళితజలధిభంగిన్॥ ఘూర్ణిల్లు। శబ్దించుచున్న, జంతు। మత్స్యాదిజంతువులతోడను, భంగ। అలలతోడను, మిళిత। కూడికొనిన, జలధిభంగిన్। సముద్రమువలె

నదీజలంబుల నభిషేకంబు సేయించిన, రఘువరుండు సీతాసమేతుండై, జలంబులాడి, పంచిపుట్టంబులు గట్టికొని, కమ్మనిపువ్వులు ముడిచి, సుగంధంబు లలందికొని, తొడవులు దొడిగికొని, తనకు భరతుండు సమర్పించిన రాజసింహాసనంబునం గూర్చుండి. యతని మున్నుంచి, కౌసల్యకుం బ్రియంబు సేయుచు, జగత్పూజ్యంబుగ రాజ్యంబు నేలుచుండె నప్పుడు॥ సీ॥ కలఁగుటెల్లను మానెం జలధు లేడింటికి జలనంబు మానె భూచక్రమునకు। జాగరూకత మానె జలజలోచను నపదీనభావము మానె దిక్పతులకు। మాసియుండుట మానె మార్తాండమండలి కావిరి మానె దిగ్గగనములకు। నుడిగిసోవుట మానె నుర్వీరుహంబులకడఁగుట మానెం ద్రేతాగ్నులకును। గడఁగి ద్రేఁగుట మానెం గరిగిరికిటి నాగ|కమఠములకుం బ్రజలకలఁక మానె, రామచంద్రవిభుఁడు రాజేంద్రరత్నంబు। ధరణిభరణ రేఖఁ దాల్చు నపుడు॥ సీ॥ పొలఁతుల వాలుచూపుల యందచాంచల్య మబలల నడుములయంద లేమి। కాన్తాలకములంద*కౌటిల్యసంచారమతివల నడుపుల యందజడిమ। ముగుదల పరిరంభముల యందపీడనము గనాకుచములయందపోరు। పడఁతులరతులంద బంధసంభావంబు సతులఁ బాయుటయంద సంజ్వరంబు । ప్రియులు ప్రియురాండ్రు మనముల పెరసి తారు। నందచౌర్యంబు వల్లభులాత్మసతుల। నాగి క్రొమ్ముళ్ల వట్టుటం దక్రమంబు। రామచంద్రుండు పాలించు రాజ్యమందు॥ క॥ తండ్రి క్రియ రామచంద్రుఁడు। పుత్రుల నాజపించి ప్రజలఁ దా రక్షింపం। దండ్రుల నందబు మఱచిరి। తండ్రిగదా రామచంద్రధరణిపుఁ డనుచున్॥ వ॥ మఱియు నా రామచంద్రుండు రాజర్షిచరితుండును, నిజధర్మనిరతుండును, నేకపత్నీవ్రతుండును, సర్వలోకసమ్మతుండునగుచు, ధర్మవిరోధంబుగాకుండఁ గోరికల ననుభవించుచుం, ద్రేతాయుగంబైనఁ గృతయుగధర్మంబుఁ గాపించుచు, బాలమరణంబు మొదలగు నరిష్టంబులు ప్రజలకుఁ గలుఁగకుండ రాజ్యంబు సేయుచుండె నయ్యెడ॥ గీ॥ సిగ్గువడుటఁ గల్గి సింగారమును గల్గి। భక్తిగల్గి చాల భయము గలిగి। నయము ప్రియము గల్గి నరనాథు చిత్తంబు। సీత దనకు వశము సేసికొనియె॥ అని విని పరీక్షిన్నరేంద్రుం డిట్లనియె॥ గీ॥ భ్రాతృజనులయందు బంధువులందును। బ్రజలయందు రాజభావ మొంది। యెట్లు మెలఁగె రాముఁ డీశ్వరుండగు తన్నుఁ। గూర్చి క్రతువు లెట్లు గోరి చేసె॥ అనిన శుకుం డిట్లనియె॥ సీ॥ భగవంతుఁడగు రాఘుభద్రుండు ప్రీతితో దేవోత్తముని సర్వదేవమయునిఁ। దనుఁ దానకూర్చి యధ్వరములు సేసెను §హోతకుఁ బూర్వపు నుత్తరంబు। సామగాయకునికిఁ బశ్చిమదిగ్భాగంబు బ్రహ్మకుఁ గ్రమమునఁ బడమటెల్ల। నధ్వర్యునకు శేషమాచార్యునకు నిచ్చి సొమ్ములవంది భూసురులకొసఁగి। తనకు రెండు పుట్టంబులు దనకునైన। మెలఁత మంగళసూత్రంబు మిసుకుదక్క। వినతుఁడై యుండె నా రామవితరణంబు। పాండవోత్తమ యేమని పలుకవచ్చు॥ వ॥ అంత నా రామచంద్రుని దానశీలత్వంబునకు మెచ్చి విప్రవరులు నమ్మతిమభూములు నాకుల నిచ్చి యిట్లనిరి॥ గీ॥ ధరణి వలదు మాకుఁ దపసుల కేలని। యఖిలలోకగురుఁడవైన హరివి। మానసంబులందు మాలయు చీకటిఁ బాపు। భవదుదారరుచులఁ బార్థివేంద్ర॥ వ॥ అని పలికి ¶బ్రహ్మణ్యదేవుండైన రామచంద్రుని వినయోక్తులం బూజించి మునులు సనిరిట్లు పెద్దకాలంబు రాజ్యంబు సేసి రాఘవేంద్రుండొక్కదినంబున॥ సీ॥ వసుధపైఁ బుట్టెడు వార్తలాకర్ణించుకొఱకునై రాముండు గూఢవృత్తి। నడురేయిఁ దిరుగుచో నాగరజనులలో నొకరుఁడు సతి మొప్పకున్న। నొరుని యింటఁ గాపురంబున్న చంచలురాలిఁ బాయంగ లేకఁ జేపట్టె నేమి। రా వెఱ్ఱియగు రామధరణీశ్వరుండ నే బేలపొమ్మను మాట బిట్టు పలుక। నాలకించి మఱియు నా మాట చారుల। వలన జగములోనఁ గలుగఁ దెలిసి। సీతని క్రన్నోవఁ జెప్పక వాల్మీకిపర్ణశాలఁ బెట్టఁబని చె రాత్రి॥ వ॥ అంత సీతయు గర్భిణి గావునఁ గుశలవుల నిరువురఁ గొడుకులం గనియె వారికి వాల్మీకి జాతకర్మంబు లొనరించె. లక్ష్మణునకు నంగదుండును, జంద్రకేతుండును, భరతునకుఁ దక్షుండుఁ బుష్కలుండును, శత్రుఘ్నునకు సుబాహుండును, శ్రుతసేనుండును, సంభవించిరయ్యెడ॥ క॥ బంధురబలుఁ డగు భరతుఁడు। గంధర్వచయంబుఁ ద్రుంచి కనకాములస। ద్బంధుఁడగు నన్న కిచ్చెను। బంధువులును మాతృజనులు ప్రజలును మెచ్చన్॥ గీ॥ మధువనంబులోన మధునందనుండగు। లవణుఁ జంపి భుజబలంబు మెఱసి। మధుపురంబు సేసె మధుభాషి శత్రుఘ్నుఁ। డన్న రామచంద్రుఁ డౌననంగ॥ వ॥ అంత రామచంద్రుండు గొంత కాలంబునకుఁ దన కొమరులయిన కుశలవులిద్దఱను, వాల్మీకివలన వేదాదివిద్యలయందు నేర్పరులై పెక్కుసభలను తానకంబుగా రామకథాశ్లోకంబులు వాడుచు నొక్కనాఁడు రాఘవేంద్రుని యజ్ఞశాలకుం జని॥ మత్తకోకిల॥ వట్టిమాకులు పల్లవింపన వారియై మధుధారదా। నుట్టఁ బాడిన వారిపాటకు నుర్వరాధిపుఁడున్ బ్రజల్। బిట్టు సంతసమందిరయ్యెడఁ బ్రేలిఁగన్నుల బాష్పము। ల్దొట్టనౌదలలూఁచి వారలతోడి మూఁక పుట్టఁగాన్॥

---

ఖికంధి। సముద్రము. * కౌటిల్యము। వంకర, ముగుదలపరిరంభములయందు। స్త్రీలయొక్క ఆలింగనములయందే. పెరసి। పొందించి. చౌర్యము। దొంగతనము. వల్లభులు। భర్తలు, ఆత్మసతులు। తమభార్యలను. ఆగి। అడ్డగించి. §హోత। ఋగ్వేదము నెఱింగిన ఋత్విజుఁడు; సామగాయకునికి। ఉద్గాతకు. బ్రహ్మకు। ప్రద్రష్టకు, అధ్వర్యునకు। యజుర్వేదము నెఱింగిన ఋత్విజుఁడు. ¶బ్రహ్మణ్యదేవుండైన। బ్రహ్మజ్ఞానులచేత నారాధింపఁబడినవాఁడైన.

అంతనారామచంద్రుండుకుమారులకిట్లనియె॥గీ॥చిన్నియన్నలారశీతాంశుముఖులార।నళినదళవిశాలనయనులార।మధురభాషులారమహిమీఁదనెవ్వరు।దల్లిదండ్రిమీకుధన్యులార॥వ॥ అనినవారలేమువాల్మీకిపౌత్రులము రాఘవేశ్వరునియోగంబుసూడవచ్చితిమనవుడుమెల్లననగి*యెల్లిప్రొద్దునమీతండ్రినేఁడింగెదరుండుండనియొక్కనివాసంబునకుసత్కరించిపనిచెనుఅనాఁడుసీతందోడ్కొనికుశలవులముందటనిడుకొనివాల్మీకివచ్చిరఘుపుంగవునింగనియనేకప్రకారంబులస్తుతియించియిట్లనియె॥గీ॥సీతముద్దరాలుచిత్తవాక్కర్మంబు।లందుసత్యమూర్తియమలచరిత। పుణ్యసాధ్వివిడువఁబోలముచేకొను।రవికులాబ్ధిచంద్రరామచంద్ర॥వ॥అనివాల్మీకిపలుకరామచంద్రుండుపుత్రార్థియైవిచారింపఁగుశలవులను,వాల్మీకికినొప్పగించిరామచంద్రచరణధ్యానంబుసేయుచునిరాశయైసీత†భూవివరంబుసొచ్చెనయ్యెడ॥మ॥ముదితాయేటికిఁగ్రుంకితీవునునలోమోహంబుచింతింపవే।వదనాంభోజముసూపవేమృదువునీవాక్యంబువిన్పింపవే।తుదిసేయందగదంచునీశ్వరుఁడునైదుఃఖించెభూపాలుఁడా।పదగాదేప్రియురాలిఁబాసినయెడన్భావింపనెవ్వారికిన్॥వ॥ అనివగచిరామచంద్రుండుబ్రహ్మచర్యంబుధరియించిపదునొకండువేలయేండ్లెడతెగకుండ నగ్నిహోత్రంబులుసెల్లించితానీశ్వరుండుగావునఁదనమొదలినెలవునకుంజనియెనివ్విధంబున॥గీ॥ఆదిదేవుఁడైనయారామచంద్రునికబ్ధిగట్టుటెంతయసురకోటిఁ।జంపుటెంతకపులసాహాయ్యమదియెంత।సురలకొఱకుఁగ్రీడచూపెఁగాక॥చ॥వశుఁడుగమ్రొక్కెదన్నవణవార్ధివిజృంభణతానివర్తికి।న్దశదిగధీశమౌళిమణిదర్పణమండితదివ్యకీర్తికి। న్దశశతభానుమూర్తికిసుధారుచిభాషికిసాధుపోషికి। న్దశరథరాజుపట్టికినిదైత్యపతింబొరిగొన్నజెట్టికిన్॥ఉ॥ నల్లనివాఁడుఁబద్మనయనంబులవాఁడుమ¶హాశుగంబుల। న్విల్లునుదాల్చువాఁడుఁగడువిప్పుగవక్షమువాఁడుమేలుపైఁ।జల్లెడువాఁడునిక్కినభుజంబులవాఁడుయశంబుదిక్కులం।జల్లెడువాఁడునైనరఘుసత్తముఁడీవుతమాకభీష్టముల్ ॥ గీ॥ రామచంద్రుఁగూడిరాకలఁబోకలఁ। గదిసితిరుగువారుఁగన్నవారు।నంటికొన్నవారునాకోసలప్రజ।లరిగిరాదియోగులరుగుగతికి॥క॥మంతనములుసద్గతులకుఁ।బొంతనములుఘనములైనపుణ్యములకుఁ§దా।నింతనములుపూర్వాఘుని।కృంతనములురామనామకృతిచింతనముల్ ॥వ॥ఆరామచంద్రునకుఁగుశుండును, గుశునకునతిథి,యతిథికినిషధుండును,నిషధునకునభుండును, నభునికిఁబుండరీకుండును,బుండరీకునకుక్షేమధన్వుండును,క్షేమధన్వునకుదేవానీకుండును, దేవానీకునకునహీనుండును,నహీనునకుఁబారియాత్రుండును,బారియాత్రునకుబలుండును,బలునకుఁజలుండును, జలునకునర్కసంభవుండగువజ్రనాభుండును,వజ్రనాభునకుశంఖణుండును, శంఖణునకువిధృతియును, విధృతికిహిరణ్యనాభుం,డతఁడుజైమినిశిష్యుండయినయాజ్ఞవల్క్యమునివలననధ్యాత్మయోగంబునేర్చిహృదయకలుషంబులంబాసియోగచర్యుండయ్యె,నాహిరణ్యనాభునకుఁబుష్యుండును,బుష్యునకుధ్రువసంధియు,ధ్రువసంధికిసుదర్శనుండును,సుదర్శనునకునగ్నివర్ణుండును,నగ్నివర్ణునకుశీఘ్రుండును,శీఘ్రునకుమరునురాజశ్రేష్ఠుండువుట్టె,నారాజయోగిసిద్ధుండయి,కలాపగ్రాంబుననున్నవాఁడు,కలియుగాంతంబుననష్టంబయ్యెడుసూర్యవంశంబుఁగ్రమ్మఱంబుట్టింపంగలవాఁడామరువునకుఁ, బ్రశుశ్రుకుం, డాప్రశుశ్రునకుసంధియు, నతనికినమర్షణుం,డాయమర్షణునికిమహస్వంతుం,డామహస్వంతునకువిశ్వసాహి,విశ్వసాహికిబృహద్బలుండుజనియించె, వాఁడుభారతయుద్ధంబున, మీతండ్రియగునభిమన్యునిచేత,హతుండయ్యెవినుము॥గీ॥పరగనిక్ష్వాకుఁడునుబృహద్బలుఁడు మొద

## భవిష్యద్రాజేతిహాసవర్ణనము.

లు।మదయుగాఁగలరాజులఁదోడుతోడ। నెఱుఁగఁజెప్పితినేవారినింకమీఁదఁ।బుట్టఁగలవారిఁజెప్పెదభూవరేంద్ర॥వ॥ఆబృహద్బలునకు బృహద్రణుండును, బృహద్రణునకునురుక్షతుండు,నాతనికివత్సప్రీతుండును,వత్సప్రీతునకుఁబ్రతివ్యోముండును,బ్రతివ్యోమునకుభానుండును,భానునకుసహదేవుండును,సహదేవునకుబృహదశ్వుండును,బృహదశ్వునకుభానుమంతుండును, భానుమంతునకుఁబ్రతీకాశ్వుండును, బ్రతీకాశ్వునకుసుప్రతీకుండును, సుప్రతీకునకుమేరుదేవుండును,మేరుదేవునకుసునక్షత్రుండును,సునక్షత్రునకుఋక్షకుండును,ఋక్షకునకుసుతపుండును,సుతపునకునమిత్రజిత్తు,నతనికిబృహద్వాజియు,నతనికిబర్హియు,బర్హికిధనంజయుండును, ధనంజయునకురణంజయుండు, నతనికిసృంజయుండును,సృంజయునకుశాక్యుండును,శాక్యునకుశుద్ధోదుండును, శుద్ధోదునకులాంగలుండును,లాంగలునకుఁబ్రసేనజిత్తు,నతనికిక్షుద్రకుండును,క్షుద్రకునకుఋణకుండును,ఋణకునకుసురథుండును,సురథునకుసుమిత్రుండును,సుమిత్రునియనంతరకాలంబున,సూర్యవంశంబునశింపఁగలదు,వీరలుబృహద్బలునినుండిక్రమంబునంబుట్టంగలవారలనిచెప్పిశుకుండిట్లని

---

* ఎల్లి।రేవు. † వివరము।రంధ్రము. ¶ ఆశుగంబులన్।బాణములను. § దానింతనములు।స్థానభూతములైనవి. పూర్వాఘనికృంతనములు।పూర్వమందుఁజేసినపాపములఛేదించునట్టివి.

మె॥ సీ॥ ధన్యుఁడాయిక్ష్వాకుతనయుఁడానిమియాగమాచరింపఁగఁగోరియావసిష్ఠు। నార్త్విజ్యమునకుఁదానర్థింపఁగనిని యాతఁడింద్రునిమఖముసేయింపనియ్యు।కొనినాఁడనుటివత్తుఁగొదువలేదనివచ్చి సంసారమెంతయుఁజంచలంబు। కాలయాపనమేలఁగ్రతువుసేసెదననియన్యఋత్విక్కులనతఁడుకూర్చి। సేయనింద్రునియాగంబుచెల్లఁజేసి। గురుఁడుచనుదెంచిశిష్యుపైకోపమెత్తి। యోరినావచ్చునందాఁకనుండవనుచు। నతనిదేహంబువడుగాతయనిశపించె॥ వ॥ ఇట్లువసిష్ఠుండుశపించిననిమియునువసిష్ఠునిదేహంబువడఁగాకయనిమఱలశపియింపనవ్వసిష్ఠుండుమిత్రావరుణులవలనఁగడపటనూర్వశికిజన్మించె-గురుశాపంబునబ్రహ్మజ్ఞానియైననిమివిగతదేహుండైననతనిదేహంబు మునీశ్వరులుగంధవస్తువులంబొదివిదాఁచిదొరఁకొన్నసత్త్రయాగంబుచెల్లించిరికడపట దేవగణంబులుమెచ్చివచ్చిన వారలకు నిమిదేహంబుసూపిబ్రతుకంజేయుండనవుడువారలనిమిప్రాణంబువచ్చుంగాకయనిపలికిన నిమితనదేహంబుసొరనొల్లకయిట్లనియె॥ మ॥ అతిమోహాకులితంబుసాంద్రనమతాహంకారమూలంబునం। తతనానాసుఖదుఃఖపీడితమనిత్యంబిట్టిదేహంబునం। కృతినాకేటికిమీనజీవనముభంగింభీతిబాహుళ్యనుం। చితరుల్పెద్దలుదీనిఁజేకొనరుసర్వేశున్మదింగొల్చెదన్॥ వ॥ అనిపలికిననిమిమాటలుగ్రమ్మఱింపనేరకశరీరులుగన్నులుదెఱచినప్పుడునుమూసినప్పుడునునిమిగానవచ్చుంగాకయని పల్కి-దేవతలుచనిరంత॥ గీ॥ పెద్దలైనమునులుపృథివీస్థలికిరాజు। లేమిఁజూచినిమికళేబరంబు। తరువనొక్కఁడువుట్టెఁదనయుండువానిని। జనకుఁడనుచుఁబలికెజగములెల్ల॥ వ॥ మఱియుతండువిగతదేహుండుగావునవైదేహుండనియును, మథనజాతుండుగావునమిథిలుండనంబరగె, నమ్మిథిలునిచేత, నిర్మితంబయినదిగావున, మిథిలానగరంబనాఁబరగె, నాజనకునకు నుదావసుడు, నుదావసునకునందివర్ధనుండును, నందివర్ధనునకుసుకేతుండును, సుకేతువునకుదేవరాతుండును, దేవరాతునకుబృహద్రథుండువుట్టె, నతనికిసుధృతియు, నతనికిధృష్టకేతుండును, నతనికిహర్యశ్వుండు, నతనికిమరువు, నతనికిఁబ్రతింధకుండును, నతనికిఁగృతరథుండు, నతనికిదేవమీఢుండును, నతనికివిధృతుండును, నతనికిమహాధృతియు, నతనికిఁగీర్తిరాతుండు, నతనికిమహారోముండును, నతనికిస్వర్ణరోముండును, నతనికిహ్రస్వరోముండును, నతనికిసీరధ్వజుండునువుట్టె॥ గీ॥ అతఁడుమఖముసేయనవనిదున్నింపంగ। లాంగలంబుకొననులక్షణాంగి। సీతజాతయయ్యెసీరధ్వజుండనఁ। దానఁజెప్పఁబడియెధన్యుఁడతఁడు॥ వ॥ ఆసీరధ్వజునకుఁగుశధ్వజుండును, గుశధ్వజునకుధర్మధ్వజుండును, ధర్మధ్వజునకుగృతధ్వజమితధ్వజులను వారిద్దఱువుట్టిరి, యందుఁగృతధ్వజునకుఁగేశిధ్వజుండతండు, దన్నుఁదానెఱింగెడివిద్యయందు నేర్పరియయ్యె-మితధ్వజునకుఖాండిక్యుండనువాఁడుజన్మించి, తండ్రివలననెఱుకగలవాఁడై, కర్మతత్త్వంబునేర్చి, కేశిధ్వజునివలనభీతుండైయేగె, ఖాండిక్యునకుభానుమంతుండును, భానుమంతునకుశతద్యుమ్నుండును, శతద్యుమ్నునికిశుచియు, శుచికిసనద్వాజుండు, సనద్వాజునకునూర్ధ్వకేతుండు, నూర్ధ్వకేతునకునజుండు, నజునకుఁగురుజిత్తుఁ, గురుజిత్తునకునరిష్టనేమియు, నరిష్టనేమికిశ్రుతాయువు, శ్రుతాయువునకుఁబార్శ్వుండును, బార్శ్వునకుఁజిత్రరథుండును, జిత్రరథునకుక్షేమాపియు, క్షేమాపికిహేమరథుండును, హేమరథునకుసత్యరథుండును, సత్యరథునకునుపగురుండును, నుపగురునకునగ్నిదేవుప్రసాదంబున నుపగుప్తుండును, నుపగుప్తునకుసావనుండును, సావనునకుసువర్చసుండు, నతఁడెసుభాషణుండనివినఁబడు, నాసుభాషణునకుజయుండును, జయునకువిజయుండును, విజయునకుఋతుండును, ఋతునకునఘుండు, నఘునకువీతిహవ్యుండును, వీతిహవ్యునకుధృతియు, ధృతికిబహుళాశ్వుండును, బహుళాశ్వునకుఁగృతియుఁ, గృతికిమహావశియనువాఁడుజన్మించె, వీరలుమైథిలురగురాజులనిచెప్పంబడుదురు, యోగీశ్వరప్రసాదంబునగృహస్థులయి యుండియు, బంధనిర్ముక్తులై, యాత్మజ్ఞానంబుగలిగి, నిరంతరబ్రహ్మానుసంధానంబుసేయుచునుండుదురనిపలికి, శుకయోగీంద్రుండిట్లనియె॥

### ——శ్రీ చంద్రవంశ్యులగురాజులయితిహాసము. శ్రీ——

గీ॥ చంద్రగౌరవమునఁజంద్రవంశమునందు। జంద్రకీర్తులతోడజనితమైన। యట్టిపుణ్యమతులునైననరాధరాజుల। నింకవినుము మానవేంద్రచంద్ర॥ సీ॥ ఒకవేయితలలతోనుండుజగన్నాథుబొడ్డుతమ్మినిబ్రహ్మవుట్టె మొదల। నతనిగుణంబులనతనిబోలెడుదక్షుఁడత్రియనసంజాతుఁడయ్యెనత్రి। కడకంటిచూడ్కులఁగలువలసంగడీఁడుదయించెవిప్రులకోషధులకు। నంబుగర్భములకునజునిపంపుననాథుఁడైయుండిరాజసూయంబుజేసి। మూఁడులోకములనుగెల్చిమోదమునను। జనిబృహస్పతిసతిఁదారఁజారుమూర్తిఁ। దారనిలుసొచ్చిగొనిపోయితన్నుఁగురుఁడు। వేడునందాఁకనయ్యింతివిడువఁడయ్యె॥ వ॥ అంతవేల్పులతోరక్కసులకుఁగయ్యంబయ్యెబృహస్పతితోడివైరంబునంజేసికావ్యుండుగాక్షసులతోఁజేరికొనిచంద్రునింజేపట్టెసురాచార్యునింబోఁదోలినహరుండుభూతగణసమేతుండైయతనిగురుపుత్త్రుండైనబృహస్పతింజేపట్టె, దేవేంద్రుండు

సురగణంబులుం దానును బృహస్పతికి నడ్డంబు వచ్చె నయ్యవసరంబున బృహస్పతి భార్యానిమిత్తంబున రణంబు సురాసుర
వినాశకరంబయ్యె నాలోన బృహస్పతి తండ్రియగు నంగిరసుండు సెప్పిన పని బ్రహ్మదేవుండు చంద్రునిం గోపించి గర్భిణియై
న తారను మఱలనిప్పించినం జూచి బృహస్పతి దానికిట్లనియె॥ ఉ॥ సిగ్గొకయింత లేక వెలచేడియ భంగి నిధర్మకీర్తులన్ ।బొగ్గ
లు సేసి జారుకతఁ బొందికటా కడుపేలఁ దెచ్చుకొం। టెగ్గువలంప గావల దెయిప్పుడు గర్భము డించుకొమ్మని। న్నిగ్గఁగ జే
సెదన్ జెనఁటిమానవతుల్ నిను జూచి మెత్తురే॥ వ॥ అని కోపించుచుండ నా చెలువ కుఁబసిండిచాయ మేనుగల కుఱ్ఱ పుట్టె వా
నిం జూచి మోహంబు చేసి బృహస్పతి దనకొడుక నియును జంద్రుండు దనకన్నవాఁడనియును జగడించిరప్పుడు॥ గీ॥ వారి వా
దుఁ జూచి వారింపఁగా వచ్చి। యేర్పరింప లేక యెల్ల మునులు నమరవరుల నడుగ నా వేడుకలకత్తె। యెటుఁగుఁగా నియిరువురు లె
ఱుఁగరసిరి॥ ఆ పలుకులు విని సిగ్గువడియున్న తారఁ బిన్నికొమరుండిట్లనియె॥ క॥ ఇలువరుస చెడఁగ బంధులు। దలవంపఁగ మ
గఁడు బోయఁ దల్లి కట్టా వెలి నేల నన్నుఁ గంటివి। కలిగించిన వాఁడు శీతకరుఁడో గురుఁడో॥ వ॥ అని పలుకుచున్న కొడుకునకు ము
ఱుమాటలాడ నేఱక యున్న తారనేకాంతంబున కుంజేరి మంతనంబున బ్రహ్మ యిట్లనియె॥ సు॥ చెలువా నీ మొలసిగ్గువాపి గురుఁ
డో నిశాంశుఁడో యెవ్వఁడీ లలితాకారుఁ గుమారుఁ గన్నయతఁ డేలా దాఁపనీ పాటు నీతల నేవు పెట్టె నె వెచ్చనూర్పకుము కాం
తల్లా మిను లెగ్గారెమాటలనిం దేమియుఁ బోముపో యెరులతోడం జెప్పి విన్పింపవే॥ వ॥ అని పలికిన బ్రహ్మకు నేముఱు మాటాడ వె
ఱచి మంతనంబున నయ్యింతి చంద్రునికిం గన్న దాన ననవుడా బాలకునకు బుధుండను పేరువెట్టి చంద్రునికిచ్చి బ్రహ్మ సని
యెనంత॥ గీ॥ బుద్ధిమంతుఁడైన బుధుఁడు పుత్రుండైన। మేనుఁబెంచి రాజు మిన్నుముట్టె। బుద్ధిగల సుతుండు పుట్టినచోఁ దండ్రి।
మిన్నుముట్ట కేల మిన్నకుండు॥ వ॥ ఆ బుధునకుఁ దొల్లి చెప్పినయిళాకన్యక వలనఁ బురూరవుండు పుట్టె నా పురూరవునకుఁ గ
లశౌర్యసౌందర్యగాంభీర్యాది గుణంబులు నారదుని వలన నింద్రసభలోన నూర్వశి విని, మిత్రావరుణ శాపంబున మనుష్య
స్త్రీరూపంబు దాల్చి భూలోకంబునకు వచ్చి ముందర నిలువంబడి॥ తరల॥ సరసిజాక్షుఁడు మృగేంద్రమధ్యు విశాలవక్షుఁడు మహా
భుజుఁడు సుందరాననచంద్రమండలశోభితుఁడు సుకుమారుఁ డా। పురుషవర్యుఁ బురూరవుం గని పువ్వుఁటంపరజోముచే। దొఱుఁ
గు క్రొవ్విరితూపులన్ మదిఁ దూలఁబోవఁగ భ్రాంతయై॥ ఊర్వశి నిలిచియున్నంత॥ ఉ॥ భావజుకోలయో మొసులు వాసి వె
లుంగు మెఱుంగు మోహినీ। దేవతయో నభోరమ యొదీనికర గ్రహణంబు లేనివో। జీవనమేటి కంచుమరు చేఁజిగురాకడిద
మ్ము జిమ్ములం। దావడ కెన్నుఁ బురూరవుఁడు దామరపాకుజలంబు కైవడిన్॥ వ॥ ఇట్లు రాచపట్టి చెట్టువింటివాని దాడికి నోడి
యెట్టకేలకు ధైర్యము సేసి నిలుకడం దెచ్చికొని యచ్చెలువ కిట్లనియె॥ ఉ॥ ఎక్కడనుండి రాక మనకిద్దరికిం దగు నీకుఁ దక్కటిన్।
మ్రొక్కెడి వచ్చెనో యలరుముల్కుల వాఁడడిదంబుఁ ద్రిప్పనే। దిక్కు నెఱుంగనేయబలదేహము దేహముఁ గేలుఁ గేలనీ। నెక్కు
నఁ జెక్కు మోపి తగు చెయ్వులనన్ను విపన్నుఁ గావవే॥ అనినం బ్రోడచేడియ యిట్లనియె॥ మ॥ ఇవి నా హృత్పతగంబు రెండు ద
గనీ వెల్లప్పుడుం గాఁచెదే। నివి వస్త్రింబడవు గాక నాకడను దానీవుండు దేనిన్నివే। కగుణాలంకృతనీకు నానుతము నిక్కంబ
య్యో నేనిన్ను నో। జవినోదంబుల నిన్నుఁ దేల్తు నను నే చంద్రాన్వయగ్రామణీ॥ అని పలికిన వేల్పుల వెలయాలి ప్రతిమాటల
కియ్యకొని తనమనంబున॥ క॥ మంచిదటరూపు సంతతి। నంచితయా దేవగణిక యటపరుచేత। స్సంచలితచిత్తను గా। మిం
చిన దటయంతకం టెమేలుంగలదే॥ అని నిశ్చయించికొని॥ గీ॥ రాజు రాజముఖిని రతిఁ దేల్చె బంగారు। మేడలందుఁ దరులనీడ
లందుఁ। దోఁటలందు రత్నకూటంబులందును। గొలఁకులందు గిరులకోలఁకులందు॥ వ॥ అంత నయ్యిద్దఱు కుండగుణంబు నెలకొ
ని॥ క॥ ఒకవలని కేగు మఱువా। రొకచోటన కాని నిలిచియుండరు దమలో। నొకటియె మనమున నెంచుదు। రొకనిమిషము పా
యకుందురు విదయుతేఁడున్॥ క॥ దయ్యము నెఱుంగు న్వారల। నెయ్యంబులు మక్కువలును నిజగరితనము। లెవ్వ యొయ్యము గలచో
సందడిఁ। బయ్యెదకొంగడ్డమైన బ్రాణము వెడలున్॥ వ॥ ఇట్లూర్వశియుం బురూరవుండు నెండొరుల వలన మక్కువలు చె
క్కులొత్తంబగ ల్లురేలు నెల్లెడల విహరింప నొక్కనాఁడు దేవలోకంబున దేవేంద్రుండు గొలువుండుతటిఁ గొలువునఁ మా
ర్వశి లేకుండుటం జూచి॥ క॥ ఇన్ని దినంబులు దగ మన। మున్న సభామధ్యవేదియూర్వశిలేమి। న్విన్ననదనంబున నున్నది। వన్నె
దఱిగియున్న పసిఁడివడువున ననుచున్॥ వ॥ ఇంద్రుండు గంధర్వులం బనిచిన వారున్నడురేయిం జని చీఁకటి నూర్వశి పెంచుచు
న్న రెండు మేడకంబులం బట్టిన నవి రెండును మొఱవెట్టుడు వాని మొఱవిని రతిఖిన్నుండై మేనుమఱచి కూఁకుచున్న పురూరవు
కౌఁగిటనుండి యూర్వశి యిట్లనియె॥ మ॥ అడె నా బిడ్డలఁ బట్టి దొంగలు మహాహంకారులై కొంచుమున్నడులై పోయెదరడ్డ
పాటునకు సామర్థ్యంబున స్త్రీమూఁడై। కదలండేమగసందకూరుసుగతిం గన్మూసి గుత్తోవట్టుచు। న్నిద్రలం జాలఁడు నాడు కౌఁగి
లియుఁ దావంధ్యాత్ముఁడై చెల్లరే॥ క॥ పగతులు దొంగలరేపఁగ। మగఁటిమి వాటింపలేక మగతనమెల్లన్ మగువల కౌఁగిటఁ జూ

శ్రీ ఏడకంబులన్ । పాశ్చైల్లను.

పెడు। మగవాఁడ వగుట కంటె మగఁడు మగువకు వగటొప్పఁగ॥ గీ॥ అధముఁడైన వాని కాలగుకంటెన। త్యధికునింటఁ దాసియగుట
మేలు। హీనుఁ బొంది మోహనిహింసింపఁగా నేల। యువతిజనుల కూరకుంట లెస్స॥ క॥ పటికి నీ రాచతికము। బోఁటులు మొఱపె
ట్టఁ బసుపు భోగనియతివ। న్నోఁటల నీడ్చెడి దొంగల। గీటడఁపవు వెడలి శవము క్రియనుండెదదే॥ క॥ వినియు వినవు రణభీరువు।
మనుజాధము నిచుర పోఁతు మందు నినక్తటా। నినుఁ జక్రవర్తిఁ జేసిన। వనజాసను కంటె వెఱ్ఱి వాఁడును గలఁడే॥ వ॥ అని పెక్కు-
భంగుల నయ్యింతి పరుషోక్తులను కరవాలమ్ములు చెవులఁ జొనుప నా రాజశేఖరుండంకుశంబు పోట్ల నడంగు మదగజంబు వం
దంబున మఱలి దిగంబరుండై వాలు కేలనంకించి నడురేయి దొంగలనతికివైచి మేషంబుల విడిపించుకొని తిరిగివచ్చునెడ॥
గీ॥ చీఱలేని మగనిఁ జెలువ దానీక్షించి। కన్ను మొఱఁగిపోవఁ గాల్లు రాక। వెఱ్ఱి వాని భంగి వివశుఁడై పడిలేచి। పొగిలి తెఱలి స్రు
క్కి పొక్కి పడియె॥ వ॥ మఱియుఁ బురూరవుండును దనాతురుండై వెదకుచు సరస్వతీనదీతీరంబునఁ జెలికత్తెలతోఁ గూడియు
న్నయూర్వశిం గని వికసితముఖకమలుండై యిట్లనియె॥ మ॥ తనుమధ్యా యిదియేల పచ్చితకటా ధర్మంబె శర్మంబె మున్మన
లోనుండ పలాడికొన్న పలుకుల్ మర్యాదలుండప్పె నే। నిను నేఁ బాసిన యంతనుండి తనువున్నేలం బడం బాతెన। న్దినుము గ్రం
పుమ్ము గాలిసి నీఁ గరుణాదృష్టిన్ విలోకింపవే॥ అనిన నూర్వశి యిట్లనియె॥ క॥ మగువలకు నింత లాంగెడు। మగవాఁడవె నీవు ప
శువు మాడ్కి న్వగపం। దగవే మానుష పశువును। మృగములు గని తోఁయఁ గాక మేలని దినునే॥ అదియును గాక॥ మ॥ తలఁపు
ల్చిచ్చులు మాటలుజ్జ్వలసుధాధారల్ విభుండైనపు। డ్విలుతున్ మెచ్చరు యన్యులం సలఁతు రేవిశ్వాసము న్లేదు స్త్రీ। రుల పొత్తు
న్నతినైనఁ జంపు మరధర్ముల్ నిర్దయుల్ వంచకుల్। ల్వెలయాండ్రెక్కడ వారి వేడబములా వేదాంతసూక్తంబులే॥ ఉ॥ ఇంకొ
క యేఁడు వోయిన నరేశ్వర యన్నిలి రేయి నీవు నా। లంకెకు వచ్చి యాత్మజుల లక్షణవంతులఁ గాంచెదేమియు। న్శంకకపొ
మ్మ నీవనుఁడు గొమ్మను గర్భిణిగాఁ దలంచుచు। న్శంక యొకింత లేక నృపసత్తముఁడట్లన పోయె వీటికిన్॥ వ॥ ఇట్లు మఱలి చని త
న పురంబున నొక్కయేఁడుండి పిదప నూర్వశికడకేగి యొక్క రేయి పురూరవుండయ్యింతి కడనున్న నా పెలంది యు గంధర్వ
వరుల వేఁడికొనుము తన్నిచ్చెదరనవుడు నతండు గంధర్వవరులం బ్రార్థించిన వారలతండు పొగడుటకు మెచ్చి *యగ్నిస్థాలి
నిచ్చిన నయ్యగ్నిస్థాలిని నూర్వశిం గాఁ దలంచుచు దానితో నడవిం దిరుగుచుండి యొక్కనాఁ డగ్నిస్థాలి యనియెఱింగి వనం
బునం దిగవిడిచి యింటికిం జనుదెంచి నిత్యంబు రాత్రి దానిని జింతించుచుండఁ ద్రేతాయుగంబు సొచ్చిన నా రాజు చిత్తంబు
నఁ గర్మబోధంబులునై వేదంబులు మూఁడు మార్గంబులై తోఁచిన నాభూవరుండు స్థాలికడకుం జనియందు శమీగర్భజాతం
బైన యశ్వత్థంబుఁ జూచి యశ్వత్థంబు చేత నరణులు రెండు గావించి ముందటి యరణియఁ దాను వెనుకటి యరణి యూర్వ
శియును రెంటినడుమనున్న కాష్ఠంబు పుత్రుండనియును, మంత్రంబు చెప్పుచుం ద్రచ్చుచుండ జాతవేదుండన నగ్ని సంభవిం
చెన తఁడు విహితారాధన సంస్కారంబునం జేసి యాహవనీయాదిరూపి యై నెగడి పురూరవుని పుత్రుండని కల్పింపం బడియె
నాయగ్ని పురూరవునిఁ బుణ్యలోకంబునకుం బనుసంగారణంబగుటం జేసి॥ క॥ ఆయగ్నిచేఁ బురూరవుఁ। డాయజ్ఞేశ్వరున
నంతు హరి వేదమయుఁ। శ్రీయుతుఁ గూర్చి యజించెను। నాయుతుఁ డూర్వశిఁ గనంగ నరిగెడుకోర్కై॥ ఉ॥ ఒక్కటి వహ్ని
వేల్పుఁ బురుషోత్తముఁ డొక్కఁడు వహ్ని వాఙ్మయం। బొక్కటి వేదమా ప్రణవ మొక్కటి వర్ణము దొల్లి త్రేతయం। దొక్క-
టి చూచి మూఁడుగను దోరము గానొనరించె బుద్ధిచేఁ। జక్కన నా పురూరవుఁడశక్తులకున్ సులభంబు లెల్లఁ గన్॥ వ॥ ఇట్లు వేద
విభాగంబు గల్పించి యాగంబు సేసి పురూరవుండూర్వశియున్న గంధర్వలోకంబునకుం జనియె- నతనికి నూర్వశి గర్భంబున
నాయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుండును, జయుండును, విజయుండన, నార్గురుపుత్రులు గలిగిరందు, శ్రుతాయు
వునకు వసుమంతుండును, సత్యాయువునకు శ్రుతంజయుండును, రయునకు శ్రుతుండును, నేకుండన నిరువురు గలిగిరి. జయు
నకు నమితుండు, విజయునకు భీముండు జనించి, రాభీమునకుఁ గాంచనుండును, గాంచనునకు హోత్రుండును, హో
త్రునకు గంగాప్రవాహంబు పుక్కిటం బెట్టిన జహ్నుండు, జహ్నునకుఁ బూరుండుఁ, బూరునకు బాలకుండు, బాలకునకు నజ
కుండు, నజకునకు కుశుండు, కుశునకుఁ గుశాంబుండు, ధూర్తయుండు, వసువు, కుశనాభుండన, నలువురు సంభవించిరందుఁ గు
శాంబునికి గాధియనువాఁడు గలిగె - నా గాధి రాజ్యంబు సేయుచుండ॥ సీ॥ సత్యవతిని గాధిజాతసుకన్యను విప్రుఁ డఋచి
కుండు వేఁడికొనిన। గాధియు సుతకీడుగాఁడని తెల్లనై నవకంపు మేనులు నల్లచెవులు। గలగుఱ్ఱములు వేయి కన్యకు సీపుంకువి
చ్చినఁ గూఁతురనిత్తుననిన। వసుధామరుండును వరుణునికడకేగి హరులఁ దెచ్చినఁ గూఁతు నాతఁ డిచ్చె। నా మహాత్ము సతియు
నంతటఁ గోడుకులఁ। గోరియడుగ నీయకోని యతండు। విప్రరాజమంత్రవితతుల వేల్పించి। చెరువు చేసి గ్రుంకఁ జనియె నదికి॥
వ॥ అయ్యెడం దల్లి యడిగిన సత్యవతి బ్రహ్మమంత్రంబుల వేల్పించిన +చరువుఁ దల్లికిచ్చి క్షాత్రమంత్రంబులం దల్లికి వేల్పించి

*అగ్నిస్థాలి। అగ్నిపాత్ర. +చరువు। హోమయోగ్యాన్నము.

గ్గచరువుదానందుకొనియుండ నామునిసను దెంచి చరువుపీడ్వడుటయెఱింగి భార్యకిట్లనియె॥ గీ॥ తల్లి చరువునీవు దాల్చినీచ రువేల। తల్లిపాలనడితి తరళనేత్ర। కొమ్మయింకనీకుఁ గ్రూరుఁడుపుట్టుని। యమ్మబ్రహ్మవిదునినఘుఁగాంచు॥ వ॥ అనినన య్యింతి వెఱచి మ్రొక్కి వినయంబులాడినం బ్రసన్నుండై నీకొడుకు సాధువై మనమండు క్రూరుండగుంగాక యని రుచి కుండను గ్రహించిన నాసత్యవతికి జమదగ్ని సంభవించె- నాసత్యవతియుం గౌశికనదియై లోకపావనియై ప్రవహించె, నాజ మదగ్నియు రేణువుకూఁతురు రేణుకను వివాహంబై వసుమనాదికుమారులం గనియె నందు॥ క॥ పురుషోత్తమునంశంబున। ధ రజమదగ్నికి జనించె ధన్యుఁడు రాముం। డిరువదియొక మాఱు నృపతుల। శిరములఁ జక్కడిచెదనముచే గొడ్డంటన్॥ అనిన విని భూ

—శ్రీ భగవదంశసంభూతుండగు శ్రీపరశురాముని చరిత్రము. శ్రీ—

వరుండు శుకునకిట్లనియె॥ ఉ॥ ఏటికి జంపె రాముఁడవనీశులఁ బల్వురవారియందుఁ ద। ప్పేటికిఁ గల్గె విప్రుఁడతఁ డేటికి రా జసతామసంబులన్। బూటముఁ బొందె భూభరము వారితమాటది యేపథంబునన్। మాటకు మౌని చంద్రమ ఈమాట ప్రకాశ ముగాఁగఁ జెప్పవే॥ అనిన విని శుకుండిట్లనియె॥ సీ॥ హైహయాధీశ్వరుం డర్జునుం డనువాఁడు ధరణీశ్వరులలోనఁ దగినవాఁ డు। పురుషోత్తమాంశాంశుఁ బుణ్యు దత్తాత్రేయు నారాధనము సేసి యతనివలనఁ। బరిపంథిజయమును బాహుసహస్రంబు న ణిమాదిగుణములు యశము బలము। యోగీశ్వరత్వంబు నోజయుఁ దేజంబు చెడని యింద్రియములు సిరియుఁ బడసి। గాలికైవ డి సకలలోకంబులందుఁ। దనకుఁ బోరామి రారామి తలము లేక। నెట్టిచో నైనఁ దనయాజ్ఞ యేపు మిగిలి। ధరణి వెలుఁగొందె వి నువీధిఁ దరణి మాడ్కి॥ మ॥ ఒకనాఁ డామనుజేంద్రుఁ డంగనలతో నుద్దాముఁడై వీటనుం। డక రేవానదికేగి యందుఁ దెలినీ టం జల్లుఁబోరాడి దీ। ర్ఘకరాబ్జంబున నానదీజలముల న్గట్టెన్ వడిన్నీరు మ్రో। లకుఁ బెల్లుబ్బి రణాగతుండయిన యాలంకేశు పైఁ గొట్టఁగన్॥ వ॥ ఇట్లు దిగ్విజయార్థంబు వచ్చిన రావణుం డా రాజు చెంగటం దొట్టిన యేటినీటికి సహింపక రోషంబునం బోటరియుం బోలెన మ్మేటి మగనితోటిపోరాటమునకుం జనినఁ జాటింపక దన బాహుపాటవంబున॥ క॥ వీఁకమెయి నతఁడు రావణు। మూఁకటులఁ గలించి పట్టికొని మ్రోకాళ్లం। దాఁకించి కోఁతికైవడి। నాఁకం బెట్టించెఁ గింకరావళిచేతన్॥ అంతనర్జును నుండు మాహిష్మతీపురంబునకేతెంచి॥ క॥ ఆరాజేంద్రుఁడు రావణు। నూరీయిటమీఁద నూరకుండుము జగతిన్। వీరుండనని నుఁ గాఁచితిఁ। బోరా యని సిగ్గుపఱిచి పుచ్చె న్మఱలన్॥ అంత॥ సీ॥ ధరణీశుఁడొకనాఁడు దైవయోగంబున వేటకై కాంతా రవీథి కేగి। తిరిగియాటల శ్రాంతదేహుఁడై జమదగ్ని మునియాశ్రమముఁ జేరి మ్రొక్కి నిలువ। నామునీంద్రుఁడు రాజున గ్ధితోఁ బూజించి యారాజునకు రాజునను చరులకు। దన హోమధేనువుఁ దడయక రప్పించి యిష్టాన్నములు గురియింపఁ ద డవఁ। గుడిచి కూర్చుండి మొదవుపైఁ గోర్కెఁ జేసి। సంపదేటికి నీయావు చాలుఁ గాక। యిట్టిగోవుల నెన్నఁడు నెఱుఁగ మను చుఁ। బట్టి తెమ్మని తనయొద్దిభటులఁ బనిచె॥ వారలు దర్పంబునం జని॥ క॥ క్రేపుం బాపకుఁ డంచును। నాపదలం బడితి ననుచు నం భాయంచుం। జూపోర్వరు నృపులంచును। వాపోవ న్మొదవుఁ గొనుచు వచ్చిరి పురికిన్॥ అంత నర్జునుండు మాహిష్మతీపురంబు నకు వచ్చునెడ రాముం డాశ్రమంబునకేతెంచి॥ గీ॥ అద్దిరయ్య యింట నశనంబు గుడిచి మా। యయ్య వలదనంగ నాక్రమిం చి। కోరి మొదవు రాజు గొనిపోయి నాఁడటఁ। యేను రాముఁ డౌట యెఱుఁగఁ డొక్కొ॥ అని పలికి॥ మ॥ ప్రళయాగ్నిచ్ఛటభంగిఁ గుంభి విదళింపం బాఱు సింహాకృతిం। బెలుచన్ రాముఁడు లేచి వెంటనడిచెన్ బృథ్వీతలం బెల్లనా। కులమై క్రుంగఁగ ధారియై కవచియై కోదండియై కాండియై। * ఫలియై సాహసియై మృగాజినమనోజ్ఞశ్రోణియై తూణియై॥ చని మాహిష్మతీపురంబుఁ జేరి నిలుచున్న సమయంబున॥ మ॥ కనియె న్ముందటఁ గార్తవీర్యుఁడు సమిద్ధాక్షుం బ్రకాము న్సరా। సనతూణీరకు దారభీమున తిరోవప్రాంచలచ్ఛాయుగా। నన నేత్రాంచలసీము నైణపట నానామాలికోద్దాము నా। తన సంరంభ నరేంద్రదారళ భసూత్రచ్ఛాయమునిన్ రామునిన్॥ కని కోపించి॥ ఉ॥ బాలుఁడు వెఱ్ఱిబ్రాహ్మణుఁడు బ్రాహ్మణుకైవడి నుంట మాని భూ। పాలురతోడఁ భూరిజయభవ్యులతోడ భయంబు దక్కి క। య్యాలకు వచ్చినాఁడు మనయందుఁ గపాపము లేదు లెండు లెం। డేల సహింప భూసురుని నేయుఁడు వ్రేయుఁడు గూల్పుఁడిమ్మహిన్॥ వ॥ అని కదలించి దండనాయకులం బురికొల్పిన వారు రథగజతురగపదా తిసమూహసహితసప్తదశాక్షౌహిణులతో నెదురునడిచి శరచక్రగదాఖడ్గభిండివాలశూలప్రముఖసాధనంబుల నొప్పిం చిన నవ్విప్రుండుఁ గన్నులకొలంకుల నిప్పులకుప్పలు దెప్పలుగొన రెట్టించిన గట్టుకట్టలుక మిట్టిపడి యజ్ఞోపవీతంబు చక్కనిడికొ ని కరాళించి బిట్టు రెట్టించి కఠోరంబగు కుఠారంబు సారించి మూఁకలపైఁ గుటికితొలియాడి మొగంబునం గ్రొత్తయలుక నెట్టం గఁ జెట్టులుగొట్టు కృషీవలుని తెఱంగున బదంబులు దెంచుచు నటికంబంబులఁ దెగనడంచు నారామకారుని పగిది మధ్యం బులఁ ద్రుంచుచుఁ, దాలఫలంబులు రాల్చు పృథురోహకుని కైవడి శిరంబులఁ ద్రుంచుచు, మృగంబులఁ ఖండించు సూపకారు

* ఫలియై। నెవముగలవాఁడయి

నిభంగినవయవంబులఁ జెక్కుచు,నంతటం దనివిసనక విలయకాలకీలి కేళినిమంటలుమియుచు,విల్లందియొప్పెడంబిడుసులస్త్రో
నలుగురియబలు మొగుల్లవడువునన ప్రమాణంబులగు బాణంబులఁబఱపి సుభటసైన్యంబులకు దైన్యంబులిచ్చుచు, నడ్డం
బు లేనియార్భాటంబులుగలబాణవర్షఘృతంబులచేఁగోపానలంబున కాహుతులుసేయుచుఁదురంగంబులనిరంగంబులఁ
గావించుచు,రథంబులువితథంబులుగా నొనర్చుచు,ద్విరదంబులనరదంబులపైఁబడఁద్రోయుచునివ్విధంబున సేనలనంప
వానలముంచిరూపుమాపిన॥క॥మత్తిల్లిభూతజాలము।చిత్తంబులఁజొక్కి వేడ్కఁజిందులువాఱ। న్దొత్తిల్లిసమిత్తలమున।
నెత్తురుమేదంబుపలలనికరంబమెక్కెన్॥అయ్యవసరంబున॥క॥మేలీబ్రాహ్మణుఁడొక్కఁడు। నేలంబడఁగూల్చె సైన్యనిచయ
మునెల్ల।న్బాలార్ప నేలయీతనిఁ।గూలింపఁగాక నాదుదోర్బలము వడిన్॥అనిపలికి॥ ఉ॥ఒకయేనూఱుకరంబులన్ధను
వులెత్తియల్లాసరిమై తాల్చి వే।ఱొకయేనూటగుణధ్వనుల్నిగుడ శాతోగ్రాస్త్రముల్గూర్చి వి।ప్రకుతారంబునునిన్నుఁగూల్తున
నుచున్నర్జించిపుంఖానుపుం।ఖకఠోరంబుగనేసియార్చెరయరేఖోద్దామునిన్రామునిన్॥క॥వడిఁనూపులెగయగుఱుసులు।
వడి కార్ముకపంచశతముపఱగవిభుఁడుసాం। వడరేఁబరివేషమండలి। నడుమకరద్యుతులవెలయునలినాప్తుక్రియన్॥ ఇట్ల
ర్జునుండుబహువిలాసంబులుసూపిన॥మ॥ధరణీదేవుఁడురాముఁడాఢ్యుఁడుజగద్ధానుష్కరత్నంబునుం। పుష్కరచాపంబా
కటెక్క వెట్టిశరముల్సంధించి పెల్లేసిభూ। వరుకోదండములొక్కచూడ్కిఁదునిమెన్వాఁడంతటంబోక వే। తరువుల్ ఉ
వ్వఁగుతారధారనటికెక్కిదద్బాహుసందోహముల్॥ క॥ కరములుమునిసిననతనికి।శిరమొక్కటి చిక్కెశైలశిఖరముభం
గిం।బరశువుననదియుఁద్రుంచెను।బరసూదనుఁడైనఘనుఁడు భార్గవుఁడు వడిన్॥ గీ॥తండ్రి వడిననతనితనయులుపదివేలు।
దలఁగిపోయిరతనిఁదాఁక లేక।పరభయంకరుండుభార్గవుండంతనా।గోవుఁగ్రేపుఁదోడఁగొనుచుఁజనియె॥వ॥ఇట్లు హో
మధేనువునట్లఁదెచ్చియిచ్చితనపరాక్రమంబుదండ్రికిం,దోఁబుట్టువులకుం దెలియం జెప్పినజమదగ్ని రామునకిట్లనియె॥
క॥కలవేల్పులెల్లఁదమతను।చెలువంబులు దెచ్చి రాజుఁజేయుదురకటా।బలువేల్పు రాజువానిం।జలమున నిన్నేలపోయిచంపి
తిపుత్రా॥ క॥తాలిమి మనకును ధర్మము।తాలిమి మూలంబు మనకు ధన్యత్వమునం।దాలిమిగలదని యీశుం।డేలించును బ్ర
హ్మపదము నెల్లన్మనలన్॥ క॥ క్షమగలిగినసిరిగలుగును।క్షమగలిగిన వాణిగలుగు సౌఖ్యము లెల్లన్।క్షమగలుగ ముక్తిగలు
గును।క్షమగలిగినమెచ్చు శౌరిసదయుఁడు తండ్రీ॥ క॥ పట్టపురాజును జంపుట।కట్టలుకన్విప్రుఁ జంపుకంటెను బాపం।బట్టిట్ట
నకుమునీ। చెట్టసెడన్దీర్థ సేవసేయుము దనయా॥క॥అనితన్నుఁదండ్రి పంచినఁ। బనిపూని ప్రసాదమనుచు భార్గవుఁడుర
యంబుననొక యేఁడు ప్రయాణము।చని తీర్థము లెల్లనాడి చనుదెంచెన్నృపా॥ ఉ॥ఆమెడనొక్కనాఁడు సలిలార్థము రేణుక
గంగలోనికిం।బోయిప్రవాహమధ్యమునఁబొల్పుగనచ్చరలేమపిండుతోఁ। దోయవిహారముల్సలుపు దుర్లభుఁజిత్రరథు
న్సరోజమాలాయుతుఁజూచుచుండెఁబతియాజ్ఞ దలంపక కొంతప్రేమతోన్॥వ॥ఇట్లు గంధర్వవల్లభునిం జూచుకారణంబు
నఁదడసి॥ఉ॥ అక్కటవచ్చి పెద్దతడవయ్యెడి హోమము వేళదప్పె నే।నిక్కట నేలయుండితిమునీశ్వరుఁడేమను నోయ
టంచుఁదాఁ। గ్రక్కునఁదోయకుంభముశిరస్థలమందిడి తెచ్చియిచ్చె వే। మ్రొక్కి కరంబు మోడ్చి పతిముందట నల్లన నిల్వఁ
జూచుచున్॥అప్పుడు॥క॥చిత్తమునభార్యదడసిన।వృత్తాంతంబెఱిఁగి తపసి వేగన సుతులన్।మత్తందీనింజావఁగ।మొత్తుండ
నమొత్తరైరిమునుఁగుచువారల్॥క॥కడుకొని పెండ్లము జంపని।కొడుకుల బెండ్లాముఁ జంపఁ గురుఁడొసఁగినఁదా।నడుగు
లకు నెఱఁగి రాముం।డకుఁగిడకుండంగఁద్రుంచెనన్నలఁదల్లిన్॥శా॥తల్లిన్ భ్రాతలనెల్లఁ జంపుమనుచోఁదాఁజంపరాకున్నఁ
జెం।పెల్లం బోవశపించుఁదండ్రితనపెంపేచేయుడున్మెచ్చినా।తల్లిన్భ్రాతలనిచ్చునిక్కముతపోధన్యాత్ముఁడంచున్ వేఁ।
దల్లిన్భ్రాతలజంపెభార్గవుఁడు వేఁదాఁజంపఁజెయ్యాడునే॥ఇవ్విధంబున.క॥అడ్డము సెప్పకకడపటి।బిడ్డఁడు రాముఁడుసు
తులఁబెండ్లమునచట।న్దొడ్డంటం దెగనడిచిన।జడ్డనఁదలయూఁచి మెచ్చి జమదగ్ని మదిన్॥ క॥ మెచ్చినతండ్రినిఁగనుఁగొని।
చెచ్చెరనీపడినవారి జీవంబులు నీ।విచ్చితి ననుమని మ్రొక్కిన।నిచ్చెన్వారలును లేచి రెప్పటిభంగిన్॥గీ॥పడినవారిమఱల బ్ర
తికింపనోపును। జనకుఁడనుచుఁ జంపెఁ జామదగ్ని। యతఁడుసంపెననుచునన్నలఁదల్లిని॥జనకునాజ్ఞనైనఁ జంపఁదగదు.
సీ॥పరశురామునికోడి పరుసులు వెట్టినయర్జునపుత్రకులాత్మయందుఁ। దండ్రిప్రస్తుటకుసంతప్తులై పొగలుచునింతటనం
తటనెడరువేఁది।తిపిరియాడుచునొక్కదివసమందారాముఁడడవికన్నలతోడనరుగుపిదపఁ। బగఁదీర్పఁదలఁచియేపరతెంచి
హోమాలయంబున సర్వేశునాత్మనిలిపి।నిరుపమధ్యానసుఖవృత్తినిలిచియున్న। పుణ్యుజమదగ్నినండఁబుపొదివిపట్టిక
దలకుండంగఁదలఁద్రెంచికొనుచుఁజనిరి। యడ్డమేతెంచి రేణుకయడచికొనఁగ॥మ॥జనకుంజంపినవైరమున్దలఁచి రాజన్యా
త్మజులెన్నఁడుమిమాజనకుంజంపిరిరామరామరిపులన్నాసింతురమ్మంచునన। మ్మునిపైవ్రాలెలతాంగిమోదికొనుచున్సమ్మయ్యో

లును, పౌరవియందు సుభద్రుండును, భద్రబాహుండును, దుర్మదుండును, భద్రుండును, భూతాదులుం గూడం బన్నిద్దఱును మదిరయందు నందోపనందకృతక శ్రుతశూరాదులును, కౌశల్యయందుఁ గేశియు, రోచనయందు హస్తహేమాంగాదులును, నిళయందు యదుముఖ్యులైన యురువల్కాదులును, సహదేవియందుఁ ద్రిపృష్ఠుండును, శాంతాలిదేవాత్మజయందుఁ బ్రశ్రమ ప్రశ్రితాదులును, నుపదేవియందుఁ గల్పవృష్ట్యాదులు పదుండ్రును, శ్రీదేవియందు వసుహంససుధన్వాదులాఱ్వురును, దేవరక్షితయందు గదాదులు తొమ్మండ్రును, సహదేవయందుఁ బురూథ శ్రుత ముఖ్యాదులెనమండ్రును, దేవకీదేవియందుఁ గీర్తిమంతుండును, సుషేణుండును, భద్రసేనుండును, ఋజువును, సమదనుండును, భద్రుండును, సంకర్షణుండును, వారేడ్వురు పుట్టిరి మఱియును॥ క॥ దుష్టజననిగ్రహంబును। శిష్టజనానుగ్రహంబు సేయుటకొఱకై । యష్టమగర్భమున గుణో।త్కృష్టుఁడు దేవకికి విష్ణుదేవుఁడు పుట్టెన్॥ గీ॥ విష్ణుఁడుదితుఁడైన వెనుక నా దేవకి। భద్రమూర్తియగు సుభద్రఁ గనియె। నా గుణాఢ్యము త్తవసునీకు నర్జుని। దయితయనఁగఁ జేసి ధరణినాథ॥ క॥ ఎప్పుడు ధర్మక్షయమగు । నెప్పుడు పాపంబు వొడమును లోకములో। నప్పుడు విశ్వేశుఁడు హరి। దప్పక విభుఁడయ్యుఁ దన్నుఁ దా సృజియించున్॥ క॥ తనమాయ లేకఁ బగునకు। ఘనునకునీశ్వరునకాత్మకర్తకు హరికిన్। జనములకుఁ గర్మములకును। మనుజేశ్వర కారణంబు మఱియును గలదే॥ క॥ తలఁపఁగ నెవ్వనిమాయా। విలసనములు జననవృద్ధివిలయంబులను। గ్గలిమికనుగ్రహమోక్షం।బులకును జీవునికి మూలములు నాకెపుడున్॥ సీ॥ అట్టి సర్వేశుని కరయంగ జన్మాదిపరతంత్రభావమెప్పాటిఁ గలదు। రాజలాంఛనముల రాక్షసవల్లభులక్షౌహిణీశులై యవనిఁ బుట్టి। జనులను బాధింప శాసించుకొఱకునై సంకర్షణునితోడ జననమంది। యమరుల మనములకైన లెక్కింపంగరాకుండునట్టి కర్మములఁ జేసి। కలియుగంబున జన్మింపఁగలుగు నరుల। దుఃఖజాలంబులన్నిటిఁ దొలఁగనడచి। నేలప్రేగెల్ల వారించి నిఖిలదిశల। విమలకీర్తులు వెదఁజల్లి వెలసె నధిప॥ క॥ మంగళహరికీర్తిమహా।గంగామృతమించుకైనఁ గర్ణాంజలుల। న్సంగతము సేసి త్రావఁ దొలంగును గర్మంబులావిలంబసుచున్నృపా॥ క॥ వనజాక్షుని మందస్మిత। ఘనకుండలదీప్తిగండకలితాననమున్। వనితలు పురుషులు సూచుచు। ననిమిషభావంబు లేమి కలయుమ రధిపా॥ సీ॥ జనకుని గృహమున జన్మించియుందలోఁ బెరిగి శత్రులనెల్లఁ బీఁచమడఁచి। పెక్కండ్రు భార్యలఁ బెండ్లియై సుతశతంబులఁ గాంచి తనునాదిపురుషుఁ డర్చి। శరణన్నవారినిఁ గరుణించి పాండవకౌరవులకు నంతకలహమైన। నందఱ సహయించి నర్జును గెలిపించి యుద్ధవునకుఁ దత్త్వమొప్పఁ జెప్పి। మగధపాండవసృంజయమధుదశార్హ। భోజవృష్ణ్యంధకాదిసంపూజ్యుఁడగుచు। నుర్విభరము నివారించి యుండనొల్ల। కా మహామూర్తి నిజమూర్తియందుఁ బొందె॥ చ॥ నగుమొగమున్ సుమధ్యమును నల్లని దేహము లచ్చికాటపట్టగు నురమున్ మహాభుజములంచితకుండలకర్ణమల్మదే। భగలీయు నీలవేణియుఁ గృపారసదృష్టియుఁ గల్గు వెన్నుఁడి। మ్ముగఁ బొడసూపుఁగాత కనుమూసినయప్పుడు విచ్చినప్పుడున్॥ అని చెప్పి॥ ... ... ... ... ... ... ... ... ...

క॥ జనకసుతాహృచ్చోరా। జనకవచోలబ్ధవిపినశైలవిహారా। జనకామితమందారా। జనకాలిపహేశ్వరాతిశయసంచారా॥

మాలిని॥ జగదుపవనచారీ సర్వలోకోపకారీ। సుగుణఘనవిహారీ సుందరీమానహారీ।
విగతకలుషదోషీ వీరవిద్యాభిలాషీ। స్వగురుహృదయపోషీ సర్వదాసత్యభాషీ॥

గద్య॥ ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు సూర్యవంశారంభంబును, వైవస్వతమనుజన్మంబును, హైమచంద్రకథనంబును, సుద్యుమ్నాదిమనుసూనుల చరిత్రంబును, మరుత్తు తృణబిందు శర్యాతి కకుద్మి, నగర నాభాగ ప్రముఖుల చరిత్రంబు, నంబరీషునియందుఁ బ్రయోగింపంబడిన దుర్వాసునికృత్య నిరర్థకయగుటయు, నిక్ష్వాకు వికుక్షి మాంధాతృ పురుకుత్స హరిశ్చంద్ర సగర భగీరథ ప్రముఖుల చరిత్రంబును, భాగీరథీప్రవాహవర్ణనంబును, గల్మాషపాద ఖట్వాంగ ప్రముఖుల వృత్తాంతంబును, శ్రీరామచంద్రకథనంబును, తదీయవంశపరంపరాగణనంబును, నిమికథయును, జంద్రవంశారంభంబును, బుధపురూరవుల కథయును, జమదగ్నిపరశురాముల వృత్తాంతంబును, విశ్వామిత్ర నహుష యయాతి పూరు దుష్యంత భరత రంతిదేవ పాంచాల బృహద్రథ శంతను భీష్మపాండవ కౌరవముఖరుల జన్మంబును, ఋశ్యశృంగవ్రతభంగంబును, ద్రుహ్యానుదుర్వసుల వంశంబును, యదు కార్తవీర్య శశబిందు జామదగ్న్యాదుల చరిత్రంబును, శ్రీకృష్ణావతారకథాసూచకంబును, ననుకథలుగల నవమస్కంధము సంపూర్ణము.

⟶ శ్రీ ⟵

శ్రీరుక్మిణీసత్యభామాసమేత శ్రీగోపాలకృష్ణార్పణమస్తు.



శ్రీ

రుక్మిణీసత్యభామాసమేత శ్రీగోపాలకృష్ణపరబ్రహ్మణేనమః.

# శ్రీమదాంధ్రభాగవతము - దశమస్కంధ ప్రారంభము.

## పూర్వభాగము.

*శ్రీకంఠచాపఖండన। పాకారిప్రముఖవినుతభండనవిలస। త్కాకుత్స్థవంశమండన। రాకేందుయశోవిశాలరామనృపాలా॥

వ॥ శ్రీమహనీయగుణగరిష్ఠులగునమ్మునిశ్రేష్ఠులకునిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైనసూతుండిట్లనియెనట్లుపరీక్షిన్నరేంద్రుండుశుకయోగింగనుంగొని. క॥ తెలిపితివిసోమసూర్యుల। కులవిస్తారంబువారికులముధరిత్రీ।శులనడువడ్లనువింటిమి। కలరూపము లెల్లమాకుఁగడు వెఱఁగులుగన్॥ క॥ ‡శీలముగలయదుకులమున। నేలాపుట్టెనుమహాత్ముఁడీశుఁడువిష్ణుం। డేలీలమెలఁగెనెయ్యె। వేళలనేమేమిఁచేసెవివరింపుతగన్॥ క॥ †భవములకుమందుచిత్త। శ్రవణానందమునుముముక్షుజనపదముహరి। స్తవముపశుఘ్నుఁడుదక్క। నుచెవులకుఁదనివయ్యెననెడిచెనఁటియుఁగలఁడే॥ క॥ మాపెద్దలుమునువేల్పులునోపనిభీష్మాదికురుకులోత్తము¶సేనా। మూపారమునేకోలము। ప్రాపునలంఘించిరొక్క బాలపదముగన్॥ క॥ మాయమ్మకుక్షిగురుసుత। సాయకపీడితుఁడనైనజడుననన్నుంగాంచి। తేయకురుకులముమొదలగు। నాయుత్తముఁడాత్తచక్రుఁడైరక్షించెన్॥ గీ॥ కలసిపురుషమూర్తికాలరూపములను। లోకజనులవెలియులోననుండి। జన్మమృత్యువులనుసంసారముక్తుల। నిచ్చునతనిచరితమెల్లఁజెపుము॥ సీ॥ ఊహించిరాముఁడురోహిణికొడుకంచునప్పుడయోగీంద్రచెప్పితీవు। దేవకికడుపుననేవెరవుననాతఁడుండెనుదేహంబునొండులేక। తనతండ్రియిలువాసివనజాక్షుఁడేరీతిమందకుఁబోయనేమందిరమున। నుండినెయ్యదిసేయుచుండెనుదనమేనమామకంసునినేలనామాసుడఁచె। నెన్నియేండ్లుమానియెనిలమీఁదమనుజుఁడై। యెందఱైరిభార్యలెట్లుమెలఁగె। మఱియునేమిచేసెమాధవుసంచార। మెంతగలదునాకునేర్పరింపు॥ అనిమఱియునిట్లనియె॥ గీ॥ నీముఖాంబుజాతనిర్ముక్తహరికథా। మృతముఁద్రావఁద్రావమేనువదలె। ఋవంతమానెనీరువట్టునాఁకలియును। దూరమయ్యెమనముతొంగలించె॥ అనిపలుకుచున్నరాజుమాటలువిని§వైయాసియిట్లనియె॥ క॥ విష్ణుకథారతుఁడగునరు। విష్ణుకథల్సెప్పనునుచువినుచుండునరు। న్విష్ణుకథాసంప్రశ్నము। ✡విష్ణుపదీజలముభంగివిమలులఁజేయున్॥ సీ॥ రాజేంద్రవినుతొల్లిరాజలాంఛనములవేలసంఖ్యలదైత్యవిభులుదన్ను। నాక్రమించినభారమాగఁజాలకభూమిగోరూపయైబ్రహ్మఁజేరఁబోయి। కన్నీరుమున్నీరుగారోదనముసేయఁగరుణతోభావించికమలభవుఁడు। ధరణినూరడఁబల్కి ధాత్రియువేల్పులుగదలిరావిష్ణునిఁగాననేగి। పురుషసూక్తంబుఁజదివియచ్యుతసమాధి। నుండనొకమాటవినివారిజోద్భవుండు। వినుఁడువేల్పులుధరయునేవిన్నయట్టి। పలుకువివరింతుననిప్రీతిఁబలికెఁదెలియ॥ క॥ యాదవకులముననమరులు। మేదినిపైఁబుట్టఁజనుఁడుమీయంశములన్। శ్రీదయితుఁడువసుదేవున। కాదరమునఁబుట్టిభారమంతయుఁబాపున్॥ క॥ హరిపూజార్థమువుట్టుడు। సురకన్యలుభూమియందుసుందరతనులై। హరికగ్రజుఁడైశేషుఁడు। హరికళతోఁబుట్టుఁదనప్రియారంభుండై॥ గీ॥ ఈప్రపంచమెల్లనేమాయచేమోహి। తాత్మయగుచునుండునట్టిమాయ। కమలనాభునాజ్ఞకార్యార్థమైనిజాం। శంబుతోడఁబుట్టుఁగతియందు॥ వ॥ అనియిట్లువేల్పుల✡నియ్యకొలిపిపుడమిముద్దియనెడంబఱచితమ్మిచూలితనమొదలినెలవునకుంజనియెనంతయమవిభుండైనశూరసేనుండనువాఁడుమథురాపురంబుతనకురాజధానిగామాథురంబులుశూరసేనంబులనియెడుదేశంబులేలెంబూర్వకాలంబున॥ క॥ ఫమథురయందుఁబ్రియమున। శ్రీమన్నారాయణుండుచెలఁగునునిత్యం। బామథురనగ

---

*శ్రీకంఠచాపఖండన॥ శ్రీకంఠ। గరళకంఠుఁడైనశివునియొక్క, చాపఖండన। విల్లునువిరిచినవాఁడా, పాకారిప్రముఖ। ఇంద్రుఁడుమొదలగుదేవతలచేత, వినుత। కొనియాడఁదగిన, భండన। యుద్ధముగలవాఁడా. విల-।-డన॥ విలసత్। మిక్కిలిమెఱయుచున్న, కాకుత్స్థవంశ। సూర్యవంశమునకు, మండన। భూషణమువంటివాఁడా. రాకేం-।-విశాల॥ రాకేందు। పూర్ణచంద్రునివంటి, యశో। కీర్తిచే, విశాల। అమితమగుకీర్తిగలవాఁడా, రామచంద్రా। రాముఁడనురాజా.— శ్రీమహనీయగుణగరిష్ఠులగు॥ మహనీయ। మనోహరములైన, గుణ। గాంభీర్యాదిగుణములకు, గరిష్ఠులగు। భారవాహకులైన, వైఖరి। క్రమముతోడ. ‡శీలముగల। యయాతిశాపముగలిగిన. †భవము। జన్మము-పాపము. ¶సేనామహాపారమున్। సైన్యమనుసముద్రమును, ఏకోలము। ఏతెప్పయొక్క. ఋవంత। దుఃఖము, నీరువట్టు। డప్పి, తొంగలించెన్। ప్రకాశించెను-నిర్మలమయ్యెను. §వైయాసి। వ్యాసపుత్రుఁడైనశుకుఁడు. ✡విష్ణుపదీ। గంగ. ✡ఇయ్యకొలిపి। సమాధానపఱచి, పుడమిముద్దియన్। భూదేవిని, తమ్మిచూలి। బ్రహ్మ, నెలవు। స్థానము, రాజధాని। ముఖ్యపట్టణము.

లయాదవ! భూమీశులకెల్ల మొదలిపురియయ్యె నృపా॥ సీ॥ ఆశూరసేనున కాత్మజుండగు వసుదేవుఁ డాపురి నొక్క దినము
నందు। దేవకిఁ బెండ్లియై దేవకియును దానుఁ గడు వేడ్క రథమెక్కి కదలు వేళ। నుగ్రసేనుని సుతుండుల్లాసి కంసుఁడు చెల్లెలుపై
అదియునుల్లసిల్లి। *హారులపగ్గములఁ జేనంది †శిరొప్పఁ దొడంగె ముందర భేరులు మురజములును। శంఖపటహములును జడి
గొని మ్రోయంగ। సూఁతుతోడ వేడ్క కొనలుసాఁగ। దేవకుండు సుతకు దేవకీదేవికి। నరణమీఁదలంచి యాదరించి॥ వ॥ సార్థం
బులైన రథంబుల వేయిన్నెనమన్నూటిని గనకదామసముత్తుంగంబులైన మాతంగంబుల నన్నూటిని బదివేల తురంగంబుల
నువిలాసవతులైన దాసీజనంబుల నిన్నూటి నిచ్చి యనిచిన నంగదలి వరవధూయుగళంబు తెరువునఁ జనుసమయంబున॥ క॥ ప
గ్గములు వదలి వేగిర। ¶మగ్గలముగ రథముఁ గడుపు నా కంసుఁడు లో। బెగ్గిలి యొగ్గనితలఁపఁగ। దిగ్గనన శరీరవాణి దివినిట్లని
యెన్॥ క॥ ‡తుష్టయగు భగిని మెచ్చఁగ। నిష్టుఁడవై రథముఁ గడపెదెలుఁగవు మీఁద। న్నిష్టయగు నీతలోదరి। యష్టమగర్భంబు ని
న్నుహరియించుఁ జుమీ॥ వ॥ అని యిట్లాకాశవాణి పలికిన నులికిపడి భోజకులపాంసనుండైన కంసుండు సంచలదంసుండై ‡య
డిదంబు బెడిదంబుగఁ బెటీకి ఝుళిపించి దెప్పరంబున నను జకొప్పుఁ బట్టి కప్పారగపాటున నొప్పు అందిగిచి యొడిసిపట్టి తోఁబుట్టు
వనితలంపక తెంపుఁ జేసి తెగ వ్రేయఁ గమకించు సమయంబున వసుదేవుండు డగ్గరి॥ క॥ ఆపాపచిత్తు నుత్తుం। గోపాగ్నిశిఖాను
వృత్తుఁ గొనకొనితనస। ల్లాపామృతధారావి। క్షేపణమునఁ గొంత శాంతుఁ జేయుచుఁ బలికెన్॥ ఉ॥ అన్నవు నీవు చెల్లెలికి న
క్కటమాడలు చీరెలిచ్చుటో। మన్ననసేయుటో మధురమంజులభాషల నాదరించుటో। మిన్నుల మ్రోఁత లేనిజము మేలని
చంపకుమన్నమానిరా। పన్నసహింపుమన్న తగదన్న వధింపకుమన్న వేఁడెదన్॥ అదియును గాక॥ మ॥ చెలియల్ కన్నియ
ముద్దరాలబలనీ సేమంబె చింతించుని। ర్మలదీనిన్బయలాడుమాటలకునై మర్యాదఁ బోఁగొట్టిన। తుక్కలజాతుండవు పుణ్య
మూర్తివకటా కోపంబు పాపంబు నె। చ్చెలినోహో తెగ వ్రేయఁ బాడియగునే చింతించు భోజేశ్వరా॥ సీ॥ మేనితోడన పు
ట్టు మృత్యువు జనులకు నెల్లి నేఁడైన నూఱేండ్లకైనఁ। దెల్లంబు మృత్యువు దేహంబు పంచత నొందఁ గర్మానుగుఁడై శరీరి। మా
రు దేహముఁ జొచ్చి మఱి తొంటి దేహంబుఁ బాయును దనపూర్వభాగమెత్తి। వెఱొంటిపైఁ జెట్టి వెనుకభాగం బెత్తఁగ మనిం
చు ‡తృణజలూకయును బోలె। వెంటవచ్చు కర్మవిసరంబుమును మేలు। కన్నవేళ నరుఁడు గన్నవిన్న। తలఁపఁబడిన కార్యతం
త్రంబు కలలోనఁ। బాడితోడఁ గానఁబడిన యట్లు॥ క॥ తనతొంటికర్మరాశికి। ననుచరమై బహువికారమైమనము వడిన్। జను
నింద్రియముల తెరువులఁ। దనువులు పైకొనఁ జెడవు తనకర్మంబుల్॥ గీ॥ జలఘటానులందుఁ జంద్రసూర్యాదులు। గాడ్పఁ బ
డుచు గాలిఁ గదలుభంగి। నాత్మకర్మనిర్మితాంగంబులను బ్రాణి। గదలుచుండు రాగకలితుఁ డగుచు॥ క॥ కర్మములు మేలు నిచ్చె
డుఁ గర్మంబులు కీడు నిచ్చుఁ గర్తలు దనకున్। గర్మములు బ్రహ్మకైనను। గర్మగుఁడై పరులఁ దడవఁగా నేమిటికిన్॥ క॥ కావునఁ బరు
లకు హింసలు। గావింపఁగవలదు తనకుఁ గల్యాణముగా। భావించి పరుల నొంచినఁ। బోవునె తత్ఫలము పిదపఁ బొందక యున్నే॥
మత్తకోకిల॥ వావిఁ జెల్లెలుగాని కూఁతురు వంటిదుత్తమురాలు సం। భావనీయచరిత్ర భీరువు బాలనాత్మ వివాహసు। శ్రీవి
లాసినీ దీనఁ గంపితచిత్త నీకిదె మ్రొక్కెదం। గావవే కరుణామయాత్మక కంసమానవవల్లభా॥ వ॥ అనిమఱియు సామభేదం
బులగు పలుకులు పలికిన విని యు వాఁడు వేఁడిచూపుల రాలు నిప్పులు కుప్పలు గొన §వనుకంప లేక తెంపుఁ జేసి చంపకగంధిం జం
పఁ జూచుట నెఱింగి మొఱంగెడి తెఱంగు విచారించి తనలో నిట్లని యె॥ క॥ ఎందును గాలము నిజమని। పందతనంబునను బుద్ధిఁ బా
యక ఘనులై। యెందాఁక బుద్ధి నెగడెడి। నందాఁక నుఁ జరింపవలయు నాత్మబలమునన్॥ అని నిశ్చయించి॥ సీ॥ ఆపన్నరాలైన
యంగన రక్షించి సుతుల నిచ్చెదనన్న శుభము నేఁడు। మీఁదెవ్వఁడెఱుఁగును మేలఁత ప్రాణముతోడ నిలిచిన మఱునాఁడు నేర
రాదె। సుతులు పుట్టరియే ని సుతులకు మృత్యువు వాలాయమై వెంటవచ్చె నేని। బ్రహ్మచేతను వీఁడు పాపేమియును లేక యుం
డు నే సదుపాయ మొకటి లేదె। పొంత మ్రాకుల గాల్పక పోయి వహ్ని। యొగసి ‖దవ్వుల వాని దహించుభంగిఁ। గర్మవశము
న భవ మృతి కారణంబు। దూరగతిఁ బొందునిదియేల తొట్రుపడఁగ॥ క॥ కొడుకుల నిచ్చెదననిసతి। విడిపించుట నీతి వీఁడు విడిచిన
మీఁద। న్కొడుకులు పుట్టిన కార్యము। దడఁబడ దేనాఁటికొక్కదైవము లేదే॥ క॥ ఎనిమిదవ చూలు వీనిన్। దునుమాడెడి నంచు మింట
దోరపు పలుకు। ల్వినఁబడియె నేల తప్పును। వనితను విడిపించుటొప్పు ‡వైళంబనుచున్॥ క॥ తిన్నని పలుకులు వలుకుచుఁ। గ్రన్న

*హారులపగ్గములు।గుఱ్ఱములనీడ్చిపట్టుత్రాళ్లు. †శిరొప్పఁదొడంగెన్।తోలుటకారంభించెను. మురజ।మద్దెల, పటహ।తప్పెట, కనకదామ।బంగారుగొలుసులు. సముత్తుంగ।మిగులపొడవులైన, మాతంగ।ఏనుఁగు, తురంగ।గుఱ్ఱము, అనిచినన్।పంపఁగా. ¶అగ్గలము।అధికము, బెగ్గిలి।భయపడి. ‡తుష్టయగుభగిని।తుష్టయగు।సంతసిల్లుచున్న, భగిని।తోఁబుట్టిన దేవకీదేవి. ‡అడిదము।కత్తి. ‡తృణజలూక।పచ్చికపురుగు, విసరము।సమూహము. §అనుకంప।దయ, మొఱంగెడి।ఏమఱించెడు. ‖దవ్వులవానిన్।దూరమునందుండెడివానిని. ‡వైళము।క్రన్నన-శీఘ్రము.

నఁదగఁ బూజఁ జేసి కంసుఁ *నృశంసు।న్మన్నించి చిత్తమెఱియఁ బ్ర।సన్ననుఁడగుచుఁ బలికె శౌరి నయమునన్ ॥క॥ లలనకుఁ
బుట్టిన కొమరుని। వలనం దెగెదనుచు గగనవాణి పలికెనం। చలిగెద వేని మృగాక్షికిఁ। గలకొడుకులఁ జంపనిత్తుఁ గ్రమమున నీ
కున్ ॥వ॥ అని యిట్లు పలికిన విని కంసుండు కంపి‡తావతంసుండై సంతసించి గుణగ్రాహిత్వంబు గైకొని కొండలమందు చెలి
యలి ముందల విడిచిచనియె వసుదేవుండును బ్రతుకుమందలఁ గంటిననుచు సుందరీయుందానును మందిరంబునకుం బోయి డెం
దంబున నానందంబు నొందియుండె నంతఁ గొంతకాలంబు చనిన సమయంబున ॥క॥ ఎడపక కంసుని యొద్దను। బడి దేవకి నిఖిల దే
వభావము దనకే। గ్రపడ నేఁట నొకని లెక్కను। గొడుకుల నెనమండ్రనొక్కకూఁతుం గనియెన్ ॥అందు॥ గీ॥ సుదతి మున్ను గన్న సుతుఁ
గీర్తిమంతుని। పుట్టుఁ డడవఁ గంసభూవరునకుఁ। దెచ్చియిచ్చెఁ జాలధృతిగల్గి వసుదేవుఁ। డాసపడక సత్యమందు నిలిచి ॥క॥ పలి
కిన పలుకులు దిరుగక। సొలయక వంచనము లేక సుతులరిపునకున్। గలఁగక నిచ్చిన ధీరుం। డిల వసుదేవుండు దక్క నితరులు గల
రే॥ గీ॥ మానవేంద్ర సత్యమతికి మచ్చరమెయ్యది। తెలుఁగ నేర్చువానికిష్టమెయ్యది। ఈశభక్తిరతునికి రానిదెయ్యది। యెఱుఁగ
లేనివానికేది కీడు॥ ఇట్లు సత్యంబుఁ దప్పక కొడుకు నొప్పించిన వసుదేవు పలుకులు విని నిలుకడకు మెచ్చి కంసుండిట్లనియె॥ గీ॥ కొ
డుకు నీవు మఱలఁ గొనిపొమ్ము వసుదేవ। వెఱపు లేదు నాకు వీనివలన। నల్గవీనికి భవదష్టమపుత్రుండు। మృత్యువట వధింతు మీఁ
దనతని ॥వ॥ అనినశౌ నానకదుందుభి నందనుం గొనిచనియు నానందంబు నొందక దుష్టభావుండగు బావపలుకులు వినియును లు
కుచుండె నంత ॥సీ॥ ఒకనాఁడు నారదుం †డొయ్యనఁ గంసుని యింటికిఁ జనుదెంచి యేకతమున। మందలోపలనున్న నందాదు
లును వారి భార్యలు పుత్రులు బాంధవులును। దేవకి మొదలగు తెఱవలు వసుదేవుఁ డాదిగాఁ గల సర్వయాదవులును। సురలు
గాని నిజంబు నరులు గారని చెప్పి కంసుండ నీవు రక్కసుఁడవనియు। దేవమయుఁడు చక్రి దేవకీదేవికిఁ। బుత్రుఁడై జనించి భూ
తలంబు। చెఱుపఁ బుట్టినట్టి చెనఁటి దైత్యుల నెల్లఁ। జంపుననుచుఁ జెప్పిచనియె దివికి॥ క॥ నారదుమాటలు విని పెల్లారాటముఁ
బొందియము‖లనిమిషులనియున్। నారాయణ కరఖడ్గవి। దారితుఁడగు కాలనేమి దాననియు మదిన్॥ వ॥ కలగంబాఱి మ
అందిఁ జెల్లెలి నుగ్రక్రోధుఁడై పట్టి బద్ధులఁ గావించి హరింపఁ దలంచి వెసఁ దోడ్తో వారు గన్నట్టి పుత్రులఁ జంపె న్నుగ్రసే
నుయదుభోజాంధకాధీశుని। ర్మలుఁ బట్టెన్ గడువ్రాలి మేలెఁ జలమారన్మార సేనంబులన్॥ గీ॥ తల్లిఁ దండ్రి నైనఁ దమ్ముల
నన్నల నఖులనైన బంధుజనులనైన। రాజ్యకాంక్షఁ జేసి రాజులు చంపుదు। రవనిఁ దఱచు జీవితార్థులగుచు॥ వ॥ మఱియు బా
ణభౌమమాగధ మహాశన కేశి ధేనుక బక ప్రలంబ తృణావర్త చాణూర ముష్టికారిష్ట ద్వివిద పూతనాది సహాయసమేతుండై
కంసుండు ❖కదనంబున మదంబు లడంచిన వదనంబులు వంచికొని సదనంబులు విడిచి యదవదలై యదువులుపవులు వదిలి నిష
ధకురుకోసల విదేహ విదర్భ కేకయ పాంచాల సాల్వ దేశంబులు సొచ్చిరి మచ్చరంబులు విడిచి కొందఱు కంసుని గొలిచిరం
త॥క॥ ※తోడితోడిఁ గంసుఁడు దేవకి। కొడుకుల నార్వుర వధింపసురు శేషాఖ్యం। బొడవగు హరిరుచి యాసతి। కడుపున నేడవ
దియైన గర్భంబయ్యెన్॥ అయ్యవసరంబున విశ్వరూపుండగు హరి తన్ను నమ్మిన యదువులకుఁ గంసునివలన భయంబు గలుగు
ననియెఱింగి యోగమాయాదేవికిట్లనియె॥ సీ॥ గోపికాజనములు గోపాలకులునున్న పసులమందకుఁ బొమ్ము భద్ర నీవు। వసు
దేవు భార్యలు వరుసఁ గంసునిచేత ♣నాఁకలఁ బడియుండ నందుఁ జొరక। తలఁగి రోహిణియను తరలాక్షి నందగోకులమందు
నున్నది సుణగణాఢ్య। దేవకి కడుపున దీపించు శేషాఖ్యమైన నా తేజమీవు మరఁ బుచ్చి। నేర్పు మెఱసి రోహిణీదేవి కడుపునఁ జొ
నుపు దేవకికి నీ సుతుఁడనగుదు। నంశభాగయుతుఁడనై యశోదకు నందు।పాలఁతి కడుపునందుఁ బుట్టెదీవు॥ క॥ నానావిధసంప
దలకుఁ §దానకమై సర్వకామదాయిని వగుని। న్మానవులు భక్తిఁ గొలుతురు। కానుకలును బలులు నిచ్చి కల్యాణమయీ॥ వ॥ మ
ఱియు నిన్ను మానవులు దుర్గ భద్ర కాళి విజయ వైష్ణవి కుముద చండిక కృష్ణ మాధవి కన్యక మాయ నారాయణీశాన శారదాం
బికయను పదునాలుగు నామంబులం గొనియాడుచు రాయాస్థానంబులయందని యెఱింగించి సర్వేశ్వరుండగు హరి పొమ్మని
యానతిచ్చిన మహాప్రసాదంబనియవ్యోగనిద్ర యియ్యకొని మ్రొక్కి చయ్యన నియ్యిలకయ్యెడ వాసి వచ్చి॥ గీ॥ దేవకీదేవి
కడుపులోఁ దేజరిల్లు। దీప్తగర్భంబు మెల్లనఁ దిగిచి యోగ।నిద్ర రోహిణి కడుపున నిలిపి చనియెఁ। గడుపు దిగెనంచుఁ బౌరులు గ
లఁగఁబడఁగ॥ అంత॥ గీ॥ బలము మిగులఁ గలుగ బలభద్రుఁ డనలోక।రమణుఁడగుటఁ జేసి రాముఁడనఁగ। సలికిఁ బుట్టె గర్భసం
కర్షణమున సం।కర్షణుండనంగ ఘనుఁడు సుతుఁడు॥ తదనంతరంబ॥క॥ ¶ఆనకదుందుభి మనమున। శ్రీనాథుండంశభాగశిష్టతఁ

*నృశంసున్। ఘాతుకుఁడైన, శౌరి। వసుదేవుఁడు. ‡కంపితావతంసుండై। శిరఃకంపనము చేసినవాఁడయి, కొండలమందు। దుఃఖించుచున్న. ¶ఆనకదుందుభి। వసుదేవుఁడు. †ఒయ్యనన్। తిన్నఁగా, ఏకతమునన్। ఏకాంతమందు. ‖అనిమిషులు। దేవతలు. ❖కదనము। యుద్ధము, వదనము। ముఖము, సదనము। గృహము. ※తోడితోడి। వెంబడివెంబడిగాను. ♣ఆఁకలన్। చెరసాలలయందు. § తానకము। స్థానము.

ఘోరఁగర్।భానురు వినతఁడు వెలిఁగెను। గానఁగఁబట్టయ్యెభూతగణములకున్నృపా॥ ఉ॥ ఆవసుదేవుఁడంతఁదనయంపఖిలా త్మకమాత్మభూతమున్।బావన రేఖయుస్సువనభద్రము నై వెలుఁగొందుచున్నల।శ్రీమిభుతేజముచ్చుపడఁజేర్చినఁదాల్చిన వీనకాంతితో; దేవకిమొప్పెఁబూర్వయగుదిక్సతిచంద్రునిఁదాల్చుకై వడిన్॥ వ॥ అనినవినితరువాతివృత్తాంతంబెట్లయ్యెన నిరాజడిగినశుకుండిట్లనియె॥ క॥ సుగతరముగఁదనకడుపున।సరసిజగర్భాండభాండచయములుగలయా। హరి దేవకికడు పునభూ।భరణార్థమువృద్ధిఁబొందెబాలార్కక్రియన్॥ అంత॥ సీ॥ *విమతులమోములు వెలవెలఁబాఱంగవిమలాస్య మోము వెల్వెలకవాఱె।మలయువైరులకీర్తిమాసినల్లనగాఁగనాతిచూచుకములునల్లనయ్యె।మస్టాలయంబులధూమరే ఖలువుట్టలేమయాఱునరోమరేఖమెఱసె।నరిమానసములనాహారవాంఛలుడప్పవనజాక్షికాహారవాంఛదప్పె। శ్రమ మునంధిల్లెరిపులకుశ్రమముగదుర।శిజడతవాటిల్లెశత్రులుజడనుపడఁగ।మన్నరుదియయ్యెఁబగతురువమ్మనొరఁగ। వె లఁడియుదరంబులోహరివృద్ధిఁబొంద॥ మఱియును॥ సీ॥ ✝సలిలమాయెలనాగజఠరార్భకునిఁగానఁజననికై వడిఘర్మ సలిల మొప్పె। నెగిఁదేజమాయింతియుదరడింభకుఁగొల్వఁగదిసినక్రియదేహకాంతిమెఱసెఁ। బవనుఁడాకొన్సుగర్భస్థుని సే వింపనెప్పుతోమిక్కిలియూర్పులమరెఁ। కుంభినియాలేమకుక్షిగునర్చింపఁజొచ్చుభంగినిమంటిచొరవదనరె। గగనమిం దువదవకడుపులోఁబాలుసే।వలసురూపు మెఱసివచ్చినట్లు।బయలువంటినడుముబహుళమయ్యెనుబంచ। భూతమయుఁడు లోనఁబొదలసతికి॥ తదనంతరంబ॥ సీ॥ అతివ⊕కాంచీగుణంబల్లనబిగియంగవై రివధూగుణవ్రజమువదలె। మెల్లనఁద న్వంగి మెయిదీఁగెమెఱుఁగెకక్కదుష్టాంగనాతనువ్యుతులడంగె। నాతికల్లనభూషణములుపల్వలకఁగాఁ బరసతీభూషణ పఙ్క్తులెడలెఁ।గలకంఠికొయ్యనగర్భంబుదొడ్డుగాఁబరిపంథిదారగర్భములువగిలెఁ। బొలఁతికంతంతసీల్లాడప్రొద్దులెము గ।నహితవల్లభలైదువలైతనర్చు।ప్రొద్దులన్నియుఁగ్రమమునఁబోవఁదొడఁగె।నువిదకడుపుననసురారియుంటఁజేసి॥ ఇ వ్విధంబున॥ గీ॥ ⊛జ్ఞానఖలునిలోనిశారదయనుబోలె।ఘటములోనిదీపకళికవోలె।భ్రాతయింటనాఁకఁబడియుండెదేవకీ। కాంతవిశ్వగర్భగర్భయగుచు॥ వ॥ అంతనక్కంతాతిలకంబునెమ్మొగంబు తెలివియును మేని మెఱుంగును మెలంగెడిసొబ గునుంజూచి వెఱఁగుపడితలఁచు వెఱచుచుఁగంసుండుతనలోనిట్లనియె॥ క॥ కన్నులకుఁజూడబరువై। యున్నదిమెలనాగగ ర్భముల్లముగలఁగ।నమ్మన్నెన్నఁడునిట్లుండదు।⊜వెన్నుఁడుచొరఁబోలుగర్భవివరములోనన్॥ ఉ॥ ఏమితలంచుపెడనిఁక నెయ్యదిగార్యమునాఁడునాఁటికి।న్గామినిచూలుపెంపెసఁగెగర్భిణిఁజెల్లెలినాఁడుపేదనే। నేమనిచంపువాఁడ... వేలని చంపితినేనిశ్రీయును।గ్గామయశంబునాయువునుధర్మమునుంజెడిపోవకుండునే॥ క॥ వావినెఱుంగనిక్రూరుని।జీవన్మృతుఁ డనుచునిందసేయుదురతఁడు।న్పోవునునరకమునకుధు।ర్భావముతోఁబ్రతుకుటొక్కబ్రతుకేతలఁపన్। వ॥ అనినిశ్చయించి క్రౌర్యంబువిడిచిధైర్యంబునొంది గాంభీర్యంబువాటించిశౌర్యంబుప్రకటించికొనుచుదిగ్గనంజెలియలింజంపు ⊕నగ్గలిక మొగ్గనియుగ్గడించిమానిమానియంబోలెనూరకుండియు॥ గీ॥ పాపరానిదొడ్డపనిపుట్టెనిఁకనెట్టు।లిందుముఖికిఁజక్రిమెపు దుపుట్టుఁ।బుట్టినపుడెపట్టిపురిటింటిలోఁదెగ।జూతుననుచునెదురుఁజూచుచుండె. వ॥ నుఱియువైరానుబంధంబుననన్యా నుసంధానంబులమఱచియతండు॥ క॥ తిరుగుచుఁగుడుచుచుఁద్రావుచుఁ।నరుగుచుఁగూర్చుండిలేచుచనవరతంబున్।హరిఁ దలఁచితలఁచిజగమా।హరిమయమనిచూచెఁగంసుఁడాఱనియలుకన్॥ వెండియు॥ సీ॥ ✕శ్రవణరంధ్రముల నేశబ్దంబువినఁ బడునదిహరిరవమనియాలకించు।నక్షిమార్గమున నెయ్యదిచూడఁబడునదిహరిమూర్తిగానోపునంచుఁజూచుఁ।దిరుగుచో దేహంబుతృణమైనసోఁకినహరికరాఘాతమోయనుచుఁగలఁగు।గంధంబులేమైనప్రాణంబుసోఁకినహరిమాలికాగంధమ నుచునదరుఁ।బలుకులెవ్వియైనఁబలుకుచోహరిపేరు।పలుకఁబడియెననుచుభ్రమసిపలుకుఁ।దలఁపులెట్టివైనఁదలఁచియాత లఁపులుహరితలంపులనుచునలుగఁదలఁచు॥ వ॥ అయ్యవసరంబుననను చరసమేతలైనదేవతలునునారదాదిమునులునుగూ డినదువనలువయునుముక్కంటియునక్కడికివచ్చి దేవకీదేవిగర్భార్భకుండగుపురుషోత్తమునిట్లనిస్తుతియించిరి॥ సీ॥ సత్య

* విమతులమోములు।శత్రువులముఖములు, విమలాస్య।నిర్మలమయినముఖముగలదేవకీదేవియొక్క, వెల్వెలకవాఱెన్।తెలతెలపాఱెను, మలయు।వ్యాపించియున్న, చూచుకములు।చనుమొనలు, ధూమరేఖలు।తోఁకచుక్కమొదలగునుత్పాతములు, లేమయాఱునన్।దేవకీదేవినూ గారుున. శిజడత।జడను, మాంద్యము।బలహీనత్వమైమందపడుట, పగతురు।పగవారు. ✝సలిల-।-వడిన్॥ సలిలము।జలము, ఆయెలనాగ।ఆదేవకీదేవి యొక్క, జఠరార్భకునిఁగానన్।గర్భమందలిబిడ్డనుచూచుటకు, చనినకైవడిన్।పోయినదోయనునట్లుగాను, ఘర్మసలిలము।చెమటనీరు, ఒ గిన్।క్రమముగా, ఉదర।గర్భమందలి, డింభకున్।శిశువును, కుంభిని।భూమి. ⊕కాంచీ।ఒడ్డాణము. గుణము।దారము, పల్వకగాన్।బిగువు గాఁగా. ⊛జ్ఞానఖలునిలోని।విపరీతజ్ఞానముగలవానియందలి, శారదయనుబోలెన్।విద్యవలెనె. ⊜వెన్నుఁడు।విష్ణువు. ⊕అగ్గలిక।ఉత్సాహ ము. ✕శ్రవణ।చెవి. అక్షి।నేత్రము. కరాఘాతము।చేతిదెబ్బ. ఘ్రాణము।నాసికము.

## శ్రీ బ్రహ్మ మొదలగు దేవతలు దేవకీగర్భస్థుఁడగు దేవుని స్తుతించుట. శ్రీ

వ్రతుని* నిత్యసంప్రాప్తసాధనుఁ గాలత్రయమునందుఁ గలుగువాని। భూతంబులై దను బుట్టుచోటగువానినై మభూతంబులందఁ బరువాని। నై మభూతంబులు నడఁగిన పిమ్మటఁ బరగువానిని సత్యభాషణంబు। సమదర్శనంబును జరిపెడువానిని నిన్నాశ్రయింతుము నీయధీన। మాయచేత నెఱుక మాలినవారలు। పెక్కుగతుల నిన్నుఁ బేరుకొంద్రు। తెలియఁగ నేర్తురు విబుధులేక చిత్తంబున। నిఖిలమూర్తులెల్ల నీవయంద్రు॥ అదియునుంగాక॥ సీ॥(1)॥ ప్రకృతి యొక్కటి పాదు ఫలములు సుఖదుఃఖములు రెండు గుణములు మూఁడు వేళ్లు। దగు రసంబులు నాల్గు ధర్మార్థముఖరంబు లెఱిఁగెడి విధములైదింద్రియంబు। లాఱు స్వభావంబులా శోకమోహాదులూర్ములు ధాతువు లొక్కయేడు। పైపొరలెనిమిది ప్రంగలు భూతంబులై చు బుద్ధియును మనోహంకృతులును। రంధ్రములు తొమ్మిదియుఁ గోటరములు ప్రాణపత్రదశకంబు జీవేశపక్షియుగము। గలుగు సంసారవృక్షంబుఁ గలుగఁ జేయఁ। గావ నడఁగింప రాజవొక్కరుఁడవీవ॥ క॥ నీ దెసఁ దమచిత్తము లిడి। యే దెసలం బోక గడచు రెఱుక గలుగువా। రామూఁఢ యకుసు క్రియ నీ। పాదంబను నావ కతన భవసాగరముల్॥ గీ॥ మంచివారికెల్ల మంగళప్రదమగుఁ। గల్లరులకు మేలుగాని యట్టి తనువు లెన్నియైనఁ దాల్చి లోకములకు। సేమమెల్ల ప్రాప్తు సేయుదీవు॥ క॥ ఎఱిఁగిన వారంబనుచును। గొఱమాలిన యెఱుక లెఱిఁగి కొంద ఱనీపే। రెఱిఁగియుఁ దలఁపగ నెల్లరు। పఱుతురధోగతుల జాడఁ బద్మదళాక్షా॥ క॥ నీవారై నీ దెసఁ దమ। భావంబులు నిలిపి ఘనులు భయవిరహితులై। యే విఘ్నంబులఁ జెందక। నీ వరయఁగ మేటిచోట నెగడుదురీశా॥ క॥ నిను శ్రీనాలుగాశ్రమంబుల। జనములు సేవింప నఖిలజనముల సత్త్వఁ। బును శుద్ధంబును శ్రేయఁ। బును నగు గాత్రంబు నీవు పొందుదువు హరీ॥ సీ॥ నళినాక్ష సత్త్వగుణంబు నీగాత్రంబుగా జే[illegible]జ్ఞానకలితమగుచు। నజ్ఞానభేదనంబగు నెట్లు గుణములయందును వెలుఁగు నీవను మతింపఁ। బడుచు సత్త్వరూపంబు సేవింపంగ సాక్షాత్కరింతువు సాక్షివగుచు। వాఙ్మనంబుల కనవ్వలయైన మార్గంబు గలుగు నీగుణజన్మకర్మరహిత। మైన రూపును బేరు సత్యానఘుబుద్ధు। లెఱుఁగుదురు నిన్నుఁ గొల్వ నూహించుకొనుచు। వినుచుఁ దలఁచుచుఁ బొగడుచు వెలయువాఁడు। భవమునొందఁడు నీపాదభక్తుఁడగుచు॥ క॥ ధరణీభారము వాసెను। బురుషోత్తమ యాశ నీదు పుట్టువున భవ। చ్చరణాంబుజముల ప్రాపున। ధరణియు నాకసముఁ గాంచె దమునీకరుణన్॥ ఉ॥ పుట్టువు లేని నీకభవ పుట్టుట క్రీడయె కాక పుట్టుటే। యెట్టనుకొన్న భవాదిదశలెల్లను జీవమునం దవిద్యఁ దా। బుట్టుచునుండుఁ గాని [illegible]ఁ బుట్టిన దింబలె బొంత నుండియుం। జుట్టఁగ లేని తత్క్రియలఁ జొక్కని యొక్కటి పౌరుమీశ్వరా॥ మ॥ శకురుపాఠీనమవై జలగ్రహమవై కోలంబవై శ్రీనృకే। సరివై భిక్షుఁడవై హయాననుఁడవై రామాదేవతాభర్తవై। ధరణీసాధుఁడవై దయాంగుణగణోదారుండవై లోకముల్। పరిరక్షించిన నీకు మ్రొక్కెదమిలాభారంబు వారింపవే॥ క॥ ¶ మ్రుచ్చిజయిన్నది లోకము। నిచ్చలుఁ గంసాదిఖలులు నిర్దయులేపన్। మచ్చిక గావఁగ వలయును। పచ్చేయుచు తల్లికడుపు వెడలి ముకుందా॥ అని మఱియు దేవకీదేవితో నిట్లనిరి॥ మత్తకోకిల॥ తల్లి నీ యుదరంబులోనఁ బ్రధానపూరుషుఁ డున్నవాఁ। డెల్లి పుట్టెడిఁ

---

*నిత్యసంప్రాప్తసాధనున్॥ నిత్య। శాశ్వతమైన మోక్షమును, సంప్రాప్త। పొందించుటకు, సాధనున్। సాధకమైనవాఁడును. భూతంబులైదును॥ భూ। జల, అగ్ని। వాయు, ఆకాశములను పంచభూతములును. పుట్టు। జనించుటకు, పెక్కుగతులన్। అనేకమార్గములచేత, పేరుకొందురు। పలుకుచుందురు. (1) ప్రకృతియొక్కటిపాదు। వ్యష్టిసమష్ట్యాత్మక[illegible]జగదుత్పత్తినాశనములఁ జేయుచు ఏకస్వరూపమైన బ్రహ్మశక్తియే ఆలవాలము, అనఁగా సంసారమనెడి వృక్షోత్పత్తిస్థితినాశములకు బ్రహ్మశక్తియే ఆలవాలమని తా. గుణములు మూఁడు। రాజసతామససాత్త్వికములు. ధర్మార్థముఖరముల్। ధర్మ-అర్థ-కామ-మోక్షములు. ఎఱిఁగెడివిధములైదింద్రియంబు। శ్రోత్ర-త్వ-చక్షు-జిహ్వా-ఘ్రాణములు విషయములగు శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములను తెలిసికొనెడు మార్గములు, ఆఱు స్వభావంబులు। అస్తి-జాయతే-వర్థతే-పరిణమతే-అపక్షీయతే-నశ్యతి-అను నవియాఱును సహజములు, ఆ శోకమోహాదులూర్ములు। అశన-పిపాస-శోక-మోహ-జరా-మరణములాఱును, ధర్ములు। ధర్మములు, ధాతువులొక్కయేడు పైపొరలు। త్వక్-మాంస-రుధిర-మేదః-మజ్జ-అస్థి-స్నాయువులు-యేడును మీఁది పొరలు, భూతంబులైదును। భూమ్యాదిపంచభూతములును, బుద్ధియు। నిశ్చయాత్మకమయిన బుద్ధియును, మనోహంకృతులును॥ మనః। చంచలాత్మకమయిన మనస్సు, అహంకృతులును। కర్తృత్వాత్మకమయిన అహంకారమును, ఎనిమిది ప్రంగలు। ఈ యెనిమిది శాఖాద్వయమగాలములు, రంధ్రములు తొమ్మిదియుఁ గోటరములు, నవరంధ్రములే తొఱ్ఱలు. ప్రాణపత్రదశకంబు। ప్రాణ। అపాన-వ్యాన-ఉదాన-సమాన-నాగ-కూర్మ-కృకర। దేవదత్త-ధనంజయములను పదివాయువులే ఆకులు. జీవేశపక్షియుగము॥ జీవ। కించిజ్జ్ఞత్వాదిలక్షణలక్షితుఁడైన జీవుఁడు. ఈశ। సర్వజ్ఞత్వాదిలక్షణయుక్తుఁడైన యీశ్వరుఁడను, పక్షియుగము। రెండు పులుగులు, కలుగుసంసారవృక్షంబున్। కలిగియున్న ప్రపంచశరీరసంజ్ఞ గలవృక్షమును, కలుగఁజేయన్। పుట్టించుటను, కావన్। రక్షించుటకు, అడఁగింపన్। నశింపఁజేయుటకు, రాజవొక్కరుఁడవీవ। ప్రభువు నీవొక్కఁడవేను.— శ్రీనాలుగాశ్రమంబులన్। బ్రహ్మచారి-గృహస్థ-వానప్రస్థ-యత్యాశ్రమములచేత. ‡గురుపాఠీనమవై। మహామత్స్యస్వరూపుఁడవై, జలగ్రహమవై। కూర్మావతారుఁడవై, కోలంబవై। వరాహాకారుఁడవై, రమాదేవతాభర్తవై। బ్రాహ్మణశ్రేష్ఠుఁడవై, అనఁగాఁ బరశురాముఁడవై ధరణీనాథుఁడవై। రాజవై, అనఁగా శ్రీరాముఁడవై. ¶ మ్రుచ్చిలియున్నది। మనోదుఃఖమును జెందియున్నది, నిచ్చలున్। నిరంతరమును, ఏపన్। బాధింపఁగా, మచ్చికన్। ప్రీతితో.

గొనెసుచేభయము లేదునిజంబుమా। కెల్లవారికిభద్రముయ్యెడు నింక నీకడుపెప్పుడున్। జల్లగావలెయాదవావళిసంతసంబును బొందఁగన్॥ వ॥ అనియివ్విధంబున హరిం బొగడి దేవకీదేవిని దీవించి దేవతలీశాన బ్రహ్మలముందటనిడుకొని చనిరంత॥

## ——⊰ శ్రీకృష్ణావతారఘట్టము. ⊱——

క॥ పంకజముఖి శ్లాఘనసంకటపడ ఖలులమానసంబులనెల్లన్। సంకటముదోఁచె మెల్లన। సంకటములేమితోఁచె సత్పురుషులకున్॥ సీ॥ స్వచ్ఛంబులై పొంగె జలరాశు లేడును గలఘోషణముల మేఘంబులుఱిమె। గ్రహతారకలతోడ గగనంబు రాజిల్లె దిక్కులు మిక్కిలి తెలివిఁ దాల్చెఁ। గమ్మనిచల్లని గాలి మెల్లన వీఁచె హోమానలంబులు చెన్నొంది వెలిఁగెఁ। గొలఁకులు కమలాళికలములై సిరియొప్పెఁ బ్రవిమలతోయలై పాఱె నదులు। వరపురగ్రామ* ఘోషమై వసుధయొప్పె। విహగరవపుష్పఫలముల వెలసె వనము। లలరుసోనలు గురిసిరయ్యమరవరులు। దేవదేవుని దేవకీదేవి గనఁగ ॥ క॥ పాడిరి గంధర్వోత్తము। లాడిరి రంభాదికాంతలానందమున। న్గూడి రిసిద్ధులుభయములవీడిరి చారణులు మొరసె వేల్పులభేరుల్ ॥క॥ అయ్యవసరంబున॥ క॥ సురుచిగనె దేవకినడురేయతిశుభగతిఁ దారలును గ్రహంబులునుండన్। దితిసుతనిరాకరిష్ణున్। శ్రితవనాలంకరిష్ణు జిష్ణు న్విష్ణున్॥ క॥ వెన్నునినతిప్రసన్నునిఁ। గ్రన్ననఁ గని మెఱుఁగుబోఁడి కడు నొప్పారెం। బున్నమనాఁడు కళానిధిఁ। గన్నను హేంద్రాశ చెలువు గలిగిన రేఖం ద్రా॥ అప్పుడు॥ సీ॥ జలధరదేహు నాజానుచతుర్బాహు సరసీరుహాక్షు విశాలవక్షు। జారుగదాశంఖచక్రపద్మవిలాసుఁ గంఠకౌస్తుభమణికాంతిభాసు। గమనీయకటిసూత్రకంకణకేయూరు శ్రీవత్సలాంఛనాంచితవిహారు। నురుకుండలప్రభాయుతకుంతలలలాటు వైదూర్యమణిగణవరకిరీటుఁ। బాలుఁబూర్ణేందునిజాలుభక్తలోక। పాలు సుగుణాలవాలుఁ గృపావిశాలుఁ। జూచితిలకించి పులకించి చోద్యమంది। యుబ్బిచెలరేఁగివసుదేవుఁడుత్సహించె॥ క॥ స్నానముసేయఁగ రామిని। నానందరసాబ్ధిమగ్నుఁడై విప్రులకున్। ధేనువులను బదివేలను। మానసమున ధారవోసెనప్పుడుఁ బుట్టకున్॥ నుతియువసుదేవుండు॥ క॥ ఈపురిటియింటి కుద్యద్దీపంబును బోలి చాలదీపించె నిజం। బీపాపఁడునలు మొగముల। యాపాపనిఁగనిన మేటియగునని భక్తిన్॥ గీ॥ సాగిమ్రొక్కి లేచి సరగుననోసలిపైఁ। గేలుదమ్మిదోయి నిలుకొలిపి। పాపఁడనక వెఱకపాపనిమొదలింటి। పోకలెల్లఁదలఁచి పొగడఁదొడఁగె॥ త॥ ఏని న్నఖిలదర్శను। జ్ఞానానందస్వరూపు సంతతుఁ బరా। త్మునిసనిమాయామారుని। సూనునిఁగాఁ గంటినిట్టి చోద్యముగలదే॥ త॥ అచ్చుగ నీమాయలమున్నచ్చెచ్చెరఁ ద్రిగుణాత్మకముగఁ జేసినజగము। న్జొచ్చిన క్రియఁజొరకుండుదువుఁ। జొచ్చుటయును లేదు లేదు చొరకుండుటయున్॥ సీ॥ అదియునెల్లనమహదాదులఁబోలెడివై వేఱువేఱై యున్నవిధము। లగుసూక్ష్మభూతంబులమరషోడశవికారములతోఁగూడి విరాట్టనంగ। బరమాత్మ నకునీకుఁబరపైన మేను సంపాదించి యందులోఁబడియుఁబడక। యుండుసృష్టికిమ్రోల నున్నకారణమున వానికిలోనిభవంబుగలుగ। దట్టిబుద్ధిమెఱుఁగనను వైనలాగున। గలుగు నింద్రియములకడలనుండి। వానిపట్టులేకవసుసజగంబులఁ। గలసియుండిరైనఁ గలయవెపుడు॥ క॥ సర్వము నీలోనిదిగా। సర్వాత్మఁడవాదివస్తుసంపన్నుఁడవై। సర్వమయుఁడవగునీకును। సర్వేశ్వర లేవు లోను సంధులు వెలియున్॥ గీ॥ ఆత్మవలనఁ గలిగియమరుదేహాదుల। నాత్మకంటె వేఱుల మెఱుఁగుచుఁ। బలుచువాఁడు మూఢతముఁడుగావున నీశ। విశ్వమెల్ల నీవ వేఱులేమ॥ అదియునుంగాక॥ సీ॥ గుణము వికారంబుఁ గోరికయును లేని నీవల్ల జగములు నెట్టెజనించుఁ। శబ్రబ్బ లేదగునంచుఁబలుకుట తప్పగాదీశుండవై బ్రహ్మమీవ। యైన నీను గొల్పు గుణములు నీయానతులు సేయ భటుల శౌర్యంబులు పతికివచ్చు। పగిది నీగుణముల బ్రాసలు నీవని త్రోఁచుననీమాయతోఁ జనుడు। రక్తనవళ నీలవర్ణంబుల। జగముసేయఁగావ సమయఁజూడఁ। దనరుదువ్వు నేఁడు నరైత్యులఁ దండింపఁ। బృథివిఁ గావనవతరించితీశ॥ శా॥ మింటన్మ్రోసిన మ్రోఁత తాలిమిని లోఁ* శ్రీమేండ్రింపము న్నీవు నా। యింటం బుట్టెదవంచుఁ గంసుఁడుదోడిఁ ఖ్లాంసించె నీయన్నల। న్గంటం గూరుకుఁ జేడు నీయుదయమీ కారాజను లెప్పఁగా। బంటింపం డెటు రేఁగు పెం

## ——⊰ దేవకీదేవి స్వామిని స్తుతించుట. ⊱——

చువడినీపై నేఁడు సన్నద్ధుఁడై॥ వ॥ అనుచుండ దేవకీదేవి మహాపురుషలక్షణుండును, విచక్షణుండును, సుకుమారుండును నైనకుమారునిం గనికంసునివలన వెఱపునకు విస్మితయై యిట్లనియె॥ సీ॥ అట్టిట్టిదనరాని దై మొదలై నిండుకొన్నదై వెలుఁగుచు గుణములేని। దైయొక్కచందంబుదై కలదై నిర్విశేషమై క్రియలేక చెప్పరాని। దీరూప నుని శ్రుతు లెప్పుడు నొడివెడియా రూపగుచు నధ్యాత్మదీప। మై బ్రహ్మ రెండవయర్ధంబుతుదిజగంబులు నశియింపంగ భూతగణము। సూక్ష్మభూతమందుఁజో

* ఘోష=గొల్లపల్లె. శబ్రబ్బ=సంబంధము. శ్రీమేండ్రింపక=నాఁటియుండఁగా, బంటింపఁడు=సంచేహింపఁడు. షోడశవికారములలోన=పంచభూతములు-జ్ఞానేంద్రియపంచకము-కర్మేంద్రియపంచకము-బుద్ధి-ఈపదియాఱింటితో.

రంగ నాభూతంబు ప్రకృతిలోఁ జొరంగ బ్రకృతి వోయి వ్యక్తముం జొరంగ వ్యక్తమడంగను శేషసంజ్ఞ నీవు చెలువమ
గుదు॥ ఉ॥ విశ్వము లీలఁ ద్రిప్పుచు నవిద్యకుఁ జుట్టమవైన నీకు నా శాశ్వతమైన కాలమిది సర్వము* వేడబమంచు రట్టివి శ్వేశ్వ
ర మేలు సుమ్మని నిను నెప్పుడుఁ గోరి భజించువాఁడెపో శాశ్వతలక్ష్మి మృత్యుజయసౌఖ్యయుతుండభయుండు మాధవా॥ మ॥ త్త
కోకిల॥ ఒంటి నిల్చి పురాణ యోగులు యోగమార్గ నిరూఢులై కంటి మందురు గాని నిక్కము గానరీ భవదాకృతిన్ గంటి భ్ర
ముఁ గంటి మాంసపుఁ గన్నులం గనఁ బోలనీ తొంటిరూపుఁ దొలంగఁ బెట్టుము త్రోయజేక్షణ మ్రొక్కెదన్॥ గీ॥ విలయకాల
మందు విశ్వంబు నీ పెద్ద కడుపులోన దాఁచు కడిమి మేటి వటుఁడవీవు నేఁడు నా గర్భజుఁడవౌట పరమపురుష వేడబంబు గా
దె॥ తరల॥ నలినలోచన నీవు నిక్కము నా సుతుండవు బుట్టెదవంచు నీ ఖలుఁడు కంసుఁడు పెద్ద కాలము † కారయింటనడంచె నిర్మలిన
చిత్తుని నాజ్ఞ సేయుము మమ్ముఁ గావుము భీతులన్ నుల్లుసు లేక ఫలించెనో దిననోము లెల్లను నీవడైన॥ వ॥ అని యిట్లు దేవకీదేవి
విన్నవించిన నీశ్వరుండిట్లనియె నవ్వా నీవు తొల్లి స్వాయంభువ మన్వంతరంబునఁ బృశ్ని యను పరమపతివ్రతవు వసుదేవుం
డును సుతపుండను ప్రజాపతి మీరిరువురు సృష్టికాలంబున బ్రహ్మపంపున నంబెంపున నింద్రియంబుల జయించి తెంపున వాన
గాలి యెండ మంచులకు సైరించి ❀ యేకలంబులై యాకలంబులు దిని యేకలంకంబును లేక వేంద్రంబునఁ బండ్రెండు వేలది
వ్యవర్షంబులు తపంబుల నెపంబుల మీరూపంబులు మఱియ యోజనాజపంబులు సేసి డాసి పేర్చి యర్చింప మీకు సనా
కుంగలరూపుఁ జూపి యేను తిరంబులగు వరంబులు వేఁడుఁడు నిన మీరు నా మాయం బాయని మోహంబున బిడ్డలు లేని దొడ్డయ
డ్డంబున దుర్గమంబగు నపవర్గంబు గోరక నా యీడు కొడుకున డిగిన మెచ్చి యట్ల వరంబిచ్చి మీకేను బృశ్నిగర్భుండనను
ర్భకుండనై తిమఁ తియును ॥ క ॥ అదితియుఁ గశ్యపుఁడునఁ గా । విదితులరగు మీకుఁ గుఱుచ వేషంబున నే । నుదయించితి
వామనుఁడనఁ । ద్రిదశేంద్రానుజుఁడనై ద్వితీయభవమునన్ ॥ క ॥ ఇప్పుడు మూఁడవ §బాముఁన । దప్పక మీ కిరు
వురకు సుదనయుఁడనైతిన్ । జెప్పితిఁ బూర్వము మీ యాయం । దెప్పటికిని లేదు జన్మమిట పై నాకున్ ॥ క ॥ నందనుఁడని యుంబర
మా నందంబగు బ్రహ్మమనియు నను దలఁచుచు నా । పెంపెరువు నెందెదరు నా । యందుల ప్రేమమున భవమునందఱు మీ
రున్ ॥ అని యిట్లు పలికి యీశ్వరుండా రూపంబు విడిచి ॥ క ॥ తెప్పలిడక తలిదండ్రులు । తప్పకఁ దనుఁ జూడ మాయఁ దనరిల
లితుఁడై । యప్పడటు గన్న పాపని । యొప్పున వేడుకలు సేసె నొక కొన్ని నృపా ॥ వ ॥ అంతవసుదేవుండు దనమంజే
యమ[illegible]పను లీశ్వరుండైన హరి వలన నెఱింగిన వాఁడు గావున॥ క ॥ ఆ పురిటి యిల్లు వెలువడి । పాపనిఁ దరలించుకొను
చుం బరచె దననుచున్ । రూపించి నందు భార్యకుఁ । బాపయగుచు యోగమాయ ప్రభవించె నృపా ॥ అయ్యవసరంబున॥
క ॥ బిడ్డనిఁ గరములఁ దోమ్మన । నడ్డంబుగఁ బట్టి పదములల్లన నిడుచున్ । ¶జడ్డనఁ గావలి వారల । యొడ్డుగడ దిపురిటిసాల యొ
య్యోన వెడలెన్ ॥ అంతనట ॥ క ॥ నందుని సతికి యశోదకు । బొందుగ హరి యోగమాయ పుట్టిన ❀ మాయా । స్పందమునన్ ఒక్క
యెఱుగమి । క్రందుకొని యెనూరి వారిఁ గావలి వారిన్ ॥ వ ॥ అప్పుడు చప్పుడుగాకుండఁ దప్పటడుగులిడుచు నినుపగొలుసు
ల మెలసులు వీడినఁ దాలంబులు మహోత్తాలుండైన బిడ్డనికి నడ్డంబు గాక కీలూడి వీడిపడి ❀యరళంబులు విరళంబులైన స
రళంబులగు మొగసాల పెంగడచి పాపతోఁడు వాకిండ్లను బలమూయుచుఁ బడగ వెడగలుగ విప్పి కప్పి యేఁచి కాఁచికొని వెంట
నంటి గాఁగఁ గడంగిన మచు నెడ॥ క ॥ ఆ శౌరికిఁ దెరువొసఁగెం బ్రకాశోద్ధతతుంగభంగకలితధరాశా । కాళయగు యమునమ
నుసి । తేశుసక్షుఁ బరమోఘ త్రోవనిచ్చిన భంగిన్ ॥ వ ॥ ఇట్లు యమున దాఁటి (¶)దాఁటి చని నంపునిమందం జేరి యందపండని ద్రం
బొందియుండ లేఱుంగని గొల్లలం దెలుప నెల్లక నిత్యప్రసాదయగు యశోద శయ్యా నొయ్యన చిన్నినల్లనయ్యను నిచ్చి యయ్యన
నయ్యన్నకూఁతు నెత్తుకొని మలనింటికి బంటింపక వచ్చి యచ్చిలుత పాపను దేవకి ప్రక్కం జక్కనిడి॥ క॥ పదములసంకెల
లిడుకొని మది ॥ సలఁగుచు శూరసుతుఁడు మందుఁడు వోలెన్ । చెదరుగలరీతి దేహముఁ । గదలించుచు నొదిగి యుండె గరువత
నమునన్ ॥ క ॥ వనజాక్షునిఁ బెచ్చుటయును । దనసుతఁ గోనిపోవుటయును దా నెఱుఁగక మూఁగిన నిద్రఁ జొక్కుచుండెను । వన
జాక్షి యశోద రేయి వసుధాధీశా ॥ సీ॥ అంత బాలికయా పురని యేడ్పు చిఱుచప్పుడాలించి వేగన నాఁక యింటి । కావలివాడు
మేల్కని చూచి తలుపుల తాళముల్ తొంటి విధమున నుండఁ । దెలిసి చక్కన వచ్చి దేవకి నీల్లాడె రమ్మురన్న భోజరాజుతోడఁ జె
ప్పిన నాతఁడు ॥ విడిముడిపాటుతోఁ దల్పంబు పై లేచి తత్తరమున వెంట్రుకలు వీడఁ బైచీర వ్రేలియాడఁ । జాల్మికీలూపరో

* వేడబము । వేషము-బూటకము. † కారయింటన్ । చెరసాలయందు. ❀ ఏకలంబులై । ఏకాకులై. నాయీడు । నావంటి. § బాము । జన్మము. ¶ జడ్డనన్ । శీఘ్రముగా, ఒడ్డు । గుంపు. మాయాస్పందమునన్ । మాయ యొక్క ఆవరించుట చేత. ఎఱుఁగమి । అజ్ఞానము- మైకము. క్రందుకొని యెన్ । క్రమ్ముకొనెను. ❀ అరళంబులు । తలుపులు. (¶) దాఁటి చని । వేగముగాఁ బోయి. ¶ తలఁకుచు । భయపడుచు. శూరసుతుఁడు । వసుదేవుఁడు. ¶ చిడిముడిపాటుతో । తొందరపాటుతో.

షాగ్నిదర్పమాడ! భూరివైరంబుతోఁ గూడఁ బురిటియింటి! జాడఁ జనుదెంచి యీపాపఁ జంపఁ గదియ॥ అంత దేవకీదేవి యడ్డం బువచ్చి యిట్లనియె॥ ఉ॥ అన్న శమింపుమన్న తగదల్లుఁడు గాఁడిది మేనగోడలౌ, మన్నన సేయుమన్న వినుమా నిజంపుటరాచపాడి గాదన్న సుకీర్తివై మనఁగదన్న మహాత్ములు నోవు త్రోవఁ బోవన్న భవత్సహోదరిఁ గదన్న నినున్ శరణంబు వేఁడెదన్॥ క॥ *కట్టా యాఁడుఁగూఁతురు కొడుకులఁ బట్టి వధించితి వియాఁడుపడుచు విదికోడల్। నెట్టనఁ జంపఁగవలెనే! కట్టడివి గదన్న యన్న కరుణింపఁగదే॥ క॥ పుత్త్రుఁడు నీ బ్రతుకునకును శత్రుండని వింటిఁ గాన సమయింపఁ దగున్। పుత్త్రులకు నోమనైతిని పుత్త్రీదానంబు సేసి పుణ్యము గ్రనవే॥ వ॥ అని పయ్యాదఁ జక్కఁగ సవరించుకొనుచుఁ బలవరించుచు భ్రాంతిపడి కూఁతుం గ్రక్కున నక్షునం జక్కఁ హత్తుకొని చెక్కు చెక్కున మోపి చక్కనను త్తరీయాంచలంబున సంచలతం గప్పి చప్పుడుగాఁగ సుయ్యుచు నయ్యోడం †క్రయ్యంబడి వాఁడు పోడిమి చెడఁ దోఁబుట్టువుం దిట్టి చిట్టిపట్టియా పురనివాసోవఁ గావరంబున నడుగులాడి సిగ్గిగిచి వడిం బెడిసి పడం బుడమి పయిం బడ వ్రేసిన నబ్బాలయు నేలం బడక నవలీల నెగసి నవ్యదివ్యమాలికాగంధబంధురమణిహారాంబరాద్యలంకారమనోహారిణియై, గదాశరశంఖచక్రచర్మచాపాసిశూలంబు లెనిమిది కరంబులం గరం బొప్పనొప్పుచు, సిద్ధచారణకిన్నరగరుడగంధర్వాదివైమానికులు కానుక లిచ్చి పొగడ నెగడుచు, నచ్చరలయాటపాటలకు మెచ్చుచు, మింటనుండి కంటఁబడి కంటుపడఁ గంసునకిట్లనియె॥ ఉ॥ తెంపరివై పొరింబొరిని దేవకిబిడ్డల చిన్నికుఱ్ఱలన్। జంపితి వింకనైన నుపశాంతి వహింపక రాలమీఁద నన్నెంపితి విస్సిరో యిది యవీరము నా సరసన్ జనించి నిన్నంపెడి వీరుఁ డొక్కఁడెడ సత్కృతి నొందెడువాఁడు దుర్మతీ॥ అని పలికి॥ క॥ మహనీయగుణాస్పదయై మహిలోనా దేవి జనము మన్నింపంగా। బహునామనివాసంబుల బహునామములం జరించె భద్రాత్మికయై॥ వ॥ అంత నాఁబోఁటి పలికిన కలికిపలుకులు ములుకులై చెవులఁ జిలికిన నులికిపడి ఝళుకుఁ గదిరిన మనంబున ఘనంబుగ వెఱగంది కందికుందెడు దేవకీవసుదేవుల రావించి యాదరంబున గారవించి చేరి వారితో నిట్లనియె॥ ఉ॥ పాపుఁడ బాలఘాతకుఁడ బంధువిరక్తుఁడ దుష్టచిత్తుఁడన్। గోపనుఁడన్ జరన్మృతుఁడఁ గ్రూరుఁడ బ్రాహ్మణహంతభంగి మీ। పాపలఁ జంపితిన్ బ్రియలిపల్కుల నమ్మితి సాధులార నా। పాపములుగ్గడింపక కృపాపరులై కనరేశ మింపరే॥ ఉ॥ ఒక్కఁడ ప్రాణులందఱు నిజోచితకర్మములోలిఁ ద్రిప్పఁగా। నొక్కొక మేనులం బొడమి యొక్కొక త్రోవల రాఁ కపోకలం జిక్కులఁ బొంచుచుండుదురు చేరరు సంసృతితోడఁ బాయలే। రెక్కడి హంత మీశిశువు లెక్కడి ‡హన్యులు దూర నేటికిన్॥ క॥ పగతురఁ జెఱిచితి ననియును బగతురచేఁ జెడితి ననియు బాలుఁడు దలఁచున్। బగచెలుములు లేవాత్మకుఁ బగచెలుముల §కీలు కర్మబంధము సుండీ॥ వ॥ అని పలికి కన్నీరు నించి వగచి వెఱచుచు దేవకీవసుదేవుల పాదంబులఁ బట్టుకొని సంకెలలు విప్పించి మిక్కిలి యక్కఱగల వాక్యంబుల నైక్యంబులు నెఱపినవారును బరితప్తుండైన కంసునిఁ జూచి రోషంబును బాసి రంత నా వసుదేవుండు దేవకి కిట్లనియె॥ శా॥ బావా నీవచనంబు నిక్కము సుమీ ప్రాణుల్ల తజ్ఞానులై। నీ వేనంచును లోభమోహమదభిన్నమిత్త్రా తామోదశో। కావేశంబుల నెండొరుం బొడుతురే కాకారుఁడై సర్వరూ। పావిష్టుఁడగు నీశ్వరుం డెలియ లేరన్యోన్యవిభ్రాంతులై॥ వ॥ అని యిట్లు ప్రసన్నులైన దేవకీవసుదేవుల యనుజ్ఞ వడసి కంసుండింటికిం జనియా రేయి గడపి మఱునాఁడు గ్రద్దన బ్రొద్దున నందనకుం బరతంత్రులగు మంత్రుల రావించి యోగనిద్రవలనం దా వినిన వృత్తాంతం బంతయు మంతనంబున నెఱింగించిన నప్పుడు వారలతనికిట్లనిరి॥ క॥ ఇట్టయిన ||తడయ నేటికిఁ బట్టణముల మందలందుఁ బల్లెల నెల్లన్ బుట్టెడి పెరిగెడి శిశువులఁ బట్టి వధించెదము మమ్ముఁ బంపుము ధీశా॥ మ॥ భవదీయోజ్జ్వలబాహుచాపవిలసద్బాణావళీభగ్నులై దివిజాధీశ్వరులే క్రియం జనిరొ యే దేశంబులం డాగిరో। శివునిం జొచ్చిరొ బ్రహ్మఁ జెందిరొ హరిన్ సేవించిరో మానివ్ర। త్తివసాంతంబుల నిల్చిరో మనసు శోధింపం దగున్ వల్లభా॥ క॥ నొచ్చిరి శాత్రవులను చును విచ్చలవిడిఁ దిరుగవలదు వివిధాకృతులన్। మ్రుచ్చిలి వత్తురు వారలు సచ్చినయందాఁక మఱవఁ జనదధిపునకున్॥ క॥ ఒత్తికొనుచు రా నీజన దెత్తిన రోగముల రిపుల నింద్రియములను తృప్తిసమయములఁ జెఱుపక మెత్తన గా రాదు రాదు మీఁద జయంబున్॥ వ॥ అమరశ్రేణికి నెల్లఁ జక్రిముఖరుండా చక్రి ధర్మంబునం। దమరుద్గోవులు భూమిదేవతలు దీ ఆమ్నాయకారుణ్యస। త్యములున్ యాగతపోదమంబులును శ్రద్ధాశాంతులున్ విష్ణుదే। హములిన్నింటిని సంహరించిన నతం డంతంబునుం బొందెడిన్॥ కావున॥ ఉ॥ చంపుదమే ¶నిలింపులను జంకెలరం కెలఁ దాపసావలిం। బంపుదుమే కృతాంతకుని పాలికి గ్రేపులతోడ గోవులన్। ద్రుంపుదుమే ధరామరులఁ దోలుదుమే నిగమంబులన్ విదా। రింపుదుమే వసుంధర హరింపుదుమే జననాథ పంపుమా॥ వ॥ అని పలుకు మంత్రుల

---

*కట్టా। అయ్యో, నెట్టనన్। శీఘ్రముగా, కట్టడివి। కఠినుఁడు. †క్రయ్యంబడి। సమీపించి. ‡హన్యులు। చంపఁబడినవారు, §ఈలు। కారణము. ||తడయుట। ఆలస్యము చేయుట. ¶నిలింపులు। దేవతలు.

షఃమంత్రంబులనిమంత్రితుండై బ్రాహ్మణనిరోధంబునిషేధంబనితలంపక కాలపాశబద్ధుండై విప్రాది సాధుమానవులఁబు
సదానవులఁబంపియంతిపురంబునకుంజనియె ననంతరంబ యారక్కసులు వెక్కసంబులగు మొక్కలంబులసజ్జనులపజ్జ
లఁబడితర్జనగర్జనభర్జనాదిదుర్జనత్వంబులనిర్జించిపాపంబులార్జించిరి॥ గీ॥ వెదకి వెదకి దైత్యపీరులుసాధుల। నడఁప వారిబ
లములడఁగిపోయె। యశముసిరియుధర్మమాయువుభద్రంబు। నార్యహింససేయనడఁగుఁగాదె॥ వ॥ అంతమందలోనందుం
డునందనుండుపుట్టుటయెఱింగిమహానందంబున నెఱవాదులగు వేదవిదులంబిలిపించిజలంబులాడిశుచియై శృంగారించు
కొనిస్వస్తిపుణ్యాహవాచనంబులుచదివించిజాతకర్మంబులు సేయించిపితృదేవతలనర్చించి విప్రులతోడంగూడఁగై చేసి
నపాడిమొదవుల రెండులక్షలనుగనకకలశవాణివసనపిశాలంబులైనతిలశైలంబు లేడింటినిభూదేవతలకిచ్చిన. క॥ ఈయా
భీరకుమారుఁడు। శ్రీయుతుఁడై వీరవైరిజేతయునై దీ। ర్ఘాయుష్మంతుండగుననని। పాయక దీవించిరపుడు బ్రాహ్మణజనముల్.
క॥ దుందుభులు మొరసెగాయక। సందోహముపాడె సూతసముదాయముతో। వందిజనులుగీర్తించిరి। క్రందుగవీతెం
చెభద్రకాహళరవముల్॥ క॥ పల్లవతోరణసురుచిర। వల్లీధ్వజరాజిధూపవాసనములతో। సల్లలితములై యొప్పెను। వల్లవ
వల్లభులయిండ్లవాకిండ్లెల్లన్॥ క॥ పసపులునూనెలునలఁదిన। బసఁదనరిసువర్ణబర్హిబర్హప్రభతోఁ। బసిమిగలిగి వెలుఁగొందు
చుఁ। బసులన్నియుమందలందుఁ బ్రభవించెన్నృపా॥ క॥ క్రేళ్లుఱికిమసలెలేగలు। ముల్లడిగొనిరంకెలిడియెమదవృషభంబుల్
పెల్లుగమొదవులపొదుగులఁ। జల్లించెంబాలుబాలుసంభవవేళన్॥ క॥ ఆరగఁజదివెడిసొగడెడి। వారికివిద్యలను బ్రతుకువారి
కిలేమిం। జేరినవారికినెల్లను। గోరకమునునందుఁడిచ్చెగోధనచయముల్॥ ఆసమయంబున॥ క॥ కంచుకములుతలచుట్లును।
కాంచనభూషాంబరములుగడుమెఱయఁగనే। తెంచిరిగోపకులందఱు। మంచిపదార్థములుగొనుచుమాధవుఁజూడన్॥ క॥ ప
తెంచిచూచిచెలఁగుచు। నేతులఁజెరుగులనుబాలనీళ్లనువెన్నన్। బ్రీతివసంతములాడిరి। యాతురులై సరసభాషలాడుచు
గొల్లల్॥ తదనంతరంబ॥ గీ॥ ఏమినోముఫలమొయింత ప్రౌఢొక వార్త। వింటిమబలలార వీనులలర। మును*యశోదచిన్నిసుగ
వానిఁగనెనఁట। చూచివత్తమమ్మసుదతులార॥ వ॥ అనియొండొరులలేపిగోపికలోపికెలులేని చిత్తంబులనెత్తినత్తఱంబు
లొత్తుకొననుదారంబులగుశృంగారంబులనింపులువెలువడి॥ క॥ జడగతులనుబలుపిఱుఁదులుఁ। బిడికెడునడుములునువలుదబి
గిచనుగవలు। స్వేదఁదనయనములుసిరితడఁ। బడుమోములుభ్రమరదిరుగభరములునమరన్॥ ఉ॥ వేడుకతోడఁ గ్రొమ్ముడు
లువీడఁగుచోపరిహారరేఖలు। ల్లాడఁగపోలపాలికలహాటకపత్త్రరుచుల్ప్రపోదనం। బాడపటాంచలంబులసియాడుచుఁజేరి
యశోదయింటికిన్। జేడియలేగిచూచిరొగిజిష్ణునివిష్ణునిఁజిన్నికృష్ణునిన్॥ చూచిసంతసించితెచ్చినకానుకలిచ్చి॥ గీ॥ పాపని
కినూనెతలయంటిపసపుఁబూసి। *బోరుకాడించిహరిరక్షపొమ్మటంచు। జలములొకకొన్నిచుట్టిరాజిలెదుతొట్ల। నునిచిదీ
వించిపాడిరయ్యువిదలెల్ల॥ క॥ శ్రీజోజోకమలదళేక్షణ। జోజోమృగరాజమధ్యజోజోకృష్ణా। జోజోపల్లవకరపద। జోజో
పూర్ణేందువదనజోజోయనుచున్॥ ఇవ్విధంబున॥ క॥ పలుతోయంబులజగములఁ। బలుతోయములందుముంచిభాసిల్లెడియా।
పలుతోయగాఁడువల్లవ। లలనాకరతోయములఁ జెలంగుచుఁదడియన్॥ క॥ లోకములునిదురవోవఁగ। జోకొట్టుచునిదుర
వోనిసుభగుఁడురమణుల్। జోకొట్టిపాడనిదురం। గైకొనుక్రియనూరకుండెఁగనుఁదెఱవకయున్॥ సీ॥ ఏబాములెఱుఁగ
కయేపాటుమేటికిఁబసులగాపటియింటబాముగలిగె। నేకర్మములులేకయెనయుచక్కటికినిజాతకర్మంబులుసంభవించె।
నేతల్లిచనుపాలునెఱుఁగనిప్రోఢయశోదచన్నులపాలచొరవనెఱిఁగె। నేహానివృద్ధులునెఱుఁగనిబ్రహ్మంబుపొదిగింటి
లోవృద్ధిఁబొందజొచ్చె। నేతపములనైననెలమిఁబండనిపంట। వల్లవీజనములవాడఁబండె। నేచదువులనైననిట్టిట్టిదనరాని।
యర్థమువయవములనందమొందె॥ మ॥ చెయువుల్సేయుతఱిన్విధాతకరణిజ్జైనొందుసంతోషమ్ము। ప్రియుతుండైనగుచున్జ
నార్దనునిమాడ్కింబొల్చురోషించియు। న్నయెడన్ రుద్రునిభంగినెప్పనుసుఖానందంబునుంబొందిత। న్మయుఁడై బ్ర
హ్మముభాతిబాలుఁడమరున్బాహుళ్యబాల్యంబునన్॥ అయ్యవసరంబున॥ గీ॥ కొడుకుఁగన్నవేడ్కగొనసాగరోహిణిఁ। జి
ఱఁబంచిచిత్రచేలములను। మండనములనిచ్చిమన్నించెనందుఁడా। యంబుజాక్షిప్రీతరయ్యెచరించె॥ వ॥ అదిమొదలుమొదవు
లకమపులుపొదువులుగలిగియుండెనంతనమ్మందగోపకులనేకులగోకులరక్షకుదక్షులై నవారినినియమించిమధురకుం
జనికంసునికినేఁటేఁటంబెట్టెడియరింబెట్టివీడ్కొనివసుదేవునికడకుంజనియథోచితంబుగవర్తించిన॥ క॥ నందుననిఁగనుఁగొ
నిప్రాణము। పొందినబొందియునుబోలెఁబొలుపారుచునా। నందాశ్రులుగడకన్నులఁ। గ్రందుకొనంగేలుసాఁచికౌఁగిటఁ
జేర్చెన్॥ వ॥ మఱియుఁగౌఁగలించికొనిసుఖాసీనునింగాఁజేసివసుదేవుండుతనకొడుకునలనిమోహంబుదీపింపనందునకి

*యశోదచిన్ని।బిడ్డలులేకయున్నయశోదాదేవి. *బోరుకాడించి।స్నానముచేయించి. శ్రీజోజో।సుఖముగానిద్రింపుము; జోకొట్టి।బుజ్జార్చి.

ష్టీనియె॥ క॥ సంతతి లేదని మనమున, జింతనము లమునిఁగి ముదిసి చిక్కితి నీకున్, సంతతి గలిగెను భాగ్యము, సంతతిహీనునికి సౌఖ్యసంతతి గలదే॥ క॥ పొడఁగంటి నిన్ను బ్రతికితి, గడచితి నాపదల నింకఁ గార్యము లందే, యెడపడుగు లేసి నెచ్చెలి, పొడఁగాంచుట చచ్చి మఱలఁ బుట్టుట గాదే॥ క॥ పలుపాటులఁ బడు జనులకు, నిలనొక చో నుండ గలదె యేరుల వెంటన్, గలసి చను మ్రాఁకు లన్నియుఁ, బలు వెంటలఁ బోవుఁ గాక పాయక యున్నే॥ మ॥ బలురోగంబుల నొందకున్నె పసుల్ వాలిచ్చునే ధేనువుల్, గ్రాలఁ ఖల్వాఁగులు వారిపూరితములే గోష్ఠప్రదేశంబులం, బులులుర్ దుష్టులు సంచరింపవుగదా పొల్పారునే ఘోషము, ల్కలవే పచ్చని పూరు జొంపములు తత్కాంతారభాగంబులన్॥ క॥ తన పుత్ర మిత్ర ముఖరులఁ, దను పక చూడక యువారు దఱిగిన శింషన్మనుచు గృహమేధియాశ్రమ, మునను నుండెడి వానికొక్క మోదము గలదే॥ క॥ నీ కాంత యొద్ద నీవును, నీ కాంతయుఁ గారవింపనినుఁ దండ్రిగనా, లోకించుచు నీమందను, నా కొడుకున్నాఁడు నందనందాన్వితుఁడై॥ అనిన నందుం డిట్లనియె॥ శా॥ నీకున్ దేవకికిన్ జనించిన సుతానీకంబుఁ దోడ్తోడ ము, న్నీ కంసుండు వధించె మీ సుతఁ దుదిన్ హింసింపఁ జేతప్పితా। నా కాశంబున కేగె బాలయిది దైవాధీనమాపద్దశ, న్నొకం బందు నెతజ్జ్ఞుఁ డూరడిలు నాసూనుండు నీసూనుఁడే॥ అనిన వసుదేవుండు నందునికి మఱియు నిట్లనియె॥ క॥ జనపతికరియిడితివి మముఁ, గనుఁగొంటివి మేము నిన్నుఁ గంటిమి మేల, య్యెను బొమ్మింకను గోకుల, మునను

❋ కంసుని పంపున పూతనయను రాక్షసి రేపల్లెకుఁ జనుదెంచుట. ❋

త్పాతములు దోఁచె మనుకొనవలయున్॥ వ॥ అని పలికిన వసుదేవుండు నందాదులైన వల్లవుల వీడ్కొలిపిన వారలు గొబ్బున వడిగల గిబ్బలం బూనిన శకటంబులు ప్రకటంబులుగ నెక్కి తమతమ పల్లెల త్రోవలు పట్టి చని రానందుండు ❋ ప్రతీతంబులైన యుత్పాతంబులు ముందరఁ బొడఁగని శౌరి తనతోఁ బలికిన పలుకులు దప్పదనుచుఁ దలంచుచుం జనె నంత॥ సీ॥ కంసుపంపున బాలఘాతిని పూతన పల్లెల మందలఁ బట్టణముల, నిలయెల్ల చో బాలహింసఁ గావించుచుఁ జనుచు నెవ్వని పేరు శ్రవణవీథిఁ। బడిన యంతన సర్వభయనివారణమగునట్టి దైత్యాంతకుండవతరించి, యున్న నందుని పల్లెకొక నాఁడు ఖేచరియై వచ్చి యందమాయాప్రయుక్తిఁ, గామరూపిణియై చొచ్చి కానకుండ। నరిగి యిల్లిల్లుఁ దప్పక యరసికొనుచు। నందగృహమున బాలుని నాదమొకటి, విని ప్రమోదించి సుందరీవేషయగుచు॥ మత్తకోకిల॥ ❋ క్రాలుకన్నులు గుబ్బచన్నులుఁ గందు బొందని చందురుం, బోలు మోమును గల్గు లేదను బుద్ధి నూనిన కౌను హే, రాళమైన పిఱుందు పల్లవరాగ పాదకరంబులున్। జాలజొత్తగు కొప్పు నొప్పగ సర్వమోహనమూర్తితోన్॥ మానినీవృత్తము॥ కాంచన కుండల కాంతులు గండయుగంబునఁ గ్రేళ్లుఱుకన్ వక్షపై, మించిన మల్లెల మేలిమి తావులు మెచ్చిన దాటులు మిన్నునరా, నంచిత కంకణహారరుచుల్ చెలువారఁగఁ జై వలువంచలమిం, చించుగ జారఁగ నిందునిభాననయే గెఁగు మారుని యింటికి నై॥ ఆసమయంబున॥ మ॥ సిరి యమ్మున్ బ్రతుకంగఁ జూచుకొఱకై శృంగారవేషంబుతో, నరుదేనో పునటంచు గోపికలు జిహ్వాలోక మోహించితే। త్వరులై చూడలతాంగి వోయిక నియెంబర్యంక మధ్యంబునం, బరుభస్మానల తేజు దుర్జనవధప్రారంభకున్ డింభకున్॥ కనికదియ వచ్చు సమయంబున॥ శా॥ ఆలోకేశ్వరుఁడా చరాచరవిభుండా బాలగోపాలుఁడా, బాలధ్వంసిని గొంటుఁ గంటిడి వైన న్బాలింత చందంబున, న్బాలిఁ జల్ల విషమానివచ్చుట మదిన్ భావించి లోనవ్వుచున్। గాలుం గేలు నెఱుంగకున్న కరణి న్గన్మోడ్చి గుఱ్ఱెట్టుచున్॥ క॥ ఆపాపజాతి సుంగరి, యాపాపని పాన్పుఁ జేరనరిగి కరములన్। లేపి చనుంగవ శిశువు, న్మోఁపుచు ముద్దాడి సిరము మూర్కొని పలికెన్॥ క॥ చను నీకుఁ గుడువఁ జాలెడి। చనువారలు లేరు నీవు చనవలెననుచు। న్జనుఁ గుడిపి మీఁద నీకడఁ। జనుదాననన౦గ వేడ్కఁ జనుఁ జనుగుడుపన్॥ క॥ నా చనుబాలు క్రొక్కేడు, నో చిన్ని కుమార త్రావు ముయ్యానఁ బిడపన్। నీ చెలువ మెఱుఁగవచ్చును। నా చెలువము సఫలమగును నళినదళాక్షా॥ వ॥ అని బాలునుద్దేశించి ముద్దాడెడి భంగి మాటలాడెడి చేడియం జూచి॥ మ॥ వనితా ముట్టను మమ్మ చన్నుగుడుపన్వల్ద న్మనీ చన్నమా, తనయుం డొల్లఁడు వాసిపొమ్మనియ యశోదా రోహిణుల్ జీఱఁగై, కొనకీక్షించుచు మాయఁబన్ని పెలుచన్ గోశంబులో పాలు మెల్పున రాజిల్లుచు మాట మెత్తదనముల్లో వాడియున్నేర్పడన్॥ వ॥ కదిసి కలికి పలుకులం బలుకుచు నులుకు చెడి ఝుళుకు సౌరక యెదురనిదురం గదిరిన ఫణియని యెఱుంగక గుణమతంబిగు ముజడమతి జెడంగునక అటిజరభి తెఱవ పఱపున డుమ నెఱపుగలిగి మెఱయుచుఁ గనుంగవం దెఱవక వెఱపు మఱపు నెఱుంగక కొమరు మిగులు చిఱుతకొమరు సిందిగి చితొడలన డుమనిడుకొని యొడలు నివురుచు నెడనెడ మమతం గడలుకొలుపుచు నాఁకొన్న చిన్ని యన్న చన్నుగుడువుమని చన్నిచ్చు సమయంబున॥ సీ॥ మేల్కొన్న తెఱఁగున మెల్లనఁ గను విచ్చి క్రేగంటఁ జూచుచుఁ గిదికి నీల్గి, యావలించుచుఁ జేతులాకసంబునఁ జాఁచి యొదిగిలి యాఁకొన్న యోజనూఁది, బిగిచన్నుగవఁ గేలఁ బీడించి కబళించి గ్రుక్క గ్రుక్కగుగుటుగుటుకుమనుచు, నొక రెండు గ్రుక్కలను పిడ ప్రాణంబులు సైతము మేనిలో సత్వమెల్లఁ, ద్రావెన దియును గుం

❋ ప్రతీతము, ప్రసిద్ధము. ❋ క్రాలుకన్నులు, లకుకన్నులు, కౌను, నడుము.

డెలుదల్లడిల్లఁ జిమ్మదిఱుఁగుచు నిలువక శిరము వ్రాల నితరబాలుర క్రియ వాఁడఁ పీవు గావు । చన్నువిడువుము విడువుము చాలుననుచు॥ క॥ నిబ్బరము దప్పి మంటలు ప్రబ్బిన ధృతిలేక నేత్రపదహస్తంబుల్ గొబ్బున వివృతములగుచును గుబ్బనుచున్నట్టి మాఁతగూలెన్ నేలన్॥ మ॥ అదరెన్ గొండలతోడ భూమి గ్రహతారానీకముల్ మింటిపై బెదరెన్ దిక్కుల మూలు మ్రోఁతలెసఁగెన్ భీతిల్లె లోకంబులుం గదలం బాఱెను వజ్రభిన్నగిరిరేఖంబూర్వదేహంబుతోఁ ద్రిదశధ్వంసిని గూలెఁ గుయ్యిడుచుం దద్దీర్ఘోరుఘోషంబునన్॥ క॥ అప్పుడు దెప్పరమగు నా చప్పుడు హృదయములఁ జొచ్చి సందడిఁ బెట్టన్ ముప్పిరిఁగొని పడిరెటుకలు దప్పి ధరన్ గొల్లలెల్లఁ దల్లడపడుచున్॥ క॥ ఆజరభిరండరక్కసి నైజశరీరంబు నేలనలియంబడినన్ యోజనమున్నర మేరధరాజంబులు నుగ్గులయ్యె రాజవరేణ్యా॥ సీ॥ *దారుణలాంగూలదండదంతంబులు నగగహ్వరముఁ బోలు నాసికయును గండశైలాకృతిగల కుచయుగమును విరిసితూలెడి పల్ల వెంట్రుకలును జీకటినూఁతులఁ జెనయు నేత్రంబులు పెనుదిబ్బఁబోలెడి పెద్దపిఱుఁదు చాలుకట్టలఁబోలు చరణోరుహస్తంబు లింకిన మడువుతో నెనయు కడుపు గలిగి పట్టోర్విశదీర్ఘమై కదిసి చూడ భయదమగు దాని ఘనకళేబరముఁ జూచి గోపగోపీజనంబులు గుంపుఁ గూడి బెగడుచుండిరి చనమున బెదరు గదిరి॥ ఇవ్విధంబున॥ క॥ ఆతఱిఁ గుఱువఁ గనడిచెను నూతనఫుల్లాబ్జలోచనుఁడు హరి మృత్యుద్యోతనఁ గృతముని సముదయ యాతనఁ బూతన నెఱింగి యాతను లీలన్॥ క॥ ¶విషధరరిపుగమనునికిని విషగళసఖునికిని విమలవిషశయనునికిన్ విషభవభవజనకునికిని విషకుచ చను విషముఁ గొనుట విషమే తలఁపన్॥ వ॥ అంత నా గోపగోపీజనంబులు దెలిసి రోహిణీయశోదలం గూడుకొని బెగ్గడిలక డగ్గరి॥ శా॥ నేలం గూలిన మేటి పెన్నురముపై నిర్భీతిఁ గ్రీడించు నో బాలారమ్మని మూఁపుఁ జేర్చుకొని సంస్పర్శించి నూరార్చుచు న్గోలాంగూలముఁ ద్రిప్పి గోపురజమున్ గోమూత్రముం జల్లి తద్బాలాంగంబుల గోమయంబలఁది రా పంద్రెండు నామంబులన్॥ రక్షావచనము॥ మఱియు నంతటం దనియక గోపికలాచమనంబులు సేసి దక్షులై మునుదమకురక్షాకరంబగు బీజన్యాసంబు చేసుకొని చిన్నియన్న నీ యడుగుల నజుండును, జానువుల ననిలుండును, దొడల యజ్ఞుండును, గటితలంబచ్యుతుండును, గడుపు హయాస్యుండును, హృదయంబు కేశవుండు, నురము నీశుండును, గంఠంబు నినుండును, భుజంబులఁ జతుర్భుజుండును, ముఖంబు త్రివిక్రముండును, శిరంబీశ్వరుండును రక్షింతురు- ముందు చక్రియు, వెనుక గదాధరుండైన హరియుఁ, బార్శ్వంబుల ధనుర్ధరుండైన మధువైరియు, నసిధరుండగు జనార్దనుండును, గోణంబుల శంఖచక్రగదాధరుండైన నయ్యురగశయనుండును, మీఁదనుపేంద్రుండును, గ్రిందు తార్క్ష్యుండు, నంతటను హలధరుండగు పురుషుండును గాతురు- నీ యింద్రియంబుల హృషీకేశుండును, బ్రాణంబుల నారాయణుండును, జిత్తంబు శ్వేతద్వీపపతియును, మనంబు యోగీశ్వరుండును, బుద్ధి నిపృశ్నిగర్భుండు, నహంకారంబును భగవంతుండైన పరుండుఁ బాలనంబు సేయుదురు- నీవు క్రీడించు నెడ గోవిందుండును, శయనించుతఱి మాధవుండును, నడుచు వేళ వైకుంఠుండును, గూర్చున్న సమయంబున శ్రీపతియును, గుడుచు కాలంబున సర్వభక్షుకుండయిన యజ్ఞభుజుండు నేమఱకుండుదురు- నిన్నుఁ బేర్కొని నదుస్స్వప్న వృద్ధబాలగ్రహంబులును, గూశ్మాండఢాకినీయాతుధానులును, భూతప్రేతయక్షరాక్షసపిశాచవినాయకులును, గోటరాదులును, జ్యేష్ఠాదిభూతనాథులును, మాతృకాదిగణంబులు నశియింతురు. నీయందుఁ బ్రాణేంద్రియశరీరవిరోధంబులైన యున్మాదంబులు, నపస్మారంబులును, దుస్స్వప్నంబులును బొందకుండుం గావుత యని రక్ష చేసి దీవించిరంత॥ క॥ ఆ పెద్ద వేడబంబుల పాపనికిఁ జన్నుఁ గుడిపి పానుపుపైనం బ్రాపించి కప్పి యూరుకు మోపాపఁడ యని యశోద యొయ్యనఁ బాడెన్॥ వ॥ అంత నందుండు మొదలైన గోపకులు మధురనుండి వచ్చి రక్కసి మేనుఁ గని వెఱఁగుపడి మున్ను వసుదేవుం డుత్పాతంబు లెఱింగి చెప్పె నతండు మహాయోగియని పొగడి కఠోరంబగు పూతన మొడలుఁ గుఠారంబుల నఱికి తమ ‡కుటీరంబులకుం దవ్వగు ప్రదేశంబున పటీరంబుల దహనంబు సంగ్రహించి దహించిరి॥ గీ॥ పొగిలి పొగిలి కాలుచున్న దేహంబున నగరుపరిమళముల పొగలు వెడలె దేహకల్మషములు శ్రీహరిముఖమునఁ ద్రావఁబడుటఁ జేసి భూవరేణ్య॥ క॥ హరి దనమీఁదం బడముల గరములు నిడి చన్నుఁ గుడిచి వికదిసిన మాత్రన్ హరిజనని పగిదిఁ బరగతి కరిగెను దురితములఁ బాసి యసురాంగనయున్॥ క॥ వెన్నునికొకమఱి

---

* దారుణలాంగూలదండదంతంబులు భయంకరములగు తోఁకలవలె-కట్టెలవలె పొడవులయిన పండ్లును. ‡కుటీరము గృహము-గుడిసె. పటీరంబుల చందనవృక్షములచేత. ¶విషధరరిపుగమనునికిని॥ విషధర సర్పములకు, రిపు శత్రువైన గరుత్మంతునిపై నెక్కి, గమనునికి సంచరించువానికిని, విషగళసఖునికిని॥ గరళకంఠుడయిన శివుఁడే స్నేహితుఁడుగాఁ గలవానికిని, విమలవిషశయనునికిన్॥ విమల విష నిర్మలములగు జలములయందు, శయనునికిన్ పరుండియుండువానికిని, విషభవభవజనకునికిని॥ విషభవ జలమునందు బుట్టిన పద్మమునందు, భవ ఉద్భవించిన బ్రహ్మయొక్క, జనకునికిని తండ్రియైనవానికిని, విషకుచ గరళము స్తనమందుఁ గల భూతకియను రక్కసియొక్క, చనువిషము పాలిచ్చునపుడుగల విషమును, కొనుట గ్రహించుట, తలఁపన్ విచారింపఁగా, విషమే కష్టము.

విసమును దన్నిచ్చిన బాలహంత్రి చనెనఁట దివికి నెవ్వన్ను నెఁగని పెంచుచుఁ దన చన్నిచ్చిన సతికి మఱియు జన్మము గలదే॥ క॥ హ
రిఁగని చన్నులు సుడి పెడి తరుణులు ప్రాపించు పదము తలఁపఁగ వశమే హరి యారగించుటం బా ల్గురిసిన ధేనువులును ము
క్తిఁ గొనలఁ జరించుఁ॥ క॥ శ్రీ ఆపూతన మెయిగంధము గోపాలు రెఱింగి యిట్టికువనిత యొడలం దీపాటి స్వాదుగంధము ప్రా
పించునె యనుచుఁ జనిరి పల్లెల కధిపా॥ వ॥ అంత నందుండు పరమానందంబున నింటికిం జని వ్రేతల చేత రక్షసేసి సేఁతలన్నియు
నెఱింగి వెఱఁగుపడి పాపని లేపి శిరంబు మూర్కొని ముద్దాడి ముదంబున నుండె నని చెప్పిన విని పరీక్షిన్నరేంద్రుం డిట్లనియె॥
క॥ ఏయే యవతారంబుల నేయే కర్మములు చేసె నీశుఁడు హరి భద్రాయతనము లన్నియు విన బాయదు చిత్తంబు సెవుల
పండువు లయ్యెన్॥ క॥ ఉరుసంసారపయోనిధి తరణంబులు పాపపుంజదళనంబులు శ్రీ కరణంబులు ముక్తిసమాచరణం
బులు బాలకృష్ణసంస్మరణంబుల్ ॥ వ॥ అని తరువాత బాలకృష్ణుం డేమి చేసె నాయంచుం గృపగలదేని చెప్ప వే యని యడిగిన

శ్రీ బాలుండగు కృష్ణుండు శకటమును దన పాదముచేఁ గూలఁద్రన్నుట. శ్రీ

రాజునకు శుకుం డిట్లనియె॥ సీ॥ బాలకుఁ డొదిగిలఁబడ నేర్చె నిజజన్మనక్షత్రమం దొక నాఁడు నందపాలఁతి వేడుకతోడఁ బో
రుగు వ్రేతలఁ జీరి వాదిత్రగీతారవంబు చెలఁగ విప్రులతోఁ గూడ వేదమంత్రంబుల నభిషేచనాదిక మాచరించి వారి దీవె
నఁ బొంది వారికి మొదవుల నన్నంబు చీరెలు నడిగినట్టు లిచ్చి బాలుఁ డియ్యమెసఁగఁ బానుపుఁ జేర్చి నిదురఁ బుచ్చి గోపనివ
హామునకు గోపికలకుఁ బూజఁ గొమరారఁ జేయుచు జనని కొడుకు మఱచె సంభ్రమమున॥ ఆ సమయంబున॥ క॥ నిమిరించి నశి
వాఁకొని కిముకుచుఁ జనుఁ గోరి కెరలి కిసలయవిలసన్మృదు చక్ర చాప రేఖా స్పదపదమునఁ దన్నె నొక్క బండిం దండిన్॥
క॥ శకటము హరి దన్నిన దివి ప్రకటంబై యెగసి యిఱుసు భరమునఁ గండ్లుం వికటంబుగ నేలం బడె నకటా యని గోపబృంద
మాశ్చర్యపడన్॥ వ॥ అప్పు డందున్న సరసపదార్థంబులు వ్యర్థంబులై నేలం గూలుటం జూచి యశోదానందముఖ్యులైన గోప
గోపికాజనంబులు పనులు మఱచి *ప్రబ్బంబులు మాని యుబ్బు చెడి వెఱపులు ఘనంబులుగ మనంబులం ముఁగమర॥ క॥ మిన్నున
కూరక నెగయదు తన్నసమర్థుండు గాఁడు తల్పగతుం డీ చిన్నికుమారుఁడు తేరే శ్రీ విన్ననువున నెగసె దీని విధ మెట్టిదియో॥
అని వితర్కించు సమయంబున॥ క॥ బాలకుఁ డాఁకొని యేడ్చుచుఁ గాలెత్తినఁ దాఁకి యెగసెఁ గాని శకటమే మూలమున నెగ
య దని తద్బాలునికడ నాడుచుండి పలికిరి శిశువుల్ ॥ ఇట్లు శిశువుల పలుకులు విని॥ శా॥ బాలుం డెక్కడ బండి యెక్కడ నభో
భాగంబుపైఁ జేడ్పడన్ గాలం దన్నుట లెక్కడాటపడుచుల్లల్లాడిరీ జల్పము లేక లోకంబుననైనఁ జెప్పఁబడు నే యేచ్చంద
మో కాకయుం జాలాపించుచు వ్రేలు వ్రేతలు ప్రభూతాశ్చర్యలై రంతటన్॥ వ॥ అప్పు డా బాలుని రోదనంబు విని యశోద ప
రతెంచిన॥ గీ॥ అలసితివి గదన్న యాఁకొంటివి గదన్న మంచియన్న యేడ్పు మానుమన్న చన్నుగుడువుమన్న సంతసపడుమ
న్న యనుచుఁ జన్నుఁ గుడిపె నర్భకునకు॥ వ॥ అంత నబ్బాలుని మేన బాలగ్రహంబు సోఁకును గదా యని శంకించి గోపకులనేకుల
నేక బలివిధానంబులు సేసిరి బ్రాహ్మణులు దధికుశాక్షతంబుల హోమంబు లాచరించిరి ఋగ్యజుస్సామమంత్రంబుల న
భిషేచనంబులు సేయించి స్వస్తిపుణ్యాహవాచనంబులు చదివించి కొడుకున కభ్యుదయార్థంబు నందుం డలంకరించిన పాడి

శ్రీ తృణావర్తుఁడను రాక్షసుఁడు సుడిగాలియై కృష్ణుని యెత్తుకొనిపోవుట. శ్రీ

మొదవుల విద్వజ్జనంబుల కిచ్చి వారల యాశీర్వాదంబులు గైకొని ప్రమోదించె నని చెప్పి శుకుం డిట్లనియె॥ క॥ కొడుకు నొక
నాఁడు తొడపై నిడుకొని ముద్దాడి తల్లి యెలమి నివురుచోఁ గడుదొడ్డకొండశిఖరము వడువున వ్రేఁగయ్యె నతఁడు వసుధాధీ
శా॥ క॥ బరువైన కొడుకు మోవను వెరవిడి యిలమీఁదఁ బెట్టి వెఱచి జనని దా ధరఁ గావఁ బుట్టిన మహాపురుషుఁడు గాఁ బో
లు ననుచు బుద్ధిం దలంచెన్॥ అప్పుడు॥ క॥ ఖరమతి కంసుని పంపున నరిగి తృణావర్తుఁ డవని కతిచోద్యముగా సురగరువలియై విస
విస నరుదరుదనము సరి విసరి హరిం గొనిపోయెన్॥ క॥ సుడి యెఱుఁగని హరి సుడివడ సుడిగాలి తెఱంగు రక్కసుఁడు విసరెడి
యా సుడిగాలి ధూళి కన్నులఁ సుడిసిన గోపకులు బెగడి సుడివడి రధిపా॥ వ॥ మఱియు మలయపవనదనుజుండు విలయపవనుని
తెఱంగునకు సిమసంగిమఁ సరిముసరుక విసివిసరెడి సురకరువలిం బొడమిన పుడమిరజంబు వడి నెగసి గగనమున మెఱసి తరణికి
రణములకు మఱుఁగువడిన నిబిడమగు బెడిదంపు తిమిరమున దశదిశ లెఱుంగఁబడక గోకులం బాకులంబు నొంద నొండొరుల నె
ఱుంగక బెండువడుచున్న జనంబుల మనంబుల ఘనంబగు భయంబు రయంబునం జెంద నదభ్రపరిభ్రమణశబ్దంబున దిగంతం
బులు చెవుడుపడి పరిభ్రాంతంబులుగ నొక్కముహూర్తమాత్రంబున భువనభయంకరంబు దోఁచె నాసమయంబున॥
ఉ॥ పాపనిఁ జూడఁగానక విపద్దశ నొందికలంగి తల్లి యో పాపఁడ బాలసూర్యనిభ బాలశిరోమణి నేఁడు గాలికిన్ జేపడిపో
యితే యనుచుఁ జీఱుచు దైవముఁ జాల దూరుచున్ దాపము నొంది నెవ్వగలఁ డయ్యుచుఁ గుందుచు బిట్టుగుయ్యుచున్॥ క॥ సుడి

శ్రీ ఆపూతన అభాగకి మొక్క. *ప్రబ్బంబు అర్చన-వేడుక. శ్రీ విన్ననువు ఉపాయము.

గాలివచ్చినిన్నుఁ। సుడిగొనికొనిపోవమింటసుడివడిగొనుచుఁ।బెడగడరెడినాముద్దుల। కొడుకాయేమంటివనుచుఘో
రంబనుచుఁ॥ఉ॥ఇక్కడఁబెట్టితిందనయుఁడిక్కడనాడుచునుండెగాలిదా। నెక్కడనుండివచ్చెశిశువెక్కడిమార్గమువట్టి
పోయెనే। నెక్కడఁజొత్తునంచుఁగనులెత్తుచుగ్రేపుఁదొలంగిబిన్నవై। పొక్కుచువ్రాలుగోవుక్రియభూస్థలివ్రాలెనురం
తచింతయై॥క॥పాపనికైయిటుపొగిలెడి।యాపాపనితల్లిఁజూచియాకటపడుచుఁ।గోపాలసతులుబాష్పజ।లాపూరితన
యనలైరియార్తింబడుచుఁ॥శా॥ ఆలోఁజక్రసమీరదైత్యుఁడసుహాహాహాంకారుఁడైమింటికిఁ। బాలుందోకొనిపోయిపో
యికుదిఁదద్భారంబుమోవఁగబల।శ్రీలేమింబరిశాంతవేగుఁడగుచుఁజేష్టింపఁగాలేకము। న్నీలాగర్భకుఁజూడనంచునిట
మీఁదెట్లంచుఁజింతించుచుఁ॥అల్లుదనుజుఁడుదింతెంచుచున్నసమయంబున॥క॥బాలద్విరదకరంబులఁ। బోలెడికరముల
నుదనుజుఁబొందుగబిగియంగీలించివ్రేలఁబడియెను।బాలకుఁడొకకొండభంగిఁబరుసైయధిపా॥క॥మెడబిగియఁబట్టుకొని
డిగఁ। బడియెడిబాలకునిచేతఁబర్వతనిభుచే। విడివడఁజాలకవాఁడుఱిఁ। బడిబెగడెఁఖగముభంగిభయముంబొందెన్॥
క॥హరికరగళపీడనమునఁ।బరవశుఁడైరాలమీఁదభగ్నాంగకుఁడై। సురవైరిభటుఁడుగూలెను।బురభంజనుకోలఁగూలు
పురముంబోలెన్॥వ॥అంతగోపకాంతలంతయుంగనిరోదనంబులుమానిసమ్మోదంబునవిక్కవిరిసెరక్కసునియురమునను
రువుఁగలిగిబరువులేకవ్రేలుబాలుంగొనివచ్చిముచ్చిలుచున్నతల్లికిచ్చిరప్పుడుగోపగోపికాజనంబులండఱుదనులోనిట్లని
రి॥క॥రక్షణములేకసాధుఁడు।రక్షితుఁడగుసమతఁజేసిరాయిడులందున్। రక్షణములువెయిగలిగిన।శిక్షితుఁడగుఖలుఁడు
పాపవిత్తుండగుటన్॥మ॥ గతజన్మంబులనెంచుబుట్టితిమొయాగశ్రేణులేమేమిచే। సితిమోయెవ్వరికేమిపెట్టితిమొయే
చింతారతింబ్రొద్దువు। చ్చితిమోసత్యములేమిపల్కితిమొయేసిద్ధప్రదేశంబుఁద్రొ। క్కితిమోయిప్పుడుచూడఁగంటిమిచ
టంగృష్ణార్భకున్నిర్భయున్॥వ॥అనిపలికిరంతనందుండుమున్నుదనకువసుదేవుండుసెప్పినమాటలకువెఱఁగుపడుచుండె
మఱియును॥సీ॥ జననాథయొకనాఁడుచన్నుచేపినఁదల్లిచిన్నిముద్దులకృష్ణుఁజేరఁదిగిచి।యెత్తిపెందొడలపైనిడికొనిము
ద్దాడిచన్నిచ్చినెమ్మోముచక్కనివిరి।యల్లననగవుతోనావలించినబాలువదనగహ్వరమునవారినిధులు।దిశలుభూమియు
వనద్వీపశైలంబులునేఱులుగాలియునినుఁడుశశియు। దహనుఁడాకసంబుదారలుగ్రహములు। నఖిలలోకములుచరాచ
రంబు।నైనభూతగణములన్నియునుండుటఁ।జూచికన్నుమోడ్చిచోద్యపడియె॥ వ॥ అంతనొక్కనాఁడువసుదేవుపంపున
యశస్విన్నపురోహితుండైనగర్గుండుమందకుంజనుదెంచిననందుండతనిఁగనుంగొనిలేచినిలిచికృతాంజలియై॥క॥ కోరిభజిం
చెనునందుఁడు।సారగుణాచారమార్గసత్సంసర్గున్। ఆరాధితభర్గున్మతి। దూరితషడ్వర్గుఁగుజనదుర్గున్గర్గున్॥ వ॥ మఱి
యుఁదగినసత్కారంబులుచేసియిట్లనియె॥క॥ఊరకరారుమహాత్ములు। వారధములయిండ్లకడకువచ్చుటలెల్లన్। కారణ
ముమంగళములకు।నీరాకశుభంబుమాకునిజముమహాత్మా॥శా॥ జ్యోతిశ్శాస్త్రములకెల్లమేటరివితేజోమూర్తివాశాంతవి।
ఖ్యాతస్ఫూర్తివిబ్రహ్మబోధనుఁడవాకర్ణింపునాపల్కని।ర్ణీతుండైవసురుండుమానవులకున్విప్రోత్తముఁడండ్రునీ। నా
తుర్యంబుననీకుమారులకుసంస్కారంబుఁగావింపవే॥ వ॥అనిరామకృష్ణులంజూపినగర్గుండుమున్నుకంసునిచేతవ్రేటుఁబడి
దివికెగసిపోయినతెఱవచెప్పినతెఱంగుతేటపడదేవకీదేవికొడుకనికృష్ణునికంసుండుదలంచుఁగావునరహస్యంబునసం
స్కారంబుసేయుటకార్యంబనినందానుమతంబునరోహిణీకుమారునుద్దేశించి॥క॥జనులరమియింపఁదిరిగెడి।యనువుకలి
మిరాముఁడనియయ్యెనుసంకర్షంబునసంకర్షణుఁడనియును।ఘనబలమునబలుఁడనియునగణుతింతురుచెన్నుపా॥వ॥మఱియుం
గృష్ణునుద్దేశించితొల్లియీశిశువుధవళారుణపీతవర్ణుండైయిప్పుడునల్లనైనకతంబునఁగృష్ణుండయ్యెవసుదేవునకునొక్క
డజన్మించినకారణంబునవాసుదేవుండయ్యె-నీపాపనికిగుణరూపకర్మంబులనేకంబులుగలుగుటంజేసినామంబులనేకంబు
లుగలవీశాబకునివలనమీరుదుఃఖంబులఁదరియింతురు-యీయర్భకునిచేతదుర్జనశిక్షణంబునగునీకుమారుండునారాయ

## ——శ్రీకృష్ణబలరాములబాలక్రీడాభివర్ణనము.——

ణసమానుండనిచెప్పితనగృహంబునకమ్మునీశ్వరుండుచనియెనందుండునుబరమానందంబుననుండెనంత॥ సీ॥జానుభాగ
ములహస్తములునీడ్వఁజేసినిడుచుదిగ్గనఁబోనురింతనంత। నవ్వులపయ్యెదలందిజవ్వాడుదురాలక్రేపులతోఁకలలమిప
ట్టి।విడువనేరకవానివెనువెంటఁజరుగుచుసారిదిపంకములందుఁజొత్తురెలమి। యెత్తిచన్నిచ్చుచోనిరుదెసఁజాలిండ్లుచేతఁ
లఁబుడుకుచుఁజేపుగలుగ।మాఁటుమరుగ్రుక్కగ్రుక్కకుఁదోరమునుచు।నాడునరుముద్దపలుకులవ్యక్తముగను।గరము
లల్లార్చికోరికఁగడలుకొలుప।రామకృష్ణులుశైశవరతులఁదగిలి॥క॥ తడవాడిరిబలకృష్ణులు।దడవాడిరివారిఁజూచితగగం
ఖామల్ ।దడవాడిరరులుభయమునఁ।దడవాడిరిమంతనములఁదపసులువేడ్కన్॥ సీ॥తలయెత్తిమెల్లనఁదడవియాడెడునే

శపన్నగాధీశులపగిదిఁ దాల్తు। రంగసమ్మృష్టపంకాంగరాగంబుల నేనుఁగుగున్నల నెత్తువత్తు। రసమంబులైనజవ్వాదిలే
ఖంబులసింగంపుకొదమలసిరివహింతు। రాననంబుల కాంతులంతంత కెక్కఁగ బాలార్కచంద్రులపగిదిఁదోఁతు। రేలమిఁ
దల్లులచన్నుఁబాలెల్లఁద్రావి పరమయోగోద్ధవామృతపానలీల। సోలియోగులవిధమునసొంపుగందు। గాకుమారులుజన
మనోహరులగుచు॥ క॥ చూడనివారల నెప్పుడుఁ। జూడక లోకములుమూఁడుచూపులఁదిరుగన్। జూడఁగ నేర్చినబాలకు। చూ
డామణిజనుల నెఱిఁగి చూడఁగ నేర్చెన్॥ క॥ నగవులవిద్యలపోడిమి। నగుబాటుగఁ జేయ నేర్పుతగవరియంత। న్నగుమొగము
తోడ మెల్లన। నగుమొగములసతులఁజూచినగ నేర్చె నృపా॥ క॥ అవ్వల నెఱుఁగకముప్పూరి। కవ్వల వెలుఁగొందుపరముఁడ
ర్భకుఁడై యా। యవ్వలకుసంతసంబుగ। నవ్వాయవ్వాయనంగ నల్లన నేర్చెన్॥ క॥ అడుగులు వేయఁగలిగి రెం। డడుగుల నే
మున్నుమిన్నునలమినబాలుం। డడుగిడఁదొడఁగెను శాత్రవు। లడుగులుసడుగులును వదలియడుగవనిఁబడన్॥ మఱియును॥
సీ॥ తనువుననంటినధరణీపరాగంబుపూసిన నెఱిభూతిపూఁతగాఁగ। ముందరవెలుఁగొందుముక్తాలలామంబు తొగలసంగ
డికానితునుకగాఁగ। ఫాలభాగంబుపైఁబరగుకావలిబొట్టు కామునిగెల్చినకన్నుగాఁగ। గంఠమాలికలోనిఘననీలరత్నం
బుకమనీయమగు మెడకప్పుగాఁగ। హారవల్లులురగహారవల్లులుగాఁగ। బాలలీల ప్రౌఢబాలకుండు। శివునిపగిదినొప్పె శివుని
కిఁ దనకును। వేఱులేమిఁ దెలుప వెలయునట్లు॥ క॥ ఆపాపలవిహరణములు। తీపులుపుట్టింపమఱియు తేఁకువ లేకా। గోపాలసతు
లుమకుఁగావ। నేపనులును మఱచియుండిరీక్షణపరలై॥ వ॥ ఆసమయంబున బాలకులతల్లులు గోఱ,గోరు,కొమ్ములుగలజంతు
వులవలన నేమఱక జల,దహన,కంటకాదులవలన మోసపోక బాలసంరక్షణంబుసేయుచు నుల్లంబులు మొల్లంబులైన ప్రే
మంబులభిరామంబులుగా విహరించుచుండిరంత॥ క॥ తనయీడు గోపబాలురు। తనుఁగొలువఁగ రాముఁగూడితనువుగలుగు
చు। న్దనుగమనంబులఁ గృష్ణుఁడు। తనుమధ్యలు మెచ్చ నీలతనుఁడు దనరెన్॥ వ॥ మఱియు నాకుమారుండు దినదినంబునకు
సంచారసంభాషణదక్షుండై॥ ఉ॥ చప్పుడుసేయకుండుమనిజంకెయొనర్చిననగ్గిఁబోవఁగా। నప్పుడు బారసాఁచితననవ్వుల
వింములువచ్చిరంచునవ్వొప్పఁగఁజీఱుతల్లిదెసకొత్తిలికృష్ణుఁడురంతుసేయుచు। న్నప్పుడువచ్చి చన్గుడుచునవ్వులయన్నొ
లగంటమ్రోయఁగన్॥ క॥ వల్లవగృహనవనీతము। లెల్లనుభక్షించివచ్చియెఱుఁగనిభంగి। న్దల్లిఁగదిసిచిట్టాడుచు। నల్లనచను
బువ్వఁబెట్టుమవ్వాయనుచున్॥ మఱియు గోపకుమారులంగూడికొని కృష్ణుండు॥ సీ॥ గోవల్లభుఁడ నేను గోవులుమీరని వడిఁ అం
కెవైచుచు వంగియాడు। రాజునేభటులుమీరలురండురండనిప్రాభవంబున పెక్కుపనులువనుచు। నేతస్కరుఁడ మీర లింటి
వారనినిద్రపుచ్చిసొమ్ములుగొనిపోయి డాఁగు। నేసూత్రధారిమీరిందఱుబహురూపులని చెలంగుచు నాటలాడఁబెట్టు।
మూలలుఱుకును డాగిలిమూఁతలాడు। నుయ్యాలలనూఁగుఁ జేబంతులూనరవైచు। జారచోరులజాడలఁ జాలనిగుడు। శౌరి
బాలురతోనాడు సమయమందు॥ వ॥ మఱియు నాకుమారశేఖరుండు కపటశైశవంబున దొంగజాడలం గ్రీడింపగోపికలోపి

### శ్రీ గోపికలు శ్రీకృష్ణునిదుడుకుతనంబుల యశోదాదేవితోఁ జెప్పుట. శ్రీ

కలులేక యశోదకడకువచ్చి యిట్లనిరి॥ క॥ బాలురకుఁబాలులేవని బాలింతలుమొఱలువెట్టఁ బకపకనగియీ। బాలుండాలము
సేయుచు। నాలకుఁ గ్రేపులను విడిచె నంభోజాక్షీ॥ క॥ పడఁతీనీబిడ్డఁడుమా। కడవలలోనున్నమంచి కాఁగినపాలా। పడుచుల
కుఁబోసిదిక్కన। కడవలఁబోనడఁచెనాజ్ఞకలదో లేదో॥ క॥ మీపాపఁడుమాగృహముల। నాపోవఁగఁబాలుఁద్రావియగపడ
కున్న। న్గోపింపఁబిన్నపడుచుల। వాపోవఁగఁజిమ్ముకొనుచువచ్చెన్ దల్లీ॥ మత్తకోకిల॥ పుట్టిపుట్టఁడునేఁడుదొంగిలఁబోయి
మాయిలుఁజొచ్చి తా। నుట్టిక్రిందొకరోలుఁబీటలు నొకప్రోవిడియెక్కిచైఁ। బెట్టఁజాలక కుండక్రిందొక పెద్దతూఁటొ
నరించిమా। పట్టిమీఁగడపాలుఁ జేరలఁబట్టి త్రావెఁ దలోదరీ॥ క॥ ఆడంజనివీరల పెరు। గోడకనీసుతుఁడుద్రావియొకయించు
కఁ జాఁ। గోడలిమూఁతెంజరిమినఁ। గోడలుమ్రుచ్చనుచునత్తమొత్తెలతాంగీ॥ క॥ వారిల్లుఁజొచ్చికడవలఁ। దోరంబగు నెయ్యిఁ
ద్రావితుదినాకడవ। ల్వీరింటనీసుతుండిడ। వారికివీరికిని దొడ్డవాదయ్యెసతీ॥ క॥ వేలుపులఁ డెనాకంబెను। వేలుపుమఱియె
వ్వఁడనుచుఁ బికవికనగిమా। వేలుపులగోడపైనో। హేలావతినీతనూజుఁ డెంగిలిఁ జేసెన్॥ క॥ వెన్నఁదినఁగఁ బోడఁగనిమా। పి
న్నదియడ్డంబువచ్చి పిఱిదికిఁదివియన్। జన్నొడిసిపట్టి చీఱెను। జిన్నికుమారుండెయితఁడు శీతాంశుముఖీ॥ క॥ ఇమ్మగువత్తె
న్నువాకిటఁ। గ్రుమ్మలుచోఁజీఱినిలిపికొని పేరడుగ। న్నెమ్మోవిఁ గఱచివడిఁ జనె। నమ్మా యీముద్దుకుఱ్ఱఁడల్పుడె చెపుమా॥
క॥ చేబంతితప్పిపడెనని। ప్రాబల్యముతోడవచ్చి భవనము వెనుక। న్నాబిడ్డజలకమాడఁగ। నీబిడ్డఁడువలువఁ దెచ్చె నెలఁతుక తె
గునే॥ క॥ ఇచ్చెలువఁజూచిమ్రుచ్చిలి। యచ్చుగనుఱికించుకొనుచునరిగెద నాతో। వచ్చెదవాయని యనినాఁ। డిచ్చెలుతఁడు
సుదతి చిత్రమిట్టిదిగలదే॥ క॥ కొడుకులులేరనియొకసతి। కడువగవఁగఁ దన్నుమగనిఁగాఁగైకొనిన। న్గొడుకులుగలిగెదరని

పైఁబడినాఁడిదివినుముశిశువుపను లేతల్లీ॥ క॥తలఁగినదానందలమనఁ।దలఁగకనాచెలికినానతలయెత్తఁగనీ।తలఁగినచో
శెయ్యేదియని।తలయూఁచెన్నీసుతుండుతగ వెన్మృగాక్షీ॥ క॥వ్రాలఁగవచ్చిననీసతి।చూలాలందలఁగుమనుఁడుఃజూలగుట
కనే।మూలంబు చెప్పుమనెనీ।బాలుఁడు చెప్పఁడు రెసతులుపర్వేందుముఖీ॥క॥మగువానీకొమరుఁడుమా।మగవారటుఁబో
వఁజూచినంతనమునకు।న్దగఁజీఁజీపొందనడిగెను।జగములమున్నిట్టిశిశువుచదువంబడెనే॥గీ॥నమ్మినిదురనోవనాపట్టి*చుం
చుమా। లేఁగతోఁకతోడలీలఁగట్టి।వీధులంచుఁదోలెవెలఁదినీకొమరుండు।రాచబిడ్డఁడైనఁజవ్వ మేలె॥క॥ నాపట్టిపొట్టనిండఁ
గఁ।బైఁబడినీపట్టి వెన్నబానెండిడినాఁ।డూపిరివెడలచువానిఁ।జూపెదనేమైననీవసుమ్ములతాంగీ॥ క॥ తెలివమొకతెని
ద్రింపఁగ। నెత్తిఁగట్టిరవలువవీడ్చి నేఁడొకతేలుం। గఱపించెనీకుమారుఁడు। వెఱచుచునదిపఱవనగుటవిహితమెసాధ్వీ॥
క॥నాకొడుకును నాకోడలు। నేకతమునఁబెనఁగఁబాముసీతఁడు వై వఁ।గోకలెఱుంగకఁబాటిన।గూకలిడెన్నీసుతుండుఁగు
ణమెగుణాఢ్యా॥ గీ॥తరుణిమొకతె పెరుగుఁదఱుచుచుఁదుదివఁగి। వెన్నఁదీయనెదిగి వెనుకఁగదిసి।మగువనీసుతుండుమ
గపోడుములుసేయ।సాగినాఁడుతగదెచక్కఁజేయ॥ సీ॥ కలకంఠిమావాడగరితలమెల్లనీపట్టిరాఁగలఁడనిపాలు పెరుగు।
లిండ్లలోపలనిడియేమెల్లఁదనత్రోవఁజూచుచోనెప్పుడుచొచ్చినాఁడొ।తలుపులుముద్రలుతాళంబులును బెట్టియున్నచం
దంబుననున్నవరయ।నొకయింటిలోఁబాడునొకయింటిలోనాడునొకయింటిలోనవ్వునొకటఁదిట్టు। నొకటఁజెక్కిరించు
నొకొకచోమృగ।పక్షిఘోషణములుపరగఁజేయు। నిట్లుచేసి వెనుకనెక్కడఁబోవునో। కానరాఁడుజిత్తకడవలుండు॥
క॥ కడులచ్చిగలిగెనేనియుఁ।గుడుతురుగట్టుమరుగాకకొడుకులనగుచు।న్బడుగులవాడలపైఁబడ।విడుతురెరాకాంతలెం
దువినులేందుముఖీ॥ క॥ ఓయమ్మనీకుమారుఁడు।మాయిండ్లనుబాలుఁబెరుగుమననీడమ్మా।పోయెదమెక్కడికైనను।మా
యన్నలసురభులానమంజులవాణీ॥ వ॥ అనిమఱియుననేకవిధంబులబాలకృష్ణుండుసేయువినోదంబులుదమయందుఁజే
యుమహాప్రసాదంబులనియెఱుంగకదూఱుచున్న యట్టిగోపికలకుయశోదయిట్లనియె ॥ క ॥ చన్నువిడిచినఁడిట్టట్టు।
నెన్నఁడుపొరిగిండ్లత్రోవ లెఱుఁగఁడు నేఁడుం। గన్నులుదెఱువనిమాయీ।చిన్నికుమారకునిఅవ్వ సేయందగునే॥గీ॥అన్య
మెఱుఁగడుతనయుంతనాడుచుండు।మంచివాఁడితఁడెగ్గులుమానరమ్మ।రామలారత్రిలోకాభిరామలార।తల్లులారగుణ
వతీమతల్లులార॥వ॥అనియశోదవారలనెడంబఱచిపంపికొడుకుంగోపింపఁజాలకయుండెనిట్లు॥ ఉ॥కాంతలుదల్లితోఁదన
వికారములెల్లగణింపభీతుఁడై।శాంతునిసొంపునన్బరమసాధునిపెంపునగోలమాడ్కివి। భ్రాంతునికైవడిన్జడునిభంగిఁ

※ మృద్భక్షణవిశ్వరూపప్రదర్శనాద్యభివర్ణనము. ※

సుమారకుఁడూరకుండెనే। వింతయులేకదల్లికుచవేదికపైఁదలమోపియాడుచున్॥ వ॥ అంతనొకనాఁడుబలభద్రప్రము
ఖులైనగోపకుమారులువెన్నుండుమన్నుదినెననిచెప్పినయశోదబాలునికేలువట్టికొనియిట్లనియె॥ క॥ మన్నేటికిభక్షించె
దు।మన్నియమములేలనీవుమన్నింపవుగీ।యన్నయుసఖులునుజెప్పెడ।రన్నామన్నేలమఱిపదార్థములేదే॥వ॥ అనిపలికిన
ముగుదతల్లికినెఱదంటమైనకొడుకిట్లనియె॥శా॥అమ్మామన్నుఁదిననేశిశువునోయాఁకొంటినో వెఱ్ఱినో।నమ్మంజూడ
కువీరిమాటలుమదిన్ననీవుగొట్టంగవీ। రిమ్మార్గంబుఘటించిచెప్పెదరుకాదేనిన్మదీయాస్యగం। ధమ్మాఘ్రాణముఁజేసి
నావచనముల్దప్పైనదండింపవే॥వ॥అనిపలికినెయ్యంబుననయ్యవ్వనియ్యకొలిపిక్రీడామనుజబాలకుండైనయీశ్వరుండు
తననోరుఁదెఱచిముఖంబుఁజూపిన॥క॥ఆలలితాంగిగనుంగొనె। బాలునిముఖమందుజలధిపర్వతవనభూ। గోళశిఖితరణి
శశిదిక్పాలాదికరండమైనబ్రహ్మాండంబున్॥కనుంగొని॥ మ॥ కలయో వైష్ణవమాయయోయితరసంకల్పార్థమోసత్య
మో।తలఁపన్నేరకయున్నదాననొయశోదాదేవిగానోపర। స్థలమోబాలకుఁడెంతయీతనిముఖస్థంబైయజాండంబు
ప్రజ్వలమైయుండుటకేమిహేతువొమహాశ్చర్యంబుచింతింపఁగన్॥ గీ॥బాలమాత్రుఁడగుసలీలునిముఖమందు।విశ్వమె
ల్లనెట్లు వెలసియుండు।బాలుభంగినితఁడుభాసిల్లుఁగానిస।ర్వాత్ముఁడాదివిష్ణుఁడగుటనిజము॥ అనినిశ్చయించిన॥గీ॥ పమ
హాత్మ్యవలననీవిశ్వరూపంబు।గానఁబడినబుద్ధికంపమయ్యె।నామహాత్మువిష్ణునఖిలలోకాధారు।నార్తులెల్లఁబాయనాశ్ర
యింతు॥క॥నామగఁడునేనుగోవులు। నీమందలుగోపజనులునిబ్బాలునినే। మ్మోమందున్నవిధముగని। యేమఱితిమిగాని
యీశుఁడీతఁడుమాకున్॥వ॥అనితన్నుపరమేశ్వరుండనితలంచుచున్నయశోదయందునాకృష్ణుండువైష్ణవమాయంబొం
దించిన॥క॥జడనువడిమెఱుకచెడియా।పడఁతుకసర్వాత్ముఁడనుచుఁబలుకకయతనిం।గొడుకనితొడపైనిడుకొని। కడువే
డుకతోడమమతఁగావించెన్నృపా॥అనినవినిరాజిట్లనియె॥గీ॥జగదధీశ్వరునకుఁజన్నిచ్చుతల్లిగా। నేమినోమునోఁచెనీయ
శోద।పుత్త్రుఁడనుచునతనిఁబోషించుతండ్రిగా। నందుఁడేమిచేసెనందితాత్మ॥క॥ప్రబ్బినభక్తినిహరిపైఁగబ్బంబులు సె

•చుంచు।జడ,అవ్వ।అల్లరి-అపకీర్తి.

ప్పకవులుకై వల్యశ్రీ। కబ్బుదురఁట హరిపోషణ। మబ్బినతలిదండ్రు లెచటికబ్బుదురు తుదిన్॥ అనినవిని రాజయోగికి శుక
యోగీంద్రుండిట్లనియె॥ సీ॥ అవనీశ విను ద్రోణుఁడను వాఁడు వసువులయందు ముఖ్యుఁడు ధరయతని భార్య। వారి నిద్దఱి బ్ర
హ్మ వసుధపై జన్మింపఁ డంచుఁ బంపినవారలతనిఁ జూచి। విశ్వేశ్వరుండైన విష్ణు సేవారతి మాకిచ్చి తేనియు మహిజనింతు। న
నవుడు నట్ల కాకనియె వేల్పుల పెద్దయా ద్రోణుఁ డీనందుఁడై జనించె। ధర యశోదయయ్యె దనుజేంద్రవైరియుఁ। గమలగర్భు
మాటఁ గారవించి। తల్లిదండ్రులనుచుఁ దగ వారి మన్నించె। నధికభక్తితోడ నలరిరిట్లు॥ వ॥ అంత నొకనాఁడు తనయింటిక

శ్రీకృష్ణుఁడు దధిభాండవికలనాదులు చేసుటవలన యశోదయతని వెంటదిరిగి పట్టుకొనుట.

డపాపలందఱు నయ్యైయి పనులం దుఁబంపువడి పోయిన నందసుందరి సంరంభంబు నందరికంభంబుకడ సుమరుగా నొక్క దధి
కుంభంబు వెట్టి మిసిమిగల మీఁగడ పెరుగు కూడం బోసి వీఁకనాఁక త్రాడు కవ్వంబున నలవరించి॥ సీ॥ కరకమలారుణ కాంతిఁ గ
వ్వపుత్రాడు పవడంపు నును తీఁగె పగిది మెఱయఁ। గ్రమముతో రజ్జువాకర్షింపఁ బాలిండ్లు వీడ్వడ నొండొంటి పీఁక నొత్తఁ। గు
చకుంభములమీఁది కొంగు జాఱఁగఁ జిక్కవడుచు హారావళుల్ బయలుపడఁగఁ। బొడమిన చెమటతోఁ బొల్పారు నెమ్మొము
మంచుపైఁబడిన పద్మంబుఁ దెగడఁ। గౌను నులియంగఁ గంకణక్వణనమెసఁగఁ। దుఱుము బిగివీడఁ గర్ణికాద్యుతులు మెఱయ।
బాలు నంకించి యప్పుడు పాటఁ బాడ। దరువు లిగురొత్తఁ జెరుగింతి దఱువఁ జొచ్చె॥ ఆసమయంబున॥ క॥ సుడియుచు వ్రాలు
చుఁ గిదుకుచు। నడిగొట్టుచు నమ్మ రమ్మ చన్నిమ్మనుచున్। వెడవెడ గంతులు వైచుచుఁ। గడవఁగదిసి బాలకుండు గవ్వముఁ బ
ట్టెన్॥ క॥ కవ్వముఁ బట్టిన ప్రియసుతు। నవ్వనరుహనేత్రి దిగిచి యంకతలమునన్। నవ్వుచు నిడుకొని మూఁకటి। మువ్వుచుఁ జన్ని
చ్చె నతఁడు దూఁటుచుఁ గుడిచెన్॥ మ॥ కడుపారం జను బాలు ద్రావిన సుతుం గంజాక్షి పీఠంబుపై। నిడి పొంగారెడు పాలు
డించుటకుఁ బోవం జూచి తద్బాలుఁడే। కుఱ్ఱఁడు కోపంబున వాఁడిరాత దధిమత్కుంభంబు వోఁగొట్టెఁ దెం। పడరం గుంభము
లోని వెన్నఁదినె మిథ్యాసంకులద్బాష్పుఁడై॥ వ॥ అంత నాలోలలోచన పాలు డించి వచ్చి వికలంబులయిన దధికుంభశకలం
బులఁ బొడఁగని తుంటకొడుకు వెన్నఁదింట నెఱింగి నగుచు నాకలభగామిని యతనిఁ గానక చనిచని॥ గీ॥ వికచకమలనయన వే
ఱొకయింటిలో। వెలయ రోలుఁ దిరుగవేసి యెక్కి। యుట్టిమీఁద వెన్నలులుపుచు నొకకోఁతికి। పాలు సేయుచున్న బాలుఁ గని
యె॥ మ॥ కనిచేతన్ సెలగోల వట్టికొనుచున్నానిమ్ము కానిమ్మురా। తనయా యెవ్వరియందుఁ జిక్కువడ నే దండంబు నుంగ్గాన నే। విని
వారంబును బొంద నే వెఱవు నే విభ్రాంతియుం జెందము। న్ననియున్నీ విటు నన్నుఁ గైకొనవు నేఁడా రీతి సిద్ధించునే॥ వ॥ అనియ
దలించుచు కొడుకునకు వడిం దలంచి తనుమధ్య తనమనంబున॥ సీ॥ బాలుఁడీతండని భావింతునందు నాయె పెద్దలును నేరరీక్ర
మంబు। వెఱపెఱుంగుటకునై వెఱపింతునందు నాకలిగి లేకొక్కఁడుగాని లేఁడు। వెఱపుతో నాబుద్ధి వినిపింతునందు నాతను
తానయై బుద్ధిఁ దప్పకుండు। నుం డెఱుంగక యింటనుం డెడినందు నా చొచ్చి చూడని దొకచోటు లేదు। తన్ను నెవ్వరైనఁ దలపో
యఁ బాఱెడు। నోజ లేదు భీతి యొక్క టెఱుంగఁ। డెలమి నూరకుండఁ డెకసక్కెములనాఁడు। బట్టి శాస్తి సేయు భంగి యెట్లు॥
అనివితర్కించి॥ క॥ లాలనమున బహుదోషము। లోలిం బ్రాపించుఁ దాడనోపాయములన్। జాలగుణంబులు గలుగును। బా
లురకును దాడనంబు పథ్యంబరయన్॥ వ॥ అని నిశ్చయించి కేలనున్న కోలఁ ద్రుళ్లింపించి బాలా నిలునిలుమని భగ్గుభగ్గున నదల్చి త
ల్లి డగ్గరిన బెగ్గడిలిన చందంబున నగ్గలిక చెడి రోలు డిగ్గనుఱికి॥ క॥ గజ్జలు ఘల్లని మ్రోయఁగ। నజ్జలు ద్రొక్కటలు మానియతిజ
వమున యోషిజ్జనములు నగఁ దల్లియుఁ। బజ్జం జను దేరన తఁడు పరువిడెనధిపా॥ అప్పుడు॥ మ॥ స్తనభారంబున డస్సి గ్రుస్సియ
సదై జవ్వాడు మధ్యంబుతో। జనితస్వేదముతోఁ జలత్కబరితో స్రస్తోత్తరీయంబుతో। వనజాతేక్షణ పాఱి వెంటఁ దిరిగెన్
వారించుచున్వాఁకిటన్। ఘనయోగీంద్రమనంబులున్ వెనుకొనంగా లేని లీలారతున్॥ ఇట్లు కూడం జని॥ సీ॥ స్తంభాది
కంబులు దనకు నడ్డంబైన నిట్టట్టుఁ జని పట్టనీనివాని। నీతప్పు సైరింపు మింకఁ దొంగిలఁ బోవ నే ననిముసుముట్ట నేడ్చువాని।
గాటుక నెఱయంగఁ గన్నులును లుముచు వెడలు కన్నీరుతో వెగచువాని। నే దెస వచ్చునో యిది యని పలుమారు సొరుసు
చుఁ గ్రేకంటఁ జూచువానిఁ। గూడఁ బాఱి పట్టుకొని వెఱపించుచుఁ। జిన్నివెన్నదొంగ చిక్కెననుచు। నలిగి కొట్టఁ జేతులాడక
ప్రాఁబోఁడి। కరుణతోడ బాలుఁ గట్టఁదలఁచి॥ క॥ వీరెవ్వరు శ్రీకృష్ణులు। గారా యెన్నఁడును వెన్నఁ గానరఁట కదా। చోరత్వం
బించుకయును। నేరరఁట ధరిత్రి నిట్టి నియతులు గలరే॥ క॥ పట్టినఁ బట్టువడనినినుఁ। బట్టెద ననిచలముఁ గొనినఁ బట్టుట వెట్టే। ప
ట్టుఁ బడవంద్రు పట్టీ। పట్టుకొనన్నాకుఁ గాక పరులకు వశమే॥ క॥ ఎక్కడనైన నుదిరిగెద। వెక్కడ మెడన్ గుణము గలిగి యుండ
వు నియమం। బెక్కడిది నీకు మఱదినఁ। జక్కఁగఁ బోయెదవు పెక్కుజాడలఁ బుత్రా॥ సీ॥ తోయంబులిపియని తొలఁగక చొచ్చె
దుతలచెన వెళ్లైనఁ దరల నెత్తి। మంటితో నాటలు మానవు కోరాడెదున్నతస్తంభంబులూఁపఁ బోయె। దన్యులనల్పంబులడు

గంగఁబాఱెడు రాచవేటలఁ జాలఁ బన్నఁ దెచ్చె। దలయవు నీళ్లకు నడ్డంబుగ గట్టెదు ముసలి పైహరివృత్తి మొనయఁ జూచెదం
బరంబు మొలకు నడుగవు లిరిగెడ। వింకఁగలికి సేఁత లేల పుత్ర। నిన్ను వంపవ్రాల్ప నే నేరననియు నీ। విట్లు క్రించు మీఁదు నెఱుఁ

## ఉలూఖలబంధన-యమళార్జునభంజనాద్యభివర్ణనము.

గకునికి॥ అని సుర్మంబులెత్తి పలికి॥ క॥ ఆలలనఁ గట్టె రోలన్। లీలన్నవనీతచౌర్యశీలున్ బ్రియవాగ్జాలున్ బరివిస్మితగోపా
లున్మత్తాలలామఫాలున్బాలున్॥ క॥ రోలను గట్టువడియున। బ్బాలుఁడు విలసిల్లె భక్తపరతంత్రుండై। *యాలానసన్నిబద్ధవి।
శాలమదేభేంద్రకలభసమరుచిననఘా॥ క॥ వెలిలోను మొదలు తుదినడు। ములు లేక జగంబు తుదియు మొదలున్నడుము। న్వె
లియు న్లోనగు నీశ్వరు। నలవడు నే కట్టఁ బ్రణతు రాల్గాఁ దన్నన్॥ గీ॥ పట్టియలరు బోఁడిపట్టియై యాతఁడని। గట్టె తల్లి పుత్రుఁడని గట్టెఁ
గాక। పట్టి కడుపు పెక్కు బ్రహ్మాండములు పట్టు। బెడఁగి నేనిఁ దల్లి మేలకట్టు॥ క॥ చిక్కఁడు సిరికౌఁగిటిలోఁ। జిక్కఁడు సనక
కాదియోగిచిత్తాబ్జములన్। జిక్కఁడు శ్రుతిలతికావలిఁ। జిక్కెనతఁడు లీలఁ దల్లి చేతన్ రోలన్॥ వ॥ ఇట్లు గ్రద్దన నా ముద్దియ
ముద్దులపట్టి నుదరంబు గట్టనసరుచుఁ జతురంబుగఁ జక్కనొక త్రాడు చుట్టిన నది రెండంగుళంబులకడమ పడియె మఱియు
నొక్క బంధంబు సంధించి వలగొనిన నంతియ కొఱంతయయ్యె- వెండియు నొక్క పాశంబుఁ గూర్చి పరివేష్టించిన వెత్తిఁ జూ
పెనిట్లు॥ క॥ తజ్జననిలోఁగిటం గల। రజ్జుపరంపరల గ్రమ్మఱ నన్నిటఁ గట్ట। న్బెజ్జఁదరిగి రాదయ్యెఁ జ। గజ్జాలము లున్న బొజ్జఁ గట్టన్వ
శమే॥ వ॥ అప్పుడా యవ్వయు, గోపికలును వెఱంగుపడిరి తదనంతరంబ॥ గీ॥ ఒడలఁ జెమటలెగయ నుత్తరీయము జార। వీడియు
న్నతుఱుము విరులు రాలఁ। గట్ట రానితన్నుఁ గట్టెదనని చింతఁ। గట్టుకొనిన తల్లిఁ గరుణఁ జూచి॥ క॥ బంధవిమోచనుఁడీశుఁడు।
బంధింపఁ బెనంగు జననిపాటోర్చి సుహృ। ద్బంధుఁడు గావున జననీ। బంధంబునఁ గట్టువడియెఁ బాటించి నృపా॥ క॥ సంగడి తిరి
గెడు శంభుఁడు। నంగాశ్రయయైన సిరియు నాత్మజుఁడై యుఁ। బొంగెడు పద్మజుఁడును గో। పాంగన క్రియఁ గరుణ పడయర ఖి
లేశ్వరుచేన్॥ క॥ జ్ఞానుల చే మానులచే। దానులచే యోగసంవిధానులచేత। న్బానిని బద్ధుండగు నే। శ్రీనాథుఁడు భక్తియుతు
లచేతం బోలెన్॥ వ॥ అంతనయ్యశోద యింటి కడపనుల వెంటం దిరుగఁ గృష్ణుండు తొల్లి నారదశాపంబున నిసువద్దులై యు
న్న నలకూబరమణిగ్రీవులను గుహ్యకుల నిద్దఱిం గని రోలీడ్చుకొని చనియెనని చెప్పిన శుకయోగివరున కభూవరుండిట్లనియె॥
క॥ నారదుఁ డేల శపించెను। వారా వృక్షత్వమునకు వచ్చిన పనికిం। గారణ మెయ్యది యోగికు। లారాధ్యా యెఱుఁగఁ జెప్పవ మ
య్యెవ్విన్ని మెఱసెన్॥ వ॥ అనిన శుకుండిట్లనియె- మున్ను కుబేరుని కొడుకు లిరువురు శంకరకింకరులై యహంకరించి వెండికొండ
మీఁద విరులతోఁటలం బాడెడి చేడియలం గూడికొని కరేణుసంగతంబులైన యేనుంగుల భంగి సురంగంబులైన మందాకినీత
రంగంబులం గ్రీడింప నారదుండు వచ్చిన నచ్చెలువలు చెచ్చెర వలువలు ధరియించిరి- మదిరాపానపరవశులు గావున వారలి
రువురు వివస్త్రులై మెలంగుచున్న నామునీశ్వరుండు చూచి శపియించువాఁడై ప్రతీతంబగు గీతంబు వాడె వినుము॥ శా॥ సం
పన్నుండొరుఁ గాన లేఁడు తను వున్సంసారము న్నమ్మి హిం। సింపం జూచు దరిద్రుఁడెత్తువడి శుష్కీభూతుఁడై చిక్కి హిం।
సింపం డన్యుల నాత్మ నున్న ములుగాఁ జింతించు నట్లౌటఁ దాత్సంపన్నాంధునకంజనంబు విను మీదారిద్ర్యమూహింపఁగన్॥ అ
సి గీతంబు వాడి తన మనంబున॥ క॥ కలవానిసుతులు మనుచును। గలకంఠులతోడఁ గూడి కానరు పరుల। న్నలలోనైన నుపేక్షింగల
క్రొవ్వడఁగించి బుధులఁ గలుపుట యొప్పున్॥ వ॥ అని చింతించి విజ్ఞానవిశారదుండగు నారదుండు నలకూబరమణిగ్రీవులఁ జూ
చి మీరలు స్త్రీమదాంధులరు గావున భూలోకంబున ‡నర్జునతరువులై నూఱుదివ్యవర్షంబులుండుండట మీఁద గోవిందచరణా
రవిందపరిస్పందంబున॥ క॥ ముక్తులరై నారాయణ। భక్తులరై పరమసాధుభావశ్రీసం। సక్తులరై సురలోక। వ్యక్తులరయ్యెద
రు నాదువాక్యము కతనన్॥ వ॥ అని యిట్లు పలికి నారదుండు నారాయణాశ్రమంబునకుం జనియె వారిరువురు సంగడి మద్దులై
రి పరమభాగవతుండైన నారదుమాటలు వీటింబుచ్చక పాటించి॥ క॥ ముద్దులతక్కరిబిడ్డఁడు। మద్దులఁ గూల్పంగఁ దలఁచి మన
లకఁ దానా। మద్దికవ యున్న చోటికి। గ్రద్దన రోలీడ్చుకొనుచుఁ గడకన్జనియెన్॥ వ॥ చని యా యుగ్మితమహాబలుండు నిజోదర
దామసమాకృష్యమాణతిర్యగ్భవ†దులూఖలుండై యా రెండు మ్రాఁకుల నడుమం జొచ్చి ముందరికి నిగుడుచు॥ క॥ బాలుఁడు
రోలడ్డము దివ। మూలంబులు పెకలి విటపములు విరిగి మహా। భీలధ్వనిఁ గూలెను శా। పాలస్యవివర్జనములు యమళార్జునముల్॥
వ॥ ఇట్లు నిర్మూలంబులై పడిన సాలంబులలోనుండి కీలికీలలు వెల్వెడలు పోలికె నెక్కుడు తేజంబున దిక్కులు పిక్కటిల్లం బ్ర
సిద్ధులైన సిద్ధులిద్దఱు వెడలి వచ్చి ప్రబుద్ధులై భక్తలోకపాలకుండైన బాలకునకు మ్రొక్కి లేదికరకమలంబులు మొగిచి యి
ట్లనిరి॥ క॥ బాలుఁడవే నీవు పరుఁడవ। నాలంబుఁడ వధికయోగివాద్యుఁడవు తను। స్థూలాకృతియగు విశ్వము। నీలీలారూపమం
త్రు నిపుణులు కృష్ణా॥ సీ॥ ఎల్ల భూతంబులకింద్రియాహంకృతిప్రాణంబులకు నధిపతివి నీవ। ప్రకృతియుఁ బ్రకృతిసంభవమహ

*ఆలానము = ఏనుఁగును గట్టెడు స్తంభము. ‡అర్జునతరువులై = మద్దిచెట్లయి, †ఉలూఖలము = రోలు.

స్తుతునీవవీనికన్నిటికినివిభుఁడవీవ। ప్రాకృతగుణవికారములఁబొందకపూర్వసిద్ధుఁడవగునిన్నుఁజింతసేయ।గుణహితుం డౌవు నేగుణహీనునీయందకలగుణంబులనీవకప్పఁబడుదు। మొదలనెవ్వనియవతారములుశరీరు। లంచుసరిదొడ్డు లేనివీర్యములతనువులఁడరజన్మించివారలయందుఁజిక్కు।వట్టిపరమేశ మ్రొక్కెదమయ్యనీకు॥ క॥భువనములు సేయఁగావఁగ।నవతీర్ణుఁడవై తికాదెయఖిలేశ్వరయో।గివరేణ్యవిశ్వమంగళ।కవిసన్నుతవాసుదేవకల్యాణనిధీ॥ఉపేంద్రవజ్రము॥ తపస్వివాక్యంబులుదప్పవయ్యె। న్నేనపంబునంగంటిమినిన్నుఁజూడ।న్దసంబులొప్పెన్మనుఁదావకీయ। ప్రపన్నులంజేయుముభక్తమిత్రా॥ శా॥నీపద్యావళులాలకించిచెవులన్నిన్నాడువాక్యంబుల।న్నీపేరంబనిసేయుహస్తయుగమున్నీమూర్తిపైఁజూపులు। న్నీపాదంబులపొంతమ్రొక్కుశిరమున్నీసేవపైఁజిత్తము। లీన్నిపైబుద్ధులుమాకునిమ్ముకరుణన్నీరేజపత్రేక్షణా॥ వ॥అనియిట్లుకీర్తించినగుహ్యకులంజూచినగుచునులూఖలబద్ధుండైనహరియిట్లనియె॥క॥తమతమధర్మముఁదప్పక।సములైననునమ్మితిరుగుసభ్యులకునుబంధమునఁజూచినవిరియును।గనులాప్పుఁడుబోడమవిరియుఘనతమముక్రియన్॥ క॥కారుణ్యమానసుండగు।నారదువచనమునఁజేసిననుఁబొడఁగనుట।న్మీరుప్రబుద్ధులరైతిరి। చేరెన్నామీఁదఁదలఁపుసిద్ధముమీకున్॥వ॥అనియీశ్వరుండుమీరుమీనెలవులకుంబొమ్మనియానతిచ్చినమహాప్రసాదంబనివలగొనిపెక్కుమ్రొక్కులిడిననలకూబరమణిగ్రీవులుత్తరభాగంబునకరిగిరంతనందాదులైనగోపాలకులునిర్మూలంబులైపడిన*సాలంబులచప్పుడుపిడుగుచప్పుడనిశంకించివచ్చిచూచి॥ క॥ఈపాదపములుగూలఁగ।నీపాపఁడులూఖలముననిటబద్ధుండై।యేపగిదిబ్రతికెఁగంటిరె।వాపోవఁడువెఱవఁడెట్టివాఁడోయితఁడున్॥గీ॥పిడుగువడదుగాకపెనుగాలివిసరదు।ఖండితంబులగుటగానరాదు।బాలుఁడితఁడుపట్టిపడఁద్రోయఁజాలఁడు।తరువులేలకూలెధరణిమీఁద॥వ॥అనిపెక్కండ్రుపెక్కువిధంబులనుత్పాతంబులుగావలయుననిశంకించిననక్కడనున్నబాలకులిట్లనిరి॥ క॥ నందునికొమరుఁడువినుఁడీ।నందుననునుదూరిరోలుసరినడ్డముగా।ముందరికీడ్చినమద్దులు।గ్రందుకొనంగూలెజనులఁగంటిమిరువురన్॥ వ॥ అనియిట్లుపలికినబాలకాలాపంబులువినిమిథ్యారూపంబులనికొందఱందుఱుకొందరునానావిధంబులసందేహించిరంతనందుండువికసితవదనారవిందుండగుచుఁబట్టికట్టువిడిచెనట్టియెడఁదనతెఱంగెవ్వరునెఱుంగకుండవలెననికపటకుమారుండు॥ ఉ॥పాడుమ్మందునిభంగిగోపవనితల్పాణిధ్వనుల్సేయఁగా।నాడున్*జంత్రముకైవడిన్స్వరవశుండైహస్తముల్ద్రిప్పుచు।న్జూడన్నేరనివానిభంగిఁదలయూఁచున్నగున్బాలుర।న్గూడున్వేడ్కలపంపుసేయఁజనుదాసున్మట్టిఁజిట్టాడుచున్॥క॥చంచొదవుఁబాలుద్రావుము।దంచితముగననుఁడుపాలుద్రావిజననితోఁ।జంచొదవదనుచులీలా।చంచుండైయతఁడుచంచుఁజూపెనరేంద్రా॥క॥ సెలగోలపట్టుకొనిజల।కలశములోనీడఁజూచికలశయుతుండై।సెలగోలపాపఁడొకఁడిదె।తలచెన్నఁనుగొట్టననుచుఁదల్లికిఁజెప్పెన్॥క॥ భిక్షులువచ్చెదరేడ్చిన।భిక్షాపాత్రమునవేసిబెగడించినిన్న్।శిక్షించెదరనిచెప్పిన।భిక్షులఁగనితల్లిఁగనియుభీతిల్లెన్నృపా॥

### నందాదులుబృందావనంబునకునరుగుట.

వ॥ ఇట్లుకృష్ణుండుబహువిధంబులఁగపటబాలలీలలవినోదింపబృహద్వనంబుననందాదులైనగోపవృద్ధులుమహోత్పాతంబులగుటయువానివలనబాలుండుత్తరించుటయుఁజూచియేకాంతంబుననొక్కనాఁడువిచారింపనుపనందుండనువృద్ధగోపకుండుతనయెఱుకమెఱసియిట్లనియె॥ఉ॥ ఇక్కడనుండురేమనుజులీమనకృష్ణునకెగ్గుసేయఁగా। రక్కసురాలుచన్నొసఁగెరాలపయిన్పడిగాలివీఁచెబై।గ్రిక్కిరియందరుల్వడియెఁగేశవుసత్కృపఁదప్పెఁజాలునేఁ। డెక్కడికైనఁబోవలయునింకిటగోపకులారవింటిరే॥క॥కసవుగలదిరవుపసులకు।లసదద్రినదీమహీజలతికావళిఁబెం।పెసఁగునుగాపురమునకును।బొసఁగునుబృందావనంబుపొదఁడచ్చటికిన్॥వ॥అనుపలుకులకార్యులైనగోపకులిదియకార్యంబునుందలయనికొందలమందకయామందలామందగమనంబునముందఱనడువఁబంచిపిఱుందం।గ్రందుకొనకుండబాలవృద్ధనారులెక్కినతేరులుసాగించి*తనుత్రాణతూణీరబాణధరులైవిండ్లుపట్టుకొనినడువబండ్లవెనుకంగొమ్ములిమ్ములంబూరించుచునవార్యంబులగుతూర్యరవంబులనార్యపురోహితసమేతులైవేడుకలుకొనలునిగుడమొనలేర్పఱచుకొనిపావనంబగుబృందావనంబునకుంజనిరప్పుడు॥తరల॥పసపులాడియరోజకుంకుమపంకశోభితలైలస।ద్వసనలైకచభారచంపకదామలైసులలామలై।పసిఁడిమాడలకాంతులల్లులఁబర్వఁదేరులమీఁదపెం।పెసఁగఁబాడిరి*వ్రేతలాహరిహేలలింపగునేలలన్॥వ॥అప్పుడురోహిణీయశోదలేకరథంబునఁబరిపూర్ణమనోరథలైరామకృష్ణులముందరనిడుకొనివారలవినోదంబులకుఁ బ్రమోదంబునొందుచుండిరిట్లుగోపకులుబృందావనంబుసొచ్చియందర్ధచంద్రాకారంబుగశకటసందోహంబునిలిపిమందలువిడియించివసి

*సాలంబులచప్పుడు।వృక్షములుపడినశబ్దములు. *జంత్రము।బొమ్మ. *తనుత్రాణ।చొక్కా. *వ్రేతలు।గోపస్త్రీలు

యుంచిరి॥ క॥ చెందిరి బలమాధవులభి। నందించుచుఁ బరమపావనము దంచిత కా। ళిందీసంజీవనము। న్బృందావనమున్మునీంద్ర
బృందావనముల్॥ వ॥ ఇట్లు బృందావనంబు చేరి కొంత కాలంబునకు రామకృష్ణులు సమానవయస్కులై గోపబాలకులం గూ
డుకొని వేడుకలూఁదుకొన దూడలఁ గాచుచు॥ సీ॥ వేణువులూదుచు వివిధరూపములతో గంతులువైతురు గౌతుకమున। గుఱు
కంబళాదుల గోవృషంబులఁ బన్ని పరవృషభములని ప్రతిభటింతు। ¶ కల్లులు కట్టించి యంఘ్రుల గజ్జెలు మొఱయఁ దన్నుచు రో
లి ముమ్మరముగ। బన్నిదంబులువై చిఫలమంజరులు గూర్చి వేటులాడుదురు ప్రావీణ్యమొప్ప। వన్యజంతుచయంబుల వానివా
నిఁబను రుపమరు చువంచించి పట్టఁబోదు। రంబుజాకరములఁ జల్లులాడఁ జనుచు। రాకుమారులు బాల్యవిహారులగుచు॥ క॥ పోరు
దురు § కికురువొడుచుచు। దూఱుదురు భయంబులేక తోరపుటిరువు। ల్జాఱుదురు ఘనశిలాతటి। మీఱుదురెన్నంగరాని మెలఁ

## శ్రీ వత్సాసురబకాసురులవధ.

కువలనృపా॥ వ॥ అంత నొక్కనాఁడు యమునాతీరంబున నాకుమారులు గోపకుమారులందఱును గ్రేపుల మేఁప నొక్కరక్కసుం
డు క్రేపురూపంబున వచ్చి వారల హింసింపం దలంచి॥ క॥ క్రేపులయట్టుల నాఁకుచుఁ। గ్రేపుల లోనిది యుమంచి క్రేపనఁ గఁగ
దుర్। జూపట్టి భక్తసంగతి। క్రేపై చనువాని మ్రోలఁ గ్రేపై తిరిగెన్॥ వాని నెఱింగి కృష్ణుండు రామునకుం జెప్పిన॥ చ॥ ఇదిమొ
కమంచిలేఁగ వినుఁడెంతయు నొప్పెడినంచు దానెత। త్పదములు తోఁకయున్ బిగియఁబట్టి చెలంగి వెలంగమానుతోఁ। జదియఁ
గనొక్కపెట్టుఁ గొని చంపెఁగుమారుఁడు లేఁగరక్కసుం। గుసులుకొనంగ బాలకులు కోయని యార్వ నఖర్వలీలతోన్॥
వ॥ ఇట్లు రక్కసుండు పట్టు వడి విశాలంబగు సాలంబుతో నేలం గూలెనప్పుడు॥ క॥ గొంగడులెగరఁగ వైచుచుఁ। జంగునదాఁటు
చును జెలఁగి చప్పటలిడుచు। న్బొంగుచుఁ గృష్ణునిఁ బొగడుచుఁ। ప్రంగిన రక్కసునిఁ జూచి క్రుల్లిరి కొమరుల్॥ వ॥ ఆసమయం
బున వేలుపులు విరుల వానలు గురియించిరప్పుడు॥ క॥ వత్సములపగిది జగముల। వత్సలతన్మనుపఁ జూచువాఁడై యింటన్। వత్స
ముల మేపుచుండియు। వత్సాసురుఁ జంపె భక్తవత్సలుఁ డధిపా॥ వ॥ మఱియు నొక్కనాఁడు రేపకడ గోపకుమారులు క్రేపులం
గొంచు నడవికిం జని యెండం బడి మెండుకొనిన దప్పి బెండువడి నతమతము లేఁగక దుపుల నేర్పఱించి నిలువరించుకొని కలంకం
బు లేని యొక్క కొలంకున నీరుం ద్రావించి తారును జలపానంబు చేసి వచ్చు నెడ నందు॥ క॥ అకలంకులు బాలురు గని। రకు
టిలదంభోళిహతసితాద్రిశిఖరరూ। పకమున్ హరిహింసారం। భకమున్ బకమున్ విశాలభయదాంబకమున్॥ వ॥ కని దా
ని మొదలి పొడవునకు వెఱఁగుపడి చూచుచుండ॥ గీ॥ ఎల్లపనులు మాని యేకాగ్రచిత్తుఁడై। మౌనివృత్తి నితరమతము విడిచి। వన
ములోననిలిచి వనజాతముపై దృష్టిఁ। జేర్చి బకుఁడు తపసి చెలువుఁ దాల్చె॥ ఇవ్విధంబున నొదుగుఁ బెట్టుకొని యుండిన॥ ఉ॥ చం
చువుఁ దీటి పక్షములు ఝల్లున విచ్చి పదంబులెత్తి కు। ప్పించి నభంబుపై కెగసి భీషణఘోషణవక్త్రుఁడై విజృం। భించి గరుత్సమీ
రమున భిన్నములై తరులొలిఁగూలఁగా। మించి బకాసురుండొడిసి మ్రింగె సహిష్ణునిఁ జిష్ణు కృష్ణునిన్॥ క॥ సంగడిలోకముల
న్నియు। మ్రింగుచుఁ గ్రక్కుచును బయల మెలఁగించుచును। ప్పొంగెడు వేడుక కాఁడటు। మ్రింగుడువడె బకునిచేత మీఁదెఱిఁ
గి నృపా॥ క॥ దనుజుఁడు మ్రింగినఁ గృష్ణునిఁ। గనలేక బలాదిబాలకప్రముఖులు చేతనులై వెఱఁగందిరి చ। య్యనఁ బ్రాణము లే
నియింద్రియంబులభంగిన్॥ ఇట్లు మ్రింగుడువడి లోనికిం జనక॥ శా॥ కంఠోపాంతము దాఁడలు। న్నెఱియుచున్ గాలాగ్ని
చందంబునన్। కుంఠీభూతుఁడుగాక వేండ్రమగు నా గోపాలబాలున్ జయో। త్కంఠున్ బ్రహ్మగురున్ మహామహిముఁ జ
క్కన్ మ్రింగరాదంచు సో। ల్లుంఠం బాడుచు వాఁడు గ్రక్కె వెడలన్ లోకంబు శోకంబుగన్॥ క॥ కక్కి మహాఘోషముతోఁ।
జక్కఁగ దనుఁబొడువ రాఁగఁ జంచులు రెండున్। ప్రక్కఁగఁ బట్టి తృణముక్రియ। గ్రక్కున హరి చీరెఁ బకుని గలహాతత్స
కునిన్॥ వ॥ అప్పుడానందనందను మీఁద వేలుపులు చాలుపులుగా నందనమల్లికాదికుసుమవర్షంబులు హర్షంబునం గురియిం
చిరి-దేవవాద్యంబులు మొఱయింప రామాదిగోపకుమారులు ప్రాణంబులతోఁ గూడిన యింద్రియంబులుం బోలెఁ గ్రమ్మఱఁ
గృష్ణునిం గని రమ్మని కౌఁగిలించికొని కృష్ణసహితులై లేఁగదాఁటులవఁ అలదాఁటించుకొని మందగమనంబున మందకరిగిన
వారలచేత నావృత్తాంతంబంతయు విని వెఱఁగుపడి గోపగోపికాజనంబులు॥ క॥ ఆపదలమీఁద నాపద। లీపాపనిఁ జెందితొలఁ
గెనీయర్భకుపై। వేపడినఖలులు దహనుని। పైపునశలభములపగిదిఁ బడిరి ధరిత్రిన్॥ వ॥ అని పలికి మఱియు నా రామకృష్ణులు క్రే
పులం గాచుతఱి॥ సీ॥ కపులమై జలరాశిఁ గట్టుదమా యని కట్టుదురడ్డంబు కాలువలకు। మునులమై తపములు మొనయుదమా
యని మౌనులై యుందురు మాటలేక। గంధర్వవరులమై గానవిద్యలు మీఱఁ బాడుదమాయని పాడఁ జొత్తు। రప్సరోజనులమై
యాడుదమాయని యాఁడు రూపముఁ దాల్చి యాడఁ జనుదు। రమరదైత్యవరులమై యబ్ధిఁ ద్రత్తమా। యనిసరోవరముల

¶ అల్లులు। భుజములను. • పన్నిదము। పందెము. § కికురువొడుచుచున్। వెక్కిరించుచు-లాలించుచు. వత్సము। శిశువు-దూడ. వత్సలతన్। కృపచేత.

యంమహాస్త్ర। దండచయముఁ ద్రిప్పి తరుతురుతమయోధుఁ। కొమరులను సరింపఁగొమరు మిగుల॥ వ॥ అంతనొక్కనాఁడు

### శ్రీకృష్ణుండు గోపకులతోఁ జేరి బంతిచల్దులు గుడువఁ గాంతారంబునకరుగుట.

రామకృష్ణులు కాంతారంబున బంతిచల్దులు గుడువ నుద్యోగించి ప్రొద్దున లేచి గ్రద్దనందనయింటి లేఁగకదుపులం గదలించి సు
రంగంబులను శృంగంబులు పూరించి నవిని మేలుకని సంరంభంబున గోపడింభకులు చలిదికావడులు మోఁపున వహించి ✿స
జ్జంబులను ఖజ్జంబులు గట్టికొని పవిత్రాణవేత్రదండధరులై లెక్కకు వెక్కసంబైన తమతమ క్రేపుకదుపులం జప్పుడించి
రొప్పుకొనుచుఁ గాననంబు సొచ్చి కాంచనమణిపుంజగుంజాదిభూషణభూషితులయ్యును ఫలకుసుమకోరకపల్లవవల్లరుల
తొడవులుగా నిడికొని కొమ్ములిమ్ముగ నూరించుచు, వేణువులూదుచుఁ, దుమ్మెదలం గూడి పాడుచు, మయూరంబులతోడం గూ
డియాడుచుఁ, బికంబులం గలసి కూయుచు, శుకంబులం జేరి రొదలు సేయుచుఁ, బులుఁగులనీడలం బాఱుచుఁ, బొదరిండ్లదూ
రుచు, సరాళంబులగు వాఁగులు గడచుచు, మరాళంబుల చెంత నడుచుచు, బకమ్ములం గని నిలుచుచు, సారసంబులం జొచ్చి
యలంచుచు, నదీజలంబులం దోఁగుచుఁ, దీఁగెయుయ్యెలలూఁగుచుఁ, బల్లంబులం డాఁగుచు, దూరంబులకేఁగుచుఁ, గపులసం
గడిఁ దరువులెక్కుచు, ఫలంబుల మెక్కుచు, రసంబులకుం జొక్కుచు, నింగికి నిక్కుచు, నీడలు చూచి నవ్వుచుఁ, గయ్యంబుల
కుం గాలుఁ ద్రవ్వుచుఁ, జెలంగుచు, మెలంగుచు, వ్రాలుచు, సోలుచు, బహుప్రకారంబుల శరీరవికారంబులు సేయుచు, మఱి
యును॥ క॥ ఒకనొకని చల్దికావడి। నొకఁడొకఁడడగించి దాఁచు నొకఁడొకఁడది వే। ఱొకఁడొకరి మొఱఁగికొనిచను। నొకఁ
డొకఁడది దెచ్చి యిచ్చు నుర్వీనాథా॥ క॥ ఒక్కఁడు మున్నేమఱి చన। నొక్కఁడు బలుబొబ్బ వెట్టు నులికిపడ న్వే। రొక్కఁడు మీ
ఁదెత్తటంబున। నొక్కనికను దోయి మూయు నొక్కఁడు నగఁగన్॥ క॥ తీపులగు ఖజ్జములున్యూఁడు। కోపింపఁగ నెడిసి పుచ్చుకొను
చున్నాఁడు। న్నేమఱియకుఁగ నొక్కఁడు। క్రేపులలో నట్టునిట్టు గిఱికొంచు నృపా॥ క॥ వనజాక్షుఁడు మున్నఱిగిన। మునుప
డఁగాన తని మేము ముట్టెదమనుచున్। జనిమును ముట్టని వాని న్మును ముట్టిన వాఁడు నవ్వు మొనసి నరేంద్రా॥ ఇవ్విధంబున॥
ఉ॥ ఎన్నఁడునైన యోగివిభులెవ్వని పాదపరాగమింతయు। న్గన్నులఁ గానరట్టిహరిఁ గౌఁగిటఁ జేర్చుచుఁ జెట్టఁబట్టుచున్। ద
న్నుచు ద్రొద్దుచున్నగుచు దద్దయుఁ బైఁబడి కూడియాడుచు। న్మన్నన సేయు పల్లవకుమారుల భాగ్యములింత యొప్పునే॥
క॥ విందులకును బ్రహ్మసుఖా। నందంబై భక్తగణమునకు దైవతమై। మందులకు బాలుఁడగు హరి। పొందఁగనిరి గొల్లలిట్టి పు
ణ్యులుగలరే॥ అని పలికి శుకయోగీంద్రుండు మఱియు నిట్లనియె॥ క॥ అమరులమృతపానంబున। నమరినవారయ్యు నేని శౌటు
నిపంచ। త్వమునకు నెమళ్లు సూతురు। తమునమ్మకయట్టి యఘుఁడుదరోద్ధతుఁడై॥ క॥ బకునికిఁ దమ్ముఁడుగావున। బకమరణ
ముఁ దెలిసి కంసుపంపున గోపా। లకబాలురతోఁ గూడన్। బకవైరిని ద్రుంతుననుచుఁ బటురోషమునన్॥ క॥ బాలుర ప్రాణం
బులు గో। పాలురకును దగ్రజాతు ప్రాణము మాకీ। బాలురఁ జంపిన నంతియ। చాలును గోపాలురెల్ల సమసినవారల్॥ వ॥ అ
ని నిశ్చయించి యోజనంబు నిడుపును, మహాపర్వతంబు పొడవును, గొండతుదలమీఱిన కోరలును, మిన్నుదన్ని పన్నిన నల్ల మొ
సుల్ల పెల్లుగల పెదవులును, బిలంబులకు నగ్గలంబయిన యిసుల్ల సందులు, నంధకారబంధురంబయిన వదనాంతరాళంబును,
దావానలజ్వాలాభీలంబైన దృష్టిజాలంబును, వేఁడిమికి నివాసంబులయిన యుచ్ఛ్వాసనిశ్శ్వాసంబులును మెఱయ నేలనా
లుకలు పఱచుకొని ఘోరంబగు నజగరాకారంబున॥ క॥ ✿జాపెఱము లేక యిప్పుడు। క్రేపులతో గొల్లసుతులఁ గృష్ణుని దొర
లన్। గీపెట్టఁగ మ్రింగెదనని। పాపపురక్కసుఁడు నేలఁబడియుండెన్నృపా॥ ఆ సమయంబున॥ మ॥ ఒకవన్యాజగరేంద్రముల్ల
దెగిరీంద్రోత్సేధమై దావపావకకీలాపరుషప్రచండతరనిశ్శ్వాసంబుతో ఘోరవ। క్త్రకరాళాతతజిహ్వతోడ మనలన్
హింసింపనీక్షించుచున్। వికటంబై పడి సాగియున్నది పురోవీథిం గనుంగొంటిరే॥ అని యొండొరులకుఁ జూపుచు॥ మ॥ బకు
నిఁ జంపిన కృష్ణుఁడుండ మనకుం బామంచుఁ జింతింపనే। టికి రాపోదము దాఁటి కాకయది కౌటిల్యంబుతో మ్రింగుచున్।
బకు వెంటన్ జనుఁ గృష్ణుచేత నసుచున్న బద్మాక్షుఁడీక్షించి యయ్యు। త్సుకులై చేతులు వేసికొంచు నగుచున్ దుర్వారులై పోవఁగన్॥
వారలఁ జూచి హరి తనమనంబున॥ మ॥ అర్భకులెల్ల బాముదివిజాంతకుఁ డౌట నెఱుంగరక్కటా। నిర్భయులై యెదుర్కొని రి
నేఁగలనంచు విమూఢులంచు నా। విర్భవదాగ్రహత్వమున వేఁదగులన్ దమలేఁగపిండుతో। దుర్భరఘోరసత్త్వఘనతుండ
బిలాంతముఁ జొచ్చిరందఱున్॥ అయ్యవసరంబున॥ శా॥ వేల్పుల్ చూచి భయంబునొంద గ్రసనావేశంబుతో నుజ్జ్వలత్క
ల్పాంతోజ్జ్వలమానజిహ్వదహనాకారంబుతో మ్రింగెనా। స్వల్పాహీంద్రము మాధవార్పితమనోవ్యాపారసంచారుల
న్నల్పాకారుల శిక్యభారులఁ గుమారాభీరులన్ ధీరులన్॥ ఇట్లు పెనుబాము చేత మ్రింగుడువడు సంగడికాని గమిం జూచి కృ

✿సజ్జంబులగు ఖజ్జంబులు। మనోహరములైన కజ్జకాయలను పిండివంటవిశేషము. గుంజ। గురివెంద. ✿జాపెఱము। ఆలస్యము.

ష్ణుండు॥ ఉ॥ పసులు లేఁగలుం గలసి పైకొని వత్తురు తొల్లి కృష్ణ మా। కొడుకుల జేల రారనుచు గోపిక లెల్లను బల్క నేక్రియ। న్నొండి వెద నేఁడు పన్నగము నోరికి వీరికి నొక్కలంకెగా। నొడఁబడ నేల చేసె విధి యొడ్డక సేయఁగదయ్య క్రౌర్యముల్॥ వ॥ అని తలపోసి, నిఖిలలోచనుండును, నిజాశ్రితనిగ్రహమోచనుండు నైన, తమ్మికంటి మింటి తెరువరులు మొరలిడ, రక్కసులుక్కుమిసుల వెక్కసంబగు నజగరంబు కుత్తుకకుఁ బొత్తుగొని మొత్తంబు వెంటనంటం జని తమ్మునం పఱ దిందరవందర చేసి మ్రింగ నగ్గలించు నజగరంబు కంఠద్వారంబున సమీరంబు వెడలకుండఁ దన శరీరంబు పెంచి గద్దన మిద్దెసర దిన్నల్లుండ॥ క॥ ఊపిరి వెడలక కడుపున। వాపోదవిసర్బ్బాసు ప్రాణవాతంబులు సం। తాపించి శిరము వ్రక్కలు। వాపికొనుచు వెడలి చనియె వ్రాకటఘోషముతోన్॥ శా॥ క్రూరవ్యాళవిశాలకుక్షిగతులన్ గోవత్ససంఘంబుతోఁ। గారుణ్యామృతదృష్టిచేత బ్రతుకంగాఁ జూచి వత్సంబులు। న్వారుం బానుఁ దదాస్యవీథిని సుడన్ వచ్చెన్ ఘనోన్ముక్తుఁడై। తారానీకముతోడ నెప్పొసఁగు నాతారేశు చందంబునన్॥ గీ॥ అమరవరులకొ అశుఁ గమలజాండం బెల్ల। బలిఁ దిరస్కరించి బలియు వటువు। గోపసుతులకొ అశుఁ బాపపు పెనుబాము। గళము గూఁటుఁ గట్టి బలియకన్నె॥ ఉ॥ ఆ పెనుబాము మేననొక యద్భుతమైన వెలుంగు దిక్తటో। ద్దీపకమై వడిన్ వెడలి దేవపథంబునఁ దేజరిల్లుచున్। గోపులు బాలురున్ బెదరఁ గృష్ణుని దేహము వచ్చి చొచ్చెనా। పాపఁడు చొచ్చి ప్రాణములఁ బాపిన యంతన సుద్ధసత్త్వమై॥ క॥ తనరూపాకమారైనను। మనమున నిడికొనినఁ బాపమంతయుఁ దనలోఁ। గొని చనుహరి తను మ్రింగిన। దనుజుని గొనిపోవకున్నె తనలో పలికిన్॥ వ॥ తదవసరంబున, సురలు సుమవర్షంబులు గురియించిరి, రంభాదులాడిరి మేఘంబులు మృదంగంబుల భంగి ఘోషించె, సిద్ధగంధర్వులు జయజయభాషణంబుల భాషించిరంత॥ శా॥ ఆ వాద్యంబులు నా మహాజయరవం బా పాటలా యాటలం। దేవజ్యేష్ఠుఁడు పద్మజుండు విని ప్రీతిన్ స్వామి కేతెంచి నేఁ।డీ వత్సార్భకులన్ భుజంగపతి హింసింపంగ నీ బాలకుం।డీ వెంటన్ బ్రతికించె మేలనుచు నూహించెన్ గడున్ నిచ్చలున్॥ వ॥ అంత నయ్యజగరచర్మంబు కొన్ని దివసంబుల కెండి పెద్దకాలంబు గోపాలురకు కేళీబిలంబై యుండె-నిట్లు కౌమారవిహారంబున నైదవయేఁట గృష్ణుం డఘాసురునిం దెగఁ జూచుటయుఁ దమ్ముం గాచుటయు నా యవయేఁటి వృత్తాంతంబని చిత్తంబుల గోపకుమారులు పౌగండమునిఁ దలచుచుండిరని చెప్పిన నప్పుడమి తేఁడప్పరమయోగీంద్రున కిట్లనియె॥ సీ॥ అయి దేండ్లు కౌమారమటమీఁద నయిదేండ్లు పౌగండమని యెడు ప్రాయసుంచు। నయిదేండ్లవాఁడై నయబ్జాక్షు చరితంబు పౌగండమునఁ గోపబాలురెల్లఁ। దలఁతురంటది యెట్లు తలఁతురు వారలు నిరుడు చేసినపని నేఁటిదనఁగ। వచ్చునే యివినాకు వరుసతో నెఱిఁగింపు మనవుమ యతిచంద్రుఁడై నశుకుఁడు। యోగదృష్టిఁ జూచి యొక్కింత భావించి। వినుము రాజవర్య వినయధుర్య। పరమసుహృద్యమనుచుఁ బలుకుదురార్యులు। శిష్యజనులకీవు సేయుతలఁపు॥ క॥ ప్రియురాలివలని వార్తలు। ప్రియజనులకు నెల్లఁ బ్రొద్దుఁ బ్రియమగు భంగిన్। ప్రియుఁడగు హరిచరితంబులు। ప్రియభక్తులకెల్ల యెడలఁ బ్రియములుగావే॥ వ॥ అని పలికి యోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె-నట్లఘాసురుముఖంబువలనం గడచి లేఁగల గోపవరులం బ్రతికించి వారునుం దానునుం జని చని॥ మ॥ కనియెన్ గృష్ణుఁడు



సాధునీరము మహాగంభీరము నుం బద్మశీకో। కనదస్వాదువినోదమోదమదభృంగద్వంద్వఝుంకారమున్। ఘనకల్లోలలతావితానశిఖివిహారశ్వాదంబకోలాహల। స్వనవిస్ఫారము మందవాయుజకణాసారంబుఁ గాసారమున్॥ వ॥ కని తమ్మికంటి తమ్ములయింటి సొబగునకు నిచ్చ మెచ్చుచుఁ జెచ్చెర గాలింగడ లెడక యుల్లతుంపురులజల్లు పెల్లునకు నొడల్లు గగుర్పొడవ కొలంకు కెలంకులఁ గాయపండులగొలల క్రేఁగునవీఁగి పట్టుగల చెట్టుతుటుము నీడ నొప్పుచున్న యిసుక తిప్పల పిప్పచూచి వేడుక పిచ్చలింపనచ్చెలులకిట్లనియె॥ శా॥ ఎండన్ గ్రుగ్గితిరాఁకటం బడితిరిం కేలా విలంబింపఁగా। రండో బాలకులార చల్దిగుడువన్ రమ్యస్థలం బిక్కడీ। వండన్ లేఁగలు నీరుఁ ద్రావి యిరవందం బచ్చికన్ మేయుచుం। దండంబై విహరించుచుండఁగ నవాంత ప్రీతిభక్షింత మే॥ వ॥ అనిన నగుఁగాక యని వత్సంబుల నుత్సాహంబున నిర్మలంబులగు జలంబులు ద్రావించి పచ్చికల మొల్లంబులు గలపల్లంబుల నిలిపి చొక్కంబులగు చల్దుల చిక్కంబులు దక్కడించి॥ మ॥ జలజాంతస్థితకర్ణికం దిరిగి రాసంఘంబులై యున్న రేకుల చందంబునఁ గృష్ణు సందిరిగి రాఁగూర్చుండి వీక్షించుచున్। శిలలున్ పల్లవముల్ తృణంబులు లతల్ చిక్కంబులు న్పుష్పముల్। పలు కంచంబులుగా భుజించిరచటన్ గోపార్భకుల్ భూవరా॥ సీ॥ మాఁటిమాఁటికిఁ ప్రేలుమాఁడి చియ్యారించుచు నాలుగాయలు దినుచుండు నొక్కఁ। డొకనికంచములోని నొడిసి చయ్యన మ్రింగి చూడు లేదనినోరుఁ జూపునొక్కఁ। డేసురాగ్గురి చల్దులేమిఁ బన్నిదమాడి కూర్కొనికూర్కొని కుడుచు నొక్కఁ। డిన్నియుఁ బొరలుచు నిసుచు నెచ్చెలితనమును ముబంటిన గుంపునాఁడునొ.

శీకోకనద। ఎఱ్ఱగలువ, శిఖివిహారశ్వాదంబకోలాహలస్వనవిస్ఫారము॥ విహరత్ । నంచరించుచున్న, శాదంబ। రేఁహంసలయొక్క, కోలాహలస్వన। కలకలధ్వనులచేత, విస్ఫారము। విస్తృతమైనది యగు.

కఁడు। గృష్ణుఁ జూపఁ జనుచుఁ గికురించి వడి మ్రోల। మేలి భక్ష్యరాశి మెసఁగు నొకఁడు। నవ్వు నొకఁడు సఖుల నవ్వించు నొ
కఁడు। ముచ్చటాడు నొకఁడు మురియు నొకఁడు॥ అయ్యవసరంబున॥ సీ॥ కడుపున దిండుగాఁ గట్టిన వలువలో లాలితవంశ
నాళంబుఁ జొనిపి। వినుత శృంగంబును వేత్రదండంబును జాఱి రానీక డాచంక నిఱికి। మీఁగడ పెరుగుతో మేళవించిన చల్దిము
ద్ద డాపలి చేత మొనయ నునిచి। చెలరేఁగి కొసరి తెచ్చిన యూరుఁగాయలు వ్రేళ్లసందులను దా వెలయ నిఱికి। సంగడీలనడుమఁ
జక్కఁ గూర్చుండి। నర్మభాషణముల నగవు నెఱపి। యాగభోక్త కృష్ణుఁ డమరులు వెఱఁగంద। శైశవంబు మెఱసి చల్ది గుడిచె॥
వ॥ ఇట్లు కృష్ణసహాయులైన గోపకుమారులు చల్దులు గుడుచు నెడ క్రేపులు మేపులకుం జొచ్చి పచ్చని గఱికి జొంపంబులకుం బుల
పుఱికిలంపులు మేయుచు ఘోరంబగు వనంబున మఱుఁదొరంగుచు దూరంబు చనిన వానిం గానక వెఱచుచున్న గోపడింభకుల
కు నంభోజనయనుం డిట్లనియె। మ॥ వినుఁడో బాలకులార క్రేపులటవీవీథిన్ మహాదూరముం। జని యెన్నో మలఘాసఖాదనర

## శ్రీ బ్రహ్మ గోవత్సములను గోపాలకుల నంతర్ధానంబు చేయుట. శ్రీ

తోత్సాహంబుతో నెందుఁ బో। యెనో యేమయ్యెనొ క్రూరజంతువుల చే నేయాపదం బొందెనో। కని తెత్తున్ గసవుండు చ
ల్దిఁ గొంచుఁ దల్లాకుఁ జండ మీరందఱున్॥ అని చెప్పి॥ శా॥ కర్ణాలంబిత ¶ కాకపక్షములతోఁ గ్రైవేయహారాళితో। స్వర్ణాభాసిత వే
త్రదండములతోఁ సత్పింఛదామంబుతోఁ। బూర్ణోత్సాహముతో ధృతాన్నకబళోత్ఫుల్లాబ్జహస్తంబుతోఁ। ‡ దూర్ణత్వంబున
నేఁగెఁ లేఁగలకై మురారటవీవీథికిన్॥ క॥ ఇచ్చోఁ బచ్చిక మేసిన। విచ్చోఁ ద్రావినవి తోయ మేఁగినవిచ్చో। నిచ్చోట నుండఁ గొ
న్నవి। యిచ్చోఁ బాసినవి జాడ యిదె యిదె యనుచున్॥ క॥ కంజదళాక్షుఁడు వెదికెను। గొంజక లేఁగల నపార గురుతృణవని
కా పుంజంబుల భీకరన్యగ్ర కుంజంబులఁ దరుల గిరులఁ గొలఁకుల నదులన్॥ అంత॥ శా॥ బాలుం డయ్యు బకాసురానుజునిఁ ద్రుం
పక బాలుర్ గ్రేపులన్ మేలీలన్ బ్రతికించె నెక్కొ భువి నూహింపంగఁ డుంజోద్యముం। చాలోనంబుజసంభవుండుఁ జని
మాయాబాలు శుంభద్బలం। బాలోకింపఁదలంచి డాఁచె నొకచో నాలేఁగలన్ బాలురన్॥ వ॥ ఆసమయంబున మాడలుపో
యిన జాడ లెఱుంగక తప్పి యప్పద్మలోచనుం డెప్పటికొలంకు కడకు వచ్చి యచ్చోట నెచ్చెలులం గానక వారిం జీఱి లేకుండు
ట నిశ్చయించి గోవిందుండు విశ్వవిదుండు గావున యిది విరించి మొఱంగని యెఱింగి తిరిగి పోవుచు॥ శా॥ వంచింపం బని లేమ బ్ర
హ్మకిదె తన్వత్సంబుల న్బాలుర। న్వంచించెన్ గనుఁ బ్రాలి తన్ను మఱల న్వంచించుటాశ్చర్యమే। వంచింపన్ దనకేల తెచ్చ
టయగున్ వల్దంచు బ్రహ్మాండము। న్వంచింప న్మఱలింప నేర్చు హరి లీలన్మందహాసాస్యుఁడై॥ క॥ గోపాలసుతులు లేరని। గోపికల
కుఁ జెప్ప నేల గోపాలకులు। న్గోపికలు నలర బాలుర। క్రేపుల రూపముల నేఁ జరించెద ననుచున్॥ మ॥ కరముల్ పాదములున్ శిరంబు
లవలగ్నంబుల్ ముఖంబుల్ భుజాం। తరముల్ ముక్కులు గన్నులున్ శ్రవణముల్ దంతావలుల్ దండకాం। బరస్రగ్వేణువిషాణ
భూషణవయోభాషాగుణాఖ్యానత।త్పరతల్వొడ్వడకుండఁ దాల్చె విభుఁ డావత్సార్భకాకారముల్॥ క॥ రూపంబు లెల్ల నను
బహురూపకుఁ డిటు బాలవత్సరూపంబులతో। నేపారుటేమి చోద్యము। రూపింపఁగ నతని కితరరూపము గలదే॥ క॥ మఱలువు
మని యొకకర్తయు। మఱలించు కుమారకులును మఱలెడి క్రేపు।ల్పలికింపఁ దానయై హరి। మఱలంజనె లీలతోడ మందకు సది
మా॥ వ॥ ఇట్లు బాలవత్సరూపంబులతో విహరించుచు మందకు వచ్చి వారి వారి దొడ్ల నయ్యై వత్సంబుల ముందరికంపువలని నిలిపి
తత్తద్బాలురూపంబుల నందఱి గృహంబులఁ బ్రవేశించి వేణునాదంబులు చేసిన॥ చ॥ కొడుకుల వేణునాదములు గొబ్బున వీను
లకుం బ్రియంబులై। ముడివడ లేచి యెత్తికొని మూర్కొని తల్లులు గౌఁగిలించుచుం। జడిగొనఁ జేఁపు వచ్చి తమ చన్నులయం
మృతధారసమంబులై। వెడలెడి పాలు నిండుకొను నేపుకనిచ్చిరి తత్సుతాళికిన్॥ వ॥ మఱియుఁ దల్లులుల్లంబుల బెల్లుగ వెల్లిగొ
ను వేడుకలం దనూనందనులకు నలుఁగులిడి మజ్జనంబులు గావించి గంధంబులలంది తొడవులు దొడిగి నిటలతటంబుల రక్షాతిల
కంబులు వెట్టి సకలపదార్థసంపన్నంబులైన యన్నంబులొసంగి సన్నములు గాని సన్ననలు చేసిరి॥ క॥ పసితల్లుల కే బాలకు। లే
తెఱఁగున దిరిగి ప్రీతి నెసఁగింతురు। తన్నాతల్లుల కా బాలకులా। తెఱఁగునఁ బ్రీతిఁ జేసి రవనీనాథా॥ వ॥ ఆసమయంబున॥
ఉ॥ పాయని వేడ్కతో నునికిపట్టులకుం జని గోవులెల్లనం। భాయని చీఱి హుమ్మనుచుఁ బైఁబడి మూర్కొని † పంచటిల్లెఁ బెన్నై
యతిరేకమై పొదుగులం జెడలేక స్రవించుచున్న పా। లాయెడ నాఁకుచున్ సుముఖులై యొసఁగెన్ నిజవత్సకోటికిన్॥ క॥ వ్రేత
లకును గోవులకును। మాతృత్వము చాలఁ గలిగె మఱి మాధవుపై। మాతలని హరియు నిర్మల। కౌతూహలమొప్పఁ దిరిగెఁ గడు
బాల్యమునన్॥ గీ॥ ఘోషజనుల కెల్లఁ గుఱ్ఱలపై వేడ్క। పూఁట పూఁట కెలమిఁ బొటమరించె। నిచ్చ క్రొత్తలగుచు నీరజాక్షు
నిమీఁద। వేడ్క దమకుఁ దొల్లి వెలసినట్లు॥ వ॥ ఇట్లు కృష్ణుండు బాలవత్సరూపంబులు దాల్చి తన్నుఁ దాన రక్షించుకొనుచు మంద
నువనంబునన మందమహిమంబున నొక్క యేఁడు గ్రీడించె నా యేఁటికి నైదాఱు దినంబులు కడమపడియుండ నం దొక్కనాఁ

¶ కాకపక్షములు పాలు. ‡ తూర్ణత్వంబునన్। వేగముచేతను. † పంచటిల్లెన్। ఆనందించెను.

డు బలభద్రుండును దానును వనంబునకుం జని మంద చేరువ లేఁగల మేపన తిదూరంబున గోవర్ధన శైలశిఖరంబున ఘాసం
బులు గ్రాసంబులు గొనుచున్న గోవులా లేఁగలం గని॥ చ॥ ముదమున హుంకరింపుచును మూఁపుల పై మెడ లెత్తి చాఁచు
చుఁ। బదములు నాల్గు రెండయిన భాసనఁ గూడఁగఁ బెట్టి దాఁటుచు। న్వదనములన్వి శాల తరవాలములన్వడి నెత్తి పాఱి
యా। మొదవులు దన్నులం గుడిపె మూఁతుల బ్రుంగడి భంగి నాఁకుచుఁ॥ వ॥ అంత గోపకులు గోవులని వారింపనలవిగాక ది
గ్గనలుక తోడి సిగ్గులగ్గలంబుగ దుర్గమ మార్గంబున వాని వెంటనంటి వచ్చి లేఁగల మేపుచున్న కొడుకులం గని॥ ఉ॥ అయ్యలఁ
గంటి ముంచుఁ బులకాంకురము ల్వెలయంగఁ గుఱ్ఱలఁ। జయ్యన డాసి యెత్తికొని సంతసమందుచుఁ గౌఁగిలింపఁ డా। రయ్యెడ
నౌదలల్మనములారఁగ మూర్కొని ముద్దు సేయుచుఁ। దయ్యె మెఱుంగు గోపకులు తద్దయు సుబ్బిరి నిబ్బరంబుగన్॥ వ॥ ఇట్లు
బాలకాలింగనంబుల నానంద బాష్పపూరిత నయనులై గోపకులు గోవుల మరలించుకొని తలంగి చనువారలఁ జూచి బలభ
ద్రుండిట్లని తనలోఁ దలంచె॥ సీ॥ చన్ను మాసినయట్టి శాబక శ్రేణిపై గోగణంబులకును గోపకులకు। నిబ్బంగి వాత్సల్య మబ్బం
గినుదయించె పూరి తొల్లి మన్నించునట్లు మీరు। మన్నించుచున్నారు మమతఁ జేయుచుఁ బ్రీతి నంబుజాక్షుఁ గన్నయట్లు నా
కుఁ। బ్రేమ మయ్యెడి డింభబృందంబుఁ గనుఁగొన్న నిది మహాద్భుత మెంత మెఱుఁగ రాదు। మనుజ దైవత దానవ మాయ యొ
క్కో। కాకనాభర్తయగుచున్న కమలనయను। మాయయో గాక యితరుల మాయ నన్నుఁ। గలఁపనోపదు విభుమాయ గాఁగ
నోపు॥ క॥ అని మున్నమ్ముగ్ధుఁడయ్యును। దనయంతరదివ్యదృష్టిఁ దప్పక బుద్ధిం। దన చెలికాండ్రను గ్రేపుల। వనజాక్షుండనుచుఁ
జూచె వసుధాధీశా॥ వ॥ ఇట్లు విజ్ఞానదృష్టిం జూచి యెఱింగియు నమ్మక కృష్ణుఁ జూచి మహాత్మా తొల్లి యెల్ల గ్రేపులను ఋషుల
యంశంబనియును, గోపాలకులు వేల్పుల యంశంబనియును దోఁచుచుండు నిప్పుడు వత్సబాలక సందోహంబున సందేహంబు లే
క నీవయని తోఁచుచున్నది యిది యేమియని యడిగిన నన్నకును న్నరూపంబు వెన్నుండు మున్నఁ జేసె క్రన్నన నెఱింగించె న
తండు నెఱింగె నివ్విధంబున హరి బాలవత్సంబులు దానయై సంచరించిన యేఁడు విరించికి తనమానంబున నెక్క త్రుటిమాత్రం
బైన విరించి చనుదెంచి వత్సపాలకుండైన కృష్ణబాలకుం జూచి వెఱఁగుపడి యిట్లని వితర్కించె॥ శా॥ మందన్ గగ్గిన వత్సబాల
కులు నామాయా సుషుప్తులై। యెందుం బోవరు లేవ రెప్పుడును లేరే చేయ నాకన్యులాం। డెందున్ లేరు విధాతలుం బరు
లు వీరెవ్వార లెట్లైరకో। యెందే తెంచిరొ కృష్ణుతో మెలఁగువా రెందయ్యెడి న్నేఁటికిన్॥ మత్తకోకిల॥ బ్రహ్మపంపునఁ గాని
పుట్టదు ప్రాణిసంతతి యెప్పుడుం। బ్రహ్మ నెక్కఁడఁ గాని వేఱొక బ్రహ్మ లేఁడు సృజింపఁగా। బ్రహ్మ నేను సృజింప నెండొక
బాలవత్సకదంబమే। బ్రహ్మ నుంచు జనించె నెక్కఁడ బ్రహ్మ మైనది చూడఁగాన్॥ వ॥ అని యిట్లు సకలంబును సుకరంబుగ నెఱి
వెఱింగెడి నెఱివాడి ముదుకఱి యొక గల ప్రోగు వెఱంగుపడి గ్రద్దనఁ బెద్ద ప్రొద్దు తద్దయుం దలపోసి కర్జంబు మందల యెఱుంగ
కకొందలపడుచు నాందోళంబున॥ క॥ మోహము లేక జగంబుల। మోహింపఁగఁ జేయ నేర్పు మొనసిన విష్ణున్। మోహించెద
నేనని యెడ। మోహమున విధాత తాన మోహితుఁడయ్యెన్॥ గీ॥ పగలు ఖద్యోతరుచి చెడు పగిది రాత్రి। మంచు చీఁకటి లీనమై
మాయ మాడ్కి। విష్ణుపైనన్యమాయలు విశదము గు నె। చెడిని జేశులగరిమంబుఁ జెఱుచుఁ గాక॥ మఱియును॥ క॥ పుట్టించి బుద్ధి
యెఱింగితిఁ। బుట్టించితి జగము సగము పోయెను బ్రాయం। బిట్టి వినూతన సృష్టులు। పుట్టుట లేదౌర యుట్టి*బూమెలు భూమిన్॥
వ॥ అని యిట్లు తలవాకిట వాడిమిగల వాణిపోఁడిమి చేవాఁడి కెక్కినవలు మొగంబుల తక్కరి గొంటు పెనుదంటపలు వెంటలై
న తన మనంబున వితర్కించి విచారించు నెడ నతండు గనుంగొనుచుండ నబ్బాలకులు మేఘశ్యాములును, హారకుండల కిరీటవన
మాలికాభిరాములును, శ్రీవత్సమంగళాంగద నూపుర కనక కటక కంకణ కటిఘటిత కాంచీసుశోభాఢ్యులు, నాపాదమస్త
కతులసీనవదామములును, విలసదంగుళీయకస్తోమములును, శంఖచక్రగదాకమలహస్తులును, చతుర్భుజ ప్రశస్తులును, పీతకౌశే
య వాసులును, చంద్రికాధవళ హాసులును, కరుణాకటాక్షవీక్షణవిలాసులును, రవికోటిభాసులు నంతసచ్చిదానందరూప
మహితులు నణిమాదిగుణోపేతులును. విజాతీయ భేదరహితులును, శ్రీమన్నారాయణ ప్రతిమానవిగ్రహస్వరూపులునై
తమకుఁ బరతంత్రులగుచున్న స్తగీతాది సేవావిశేషంబుల సంజొచ్చి మెలంగుచు మూర్తిమంతంబులైన బ్రహ్మాదిచరాచరం
బులు నణిమ మహిమాదిసిద్ధులును, మాయా ప్రముఖంబులైన శక్తులును, మహదాది చతుర్వింశతి తత్త్వంబులును, గుణక్షో
భకాలపరిమాణ హేతుసంస్కారకామకర్మగుణంబులును, సేవింప వేదాంతవిదులకైన నెఱుంగరాని తెఱంగున మెఱయు
చుఁ గానంబడిన వారలం గనుంగొని॥ ఉ॥ బాలురఁ గంటి నా మదికిఁ బాసిన వారి నిమున్న వారి నేఁ। బోలఁగఁ జూచు నంతటన
భూరి నిరర్గళ దుర్గమప్రభా। జాలముతోడఁ జూపులకుఁ జాలమిఁ దెచ్చుచునున్నవార లే। మూల మొమార్గ మెయ్యదియొ
మోసము వచ్చెఁగదే విధాతకున్॥ వ॥ అని సకలేంద్రియంబులకు వెక్కసంబులైన స్రుక్కి॥ ఉ॥ పపర మేము తేజమున నీసచరా

* బూమెలు। మాయలు.

చరమైనలోకము। దీపితమయ్యెనట్టి విభుతేజముం గన్నులం జక్కంజూడంగా। నోపక పారవశ్యమును నొందుచు సంస్తిమితా ఖిలేంద్రియుండై పరమేష్ఠి మైనం బడిచె నప్పుడు చిత్రపుడూపుకైవడిన్॥ వ॥ ఇట్లు మాయాతీతుండును, వేదాంతవిజ్ఞానదుర్లభుండును, స్వప్రకాశానందుండును నైన, తనబాహుళ్యంబుం జూచి నివ్వెఱపడిన, బ్రహ్మం గని యీశ్వరుండు॥ శా॥ బాలుండై చను రాననుఁడు తనయీ బ్రహ్మాభిమానంబునన్। లోలుండై మతిఁదప్పి నా మహిమ యాలోకింప నేతెంచెఁదా। నాలోకింపఁగ నెంతవాఁడ ననుచు మాయాజాలముల్ విప్పితి। న్లీలారూపము లెల్లఁ దాఁచె నట కేళీచాతురీధుర్యుఁడై॥ వ॥ అంతలోన నిర్జీవుండు సజీవుండైన తెఱంగున నెనిమిదికన్నులుగల వేల్పుగమికాఁడు తేఱి తెప్పిఱిలి కాలుఁగేలుఁ గదలించి చెచ్చెఱం గన్నుఁ దెఱచి చూడ సమర్థుండై ముందరగని వెనుకఁ జూచి దివి విలోకించి దిక్కులు వీక్షించి యెల్లయెడలం గలయ దర్శించి తనపురోభాగంబున హరి సంచరించుటం జేసి జాతివైరంబు లేని నరపక్షిమృగామలకు నాటపట్టయి సిరిఁ గలిగి కామక్రోధాదిరహితులకు జీవనంబైన బృందావనంబు బొడగాంచి యయ్యెడ॥ సీ॥ తనకన్యములు లేక తనరారి మున్నూలవిభుఁడయ్యుఁ గ్రేపుల వెదకువాని। నఖిలజ్ఞుఁడై యొక్కఁడయ్యు నజ్ఞాకృతిఁ జెలికాండ్రఁ జెక్కండ్రఁ జేయువాని। బహిరంతరాద్యంతభావశూన్యుండయ్యు నంతంతనడుగుచొప్పరయువాని। గురుగభీరుండయ్యుఁ బరువులు వాఱుచు నట్టిట్టు పాఱఁ దరలాడువాని। జాతిరహితుఁడయ్యుఁ జతురగోపార్భక। భావ మెల్లనచ్చుపడిన మేని। చెలువువాని హస్తశీతాన్నకబళంబు। వానిఁ గాంచె నపుడు వాణివిభుఁడు॥ వ॥ కని సంభ్రమించి విరించి రాయంచ డిగ్గనుఱికి కనకదండసుకుమారంబైన శరీరంబుతోడ నేలం జాగిలంబడి మణిగణసుప్రకాశంబులైన తనకిరీటశిఖరప్రదేశంబులా పుమారుని పాదపద్మంబులు మోవ ముక్తాహారంబులగు నానందబాష్పజలపూరంబుల న తనియడుగులు గడిగి మఱియును॥ క॥ అడుగుల పైఁబడు లేచున్। బడుఁ గ్రమ్మఱ లేచు నిట్లు భక్తిన్ మనుదాఁ। బొడగనిన పెంపుఁ దలఁచుచు। మడుకని మహిమాబ్ధి నజుఁడు మడుకడఁ జెన్నృపా॥ వ॥ అంత నల్లనల్లన లేచి నిలుచుండి నయనారవిందంబులు దెఱచి గోవిందుని సందర్శించి చతుర్ముఖుండు ముఖంబులు వంచి కృతాంజలియై దిగ్గన డగ్గుత్తికయిడికొనుచు నేకచిత్తంబునఁ జతుర్ముఖంబుల నిట్లని స్తుతియించె॥ సీ॥ శంపాలతికతోడి జలదంబుకైవడి మెఱుఁగుటొల్లియతోడి మేనివానిఁ। గమనీయమృదులాన్నకబళవేత్రవిషాణవేణుచిహ్నంబుల వెలయువాని। గుంజావినిర్మితకుండలంబులవాని శిఖిపింఛవేష్టితశిరమువానిఁ। వనపుష్పమాలికావ్రాతకంఠము వాని నళినకోమలచరణముల వానిఁ। గరుణ గడలుకొను నకడకంటివాని గో। పాలబాలుభంగిఁ బరగువాని। నగుమొగంబువానిఁ నను గన్నతండ్రిని। నిను భజింతు ముక్తినీరజాక్ష॥ మ॥ నను మన్నించి భవజ్జగంబులకు నానందంబు నిండించి నీ। తను రూపంబిదె నా మనంబున కచింత్యంబయ్యె నీయుల్లస। ద్ఘనవిశ్వాకృతి నెవ్వఁడోపు నెఱుఁగన్ గైవల్యమై యొప్పు నా। త్మనివేద్యంబగు నీమువైభవము చందంబెట్టిదో యీశ్వరా॥ క॥ విజ్ఞానవిధము లెఱుఁగక। తద్జ్ఞులు నీవార్తఁ జెప్పఁ దను వాఙ్మనముల్। యజ్ఞేశ నీకు నిచ్చిన। యజ్ఞులు నినుఁ బట్టి గెలుతు రజితుఁడవైనన్॥ క॥ శ్రేయములు గురియు భక్తిన్ఁ। జేయక కేవలము బోధసిద్ధికిఁ దపముల్। జేయుట విఫలము పొల్లం। దాయము చేకుఱు నెతలఁప నధికంబైనన్॥ క॥ నిజముగ నిన్నెఱుఁగరు మును। నిజవాంఛలు నిన్నుఁ జేర్చి నీకథ వినుచున్। నిజకర్మలబ్ధభక్తిన్। సుజనులు నీ మొదలిటెంకిఁ జొచ్చి రధీశా॥ సీ॥ విక్రియాశూన్యమై విషయత్వమును లేనిదగుచు నాత్మాకారమై తనరు। నంతర్గకరణ మొక్కయధిక సాక్షాత్కారవిజ్ఞానమునఁ బట్టి వేఱొరులకు। నెఱుఁగంగరానిదై యేపారియుండుటఁ జేసి నీ నిర్గుణశ్రీవిభాతి। బహిరంగవీథులఁ బాఱక దిరములై యనులంబులగు నింద్రియముల చేత। నెట్టకేలకైన నెఱుఁగంగ నగుఁగాని। గుణవిలాసి వగుచుఁ గొమరుమిగుల। నీగుణవ్రజంబు నేరరా దెఱుఁగంగ। నొక్కమితము లేక యుంట నీశ॥ క॥ తారాతుషారశీకర। భూరజములకైన లెక్క బుధు లిడుదురు భూ। భారావతీర్ణ కరుఁడవు। నీరమ్యగుణంబు లెన్న నేరరగణ్యా॥ శా॥ ఏవేళం గృపఁ జూచు నెన్నఁడు హరి నీక్షింతు నంచార్తుఁడై। నీ వెంటన్బడి తొంటికర్మచయమున్ నిర్మూలముం జేయుచు। నీన్నివాఁడై తను వాఙ్మనోగతులని న్సేవించు విన్నాణి నో। కైవల్యాధిపలక్ష్మి నుద్ధవడిఁ దాఁ గైకొన్నవాఁ డీశ్వరా॥ ఉ॥ మాయలు గల్గువారలను మాయలఁ బెట్టెడి ప్రోఁడ నిన్ను నా। మాయఁ గలంచి నీ మహిమమానముఁ జూచెద నంచు నేరమిన్। జేయఁగఁ బూనితిన్ గరుణఁ జేయుము కావుము యోగిరాజ వా। గ్గేయజ వాగ్నిఁ దజ్జనితకీలముఁ గెల్చి వెలుంగ నేర్చునే॥ సీ॥ సర్వేశ నీరజోజనితుండ మూఢుండ ప్రభుఁడ నే నని వెట్టి ప్రల్లదమున। గర్వించినాఁడను గర్వాంధకారాంధనయను డకృపఁ జూడు నను బ్రధాన। మహదహంకృతి నభోమరుదగ్నిజలభూమి పరివేష్టితాండకుంభంబులోన। నేఁడు జానల మేన నెనయ నొక్కండ నే నీదృగ్విధాండంబు నేరికైన। సంఖ్యసేయంగరానిది సంతతంబు। నోలిఁ బరమాణువుల భంగి నొడలి రోమ। వివరముల యందు వర్తించు విపులభాతి। నెనయుచున్న నీ వెక్కడ నెంత కెంత॥ తరల॥ కడుపులోపల నున్న పాపఁడు కాలఁ దన్నినఁ గిన్కతో। నడువఁ బోలు నే

కాఁగిటల్లికి నాథసన్నముదొడ్డునై। యుడఁగి కారణకార్యరూపము నైనయాసకలంబునీ। కడుపులోనిడిగాఁ జెప్పవఁడఁ గో
క నేమఁటిరొవ్వఁడఁగా॥ క॥ భూరిలయజలధిని శ్రిత। నారాయణనాభికమలనాళమున నజుం। డారయఁబుట్టైననుటనిజ। మో
రాజీవదళాక్షుపుట్ట మొఱపుఁదలంపఁగా॥ సీ॥ నలినాక్షనీవాది నారాయణుండవు జలము నారము జీవచయము నారం బందునీ
వుంటనీయందవియుంటను నారాయణుండను నామము య్యెఁ। సకలభూతములకు సాక్షివధీశుండవట్టి ని త్రించు నారాయణుఁ
డవు। నీమూర్తి యిదినీకు నిజమూర్తి యనశామ నలిననాళము త్రోవ నడిచిమున్ను। కడఁగి నూఱేండ్లు వెదకి నేఁగాననైతి। నేక
దేశస్థుఁడవుగావ నేకరుచివి। జగములోనుండువీలోనజగములుండు। నరుఁడు నీమాయ నెట్లైనను గుచునుండు॥ వ॥ వినుమా
యీశ్వర పేల్పుల న్సెలుఁగునీ విశ్వంబునీమాయగాఁ। కనిజంబైనయశోదయొస్సు గని యెన్న న్నారనీకుక్షిలోఁ। గనెంబో త్ర
ష్మఱఁగాంచె నే భవదపాంగ శ్రీప్రపంచంబు చ। క్కనలోనా వెలినుండు లోను వెలియై వీక్షింపధన్యంబగుగా॥ మ॥ ఒకఁ
డైయుంటివి బాలవత్సములతో నొప్పారినీవంతట। న్సకలోపాశ్రితులై చతుర్భుజులునై సంప్రీతితోఁ గొల్వఁగాఁ। బ్రకట
శ్రీగలవాఁడవై లివిపుడుగా బ్రహ్మాండములున్నాపియొ। ల్లకయిట్లొక్కఁడవై తినీ వివిధలీలత్వంబుఁ గంటెం గదే॥ క॥ ఎఱుఁగ
నివారికిఁ దోపవు। నెఱిఁబ్రకృతిఁజేరి జగము నిర్మింపఁగనా। తెఱఁగున రక్షింపఁగనీ। తెఱఁగునఁ బ్రహరింపరుద్ర తెఱఁగున నీ
శా॥ క॥ జలచరమృగభూసురనర। కులములజన్మించితీవు కుజనులఁ జెఱుపగా। జెలిమిని సుజనులమనుపను। దలపోయఁగరావుని
విధంబులనంతా॥ గీ॥ మబ్బుఁ గొలిపి యోగమాయనింద్రించెద। వోపరాత్మ భూమ యోగరాజ। యే తెఱంగు లెన్ని యెంతయె
చ్చోటనీ। హేల లెవ్వఁడెఱుఁగు నీశ్వరేశ. సీ॥ అవిగాన నిజరూపము నరాదుకలవంటి దై బహువిధదుఃఖమై విహీన। సంజ్ఞాన మై
యున్న జగము సత్సుఖబోధకుఁడవైతుదిలేక తనరుదీవు । మాయచేఁ బుట్టుచు మనుచు లేకుండుచునున్న చందంబు నను
డు చుండు। వొకఁడ వాత్ముఁడ పితరోపాధిశూన్యుండవాద్యుండవమృతుండవక్షరుండ । వద్వయుండవు స్వయంజ్యోతివా
పూర్ణుఁ। డవు పురాణపురుషుఁడవు నిత్యాంత। సౌఖ్యనిధివి నిత్యసత్యమూర్తి విహరం। జనుఁడవీవు తలఁపఁ జను నెనిన్ను॥ వ॥ దేవా
యిట్టినిన్ను జీవాత్మస్వరూపుండవనక సకలాత్మలకు నాత్మయైన పరమాత్మస్వరూపకుఁడవని యెవ్వ రెఱుంగుచురు వారుగ
దాగురువనియెడు దినకరునివలనఁ బ్రాప్తంబైన యుపనిషద్జ్ఞానంబను నేత్రంబునం జేసి సంసారమిథ్యాసాగరంబుఁ ద
రించిన చందంబున నుండుదురు రజ్జువందు రజ్జువని యెఱింగెడి యెఱుక లేకుండ నయ్యెఱుంగమి నది సర్పరూపంబై తోఁచిన పిద
ప నెఱింగిన వారివలన రజ్జువని తెలుపుచుండ సర్పరూపంబు లేకుండునట్లై నడినాత్మ యప్పరమాత్మయని యెఱుంగరు- వారిక
య్యెఱుంగమివలన సకలప్రపంచంబులు గలిగి తోఁచు నాత్మయప్పరమాత్మయని యెవ్వ రెఱుంగుదురు వారికయ్యెఱుకవల
నఁ బ్రపంచంబు లేకుండు నజ్ఞానసంభావిత నామకంబులైన సంసారబంధమోక్షంబులు జ్ఞానవిజ్ఞానంబులలోనివి గావు కా
వునఁ గనులమిత్రునకహోరాత్రంబులు లేని తెఱంగునఁ బరిపూర్ణజ్ఞానమూర్తియగు నాత్మయందు జ్ఞానంబు లేమి మో
క్షంబు లేదాత్మవయిన నిన్ను దేహాదికంబని తలంచియు నాత్మ వెలినుండునంచు మూఢులు మూఢత్వంబున వెదుక
చుందురు- వారిమూఢత్వంబుఁ జెప్ప నేల బుద్ధిమంతులయి పరతత్త్వంబు గాని జడంబును నిషేధించుచున్న సత్పురుష
లు తమతమ శరీరంబులయందు నిన్నరయుచుందురదిగావున॥ శా॥ దేవా నీచరణప్రసాదకణలబ్ధిం గాక లేకున్న నెం
డే వెంటన్ జనునీ మహామహిమ నూహింపంగ నెవ్వారికిన్ । నీవారై చనువారిలో నొకఁడనై నిన్గొల్చు భాగ్యంబుగాఁ
కీ వేయిప్పటి జన్మమందయిన నెండెం దైన నన్నీశ్వరా ॥ తరల ॥ క్రతుశతంబునఁ బూర్ణకుక్షివి గాని నీవిటు క్రేపులుగా
సుతులునై చనుబాలుఁ ద్రావుచుఁ జొక్కియాడుచుఁ గౌతుక। స్థితిఁ జరింపఁగఁ దల్లులై విలసిల్లు గోవులు గోపికా। సతులు ధన్య
తలెట్లు చెప్పఁగఁ జాలువాఁడఁ గృపానిధీ॥ క॥ పరిపూర్ణంబుఁ బురాణము। పరమానందంబునైన బ్రహ్మమె చెలికాఁ। డరుదరు
దు నంద ఘోష। స్థిరజనముల భాగ్యరేఖ దింతింపంగన్॥ సీ॥ *ఏకాదశేంద్రియాధీశులు చంద్రాము లేను ఫాలాక్షుండు నిట్లు
గూడఁ। బనుము వ్వారము నెడపడక నింద్రియపాత్రముల నీపదాంభోజముల మరంద। ము స్వృతంబు ద్రావి యనమర నేకైకెం
ద్రిమాభిమానులు నయ్యునతికృతార్థ। భావులమైతిమి పరగ సర్వేంద్రియవ్యాపులు నీ సీఁనఁ ద్రావ్రిలి దిరుసు। గోపిగోపకజన
ములగురువిశిష్ట। భాగ్యసంపదఁ దలపోసి ప్రస్తుతింప। నలవిగాదెవ్వరికైన నంబుజాక్ష। భక్తవత్సలసర్వేశ పరమపురుష॥
శా॥ ఏలా బ్రహ్మపదంబు వేదములకున్నీక్షింపఁగారానినీ। న్నీలోకంబున నీవనాంతరమునందీమందలోఁ గృష్ణ యం। చాలా

*ఏకాదశేంద్రియాధీశులు చంద్రాదులు॥ ఏకాదశేంద్రియ। జ్ఞానకర్మేంద్రియములు పది-మనసు-వీనికి, అధీశులు। ప్రభువులు, చంద్రాదులు। చంద్రుఁడు మొదలగువారు-అనఁగా-మనస్సునకు చంద్రుఁడధిదేవత. జ్ఞానేంద్రియములైన శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములకు-దిగ్వాతార్క-ప్రచేతసాశ్వినులు అధిదేవతలు. కర్మేంద్రియములైన-వాక్పాణిపాదపాయూపస్థలకు-వహ్నీంద్రోపేంద్రమృత్యుప్రజాపతులధిదేవతలు..

పాదిసమస్తభావములునీయందేసమర్పించినీ।వ్రేలంద్రొక్కినపాదరేణువులపైవేష్టించినంజాలదే॥మ॥నినుహింసించి నపూతనాదులకుమున్నీమేటిసంకేతమి।చ్చితినీకున్బరదారపుత్రగృహగోస్త్రీప్రాణదేహాదులెల్లనువంచింపకనిచ్చుగో పకులకున్లక్షింపనేమిచ్చెదో।యనిసందేహముదోఁచుచున్నదిప్రపన్నానీకరక్షామణీ॥క॥దేహముకారాగేహము। మో హము *నిగళంబురాగముఖరములురిపు।వ్యూహములుభక్తితోని।న్నూహింపఁగనెంతదడవునోకమలాక్షా॥ గీ॥ఆశ్ర యించుజనులకానందసందోహ।మీదలంచివివిధహేలతోడ।నప్రపంచకుండవయ్యుఁబ్రపంచంబు। వెలయఁజేయదీవువి శ్వమూర్తి॥ క॥ఎఱిఁగినవారలెఱుంగుదు।రెఱుఁగన్బహుభాషలేలనీశ్వరనీపెం। పెఱుఁగమనోవాక్కులకున్। గుఱిసే యంగొలఁదిగాదుగుణరత్ననిధీ॥క॥సర్వమునీవయెఱుంగుదు।సర్వవిలోకనుఁడవీవజగదధిపతివిన్।సర్వాపరాధిననునో। సర్వేశయనుగ్రహింపుచనిమొదలింకన్॥ క॥జిష్ణునిశాటవిపాటన।వృష్ణికులాంభోజసూర్యవిప్రాదరగో।వైష్ణవసాగర హిమకర।కృష్ణాపాపండధర్మగృహదావాగ్నీ॥వ॥దేవానీకుఁగల్పపర్యంతంబునమస్కరించెదనని యివ్విధంబునసంస్తు తించిముమ్మారువలగొనిపాదంబులపైఁబడివీడ్కొని।బ్రహ్మతననెలవునకుంజనియెనతనిమన్నించిభగవంతుండైనహరితొ ల్లిచెడితిరిగివచ్చినవత్సబాలకులంగ్రమ్మఱంగైకొనిపులినంబుకడఁజేర్చెనిట్లు॥క॥†క్రించుతనంబునవిధిదము।వంచించిన యేఁడుగోపవరనందనులొ।క్కించుకకాలంబుగనీ।క్షించిరిరాజేంద్రబాలకృష్ణునిమాయన్॥గీ॥ఏమహాత్ముమాయనీవిశ్వ మంతయు।మోహితాత్మయగుచుమునిఁగియుండు।నట్టివిష్ణుమాయనర్భకులొక్కయేఁ।డెఱుఁగకుండిరనుటయేమిదొడ్డు॥ అప్పుడు॥మ॥చెలికాండ్రాయరుదెంచితేయిచటికిస్నేమంబునంగ్రేపులు।న్నెలవుల్చేరెనరణ్యభూమివలనన్నీవచ్చునందాఁ కఁజా।ల్దులుమీరించుకయెవ్వరున్గడువరాలోకింపురమ్మంచునా। జలజాక్షుండునగన్భుజించిరచటన్సంభాషలన్డింభకుల్॥ వ॥ఇట్లుబాలకులతోడఁజల్దిగుడిచివారలకునజగరచర్మంబుచూపుచువనంబుననుండితిరిగి॥వనమయూరవృత్తము॥ప్రసన్న పింఛమాలికాప్రభావిభాసితాంగుఁడుం। బ్రసిద్ధశృంగవేణునాదపాశబద్ధలోలుఁడుం। బ్రసన్నగోపబాలగీతబాహువీ ర్యుఁడయ్యును।ల్లసించిరేఁగెగోపకుల్చెలంగిచూడమందకున్॥ఆసమయంబున॥క॥ పెనుబాముదమ్మునమ్రింగిన।మనసందను తుండుపామువధ్గించినము।న్మనిచెనరణ్యములోపల।నని ఘోషించిరికుమారులాఘోషములోన్॥అనినవినినరేంద్రుండి ట్లనియె॥క॥కనిమనిచియెత్తిపెంచిన।తనుజన్ములకంటెనందతనయుండాఘో।షనివాసులకుమనోరం।జనుఁడెట్లయ్యెనుబు ధేంద్రచనునెఱిఁగింపన్॥అనినశుకుండిట్లనియె॥సీ॥అఖిలజంతువులకునాత్మవల్లభుఁడైనభంగిబిడ్డలునిండ్లుఁబసిఁడిమొద లు।వస్తువులెవ్వియువల్లభంబులుగావునకలాత్మకుండైనజలజనేత్రుఁ।డఖిలజంతువులకునాత్మగావునఘోషవాసులకె ల్లనువల్లభత్వ।మునుమిక్కిలొప్పెనుమాఁడులోకములకుహితముసేయఁగఁజలజేతుఁడుండు।మాయతోడమూర్తిమంతుఁ డైయొప్పారు।కలఁడతండునిఖిలగణములందు।భవతిధాతువెట్లుభావార్థమైసర్వ।ధాతుగణమునందుఁదనరినట్లు॥ క॥శ్రీ పతిపదమనునావను।బ్రాపించుభవాబ్ధివత్సపదముగధీరు।ల్రూపించిదాఁటిచేరుదు। రాపత్పదరహితులగుచునమృతపదం బున్॥గీ॥అఘునిఁజంపికృష్ణుఁడాప్తులుదానును।జల్దిగుడిచిజలజసంభవునకుఁ।జిద్విలాసమైనచెలువుఁజూపినకథఁ। జనుల వినినఁగోర్కె సఫలమగును॥అనిచెప్పిశుకయోగివ్యాసనందనుండిట్లనియె॥క॥రాగంబులబలకృష్ణులు। పౌగండవయస్కుల గుచుఁబశుపాలకతా। యోగంబునబృందావన। భాగంబునఁగాఁచిరంతఁబశువులనధిపా॥ వ॥అయ్యెడఁగృష్ణుండొకక నాఁడు‡రేపకడలేచి వేణువుపూరించిబలభద్రసహితుండైగోపకుమారులుదన్నుబహువారంబులుగైవారంబులుసే య మ్రోలనాలకదుపులనిడికొనినిరంతర ఫలకిసలయకుసుమంబులును, గుసుమమకరంద నిష్యందపానానందదిందిం దిరకదంబంబును, గదంబాదినానాతరులతాగుల్మసంకులంబును, గులవిరోధ రహితమృగపక్షిభరితంబును, భరితసర స్సరోరుహపరిమళమిళితపవనంబునునైన,వనంబుఁగనియందువేడుకంగ్రీడింపనిశ్చయించివెన్నుఁడన్నకిట్లనియె॥శా॥శా ఖాపుష్పఫలప్రభారనతలైచర్చించియోదేవమా। శాఖిత్వంబుహరింపుమంచుశుకభాషన్నీకెఱింగించుచున్। శాఖా హస్తములన్బ్రసూనఫలముల్పెక్కన్సమర్పించుచున్। శాఖిశ్రేణులునీపదాబ్జములకోజన్మ్రొక్కెడిన్జూచితే॥సీ॥ని ఖిలపావనమైననీకీర్తిఁబాడుచునీతుమ్మెదలువెంటనేఁగుదెంచె। నడవిలోఁగూడుండవైనయీశుఁడవనిముసరికొల్వఁగవ చ్చెమునిగణంబు। నీలాంబరముతోడనీవుజీమూతమ వనినీలకంఠంబులాడఁదొడఁగెఁ। బ్రియముతోఁజూచుగోపికల చందంబుననినుఁజూచెనదెహరిణీచయంబు। నీవువిందవనుచునిర్మలసూక్తులు। వలుకుచున్నవిచటఁబరభృతములు। నేఁ

*నిగళంబు।సంకిలి. రాగముఖములు।కామక్రోధాదులు. †క్రించుతనంబునన్।దుష్టతనముచేత. విధి।బ్రహ్మ. ‡రేపకడ।ప్రాతఃకాలము. బహువారంబులుకైవారంబులు॥బహువారంబులు।అనేకమారులు, కైవారంబులు।స్తోత్రములు.

డువిపినచరులునీవువిచ్చేసిన।ధన్యులైరిగా దెతలఁచిచూడ॥ సీ॥నీపాదములుసోఁకి నేఁడునీరునుదృణపుంజంబుతో భూమిపుణ్యయయ్యె।నీనఖంబులుదాఁకి నేఁడునా నాలతాతరుసంఘములుగృతార్థంబులయ్యె। నీకృపాదృష్టి చే నేఁడునదీశైలఖగమృగంబులుదివ్యకాంతిఁ జెందె।నీపెన్నురము ప్రోవ నేఁడుగోపాంగనాజనములపుట్టువుసఫలమయ్యె। ననియరణ్యభూమినంకించిపశులను।మిత్రజనులుదాను మేపుచుండి।నలిననలోచనుండునదులందుగిరులందు। సంతసంబు మెఱయసంచరించె॥మఱియునయ్యాశ్వరుండు॥సీ॥ఒకచోటమత్తాలియూథంబుఝుమ్మని మ్రోయంగఝుమ్మని మ్రోయుచుండు।నొకచోటఁగలహంసయూథంబుగూడి కేంకృతులు సేయంగఁ గేంకృతులు సేయు । నొకచోటమదకేకియూథంబులాడంగ హస్తాబ్జములుద్రిప్పియాడఁదొడఁగు । నొకచోటవనగజయూథంబునడువంగనయముతో మెల్లననడువఁజొచ్చుఁ। గ్రౌంచచక్రముఖరఖగములొక్కొకచోటఁ।బలుకవానియట్ల పలుకఁగడిసి। పులులసింహములను బొడఁగని యొకచోటఁ। బఱచుమృగములందుఁదలుచుగూడి।మఱియును॥సీ॥రాపూర్ణచంద్రికరా గౌతమీగంగరమ్మభగీరథరాజతనయ। రాసుధాజలరాశిరా మేఘమాలికరమ్మచింతామణిరమ్మసురభి। రామనోహారిణిరాసర్వమంగళరాభారతీదేవిరాధరిత్రి। రాశ్రీమహాలక్ష్మిరానందమారుతిరమ్మమందాకినిరాశుభాంగి।యనుచుమఱియుఁగలుగు నాఖ్యలుగలగోవు। లడవిలోనదూరమగుచు మేయ।ఘనగభీర భాషఁ గడు నెప్పఁజీఱు నా।భీరజనులువొగడఁ బెంపు నెగడ॥క॥కాంతారవిహారమ్ముల।శ్రాంతుండై గోపకాంకశయనుండగుచు।న్సంతుష్టిఁబొందఁ జేయుని। రంతరకరచరణమర్దనాదులనధిపా ॥ క ॥ పాడుచునాడుచుముచ్చట। లాడుచునొండొరులఁదాఁకునాప్తులఁగనిబిట్టాడుచుఁ జేతులుద్రిప్పుచుఁ।గ్రీడింతురునగుచుబలుఁడుఁగృష్ణుఁడునొకచోఁ॥ఇవ్విధంబున॥సీ॥ వేదాంతవీథులవిహరించువిన్నాణివిహరించుఁగాంతారవీథులందు। ఫణిరాజశయ్యపైఁబవళించుసుఖభోగిపల్లవశయ్యలఁబవ్వళించు।గురుయోగిమానసగుహలఁద్రిమ్మరు మేటిద్రిమ్మరునద్రీంద్రగుహలలోనఁ।గమలతోఁడఁబెనంగికడుడయ్యుచతురుఁడాభీరజనులతోఁడఁ బెనఁగిడయ్యు।నఖిలలోకములకునాశ్రయుండగుధీరుఁ।డలసితరులనీడనాశ్రయించు। యాగభాగచయములాహరించుమహాత్ముఁ। డడవిలోనిఫలములాహరించు॥ఆసమయంబున॥సీ॥ అలసినచోఁగొందఱతివేడ్కమునవీపు లెక్కించుకొనిపోదు రేఁపు మెఱసి। సొలసినిద్రించినచోనూరుతల్పంబులిడుచురుకొందఱుహితవుగలిగి।చెమరించియున్నచోఁజిగురుటాకులఁగొందఱొయ్యనవిసరుదురుత్సహించి।దవ్వేఁగినిలుచుచోఁదడయకగొందఱుపదములొత్తుదురతిబాంధవమున।గోపవరులుమఱియుఁగొందఱుకొందరు। మాధవునకుఁబెక్కుమార్గములను।బనులు సేసి రెల్లభవములఁ జేసిన।పాపసంచయములుభస్మములుగ॥ వ॥అయ్యవసరంబున శ్రీరామనా

### గార్దభాకారుండైన ధేనుకాసురునివధ.

మధేయుండైనగోపాలకుండు రామ కేశవులంజూచియిట్లనియె॥క॥ దూరంబగుతాలతరు।స్ఫారంబగువనముగలదుపతితానుపత।ద్భూరిఫలసహితమదియే।ధీరులుచొర వెఱతురందు ధేనుకుఁడుంటన్॥వ॥ఆధేనుకాసురుండుమహాశూరుండును, ఖరాకారుండును నై, సమానసత్వసమేతులైనజ్ఞాతులుండానును, మనుష్యులంబట్టిభక్షించుచుండునయ్యెడఁ, బరిమళోపేతంబులైననూతనఫలవ్రాతంబులసంఖ్యాతంబులుగఁగలవు,వినుఁడు॥క॥ ఫలగంధము నాసాపుట। ములవెంటన్జొచ్చిచిత్తములఁగొనిపోయెన్।ఫలములునమలింపుఁడుమము।బలియురకునుమీకు దైత్యభటులడ్డంబే॥వ॥అనిపలికిన చెలికాండ్రపలుకులాదరించివిని నగి వారునుందాను, నుత్తాలంబగు తాలవనంబునకుంజనిరంత॥క॥ తత్తరమునబలభద్రుఁడుఁ। దత్తాలానొకహములఁదనభుజబలసంపత్తిఁగదల్చుచుగ్రక్కున।మత్తేభముభంగిఁబండ్లుమహిపైరాల్చెన్॥వ॥ అప్పుడుపండ్లురాల్చినచప్పుడు చెవులకు దెప్పరంబై ననదఱిపడిరిపుమర్దనకుతుకంబున గార్దభాకారుండైన ధేనుకాసురుండు॥మ॥ పదవిక్షేపములన్నవృక్షధరణీభాగంబుగంపింపఁగా।రదముల్దీటుచుఁగత్తరించిన చెవుల్రాజిల్లవాలంబుభీ।తిదమైతూలఁగఁగావరంబుననముద్దీపించి గోపాలకు।ల్బెదరన్రాముని తోమ్మఁదన్నె వెనుకై భీరంబుతోరంబుగన్॥క॥ మఱియునుదనుజుఁడురామునిఁగఱవఁగమకించి తెఱపిఁగానకయతని।న్జఱచుచుఁజూచుచుశౌర్యము।పఱివోవఁగనంతనింతఁబదములఁదన్నెన్॥వ॥అంతబలభద్రుండురౌద్రాకారంబునగర్దభాసురుపదంబులునాలుగునొక్కకేలనంటంబట్టిబెట్టుదట్టించిద్రిప్పివిగతజీవుంజేసి.
మ॥ ఒకతాలాగ్రముఁదాఁకవైవనదికంపోద్రేకమై త్రెళ్లి వే।ఱొకతాలాగ్రముపైఁబడన్నదియునత్యుగ్రాహతిన్నిల్వకొం।డొకతాలాగ్రముపైఁబడన్విరిగియిట్లొండొంటిపైఁదాలవృ। క్షకముల్గూలెఁబ్రచండమారుతముదాఁకన్గూలుచందంబునన్॥ ఉ॥తంతువులందుఁజేలమువిధంబుననేపరమేశమూర్తియం। దింతయుఁబుట్టునట్టిజగదీశుఁడనంతుఁడుదైత్యమాత్రునిట్లంతము సేయుటెంతపనియచ్యుతమేవినుమంతలోనవాఁ। డంతముఁబొందు టెల్లఁగనియాతనిబంధులుగార్ద

* పరభృతములు।కోకిలములు.

భంబులై॥ క॥ బలకృష్ణులపైఁగదిసిన।బలియురఖరదైత్యభటులఁబశ్చిమపాదం।బులువట్టితాలశిఖరం।బులనెగరఁగవైచి వారిఁబోరిఁగొనిరధిపా॥ అప్పుడు॥ క॥ ఆలమున నోలిఁగూలిన।తాలద్రుమఖండదైత్యతనుఖండములన్।గ్గీలితమైధరజలధరమాలాన్వితమైనమింటిమాడ్కి న్వెలిఁగెన్॥ క॥ ధేనుకవనమున నమలిరి।మానవులా వేళఁజాటిప్రాసులఫలముల్।ధేనువులుమెసఁగెఁగసవులు ధేనుకహరభక్తకామధేనువుగలుగన్॥ వ॥ ఆసమయంబునసురలువిరులవానలుగురియించిరంతఁ గమలలోచనుండు గోపగీయవర్తమానుండై యన్నయుందానును గోపగణంబులంబిలిచికొనిమందకుంజనియెనవ్వేడ॥ ఉ॥ గోపదరేణుసంకలితకుంతలబద్ధమయూరపింఛునుద్దీపితమందహాసశుభదృష్టిలసన్ముఖునవ్యపుష్పమా।లాపరిపూర్ణుగోపజనలాలితవేణురవాభిరామునా।గోపకుమారునింగనిరిగోపసతుల్నయనోత్సవంబుగన్॥ గీ॥ కమలనయనువదనకమలమరందంబుఁ।కవిలినయనషట్పదములవలనఁ।ద్రాగిదినవియోగతాపంబుమానిరి।గోపకాంతలెల్లఁగోరికలర॥ వ॥ ఇట్లుగోపికలాదరంబునంజూడక్రీడాహాసవినయంబులంజూచుచుంగ్రీడాగరిష్ఠుండై నప్రౌఢగోష్ఠంబుప్రవేశించెనంతరోహిణీయశోదలుకుఱ్ఱలవలనిమచ్చికపిచ్చలింపనిచ్చకువచ్చిన క్లైమ్యోవేళలదీవించిరి-వారునుమజ్జనోన్మర్దనాదులంగీకరించి సురభికుసుమగంధంబులుగైకొనిరుచిరచేలంబులుగట్టికొనిరసోపపన్నంబులైనయన్నంబులుగుడిచితృప్తులై మంజులశయ్యల

## శ్రీకృష్ణుఁడు కాళియమర్దనము గావించుట.

సుప్తులై యుండిరంతు॥ సీ॥ ఒకనాఁడుబలభద్రుఁడొక్కఁడురాకుండగోపాలకులుదానుఁగూడికృష్ణుఁ। డడవికిఁజనియెండనాగోవులునుగోపకులునీరువట్టునఁగుందియుండఁ।గాళిందిలోవిషకలితతోయముఁద్రావిప్రాణానిలంబులువాసివడిన। యోగీశ్వరేశుండుయోగివంద్యుఁడుఁగృష్ణుఁడీక్షణామృతధారలెల్లమిగురిసి। పసులగోపకులనుబ్రతికించెనపుడు।వారుదమకుఁగృష్ణువలనమఱలఁ।బ్రతుకుగలిగెనంచుభావించిసంతుష్ట।మానసములఁజనిరిమానవేంద్ర॥ క॥ కాళియఫణిదూషితయమునఁ।గాళిందిఁబవిత్రఁజేయఁగానుత్సుకుఁడై।కాళిందీజలవర్ణుఁడు।కాళియువెడలంగనడిచెఁగౌరవముఖ్యా॥ వ॥ అనినయ్యగాధజలంబువలనమాధవుండెట్టినేర్పునసర్పంబుదర్పంబుమాపివెడలించెనందుఁబెద్దకాలంబువ్యాళమ్మేలయుండెనెఱింగింపుము॥ క॥ తొల్లుల్ఁగాఁచిననందుని।కుఱ్ఱనిచరితామృతంబుగొనకొనిచెవులన్।జుఱ్ఱంగఁదనివిఫెగ్గల్గునె। వెఱ్ఱులకైననుదలంపవిప్రవరేణ్యా॥ అనినశుకుండిట్లనియె॥ సీ॥ మానవేశ్వరయొక్కమడుగుకాళిందిలోఁగలదదియెప్పుడుకాళియాహి।విషవహ్నిశిఖలచేవేఁచుచుండునుమీఁదఁబరతెంచినంతనఁబక్షులైనఁ।బడిమగ్గునందుఁదత్కంగశీకరయుక్తపవనంబుసోఁకినఁబ్రాణులెవ్వియైననప్పుడెచచ్చునట్టియామడుగులోనుదకంబుపొంగుచునుడుకుచుండఁ। జూచివెఱగందికుజనులప్రక్కఁజేయ।నవతరించినబలువీరుఁడాగ్రహించి।భుజగవిషవహ్నిదోషంబుపాలియఁజేసి।సుజలఁగావించియానదిఁజూతుననుచు॥ వ॥ కృతనిశ్చయుండై పూర్వజన్మభాగ్యంబునందనచరణసంస్పర్శనంబునకు యోగ్యంబైతత్సమీపంబునవిశాలవిటపశాఖాకదంబంబుతోనున్నకదంబభూజంబునెక్కె॥ మ॥ కటిచేలంబుబిగించిపింఛమునఁజక్కంగొప్పుబంధించిదోః।స్తటసంస్ఫాలనమాచరించిచరణద్వంద్వంబుఁగీలించితత్।స్ఫుటశాఖాగ్రముమీఁదనుండియుఱికెన్గోపాలసింహంబుది।క్తటముల్మ్రోయహ్రదంబులోగుభగుభధ్వానంబనూనంబుగన్॥ ఉ॥ భూరిమహాప్రతాపపరిపూర్ణభయంకరగోపబాలకం।ధీరవపాతవేగవికటీకృతదుర్విషభీషణోర్మిసం।పూరితమైవడింగలఁగిపొంగిధనుశ్శతమాత్రభాగవి। స్తారమువొందెనమ్మడుగుతప్తపయఃకణబుద్బుదోగ్రమై॥ శా॥ పాఠీనాకృతిఁదోయరాశినడుమన్నాసిల్లిమున్నాఢ్యుఁడై। కాఠిన్యక్రియనీమనేర్పదనకున్గల్మిన్భుజంగేంద్రహృత్పీఠాగ్రంబునరోషవహ్నిలెగయన్భీమంబుగానీదెను।ల్లుఁదోత్తుంగతరంగమైమడుగుచుఱ్ఱోక్యంబుగాబాహులన్॥ ఆసమయంబున॥ శా॥ బాలుండొక్కఁడువీఁడునామడుఁగువిభ్రాంతోచ్ఛలత్కీర్ణకల్లోలంబై కలఁగన్జరించెనిటనేలోనుండఁజూడండుమ। త్క్ష్వేళాభీలవిశాలమన్మహావిషాగ్నిజ్వాలలన్భస్మమై।కూలంజేసెదనేఁడులోకులకునాకోపంబుదీపింపఁగన్॥ అనితలంచివిజృంభించి॥ ఉ॥ ఘోరవిషానలప్రభలుగొబ్బునఁగ్రమ్మఁగసర్పసైన్యవి। స్ఫారుఁడుగాలిమోరగుఁగుపాఱివడిన్గలచెన్నయోధరా। కారుఁబయోపిహారుభయకంపవిదూరుమహాగభీరునా।భీరకుమారువీరునవపీతసుఖాంబరధారుధీరునిన్॥ క॥ కఱచిపెలుచనవకమెఱియును।వెఱవకనిజవదనజనితవిషదహనశిఖల్మెఱయఁదననిడుదయొడలిని। నెఱిహరిఁబెనఁగొనియెభుజగనివహాపతివడిన్॥ వ॥ ఇట్లుభోగిభోగవేష్టితుండైచేష్టలులేనివానితెలుంగునఁగానంబడుచున్నప్రాణసఖునింగనుంగొనితత్ప్రీభావంబులెఱుంగకతత్సమర్పితధనదారమనోరథమానసులుగావున॥ చ॥ అడెమనకృష్ణునింగఱచెనంతటఁబోకభుజంగమంబుదు।ర్మదమునమేనుఁజుట్టికొనిమానకయున్నదియింకనేమిసే। యుదమెటుసొత్తమేపురుషులోపుదురీయహినడ్డపెట్టనె। య్యదిసదుపాయమంచుఁబడిరార్తరవంబు

లందూలి గోపకుల్ ॥ క॥ గోపకుమారకశేఖరు, నేపున సర్పంబు గఱచుటీక్షించి వగ, న్నేపులకుఁ దొలఁగి గోవులు, వాపోవుచు
నుండె న్వృషభవత్సంబులతోన్ ॥ క॥ భూతములు వడఁకె నుల్కా, పాతంబులు మింటఁ గానఁబడె ఘోషములో, వ్రేతలకును గో
పకసంఘాతములకు నదరెను గడకన్నులి లేశా ॥ వ॥ అంతనా మర్నిమిత్తంబులు పొడగని బెగడుగదిరిన చిత్తంబులను త్తలపడు
చు మందనున్న నందయశోదాములైన గోపగోపికాజనంబులు హరిదళ సరియెఱుంగక గోపాలగోగణపరివృతుండైన కృష్ణుం
డెక్కడనైనం జిక్కనోపునని హృస్కుచుం బెక్కువలైన నుక్కువలు చెక్కులొత్తనొక్కపెట్ట బాలవృద్ధసమేతులై మహాఘో
షంబున నా ఘోషంబు వెలువడి ॥ క॥ వారిబ్బంగి నెఱుంగని, వారై హరిఁ జూడఁ బోవ వడిగొని నసుచు, న్వారింపఁడయ్యె రా
ముఁడు, వారిని హరిలావెఱుంగు వాఁడయ్యు నృపా ॥ వ॥ అంతలోన వారును గ్రామాంతరమార్గంబు పట్టి పోవుచు నెడనెడ గో
పగోష్పదంబుల సందుల నింతనంతనక్కడక్కడికి యవాంకుశకమలకులిశచక్రచాపకేతనాది రేఖాలంకృతంబులై మా
ర్గాభరణంబులైన హరిచరణంబుల జాడఁ గని చొప్పుదప్పక చని మర్ఘటంబైన యమునాతటంబు చేరి వారిమధ్యంబున నితరు
లకసాధ్యంబైన సర్పంబు చేతఁ గాటుపడి దర్పంబు చూపక భోగిభోగపరివృతుండైన శ్రీకృష్ణునిం గని కృష్ణకృష్ణేతి విలాపం
బులం దాపంబులం బొందుచుఁ దత్కాలంబున నంధ్రతిమిరాలంబయ్యెననుచు దైవంబుఁ దిట్టు గోపికలును గోపకులం గలిసి మేత
లుడిగి తెప్పలిడక కృష్ణునిం దప్పక చూచుచు నెరలుచున్న గోవులం గని రందు గోపికలు యశోదం బట్టుకొని విలపించుచుఁ గృ
ష్ణును ద్దేశించి యిట్లనిరి ॥ సీ॥ ఎదురువచ్చినఁ జాల నెఱుగు గాఁజను దెంతు వెదురువచ్చిన నేఁడదేల రావు, చూచినఁ గృపతోడఁ
జూడుదుమంచు నీవు చూచినఁ గనువిచ్చి చూడవేల, డాసినన్ అలేక డాయంగవత్తువు డాసిన నేఁటికి డాయవిచట, జీతినన్నో
యని చెలరేఁగి పలుకుదు మిదియేమి చీటిన నెఱుఁగకుంట, తలఁపు సేయునంతఁ దలపోయుచుండువు, తలఁపు సేయ నేఁడు తలఁప
వకట' యను చుభక్తివివశులాడెడికై వడి, వ్రేత లెల్ల నాడివివశులైరి ॥ వ॥ ఆసమయంబున నందయశోదాదులు హరింజూచి యా
ధికంబునన్ శోకంబున నిట్లనిరి ॥ క॥ విషధచయుగయకురక్కసి, విషకుచమర్ధంబు ద్రావి విషవిజయుఁడవై, విషరుహలోచన
యక్కుత, విషయుండగు నీకు సర్పవిష మెక్కఁగదా ॥ క॥ కట్టా క్రూరభుజంగము, గట్టులుకన్నిన్నుఁ గఱవఁగం పించితివో, తిట్టితి
వో పాపవుపధి, బట్టీనుముఁదలఁచి కాకపలవించితివో ॥ క॥ పన్నగము నమ్ముఁగఱవక, నిన్నేటికిఁ గఱచె కృత్తి నెమ్మిగలిగినీ, వు
న్నను మమ్మురక్షింతువు, నిన్నున్రక్షింపనేము నేరముతండ్రీ ॥ ఉ॥ చూడవదేమి గారవపుఁ జూపుల మమ్ము సఖాలితోడ మా, టా
డవదేమి నర్మమగనం జెలుపాదములందు మ్రోయనే, డాడవదేమి నర్తనములవ్వల మ్రోలను గోపికావళిన్, గూడవదే
మినవ్వులకు గోపకుమారవరేణ్య చెప్పుమా ॥ సీ॥ శ్రవణరంధ్రంబులు సఫలతఁ బొందంగ నెలమి భాషించువారెవ్వరింకఁ, గ
రచరణామలక లిమి ధన్యతనొంద నెగడీపైఁ బ్రాకువారెవ్వరింక, నయనయుగ్మంబులున్న తిఁగృతార్థములు గానవ్వులు
చూపువారెవ్వరింక, జిహ్వలు గౌరవశ్రీఁ జేరఁ బాటలమెడఁ బరికించువారెవ్వరింక, సం డ్రి నీవు సర్పగ్రస్తుండవై యున్న, ని
చట మాకుఁ బ్రభువులెవ్వరింక, మఱిగిపాయలేము మాకు నీతోడిద, లోకమీవు లేనిలోకమేల ॥ వ॥ అని యొండొరులం బట్టు
కొని విలపించుచుం గృష్ణునితోడ నమునుగుఁజొత్తమనుచుఁ గృష్ణవిరహవేదనానలభారతప్తులై మడుగుఁజొరఁబారుచున్న
వారలం గనుంగొని భగవంతుండైన బలభద్రుండు మీరు మీ చెఱుఁగరు ధైర్యంబు విడుచుట కార్యంబు గాదు సహించి చూడుఁ
డనుచు వారిని వారించి ॥ క॥ తనుఁగూర్చి యివ్విధంబున, వనితలు బిడ్డలును బాగువాపోయెడి ఘోష, నివాసులఁ గని కృష్ణుఁడు,
మనుజుని క్రియ నొక్కముహూర్తమాత్రము జరిపెన్ ॥ శా॥ అంతన్ గృష్ణుఁడు మేనుఁ బెంపభుజగుండాపృత్తులన్ బాసి తా,
సంతప్తాయతభోగుఁడై కదుటల్పాలించి నిట్టూర్పుతో, శ్రాంతుండై తలలెత్తి మిర్విషము నాసావీథులం గ్రమ్మఁదు, శ్వం
తన్ దిక్కులు సూచుచుండెఁ దలఁగి నిల్చెన్ దామకాస్త్రాకృతిన్ ॥ చ॥ వెఱుగు లేని మేటిబలుపీరుఁడు కృష్ణకుమారుఁడొక్కచేఁ,
జలధిభగేంద్రచందమునఁ జక్కనఁ దౌడలువట్టి స్రుక్కఁగన్, జోఁ జొ అమర్షపానలము జొబ్బిలుచుండఁగ నెత్తిలీలతో, జి
అజిఱఁ ద్రిప్పి వైచెం బరిశేషితదర్పము క్రూరసర్పమున్ ॥ వ॥ ఇట్లు వేగంబున నాగంబు పీఁచి వైచి జగజ్జెట్టియైన నందనందను నిపట్టి రె
ట్టించిన సంభ్రమంబున ॥ సీ॥ ఘనయమునానదీకల్లోలఘోషంబు సరససమృదంగఘోషంబు గాఁగ, సాధుబృందావనచర
చంచరీకగానంబు గాయకసుగానంబు గాఁగ, కలహంససారసకమనీయమంజులశబ్దంబులు తాళశబ్దములు గాఁగ, విపినం
డివీక్షించు దివిజగంధర్వాదిజనులు సభాసీనజనులు గాఁగ, బన్నగరాగాదిరత్నప్రభాసమాన, సుమహితకాళియఫణిఫణామం
టపమున, నళినలోచన విఖ్యాతనర్తకుండు, నిత్యనైపుణము నఁ బేర్చి నృత్యమాడె ॥ శా॥ సుతిశ్లోకమాలున్న గౌరవముతో గోపా
కృతి నున్న నయ్యా, రక్తోహంతవడిన్మహాఫణిఫణారంగప్రదేశంబుపై, నత్తీర్ణోద్ధతినాడుఁ బాడుఁ జెలఁగున్ హాసంబుతో డం
బవ, ప్రస్తావంబులు సేయుఁ గేళిగతులన్ బ్రాహ్మైకశేషంబుగన్ ॥ క॥ ఘనతరసుషిరానందస్వనములతో సిద్ధసాధ్యచారణ

గంధర్వనిలింపమునినుతులువ। య్యానగురిసిరివిరులవానలాడుచుహరిపై॥వ॥ ఇట్లుమహాజనదండధరావతారుండైనహరి వడిగలిగినపడగలమీఁదఁదాండవంబుసలుపఁబెండువడియొండొంటిముఖంబులరక్తమాంసంబులుమియుచుఁగన్నులవిషం బుగ్రక్కుచునుక్కుచెడిదిక్కుదిక్కులుచూచుచుంగంఠగతప్రాణుండైఫణీంద్రుండుతనమనంబున॥ఉ॥ వేలుపులైనలా వుచెడిపేదనఁబొందుచునావిషానలజ్వాలలుసోఁకినంతటనెచత్తురునేఁడిదియేమిచోద్యమో। భీలవిషాగ్నిహేతిభయపీడ కునోర్చియుఁగ్రమ్మఱంగనీ।బాలుఁడునుత్ఫణాశతముభగ్నముగావెసఁద్రొక్కియాడెడిన్॥క॥ ఈతఁడుసర్వచరాచర। భూతేశుఁడుపరమయోగిపురుషుఁడుసేవా।ప్రీతుఁడుశ్రీహరియగునని।భీతిన్శరణంబువేఁడెబిట్టలసినృపా॥వ॥ ఇట్లుక్రూ

—— శ్రీ కాళియునిభార్యలైననాగకాంతలుశ్రీకృష్ణునినుతించుట. శ్రీ ——

రంబులైనహరిచరణప్రహారంబులంబడగలిడిసినొచ్చిచచ్చినక్రియంబడియున్నపతింజూచినాగకాంతలుదురంతంబైన చింతాభరంబునిష్పటిల్లైమసెవ్వగలనొల్లంబోయిపల్లటిల్లినయుల్లంబుల॥ఉ॥ కచబంధంబులువీడభూషణములాకంపింపఁ గౌఁదీఁగెలుస్సగయుస్తనంబులవ్రేఁగునంగదలఁబైకొంగుల్వడిజ్జారఁగాఁ।బ్రచురభ్రాంతిఁగలంగిముందటరుదవ్వాలావ లింగొంచుక్రుక్కుమభక్తింజనికాంచిరాగుణమణిస్తోమాలచూడామణిన్॥వ॥ కనిపండప్రణామంబులాచరించినిటల తటఘటితకరకమలలైయిట్లనిరి॥క॥ క్రూరాత్ములదండింపఁగ।ధారుణిపైనవతరించితనరెడినీకిన్। క్రూరాత్మునిదండించుట। క్రూరత్వముగాదుసాధుగుణముగుణాఢ్యా॥క॥ పగవారిసుతులయందును।బగయించుకలేకవిమతఁబరగెడినీకుం। బగగల దెఖలుపనడఁచుట।జగదవనముకొఱకుగాదెజగదాధారా॥క॥ నిగ్రహమేమమువిషాస్యుల। నుగ్రులశిక్షించుటెల్లనూ హింపమహా।నుగ్రహముగాకమాకీ।నిగ్రహమువిషాస్యభావనిర్గతిఁజేసెన్।॥ఉ॥ ఎట్టితపంబుచేసెనొకొయెట్టిసుకర్మము లాచరించెనో।యెట్టినిజంబువల్కెనొకొయీఫణిపూర్వభవంబునొందుము। న్నెట్టిమహానుభావులకునెన్నఁడుచేరువ గానినీవునేఁ।డిట్టివినోదలీలఁదలలెక్కనటించెదవీఫణీంద్రుపైన్॥మ॥ బహుకాలంబుతపంబుచేసివ్రతముల్పాటించికామిం చినీ।మహనీయోజ్జ్వలపాదరేణుకణసంస్పర్శాధికారంబుశ్రీ।మహిళారత్నముతొల్లికాంచెనిదెనేమంబేమియున్లేకనీ। యహిసీపాదయుగాహతిన్బడసెనేఁడత్యద్భుతంబీశ్వరా।॥ఉ॥ ఒల్లరునిర్జరేంద్రపదమొల్లరుబ్రహ్మపదంబునొందఁగా। నొల్లరుచక్రవర్తిపదమొల్లరుసర్వరసాధిపత్యమున్।నొల్లరుయోగసిద్ధిమఱియొండుభవంబులనొందనీనినీ। సల్లలితాం ఘ్రిరేణువులసంగతినొందినధన్యులెప్పుడున్॥క॥ ఘనసంసారాహితులగు।జనులాకాంక్షింపఁగడునశక్యంబగుశో। భన ముసమతుంబుసనహి।గనియెందామసుఁడుదోషకలితుండయ్యున్॥వ॥ దేవాసకలపురుషాంతర్యామిరూపత్వంబువలనఁ బురుషుండవయ్యునపరిచ్ఛిన్నత్వంబువలనమహాత్ముండవయ్యునాకాశాదిభూతసమాశ్రయత్వంబువలనభూతవాసుం డవయ్యుభూతమయత్వంబువలనభూతశబ్దవాచ్యుండవయ్యుఁగారణాతీతత్వంబువలనఁబరమాత్ముండవయ్యుజ్ఞానవిజ్ఞా నపరిపూర్ణత్వంబుగలిగినిర్గుణనిర్వికారంబులవలనబ్రహ్మంబవయ్యుఁబ్రకృతిప్రవర్తకత్వంబువలననంతశక్తివైయప్రా కృతుండవయ్యుఁగాలచక్రప్రవర్తకత్వంబువలనఁగాలుఁడవయ్యుంగాలశక్తిసమాశ్రయత్వంబువలనంగాలనాభుండ వయ్యుసృష్టిజీవనసంహారాదిదర్శిత్వంబువలనంగాలావయవసాక్షివయ్యునొప్పనీకునమస్కరించెదముమఱియును॥సీ॥ విశ్వంబునీవయైవిశ్వంబుఁజూచుచువిశ్వంబుసేయుచువిశ్వమునకు।హేతువవైపంచభూతమాత్రేంద్రియములకుమనః ప్రాణబుద్ధిచిత్తములకెల్లనాత్మవైమొనసిగుణంబులనావృతమగుచునిజాంశభూత।మగునాత్మవయమునకనుభూతిసే యుచుమమూఁడుహంకృతులచేమునుఁగువడక।నెఱిననంతుఁడవైదర్శనీయరుచివి।కారసూక్ష్ముఁడవైనిర్వికారమహిమఁ।ద నరికూటస్థుఁడనసమస్తంబునెఱుఁగు।నీకుమ్రొక్కెదమాలింపునిర్మలాత్మ॥వ॥ మఱియుఁగలండులేఁడుసర్వంబునెఱుంగునిం చుకయెఱుంగునించుకబద్ధుండవిముక్తుండొకండనేకుఁడుసనునివిమొదలుగాఁగలవాదంబులుమాయవలనననురోధింపు డురుగావుననానావాదానురోధకుండవయ్యునభిధానాభిధేయశక్తిభేదంబువలనబహుప్రభావప్రతీతుండవయ్యుఁజతు రాదిరూపంబులవలనఁబ్రమాణరూపకుండవయ్యునిరపేక్షజ్ఞానంబుగలిమింగవివయ్యువేదమయనిశ్వాసత్వంబువలనశా స్త్రయోనివయ్యుసంకర్షణవాసుదేవప్రద్యుమ్నానిరుద్ధరూపంబులవలనఁజతుర్మూర్తివయ్యుభక్తజనపాలకుండవయ్యునం తఃకరణప్రకాశత్వంబుగలిగినీవసజ్జనఫలప్రదానంబుకొఱకుగుణాచ్ఛాదకుండవయ్యుఁజిత్తాదివర్తనంబులగానందగినగు ణంబులకుసాక్షివైమొరులకెఱుఁగరానినగోచరుండవయ్యుఁదర్కింపరానిపెంపువలననవ్యాహతవిహారుండవయ్యునక లకార్యహేతువయ్యు నంతఃకరణప్రవర్తకత్వంబువలనహృషీకేశుండవయ్యునుసాధనవశంబుగానియాత్మారామత్వం బువలనమునివయ్యు, నధికసూక్ష్మమతులనెఱుంగనెంజెండకనీవువిశ్వంబుగాకయువిశ్వంబునీవయయ్యును,విశ్వ

భావాభావసందర్శనంబు సేయుచు విద్యావిద్యలకు హేతువైన నీకుం బ్రణామంబు లాచరించెద మవధరింపుము॥ క॥ లోకజ
నస్థితిలయములు గైకొని చేయుదువు త్రిగుణకలితుఁడవై కాలాకారమున నమోఘ శ్రీకలితుఁడవగుచు నిచ్చఁ జెందక నీశా॥
క॥ ఈ శాంతలు గానితనువు లీశా యీమూఢజాతు లీసజ్జాతుల్ నీ శాంతతనువులం బ్రకాశింతువు ధర్మహితము గా సుజ
నులలోన్॥ ఉ॥ నేరములెన్న నెక్కుడిది నేము దలంచ తలంపులందు లో నేరుపులున్న వేసుతుల నేరమిఁ దండ్రులు ద్రోఁచిపు
చ్చరే నేరము సేయువారి ధరణీపతు లొక్కొకమాటు గావరే నేరమిగల్గు మద్విభుని నేఁ డిటు గావఁగదే కృపానిధీ॥ శా॥ బా
లుం డీతఁ డనుంచి వాఁడనుచుఁ జెప్పన్రాము క్రూరుండు మా శ్శీలుం డౌటయు నైన నేము సుభగశ్రీఁ బాసి వైధవ్యముం ట్రాలంకా
రముఁ బొంద నోపదు సునాథాలాపమాలింపవే చాలున్ నీపదతాండవంబు పతిభిక్షం బెట్టి రక్షింపవే॥ ఉ॥ ఆకులమయ్యె భోగ
మి దెయాసలన్నియు వ్రస్సెఁ బ్రాణముల్ ప్రాకలఁబోకలన్ బలిసెఁ రాయెడఁ జెట్టకమాని జేసుపై నీకరుణాకటాక్షములని
ల్పఁగఁ జేతగనోపము స్తల్లో కైక శరణ్య మోయుభయకారణమో కమలామనోహరా॥ గీ॥ సమ్మఁ బెండ్లి సేయుమా ప్రాణ
వల్లభు ప్రాణమిచ్చి కావు భక్తవరద నీవు సేయు పెండ్లి నిత్యంబు భద్రంబు పిన్ననాటి పెండ్లి పెండ్లి కాదు॥ ఇంద్రవజ్ర
ము॥ నీయాన మెవ్వారి నిగ్రహింపం డాయున్ గ్రహాపాకృతి నందడింక నీయాజ్ఞలో నుండెద నేఁటనుండి స్వామియాశు
ప్రాణంబులు మాకు నీవే॥ వ॥ అని యిట్లు తన పెనిమిటి బ్రతుకుఁ గోరెడి భుజగసతులయందు శరణాగతవత్సలుండైన పుండ
రీకాక్షుం డంతకరుణించి చరణఘట్టనంబు చాలించి తలంగిన నెట్టకేలకుఁ బ్రాణేంద్రియములను అలంబడసి చిగిసినలఁగిన తల
లు సవరించుకొని వగపు గదుర భుజగపతి జలజనయనునికి నంజలి చేసి మెల్లన నిట్లనియె॥ చ॥ మలకలు మా ప్రచారములు మాము
ఖముల్ విషచిహ్నఘోరముల్ ఖలులము రోషజాతులము గర్వులమే మొకమందివారమే । నలినదళాక్ష ప్రాణులకు నై
జగుణంబులు మాననేర్చునే । వెలయ వెమావికారములు వింతలె నేలొనరించితీశ్వరా ॥ సీ ॥ వివిధభావాకారవీర్యబీ
జాశ్రయజనయోనియుతము గా జగములెల్ల । నీవ చేసితిమున్న నేమా జగంబులో సహజకోపనులము సర్పములము । దు
ర్వారమైన నీతోరంపుమాయ నే మెఱిఁగి చాఁటెడుపని కెంతవార । మంతకుఁ గారణ మఖిలేశ్వరుండవు సర్వజ్ఞుఁడవు నీవు జ
లజనయన మునిచె దేని యుమన్నించి మనుపు నన్ను । నిగ్రహించెద వేని యు నిగ్రహింపు మింక సర్వేశ మా యిమ్ములెందుఁ గ
లవు । చిత్తమందున్న క్రమమునఁ జేయఁదగును॥ క॥ నాపుణ్యమేమి చెప్పను నీపాదరజంబుఁ గంటి నే సనకాదుల్ । నీపా
దరజముఁ గోరుదు రేపగిదిం జన్నవైన నిట మేలు హరీ॥ వ॥ అని విన్నవించినఁ గాళీయుపలుకులు విని నవధరించి కార్యమాన
సుండైన సర్వేశ్వరుం డతనికిట్లనియె॥ క॥ గోవర్గముతో మనుజులు ద్రావుదురీ మడుగు నీరుఁ దగదిందుండన్ నీవును నీ బాంధ
వులును నీ వనితలు సుతులు జనుఁడు నేఁడంబుధికిన్॥ క॥ నిను నే శాసించిన కథ మనమునఁ జింతించి రేపు మాపును గీర్తిం దినమ
నుజులు నీభయమున విను మెన్నఁడుఁ బొందరెందు విషవిజయముతోన్॥ చ॥ ఇది మొదలెవ్వరైన నరులీయమునానదిని ప్ర
దంబులో వదలక తోఁగి నన్ను నుపవాసముతోఁ దలంచి కొల్చుచుం గడలక దేవతాదులకుఁ గా జలతర్పణ మాచరించిన న్న
దములదిత్తులై దురితసంఘముఁ బాయుదురాత్మలంబునన్॥ గీ॥ గరుడభీతిఁ రమణకద్వీపమొల్లకీ మడువుఁ జొచ్చితీవు మత్పదా
బ్జలాంఛనములు నీతలననుంటఁ జూచియా పక్షిరాజు నిన్నుఁ బట్టఁడింక॥ వ॥ అని యిట్లు విచిత్రవిహారుండైన గోపాలకృష్ణకు
మారుం డానతిచ్చిన నీయకొని చయ్యన నయ్యహీంద్రుండు తొయ్యలులుం దానును నెయ్యంబున నయ్యీశ్వరునకు నవ్యది
వ్యాంబరాభరణరత్నమాలికానులేపనంబులు సమర్పించి తేటిదండంబులకు దండయగు నీలోత్పలంబుల దండ నిచ్చి పుత్ర
మిత్రకళత్రసమేతుండై బహువారంబులు వారంబు చేసి వలగొని మ్రొక్కి లేచి వీడ్కొని రత్నాకరద్వీపంబునకుం జని

## కాళియుని పూర్వకథ.

యెనిట్లు॥ క॥ వారిజలోచనుఁ డెవ్వరు వారింపఁగలేని ఫణినివాసత్వంబు న్వారించిన యమునసుధా వారింబోలుపారె నె
ల్లవారికిఁ బ్రియమై॥ వ॥ అనిన విని మునీంద్రా యేమికారణంబునఁ గాళియుండు భుజగనివాసంబయిన రమణకద్వీపంబు విడి
చెన తండొక్క రుండును గరుడున కేమి తలంచెనని నరవరుండడిగిన మునివరుం డిట్లనియె॥ సీ॥ సర్పభీరువులైన జను లెల్ల నెల నెల
సరసభక్ష్యములు వృక్షములమొదల సర్పంబులకుఁ బెట్ట సర్పంబులును మును సర్పాంతకుఁడు దమ్ముఁ జంపకుండఁ బ్రతిమాస
మును దమభాగభక్ష్యంబులా పక్షిరాజునకిచ్చి బ్రతుకుచుండ విషవీర్యదుర్మదావిష్టుఁడై కాళియుఁ డహికులాంతకుని పా
లపహరించి యాకతన పాలిభాగంబు లెల్లఁ దినిన విని ఖగేంద్రుఁడు కోపించి విపినితలలు చీఱి చెండాడి భోగంబు చించి వైచి
ప్రాణములఁ బాపి వచ్చెదఁ బట్టియనుచు॥ క॥ అక్షీణకనకసన్నిభపక్షయుగోద్భూతఘోరపవమానమహావిక్షేపకంపితాశా
నేకక్షోణిధరేంద్రుఁ డగుచు గరుడుఁడు వచ్చెన్॥ ఉ॥ వచ్చిన సర్పవైరిఁ గని వ్రాలక లేచి మహోఫణావళుల్ విచ్చి దృగంచలం

బులనవీనవిషాగ్నికణంబులొల్కఁగా।నుచ్ఛలదుగ్రజిహ్వలుమహోగ్రతఁద్రిప్పుచునూర్పులంబుగాఁ।జిచ్చెగయంగఁబాటికలచెన్నివహించుదురవహింపఁడుఁడుగ్రతన్॥ క॥ కదినభుజగముగదనములు। వెలుఁగఁగవదనములవిషము వెడలఁగశిరముల్పదియలుగనడచెగరుడుండు।తదీయుకనకరుచులుగలుసుతనవలతెంక్రన్॥ వ॥ ఇట్లుహరిమూరాత్రిచేతబ్రేటువడి వెఱచిపఱతెంచికాళీయుండీగభీరంబైనమడుఁగుఁజొచ్చెనంటియు నొక్కవిశేషంబుగలదు॥ సీ॥ మున్నుసౌభరియనుమునియాప్రదంబునఁదపముచేయుచునుండధరణిలోన। నాఁకలిఁగొనిపన్నగాంతకుఁడొక నాఁడుచనుదెంచియందుమలజరచరములనొడిసిభక్షించినమన్నమీనముల్లెల్లఖిన్నంబులైవగఁగ్రస్సియున్నఁ।జూచియామునిరాజుశోకించికోపించిగరుడుఁడునేఁడాదిగాఁగనింకఁ।జొచ్చిమీనంబులనుమ్రింగఁజూచెనేనిఁ।జచ్చుఁగావుతయనియుగ్రశాపమిచ్చెఁ।గాళియుండొక్కఁడాశాపకథనెఱుంగు। నితరభుజగంబులెవ్వియునెఱుఁగవధిప॥ వ॥ అదిగారణంబునఁగాళియుండామడుఁగుఁజొచ్చినగోపజనుజరక్షణార్థంబుకృష్ణుండతనివెడలించెనిట్లుదివ్యగంధాంబరసువర్ణమణిగణమాలికాలంకృతుండైమడుగువెడలివచ్చినమాధవుంగనిప్రాణలాభంబులంబొందినయింద్రియంబులుంబోలెయశోదారోహిణీసమేతలైనగోపికలును,నందసునందాదులైనగోపకులునుమూర్ఛలంబాసితేటితెప్పఱిలిలేచిపరమానందంబులంబొందిరిబలభద్రుండుతమ్మునినాలింగనంబుచేసెనప్పుడు॥ క॥ రంకెలువైచెనువృషభము।లంకారముతోడలేఁగలట్టిట్టుఱికె।న్పొంకములనొప్పెధేనువు।లంకురితములయ్యెఁదరువులాహరిరాకన్॥ క॥ నీసుతుఁడహిచేవిడివడె।నీసురుచిరభాగ్యమహిమనిశ్చలమనుచు। న్భూసురులుసతులుదారును; భాసురవచనములనందుఁబలికిరిలేశా. శా॥ నిన్నాయుగ్రభుజంగమంబుగఱవన్నీవాపదంబొందుచు।న్నన్నేమంటితనూజమోడవుగదానాకూననాతండ్రిరా। వన్నాయంచుశిరంబుమూర్కొనినిజాంకాగ్రంబుపైనిల్పుచు।న్గన్నీరొల్కఁగఁగౌఁగిలించెదనయన్నారాబుతోఁదల్లిదాన్॥ వ॥ ఇట్లుపరమసంతోషులైఘోషజనులారేయికాళిందీతటంబుననాఁకలినీరువ

⟶ గోగోపగోపికాసంఘమునుగార్చిచ్చుచుట్టుకొనుట. ⟵

ట్టులడస్సిక్రుస్సిగోవులుందారునుండనగణ్యంబగునయ్యరణ్యంబుననొక్కదవానలంబుపుట్టిచుట్టుముట్టుకొనినడురేయినిద్రితప్రశంబైనవ్రజంబుమీఁదఁగదిసిననదరిపడిలేచిదందహ్యమానదేహులైసకలజనులునుమాయామనుజబాలకుండైనహరికిశరణాగతులైయిట్లనిరి॥ మ॥ అదెవచ్చెన్దవవహ్నిధూమకణకీలాభీలదుర్వారమై।యిదికప్పెన్మమునెల్లవారినిటమీఁదేలాసురక్షింపునీ। పదపద్మంబులుగానిమొండెఱుఁగమోపద్మాక్షరామకృష్ణమ్రొ।క్కెదమోరామమహావరాక్రమదవాగ్నిన్వేగవారింపవే॥ క॥ నీపాదంబులునమ్మిన।నాపదలెక్కడివిజనులకత్యుగ్రమహా।దీపితతాపజ్వలనము।పైఁబడకుండెడివిధంబుభావింపగదే॥ వ॥ అనిఘోషించుఘోషజనులంగరుణించియప్పద్మలోచనుండగుననంతుండనంతశక్తియుతుండైగహనంబునిండినదావదహనంబుపానంబుచేసి విజయగానంబుపదిదిశలనిగుడనంతకృష్ణుండుగోగణజ్ఞాతిసమేతుండైమందయానంబుననిండ్లకుంజనిరిట్లురామకేశవులుగోపాలవేషంబులఁగ్రీడించుసమయంబున॥ సీ॥ దినములం

⟶ గ్రీష్మఋతువర్ణనము. ⟵

తంతకుదీర్ఘంబులైయుండెదిననాథుఁడుత్తరదిశఁజరించె।నాఁడునాఁటికినెండనవ్యమైఘనమయ్యెవెచ్చనిగాడ్పులువిసరఁజొచ్చె।మేదినీరేణువుల్మింటసంకులమయ్యెనేఱులుగొలఁకులుసిగిలిపోయెఁ।బానీయశాలలఁబథికసంఘము నిల్చెఁజప్పరంబులభోగిచయముడాఁగెఁ।దరులుకుసుమచయముదళములతోవాడె।మిథునకోటికిరతిమెంపుదోఁచె।నఖిలజంతుభీష్మమైనగ్రీష్మమురాక।గలిగియడవులందుఁగేలిసలిపె॥ గీ॥ వాడిమచులుగలుగువాఁడువేఁడిమిగ్రీష్మ। కాలమందుజగముగలయఁబడియెబ్రహ్మజనులకొఱకుబ్రహ్మాండఘటమునన్నుష్ణరసముఁదెచ్చియునిచెననఁగ॥ వ॥ ఇట్లాభీలంబైననిదాఘకాలంబువర్తింపబృందావనంబురామగోవిందమందిరంబైనకతంబుననిదాఘకాలలక్షణంబులంబాసినిరంతరగిరినిపతితనిర్ఝరశీకరపరంపరాభాసితపల్లవితకుసుమితతరుతలంబయ్యును,సరులతాకుసుమపరిమళమిళితమృదులపవనంబయ్యును,బవనచలితకమలకల్హారసరోవరమహాగభీరనదీప్రవాహంబయ్యును,నదీప్రవాహకల్లోలకంకణప్రభూతపంకంబయ్యును, బంకసంజనితహరితాయమానతృణనికుంజంబయ్యును, జనమనోరంజనంబైనవసంతకాలలక్షణంబులుగలిగిలలితమృగపక్షిశోభితంబైయొప్పుచుండెనంటియునంత॥ క॥ పికములకోలాహలమును।శుకసంఘముకలకలంబుసుభగమయూర। ప్రకరముకేకారవమాళి।నికరమురొదయును జెలంగెనెట్టినయ్యడవిన్॥ క॥ ఆతతయమునాసరసీ।జాతతరంగాభిషిక్తజలరుహగంధో।పేతానిలమడఁచెనిదా।ఘాతతదావాగ్నిపీడనవ్వనములరున్॥ వ॥ ఇట్లామనికంబువతెఱంగుగల్గిసుందరంబైన బృందావనంబునకుబలకృష్ణులుగోవులరొప్పికొనిచనిగోపులుందారునునొండొరులతోనగుచుఁ, దెగడుచుఁజెలంగుచుఁ,వలంగుచు

జిఱ్ఱజిఱ్ఱందిరుగుచుఁ, దరులసందులను ఱుకుచు, దాఁగురుమూఁతలాడుచు, గీతంబులు పాడుచు, వేణునాదంబులు ఘటియించు
చు నటియించుచు, గతులు దప్పిన క్రియ నెగయుచుఁ, గుప్పలుఱుకుచుఁ, జప్పట్లు వెట్టుచుఁ, గందుకంబులఁ దట్టుచు, నుప్పరం బెగసి
దర్దురంబుల చందంబున దాఁటుచు, నామలక బిల్వాది ఫలంబుల మీఁటుచుఁ, గుటవిటపంబులు గదల్చుచు, మృగంబుల నదల్చు
చుఁ, బెరలఁ రేఁపుచు, మధుమక్షికంబుల జోఁపుచుఁ, దేనియలు ద్రావుచు, సొమ్మసిలం బోవుచు, గురుశిష్యకల్పనంబులం బను
లు సేయుచుఁ, గాకపక్షధరులై ముష్టియుద్ధంబుల డాయుచుఁ, బన్నిదంబులు చఱచుచుఁ, బులుగుల భంగి నఱచుచు బహురూ
పంబులఁ బన్నుచు నెగరి తన్నుచు సేవ్యసేవక మిత్రామిత్ర భావంబులు వహించుచు నుత్సహించుచు మఱియు ననేకవిధంబు
లఁ గ్రీడించిరంత ॥క॥ మాపాలికి బలకృష్ణులు । భూపాలకులంచు నెగరి బొబ్బలిడుచు నా । గోపాలురు మోతురు ప్రమ । దా
పాదకులగుచు వల్లికాందోళికలన్ ॥క॥ గోపకులందఱు నాడుచు । దీపింపఁగ రామవాసుదేవుల వెనుకన్ । పైకొని పాతక గా
యక । రూపంబులఁ బొగడుదురు నిరూఢాత్మకులై ॥క॥ ప్రీతిన్ గోపకులందఱు । గీతంబులు పాడఁ దరుల క్రిందను నగుచు । జేతులు
త్రిప్పుచు వెడ వెడఁ । బాతరలాడఁగ యశోదపాపం డడవిన్ ॥ మ॥ జలజాతుండును రాముఁడున్నటనముల్ సల్పంగ గోపాల
మూ । ర్తులతో వారలఁ గొల్చు నిర్జరులు సంతోషింప వేణుస్వనం । బులు గావించుచుఁ గొమ్ములూఁదుచు శిరంబుల్ద్రిప్పుచున్నా
డుచు । న్వ్రాలనొప్పన్వినుతించిరప్పుడు నటుల్ వర్ణించు చందంబునన్ ॥వ॥ ఇట్లు రామకృష్ణులు నదనదీతీరంబులఁ గొలంకుల సమీ

## శ్రీ బలభద్రుండు ప్రలంబాసురుని వధించుట. శ్రీ

పంబుల గిరులఁ జెరువుల సెలయేఱుల నడుగుల నీడల పొంతలఁ బసిమిగల కసవుజొంపంబులఁ బసులను మేపుచుండం బ్రలం
బుండను రక్కసుండొక్కరుఁడు మిగిలి గోపాలరూపంబున వచ్చి వారల హింస సేయం దలంచుచుండ నయ్యఖిల దర్శనుండగు సుద
ర్శనధరుం డెఱింగియు నెఱుఁగని తెఱంగున ॥క॥ ఆ రాముని సహజన్ముఁడు । రారమ్మని వానిఁ జీరి రాకన్నొక । న్నా రాము చేసి మె
ల్లనఁ । బోరామి యొనర్చెఁ బిదపఁ బోరిగొనుకొఱకున్ ॥ వ॥ ఇట్లు ప్రలంబునితోఁ జెలిమి సేయుచుఁ గృష్ణుండు గోపాలకులకు
నిట్లనియె ॥గీ॥ మనకుఁ బ్రొద్దు నోదు మనమిందఱము రెండు । గముల వారమగుచుఁ గందుకముల । శిలలు గుఱులు చేసి చేరి క్రీడిం
తము । రండు వలయు జయపరాజయములు ॥వ॥ అని యిట్లు పలికి తాను బలభద్రుండు పెన్నద్దలై యితర వల్లవులెల్ల నుడిపించు
కొని చిట్టుద్దలై వచ్చిన సమయంబున విభజించికొని రెండు గములవారై మార్గంబులందుఁ దృణదారుశిలాకల్పితంబులగు గుఱు
లొడ్డి కందుక శిలాది ప్రక్షేపణంబుల లక్ష్యంబులఁ దాఁక వైచి జయపరాజయ నిర్ణయంబులుగని వాహ్యవాహక లక్షణంబు
లం జేకులు చేతుల వహించి క్రీడించుచు బలరామునికి వానిచందంబు రహస్యంబున నెఱింగించి పసులం బిల్చుచు భాండీరకంబ
ను వటంబు చేరి రా క్రీడయందుఁ బిదపఁ గృష్ణుని శ్రీరామ నామధేయుండైన గోపకుండు వహించె భద్రసేనుండు వృషభు నె
క్కించుకొనియె బలభద్రుండు ప్రలంబు నారోహించె నప్పుడు ॥మ॥ వనజాక్షున్బలిమిన్బలాఢ్యుఁడు సత్త్వావగ్రస్తుండు ముమ్మిం
టికిన్ । గొనిపోఁ జాలక జిక్కెనాఁడతని నాకున్మోవ రాదంచు నా । దనుజారిన్గొనిపోఁ దలంపక వడిన్దైత్యేశుఁ డయ్యాటలోఁ
గొనిపోయెన్గిరిదాఁటి రాము నఖిల క్రూరతను యోద్ధామునిన్ ॥ వ ॥ ఇట్లు క్రీడాకల్పితవాహనుండగు నప్రలంబుండు బల
భద్రునిం గొనిపోవుచు ॥మ॥ గురుశైలేంద్ర సమాన భారుఁడగు నా గోపాలకున్మోవలే । కరయో గ్రేకము మాని దైత్యుఁడు
నరాకారంబు చాలించి భీకరదైత్యాకృతి నేఁగె హేమకటకాకల్పంబుతో రాముతో । మురువొప్పంగఁ దటిల్లతేందుయుతజీ
మూతంబు చందంబునన్ ॥ఉ॥ మోసము లేక వాని పెనుమూపున నుండుచు నా హలాయుధుం । డా సమయంబునం గనియె హా
టకరత్నకిరీటకుండలో । ద్భాసితమస్తకున్ భ్రుకుటిభాసుర దారుణ నేత్రు నుగ్రదం । ష్ట్రాసహితుం బ్రలంబు నురుశౌర్యవిలం
బుమదావలంబునిన్ ॥ కని నక్తంచరుండని యించుక శంకించి వెఱవక ॥క॥ కడువడిఁ దను వెసఁ గొనిచను । నెడ దనుజుని శిరము
పగుల నెగరి హలధరుం । డదరిపడి చటులతరమగు । పిడికిట వెసవిసిరి పొడిచె బిఱుసున నలుకన్ ॥క॥ హలధరు బలుపిడికిటిహతిఁ ।
దలవగిలిన రుధిరజలము తనువివరములం । దొలుక మొఱయిడుచు దనుజుఁడు । బలరిపుపవినిహత నగము పగిదిం బడియెన్ ॥ తర
ల॥ మేలు మేలు గదయ్య రాముఁడు మేటి రక్కసు నొక్కనిన్ । నేలఁ గూలిచె నొక్క పోటున నేఁడు విస్మయమంచు గో । పాలకు
ల్గని చచ్చి వచ్చిన భ్రాతఁ గన్న విధంబునన్ । వ్వాలదీవెన లిచ్చి రాముని సత్కరించిరి వేడుకన్ ॥ క ॥ బలవంతుఁడగు ప్రలంబుఁడు । బ
లు ముష్టిన్నిహతుఁడైన బ్రతికితిమనుచు న్బలసూదనాది దివిజులు । బలు పైఁ గుసుమముల వానఁ బరగించిరొగిన్ ॥వ॥ ఇట్లు గోప

## శ్రీ శ్రీకృష్ణుండు దావాగ్నిని మ్రింగి గోపక గోసంఘమును గాపాడుట. శ్రీ

కులు క్రీడింప గోవులంతంతం గాన్తారంబున వింతకసవులు మెసవుచు మేతవడి నెండడపికి నూరంబు చనియం దవదహనప
వనసంస్పర్శంబు సైరింపక కంపించి దప్పినొప్పు సెడి ఘోషించిన ॥ శా॥ ఆ గోపాలకులందఱున్బసులకయ్యాలిందికోమారశే

ళీగాథత్వముమానిగోఖురరదావిచ్ఛిన్నఘాసంబుతో। బాగై యున్నపథంబునన్జనిదవాపన్నంబుగాకుండవే। వేగన్గోగణమున్మరల్చిరటవీవీథిఁ జవంబొప్పఁగన్॥ క॥ జలధరగభీరరవమున। నలినదళాక్షుండుదమ్ము నామాంకములన్। బిలిచినవిని ప్రతిఘోషణ। ములు సేయుచుఁబసులుదిరిగెనుదమునననఘా॥ వ॥ అంతనవ్వనంబునదైవయోగంబునఁగాల్చిచ్చుపుట్టిచెట్టువిసరెడికరువలివలనమిన్నుముట్టమిట్టిపడిగట్టుచెట్టనకదరికొనియట్టికాలుమఁజుట్టుకొనిపరవన్గని పల్లటిల్లినయుల్లంబుల వల్లవులెల్లఁదల్లడిల్లి ప్రబలుండైనహరికిమృత్యుభీతులరీతింజక్క మ్రొక్కి యిట్లనిరి॥ క॥ అభ్రంకషధూమాయిత। విభ్రాంతమహోస్ఫులింగవిసరోగ్రశిఖా। విభ్రష్టదగ్ధలోకా। వభ్రంబై వచ్చెఁజూడుదవశిఖికృష్ణా॥ శా॥ నీచుట్టాలకునాపదల్గలుగనేనేమెల్లనీవారము। న్యాచారంబులెఱుంగమీసుఁడవుమాకాఖీలదావాగ్ని నేఁ। డేచందంబుననింకదాఁటుమముమమ్మీక్షించిరక్షింపవ। న్నాచంద్రాభవిపన్నులన్నిఖవితానచ్ఛన్నలక్ష్మిన్నులన్॥ అనినఁజేయును॥ ఉ॥ బంధుజనంబుచేతనిటుఁప్రార్థితుఁడై హరివిశ్వరూపుఁడో బంధువులారమీనయనపంకజముల్ముకుళింపుఁడగ్నిని। స్సంధినడంతునేననినఁజక్కనవారలునట్ల చేయుఁడు। న్సంధురదావపావకముఁబట్టిముఖంబునఁద్రావెలీలతోన్॥ వ॥ ఇట్లు నిజయోగవైభవంబున దావదహనంబుపానంబుచేసినిమిషమాత్రంబునగోపకులనందఱభాండీరకవటసమీపంబునకుంజెచ్చివిడిచినవారు వికసితనయనకమలులైకృష్ణునియోగమాయాప్రభావంబుననెఱిఁగలిచిచ్చువ్రగ్గననియెఱింగించుఁదమమనంబులందు॥ క॥ కార్చిచ్చార్పఁపటుత్వము। నేర్పునెవఁడోకఁడుశౌరి నేఁడిదెకార్చిచ్చార్చిమనలరక్షింపఁగ। నేర్చెనితండజుఁడోహరియొనిటలాక్షుండో॥ వ॥ అనివితర్కించిరంతఁగృష్ణుండుసాయాహ్నసమయంబునరామసహితుండైవంశనాళంబుపూరించుచుగోపజేగీయమానుండై గోష్ఠంబుప్రవేశించెనప్పుడు॥ క॥ కమలాక్షునొద్దనుండని। నిమిషముయుగశతముగాఁగనెగడినగోప। ప్రమదలుసంభ్రమమునన్। కమలాక్షునిఁజూచిముదముగనిరిమహేశా॥ వ॥ ఆసమయంబునగోపకులింట్ల కడనున్నవృద్ధకాంతాజనంబులకురామకృష్ణులచిత్రచరిత్రంబులుచెప్పినవిని వారువారినికార్యార్థులైవచ్చినవియచ్చరవరులనితలఁచి

## శ్రీ వర్షఋతువర్ణనము. శ్రీ

రంత ॥ సీ ॥ పూర్వవాయువులుప్రభూతంబులైవీఁచెఁబడమటనింద్రచాపంబుదోఁచెఁ। బరివేషయుక్తమై భానుమండలముప్పెమెఱుపులుత్తరదిశమెఱపఁదొడఁగె। దక్షిణగాములైతనరె మేఘంబులుజలచరానీకంబుసంతసించెఁ। జాతకంబులపిపాసలుకడపలఁజేరెఁగాంతారవహ్నులగర్వమడఁగె। నిజకరాళివలననీరజబంధుండు। దొల్లిపుచ్చుకొనినతోయమెల్ల। మఱలనిచ్చుచుండెమహికర్షకానంద।కందమైనవానకందువందు॥ క॥ వర్షాకాల*భుజంగుఁడు। హర్షముతోనడిచినవనఖాంకములనియు। తర్కింపభూమిసతిపైఁ। గర్షకహలరేఖలనురెగహానాంతములన్॥ క॥ చెలువుఁడుప్రావృట్కాలుఁడు। పాలసినఁబులకించుభూమిపులకములనఁగా। మొలిచితలలెత్తినిక్కుచు। సలలితగతిఁజాలువారెసస్యములనఘా॥ వ॥ మఱియుఁజటులపవనచలితంబులై పన్నిమిన్నుదన్నిలెక్కలకుమిక్కిలియై తెక్కలుగలనీలగిరులసిరులమీఱికాఱుకొని తెరపిపడకనిబిడంబులైశిశిరకిరణతరణిమండలంబులచొప్పడప్పించివిప్పుగలిగిచదలుగప్పుకొనిననీలమేఘంబులును, మేఘవిముక్తంబులైజలదసమయవిటుండుసరసగతిధరణిసతియురమ్మునదర్పించినేర్పునసమర్పించుకర్పూరఖండంబులవడువునఁబుడమిఁబడుకరకనులును గరకానుగతంబులైయసితభోగిభోగంబులచాగుననీలమణిమాలికావిశేషంబులవిధంబుననెడపడకపడుసలిలధారలును, ధారాధరవిగళితవిమలసలిలంబులందోఁగుచుమదజలాభిషిక్తమాతంగంబులసొబగుననుండుకొండలును, గొండలతుదలనుండిగండశైలంబులపైఁబడివికీర్యమాణంబులగుగిరినిర్ఝరంబులశీకరంబులును, శీకరపరంపరలచొప్పుకులుమమగులుగొనినపిదఁబిడనగుచుఁజిమ్ముచిదుమమనురొంపులును, రొంపులుగ్రొచ్చిక్రచ్చరనుచ్చలితంబులైపఱచుపఱవలవలనమెదలికదలిపాతెడిమోఁబులును, నేఱులవెంటగరులుత్రిప్పుచుగములుగొనిక్రొన్నీటికెదురునడుచుమీనంబులును, మీననయనలమేనులమెఱుంగుసొంపుపెంపుసైరింపకకంపించిసురిగితిరిగిచనియెడికరణిమేఘమధ్యంబులంబొలసిమలసిలిలువకమఱలిచనుక్రొమ్మెఱుంగులును, మెఱుంగులతెఱంగునఁదెరవలుపురుషులందగిలినిలువరనిజనులకెఱుంగనలువమొఱఁగిడినపడువున మొఱయనుఱుములు, ఱుఱుములకులికిపడకకిరుపాడుచుచుఁ, బింఛంబులుకొంచెంబులుసేయకవిప్పిదెప్పరంబుగనొప్పుచునర్తనంబులుసేయుమయూరంబులును, మయూరఘోషంబులుభీషణంబులై చెవులకసోకననూనంబులైనమానంబులనాసలుచెడియొండొరులకుంగ్రిందుపడిక్రందుకొనువిరహిజనులును, జనులకురేపుమాపునిరూపింపరాకశీమాలతీకుసుమవిసరవికసనవిదితావసానంబులగుదుర్దినంబులునుదినావసానసమయంబునమినుకుమినుకు

* భుజంగుఁడు। విటుఁడు. శీమాలతీకుసుమవిసరవికసనవిదితావసానంబులగు। జాజిపూవులగుంపులపూచుటనుదెలిపెడుతుదలుగల.

మని మెఱయుచుందిరుగు ఖద్యోతంబులును* ఖద్యోతసందర్శనంబు గోరుచును డగక విడువక గురియు జడింబడి వలిగొనివడఁకుచు నశనయత్నంబులు వర్జించి శిఖగ్జూరజంబూఫలభక్షణంబుల దేహసంరక్షణంబులాచరించు వనచరులును, వనచరానందకారిణులైన వారవిరహుణులు రుచిన నవరతభుజగ సమేతలగు కేతకులును, గేతకీకదంబ†యూథికా కుటజకుసుమపరిమళమిళితంబులగు విపినమార్గంబులును, మార్గనిరోధంబులగు ముంజెవిగిరసికంబులై పసరుటాలు గలుగుచుఁ, బద్మరాగకిరణపుంజంబుల భంగి రంజిల్లి తొంగలించుచు, జొంపంబులు గొనినక సపులును, గసవులు మెసవి ఘసమి సందనువులు సెలయవలు బఖ్ఖదుగులబసువుకదలక నిల్చి నెమరుసురనిసు ధేనువులును గలిగి, ధేనువ్రజంబులై వడిబయని కణమనోహరంబై, హరకరముభంగిఁ బరిపూర్ణసారంగభాసురంబై, సురగిరి చెలువున హరిశరాసనపిభీషణంబై, విభీషణహృదయంబు పోలికెఁబ్రకటితహరిశబ్దవైభవంబై, భవపూజనంబు చందంబున నింద్రగోపాదివిభవజనకంబై, జనకయాగంబు భాతి సీతాప్రకరణాలంకృతంబై కృతయుగంబు సొంపున బహువర్షంబులై వర్షాగమంబు వచ్చెనంత॥ క॥ హాటకప్రాలకతెవులులఁ। గూడక తగనల్లగిరులు గొనినవకములై। చూడఁగ భగ్రములగుచును। వీడెన్ సస్యంబులిడుము పీడెఁ బ్రజకున్॥ క॥ జీవనముచాలఁ గలిగియుఁ। గావరమునమిట్టిపడని ఘనుని క్రియ నదీ। జీవనములు సొరజలనిధి। ప్రావృట్కాలమున నడంచుపడియుండెన్నృపా॥ శా॥ ఆవర్షాగమమందు గోవులనరణ్యాంతంబులన్మేపుచు। న్గోవిందుండు ప్రలంబవైరియుతుఁడై గోపాలవర్గంబుతోఁ। బ్రావీణ్యంబునఁ గందమూలఫలముల్భక్షించుచున్మంజుల। శ్రీగ్రావాగ్రంబులఁ బ్రీతిఁ జల్దిగుడిచెన్గా సారలీరంబులన్॥ అసనాయంబున॥ సీ॥ విశ్వమోహనమైన వేణునినాదంబు సరసగంభీరగర్జనము గాఁగ। మహనీయనిర్మలమందహాసద్యుతిలలితసౌదామినీలతిక గాఁగ। దలఁచుట్టుబాగుగఁ దనరుపింఛపు దండ శైలభేదనుశరాసనము గాఁగ। గరుణాకటాక్షవీక్షణసుధావర్షంబు సలిలధారాప్రవర్షంబు గాఁగ। జాడ నేతెంచు గోపాలజనము నింద్ర। చాతకంబుల మురవస్థఁ జక్కఁజేసి। కృష్ణమేఘంబు బహుతరకీర్తి నెప్పె। విమలబృందావనాకాశవీథియందు॥ క॥ గోపులవృషవత్సంబుల। వాపిరిఁ బూజించి పేదపవర్షాకాల। శ్రీ చనితను బూజించెను। శ్రీ వల్లభుఁడయ్యె గోపశేఖరుఁడధిపా॥ ఇట్లు కృష్ణుండు విహితవిహారంబుల వర్షాకాలంబుఁ బుచ్చెనంత॥ క॥ జొంపములు గొనియె వనములు। రొంపులిగిరె నేలలు నిగములరోదలుడిగెనదు। ల్పెంపుల కుఁబాసెను ఘనములు। శంపలసంపదలుమానె శారదవేళన్॥ వ॥ మఱియు జీవనంబులు విడిచి విమలజ్ఞానవశంబున ముక్తులగు పురుషరత్నంబులచెన్నునఁ జెన్నువదలి మిన్నుపిడిచి వాయువశంబులై వెల్లివిరిసి చను మేఘంబులును, మేఘపటలరహితంబును, గలశభవముని సహితంబును నై విజ్ఞానదీపవిలసితంబగు యోగిహృదయంబు చందంబున శుభంబైన నభంబును, నభంబున నీలమహాలవితాన సంయుక్తముక్తాఫలంబులవడువున నెగడును డుగణంబులును, నుడుగణముయూఖంబు క్రొవ్వులు వ్రేత్తుగఁ గొనినివ్వటిల్లు మద్రప్ఫోటకరండకర్పూరఖండాయమానంబులగు చంద్రకిరణంబులును, జంద్రకిరణసమ్మర్శనంబున సగర్భంబులై భూమికి మర్షరంబులగుచు పిండిపండిహాలికకరనిశితలవిత్రధారాసంరంభంబు దలంచి తల్లడిల్లి వెలవెలకంబాఱుచుఁ దల్లియగు విశ్వంభర సుమనుకొని ప్రణతంబులై వడంకుచు నెఱుగ మొఱయిడుచున్న పెంపున సంపన్నంబులైన యెన్నుల ప్రేసున వ్రాలిగాలిం దూలుచు మర్మరధ్వనుల సారస్యంబులగు కలమాది సస్యంబులును, సస్యమంజరీపుంజంబులు గొంచక చంచువులఁ ద్రుంచి కబళించి పిల్లపెంటితండంబులం గూడి కడుపుల నిండ మెక్కి వెక్కి విరిసి చొక్కి చంద్రికలు గొనిను చ్చాత్తుంగసమంచితమంచప్రదేశంబు లెక్కి సంచరించుచు వెన్నులకావలియున్నయన్నులకె మ్మోవులు బింబఫలంబులని కఱచి తత్కరాస్ఫాలనంబులనులికిపడి యెగసిచను శుకనికరకలకలంబులును, గలహంసకోకసారసకోలాహలమండితంబులై నిండినిర్మలజలంబులు గల జలాశయంబులును, జలాశయంబుల జలములను దినముని సుడ గృహములఁ బ్రతుకుదినములు సనుట యెఱుంగని మనుజుల గమనిక దిరుగు జలచరములును, జలచరహృదయములు బెగడుగ దురడొంకియుంకిన నదులును, నదులందుఁ గల్హారమంటపంబుల లెఱుంగున, మణికుట్టిమంబుల మాడ్కిని, సౌధసోపానమార్గంబుల జాడను, విలోకితంబగు నూతనసైకతంబులును, సైకతప్రదేశంబులనుదయవేళ నిత్యకర్మానుష్ఠాననిరతులగు మునులును, మునికన్యకాకరకలశసలిలాభిషిక్తమూలంబులగు తపోవనబాలసాలంబులును, సాలవిటపివాసంతికామంజపుంజంబులెతరుచునని ముడుకొని, దినకరకిరణములమంగరు

———శ్రీ శరదృతువర్ణనము. శ్రీ———

* ఖద్యోతంబులును। మిడుగురుపురుగులును. †యూథిక। అడవిమొల్లలు. సారంగ। లేడి—చాతకపక్షి. హరిశరాసన। ఇంద్రధనుస్సు. హరిశబ్దంబై। కప్పలచప్పుళ్లుగలదై. భవపూజనంబు చందంబున నింద్రగోపాదివిభవజనకంబై॥ భవపూజనంబు చందంబునన్। శివార్చనవలె, ఇంద్రగోపాదివిభవజనకంబై। ఇంద్రరక్షణము మొదలయిన విభవకారణమై—పట్టుపురుగులు మొదలగు పురుగులు పుట్టుటకు కారణమై. శరకములు। వడిగండ్లు. ... సారలీరంబులన్। గుంటగట్టులందు.

వలి కింజోరవెఱవుపడనివనములును, వనములందరులకొమ్మలనాకలంబులు నేకలంబులై మెసంగినసరుకపిసిఁ ద్రొవ్వి ద్రొమ్ములకొనలనూఁదియేటికరులు ద్రవ్వి చిమ్మి క్రుమ్మి కోరాడెడి వనగజంబులును, గజకుంభకనకకుంభరుచిరకుచభారభీరుమధ్యసమంచితలగు చెంచితలును, జెంచితల క్రొమ్మరమ్ములగు వాలమ్ములసారమ్ములు చెడి, బెడిదంబునఁ బాదంబులు దొట్రుపడఁ, బెను గాఢంబులఁ బడువరాహపుండరీకంబులును, బుండరీకకుముదకురంటకాది కుసుమమకరందంబు గ్రోలి తేలిసోలి వ్రాలి మహాహంకృతులఁ ఝంకృతులు సేయు తేఁటికదుపులును, గదుపులంగలయక యెడగలిగి మదమున నదనుపడ నెఱింగి మననమార్గణప్రేరితంబులై పెంటితుటుముల వెంటంజని, యొండొంటి గెంటించుచుఁ దగుల నెక్కి గర్భంబులు నెక్కొల్పున్ప్రవృషభరాజంబులును, గలిగి రాజరాజగృహంబు పగిది విలసితకుందపద్మసౌభాగ్యంబై, భాగ్యహీనుకర్మంబు రేఖన శ్రుతనీలకంఠశబ్దంబై, శబ్దశాస్త్రవేదిహృదయంబు చాడ్పున విశదప్రకాశాభిరామంబై, రామసంగ్రామంబుకైవడి *బాణాసనాలంకృతంబై కృతాంతహృదయంబుకరణి నపంకంబై పంకజాసనుగేహంబు సొంపున రాజహంసవిరాజమానంబై మానధనుని చరిత్రంబు సొబగున నకల్మషజీవనంబై, వననిధి పోలువున సమ్మిళితభూభృద్వాహినీసంకులంబై, కులవధూరత్నంబు చెలువున నదృష్టపయోధరంబై, ధరణికిం దొడవగుచు శరత్కాలంబు వచ్చె నంత॥ క॥ రాజులశశినీ రాజనములు। రాజుల జయగమనములును రాజితలక్ష్మీ। పూజలు దేవోత్సవములు। రాజిల్లెను జగతియందు రాజకులేంద్రా॥ క॥ చాగగల చెలుకువింటను। బాగుగ నీలోత్పలంబు బాణంబుగ సం। యోగంబు చేసి మదనుఁడు వేగంబున విరహిజనుల వేఁటాడె నెఱిన్॥ వ॥ ఇట్లు భాసురంబైన శరద్వాసరంబుల గోవిందుండు గోబృందసమేతుండై బృందావనంబున నంబసులఁ బొసంగ మేపుచు॥ సీ॥ కర్ణావతంసితకర్ణికారప్రభ గండభాగద్యుతిఁ గడలుకొలుప। భువనమోహనమైన భ్రూవిలాసంబుతో వామభాగానతవదన మొప్ప। నపసవ్యకరరమ్యమలాంగుళీచాతురి వడ్డ్వనికిమర్మసరణిఁ జూప। డాకాలిమీఁద నడ్డముసాఁచి నిల్పినపదనఖద్యుతి భూమి ప్రబ్బికొనఁగ। మౌళిపింఛముకంఠదామమున మెఱయ। విలసితగ్రామముగ నొక్క వేణువందు। బ్రహ్మగాంధర్వగీతంబు పరగఁ జేసె। జతురనటమూర్తి గోపాలచక్రవర్తి॥ వ॥ ఇట్లు హరి వేణునాదంబు పూరించిన మారవికారహేతువగు తద్గీతంబు చాలించి సిగ్గులుసాలించి మక్కువలు చెక్కలొత్త గోపికలోపికలులేక తమతమపొత్తుకత్తెలుం దారును దత్తరంబునఁ బసురు నేసురుం దుటుములుగొని జిలిబిలిముచ్చటలకుం జొచ్చితమలోన॥ మ॥ శ్రవణోదంచితకర్ణికారములతో స్వర్ణాభచేలంబుతో। నవతంసాయితకేకిపింఛములతో నంభోజదామంబుతో। స్వవశుండై మధురాధరామృతము చే వంశంబుఁ బూరించుచు। న్నవిదా మాధవుఁ డాలవెంటవనమందొప్పారెడిఁ జూచితే॥ శా॥ రావే సుందరి యేమె బోఁటి వినవే రాజీవనేత్రుండు బృందావీథిం దగ వేణువూఁదుచులసత్సవ్యానతాస్యంబుతో। భ్రూవిన్యాసములం గుళీక్రమములం బొల్పారషడ్జంబు గాఁ। గావించె న్నటు భంగి బ్రహ్మము గదద్గాంధర్వసంగీతముల్॥ క॥ తలఁకెను గొబ్బునఁ జిత్తము। నలినాక్షుని మధురవేణునాదము నా వీనులు సోఁకిన యంతమాత్రన। చెలియా యిఁక నేటి వెఱపు చింతింపఁగదే॥ క॥ నాతోడ వెఱవవల దే। నాతోడనె గోనుచుఁ బోయినలినదళాక్షు। నీతో డుతఁ బలికించెద। నీతోడి జనంబు మెచ్చ నీతో డుసుమీ॥ వ॥ అని పెక్కుభంగుల నోర్తోర్తు నుద్దేశించి పలుకుచు గోపసుందరులు బృందావనంబునకు గోవిందున కెదురుచని పరమానందంబున నతని నిజమనంబులఁ బ్రతిపదంబును నాలింగనంబు చేసినవారలగుచు రామకృష్ణులను ద్దేశించి॥ మ॥ నవగోష్ఠానకరంగమందుఁ బరమానందంబుతోఁ జూడఁ బల్లవనీలోత్పలపింఛపద్మదళమాలావస్త్రసంపన్నులై। కవలై వేణువులూఁదుచున్నృహనటాకారంబుల న్గేళిత్రాం। డవము శ్శేసెదరీకుమారకులు వేడ్క న్గామినుల్గంటిరే॥ క॥ ఓ చెలువలార వినుఁడీ। వాచాశతకంబు లేల వర్ణింపంగా। లోచనములకలిమికిఫలం। మీ చెలువుగఁ జూడఁగలుగుటింతియసుండీ॥ అనిపలికి రొందుఁగొందఱు గోవిందు నుద్దేశించి॥ మ॥ ఒనర న్వ్రేతలకించుకేనియును లేకుండంగ గోపాలకృష్ణుని కెమ్మోవిసుధారసంబు గొనుచున్ జోద్యంబుగా మ్రోయుచున్। దనపర్వంబులు నేత్రపర్వములు గాదర్పించెఁ బూర్వంబున। న్వనితా యెట్టితపంబు చేసెనొకొ యీ వంశంబు వంశంబులోన్॥ మ॥ ముదితామేతటినీపయగ్గకణములన్మన్వేణువింతయ్యెనా। నదిసత్పుత్రునిఁ గన్నతల్లిపగిదిన్నందంబుతో నేఁడు సమ్మదహంసధ్వనిపాటగా వికచపద్మశ్రేణి రోమాంచమై। యొదవన్ మంగీతరంగహస్తనటనోదద్యోగంబుగా వింపదే॥ క॥ నలినోదరుభక్తునిఁ గని। కులజులు నందాశ్రుజలము గురియుతెఱఁగున్ మ్రాఁ। కులు పూదేనియలాలి కెడు। నలినాక్షుని చేతివంశనాళము మ్రోఁతన్॥ శా॥ నా మోసంబున కెద్ది మేర విన వే నాపూర్వజన్మంబులన్। లేమా నోములు నోఁచుచో నకట కాళిందీతటి

* బాణాసనాలంకృతంబై। వింటిచేతనలంకరింపఁబడినదై, బాణ। నల్లపువ్వులగోరంటలచేత - లేక - పచ్చపువ్వులగోరంటలచేత, అసన। వేగిస్రానులచేతను, అలంకృతంబై। కైసేయఁబడినదయి, పయోధర। మేఘము - స్తనము, శశినీరాజనములు। ఆరతులు.

న్వేణువై। భూమిన్బుట్టెదనంచుఁ గోరఁదగదే బోధిల్లి యెట్లైననీ। బామందిప్పుడు మాధవాధరసుధాపానంబు గల్గుంగదే॥ క॥ కాళిందీకూలంబున। నాళీయానందతనయు నధరామృతముల్। గ్రోలెడి వేణువు నగునో। మేలాగున నోమ వచ్చు నెఱిగింపఁగదే॥ క॥ వనితా కృష్ణుఁడు నల్లని। ఘనమనియు న్వేణురవము గర్జనమనియున్। మనమునఁదలంచి రొప్పుచు। ననవరతము నెమ్మలి తుటుములాడెడిఁ గంటే॥ క॥ *గిరిచరమిథునములోలిన్। బరికింపఁగఁ గృష్ణపాదపద్మాంకితమై। సురరాజునగరికంటెను దరుణీ బృందావనంబు తద్దయు నొప్పెన్॥ మ॥ అమరేంద్రాంగనలాకసంబున విమానారూఢలై పోవుచున్। గమలాత్రున్నభమూర్తిఁ గాంచి మురళీగానంబు లందందఁ గర్ణములన్నిల్పుచు మేఖలల్వదలఁగా నాథాంకమధ్యంబులన్। బ్రమదాప్రాళిరి చూచి తేవివశలై పంచాశుగభ్రాంతలై॥ ఉ॥ కానలనుండు చున్నరసగానవివేకవిహీనజాతలై। వీనులనేఁడు కృష్ణముఖవేణురవామృతధారసోకిన। న్మేనులు మేతలున్మఱచి మెత్తని చూడ్కి మృగీవ్రగావళుల్। ల్మానిని చూడవమ్మ బహుమానము చేసెఁ గృతార్థచిత్తలై॥ ఉ॥ తల్లులచన్నుబాలుమును ద్రావుతఱిన్ దమకర్ణవీథుల। న్వల్లభమైన మాధవుని వంశరవామృతధారచొచ్చినన్। మ్రుల్లకపాలు రాదివక దూఁటక మానక కృష్ణుమీఁద దృ। గ్వల్లులు చేర్చి నిల్చెన దవత్సములంగనలార గంటిరే। మ॥ మమతన్మేములు నీఁది కెత్తుకొని §రోమంథంబు సాలించి హృ। త్కమలాగ్రంబులఁ గృష్ణునిల్పి మురళీగానామృతశ్రేణికఁ గర్ణములన్ గ్రోలుచు మేతమాని గలితానందాశ్రులై చిత్రితో। పమలై గోవులు చూచుచున్నవది గోపద్మాక్షి వీక్షించితే॥ మ॥ జగతీజంబుల శాఖలెక్కి మురళీశబ్దామృతస్యందము। న్మిగులన్వీనులఁ ద్రావి ద్రేఁగుపడి నెమ్మిం గృష్ణురూపంబు చి। త్తగమై యుండఁగ నడ్డపెట్టు క్రియ నేత్రంబుల్ దగన్మూసి యీ। ఖగముల్ పొక్కెడిఁ జూచితే మునిజనాకారంబులం గామినీ॥ మ॥ క్రమమొప్పన్నదులెల్ల వంశరవమాకర్ణించి సంజాతమో। హములన్మన్మథసాయకక్షతవిశాలావర్తలై హంసవా। క్యములం జీఱితరంగహస్తముల నాకర్షించి పద్మోపహా। రములన్ గృష్ణపదార్చనంబు సలిపెన్రామా విలోకించితే॥ గీ॥ వనిత నేఁడు కృష్ణు వంశనినాదంబు। వినిపయోధరంబు పిరులు గుఱిసి। తనశరీర మెల్లధవళాతపత్రంబుఁ। జేసి మింటనీడఁ జేసెఁ గంటే॥ క॥ మంచిఫలంబులు హరి చే। నించిక రాలంబనముల నెగడుచు నిడెక్రీడించెదరంగన చూడుము। చెంచితలం బింఛపత్రచేలాంచితలన్॥ క॥ ఉల్లసితకుచభరంబుల। నల్లాడెడి నడుముతోడ నలరుల దండశ్రీ। ¶ల్చిల్లి యొకతె హరికిచ్చెను। హల్లోహలకలితయగుచు నంగనకంటే॥ క॥ గిరులెల్ల జలములయ్యెం। దరులెల్లను బల్లవించె ధరణిగగనభూ। చరులెల్లను జొక్కిరిహరి। మురళీరవామృతము సోఁకి ముద్దియకంటే॥ మ॥ బలకృష్ణాంఘ్రిసరోజసంగమము చే భాసిల్లుచు న్ధన్యమై। ఫలపుష్పంబులఁగానుకల్గురిసి సంభావించి మిన్నంచుచున్। జలఘాసంబుల గోవులందనిపి చంచద్భూజరోమాంచమై। వెలసెన్జూడఁగదమ్మ యీగిరిపురోపీథిన్సరోజాననా॥ వ॥ అని యిట్లు బృందావనవిహారి యైన గోవిందుని సందర్శించి పంచబాణభల్లభగ్నహృదయలై వల్లవకాంతలేకాంతంబులఁ జింతించుచుఁ దత్పరతంత్రలై యుండిరంత॥ క॥ శామంతికాస్రగంచిత। సీమంతవతీకుచోష్ణజితశీతభయ।

## ॥ హేమంతఋతువర్ణనము. ॥

శ్రీమంతంబై గొబ్బున। హేమంతము దోఁచె మదనుఁడేఁచె విరహులన్॥ క॥ ఉత్తరపుగాలి విసరెవి। యత్తలమునఁ దుహినకిరణుఁడహితుండయ్యెన్। బొత్తుజరిగె మిథునములకు। నెత్తమ్ములు దఱిగె హిమము నెలకొనియె నృపా॥ క॥ ‡అహములు సన్నములయ్యెను। దహనము హితమయ్యె దీర్ఘదశలయ్యె నిశల్। బహుశీతోపేతంబై। యుహుహూయనివడఁకె లోకమూర్వీనాథా॥ క॥ అన్నులచన్నులదండవి। పన్నులుగాకెల్లవారు బ్రతికిరిగాకీ। చన్నులమీఱిన చలినా। పన్నులుగాకుండఁదరమె బ్రహ్మాదులకున్॥ గీ॥ పొడుపుకొండమీఁద పొడిచిందిమొదలుగాఁ। బఱువుఁబెట్టి యినుఁడు పశ్చిమాద్రి। మఱుఁగుఁజొచ్చెఁగాక నుసలిన చలిచేతఁ। జిక్కెఁ జిక్కెననఁగఁ జిక్కకున్నె॥ క॥ చెంగల్వవిరులగంధము। మంగళముగఁ గ్రోలుచున్న మధుపములొప్పె। న్నంగజవహ్నులపైను। ప్పొంగి విజృంభించు పొగలపోలికెనధిపా॥ గీ॥ శంభుకంట నొకటి జలరాశి నొకటి। మఱియు నొకటి మనుజమందిరములనొదిగెఁగాక మెఱసియున్నమూఁడగ్నులు। చలికినోడి భక్తిసలుపకున్నె॥ శా॥ ఈ హేమంతమురాకఁ జూచి రసణీహేలాపరీరంభస। త్సాహాయ్యంబునఁ గానిపీనిఁ గెలువన్శక్యంబు గాదంచుఁదా। రూహాపోహవిధింద్రిమూర్తులు సతీయుక్తాంగులై నారుగా। కోహోహో వారల దేమిసంతతవధూయోగంబు రాఁగందురే॥ క॥ ఈ హేమంతమురాకకు। శ్రీహరియొక్కింతవడఁకి చింతింపంగా। నోహోహో వెఱవకుమనుచు। న్నాహరికిని శ్రీకుచంబులభయంబిచ్చెన్॥ వ॥ ఇట్లుని తాంతంబగు హేమంతంబున మొదలినెలతొలిదినంబునందు నందునిమందఁ గలగోపకుమారికలు రేపకడలే

---

* గిరిచరమిథునములు। వజ్రరేఖలయొక్క జంటలు. § రోమంథంబు। నెమరుఁబెట్టుటను. ¶ ఝిల్లి। ఎలుకది, హల్లోలహలకలితయగుచున్। ప్రీతితోఁగూడుకొనినదయి. ‡ అహములు। పగళ్లు-దివసములు.

ంచని కాళిందీజలంబులందోఁగి జలతీరంబున నిసుముసం గాత్యాయనీరూపంబుఁ జేసి సురభికుసుమగంధంబులిడి ధూపదీపంబులిచ్చి బహువిధోపహారంబులు సమర్పించి ॥ క ॥ ఓ కాత్యాయని భగవతి! నీకును మ్రొక్కెదము మేము నేఁడనుకంప న్నాకిందనువైళము శ్రీకృష్ణుఁడు మగఁడుగాఁగఁ జేయుము తల్లీ ॥ క ॥ ఓ తల్లి మాకుఁ గృష్ణుఁడు । చేతోవిభుఁడైన నాఁడు చెలువలమెల్ల న్నేతివసంతములాడుచు । జాతరఁ జేసెదము భక్తి చాతురితోడన్ ॥ వ ॥ అని నమస్కరించి హవిష్యంబులు గుడుచుచుని

## గోపికావస్త్రాపహరణము.

ష్ఠితంబున మాసవ్రతంబు సల్పిరందొక్క నాఁడు ॥ మ ॥ రమణుల్ ప్రొద్దున మేలుకాంచి సఖులన్ రండంచు వాత్సీయనా । మములం జీరుచు చద్దియాభరణముల మ్మాధ్యంబుల ల్లాడఁగాఁ । బ్రమదోద్దామగజేంద్రయానలగుచున్ బద్ధాత్ముని న్బాడుచున్ । యమునాతీరముఁ జేరఁబోయి రిగృహీతాన్యోన్యహస్తాబ్జలై ॥ వ ॥ ఇట్లా నదీతీరంబు చేరం జని గజగమనలు విజనప్రదేశంబున వలువలు విడిచి విడివడి దిశంక లేక యకలంకలై గ్రుంకులిడఁ జలంబున జలంబు సొచ్చి ॥ క ॥ వారిజలోచనుఁ బాడుచు । వారిజలోచనలు వారివారికి వేడ్కన్ । వారివిహారము సలిపిరి । వారివిహారములు జగతి వారికిఁ గలవే ॥ ఆసమయంబున ॥ క ॥ తోయజనయనలు యమునా । తోయములందుండ నెఱిఁగి దూరగుఁడయ్యుం । దోయజనయనుఁడు హరి తన । తోయము గోపకులు దానుఁ దోతెంచె నృపా ॥ తరల ॥ కదలక వుండని తోడి వారలఁ గన్ను సన్నల నిల్పుచున్ । బదముల్ మెల్లన నేలఁ బెట్టుచు బ్రహ్మనేత్రుఁడు మానినీ । పాదలమాటున నల్ల నల్లనఁ బొంచి పొంచి నతాంగుఁడై । యదను గోరుచు డాసి వ్రేతల యంబరంబులు దొంగిలెన్ ॥ ఇట్లు దొంగిలి ॥ శా ॥ ఉన్మద్గంధగజేంద్రగౌరవముతో యోషాంబరంబుల్ విభుం । డామ్యం దర్పకుభంగి నర్థమలతో హాసార్థియై కొంచు దన్న ద్యంభ గ్రికణశీతవాతజనితానందంబుతో నెక్కెఁ దా । సద్యోముక్తమరంతపాదపజనస్సంతాప మన్నీపమున్ ॥ అప్పుడయ్యింతులిట్లనిరి ॥ క ॥ * మా మా వలువలు ముట్టకు । మా మాకొని పోకు పోకు మన్నింపఁ దగున్ । మామాన మేల కొనియెదు । మామానసహరణ మేల మానుము కృష్ణా ॥ సీ ॥ బహుజీవనము తోడ భాసిల్లియుండుటో గోత్రంబు నిల్పుటో ఘూర్మితోడ । మహిసుద్ధరించుటో మనుజసింహంబవై ప్రజలఁ గాచుటో కాకబలిఁ జెరల్చి । పిన్నవై యుండియుఁ బెంపువహించుటో రాజుల గెల్చుటో రణములోన । గురునాజ్ఞ సేయుటో గుణనిధివై బలప్రఖ్యాతిఁ జూపుటో భద్రలీల । బుధులు మెచ్చ భువిఁ బ్రబుద్ధత మెఱయుటో । కలికితనము సేయఘనత గలదె । వావి లేదు వారివారును వారని । యెఱుఁగవల దెవలువలిమ్ము కృష్ణ ॥ క ॥ కొంటివి మాహృదయంబులు । గొంటివి మామానములజ్జఁ గొంటివి వలువల్ । గొంటివిక నెట్లు చేసెదొ । కొంటెవు గదనిన్ను నెఱిఁగి కొంటిమి కృష్ణా ॥ సీ ॥ రాజసంబున నీపురంజిల్లు తెరుగమే చెలరేఁగి వింతలు సేయుచుండ । సత్త్వసంపద గల్గి జరగుటఁ దలఁపమే సిరిగల్గి యన్యులఁ జెనఁకుచుండ । గుణతరశక్తి యుక్తుఁడవౌటఁ జూడమె తామసంబున నెగ్గుదలఁచుచుండ । నొకభంగితో నుండకుంటఁ జింతింపమె మాయావివైన మాయముపలయుచుండ । నేమి జాడవాడ వేపాటి గలవాఁడ । వేగుణంబు నెఱుఁగ వెల్ల యెడల । నెదిగి యుండ నేరవో రెంత ప్రాజ్ఞుసు । బటమలీగ దయ్యాపద్మనయన ॥ క ॥ రాజుల నెఱుఁగవు బలిమిని । రాజిల్లెదు దీరలీవు రమణుల మింక । రాజున కెఱిఁగించెదమో । రాజీవదళాక్ష నీవు రాజవె ధరణిన్ ॥ వ ॥ అని పలికిన కన్నియలపలుకులాలించి మందహాససుందరవదనారవిందుండై గోపాలబాలకులకరంబుల గరంబులు వ్రేసి యమ్ముద్దియలనుద్దేశించి నెవ్వాదిచతురుండిట్లనియె ॥ శా ॥ రాముల్ ప్రాణులతోడ నీపనికి రాఁగా రింతు రేమీ క్రియల్ నోమా లేమియు లేక దూఱెదరు మీమోసంబు చింతింపరం । భోమధ్యంబుననుండి వెల్వడి వెసన్ పొర్ణెందుబింబానన । ల్మీ మీ చీరెలు వచ్చి పుచ్చుకొనుఁడా మీకిచ్చెదం జెచ్చెరన్ ॥ వ ॥ అనిన నమ్మానవతులొండొరుల మొగంబులు చూచి నగుచు మర్మంబుల నాఁటిన మాటలకు నగుడంబులు కసిగ్గువడుచు నగ్గలంబైన చలి నివలిగొని కంఠప్రమాణజలంబులందుండి డోలాయమానమానసలై యిట్లనిరి ॥ క ॥ మా వలువలు లాఘవమున । నీవేటికిఁ బుచ్చుకొంటి నీవల్పుఁడవే । నీ వెఱుఁగనిదేమున్నది । నీవిందఱిలోన ధర్మనిరతుఁడవు గదే ॥ శా ॥ ఇంతుల్ డోయము లాడుచుండ నగవారే తెంతు రేవచ్చిరా । యింత ల్సేయుదురే కృపారహితులై యేలోకమందైన నీ । నింతల్ నీతలఁ బుట్టెఁగాక మఱి యేమీ కృష్ణ యోచల్లనీ । చెంతన్ దాసులమై చరించెదము మా చేలంబు లిప్పింపవే ॥ క ॥ వచ్చెదము నీవు పిల్చిన । నిచ్చెదమే మైనఁ గాని నెటుచౌరుమునిన । జ్జొచ్చెదము నేఁడు వస్త్రము । లిచ్చి మముంగరుణతోడ నేలుము కృష్ణా ॥ అనిన దరహాసితవదనుండై హరి యిట్లనియె ॥ క ॥ ఏతరుణుఁడు మగఁడౌటకు । మీ తపములు చెప్పుడింక మీయానలసుం । డీ తప్పిన మీకూరిమి । మీతలల నెపుఁ బెట్టెనో టు మేదినిలేదే ॥ క ॥ ఎవ్వనిఁ గని మోహించితి । రెవ్వఁడు మీ మానధనము లెల్ల హరించె । న్నివ్వటిలె మీకుఁ గూరిమి । యెవ్వని పైఁ బలుకరాదె యేమన్నుఁడ నే ॥ వ ॥ అనిన విని సుందరులన్యోన్యసందర్శనంబులు సేయుచు హృదయారవిందంబులఁ

* మామా వలువలు ముట్టకుమా ॥ మా యొక్క — మా యొక్క — వస్త్రములను తాఁకకుమీ । కొని పోకు పోకుమా — తీసికొని పోవలదు వలదు సుమీ.

గంధర్వుండు సంపడింపనగుచు నిరుత్తరలై యున్న లోకోత్తరుండిట్లనియె॥క॥ నాయింటికి దాసులరై। నాయాజ్ఞవహించిమీ రునడిచెదరేనిన్। మీయంబరంబులిచ్చెద। తోయంబులు వెడలి రండు తొయ్యలులారా॥ అనినవిని హరివచ్యలు చలికి వెఱచి సలిలమధ్యంబున నిలువనోపక॥క॥ కొందఱు వెడలుదమందురు। కొందఱు వెడలుటయ సిగ్గుఁగొను గోవిందుం। డందఱు కొందఱుదమలోఁ। గొందలమందుచు వడఁకుఁగొని మనుజేంద్రా॥వ॥ మఱియు నెట్టకేలకుఁ జిత్తంబులు గట్టిపఱచుకొని తనుమధ్యలు తోయమధ్యంబు వెలువడి॥క॥ చంచత్పల్లవకోమల। కాంచననవరత్నఘటితకంకణరుచిరో। సంచితకరసంఛాదిత। పంచాయుధగేహలగుచుఁ బడఁతులు వరుసన్॥వ॥ చని ప్రౌఢలైన సుందరుల ముందఱనిడుకొని మందగమనలు మందహాసంబుతోడ నెదుర నిలిచిన నరవిందనయనుండిట్లనియె॥సీ॥ శృంగారవతులార సిగ్గేల మిముఁ గూడి పిన్ననాఁటను గోలెఁ బెరిగినాఁడ। నెఱుఁగనే మీలోన నెప్పుడు నున్నాఁడ నేనుచూడని మర్మ మెద్దిగలదు। వ్రతనిష్ఠలై యుండి వలువలు గట్టక నీరుచొత్తురె మీరు నియతిఁ దప్పి। కాత్యాయనీ దేవిఁ గల్ల సేయుటగాక నీరీతి నోము వారెందుఁ గలరు। వ్రతముఫలము మీరు వలసినఁ జక్కఁగఁ। నింతులెల్లఁ జేతులెత్తి మ్రొక్కి। చేరిపుచ్చుకొనుఁడు చీరెలు సిగ్గువో। నాడనేల మొగ్గలాడ నేల॥ అనినవిని మానవతులు తమలోన॥ను॥ వ్రతము సేయుచు నొక్కమాటయిన నెవ్వానినివ్విచారించిన। న్వ్రతభంగంబులు మానునట్టివరపున్వామాతులీక్షించియు। న్గతచేలాప్లవనంబు నేఁడు వ్రతభంగంబంచు శంకించిరో। లతటన్యస్తకరాబ్జలై సరసలీలన్ మ్రొక్కిరట్లందఱున్॥క॥ బాలలకు హస్తకీలిత। ఫాలలకు నితాంతశీతపవనాగమనా। లోలలకు నంబరములుగ్ర। పాలుఁడు హరియిచ్చె భక్తపాలకుఁడగుటన్॥గీ॥ చీరెలపహరించి సిగ్గులు విడిపించి। పరిహసించినైనఁ బరగమనకు। ఘనుఁడు నోముకొఱఁతగాకుండ మ్రొక్కించె। ననుచు హరినుతించి రబలలెల్ల॥క॥ ఉల్లములు నొవ్వనాడినఁ। గల్లలు చేసిననునగినఁ గలఁచిననైనన్। వల్లభులు సేయుకృత్యము। వల్లభలకు నెగ్గుగాము వల్లభమతిపా॥వ॥ ఇట్లు హరివలువలిచ్చినఁ గట్టుకొని సతులు తనియందు బద్ధానురాగలై యుచ్చరింపక రెప్పలిడక తప్పక చూడ నాప్రౌఢ మెఱింగి చేరి వారికిట్లనియె॥సీ॥ లక్షణవతులార లజ్జించి చెప్పరు గాని మీమర్మముల్గానఁబడియె। ననుఁగొల్వఁజింతించినారు నాచేతను సత్యంబు మీనోము సఫలమగును। గామితార్థంబుల కలిమి సెప్పఁగ నేల ననుఁగొల్వ ముక్తికి నడువవచ్చుఁ। గడమకూడఁగ నంబికాదేవినోమంగనట మీఁద రాత్రులయందు మీకు। నన్నుఁ బొందఁగల్గును సమ్మి పొండని హరి। సల్క నింతులెల్ల భ్రాంతిఁ జనిరి। తపము పండెననుచుఁ దత్పదాంభోజము। ల్మానసించికొనుచు

శ్రీ మునిభార్యలన్నముఁదిసికొనివచ్చి శ్రీకృష్ణున కారగింపుసేయుట. శ్రీ

మందకడకు॥వ॥ ఇట్లు గోపకన్యకలం బ్రసన్నుండై గోవిందుండు బృందావనంబు దాఁటి దూరంబున ధేనువుల మేపుచుండఁ జండకిరణుని యెండఁబడి వండి చెడి తరులదండనండఁగొనుచు నాతపత్త్రాకారంబులై నీడలు సేయుచున్న వృక్షంబులఁ నీక్షించి కృష్ణబలశ్రీరామదేవ ప్రశస్థవిశాలార్జునప్రముఖులకుం దక్కిన గోపకులిట్లనిరి॥మ॥ అపకారంబులు సేయ వెవ్వరికి నేకాంతంబులం దుండు నాతపశీతానిలవర్ష వారకములై త్వగ్గంధనిర్యాసభ। స్మపలాశాగ్రమరందమూల కుసుమచ్ఛాయాఫలశ్రేణిచే నుపకారంబులు సేయు నర్థులకు నీయుర్వీజముల్గంటిరే॥వ॥ అని చిగురాకు పువ్వు కాయ పండుతండంబుల వ్రేఁగున వీఁగిన తరువులనడిమి తెరువులం బసులఁ దాఁటులదాఁటించి యమునకుం జని వెడఁదమడుగుల మెల్లనఁ జల్లని నీరుఁ ద్రావించి తత్సమీపంబున మేపుచు వల్లవులెల్ల మూఁకలుగొని యాఁకలిగొంటిమని విన్నపించినఁ దనకు భక్తురాండ్రగు విప్రభార్యలవలనం బ్రసన్నుండై వారలం జూచి రామసహితుండై నహరియిట్లనియె॥సీ॥ వల్లవులార యీవనమున విప్రులు బ్రహ్మవాదులు దేవభవనమునకు। నరుగుటకాంగిరసాహ్వయసత్త్రంబు సల్పుచున్నారు సనుఁడు మీరు। మానామములు సెప్పి మైత్రితో నడిగిన నన్నంబుఁ బెట్టెదరనుచుఁ బలుక। వారలుచని విప్రవరుల కెల్లను మ్రొక్కి పసుల మేపుచు బలభద్రకృష్ణు। లలసి పుత్తెంచిరి టమ్ము నన్నమడుగ। ధర్మవిదులార యర్థిప్రదాతలార। పెట్టుఁడన్నంబు శ్రాంతులఁ బిలిచి తెచ్చి। పెట్టుదురుగాదె మిముఁబోటి పెద్దలెల్ల॥క॥ ఘనదీక్షితునకు నైనం। జనుఁగుడువఁగ బశువధంబు సౌత్రామణియుం। జనిన వెనుక దోషము లే। దనఘాత్మకులార పెట్టుఁడన్నము మాకున్॥ అని గోపకులు వలికిన॥మ॥ క్రతువున్మంత్రము తంత్రము న్ధనములు న్గాలంబు దేశంబు దే। వతయున్ధర్మము నన్యముల్దలఁప నెవ్వాఁ డట్టి సర్వేశ్వరు। న్మతి నూహింపక గోపబాలుఁడనుచు న్మందస్థితిం జూచి మూర్ఖులై యన్నము లేదు లేదనిరి సన్మానక్రియాశూన్యులై॥వ॥ అంత గోపకులు నిరాశులై వచ్చి యెఱింగించిన హరి లౌకికానుసారియగుచు మీర య్యార్యులనడుగక వారి భార్యలకు మా రాకఁ జెప్పుఁడన్నంబు వెట్టెదరని పంచిన వారుఁ జని బ్రాహ్మణసతులదర్శించి నమస్కరించి సంపూజితులై యిట్లనిరి॥క॥ గోవుల మేపుచు నాఁకొని। గోవిందుం డన్నమడిగికొనిరండనిమ। మ్మీ వేళను బుత్తెంచెను। ధీవిలసితలార రండు తెండన్నంబుల్॥వ॥ అనిన విని గోవిందసందర్శన కుతూహలలై త

ర. శీసురసుందరులు సంభ్రమానందంబులు డెందంబుల సందడింప భక్ష్యభోజ్యలేహ్యచోష్యపానీయభేదంబులం గలిగి సం
స్కారసంపన్నంబులైన యన్నంబులు కుంభంబుల నిడికొని సంరంభంబుల సముగ్రంబునకు నడుచు నదుల తెఱంగున॥ క॥ బి
డ్డలు మగలును భ్రాతలు। నడ్డము చని వలదనం గనటు దలఁడని మా। యొడ్డుచు జగదీశ్వరునకు। జడ్డన నన్నంబు గొనుచుఁ జని
రా సుదతుల్॥ వ॥ చనియమునా సమీపంబున నవపల్లవాతిరేకంబును విగతవనచర శోకంబునైన యశోకంబు క్రిందనిర్మలస్థ
లంబున॥ సీ॥ ఒక చెలికాని పైనొక చెయి చాఁచి వేఱొక చేతలీలాబ్జమూను వానిఁ। గొప్పనకందనికొన్ని కుంతలములు చెక్కు
లనృత్యంబు సేయు వానిఁ। గుఱుచ చుంగులు పుచ్చికొమరారఁ గట్టిన పసిఁడివన్నియగల పటమువాని। నొదలఁ దిరిగి రానలవ
డఁ జుట్టిన దట్టంపు శిఖిపింఛ దండవాని। రాజితోత్పలకర్ణపూరముల వాని। మహితపల్లవపుష్పదామముల వాని। భువన
మోహననట వేషభూతి వానిఁ। గనిరి కాంతలు గన్నుల కరువుదీఱ॥ క॥ కనిలోచనరంధ్రంబుల। మునుమిడి హరిలలితరూపము
నులోఁ గొని నెమ్మనములఁ బరిరంభించిరి। తనుమధ్యలు హృదయజనిత తాపము వాయన్॥ ఇవ్విధంబున॥ క॥ వారితసర్వస్పృ
హలై। వారం దఱు తన్నుఁ జూడ వచ్చుట మదిలో। వారిజనయనుఁడు వొడగని। వారికినిట్లనియె నగియ వారితదృష్టిన్॥ శా॥
కాంతారత్నములార మీ గృహములం గళ్యాణమే యేమిగా। వింతుస్మీకిటు రండువమ్మని చటస్వీక్షింప నే తెంచినా। రెంతో
వేడుకతో నెఱుంగుదు మునిశ్రేష్ఠస్థితిన్నన్నుధీ। మంతుల్మీక్రియఁ జేరి కందురుగదా మత్సేవలన్సర్వమున్॥ వ॥ కావున గృహస్థ
లైన మీ పతులు మిమ్ముం గూడి క్రతువు సమాప్తిం జేసెదరు మీరు యాగవాటంబునకుం జనుండనిన విప్రభార్యలిట్లనిరి॥ మ॥ త
గునే మాధవ యిట్టి వాఁడి పలుకుల్ ధర్మంబు లేయీయెడ। న్మగలున్ బిడ్డలు సోదరుల్జనకులున్మమ్మున్నివారింపమ। చ్చిగనీ
యంఘ్రులు చేరినారమటఁ బోఁ జేకొందు రే వారలా। పగిదే మొల్లము కింకరీజనులఁగా భావించి రక్షింపవే॥ అనిన జగదీశ్వ
రుండు॥ సీ॥ నా సమీపమున నున్నారం చనలు గురుబంధులు భ్రాతలు పతులు సుతులు। మిమ్ము దేవతలైన మెత్తురంగనలార నా
దేహసంగంబు నరుల కెల్ల। సౌఖ్యానురాగసంజనకంబు గాదు ముక్తిప్రదాయకము నాకీర్తనమున। దర్శనాకర్ణనధ్యానంబు
లను గర్మబంధదేహంబులఁ బాసి మీరు। మానసంబులు నాయందు మఱుఁగఁ జేసి। నన్నుఁ జేరెదరిట మీఁదనమ్ముఁడనుచుఁ। బలి
కి వారలు దెచ్చిన భక్ష్యనాదు। లాప్తవర్గంబుతో హరి యారగించె॥ క॥ పరమేశ్వరార్పణంబుగఁ। బరజనులకు భిక్షమిడినఁ బర
మపదమునన్। బరగెదరఁట హరిసాక్షాత్పరమేశ్వరు భిక్ష సేయు ఫలమెట్టిదియో॥ వ॥ ఇట్లు సర్వేశ్వరుండయిన హరికి భిక్ష
యిడి తమతము భార్యలు తనివలనం గృతార్థులగుట నెఱింగి భూసురులు తమలో నిట్లనిరి॥ ఉ॥ కటకట మోసపోయితిమి కాంతల
పాటియు బుద్ధిలేదు నేఁ। డిట హరిఁ గానఁ బోనెఱుఁగమేము దురాత్ముల మేము కర్మమో। ద్భటుల ము విష్ణుదూరగుల ప్రాజ్ఞత
లేఁ తపంబు లేల ప। ర్యటనము లేల శీలములు యాగములున్మఱి యేల కాల్పనే॥ క॥ జపహోమాధ్యయనంబులు। తపములు
వ్రతములును లేని తరుణులు హరిస। త్కృపఁ బడసిరన్నిగలిగియుఁ। జపలతఁ బొందితిమి భక్తి సలుపమి నకటా॥ క॥ సురగురుల
గు యోగీంద్రుల। నరుదుగ మోహితులఁ జేయు హరిమాయ మము। న్నరగురుల మూఢవిప్రుల। నురువడి మోహితులఁ జే
య నోపక యున్నే॥ మ॥ క్రతువుల్ధర్మము మంత్రతంత్రధనముల్కాలంబు దేశంబు దే। వతయున్వహ్నులు మేదినీసురులు
నెవ్వాఁడట్టి సర్వేశుఁడీ। క్షితి రక్షింప జనించినాఁడెఱుఁగమా శ్రీభర్తకుం గర్తకుం। గుతలోద్ధర్తకు మేము మ్రొక్కెదము ర
క్షోనాథసంహర్తకున్॥ వ॥ అని మఱియు ననేకవిధంబులఁ బశ్చాత్తాపంబులం బొంది హరిం దలంచి శమింపుమని మ్రొక్కి
బ్రాహ్మణులు కంసభీతులై కృష్ణసందర్శనంబు సేయం జనరైరంత నక్కడ నఖిలదర్శనుండైన హరి యింద్రయాగంబు సే
యం దలంచితనకడకు వచ్చిన నందాదిగోపవృద్ధులం గని నందునకిట్లనియె॥ సీ॥ యాగంబు సేయంగనర్థించి వచ్చితిరీ యాగ

## ✤ గోపాలకృష్ణుఁడు గోవర్ధనపర్వతము నెత్తుట. ✤

మున ఫలమేమి గలుగు। నెవ్వాఁడు దీనికి నీశ్వరుం డధికారి యెవ్వఁడు సాధనమెంత వలయు। శాస్త్రీయమో జనాచారమో
కార్యంబు వైరుల కెఱిఁగింపవలదు గాని। యొఱిఁగెడి మిత్రుల కెఱిఁగింపఁదగుఁ జేరి యెఱిఁగి చేసినఁ గోర్కులెల్లఁ గలుగుఁ। బ
గయుఁ జెలిమి లేక పరగిన మిముబోఁటి। మంచివారి కెల్ల మంతనంబు। తలఁపులెల్ల మాకుఁ దగ నెఱిఁగింపవే। తాతవాక్సుధా
ప్రదాత వగుచు॥ అని పలికిన ప్రౌఢకుమారునికి నందుఁడిట్లనియె॥ సీ॥ పర్జన్యుఁ డధికుండు భగవంతుఁ డమరేంద్రుఁ డతనికిఁ
బ్రియమూర్తులగుచునున్న। మేఘబృందంబులు మేదినీతలము పైనతనిపంపున భూతహర్షణముగ। జలములు గురియుఁ దజ్జల
పూరములఁ దోఁగి పండు సస్యంబులా పంట దమకు। ధర్మార్థకామప్రదాయకములు లోకులెల్లను బ్రతుకుదు రింత యెఱిఁ
గి। మేఘవిభుఁడైన యింద్రుండు మెచ్చుకొఱకు। నింద్రమఖములు సేయుదు రెల్ల నృపులు। కామలోభభయద్వేషకలితులగు
చుఁ। జేయకుండిన నశుభంబు చెందుఁ బుత్ర॥ అదియునుం గాక॥ గీ॥ మఖము సేయ వజ్రి మది సంతసించును। వజ్రి సంతసింప

వానసురియు। వానగురియఁగఁ బసువుపసుమతిఁ జెరుగును। గసవు మేసి ధేనుగణము బ్రతుకు॥ క॥ ధేనువులు బ్రతికె నేనియు। మానసమున నైన పాఁడిమందలఁ గలుగుఁగా। మానసము గబ్బాఁడి గలిగిన। ఘానవులును సురలు గనిసివాసు మరు పుత్రా॥ వ॥ అని యిట్లు నుడివిన నందుని వచనంబులు విని యింద్రునకుఁ గోపంబు దీపింపఁ దనుజదమనుండు తండ్రి కిట్లనియె॥ క॥ కర్మమునఁ బుట్టు జంతువు। కర్మమునన్ వృద్ధిఁ బొందుఁ గర్మమునఁ జెడున్। గర్మ మెజనులకు దేవత। కర్మము సుఖదుఃఖములకుఁ గారణమధిపా॥ క॥ కర్మములకుఁ దగుఫలములు। కర్మములనిడఁగ రాజు గానిసదా ని। ష్కర్ముఁ డగు నీశ్వరుండును। గర్మకు హీనునికి రాజు గాఁడు మహాత్మా॥ వ॥ కావునఁ గర్మానుయాతంబులై నభూతంబులకుఁ బురుహూతునివలన భీతిలేదు। జీవుండు గాత్రజన్మసంస్కారంబులు నప్పలుగొనక ప్పనఁ గర్మంబులఁ దప్పించి పెంపు వడయ నప్పరమేశ్వరుండును నేరఁడు ఇతరుల జెప్ప నేల, సురాసుర నరానీకంబులతోడి లోకంబు, నిజసంస్కారవశంబై యుండడిందియున్నది, సందేహంబు లేదు, దేహి కర్మవశంబున గురుతును దేహంబులఁ జొచ్చి వెడలు, నెజ్జ వేలుపు నెచ్చెలి పగరు చుట్టంబులు కర్మంబు, జీవుండు కర్మంబుతోడ వర్తించు, వతనికిఁ గర్మంబు పైవతంబు, కర్మంబున బ్రతుకుచు, నితర సేవ సేయుట పతి విడి విజారుం జేరిన చందంబగు। విప్రుండు వైదిక కర్మంబున మెలంగు, నృపతి ధరణీ పాలనంబున సంచరించు, వైశ్యుండు వాణిజ్య కృషి కుసీద గోరక్షణాదుల వర్తించు, శూద్రుండు ద్విజన్ములఁ సేవించి బ్రతుకు, సత్త్వరజస్తమోగుణంబులు సృష్టిస్థితిలయకారణంబు, లందు రజంబున జగంబు జన్మించు, రజోగుణప్రేరితంబులై మేఘంబులు వర్షించు, వర్షంబున బ్రజావృద్ధియగు, నింద్రుండేమి సేయంగలవాఁడు? నియుడుం గాక॥ శా॥ కోపింపం బని లేమ శక్రునికిఁ దాఁ గోపించుఁ గాకేమి సం। తాపంబయ్యెడి దేమి పట్టణములు న్గేహంబులు న్దేశముల్। వ్యాపారంబులు మీకుఁ బోయెడి నెవైశైలారణ్యభాగంబులు। న్గోవత్సంబుల నుండుచున్న నను సంకోచింపఁగా నేటికిన్॥ సీ॥ పసులకుఁ గొండకు బ్రాహ్మణోత్తములకు సుఖముగా విందు బనుం దిబుద్ధి। యింద్రయాగంబున కేమేమి దెప్పించు రవి యెల్లఁ దెప్పింపుఁ డరసి మీరు। పాయసంబులు నపూపంబులు నైంద వపు పిండివంటలు సుబవ్వవలయు నట్టి। ఫలశాకములు వండఁబంపుఁడు సూపాపసంబు సేయుఁడు ధేనువక్షిణలనిచ్చి। బహురసాన్నంబు పెట్టుఁడు బ్రాహ్మణులకు। నచలులై పూజ గొనెసరింపుఁడచలమునకు। నధమ చండాలశ్వనకసంహతికిఁ దగిన। భక్ష్యములు పెట్టి కసవులు పసులకిండు॥ శా॥ గంధాలంకరణాంబరావళుల చేతన్ సైచేసి యిష్టాన్నము। ల్భుంజిం శ్రేణియు మీరలుం గుడిదినా భాపారతి న్వేడుక। ల్సంధిల్లన్ గిరి గోద్విజానల నమస్కారంబుగా విప్రవహా। సంధిల్లన్ సకలేప్సితంబులును మీ జన్మంబు ధన్యంబగున్॥ వ॥ అనిమహేంద్రియుని లింప పతి సొంపు దింపు తలంపునన్ ఖిమ్మఖంబు తనకు సమ్మతంబని గోవిందుండు పలికిన నందాదులు మేలు మేలని తద్వచనప్రకారంబున నంబు స్వాహా వాచనంబులు చదివించి ధరణీసురులకు భోజనంబులిడి పసులకుం గసవులొసంగి రప్పుడు॥ మ॥ సకలాభీరులు మీఁద గృష్ణుఁ డనన్యైజంబై న రూపంబులో। నకలంకస్థితి నుండి శైలమిదె నేనౌర ర్పింపరం డంచుఁ దా। నొక శైలాకృతిఁ దాల్చి గోపకులతో నొండొండఁ బూజించి గో। పకదత్తాన్నములాహరించె విభుఁ డా ప్రత్యక్ష శైలాకృతిన్॥ మ॥ వినుఁడీ శైలము కామరూపిఖలుల న్వేధించు నాజ్యాన్నముల్। మన మొప్పించిన నాహరించె మనలన్ మన్నించెఁ జిత్తంబులో। నను కంపాతిశయంబు చేసెను మనకైనెంచున్న గోపాలురై। వనజాక్షుండు నమస్కరించె గిరికిన్ వంచారుమందారుఁడై॥ వ॥ ఇట్లు గోపకులు హరిసమేతులై గిరికిం బూజనోపహారంబులు సమర్పించి గోధనంబులం బురస్కరించుకొని భూసురాశీర్వాదవచనంబులతో గిరికిం బ్రదక్షిణంబు చేసి రా సమయంబున॥ క॥ సఖ్యములపసుపు మెచ్చని। సఖ్యలఁ గట్టి నరథంబు నంద ప్రముఖుల్। గ్లొఖ్యల యార్పులు చెలఁగఁగఁ। దొఖ్యఁ గమి వెంటనంటఁ దోలిరి లేశా॥ క॥ పాటించి గానవిద్యా। పాటవమునఁ జేరు లెక్కబహు తానములు। న్పాటల గంధులు గృష్ణుని। పాటలు వాడిరి శరోధిపాటనుఁ డనుచున్॥ క॥ మండనశిఖాపీనంబులు। మండితవర్ణములు వివిధమహిదాకృతులు। న్నిండిన కడుపులుఁ గన్నులు। పండువులు గఁబ్బాఁడి కుఖ్యపసువులు జరిగెన్॥ క॥ పొగ రెక్కనమూపురములు। దెగగల వాలములు శైలదేహంబులు భూ। గగనములు నిండ అంకెలు। మిసుల మెఱయు వృషభగణము మెల్లన నడిచెన్॥ వ॥ ఇట్లు పర్వతప్రదక్షిణంబులు చేసి గోపకులు మాధవసమేతులై మందకుం జని రంత నమహేంద్రుండంతయు నెఱింగి మహాకోపంబునఁ బ్రళయప్రవర్తకంబులగు సంవర్తకాది మేఘంబులం జీరి యిట్లనియె॥ మ॥ పెఱుగు న్నేతులుఁ ద్రావి క్రొవ్వి భువి నాభీరుల్మదాభీలురై। గిరిసంఘాతక ఘోరపక్షదళన క్రీడాసమారంభమ। ర్భరదంభోళిధరుం బురందరుననుం బాటించి పూజింపక। గ్గిరికిం బూజలు చేసి పోయిరి దెపో కృష్ణుండు ప్రేరేపఁగన్॥ క॥ గురుదేవహీను బాలుని। గిరిభూజప్రముఖవాసుఁ గృష్ణుని నీశున్। బరిమాణశీలకులగుణ। విరహితుఁ జేపట్టి యింద్రు విడిచిరి గొల్లల్॥ గీ॥ విమలఘనతరాత్మవిజ్ఞానవిద్య చే। నిగుడ లేక యుడుపనిభములను చుఁ। గర్మమయములైన క్రతువుల భవ

---

• వంచారుమందారుఁడై। తననుభూషించు వారలకు కల్పవృక్షప్రాయుఁడై. శిఖాపీనంబులు। పొడుగులు.

మహార్ణవముగడువఁగోరినారువీరు॥ శా॥ఉద్వృత్తంపవనమ్మినందతనయోదోద్యోగంబునన్వేల్పులై।మద్యాగంబువిసర్జనీయ
మనిరీమర్త్యుల్పాడిన్మీరుమీ।విద్యుద్వల్లులఁగప్పిగర్జనముల న్వేధించిగోవుల్జను।ల్పద్యోన్మృత్యువుఁబొందరాల్గురియుఁడీశౌ
ర్యంబవార్యంబుగ౯॥క॥మీ వెంటవత్తు నేనై।రావణనాగంబు నెక్కి రయ మొప్పంగా। దేవగణంబులతోడను। గోవిందుని
మందలెల్ల గొందలపెట్ట౯॥వ॥అనియిట్లుపలికిజంభవైరిసంరభంబునదంభోళిఝుళిపించి,ఖింకంబునశంకింపక, కినుకతోడ
సంకిలులువిప్పించిన,మహానిలప్రేరితంబులై చని,నంచునిమందమీఁదన మోఘుంబులైన మేఘంబులు, మహౌఘంబులైప
న్ని,ప్రచండగతిఁజండమరీచిమండలంబుఁ,గప్పిదివినిండి, దిశలావరించి, రోదోంతరాళంబునిరంతరనీరంధ్రనిబిడాంధ
కారబంధురంబుగనిరోధించి,బలిభంజనతృతీయపాదపల్లవభగ్నంబైన బ్రహ్మాండభాండంబు,చిల్లులజల్లించినఁదోఁచుఁగు
బహిస్సముద్రసలిలనిర్ఝరంబులవడువున నెడతెగక,తోరంబులైననీరధారలఁగురియుచు, శిలలవర్షించుచుఁ,బిడుగులరు
వ్వుచు,మిట్టుపల్లంబులుసమతలంబులైయేకార్ణవంబురూపుచూపినందుముడుకడఁచుచు,విలయశిఖిశిఖాసంరంభవిజృంభ
మాణవిద్యుల్లతావిలోకనంబులమిఱుమిట్లుగొనిసొమ్మసిలంబోవు లేఁగలును, లేఁగలకుమూఁతులడ్డంబులిడిప్రళయభైర
వభేరీభాంకారభీషణంబులగుగర్జనఘోషణంబులఁజెవుడువడి చిందరవందరలైన డెందంబులంగందికుందిప్రాలు ధేనువు
లును,ధేనువులవెనుకనిడుకొనిదురంతకల్పాంతకాలకీలికరాళకాలకరవిశాలగదాఘాతప్రభూతంబులైననిర్ఘాతపాతం
బులభీతంబులై,హరికిమ్రొక్కిరక్షరక్షేతిశబ్దంబులు సేయుకైవడి,విడువనిజడింబడిసైరింపక,శిరంబులువంచుకొని, గద్గ
దకంఠంబుల,నంభారవంబులు సేయు,వృషభంబులును,వృషభాదిగోరక్షణంబు సేయుచుదుర్వారఘోరశిలాసారంబుల
సారంబులు సెడిశరీరంబులుభారంబులైన మ్రానువడు గోపకులును,గోపకులంబట్టుకదట్టంబైనవానకొట్టునంబెట్టువడిబ
డుగునడుములునులుసువడవడవడవడంకుచుగోవిందునింజీఱుగోపికలునుగోపికాజనకఠినకుచకలశయుగళంబుల మఱుం
గునందలలువెట్టుకొనిపరవశులైనశిశువులుంగలిగి మహాఘోషంబుతోడనష్టంబైన ఘోషంబుఁజూచిప్రబుద్ధులైనగోప
వృద్ధులుకొందఱుదుర్జనశిక్షకుండును,సజ్జనరక్షకుండయిన పుండరీకాక్షునకుమ్రొక్కి యిట్లనిరి ॥ ఉ ॥ అక్కటవానఁ
దోఁగి ప్రజలాకులమయ్యెగదయ్యకృష్ణనీ। వెక్కడనుంటివింతదడ వేల సహించితినీపదాబ్జముల్। దిక్కగనున్నగో
పకులు దీనతనొందభయాపహారివై। గ్రక్కునఁగావకిట్లునికి కారుణికోత్తమనీకుఁబాడియే ॥ క ॥ ఈయుఱుములు
నీమెఱుపులు। నీయశనీఘోషణముఁల్నీజలధారల్। నీయానతొల్లియెఱుఁగము। కుయ్యాలింపంగదయ్యగుణరత్న
నిధీ॥ క ॥ వారిబరువయ్యెమందల। వారికిని దెవసులు లేరు వారింపఁగా। వారిదపటలభయంబును। వారిరుహదళాక్ష
నేఁడు వారింపఁగదే ॥ అనినవినిసర్వజ్ఞుండైన కృష్ణుండంతయు నెఱింగి ॥ ఉ ॥తన్నొకయింతగైకొనరుతప్పిరియా
గముచేసిరంచుఁదా। మిన్నుననుండి గోపకుల మీఁదశిలల్గురియించుచున్నవాఁ। డున్నతనిర్జరేంద్రవిభవోద్ధితగ
ర్వనగాధిరూఢుఁడై।కన్నులఁగానఁడింద్రుఁడిటుగర్వపరుండొరుఁగాననేర్చునే॥ క॥ దేవతలందఱునన్నును। సేవింతురు
రాజ్యమదముఁజెందరుచెరుపం।గావలచుమానభంగము।గావింవఁగవలయుశాంతిగలిగెడుకొఱకై॥వ॥అనిచింతించిశిలా
వర్షహతులైశరణాగతులైనఘోషజనులరక్షించుటతగవనిసకలలోకరక్షకుండైనవిచక్షణుండు॥ చ॥ కలఁగకుఁడీవధూ
జనులుకంపమునొందకుఁడీవ్రజేశ్వరు। ల్తలఁగకుఁడీకుమారకులుతక్కినవారలురాలవానచే। నలయకుఁడీపశువ్రజమున
కడనకడనిల్వనీకుఁడీ। మెలుపునమీకునీశ్వరుఁడు మేలొసఁగున్గరుణార్ద్రచిత్తుఁడై॥అనిపలికి॥క॥కిరివైధరయెత్తినహరి।
కరిసరసిజముకుళమెత్తుగతిఁద్రిభువనశం।కరకరుఁడైగోవర్ధన।గిరియెత్తెంజకకనొక్కకేలన్లీల౯॥క॥దండిని బ్రహ్మాండం
బులు। చెండులక్రియఁబట్టియెగరఁజిమ్మెడుహరికి।న్గొండపెకలించియెత్తుట।కొండొకపనిగాకయొక్కకొండాతలఁప౯॥ఇ
ట్లుగిరియెత్తి॥ఉ॥బాలుండాడుచునాతపత్త్రమునిసంభావించిపూగుత్తికె౯। గేలందాల్చినలీలలేనగవుతోఁగృష్ణుండుదా
నమ్మహా।శైలంబున్వలకేలఁదాల్చివిపులచ్ఛత్త్రంబుగాఁబట్టెనా।భీలాభ్రచ్యుతదుశ్శిలాచకితగోపీగోపగోవక్తికి౯।ఇ
ట్లుగోత్రంబుఛత్త్రంబుగాఁబట్టిగోపజనులకుగోపాలశేఖరుండిట్లనియె॥క॥ రాతల్లిరమ్మతండ్రీ। వ్రేతలుగోపకులురం
డువినుఁడీగర్త।త్మ్రొత్తలమునసుండుఁడుగో।వ్రాతముతో మీరుమీకువలసినయెడల౯॥శా॥ బాలుండీతఁడుకొండదొడ్డదిమ
హాభారంబుసైరింపఁగా।జాలండోయనిదీనిక్రిందనిలుహన్నంకింపఁగాఁబోలదీ। శైలాంభోనిధిజంతుసంయుతధరాచక్రం
బుపైఁబడ్డనా। కేలల్లాడదుబంధులారనిలుఁడీక్రిందర్బ్రమోదంబున౯॥ వ॥ ఇట్లుపలుకుచున్నహరిపలుకులువిని నెమ్మన
మ్ములనమ్మికొండయడుగునతమతమయిమ్ములంబుత్రమిత్రకళత్రాదిసమేతులై గోవులుందారునుగోపజనులుజనార్దనక
థనావిలోకనామృతవర్షంబున నాఁకలినీరుదప్పులచొప్పెఱుంగకకృష్ణకథావినోదంబులనుండిరివ్విధంబున॥మ॥ హరిదో

గ్దండము కామగుబ్బశిఖరం బాలంబిముక్తావళు। ల్వరగంజా రెడుతోయబిందువులుగాగోపాంగనాపాంగహా । సరుచిరత్నచయంబు గాఁగనచలచ్ఛత్రంబుశోభిల్లెఁద।ద్గిరిభిద్దుర్మదభంజియై జలధరాఖిన్న ప్రజారంజియై॥క॥రాజీవాక్షునిచేఁ గొక।రాజీవముభంగి శైలరాజము మెఱసెన్।రాజేంద్రమీఁదమధుకర।రాజిక్రియ న్మేఘరాజిరాజిల్లెఁగడున్॥క॥వడిగొనిబలరిపువనుపున।నుడుగక జడిగురిసె నేడహోరాత్రములు।య్యెడగోపజనులు బ్రతికిరి।జడిఁదడియక కొండగొడుగుచాటుననధిపా॥వ॥ ఇట్లుహరియేడహోరాత్రంబులుగిరిధరించినగిరిభేదివిసికి వేసరికృష్ణుచరితంబులువిని వెఱఁగుపడివిఫలమనోరథుండై మేఘంబుల మఱలించుకొనిచనియెనంత నభోమండలంబువిద్యోతమానఖద్యోతమండలంబగుటవినిగోవర్ధనధరుండు గోపాలకులకిట్లనియె॥క॥ఉడిగెను వానయు గాలియు।వడిచెడినవి యెల్లఁ బొలుపవరదలిగె రేఁగొం। డగుగుననుండక వెడలుఁడు।కొడుకులుఁగోడండ్రుసతులుగోవులుమీరున్॥వ॥ అనినవినిసకలగోపజనులుశకటాద్యుపకరణసమేతులై గోవులుందారునుగొండయడుగువిడిచివచ్చిరచ్యుతుండును జెచ్చెరఁదొల్లింటియట్ల నిజస్థానంబునగిరినిలిపెనంతవల్లవులెల్లఁగృష్ణుంగౌఁగిలించుకొనిసముచితప్రకారంబులసంభావించిదీవించిరి గోపికలు సేసలిడిదధ్యన్నకబళంబులొసంగుచునాశీర్వదించిరినందబలభద్రరోహిణీయశోదలాలింగనంబు సేసిభద్రవాక్యంబులువలికిరిసిద్ధసాధ్యగంధర్వవరులువిరులుగురియించిరిసురలుశంఖదుందుభులు మ్రోయించిరితుంబురుప్రముఖులయినగంధర్వులుపాడిరప్పుడు॥క॥వల్లవకాంతలుదనకథలెల్లనుబాడంగనీరజేక్షణుఁడంతన్।వల్లవబలసంయుతుఁడై।యల్లనగోష్ఠంబుచేరెనుర్వీనాథా ॥ అయ్యవసరంబునఁగృష్ణుచరిత్రంబులుతలఁచి వెఱఁగుపడి గోపజనులునందునకిట్లనిరి.సీ॥కన్నులుదెరువనికడుచిన్నపాపఁడైదానవిఁజనుబాలుద్రావిచంపె।మూఁడవనెలనాఁడుముద్దులబాలుఁడై కోపించిశకటంబుఁగూలఁదన్నె। నేఁడాదికుఱ్ఱఁడై యెగసితృణావర్తుమెడఁబట్టుకొనికూల్చి మృతునిఁజేసెఁ।దల్లి వెన్నలకునై తనురోలఁగట్టినఁగొమరుఁడై మద్దులఁగూలనీడ్చెఁ।బసులఁగ్రేపులఁగాఁచుచుబకునిఁజీరె। వెలగతోవత్సదైత్యునివ్రేసిగెడపె।సబలుఁడై ఖరదైత్యునిసంహరించె। నితఁడు కేవలమనుజుఁడే యెంచిచూడ॥క॥ తెంపరియై రామునిచేఁ।జంపించెఁబ్రలంబుమ్రింగెఁజటులదవాగ్ని।న్సొంపుచెడఁద్రొక్కెఁగాళియుఁ।ద్రుంపఁగ కాళిందివెడలదో లేలీలన్॥క॥ఏడేఁడ్లబాలుఁ డెక్కడ । క్రీడంగరితమ్మిమొత్తక్రియనందఱమున్।జూడగిరిమొత్తుటెక్కడ।వేడుకనొకచేత నేఁడు వెఱఁగౌఁగాదో॥క॥ఓనందగోపవల్లభ। నీనందనుఁడాచరించు నేర్పరితనముల్।మానవులకుశక్యంబులె।మానవమాత్రుండె నీకుమారుఁడుతండ్రీ॥వ॥అట్లువినినందుండువారలంజూచిమున్నుతనకుగర్గమహాముని చెప్పినసంకేతంబు తెలిపిశంకలేదుకృష్ణుండులోకరక్షకుండై నపుండరీకాక్షుని నిజాంశమనుచు నంతరంగంబునంజింతింతునని పలికిన వెఱఁగుపడిగోపకులుకృష్ణుండనంతుండనిపూజించిరంత॥మ॥హరి కేలన్గిరియెత్తివర్షజలఖిన్నాభీరగోరాజికి। న్శరణంబైనత్రిలోకరాజ్యమదముంజాలించినిర్గర్వుఁడై।సురభింగూడిబలారివచ్చికనియెన్సొంపేది దుష్టప్రజేశ్వరదుర్మాననిరాకరిష్ణుఁగరుణావర్ధిష్ణు శ్రీకృష్ణునిన్॥క॥కనియింద్రుఁడుపూజించెను। దినకరనిభనిజకిరీటదీధితిచేత।న్మునిహృద్యలంకరణంబులు।సునతోద్ధరణములు నందసుతుచరణంబుల్ ॥ వ॥ ఇట్లునమస్కరించికరకమలంబులుముకుళించిహరికిహరిహయుండిట్లనియె॥సీ॥పరమనిధానంబు భాసురతత్త్వంబు శాంతంబు హతరజస్తమము నిత్య। మధికతపోమయమట్లుగావునమాయ నెగడెడిగుణములు నీకులేవు । గుణహీనుఁడవుగానగుణములనయ్యెడిలోభాదికములునీలోనఁజేర।వైనదుర్జననిగ్రహముశిష్టరక్షయుఁదగిలి సేయఁగదండధారివగుచు।జగముభర్తవుగురుఁడవుజనకుఁడవును। జగదధీశులమనుమూఢజనులుదలఁక।నిచ్చపుట్టినరూపంబులీవుదాల్చి।హితముసేయుదుగాదెలోకేశ్వరేశ॥క॥నావంటివెఱ్ఱివారిని।శ్రీవల్లభనీవుశాస్తిచేసితివేనిన్।గావరముమాని పెద్దల।త్రోవంజరుగుదురుబుద్ధితోడుతనీశా॥క॥ఒక్కొక్కలోకముగాఁచుచు। నెక్కుడుగర్వమున నేమీశులమనుచున్।జొక్కెదనుబోటివెఱ్ఱులు।నిక్కమునీమహిమఁదెలియ నేరరనంతా॥గీ॥వాసుదేవకృష్ణవరదస్వతంత్రవి।జ్ఞానమయమహాత్మసర్వపుణ్య।పురుషనిఖిలబీజభూతాత్మకబ్రహ్మ।నీకువందనంబునిష్కళంక॥శా॥నీసామర్థ్యమెఱుంగ మేఘములచేనిర్ఘోషముల్భీషణో।గ్రాసారంబునముంచితిన్మఖమునాకై వల్లవుల్సేయరం। చోసర్వేశభవన్మహత్త్వమునఁనాయుద్యోగమిట్లయ్యెనీ। దాసున్నన్గృతాపరాధుఁగరుణన్దర్శింపవే మాధవా॥మ॥నినుబ్రహ్మాదులెఱుంగలేరు జడతానిష్ఠుండ లోకత్రయీ। వనదుర్మానగరిష్ఠుఁడన్నృపులదుర్వైదుష్యభూయిష్ఠుఁడ।న్వినయత్యాగకనిష్ఠుడన్గుజనగర్వశ్రేష్ఠుఁడ న్దేవనీ।ఘనలీలావిభవంబు పెంపుఁ దెలియంగా నెవ్వఁడన్సర్వగా॥వ॥అనినవినినగుచుజలధరగంభీరరవంబున శక్రునకుంజక్రియిట్లనియె॥మ॥అమరాధీశ్వరలక్ష్మితోఁదగిలియిట్లంధుండవై యున్ననీసమదోద్రేకముఁద్రుంచివైచుటకు నీజన్నంబుదప్పించితి । న్బ్రిమదశ్రీరతదండధారియగునన్భావింపఁ డెవ్వాఁడుఖి।

కర్కశిక్షింపఁ దలంతు వానిన ధనుఃగావింతు జంభాంతకా॥ క॥ నాయాజ్ఞ సేయుచుండుము। నీయధికారంబు నేఁడు నిలుపు
సురేంద్రా। శ్రీయుతుఁడవై మదింపకు। శ్రేయంబులు గల్గుఁ బొమ్ము సితకరిగమనా॥ వ॥ అని యిట్లు జిష్ణుని బలుకుచున్న కృష్ణుని
కి మ్రొక్కి గోగణసమేతయయిన కామధేనువు భక్తజన కామధేనువయిన యీశ్వరునకిట్లనియె॥ క॥ విశ్వేశ విశ్వభావన। వి
శ్వాకృతి యోగివంద్య విను నీ చేతన్। శాశ్వతులమైతి మిప్పుడు। శాశ్వతము గఁ గంటి మధిక సౌఖ్యంబు హరీ॥ వ॥ దేవా మాకుం
బరమదైవంబవు గావున నీవు ధరణీ సురగోసురసాధు సౌఖ్యంబులకొఱకు నిన్నింద్రునిం జేసి పట్టముగట్టుము నిన్ను విరించి నియమిం
చి పుత్తెంచె నీవు భూతల భూరిభారనివారణంబు సేయ నవతరించిన హరివని పలికి యంత॥ మ॥ సురభిక్షీరములన్ సురద్విపక
రానీతామృతాకాశగంగాంబువులన్ని లింపజననీసన్మౌనిసంఘంబుతో। సురనాథుండభిషిక్తుఁ జేసి పలికెన్ సొంపార
గోవిందుఁడం। చురగాక్రాంతవిపత్తుఁ దోయజదళాక్షున్ వ్యాధుసంరక్షణున్॥ సీ॥ తుంబురు నారదాదులు సిద్ధచారణగంధ
ర్వులును హరికథలు వాడి। రమరకాంతలు మింట నాడిరి వేల్పులు కురియించిరి దివ్యపుష్పవృష్టి। జగములు మూఁడును సం
తోషమును బొందెఁ గసిట్టిల చన్నుల సురిసెఁ బాలు। నవజలంబులతోడ నదులెల్లఁ బ్రవహించె నఖిలవృక్షములు తేనియలు వడి
సె। సర్వలతికలఫలపుష్పచయములమరెఁ। బర్వతంబులు మణిగణప్రభల నొప్పెఁ। బ్రాణులకు నెల్ల తమలోని పగలుమానె।
వాసుదేవుని యభిషేకవాసరమున॥ వ॥ ఇట్లు గోపగోగణపతిత్వంబునకు గోవిందునభిషిక్తుం జేసి పీడ్కొని పురందరుండు దే

——శ్రీ శ్రీకృష్ణమూర్తి నందుని వరుణనగరమునుండి గొని తెచ్చుట. శ్రీ——

వగణంబులతో దివంబునకరిగెనంత॥ సీ॥ నందుఁడేకాదశి నాఁడుపవాసంబు చేసి శ్రీహరిపూజ చేసి దనుజ వేళ యెఱుంగక వే
గకముందర ద్వాదశీస్నానంబు తగనెనర్ప। యమునాజలము సొరనందొక్క దైత్యుండు నందుని వరుణుని నగరమునకుఁ గొ
నిపోవఁ దక్కిన గోపకులందఱు నంద గోపకునిఁ గానక కలంగి। రామకృష్ణులఁ జేరి రోదనము సేయఁ। గృష్ణుఁడీశుండు లక్షతం
డ్రిఁ గికురు వెట్టి వరుణభృత్యుండు గొని పోయి వరుణుఁ జేర్చె। నెఱిఁగి రయమున కచ్చోటికేఁగెనధిప॥ అప్పుడు॥ క॥ వచ్చిన మా
ధవుఁ గనుగొని। చెచ్చెర వరుణుండు పూజ చేసి వినతుఁడై। యచ్చుగ నిట్లని పలికెను। విచ్చేసితి దేవ నాని వేశంబునకున్॥ ఉ॥ ప
విభుపాదపద్మరతులెన్నఁడు నెవ్వరుఁ బొందలేని పెం। ప్రో వజరింతు రట్టి బుధలోకము నీ వరుసెంచుట స్పృహం। బౌవృతప
ద్యోజిత్తముకృతార్థత నొంచెను నోరథంబు నీ। సేవఁ బవిత్రభావమును జెందె శరీరము నేఁడు మాధవా॥ ఉ॥ పరమేశ్వరు
జ్జగములిన్నిటిఁ గప్పిన మాయఁ గప్పఁ గా। నోపక పారతంత్ర్యమున నుండు మహాత్మక యుట్టి నీకును। గ్రీపితభద్రమూర్తి
కి సుధీజనరక్షణ వర్తికిం దమా। తాపము వాయ మ్రొక్కెద నుదారతపోధన చక్రవర్తికిన్॥ చ॥ ఎఱుఁగఁడు వీఁడు నా భటుఁడొ
కించుకయైన మనంబులోపలన్। దెఱకువ లేక నీ జనకుఁ దెచ్చె దయం గొనిపొమ్ము ద్రోహము। న్మఱువు మునన్న నీ భటుని వ
న్నన సేయుము నీకు సైరణన్। వఱలుము గాదె యోజనకవత్సల నిర్మలభక్తవత్సలా॥ వ॥ అని యిట్లు పలుకుచున్న వరుణుని గ
రుణించి తండ్రిం దోడ్కొని హరి తిరిగివచ్చె నంత నందుండు తన్ను వెన్నుండు వరుణనగరంబుననుండి విడిపించి తెచ్చిన వృత్తాం
తంబంతయు బంధువుల కెఱింగించిన వారలు కృష్ణుండీశ్వరుండని తలంచి రఖిలవర్మనుండైన యీశ్వరుండును వారల తలం
పెఱింగి వారికోరికె సఫలంబు సేయుమనని వారి నంద జేబ్రహ్మ హ్రదంబున ముంచి యెత్తిన॥ గీ॥ ప్రకృతిఁ గామకర్మపరవశ
మై యుచ్చ। నీచగతులఁ బొంది నెఱయ భ్రమసి। తిరుగుచున్న జనము తెలియనేరదు నిజ। గతివిశేష మీ జగంబునందు॥ వ॥ అని
చింతించి దయాళుఁడైన హరి మాయామార మైజ్యోతియై। యని రూప్యంబయి సత్యమై మెఱుకయై యానందమై బ్రహ్మమై।
యనఘాత్ముల్గుణనాశమందుగను నిత్యాత్మీయలోకంబు గ్ర। క్కునఁ జూపె న్గరుణార్ద్రదృష్టుఁడగుచున్ గోపాలక శ్రేణికిన్॥

——శ్రీ శరద్రాత్రియందు గోపికలు గానము చేసెడు శ్రీకృష్ణుని సన్నిధికి వచ్చుట. శ్రీ——

వ॥ ఇట్లు హరిమున్నక్రూరుండు వొందిన లోకమంతయుం జూపి బ్రహ్మలోకంబునుం జూపినం జూచి నందాదులు పరమానందం
బునుం బొంది వెఱఁగుపడి హంసస్వరూపకుండైన కృష్ణునిం బొడగని పొగడి పూజించిరంత॥ చ॥ కలువల మేలికందువలు కా
మునికయ్యపు బాణముల్విర। క్తులు దలడించు వేళలు చకోరకపక్షుల భోగకాలముల్। చ్చెలువలు సైరణల్విడిచి పిక్కటిల్లు ఘ
న చంద్ర చంద్రికా। జ్వలితదిశల్ శరన్నిశలు జారకముద్దశలయ్యె నయ్యెడన్॥ గీ॥ కామతంత్రటీకకలువల జోకకం। దర్పఘా
కవిటుల తాల్మి పోక। చకితచక్రవాకసంప్రీతజనలోక। రాకవచ్చె మేలురాకయగుచు॥ క॥ పతి తన కరముల కుంకుమ। సతి మొ
గమున నలఁదు భంగి సముదయవేళాం। చితకరరాగము ననిశా। పతి రంజించెన్నరేంద్ర ప్రాక్సతి మొగమున్॥ సీ॥ విటసేన పై
దండు వెడలె కువలరేని *గొల్లెన పై హేమకుంభమనఁగ। గామకధృతివల్లికలు ద్రెంప నెత్తిన శంబరాంతకు చేతి చక్రమన
ఁగ। మారుండు పాంథులమానాటవులు గాల్పఁ గూర్చిన నిప్పులకుప్ప యనఁగ। విరహిణీమృగముల వేఁటాడ మదనుండు దెచ్చిన

*గొల్లెన।డేరా.

మోహనదీపమునఁగ।వింతనునుపుగల్గి వృత్తమైయరుణమై। కాంతితోఁజకోరగణములుబ్బఁ। బొడుపుకొండచక్కిఁ బొడిచె
రాకాచంద్రు।మండలంబుగగనమండలమున॥ వ॥ ఇట్లుపొడమినవకుంకుమాంకితరమాముఖమండలమండితంబై యఖండం
బైనచంద్రమండలంబుపొడగనిపుండరీకనయనుండుయమునాతటంబునజగన్మోహనంబుగనెక్కు గీతంబుఁబాడినవిని ప
రాయత్తచిత్తలైతత్తరంబునవ్రేతలుపనులకుంజేతులాడకయు,గోవులకుంగ్రేపులవిడువకయు,విడిచిపిడిచియాడకయు,
నీడియాడియు,నీడినపాలుకాఁపకయుఁ,గాఁచికాఁచియుఁ,గాఁగినపాలుడింపకయు,డించిడించియు,డించినపాలుబాలుర
కుంబోయకయుఁ,బోసిపోసియుఁ,బతులకుఁబరిచర్యలుసేయకయుఁ,జేసిచేసియు,నశనంబులుగుడువకయుఁ,గుడిచికుడిచి
యుఁ, గుసుమంబులుముడువకయు,ముడిచిముడిచియుఁ,దొడవులుదొడగయుఁ, దొడిగితొడిగియు,గోష్ఠంబులపట్టులనుం
డకయుఁ,బాయసంబునెఱియవండకయు,నయ్యెయెడలనిలువంబడకయుఁ,గాటుకలుసూఁటిసిడకయుఁ,సురులుచక్క నె
త్తకయుఁ,గుచంబులగంధంబులుకలయమెత్తకయుఁ,బయ్యెదలువిప్పికప్పకయు,సఖులకుంజెప్పకయు,సహోదరులుమ
గలుమామలుగనుఁ అమలుబిడ్డలునడ్డంబుచనినివారింపందలారింపకసంచలించి,పంచభల్లునిభల్లంబులమొల్లంపుజల్లులపె
ల్లునంపల్లడిల్లిడిల్లపడి, మొగుల్లగమివెలువడియుల్లసిల్లుతటిల్లతలపొందున,మందగమనలమందగమనంబులమందలువెలు
వడిగోవిందసందర్శనంబునకుంజనిరప్పుడు॥ మ॥ తరుణుల్గొందఱుమూలగేహములనుద్దండించిరారాకత।ద్వారహోగ్నింబరి
తాపమొందుచుమనోవీథిన్విభున్మాధవుం।బరిరంభంబులుసేసిజారుఁడనుచున్భావించియుర్విజొక్కి పొం। దిరిముక్తిన్గుణ
దేహముల్విడిచిప్రీతిన్బంధనిర్ముక్తలై॥ అనిననరేంద్రుండిట్లనియె॥ క॥ జారుఁడనికానికృష్ణుఁడు।భూరిపరబ్రహ్మమనియు
బుద్ధిదలంప। న్నేరరుగుణమయదేహము। లేరీతిన్విడిచిరింతులెఱిఁగింపుశుకా॥ అనినశుకుండిట్లనియె॥ మ॥ మునునేఁజెప్పితిఁ
జక్రికింబగతుఁడైమాఘుండుచైద్యుండుపెం।పునఁగైవల్యపదంబునొందెఁ బ్రియలైపొందఁగరాకున్నదే। యనఘుండ
వ్యయుఁడప్రమేయుఁడగుణుండైనట్టిగోవిందమూ। ర్తినరశ్రేణికిముక్తిదాయినిసుమీ తెల్లంబుభూవల్లభా॥ గీ॥ బాంధవ
మునైనఁబగనైనవగనైనఁ। బ్రీతినైనఁబ్రాణభీతినైన।భక్తినైనహరికిఁబరతంత్రులైయుండు।జనులెమోక్షమునకుఁ
జనుదురధిప॥ వ॥ అటుగావునఁబరమపురుషుండు,నజుండును,యోగీశ్వరేశ్వరుండైనహరినిసోఁకినస్థావరంబైనముక్తంబ
గువెఱఁగుపడవలవదివ్విధంబున॥ క॥ ఘనమధురగీతనినదము।వినివచ్చినగోపికలనువీక్షించినయం।బునమేటిసుగుణిసేర్పరి।
తనవాగ్వైభవముమెఱయఁదగనిట్లనియెన్॥ ఉ॥ మేలామీకుభయంబుపుట్టమగదామీమందకున్సింహశా। ర్దూలానేకపము
ఖ్యముల్దిరిగెడిన్ఘోరంబులేతెంతురే। యేలావచ్చితిరీనిశాసమయమందిచ్చోటవర్తింతురే।చాలుంజాలులతాంగులారచ
నుఁడీసంప్రీతితోమందకున్॥ చ॥ మీరేతెంచినజాడఁగానకవగన్మీతల్లులుందండ్రులు।న్మీరామల్మఱఁదుల్తనూజులుగురుల్మీసో
దరుల్బంధువు।ల్మేరల్మీరిరిలేరుపోయిరనుచున్మీఘోషభూభాగమం। దేరీతింబరికించిరోతగవులేయీసాహసోద్యోగముల్ •
చ॥ ఇలువరిసున్నఁజేసిహృదయేశులసిగ్గులఁజంపియుత్తమా।వలనెఱియించిసోదరులమానముసూరలువుచ్చితల్లిదం। డ్రుల
రుచిమాన్పిబంధులకురోఁతయొనర్చుచుజారవాంఛల।న్వలనటిసత్కులాంగనలువత్తురెలోకులుచూచిమెత్తురే॥ సీ॥ ప్రాణే
శుఁడెఱిఁగిఁబ్రాణంబునకుఁదెగుదండించునెఱిఁగినధరణివిభుఁడు। మామయెఱింగినమనువెళ్లఁజెడిపోవుఁదలవరియెఱిఁ
గినఁదగులుసేయుఁ।దలిదండ్రులెఱిఁగినఁదలలెత్తకుండుదురేరాలెఱింగిననెత్తిపొడుచు। నాత్మజులెఱిఁగిననాదరింపరు
చూచిబంధువులెఱిఁగినబహిరమొనర్తు।రితరులెఱిఁగిరేనినెంతయుఁజులుకఁగాఁ।జూతురిందునందుసుఖములేదు। యశము
లేదునిర్భయానందమునులేదు।జారుఁజేరఁజనదుచారుముఖికి॥ క॥ నడువడికొఱగాకున్నను। బడుగైనఁగురూపియైనఁబా
మరుఁడైనన్।జడుఁడైనరోగియైనను।విడుచుటమర్యాదగాదువిభునంగనకున్॥ చ॥ ఇదియమునానదీజలసమేధితపాదపప
ల్లవప్రసూ।నదళవిరాజితంబగువనంబుమనంబులమేరదప్పెనో।పొదిగిటనేడ్చుబిడ్డలకుఁబోయుఁడుపాలుపిడుండులేఁగ
ల।న్మోనవులకున్నిజేశ్వరులముద్దియలారభజింపుఁడొప్పుగన్॥ చ॥ వనితలునన్నుఁగోరియిటవచ్చితిరింతఁగొఱంతలేమమే।
లూనరెసమస్తజంతువులునోలిఁబ్రియంబులుగావెనాకునై।ననునిలువంగఁబోలదుసనాతనధర్మములాఁడువారికిం।బెని
మిటులన్భజించుటలుపెద్దలుచెప్పుచునుందురెల్లెడన్॥ క॥ ధ్యానాకర్ణనదర్శన। గానంబులనాతలంపుగలిగినఁజాలున్।బూ
నెదరుకృతార్థత్వము।మానవతుల్చనుఁడుమఱలిమందిరములకున్॥ అనిపలికినవిని॥ సీ॥ విరహాగ్నిశిఖలలోవెడలునిట్టూర్పు
లమున్మురంబులఁగందిమోముఁలెండఁ। గన్నులవెడలెడికజ్జలధారలకుచకుంకుమంబులఁగ్రుచ్చిపాఱఁ। జెక్కులఁజేర్చినచే
తులవేఁడిమిమోముదమ్ముల మేలిమురుడింపఁ। బొరిపొరిపుంఖానుపుంఖంబులైతాఁకుమదనుకోలలధైర్యమహిమవెడల।
దుఃఖభరమునమాటలుదొట్రుపడఁగఁ। బ్రియములాడనిప్రియుఁజూచిబెగ్గడిల్లి।చరణములువేలవ్రాయుచుసంభ్రమములఁ।

౧౦౩

గాంతలెల్ల నవగళనాక్రాంతలగుచు॥ ఇట్లనిరి॥ మ॥ అకటా నమ్మితిమేము క్రూరుఁడన నిన్నర్థంబె మాయిండ్లలో। సకలవ్యా
ప్తులడించి నీపదసరోజాతంబులర్చింపఁజి।కక నే తెంచితిమీశుఁ డాఢ్యుఁడు మము దౌసక్తులం గాఁచు పో।లికఁ గావందగుఁ
గావవే విడువమే లే కాంతలన్ బ్రాంతలన్॥ మ॥ పతులన్ బిడ్డల బంధులన్ సుతులమన్నాటించు టే ధర్మమా। స్థితి నీవంటివి దేహధారి
ణులకున్ ధర్మజ్ఞ చింతింపుమా। పతిపుత్రాదిక నామమూర్తివగుచున్ భాసిల్లు నీయందుఁ దా।స్పతిపుత్రాధిక వాంఛలన్ సలిపి సంభా
వించుటన్యాయమే॥ మ॥ త్తకోకిల॥ నీపయిన్ రతిసేయుచుందురు నేర్పరుల్ సతతప్రియో।ద్దీపకుండవుగాన నెవ్వఁగఁ దెచ్చు నాథ
సుతాదులన్।జ్ఞాప నేటికి మన్మహాశలు చుట్టి నీకడనుండఁగాఁ। బాప నేల మదీయతాపము బాపవు బోలుఁ గృపానిధీ॥ సీ॥ నీపాద
కమలంబు నెమ్మిడగ్గరఁగాని తరలి వోవంగఁ బాదములు రావు। నీకరాబ్జంబులు నెఱి వంటితివఁగాని తిక్కనపనికి హస్తములు
చొరవు। నీవాగమృతధారనిండఁ గ్రోలఁగఁగాని చెవులన్యభాషలఁ జేరి వినవు। నీసుందరాకృతి నియతిఁ జూడఁగఁగాని చూడవ
న్యంబులఁ జూడ్కికవలు నిన్నె కాని పలుక నేరవు మా జిహ్వ। లొల్లననుచుఁ బలుక నోడ నీవు। మా మనంబులెల్ల నాఁ బలించి దొం
గిలి తేమి సేయువార మింకఁ గృష్ణ॥ చ॥ సిరికి నుదార చిహ్నములు సేయు భవచ్చరణారవిందము। ల్సరసిజనేత్ర మా తపము
సంపదఁ జేరితి మెట్టకేలకు। న్మఱలఁగ లేము మామగల మాటలనెల్ల ముపద్మగంధము। ల్మఱిగిన తేఁటులన్యకుసుమంబుల చెంత
లఁ జేరనేర్చునే॥ గీ॥ సవతు లేక నీవిశాలవక్షస్థలిఁ। దులసితోడఁ గూడఁ దోయజాక్షు। మనుపుమనుచు లక్ష్మి మానైన నీపాద। క
మలరజముఁ గోరుఁగాదె కృష్ణ॥ ఉ॥ అత్తలు మామలున్ వగవ నాడికోడక నాథులన్నుగా। యత్తులఁ జేసి యిల్వరుసలాడి నో
వఁగ నీమనవ్వులన్। నెత్తనమాటలన్ మఱుఁడు మేల్కొని యేఁచిన వచ్చినారమే। పొత్తులనొల్ల మోపురుషభూషణ దాస్యము
లిచ్చి కావవే॥ మ॥ మనువల్పి కర్రెతొల్లి వల్లభులకున్ మన్నించి తద్వల్లభు। ల్మగవంతంబు తలంపరే తగులముల్మా పాలనేపుచ్చై
నే। మగవారాడెడుమాట లేతగవు నీమాటల్మనోజాగ్నిచేఁ। బొగలం జాలము కౌఁగిలింపుము మముం బుణ్యాంబుపుణ్యాత్మ
కా॥ ఉ॥ కుండలదీప్తగండమున కుంచితకుంతలఫాలమున్ సుధా। మండితపల్లవాధరము మంజులహాసవిలోకనంబునై। యుండె
డు నీముఖంబు గని యుండఁగ వచ్చునె మన్మథేక్షుకో।దండవిముక్తబాణముల దాసుల మయ్యెద మాదరింపవే॥ సీ॥ నీయధరా
మృతనిర్ఝరంబులు నేఁడు చేరి వాతెఱలపైఁ జిలుకకున్న। నీవిశాలాంచితనిర్మలవక్షంబు కుచకుట్మలంబులఁ గూర్పకున్న। నీ
రమ్యతరహస్తనీరజాతంబులు చికురబంధంబులఁ జేర్పకున్న। నీకృపాలోకననివహంబు మెల్లన నెమ్మొగంబులమీఁద నెఱ
పకున్న। నీనవీనమాననీయసల్లాపంబు। కర్ణరంధ్రదిశలఁ గప్పకున్న। నెట్లు బ్రతుకువార మెందుఁ జేరెడువార। మధిపవినఁగఁ
దగదె యాఁడుకయులు॥ మ॥ భవదాలోకనహాసగీతజములై భాసిల్లు కామాగ్నులన్। భవదీయాధరపల్లవామృతముచేఁ బా
పక దగున్ బాపవే। నివియోగానలహేతిసంహతుల చేనీ త్రైభవచ్చింతల। న్భవదంఘ్రిద్వయవీథిఁ బొందెదము నీపాదంబు
లాన ప్రియా॥ క॥ తరుమృగఖగగోగణములు। కరము ప్పెడు నిన్నుఁగన్నఁ గానము విన్నన్। గరగి పులకించు నబలలు। కర
గరె నినుఁగన్న నీమగానము విన్నన్॥ సీ॥ ఈపంచబాణాగ్ని నేమిటనార్తుము నీమంజువాగ్వృష్టి నెగడదేని। నీమన్మథాం
భోధి నేత్రోవగడతుము నీదృష్టి నావమై నిలువదేని। నీచిత్తజధ్వాంత మేజాడఁ జెఱుతుము నీహాసచంద్రిక నిగుడదే
ని। నీదర్పకజ్వరమే భంగి నడఁతుము నీనవాధరసుధ నింపవేని। నెట్లు నిర్వహింతు మేలాగు మాలాగు। కరుణసేయ
వేని గదియవేని। మఱుఁడు నిర్దయుండు మననిచ్చునే యశో। దాకుమారయువతిధైర్యచోర॥ క॥ అమరులఁ గా
చిన హరి క్రియఁ। గనులేకుణ నీవు నేఁడు కరుణనభయహ। స్తము మాయురములశిరములఁ। బ్రమదంబున నిడుము మూర్ఛ
పాల్పడకుండన్॥ క॥ కట్టాతలమునుకలునై। ద్రట్టపు విరహాగ్ని శిఖలు తరుణుల నేఁప। న్నెట్టుంబలుకవు చూడవు। కట్టడవిగదా
కుమారకరుణోదారా॥ వ॥ అని యిట్లు కుసుమశరుని శరపరంపరాపరవశలై యోపికలు లేక పలికిన గోపికల దీనాలాపంబు
లు విని నవ్వి యోగీశ్వరేశ్వరుండైన కృష్ణుండాత్మారాముండై వారలతో రమించె నప్పుడు॥ మ॥ కరుణాలోకములం బటాం
చలకచాకర్షంబుల న్మేఖలా। కరబాహుస్తనమర్శనంబుల నఖాంకవ్యాప్తులన్నర్మవా। క్పరిరంభంబుల మంజులాధరసు
ధాపానంబులన్ గాంతలన్। గరగించెన్ రతికేళిఁ గృష్ణుఁడు కృపన్ గందర్పుఁ బాలార్చుచున్॥ క॥ మకురవవికసితవదనలు। చ
కరగఁగనుఁ గొల్వహాసచంద్రికతోడన్। మిక్కిలి మెఱసెను గృష్ణుఁడు। చుక్కలగమి నడిమి పూర్ణసోముని భంగిన్॥ గీ॥ పతు
లు వన్నెఁ బాడ సంప్రీతి నాడుచు। నలుతనున్న వైజయంతి తోడ। వనజలోచనుండు వనభూషణుండయ్యె। యువతిజనశతం
బులోలిఁ గొలువ॥ ఉ॥ చిక్కనిశుండై యెదిరిఁ జిక్కులఁ బెట్టెడి మాయలా నికిన్। జిక్కె కృతార్థలై మఱుని చిక్కులఁ జొక్కుల
తాంగులుండఁగా। మక్కువ శాంతి సేయుటకు మన్ననఁ జేసి ప్రసన్నుఁడౌటకున్। జక్కన నావిభుండు గుణశాలి తిరోహితుఁ
డయ్యె నయ్యెడన్॥ వ॥ ఇట్లు హరి కను మొఱంగి చనినఁ గరిం గానక తిరుగు కరేణుల పెల్లున నుల్లంబులు దల్లడిల్ల వల్లవకాంతలు

తదీయగమనహాసవిలాసవీక్షణవిహారవచనరచనానురాగంబులంజిత్తంబులుగోల్పడివివిధచేష్టలకుం బాల్పడితదాత్మక
త్వంబున నేన నేనకృష్ణుండననికృష్ణగుణావేశంబులంజరియించుచు॥క॥భూతములలోన వెలిఁబ్ర। ఖ్యాతుండగునట్టివానిఁ
గాంతలు కాళిందీతీరవనాంతరముల। భ్రాంతిన్వెదుకంగఁ జనిరిపాడుచునధిపా॥సీ॥పున్నాగకాన వేపున్నాగవందితుఁది
లకంబ కాన వేతిలకనిటలు।ఘనసార కాన వేఘనసారశోభితుబంధూక కాన వేబంధుమిత్రు।మన్మథకాన వేమన్మథాకారుని
వంశంబ కాన వేవంశధరునిఁ।జందన కాన వేచందనశీతలుఁగుందంబ కాన వేకుందరదను।సంక్రభూజమ కాన వేయింద్రవిభ
వుఁ।గువలవృక్షమ కాన వేకువలయేశుఁ।బ్రియకపాదపకాన వేప్రియవిహారు। ననుచుఁగృష్ణుని వెదకిరయ్యబ్జముఖులు॥మ
ఱియును॥ఉ॥నల్లనివాఁడుపద్మనయనంబులవాఁడుకృపారసంబుపైఁ । జల్లెడువాఁడుమౌళిపరిసర్పితపింఛమువాఁడున
వ్వురాజిల్లెడుమోమువాఁడొకఁడుచెల్వలమానధనంబుఁదెచ్చెనో।మల్లియలారమీపొదలమాటునలేఁడుగదమ్మచెప్ప
రే॥ఉ॥అంజునైనఁజూడహృదయంగముఁడైకరగించువాఁడు శ్రీ। రంగదరంబువాఁడుమధురంబగువేణురవంబువాఁ
డుమ।ప్మంగజుపువ్వుదూఁపులకునగ్గముచేసెలవంగలుంగనా । రంగములారమీకడకురాఁడుగదా కృపనుంచిచూడరే॥
సీ॥మానినీమన్మథుమాధవుఁగాన రేసలిలతోదారవత్సకములార।సలలితోదారవత్సకవైరిఁగాన రేసుందరోన్నతలతార్జు
నములార।సుందరోన్నతలతార్జునభంజుఁగాన రేఘనతరలసదశోకంబులార।ఘనతరలసదశోకస్ఫూర్తిఁగాన రేనవ్యరు
చిరకాంచనంబులార।నవ్యరుచిరకాంచనకిరీటుఁగాన రే।గహనపదవిఁగురువకంబులార।గహనపదపికురువకనివాసిఁగా
న రే।గణికలార చారుగణికలార॥సీ॥అదెనందనందనుండంతర్హితుండయ్యెఁబాటలీతరులారపట్టరమ్మ।హేలావతులఁగృష్ణ
యేలపాసితివనిమైలేయలతలారయడుగరమ్మ।వనజాక్షుఁడిచటికివచ్చిడాఁగఁడుగదాచూతమంజరులారచూడరమ్మ।
మానినీమదనుతోమాశాకమెఱిఁగించిమాధవీలతలారమనుపరమ్మ।జాతిసతులఁబాయనీతిమొహరికని।జాతులారదిశలఁ
జాటరమ్మ।కదళులారపోయికదలిందిశిఖిపింఛ।జూటుఁదెచ్చికరుణఁజూపరమ్మ॥క॥హరిచరణములకుఁబ్రియమై। హరిని
నుమన్నింపభ్రమందెడుతులసీ। హరినీదెసరాఁడుగదా।హరిచొప్పెఱిఁగించిశుభమునందింపగదే॥గీ॥పొగడదగువానిఁ
గాన రెపొగడలార।యీడెలుంగనివిభుఁజూపుఁడీడెలార। మొల్లమగుకీర్తివాఁడేడిమొల్లలార।శుకనిగదితునిఁజెపుఁడుకిం
శుకములార॥క॥తరుణీకుచకుంకుమయుత।హరికుందకదామగంధమడరెడిచూడ్కిఁ। హరిఁగనినపగిదిఁదనరెడి।హరిణీహ
రిఁజూడఁబుణ్యమయ్యెడిఁజెపుమా॥క॥కిటియైకౌఁగిటఁజేర్చెను।వటుఁడైనర్థిల్లికోలిచెవడిఁగృష్ణుండై । యిటుపదచిహ్న
ములిడెక్రిందటిబామునమేమినోఁచితమ్మధరిత్రీ॥వ॥ అనుచునున్మత్తచిత్తలైతదాత్మకత్వంబునఁగృష్ణులీలలననుకరించు
చు.సీ॥పూతనయైయొక్కపొలఁతిచరింపంగశౌరియైయొకకాంతచన్నుగుడుచు।బాలుఁడైయొకభామపాలకునేడ్చుచో
బండినేననులేమఁబాఱఁదన్ను।సుడిగాలిననియొక్కసుందరిగొనిపోవహరిననివర్తించునబ్జముఖియు । బకుఁడనేననియొ
క్కపడఁతిసంరంభింపఁబద్మాక్షుఁడనుకొమ్మపరిభవించు। నెలమిరామకృష్ణులింతులిద్దరుగాఁగ।గోపవత్సగణముకొందఱు
గుచు।లసురవైరిననుచునబలయొక్కతెచీఁఱు।బసులమనెడిసతులభరతముఖ్య॥గీ॥లోకమెల్లఁగుక్షిలోపలనున్నట్టిమా
ధవుండనేనుమాతవీవు।చూడుమనుచునొక్కసుందరియొకతెకు।ముఖముఁదెఱచిచూపుముఖ్యచరిత॥క॥వెన్నలుదొంగిలి
తినియెడి। వెన్నుఁడననియొకతెనడువవేఱొక్కతెచే।సన్నలయశోదనంచును।గ్రన్ననఁగుసుమములదండఁగట్టునిలేశా॥
క॥కాళియఫణియిదివీరలు।కాళియఫణిసఖులు మ్రొక్కఁగడఁగిరినేగో।పాలకుమారుఁడననుచును।లీలాగతినాడునొక్క
లేమనరేంద్రా॥క॥తరుణులుగోపకులందఱు।హరిహయుఁడిదెవానగురిసెహరినేననిభా।సురచేలాంచలమొక్కతె।గిరినె
త్తెదననుచనెత్తుఁగెంగేలన్నృపా॥క॥మీరలుగోపకులేనను।రారిదిదావాగ్నివచ్చెనటుచూడకుఁడీ। వారించెదననియొక్క
తె।చేరిబయల్కబళనంబుసేయునరేంద్రా॥వ॥ఇట్లు తన్మయత్వంబునగోపసుందరులుబృందావనంబునంగలతరులతాదు
లహరినడుగుచునిరర్గళంబులైనవిపినమార్గంబులసరోజాతకేతనకులిశాంకుశాదిలక్షణలక్షితంబులైమనోహరంబుల
యినహరిచరణంబులచొప్పుఁగనితప్పకచెప్పికొనుచుఁదమలోనిట్లనిరి॥ సీ॥ కొమ్మకుఁబువ్వులుగోసినాఁడిక్కడమొనసి
పాదాగ్రంబుమోపినాఁడు।సతినెత్తికొనివేడ్కజరిగినాఁడిక్కడఁదృణములోఁదోఁపమతెలవజాడ।ప్రియకుఁధమ్మిల్లం
బుపెట్టినాఁడిక్కడఁగూర్చున్నచొప్పిదెకొమరుమిగులు।నింతికిఁగెమ్మోవినిచ్చినాఁడిక్కడవెలఁదినిక్కినగతివిశదమయ్యె
సుదతితోడనీరుఁజొచ్చినాఁడిక్కడఁ।జొచ్చితావెడలినచోటులమరెఁ।దరుణిఁగామకేళిఁదనిపినాఁడిక్కడ। ననఁగిపెనఁ
గియున్నయందమొప్పె॥మఱియును॥సీ॥ఒకయెలనాగ చెయ్యూఁదినాఁడిక్కడసరసనున్నవినాల్గుచరణములును। నొకనీ
లవేణితోనాదిగినాఁడిక్కడమగజాడలోనిదెమగువజాడ।యొకలేమ మ్రొక్కననొడివినాఁడిక్కడ రమణిమ్రొక్కినచో

ప్పురమ్యమయ్యె। నొకయింతి కెమలు గానొలసి నాఁడిక్కడ నన్యోన్యముఖములై యంఘ్రు లొప్పె। నొక తె వెంటఁదగుల
నుండక నేఁగినాఁ డమగుమీఁదఁ దరుణి యడుగులమరె। నబలలిరు గెలంకులందు శాఁదిరిగినాఁ। డాలుపదములున్నవమ్మ యి
చట॥ సీ॥ ఈ చరణంబులే యింమని భానన సనకాది ముని యోగ సరణి నెప్పు। నీపాదతలములే యెలనాగ శ్రుతివధూసీమంత
వీథులఁ జెన్నుమిగులు। నీపదాబ్జంబులే యిభక్తులోత్తమయానపాలేటి రాచూలిపట్టుకొమ్మ। లీ సుందరాంఘ్రులే యిందీవ
రేక్షణముక్తి కాంతామనోమోహనంబు। లీయడుగులరజమె యింతి బ్రహ్మాదివిబుధవరులు మౌళి దిశలఁ దాల్తు। రను
చుఁ గొంచబలలబ్జాక్షుఁ డేఁగిన। క్రమముఁ గనియు నతనిఁ గానరైరి॥ సీ॥ పతులదైన్యంబును భామల క్రౌర్యంబుఁ జూపుచు
విభుఁ డొక్క సుదతితోడ। విహరింప నది యెల్ల వెలఁదులవర్జించి నా యొద్దనున్నాఁడు నాథుఁ డనుచు। గర్వించి రాజాలఁగను
లాక్షుమూఁపు నెక్కుకొను మనుఁడు నయ్యీశ్వరుండు। మొఱఁగి పోయినఁ దాపమును బొంది యోకృష్ణ యెక్కడఁ జనితి ప్రా
ణేశ రమణ। నీకు వరవుడ నయ్యెదనిలువు మనుచు। వగవఁ గొందలు కాంతలా వనితఁ జూచి। వరుఁడు మున్నింప గర్వించి వనజనే
త్రి। చిక్కనేఁడని వెలఁగును జెందిరపుడు॥ వ॥ జీయును॥ సీ॥ ఈ పాదరింటిలో నిందాఁక కృష్ణుండు నాతోడ మన్మథనటనమా
డె। నియ్యాలమగు చోట నిందాఁక చెలువుండు గాఢంబు గా నన్నుఁ గౌఁగిలించె। నీమహీజము నీడ నిందాఁక సుభగుండు చిట్ట
ట్టు సేఁత లసిగ్గుఁగొనియె। నీపుష్పలతపొంత నిందాఁక దయితుండు నను డాసి యధరపానంబు సేసె। నీప్రసూన వేది నిందాఁ
క రమణుండు। కుసుమదామములను గొప్పఁ దీర్చె। ననుచుఁ గొంద ఱతి వెలం భోజనయనుని। పూర్వలీలఁ దలఁచి పొగడి రధిప॥
వ॥ అని యిబ్బంగిలతాంగులందఱును బృందారణ్యమందీశ్వరు న్వనజాక్షున్వరికించి కానక విభు న్వర్ణించుచున్నాడుచు। న్మ
నములు మాటలు చేష్టలు న్గ్రియలు నమ్మానాథుపైఁ జేర్చి వే। చని రయ్యమునసైకతాగ్రమునకు న్సంత్యక్తగేహేచ్ఛలై॥ చని

## శ్రీ గోపికాగీతల ప్రారంభము. శ్రీ

గోపికలు హరి నుద్దేశించి యిట్లనిరి॥ క॥ నీవు జనించిన కతమున। నోవల్లభ లక్ష్మి నుందనొప్పెనధికమై। నీ వెంట నె ప్రాణములిడి।
నీవారరసెదరు చూపు నీరూపంబుల్॥ క॥ శారదకమలోదర రుచి। చోరకమగు చూపువలన సుందరమమ్ము। న్గోరి వెలయీని
దాసుల। ధీరత నొప్పించుట యిది వధించుట గాదే॥ గీ॥ విషజలంబువలన విషధర దానవు। వలనఁ గాలివలన వహ్నివలన। నున్నవా
నివలన నొగి మమ్ము రక్షించి। కుసుమశరుని బారిఁ గూల్పఁదగునె॥ ఉ॥ నీవు యశోదబిడ్డఁడవె నీరజనేత్ర సమస్తజంతు చే। తోవి
దితాత్మ వీశుఁడవు తొల్లి విరించి దలంచి లోకర। క్షావిధమాచరింపుమని సన్నుతి సేయఁగ సత్కులంబున। న్భావలయంబుఁ
గావ నిటు పుట్టితి గాదె మనోహరాకృతిన్॥ గీ॥ చరణసేవకులకు సంసారభయమును। బాపి శ్రీకరంబు పట్టుగలిగి। కామదా
యియైన కరసరోజంబు మా। మస్తకములను నిడుము పుమీశ॥ ఉ॥ గోవుల వెంటఁ ద్రిమ్మరుచుఁ గొల్చినవారల పాపసంఘము।
ల్డోలఁగఁజాలి శ్రీదనరి దుష్టభుజంగఫణాలతాగ్రసం। భావితమైన నీచరణపద్మము చన్నులమీఁద నొపిత। ద్భావజపుష్ప
భల్లభవబాధ హరింపు వరింపు మాధవా॥ క॥ బుధరంజనియను సూక్తియు। మధురయు నగు నీదు వాణి మఱగించెను నీ। యధ
రామృతసంసేవన। విధి నంగజతాపమెల్ల విడిపింపగదే॥ క॥ మగువల మెడ నీ క్రౌర్యము। తగునే నిజభక్తభీతిదమనుఁడవకటా।
తగదు భవద్దాసులకును। నగుమొగముం జూపి కావు నళినదళాక్షా॥ మ॥ ఘనలక్ష్మీయుతమై మహాశుభదమై కామాదివిధ్వం
సియై। సనకాదిస్తుతమై నిరంతరతపస్సంతప్తపున్నాగజీ। వనమై యొప్పెడు నీకథామృతము ద్రావంగల్గు నేభూరిదా। నని
రూఢత్వము లేని వారలకు మా నారీమనోహారకా॥ క॥ నీ నగవులు నీ చూడ్కులు। నీ నానా విహరణములు నీ ధ్యానంబు। ల్నీన
ర్మాలాపంబులు। మానసముల నాఁటి నేఁడు మగుడవు కృష్ణా॥ గీ॥ ఘోషభూమి వెడలి గోవుల మేపంగ। నీరజాభమైన నీ పద
ములు। కసవు శిలలు దాఁకి కడు నొచ్చునో యని। కలఁగు మామనములు కమలనయన॥ ఉ॥ మాపటి వేళ నీవు వనమధ్యము వెల్వ
డి వచ్చి గోప్పన। ప్రాపితధూళిధూసరిత భాసితకుంతలమై సరోరుహా। న్దీపితమైన నీమొగము ధీరజనోత్తమ మాకు వే
డ్కతోఁ। జూపి మనంబులన్మరునిఁ జూపుదు గాదె క్రమక్రమంబునన్॥ గీ॥ భక్తకామదంబు బ్రహ్మసేవితమిలా। మండనం
బు దుఃఖమర్దనంబు। భద్రకరమునైన భవదంఘ్రియుగము మా। యురములందు రమణ యునుపఁదగదె॥ గీ॥ సురతవర్ధనంబు శో
కాపహరణంబు। స్వనితవంశనాళసంగతంబు। నన్యరాగజయమునైన నీ మధురాధ। రామృతమునఁ దాపహార్పుమీశ॥ ఉ॥ నీ
వడవింబ గల్గిరుగ నీ కుటిలాలకలాలితాస్యమి। చ్ఛావిధిఁ జూడకున్న నిమిషంబులు మాకు యుగంబులై చనుం। గావున రాత్రు
లైన నినుఁ గన్నుల నెప్పుడుఁ జూడకుండల। క్ష్మీవర రెప్పలడ్డముగఁ జేసెని దేలవిధాత క్రూరుఁడై॥ ఉ॥ అక్కటబంధులున్మగలు
నన్నలు దమ్ములుఁ బుత్రకాదులు। న్నెక్కొని రాత్రిఁ బోకుఁడన నీమృదుగీతరవంబు వీనుల। న్వెక్కసమైన వచ్చితిమి వేగమె
మోహము నొంది నాథ నీ। వెక్కడ వోయితో యెఱుఁగ మీక్రియ నిర్దయుఁ డెందుఁ గల్గునే॥ గీ॥ మదనుఁ డార్వంగ నీ వాఁడు

మంతనములు। నవరసాలోకనంబగు నను మొగంబు। కమలకిరవైన మహితవక్షస్స్థలంబు। మానసంబుల లోఁగొనిమఱిపెగ్గృ
ష్ణ॥ మ॥ అరవిందంబులకంటెఁ గోమలములై యందంబులై యున్ననీ । చరణంబుల్ శిరంబులై మొనయ మాచన్నులంగవ
న్మోవఁగా। నెఱియంబోలు నటంచుఁ బోకుఁడుము నయ్యో కర్కశారణ్యభూ। పరిసంచారము కృష్ణ నీ ప్రియలకుం బ్రాణవ్య
థం జేయదే॥ క॥ కట్టా మన్మథుకోలలు। నెట్టన నోనాఁట బెగడి నీ పాదంబుల్ బట్టికొనఁగ వచ్చినము। నట్టడవి నిడించి పోవ నా
యమె కృష్ణా॥ క॥ హృదయేశ్వర మాహృదయము। మృదుతరముగఁ జేసితొల్లి మిక్కిలి కడు నీ। హృదయము కఠినము చేసెను।
మదీయ సౌభాగ్య మెట్టిసుండమ గలదే॥ ఉ॥ క్రమ్మి నిశాచరుల్ సురసికాయములన్విడిఁ దాఁకి పీఁకవా। లమ్ముల తెట్టెముల్వాఱు
పనడ్డము వచ్చి జయింతువంత్రు ని। న్నమ్మి నముగ్ధల న్రహితసాథలనక్కట నేఁడు రెండు మూఁ। డమ్ముల యేటు కాఁడె సువన
ద్దము రాఁదగదే కృపానిధీ॥ క॥ తియ్యవిలు కాఁడు డీకొని। వ్రయ్యలుగా నాఁటనేసె వనితల మనము। ల్నియ్యానయింక నైనం।
గుయ్యాలింపంగదయ్య గోవిందహరీ॥ మ॥ అనియిట్లంగనలం చితస్వరముతో నంకించుచున్ బాడుచు। న్దను రావే యని చీఱియే
డువ జగత్త్రాణుండవై త్రైలోక్యమోహనుఁడై మన్మథమన్మథుండయి మనోజ్ఞాకారియై యంతటన్। న్ఘనపీతాంబరధారియై
పొడసూపెం దత్కాంతాసమీపంబునన్॥ క॥ వచ్చిన వల్లభుఁ గనుఁగొని। విచ్చేసె నటంచు సతులు వికసితముఖలై। యచ్చుగని
ల్చిరి ప్రాణము। వచ్చిన నిలుచుండు నవయవంబుల భంగిన్॥ సీ॥ అబలయొక్కతె భక్తి నంజలి గావించి ప్రాణేశు కెంగేలుఁ బ
ట్టికొనియె। నింతియొక్కతె జీవితేశ్వరు బాహువు మూపున నిడికొని ముదము నొందె। వనితయొక్కతె తనవల్లభు తాంబూ
లచర్వితమాత్మహస్తమునఁ దాల్చెఁ। బడఁతియొక్కతె ప్రియుపదము లువిరహాగ్నితప్తకుచంబులఁ దాఁపుకొనియె। భామ
యొకతె భ్రూకుటిబంధంబుఁ గావించి। ప్రణయభంగ కోపభాషణమున। దష్టదశన యగుచు దండించువైనడి। వాఁడి చూడ్కి గ
ములవరునిఁ జూచె॥ క॥ హరిముఖకమలముఁ జూచుచుఁ। దరుణియొకతె రెప్పలిడక తనియక యుండెన్। హరిపదకమలముఁ జూ
చుచు। మఱిగిత్తనివిలేని సుజను మాడ్కి నరేంద్రా॥ ఉ॥ ఒక్కలతాంగి మాధవుని యుజ్జ్వలరూపము చూడ్కిఁ దీఁగెలం। జిక్కఁ
గఁబట్టి హృద్గతముఁ జేసి వెలింజనకుండ నేత్రముల్ ద్రిక్కవమూసి మేనఁ బులకంబులు గ్రమ్మఁగఁ గౌఁగిలించుచు। న్జొక్కములై
న లోచనులఁ జొక్కుచునుండెను యోగికైవడిన్॥ సీ॥ ఎలయించి ప్రాణేశ యెందుఁబోయితి వనితోరంపుటలుక తో దూఱు నొక
తె। జలజాక్షననుఁ బాసి చనఁగ నీపాదంబు లెట్లాడెనని వగ నెడి తెనొకతె। నాథ నీవఱిగిన నా ప్రాణమున్నది హార్మి యేమియిది
యనిమందెనొకతె। యీశ్వరననునిన్ను నిందాఁకపాపెనే పాపపువిధి యని పలుకు నొకతె। తలఁగిపోవునట్టి తప్పేమి చేసితి। న
ధిప పలుకు ధర్మమనియె నొకతె। యేమినోముఫలమొ హృదయేశ నీమోము। గంటి ననుచు మసలె నొకతె॥ క॥ పలికిన ప్ర
తిపల్కఁదప్పెడిఁ। బలికించినఁ గాని రమణుఁ బలుకనటంచు। న్గలకంఠి యొకతె చెలితోఁ। బలుకుల నమృతములు గురియ పలుకులు వ
లికెన్॥ క॥ పట్టినఁగాని మనోవిభుఁ। బట్టఁగదా యంచు నొక్క బాలిక సఖిచే। పట్టుకొని చెప్పె ధైర్యము। పట్టెల్లను గురుని జెంకిప
ట్టుగ నధిపా॥ క॥ చెలువుఁడు చెప్పక పోయిన। సొలపున నొకముగ్ధ మున్ను చూడననుచు నా। దలవంచి యుండెఁ జాలక। తలమెత్తె
ను లోన మరుఁ డెత్తలమెత్తన్నృపా॥ ఇవ్విధంబున॥ క॥ హరిసురుచిరలలితాకృతిఁ। దరుణులు గని ముక్తవిరహతాపజ్వరలై। పర
మోత్సవంబు సలిపిరి। పరమేశ్వరుఁ గని నముక్తబంధుల భంగిన్॥ వ॥ అంతనక్కాంతుండు కాంతాజనపరిక్రాంతుండై వనాంత
రంబున శక్తినికరసంయుక్తుండైన పరమపురుషుండునుం బోలె వారలం దోడ్కొని మందార కుంద కురువక పరిమళ మిళిత పవమా
నమానితమధుకరనికర ఝుంకార సుకుమారంబును, శరత్కాల చంద్రకిరణ సందోహ సంఛలిత అంధకారంబును, యమునాత
రంగసంగత కోమల వాలుకాస్ఫారంబును నై యమాలినంబైన పులినంబు ప్రవేశించె. వారును జ్ఞానకాండంబున నీశ్వరుంగని
శ్రుతులు ప్రమోదంబునం గామానుబంధంబుల విడిచిన విధంబున హరిం గని విరహవేదనల విడిచి పరిపూర్ణమనోరథలై॥ క॥
పాఠీననయనలెల్లన। కాళిస్యపటాంచలములఁ గౌతుకములు హృ। త్పీఠముల సంపడింపఁగ। బీఠముఁ గల్పించి రంతఁ బ్రియునకు
నధిపా॥ గీ॥ పరమయోగిహృదయభద్రపీఠంబుల। నుండుమేటి వ్రజవధూత్తరీయ। పీఠమున వసించి పెంపారెఁ ద్రిభువన। దే
వలక్ష్మి మేనఁ దేజరిల్ల॥ మ॥ మదనోద్దీపితుఁడైన నాథునికి సన్మానంబు గావించుచు। న్మదితభ్రూవిలాసవిలోకవిభ్రమముల న్మోదించు
చుం జేరి తత్పదముల్ హస్తతలంబులన్ బిసుకుచు న్నైచెముట్టుచుఁ జాఱుచు। న్జదురుల్వల్కుచుఁ గూర్మినిట్లనిరియాసక్తోపదీస్తా
స్యలై॥ క॥ కొలిచినఁ గొలుతురు కొందఱు। గొలుతురు దముఁ గొలువకున్నఁ గొందఱుపతులం। గొలిచినను గొలువకున్నను।
గొలువరు మఱికొందఱెలమి గోపకుమారా॥ వ॥ అనితన్నునుద్దేశించి రహస్యంబుగాఁ బల్కిన సుందరుల పలుకులు విని గోపా
లసుందరుండిట్లనియె॥ సీ॥ కొలిచినఁ గొలుతురు కొందఱు పశువుల భజనముభంగిని ఫలముకొఱకు। నైసఖ్యధర్మములందు సిద్ధిం
పవు కొందఱుతంత్రుల గుణముఁ దాల్చి। దయఁగలవారును దగిన సుహృత్తులు గొలువనివారలఁ గొల్తురెపుడు। ధర్మకామంబు

లుతనరంగఁగొందఱుకొలువనివారినిఁగొలుచువారిఁ। గొలుచుతలఁపు లేమిఁగొలువరాత్మారాములాప్తకాములజ్ఞులకృ
తీసులువారియందుఁబిదపవానిఁగాఁ జింతించి। నేలతాంగులారయిట్టులనుట॥క॥ ఏనిం దెవ్వఁడనైనం। గానంగనలారపర
మకారుణికుండ। న్మానసబంధుఁడనిత్యా। ధ్యానముమీకొనరవలసితలఁగితిసుండీ॥మ॥ నను సేవించుచునున్నవారలకు నేనా
రూపముంజూపఁజూ। చినఁజాలించిమదించివారుమదిన స్సేవింపరోయంచుని। ర్ధనికుండాత్మధనంబుచెడ్డ నెపుడున్దత్పారవ
శ్యంబుదా। ల్చినభంగిన్ననుఁబాసిమత్ప్రియుఁడుదాఁజింతించునారూపముల్॥ తరల॥ తగవుధర్మముఁజూడ నెల్లకఁడల్లి
దండ్రులబంధులన్మగలబిడ్డలఁ బాసివచ్చినమన్నిషక్తులమిమ్ము నేఁ। దగమపాసితిఁదప్పసైఁపుఁడుతద్వియోగభరంబున।
న్వగలఁబొంచుచుమీరలాడినవాక్యముల్వినుచుండితిన్॥ఉ॥పాయని గేహశృంఖళముఁబాసినిరంతరమత్పరత్వముల్। జే
యుచునున్నమీకుఁబ్రతిసేయయుగంబులనైన నేరనన్। బాయకఁగొల్చుమానసము ప్రత్యుపకారముగాఁదలంచినా।పా
యుటఁదప్పగాఁగొనకభామినులారకృపన్సమింపరే॥క॥చక్కగహరియిటుపలికినఁ।జక్కనివాక్యములనతనిసంగమమున

## ——⇒శ్రీ రాసక్రీడాభివర్ణనము. శ్రీ⇐——

లో। నిక్కనపియోగతాపములొక్కటవిడిచిరిలతాంగులుర్వీనాథా॥ఉ॥ఆసమయంబునన్విభుఁడనంతుఁడుకృష్ణుఁడుచి
త్రమూర్తియై। చేసెనుమండలభ్రమణశీలపరస్పరబద్ధబాహుకాం। తాసువిలాసముల్బహువిధస్ఫురితాననహస్తపాద
విన్యాసమురాసముల్గృతవియచ్చరనేత్రమనోవికాసముల్॥వ॥ ఇట్లుబహుగతులందిరుగనేర్పరియగుహరి,దర్పించి
తనయిరుకెలంకులనలంకృతలై,కళంకరహితచంద్రవదనలిద్దరుముద్దియలందుకొని.వీణలంబ్రవీణలైసొంపుమెఱసియిం
పుగవాయించుచు,నానందలహరీనిధానంబగుగానంబుసేయ,నవిరళంబైతరళంబుగాని వేడుకసగళంబగు,మురళంబులీ
లంగేలనందుకొని, మధురంబగునధరంబునంగదియించిమించి, కామినీజనకబరికాసౌగంధికగంధబంధురకరాంగుళీకిసల
యంబులుయతిలయంబులంగూడి,వివరంబుగమురళీవివరంబులసారించిపూరించుచుసరిలేనిభంగిన్ద్రిభంగియైకమలక
ర్ణికాకారంబుననమునిలిచిమఱియుగోపసుందరులెందఱందఱకునందఱయిసుందరులకవలియెడలందానునుదనకవలియె
డలసుందరులును,దేజరిల్లనృత్యవిద్యామహార్ణవవేలావలయవలయితంబై,విస్మితాఖండలంబైనరాసమండలంబుగల్పిం
చివేల్పులుహర్షంబునంగుసుమవర్షంబులుగురియనంతఁబ్రసూనమంజరీసహచరంబులైనచంచరీకంబులమించుప్రకటిం
చుసువర్ణమణిమధ్యగంబులైనను హేంద్రనీలంబుల తెఱంగు నెఱపుచుఁ,గరిణీవిహారబంధురంబులైన సింధురంబులచెలు
వుఁగైకొలుపుచుఁ,బల్లవితకుసుమితలతానుకూలంబులైనతమాలంబులసొబగునిగుడించుచు, మెఱుపుఁదీగలయెడ నెడఁబె
డంగడరునల్లమొగుల్లపెల్లుచూపుచుఁ,దరంగిణీసంగతంబులైనరోహణాచలశృంగంబులబాగులాగించుచు,జగన్మోహనుం
డైయుండి,రక్తకమలారుణంబులును,జంద్రశకలనిర్మలనఖరసంస్ఫురణంబులును,శ్రుతినితంబినీసీమంతవీథికాలంకరణం
బులును,సనకసనందనాదియోగీంద్రమానసాభరణంబులునునైన, చరణంబులుగదియనిడిసమస్థితినంజలిపుటంబులంబు
ష్పంబులుల్లసిల్లఁజల్లిసల్లలితకమలప్రశస్తంబులైనహస్తంబులువల్లవీజనులకంఠంబులపైనిడిగీతానుసారంబుగవిచిత్ర
పాదసంచారంబులుసలుపుచు, వర్తులాకారరాసబంధంబులనర్తనంబునంబ్రవర్తించి, వెండియుఁద్రేతలుండానును,శం
ఖపద్మవజ్రకంచుకచతుర్ముఖచక్రవాళచతుర్భద్రసౌభద్రనాగనంద్యావర్తకుండలీకరణ కురళీబంధప్రముఖంబులైన
విశేషరాసబంధంబులకుంజొక్కి, యేకపాదసమపాదపినివర్తిత గతాగత వలితవైశాఖ మండలత్రిభంగిప్రముఖం
బులైన తానకంబులనిలుచుచుఁ, గనకకింకిణీమంజుల మంజీరసింజనంబులు, జగజ్జనకర్ణరంజనంబులై చెలంగ, ఘటిత
మర్దితపార్శ్వగప్రముఖంబులైనపాదకర్మభేదంబులు సేయుచు,సమపాదశకటవదనమతల్లిశుక్తిప్రముఖంబులైనపా
ర్థివచారివిశేషంబులును,నపక్రాంతడోలాపాదసూచీప్రముఖంబులైనవ్యోమచారివిశేషంబులంజూపుచు,సురేంద్రశా
ఖిశాఖామనోహరంబులు,నపహసితదిక్కరీంద్రకరంబులును,ద్రిలోకక్షేమంకరంబులును,నగుకరంబులందిరంబులగు
రత్నకటకంబులమెఱుంగులునింగిచెఱంగులందుచుకొన,నర్ధచంద్రకర్తరీముఖకపిత్థకటకాముఖశుకతుండలాంగూలప
ద్మకోశపతాకాప్రముఖంబులైనస్వస్వభావసూచకనానావిధకరభావంబులాచరించుచుఁ,గటినిబద్ధసువర్ణవర్ణచేలాం
చలప్రభానికరంబులుసుకరంబులైదిశాంగనాముఖంబులకుహరిద్రాలేపనముద్రాలంకారంబులొసంగుచు, నాస్కంది
తభ్రమరశకటాసనప్రముఖంబులైన భానుమండలభేదంబులు, నలాతదండవాతలలితవిచిత్రప్రముఖంబులైన దైవ
మండలంబులొనర్చుచుఁ,గమనీయకంబుకంఠాభిరామంబులు,నుద్దామతేజస్తోమంబులునైననీలమౌక్తికవజ్రవైడూర్య
దామంబులరుచులిందిరాసుందరికిమందిరంబులైసుందరంబులయినయురంబులందిరుగుడువడికలయంబడినఁ,గాంతార

వాహ్యాలకుఛత్ర ప్రముఖంబులైన భ్రమరవిశేషంబులవిలసించుచు, నిర్గంబులగు చెక్కుటద్దంబుల నుద్ధవిడితద్దయుం బ్రభాజితచంద్రమండలంబులగుకుండలంబుల మెఱుంగుమొత్తంబులునృత్యంబులొనరింపఁగటిభ్రాంతదండరచితలలాటతిలకమయూరలలితచక్రమండలనికుంచితగంగావతరణప్రముఖంబులైనకరణంబులెఱింగించుచు, వెలిదమ్మివిరులసిరుల చెన్నుమిగులుకన్నులవలన దీనజనదైన్యకర్కశంబులై తనరుకటాక్షదర్శన జాలంబులుజాలంబులై కామినీజననయనమీనంబులనావరింప, లళితకుంచితవికాసముకుళప్రముఖంబులైనచూపుల్కలఁదేజరిల్లుచు, ననేకపరిపూర్ణచంద్రసౌభాగ్యసదనంబులగువదనంబులఁ, బ్రసన్నరాగంబుఁబ్రకటించుచు,నుదంచితపింఛమాలికామయూఖంబులఁగాలశక్రచాపంబులసొంపుసంపాదింప,నికుంచితాకుంచితకంపితాకంపితపరివాహితపరావృత్తప్రముఖంబులైన శిరోభావంబులునెఱపుచు,మృగనాభితిలకంబులుగలనిటలఫలకంబులఁజికురంబులనికరంబులుగప్ప, నవరాజితసూచికావిద్ధపరిచ్ఛిన్నవిష్కంభరేచితప్రముఖంబులగునంగహారంబులవిలసిల్లుచుఁ,జరణకటికరకంఠరేచకంబులాచరించుచు,నొప్పెనప్పుడారాసంబు,సంజనితసకలజనమానసోల్లాసకరంబై, సుధార్ణవంబునుంబోలెనుజ్జ్వలరసాభిరామంబై, రామరాజ్యంబునుంబోలెరాగపరిపూర్ణంబై,పూర్ణచంద్రమండలంబునుంబోలెఁగువలయానందంబై,నందనవనంబునుంబోలెభ్రమరవిరాజమానంబై,మానధనునిచిత్తంబునుంబోలెఁబ్రధానవృత్తిసమగ్రంబై,సమర్థకవివిలసనంబునుంబోలెబహుప్రబంధబాసురంబై,సురలోకంబునుంబోలెవసుదేవనందనవిశిష్టంబై, శిష్టచరితంబునుంబోలెధరణీగగనమండలసుందరంబై, సుందరీరత్నంబునుంబోలెనంగహారమనోహరంబై, హరవధూనిలయంబునుంబోలెననేకచారిసుకుమారంబై, సుకుమారవృత్తంబునుంబోలెనుద్దీపితవశంబైయుండెనందు॥ చ॥ నడుములువీఁగియాడఁజెఱునవ్వులునివ్వటిలంగహారముల్। సుడివడమేఖలల్వదలఁజూడ్కిమెఱుంగులువర్వఘర్మము।ల్పొడమఁగురుల్చలింపశ్రుతిభూషణముల్మెఱయన్సకృష్ణలై।పడఁతుకలాడుచుంజెలఁగిపాడిరిమేఘతటిల్లతాప్రభల్॥ క॥ అంకరహితేందువదనలు।పంకజలోచనునిఁగూడిపరగనటింప। న్గింకిణులనూపురంబుల।కంకణముల మ్రోతలెసఁగెఁగర్ణోత్సవమై॥ క॥ హరిణీనయనలతోడను।హరిరాసక్రీడసేయనంబరవీథి।న్సురనాథులుభార్యలతో।సొరిదివిమానంబులెక్కిచూచిరిలేశా॥ క॥ కురిసెన్పువ్వులవానలు। మొరసెందుందుభులుమింటముదితలుదారు।న్సరసన్గంధర్వపతు।ల్వరుసన్పాడిరపుడువసుధాధీశా॥ క॥ రామలతోడనురాసము। రామానుజుఁడాడఁజూచిరాగిల్లిమనో।రాములమీఁదవియచ్చర। రాములుమూర్ఛిల్లిపడిరిరామవినోదా॥ క॥ తారాధిపనిభవదనలు।తారాధిపవంశుఁగూడితారునటింపన్।దారలునిల్చిసుధాంశుఁడు।దారునువీక్షింపరేయితడవుగజరిగెన్॥ మ॥ యమునాకంకణచారియైవనజపుష్పామోదసంచారియై।రమణీఘర్మనివారియైమదవతీరాసశ్రమోత్తారియై। ప్రమదామానసనవ్యభవ్యసుఖసంపత్కారియైచేరియా।కమలాక్షుండలరంగఁగాలివిసరెన్గల్యాణభావంబునన్॥ అప్పుడు॥ మ॥ ప్రమదయొకర్తెమాధవుఁడుపాడవిపంచిధరించికేలసం।భ్రమమునఁదంత్రిమీఁటుచుఁదిరంబుగగానముచేసెయొక్కరా।గముతగనాలపించిసుభగస్వరజాతులువేలువేలకా।నమరఁగఁబాడెఁదన్రమణుఁడౌననదారువులంకురింపఁగన్॥ క॥ ఆడుచుఁబాడుచునందొక।చేడియమంజీరమంజుశింజితమమరం।గూడిహరికరముచనుఁగవ। పైఁడాయఁగఁదిగిచెజఘనభారాలసయై॥ క॥ చందనలిప్తంబైయరవిందామోదమునఁనొప్పువిపులభుజముగో।వింద్ఁడొకతరుణిమూపునఁ। బొందించిననదిదెమల్చిపులకించెన్నృపా॥ సీ॥ చెలువయొక్కతెచెక్కుఁజెక్కుతోమోపినవిభుఁడుతాంబూలచర్వితమువెట్టె।నాపచుయొకలేమయలసినఁబ్రాణేశుఁడున్నతదోస్తంభమూఁతఁజేసెఁ।జెమరించియొకభామచేరినఁగడగోరఁజతురుఁడుగుచఘర్మజలమువాపె।నలకంబులొకయింతికలికచిత్రకరేఖనంటినఁబ్రియుఁడుపాయంగదువ్వెఁ। బడఁతియొకతెపాటఁబాడిడస్సినయథ।రామృతమునాథుఁడాదరించె ।హారమొక్కసతికినంసావృతంబైనఁ। గాంతుఁడురముఁజేర్చికౌఁగిలించె॥ క॥ హాసంబులఁగలరతలవి।న్యాసంబులదర్శనములనాలాపములన్।రాసశ్రాంతలకాహరి। సేసెన్మన్ననలుకరుణఁజేసినరేంద్రా॥ క॥ హరితనుసంగసుఖంబునఁ।బరవశలైవ్రేతలెల్లఁబయ్యెదలునిజాం।బరములునెఱుఁగమిచోద్యమె। సురసతులీక్షించికరగిచొక్కిరిమింటన్॥ వ॥ ఇట్లుభగవంతుండైనకృష్ణుండాత్మారాముండయ్యునుగోపసతులెందఱందఱకు నందత్తైనిజప్రతిబింబంబులతోడంగ్రీడించుబాలురపోలికెరాసకేళిసలిపిన॥ క॥ తగఁగూడియాడిమనముల। నగెఁజూచెంబలికెనం

## ⇒ జలక్రీడాభివర్ణనము. ⇐

దనందనుఁడనుచున్మగువలుపెద్దతికముతోఁ।బొగడిరితమపూర్వజన్మపుణ్యశ్రేణిన్॥ వ॥ ఇట్లుహరిరాసకేళిసాలించి, తలంగుతటిల్లతలచెలువున,ఘర్మసలిలకణాక్రాంతలగుకాంతలంగూడి,జలక్రీడాకుతూహలుండై,యమునాజలంబుసొర,

నంమముందరసుందరులుసొచ్చి,పదప్రమాణంబుఁజానుదఘ్నంబు,కటిద్వయసంబు,మధ్యమాత్రంబు,కుచంబులబంటియు
నిబలుకుచంను చనయన నాభివివరకుంతలంబులు, చక్రవాకజలచరావర్తశైవాలంబులచందంబున, నందంబుగ నీను
సొందినయేఱుల్లని,కళిందనందనకరంబులుసాఁచి,పరిరంభంబులకునారంభించుకైవడి, నెమఱఁజను దెంచి తొఁపతరంగం
బులకునులుకుచు,సారసంబులకుంగరంబులుసాఁచుచు,మరాళంబులంజోఁపుచుఁ,జెన్నుమిగిలినచన్నులయొత్తువత్తునను
నెపంబులతపంబులనీటఁగావించుమాడ్కి నిసంచరించుచక్రవాకంబులందోలుచు,నితాంతకాంతిసదనంబులగువదనంబు
లకునోడి వ్రీడంజెందికందిచందురుఁడుచలముడిగిజలమ్మునంబడికంపించుకరణి,నిజకరకలితజల ప్రతిఫలితుండైకదలుచం
ద్రునింగనిమెచ్చినోలుచు,సలిలావగాహనసమయసముచ్ఛలితవారిశీకరపరంపరలవలనమకరందపానమత్తమధుకరపక్ష
విక్షేపణసంజాతవాతసముద్ధూతకుముదాచపరాగపటలంబులంజేరుచు, మోముదమ్ములకమ్మతనంబులకుమూఁగిఝుమ్మ
రనుతుమ్మెదలకు వెఱచుచుఁ,గరంబులనీరెగయంజఱచుచు,నీలనీరదనిపతితపయోబిందుసందోహంబులండడియుపువ్వుఁదీ
వియలబాగునఁగృష్ణుకరద్వయంబునంజెక్కు తోయంబులండడియుచుఁ,గ్రమ్మకొనిసుడియుచునసమబాణునిపులుగడిగిన
కుసుమబాణంబులపగిది మేనులుమెఱయసలిలావగాహనపరాయత్తచిత్తలగుచు, మొత్తంబులై సరసభాషణంబులంద్రు
ళ్లుచు, బాహువులనీరునించుచు,హరిమీఁదఁజల్లుచుఁ,జల్లు నెడందడపడఁదాఁటుచు, దాఁటిచనక నిలువరించుచువినోదింపంగ రే
ణుకరవికీర్ణ నీరధారాభిషిక్తంబగుశుండాలంబులీలనాభీరకామినీకరసముత్క్షిప్తజలాసారంబులందోఁగుచు, వ్రజవధూ
జనహస్తప్రయుక్తకల్హారకైరవపరాగపటలంబువలనభూతిభూషణుసిరివహించుచు, గోపికాజనపాణికిసలయసముత్క్షి
ప్తకమలదళంబులవలనసహస్రనయనునిరూపుఁజూపుచు,గోపాలబాలికాకుచకలశకుంకుమపంకంబువలనఁబ్రభాతభా
నునిభంగిభాసిల్లుచు, ఘోషయోషాకటాక్షవిక్షేపణంబులవలనమధుపపరివృతహరిచందనసౌందర్యంబు నొందుచు,వల్లవీ
హాసరుచులవలనఁజంద్రికాప్రభాభాసితనీలశైలంబుక్రియనపు రెనంత॥చ॥సతులుండానునునీటిలో వెడలిభూషాగంధ
చేలాద్యలంకృతుఁడై కుంభికరేణుయూథములతోఁగ్రీడించుచాపంబున।గ్నలతలంపుందరులందుఁబువ్వుఁబాయలీలాశయ్యా
లంపున్నుభోగ్నతుఁడై కృష్ణుఁడుక్రీడలన్నిసిపెనానారీలలామంబులన్॥వ॥ ఇట్లుశరత్కాలంబున వెన్నుఁడింద్రియస్ఖల
నంబు సేయక గోపికలతోడరమించెనని చెప్పినమునివరునకుభూవరుండిట్లనియె॥మత్తకోకిల॥ధర్మకర్తయుధర్మభర్తయు
ధర్మమూర్తియునైనన।త్కార్మ్యుఁడీశుఁడుధర్మశిక్షుయుధర్మరక్షయు సేయఁగా।నర్మిలిన్ధరమీఁదఁబుట్టి పరాంగనాజనసం
గమే।ధర్మనుంచుఁడలంచిచేసెనుదాత్తమానసచెప్పుమా॥అనినశుకుండిట్లనియె॥గీ॥ సర్వభక్షుండగ్నిసర్వంబుభక్షించి।
దోషిగానిపగిదిదోషమైనఁ।జేసిదోషపదముఁజెందరుతేజస్వు।లసుటచంద్రవాసవాదులధిప॥క॥ ఈశ్వరుఁడుగానివాఁ
డున।రీశ్వరపరకాంతఁదలఁచియెట్లుబ్రతుకుగా।రీశ్వరుఁడుదక్క నన్యుఁడు।విశ్వభయదవిషముమ్రింగి పెలయంగలఁడే।
క॥సత్యముప్రభువులవచనము।నిత్యముతద్వచనవిధినినిలుతురుపెద్ద।ల్సత్యాసత్యముగావున।సత్యమునుచుఁజనరువారిచరి
తమునున్నపా॥ఘనులైయెవ్వనిపాదపంకజపరాగధ్యానసంప్రాప్తయో । గనిరూఢత్వముచేమునీంద్రులుమహాక
ర్మంబులంబాసిబం।ధనిరోధంబులులేకవిచ్చలవిడిందర్పింతురానిత్యశో । భనుఁడెట్లుండినముండేఁగాకకలవేబంధంబులు
రీశ్వరా॥గీ॥గోపజనములందుగోపికలందును।సకలజంతులందుసంచరించు।నామహాత్మునకుఁబరాంగనలెవ్వరు। సర్వ
మయుఁడులీలసలిపెఁగాక॥వ॥అనిచెప్పిశుకుండిట్లనియెనంతబ్రాహ్మ్యముహూర్తంబునంగృష్ణువీడ్కొని గోపికలిచ్చలే
కయునిండ్లకడకేఁగినంగృష్ణమాయామోహితులై గోపకులువారలంగోపింపనెఱుంగనేరరైరి॥ఇంద్రవజ్రము॥ గోపా
లకృష్ణుండనుగోపకాంతల్ ।ప్రాపించిక్రీడించినభంగులెల్లన్।రూపించివర్ణించినరుండుహృత్సం।తాపంబులన్బాయునుద

శ్రీ సర్పరూపియగుసుదర్శనుండనుగంధర్వునిశాపవిమోచనము. శ్రీ

త్ప్రాప్తిన్॥వ॥అంతనొక్కనాఁడునందాదులైనగోపకులంబికావనంబునకుశకటంబులెక్కి జాతరకుంజనిసరస్వతీనదీజ
లంబులస్నానంబులుసేసియుమామహేశ్వరులనర్చించికానుకలిచ్చి బ్రాహ్మణులకుగోహిరణ్యవస్త్రాన్నదానంబులొ
సంగిజలప్రాశనంబుసేసినియమంబుననుండదైవయోగంబుననాఁకొనియొక్కమహోరగంబునిమకవోయిననంద
నింగఱచిమ్రింగనగ్గలింపనతండుకృష్ణకృష్ణేతివచనంబులందన్నువిడిపించుమనిమొఱయిడినవిని॥ క॥ గోపకులందఱుమే
ల్కొని।కోపముతోఁబెద్దగుదెలఁగొఱవులమొత్తన్। దాపమునొందియువదలక।పాపపుపెనుబాముసందుఁజుట్టెన్నృపాలా॥
వ॥అయ్యవసరంబునఁగృష్ణుండుదర్పించిపాదతాడనంబుసేసిత్రొక్కినసర్పంబుసర్పరూపంబువిడిచి విద్యాధరేంద్రరూ
పంబుఁదాల్చిహరికిమ్రొక్కినతనికిహరియిట్లనియె॥ఉ॥మండితమూర్తితోఁగనకమాలికతోశుభలక్షణుండవై। యుం

డెపునీకు మప్పుడు ఘోరాజగదేహమి దేలవచ్చె నే।న్వండవు నామ మెయ్యది భవంబున కెద్దిమిషంబు నాకు నెం। డొండ
యెఱుంగఁ జెప్పుము బుధోత్తమ నీపని చోద్యమయ్యెడిన్॥ వ॥ అనిన వాఁడిట్లనియె, దేవా నేను సుదర్శనుండను విద్యాధరుండ
విమానారూఢుండనై రూపసంపద్గర్వంబులం జొక్కి దిక్కులం జరించుచు, నొక్కయెడ నాంగిరసులైన ఋషులం గురూ
పులైన వారలం గని నగిన, వారు నీవు రూపదర్పంబునం దమ్ము నగితివి గావున, మహాసర్పంబవై యుండుమని శపించినఁ, బిదప
నే వేఁడుకొనిన నిట్లనిరి॥ చ॥ యదుకులసంభవస్థలభయంబు హరించుటకుం జనార్దనుం। డుదయమునొంది యాయడవి కొ
క్కదినంబున రాఁగలండు తత్పదమున నీవు దన్నఁబడి పన్నగదేహముతోడఁ బాసి నీ। మొదలిటి మేనుఁ గాంచెదవు మూఢుఁ
డపోహ్మని రాదయానిధుల్॥ మ॥ నినుఁ జింతించిన విన్నఁ బేరుకొనినన్ నిర్ధూమలమైస్రుస్సిపా। పనికాయంబు వినష్టమానఁట భవ
త్పాదంబు నామీఁదఁ బెట్టినఁ దద్బ్రాహ్మణశాపసంజనితకౌటిల్యంబు దా నిల్చునే। వనజాతేక్షణ నేఁడు నా సెను రగత్వంబె
ల్ల నేఁ బోయెదన్॥ వ॥ అనివిన్నవించి హరికిఁ బ్రదక్షిణంబు వచ్చి మ్రొక్కి సుదర్శనుండు దివంబునకుం జనియె సర్పంబువలన
నందుండు విముక్తుం డయ్యెఁ దత్ప్రకారంబు విని వెఱఁగుపడి గోపకులు దేవతానుష్ఠానంబు సమాప్తి నొందించి కృష్ణకీ

### శ్రీ కుబేరభటుండగు శంఖచూడుండను గుహ్యకుని సంహరించుట. శ్రీ

ర్తనంబు సేయుచు మఱలు మందకుం జనిరంత॥ చ॥ మఱియొకనాఁటి రాత్రి బలమాధవు లుజ్జ్వలవస్త్రమాలికాధరులును లే
పనాభరణధారులునై చనిపల్లికాదివు। ష్పరసనిమగ్నమైన మధుపంబుల గీతము వించుఁ దద్వనాం। తరమున వెన్నెలన్ బ్ర
జనితంబినులుండఁగఁ బాడిరింపుగన్॥ క॥ ఆపాట చెవులసోఁకిన। నేపాటియు దేహలతల నెఱుఁగక దృగ్వా। చాపాటవములు
చెడిపడి। రాపాటలగంధులెల్ల నటవీవీథిన్॥ వ॥ ఇట్లు సకలభూతసమ్మోహనంబగు గానంబు సేయుచు నిచ్ఛావర్తనంబులం
బ్రమత్తులచందంబున రామకృష్ణులు గ్రీడింపఁగు బేరభటుండు శంఖచూడుండను వాఁడు రామకృష్ణరక్షితలగు గోపికలం ద
నమోగబలంబునను త్తరపు దిక్కునకుం గొనిపోవ నయ్యోషిజ్జనంబులు రామకృష్ణేతి భాషణంబులు వలుకుచుఁ బులికినగ
పడిన మొదవులక్రియ మొఱయిడిన విని॥ ఉ॥ గ్రద్దన సాలవృక్షములు గైకొని బల్లిదులన్నదమ్ములా। యిద్దరు కాలమృత్యువు
లమేపున వేచని యోడకుం ఘుఁడో। ముద్దియలారయంచుఁ దనుముట్టినఁ జూచి కలంగి గుహ్యకుం। డుద్దవిడిం దగం బఱచెను త్త
రమింతులడించి భీతుఁడై॥ వ॥ ఇట్లు గుహ్యకుని చేత విడివడిన గోపికల రక్షించుకొని యుండుమని బలభద్రునిం బలికి॥ శా॥ ఓరీ
గుహ్యకపోకుపోకు మనిరోషోత్కింబకారాతి వాఁ। డే రూపంబున నెందుఁ జొచ్చె నెఱిం బోయెందోడఁ దానేఁగిమ। ర్వారోదం
చితముష్టి వానితలఁ ద్రెవ్వంబట్టి తద్వీరుకో। టీరభ్రాజితరత్నముం గొని యెదం డిగ్గోపికల్ప్వాడఁగన్॥ వ॥ ఇట్లు శంఖచూడునిం
జంపి వాని శిరోరత్నంబుఁ దెచ్చి బలభద్రునకిచ్చి మెప్పించె మఱియొక్కదినంబునం గృష్ణుండు వనంబునకుం జనిన నతనిలీ
లలు వాడుచు నిండ్లకడఁ దద్విరహవేదనానలభరంబు సహింపక గోపికలు తమలో నిట్లనిరి॥ శా॥ భ్రూవిక్షేపముతోడ దాప
లిభుజంబున్ జెక్కుఁ గీలించి కెం। మ్మోవిన్ వేణువుఁ గూర్చి సుస్వరముగా మ్రోయించుచున్నంగుళీ। ప్రావీణ్యంబు విభుండు
సూపఁగని సప్రాణేశలై యుండియు। న్నీవీబంధములూడఁ జొక్కుదురు పోనింగిన్నిలింపాంగనల్॥ మ॥ నవమాధుర్యముగ
ల్గుకృష్ణమురళీనాదామృతస్యందము। ల్చెవులన్ జొచ్చి హృదంతరాళములఁ బాసిల్లన్ స్రవత్సంబులై। యుపిదా మేపులకుం
దొఱంగి మృగగోయూథంబు లుత్కంఠతో। దివికిం గంఠము లెత్తి లోవడలుఁ బో దేహేంద్రియవ్యాపృతుల్॥ శా॥ ఓకంజేక్షణ
కృష్ణుఁ డుజ్జ్వలితహారోద్దాముఁడై గానవి। ద్యాకౌతూహలతన్మనోజ్ఞమురళీధ్వానంబు గావింపఁగా। నాకర్ణించి సశంపమై
మొఱయు నీలాభ్రంబుగాఁ జూచుచున్। గేకారావములిచ్చుచున్మరియుఁ బో కేకీంద్రసంఘాతముల్॥ మ॥ లలనా యేటికిఁ
దెల్లవారెరవి యేలాదోఁచెఁ బూర్వాద్రిపైఁ। గలకాలంబు నహంబు గాక నిశి గాఁగల్పింపఁడా బ్రహ్మదా। వలతేఁడు నృప
లేఁడు కీరములు దుర్వారంబు లెట్లోగదే। కలదే మాపటి కాలమందు మనకుం గంజాక్షుసంభోగముల్॥ ఉ॥ ఎప్పుడు ప్రొద్దు
గ్రుంకు హరియెప్పుడు గోవుల మేపి వచ్చు మా। కెప్పుడు తన్ముఖాంబుజసమీక్షణ మబ్బునతండు వచ్చిన। న్నెప్పుడు మా గారవిం
చుఁ దుది యెప్పుడు మద్విరహాగ్నిరాశికిన్। జెప్పఁగదమ్మ బోఁటి మరుసేఁతల నుల్లము తల్లడిల్లెడిన్॥ మ॥ చెలియా కృష్ణుఁడు న
న్నుఁ బాసి వనముం జేరంగ నయ్యాక్షణం। బులు నాకన్నియు నుండనుండఁగఁ దగన్ బ్రహ్మణ్యంబులై స్వాగిలో। పలఁ దోఁచుం బ్ర
హరంబులై దినములై పక్షస్వరూపంబులై। నెలలై యబ్దములై మహాయుగములై నిండారు కల్పంబులై॥ వ॥ అని మఱియుఁ
గృష్ణవిరహదుఃఖంబున బహువిధంబులఁ బశ్చాత్తాపంబు నొందుచు గోపికలోపికలు లేక నెట్టకేలకు దివంబు గడిపి దినాంత
సమయంబునందు॥ మ॥ అదె భానుం డపరాద్రిఁ జేరెని దె సాయంకాలమేతెంచెనల్ల దె గోపాదపరాగమొప్పెసఁ గెబ్బం
దారణ్యమార్గంబునం। ది దె వీతెంచె వృషేంద్రఘోషము ప్రియుండేతెంచె రండంచుఁ దా। మెమ రే తెంతురు మా పుకృష్ణుని

కెనయ్యింతుల్పరిభ్రాంతలై॥ వ॥ ఇట్లు తన కెదురువచ్చిన మచ్చిక నచ్చెలువల నచ్యుతుండిచ్ఛావర్తనంబుల గారవించె నంత నొ

### ⇒ శ్రీకృష్ణుండు వృషభాసురుని సంహరించుట. ⇐

కకుద్మినాఁడు॥ సీ॥ ఎవ్వని మూపుర మీక్షించి మేఘంబు లద్రిశృంగంబని యాశ్రయించు। నెవ్వని యంకెక కర్ణేంద్రియంబులు సోఁక గర్భపాతనమగు గర్భిణులకు। నెవ్వని పదహతి నెగయు పరాగంబు లంధకారారాతి నావరించు। నెవ్వఁడు కొమ్ముల నెదిరించి చిమ్మఁ బృథ్వీధరంబులు పెల్లగిల్లు। నట్టి వృషభాసురేంద్రుఁ డహంకరించి। వాలలత నెత్తి పెను రంకె వైచి నేలఁ। గాలుఁ ద్రవ్వుచు నిశితశృంగములు సాఁచి। మందఁ బెగడంగఁ గవిసె నమందుఁ డగుచు॥ వ॥ ఇట్లు వృషభాకారంబున నరిష్టుం డపహారికి నరిష్టంబు సేయం దలంచి పైకుఱికిన॥ ఉ॥ క్రేపులు వాఱె గోవులకుఁ గ్రేపులు గోవులు గోవృషంబులం। బైపడె వత్సధేనువృషభంబులు గోపకులం జొచ్చెనా। గోపకులావృషేంద్రములు గోవులు లేఁగలు విచ్చిపాఱఁగా। గోపచమూవిభుండు మగనై గోవృషదైత్యుఁడు వెంటనంటఁగన్॥ వ॥ ఇట్లు భయభ్రాంతులయి కాంతలుం దారును గృష్ణకృష్ణ రక్షింపుమని మొఱ గోపకులకు నడ్డంబు వచ్చి దీనజనరక్షకుండయిన పుండరీకాక్షుం డిట్లనియె॥ ఉ॥ బాలురనింతులం బసులఁ బాఱఁగఁ దోలుట బంటుపంతమే। చాలు వృషాసురేంద్ర బలసంపదఁ జూపఁగ నెల్లఁ బాడి గో। పాలురనుండ గాదు చనుపైఁబడి తేని ప్రచండ కృష్ణశార్దూలము నేఁడు నీ గళముఁ ద్రుంపక చంపక పోవనిచ్చునే॥ గీ॥ అను చధిక్కరించి హస్తతలంబులఁ జప్పళించి నగుచు సఖుని మీఁద బన్నగేంద్రభయద బాహుదండము సాఁచి వండి మెఱసి దనుజ దండి నిలిచె॥ అప్పుడు॥ చ॥ ఖురముల నేలఁ ద్రవ్వుచు నకుంఠిత వాలసమీరణంబులన్। విరవిరఁ బోయి మేఘములు విప్పవిషాణములాడ్డికొంచుమ। స్తరతరమూర్తియై వృషభదైత్యుఁడు కన్నులనిప్పు లాల్కఁగా। దురదుర వచ్చి తాఁకె రిపుమర్మద మోచనుఁ బద్మలోచనున్॥ ఉ॥ యాదవకుంజరుండు వృషభాసురుకొమ్ములు రెండుఁ బట్టియ। ష్టాదశ పాదమాత్రము గజంబు గజంబును ద్రొబ్బుకైవడిన్। భేదిల ద్రొబ్బ నయ్యసుర పిమ్మట నొంది చమర్చి మొగ్గిమ। ర్యాదము తోడఁ డీకొనఁ బ్రమత్తవిమర్దను నాజనార్దనున్॥ గీ॥ అంత గోపసింహుఁడసురఁ గొమ్ములు వట్టి। ధరణిఁ ద్రొబ్బి త్రొక్కి దైత్యభటుల। కొమ్ము వీఁగ సురలకొమ్మువగ్గిల వాని। కొమ్ము వెఱికి మొత్తి కూల్చె నధిప॥ క॥ ఉక్కు చెడి రోఁజి నెత్తురు। ముక్కున వాఁతను స్రవింపమూత్రశకృత్తు। ల్మిక్కిలి విడుచుచుఁ బసరపు రక్కసుఁడనిసమసెఁ బ్రజకు రాగము లమరన్॥ వ॥ ఇట్లు వృషభాసురుం జంపిన నిలింపులు గుంపులు గొని పిరులు వర్షింప, గోపకులు హర్షింప, గోపసతులుత్కర్షింప, బలభద్రుండును, వారును, గోవిందుండును, బరమానందంబున, మందకుం జనిరంత॥

చ॥ ఘనుఁడొకనాఁడు నారదుఁడు కంసునితోడ యశోదకూఁతురం। గనుటయుఁ జక్రి దేవకికి గర్భజుఁడౌటయు మున్ను రోహిణీతనయుఁడు రాముఁడౌటయును నద్విభు నిద్దరు నుందనున్నవా। రని మొఱుఁగంగఁ జెప్పిన మహోచ్ఛ్రితమంచుఁ జలించుఁ గినుకతోన్॥ చ॥ కొడుకుల మందలోన నిడి గొంటుతనంబున మోసపుచ్చెనీ। బడుగును బట్టి చంపుటిది భావ్యమటంచుఁ గృపాణపాణియై। వడివసుదేవు నిందనుమ వచ్చిన కంసునిఁ జూచి నారదుం। డుడుగుము చంపఁ బోలదని యోడక మాని విపోయె మింటికిన్॥ వ॥ మఱియు నలుక దీఱక కంసుండు దేవకీవసుదేవుల లోహపాశబద్ధులం జేసి కేశియనువానిం బిలిచి రామకేశవులం జంపు మని పంపి మంత్రి భటగజారోహక చాణూరముష్టిక సాల్వకోసల ప్రముఖుల రావించి యిట్లనియె. శా॥ ఎందున్న న్నెదిరించి పోరుటకు దేవేంద్రాదులుం జాలరీ। బృందారణ్యమునందు నిప్పుడు మదాభీరార్భకులార్మ గో। విందుల్వర్ధిలుచున్నవారఁట రణోర్విం గంసు నొప్పింతుమం। చుందర్పంబులు వల్కుచుందురఁట యాచోద్యంబు లన్వింటిరే॥ క॥ పట్టణజనములు చూతురు। దట్టంబుగ మల్లరంగతల పార్శ్వములన్। బెట్టింపుఁడు మంచంబులు। పుట్టింపుఁడు వీటమల్లుపోరను మాటన్॥ శా॥ వినాశనంబులఁ బోర నేర్తురు మహావీర్యప్రతాపాదిసం। పన్నుల్మీరలు మేటిమంతనములన్ విఖ్యాతులై పెంపుతో। మన్నారాబలకృష్ణులం బెనకువన్మర్దించి మాత్సి త్రికా। సన్నుల్గండు పురీజనుల్పొగడ నో చాణూర యో ముష్టికా॥ శా॥ రారా హస్తిపకేంద్ర గండమదధారాగంధలోభాంధగం। భీరాళివ్రజమైన మత్తకువలయాపీడద్విపేంద్రంబు దు। ర్వారోదంచిత దేహళీపరిసరస్తంభంబు డాయంగ నా। భీరుల్రా నదలించి డీకొలుపు నీ బీరంబు తోరంబుగన్॥ క॥ పశువిశసనములు సేయుఁడు। పశుపతికిం బ్రియముగాఁగ భావించి చతు। ర్దశినాఁడు ధనుర్యాగము। విశదంబుగఁ జేయవలయు విజయముకొఱకున్॥ వ॥ అని తన నారి నందఱ నయ్యై పనులకు నియమించి యదుశ్రేష్ఠుండగు నక్రూరునిం బిలిచి చెట్టఁ బట్టికొని యిట్లనియె॥ శా॥ అక్రూరత్వము తోడ నీవు మనఁగా నక్రూరనామంబు ని। ర్వక్రత్వంబున దెల్లమైత్రి సలుపన్వచ్చున్నినుం జేరి నీ। వక్రోధుండవు మందలోన బలకృష్ణాభీరుల స్మద్వినా। శక్రీడారతులై చరింతురఁట యోజం దెచ్చి యొప్పింపవే॥ గీ॥ నాకు వెఱచి సురలు నారాయణుని వేఁడికొనిన నతఁడు వచ్చి గోపకులము। నందుఁ గృష్ణమూర్తి నా నక దుందుభి। కుదితుఁ డయ్యెనన ఁగ నొకటి వింటి॥ వ॥ కావున నీవు గో

పకులచేతనరులుగొనిధనుర్యాగంబుఁజూడరండనివారలందోడ్కొని రమ్ము తెచ్చిన॥ శా॥ కొండల్గూలఁగఁద్రొబ్బుకొమ్ముల తుదింగోపించికోరాడుచో। దండిన్దండిన ధిక్కరించునొక వేదండంబునాయింట బ్రహ్మాండంబైనఁ గదల్పనోపు బలకృష్ణాభీరులఁబోరిలో। ఖండింపన్ దడవెంతదానికదియుం గాదేని యక్రూరకా ॥ శా॥ చాణూరుండును ముష్టికుండును సభాసంఖ్యాతమల్లుల్ జగ। త్ప్రాణుల్ మెచ్చరుసత్వసంపదలబాహాబాహిసంగ్రామపా। రీణుల్వారలు రామకృష్ణులబలోద్రేకంబుసైరింతురే। క్షీణప్రాణులఁజేసి చూపుదురు సంసిద్ధంబు యుద్ధంబునన్ ॥ సీ॥ ఆరామకేశవులంతరించినవసుదేవముఖ్యులఁజంపితెగువ మెఱసి। వృష్ణిభోజదశార్హవీరులఁదెగటార్చి ముదుకఁడు రాజ్యకాముకుఁడు ఖలుఁడు। నగునుగ్రసేను మాయయ్యఁగీటడఁగించిపినతండ్రి దేవకు *బిలుకుమార్చి। మఱియువైరుల నెల్లమర్దించి నేజరాసంధనరకబాణశంబరాదిసఖులతోడ భూమిచక్రమేలెదఁబొమ్ము। తెమ్ము వేగమవసుదేవసుతుల। ముఖము పేరఁజెప్పి సుమంత్రభేదము సేయ। వలయుఁ జెంపఁజనదువైరిజనుల॥ అనినన క్రూరుండిట్లనియె॥ ఉ॥ పంపినఁబోనివాఁడనె నృపాలక మానవులైన తమ్మునూహింపరు దైవయోగములనించుకగానరు తోఁచినట్లుని। ష్కంపగతిన్ జరింతురదిగాదనవచ్చునె యీశ్వరేచ్ఛఁదప్పింపఁగరాదునీపగతు బిడ్డలఁదెచ్చెదఁబోయివచ్చెదన్ ॥ వ॥ అనిపలికి రథంబెక్కియక్రూరుండు చనిన సకలజనులను వీడుకొలిపి కంసుండంతిపురంబునకుం జనియె-నంతకంసప్రేరితుండై ॥

### శ్రీకృష్ణుండు కేశివ్యోమాసురుల సంహరించుట.

సీ॥ ఖురపుటాహతిధూళికుంభినీచక్రంబు ఫణిరాజఫణలకు బరువు సేయ। భీషణహేషావిభీషితులై మింటనమృతాంధులొండొరునండఁగొనఁగ। జటులచంచలసటాచ్ఛటలగాడ్పుల మేఘములు విమానములపైమునుఁగుపడఁగ। వివృతాస్యగహ్వరవిపులదంతంబులు ప్రళయాగ్నికీలలసగిది మెఱయఁ। గాలపాశలీలగా వాలమేపార। వాహమసుచుగంధవాహగతుల। విజితశక్రపాశివీర్యపయోరాశి। కేశివచ్చె మందకేశమంద॥ క॥ భీషణఘోటకదానవ। హేషానిర్ఘోషభిన్నహృదయనిఖిలగో। యోషాపురుషార్భకమై। ఘోషము హరిచూడ దైన్యఘోషంబయ్యెన్ ॥ అయ్యవసరంబున ॥ ఉ॥ పేదలఘోషగోపకుల బిట్టదలించుట పీరధర్మమా। కామవ్రజంబులో దనుజఘస్మరుఁడేడనితన్నరోయుక్ర। వ్యాదునిఁజూచి గోపకులకడ్డమువచ్చినిశాటయింకఁబో। రాదనిశౌరిచీఱెమృగరాజుక్రియన్నెదిరించె దైత్యుఁడున్ ॥ గీ॥ నిష్ఠురోగ్రసింహనినదంబుతోనింగి। మ్రింగుభంగినోరుమిగులఁదెఱచి। కఱువరాగనతఁడుకాలుఁదప్పించినఁ। దన్నె నెగసి తురగదానవుండు ॥ ఉ॥ తన్నినతన్నునంబడకదానవహంతృ శీసమీకరంతన్మై। కన్నులఁగెంపు పెంపెనయ గ్రక్కునఘోటనిశాటు పాదముల్। వన్నెచెడంగఁబట్టి పడవైచె ధనుశ్శతమాత్రదూరమున్। బన్నగడింభమున్విసరిపాఱఁగవైచు ఖగేంద్రుకైవడిన్ ॥ ఉ॥ వైచిన మ్రొగ్గిలేచి వెసవాజినిశాటుఁడుహుంకరించి సంకోచములేక పైఁబడినగోపకులేంద్రుఁడుదిగ్గజేంద్రశుం। డాచటుల ప్రభాబలవిడంబకమైన భుజార్గళంబుదో। పాచరు నోటిలోననిడెఁ జండఫణిన్ గుహనించుకైవడిన్ ॥ శా॥ దంభోళి ప్రతిమానకర్కశమహాబాహ్యద్వయద్దోస్తంభమున్। శుంభల్లీలనఘారివానిరదముల్ చూర్ణంబులైరాలఁగా। గంభీరంబుగఁగుక్షిలోఁజొనిపి వీఁకన్ వృద్ధిఁబొందించుచున్। గుంభించెన్ పవనంబు పిక్కటిలఁదక్కిన్నరేంద్రోత్తమా ॥ క॥ వాయువు వెడలక నిలిచినఁ। గాయంబు చెమర్పఁగన్నుగవ వెలికుఱుక। న్నాయచెడితన్నుకొనుచును। గూయుచునశ్వాసురుండుగూలెన్నేలన్ ॥ గీ॥ ఘోటకాసురేంద్రుకుక్షిలోఁగృష్ణుని। బాహువధికమైనఁబట్టలేమిఁ। బగిలి దోసపండుపగిదిఁదద్దేహంబు। వసుమతీశరెండువ్రయ్యలయ్యె ॥ క॥ నలినాక్షుఁడు లీలాగతి। విలయముఁబొందించెనిట్లువీరావేశిన్। బలలాశిన్ జగదభినవ। బలరాశిన్ విజితశక్రపాశిన్ గేశిన్ ॥ వ॥ ఆసమయంబునం బుష్పవర్షంబులు గురియించిసురలువినుతించిరంత హరిభక్తివిశారదుండైన నారదుండు వచ్చి గోవిందునిసందర్శించి రహస్యంబుననిట్లనియె ॥ సీ॥ జగదీశ యోగీశ సర్వభూతాధార సకలసంపూర్ణ యీశ్వర మహాత్మ। కాష్ఠగతజ్యోతికైవడి నిఖిలభూతములందునొక్కఁడవై తనరుదీవు। సర్గాధుఁడవు గుహాశయుఁడవు సాక్షివి నీయంతవాఁడవై నీవుమాయఁ। గూడికల్పింతువుగుణములవానిచేఁబుట్టించిరక్షించిపొలియఁజేయు। దీప్రపంచమెల్లనిట్టినీవిప్పుడు। రాజమూర్తులైన రాక్షసులను। సంహరించిభూమిచక్రంబురక్షింప। నవతరించినాఁడవయ్య కృష్ణ ॥ వ॥ దేవా నీచేత నింక చాణూర, ముష్టిక, గజ, కంస, శంఖ, యవన, ముర, నరక, పౌండ్రక, శిశుపాల, దంతవక్త్ర, సాల్వ ప్రముఖులు మడిసెదరు-పారిజాతంబపహృతంబయ్యెడిని-నృగుండు శాపవిముక్తుండగు, శమంతకమణిసంగ్రహంబగు, మృతబ్రాహ్మణపుత్రప్రదానంబు సిద్ధించు-నర్జునసారథివైయనేకాక్షౌహిణీబలంబులవధియించెదవు మఱియును ॥ శా॥ కృష్ణా నీవు నరించు కార్యములు లెక్కింపన్ సమర్థుండెవఁ। డ్జిష్ణుండైన విధాత మూఁడుగుణముల్దీపించు లోపించురో। చిష్ణుత్వంబున నుండు నీవలననిస్సీమంబు నీరూపమున్। విష్ణున్ జిష్ణు సహిష్ణు నీశు నమి

*బిలుకుమార్చి। చంపి. శీసమీకరంతమై। యుద్ధక్రీడయందిచ్చగలవాఁడై.

తుఁగాఁపి శ్వేశ్వరునొప్పి క్కేర్లఁ॥వ॥అనివినుతించివీఁడుకొనినారమండరిగెనంతనొకనాఁడు కృష్ణసహితులై గోపకుమా
రులడవికిఁజనిపసుల మేపుచు నెక్కకొండదండ *నిలాయనక్రీడ చేసిరందు॥ క ॥ కొందఱుగొఱియలగుచును।గొందఱు
పాలకులగుచుఁగుటిలత్వమునర్ల।గొందఱుదొంగలగుచును।జెందిసుమారకులుక్రీడఁజేసిరితఁగు లోర్ల॥శా॥ఆలోనొం
గలలోమయాసురసుతుండాద్యుండువ్యోముండుగో । పాలుండై చనిమేషకల్పవలతో భాసిల్లి క్రీడించుచు।ద్వాల వ్రాత
ము నెల్ల మెల్లనచతుర్గపంచావశిష్టంబుగా।శైలాంతర్గుహలోనికింగొనిచనెఁజౌర్యంబవార్యంబుగర్ల॥వ॥ ఇట్లుకొండ
గుహలోనఁగ్రమక్రమంబునగోపకుమారులనిడియొక్క పెనురాతఁదద్వారంబుగప్పియెప్పటియట్లవచ్చిన ॥ ఉ॥ వీఁడుఁ
డుమాధవుండఖిలవేదినిశాచరభేదినవ్వుతో।నారనిశాటదొంగతనమచ్చుపడెన్నెఁఅదొంగవాడువా। భీరులనెల్లశైలగు
హఁబెట్టితిదిక్కనవారిఁబెట్టరా।రారయటంచుఁబట్టెనృగరాజువృకాఖ్యముఁబట్టుకైవడిర్ల ॥ ఉ ॥ పంకజలోచనుండొ
డిసిపట్టినశైలనిభాసురాకృతిర్ల।బింకముతోడఁబొంగిపడిపించుకొనంగబలంబులేమిలో।శంకిలిబిట్టుతన్నుకొనఁజక్కన
నారణభీమువ్యోమునిం।గొంకకఁగూల్చెనవ్విభుఁడుక్రోయనిమింటసుపర్వులార్వఁగర్ల ॥ గీ ॥ మోరదనుజునేలఁగూల్చి
సర్వతగుహ। వాతనున్నరాయిఁవ్రయ్యఁదన్ని। గుహచరించుచున్నగోపాలకులఁగొంచు । బల్లిమండుగోపపల్లెకరిగె॥
వ॥అంతనారాత్రిమధురానగరంబునక్రూరుండువసియించినియతుండై రేపకడరథంబెక్కికదలినందగోకులంబునకుం

——॥ కంసునిపంపునక్రూరుండుబృందావనంబునకుఁజనుదెంచుట. ॥——

బోవుచుందెరువునఁదనలోనిట్లనియె॥ఉ॥ఎట్టితపంబుసేయఁబడెనెట్టిచరిత్రములబ్ధమయ్యెనో।యెట్టిఘనంబులర్థిలకునీఁ
బడెనోతొలిబామునందునా। యట్టివివేకహీనునకునాదిమునీంద్రులుయోగదృష్టులర్ల। బట్టఁగలేనియీశ్వరునిబ్రహ్మ
మయున్నారిఁజూడఁగల్గెడిర్ల॥ఉ॥సూరులుదొల్లియేవిభునిశోభితపావనఖప్రభావళిర్లజేరిభవాంధకారములఁజిక్కకదా
టుమరట్టిదేవుని।నైర్వైరముతోడనైనఁబిలువన్ననుఁబంచిశుభంబుఁజేసెని।స్ఫారణప్రేమతోడఁసిదెకంసునిఁబోలుసఖుండు
గల్గునే॥మ॥ఇతఁడాకంసునిచేతఁబంపువడినర్లహింసింపనేతెంచినాఁ। డతిమిష్టుండనిచూచునోసకలభూతాంతర్బహిర్మ
ధ్యసం।గతుఁడౌటందలపోసినన్నుసుజనుంగాఁజూచునోయెట్టియున్నతిగావించునొయేక్రియంబలుకునోనాభాగ్యమె
ట్లున్నదో॥అనిమఱియును॥మ॥అలకభ్రాజితమైసుధాంశునిభమైహాసప్రభోద్గాఢమై।జలజాక్షుంబయికర్ణకుండలవిరా
జద్గండమైయున్నయా।జలజాతాక్షుముఖంబుచూడఁగలుగుర్లసత్యంబువోనాకునా। వలదికేఁగుచునున్నవీవనమృగ
వ్రాతంబులీత్రోవర్ల॥ఉ॥మాపటివేళనేనుజనిమాధవుపాదసమీపమందుదం।డాపతితుండనైననతఁటాశుగకాలభుజం
గవేగసం। తాపితభక్తలోకభయదారుణమైనకరాబ్జమావల।న్మోపిహసించినాకభయముల్కృపతో నొసఁగుతనీయకుండునే॥
వ॥అనిమఱియునక్రూరుండనేకవిధంబుల, గోవిందసందర్శనంబుగోరుచు,వసుందగమనసుందరస్యందనారూఢుండై,చని
చని॥క॥ముందటఁగనెఘనచందన।కుందకుటజతాలసాలకురువకవటమా।కందన్నందితబలగో।విందన్వికచారుణారవిందర్ల
బృందర్ల॥వ॥కనిబృందావనంబుదఱియంజొచ్చి,యందుసాయంకాలంబున, నడపికినెఱిగలమేతలవెంబడిదిగంబడిరాకచి
క్కన, కుఱ్ఱకోడెపడ్డతండంబులంగానక,పొదయిరువునిట్టపల్లంబులనక, తూఱిపాటివెదకిచీరెడుగోపకులయాహ్వాన
శబ్దంబులాకర్ణించుచుఁ,గోమలఘాసఖాదనకుతూహలంబులఁజిక్కనుకుఱ్ఱవలఁగ్రేపులందలంచి,తలారింపకతమకంబు
లందముతనయాంతనంభారవంబులుసేయుచు,మూత్రంబులుస్రవింపఁబరువులిడుధేనువులకునోసరించుచు, సద్యోజా
తంబులగుశ్రీతర్ణకంబులవహించి, నవసూతికలువెనుతగులుటవలనదామహస్తులై, చనువల్లవుల మెల్లనవిలోకించుచు,
సుడిదయిరుగెలంకులంగళంకరహితులై,పులిశివంగివెంగివాలపుమొత్తంబులవలన,నప్రమత్తులై,మతారకుంతశరాసన
ప్రముఖంబులుధరియించి,కావలిదిరుగువారలగడచి నానావిధసరసతృణకబళఖాదనగరిష్ఠలై,గోష్ఠంబులుప్రవేశించి,రో
మంథలీలాలసలైనధేనువులును, జన్నులుగుడిచితెల్లులమ్రోలఁబెల్లురేఁగిక్రెళ్లుఱుకులేఁగలును, నెదలైనమొదవులఁబై
కొనిపరస్పరవిరుద్ధంబులై డీకొనికొమ్ములయుద్ధంబుసలుపువృషభంబులును, నకుంఠితబలంబులంగఁతరజ్జువులందెంచుకొ
ని,పొదలుతికిదాఁటితల్లులందూఁటికుడుచుతఱిపి దూడలఘట్టించిపట్టువోపక, గ్రద్దనఁబెద్దలంజీరుగోపకుమారులును, గొ
డుకులమగలమామలమఱందులవంచించిపంచాయుధభల్లభగ్నహృదయలై,గృహకృత్యంబులుమఱచి,శంకిలకసంకేతస్థ
లంబులఁగృష్ణాగమనతత్పరలైనగోపకామినులును, గోష్ఠప్రదేశంబులగోవులకుఁగ్రేపులువిడిచిమొద్దుచు,మఱలంగట్టు
చు,నీద్చుచుంగ్రీడించుగోపకులును,గోఖురసముద్ధూతకరీషపరాగపటలంబులవలననుల్లారి,మలినులనై, ధేనుదోహనవే
ళావికీర్ణపయోబిందుసందోహపరంపరాసంపాదితపంకంబులును,దోహనసమయగోపకరాకృష్టగోస్తననిర్గతంబులయి

*నిలాయనక్రీడ।మేఁకలాట. శ్రీతర్ణకము।దూడ.

కలశంబులం దూఁబడియెడు క్షీరధారల చప్పుళ్లును, నఘూహూతుకంఠసంస్పర్శనస్నిగ్ధంబులైన, మందిరద్వారదారుస్తం
భంబులఁ బొంతనూతనజనవిలోకనకుపితంబులై కరాళించు సారమేయంబులును గలిగి బలకృష్ణ బాహుదండప్రాకారర
క్షాపి శేషభూషణంబైన ఘోషంబుఁ బ్రవేశించి యందు. ॥క॥ జలజాంకుశాదిరేఖలు, గలహరిపాదముల చొప్పుఁ గని మోదము
తోఁ, బులకించి రథము డిగియు, తక్కలి కెన్నంతో నవబాష్పకలితాక్షుండై. ॥మ॥ కనె నక్రూరుఁడు పద్మనేత్రులను రంగద్గాత్రు
లన్ ధేనుదోహనవాటీగతులనన్నలంకృతులనుద్యద్బాసులన్ స్మితనీలనవీనోజ్జ్వలవాసులన్ గుసుమమాలాధారులన్ ధీపు
లన్, వనితాకాములఁ గృష్ణరాముల జగద్వంద్యక్రమోద్దాములన్ ॥క॥ కనివారల పాదములకు, వినయంబున మ్రొక్కి భక్తి
వివశుండగుచున్, దనువునఁ బులకాంకురములు మొనయఁగ నానందబాష్పములు జడిగురియన్ ॥ తదనంతరంబ ॥క॥ అక్రూరు
లైనజనులన్ వక్రగతిం గాఁచు భక్తవత్సలుఁ డంత, న్నక్రూరుఁ గౌఁగిలించెను, జక్రాంకితహస్తతలము సాఁచిన రేంద్రా ॥
వ॥ మఱియు నక్రూరుండు బలభద్రునికిం బ్రణతుండైనఁ గౌఁగిలించి చెట్టపట్టుకొని కృష్ణసహితుండై గృహంబునకుం గొనిపో
యి మేలడిగి గద్దియ నిడి పాదప్రక్షాళనంబు చేసి మధుపర్కంబు సమర్పించి గోవు నిచ్చి యాదరంబున రసవదన్నంబు వెట్టిం
చి తాంబూలగంధమాల్యంబు లొసంగె నయ్యవసరంబున నందుండు పవిష్టుండై యక్రూరున కిట్లనియె ॥క॥ చెలియలు మొ
ఱయిడ నల్లుర, ఖలుఁడై పొరిగొనిన యట్టి కంసుఁడు బ్రతుకం, గలదె మనకిఁక శార్దూల, కిలపై మీ సేమమింక నేమని యడుగన్ ॥
వ॥ అని పలికి యంత నక్రూరుండొక్క పర్యంకంబున సుఖోపవిష్టుండై యుండ హరి యిట్లనియె ॥మ॥ శుభమే నీకుఁ బ్రమోదమే
సఖులకుం జుట్టాలకు సేమమే, యభయం బే వ్రజ కెల్ల గోత్రజులకత్యానందమే మామ మా, కభయుండే వసుదేవదేవకులు ద
తాక్కారాగృహంబందు మా, తృభవవ్యాజనిబద్ధులై బ్రతికిరే ప్రాణానిలోపేతులై ॥మ॥ నెఱి నేఁడిక్కడ నీవు రాఁగ వగతో నీ
తోడ నేమైన నా, కెఱుఁగం జెప్పు మటంచుఁ జెప్పరుగదా యేమంచు రావార్తయే । తెఱఁగున్లేదని డస్సిరో వగచిరో దీనత్వ
ముం జెందిరో, వెఱతో నా తలిదండ్రులెట్లు పడిరో విన్పింపవే యక్రూరకా ॥వ॥ మఱియు నీ వేమికారణంబున వచ్చితని హరి పలికి
న నతండు కంసునకు నారదుండు వచ్చి సెప్పిన వైరానుబంధప్రకారంబును, గంసుండు దేవకీవసుదేవుల వధియింపం గమకించి
మానిన తెఱంగును, ధనుర్యాగంబు పేరు చెప్పి పుత్తెంచిన ప్రకారంబు లెఱింగించిన రామకృష్ణులు నగి తమ్ముఁ బరివేష్టించిన
నందాదిగోపకులం జూచి కృష్ణుండిట్లనియె ॥శా॥ భూనాథుండు మఖంబుఁ జూడఁ బిలువం బుత్తెంచినాఁ డప్ప్రభుఁ, గానం బో
వలెం బాలు నెయ్యి పెరుగు లట్టన్నంబులు న్గానుక, ల్మీ నేర్పొప్పఁగఁ గూడఁబెట్టుఁడు తత్తగ్రమీమీనివాసంబులన్, యానంబుల్గొని
రండు పోండు మథురాయాత్రాభిముఖ్యంబుగన్ ॥వ॥ అని నియమించె నంత నక్రూరుండు మథురకు హరిం గొనిపోయెడినని యె
ఱింగి వ్రేతలు గలంగి ॥మ॥ హరినవ్వుల్ హరిమాటలున్ హరిమనోజ్ఞాలాపముల్ లీలలున్ హరివేడ్కల్ హరిమన్ననల్ హరికరాబ్జాలం
బనాహ్వానము, ల్హరిణీలోచనలందఱున్ మఱియుపాయం బెట్లుకో యంచులో, నెరియన్ ముచ్చటలాడి రంతగములై యేకాంత
గేహంబులన్ ॥ మఱియుం దమలోనిట్లనిరి ॥ఉ॥ మేటి గృహస్థు బ్రహ్మయని మిక్కిలి నమ్మితి మమ్మ చూడనే, పాటియు లేదుమా
కుఁబరిపాలకుండైన సరోజనేత్రుని, బ్బోటవసింపనీక నొకచోటికిఁ బోవిధియించి పిన్నబి । డ్డాటలు చేసె నీ సుఖములక్కట
భారకుకైనఁ జెప్పరే ॥ అని విధిం దూఱుచు మదనతాపాయత్తచిత్తలై ॥ ఉ॥ రమ్మని చీఱినంత నెపురంబున కేగెదుఁ గాని నన్ను
నీ కొమ్మలు నమ్మినారు మరుకోలలకగ్గము చేసి పోవఁగా, ముమ్మగమైన తాపమున మ్రొగ్గమరో యనఁ డంబుజాక్షుఁ డా,
యమ్మలు గోపవృద్ధులు ప్రయాణము వల్దనరైరి చెల్లరే ॥శా॥ అక్రూరుండని పేరుఁ బెట్టుకొని నేఁ డస్మన్మనోవల్లభుం, జక్రిన్మా
కడఁ బాపి కొంచు నరుగన్ దర్పించి నేతెంచి నాఁ, డక్రూరుండట క్రూరుఁడీతఁడు నిజం బక్రూరుఁ డా నేనని, ర్వక్రత్వంబునఁ గృ
ష్ణుఁ బెట్టి తన త్రోవం బోవ విచారింపఁడే ॥ఉ॥ ఫుల్లసరోజలోచనలు పూర్ణసుధాంశుముఖుల్ వరాంగన, ల్మెల్లనె మొల్లిపట్టణము
మేడలనుండి సువర్ణలాజము, ల్సల్లఁగ వారిఁ జూచి హరి సంగతి సేయఁ దలంచుఁ గాక వ్రే, పల్లెవసించు ముద్దియలపైఁ బడ నేల
తలంచు నక్కటా ॥క॥ పురసతులవిలోకనములు, సరసాలాపములు నర్మసంభోగములు న్మఱిగి హరి మనల నొల్లఁడు, నరవరు
లో యమ్మ మా తనప్రియులుగదే ॥క॥ పుట్టెన్నఁడు హరి నెఱుఁగని, పట్టణసుందరులకితనిఁ బతిఁ జేసి కడు, న్దట్టపు విరహాగ్నుల
కును, గట్టడిదైవంబు ఘోషకాంతల వేదిన్ ॥మ॥ హరి నేలా కొనిపోయెదం చుమనమా యక్రూరుఁ బ్రార్థింతమా, హరిఁ బో
నీకుఁడు నిల్పరే యనుచు నేఁ డర్చింతమా వేల్పుల, న్హరిపాదంబులకడ్డముల్వడుదమా హా దైవమా యంచు నా, తరుణుల్గొప్ప
లు చీరెలున్ మఱచి కందర్పజ్వరభ్రాంతలై ॥మ॥ ఉపదల్సిగ్గులు మాని కన్గవలనీ రొండొండ వర్షించుచు, న్వివశత్వంబులతోఁ గ
పోలతటసంవిన్యస్తహస్తాబ్జలై, పవనోద్ధూతలతాభలై నమ్ముఁ గృపం బాలింపు గోవిందమా । ధవదామోదరయంచు నే
డ్చిరి సుజాతంబైన గీతంబులన్ ॥వ॥ అంత మఱునాఁడు సూర్యోదయకాలంబున నందనతోడఁ బయనంబునకు గమకించిన మము

గోపికలను మఱలివత్తుననిమాతికాముఖంబులనివర్తించి కృష్ణుండుశకటంబులందుఁగానుకలును,గోరసంబునిడికొని నందాదులైనగోపకులు వెనుతగులనక్రూరచోదితంబైనరథంబెక్కి మధురాభిముఖుండై చనుసమయంబున॥ చ॥అదె చనుచున్నవాఁడు ప్రియుఁడల్లదె తేరదె వైజయంతియ ల్లదెరథఘోటకాంఘ్రిరజమా డెసమార్గముచూడుఁడంచులో నెదవెడినుకృష్ణవర్త్మహారిరథోన్ముఖలై గములై వ్రజాంగనల్లదలకనిల్చిచూచిరటుకన్నులకద్భుతమైనదూరముల్॥ వ॥ఇట్లుబలభద్రకృష్ణాక్రూరులుచనిచని॥క॥అవలోకించెనుకృష్ణుఁడు। ప్రవిమలకల్లోలపవనభాసితజన్యా। న్నవసన్నపాపసైన్యా। న్నవిజనమాన్యన్గళిందకన్యన్ధన్యన్॥ వ॥ కనితత్కాళిందియందుఁబరిఢుల్లమణిగణసముజ్జ్వలంబులగుజలంబులుద్రావితరుసమూహసమీపంబునరామసహితుండయికృష్ణుండురథంబుప్రవేశించె నంతనక్రూరుండువారలకుమ్రొక్కివీడ్కొని కా

### శ్రీ అక్రూరుండుయమునాజలంబునశ్రీరామకృష్ణులదర్శించినుతించుట. శ్రీ

ళిందీప్రాశంబుసొచ్చి విధిపూర్వకంబుగా వేదమంత్రంబులజపియించుచు॥ఉ॥స్నానముచేసి చేసినదిచల్లనినీటను రామకృష్ణులన్ మానుఁగజూచి వారురథమధ్యముపైనసియుండియున్నవా।రీనదినీటిలోపలికినెప్పుడువచ్చిరటంచు లేచి మే।ధానిధిచూచె వారినిరథస్థులభక్తమనోరథస్థులన్॥కని వెఱఁగుపడి॥శా॥ కంటిన్మున్నురథంబుపైజలములోఁగంటిన్మదిగ్రస్మరన్।గంటిన్ దొంటిరథంబుమీఁదనిదెయీకల్యాణచారిత్రులే। వెంటన్దోచిరిరెండుదిక్కులమనోవిభ్రాంతియోనీటిలో।నుఁటాశ్చర్యముచూతునంచుమఱియున్ స్నానించినుగ్నాంగుఁడై॥ఉ॥ పోషితబాంధవుండుయదుపుంగవుఁడాజలమందుఁగాంచె స।ద్భాషుసహస్రమస్తకవిభాసితభూషునహీశుభూమిభృ। ద్వేషుఁగృపాభిలాషుఁబ్రతివీరచమూవిజిగీషునిత్యసం।తోషునరోషునిర్దళితరోషునశేషవిశేషుశేషునిన్॥ వ॥ మఱియునీలాంబరసంయుతుండును,సిద్ధోరగాదిసన్నుతుండును నై యొప్పునప్పాపతేనిందప్పకకనుంగొని॥సీ॥ఆభోగిభోగపర్యంకమధ్యంబునవలనొప్పవచ్చనివలువవాని। మేఘంబుపైనున్న మెఱుఁగుచందంబున యురమునశ్రీదేవియొప్పువాని । మునురుతేఁటులువిప్పముఖచతుష్కముగలతనయుఁడాడెడిబొడ్డుతమ్మివాని।గదలనిబహుపదక్రమవిశేషంబులరవముచూపెడినూపురములవాని।జలజగర్భరుద్రసనకసనందన।సద్విజానురప్రశస్యమాన। చతురుఁడైనవానిసౌందర్యఖనియైన। వానినొక్కపురుషవర్యుఁగాంచి॥ వ॥మఱియుంజానులక్షణలక్షితనఖపాదగుల్ఫజానుజంఘోరుకటినాభిమధ్యోదరుండును,సాదరుండును,శ్రీవత్సకౌస్తుభవనమాలికావిరాజితవిశాలవక్షుండును,పుండరీకాక్షుండును, శంఖచక్రగదాపద్మహస్తుండును, సత్త్వగుణప్రశస్తుండును,బ్రహ్మసూత్రకటిసూత్రహారకేయూరకటకకంకణమకరకుండలకిరీటాదివిభూషణుండును,భక్తజనపోషణుండును, సుందరకపోలఫాలనాసాధరవదనకర్ణుండును,నీలనీరదవర్ణుండును,కంబుకంధరుండును,కరుణాగుణబంధురుండును,బ్రహ్మోదనారదసనందనందప్రముఖసంభావితుండును,శ్రీపుష్టితుష్టికీర్తికాంతీలోర్జావిద్యాశక్తిమాయాశక్త్యాదిసేవితుండును నై, యొప్పునప్పరమేశ్వరునకుమ్రొక్కి భక్తిసంభ్రమంబులగ్గలంబులుగగద్గదకంఠుండై దిగ్గనంగరంబులుముకుళించి యిట్లునివినుతించె॥దండకము॥శ్రీమానినీమానచోరాశుభాకారవీరాజగర్ద్ధేతుహేతుప్రకారాసమస్తంబునస్సంగతంబై మహాలోలకల్లోలమాలాకులాఖిలపాథోనిధింబాలకేళీగతిం దేలినారాయణాఖ్యంబటుఖ్యాతిశోభిల్లు నీనాభికంజంబులోలోకపుంజంబులంబన్నవిన్నాణియైనున్నయాబొమ్మయున్ఫన్నుఁడయ్యెంగదాపావకాకాశవాతావనీవార్యహంకారమాయామహామానసామల్ హృషీకామలుల్లోకముల్లోకబీజంబులన్నిత్యసందోహమైనీమహాదేహమందుల్లసించున్ న్వసించున్నశించున్జడత్వంబులేకాత్మమైయొప్పునీయొప్పిదంబెల్లనోచెల్ల చెల్లన్విచారింపవారెంతవారెంతవారైన మాయామలున్మాయతోఁగూడిక్రీడించుచోఁ గానుసంధాతయీధాతనిర్ణేతయేనీకళారాశికిన్గొండఱుం భోజగర్భాదులధ్యాత్మలంచున్నశేషాధిభూతంబులందున్ననేకాధిదైవంబులందున్సదాసాక్షివై యుందువంచున్ దదంతర్గతజ్యోతి వీవుండవంచున్ త్రయీపద్ధతిన్ గొందఱింద్రాదిదేవాభిధానంబులన్నిక్కుదొక్కుండవచున్మదిం గొందఱారూఢకర్మంబులంద్రుంచిసంసారముంద్రెంచిసన్యస్తులైమించివిజ్ఞానచక్షుండవంచున్మఱింబంచరాత్రానుసారంబునన్దన్మయత్వంబుతోఁగొందఱీవాత్మయంచున్మఱింగొందఱావాసుదేవాదిభేదంబులన్నల్వురై చెల్వువాటింతువంచున్మఱిన్నీవు నారాయణాఖ్యుండవంచున్నివాఖ్యుండవంచున్మఱింబెక్కుమార్గంబులన్నిన్ను నగ్గింతు రెగ్గేమియేఁటుల్పయో రాశినేరాసుపైకూడుగ్రీడన్విశేషంబులెల్లన్నశేషంబులైడిందినీయందనూనంబులీనంబులౌ నేకరాకేందుబింబంబుకుంభాంతరాళంబులంబింబితంబైనవేఱున్నదే యెన్న నేలాఘటాంతర్గతాకాశముల్లగ్గటాంతంబులందేకమౌరేఖలోఁ కావగన్నీవుఁ నేపోకలంబోక నేకాకివై యుండుదీశా కృశానుండు నెమ్మోముసోముండు భానుండు కన్నుల్ దిశల్కర్ణముల్ భూమి పాదంబులంభోని

ఘల్లుష్టి శల్యంబులద్రుల్లతా సాలము ల్రోమము ల్గాలి ప్రాణంబు బాహువుల్సురేంద్రుల్ఘనంబుల్కచంబు ల్నభోవీథినే
ఖప్రదేశంబు రేలుంబగళ్లున్నిమేషంబులంభోజగర్భుండు శేఫంబు వర్షంబు వీర్యంబు నాకంబు మూర్ధంబును న్నేకమైయు
న్ననీ మేనిదండంబ యోజాతగర్భాండముల్మండితోదుంబరానోకహానేక శాఖాఫలాపూరితానంతజంతుప్రకాండంబు
లీలం బ్రసిద్ధోదరాశిస్థజంతుప్రకారంబుగానిండియుండన్మహారూపనీరూపములెవ్వగ్గలంబుగ్గడింపన్మహాంభోధిలో మీను
మేనవ్విరోధిన్నిరోధించి సాధించి మున్వేధకున్వేదరాశిం బ్రసాదింపవే త్రుంపవే కైటభ శ్రీమధుం జక్రివై మొత్తవే యె
త్తవే మందరాగంబు రాగంబుతోఁ గూర్మలీలాపరిష్పందివై పందివై మేదినిన్మీఁదికిం ద్రోఁచి దోషాచరుం గొమ్ములన్నెమ్ము
లం జిమ్ముచున్గ్రివ్వవే త్రవ్వవే ఘోరవై రిన్నృసింహుండవై వండివై దండివై రోచనిం జూచి యాచింపవే పెంపవే మేను
బ్రహ్మాండమున్నిండ పాటుండవై రాజకోటిన్విదారింపవే రాజవై రాజబింబాస్యకై దుర్మదారిన్విదారింపవే నొంపవే
న్గాఁరుల న్వాసుదేవాదిరూపంబులన్సిద్ధబంధుండవై యేపుదీపింపఁ బౌద్ధుండవై వైరివారాంతరంగంబులన్నంతరంగంబుల
న్రూఁగరంగింపవే పెంపుదీపింపవే కల్కిమూర్తిం బ్రవర్తించి మించున్నినున్నెన్న నే నెవ్వఁడన్నన్ను మాయావిపన్నున్విప
న్నుం బ్రపన్నుం బ్రసన్నుండవై ఖిన్నతం బాపి మన్నింపవే పన్నగాధీశతల్పా కృపాకల్పవందారుకల్పా నమస్తే నమస్తే నమ
స్తే నమః॥ మ॥ కలలంబోలెడి పుత్రమిత్రవనితాగారాదిసంయోగము ల్జలవాంఛారతియెండమావులకు నాసల్సేయుచం
దంబున న్దలఁతు న్నృశ్యములంచు మూఢుఁడవృథాతత్త్వజ్ఞుఁడ న్నాకు నీ విలసత్పద్మపదంబు చూపి కరుణన్వీక్షింపు లక్ష్మీపతీ॥
వ॥ మఱియును వినుతింపనక్రూరునికి యమునాజలంబులోన నదన మొదలి మేను చూపి చాలించినటుని కై వడిఁ దిరోహితుండై
ననక్రూరుండు నీరు వెడలి వెఱఁగుపడుచు వచ్చి రథారోహణంబు సేసిన హరి యిట్లనియె॥ క॥ జలములు చేరువ నున్నవి తలపో
యఁగ నీవు పోయి తడవయ్యె నదీజలమున నభమున ధరణిం గలుగని చోద్యములు నీకుఁ గానంబడెనే॥ అనిన నతం డిట్లనియె॥ క॥ నీ
లోన లేని చోద్యము లేలోకములందుఁ జెప్పరీశ్వర నీట న్నేలన్నింగిని దిక్కుల నీలోఁ జోద్యంబు లెల్ల నెగడె మహాత్మా॥ వ॥ అ
నపలికి సాయంకాలంబున నక్రూరుండు మధురానగరంబు చేర రథంబు గడపె నంత నటమున్న చని నందాదులు పురోపవ
నంబున విడసియుండ వారలం గూడికొని కృష్ణుండక్రూరునిం జూచి నీవు రథంబు గొనుచు నగరంబునకుం జనుము మేము వెనుకవ

## శ్రీకృష్ణమూర్తి మధురానగరప్రవేశము చేయుట.

చ్చెదమనిన నతం డిట్లనియె॥ క॥ నాయింటికి విచ్చేయుము నీయంఘ్రి సరోజరేణునికరము సోక న్నాయిల్లు పవిత్రంబగు శ్రీ
యుత నీ భటుని బెద్ద సేయం దగదే॥ అనిన మఱియుం బ్రార్థించిన హరి యిట్లనియె॥ క॥ యదుకులవిద్వేషణుఁడై మదమున వర్తిం
చు కంసు మర్దించి భవత్సదనంబు చూడ వచ్చెదఁ బోదయ్య స్యందనము గొనుచుఁ బురమునకనఘా॥ వ॥ అని పలికిన నక్రూరుం
డు పురంబునకుం జని రామకృష్ణులు వచ్చిరని కంసునకెఱింగించి తనగృహంబునకుం జనియె నంతన పరాహ్ణంబున బలభద్ర
గోపాలసహితుండై కృష్ణుండు॥ మ॥ పరిఘుల్కోటలు కొమ్మలుం బడగలున్ప్రాసాదముల్వీథులున్ హరులున్ దేరులు వీరు
లున్గజములున్ హర్మ్యంబులున్వాద్యము ల్తరుణుల్ధాన్యములున్ధనంబులును మహోద్యానంబులున్దీర్ఘికల్పరమాశ్చర్యరు
చిం దనర్చు మధురన్గాంచెన్విభుండంతటన్॥ కనియప్పురంబు ప్రవేశించి వచ్చు సమయంబున॥ ఉ॥ నందతపఃఫలంబు సు
గుణంబుల పుంజము గోపకామినీ బృందము నోముపంట సిరి విందు దయాంబుధి యోగిబృందముల్ డెందములందుఁ గో
రెడు కడింది నిధానము చేర వచ్చె నో సుందరులార రండు చని చూత ముకన్నులకోర్కె దీఱఁగన్॥ వ॥ అని మఱియు గోవింద
సందర్శనకుతూహలంబులం బౌరసుందరులు పరస్పరాహూయమానలై భుంజానలై భోజనభాజనంబులు దలంగఁద్రో
చియు, శయానలై లేచియు, నభ్యంజ్యమానలై జలంబులాడకయు, గురుజనశిక్ష్యమాణలై యోడకయు, గృహకార్యప్రవ
ర్తమానలై పరిభ్రమింపకయు, రమణరమమాణలై రమింపకయు, శిశుజనబిభ్రాణలై డించియు, నలంకుర్వాణలై యన్యో
న్యవస్త్రాభరణమాల్యానులేపనంబులు విడ్వడ ధరించియు, నరిగి॥ క॥ వీటగలచేడెలెల్లను హాటకమణిఘటితతుంగహర్మ్యా
గ్రములన్గాటువలు గొనుచుఁ జూచిరి పాటించి విశాలవక్షుఁ బద్మదళాక్షున్॥ సీ॥ వీఁడెపో పేరక్కసి పిసగతజీవగఁ జన్నుఁబాలు
ద్రావిన మేటిబాలకుండు వీఁడెపో నందుని వెలఁదికి జగమెల్ల ముఖమందుఁ జూపిన ముద్దులాఁడు వీఁడెపో మందలో వెన్నలు
దొంగిలి దర్పించి మెక్కిన దాపరీఁడు వీఁడెపో యలయించి వ్రేతల మానంబు చూఱలాడిన లోకసుందరుండు వీఁడు లేకున్న వ్ర
తమట వీస్థలంబు వీనిఁ బొందని జన్మంబు విగతఫలము వీనిఁ బలుకని వచనంబు విహగరుతము వీనిఁ జూడని చూపులు వృథలు వృ
థలు॥ మ॥ చెలియా గోపికలీకుమారతిలకున్జింతించుచున్నాడుచున్గలయం బల్కుచు నంటుచున్నగుచు నాకర్షించుచున్ హ
స్తగామలకక్రీడకుఁ దెచ్చి నిచ్చలును సన్మానంబులం బొందఁగాఁ దొలిజన్మంబుల నేమి నోఁచిరొకొ దేదుర్గప్రదేశంబు

లఁగ్నక ॥ అనిమఱియుఁ బౌరకాంతలు। మునుకొని హరిరూపు నేత్రముల వెంటను లోఁ। గొని తాల్చి రిహృదయములను। జనితప్రమదమున విరులు చల్లుచు నధిపా॥ మఱియును ॥ క ॥ నానావిధగంధములుఁ బ్రసూనఫలాదులును హర్షితశుభలాజములున్। గానుకలిచ్చుచు విప్రులు। మానుగఁ బూజించి రాకుమారోత్తములన్ ॥ ... ... ... ... ... ...

—— శ్రీకృష్ణుండు రజకునిఁ జంపి వాయకసుదాములొసంగు పూజలనంగీకరించి మేలొసంగుట. ——

వ॥ ఆసమయంబున నగరద్వారంబుననుండి వచ్చు రాగకారుండగు నొక్క రజకుం గాంచి హరి యిట్లనియె॥ ఉ॥ విందులమైన రేశ్వరుని వీటికి వచ్చితి మేము మాకు నా। మందలలోనఁ గట్టికొన మంచిపటంబులు లేవు నీముడి। న్సుందరధౌతచేలములు శోభిలుచున్నవి తెమ్ము నిన్ను మే। లందెడి నిమ్ము రాజు దెసనల్లుర మో రజకాన్వయాగ్రణీ॥ అనిన వాఁడిట్లనియె॥ శా॥ ఎక్కట్రా మనుజేంద్ర చేలములు మీకీఁ బాడియే మీరలుం। గట్టంబోలుదురే పయోఘృతదధిగ్రాసంబులన్ మత్తులై। యిట్లాడం జనెఁ గాక గొల్లరకు మీకిట్లాడ నోరాడెఁ జిం। గట్టా ప్రాణముఁ గోలుపోయెదరు మీ కంసోద్ధతిన్ బాలకా॥ క ॥ మా రాజు సొమ్ముఁ గైకొన। నే రాజులు వెఱతు రింత యెల్లిద మేనీ। కీ రాజరాజగృహమున। నీ రాజస మేల గొల్లయేఁగుము తలఁగన్ ॥ అనిన విని రోషించి॥ క॥ ఘోరకరాగ్రతలంబున। ధీరుఁడు కృష్ణుండు శిరము దెగిపడఁ గొట్టెన్। బౌరులు గుండెలు వగులఁగ। వీరోద్రేకి న్మదావివేకిం జాకిన్॥ వ ॥ ఇట్లు భగ్నుండైన రజకుం జూచి వాని వారలు పటంబులు డించి వెఱచి పఱచిన రామకృష్ణులు వలసిన వస్త్రంబులు ధరియించికొని కొన్ని గోపకుల కొసంగి చనుచుండ॥ క॥ అంతట నొక వాయకుఁడా। క్రాంతస్నేహుఁడు దేవసుతులఁ గనిబహువర్ణా। త్యంతమృదుపటాభరణము। లెంతయు సంతసముతోడ నిచ్చె న్మెచ్చన్॥ శా॥ కారుణ్యంబున వానిఁ గైకొని యలంకారంబు గావించి శృం। గారోదంచితదిగ్గజేంద్రకలభాకారంబులం బోల్చి రా। శూరుల్మాధవుఁ డంత వాయకునికు స్రూపన్మహాప్రీతుఁడై। సారూప్యంబును లక్ష్మియు న్నొసఁగె నైశ్వర్యాదిసంధాయియై॥ వ॥ అంత నా రామకృష్ణులు సుదాముండను మాలాకారుగృహంబునకుం జనిన నతండు గని లేచి గ్రక్కున మ్రొక్కి చక్కన నర్ఘ్యపాద్యాదికంబు లాచరించి సానుచరులైన వారలకుఁ దాంబూలకుసుమగంధంబు లొసంగి యిట్లనియె ॥ ఉ॥ పావనమయ్యె నాకులము పండెఁ దపంబు గృహంబు లక్ష్మికి। న్సేవితమయ్యె నిష్టములు సేకుఱె విశ్వనిదానమూర్తులై। భూవలయంబు గావ నిటు పుట్టిన మీరలు రాక చేసి నే। నే విధమాచరింతుఁ బను లెయ్యవి బంట నెఱుంగఁ జెప్పరే॥ అనిపలికి॥ క॥ దామోదరరాములకు। ద్దామయశోహాసితతుహినధాములకు వధూ। కాములకుఁ దెచ్చియిచ్చెను। దాముఁడు ఘనసురభికుసుమదామములధిపా॥ క॥ వారలను మాలికుఁడర్చింపన్। భూరికుసుమదామములను భూషితులై నీ। కోరినవరమిచ్చెదమని। కారుణ్యము సేయ నతఁడు గన్గొని యిట్లనియెన్ ॥ క ॥ నీపాదకమలసేవయు। నీపాదార్చకులతోడి నెయ్యమును నితాం। తాపారభూతదయయును। తాపసమందార నాకు దయసేయఁగదే॥ వ॥ అని వేఁడికొనిన నిచ్చి మఱియు మాధవుండమ్మాలికునకు బలాయుఃకాంతికీర్తిసంపదలొసంగి వాని గృహంబు వెడలి రాజవీథిం జనిచని॥ క॥ ఆనలినాక్షుఁడు గాంచెను। నానాలేపముల భాజనము చేఁగొనుచు। న్మానినిఁ జనుదెంచుదాని। న్నాననరుచినిచయవినమితాబ్జం గుబ్జన్॥ కని యిట్లనియె. క॥ ఎవ్వరిదానవు లేపము। లెవ్వరికిం గొనుచు నేఁగెదు నీపే। రెవ్వతె మా। కిమ్మిన్నియు। నివ్వటిలెదు చక్కనగుచు నీరజనేత్రీ॥ అనిన నయ్యబల యిట్లనియె॥ ఉ॥ చక్కని వాఁడవౌదు సరసంబుల నెంపకు మెల్ల వారికి। న్జక్కదనంబు లెక్కడివి చారుశరీర త్రివక్రయండ్రు నే। నిక్కము కంసుదాసి నివి నిర్మలలేపనవిద్యదానన। న్మిక్కిలి రాజు మెచ్చుఁదగ మీరు విలేపనముల్ ధరింపరే॥ క ॥ అనిపలికి యాకుమారుల। తనువులు నగవులును వీక్షితములును మాటల్। దనచిత్తముఁ గరఁగించిన। నను లేపములిచ్చె వారికబల ప్రియముతోన్॥ సీ॥ ఇవ్విధంబునఁ గుబ్జ యిచ్చిన లేపంబు లన్నియుఁ దాను దేహమున నలఁదికొని ప్రసన్నత నొంది కుబ్జ మువ్వంకలయొడలు చక్కఁగ నెత్తియనుపఁ దలఁచి। తత్పదంబులమీఁదఁ దనపదంబులు ద్రొక్కి హస్తాంగులీద్వయ మబలనడుము। క్రిందవిప్పగనిడి కృష్ణుఁడు మీఁదికి నెత్తిన వక్రతలెల్లఁ బాసి। చక్కనైన చిత్తజన్మబాణముక్రియఁ। గొమరుమిగులఁ బిఱుఁదు గుచయుగంబు। సొంపుఁ జేయఁ దరుణి సుందరమూర్తియై। కమలయనుఁ జాదికాంతితోడ॥ క॥ వేంచేయుము నా యింటికిఁ। బంచశరాకారయనుచుఁ బైకొంగాకన్। న్నించి హరిఁ దిగిచెఁ గామిని। పంచాశుగబాణజాలభగ్నహృదయయై॥ క ॥ కామిని తిగిచినఁ గృష్ణుఁడు। రాముని వీక్షించి నగుచు రాజాననవా। త్కామితముఁ దీర్చి పిదప। న్నీ మందిరమునకు వత్తు నేఁడలుగకుమీ॥ వ॥ అని వీడుకొలిపి కృష్ణుండు *విపణిమార్గంబునం జనిచని, తాంబూలమాలికాగంధంబులును, బహువిధంబులయిన కానుకలును, బౌరులిచ్చినఁ బరిగ్రహించుచు; ధనుశ్శాలకుఁ జేరి యందు॥ క ॥ సురరాజువింటికైవడి। గురుతరమై భూరివీరగుప్తంబై దు। స్తరమైన విల్లుఁ బొడగని। నరులు వలదనంగఁ బట్టె నగ్నివిశ్వస్థితుఁడై॥ శా॥ బంధుల్మేలన వామహస్తమునఁ జాపంబెత్తి మౌర్వీలతా। సంధానంబొనరించి కొంచెపు తెగన్నద్దించుచున్ ధీరతా। సిం

* విపణిమార్గంబునన్। అంగళ్లబాజారున.

ఘుం డా హరిదానిఖండితముగాఁ జేసెఁ జనుల్వ్రాఁడఁగా। గండభేరుండంబు శిరసాలదండము నేఁగి ఖండించు చందంబునఁ ॥ క॥ కోదండభగ్ననిర్గత। నాదము పీనులకుభీషణంబై యాశా। రోదోంతరములునిండుచు। భేదించెఁ బ్రజవిభుని బింకమునధి పా॥ ఉ॥ అద్దిర రాచపిల్ల విరిచెనర్భకుఁడెంతయుశంక లేక నేఁ। డుద్దవిడిన్నసింహపదగదం గ్రతఁబట్టుఁడఁ పంచుఁ గ్రుద్ధులై। గ్ర ద్దన లేచితద్ధనువు కావలివారలు చేరవారిన। య్యుద్ధరుఁడూడిపట్టిఁ నడియించిరి కార్ముకఖండహస్తులై॥ వ॥ ఇట్లు రామకృష్ణులు మధురాపురంబున విహరించి వెడలి విడిమలకుం జనిరంత॥ మ॥ గగనారణ్యచరాంధకారగజముం గాలాహ్వయవ్యాధుఁడు।

——శ్రీ సూర్యాస్తమయచంద్రోదయములవర్ణనములు. శ్రీ——

న్నగఁబట్టంగమకించి సుచ్చిడుటకై చూతాంకుర శ్రేణిచే। నొగిఁ గల్పించినకందుకంబనఁగ సూర్యాండంబు వీక్షింపఁగాఁ। ద గెముందప్రభతోడఁ బశ్చిమమహాధాత్రీధరేంద్రంబునన్॥ క॥ తరుణుఁడ సుశీతకరుని ని। మఱిగివిమల్లిక్కతనన్నమానిను ఁకపుర్। ఖరకరుఁడు నను చుఁద్రొబ్బిన। కరణిన్ రవి పశ్చిమాద్రికడఁ గ్రుంకెన్నసా॥ గీ॥ కళలు గలుగఁగాక కమలతోడను ఁ గాక। శివునిమౌళిమీఁదఁ జేర్చఁగాక। నన్యుకొల్లఁ దపనుఁడై నమత్పతియని। సాధ్విభంగిఁ గమలజాతి మొగిడె॥ క॥ సుందరసా యంసంధ్యా। నందనవిప్రోష్ఠ్యతోయవజ్రహతోద్య। న్మందేహాసురరక్త। స్యందముక్రియఁ గెంపుసొంపెసఁగెనపరది శన్॥ గీ॥ భూమినిండమిం చఁబూర్ణమై కర్కట। మకరమీనరాశిమహితమైన। హరియశస్సుధాబ్ధి యందులతుంపురు। లనఁగ జు క్కలొప్పె నాకసమున॥ క॥ ఎల్ల దిశలునిండిన శ్రీ। వల్లభుగుణమహిమ బ్రహ్మవాసించుటకై। చల్లినమృగమదమనఁగా। వె ల్లివిరిసెఁ దమము గగనవీథులనెల్లన్॥ క॥ ఆచీఁకటివెనుఁ దగిలినఁ। బ్రాచీదిశనుండి గంతుఁ బరువునరవిభ। న్రాచలముమలక త్రోవను। వేచనియెంగాక నిలిచి విరుగకయున్నే॥ ఉ॥ మీకును వైరి యిప్పుడును మిక్కిలి మాకును వైరిరాజువో। పాకరుఁడింక వచ్చు జలజాతములార మదీయబాలురన్। జేకొనుఁడంచు బాలకులఁ జీఁకటిదాఁచినభంగిఁ జక్కిఁ రా। కాకవసించెఁ దుమ్మెద లురాత్రి సరోరుహకుట్మలంబులన్॥ సీ॥ ప్రాచీదిశాంగనాఫాలతలంబున దీపించు సిందూరతిలకమనఁగ। దర్పించి విరహుల దైర్యవల్లులు త్రెంపదర్పకుండెత్తినదాత్రమనఁగ। నలిగి కాలకిరాతుఁ డంధకారమృగంబు ఖండింప మెఱయించు ఖడ్గమనఁ గ। గగనతమాలవృక్షముతూర్పుకొమ్మను లలితమై మెఱయు పల్లవమనంగఁ। దొంగలు సంతసిల్ల దొంగలు భీతిల్లఁ। గడ లిమిన్నుముట్టి కడలుకొనఁగఁ। బొడిచె శీతకరుఁడు భూరిచకోరక। ప్రీతికరుఁడు జారభీతికరుఁడు॥ క॥ దర్పితతారాధిపపరిస ర్పితకిరణౌఘమిళితసకలదిశంబై। యేర్పడిక మలభవాండము। కర్పూరపుఁ గ్రోవిభ్రమగఁగను పట్టెన్నృపా॥ క॥ ఆ రేయి గోపయు తులై। క్షీరాన్నముమడిచి రామకృష్ణులు ముదిఁగఁ। సారంభమెఱిఁగియిష్టపి। హారంబులనప్రమత్తులై యుండిరిటన్॥ క॥ తన పురికి రామకృష్ణులు। చను దెంచిన జానుచరులఁ జంపుటయుమహా। ధనువుఁ గడిసి విరుచుటయును। వినికంసుఁడు నిద్ర లేకవి హ్వలమతియై॥ సీ॥ కర్ణరంధ్రములు చేఁ గప్పిన లోపలి ప్రాణఘోషము వినఁబడకుండెఁ। దోయమాదికములందుఁ దొంగిచూ చుచునుండఁ దలగానరాదయ్యెఁ దనువుమీఁదఁ। గరశాఖనాసికాగ్రంబు పైనిడి చూడ గ్రహతారకలు రెంటఁ గానఁబడియె। వెలుఁగున నిలుచుండి వీక్షింపఁగా మేనినీడ సరంధ్రమై నేలఁ దోఁచెఁ। గనుగుజాడ దృష్టవమాట లేదయ్యెను। దనువు తెల్లహేమత రువులనుచు। ఘూఱయుచుండెఁ గాలమృత్యువు డగ్గర। బుద్ధియెల్లఁ గలఁగె భోజపతికి॥ క॥ గరళముఁ దినుటయుఁ బ్రేతముఁ। బరిరం భించుటయు నగ్నభావుఁడవుటయున్। శిరమునఁ దైలమువడుటయు। ఖరపతినెక్కుటయును తఁడు కలలోఁ గనియెన్॥ వ॥ మ ఱియు రక్తకుసుమమాలికాధరుండై, యొక్కరుండును, నెక్కడేనియుం జనుచున్నవాఁడనని, కలఁగాంచి మరణహేతుకభీ తిం, జింతాక్రాంతుండై; నిద్రఁ జెందక వేగించుచున్న సమయంబున॥ క॥ అరుణహరినఖరవిదళిత। సురుచిరమిరేభేంద్రకుంభ

——శ్రీ సూర్యోదయవర్ణనము. శ్రీ——

కూటవినిర్ముక్తరుధిరమౌక్తికముల క్రియ। సురసతిదిశఁ గెంపుతోడఁ జుక్కలు మెఱసెన్॥ సీ॥ పౌలోమితనబాలుపాన్పు పైఁగనుపట్టఁబన్నినపవడంపు బంతియనఁగ। నాయురర్థములవ్రయంబులొప్పఁ దూటు కాలశాంభికుచేతిఘంటయనఁగ। బశ్చిమదిక్కాంతపరగఁగై సేయుచో ముందరనిడు ఘనజంతుజీవితకాలరాసులవిధిఁ గొల్వనెత్తినహేమకుంభమనఁగ। బద్మినీకాంతనోములఫలమనంగ। మూఁడుమూర్తులసారం కొన్నముకురమనఁగఁ। గోకతాపోపశమదివ్యఘుటికయనఁగఁ। బద్మినీకాంతనోములఫలమనంగ। మిహిరమండలముదయాద్రిమీఁదనొప్పె॥ క॥ విచ్చెన్ జల్లని గాడ్పులు। విచ్చెన్ గమలములు హిమము విరిసి పుమ్ముద్దయనఁగ। మిహిరమండలముదయాద్రిమీఁదనొప్పె॥ క॥ సంకాశితోదయాచల। పంకజ బిలంబుల్। చొచ్చెన్ బద్మమరందము। మెచ్చెన్ దుమ్మెదలు గ్రోలి మిహిరుఁడు పొడమన్॥ క॥ సంకాశితోదయాచల। పంకజ బిలంబుల్। చొచ్చెన్ బద్మమరందము। మెచ్చెన్ దుమ్మెదలు గ్రోలి మిహిరుఁడు పొడమన్॥ క॥ సంకాశితోదయాచల। సఖకిరణరాగపరిపూర్ణంబై। పంకేరుహగర్భాండము। కుంకుమసలిలంబుఁ గ్రోవికొమరున నొప్పెన్॥ తదనంతరంబున॥

శిరసాలదండముక్। చెఱకుగెడను. పౌలోమి। ఇంద్రునిభార్య. శాంభిక। శంఖమూదువాఁడు. కోక। చక్రవాకపక్షి. మిహిర। సూర్యుఁడు.

సీ॥ పాషాణవల్మీకపంకాదిరహితంబు నృపులకాంచననిభస్వర్ణ్మయంబుఁ। గమనీయకస్తూరికాజలసిక్తంబు బద్ధచందనదారుపరివృతంబు। మహనీయకుసుమదామధ్వజతోరణమండితోన్నతమంచమధ్యమంబు। బ్రాహ్మణక్షత్రాదిపౌరకోలాహలంబు శ్రాంత*తూర్యత్రయాంచితంబు। నిర్మలంబు సమము నిష్కంటకంబునై। పుణ్యపురుషుమనముం బోలి కంస। సైన్యతుంగమునుచుసంతుష్టలోకాంత।రంగమైన మల్లరంగము మెప్పె॥ క॥ ఆమల్లరంగపరిసర। భూమిస్థితమంచమందు భోజేంద్రుఁడు మా।న్యామాత్యసంయుతుండై। భూమీశులు గొలువనుండెఁ బొంకక చనధిపా॥ మ॥ సకలాంభోనిధిమేఖలావహనముం జాలించి మే తెంచినా। గమలాగంబులభంగి నొప్పచుఁ దగంగై సేసి చాణూరము। ష్టికకూటుల్పలకోసలుల్గుసుపులన్సేవించు మల్లరంగధా। త్రికి నే తెంచిరి తూర్యఘోషముల సుద్రేకంబ నేకంబుగన్॥ క॥ నందాదులైన గోపకు। లందఱు చని కానుకలు సమర్పించి నృపున్। సందర్శించి తదనుమతిఁ। జెంది మహోమంచమున వసించిరి వరుసన్॥ వ॥ అంత నా రామకృష్ణులు,

## శ్రీకృష్ణుండు-కువలయాపీడమను గజంబును వధించుట.

నలంకృతులై, మల్లమందుభినినదంబు వీని, సందర్శనకుతూహలంబున॥ క॥ ఓడక రంగద్వారము। జాడం జని వారు గనిరి సమద కువలయాపీడంబున్ భిన్నపరా। క్రీడంబున్ బ్రమదకంటకిత చూడంబున్॥ వ॥ కని తత్కరిపాలక శ్రేష్ఠుండైన, యంబష్ఠునికి, మేఘనాదగంభీరభాషణంబుల, రిపుభీషణుండగు, హరి యిట్లనియె॥ శా॥ ఓరీ కుంజరపాల మా దెసకు నీయుద్యన్మదేభేంద్రముం। ద్రేరేపంబని లేదు ద్రిప్పుము అలం ద్రేరేఁపినన్నిన్ను గం। భీరోగ్రాశనితుల్యముష్టిహతులం భేదించి నేఁడంతకుం। జేరంబుత్తు మహోత్తరద్విపముతో సిద్ధంబు యుద్ధంబునన్॥ అనిపలికి॥ మ॥ మిందిన కొప్పుఁ జక్కనిడి మేలనఁ బచ్చని చీరె కాశబం। ధించి లలాటకుంతలతతిన్ మలిలించుచు సంగర క్రియా। చుంచుతఁ జేర్చి బాలకుఁడు చూచుజనంబులు దన్ను బాపురే! యంచు నుతింప డగ్గఱియె మహాస్తిజిత్తాగము గంధనాగమున్॥ క॥ ¶ అంజక బాలకుఁడనియును। ‡గొంజక దయమాలి రాజకుంజరయంతన్। కుంజరముమడి కొలిపెను। కుంజరపాలకుఁడు గోపకుంజరుమీఁదన్. వ॥ మఱియు (*) నయ్యనేకపంబనేకపపాలకప్రేరితంబయి మహావాతసంఘాతసముద్ధూతంబగు విలయకాలకీలికేళి నిబిట్టుమిట్టిపడి, మృత్యుదేవతయుత్తునం గాలుపోలిక శమనుగమనికనెదిరి మదసలిలపరిమళలుబ్ధపరిభ్రమసదభ్రభ్రమరగాయకఝుంకృతులహుంకృతులు పాదింపం గులకుంభినీధరగుహాకుంభకుంభనంబుగ ఘీంకరించి రోషభీషణ శేషభోగిభోగభయంకరంబగు కరంబున శౌరిం జీటి చీరికింగొనక పట్టి, నట్టిట్టు గెంటి, విధుంతుదవదనగహ్వరంబువలన విడివడియు అకుతరణికరణి, దర్పించి, కుప్పించి, పాదమధ్యంబునకు నసాధ్యుండై, దాఁటిదాఁటిమాటుపడినం, గ్రోధబంధురంబై సింధురంబు, మహోర్ణవమధ్యమంథాయమానమందరమహీధరంబు కైవడి, జిఱజిఱందిరిగి కానక, భయానకంబై, గాలి వెరవున నంగనిపొంగి చెంగటం, బ్రళయదండిచండప్రశస్తంబగు హస్తంబు వంచి వంచించి చుట్టిపట్టి పడద్రేయంగముకొంచిన నంజలింపక తెంపున హరి కరిపిటిందికి నుటికి, మహోరాహువాలవల్లికాకర్షణోద్గీర్ణుండగు సుపర్ణు తెఱంగున నెగరి శుండాలంబు వాలంబు లీలం గేలనొడిసిపట్టి ఝళిపించి పంచవింశతిబాణాసనప్రమాణమారంబున, బిఱబిఱం ద్రిప్పివైవ్వ నవ్వారణంబు మఱ్ఱి వారణంబై, రణంబునకోహటింపక, సవ్యాపసవ్యపరిభ్రమణంబులన వక్రంబై కవిసిన, నపసవ్యసవ్యక్రమంబులం దప్పించి, ఱొప్పక కుప్పించి యొమఱ్ఱొనిన, కర్కశుండై మేచకాచలతుంగశృంగగుంభంబగు కుంభికుంభంబు చక్కటి వ్రక్కలై చెక్కలెగయ మరంతకల్పాంతజీమూతప్రభూతనిర్ఘాతనిష్ఠురంబగు ముష్టిసారించి యిమ్మాఁచిపొడిచిన నందద్వికీర్ణపూర్ణరక్తసిక్తమౌక్తికంబులు వసుంధరకు సంధ్యారాగరక్తతారకాచ్ఛన్నంబగుమిన్ను చెన్నలవరింపనిలువరింపక మ్రొగ్గి మ్రొకరిలి మ్రొగ్గక దిగ్గన నగ్గజంబు లేచి చూచి త్రోఁచిన డచిసంహారసమయసముగ్రసంఘాతసంభూతసముత్తుంగభంగసంఘట్టితంబగు, కులాచలంబు క్రియఁ గ్రమ్మఱ, నమ్మహాభుజునిభుజాదండంబులవలన ఘట్టితంబై, కట్టలుకముట్టి నెట్టడీకొని, ముమ్మరంబుగం గొమ్ముల జిమ్మిన నమ్మేటి చేసూటి మెఱసి హస్తాహస్తిసంగరంబునఁ గరంబొప్పి దప్పించ బడనొప్పించిన నకుంఠితకాలకంఠకఠోరభల్లభగ్నంబగు పురంబు పగిదిం జటులఝంఝానిలవికలంబగు కలంబుకైవడి నమ్మదకలభంబు బలంబుదక్కి చిక్కి స్రుక్కి పడిలోభికరంబునుంబోలె దానసలిలధారావిరహితంబై, విరహితలంపునుంబోలె నిరంతరచిత్తజాతనిగ్రహంబై, గ్రహణకాలంబునుంబోలెఁ శీకరాధీనఖరకరంబై, ఖరకరోదయంబునుంబోలె భిన్నపుష్కరంబై, పుష్కరవైరివిలసనంబునుంబోలె నభాసితపక్ష్మకంబై, యున్న సమయంబున॥ ఉ॥ కాలం ద్రొక్కి సలీలుఁడై నగవుతోఁ గంఠీరవేంద్రాకృతి। న్నేలన్ భీషణదంతముల్వొటికి సంక్షీణంబుగా మొత్తి గో।పా

*తూర్యత్రయ। నృత్య-గాన-వాద్యములు. ¶అంజక। ఆలస్యముచేయక. ‡కొంజక। సంకోచింపక. (*)అయ్యనేకపంబు। ఆగజము. అనేకపపాలక। మావటివానిచే. విధుంతుద। రాహువు. శుండాలము। దంతావళ। ఏనుఁగు. ఓహటింపక। వెనుకఁదీయక. మదకలంబు। మదపుటేనుఁగు.

లగ్రామణివీరమాళిమణిమై ప్రాణంబులం బాపెనా। శైలేంద్రాభము గ్రాణలోభమును దంచత్సారగంధేభమున్. వ॥ మఱియు నంతిదంత తాడనంబులదంతావళపాలకులహరించి తత్ప్రదేశంబు వాసి॥ మ॥ కరిదంతంబులు మూపులందు మెఱయ న్ఘర్మాంబువుల్ లోమ్ముల। న్నెఱయంగోపకులం దనంతవాలయ న్నిత్యాహవ స్థేములా। హరిరాముల్ చనుదెంచి కాంచిరి మహోగ్రాడంబరాపూరితా। మరమర్త్యాదిజనాంతరంగములసన్మల్లావనీరంగమున్॥ సీ॥ మహితశౌర్యంబున మల్లురకశనిగ్మైనరులకచ్యుతముగ నాథుఁడగుచు। శృంగారముగఁ బుర స్త్రీలకుఁగాముఁడై నిజమృత్యువై కంసునికిభయముగ। మూఢులు భీభత్సమును బొందవికలుఁడై దండ్రికిదయరాఁగఁదనయుఁడగుచు। ఖలులకు విరసంబుగా దండి తైగోపకులకు హాస్యంబుగఁగులజుఁడగుచు। బాంధవులకుఁ బ్రేమభాసిల్లు వేలుపై। శాంతమొనర యోగిజనులకెల్లఁ। బరమతత్త్వమగుచు భాసిల్లె బలునితో। మాధవుండు రంగమధ్యమందు॥ అప్పుడు॥ క॥ చచ్చిన ఘంభీంద్రంబును। వచ్చినబలమాధవులను వరుసం గని తా। నెచ్చినచిత్తముతోడుత। జెచ్చెరఁగడు వెఱచె భోజసింహుండధిపా॥ ఉ॥ ధీరుల వస్త్రమాల్యమణిదీప్తవిభూషణధారులన్నటాకారులసర్వలోకశుభకారుల మానవమానినీమనో। హారులరంగభూతలవిహారుల గోపకుమారుల న్మహా। పీరులఁ జూచి చూచితనివిరాఘువిముష్టికలోకులందఱున్॥ ఉ॥ సన్నుతరామకృష్ణముఖచంద్రమయూఖసుధారసంబులన్। గన్నులఁ ద్రావుచందమునఁగాంచుచు జిహ్వలనంటిచూచులీలన్నుతిసేయుచున్ గరములం బరిరంభణసేయుభంగిన। త్యున్నతిఁ జూపుచుం దగిలి యొండొరుతోడ రహస్యభాషలన్॥ క॥ వసుదేవుని వాసంబున। వసుధన్రక్షింపవీరు వైష్ణవతేజో। ల్లసనమునఁ బుట్టి నారఁట। పసిబిడ్డలనంగజనము పరదేవతలన్॥ సీ॥ చంపె రక్కసిఁ బట్టి చక్రవాతునిఁ గూల్చెఁ బకద్రొబ్బె మద్దులబడ నిఁజీతె। నఘుదైత్యుఁ బోరి గోనెనడరి వత్సకుఁ ద్రుంచెగిరి యెత్తి జేవేంద్రుఁ గ్రిందుపఱిచెఁ। గాళియు మర్దించె గహనానలముఁ ద్రావెఁ గేశినంతకుపురి కేవకనిచె। మయపుత్త్రుఁ బరిమార్చె మఱియు దానవభటుల హరించి గోపకులం బుఁగాచె। గోపకాంతలమనములకోర్కెఁ దీర్చె। నీసరోరుహలోచనుండీశుఖాంగుఁ। డీమహామహుఁడీ దిగ్గజేంద్రమడఁచె। మనుజమాత్త్రుఁడె

## శ్రీకృష్ణబలరాములు చాణూరముష్టికులను వధించుట.

తలపోయ మాధవుండు॥ వ॥ అనిపలుకుసకలజనులు చూచుచుండ రామకృష్ణులకుఁ జాణూరుండిట్లనియె॥ మ॥ వనమార్గంబున గోపబాలకులతో వత్సంబులన్మేపుచున్। జెనఁగన్మిక్కిలి నేర్చినారనుచు నీపృథ్వీజనుల్ సెప్పమా। మను జేంద్రుండిటమిమ్ముఁ జీఁఱఁబనిచె న్మల్లాహవక్రీడకు। జ్జనదేకొంతపరాక్రమింపను నకున్భద్యుల్వి లోకింపఁగన్॥ మ॥ జవసత్త్వంబులు మేలె సాముగలదే సత్రాణమే మేనుభూ। ప్రవరుండౌననిమిమ్మనంగవలె నేపాలీలభీష్టంబులే। పవివో కాకకృతాంతదండకమువో ఫాలాక్షునేత్రాగ్నివో। నవనీతంబుల ముద్దగాదు మెసఁగన్నా ముష్టి గోపార్భకా॥ క॥ జనములు నేర్చినవిద్యలు। జననాథునికొలఁకుఁగాదె జననాథుఁడు నీ। జనములు మెచ్చఁగ యుద్ధం। బున నను నెమ్ముంగొంత ప్రోద్దుపుత్త్రమె కృష్ణా॥ అనినవినిహరియిట్లనియె॥ ఉ॥ సాములు లేవు పిన్నలము సత్త్వముగల్దనరాదు మల్లసం। గ్రామవిశారదుల్ కలిశకర్కశదేహులు మీరు మీకడ। న్నేముచరించుటెట్లు ధరణీశుని వేడ్కలుసేయువారమున్। గాముని నోదముల్పలుపఁగాదనవచ్చునె యొక్కమాటికిన్॥ క॥ నీతోడుత నేఁ బెనఁగెద। ప్రీతిన్ముష్టికుని తోడఁ బెనఁగెడి బలుఁడు। గ్రాతతమల్లాహవమున। భూతలనాథునికి మెచ్చుఁ బుట్టింతుసభన్॥ అనిన విని రోషించి చాణూరుండిట్లనియె॥ శా॥ నాతోఁ బోరఁగ నెంతవాఁడవిసిరో నా పాటియే నీవువి। ఖ్యాతుండగ్గలజుండ సద్గుణుఁడ సత్కర్మస్వభావుండనీ। కేతాదృగ్విభవంబు లెల్లఁగలవే యీవీటఁ బోరాడుట। ల్వేవ్రతజ్ఞాడఁగఁగు ప్పిగంతులిడు టేవీక్షింపు గోపార్భకా॥ శా॥ స్థాణుస్మైచ్ఛఁడు బ్రహ్మఁగైకొనఁడు విష్వక్సేనునవ్వున్డగ। త్ప్రాణున్ రక్షనఁడీడుగాఁడని మహాబాహాబలప్రౌఢిన। క్షీణుండాజికినెల్లి నేఁడనఁడు వై చిత్రిన్వినోదించున। చ్చాణూరుండొకగోపబాలునికి న్మక్తుండుగాకుండు నే॥ క॥ ప్రల్లదమేటికి గోపక। బల్లిదుఁడను లోకమందుఁ బ్రఖ్యాతుఁడనా। చల్లడము క్రిందదూరని। మల్లురులే రెందుధరణిమండలమందున్. సీ॥ చలమున నను డాసి జలరాశిఁ జొరరాదు నిగుడి త్రిగోత్రము దండనిలువరాదు। కేడించి కుంభిని క్రిందికిఁ బోరాదు మనుజసింహుఁడనని మలయరాదు। చేరినఁ బడవైతుఁ జెయ్యిసాఁపఁగరాదు బెరసి నాముందర బెరుగరాదు। భూనాథ హింసకుఁ బోరాదు నను మీఱి శోధింతుఁ గానలసొరఁగరాదు। ప్రబలమూర్తిని నను భాసిల్లఁగారాదు। ధరఁ బ్రబుద్ధుఁడనని దరుమరాదు। కలికితనము చూపి గర్వింపఁగారాదు। తరముగాదు కృష్ణ తలఁగు తలఁగు॥ అదిగాక నీవు శ్రీహరినంటేని॥ సీ॥ మహిమతో నుండంగ మధురాపురముగాని పాలు పారువైకుంఠపురము గాదు। గర్వంబుతో నుండఁ గంసుని సభగాని సంసారరహితుల సభయుఁ గాదు। ప్రకటించి వినఁగ నా బాహునాదముగాని నారదు వీణాస్వనంబు గాదు। చదురులాడఁగ మల్లజనవిగ్రహముగాని రమతోడి ప్రణయవిగ్రహము గాదు। వెలసి తిరుగంగ వేదాంతవీథిగాదు। మోఁగి

సాళీలు। సాధనములు। గోత్రము। పర్వతము. శేడించి। మరలించి.

శో మునిపనములమూలగాదు। సాగినదువంగభక్తులజాడగాదు। శౌరినామ్రొలనీ వెంచుచనియెడింక॥ అనిపలికి॥ సీ॥ రో
షాగ్నిధూమప్రరోహంబులై వడిశిరముననన్నపుసిక వెలుంగ। నాశామదేభేంద్రహస్తసన్నిభములై బాహుదండంబులు
భయదములుగ। లయసమయాంతకోల్లసితదంష్ట్రిలభంగిఁజాగినకోఱమీసములు మెఱయ। నల్లని తెగగలనడగొండనాక్ష్వ
సనాభీలనీలదేహంబు మెఱయఁ। జరణహతులధరణిసంచలింపఁగనభో। మండలంబునిండఁ బల్లసఱచి। శౌటి జెనకునడిచెఁ
జాణూరమల్లుండు। పౌరలోకహృదయభల్లుఁడగుచు॥ వ॥ ఇట్లగ్గలంబగు* నగ్గలికడగ్గరినమల్లునింగని మెల్లనమొల్లంబగుబీ
రంబు వెల్లిగొనవల్లవవల్లభుండుల్లసిల్లి బాహునాదంబునరోదోంతరాళంబుపూరించి మించికవిసినట్టిద్దరుసద్దవిడినున్న
తవిషపంబులనుతాణలిడికరికరియును;హరిహరియును,గిరిగిరియునుం, దాఁకుపీఁకందలపడియితరేతరహేతిహింసితం
బులగుదవానలంబుల తెఱంగునఁబరస్పరదీర్ఘనిర్ఘాతఘట్టితంబులగుమహాభ్రంబులవిభ్రమంబునన న్యోన్యతుంగతరం
గతాడితంబులగుకల్పాంతకాలసముద్రంబులరౌద్రంబున నొండొరులముష్టిఘట్టనంబులఘట్టితశరీరులై దద్దరిలకడగ్గరి
గ్రద్దనయ్యిద్దరుండిరుగు నెడహరిచొచ్చి పేర్చియార్చి జెట్టెంబట్టిపడందిగిచిపాదంబులజడించిసముల్లాసంబున నెసకం
బునకువచ్చినమెచ్చినొచ్చియచ్చపలుండుమీఁటి మోరసారించి తెరలకపొరలఁ ద్రొబ్బిననబ్బలానుజుండుబ్బిగొబ్బున మే
నువర్ధిల్లనగ్గాంకంబుననుండిజానువులనొత్తుచునురువడిం గరవడంబుననున్నవాఁచూర్ణయుండునను, బాలమేలు మేలనిలీ
లంగాలుసొరనిచ్చి త్రోచినంజూచియేచిఖేచరులగ్గించియుగ్గడింపనగ్గోపకుమారుండుపాటవంబునను రాటవంబునకుంజని
వెన్నెక్కి-నిక్కి-న నక్కంసభటుండుమదగజరేఖబంధురంబగుపదంబునుబదంబునంజాపి కరంబునుకరంబునంగ్రహిం
చిసహించివహించి నైపుణంబునలోపలందిరిగియట్టిట్టుతప్పించినదిట్టతనంబునంపప్పకసప్పర్మ్మలోచనుండుకేడించి యేచి
సముతలంబునవైచి ప్రచండంబగువాని పిచండంబువాగించి కాలధికక-రించిడొక్క-రంబుగొనినయ్యభ్యాసిసభ్యులుస
న్నుతింపంగ్రమ్మఱించిజడ్డనఁగాలడ్డగించిరక్షించుకొనినవారత్కొవైరివైరికటిచేలంబుపట్టియెత్తియెత్తినదుమురాగె
యిడిసందువెట్టినవ్విననవ్విరోధికాలుకాలిలోనిడి వేధించినిరోధించిరరోధంబుఁబాసితిరిగినవను దేవుపట్టిపట్టసంబుగొ
నిభట్టించినసుబ్బరికచేసిచాణూరుండుహరికరంబుపట్టిహుమ్మనినెమ్మొగంబునంగాలిడిమీఁదైనంగేలిబాలకుండు కాలుఁ
గాలనివారించిమీఁదైనెగడియుండియునుండకచుర్వారబలంబునవిదలించిలేచిగృహీతపరిపంథిచరణుండై విపక్షునివ
క్షంబువజ్రవజ్రసన్నిభంబగుపిడికిటంబొడిచినవాఁడువాడిచెడక విజృంభించియంభోరాశిమథనంబునందిరుగుశైలం
బుపోలికనేలబిఅజిఅందిరిగితన్నినవెన్నుండుకుప్పించియుప్పరంబెగసిమీఁదనుఱికినతండుకృష్ణపాదసంధిపరిక్షిప్తపా
దుండై మెగసిలేచిసముద్ధతుండయ్యెనయ్యెడ॥ క॥ బలభద్రుఁడుముష్టికుఁడును। బలములు మెఱయంగఁ జేసిబాహాబాహిం
బ్రశయాస్నలక్రియఁబోరిరి। వెలయఁగబహువిధములైనవిన్నాణములన్॥ ఇవ్విధంబున॥ క॥ వల్లవులు పెనఁగిరున్నత।శృంగ
ల్లులతోభిన్నదిగిభకరవల్లులతో। మల్లులతోరిపుమానసభల్లులతోభీతగోపపల్లులతోడన్॥ వ॥ ఆసమయంబునఁబౌరకాం
తలుమూఁకలుగట్టి వెచ్చనూర్చుచుముచ్చటలకుంజొచ్చితమలోనిట్లనిరి॥ ఉ॥ [illegible]దికుమారులంగుసుమమంజుళశరీరులఁ బె
చ్చి చెల్లరే।యంచితవజ్రసారులుమహాద్రికఠోరులునైనమల్లురం। గ్రించ[illegible]రాజుపెనఁగించుచుఁ జూచుచునున్న
వాఁడుమేలెంచుక లేదుమానుమనఁడిట్టిదురాత్మునిమున్నవింటిమే॥ క॥ [illegible]దరుగానిసభికులు। నీచిన్నకుమారకులకునీ
మల్లురకు।నెన్నఁ జెల్లయీడుగాదని। సూచింపరుపతికిఁదమకుశోకము[illegible]దే॥ సీ॥ వేణునాళములైవెలసినమాధవుం దధ
రామృతములిచ్చియాదరించుఁ। బింఛదామములైపెరిగినవెన్నుందుమస్తకంబునఁదాల్చి మైత్రినెఱపుఁ। బీతాంబరము
లమైబెరసినగోవిందుఁడంసభాగములఁబాయకధరించు। పైజయంతికలమై వ్రాలినకమలాక్షుఁడతికుతూహలముననలు
తఁదాల్చుఁ। వనరుబృందావనంబునఁదరులమైనఁ। గృష్ణుఁడానందమునఁజేరిక్రీడసల్పు। నెట్టినోములనైనమున్నిట్టివిధ
ము। లేలకామైతిమోయమ్మయింకనెట్లు॥ ఉ॥ పాపపుబ్రహ్మగోపికలపల్లెలలోనసృజింపరాదెను? న్నిపురిలోపలమ్మనల
నేలసృజించెనసైననిచ్చలున్। జేపడుఁగాదెయీసుభగుఁజెంజెడిభాగ్యముసంతసంబునీ। గోపకుమారుఁబొందమునుగో
పకుమారికలేమినోఁచిరో॥ క॥ గోపాలకృష్ణుతోడనుగోపాలనవేళలందుఁగూడితిరుగునా। గోపాలురెంతధన్యులో। గోపా
లురమైననిట్టిగురుచిగలదే॥ క॥ శ్రమజలకణసిక్తంబై। కమలదళేక్షణునివదనకమలముమెఱసెన్। హిమజలకణసిక్తంబై।
కమనీయంబగుచునున్నకమలముభంగిన్॥ గీ॥ సభకుఁబోవఁజనముసభవారిదోషంబు। నెఱిఁగియూరకున్న నెఱుఁగకున్న।

---

*అగ్గలిక।రణోత్సాహము. బీరంబు।పరాక్రమము. ఘాతి।త్రొక్కిన ట్లావ. నిర్ఘాతుండగు। పిడుగువంటివాఁడైన. ఎసకంబునకు।ఉద్రేకించుట కు-మీఁటుటకు. పిచండము।కడుపు. డొక్క-రంబు।మల్లనైపుణము. రాగె।పొరలుట. ఉబ్బరికచేసి।విజృంభించి. శృంగల్లులలోన్।కంఠధ్వనులు గలవారిలో. అనఁగాసింహనాదములు సేయుచున్నవారు.

నెఱిఁగియుండిరైన నిట్టట్టు వలికిన। బ్రాజ్ఞులైనఁ బొందఁ బాపచయము॥ వ॥ అని పెక్కండ్రు పెక్కువిధంబులం బలుకఁ దద్బాహుయుద్ధంబున॥ క॥ ధృతిచెడి లోఁబడెను మల్లుం। డతులితభవజలధితరికి హతరిపుపురికిన్। హితకరికిన్ ధృతగిరికిన్। దతహరిరవ ఖరితశిఖరిదరికిన్ హరికిన్॥ క॥ హరికి నిలోఁబడి బెగడక। హరియురమును పెనుగ్రముష్టి నహితుఁడు పొడువన్। హరిపుసుమమాలికాహత। కరిభంగిం బరాక్రమించెఁ గలహోద్ధతుఁడై॥ క॥ శౌరి నెఱిఁ జొచ్చి కరములు। క్రూరగతిం బట్టి త్రిప్పి కుంభినిపైం జెన్। శూరుం గలహగభీరున్। వీరున్ జానూరు ఘోరువితతాకారున్॥ క॥ శోణితము నోర నొలుకఁగఁ। జాణూరుం డట్లు కృష్ణుసంభ్రమమున నఁ। క్షీణుండై త్రోణింబడి। ప్రాణంబులు విడిచెఁ గంసుప్రాణము గలఁగన్॥ క॥ బలభద్రుండును లోకులు। బలభద్రుం డనఁగఁ బెనఁగి పటుబాహుగతిన్। బలభేది మెచ్చఁ ద్రిప్పెను। బలవన్ముష్టికుని గంసుబలములు బెగడన్॥ గీ॥ త్రిప్పి నేలపై వడిఁ గ్రన్న రక్తంబు। వదనగహ్వరమున వరదవాఱ। ముష్టికుండు ఘోరముష్టిసత్త్వము సెడి। గూలెఁ గాలిఁ దరువు గూలినట్లు॥ క॥ పాటవమునఁ బలుపిడికిట। సూటింబడఁ బొడిచె బలుఁడు శోభితఘనభా। హాటోపనృపకిరీటు। న్గూటుస్వాచాటు నధికఘోరలలాటున్॥ వ॥ అంతనగ్రనుజాంతకుండు చరణప్రహారణంబుల భిన్నమస్తకుం జేసి, వాని చెలులనంత కాంతికంబునకు నిచిన॥ క॥ వల్లవబాలకులనిమన। మల్లవరులు పెనఁగి నేఁడు మడిసిరి వీరల్। బల్లిదులు తలఁ ద్రుంతలఁ డని। చెల్లా చెదరైరి పాఱి చిక్కని మల్లుల్॥

→ శ్రీకృష్ణుండు కంసుని వధించుట. ←

ఉ॥ మల్లురఁ జంపి గోపకసమాజములో మృగరాజురేఖతో। భిల్లఁగఁ బాదపద్మములఁ బెల్లుగ నందెలు మ్రోయవచ్చునా। వల్లవరాజనందనుల వారకఁ జూచి మహీసురాదుల। ల్లల్లన సంస్తుతించిరి ప్రియంబుగఁ గంసుఁడు దక్కనందఱున్॥ వ॥ అంత సభాజనుల కలకలంబు నివారించి, మంత్రులం జూచి, కంసుం డిట్లనియె॥ మ॥ వల్లవబాలు రన్నగరి వాకిటికిన్ వెడలంగఁ ద్రొబ్బుఁడీ। గొల్లల ముట్టికొల్లలనుఁడు క్రూరుని నందుని గట్టుఁ డుర్వికిం। దెల్లముగాఁగ నేఁడు వసుదేవునిఁ జంపుఁడు తండ్రి గాఁడు మీఁ। డెల్ల విధంబులం బరులకిష్టుఁడు కావకుఁ డుగ్రసేనునిన్॥ అనిపలుకు సమయంబున॥ శా॥ జంఘాలత్వముతోన గోపరిచరత్సారంగ హింసేచ్ఛను। ల్లంఘింపంగ మకించు సింహము క్రియన్ లక్షించి పౌరప్రజా। సంఘాతంబులు తల్లడిల్ల హరి కంసప్రాణహింసార్థియై। లంఘించెన్ దమగంబు మీఁదికి రణోల్లాసంబు భాసిల్లఁగన్॥ క॥ తమగతమున కెమరుయముస। త్తమగణ్యునిఁ జూచి ఖడ్గధరుఁడై యెదిరె। న్దమ గమివారలు వీరో। త్తమగణవిభుఁడనఁగఁ గంస ధరణీపతి యున్॥ శా॥ పక్షీంద్రుండురగంబుఁ బట్టువిధ మొప్పం గేశబంధంబులో। కత్రోభంబుగఁ బట్టి మౌళిమణులాకల్పాంత వేళాపత। న్నతపత్రంబుల భంగి రాలరణసన్నాహంబు డిందించి రం। గత్రోణింబడఁ ద్రొబ్బెఁ గృష్ణుఁడు వెసం గంసున్నృపోత్తంసునిన్॥ శా॥ మంచాగ్రంబుననుండి రంగధరణీ మధ్యంబునం గూలి నే। సంచారంబును లేక చిక్కిజను లాశ్చర్యంబునుం బొందఁగాఁ। బంచత్వంబును బొందియున్నవిమతుం బద్మాక్షుఁ డీడ్చెన్ వడిన్। బంచాస్యంబు గజంబు నీడ్చు పగిది న్బాహాబలోల్లాసిగా॥ క॥ రోషప్రమోదనిద్రా। భాషాశనపానగతులఁ బాయక చక్రి। న్దోషరతిఁ జూచినైన వి। శేషరుచిం గంసుఁ డతనిఁ జెందెనపై॥ క॥ ఆసమయంబున॥ గోపాలుఁ డొక్కఁడద్దిర। భూపాలకుఁ జంపె మీనిఁ బొడువుం డేత। త్సూపాలస్యము లేలని। తానరేంద్రా॥ ఆసమయంబున॥ గోపాలుఁ డొక్కఁ డద్దిర। భూపాలకుఁ జంపె మీనిఁ బొడువుం డేత। త్సూపాలస్యము లేలని। పాలఘురోషులసుచదరోప్లేక్షతులై॥ శా॥ న్యగ్రోధుండును గహ్వుఁడున్మొదలుగా నానాయుధానీక సా। మగ్ర్యంగంసుని సోదరుల్ల వియుఁడున్నాద్యగ్గజేంద్రాభుఁడై। యుగ్రుండై పరిఘాయుధోల్లసితుఁడై యొండొండఁ జెండాడి కా। లాగ్రక్షోణికిఁ బంచె రాముఁడు గరీయస్థేముఁడై వారలన్॥ అయ్యవసరంబున॥ చేతులఁ దాళముఁ బట్టుక। చేతోమోదంబుతోడ సిగ ముడిపీడన్। బాతరలాడుచు మింటను। గీతము నారదుఁడు వాడెఁ గృష్ణా యనుచున్॥ క॥ వారిజభవరుద్రాదులు। భూరిప్రసూనవృష్టిఁ గురిసి పొగడిరి కృష్ణున్। భేరులు మ్రోసెను నిర్జర। నారులు దివి నాడి రధికనటనములనృపా॥ వ॥ అంతం గంసాదుల కాంతలు, భర్తృమరణదుఃఖాక్రాంతలై కరంబుల శిరంబులు మోఁదుకొనుచు, నశ్రుసలిలధారాపరిషిక్తవదనలై, సదనంబులు వెలువడివచ్చి, వీరశయ్యానిద్రితులైన విభులం గౌఁగిలించుకొని, సుస్వరంబుల విలపించి రందుఁ, గంసభార్య లిట్లనిరి॥ సీ॥ గోపాలసింహంబు గోపించి వెల్వడి నినుఁ గజేంద్రునిభంగి నేఁడు గూల్చె। యాదవేంద్రానిలమాభీలజవమున నీ సుమహీజము మాడి నేలవ్రాల్చె। వాసుదేవాంభోధి వారియుద్వేలమై నిను దీవి కైవడి నేఁడు ముంచె। దేవకీసుతవజ్రి దేవతలలరంగ నినుఁ గొండ క్రియ నేఁడు నిహతుఁ జేసె। హా మనోనాథ హా వీర హా మహాత్మ। హా మహారాజ నీవిట్లు హతుఁడవైన। మనుచు నున్నారము కటమమ్ముఁ బోలు కఠినహృదయలు జగతిపైఁ గలరె యెందు॥ క॥ భూతముల కెగ్గుఁ జేసిన। భూతంబులు నీకు నెగ్గు పుట్టించెన్ నాథా। భూతమ సుమనికి యెల్లను। భూతద్రోహికిని శుభము పొందదధీశా॥ క॥ గోపాలకృష్ణుతోడను। భూపాలక మును న్నతోడ విరోధా। పాలిసినవారి। న్నీపాలబుధులు చెప్ప రెకొ పాలస్యములు విడిచి కొలువందగదే॥ వ॥ అని విలపించుచున్న రాజవల్లభలను

రార్చి, జగద్వల్లభుండైనహరి,కంసాదులకుంబరలోకసంస్కారంబులు సేయంబనిచి, దేవకీవసుదేవులవిడిపించిబలభద్ర సహితుండై,వారలకుంబ్రణామంబులు సేసిన॥మ॥కనిలోకేశులుగానివీరుకొడుకుల్గారంచుఁజిత్తంబులన్।జనయిత్రీజనకుల్విచారపరులై శంకింపఁగృష్ణుండుదా। జనసమ్మోహినియైనమాయఁదదభిజ్ఞానంబు వారించియి। ట్లనియె న్సాగ్రజుఁ

——⊰ శ్రీకృష్ణుఁడు దేవకీవసుదేవుల చెరమాన్పియుగ్రసేనునికిపట్టంబుగట్టుట. ⊱——

డైమహావినతుఁడై యానందసందాయియై॥ సీ॥ మమ్ముఁగంటిరిగానిమాబాల్యపౌగండకైశోరవయసులఁగదిసినీరలెత్తుచుదించుచు నెలమిమన్నించుచు నుండుసౌభాగ్యంబులొందరైతి। రాకాంక్షగలిగియు నదిదైవయోగంబుతల్లిదండ్రులయొగ్గతనయులుండి। యేయవసరమున నెబ్బంగిలాలితులగుచువర్ధిల్లుమరట్టిమహిమ। మాకునిన్నాళ్లు లేదయ్యెమఱి యువినుఁడు।నిఖిలపురుషార్థహేతువై నెగడుచున్న। మేనికెవ్వారలాఢ్యులుమీరకారె।యాఋణముదీర్పనూఱేండ్లకైనఁజనదు॥క॥చెల్లుబడిగలిగియెవ్వఁడు। తల్లికిఁదండ్రికిని దేహధనములువృత్తుల్। చెల్లింపఁడట్టికష్టుఁడు।ప్రల్లదుఁడామీఁదనాత్మపలలాశియగున్॥క॥జననీజనకులవృద్ధులఁ।దనయలగురువిప్రసాధుదారామలనే। జనుఁడుఘనుఁడయ్యుఁబ్రోవక।వనరునుజీవన్మృతుండువాఁడుధరిత్రిన్॥అదియునుంగాక॥ శా॥ కారాశాలలమానిమిత్తముమిముంగంసుండుగాఱింపఁగా।వారింపంగసమర్థతల్గలిగియున్వారింపఁగా లేకని।షాకారుణ్యాత్మలమైనక్రూరులమహాకౌటిల్యసంచారులన్।సారాతిక్షమలారమమ్ముఁగొరతల్ సైరించిరక్షింపరే॥వ॥అనియిట్లుమాయామనుష్యుండైనహరిపలికినపలుకులకు,మోహితులై వారలనంకపీఠంబులనిడుకొని,కౌఁగిలించుకొని,కన్నీటందడుపుచుఁ, బ్రేమపాశబద్ధులై దేవకీవసుదేవులూరకుండిరంత,మాతామహుండైనయుగ్రసేనునింజూచి॥చ॥ అనఘయయాతిశాపమున,యాదవవీరులకున్నరేశ్వరా। ననమున నుండరామనృపసత్తమరాజవుగమ్ముభూమికిన్।నినుఁగొలువంగనిర్జరులునీకరిఁబెట్టుమరన్యరాజులం। బనిగొను టెంతరమ్ముజనపాలనశీలివిగమ్ము వేడ్కతోన్॥అనిపలికి॥క॥మన్నించిరాజుఁజేసెను। వెన్నుఁడుసత్యావధానువిశ్రుతదానున్।సన్నుతమానున్గదన।భిన్నాహితసేనునుగ్రసేనున్దీనున్॥వ॥ తదనంతరంబ,తొల్లికంసభీతులై విదేశంబులంగృశియించుచున్న,యదు,వృష్ణి,భోజ,మరు,దశార్హ,కుకురాంధక,ప్రముఖులగు, సకలజ్ఞాతిసంబంధులను రావించి,చిత్తంబులలరవిత్తంబులిచ్చి,వారివారినివాసంబులనుండనియమించె,నివ్విధంబున॥క॥మధుసూదనసత్కరుణా। మధురాలోకనవిముక్తమానసభయులై ।మధురవచనములఁదారును।మధురానగరంబునరులునునిరినరేంద్రా॥వ॥ అంత నెక్క నాఁడు,సంకర్షణసహితుండై,నందునింజేరి గోవిందుండిట్లనియె ॥ శా॥ తండ్రింజూడముతల్లిఁజూడముయశోదాదేవియున్నీవుమా। తండ్రిందల్లియునంచునుండుమముసద్ధర్మంబు లందొల్లియే। తండ్రుల్బిడ్డలనిట్లుపెంచిరిభవత్సౌజన్యభావంబులన్। దండ్రీయింతటివారమైతిమిగదాతత్త్వయోలీలలన్॥ఉ॥ఇక్కడనున్నబాంధవులకెల్లనుసౌఖ్యముచేసివత్తుమే। మక్కడికిన్మదీయులకునందఱికిన్విను పింపునయ్యనే। మెక్కడనున్నమాకుమదినెన్నఁడుఁబాయవుమీవ్రజంబులో। మక్కువతోడమీరుకృపచూకొనరించుక్రియావిశేషముల్ ॥వ॥అనిపలికి,వస్త్రభూషణాదులొసంగి, సాదరంబునంగౌఁగిలించికొని, గోవిందుండనిచిన,నందుండుప్రణయవిహ్వలుండై, బాష్పజలపూరితలోచనుండగుచు,వల్లవులుంనానును,వ్రేపల్లెకుంజ

——⊰ రామకృష్ణులుపనీతులై కాశీపట్టణమునకుఁజనివిద్యాభ్యాసము చేయుట. ⊱——

నియెనంత॥క॥గర్గాదిభూసురోత్తమ।వర్గముచేనుపనయనమువసుదేవుఁడున। న్మార్గంబునఁజేయించెను।నిగ్గర్వచరిత్రులకునునిజపుత్రులకున్॥క॥ద్విజరాజవంశవర్యులు।ద్విజరాజముఖాంబుజోపదిష్టవ్రతులై ।ద్విజరాజత్వమునొందిరి।ద్విజరాజాదికజనంబుదీవింపంగన్॥ వ॥ఉపనయనానంతరంబున,వసుదేవుండుబ్రాహ్మణులకుసదక్షిణంబులుగాననేకగోహిరణ్యాదానంబులొసంగి తొల్లి రామకృష్ణులజన్మసమయంబులందునిజమనోదత్తలైనగోవులనుచ్చరించియిచ్చి కామితార్థంబులనర్థులకుంబెట్టెనిట్లు,బ్రహ్మచారులై ॥శా॥ఉర్విన్మానవులెవ్వరైనగురువాక్యోద్యుక్తులై కానిత। త్పూర్వాచారంభముసేయఁబోలరనుచున్బోధించుచందంబునన్।సర్వజ్ఞత్వముతోజగద్గురువులై సంపూర్ణులై యుండియున్। గుర్వంగీకరణంబు సేయఁజనిరాగోవిందుఁడున్రాముఁడున్॥వ॥ చనిమహావైభవరాశియైనకాశిం జేరి, తత్తీరంబున,నవంతీపురనివాసియు,సకలవిద్యావిలాసియునైన,సాందీపుండనుబుధవర్యునింగని,యథోచితంబుగదర్శించి, శుద్ధభావవర్తనంబులభక్తిచేయుచునుండవారలవలనసంతుష్టుండై॥శా॥ వేదశ్రేణియునంగకంబులుధనుర్వేదంబుదంత్రంబుమ। న్వాదివ్యాహృతధర్మశాస్త్రములునుద్యన్న్యాయముందర్కవి।ద్యాదక్షత్వమురాజనీతియునుశబ్దప్రక్రియన్జెప్పెనా।భూదేవాగ్రణి

ద్విజరాజ।చంద్రుఁడు, ద్విజరాజ।బ్రాహ్మణశ్రేష్ఠులు. ఉపదిష్ట।ఉపదేశింపఁబడిన. ద్విజరాజత్వమున్।ద్విజరాజాదికజనంబు.

రామకృష్ణులకుసంభూతప్రమోదంబునన్॥క॥అఱువదినాలుగువిద్యలు।నఱువదినాలుగుదినంబులంతనవార। లైరవా
ములై నకతమున। నెఱినొక్కొక నాఁటిపనికి నేర్చిరి లేశా॥క॥గురువులకు నెల్లగురులై।గురులఘుభావములు లేక కొమరారుజ
గద్గురులు త్రిలోకహితార్థము।గురుశిష్యన్యాయలీలఁగొలిచిరి వేడ్కన్॥వ॥ఇట్లుకృతకృత్యులై నశిష్యులంజూచి, వారల
మాహాత్మ్యంబునకు వెఱఁగుపడి,సభార్యుండై నసాందీపుండిట్లనియె॥శా॥అంభోరాశిఁబ్రభాసతీర్థమునమున్నస్మత్తనూ
సంభవుండంభోగాహము సేయుచున్మునిఁగి లేఁడయ్యెంగృపాంభోనిధుల్। శుంభద్వీర్యులుమీరుమీగురునికింజోద్యంబు
గాశిష్యతన్।గాంభీర్యంబునఁబుత్రదక్షిణయిడన్గర్తవ్యమూహింపరే॥క॥శిష్యులుబలాఢ్యులైనవి। శేష్యస్థితి నొందిగురు
వుజీవించునని।ర్దూష్యగుణబలగరిష్ఠులు।శిష్యులరై గురునికోర్కె సేయందగదే॥వ॥అనినవిని రామకృష్ణులు,సర్వార్థంబుగా
మర్వారరథారూఢులై,రయంబునంజని,రౌద్రంబునసముద్రంబుఁ జేరియిట్లనిరి॥క॥సాగరసుబుద్ధితోడను।మాగురుపుత్రు
కుని దెమ్ముమా ఱాడిననీ।వాగడమువుచువుమస్సహ। వేగరణాభీలనిశితవిశిఖాస్త్రులకున్॥ అనినవారలకు జలరాశియిట్లని
యె॥ఉ॥వంచనయేమి లేదుయదువల్లభులార ప్రభాసతీర్థమం। దంచితమూర్తివిప్రసుతుఁడాఢ్యుఁడుతోయములాడుచుం
డను।త్సంచలితోర్మి యొక్కటి ప్రచండగతింగొనిపోయెఁబోవఁగాఁ।బంచజనుండుమ్రింగెనతిభాసురశీలునివిప్రబాలునిన్॥
అనివానివసియించుచోటెఱింగించిన॥ శా॥ శంఖారావముతోడఁబంచజనుఁడాశంకించిచిత్తంబులో। నక్షీణిస్నుండుగవా
ర్ధిఁజొచ్చెదహనజ్వాలాభహేమోజ్జ్వల।త్సంఖాస్త్రంబునఁగూల్చి వానిజఠరంబున్వ్రచ్చిగోవిందుఁడు। ప్రేంఖచ్చిత్తుఁడప
బాలుఁగానకగురుప్రేమోదితోద్యోగుఁడై॥ క॥ దానవుని దేహజంబగు।మానితశంఖంబుగొనుచుమసలకబలుఁడు।న్దో నే
లేరఁగరథియై।దానవరిపుఁడరి గెదండధరుపురికిన్నృపా॥ వ॥చనిసంయమినీనామనగరంబుచేరి,తద్ద్వారంబునఁబ్రళయకా
లమేఘగంభీరనినదభీషణంబగుశంఖంబుపూరించినవిని, వెఱఁగుపడి॥ శా॥ అస్మద్బాహుబలంబుఁగైకొనకశంఖారావ
మున్నానసా। పస్మారంబుగ నెవ్వఁడొక్కొ నగరప్రాంతంబునం జేసెను। ద్విస్మేరాహవరోషపావకునిచేనిధ్వస్తుఁడై
వాఁడుదా।భస్మంబై చెడునంచునంతకుఁడుకోపప్రజ్వలన్మూర్తియై॥వ॥వచ్చిరామకృష్ణులంగని, వారులీలామనుష్యులై
నవిష్ణుమూర్తులనియెఱింగి, భక్తితోడశుశ్రూషచేసి, సర్వభూతమయుండగుకృష్ణునకునమస్కరించి, యేమిసేయుమ
నానతిమ్మనినవమ్మహాత్ముండిట్లనియె॥క॥చెప్పెదమాగురునందనుఁ।దప్పగలుగఁజ్ఞానినీవుచండనమునకు। ద్దెప్పించి నాఁడవా
తని।నొప్పింపుముమాకువలయునుత్తమచరితా॥ క॥అనినవిని వీఁడెవీనిం।గొనిపొండనిభక్తితోడగురునందనుని।చ్చినకృష్ణుఁ
డువీక్షొలి పెను।ఘనదుగ్ధనదమనుమహిషగమనుఁకశమనున్॥వ॥ఇట్లుజమునడిగి తెచ్చి రామకృష్ణులుసాందీపునికింబుత్రు
నిసమర్పించియింక నేమి సేయవలయునానతిండనినతండిట్లనియె॥క॥గురుసకుఁగోరినదక్షిణఁ।గరుణమ్మ న్నెవ్వఁడిచ్చెఘ
నులారభవ।గ్గురునకుఁగోరినదక్షిణఁ।దిరముగనిచ్చితిరిమీరుదీపితయశులై॥క॥ కాలునివీటికిఁజనిమృత।బాలకుఁడేనొరుల
వశమెభవదీయకృపన్। మేలుదొరఁకొనియెమాకుపి।శాలమగుంగాతమీయశములోకములన్॥వ॥మహాత్ములారయేనుగృ
తార్థుండనై తిననిదీవించినసాందీపునివీడ్కొని, కృతకృత్యులై,రామకృష్ణులు, రథారోహణంబుచేసి,మధురకుంజనుదెంచి
పాంచజన్యంబుపూరించినఁగని,నష్టధనంబులుగనినవారిభంగిం, బ్రజలుప్రమోదించిరంతనెక్కనాఁడేకాంతంబున॥

### శ్రీకృష్ణుండుగోపకాంతలచెంతకునుద్ధవునిఁబంపుట.

శా॥నాపైఁజిత్తములెప్పుడున్నిలుపుచున్నారాకఁగాంక్షించుచు। న్నాపేరాత్మలనావహించుచువగన్నానాప్రకారం
బులన్।గోపాలాంగనలెంతజాలిఁబడిరోకోపించిరోదూఱిరో।వ్రేపల్లెన్నిజధర్మగేహములలోవిభ్రాంతచైతన్యలై॥అని
చింతించి॥క॥సిద్ధవిచారుగభీరున్।వృద్ధవచోవర్ణనీయువృష్ణిప్రవరున్। బుద్ధినిధినమరగురుసము। నుద్ధవునింజూచికృష్ణుఁడొ
య్యనఁబలికెన్॥శా॥రమ్మాయుద్ధవగోపకామినులునారాకల్నిరీక్షించుచు।న్సమ్మోహంబుననన్నియున్మఱచియేచందంబు
నన్గుందిరో।తమ్మున్నమ్మినవారిడిగ్గవిడువన్ధర్మంబుగాదంద్రు వే। పొమ్మా ప్రాణములేక్రియన్నిలిపిరోప్రోద్యద్వియో
గాగ్నులన్॥ క॥త్కొకిక మొల్లకననా।లోకించుప్రపన్నులకునులోఁబడికరుణా।లోకనములఁబోషింతును।నాకాశ్రితర
క్షణములునైసర్గికముల్॥క॥సందేహముమానుండర। విందాననలారమిమ్మువిడువనువత్తున్। బృందావనమునకని హరి।
సందేశముపంపెననుముసంకేతమునన్ ॥ వ ॥ అనిమందహాససుందర వదనారవిందుండై, కరంబుకరంబుననవలంబిం
చిసరసవచనంబులాడుచువీడుకొల్పిననుద్ధవుండునురథారూఢుండై సూర్యాస్తమయసమయంబునకునందవ్రజంబుచేరి
వనంబులనుండివచ్చుగోవులచరణరేణువులంబ్రచ్ఛన్నరథుండై చొచ్చినందమందిరంబుప్రవేశించిన॥శా॥ ఆపుణ్యాత్ము
నిఁగౌఁగిలించుకొనినందాభీరుఁడానందియై।మాపాలింటికిఁగృష్ణుఁడీతఁడనుచున్మన్నించిపూజించివాం।ఛాపూర్ణంబుగ

మంజులాన్నమిడిమార్గాయాసముం బాపిన। ల్లాపోత్సాహముతోడ నిట్లని యెసంలక్షించి మోదంబునన్ ॥ క ॥ నామిత్రుఁడు వసుదేవుఁడు। సేమంబుగనున్న వాడె చెలువుగఁ బుత్రుల్। నేమంబున సేవింపను। హా ఘాత్ముండై నకంసుఁడడఁగినపిదపన్ ॥ శా ॥ అన్నా భద్రమె తల్లిదండ్రులమము న్హర్షించి చింతించునే। తన్నుం బాసిన గోపగోపికలమిత్ర వ్రాతము న్గోగణం। బు న్నిత్యంబు దలంచునే వనన దీభూముల్ ప్రసంగించునే। వెన్నుం డెన్నఁడు వచ్చునయ్య యిటమా వ్రేపల్లెకు న్నుద్ధవా ॥ క ॥ అం కిలిగలుగఁగ మాకకలంకేందునిపగిదిఁ గాంతిలలితంబగుద। త్పంకజనయనుని నెమ్మొగ। మింక విలోకింపఁగల దెయీజన్మము నన్ ॥ క ॥ అనిహరిమున్నొనరించిన। పను లెల్లను జెప్పి చెప్పి బాష్పాకులలో। చనుఁడై డగ్గుత్తికతో। వినయంబుననుం డెగోపవీరుం డంతన్ ॥ క ॥ పెనిమిటిబిడ్డనిగుణములు। వినుపింపయశోద ప్రేమవిహ్వలమతియై। చను మొనలఁ బాలుగురియఁగఁ। గను గొనలను జలములొలుకఁగా బెగ్గిలియెన్ ॥ వ ॥ ఇట్లు గోవిందసందర్శనాభావవిహ్వలులై నయశోదానందులకు నుద్ధవుం డిట్లనియె ॥ క ॥ జననీజనకులమిమ్మం। గను గొనశీఘ్రంబె వచ్చుఁగని భద్రంబు। ల్వనజాక్షుండొనరించును। మనమున వగవకుఁడు ధైర్యమండనులారా ॥ మ ॥ బలుఁడుం గృష్ణుఁడు మర్త్యులే వసుమతీభారంబు వారింపవా। రలరూపంబులఁ బుట్టినాఁడు హరిని ర్వాణప్రభుం డిప్పుడు। జ్వలుఁడై ప్రాణవియోగకాలమునఁ దత్సర్వేశుఁ జింతించువాఁ। డలఘుశ్రేయముఁ బొందు బ్రహ్మమయుఁడై యగ్రాభుఁడై నిత్యుఁడై ॥ సీ ॥ అట్టి నారాయణుం డఖిలాత్మభూతుండు కారణమానవాకారుఁ డైనఁ। జిత్తంబుల తనిపైఁ జేర్చి సేవించితిరతికృతార్థులరై తిరనవరతము। శో భిల్లునింధనజ్యోతిచందంబున నఖిలభూతములందు నతఁడతనికి। జననీజనకదారసఖపుత్రబాంధవశత్రుప్రియాప్రియజనులు లేరు। జన్మకర్మములును జన్మంబులును లేవు। శిష్టరక్షణంబు సేయకొఱకు। గుణవిరహితుఁడయ్యు గుణియగు సర్వరక్షణవినాశకేళిసలుపు చుండు ॥ వ ॥ అనిమఱియు పెక్కు విధంబుల హరిప్రభావంబు లుపన్యసించుచు నారేయి గడపి దధిమథనశబ్దంబు లాకర్ణించుచు లేచి మఱునాఁడు కృతానుష్ఠానుండై యుద్ధవుం డొక్కరహస్యప్రదేశంబున నున్నసమయంబున ॥ శా ॥ రాజీవాక్షుఁడు సుందరాస్యుఁడు మహోదారస్కందుఁడు పీతాంబరుం। డాజానుస్థితబాహుఁ డంబురుహమాలాలంకృతుం డుల్లస। ద్రాజత్కుండలుఁ డొక్కవీరుఁడిచటన్ రాజిల్లుచు

## ——శ్రీ భ్రమరగీతలు. శ్రీ——

న్నాఁడుమా। రాజీవాక్షునిభంగినం చ్నుఁగని రా రాజాన్వయుం గోపికల్ ॥ వ ॥ కనిలజ్జాసహితహాసవిలోకనంబులు ముఖంబులకుం జెలువొసంగనిట్లనిరి ॥ చ ॥ ఎఱుఁగుదుమేము నిన్ను వనజేక్షణమిత్రుఁడవీవు కూరిమి। న్నెఱయుచుఁ దల్లిదండ్రులకు మేలెఱిఁగింపఁ బ్రియుండు పంపఁగా। వఱలెదు భక్తివచ్చితివివారలనై నమనంబులో పలన్। మఱువఁడు శౌరి మేలుమఱిమాన్యులు రాజున కెవ్వరిచ్చటన్ ॥ క ॥ మునివరులైనను బంధుల। ఘనసఖ్యము విడువలేరు గాక విడువరే। యనిమిత్తసఖ్యమాఁకటి। పనిదీరిననళులు విరులఁ బాయనె లేదో ॥ చ ॥ అనియిటు గోపికల్వలుక నందొక గోపిక కృష్ణపాదచిం। తనమునఁ జొక్కి చేరువను దైవవశంబునఁ గాంచె నుజ్జ్వల। త్సునిశితసద్వివేకముఁ బ్రసూనమరందమదాతిరేకమున్। ఘనవ్యధునాదసంచలితకాముకలోకముఁ జంచరీకమున్ ॥ వ ॥ కనిహరి దన్నుం బ్రార్థింపఁ బుత్తెంచిన దూతయని కల్పించుకొని యుద్ధవునికి న్యాపదేశంబై యెఱుకపడనయ్యళికిం దొయ్యలి యిట్లనియె ॥ మ ॥ భ్రమరా చుర్జనమిత్రము ట్టకుము మా పాదాబ్జముల్నాగర। ప్రమదాళీకుచకుంకుమాంకితలసత్ప్రాణేశదామప్రసూ। నమరందారుణితాననుండవగుట న్నాఘుం డుమన్నించుగా। కమము న్నేఁపుచుఁ బౌరకాంతలశుభాగారంబులన్నిత్యమున్ ॥ మ ॥ ఒకపువ్వందలి దేనెఁ ద్రావి మధుపా యుత్సాహివై నీవు వే। రొకటం బొందెడు భంగి మమ్మధరపీయూషంబులం దేల్చి మా। యకలంకోజ్జ్వలయౌవనంబుఁ గొనియ న్యాసక్తుఁడయ్యె న్విభుం। డకటా యాతని కెట్లు బ్రక్కసిరి మిథ్యాకీర్తి యుయ్యెన్జుమీ ॥ శా ॥ భృంగా కృష్ణుఁడు మంచివాఁడనుచు సంప్రీతిం బ్రశంసించెదీ। సంగీతంబున నేము సోకుఁదుమె తచ్చారిత్రము ల్వింతలే। యంగీకారముగావు మాకుఁ బురకాంతాగ్రప్రదేశంబులన్। సంగీతంబొనరింపువారిదుమరోజన్నికు నిష్టార్థముల్ ॥ మ ॥ సమదాళీశ్వర చూడుముజ్జ్వలితహాసభ్రూవిజృంభంబులన్। రమణీయుండగు శౌరిచేఁ గరఁగరే రామల్ త్రిలోకంబులన్। బ్రమదారత్నము లక్ష్మియాతఁడు పదాబ్జాతంబు సేవించు నిక్కము నేమెవ్వరమాకృపాజలధికిం గారుణ్యముం జేయఁగన్ ॥ శా ॥ రోలంబేశ్వర నీకు దూత్యము మహోరూఢంబు నీ నేరుపు। ల్బాలున్మచ్చరణాబ్జముల్విడువుమస్మన్నాథపుత్రా మలన్। లీలం బాసి పరంబు డించితనకున్ లీనత్వమున్ బొందుము। మ్మేలా పాసెవిభుండు ధార్మికులు మున్నీ చందముల్మెత్తురే ॥ శా ॥ వాలిం జంపెను వేఁటకానిపగిది న్వంచించి దైత్యాసురన్। లోలంబట్టి విరూపిఁ జేసెను బలిన్ లోభంబుతోఁ గట్టియా। త్రైలోక్యంబు మొఱంగిపుచ్చుకొనియెన్ ధర్మజ్ఞుఁ డేమాధవుం। డేలా పట్టుదయెగ్గు మా వలన నీ కెగ్గింపఁగా నేటికిన్ ॥ ఉ ॥ పన్నగమింటిపై కెగసి పాఱువిహంగములై నవీనులన్। ద

న్నెకమాటువిన్నగృహదారసుతాదులఁబాసివి త్తసం। పన్నతఁడించిసంసరణపద్ధతిఁబాపెడువాఁడునిత్యకాం।తుఁ న్నెటి
నున్నమాబ్రతుకుసైఁచు నెయేలమధుప్రతో త్తమా॥ మ॥ కమనీయంబగు వేఁటకానిపలుకాకర్ణించినికృంబుగాఁ। దను
చి త్తంబులఁజేర్చిచేరిహారిణుల్దద్బాణనిర్భిన్నలై। యమితోగ్రవ్యథనొందుభంగిహరిమాయాలాపముల్నమ్మిదుఃఖము
లంజెందితిమంగజాస్త్రజనితోగ్రశ్రాంతిసిందిందిరా॥ఉ॥ బంధులబిడ్డలన్మగలభ్రాతలఁడల్లులఁదండ్రు లన్మనో।జాంధతఁ
జేసిడించితననమ్మినమమ్మువియోగదుర్దశా। సింధువులోనఁద్రోఁచియిటుచేరకపోవుటపాడిగాదువు।ష్పంధయమీయ
ధీశునకుఁబాదములంబడిమొ త్తిచెప్ప వే॥సీ॥ కాంచనరత్నసంఘటితసౌధంబులేమాకుటీరంబులుమాధవునకు।వివిధనరేం
ద్రసేవితరాజధానియేమాపల్లెయదువంశమండనునకు।సురభిపాదపలతాశోభితారామమేమాయరణ్యముసింహమధ్య
మునకుఁ। గమనీయలక్షణగజతురగంబులే మాధేనువులుకంసమర్దనునకు। రూపవిభ్రమనైపుణరూఢలైన।మగువలమె
మేమమున్మథమన్మథునకు। నేలచింతించుమముఁగృష్ణుఁడేలదలఁచుఁ।బృథివినధిపులునూతనప్రియులుగారె॥ వ॥ అనిమఱి
యునిట్లనేకవిధంబులఁగృష్ణసందర్శనలాలసలైపలుకుచున్నగోపికలవచనంబులువినియుద్ధవుండుమధురాలాపంబులనూ
రార్చుచునిట్లనియె॥ మ॥జపదానవ్రతహోమసంయమతపస్స్వాధ్యాయముఖ్యంబుల।న్నిపుణుల్గోరియునేవిభున్మన
ములన్నిల్పంగలేరట్టిస। ద్విపులాకారునిపైమహామహిమపైవిశ్వేశుపైమీకజ।స్రపటుధ్యానములిట్లునిల్చె భవచ్చా
రిత్రముల్చిత్రముల్ ॥క॥ననుమీకడకుంగృష్ణుఁడు।పనిపంపెడువేళఁబిలిచిపలికినపలుకుల్వినుఁడన్నియువివరించెద।వనజే
క్షణలారమీరువగవకుఁడింకన్ ॥అనిహరివచనంబులుగానిట్లనియె॥సీ॥ఎల్లకార్యములకు నేనుప్రధానకారణముగావునమీ
కురమణులార। కలుగదుమద్వియోగము చరాచరరూపములలోమహాభూతములు వసించు। కరణినుండుదుసర్వగతుఁడ
నై నేమనఃప్రాణబుద్ధిగుణేంద్రియాశ్రయుండ। నాత్మయందాత్మచేనాత్మఁబుట్టింతురక్షింతునుద్రుంతుహృషీకభూత।
గుణగణాకారనాత్మలోఁగొమరుమిగుల।నిబిడమాయానుభవమునవిత్యశుద్ధ।మాత్మవిజ్ఞానమయము వేఱయ్యుగుణము।
ప్రకృతికార్యమనోవృ త్తిఁబట్టిపొందు॥ చ॥కలఁగని లేచిమున్నుగలఁగన్నసమ స్తవిధంబుకల్లగాఁ।దలఁచినభంగిమానసప
దార్థముచేనిఖిలేంద్రియార్థముల్ ।బలమునఁగట్టితద్జ్ఞుఁడుప్రపంచములేదనుఁడన్మనంబుఁదా। రలయకఁగట్టుడున్బుధు
లకవ్వలనొండొకభేదమున్నదే॥గీ॥సాంఖ్యయోగనిగమసత్యతపోదమ।ములుమనోనిరోధములుగడపల। గాఁగనుండుజల
ధికడపలగాఁగల।నదులభంగినళిననయనలార॥మ॥చెలువల్దవ్వులనున్నవల్లభులపైఁజి త్తంబులంగూర్తురు।తత్కాలికంజేరు
వవారికంటెనదియుంగాదెప్పుడున్నన్నుమీ। రలుచింతించుచునుండఁగోరియిటుదూరస్థత్వముంబొందితిన్। దలకంబో
లమనన్నుఁబొందెదరునిత్యధ్యానపారీణలై॥ వ॥ అనిమీకుంజెప్పుమనికృష్ణుండుచెప్పెననవుడునుద్ధవునికింగోపికలుసంత
సించియిట్లనిరి॥ఉ॥ఇమ్ములసున్నవాఁడెహరియిక్కడికెన్నఁడువచ్చువచ్చిమా।యుమ్మలికంబువాపునెప్రియుండిటవచ్చె
దనన్నసైతురే।యమ్మధురాపురీరమణులడ్డమువత్తురుగాకచెల్లరే।మమ్మువిధాతనిర్దయుఁడుమన్మథవేదనపాలుచేసెనే॥
చ॥నుటుచునెకోమదిందలఁచిమాధవుఁడాయమునాతటంబున। న్దఱుచుగదివ్యసౌరభలతాగృహసీమలనేముశాగమా।
యములవులనుండిసీడలకుమమ్మెలయించికలంచిదేహము। ల్మఱచినదేర్చినూల్కొలిపిమన్మథలీలలఁదేల్చుచందముల్ ॥శా॥ నీ
తోనర్మగృహంబులంబలుకునేనేమెల్లవంశోల్లస।ద్గీతభ్రాంతలమైకళిందతనయాతీరంబునంజేరిన। న్జైతోజాతసుఖంబు
లందనిపిమాచి త్తస్థితుల్చూడలీ।లాతంత్రజ్ఞతదాఁగిమెల్లనమదాలాపంబులాలించుటల్ ॥క॥ముచ్చటవేళలఁజెప్పనెయ
చ్ఛగమును నేము నోము నప్పుడుజలముల్ । సొచ్చిన మాచేలంబులు । మ్రుచ్చిలియిచ్చినవిధంబు మూలంబెల్లన్॥
శా॥ ఏకాంతంబుననీదుపైనెరిగితానేమేనిభాషించుచో। మాకాంతుండువచించునేరవిసుతామధ్యప్రదేశంబున।న్రా
కాచంద్రమయూఖముల్మైఁబయఁగారాసంబుమాతోడనం।గీకారంబొనరించిబంధనియతింగ్రీడించుబిస్నాణముల్ ॥సీ॥త
నుఁబాసియొక్కింతతడవైననిటమీఁదనేలపైమేనులునిలువవనుము। నేలపైమేనులునిలువకయటమున్నధైర్యంబులో
కఁటదలగుననుము।ధైర్యంబులొక్కటఁదలఁగినపిమ్మటఁజి త్తంబులిక్కడఁజిక్కవనుము। చి త్తంబులిక్కడఁజిక్కక
వచ్చిన ప్రాణంబులుండకపాయుననుము। ప్రాణములుపోవమఱివచ్చిప్రాణవిభుఁడు। ప్రాణిరక్షకుఁడగుతన్నుఁబ్రాణులె
ల్లఁ। జేరిమాఱంగమఱియేమిసేయువాఁడు। వేగవిన్నపమొనరింపవేమహాత్మ॥క॥తగులరెనుగలనుమగువలు।దగులదెతను
మున్నుగనులదగవువిడిచియున్। దగిలినమగువలవిడుచుట।దగుఁదగదనితగవుఁబలుకఁదగుదువుహరికిన్॥సీ॥ విభుఁడుమా
ప్రేపల్లెవీథులనేతేరఁజూతుమేయొకనాఁడుచ్చూడ్కులలరఁ।బ్రభుఁడుమాతోనర్మభాషలుభాషింపవిందుమేయొకనాఁ
డువీనులలరఁ।దనువులుపులకింపనయితుండుడాసినఁగలుగునేయొకనాఁడుకౌఁగిలింపఁ। బ్రాణేశనమ్మెలపాసితివనిమా

మంజులాన్నమిడిమార్గాయాసముం బాపిన। ల్లా పోత్సాహముతోడ నిట్లనియె సంలక్షించి మోదంబునన్ ॥ క ॥ నామిత్త్రుఁడు
వసుదేవుఁడు। సేమంబుగ నున్నవాఁడె చెలువుగఁ బుత్త్రుల్ । నేమంబున సేవింపఁగ। హా మిత్త్రుం డైన కంసుఁ డడఁగినపిదపన్ ॥
శా ॥ అన్నా భద్రమె తల్లిదండ్రులకు మమ్మర్థిం దలంచి చింతించునే। తన్నుం బాసిన గోపగోపికల మిత్త్రవ్రాతముం గోగణం। బు
న్నిత్యంబు దలంచునే వననదీభూముల్ ప్రసంగించునే। వెన్నుం డెన్నఁడు వచ్చునయ్య యిట మా వ్రేపల్లెకున్ గద్దవా ॥ క ॥ అం
కిలిగలుగఁ గమాకకలంకేందునిభగిరిగాంతిలలితంబగు నద। త్పంకజనయనుని నెమ్మొగ। మింక విలోకింపఁగల దె యీ జన్మము
నన్ ॥ క ॥ అని హరి మున్నొనరించిన। పను లెల్లను జెప్పి చెప్పి బాష్పాకులలో। చనుఁడై డగ్గుత్తికతో। వినయంబున నుండె గోపవీ
రుం డంతన్ ॥ క ॥ పెనిమిటి బిడ్డని గుణములు। వినుపింప యశోద ప్రేమవిహ్వలమతియై। చను మొనలఁ బాలు గురియఁగఁ। గను
గొనలను జలము లొలుకఁగ గాఁ బెగ్గిలియెన్ ॥ వ ॥ ఇట్లు గోవిందసందర్శనాభావవిహ్వలురైన యశోదానందులకు నుద్ధవుం డిట్ల
నియె ॥ క ॥ జననీజనకుల మిమ్ముం। గనుఁగొన శీఘ్రంబె వచ్చుఁ గని భద్రంబు। ల్వనజాక్షుం డొనరించును। మనమున వగవకుఁడు
ధైర్యమండనులారా ॥ మ ॥ బలుఁడుం గృష్ణుఁడు మర్త్యులే వసుమతీభారంబు వారింపవా। రలరూపంబులఁ బుట్టినాఁడు హరి ని
ర్వాణప్రభుండిప్పుడు। జ్జ్వలుఁడై ప్రాణవియోగకాలమునఁ దత్సర్వేశుఁ జింతించువాఁ। డలఘుశ్రేయముఁ బొందు బ్రహ్మ
మయుఁడై యగ్రాభుఁడై నిత్యుఁడై ॥ సీ ॥ అట్టి నారాయణుం డఖిలాత్మభూతుండు కారణమానవాకారుఁడైనఁ। జిత్తంబుల
తనిపైఁ జేర్చి సేవించితిరతికృతార్థులరై తిరనవరతము। శోభిల్లునింధనజ్యోతిచందంబున నఖిలభూతములందు నతఁడతనికి। జ
ననీజనకదారసఖిపుత్త్రబాంధవశత్రుప్రియాప్రియజనులు లేరు। జన్మకర్మములును జన్మంబులును లేవు। శిష్టరక్షణంబు సే
యుకొఱకు। గుణవిరహితుఁడయ్యు గుణియగు సగ్వర। క్షణవినాశకేళి సలుపుచుండు ॥ వ ॥ అని మఱియు పెక్కువిధంబుల హరి
ప్రభావంబు లుపన్యసించుచు నా రేయి గడపి దధిమథనశబ్దంబు లాకర్ణించుచు లేచి మఱునాఁడు కృతానుష్ఠానుండై యుద్ధ
వుం డొక్క రహస్యప్రదేశంబున నున్న సమయంబున ॥ శా ॥ రాజీవాక్షుఁడు సుందరాస్యుఁడు మహోదారస్కంధుఁడు పీ
తాంబరుం। డాజానుస్థితబాహుఁ డంబురుహమాలాలంకృతుం డుల్లస। ద్రాజత్కుండలుఁ డొక్కవీరుఁ డిచటన్ రాజిల్లుచు

## భ్రమరగీతలు.

న్నాఁడు మా। రాజీవాక్షునిభంగి నంచుఁగని రా రాజాన్వయం గోపికల్ ॥ వ ॥ కని లజ్జాసహితహాసవిలోకనంబులు ము
ఖంబులకుం జెలువొసంగ నిట్లనిరి ॥ చ ॥ ఎఱుఁగుదుమేము నిన్ను వనజేక్షణమిత్త్రుఁడవీవు కూరిమి। న్నెఱయ యుచుఁ దల్లిదండ్రు
లకు మేలెఱిఁగింపఁ బ్రియుండు పంపఁగా। వఱలెడు భక్తి వచ్చితివి వారలనై నమనంబులోపలన్। మఱువఁడు శౌరి మేలుమ
ఱి మాన్యులు రాజున కెవ్వ రిచ్చటన్ ॥ క ॥ ముసివరులైనను బంధుల। ఘనసఖ్యము విడువలేరు గాక విడువరే। యనిమిత్తసఖ్య
మాఁకటి। పని దీరిన నళులు విరులఁ బాయనె లేదో ॥ చ ॥ అని యిటు గోపికల్వలుక నందొక గోపిక కృష్ణపాదచిం। తనమునఁ జొ
క్కి చేరువను దైవవశంబునఁ గాంచె నుజ్జ్వల। త్సునిశితసద్వివేకముఁ బ్రసూనమరందమదాతిరేకమున్। ఘనమృదునాద
సంచలితకాముకలోకముఁ జంచరీకమున్ ॥ వ ॥ కని హరి దన్నుం బ్రార్థింపఁ బుత్తెంచిన దూతయని కల్పించుకొని యుద్ధవునికిన
న్యాపదేశంబై యెఱుకపడ నయ్యళికిం దొయ్యలి యిట్లనియె ॥ మ ॥ భ్రమరా దుర్జనమిత్త్రము ట్టకుము మా పాదాబ్జముల్ నాగర।
ప్రముదాళీకుచకుంకుమాంకితలసత్ప్రాణేశదామప్రసూ। నమరందారుణితాననుండవగుట న్నాఘుండు మన్నించుగా। క
ముము న్నేఁపుచుఁ బౌరకాంతలశుభాగారంబులన్నిత్యమున్ ॥ మ ॥ ఒకపువ్వుం దలిదేనెఁ ద్రావి మధుపా యుత్సాహివై నీవు
వే। ఱొకటిం బొందెదు భంగి మన్మథరిపియ్యాషంబులం దేల్చి మా। యకలంకోజ్జ్వలయౌవనంబు గొనియ న్యాసక్తుఁ డయ్యె
న్విభుఁ। డకటా యాతని కెట్లు వక్కె సిరి మిథ్యాకీర్తి యయ్యెన్ జుమీ ॥ శా ॥ భృంగా కృష్ణుఁడు మంచివాఁడనుచు సంప్రీతిం బ్ర
శంసించెదీ। సంగీతంబున నేము సోక్కుదుమె తచ్చారిత్రముల్సింత లే। యంగీకారము గావు మాకుఁ బురకాంతాగ్రప్రదే
శంబులన్। సంగీతం బొనరింపు వారిడుదురోజన్నీకు నిష్టార్థముల్ ॥ మ ॥ సమదాళీశ్వర చూడు ముజ్జ్వలితహాసభ్రూవిజృం
భంబులన్। రమణీయుండగు శౌరి చేఁ గరఁగరే రామల్ త్రిలోకంబులన్। బ్రమదా రత్నము లక్ష్మి యాతనిపదాబ్జాతంబు సే
వించు నిక్కము నే మెవ్వరమాకృపాజలధికిం గారుణ్యముం జేయఁగన్ ॥ శా ॥ రోలంబేశ్వర నీకు దౌత్యము మహారూఢంబు
నీ నేరుపు। ల్బాలున్ మచ్చరణాబ్జముల్ విడువుమస్మన్నాథపుత్త్రాదులన్। లీలం బాసి పరంబుడించితనకున్ లీనత్వమున్ బొం
దుమ। మ్మేలా పాసె విభుండు ధార్మికులు మున్నీ చందముల్ మెత్తురే ॥ శా ॥ వాలిం జంపెను వేఁటకాని పగిది న్వంచించి దైత్యాసు
జన్। లోలం బట్టి విరూపిఁ జేసెను బలిన్ లోభంబుతోఁ గట్టియై। త్రైలోక్యంబు మొఱంగి పుచ్చుకొనియెన్ ధర్మజ్ఞుఁ డే మా
ధవుం। డేలా షట్పద యెగ్గు మా వలన నీకెగ్గింపఁగా నేటికిన్ ॥ ఉ ॥ పన్నగమింటిపై కెగసి పాఱు విహంగములైన వీనులన్। ప

న్నొకమాటు విన్నగృహదారసుతాదులఁ బాసి విత్తసం। పన్నతడించి సంసరణపద్ధతిఁ బాపెడువాఁడు నిత్యకాం।క్షున్నెటినున్న మా బ్రతుకు సైఁచునె యేలమధువ్రతోత్తమా॥ మ॥ కమనీయంబగు వేఁటకాని పలుకాకర్ణించి నిక్కంబుగాఁ। దమచిత్తంబులఁ జేర్చి చేరి హరిణుల్ దద్బాణనిర్భిన్నలై। యమితోగ్రవ్యథ నొందుభంగి హరిమాయాలాపముల్ నమ్మి దుః।ఖములం జెందితి మంగజాస్త్రజనితోగ్రశ్రాంతి నిందిందిరా॥ ఉ॥ బంధులబిడ్డలన్మగల భ్రాతలఁ దల్లులఁ దండ్రులన్మనో।జాంధతఁ జేసి డించితి నన్నిమ్మనమమ్ము వియోగదుర్దశా। సింధువులోనఁ ద్రోఁచి యిటు చేరక పోవుట పాడిగాదు పుష్పంధయ మీయధీశునకుఁ బాదములంబడి మొత్తి చెప్పవే॥ సీ॥ కాంచనరత్నసంఘటితసౌధంబు లేమా కుటీరంబులు మాధవునకు। వివిధనరేంద్రసేవితరాజధాని యేమాపల్లె యమవంశమండనునకు। సురభిపాదపలతాశోభితారామ మేమాయరణ్యము సింహమధ్యమునకుఁ। గమనీయలక్షణగజతురగంబు లేమా ధేనువులు కంసమర్దనునకు। రూపవిభ్రమనైపుణరూఢలైన। మగువలమె మేము మన్మథమన్మథునకు। నేల చింతించుమము గృష్ణుఁ డేల దలఁచుఁ। బృథివి నధిపులు నూతనప్రియులు గారె॥ వ॥ అని మఱియు నిట్లనేకవిధంబులఁ గృష్ణసందర్శనలాలసలై పలుకుచున్న గోపికలవచనంబులు విని యుద్ధవుండు మధురాలాపంబుల నూఱార్చుచు నిట్లనియె॥ మ॥ జపదానవ్రతహోమసంయమతపస్స్వాధ్యాయముఖ్యంబులన్నిపుణుల్ గోరియు నేవిభున్మనములన్నిల్పంగలేరట్టిస। ద్విపులాకారుని పై మహామహిమపై విశ్వేశుపై మీకజ।స్రపటుధ్యానములిట్లు నిల్చె నె భవచ్చారిత్రముల్ చిత్రముల్॥ క॥ నను మీకడకుం గృష్ణుఁడు। పనిపం పెడువేళఁ బిలిచి పలికినపలుకుల్। వినుఁ డన్నియు వివరించెద। వనజేక్షణలార మీరు వగవకుఁ డింక౯॥ అని హరివచనంబులు గా నిట్లనియె॥ సీ॥ ఎల్లకార్యములకు నేను బ్రధానకారణము గావున మీకు రమణులార। కలుగదు మద్వియోగము చరాచరరూపములలో మహాభూతములు వసించు। కరణి నుండుదు సర్వగతుఁడనై నేమనఃప్రాణబుద్ధిగుణేంద్రియాశ్రయుండ। నాత్మయందాత్మచే నాత్మఁ బుట్టింతు రక్షింతు ద్రుంతు హృషీకభూత। గుణగణాకారమాత్మలోఁ గొమరుమిగుల। నిబిడమాయానుభవమున నిత్యశుద్ధ।మాత్మవిజ్ఞానమయము వేఱయ్యుఁ గుణమ। ప్రకృతికార్యమనోవృత్తిఁ బట్టిపొందు॥ చ॥ కలఁగని లేచి మున్నుగలఁగన్న సమస్తవిధంబు కల్లగాఁ। దలఁచిన భంగి మానసపదార్థము చేనిఖిలేంద్రియార్థముల్। బలమునఁ గట్టి తద్జ్ఞుఁడు ప్రపంచము లేదనుఁ డన్మనంబుఁ దా। రలయకఁ గట్టుఁడున్పృథులకవ్వలనొండొక భేదమున్నదే॥ గీ॥ సాంఖ్యయోగనిగమసత్యతపోదమ। ములు మనోనిరోధములు గడపల। గాఁగనుండు జలధికడపల గాఁగల। నదులభంగి నళిననయనలార॥ మ॥ చెలువల్ దవ్వులనున్న వల్లభులపైఁ జిత్తంబులం గూర్తురు। తత్కాలికం జేరువవారికంటె నదియుంగా దెప్పుడున్నన్ను మీ। రలుచింతించుచునుండఁ గోరి యిటు దూరస్థత్వముం బొందితి౯। దలఁకం బోలదు నన్నుఁ బొందెదరు నిత్యధ్యానపారీణలై॥ వ॥ అనిమీకుం జెప్పుమని కృష్ణుండు చెప్పిన నవుడు నుద్ధవునికిం గోపికలు సంతసించి యిట్లనిరి॥ ఉ॥ ఇమ్ములసున్న వాఁడె హరి యిక్కడికెన్నఁడు వచ్చువచ్చి మా। యుమ్మలికంబువాపునె ప్రియుండిటవచ్చెదనన్న సైతురే। యమ్మధురాపురీరమణులడ్డము వత్తురు గాక చెల్లరే। మమ్ము విధాత నిర్దయుఁడు మన్మథవేదనపాలు చేసెనే॥ చ॥ మఱచునెకో మదిం దలఁచి మాధవుఁ డా యమునాతటంబునం। దఱుచుగ దివ్యసౌరభలతాగృహసీమల నేము రాగమా। మఱువులనుండి నీడలకు మమ్మెలయించి కలంచి దేహము। ల్మఱచినదేర్చి నాల్గొలిపి మన్మథలీలలఁ దేల్చుచందముల్॥ శా॥ నీతో నర్మగృహంబులం బలుకు నే నే మెల్లవంశోల్లస। ద్గీతభ్రాంతల మై కళిందతనయాతీరంబునం జేరిన। న్నైతో జాతసుఖంబులందని పిమ్మాచిత్తస్థితుల్ బాడలీ। లాతంత్రజ్ఞత దాఁగి మెల్లన మదాలాపంబు లాలించుటల్॥ క॥ ముచ్చట వేళలఁ జెప్పునె యాచ్చగమును నేము నోము నప్పుడు జలముల్। సొచ్చిన మాచేలంబులు। ముచ్చిలి యిచ్చినవిధంబు మూలం బెల్ల౯॥ శా॥ ఏకాంతంబున నీదుపై నెరిగి తా నేమేని భాషించుచో। మాకాంతుండు వచించు నేరవిసుతామధ్యప్రదేశంబున। న్నాకాచంద్రమయూఖముల్మెఱయఁ గారాసంబు మాతోడనం। గీకారంబొనరించి బంధనియలిం గ్రీడించు విన్నాణముల్॥ సీ॥ తనుఁ బాసి యొక్కింత తడవైన నిటమీఁద నేలపై మేనులు నిలువవనుము। నేలపై మేనులు నిలువక యటమున్న ధైర్యంబులొక్కటఁ దలఁగుననుము। ధైర్యంబులొక్కటఁ దలఁగిన పిమ్మటఁ జిత్తంబులిక్కడఁ జిక్కవనుము। చిత్తంబులిక్కడఁ జిక్కకవచ్చిన ప్రాణంబులుండక పాయుననుము। ప్రాణములు పోవ మఱి వచ్చి ప్రాణవిభుఁడు। ప్రాణరక్షకుఁడగు తన్నుఁ బ్రాణులెల్లఁ। జేరి మూఁగ మఱియేమి సేయువాఁడు। వేగ విన్నప మొనరింప వే మహాత్మ॥ క॥ తగులరె మగలను మగువలు। దగులదె తను మున్న గనుల దగవు విడిచియు౯। దగిలిన మగువలవిడుచుట। దగుఁ దగదని తగవుఁ బలుకఁ దగుచువు హరికి౯॥ సీ॥ విభుఁడు మా వ్రేపల్లెవీథుల నే తేరఁ జూతుమే యొకనాఁడు చూడ్కు లలరఁ। బ్రభుఁడు మాతో నర్మభాషలు భాషింపవిందుమే యొకనాఁడు పీనులలరఁ। దనువులు పులకింపఁ దయితుండు డాసినఁ గలుగునే యొకనాఁడు కౌఁగిలింపఁ। బ్రాణేశు నమ్మేల పాసితివనిమా

డుందొరకు నేనెయొక నాఁడుతో ద్రుపదఁగ।వచ్చునే హరి మేమున్న వనముఁజూడఁ।దలఁచునే భర్తమాతోడితసులు తెరఁగు।
చెప్పునే విభిము వ్వాన్నథుఁ దిట్టుపడక।యెఱుఁగబలుకుమహాత్మనీ కెఱుఁగవచ్చు॥వ॥ అనిమఃఖార్ణవమగ్నంబైన గోపకులంబు
నుద్ధరింపుము రమానాథయని గోపికలువగచితదనంతరంబనుఱియునుద్ధవనిగదితంబులైనకృష్ణసందేశంబువలన విరహవే
దనలువిడిచి యుద్ధవునింబూజించిరిట్లు కృష్ణలీలావర్ణనలు సేయుచు వ్రేపల్లెనుద్ధవుండుగొన్ని నెలలుండినందామలవీక్షా
నిమఱిరథారూఢుండై చనిచని॥క॥ సారమతిఁబ్రణుతి సేయుచు।నారయనుద్ధవుఁడుగాంచెనఘుసంహారి।న్వారిన్మధురా
నగరవిహారిఁ రిపుజనమదాపహారిఁ శౌరిఁ॥ వ॥ కనియథోచితంబుగాభాషించుచుఁదనచేతనందామలు పుత్తెంచిన
కానుకలుబలకృష్ణులకునుగ్రసేనునికిఁ వేఱువేఱయిచ్చెనని చెప్పి శుకుండుపరీక్షిన్నరేంద్రునకిట్లనియె॥మ॥తనుమున్నంగ

——శ్రీ కృష్ణుండుఉద్ధవునితోఁజేరుకొని కుబ్జాగృహంబునకునఱుగుట. శ్రీ——

జకేళిఁగోరినలతాతన్వికరతిక్రీడల।న్దనుపంగోరిజనార్దనుండటిగెరత్నస్వర్ణమాల్యాను లే। వనభూషాంబరధూపదీపపరి
దీప్తంబై మనోజప్రదీపనమైయున్న తదీయ గేహమునకున్నంచేఘసంచేఘుఁడై॥ఇట్లఱిగితద్గేహంబున॥గీ॥ కామశరము
వోలెఁగమలారికళవోలె।మెలఁగియాడనేర్పు మెఱుఁగువోలె।నిఖిలభువన మోహినీదేవతయుఁబోలెఁ। జెలువు మెఱసి
యున్న చెలువఁగనియె॥మ॥హరియేతెంచినలేచిసంభ్రమముతోనాళీసమూహంబుచే। సిరియొప్పన్విహితోపచారము
లుతాఁజేయించి సౌవర్ణసం।వరతల్పస్థితుఁజేసియుద్ధవునినుద్యత్ప్రీతిఁబూజించిభా। సురపీఠంబుననుండుమంచుమదినా
త్మసుకృతంబుశోభిల్లఁగన్॥క॥ఆళీనివహనివేదిత।మాలావ్యగనాభిపంకమణిమయభూషా।చేలాలంకృతయగుచును। హే
లావతిగోరెవనరు హేతుణుఁగవయన్॥ క॥లీలావతిసుకృతోల్లస।దేలాకర్పూరమిళితహితమధురమహో।హాలారసపాన
మద।శ్రీలాలితయగుచునబలచేరెఁగృష్ణున్॥మ॥సరసాలోకనవృష్టి పైఁగురియుచున్నవ్యగ్వచోవైఖరిన్। గరగన్జేసి
సువర్ణకంకణసముగ్రంబైన సైరంధ్రికేల్గరపద్మంబునఁబట్టితల్పమునకాకర్షించిగంభీరత।స్వరిరంభాదులనానవుచ్చిమరు
సంభావించుచు న్వేడుకన్॥ ఉ॥జాతియుఁగాలముంగళయుసత్త్వము దేశముభావచేష్టలు।న్ధాతువుఁ బ్రాయముంగుణముఁ
దద్దశయున్హృదయంబుఁజూడికయున్।బ్రీతివిశేషముం దెలిసి పెక్కువిధంబులఁదొయ్యలిన్మనో। జాతసుఖంబులంద
నిపె శౌరివధూహృదయాపహారియై॥క॥కరపద్మంబులమాధవుఁ।గర మొప్పంగౌఁగిలించి కామానలము। న్గరభోరువువర్జిం
చెను।గరనురుదనితోడిశీతకరముఖులలరన్॥మ॥సనకాహుల్లలపోసి కాననివిభున్సర్వప్రభున్చుర్లభున్। మును దానిచ్చిన
యంగరాగసుకృతామోదంబునన్గూడియున్।ఘననిర్వాణవిభూతియిమ్మనకనాకంజాక్షియేఁబాయఁజా। లననుంగొ
న్నిదినంబులంగభవకేళిందేల్చవేనావుడున్॥గీ॥వనితగోరుకొనినవరమిచ్చి శౌరియా।యుద్ధవుండుదానునువిపయిల్లు। వె
డలిరపుడుతియ్యవిలుకాఁడుసురభితోఁ।దీగెయిల్లువెడలు తెఱఁగు మెఱయ॥క॥ఏవేదంబులఁగాననిదేవోత్తముఁగాంచిము
క్తి తెరువడుగకరా। జీవేశుఁణరతియడిగెను।భావింపఁదదీయకర్మఫలమెట్టిదిరా॥క॥కారుణ్యంబునఁగృష్ణుఁడు। దారుణ్యా
ము మెఱసిమదనతంత్రంబులలీ।లారణ్యవీథిఁదేల్చెను।సైరంధ్రిన్విభవవిజితశక్రపురంధ్రిన్॥వ॥ తదనంతరంబకృష్ణుం
డుద్ధవరామసహితుండై హస్తిపురంబునకునక్రూరునింబనుపందలంచితద్గృహంబునకుంజనిన నతండువారలంగని లేచి
రామకృష్ణులకునమస్కరించి యుద్ధవుంగౌఁగిలించుకొని వారినందఱయథావిధింబూజించి హరిపాదంబులు దనతొడల
మీఁదనిడుకొనియిట్లనియె॥క॥అనుచరులుఁదానుఁగంసుఁడు।సనియెన్నీచేతజమునిసదనంబునకున్। ఘనులారమీబలంబు
న।నొనరఁగయాదవులవంశముద్ధృతమయ్యెన్॥ వ॥మహాత్ములారామీరువిశ్వాదిపురుషులరు,విశ్వకారణులరు, విశ్వమ
యులరుగుట,మీకుఁగార్యకారణంబులు లేవవధరింపుము-పరమేశ్వరానీవురజోగుణంబుననఖిలంబునుసృజియించి కారణ
రూపంబునఁదనప్రవిష్టుండవై కృతదృష్టకార్యరూపప్రపంచాకారంబునదీపింపుదువు,కార్యరూపచరాచరదేహంబుల
కుంగారణంబులైనభూప్రముఖంబులనుగతంబులైనఁగార్యరూపదేహంబులునైప్రకాశించుచందంబున నొక్కండవు
కారణహితుండవు నాత్మతంత్రుండవునై యుండియువిశ్వాకారంబునఁజెక్కసుదువు సృష్టిస్థితిలయంబులఁజేయుచుండి
యువిజ్ఞానమూర్తివగుటన్బరిభ్రాంతుండై నజీవునిభంగినుణకర్మబద్ధుండవుకావు కావునసిద్ధంబుతన్నిమిత్తంబునబంధ
హేతువుసిద్ధింపదు॥సీ॥పరగజీవునికైనబంధమోక్షములంటవంటునేపరతత్త్వమైననిన్ను।నంటునేయీశదేహాద్యుపాధు
లునిర్వచనీయములుగానవరుసనీకు। జన్మంబుజన్మసంశ్రయభేదమును లేమకావునబంధమోక్షములు లేవు।గణుతింపని
న్నులూఖలబద్ధుఁడనుటయునహిమక్తుఁడనుటయునస్మదీయ।బాలబుద్ధిగాదెపాషండముఖరమా। ర్గములచేతనీజద్దితార్థ।
మైనవేదమార్గమడఁగిపోవచ్చిన।నవతరించినిలుపుదంబుజాక్ష॥క॥ఆనీవుధరణిభారము।మానిచిరకక్కసులనెల్లమర్దించుట

కై।యానకమందుభియింటను।మానకజన్మించితివిసనందితకీర్తిన్॥మ॥త్రిజగత్పావనపాదతోయములచే దీపించి వేదామర।ద్విజముఖ్యాకృతివైననీవుకరుణన్విచ్చేయుటంజేసిమా।నిజగేహంబులుధన్యతంగదనరెంబో నిన్నార్యులర్చింపఁగా। నజితత్వంబులువారికిత్తువనుకంపాయత్తచిత్తుండవై॥శా॥ఏపుణ్యాతిశయప్రభావమున నోయీజన్మమందిక్కడ। నీన్నిపాదంబులుగంటిని న్నెఱింగితిన్నీవుర్విగృహపాలుండవై। నాపైనర్మిలిఁజేసిమాన్పఁగదవేనానాథనాగారశాం। తాపుత్రాదులతోడిబంధనముభక్తవ్రాతచింతామణీ ॥ వ ॥ అనిపలికినగుచున క్రూరునికిమాటలవలన సంసారసంబంధంబ

## శ్రీ కృష్ణుండక్రూరునిహస్తినాపురంబునకుఁబంపుట. శ్రీ

గుమోహంబుగీలుకొలుపుచుహరియిట్లనియె॥ క॥బంధుండవుసద్బ్యోహిత।సంధుండవువావిఁజూడజనకుఁడవుకృపా। సింధుండవెల్లగుణముల। నంధుండవుగావుప్రోవనర్హులమెందున్ ॥ చ ॥ కొలుచురుమర్త్యులిష్టములుగోరిశిలామయచేవసంఘమున్। జలమయతీర్థసంఘమునుసంతతమున్నటువారుగొల్వఁగా। వలవనరాముగాకభగవత్పదభక్తులరైనమీక్రియన్।సొలయకదేవతీర్థములుచూచినయంతనెకోర్కులిచ్చునే॥వ॥మహాత్మాపరమభాగవతుండవైననీవుమాకభీష్టంబులొనరింపనర్హుండవువినుముపాండురాజుపరలోకగతుండైనఁగుంతీసహితులైనపాండవులుధృతరాష్ట్రశాసనంబుననేలెంచికరిపురంబుననున్నవారఁటనిజపుత్రమోహితుండగునయ్యంధనృపతివారియందుసమత్వంబునం జరింపఁడఁటకావున॥ క ॥ వారలుబంధులుగావున। వారలకునుమేలొనర్చివారలరంగా। వారింపవలయుదుఃస్థితి। వారిజరిపువంశపావ్మువారింజూడన్॥వ॥అనిపలికిసంకర్షణోద్ధవసహితుండై హరినిజగృహంబునకుఁజనుటయునక్రూరుండు కౌరవరాజధానియగుకరిపురికరిగియందుధృతరాష్ట్రభీష్మవిదురబాహ్లీకభారద్వాజగౌతమదుర్యోధనకర్ణాశ్వత్థామాదులన్ గుంతీసహితులైనపాండవులండక్కినబంధువులనుంగనియథోచితసత్కారంబులనొందితత్తద్వృత్తనంబు లెఱింగికొనుచుఁగొన్నిదినంబులుండనొక్కనాఁడువిదురుండువిననేకతంబుననక్రూరునికిఁగుంతియిట్లనియె ॥ శా ॥ అన్నాతల్లులుదండ్రులున్నగినులున్నల్లుండ్రుమద్భ్రాతలు।న్నిన్నుంబొమ్మనువేళనేమనిరిమానెవ్వల్వి చారింతురే। యున్నారాసుఖయుక్తులైనృగవృకవ్యూహంబులోనున్నరే।ఖన్నేనిక్కడనున్నదానఁగుమనఃకౌరవ్యమధ్యంబునన్॥మ॥కఱపించెన్ఫణికోటిచేలతికలంగట్టించిగంగానది। న్నెఱఁద్రోపించెవిషాన్నితాన్నమొసఁగెన్నిద్రారతిన్జెందియే। మఱియుండన్బొడిపించెనాయుధములన్మత్పుత్రులందేమియున్। గొఱగాఁడీధృతరాష్ట్రసూనుఁడుమహాక్రూరుండుక్రౌర్యంబునన్॥మ॥బలుఁడుంగృష్ణుఁడునెన్నఁడైనఁదనులోభాషించిమేనత్తబి। డ్డలకున్మేలుఁదలంతురేవగపులన్ డయ్యంగఁబాలయ్యెనే। జలజాతాక్షుఁడుభక్తవత్సలుఁడిరాచక్రంబుభాగించియి।మ్ములనిప్పించునెనాకుమారకులకున్ముఖ్యప్రకారంబునన్॥వ ॥ అనిపలికికృష్ణునిఁజిత్తంబుననిల్పి నమస్కరించి సంకీర్తనంబుచేసి సర్వాత్మసర్వపాలక పుండరీకాక్ష శరణాగతనైననన్నురక్షింపురక్షింపుమనివగచుచున్నకుంతికి నక్రూరుండువిదురసమేతుండై ప్రియవచనంబుల దుఃఖోపశమనంబుచేసివీడ్కొనిబంధుమిత్రమధ్యంబున సుఖోపవిష్టుండైన ధృతరాష్ట్రునకిట్లనియె ॥ ఉ ॥ నీయనుజుండు పాండుధరణీ

## శ్రీ అక్రూరుండుధృతరాష్ట్రునితోహితోపదేశరూపముగాసంభాషించుట. శ్రీ

విభుఁడీల్గిననీవుభూమిధ। గ్న్యాయతబుద్ధినేలుచుఁబ్రజావలిఁగాఁచుచుఁగౌరవంబుతోఁ। బాయకలోకులందుసమభావతఁజేసితివేనిఁగీర్తియున్। శ్రేయముఁగల్గువేయొకటిఁజేసినదుర్గతిగల్గుభూవరా ॥ సీ ॥ అవనీశపాండవు లందునీనందనులందుసమానుండవగుటబుద్ధి। యెవ్వనితోయోగమిందెవ్వనికినిత్యమంగనాగారపుత్రాదికములు।వలసనయ్యెడిదేమివసుమతినొకజంతువుదయింపనొకజంతువుక్కడంగు। నొకఁడుపుణ్యముఁజెందునొకఁడుపాపమునొందుమీనజీవనభూతమిళితజలము।తత్తనూజులెల్లుద్రావుచురట్లుమూ।ఢాత్మువిత్తమెల్లనపహరింతు।రహితులైనకొడుకులటమీఁదమనిరైనఁ।జచ్చియైనఁదండ్రిజాడఁజనరు॥క॥కావునమూఢాత్ముఁడవై।నీవార్జించినధనంబునీపుత్రులుచుః। ఖావహులుపంచుకొనఁగా।ఖహావరనిందితుఁడవగుదుభూనాకములన్॥ శా॥ నిందంబొందకుమయ్యయీతనువుదానిద్రాకళాదృష్టమా।సందోహంబువిధంబునిల్వదుసుమీజాత్యంధతంబొందియున్। మందప్రజ్ఞతలేలచేసెదవుసవ్యాజ్ఞానచక్షుండవై। సందేహింపకయిట్టుపాండవులకున్సర్వంసహాభాగమున్॥అనినధృతరాష్ట్రుండిట్లనియె.సీ॥నీమాటమంచిదినిశ్చయమగునైననస్థిరంబైనహృదయాంతరంగ।మందునిల్వదుసుధామాదలస్ఫటికశిలాతతద్యుతితటిల్లతికభంగి।నమృతంబునొందియునానందితుఁడుగానినరుమాడ్కినేనునానందమొంద। నీశ్వరాజ్ఞావిధమెవ్వఁడుదప్పింపనోపువిజ్ఞానిరైయుండియైన।విశ్వమెల్లఁజేసివిభజించిగుణముల।నెవ్వఁడనుసరించెనెవ్వఁడవని।భారమెల్లఁబాయఁబ్రభవించెదేవకి। కెవ్వఁడాత్మతం

త్రుఁడీశ్వరుండు॥ వ॥ అట్టికృష్ణునకునమస్కరించెద,నానందనందనుని,దివ్యచిత్తంబునంగలతెఱంగునం,బ్రతుకంగలవార
మనివీడ్కొలిపిన,నక్రూరుండతనితలంపెఱింగియిట్లనియె,నీతలంపుఁగనుంగొంటి,నీకిష్టంబగునట్లువర్తింపుమనిపలికి, మ
ఱలిమధురకుంజనుదెంచి,తదీయవృత్తాంతంబురామకృష్ణులకెఱింగించె, నంతఁగంసభార్యలగు, నస్తియుం,బ్రాస్తియువి
ధవలైదుఃఖించుచుం,దమతండ్రియైనజరాసంధునికడకుంజని॥ శా॥ వాండ్రున్వీండ్రును రాజులేయనుచుగర్వప్రౌఢితో

—— జరాసంధుఁడుమధురమీఁదదండెత్తివచ్చికృష్ణునితోయుద్ధముసేయుట. ——

యాదవుల్।వేండ్రంబైనబలంబుతోమధురకున్వేవచ్చినిష్కారణం।బాండ్రన్బిడ్డలుబంధులున్వగవఁగంసాదిత్యమానా
ధులన్।దండ్రీచంపిరికృష్ణుచేతనిటువైధవ్యంబువచ్చెన్సుమీ॥ వ॥ అనినవినిప్రళయకాలానలంబుతెఱంగునమండిపడి,శోక
రోషంబులుబంధురంబులుగా,జరాసంధుండిట్లనియె॥ శా॥ యేమీకంసునిఁగృష్ణుఁడేరణములోహింసించెనోచెల్లనా।సా
మర్థ్యంబుఁదలంపడించుకయుమచ్చండప్రతాపానలో।ద్దామార్చుల్వడినేఁడుగాల్చుయమసంతానాటవీవాటిక।న్భూ
మింగ్రుంగిననింగివ్రాకినమహాంభోరాశిలోఁజొచ్చినన్॥ క॥ యాదవవిరహితయగుఁబో।మేదినినాచేతనేఁడుమీఁదుమి
గిలిసం।పాదితబలులైహరిరు।ద్రద్రుహిణేంద్రాదులెవ్వరడ్డంబైనన్॥ అనిపలికి, సమరసన్నాహసంకులచిత్తంబునఁ,గో
పంబుదీపింప,సంగరభేరివ్రేయించికదలి॥ క॥ దక్షుండైయిరువదిమూఁ।డక్షౌహిణులైనబలములనుగతములుగా।నక్షీణమ
జరాసంధుఁడు।ప్రక్షోభముతోడమధురపైఁజనియెన్నృపా॥ క॥ గంధేభతురగరథభట।బంధురచరణోత్థితోగ్రపాంసు
పటలరయా।గాంధీభూతములైదివి।మంధరగతినడచెనపుడుమార్తాండహరుల్॥ వ॥ ఇట్లుచని,నిరంతరకిసలయపత్రకోర
కకుసుమఫలభారవినమితవృక్షవిలసితమహోద్యానంబును,నుద్యానవనభాగవలమానజలోన్నయనదారుయంత్రలతా
నిబద్ధకలశవిముక్తసలిలధారాశీకరపరంపరాసంపాదితవర్షాకాలంబును,గాలకింకరసదృశవీరభటరథతురగసామజసం
కులంబును,సులాచారధర్మప్రవీణపౌరజనభూసురంబును,సురాభేద్యమాన మహోన్నతాట్టాలకయంత్రభయంకర
ప్రాకారచక్రంబును,జక్రసారసహంసాదికలకలరవకలితసరోవరంబును, సరోవరసంఫుల్లహల్లకకమలపరిమళమిళిత
పవనవిరాజితంబును, జితానేకమండలేశ్వరభూషణ మణిగణరజోనివారితమదగజేంద్రదానజలప్రభూతపంకంబును,
బంకరహితయాదవేంద్రదత్తసువర్ణాచలకల్పతరుకామధేనుసమృద్ధితవిద్వజ్జననికేతనంబును, గేతనసన్నిబద్ధచామరసు
యారచాపశింజినీనినద.పరిపూరితాభ్రంబు, నభ్రంలిహమహాప్రాసాదసౌధగవాక్షరంధ్రనిర్గతఘనసారధూపధూ
మపటలవిలోకనసంజనితజలధరవిభ్రాంతశిఖండితాండవరుచిరంబును,జిరతరానేకదేవాలయఘోష్యమాణతూర్య
నినదపరిభావితపారావారకల్లోలఘోషంబును,ఘోషకామినీప్రాణవల్లభబాహుదండపరిరక్షితంబునునై,పరులకసల
క్షితంబైన,మధురానగరంబుచేరి, వేలాలంఘనంబుచేసి, వెల్లివిరిసినమహార్ణవంబుతెఱంగున, బట్టణంబునకుముట్టణం
బుచేసి,చుట్టునువిడిసిన,జరాసంధునిబలౌఘంబుగని, వేలావిదుండగుహరితనమనంబున॥ మ॥ అయిదున్నాలుగునాఱురెం
డునిరుమూఁడక్షౌహిణుల్సుట్టిసం।ఛాదించెన్బురమెల్లమాగధునెడన్సామంబుదానంబుసం। భేదంబున్బనిలేదుదండవి
ధిశోభిల్లంబ్రయోగించియీ।భూదేవీవరభారమెల్లనుడుపంబోలున్జయోద్భాసినై॥ క॥ ఏనవతరించుటెల్లను। మాను
గజతురగాంతధరణిమండలభరమున్।మానుపుకొఱకుంగాదే।పూనెదనిదిమొదలుదగిలిభూభరమడఁపన్॥ గీ॥ మగధనా
థుఁబోరమడియింపఁబోలదు।మడియకున్నవీఁడుమఱలిమఱలి। బలముఁగూర్చుకొనుచుఁబఱతెంచుఁబఱతేరఁ। ద్రుంపవ
చ్చునేలదోసఁగుదొఱఁగ॥ వ॥ అనియిట్లుచింతించుచున్నసమయంబుననభోభాగంబుననుండి, మహాప్రభాసమేతంబులు
ను,సపరిచ్ఛదసూతంబులు, ననేకబాణబాణాసనచక్రాదివివిధాయుధోపేతంబులునైన, రథంబులురెండుమనోరథం
బులుపల్లవింప,దైవయోగంబునంజేరవచ్చినంజూచి,హరిసంకర్షణునకిట్లనియె॥ శా॥ కంటేరామరథంబులాయుధములు
న్నాథప్రకాశంబులై।మింటన్వచ్చెనువీనిఁగైకొనిసురల్మెచ్చన్నృపశ్రేణులన్। బంటింపంబనిలేదుచంపుముధరాభారం
బువారింపుమీ। వెంటన్నీయవతారమున్సఫలమావేవేగలెమ్మాజికిన్॥ అనిపలికి॥ క॥ ఖరులైదృఢకవచధను।శ్శరులైయధిగ
తరథానుచరులైమదవ। త్కరులైఘనహరులైబల। హరులయ్యెడనాజికేఁగిరతిభీకరులై॥ ఇట్లుసమరసన్నాహంబు
నం,బురంబువెడలి॥ ఉ॥ అన్యులుతల్లడిల్లదనుజాంతకుఁడొత్తెగభీరఘోషకా। తిన్యమహాప్రభావవికటీకృతపద్మభవాండ
జంతుచై।తన్యముధన్యమున్దివిజతాపసమాన్యముఁబ్రీతభక్తరా। జన్యముభీతదుశ్చరితశాత్రవసైన్యముఁబాంచజన్య
మున్॥ క॥ సింధురభంజనపూరిత।బంధురతరశంఖనినదభారమునజరా। సంధునికింగలసైన్యము। లంధములైసంచలించె
నాహవభూమిన్॥ అయ్యవసరంబునమాగధుండుమాధవునకిట్లనియె॥ సీ॥ అదలించిరొప్పంగనాలమందలుగావుగంధగజేం

ద్రసంఘములుగాని।పరికించివినఁగనంభారవంబులుగావువాజీంద్రహేషారవంబుగాని। పదహతిఁగూల్పంగఁబాతబండ్లై నుగావునగసమానస్యందనములుగాని। ప్రియములాడంగనాభీరలోకముగాదు కాలాభవైరివర్గంబుగాని।యార్పవనవహ్నిగాదు బాణాగ్నిగాని।మఱియబృందావనముగాదు మొనలుగాని।యమునగాదు నటింపఘోరాజిగాని। పోరునీ కేల గోపాలసామ్మసామ్ము॥మ॥తరుణింజంపుటయోబకు నైడపుట్టోధాత్రీజముల్గూల్చుటో। ఖరునింద్రుంపుటయోఫణింబఱపుటోగాలిన్నిబంధించుటో।గిరిహస్తంబునఁదాల్చుటోలయమహాగ్నిస్ఫారదుర్వారదుః।ఖ్ఖరబాణాహతి నెట్లునిల్చెదవుసప్రాణుండవై గోపకా॥అదియునుంగాక॥సీ॥గోపికావల్లకీఘోషణంబులుగావుశింజినీరవములుచెవుడుపఱచు।వల్లవీకరముక్తవారిధారలుగావుశరవృష్టిధారలుచకుచేయు।ఘోషాంగనాపాంగకుటిలాహతులుగావునిశితాసి నిహతులునిగ్రహించు।నాభీరకామినీహస్తాబ్జములుగావుముష్టిఘాతంబులుమురువడంచు।నల్లద్రేపల్లెగాదు ఘోరావనీశ।మకరసంఘాతసంపూర్ణమగధరాజ।వాహినీసాగరంబిదివనజనేత్ర। నెఱసినినుదీవికై వడి నేఁడుముంచు॥అనిన శ్రీహరియిట్లనియె॥ఉ॥పంతము లేలతొల్లిజనపాలురఁబోరులగెల్చినాఁడవం।ద్రంతియచాలదేబిరుదులాడుట బంటుతనంబుత్రోవయే।యింతటదీఱ నేమగధయేటికిఁద్రే లెమనీవయేలక।ల్పాంతము హూగ్రపావకునినై నహరింతువరింతుసంపదన్॥ క॥గోపాలుఁడవనిపలికితి।భూపాలక దీన నేమిపోరాడఁగా।గోపాలమహీపాల। వ్యాపారాంతరము దెలియవచ్చుంబోరన్॥అనినరోషబంధురుండై జరాసంధుండిట్లనియె॥ఉ॥బాలుఁడవీవుకృష్ణబలభద్రునిఁబంపురణంబు సేయగో।పాలకబాలుతోడజనపాలశిఖామణినైనమాగధుం। డాలము సేసెనంచుజనులాడెడిమాటకుసిగ్గుపుట్టెడి।న్వాలుఁదొలంగుదివ్యశరజాలురమమ్ముజయింపవచ్చునే॥అనినగధరుండిట్లనియె॥క॥పొగడుకొనుదు రేశూరులు।నుగటిమిఁజూపుదురుగాక మాగధనీకు।న్మగతనముగలిగె నేనియుఁ।దగు మెఱయ ‡వికత్థనములుదగదీపోరన్॥ అనిరోషించి॥ చ॥పవనుఁడు మేఘ రేణువులభానుకృశానులఁగప్పుకైవడి।న్వివిధబలౌఘముంబనిచి వేగనమాగధుఁడావరించెభూ।మ్యవనచరిష్ణులన్విమతమానవనాథనిరాకరిష్ణుల।న్దివిషదలంకరిష్ణులనతిస్థిరజిష్ణులరామకృష్ణులన్॥మ॥హయహేషల్గజబృంహితంబులురథాంగారావముల్మింజినీ। చయటంకారములున్వివర్ధితగదాచక్రాస్త్రనాదంబులున్।జయశబ్దంబులు భేరిభాంకృతులునిస్సాణాది ఘోషంబులు। న్క్షయసప్రక్రియ నొక్కటైకనెగసెన్బ్రహ్మాండభేద్యంబుగన్॥వ॥మఱియునయ్యెడమాగధమాధవవాహినులు రెండునొండొంటిందాఁకిరౌద్రంబునసంవర్తసమయసముద్రంబులభంగినింగికెంబొంగి చెల్లఁగిచలంబునందలపడిపోరు నెడమసరుకవిసిమహారణ్యంబులు వెలువడిమార్కొనుమదగజంబులమాడ్కి,మహోన్మత్తంబులగు కంఠీరవంబులగ్రద్దన,దుర్లభంబులగుశరభంబులచాడ్పునం,బ్రచండంబులగుగండభేరుండంబులగమనికం,దమతమమొనలకుందలకడచివీరరసంబులువివిధరూపంబులై నవిధంబులంబదుగురు నాల్వురేవురుగములై కులకుధరగుహాంతరాళంబులునిండ సింహనాదంబులొనర్చుచు,నార్చుచు,నట్టహాసంబులు సేయుచు,నరివీరులరోయుచు,పటహకాహళభేరీశంఖశబ్దంబులకునుబ్బుచు,గర్వంబులంబ్రబ్బుచు,గదలద్రేయుచుఁ,గాండంబు లేయుచు,ముద్గరంబులనొత్తుచు, ముసలంబుల మొత్తుచుఁ, కుంతంబులగ్రుచ్చియొత్తుచుఁ,గరవాలంబులంద్రెంచుచుఁ,జక్రంబులంద్రుంచుచు,శస్త్రంబులందఱుగుచుఁ,జిత్రంబులందిఱుగుచుఁ, బరిఘంబులఁద్రిప్పికొట్టుచుఁ,బ్రాసంబులఁబెట్టుచు, శూలంబులఁజిమ్ముచు,సురియలఁగ్రుమ్ముచు, బహుభంగులఁబరాక్రమించుచు,వీరభటులనిబిడనీరంధ్రనేమినిర్ఘోషంబులనాకాశంబునిరవకాశంబుగ,ననర్గళచక్రమార్గణంబులంబడుపదాతులును,జదియునరదంబులును,వివిధాయుధప్రయోగంబులవైరుల ద్రచ్చివందరలాడురథికులును, రథికశరపరంపరలఁగంపింపక మహామోఘ మేఘధారలకుఁజలింపని,ధరణీధరంబులచాడ్పున,రథంబులకుంగవిసి,కల్పాంతకాలదండిదండప్రచండంబులగు,శుండాదండంబులుసాఁచియాఁచికడనొగలాడసితిగిచి,కుదిచి,విరిచి*కూబరములునుఱుములుగజిఱజిఱంద్రిప్పివైచియు,భటులంజటులగతిబంతులక్రియ నెగరవైచి, దంతంబులగ్రుచ్చియు, ఘోటకంబులవ్రచ్చియు,విచ్చలవిడిందిరుగుకరులును,వజ్రివజ్రధారలకుందప్పికకుప్పలకు నెగయుఱెక్కలుగలగిరులసిరులం,బక్కెఱలతోడ,హేషారవభీషణంబులై మనోజవంబుగలతురంగంబులంబఱపితురంగపదపాంసుపటలప్రభూతబహులాంధకారంబులుకరకలితకరోరఖడ్గమరీచిజాలంబులనివారించుచు,నానాప్రకారంబులంబ్రతివ్యూహంబులంజించి చెండాడురాహుత్తులుంగలిగి సంగ్రామంబుభీమంబయ్యెనందు॥క॥చెడురథములఁదెగుహరులును।బడుకరులునుమడియుభటులుఁబఱచురుధిరముల్। మడియుతలలూరుగుతనువులు। పొడియగుతొడవులునుమధురిపునిదెసఁగలిగెన్ ॥ క ॥ భీతంబై హతసుభట।వ్రాతంబై భగ్నతురగవారణరథసంఘాతంబై విజయశ్రీ।వీతంబై యదుబలంబువిరిగెనరేంద్రా॥ శా॥ యోధాగ్రేసరుఁడాహలా

‡వికత్థనము।వ్యర్థవాక్యములు. *కూబరము।నొగ. కకుప్పు।దిక్కు. పక్కెఱ।కవచము.

యసుఘుఁడులోకోత్కృష్టబాహాబల। శ్రీధారేయుఁడుగృష్ణుఁడిట్టిఘనులఁజిత్రంబు నేఁడిట్లుసం। రోధించెఁబలముం డెర ల్చెమగధేంద్రుండంచునీక్షించుచుఁ। సౌధాగ్రంబులఁబౌరకాంతలుమహానంతప్తలై రెంతయుఁ॥వ॥ ఇట్లుతనక్రీమొన లువిరిగిపాఱినంగనుంగొని సమగసంరంభంబునహరివిశ్వంభరాభరణ వేదండతుండాభంబులగుబాహుదండంబులఁబెం చివిజృంభించి బ్రహ్మాండకుహరకుంభపరిస్ఫోటనంబగుపాంచజన్యనినదంబు, నిబిడనిర్ఘాతశబ్దంబుగ, నుదంచితపింఛదా మంబుసంక్రందనచాపంబుగ, బ్రశస్తహస్తలాఘవంబునశరాకర్షణసంధానమోక్షణంబు లేర్పడక, నిర్వక్రచక్రాకా రంబుతోడమార్తాండమండలప్రభాప్రచండంబగుశార్ఙ్గకోదండంబు క్రొమ్మెఱుంగులుగ, దిగ్గజేంద్రకర్ణభీషణంబులగు గుణఘోషంబులుఘుమఘుమారావదుస్సహంబులైనగర్జనంబులుగ, రథతురంగమరింఖాసముద్ధూతపరాగపటలపరంప రాసంపాదితపుంజీభూతంబగు పెంజీకటియిరులుగ, ననుసమరసన్నాహచాతురీవిశేషంబులకుంజొక్కి నిక్కి కరంబులె త్తినర్తనంబులం బ్రవర్తించునారదాదులులీలాతాండవమండితమహోత్కంఠంబులగునీలకంఠంబులుగ, సుందరస్యంద ననేమిసిర్ఘోషభీతులైకుంభికుంభంబులపైవ్రాలువీరులుమత్తమయూరకేకారవచకితులై యువతికుచకుంభంబులమీఁద వ్రాలెడుకాముకులుగ, నానానరేంద్రరక్తపిపాసాపరవశంబులై వాచరచుచున్నభూతవ్రాతంబులువర్షవర్షేతినిస్వనం బులాసంగుచాతకంబులుగ, నభంగసంగరప్రేరకాండగుహలాయుధుండువృష్టికారణంబగుమందసమీరణంబుగ, ననల్పక ల్పాంతకాలనీలబలాహకంబుభాతినరాతిచతురంగదేహక్షేత్రంబులంబుంఖానుపుంఖంబులుగ, నసంఖ్యాతబహువిధది వ్యబాణవర్షంబుగురియు నెడ, శస్త్రాస్త్రపరంపరాసంఘట్టనజనితంబులగుమిడుగుఱులువర్షాకాలవిహితవిద్యోతమానఖ ద్యోతంబులుగ, విశిఖవికీర్ణకోటీరఘటితపద్మరాగశకలంబులింద్రగోపంబులుగ, మహితమార్గణవిదళితమత్తమాతంగకుం భముక్తికంబులువడగండ్లుగఁ, జటులార్ధచంద్రశరచ్ఛిన్నచరణంబులై కృష్ణకృష్ణనిలునిలుమనిపలుకుచుంగూలెడి మేను లుకృషీవలకరపరశుధారావిదళితమూలవిశాలసాలంబులుగ, భాసురభల్లభగ్నంబులైనవదనగహ్వరంబులవలనడుల్లె డుదంతపుంజంబులుమాలతీకుసుమమంజరులుగ, నవ్యనారాచభిన్నదేహంబులైదిగ్గనఁగ్రొగ్గండ్లవలనవెడలు రక్తస్యం దసందోహంబులతోసంచరింపక ప్రాణంబులువిడుచుశుండాలంబులుశలయేటులతోడికొండలుగఁ, గఠోరకాండఖండితం బులైనభుజాదండంబులతోడంగలసిపడినవజ్రమయకంఠికాభరణంబులుభోగిభోగసమేతకేతకీకుసుమంబులుగఁ, బ్రళ యార్ణవకల్లోలశబ్దసన్నిభంబులైనభేరీరవంబులుభీకరభేకీరవంబులుగ, దారుణేషు విలూనవాహవారణ మనుజమస్తి ష్కంబురొంపియునైసొంపుమెఱయనాఖీలకీలాలప్రవాహంబులుప్రవహించెనందుభుజంబులుభుజంగంబులుగఁ, గపా లంబులుకమఠంబులుగ, శిరోజంబులుశైవాలంబులుగఁ, గరంబులుమీనంబులుగ, హయంబులునక్రంబులుగ, గజంబులుదీ వులుగ, ధవళచ్ఛత్రంబులునురువులుగఁ, జామరంబులుకలహంసంబులుగ, భూషణరత్నరేణురాసులుపులినంబులుగ, నొ ప్పెనప్పుడు॥లయవిభాతి॥హసితహరినీలనిభవసనమువిశాలకటినసమనయనాద్రిపరిహసితమగుమేఘో । ల్లసనమువ హింపఁగరకిసలయముహేమమణివిసరవలయద్యుతులుదెసలతుదలంచుఁ। బసలఁగురియంగసరభసమునబలుండుదర హసితసుముఖాబ్జమున నెసఁగఘనకాలా। యసమయనుహోగ్రతరముసలమువడిన్విసరికసిమసఁగిశత్రువులనసువు లనుబాపెఁ॥లయవిభాతి॥ప్రలయసమయాంతకునిచెలువునఁగటాక్షముల నలఘుచటులాగ్నికణములుచెదరఁగోలా। హలముగసువర్ణమణివలయనిచయోజ్జ్వలితహలమువడిఁజాఁచిశిరములునురములున్నిర్దలితములుగన్నకలములుగనోన రింపఁగనిబెలుకురిజరాసుతునిబలముఱరణవీధిన్జ్వలితదనుజావలికిబలికిభయభీతసురఫలికిఁద్రిజగచ్ఛలికిహలికిఁదలడించెఁ॥ శా॥ రోషోద్రేకకళాభయంకరమహారూపంబుతోనెక్కఁచే। నీషాదండముసాఁచిలాంగలముభూమీశోత్తమగ్రీవలఁ। భూపాల్ రాలఁదగిల్చిరాఁదిగిచిసంపూర్ణోగ్రతిఁరోఁకటఁ । వేషంబుల్చెడమొత్తెరాముఁడురణోర్విన్నెత్తురుల్జొత్తి లఁ॥క॥హలిహలహృతకరికుంభ।స్థలముక్తాఫలములోలిఁదనరెఁగృషికలాం।గలమార్గకీర్ణబీజా।వలికైవడినద్భుతాహవ క్షేత్రమునఁ॥ క ॥ తలమివిహలిహలమువిసరుచు। నెఱిఁగదిసినబెగడివిమతనికరముచెడలై। వెఱఁగుపఃనోదుగునడఁగు ను।మలుపడుఁజెడుమడియుఁబొరలుమఱలుఁ దెఱలుఁ॥క॥ *హరితిగ్మగోశతంబుల।హరిదంతరమెల్లఁగప్పునాకృతిఁగడి

క్రీ॥ మొనలు। సేనలు. *హరితిగ్మగోశతంబులఁ॥హరి।సూర్యుఁడు, తిగ్మ।తీక్ష్ణములైన, గోశతంబులఁ।కిరణసముదాయ్యముచేత, హరిదంతర మెల్లఁ।దిఙ్మధ్యప్రదేశములనన్నింటిని, కప్పునాకృతిఁ।కప్పినట్లు, కడిమిఁ। పరాక్రమముచేత. హరితిగ్మగోశతంబులఁ।.హరి। శ్రీకృష్ణుఁడు, తి గ్మ।పదునుగలిగిన, గో। బాణములయొక్క, శతంబులఁ।నూఱులచేత, అతిభీకరుఁడై। మిగులవెఱపుగలుగఁజేయుచున్నవాఁడయి, హరిదంత రమెల్లఁ।దిశామధ్యప్రదేశములనన్నింటిని, కప్పెఁ। ఆచ్ఛాదించెను.

రోద్యోగంబును, నీ సోదర ప్రవేశంబునుం జెప్పినవిని, యారతి మాయావతియను పేర, శంబరుని యింటఁ బాత్రప్రత్యం
బు నడుపుచు, దహనదగ్ధుండైన తన పెనిమిటి శరీరధారణంబు సేయుట కెదురుచూచుచున్నయది గావున, నయ్యర్భకుండు
కందర్పుండని తెలిసి, మెల్లనఁ బుత్రార్థియైన తెఱంగున, శంబరుని యనుమతివడసి, సూపకారుల యొద్దనున్న పాపనిం దెచ్చి
పోషించుచుండె నా కుమారుండును, శీఘ్రకాలంబున నారూఢయౌవనుండై॥ క॥ సుందర సుగుణ తనరూపము। సుందరులొక్క
మాఱు చేజిచూచినఁ జాలున్। సౌందర్యమేమి చెప్పను। బొందెదవని డాయ బుద్ధిఁ బుట్టించు నృపా. సీ॥ చక్కనివారల చక్క
దనంబున కుపమింప నెవ్వఁడు యోగ్యుఁడయ్యె। మిక్కిలి తపమున మెఱయు నంబికకునై శంకరు నెవ్వఁడు సగము సేసె। బ్ర
హ్మత్వమును బొందిపరగు పితామహుని ధాతను వాణికై యెవ్వఁడు వాఁడిచెఱిచె। వేయుడాగులతోఁడి విబుధలోకేశుని మూర్తికి నె
వ్వఁడు మూలమయ్యె। మునుల తాలిమి కెవ్వఁడు ముల్లు సూపు। మగల మగువల నెవ్వఁడు మరులుగొలుపుఁ। గుసుమధనువున
నెవ్వఁడు గొను విజయము। చిగురువాలున నెవ్వండు చిక్కవఱచు॥ వ॥ అని తన్ను లోకులు వినుతించు ప్రభావంబులు గలిగి, ప
ద్మదళలోచనుండును, ప్రలంబబాహుండును, జగన్మోహనాకారుండు నైన, పంచబాణునిం గని, లజ్జాహాససగర్వితంబులై
న చూపులం జూచుచు, మాయావతి సురతభ్రాంతిఁ జేసినం జూచి, ప్రద్యుమ్నుం డిట్లనియె॥ మత్తకోకిల॥ నాతనూభవుఁ డీత
డంచుసు నానయించుక లేక యో। మాత నీ విది యేమి నేఁడిటు మాతృభావము మానిసం। ప్రీతిఁ గాముకి భంగిఁ జేసెదు పెక్కు
విభ్రమముల్ మహా। ఖ్యాతవృత్తికి నీకు ధర్మము గాదు మోహము సేయఁగన్॥ వ॥ అనిన రతి యిట్లనియె, నీవు నారాయణనంద
నుండవైన కందర్పుండవు, పూర్వకాలంబున నేను నీ భార్యనైన రతిని, నీవు శిశువవై యుండ నిర్దయుండై దొంగిలి తల్లిఁ దొఱం
గఁ జేసి, శంబరుండు గొనివచ్చి నిన్ను నీరధిలో వైచిన, నొక్క మీనంబు మ్రింగె, నీ సోదరంబు వెడలితీవు, మీఁదటి కార్య
మాకర్ణింపుము॥ క॥ మాయావి వీఁడు దుర్మతి। మాయఁడు సంగరములందు మర్త్యులఁ గెలుచున్। మాయకరణమున వీనిన్। మా
యింపుము మోహనాది మాయల చేతన్॥ మత్తకోకిల॥ పాపకర్ముఁడు వీఁడు నిన్నిటు పట్టి తెచ్చిన లేచినా। పాపఁ డెక్కడఁ బో
యెనో సుతుఁ బాపి తే విధి యంచుఁ దాఁ। గ్రేపుఁ బాసిన గోవు భంగి నిఖిన్నయై పడి గాఢసం। తాపయై నిను నోఁచి కాఁచిన తల్లి
కుయ్యిడకుండు నే॥ వ॥ అని పలికి మాయావతి, మహానుభావుండైన, ప్రద్యుమ్నునికి సర్వశత్రుమాయావినాశినియగు, మహా
మాయావిద్య నుపదేశించె, నివ్విధంబున॥ మ॥ గురుమాయారణవేదియై కవచియై కోదండియై బాణియై। హరిజుం డోరి నిశాట
వైచితివి నాఁ డంభోనిధి న్నన్ను మో। రరణాంభోనిధి వైతు నిన్ను నిదె వే రమ్మంచు జీఱెన్ మనో। హరదివ్యాంబరు నుల్లసద్దనుజ
సేనాడంబరున్ శంబరున్॥ చ॥ అదలిచి యిట్లు కృష్ణసుతుఁ డాడిన నిష్ఠుర భాషణంబులన్। బదహతమైన డింగవయు పన్నగరా
జముఁ బోలి శంబరుం। డదరుచు లేచి వచ్చి గదనచ్యుతనందను వ్రేసె నుజ్జ్వల। ద్భిదురక ఠోర ఘోష సమభీషణ నాదము చేసి
యార్చుచున్॥ క॥ దనుజేంద్రుఁడు వ్రేసిన గదఁ। దన గద చేఁ బాయ నడఁచి దనుజులు బెదరన్। దనుజాంతకుని కుమారుఁడు। ద
నుజేశుని మీఁద నార్చి తన గద వైచెన్॥ వ॥ అంత నా రక్కసుండు వెక్కసంబగు రోసంబునఁ దనకుఁ దొల్లి మయుం డెఱింగించి
న దైతేయ మాయ నాశ్రయించి మింటికి నెగసి పంచబాణుని పై బాణవర్షంబు గురిసిన నమ్మహారథుండు నొచ్చియు సంభ
లింపక మత్సరంబున సర్వమాయావినాశినియయిన సాత్త్వికమాయం బ్రయోగించి దనుజుని బాణవృష్టి నివారించె- మఱి
యు వాఁడు భుజగ గుహ్యక పిశాచ మాయలు వన్ని నొప్పించిన నన్నియుం దప్పించి॥ క॥ దండధరమూర్తిఁ గైకొని। యొండాడక
చక్రిసూనుఁ డుగ్రత రాసి। ఖండించె శంబరుని తలఁ। గుండల కోటీర మణులు కుంభిని రాలన్॥ క॥ చిగురాకడిదపు ధారను। జగ
ములఁ బరవశము సేయు చలపాదికి దో। ర్ద్దగు నుక్కడిదంబునఁ దన। పగతుం దెగ వ్రేయు టెంత పని చింతింపన్॥ క॥ బెగడుచు
నుండక శంబరు। బెగడుచుఁ బూవింటిజోదు ధీరగుణంబు। ల్పొగడుచుఁ గురిసిరి ముదమున। నెగడుచుఁ గుసుమముల ముసరుని

## రతీదేవి ప్రద్యుమ్నసహితయయి గగనమార్గంబున ద్వారకకుఁ బోవుట.

ర్జరులధిపా॥ వ॥ ఇట్లు శంబరుని వధియించి, విలసిల్లుచున్న యించువిలుకానిం గొంచు, నాకాశచారిణియై, యారతీదేవి గగన
పథంబు పట్టి ద్వారకానగరోపరిభాగంబున నంజను దెంచిన॥ గీ॥ మెఱుఁగుతీఁగె తోడి మేఘంబు కైవడి। యువిదతోడ మింటను
డి కదలి। యరుగుదెంచె మదనుఁ డంగనాజనములు। మెలఁగుచున్న లోని మేడకడకు॥ మ॥ జలదశ్యాముఁ బ్రలంబబాహుయు
గళుం జంద్రాననున్ నీలసం। కులవక్రాలకుఁ బీతవాసు ఘనవక్షున్ సింహమధ్యున్ మనో। హరు। త్పలపత్రేక్షణు మందహాసలలి
తుం బంచాయుధున్ నీరజా। క్షులు దారేమటి పాటఁ జూచి హరియంచు న్డాఁగిరయ్యై యెడన్॥ క॥ కొందఱు హరియగునందురు।
కొందఱు చిహ్నములు గొన్ని కొన్ని హరికిని వే। ఱందురు మెల్లనె తెలియుదు। మందురు మఱుఁ జూచి కొందఱబలలు గుములై॥
క॥ హరియని వెనుచనిపిదపన్। హరిఁ బోలెడు వాఁడు గాని హరి గాఁడనుచున్। హరిమధ్యలల్లనల్లన। హరినందనుఁ డాయవ

చ్చిరాశ్చర్యములన్॥ ఉ॥ అన్నలు సేరవచ్చి మరునందనుఁ జూడఁగఁ దాను వచ్చి సం। పన్నగుణాభిరామ హరిపట్టపుదేవి విద
ర్భపుత్రి గే। కన్నుల నా కుమారకునికై వడి నేర్పడఁ జూచి బోటితోఁ। జన్నులు చేఁపనిట్లనియె సంభ్రమదైన్యములుల్లసిల్లఁ
గన్॥ శా॥ ఈ కంజేక్షణుఁ డీ కుమారతిలకుం డీ యిందుబింబాననుం। డీ కంఠీరవమధ్యుఁ డిచ్చటికి నేఁ డెంచుండియే తెంచెనో।
యీ కల్యాణునిఁ గన్న భాగ్యవతి మున్నే నోములన్నోఁచెనో। యే కాంతామణియందు వీనిఁ గనెనో యే కాంతుఁ డీ కాంతు
నిన్॥ శా॥ ఆలీ నా తొలుచూలిబిడ్డనికి బోఁగ్గాడించి నే సూతికా। శాలామధ్యవిశాలతల్పగతనై చన్నిచ్చి నిద్రింపనా। బాలు
న్నా చను బాలకుం జెటిచియే పాపాత్ము లేత్రోవము। న్నెలీలం గొనిపోయిరో శిశువుఁ డా నే తల్లి రక్షించెనో॥ క॥ కొడుకఁడు
నాపొదిగిఁటలోఁ। జెడిపోయిన నాఁటనుండి చెలియా తెలియం। బడదే వార్తయు నతఁడే। వడువున నెచ్చోట నిలిచి వర్తించెనొ
కో॥ క॥ ఇందాఁక వాఁడు బ్రతికిన। సందేహము లేమ దేహచాతుర్యవయ। స్సౌందర్యంబున లోకులు। వందింపఁగ నితనియంత
వాఁడగుసుమ్మీ॥ మ॥ అతివా సిద్ధము నాఁటి బాలకునకియ్యాకారమీ వర్ణమీ। గతిహాసంబు విలోకనస్వరము లీ గాంభీర్యమీ
కాంతి వీఁ। డతఁడే కాఁదగునున్న వారలకు నాయాత్మేశు సారూప్యసం। గతి సిద్ధింపదు వీనియందు మిగులం గౌతూహలంబ
య్యెడిన్॥ క॥ పొదలెడి ముదమునఁ జిత్తము। గదలెడి నా యెడమమూఁపు గన్నుల వెంటన్। బొదలెడి నానందాశ్రులు। మెదలె
డిఁ బాలిండ్లఁ బాలు మేలయ్యెడినో॥ అని డోలాయమానమానసయై వితర్కించుచు॥ క॥ తనయుఁడని నొడువఁదలఁచును। దన
యుఁడు గాకున్న మిగులఁ దలఁగొని సవతుల్। తనునగియెదరని తలఁచును। దనుసంశయమెలమిఁ గొనియెఁ దనుమధ్య మదిన్॥
వ॥ ఇట్లు రుక్మిణీదేవి విచారించుచుండ లోపలి నగరి కావలివారివలన విని కృష్ణుండు దేవకీవసుదేవులం దోడ్కొని చనుదెంచి సర్వ
జ్ఞుండయ్యు, నేమియు వివరింపక, యూరకుండె, నంత నారదుండు చనుదెంచి శంబరుండు కుమారునిం గొనిపోవుట మొదలైన
వార్తలెఱింగించిన॥ క॥ చచ్చిన బాలుఁడు గ్రమ్మఱ। వచ్చిన క్రియ వచ్చె నెక్కువర్షములకునీ। సచ్చరితుఁ నేఁడు గంటిమి। చె
చ్చెర మున్నెట్టి తపము సేయంబడెనో॥ వ॥ అనియంతఃపురకాంతలును, దేవకీవసుదేవరామకృష్ణులును, యథోచితక్రమం
బున నా దంపతులకు దివ్యాంబరాభరణాలంకృతుల సత్కరించి సంతోషించిరి- రుక్మిణీదేవి యనందనుం గౌఁగిలించుకొని॥
శా॥ అన్నా నాచనుఁబాపి నిన్ను దనుజుం డంభోనిధిం వైచెనే। యెన్నే వర్షములయ్యెఁ బాసి సుత నీ వేరీతి జీవించితే। సన్నా
హంబున శత్రుఁ గెల్చితివి యాశ్చర్యంబు సంధిల్లెడి। న్నిన్నుం గాంచితి నింతకాలమునకు న్నే ధన్యతన్ జెందితిన్॥ వ॥ అనికొ
డుకునుం జూచి సంతోషించి కోడలి గుణంబులకై వారంబు చేసి వినోదించుచుండె- నంత ద్వారకానగరంబు ప్రజలు విని హ
ర్షించిరంత॥ క॥ సిరిపెనిమిటి పుత్రకుఁడగు। మరుఁ గని హరిఁ జూచినట్లు మాతలు దమలోఁ। గరుగుదురఁట పరకాంతలు। మరుఁగ

## శ్రీకృష్ణుండు లోకాపవాదనివృత్తికొఱకు శమంతకమణిని దెచ్చుట.

ని మోహాంధకారమగ్నలుగారే॥ అని చెప్పిన శుకుండిట్లనియె॥ క॥ సత్రాజిత్తు నిశాచర। శత్రునకుం గీడుఁ జేసి సద్వినయము
తోఁ। బుత్రి శమంతకమణియును। మైత్రిం గొని తెచ్చియిచ్చె మనుజాధీశా॥ అనిన విని రాజిట్లనియె॥ గీ॥ శౌరికేమి తప్పు చేసె స
త్రాజిత్తు। కూఁతు మణియు నేల కోరియిచ్చె। నతని కెట్లుఁ గలిగె నా శమంతకమణి। విప్రముఖ్య నాకు విస్తరింపు॥ వ॥ అనిన విని
శుకయోగివర్యుం డిట్లనియె- సత్రాజిత్తను వాఁడు సూర్యునకు భక్తుండై చెలిమి సేయ నతనివలన సంతసించి సూర్యుండు శ
మంతకమణి నిచ్చె నా మణి కంఠంబున ధరియించి సత్రాజిత్తుండు భాస్కరునిభంగి భాసమానుండై ద్వారకానగరంబునకు
వచ్చిన మూరంబున నతనిం జూచి జనులు మణిప్రభాపటలతిరోహితదృష్టులై సూర్యుండని శంకించి వచ్చి హరికిట్లనిరి॥ క॥ నారా
యణ దామోదర। నీరజదళనేత్ర చక్రి నిఖిలేశ గదా। ధారణ గోవిందనమ। స్కారము యదుపుత్ర నిత్యకల్యాణహరీ॥ మ॥ ది
విజాధీశ్వరులిచ్చగింతురు గదా దేవేశ నిన్ జూడ యా। దవవంశంబున గూఢమూర్తివి జగత్ప్రాణుండవై యుండఁగా। భవదీ
యాకృతిఁ జూడ నేఁడ దెరుచి ప్రచ్ఛన్నదిగ్భాగుఁడై। రవి యో నీరజగర్భుఁడో యొకఁడు చేరన్వచ్చె మార్గంబునన్॥ వ॥ అని
యిట్లు పలికిన మూఢజనులం జూచి గోవిందుండు నగి మణిసమేతుండైన సత్రాజిత్తుండు గాని సూర్యుండు గాఁడని పలికె నం
త సత్రాజిత్తుండు శ్రీయుతుండై మంగళాచారసంచారితంబైన తన గృహంబునకుం జని మహీసురుల చేత నిజదేవతామంది
రంబున నమ్మణిశ్రేష్ఠంబు ప్రవేశంబు సేయించె నది ప్రతిదినంబును నెనిమిది బారువుల సువర్ణంబులొసంగుచుండు॥ క॥ పరా
జేలెడు వసుమతి। నా రత్నము పూజ్యమానమగు నక్కడ రో। గారిష్టసర్పమాయిక। మారీదుర్భిక్షభయము మానును రేం
ద్రా॥ క॥ అమ్మణి యాదవవిభునకు। నిమ్మని హరి యడుగ నాతఁడీక ధనేచ్ఛన్। బొమ్మని పలికెను జక్రికి। నిమ్మణి యీ మన్న
మీఁద నేమానను చున్॥ అంత॥ చ॥ అడరెడు వేడ్కఁ గంఠమున నమ్మణిఁ దాల్చి ప్రసేనుఁ డొక్కనాఁ। డడవికి ఘోరవన్యమృగ
యారతి నేఁగిన వానిఁ జంపి పైఁ। బడి మణిఁ గొంచు నొక్క హరి పాఱఁగ దాని వధించి డాసియే। ర్పడఁ గను జాంబవంతుఁడు ప్ర

భాంతదిగంతము నాశమంతమున్ ॥క॥ కని జాంబవంతుఁ డామణిఁ గొనిపోయి సమీపశైలగుహ జొచ్చి ముదంబున దనకూ
రిమి సుతకును ఘనకేళీకందుకంబుగాఁ జేసె నృపా ॥వ॥ అంత సత్రాజిత్తుండు తనసహోదరుండైన ప్రసేనునిం గానక దుః
ఖించుచు ॥మ॥ మణికంఠంబునఁ దాల్చి నేఁడడవిలో మా వాఁడు వర్తింపఁగాఁ। బణికై పట్టి వధించి నాఁడు హరి కిన్మర్యాద తే
దంచును। దూషణముం జేయఁగ వాని దూషణముఁ గంసధ్వంసి యాలించి యే। వ్రణము న్నాఁడ యెడలేమ నిం జగలి గెఱ్ఱ వారించు
పేరీతియో ॥ అని వితర్కించి ॥మ॥ తనవారెల్లఁ బ్రసేనుజాడఁ దెలుపం దర్కించుచున్ వచ్చి తత్। ప్స్వనవీథింగనె నేలఁగూలిన మ
హాశ్వంబుం బ్రసేనుం బ్రసేనునిహింసించిన సింహమున్ మృగపతిన్ నొప్పించి ఖండించి యేఁ। గిన భల్లూకము చొచ్చియు
న్న గుహాయుం గృష్ణుండు రోచిష్ణుఁ డై ॥వ॥ కని తన వెంటనంటి వచ్చిన ప్రజ నెల్లఁ గుహాముఖంబున విడిచి సాహసంబున మహా
నుభావుం డైన హరి నిరంతర నీరంధ్ర నిబిడాంధకార బంధురంబై భయంకరంబై విశాలంబైన గుహాంతరాళంబు సొచ్చి చని
యక్కడ నొక్క బాలిక కెమ్ము అవర్ణనీయ కేళీకందుకంబుగా వ్రేలం గట్టిన యమ్మణిశ్రేష్ఠంబుఁ గని హరింప నిచ్చయించి॥
క॥ మెల్లనె పదములిడుచు యదు। వల్లభుఁ డా బాలకడకు వచ్చిన గుండెల్ । ఝల్లనఁగఁ జూచి కంపము। మొల్లంబుగ దాని దాది
మొఱవెట్టె నృపా ॥వ॥ అంత నాధ్వని విని బలవంతుం డైన జాంబవంతుండు వచ్చి తన స్వామియని కృష్ణు నెఱుంగక ప్రాకృతపు
రుషుండని తలంచి కృష్ణునితో రణంబు చేసెనందు ॥క॥ పలలమునకుఁ బోరెడు డేగలక్రియ శస్త్రములం దరులఁ గరములఁ విజయే
చ్ఛలని రువది యెనిమిది దినములు వోరిరి నగచరేంద్రముఖ్యుఁడు హరియున్ ॥క॥ అడిదములు దరులు విఱిగిన। బెడిదములగు మగ
తనములఁ బిఱుతివక వడి। న్బిడుగులవడువునఁ బడియెడి। పిడికిటఁ బొడుచుటలు గలనఁ బెరసిరి పురుషా॥ శా॥ స్పష్టాహంకృతు
లుల్లసిల్ల హరియున్ భల్లూకలోకేశుఁడున్ ముష్టాముష్టిన హర్నిశంబు జయసంమోహంబులం బోరుచోఁ। బుష్టిం బాసి ముకుంద
ముష్టిహతులన్ బ్రాన్నశ్రమోపేతుఁ డై। పిష్టాంగోరుశరీరుఁ డై యతఁడు దాభీతాత్ముఁ డై యిట్లనెన్॥వ॥ దేవా నిన్ను పురాణ
పురుషున నధీశ్వరుం డైన విష్ణుం బ్రభవిష్ణుంగా నెఱుంగుదు - సర్వభూతంబులకుం బ్రాణప్రతాపధైర్యబలంబులు నీవ. విశ్వం
బునకు సర్గస్థితిలయంబుల నెవ్వరాచరింతురు వారికి సర్గస్థితిలయంబులఁ జేయు నీశ్వరుండవు నీవ. యాత్మకుం బరమాత్మవు నీ
వ. యని మఱియును॥ సీ॥ బాణాగ్ని నెవ్వఁడు పఱపి పయోరాశి నింకించి బంధించి సేపు మాఁపెఁ। బరఁగ నెవ్వఁడు ప్రతాపప్ర
భారాశిచే దానవగర్వాంధతమసము ద్రుంచెఁ। గంజాతములు ద్రెంచు కరిభంగి నెవ్వఁడు దశకంఠు కంఠబృందములు ద్రుంచె।
నాచంద్రసూర్య మై యమరు లంకారాజ్యమునకు నెవ్వఁడు విభీషణుని నిలిపె। నన్ను నేలిన లోకాధినాథుఁ డెవ్వఁ। డంచితో
దారకరుణారసాబ్ధి యెవ్వఁ। డాతఁడవు నీవ కా వే మహాత్మ నేఁడు। మా ఱుపడి యెగ్గుఁ జేసితి మాఱువలయు॥ వ॥ అని యిట్లు పర
మభక్తుం డైన జాంబవంతుండు వినుతించిన నతని శరీరనిగ్రహనివారణంబుగా భక్తవత్సలుం డైన హరి తనకరంబున నతని శ
రీరంబు నిమిరి మేఘగంభీరభాషణంబుల హరియు నిట్లనియె ॥క॥ ఈ మణిమా చేఁ బడెనని। తామసులానరించు నిందదప్పెడుకొఱ
కై। నీ మందిరమగు బిలమున। కేమరుదెంచితిమి భల్లుకేశ్వర వింటే ॥వ॥ అనిన విని సంతసించి జాంబవంతుండు మణియునుం దన
కూఁతు జాంబవతి యను కన్యకామణియునుం దెచ్చి హరికిం గానుకగా సమర్పించె నట మున్ను హరి వెంట వచ్చినవారలు బిలం
బు వాకిట౦ బన్రెండు దినంబులు హరి రాక కెదురుచూచి వేసఱి వగచి తమ పురంబునకుం జని రంత, దేవకీవసుదేవులు రుక్మిణి
యును, మిత్రబంధుజ్ఞాతిజనులును గుహ సొచ్చి కృష్ణుండు రాఁడు చిక్కెనని శోకించి ॥క॥ దుర్గమము గు బిలమున హరి। నిర్గతుఁ డై
చేరవలయు నేఁడని పౌరుల్ స్వర్గము లై సేవించిరి। దుర్గన్ స్మృతకుశలమార్గతోషితభర్గన్ ॥క॥ దోలాయితమానసు లై। జాలింబ
డిజనులు గొలువఁ జండిక పలికె। న్బాలామణితో మణితో। హేలాగతి వచ్చు నంబుజేక్షణుఁ డనుచున్॥క॥ యత్నము సఫలంబై
న న సపత్నసమూహములు బెగడఁ బత్న్యాత్ముండై। రత్నము తోఁ గన్యాజన। రత్నము తోఁ బురికి వచ్చె రయమున నంతన్ ॥క॥ మృ
తుఁ డై న వాఁడు పునరాగతుఁ డై న క్రియ నందలం చి కన్యాన్వితమణిసం। యుతుఁ డై వచ్చిన హరిఁ గని। వితతోత్సవకౌతుకముల వెలసి
రి పౌరుల్ ॥వ॥ ఇట్లు హరి తన పరాక్రమంబున జాంబవతీదేవిం బరిగ్రహించి రాజసభకు సత్రాజిత్తుం బిలిపించి యావృత్తాం
తం బంతయు నెఱింగించి సత్రాజిత్తునకు మణి నిచ్చిన నతండు సిగ్గువడి మణిం బుచ్చికొని పశ్చాత్తాపంబు నొందుచు, బలవద్వి
రోధంబునకు వెఱచుచు, నింటికిం జని॥క॥ పాపాత్ముల పాపములం। బాపంగా నోపునట్టి పద్మాక్షుని పైఁ। బాపము గలదని నొడి
విన। పాపాత్ముని పాపము సహచారము గలదే॥ మ॥ మితభాషిత్వము మాని యేల హరిపై మిథ్యాభియోగంబు చేసి
తిఁ బాపాత్ముఁడ నర్థలోభుఁడను మచ్చిత్తుండ మత్తుండను। ర్మలినీ దేహముఁ గాల్ప నేచు రిత మేమార్గంబు నం బాయునే। గతిం
గంసారి ప్రసన్నుఁ డై మనసు చు న న్నారుణ్యభావంబునన్॥గీ॥ మణియుఁ గూఁతు నిచ్చి మాధవు పదములఁ। బట్టుకొంటి నేని బ్రదు
కుగలదు। సంతసించు నతఁడు సదుపాయ మగు నిది। సత్యమితరవృత్తిఁ జక్కఁబడదు॥మ॥ అని యిబ్భంగి బహుప్రకారముల నే

కాంతస్థుఁడై యింటిలోఁ । దనబుద్ధిం బరికించి నీతెఁ గనిన సత్రాజిత్తు సంప్రాప్తశో। భనుఁడై యిచ్చె విపక్షమోహిత రిపుభా। మామనోహారికిన్ । దనుజాధీశ విదారికిన్ హరికిఁ గాంతారత్నమున్ రత్నమున్॥ ఉ॥ తాసురసార్వభౌముఁ డచ్యుతుఁ డుదార యశోనిధి పెండ్లియాడెనా। నానను జేంద్ర నందిత గుణస్థితి లక్షణ సత్యభామ। సుజ్ఞాన పవిత్ర తాత్త్వనయ ధర్మ విచక్షణ తాదయాయశఃల్గ। కానను సత్యభామను సుఖమ్యతిన్ గ్రీత సోమనయ్యెడన్॥ క॥ మణియిచ్చి నాఁడు నా సర। మణి నీకును మా కుఁ గలవు మణులు కుమారీ। మణి చాలు నంచుఁ గృష్ణుఁడు। మణి సత్రాజిత్తునకును మరలంగ నిచ్చెన్॥ వ॥ అంత నక్కడ, కుంతీస

శతధన్వుఁడు సత్రాజిత్తుని జంపి మణి నపహరించుట.

హితులైన పాండవులు, లాక్షాగారంబున దగ్ధులైరని విని, నిఖిలార్థదర్శనుండయ్యును, కృష్ణుండు బలభద్రసహితుండై, కరినగరంబునకుం జని కృపవిదుర గాంధారీ భీష్మ ద్రోణులం గని దుఃఖోపశమనంబులు సేయుచున్నయెడ॥ సీ॥ జగతీశ! వినవయ్య శతధన్వుఁ బొడగని యక్రూర కృతవర్మ లా ప్రవృత్తి। మనకిత్తు ననుచు సమ్మతిఁ జేసి తనకూఁతుఁ బద్మాక్షునకు నిచ్చె పాడి దప్పె। ఖలుఁడు సత్రాజిత్తు గడఁగి యే క్రియనైన మణి పుచ్చుకొనుము నీ మతము మెఱసి। యని తన్నుఁ బ్రేరేప నా శతధన్వుఁ డుపవసుఁ గటికిఁ నాఁడు పట్టి చంపు। కరణి నిదురింపోవఁ గడఁగి సత్రాజిత్తుఁ బట్టి చంపి వాని భామ లెల్ల। మొఱలు వెట్టలోభమునఁ జేసి మణిఁ గొంచుఁ జనియె నొక్క నాఁడు జనవరేణ్య॥ వ॥ ఇట్లు హతుండైన తండ్రిం గని శోకించి సత్యభామ యతని నూనెలద్రోణియందుఁ బెట్టించి హస్తిపురంబునకుం జని సర్వజ్ఞుండైన హరికి సత్రాజిత్తు మరణంబు విన్నవించిన హరియును బలభద్రుండును నీశ్వరులయ్యును మనుష్యభావంబుల విలపించి రంత బలభద్ర సత్యభామాసహితుండై హరి ద్వారకానగరంబునకు మఱలి వచ్చి శతధన్వుం జంపెదనని తలంచిన నెఱింగి శతధన్వుండు ప్రాణభయంబునఁ గృతవర్మ యింటికిం జని తనకు సహాయుండవు గమ్మని పలికినం గృతవర్మ యిట్లనియె॥ ఉ॥ అక్కట! రామకృష్ణులు మహాత్ములు వారలకెగ్గు సేయఁగా। నిక్కడ నెవ్వఁ డోపు? వినుమేర్పడఁగం సుడు బంధుయుక్తుఁడై। చిక్కఁడె మును మాగధుఁడు సేనలతోఁ బదినేడుతోయము। ద్దిక్కుల బాఱఁడే మన కదృష్టము వారల లావు వింతయే॥ వ॥ అని యుత్తరంబు చెప్పిన విని శతధన్వుం డక్రూరుని యింటికిం జని హరితోడి పగకుం దోడు రమ్మని చీరిన నక్రూరుండు హరిబల పరాక్రమ ధైర్య స్థైర్యంబులు గడించి మఱియు నిట్లనియె॥ సీ॥ ఎవ్వఁడు విశ్వంబు నెల్లను లీలుఁడై పుట్టించు రక్షించుఁ బొలియఁ జేయు। నెవ్వని చేష్టల నెఱుఁగరు బ్రహ్మము లెవ్వని మాయ మోహించు భువన। మేడేండ్ల పాపఁడై యే విభుఁ డొకచేత గోరక్షణమునకై కొండ నెత్తె। నెవ్వఁడు కూటస్థుఁ డీశ్వరుఁ డచ్యుతుఁ డనఘుఁడు గర్మసాక్షి। యట్టి ఘనునకు శౌరికి ననవరతము। మ్రొక్కెదము గాక విద్వేషమునకు నేము। వెఱతు మొల్లము నీపొందు వేగఁ బొమ్ము। చాలుఁ బవి వేలు వచ్చె నీ సఖ్యమునను॥ వ॥ అని యిట్లక్రూరుం డుత్తరంబు పలికిన నమ్మహామణి యక్రూరుని వద్దను నిచి వెడలి శతధన్వుండు తురగారూఢుండై శతయోజనదూరంబు చనియె నంత గరుడకేతనాలంకృతంబైన తేరెక్కి రామకృష్ణులు వెను చనిరంత నతండును మిథిలానగరంబుఁ జేరి సమీపంబునందు॥ చ॥ తురగము డిగ్గి తల్లడముతోఁ శతధన్వుఁడు పాదచారియై। పరువిడఁ బోకుపోకుమని పద్మవిలోచనుఁడు గూడఁ దాఁకి భీ। కరగతి వాని మస్తకము ఖండితమై పడ వ్రేసెఁ జక్రముం। బరిహతదైత్యచక్రముఁ బ్రభాచయ మోదిత దేవశక్రమున్॥ వ॥ ఇట్లు హరి శతధన్వుని వధియించి వాని వస్త్రంబులందు మణి వెదకి లేకుండుటఁ దెలిసి బలభద్రుని కడకు వచ్చి శతధన్వుం డూరక హతుండయ్యె మణి లేదనిన బలభద్రుం డిట్లనియె॥ సీ॥ ఆ మణి శతధన్వుఁ డపహరించుట నిక్క మెవ్వరిచేఁ దాఁప నిచ్చినాఁడొ। వేగమె నీ వేగి వెదకుము పురిలోన నైజేహు దర్శింప వాంఛ గలదు। పోయి వచ్చెద నీవు పొమ్మని వీడ్కొల్పి మెల్లన రాముండు మిథిలఁ జొచ్చి। పోయిన జనకుండు వొడఁగని హర్షించి యెంతయుఁ బ్రియముతో నెదురు వచ్చి। యర్ఘ్యపాద్యాదికృత్యంబు లాచరించి। యిచ్చ వచ్చిన వస్తువు లెల్ల నిచ్చి। యుండుమని భక్తిఁ జేసిన నుండె ముసలి। సుపలమేశ్వర మిథిలలోఁ గొన్నియేండ్లు॥ వ॥ అంత దుర్యోధనుండు మిథిలానగరంబునకుం జనుదెంచి జనకరాజుచేత సమ్మానితుండై॥ క॥ చలమున గాంధారేయుఁడు। లలిత గదాయుద్ధకౌశలము నేర్చెఁ దగన్। హలిచే * శ్రితజననిర్జర। ఫలిచేఁ దైత్యౌఘ వీరభటగణ బలిచేన్॥ వ॥ అటఁ గృష్ణుండును ద్వారకానగరంబునకుం జని శతధన్వుని మరణంబును, మణి లేకుండుటయును సత్యభామకుం జెప్పి సత్యభామాప్రియకరుండు గావునఁ సత్రాజిత్తునకుం బరలోకక్రియలు సేయించె నక్రూర కృతవర్మలు శతధన్వు మరణంబు విని వెఱచి ద్వారకానగరంబు వెడలి బహుయోజనదూరభూమికిం జని రక్రూరుండు లేమిం జేసి వానలు లేక మహోత్పాతంబులును, శరీర మానస తాపంబులును, ద్వారకానగరవాసులకు సంభవించిన నందుల వృద్ధజనులు బెగడి హరి కిట్లనిరి॥ సీ॥ కమలాక్షు వినవయ్య కాశీశుఁ డేలెడి కుంభినిని వానలు గురియకున్న। గోరి శ్వఫల్కుఁడను గొనిపోయి యతనికి గాందినియను నీ యెడు కన్యనిచ్చి। కాశీవిభుండు సత్కారంబుఁ జేసిన వానలు గురిసె నా వసుధమీఁద। నా లని

* శ్రితజననిర్జరఫలిచే- అనుచోట- హతరజనీచరవలిచే- అని యొక పాఠము గలదు.

పుత్త్రకుఁడై నయక్రూరుండు నంతటివాఁడె మహాతపస్వి।మఱలివచ్చె నేనిమానును త్పాతంబు। లెల్ల వానగురియు నీస్థలము
న। దేవయతనిఁ దోడితెప్పింపు మన్నింపు।మానవలయు పీడ మానవులకు॥ వ॥ అనిపలుకు పెద్దలపలుకులాకర్ణించి దూతజనుల
నుంబంపి కృష్ణుండక్రూరుని రావించి పూజించి ప్రియకథలు కొన్ని చెప్పి సకలలోకజ్ఞుండు గావున మృదుమధురభాషణంబుల
నిట్లనియె॥సీ॥తా నేఁగుతఱి శతధన్వుండు మణిఁ దెచ్చి నీయింటఁ బెట్టుట నిజముఁ దెలిసి। నాఁడ సత్రాజిత్తునకుఁ బుత్త్రకులు లే
మిన తనకిఁ గార్యంబు లాచరించి।విత్తంబు ఋణమును విభజించుకొనియెద రతనిపుత్త్రిక లెల్ల నతఁడు పరుల। చేత నమ్మరణం
బుఁ జెందినాఁడతనికై సత్కర్మములు మీఁద జరుపవలయు।మణి గ్రహింపు మీవ మాయన్న నను నమ్మఁ। డెలమి బంధుజనులకె
ల్లఁ జూపు।మయ్య నీగృహమున హాటకవేదికా।సహితమఖము లమరు సంతతమును॥వ॥ అని యిట్లు సామవచనంబులు హరిప
లికిన నక్రూరుండు వస్త్రచ్ఛన్నంబైన మణిఁ దెచ్చి హరికిచ్చిన॥ఉ॥సంతసమంది బంధుజనసంతతికిన్ హరి దెచ్చి చూపె। న
క్రాంతవిభాసమానఘృణిజాలపలాయితభూనభోంతర।ధ్వాంతము హేమభారచయవర్షణవిస్మిత దేవమానవ। స్వాంత
ముఁ గీర్తిపూరితదిశావలయాంతము నాశమంతమున్॥క॥చక్రాయుధుఁడీక్రియఁ దన।యక్రూరత్వంబు జనులకందఱకును
నిర్వక్రముగఁ దెలిపి క్రమ్మఱ।నక్రూరునకిచ్చె మణిఁ గృపాకలితుండై॥క॥ఘనుఁడు భగవంతుఁడీశ్వరుఁ।డనఘుఁడు మణిఁ దె
చ్చియిచ్చినట్టికథనము। న్వినినఁ బఠించినఁ దలఁచిన।జనులకు దుర్యశముఁ బాపసంఘముఁ దలఁగున్॥ వ॥ అంతనొక్కనాఁడు

## శ్రీకృష్ణుండింద్రప్రస్థపురంబునకరుగుట.

పాండవులం జూడ నిచ్ఛయించి సాత్యకిప్రముఖయాదవులు గొలువఁ బురుషోత్తముండింద్రప్రస్థపురంబునకుం జనినం బ్రా
ణంబులం గనినయింద్రియంబుల భంగి నఖిలేశ్వరుండైన హరిం గని కౌఁగిలించికొని కృష్ణుని దివ్యదేహసంగమంబున నిర్ధూత
కల్మషులై యనురాగహాసవిభాసితంబైన ముకుందముఖారవిందంబు దర్శించి యానందంబు నొందిరి గోవిందుండును యుధి
ష్ఠిరభీమసేనుల చరణంబులకు నభివందనంబు చేసి యర్జును నాలింగనంబున సత్కరించి నకులసహదేవులు మ్రొక్కన గ్రు
చ్చియెత్తి యుత్తమపీఠంబున నాసీనుండై యుండ నప్పుడు॥క॥చంచద్ఘనకుచభారా। కుంచితమై క్రొత్తపెండ్లికూఁతురగు
టనిం।చించుక సిగ్గు జనింపఁగఁ।బాంచాలతనూజ మ్రొక్కెఁ బద్మాక్షునకున్॥వ॥ అంత సాత్యకి పాండవులచేతం బూజితుం
డై యొక్కపీఠంబున నాసీనుఁడయ్యెఁ దక్కనయనుచరులును వారిచేతఁ బూజితులై కొలిచియుండిరి హరియుం గుంతీదేవిక
డకుం జని నమస్కరించి యిట్లనియె॥క॥అత్తా కొడుకులుఁ గోడలుఁ। జిత్తానందముగఁ బనులు సేయఁగ నాత్మా।యత్తానుగవై
యాజ్ఞా।సత్తాములు గలిగి మనుదెస మ్మోదమునన్॥చ॥అనవుడుఁ బ్రేమవిహ్వలత నందుచు గద్గదభాషణంబులన్।గనుఁగవ
నశ్రుతోయములు గ్రమ్మఁగఁ గుంతి సుయోధనుండు చే।సిన యపకారముం దడవి చెందిన దుఃఖము లెల్లఁ జెప్పి యా। దనుజవి
రోధికిట్లనియెఁ దద్దయుఁ బెద్దఱికంబు సేయుచున్॥సీ॥అన్న నీచుట్టాలనరయుచు మఱువవు నీవు పుత్తెంచిన నెమ్మితోడ । మా
యన్న యేతెంచి మముఁ జూచిపోయెను నిల్చియున్నారము నీబలమున।నా పిన్నవాండ్రకు నాకు దిక్కెవ్వరు నేఁడాదిగా నిం
కనీవె కాక।నఖిలజంతువులకీవాత్మవు గావునఁ బరులు నావారని భ్రాంతి సేయ।వయ్య నాభాగ్య మెట్టిదో యనవరతముఁ।జి
త్తమున నుండి కరుణ మాచిక్కులెల్లఁ।బాచుచుందువుగాదె యోపరమపుణ్య। యదుకుమారవరేణ్య బుధాగ్రగణ్య॥అనిన
యుధిష్ఠిరుండిట్లనియె॥ఉ॥పట్టఁగలేరు నిన్నుఁ దనుభావములందు సనందనాదులే। పట్టున నైన నట్టి గుణభద్రచరిత్రుఁడవీవ
నేఁడు మా।చుట్టమటంచు వచ్చెదవు చూచెదవల్పుల మైన మమ్ము నే।మెట్టితపంబు చేసితిను ధీశ్వర పూర్వశరీరవేళలన్॥వ॥అ
నిధర్మజుండు దన్నుం బ్రార్థించిన నింద్రప్రస్థపురంబు వారలకు నయనానందంబు సేయుచు హరి గొన్ని నెలలు వసియించి
యుండె నందొక్కనాఁడు॥మ॥తురగశ్రేష్ఠము నెక్కి కంకటధనుస్తూణీశరోపేతుఁడై । హరితోడన్ వనభూమి కేఁగి విజ
యుండాసక్తుఁడై చంపె శంబరశార్దూలతరక్షుశల్యచమరీభల్లూకగంధర్వకా। సరకంఠీరవఖడ్గకోలహరిణీసారంగము
ఖ్యంబులన్॥క॥అచ్చోటఁ బవిత్రములై।చచ్చిన మృగరాజి నెల్ల జననాథునకుం।దెచ్చిరి పర్వము వచ్చినఁ। జెచ్చెఱ నరుఁగొ
ల్చియున్న సేవకులధిపా॥వ॥అంత నర్జునుండు నీరుదప్పిఁ గొని డస్సి యమునకుం జనియె నమ్మహారథులైన నరనారాయణు

## సూర్యతనూజయగు కాళిందిని గృష్ణుండు పరించుట.

లందు వార్చి జలంబులు ద్రావి యొక్కపులినప్రదేశంబున నుండుచు॥చ॥ ఉపగతులైన యట్టి పురుషోత్తమపార్థులు గాంచి
రాపగా।విపులవిలోలనీలతరవీచికలం దమ శిరోజభారగు।చ్ఛపహసితాళిమాలికను దంచితబాలశశిప్రభాలికం। దవను నిబా
ళికన్మదనదర్పణతుల్యకపోలపాలికన్॥వ॥అని యచ్యుతుండు పంచిన వివ్వచ్చుండు చని యాకన్యకిట్లనియె॥ మ॥ సుదతీ యెవ్వ
రిదాన వేమికొఱకిచ్చోటం బ్రవర్తించెదే।య్యది నీ నామము కోర్కెయెట్టిది వివాహాకాంక్షతోఁ గూడినీ। నదికి న్వచ్చినజా

డగానఁబడెధన్యంబయ్యెనీరాకనీయుదయాదిస్థితినెల్లఁజెప్పవఁబలాయద్యతుఱంగేక్షణా॥ అనిననర్జునునకుఁగాళింది
యిట్లనియె॥ మ॥ నరవీరోత్తమయేనుసూర్యునిసుతన్నాపేరుకాళిందిభాస్వరసంకల్పితగేహనిందునదిలోఁగంజాక్షువి
ష్ణుంబ్రభుంవరుగాఁగోరితపంబుసేయుదునెరున్వాంఛింపఁగృష్ణుండువన్యరతిన్వచ్చివరించునంచుఁబలికెన్నాతండ్రి
నాతోడుతన్॥ వ॥ అనినవినిధనంజయుండానీలవేణిపలుకులుహరికింజెప్పినవిని సర్వజ్ఞుండైనహరియు,హరిమధ్యనురథం
బుమీఁదనిడుకొనిధర్మరాజుకడకుంజనివారలుకోరినవిశ్వకర్మునురావించివారిపురంబతివిచిత్రంబుసేయించె॥ క॥ దేవేం
ద్రునిఖాండవముప్పావకునకునీఁదలంచిపార్థునిరథికున్ గావించిసూతుఁడయ్యెను గోవిందుఁడుమఱఁదితోడఁగూరిమివె
లయన్॥ వ॥ ఇట్లునరనారాయణులుసహాయులుగాదహనుండుఖాండవవనంబుదహించిసంతసించి విజయునకునక్షయ
తూణీరంబులునభేద్యకవచంబును, గాండీవమనియెడిబాణాసనంబును, దివ్యరథంబును, ధవళరథ్యంబులనిచ్చెనంత॥
ఉ॥ వాసవసూనుచేఁదనకువహ్నిశిఖాజనితోగ్రవేదన। ల్వాసినఁజేసియొక్కసభపార్థునకిచ్చెమయుండుప్రీతుఁడై।
యాసభలోనఁగాదెగమనాగమనంబులఁగౌరవేంద్రుఁడు। ల్లాసముఁబాసియుండుట జలస్థలనిర్ణయబుద్ధిహీనుఁడై॥

## శ్రీకృష్ణుండు-కాళింది-మిత్రవింద-నాగ్నజిత్తి-భద్ర-లక్షణయనువారలఁబరిణయంబగుట.

వ॥ అంతంగృష్ణుండు,ధర్మరాజప్రముఖులవీడుకొనిసాత్యకిప్రముఖసహచరులుగొలువఁ దలితనపురంబునకుంజనుదెం
చిబంధుజనంబులకుఁబరమానందంబుసేయుచు నొక్కపుణ్యదివసంబునశుభలగ్నంబునంగాళిందింబెండ్లియయ్యె మఱి
యునవంతీదేశాధీశ్వరులైనవిందానువిందులుదుర్యోధనునకువశులైహరికిమేనత్తయైనరాజాదేవికూఁతురైనతమచెలి
యలినివివాహంబుసేయనుద్యోగించిస్వయంవరంబుచాటించిన॥ క॥ భూరమణులుసూడఁగహరివీరతఁజేకొనియెమిత్ర
విందనునిత్యాపూరితసుజనానందన్ జారుచికురకాంతివిజితషట్పదబృందన్॥ సీ॥ జననాథవినుముకోసలదేశమేలెడినగ్న
జిత్తనునరనాథుఁడొకఁడుసుమతిధార్మికుఁడుదత్సుతనాగ్నజిత్తియనఁగన్యకగుణవతిగలదుదానిఁబెండ్లియాడుటకునైపృ
థివీశులేతెంచివాఁడికొమ్ములుగలవానివీర గంధంబుసోఁకినఁగాలుద్రవ్వెడివానినతిమదమత్తంబులైనవానిగోవృషం
బులనేడింటిఁగూర్చితిగిచి బాహుబలమున నెవ్వఁడుపట్టికట్టు నతఁడుకన్యకువల్లభుండనినవానిఁబట్టఁజాలకపోదురాప్ర
జలుబెగడి॥ వ॥ ఇట్లుగోవృషంబులజయించినవాఁడకన్యకకువరుండనినభగవంతుండైన హరివినిసేనాపరివృతుండైకో
సలపురంబునకుంజనినఁగోసలాధీశ్వరుండుహరినెదుర్కొని యర్ఘ్యపాద్యాదివిధులంబూజించిపీఠంబుసమర్పించిప్రతి
నందితుండైయున్నయెడ॥ క॥ ఆరాజకన్యప్రియమున నారాజీవాక్షుమోహనాకారుఁద్రిలోకారాధితుమాధవుఁదన
కారాధ్యుండైననాథుఁడనికోరెన్నృపా॥ మఱియునక్కన్యకారత్నంబుదనమనంబున॥ గీ॥ విష్ణుఁడవ్యయుండువిభుఁడుగా
వలెనని నోఁచినట్టితొంటినోముఫలము సిద్ధమయ్యెనేనిఁజేకొనుఁబోనన్నుఁ జక్రధరుఁడువైరిచక్రహరుఁడు॥ మ॥ సిరి
యుంబద్మభవేశదిక్పతులుమున్సేవించియెవ్వానిశ్రీ చరణాంభోజపరాగముల్శిరములన్సవ్యగ్రతిందాల్తురీ ధరణీచక్రభ
రంబువాపుటకునుద్యత్కేళిమూర్తుల్దయాపరుఁడైయెవ్వఁడుదాల్చునట్టిహరియెబ్భంగింబ్రవర్తించునో॥ వ॥ అనియిట్లు
నాగ్నజిత్తివిచారించునెడఁగృష్ణుండారాజుంజూచిమేఘగంభీరనినదంబుననిట్లనియె॥ క॥ అన్యులయాచింపరురా జన్యులు
సౌజన్యకాంతుఁజనుదెంచితినీకన్యన్వేఁడెదనిమ్మా కన్యా*శుల్కదులమేముగామనరేంద్రా॥ అనినరాజిట్లనియె॥ శా॥ క
న్యంజేకొననిన్నిలోకములనీకన్నన్ఘనుండైనరా జన్యుండెవ్వఁడునీగుణంబులకునాశ్చర్యంబునుంబొందితా నన్యారం
భముమానిలక్ష్మిభవదీయాంగంబునన్నిత్యయై ధన్యత్వంబునఁజెందియున్నదిగదాతాత్పర్యసంయుక్తయై॥ శా॥ చంచ
ద్గోవృషసప్తకంబుకడిమిన్సైరించియెవ్వాఁడుభంజించునవ్వానికిఁగూఁతునిత్తుననియేఁజీఱించిననైవ్వభవోదంచద్గర్వు
లువచ్చిరాజతనయుల్దత్పాదశృంగాహతిన్గ్గించిక్ష్మాలమునోర్వకేసుమరనిగ్గెడించిఖిన్నాంగులై॥ శా॥ ఉష్ణాంశుండుతమం
బుఁదోలుక్రియనీవుగ్రాహవక్షోణిలోఁ గృష్ణావైరులఁదోలినాఁడవురణక్రీడావిశేషంబులన్ #నిష్ణాతుండవుసప్తగోవృష
ములన్నేఁడాజిభంజింపరోచిష్ణుత్వంబుననేఁడుచేకొనుముమాశీతాంశుబింబాననన్॥ వ॥ అనినగ్నజిత్తుదనకూఁతువివా
హంబునకుంజేసిన§సమయంబుచెప్పినవిని॥ చ॥ కనియెనఘారివత్సబకకంసవిదారిఖలప్రహారిదాఘనతరకిల్బిషంబులన
గణ్యభయంకరపౌరుషంబులన్ సునిశితశృంగనిర్దళితశూరసమూహము†ఖామిషంబులన్ హననగుణోన్మిషంబులమ
హాపరుషంబులగోవృషంబులన్॥ ఉ॥ చేలముచక్కఁగట్టుకొనిచిత్రగతిన్వడినేడుమూర్తులై బాలుఁడుదారరూపములఁబ
ట్టెడుకైవడిఁబట్టివీర శార్దూలుఁడుగ్రుద్దినేలఁబడఁద్రోచిమహోగ్రథితిఁగట్టియీడ్చెభూపాలకులెల్లమెచ్చవృషభంబు

*శుల్కదులము।ఓలియిచ్చువారము. #నిష్ణాతుండవు।నిపుణుఁడవు. §సమయము।ప్రతిజ్ఞ. †ఆమిషము।మాంసము.

లంబర్వతనన్నిభంబులన్ ॥వ॥ ఇట్లు వృషభంబులనన్నింటినింగట్టియాడ్చినం జూచి సంతసించి హరికి నగ్నజిత్తు నాగ్నజిత్తిని
చ్చి సవిధివత్ప్రకారంబునం బెండ్లి యయ్యె నారాజసుందరులానందంబునుం బొందిరా సమయంబున బ్రాహ్మణాశీర్వాదం
బులును, గీతపటహశంఖకాహళభేరీమృదంగనినదంబులు చెలంగె నంత నాకోసలేంద్రుండు దంపతుల రథారోహణంబు సే
యించి పది వేల ధేనువులును, విచిత్రాంబరాభరణభూషితలైన యువతులు మూఁడు వేలును, దొమ్మిది వేల గజంబులును, గజం
బులకు శతగుణరథంబులును, రథంబులకు శతగుణంబులైన హయంబులును, హయంబులకు శతగుణాధికంబైన నరసమూ
హంబును నిచ్చి పుత్తెంచిన వచ్చునప్పుడు. ఉ॥ భూతియలర్పఁ గోసలునిపుత్రిక కై చను దెంచి తొల్లి యాఁబోతుల చేత నోటు
వడిపోయిన భూపతులెల్ల మాధవుం। డాతని నివ్వరించుటచరావలి చేవిని ద్రోవ సైన్యసం। ఘాతములోడఁ డాఁకిరి గర్వవి
మోచనుఁ బద్మలోచనున్ ॥ఉ॥ దండిని రాజులెల్ల హరిఁ దాఁకిన నడ్డము వచ్చి వీఁక తో। భండన భూమియందుఁ దన బాంధవులె
ల్లను సన్నుతింపఁగా। గాండివచాపముక్త విశిఖంబుల వైరుల నెల్లఁ జంపె నా। ఖండలనందనుండు* శశకంబుల సింహము చం
పుకైవడిన్ ॥వ॥ ఇట్లు హరి నాగ్నజిత్తిం బెండ్లియాడి యరణంబు పుచ్చుకొని ద్వారకానగరంబునకు వచ్చి సత్యభామతోఁ గ్రీ
డించుచుండె మఱియును ॥మ॥ జనవంద్యన్ శ్రుతకీర్తినందనను సంతర్దనక్షోణిపా। ద్యనుజన్ మేనమఱందలిన్ విమలలో
లాపాంగఁ గైకేయిని। త్యనరమ్యోన్నిద్ర భద్ర పూర్ణసద్గుణసముద్రన్ భద్ర నత్యుగ్రనా। వనజాతాక్షుఁడు పెండ్లియాడె నన
హితత్రాతంబు భీతిల్లఁగన్ ॥ మఱియును ॥చ॥ అమరులఁ బాఱఁదోలి భుజగాంతకుఁడై నఖగేశ్వరుం డముం। న్నమృతముఁ దె
చ్చుకైవడిను దాంధుల రాజులను గడంచి యా। కమలదళాయతేక్షణుఁడు గైకొని తెచ్చెను మద్రకన్యకన్। సమదమృగే
క్షణన్నయవిచక్షణ లక్షణఁ బుణ్యలక్షణన్ ॥వ॥ ఇట్లు హరికి రుక్మిణియు, జాంబవతియు, సత్యభామయుఁ, గాళిందియు, మిత్ర
విందయు, నాగ్నజిత్తియు, భద్రయు, మద్రరాజనందనయైన లక్షణయు, ననంగ నెనమండ్రు భార్యలైరి - మఱియు నరకాసు

॥ శ్రీకృష్ణుఁడు - సత్యభామతోఁగూడి - మురాసుర - నరకాసురుల వధించుట. ॥

రుని వధియించి తన్నిరుద్ధకన్యలసహస్రసంఖ్యల రోహిణి మొదలైనవారిం బరిగ్రహించె ననిన విని ॥క॥ ధరకుం బ్రియనదం
నుఁడగు। నరకుని హరి యేల చంపె నరకాసురుఁడా। వరకుంతలలగు చామీ। కరకుంభస్తనుల నేల కారలఁ బెట్టెన్ ॥వ॥ అనిన న
రేంద్రునకు మునీంద్రుండిట్లనియె నరకాసురుని చేత నదితికర్ణకుండలంబులును, వరుణఛత్రంబును, మణిపర్వతమనియెడు
నమరాద్రిస్థానమును గోలుపడుటయు, నింద్రుండు వచ్చి హరికి విన్నవించిన హరి నరకాసురవధార్థంబు గరుడవాహనారూ
ఢుండై చను సమయంబున హరికి సత్యభామ యిట్లనియె ॥శా॥ దేవా నీవు నిశాటసంఘములను దీపించి చెండాడనీ। ప్రావీణ్యం
బులు చూడఁ గోరెదఁ గదా ప్రాణేశ మన్నించినన్। నీ వెంటం గొనిపొమ్ము నేఁడు గరుణన్ నే జూచియే తెంచెదన్। దేవీసంహతికె
ల్లఁ జెప్పంగ భవదీప్తప్రతాపోన్నతుల్ ॥ అనినఁ బ్రాణవల్లభకు వల్లభుండిట్లనియె ॥సీ॥ సమదపుష్పంధయఝుంకారములు
గావు భీషణకుంభీంద్రబృంహితములు। వాయునిర్గతపద్మవనరేణువులు గావు తురగరింఖాముఖోద్ధూతరజము। లాకీర్ణజలత
రంగాసారములు గావు శత్రుధనుర్ముక్తసాయకములు। కలహంససారసకాసారములు గావు దనుజేంద్రసైన్యకదంబకము
లు। కమలకల్హారకుసుమసంఘములు గావు। చటులరిపుశూలఖడ్గాదిసాధనములు। కన్య నీ వేడ రణరంగగమన మేడ। వత్తు వేగ
మనిలువుము వలదు వలదు ॥వ॥ అనినం బ్రియునకుఁ బ్రియంబు జనియింప డగ్గఱి ॥ఉ॥ దానవులైన నేమి మఱి దైత్యసమూహ
ములైన నేమి నీ। మానితబాహుదుర్గముల మాటుననుండఁగ నేమి శంక నీ। తో నరుదెంతు నంచుఁ గరతోయజముల్ ముకుళించి
మ్రొక్కె నా। మ్మానిని దన్ను భర్త బహుమానపురస్సర దృష్టిఁ జూడఁగన్ ॥ వ ॥ ఇట్లు తనకు మ్రొక్కిన సత్యభామను
గరకమలంబులం గ్రుచ్చియెత్తి తోడ్కొని గరుడారూఢుండై హరి గగనమార్గంబునం జని గిరిశస్త్రసలిలదహనపవన
దుర్గంబై మురాసురపాశపరివృతంబైన ప్రాగ్జ్యోతిషపురంబు డగ్గఱి ॥ మ ॥ గదచేఁ బర్వతదుర్గముల్ సకలముల్ లావించి సత్తే
జిత। ప్రదరశ్రేణుల శస్త్రదుర్గచయము లంఘించి చక్రాహతిన్। జెదరన్వాయుజలాగ్నిదుర్గముల నిశ్శేషంబులం
జేసెఁ దా। ప్రమదుఁడై వాలునం ద్రుంచెఁ గృష్ణుఁడు మురప్రచ్ఛన్నపాశంబులన్ ॥ మఱియును ॥ శా ॥ ప్రాకారంబుగ
దాప్రహారములను త్రొప్పటించి దియంత్రంబులన్। నాకారాతుల మానసంబులను ఖిన్నత్వంబు నొందించి నా। స్తోకాకారుఁడు
శౌరి యొత్తె విలయోద్ధూతాభ్రనిర్ఘోషరే। ఖాకారిన్యముఁ బాంచజన్యము విముక్తప్రాణిచైతన్యమున్ ॥వ॥ అంతలయకాల
కాలాభ్రగర్జనంబు పగిది నెప్పున మ్మహాధ్వని విని పంచశిరుండైన మురాసురుండు నిదుర సాలించి యావులించి నీల్గి లేచి జ
లంబులు వెడలి వచ్చి హరిం గని ప్రళయకాలకీలికైవడి మండుచు దుర్నిరీక్ష్యుండై కరాళించుచు దనపంచముఖంబులం బం
చభూతమయుండై లోకంబులు మ్రింగ నప్పళించు చందంబునం గదిసి యాభీలకీలచ్ఛటాజాలంబగు శూలంబున గరుడుని

* శశకంబులు కుందేళ్లు.

వైచి భానభోంతరంబులు నిండ నార్చుచు॥ క॥ మురమురఁ బరువిడి బిరుసున। హరిహరి నిలునిలువు మనుచు నసురయుఁ గదిసె౯। స్మరమురదివిజులహృదయము। మెరమెరయిదె యడఁగుననుచు మెఱసెఁ హరియు౯॥ అప్పుడు॥ క॥ గరుడుని పైఁబడవచ్చిన। మురశూలము నడుమ నొడిసి ముత్తునియలుగాఁ। గరముల విరిచి ముకుందుఁడు। మురముఖముల నిశితవిశిఖములు వడిఁ జొనిపె౯॥ మ॥ గదద్రే సెన్మురదానవుండు హరిపైఁ గంసారియుం దగ్గద౯। గదచేఁ ద్రుంచి సహస్రభాగములుగాఁ గల్పించె నాలోన వాఁ। డెమతైహస్తములెత్తి కొంచు వడిరా నీక్షించి లీలాసమ। గ్రదశన్యాని శిరంబులై దునువడి ఖండించెఁ జక్రాహతి౯॥ వ॥ ఇట్లు శిరంబులు చక్రిచక్రధారాచ్ఛిన్నంబులైన వజ్రివజ్రధారాదళితశిఖరంబై కూలెడి శిఖరిచందంబున మురాసురుండు జలంబులందుఁ గూలిన వాని సూనులు జనకవధజనితశోకాతురులై జనార్దను మర్దింతుమని *రణకుర్దనంబునఁ దామ్రుండు, నంతరిక్షుండు, శ్రవణుండు, విభావసుండు, వసుండు, నభస్వంతుండు, నరుణుండు, నన నేడ్వురు మోఘులు సక్రోధులై కాలాంతకచోదితంబైన ప్రళయపవనసప్తకంబు భంగి నరకాసురప్రేరితులై రయంబునఁ బీఠుండను మెడుదండనాథుం బురస్కరించికొని పఱతెంచి హరిం బాఁకి శరశక్తిగదాఖడ్గకరవాలశూలాదిసాధనంబులు ప్రయోగించిన॥ ఉ॥ ఆదను జేంద్ర మోఘవివిధాయుధసంఘము నెల్ల నుగ్రత౯। మేదినిఁ గూల నేయుచు సమిద్ధనిరర్గళమార్గణాళిఁ గ్ర। వ్యాదకులాంతకుం డసురహస్తభుజాననకంఠజానుజం। ఘాములఁ ద్రుంచివైచెఁ దిలలంతలఖండములై యిలం బడ౯॥ వ॥ మఱియు హరిశరజాలచక్రనిహతులై తనవారలు మడియుటకు వెఱంగుపడి రోషించి గరుడగమనుని దూషించి తన్ను భూషించుకొని సరకుసేయక నరకుండు వరకుండలప్రముఖాభరణభూషితుండై దానసలిలధారాసిక్తగండంబులును, మహోద్దండశుండాదండవేదండంబులు దండతండంబులై నడువ వెడలి భండనంబునకుం జని॥ మ॥ బలవంతుండు ధరాసుతుండు గనెశుంభద్రాజబింబోపరి। స్థలశంపాన్విత మేఘమో యన ఖగేంద్రస్కంధపీఠంబుపై। లలనారత్నముఁ గూడి సంగరకథాలాపంబులం జేయును। జ్జ్వలనీలాంగు‡ఁ గనన్నిషంగుఁ గుహనాచంగు౯ రణాభంగుని౯॥ వ॥ కని కలహంబునకు నరకాసురుండు గహకింపందమకింపక విలోకించి సంభ్రమంబున॥ శా॥ § వేణిన్జొల్లెము వెట్టి సంఘటితనీవీబంధయై భూషణ। శ్రేణిం దాల్చి ముఖేందుమండ

## ⟶ సత్యభామ నరకాసురునితో యుద్ధంబు చేయుట. ⟵

లనరీచీజాలముల్వర్వఁగాఁ। బాణిం బయ్యెదఁ జక్కఁగాఁ దుఱిమి శుంభద్వీరసంరంభయై। యేణీలోచన లేచి నిల్చెఁ దన ప్రాణేశాగ్రభాగంబున౯॥ క॥ ‖జన్యంబున దనుజుల దొ। ర్జన్యములుడుపంగఁ గోరి చనుదెంచిన సా। జన్యవతిఁ జూచి యమరాజన్యశ్రేష్ఠుండు సరసనల్లాపముల౯॥ క॥ లేమా దనుజులఁ గెలువఁగ। లేమా నీ వేలఁ గడఁగి లేచితివిటు రా। లేమానుమాన వేనియు। లేమా విల్లందికొనుము లీలం గేల౯॥ అనిపలికి॥ క॥ హరిణాక్షికి హరి యొసఁగెను। సురనికరోల్లాసనమును ఘోరకఠోరా। సురసైన్యత్రాసనమును। బరగర్వనిరాసనమును బాణాసనము౯॥ శా॥ ఆవిల్లంది బలంబు నొందితపగణ్యానంతతేజోవిశే। షావిర్భూతమహాప్రతాపమున వీరాలోకనుర్లోక్యమై। తా వేగన్నగుణంబు చేసె ధనువుం దన్వంగి దైత్యాంగనా। గ్రీవాసంఘము నిగ్గుణంబుగ రణక్రీడామహోత్కంఠతో౯॥ క॥ నారి మొరయించె రిపుసే। నారింఖణహేతువైన నాథము నిగుడ। న్నారీమణి బలసంప। న్నారీభాదికము మూర్ఛనందన రేంద్రా॥ సీ॥ సౌవర్ణకంకణఝణఝణనినదంబు శింజినీరవముతోఁ జెలిమి సేయఁ। దాటంకమణిగణ ధగధగద్దీప్తులు గండమండలరుచుల నప్పికొనఁగ। ధవళతరాపాంగధళధళరోచులు బాణజాలప్రభాపటలి నడఁప। శరపాతఘుమఘుమశబ్దంబు పరిపంథిసైనికకలకలస్వనములుడుప। వీరశృంగారభయరౌద్రవిస్మయములు। గలసి భామిని యొప్పె నో కాక యనఁగ। నిముడుఁ దొడుగుట దివుచుట యేయుటెల్ల। నెఱుఁగరాకుండ సనిఁ జేసె నిందువదన॥ మ॥ పనుఁ జూచున్ వైరుఁ జూచు నొంపన లరింప౯ రోషరాగోదయా। విరత భ్రూకుటిమందహాసములతో వీరంబు శృంగారము। న్జరగన్ నున్నలఁ గెంపుసొంపు బరగన్ జండాస్త్రసందోహము౯। సరసాలోకసమూహము న్నెరపుచు౯ జంద్రాస్య హేలాగతి౯॥ మ॥ అలినీలాలక చూడనొప్పె నగేం¶ప్రత్యాలీఢమానంబుతో। నలికస్వేదవికీర్ణకాలకలతో నాకర్ణకాసీత సల్లలితజ్యానఖపుంఖదీధితులతో లక్ష్యావలోకంబుతో। వలయాకారధనుర్విముక్తవిశిఖవ్రాతాహతారాతియై॥ సీ॥ బొమ్మపెండ్లిండ్ల [illegible]బో నెల్లనను బాలరణరంగమున కెట్లు రాఁదలంచె। నుగవారిఁ గనినఁ దావఁ బుఁగుఁ జేరెడు నింతి పగవారి గెల్వ నేపగిదిఁ జా[illegible]లె। బసిఁడియుయ్యాల లెక్కఁ భయమందు భీరువు ఖగపతిస్కంధమేక డిది నెక్కె। సఖులకోలాహలస్వనము

---

*రణకుర్దనమున౯। యుద్ధవిలాసముచేత. ‡కనన్నిషంగు౯। ప్రకాశమానములగు అంబులపొదలుగల. కుహనాచంగు౯। మహామాయావి యయిన. § వేణి[illegible]ల్లెము వెట్టి। జడను ముడిగా నమర్చి. ‖జన్యంబున౯। యుద్ధమునందు. ¶ లేమానుమాన వేయనుచోట – వేమానుమాన వేయని యొకపాఠముఁ గలదు. ** రింఖణ। చలనమునకు. ¶ప్రత్యాలీఢము। ఎడమకాలు ముందరికిఁ జాఁచి నిలుచుట.

‘లోర్వినికన్యపటహభాంకృతుల కెబ్బంగినోర్చె। నీలకంఠములకు నృత్యంబుఁగలుపుచు। నలసితలఁగిపోవు నలరుబోఁడి। యే విధమునను౦డె నెలమిఁ జేనాలీఢాది। మానములను రిపులమానమడఁప॥ సీ॥ పిణెఁజక్కఁగఁబట్టవెరవెఱుంగనికొమ్మ బాణాసనంబెస్లుపట్టనేర్చె। మ్రాఁకునఁదీఁగెఁగూర్పంగ నేరనిలేమ గుణము నేక్రియ ధనుష్కోటిఁగూర్చె। సరసముత్యముగ్రువ్వఁజాలనియబల యే నిపుణత సంధించె నిశితశరముఁ। జిలుకకుఁబద్యంబు చెప్ప నేరని తన్వి యస్త్రమంత్రము లెన్నఁడభ్యసించెఁ। బలుకుమనినఁబెక్కుపలుక నిముగుదయే। గతినొనర్చె సింహగర్జనములు। ననఁగ మెఱసెఁద్రిజగదభిరామగుణధామ। చారుసత్యభామ సత్యభామ॥ శా॥ జ్యావల్లీధ్వనిగర్జనంబుగసురల్పారంగయూథంబుగా। నావిల్లింద్రశరాసనంబుగసరోజాక్షుండు మేఘంబుగాఁ। దావిద్యుల్లతభంగినింతిసురజిహ్వాపాగ్నినుగ్నంబుగాఁ। బ్రావృట్కాలము సేసె బాణచయమంభశ్శీకరశ్రేణిగాన్॥ సీ॥ రాకేందుబింబమై రవిబింబమై యొప్పునీరజాతేక్షణ నెమ్మొగంబు। కందర్పకేతువై ఘనధూమకేతువైయలరుపూఁబోఁడి చేలాంచలంబు। భావజుపరిధియై ప్రళయార్కుపరిధియై మెఱయునాకృప్తమై మెలఁతచాపము। మృతప్రవాహమై యనలసందోహమైతనరారు నింతి సందర్శనంబు। హర్షదాయియై మహారోషదాయియై। పఱచుముద్గరాలిబాణవృష్టి। హరికి నరికిఁజూడ నందంద శృంగార। వీరరసములోలి విస్తరిల్ల॥ ఇవ్విధంబున॥ క॥ శంపాలతాభ బెడిదపుఁ। టంపఱచే ఘోరదానవానీకంబుల్। పెంపరి సన్నాహంబుల। సొంపరిభూసుతుని వెనుకఁజొచ్చె న్విచ్చెన్॥ వ॥ అయ్యవసరంబునంగంనసంహారిమనోహారిణిం జూచి సంతోషకారియుం గరుణారసావలోకనప్రసారియు మధురవచనసుధారసవిసారియుందదీయసమరసన్నాహ నివారియునై యిట్లనియె॥ క॥ కొమ్మా దానవనాథుని। కొమ్మా హవమునకుఁదోలఁ గెగురువిజయమ్మున్గై। కొమ్మా మెచ్చితి నిచ్చెదఁ। గొమ్మాభరణములు నీవుగోరిన వెల్లన్॥ వ॥ అనిపలికి సమ్మానరూపంబులును, మోహనదీపంబులును, మూరీకృతచిత్తవిక్షేపంబులు నైన సల్లాపంబులం గళావతిం దద్దయుఁ బెద్దరికంబు చేసి తత్కరకిసలయోల్లసితబాణాసనంబు మఱలనందుకొని యెనప్పుడు సురవైరి మురవైరికిట్లనియె॥ క॥ మగువ మగవారి ముందఱ। మగతనములు సూపరణమ్ముమానుట నీకున్। మగతనము గాదు దనుజుల। మగువలదెసఁ జనరు మగలమగలసుట హరీ॥ అనిన హరి యిట్లనియె॥ క॥ నరకా ఖండించెద మత్కరకాండాసనవిముక్తఘనశరముల భీ। కరకాయు నిన్ను సురకి। న్నరకాంతలు సూచి నేఁడు సందముఁబొందన్॥ అని పలికి హరి నరకాసుర యోధలమీఁద శతఘ్నియను దివ్యాస్త్రంబు ప్రయోగించిన నొక్కవరుసను వారలందఱు మహావ్యథం జెందిరి మఱియును॥ మ॥ శరవిచ్ఛిన్నతురంగమై పటుగదాసంభిన్నమాతంగమై। యుర్వుచక్రాహతవీరమధ్యపదబాహుస్కంధముఖ్యాంగమై। సురభిత్సైన్యము దైన్యముం బొరయుచున్ శోషించి సైన్యంబుతో। హరి మ్రోలన్నిలువంగ లేక పఱచె న్నాహా నినాదంబులన్॥ అప్పుడు॥ గీ॥ మొనసి దనుజయోధముఖ్యులు నిగుడించు। శస్త్రసముదయములు జనవరేణ్యు। మురహరుండు వరుసమూఁడేసి కోలల। ఖండితంబు చేసెఁ గదనమందు॥ క॥ వెన్నునిసత్యను మోచుచుఁ। బన్నగబదనఖరచంచుపక్షాహతుల। న్ఛిన్నములు సేసె గరుడుఁడు। పన్ని నగజసముదయముల బౌరవముఖ్యా॥ వ॥ మఱియు విహగరాజపక్షవిక్షేపణసంజాతవాతంబును సైరింపంజాలక హతశేషంబైన సైన్యంబు పురంబు సొచ్చుటఁ జూచి నరకాసురుండు మున్ను వజ్రాయుధంబుం దిరస్కరించినఁ దనచేతిశక్తిం గొని గరుడుని వైచిన నతండును విరులదండ వ్రేటునఁ జలింపని మదోద్దండంబగు వేదండంబునుం బోలి విలసిల్లె నయ్యవసరంబున గజారూఢుండై కలహరంగంబున॥ మ॥ సను దేభేంద్రము నెక్కి భూమిసుతుండా చక్రాయుధు న్వైవ శూలము చేఁ బట్టిన నంతలోన రుచిమాలాభిన్నఘోరాసురో। త్తమచక్రంబు గు చేతిచక్రమున దైత్యధ్వంసి ఖండించె ర। త్నమయోదగ్రవినూత్నకుండలసమేతంబై నతన్మూర్ధమున్॥ శా॥ ఇల్లాలింగిటియైన కాలమునము న్నేనంచు ఘోషింతువో। తల్లీ నిన్నుఁదలంచి రామైన నిచటం దన్నుం గృపం గావఁడే। చెల్లం బోతలఁద్రెంచె నంచు నిలనాక్షేపించు చందంబున। న్ద్రెళ్లెం జప్పుడు గాఁగ భూమిసుతుఁడు ద్దీప్తాహవక్షోణిపై॥ క॥ కంటిమి నరకుఁడు వడఁగా। మంటిమి నేఁడనుచు వెసనమర్త్యులు మునులు। న్మింటం బువ్వులు గురియుచుఁ। బంటింపక పొగడి రోలిఁ బద్మదళాక్షున్॥ వ॥ అంతట భూదేవి వాసుదేవుని డగ్గర నేతెంచి *జాంబూనదరత్న *మండితంబైన కుండలంబులును, వైజయంతియను వనమాలయును, వరుణదత్తంబైన సితచ్ఛత్రంబును నొక్క మహారత్నంబును సమర్పించి మ్రొక్కి భక్తితాత్పర్యంబులతోడం గరకమలంబులు ముకుళిం

## ❖ భూదేవి శ్రీకృష్ణుని స్తుతించుట. ❖

చి విబుధవందితుండును, విశ్వేశ్వరుండును నైన దేవదేవుని నిట్లని వినుతించె॥ సీ॥ అంభోజనాభునకంభోజనేత్రునకంభోజనిలయాసమన్వితునకు। నంభోజపదునకనంతశక్తికి వాసుదేవునకును దేవదేవునకును। భక్తులు గోరిన భంగి నేరూపైనఁ బొందు

* ఆలీఢ। కుడికాలు ముందరకుఁజాఁచి నిలుచుట. *జాంబూనద। బంగరు. మండిత। ప్రకాశించుచున్న.

వానికి నాదిపురుషునకును నఖిలనిధానమైయాపూర్ణవిజ్ఞానమైనవానికిఁ బరమాత్మునకును। ధాతఁ గన్న మేటి తండ్రికి నజు నికి నీకు వందనంబులే నెనర్తు। నిఖిలభూతరూపనిరుపమయిూశ పరాపరాత్మ మహితయమితచరిత॥ వ॥ దేవా నీవు లోకంబు లు సృజియించుటకు రజోగుణంబును, రక్షించుటకు సత్వగుణంబును, సంహరించుటకుఁ దమోగుణంబును, ధరియింతువు కాల మూర్తివి ప్రధానపూరుషుండవు పరుండవు నీవ నేనును వారియు వహ్నియు ననిలుండు నాకాశభూతతన్మాత్రలు నింద్రియం బులును, దేవతలును, మనంబును, గర్తయును, మహత్తత్వంబును, జరాచరంబైన విశ్వంబు నద్వితీయుండవైన నీయందు సం భవింతుము॥ చ॥ దయనిటుఁ జూడుమా నరకదైత్యునిబిడ్డఁడు వీఁడు నీ దెసన్। భయమున నున్నవాఁడు గడు బాలుఁడనన్యశర ణ్యుఁడార్తుఁడా। శ్రయరహితుం డుతండ్రి క్రియ శౌర్యము నేరఁడు నీపదాంబుజ। ద్వయిఁ బొడగాంచె భక్తపరతంత్ర సువీ క్షణదీనరక్షణా॥ వ॥ అనియిట్లు భూదేవి భక్తితోడ హరికి నమస్కరించి వాక్సుమంబులఁ బూజించిన నర్చితుండై భక్తవత్స లుండైన పరమేశ్వరుండు నరకపుత్రుండైన భగదత్తునకభయం బిచ్చి సర్వసంపదలొసంగి నరకాసురగృహంబు ప్రవేశిం

## శ్రీకృష్ణుఁడు పదాఱువేల కన్నియల వరించి దేవలోకమునకుఁ బోయి పారిజాతము దెచ్చుట.

చియుండు॥ ఉ॥ రాజకులావతంసుఁడు పరాజితకంసుఁడు సొచ్చి కాంచె ఘో। రాజులరాజులన్ బటుశరాహతి నొంచి ధరాత నూజుఁడు। తేజితశక్తిఁ దొల్లిఁ జెఱఁ దెచ్చిన వారిఁ బదాఱువేల ధా। త్రీజనమాన్యలన్ గుణవతీవ్రతధన్యల రాజకన్యలన్॥ మ॥ కనిరా రాజకుమారికల్ పరిమళత్కౌతూహలాక్రాంతలై। దనుజాధీశచమూవిదారుని నతమందారున్ శుభాకారునూ తనశృంగారువికారదూరుని సుగుణాధారున్ మృగీలోచనా। జనచేతోధనచోరు రత్నమకుటస్ఫారున్ మనోహారునిన్॥ వ॥ కని యతని సౌందర్య గాంభీర్య చాతుర్యాది గుణంబులకు మోహించి తమకంబులు జనియింప ధైర్యంబులు సాలించి సిగ్గులు వర్జిం చి పంచశరసంచలితహృదయలై దైవయోగంబున నంబరాయత్తంబులైన చిత్తంబుల నమ్మత్తకాశినులు దత్తరంబున మనో జుఁడుత్తలవెట్టన తండు తమకుఁ బ్రాణవల్లభుండని వరియించి॥ ఉ॥ పాపపు రక్కసుండు చెఱఁ బట్టెనటంచుఁ దలంతుమెప్పు డున్। బాపుఁడె వీనిధర్మపునఁ బర్మదశాతుకునిఁ గంటిమంచుము। నీ పురుషోత్తముం గదియ నేమి వ్రతంబులు చేసినార మో। యాపరమేష్ఠిపుణ్యుఁడు గదమ్మ హరిన్ మముఁ గూర్చెనిచ్చటన్॥ క॥ ఉన్నతి నీతఁడు గౌఁగిట। మన్నింపంగ నిన బ్రతుకు మానినిమనలో। ము న్నేమి నోము నోచెనొ। సన్నుతమార్గముల విపినజలదుర్గమ్ములన్॥ క॥ విన్నార మెయిూ చెలువముఁ గ న్నార మెయిట్టి శౌర్యగాంభీర్యంబుల్। మన్నారమింత గాలము। గొన్నారమె యెన్నఁడైనఁ గూరిమిచికురన్॥ సీ॥ వనజద ళాక్షి నేవైజయంతికనైనఁ గదిసి వ్రేలుదు గదా కంఠమందు। బింబోష్ఠి నేఘనపీతాంబరమునైన మెఱసియుండుదుఁ గదా మేనునిండఁ। గాంతాలలామ నేఁ గౌస్తుభమణినైన నొప్పచూపుదుఁ గదా యురమునందు। బాలికాతిలక నేఁ బాంచజన్యము నైన మొనసి చొక్కుదుఁ గదా మోవిఁ గ్రోలి। పద్మగంధి నేను బర్హదామమునైనఁ। జిత్రరుచులనుందు శిరమునందు। ననుచుఁ జెక్కుగతుల నాడిరి కన్యలు। గములుగట్టి గరుడగమనుఁ జూచి॥ శా॥ భూనాథోత్తమకన్యకల్ వరుస నంభోజాతనేత్రుండు న న్నేన వ్వేళ దగఁ జూచె డగ్గరి యెవర్ణించెన్ వివేకించె న। న్నానించెం గరుణించెఁ బేరడిగెన న్మార్గంబుతోఁ బెండ్లియా। నే నే చక్రికి ప్రియనంచుఁ దమలోన నిర్ణేతలై రందఱున్॥ వ॥ అని బహువిధంబులం బమతమమన్ననలకునువ్విళ్లూరు కన్నియలం బదా ఱువేల ధవళాంబరాభరణమాల్యానులేపనంబులనొసంగి యందలంబులనిడి వారల నరకాసురభాండాగారంబులం గల నానావిధంబులైన మహాధనంబులను, రథంబులను, తురంగంబులను, ధవళంబులై వేగవంతంబులైయైరావతకులసంభ వంబులైన చతుర్దంతదంతావళంబులను, ద్వారకానగరంబునకుం బనిచి దేవేంద్రునిపురంబునకుం జని యదితి దేవి మందిరం బు సొచ్చి యా పెద్దమ్మకు మ్రొద్దు సూపి మణికిరణపటలపరిభావితభానుమండలంబులైన కుండలంబులొసంగి శచీసమేతుం డైన మహేంద్రునిచేత సత్యభామతోడం బూజితుండై పిదప సత్యభామ గోరిన నందనవనంబు సొచ్చి॥ మ॥ హరి కేలం బెక లించి తెచ్చి భుజగేంద్రారాతిపైఁ బెట్టెసుం। దరగంధానుగతభ్రమద్భ్రమరనాదవ్రాతముం బల్లవాం। కురశాఖాఫలపర్ణ పుష్పకలికాసుచ్ఛాదికోపేతమున్। గిరిభిత్త్రాతముఁ బారిజాతముఁ ద్రిలోకీయాచకాఖ్యాతమున్॥ వ॥ ఇట్లు పారిజాతమ్ము హరియించి యదువల్లభుండు వల్లభయుం దానును విహగవల్లభారూఢులయి చనుచున్న సమయంబున॥ సీ॥ నరకాసురుని జా ధనలఁగి గోవిందునికడ కేగి తత్పాదకమలములకుఁ। దనకిరీటము సోఁక దండప్రణామముల్గావింప నాచక్రి కరుణఁ జేసి। చను దెంచి భూసుతు సమయించి తనవారిఁ దన్ను రక్షించుటఁ దలఁపఁ డది। యింద్రుండు బృందారకేంద్రత్వమదమునఁ బన్న లోచనపోకు పారిజాతతరువు విడువుమనుచుఁ డాఁకె నడ్డము వచ్చి। తలిమి సురలు నట్లు దాఁకిరకట। మొఱకు వలదె స్వర్గ క్రతఁ గాల్ప నే। సురలతామసమును జూడ సరిది॥ వ॥ ఇట్లు తనమనోద్ధారించియడ్డంబువచ్చిన నిర్జరేంద్రాదుల నిర్జించి తనపు

రంబునకుం జనినిరంతరసురభికుసుమమకరందమాధురీవిశేషంబులకుం జొక్కి చిక్కక నాకలోకంబుననుండి వెంటనరుగు
దెంచుతుమ్మెదలకు నెమ్మిదలంచుచున్న పారిజాతమనాశ్రితపారిజాతుండై నహరిమహాప్రేమాభిరామయగు సత్యభా
మతోం గ్రీడించు మహోద్యానంబున సంస్థాపించి నరకాసురునియింటం దెచ్చిన రాజకన్యకలెండలిందఱకు నన్నినివాసం
బులుగల్పించి గృహోపకరణంబులు సమర్పించి॥ చ॥ అమితవిహారుఁడీశ్వరుఁడనంతుఁడు దానెక నాఁడు మందిలగ్నమునఁ
బదాఱువేలభవనంబులలోనఁ బదాఱువేలరూపములఁ బదాఱువేలనృపబాలలఁ బ్రీతిఁ బదాఱువేలచందములవిభూతినొం
దుచు యథావిధితో వరియించె భూవరా॥ ఉ॥ దానములందు సమ్మదవిధానములందవలోకభాషణాహ్వానములందు నొక్క
క్రియనాలలితాంగులకన్ని మూర్తులై। తానని శంబుగానఁబడితక్కువయెక్కువ లేకయుత్తమజ్ఞానగృహస్థధర్మమునఁజ
క్రమించెఁబ్రపూర్ణకాముఁడై॥ క॥ తరుణులు పెక్కండ్రైనను। బురుషుఁడు మానలేఁడు సవతిపోరాటమునన్। హరియాప
దాఱువేవురు। తరుణులతో సమతమనియెఁ దత్వమునన్॥ శా॥ ఎన్నే భంగుల యోగమార్గముల బ్రహ్మేంద్రాదులీక్షించు
చున్నన్నే దేవునిఁ జూడఁగానక తుదిన్మోహింతురా మేటికే। విన్నాణంబున నోసతుల్గృహిణులై విఖ్యాతి సేవించిరి। చ్ఛి
న్నాలోకనహాసభాషణరతిశ్లాఘానురాగంబులన్॥ సీ॥ ఇంటికి వచ్చిన నెదురేఁగుదెంచుచు నాసీతవస్తువులందుకొనుచు।
సౌవర్ణమణిమయాసనములు వెట్టుచుఁ బదములు గడుగుచు భక్తితోడ। సంవాసితస్నానజలములందిచ్చుచు సద్గంధవస్త్ర
భూషణములొసఁగి। యిష్టపదార్థంబులిడుచుఁ దాంబూలాదులొసఁగుచు విసరుచు నోజమెఱసి। శిరము దువ్వుచు శయ్య
పైఁ జెలువుమిగుల। నడుగులొత్తుచు దాసీసహస్రయుక్త। లయ్యుఁ గొలిచిరి దాసలై హరిను దారుఁ। దారకాధిపవదనలుదా
రుదగిలి॥ శా॥ నన్నే పాయఁడు రాత్రులన్ దివములన్నన్నే కృపం జెందెడి। న్నన్నే దొడ్డుగఁ జూచు వల్లభలలో నాథుండునా
యింటనే। యన్నాఁడంచుఁ బదాఱువేలుదమలో నూహించి సేవించిరా। యన్నుల్గాఢపతివ్రతాత్వపరిచర్యాభక్తియో
గంబులన్॥ క॥ ఆరామలతో నెప్పుడుఁ। బోరాములు చాల నెఱపి పురుషోత్తముఁడు। న్గారామునఁ దిరిగెను సా। ధారామలతా
సరోవిహారములన్నృపా॥ క॥ ఏ దేవుఁడు జగములను। త్పాదించును మనుచుఁ జెఱుచుఁ బ్రాభవమున నమ। ర్యాదారతుఁ

## శ్రీకృష్ణుండు కేళీగృహమునందు రుక్మిణీదేవితో విరసోక్తులాడుట.

మనకై। యాదేవుండట్లు మెఱసెయాదవులందున్॥ వ॥ అంత నొకనాఁడు రుక్మిణీదేవిలోఁగిట మహేంద్ర నీల
మరకతాది మణిస్తంభవలభివిటంకపటలీ దేహళీకవాటవిరాజమానంబును, శాతకుంభకుడ్యగవాక్షవేదికాసోపానం
బును, విలంబమానముక్తాఫలదామవిచిత్రకౌశేయవితానంబును, వివిధమణిదీపికావిసరవిభ్రాజమానంబును, మధుక
రకులకలిత మల్లికాకుసుమమాలికాభిరామంబును, జాలకరంధ్రనిర్గత కర్పూరాగరుధూపధూమంబును, వాతాయ
నవిప్రకీర్ణశిశిరకరకిరణస్తోమంబును, పారిజాతప్రసవామోదపరిమిళితపవనసుందరంబునయిన లోపలిమందిరంబున,
శరచ్చంద్రచంద్రికాధవళపర్యంకమధ్యంబున, జగదీశ్వరుండయిన హరి సుఖాసీనుండయియుండ సఖీజనంబులుం దా
నును డగ్గరి కొలిచియుండె॥ సీ॥ కుచకుంభములమీఁది కుంకుమతోరాయు హారంబులరుణంబు లగుచు మెఱయఁ।
గరపల్లవము సోఁచి కదలింపఁ నంగుళీయకకంకణప్రభలావరింపఁ। గదలిన బహురత్నకలితనూపురముల గంభీరనినదంబు
గడలుకొనఁగఁ। గాంచనమణికర్ణికామయూఖంబులు గండపాలికలపైఁ గంతులిడఁగఁ। గురులునర్తింపఁ బయ్యెద కొంగు దూ
గ। బోఁటిచేనున్న చామరఁ బుచ్చుకొనుచు। జీవితేశ్వరు రుక్మిణి చేరనరిగి। వేడ్కలిఁ గరొత్తమెల్లన వీవఁ దొడఁగె॥ అప్పుడు॥
ఉ॥ పతియే రూపము దాల్చినన్ దదనురూపంబైన రూపంబుతో। సతి తానుండెడునా సురూపవలినాచంద్రాస్యనాలక్ష్మినా।
సుతనున్ రుక్మిణినాయనన్యమతినాశుద్ధాంతరంగంగళా। చతురత్వంబున శౌరి యిట్లని యెఁ జంచన్మందహాసంబుతోన్॥
మ॥ బలశౌర్యంబుల భోగమూర్తికులరూపత్యాగసంపద్గుణం। బులదిక్పాలురకంటెఁ జైద్యముఖరుల్పార్థివుల్ నుల్వారికిన్।
నెలఁతా తల్లియుఁ దండ్రియున్నహజుఁడున్నిన్నిచ్చినం బోకయి। బలవద్భీరుల వార్థిలీనుల మముం జాటింపనీకేటికిన్॥
సీ॥ లోకులనడువడిలోనివారము గాము పరులకు మా జాడ బయలుపడదు। బలమదోపేతులు పగఁగొందు రమ్మాతోడ రాజపీఠ
ములకు రాము తలఁచు। శరణంబు మాకు నీజలరాశి సతతంబు నిష్కించనుల మేము నిధులు లేవు। కలవారు చుట్టాలుగారు నిష్కిం
చనజనబంధులము ముక్తసంగ్రహులము। గూఢవర్తనుల ముగుణహీనుల ము భిక్షుల। లైనవారిఁగాని నాశ్రయింప। మిం
ముమఖులుదగులరిటువంటి మముఁబోఁటి। వారి నేలఁ దగులవారిజాక్షి॥ క॥ సిరియును వంశము రూపును। సరియైన వివాహస
ఖ్యసంబంధంబు। ల్జరుగును సరిగాకున్నను। జరుగవు లోలాక్షి యెట్టిసంసారులకున్॥ క॥ తగదని మెఱుఁగవు మమ్మున్। దగిలి
తిపివృగాక్షి దీనఁ దప్పగు నీకుం। దగినమను జేంద్రు నొక్కనిఁ। దసులుము గుణహీనజనులఁ దగు నేతసులన్॥ సీ॥ సాల్వజరాసం

థమైద్యాదిరాజులు చెలఁగినిన్నీక్షింప మలయుచుండు। రదిగాక రుక్మిణీయన్నయు గర్వించి వీర్యమదాంధుఁడై వెలయుచు న్న। వారిగర్వంబులు వారింపఁదలఁచి గోరి చెలువ నిన్నోడిచి తెచ్చితిమి గాని। కాంతాతనూజార్థకాముకులము గాము కామ మోహాచులఁ గ్రందుకొనము। వినుము దాసీనులము క్రియావిరహితులము। పూర్ణులము మేము నిత్యాత్మబుద్ధితోడ। వెలుఁగు చుందుము గృహదీపవిధము మెఱసి। నవలతాతన్వి మాతోడ నవయవలము॥ వ॥ అని యిట్లు భగవంతుండైన హరిదన్నుఁ బాయక సేవించు ప్రియురాలిం బట్టపుదేవి ననియెడి రుక్మిణీదర్పంబు నేర్పున సంహరించి యాగకుండిన నమ్మానవతియ ప్రియంబులును గౌరవంబులును పూర్వకంబులునైన మనోవల్లభు మాటలు విని దురంతంబైన చింతాభరంబున సంతాపంబు నొందుచు॥ సీ॥ కాటుక నెఱయంగఁ గన్నీరు వరదలై కుచకుంభయుగళకుంకుమము దడియ। విడివడి వెడలెడి వేడినిట్టూర్పుల లాలితాధరకిసలయము గందఁ। జెలువంబు నెఱిదప్పి చిన్నవోవుచునున్న వదనారవిందంబు వాడుదోఁప। మారుతాహతిఁ దూలు మహితకల్పకవల్లి వడువున మేన్వడవడవడంకఁ। జిత్తమెరియంగఁ జెక్కిటఁ జెయ్యిఁ జేర్చి। కౌతుకంబేది పదతలాగ్రమున నేల। వ్రాసి పెంచుచు మోనురవాంచి వగలఁ। బొందె మవ్వంబు గందిన పువ్వుబోఁడి॥ చ॥ అలికులవేణి తన్ను విభుఁడాడిన యప్రియభాషలి మ్మెయిన్। సొలవక కర్ణరంధ్రముల సూదులు చొన్పినరీతి నాత్మ బెబ్బులి రొదవిన్న లేడిక్రియఁ బొల్పఱి చేష్టలు దక్కి నేలపై। వలనరి వ్రాలెఁ గీలెడలి వ్రాలిన పుత్తడిబొమ్మకైవడిన్॥ ఇట్లు వ్రాలిన॥ మ॥ ప్రణుతామ్నాయుఁడు కృష్ణుఁ డంతఁ గదిసెన్ బాష్పావరుద్ధారుణేక్షణి విస్రస్తవినూత్నభూషణి మహారూక్షక్రూర నారాచశోషణి నాలింగితధారుణిన్ నిజకులాచారైకసద్ధర్మచారిణి విశ్లేషిణి వీతతోషిణిఁ బురంధ్రీగ్రామణిన్ రుక్మిణిన్॥ సీ॥ కని సంభ్రమంబునఁ దనువునం దనువుగా ననువునఁ జందనం బల్లనలఁది। కన్నీరు పన్నీటఁ గడిగి కర్పూరంపుపలుకులు చెవులలోఁ బాటనూది। కరమొప్పు ముత్యాలసరులు చిక్కువడలించి యురమునఁ బొందుగా నూలుకొలిపి। తిలకంబు నునుఫాలఫలకంబుపైఁ దీర్చి వదలిన భూషణావలులు దొడిగి। కమలదళచారుతాలవృంతముల విసరి। పాలుచు పయ్యెద కుచములఁ బొందుపఱచి। చిత్తమిగురొత్త నెయ్యాన సేదఁదేర్చి। బిగియఁ గౌఁగిటఁ జేర్చి నెమ్మొగము నిమిరి॥ గీ॥ నెఱులు గలమారు నీలంపుటురుల సిరుల। వరులు గొనఁ జాలి నరులను మరులు గొలుపు। నిరుల గెలిచిన తుమ్మెదగముల దెగడు। కురులను లిదీర్చి విరులిడి కొప్పువెట్టి॥ క॥ మురసంహరుఁ డిందిందిర। గరుదనిలచలత్ప్రసూనకలికాంచితసుందరశయ్యఁ జేర్చె భీష్మక। వరపుత్రిన్ నుతచరిత్రి వారిజనేత్రిన్॥ వ॥ ఇట్లు పానుపునం జేర్చి మృదు

## శ్రీ రుక్మిణీదేవి శ్రీకృష్ణలాలితయై-యతనిస్తుతించుట. శ్రీ

మధురభాషణంబుల ననునయించిన॥ క॥ పురుషోత్తమ ముఖకోమల। సరసిజ మయ్యెందువదన సవ్రీడాహో। సరుచిస్నిగ్ధాపాంగ। స్ఫురదవలోకనముల లాలయఁ జూచితగన నేన్॥ క॥ మురహర దివసాగమదర। దరవిందదళాక్ష తలఁపన దియెట్టిదగు। న్నిరవధికవిమలతేజో। వరమూర్తివి నీవ భక్తవత్సల యెందున్॥ గీ॥ సంతతజ్ఞానసుఖబలైశ్వర్యశక్తులాదిగాఁ గలసుగుణంబు లమరు నీకు। నేను దగుదునె సర్వలోకేశ్వరేశ। లీలమై సచ్చిదానందశాలివనఘ॥ సీ॥ రూఢి మైఁ బ్రకృతిపూరుషకాలములకు నీశ్వరుఁడవై భవదీయచారుదివ్య। లలితకళాకౌశలమున నభిరతుఁడై కడఁగు నీరూపమెక్కడ మహాత్మ। సత్త్వాదిగుణసముచ్చయయుక్తమూఢాత్మనైన నేనెక్కడ నఘచరిత। కోరి నీమంగళగుణభూతిదానంబు సేయంగఁ బకునని చెందుభీతి। నంబునిధిమధ్యభాగమం దమృతఫేనపటలపాండురనిభమూర్తి పన్నగేంద్ర। భోగశయ్యను బవ్వళించుచును దనరు। నట్టియున్నతలీలదివ్యంబు దలఁప॥ వ॥ శబ్దస్పర్శరూపరసగంధంబులనియెడు గుణంబులచేతం బరిగ్రహింపఁబడిన మంగళసుందరవిగ్రహుండవై యజ్ఞానాంధకారనివారకంబైన రూపంబుఁ గైకొని భవదీయులైన సేవకులకును భావ్యంబవై తిభవత్పాదారవిందమకరందరసాస్వాదలోలాత్ములైన యోగీంద్రులకైనను భవన్మార్గంబు స్ఫుటంబుగా దట్లగుటం జేసి యీమనుజపశువులకు దుర్విభావ్యంబగుట యేమి చెప్పనట్టి యీశ్వరుండవైన నీకు నిచ్ఛస్వతంత్రంబదియును, నాకధికంబుగావునని న్నే ననుసరింతు దేవా నీవకించనుండవై తేని బలిభోక్తలైన బ్రహ్మేంద్రాము లెవ్వనికొఱకు బలిసమర్పణంబు చేసిరి నీవు సమస్తపురుషార్థమయుండవనియును, ఫలస్వరూపివనియును, నీయందలి ప్రేమాతిశయంబులం జేసి విజ్ఞానదీపాంకురంబు ననిరస్తసమస్తదోషాంధకారులై యిహసౌఖ్యంబులు విడిచి భవదీయదాససంగమంబె కోరుచుందు రట్లు సేయనేరక నిజాధికారాంధకారమగ్నులై భవత్తత్త్వంబు దెలిసి బలిప్రక్షేపణంబులు సేయంజాలక మూఢులై సంసారచక్రంబునం బరిభ్రమింతు రదియునుంగాక॥ గీ॥ వరమునీంద్రయోగివరసురకోటిచే। వర్ణితప్రభావవైభవంబు। గలిగి యఖిలచేతనులకు విజ్ఞానప్రదుండవగుదు వభవదురితదూర॥ వ॥ దేవా భవదీయకుటిలభ్రూవిక్షేపోదీరితకాలవేగంబుచేత విధ్వస్తమంగళులగుకమలభవభవపాకశాసనాదులం దిరస్కరించినట్టి మదీయచిత్తంబున॥ చ॥ నినువరియించి నంబెలుచ నీరజలోచన శార్ఙ్గసా

యకా।సననినదంబులన్సకలశత్రుధరావతులజ్జయించి భో। రుచంబశుకోటిఁదోలుమృగరాజునిజాంశముభూరిశక్తిఁగై। కొనినవిధంబుననన్నునకుంఠితశూరతఁదెచ్చితీశ్వరా॥ ఉ॥అట్టినృపాలకీటములనాజినెదుర్పఁగలేనివానియ। ట్లొట్టినభీతిమైనిటుపయోధిశరణ్యుఁడవైతివింతయుఁగా। నెట్టనమాయగాకనివినిక్కము లేభవదీయభక్తులై। నట్టినరేంద్రమౌళిమణులంచితరాజఋషిమల్లుదంబునఁగా॥ గీ॥వితతరాజ్యగరిమవిడిచికాననములఁ। వాత్మలందుమీపదాబ్జయుగము। వలఁతిగాఁగనిలిపివాతాంబుపర్ణాశ।నోగ్రనియతులగుచునుంచురభవ॥ మ॥ విమలజ్ఞాననిరూఢులైనజనములీక్షింపమీపాదకం। జనురందప్పుటదివ్యసౌరభమునాస్వాదించినిర్వాణరూ।పమునత్పూరుషవాగుదీరితముశోభాశ్రీనివాసంబునౌ।మిము సేవింపకమానవాధమునిమర్మేధాంధు సేవింతునే॥ వ॥ మఱియును దేవాభూలోకంబునందును,నిత్యనివాసంబులందును, సకలప్రదేశంబులందును,జగదీశ్వరుండవైననిన్నునభిమతంబులైనకామరూపంబులుగైకొనివరియింతు భవదీయచరణారవిందమకరందాస్వాదనచాతుర్యభృంగిమైనకామినియతిహేయంబైన త్వక్శ్మశ్రురోమనఖకేశంబులచేతఁగప్పంబడియంతర్గతంబైన మాంసాస్థిరక్తక్రిమివిట్కఫపిత్తవాతంబుల భీభత్సంబైన నరాధముని మూఢాత్మయై కామించునేయదియునుంగాక॥ సీ॥ నీరదాగమమేఘనిర్ముక్తపయఃపానచాతకంబేసునేచాటిపడెకుఁ। బరిపక్వ*మాకందఫలరసంబులుగ్రోలుకీరముల్చనునెమత్తూరములకు। ఘనరవాకర్ణనోత్కలికమయూరముల్గోరునేకతీనఝిల్లీరవంబుఁ। గరికుంభపిశితసద్గ్రాసమోదితసింహమటుగునేశునకమాంసాభిలాషఁ। బ్రవిమలాకారభవదీయపాదపద్మ। యుగసమాశ్రయనైపుణోద్యోగచిత్త।మన్యుఁజేరునెతనకుపాస్యంబుగాఁగ। భక్తమందారదుర్భవభయవిదూర॥ క॥ వాసవవందితభవకమ।లాసనదివ్యప్రభావభావినియెపుడుఁగా।నీసమధికచారిత్రక।థాసురుచిరగానమవితథంబై చెల్లుఁగా॥ క॥ ధరణీనాథులుతమతము।వరవనితామందిరములవసియించుచుగో।ఖరమార్గాలములగతిఁగా।స్థిరబద్ధులగుదురునిన్నుఁదెలియనికతనఁగా॥ గీ॥ జలజనాభసకలజగదంతరాత్మవై।నట్టిదేవనీపదారవింద।యుగళిసానురాగయుక్తమైనామదిఁ।గలుగునట్లుగాఁగఁదలపుమనఘ॥ గీ॥ పృథురజోగుణప్రవృద్ధమైనట్టినీ।దృష్టిచేతనన్నుఁదేరుకొనఁగఁ।జూచుటెల్లఁబద్మలోచననామీఁది।ఘనదయార్ద్రదృష్టిగాఁదలంతు॥ వ॥ అదియునుంగాకమధుసూదననీవాక్యంబులుమిథ్యగావుతల్లివచనంబు మాఁతురికభిమతంబుగాదె యౌవనారూఢమదంబున స్త్రీస్వైరిణియగు కామిని పురుషాంతరాసక్తయగుటవిచారించిపరిజ్ఞానియైన వాఁడువిడుచునవివేకియయినపురుషుం డింద్రియలోలుండై రతిందగిలిదానివిడువనేరకపరిగ్రహించియుభయలోకచ్యుతుండగునట్లుగావున నీయెఱుంగనియర్థంబుగలదేయనివిన్నవించిన రుక్మిణీదేవివచనంబులకుఁగృష్ణుండు సంతసిల్లియిట్లనియె॥

## కృష్ణుండురుక్మిణీదేవినియారడించుట.

చ॥అలికులవేణినవ్వులకునాడినమాటలకింతనీమదిం। గలఁగఁగనేలవేఁటలనుగయ్యములఁగా రతులందునెవ్వఁగాఁ।బలికినమాటలెస్సలనిపట్టుమరే భవదీయచిత్తముం।దెలియఁగఁగోరినేఁబలికితిన్మదిలోనిటుగుందనేటికిఁగా॥అదియునుంగాక॥ఉ॥కిన్కలుముద్దుపల్కులును గెంపుకనుంగవలియ్యమోవియుఁగా। జంకెలుతేరిచూపు లెకసక్కెములున్నెలవంకబొమ్మలుం।గొంకకవీడనాడుటలుఁగూరిమియుంగలకాంతగూడుటల్ ।అంకిలిలేకజన్మఫలమబ్బుటగాదెకురంగలోచనా॥అనిమఱియునిట్లనియె॥ఉ॥నీవుపతివ్రతామణివినిర్మలధర్మవివేకశీలస।ద్భావవునీమనోగతులఁబాయకనెప్పుడునస్మదీయసం।సేవయకానియన్యముభజింపవుపుట్టిననాఁటనుండినీ।భావమెఱింగియుండియునుబల్కనతప్పునసహింపుమాననీ॥వ॥అని వెండియు, నిట్లనియెనీవాక్యంబులుశ్రవణసుఖంబులుగావించెనీవు వివిధంబులైనకామంబులుగోరితి వేనినవియన్నియును నాయందయుంటంజేసియేకాంతసేవాచతురవైననీకునవియన్నియు నిత్యంబులై యుండు నీపాతివ్రత్యంబును, నాయందలిస్నేహంబునతివిశదంబులయ్యెనావాక్యంబులచేతభవదీయచిత్తంబుచంచలంబుగాకనాయందులబుద్ధిదృఢంబగుంగావునసకలసంపద్విలసితంబైనద్వారకాదినగరదివ్యమందిరంబులందునీమభాగ్యంబునంజేసిసంసారికైవడినీయందుబద్ధానురాగుండనై వర్తింతుఁదక్కినప్రాణేంద్రియపరవశత్వంబునవికృతశరీరధారిణివైన సతినన్నుంజెంచుటముమ్మారంబదియునుంగాకమోక్షప్రదుండనైననన్నుంగామాతురలైయల్పమతులై వ్రతతపోమహిమలచేతదాంపత్యయోగంబుకై సేవింతురదియంతయునామాయావిజృంభితంబునమందభాగ్యలై నిరయంబునొందుదురట్లుగావుననీసమానంబైనకాంతయేకాంతలంగలదెనీవివాహకాలంబుననేకరాజన్యవర్యులఁగైకొనక భవదీయమధురాలాపశ్రవణాత్మకుండనైననాసన్నిధికన్యశరీరంబయోగ్యంబునీకుశేషంబై యున్నదాననని యేకాంతంబునంబ్రాహ్మణుంబుత్తెంచినయేనునుంజనుదెం

*మాకంద।మామిడిచెట్టు. ఉత్తూరము।ఉమ్మెత్తచెట్టు. ఝిల్లీరవంబు।చిమటరొద. స్త్రీస్వైరిణి।వ్యభిచారి. పిశిత।మాంసము. ఆర్ద్ర।చల్లని.

చినీపరిణయసమయంబున భవత్సహోదరుం బట్టి విరూపుం గావించిన నది గనుంగొనియును నాయందలి ప్రేమాతిశయం
బున నూరకుండితివి గావున బహుప్రకారంబులై వర్తించు నీ సద్గుణంబులకు సంతసింతు నని యివ్విధంబున దేవకీసుతుండు
నరలోకవిడంబనంబుగ గృహస్థుని భంగి నిజగృహకృత్యంబు లాచరించుచుండె నని శుకుండు మఱియు నిట్లనియె॥ క॥ అని యి
ట్లు కృష్ణుఁ డాడిన । వినయవివేకానులాపవితతామృతసే । చనమున విరతహృదయ యై య । వ్వనితామణి వికచవదనవనరుహ యయ్యెన్ (?)
గుచున్॥ క॥ నగవానవలింపుచూపులు । నగధరు మొగమునను నిలిపి నయమునఁ గరము । ల్మోగిచి వినుతించెఁ గృష్ణున్ । ఖగవా
హుఁ గరుచిరదేహుఁ గలితోత్సాహున్॥ చ॥ అతఁడు విరాజమానముఖుఁడై వివిధాంబరచారుభూషణ । ప్రతతులతోడఁ గో
రినవరంబులు దద్దయుఁ జిచ్చెఁ గృష్ణుఁడు । న్నతశుభమూర్తి దేవగణనందితకీర్తి దయానువర్తియై । యలిమృదువాణికిం గిసల
యారుణపాణికి నీలవేణికిన్॥ వ॥ ఇట్లు సన్మానించి కృష్ణుండు రుక్మిణియుం దానును దదనంతరంబ॥ చ॥ ఎలమిఁ ఘటింపఁగాఁ గ
లసి యాడెల నీడల మల్లికాలతా । వలికరవీరజాతివిరవాదులవీథులఁ గ్రుమ్మఱె మ్మెర । ల్పొలయనవీనవాసనలఁ బొన్నలది
న్నెలఁ బచ్చరచ్చల । న్దోలఁకుల లేఁగెలంకులను గోరి కేళిరి కెలొత్తఁ గ్రొత్తలై॥ క॥ ఆరామభూములం దువి । హారాధిక సౌఖ్య
లీలనతిమోదముతో । నా రామానుజుఁ డుండెను । నా రామామణియుఁ దాను నభిరామముగన్॥ వ॥ మఱియు ననేకవివిధవిచి
త్రమణివిలానాభిశోభితప్రాసాదోపరిభాగంబులను, లాలితనీలకంఠకలకంఠకలపికశుకకలాపకలితమాకరందపానమద
వదిందిందిరఝుంకారసంకులకమలకల్హారసుధాసారనీహారపూరితకాసారతీరంబులను, ధాతువిస్ఫురద్రంజితసానుదేశగిరి
కుంజపుంజంబులను, కృతకశైలంబులను, క్రీడాగృహంబులను జెలంగి నందనందనుండు విదర్భరాజనందనం దగిలి కందర్ప
కేళీలోలాత్ముండై యనంతరంబ యాసుందరీలలామంబువలనఁ బ్రద్యుమ్నుండు, చారుదేష్ణుండు, సుదేష్ణుండు, చారుదేహుం
డు, సుచారువు, చారుగుప్తుండు, భద్రచారువు, చారుభద్రుండు, విచారువు, చారువు నన నొప్పు పదుగురు తనయులం బడసె. న
ట్లు సత్యభామా, జాంబవతీ, నాగ్నజిత్తి, కాళిందీ, మాద్రీ, మిత్రవిందా, భద్రలకు, వేఱు వేఱం బదుగు రేసి భద్రమూర్తులై
న కుమారులు దయించి రివ్విధంబున మఱియును॥ చ॥ అనఘపదాఱువేల సతులం దుదయించిరి వేఱు వేఱ నం । దనదశకంబు దత్సు
తవితానము గాంచిర నేకసూనులు । న్ననయముఁ గనిట్లు పిల్లచెఱకుక్కినకైవడిఁ బుత్రపౌత్రవ । ర్ధనమున నొప్పెఁ గృష్ణుఁడు ము
దంబునఁ దామరతంపరై భువిన్॥ గీ॥ అట్టి యదువృష్ణిభోజాంధకాదివివిధ । నామధేయాంతరముల నెన్నంగ నూట । యొ
క్కటై చాల వర్ధిల్లెను కులంబు । నృపకుమారులఁ జదివించు నేర్పు గలుగు॥ గీ॥ గురుజనంబులు విను మూఁడుకోట్ల మీఁద । నెనుబ
దెనిమిది వేలపై నెసఁగ నూట్లు । రన్నదద్బాల కావలి నెన్నఁ దరమె । మూలికై నను దామరచూలికైన॥ వ॥ అంత గోవిందనం

శ్రీ అనిరుద్ధుని వివాహసమయంబున బలరాముండు రుక్మి మొదలగు వారిం జంపుట. శ్రీ

దనుండైన ప్రద్యుమ్నునకు రుక్మికూఁతురివలన ననిరుద్ధుండు సంభవించె నని మునివరునకు భూవరుం డిట్లనియె॥ క॥ బవరము
నఁ గృష్ణుచే మ్రున్నవమానము నొందె రుక్మి యచ్యుతుఁ గెలువం । దివురుచుఁ దనసుత నరిసం । భవునకు నెట్లిచ్చె నెఱుఁగఁ బలుకు
మునీంద్రా॥ సీ॥ నావుడు శుకయోగి నరనాయకోత్తమ నీవు చెప్పిన యట్ల నెమ్మనమునఁ । బద్మాయతాక్షుచేఁ బడిన బన్నము.
నకుఁ గనలుచు నుండియు ననుజతోడి । నెయ్యంబునను భాగినేయున కిచ్చె నుఁగూఁతు నంచితపుష్పకోమలాంగిఁ । దనపూన్కి ద
ప్పినఁ దగ విదర్భేశుండు పిను మెఱఁగింతు నవ్విధము దెలియఁ । బరగ రుక్మవతీస్వయంవరమునకొగి । నరుగు దెండని భీష్మభూ
వరసుతుండు । వరుస రప్పించె రాజన్యవరకుమార । వరుల నను వార్త కలరి యాహరిసుతుండు॥ చ॥ వరమణిభూషణప్రభలవ
గ్గను నగ్గళభంగిఁ బర్వఁ బ్ర । స్ఫురితరథాధిరోహణవిభూతి దలిర్పను సోహరైకసు । స్థిరశుభలీల నేసుయమసింహకిశోర
మురాజకన్యకా । పరిణయవైభవాగతనృపాలకకోటికి రుక్మివీటికిన్॥ చ॥ చని పురిఁ జొచ్చి వృష్ణికులసత్తముఁ డచ్చట మూఁగి
యున్నయ । మ్మనుజవరేణ్యనందనుల మానము దూలభయాకులాత్ములై । చనఁగ ననేకచండతరసాయకసంపదఁ జూపి రుక్మి
నం । దనఁ గొని వచ్చి వేడ్క నిజధామము సొచ్చె ననార్యశౌర్యుఁడై॥ వ॥ ఇట్లు తెచ్చి ప్రద్యుమ్నుండు హరిణనయనం బరిణయం
బంది నిఖిలసుఖంబు లనుభవించుచుండె నంతరంబ॥ క॥ ధీరుఁడు కృతవర్మనిసుకు । మారుఁడు వరియించె రుచిరమండనయుత
సం । భోరుహముఖి రుక్మిణిసుతఁ । జారుమతి నన్యఁ బ్రకటసజ్జనమాన్యన్॥ గీ॥ ప్రకటచరితుండు భీష్మభూవరసుతుండు । మాన
ము మోదింపఁ దనమార్మిమనుమరాలి । రుక్మలోచన నసమానరుక్మకాంతిఁ । జేర్చి ననిరుద్ధునకుఁ బెండ్లి సేయునప్పుడు॥ క॥ సొ
లుపసురత్నవిభూషోజ్జ్వలులై శుభవేళ నవ్వివాహార్థము ని । ర్మలబహువైభవశోభన । కలితవిదర్భావనీశకటకంబునకున్.
చ॥ హరియును రుక్మిణీసతియు నాబలభద్రుఁడు శంబరారియు । న్నరిమదభేది సాంబుఁడును నాదిగ రాజకుమారకోటి సిం ।
ధురరథవాజిసద్భటులతోఁ జని యందు సమగ్రవైభవా । చరితవివాహయుక్తదివసంబులు వేడుకఁ బుచ్చి యంతటన్॥ క॥ ఒ

కనాఁడు యదుకుమారకులకలంక సమగ్రవైభవాటోపవపుష్మంతు లై యుండఁగఁ జూపోపక యొక్క సక్కెముసనవని పాలుపనరుసగా॥ ఉ॥ ఎచ్చరికంగ లింగధరణీశుఁడు రుక్మి మొగంబు సూచినీ యొచ్చము దీర్పు కోనిదియ యొప్పగు వేళ బలుం డు జూదమాం దివ్చగలండు గాని పాలు పెక్కైన నేర్పరి గాఁడు గాననీ కిచ్చనవశ్యము౯ జయము నీసుముతోల్లిటి బన్నముల్వా డి౯॥ క॥ అనిపురికొల్పిన రుక్మియు దనచేటు తలంపలేక తాలాంకునితోఁ డనుజూదమాడఁ దివిరెను వనజాసనుకృతము గడచువారెవ్వరిల౯॥ అంత॥ క॥ కోరి విదర్భుఁడు కుటిలవిహారుండై పిలిచె జూదమాడ జితారి౯ హారిస్సనున్నత సూరిస్సిరిక౯ రై వతసుతాహృద్రిచిత్రవిహారి౯॥ గీ॥ పూని మనము గొంత ప్రొద్దు వోకకు రామ నెత్తమాడ నీవు నేర్తువనఁగ పిందు మిపుడు కొం త వేలమొడ్డియాడుదమనిన బలుఁడున్నలెస్సయని చెలంగె॥ క॥ మదిలోని చలము డింపక పదియిరు వైనూలు వేయి పదివేలి దెప న్నిదమని మొడ్డుచు నాడిరి మదమున నిద్దరును మరభిమానము పేర్మి౯॥ ఉ॥ ఆడిన యాటలెల్ల నుహలాయుధుఁ డోడిన రుక్మి గె ల్చుచు౯ వోడిన నృపాలకోటిపకితోషముఁ జెందఁ గళింగభూవిభుం డోడె బలుండటంచుఁ బ్రహసోక్తుల నెంతయు రాముఁ జుల్కగా నాడె మదంతపఙ్క్తి వెలినైకని పెట్టఁగఁ జాలనవ్వుచు౯॥ గీ॥ బలుఁడు కోపించి యొకలక్షపణము సేసి యాడె బ్ర కటంబుగా జూదమపుడు గెల్చె గెల్చిననురుక్మి యిదియేను గెల్చియుండ గెలుపు నీదనికి పరింపనలవియగునె॥ క॥ అనవుడు హలధరుఁడచ్చట జనపాలకసుతులఁ జూచి సత్యము పలుకుం డని యడిగినవారలురుక్మికి హితులై పలుక రైరి మొగమాటమున౯॥ ఉ॥ అప్పటియట్ల యొడ్డి ముసలాయుధుఁడే పున నాడి జూదముం జొప్పడ గెల్చి యీ గెలుపు చూడఁగ నాదియొ వానిదో జనుల్ దప్పక చెప్పుడన్న విదితధ్వనితో నశరీరవాణి దా నిప్పటి యాట రాముఁడె జయించె విదర్భుఁడె యోడెనా వుడు౯॥ వ॥ అనిన విని సకలజనంబులు నద్భుతానందనిమగ్నమానసులై రికుటిలస్వభావులైన భూవరులు రుక్మిం గైకొల్పిన నతండు తన తొల్లింటి పరాభవంబు వలం దియెదిఁ జేఁదన్ను నెఱుంగక బలాబలవివేకంబు సేయ నేరక విధివశానుగతుండై చలంబు నంబ లునింగని యిప్పటి యాటయు నేన గెల్చియుండ వృథాజల్పనకల్పనుండవై నీవు గెల్చితి నని పలికెదవక్షవిద్యానైపుణము గల భూపకుమారులతోఁ బసులగాపరులెత్తువత్తురే యని క్రొవ్వు నవ్వుచుం బలికిన నప్పలుకులు చెవులకు ములుకులక్రియం దాఁకినఁ గోపోద్దీపితమానసుండై పెటపెటం బండ్లు గొఱుకుచుం గన్నుల నిప్పులుప్పతిల్లంగి నుకంచోఁకఁ ద్రొక్కి నమహాపరిఘంబు నొరజగ్రోఁ జుచుదండతాడితంబైన పుండరీకంబు లీలహుమ్మని మ్రోయుచుఁ బ్రచండబాహుదండంబులు సాఁచి పరిఘంబందుకొని రుక్మి ని నతనికనుకూలంబైన రాజలోకంబును బడలుపడ నడచె నయ్యవసరంబున॥ క॥ మునుదంతపఙ్క్తి వెలిగాఁ దనునవ్విన యక్కళింగుఁదల వట్టి రయం బున బడఁదిగిచి వదనమే పునఁబెడ చే వ్రేసి నంతములు వెసడులిచె౯॥ క॥ అంతం బోవక రుక్మిని దంతంబులు మున్ను డులిచితను వగలింప న్నంతకపురికేగెను వాఁ డంతయు భయమంది రాజులెల్లం గలఁ గ౯॥ అట్లు చేసి యయ్యాదవసింహంబు వక్రవిక్రమంబున నంజెలంగెనంత॥ క॥ భూవరపద్మాప్తుఁడు దన బావ హతుండగుటఁ గని యుఁబలుకక యుండె౯ భావమున రుక్మిణీబలదేవుల కేమనఁగ నెగ్గు దేరు నొయనుచు౯॥ అంత నావిదర్భనగరంబు నిర్గమించి॥ క॥ పరమానురాగరససంభరితాంతఃకరణులగుచుఁ బాటించి వధూవరులను రథమందిడి హాలధరహరిరుక్మిణులుఁ గొల్చి తగ యదువీరుల్॥ ఉ॥ మంగళతూర్యఘోషములమందగతిం జెలఁగంగ మత్తమాతంగతురంగసద్భటకదంబముతోఁ జనికాంచిరంతనా రంగలవంగలుంగవిచరన్మదభృంగసురంగనాదసంసంగతరంగిణీకలితసంతతనిర్మలినాకుశస్థలి౯॥ ఇట్లు పురోపవనోపకంఠంబునకుం జని॥ క॥ అందు వసించిరి నందిత చందనమందారకుందచంద్రలసన్మాకందములనీడ హృదయానందము సంధింపనందనందనముఖ్యుల్॥ వ॥ తదనంతరంబ పురప్రవేశంబు చేసిరని చెప్పి శుకయోగీంద్రుండు పరీక్షి

## ——⟶ శ్రీ బాణాసురుండీశ్వరప్రసాదంబు నొందుట. శ్రీ ⟵——

న్నరేంద్రున కిట్లనియె॥ గీ॥ అనఘ బలినందనులు నూర్వురందులోన నగ్రజాతుండు బాణుఁడత్యుగ్రమూర్తి విరయశోహా రివిహితపూజితపురారి యహితతిమిరోష్ణకరుఁడు సహస్రకరుఁడు॥ క॥ బాణుఁడు విక్రమజితగీర్వాణుఁడు సనికాంచె భక్తివశుఁడై సగుణు౯ స్థాణు౯ నిర్గళితాసను బాణు౯ దాండవధురీణు భక్తత్రాణు౯॥ క॥ కనియసురాగవికాసము దనమనమునఁ గడలుకొనఁగ ధరజాగిలి వందనమాచరించె మోదము దనరఁగఁ దాండవము సలుపు తఱి నయ్యభవు౯॥ ఉ॥ సంచితభూరిబాహుబలసంపద పెంపున నారజంబు వాయించియనేకభంగులను మేశుఁ ద్రిలోకశరణ్యు నాత్మమెప్పించి ప్రమోదియై నిజవశీకృతనిశ్చలితాంతరంగుఁగా వించితదాననాంబురుహవీక్షణుఁడై తగ మ్రొక్కియిట్ల నె౯॥ ఉ॥ శంకర భక్తమానసవశంకర దుష్టనుదాసురేంద్ర నాశంకర పాండునీలరుచి శంకరవర్ణనిజాంగభోగి రాటంకణ పార్వతీహృదయ కైరవ కైరవమిత్ర యోగిహృత్పంకజ పంకజాప్త నిజతాండవఖేలన భక్తపాలనా॥ అనివినుతించి॥ ఉ॥ దేవ మదీయ

* నెత్తము-జూదము.

వాంఛితము దేటపడన్నిటు విన్నవించెద। నీవును నద్రినందనయు నెమ్మి నినాపురి కోటవాకిట। న్గావలియుండి నన్నుఁ గృప గావుము భక్తఫలప్రదాత యో। భావభవారి నీచరణపద్మము లెప్పుడు నాశ్రయించెదన్॥ వ॥ అని యభ్యర్థించిన సంప్రసన్నుండై భక్తవత్సలుండగు పురాంతకుండు గౌరీసమేతుండై తారకాదిభూతగణంబులతోడ బాణనివాసంబగు శోణపురంబు వాకిటం గాఁపుండెఁ బదంపడి యొక్కనాఁడబ్బలినందనుండు॥ గీ॥ దర్పమునఁ బొంగి రుచిరమార్తాండదీప్తిమండలముతోడ మార్పడు మహితశోణమణికిరీటము త్రిపురసంహారుని పాదవనజములు సోఁక మ్రొక్కి యిట్లని నుతించె॥ సీ॥ దేవజగన్నాథ దేవేంద్రవందితవితతచారిత్ర సంతతపవిత్ర। హాలాహలాహార యహిరాజకేయూర బాలేందుభూష సద్భక్తపోష। సర్వలోకాతీత సద్గుణసంఘాత పార్వతీహృదయేశ భవవినాశ। రజతాచలస్థాన గజచర్మపరిధాన సురవైరివిధ్వస్త శూలహస్త। లోకనాయక సద్భక్తలోకవరద। సురుచిరాకార మునిజనస్తుతివిహార। భక్తజనమందిరాంగణపారిజాత। నిన్ను నెవ్వఁడు నుతిసేయ నేర్చు నభవ॥ మ॥ అనిలో నన్ను నెదిర్చి బాహుబలశౌర్యస్ఫూర్తిఁ బోరాడఁ జాలినవీరుండొకఁడైనఁ బండెమునకున్ లేఁడయ్యె భూమండలి। న్ననయంబున్ భవదగ్ర్యదత్తకరసాహస్రంబు కండూతి వాయను పాయంబును లేదె యీభరము నెట్లోర్తున్ నుమానాయకా॥ సీ॥ హుంకారకంకణక్రేంకారశింజినీటంకారనిర్ఘోషసంకులంబు। చండదోర్దండభాస్వన్మండలాగ్రప్రకాండఖండితరాజమండలంబు। శూలాహతతుతోద్వేలకీలకరాళకేళీసమాలోలఖేలనంబు। శుంభదున్మదకుంభికుంభస్థలధ్వంససంభూతశౌర్యవిజృంభణంబు। గలుగు నుద్దామభీమసంగ్రామకేళి। ఘనపరాక్రమవిక్రమక్రమముగాఁగఁ। జరుపలేనట్టి కరములు గరము దుఃఖకరములగుఁ గాక సంతోషకరములగునె॥ ఉ॥ కాన మదీయచండభుజగర్వపరాక్రమకేళికిన్ సముం। డీనిఖిలావనిం గలఁడె యింక శశాంకధర నీవు దక్కఁగా। నానిటలాంబకుండు దనుజాధిపుమాటకుఁ జాలరోసి లో। నూనిన రోషవార్ధి గడలొత్తఁగ నిట్లని పల్కె భూవరా॥ క॥ వినుమూఢహృదయ నీకేతన మెప్పుడ కారణంబ ధారుణిపైఁ గూలును నపుడ నీభుజావలి। తునియఁగ నాయంత వానితో ననిగల్గున్॥ వ॥ అని పలికిన నట్ల సంప్రాప్తసమునోరథుండై భుజవినాశకార్యధురీణుండగు బాణుండు సంతుష్టాంతరంగుండగుచు నిజనివాసంబునకుం జని తన ప్రాణవల్ల

## శ్రీ ఉషాకన్య యనిరుద్ధునిఁ గూడినటుల స్వప్నముగనుట. శ్రీ

భలయుల్లంబులు పల్లవింపఁ జేయుచు నిజధ్వజనిపాతంబు నిరీక్షించుచుండెఁ దదనంతరంబ॥ సీ॥ ఆదానవేశ్వరు ననుఁగుకూఁతురుషాకన్య సచ్చరితసౌజన్యధన్య। రూపవిభ్రమకళా రుచిరకోమలదేహ యసమానజవబాణమనఁగ నొప్పు। సుందరీరత్నంబు నిందునిభానన యళినీలవేణి పద్మాయతాక్షి। యొకనాఁడు రుచిరసౌధోపరి వేదికాస్థలమున హృద్యశయ్యా నెలమిఁ గూర్కి। మున్ను దనచాల నెన్నఁడు వినినయతఁడుఁ। గన్నులారంగఁ దాఁ బొడగననియతఁడు। గానియసమానరూపరేఖావిలాసకలితు ననిరుద్ధు నర్మిలిఁ గవసినటుల॥ చ॥ కలగని యంత మేలుకని కన్నుల బాష్పకణంబులొల్కఁగాఁ। గలవలెగాక నిశ్చయముగాఁగ మనీయవిలాసవిభ్రమా। కలితతదీయరూపము ముఖంబున వ్రేలినయట్లతోఁచిన। న్గళవళమందుచు న్సిగియఁ గౌఁగిలి చేబయలప్పళించుచున్॥ మఱియును॥ చ॥ సరసమృదూక్తులుం గుసుమసాయకకేళియు శాటికాకచాకర్షణములన్నఖక్రియలుఁ గ్రమ్మకపోలలలాటమేఖలా। కరకుచబాహుమూలములు గైకొనియుండుటలాదిగాఁ దలో। పరిమదగాఢమై తగిలె దర్పకుఁడచ్చన నెత్తినట్లయై॥ సీ॥ కలికి చేష్టలు భావగర్భంబులైనను బ్రియుమీఁది మోహరిమి బెగ్గలింపఁ। బిఱపిననై లజ్జ మదిఁ బదనిచ్చినఁ జెలిమేనఁ బులకలు చెక్కులొత్త। మదనాగ్నిసంతప్తమానసయగుటకు గుబ్బచనుహారవల్లరులు గందఁ। జిత్తంబు నాయకాయత్తమై యుంటకు మఱుమాటలాడంగ మఱపుగదుర। నతివమనమున సిగ్గు మోహంబు భయముఁ। బొడమనను మంచు నెత్తమ్మిఁ బొమవుమాడ్కిఁ। బ్రమథచింతాభరంబునఁ బద్మనయన। కోరి తలఁచీర వాటింప నేరదయ్యె॥ వ॥ ఇట్లు విరహవేదనాధూయమానమానసయై యుండెనంత నచ్చెలులు డాయఁజనుదెంచిన నం దనమనంబునఁ బొడము మనోజవికారంబులు మఱుఁగు వెట్టుచున్నప్పుడు॥ చ॥ పొరిపొరి వచ్చు నూర్పుగమిఁ బుక్కిటనుంచి కుచాగ్రసీమపై। బెరసిన సన్నలేఁ జెమటబిందువులొయ్యన నార్చెఁ గన్నుల। న్దొరిగెడు బాష్పపూరములు దొంగిలి ఱెప్పల నానిచుక్కలం। దరుణులు రండు మాతమని తా మొగమెత్తును గూఢరాగయై॥ ఇవ్విధంబున సంచరియించుచుండె నట్టియెడ॥ గీ॥ అంతకంతకు సంతాపమతిశయించి। వలుదచన్నులు గన్నీటి వరదఁ దడుపఁ। జెలుల దెసఁ జూడఁ జాల లజ్జించి మొగము। వాంచి పలుకకయుండె నవ్వనరుహాక్షి॥ అంత॥ గీ॥ బలితనూభవుమంత్రి కుంభాండుతనయ। తనబహిఃప్రాణమిది యనఁ దనరునట్టి। కామినీమణి ముఖపద్మకాంతివిజిత। శిశిరకర చారురుచిరేఖ చిత్రరేఖ॥ కదిసి యబ్బాలను పలుకించి॥ గీ॥ పడఁతి నీవిప్పుడొ బసుని బయల వెదకు। విధమునను నాత్మవిభుఁడని వేడ్కఁ బిలిచి। పూని చేతికిలోనైన వానిఁ బాసి। భ్రాంతిఁ బొందిన భావంబు ప్రకటమయ్యె॥ గీ॥ వనిత

నాకన్న నెనరైనవారు నీకుఁ గలుగ నేర్తురె నీకోర్కెఁ దెలియఁ జెప్పు। మన్న నీయన్నతోడ నన్నఁ గన్నుఁగవల। నలరునునుసి గ్గుతోనగవా మొలింప॥ ఇవ్విధంబునఁ జిత్రరేఖం గనుంగొని యిట్లనియె॥ చ॥ చెలికలలోన నొక్క-సరసీరుహనేత్రుఁడు హార రత్నకుండలకటకాంగుళీయకరణన్మణినూపురభూషణుండు నిర్మలకనకాంబరుండు సుకుమారతనుండు సునీలదేహుఁడు। జ్జ్వలరుచి నూతనప్రసవసాయకుఁ డున్నతవక్షుఁ డెంతయున్॥ చ॥ ననుబిగియారఁ గౌఁగిటను నంబలరారఁగఁ జేర్చి మోవ ముం। ననుకఁగనంచితాధరసుధారస మిచ్చి మనోజకేళికి। న్ననుపడఁ జేసి మంజువృదుభాషలఁ దేలిచి యంతలోన నే। చనియె నుమగ్గిఖవార్ధిఁ బెలుచన్ననుఁ ద్రోచి సరోరుహాననా॥ వ॥ అనుచు నమ్మత్తకాశిని చిత్తంబు నిత్తజాయత్తంబై తత్తరంబున విరహానలంబు మొత్తలపెట్టఁ గన్నీరు మున్నీరుగా వగచుచు విన్ననైన వదనారవిందంబు వాంచి యూరకున్నఁ జిత్రరేఖ తనమ

### ⟶ శ్రీ చిత్రరేఖ రాజవరుల నంబటంబున లిఖించి చూపి యనిరుద్ధునిఁ దేఁబోవుట. శ్రీ ⟵

నంబున నయ్యింతిసంతాపంబు చింతించి యిట్లనియె॥ చ॥ సరసిజనేత్రి యేటికి విచారము నాకుశలత్వ మేర్పడ। న్నరసురయక్ష కింపురుషనాగనభశ్చరసిద్ధసాధ్యకిన్నరవరముఖ్యులం బటమునన్ లిఖియించినఁ జూచి నీమనోహరుఁ గని వీఁడె పొమ్మనిన నప్పుడె వానిని నీకుఁ దెచ్చెదన్॥ వ॥ అని యొడంబఱచి మిలమిలని మించు తొడంబు రణించు ధళధళయని మెఱుంగులు మెఱుంగ లిగొను పటంబు నావటంబు సేసి వజ్రంబు మెదియించి, పంచవన్నియలు వేఱు వేఱంగ నకరజతపాత్రంబుల నించి, కేలందూ లికఁ ధరించి యొక్క-విజనస్థలంబునఁ గుంజనిముల్లోకంబులం బేరుకలిగిన వయోరూపసంపన్నులైన పురుషముఖ్యుల నన్వయ గోత్రనామధేయంబులతోడ వ్రాసి యాయితంబైన యప్పటంబు దన ముందటికిం దెచ్చి యుంచి యిప్పటంబునందుఁ గల వారు లేఱు సావధానంబున నాకర్ణింపు మని యిట్లనియె॥ సీ॥ కమనీయసంగీతకలితకోవిదులు కింపురుషగంధర్వకిన్నరులు వీరె। సతతయౌవనులు నిచ్ఛావిహారులు సిద్ధసాధ్యచారణవియచ్చరులు వీరె। ప్రవిమలసౌఖ్యసంపద్వైభవులు సుధాశనమరుద్యక్షరాక్షసులు వీరె। నిరుపమరుచికళాన్వితకామరూపులై పొగడొందు నట్టి పన్నగులు వీరె। చూడు మని నేర్పు దీపింపఁ జూపుటయును। చిత్తమునఁ నిజ మనోరథసిద్ధి వడయఁ। జాలకుండిన మధ్యమక్ష్మాతలాధి। పతులఁ జూపుచు వచ్చె నప్పద్మనయన॥ ఉ॥ మాళవకొంకణద్రవిడమత్స్యపుళిందకళింగభోజనే। పాళవిదేహపాండ్యకురుబర్బరసింధుయుగంధరాంధ్రబం। గాళకరూశటెంకణత్రిగర్తసుదేష్ణమరాటలాటపాం। చాలనిషాదఘూర్జరకసాళ్వమహీశులు వీరె కోమలీ॥ ఉ॥ సింధురవైరివిక్రముఁడు శీతమయూఖకులాళికావయ। స్సింధుపటీరనిర్మలవిశేషయశోవిభవుండు శౌర్యవ। ర్వాంధరిపుక్షితీశనికరాంధతమఃపటలార్కుఁ డీజరా। సంధునిఁ జూడుమాగధుని సద్బృహదశ్వసుతుం గృశోదరీ॥ మ॥ సకలోర్వీతలనాథసన్నుతుఁడు శశ్వన్నిష్ఠురబాహాబలా। ధికుఁ డుగ్రాహవకోవిదుండు త్రిజగద్విఖ్యాతచారిత్రకుం। డకలంకోజ్జ్వలదివ్యభూషుఁడు విదర్భాధీశ్వరుండై నభీ। ష్మకభూపాలకుమారుఁ జూడు మితని న్మత్తద్విరేఫాలకా॥ ఉ॥ సంగరరంగనిర్దళితచండవిరోధివరూథినీశమా। తంగతురంగసద్భటరథప్రకరైకభుజావిజృంభణా। భంగపరాక్రమప్రకటభవ్యయశోమహనీయమూర్తి కాళింగుఁడు వీఁడె చూడు మతరళీకృతచారుకురంగలోచనా॥ మ॥ సుగుణాంభోనిధి ఫాలలోచనుని మేను న్నాత్మ మెప్పించి శ। క్తిగరిష్ఠంబగు శూలము న్బడసె యక్షీణప్రతాపోన్నతిన్। జగతిన్మిక్కిలి మేటి వీఁడు రణోత్సాహుండు భూపౌత్రుఁడీ భగదత్తుం గనుఁగొంటె పంకజముఖీ ప్రాగ్జ్యోతిషాధీశ్వరున్॥ మ॥ వికచాంభోరుహపత్రనేత్రుఁడగు గోవిందుండు దాఁ బూనునం। దక చక్రాబ్జగదాదిచిహ్నముల చేత న్వాసుదేవాఖ్యను। త్సుకుఁడై యొప్పుడు మచ్చరించు మదిఁ గృష్ణుం డన్న నీ మేటి పౌం। డ్రకుఁ గాశీశసఖుం గనుంగొను మువేడ్కం జంద్రబింబాననా॥ మ॥ ద్విజశుశ్రూషయు సూనృతవ్రతము సద్వృత్తిన్ను జాగర్వము। న్విజయాటోపము చాపనైపుణియు ధీవిస్ఫూర్తి సత్కీర్తులీ। రజనీనాథకులప్రదీపకులఁ బాఱంజూడు పద్మాక్షి ధ। ర్మజభీమార్జునమాద్రినందనుల సంగ్రామైకపారీణులన్॥ మ॥ బలిమిన్సర్వనృపాలురన్న దిమికప్పంబుల్లగంగొంచు నుజ్జ్వలతేజోవిభవాతిరేకమున భాస్వత్కీర్తిశోభిల్లఁగాఁ। బొలుపొందం దను రాజరాజన మహాభూరిప్రతాపంబులుం గలదుర్యోధనుఁ జూడు సోదరయుతుం గంజాతపత్రేక్షణా॥ వ॥ అనియిబ్భంగి సకలదేశాధీశులగు రాజవరుల నెల్లం జూపుచు యదువంశసంభవులైన శూరసేన, వసుదేవ, యుద్ధవాదులం జూపి నుతియును॥ ఉ॥ శారదనీరదాబ్జఘనసారసుధాకరకాశచంద్రికా। సారపటీరవర్ణ్ణయమసత్తము నుత్తమనాయకుం బ్రమ। త్తారినృపాలకాననహుతాశనమూర్తిఁ బ్రలంబదైత్యసం। హారునిఁ గామపాలుని హలాయుధుఁ జూడుము దైత్యనందనా॥ సీ॥ కమనీయశుభగాత్రుఁ గంజాతదళనేత్రు వసుధాకళత్రుఁ బావనచరిత్రు। సత్యసంకల్పు నిశాచరోగ్రవికల్పు నతపన్నగాకల్పు నాగతల్పుఁ। గౌస్తుభమణిభూషు గంభీరమృదుభాషు శ్రితజనపోషు నంచితవిశేషు। నీలనీరదకాయు నిర్జితదైతేయు ధృతపీతకౌశేయు నతవిధేయు। నఘను

హాఁగదవైన్య వేదాంతవేద్యు।దివ్యమునిసన్నుతా మోమఁదీర్ఘపాదు। జిష్ణువరసద్గుణాలంకరిష్ణుఁగృష్ణుఁ।జూడుదైతేయ
కులవాలసుభగలీల॥ చ॥స్ఫురదళిశింజినీరవవిభూషితపుష్పధనుర్విముక్తభా।స్వరనవచూతకోరకనిశాతశిలీముఖపాతభీ
తవం।కరుహాభవాదిచేతననికాయుమనోజనిజాంశురుక్మిణీ।వరసుతురాజకీరవరివారునిమారుని(జూడుకోమలీ॥ ఇవ్విధం
బునంజూపిన॥మ॥వనితారత్నముకృష్ణనందనునిభావప్రౌఢిఁదాఁజూచిగ్రద్దనఁదన్నర్థివరించిచన్నసుగుణోత్తంసంబకా
నాస్మలో। ననుమానించియనంతరంబయనిరుద్ధాఖ్యున్సరోజాతునూ। తనచేతోభవమూర్తిఁజూచిమదిసంతాపించుచు
న్నిట్లనుఁ॥ఉ॥ఇంతిమదీయమానధనమెల్లహరించినముచ్చునిమ్మెయిం।బంతమెలర్పవ్రాసిపటభాగనిరూపితుఁజేసినట్టి
నీ। యంతటిపుణ్యమూర్తిఁగొనియాడఁగనేర్తునెనీచరిత్రము। ల్వింతలెనాకునీమహితవీరకులంబుబలంబుఁజెప్పుమా॥
చ॥ అనవుడుచిత్రరేఖజలజాక్షికినిట్లనునీకుమారకుం।డనఘుఁడుయాదవాన్వయసుధాంబుధిపూర్ణసుధాకరుండునాఁ।
డనరినకృష్ణపౌత్రకుఁడుదారచరిత్రుఁడుభూరిసింహసం। హననుఁడరాతిసైన్యతిమిరార్కుఁడుపేరనిరుద్ధుఁడంగనా॥
వ॥అనిచెప్పియేనతిత్వరితగతింజనియకుమారరత్నంబుఁదోడ్కొనివచ్చునంతకుసంతాపింపకుండుమనియత్నంబవియ
ద్గమనంబునఁజనిచనియుందట॥ క॥సరసిజముఖికనుఁగొనెశుభ।భరితవిలోకనవిధూతభవవేదనము।స్వరసాధనమునుసు
కృత।స్ఫురణాపాదనముఁగృష్ణపుటభేదనముఁ॥ వ॥కనిడాయంజనితదీయసుషమావిశేషంబులకుంబరితోషంబునొంది
చ్చుం గామినీచరణరణితమణినూపురఝుణఝుణధ్వనితమణిగోపురంబును,నళివిభవవిజితగోపురంబును,నగుద్వారకాన
గరంబునిశాసమయంబునంబ్రచ్ఛన్నవేషంబునంజొచ్చికనకకుంభకలితసౌధాగ్రంబునమణిదీపనిచయంబుప్రకాశింపఁ
జంద్రకాంతశిలాభవనంబున సుధాధామరుచిరరుచినిచయంబునపహసించుహంసతూలికాతల్పంబున నిజాంగనారతి
శ్రమంబుననిద్రాసక్తుండైయున్నయనిరుద్ధుం జేరి,తనయోగవిద్యామహత్వంబుననతని నెత్తికొనిమనోవేగంబునశో

### శ్రీ చిత్రరేఖయనిరుద్ధునిఁదెచ్చియుషాకన్యకకునొప్పగించుట. శ్రీ

ణపురంబునకుంజని,బాణాసురనందనయగు నుషాసుందరీతల్పంబునందిడియిట్లనియె॥క॥వనజాక్షిచూడునీవిభు।ననిమిషన
గధీరుశూరునభినవమారు।న్వనధిగభీరునుదారుని।ననిరుద్ధకుమారువిదళితాహితవీరుఁ॥ క॥అనిననుషాసతిదనమున।మున
ననురాగిల్లి మేనఁబులకాంకురము। ల్మొనయఁగనానందాశ్రులు। గనుఁగవజడిగ్గురియముఖవికాసమెలర్పఁ॥వ॥ఇట్లుమ
నంబుననుత్సహించిచిత్రరేఖంగనుంగొనియయ్యింతియిట్లనియె॥సీ॥అతివనీసాంగత్యమనుభానురుచినాకుఁగలుగుటఁగా
మాంధకారముఁడఁగెఁ। దరలాక్షినీసఖత్వంబనునావచేఁగడిఁదివియోగాబ్ధిఁగడవఁగంటి। నబలనీయనుబంధమనుసుధా
వృష్టిచేనంగజసంతాపమార్పఁగంటి।వనితనీచెలితనంబనురసాంజనముచేనామనోహరనిధానంబుఁగంటిఁ। గలఁడోఁ
చినరూపుగ్రక్కునలిఖించు।వారునౌనన్నఁదోడ్తెచ్చువారుఁగలరె।నీటిలోఁజాడఁబుట్టింపనేర్పునీక।కాకగల్గునెమూఁడు
లోకములయందు॥వ॥అనివినుతించిచిత్రరేఖనునిజమందిరంబునకుంబోవంబనిచినంజనియె-ననంతరంబవింతజనులకెవ్వ
రికిఁబ్రవేశింపరానియంతఃపురసౌధాంతరంబుననయనిరుద్ధుండుమేల్కనియయ్యింతింగనుంగొనియప్పుడు॥క॥సురుచిరవ్య
దుతల్పంబునఁ। బరిరంభణసరసవచనభావగళాచా। తురిమెఱయనాకుమారుఁడు। తరుణీమణిఁబొందెనుదనతంత్రజ్ఞుం
డై॥వ॥ఇవ్విధంబుననతిమనోహరవిభవాభిరామంబులగుదివ్యాంబరాభరణమాల్యానులేపనంబులఁగర్పూరతాంబూ
లంబుల వివిధాన్నపానంబులసురుచిరమణిదీపికానీరాజనంబులసుగంధబంధురాగరుధూపంబుల,నాటలపాటల,వీణావి
నోదంబులంబరితుష్టింబొంది- కన్యాకుమారకులానందసాగరాంతర్నిమజ్యమానమానసులై యుదయాస్తమయనిరూ
పణంబుసేయనేరక ప్రాణంబులొక్కటిర్మైతలంపులంగదిసియిష్టోపభోగంబులనుభవించుచుండిరంత॥ క॥ఆలోనన
నతిచిరమగు।కాలముసుఖలీలజరుగఁగావరుసనుషా। బాలాలలామకొయ్యనఁ। జూలేర్పడిగర్భమొదవెనుదిరభంగిఁ॥
క॥కాచినకావలిహారలు। సూచిభయాకులతనొందిప్రుక్కుచుఁదమలో। నోచెల్లయిట్లుదానవ। రాచూలికిఁజూలునిలిచె
రామెబ్భంగిఁ॥క॥అనిగుజగుజఁబోవుచునిప్పు।డిదప్పకదనుజలోకపాలునితోడ।న్విసుపింపవలయుననివే।చనిబాణుంజేరి
మ్రొక్కి-సద్వినయమునఁ॥క॥మంతనమునదేవరక। న్యాంతఃపురమేముగాచియరయుచునుండ।న్వింతజనములకుఁజొ
రఁగరాదంతమువినుపోఁతుటీఁగెకైనసురారీ॥ గీ॥ఇట్టిచోఁగావలున్నమేమెవ్వరమును। నేమికనుమాయయోకానియెఱు
ఁగముధిప।నీకుమారికగర్భంబునివ్వటిల్లి।యున్నదన్ననువివిరోషయుక్తుఁడగుచు॥వ॥అట్టియెడదానవేంద్రుండురోషావేశ
భీషణాకారుండై కటములదరబొమలుముడివడంగనుంగవలననలకణంబులుప్పతిల్ల నటలువెటికినంజటులగలినెగయుస్సిం
గంబువిధంబునలంఘించుచు,భీకరకరవాలంబుకేలందాల్చిసముద్దండగతింగన్యాసౌధాంతరంగంబునకుంజనిసీ॥కనియె

శ్రీ బాణాసురుండనిరుద్ధుని నాగపాశబద్ధునిం జేయుట. శ్రీ

శోభోపేతుఁ గందర్పసంజాతు మానితదేహు నాజానుబాహు। మకరకుండలకర్ణమహిత ప్రభాపూర్ణగండయశోల్లాసుఁ గౌశేయవాసు। గస్తూరికాలిప్తఘనకాంతికముదావృత్తవక్షశోభితవక్షుని నంబుజాతు। యదువంశతిలకు మత్తాలినీలాలకు నవపుష్పచాపుఁ బూర్ణప్రతాపు। నభినవాకారు నక్షవిద్యావిహారు। మహితగుణవృద్ధు మన్మథమంత్రసిద్ధుఁ। గలితపరిశుద్ధు నఖిలలోకప్రసిద్ధు। చతురు ననిరుద్ధు నంగనాజను ననిరుద్ధు॥ చ॥ కనికనలగ్గలింప సురకంటకుఁ డుద్ధతి నబ్భటావళిం। గనుఁగొని యీనరాధముని గట్టుఁడు పట్టుఁడు కొట్టుఁడన్న వా। రనుపమహేతిదీధితుల హర్పతి తేజము మాయఁ జేయఁడా। సిన నృపశేఖరుండు నుదిఁ జేవయు లావును నేర్పు దర్పముల్॥ చ॥ కలిగిన మహోగ్రవృత్తిఁ బరిఘంబు గరంబున లీలఁ దాల్చి దోర్బలఘనవిక్రమప్రళయభైరవుభంగి విజృంభణక్రియా। కలన నెదిర్చి దానవనికాయముతోఁ దలపాటుఁ బోటునుం। జలము బలంబు ధైర్యమును శౌర్యము రేవతునుం బాటుఁ జూపుచున్॥ చ॥ పదములు బాహులుం దలలు ప్రక్కలు సెక్కలు జానుయుగ్మముల్। రదములు గర్ణముల్ మెడలు రంబులు మూఁపులు వీఁపులూరువు। ల్చిదురుపలై ధరం దొరుఁగ జిందరవందర సేయ సైన్యము। ల్గదనపరాఙ్ముఖక్రమముఁ గైకొని పాఱెఁ గాంది శీకులై॥ వ॥ ఇవ్విధంబున సైన్యంబు దైన్యంబు నొందియు వెఱచియుఁ బఱచియు విచ్చియుఁ జచ్చియుఁ గలంగియు నలంగియు విరిగియు సురిగియుఁ జెదరియు బెదరియుఁ జేవదఱిగినులుము లై తనముఱుఁగు సొచ్చిన బాణుండు శౌర్యధురీణుండును గోపోద్దీపితమానసుండును నై కదిసి యేచి ప్రేసియుఁ బొడిచియు నడఁచియు ననంగియుఁ బెనంగియు॥ క॥ క్రుద్ధుండై యహిపాశని। బద్ధుం గావించె నసురపాలుఁడు రణస। న్నద్ధు న్మరవిద్ధు న్ననిరుద్ధు న్మహితప్రబుద్ధు రూపసమృద్ధున్॥ వ॥ ఇట్లు కట్టిత్రోచిన నుషా సతి శోకవ్యాకులితచిత్తయై యుండె నంతనక్కడ॥ క॥ ద్వారకలోన నిరుద్ధకుమారుని పోక కును యదుసమాజము వగలం। గూరుచు నొక వార్తయు విన। నేరక చింతింప నాల్గు నెలలఱిగె నృపా॥ అయ్యెడ॥

శ్రీ నారదునివలన-ననిరుద్ధవృత్తాంతమును విని-కృష్ణుఁడు-బాణాసురునిమీఁదికిఁ దండెత్తుట. శ్రీ

క॥ శారదనిర్మలనీరద। పారదరుచిదేహుఁ డతులభాగ్యోదయుఁడా। నారదముని యేతెంచెన। పారదయామతి మురారిభజనప్రీతిన్॥ వ॥ ఇట్లు చనుదెంచిన నద్దివ్యమునికి నిర్మలమణివినిర్మితసుధర్మాభ్యంతరంబున యదువృష్ణిభోజాంధకవీరులుగొలువం గొలువున్నకమలలోచనుండు ప్రత్యుత్థానంబు చేసి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి సముచితకనకాసనాసీనుం జేసిన నత్తాపసోత్తముండు పురుషోత్తమునుదాత్తతేజోనిధిం బొగడి యనిరుద్ధువృత్తాంతం బంతయుఁ దేటపడ నెఱింగించి యప్పుండరీకాక్షుని చేత నామంత్రణంబు వడసి యంతర్ధానంబు నొందెఁ దదనంతరంబ కృష్ణుండు శుభముహూర్తంబున దండయాత్రాభిముఖుండై ప్రయాణభేరి వ్రేయించి బలంబుల వెడలింప *బడవాల్గంబనిచి తానును గట్టాయితంబయ్యె నంత॥ సీ॥ హారకిరీటకేయూరకంకణకటకాంగుళీయకనూపురాదివివిధ। భూషణప్రతతి చేఁ బొలుపారు కరముల ఘనగదాశంఖశక్రములు దనర। సురభిచందనలిప్తసురుచిరోరఃస్థలిఁ బ్రవిమలకౌస్తుభప్రభలు నిగుడఁ। జెలువారఁ బీతకౌశేయచేలము కాశ వలను గారింపులువారఁ గట్టి। సైన్యసుగ్రీవమేఘపుష్పకవలాహకములు పూన్చిన తేరాయితముగఁ జేసి। దారకుఁడు దేర నెక్కె మోదంబుతోడ। భానుఁడుదయాచలం బెక్కు పగిది మెఱయ॥ వ॥ ఇట్లు రథారోహణంబు చేసి భూసురాశీర్వచనపూతుండును, మహితదూర్వాంకురాలంకృతుండును, లలితపుణ్యాంగనాకరకిసలయకలితశుభాక్షతవిన్యాసభాసురమస్తకుండును, మాగధమంజులగానానుమోదితుండును, వందిజనసంకీర్తనానందితుండును, బాలకపఠనరవవికాసితహృదయుండును నై వెడలు నవసరంబున॥ సీ॥ బలభద్రసాత్యకిప్రద్యుమ్నయదుముఖవృష్ణిభోజాంధకవీరవరులు। దుర్వారపరిపంథిగర్వభేదనకళాచతురబాహాబలోత్సాహలీల। వారణస్యందనవాజిసందోహంబు సవరణ సేయించి సంభ్రమమున। సముచితప్రస్థానచటులభేరీభూరిఘోషమంభోనిధిఘోషము డఁప। ద్వాదశాక్షౌహిణీబలోత్కరములోలి। నడిచెఁ గృష్ణుని రథము వెన్నంటి చెలఁగి। పృథులగతి మున్ను భగీరథు రథము వెనుక। ననుగమించు వియన్నదిననుకరించి॥ వ॥ ఇవ్విధంబునం గదలి కతిపయప్రయాణంబుల శోణపురంబు చేరం జని వేలాలంఘనంబు చేసి యదువీరులంత॥ మ॥ సరిదారామసరోవరోపవనయజ్ఞస్థానముల్మాపి వే। పరిఘల్పూడిచి యంత్రముల్దునిమి వప్రవ్రాతముల్ ద్రొబ్బి గో। పురముల్గూలఁగ ద్రోఁచి సౌధభవనంబుల్ద్రుంచి ప్రాకారముల్। బరణింగూల్చి కవాటముల్వ్రేటి విరుద్ధండక్రియాలోలులై॥ వ॥ ఇట్లనేకప్రకారంబులగాసి చేసి, పురంబు నిరోధించి పేర్చి యార్చినం జూచి యాగ్రహసమగ్రోగ్రమూర్తియై సమరసన్నాహసంగంబ విజృంభమాణుండై సంగరభేరి వ్రేయించి వ॥ సీ॥ ఆచక్రవాళాచలాచక్రమంతయు భ్రమసి కుమ్మరసారె పగిదిఁ దిరిగె। ఘనఘోణిఖురకోటిఘట్టనస్వనముల కరణి నంభోనిధుల్గలఁగి పొరలెఁ। గాలరుద్రాభీలకరశూలహతి రాలు పిడుగుల గతి నుడుగణము రా

*పడవాళ్లన్। సేనానాయకులను.

లెం। జటులానిలోద్ధూత శాల్మలీతూలంబు చాడ్పున మేఘముల్ చదలఁ దూలె। గిరులు వడకాడెఁ దివి పెల్లగిల్లె సురల। గుండెలవి
సెర సాతలక్షోభ మొదవె। దిక్కులదరె విమానముల్ స్థైరలి చెదరెఁ। గలఁగె గ్రహరాజచంద్రులగతులు దప్పె॥ వ॥ అట్టి సమరస
న్నాహంబునకుఁ గట్టాయితంబై నవమణిఖచితభర్మవర్మనిర్మితనిర్మలాంశుజాలంబులును, శిరస్త్రాణకిరీటకోటిఘట్టితవినూ
త్నరత్నప్రభాపటలంబులును, గనకకుండలగ్రైవేయహారకంకణతులాకోటివివిధభూషణవ్రాతరుచినిచయంబులును,
ప్రచండబాహుదండసహస్రంబును, వెలుఁగ శరశరాసనశక్తిప్రాసతోమరగదాకుంతముసలముద్గరభిండివాలకరవా
లపట్టసశూలతుమురి కాపరిఘాదినిశాతహేతివ్రాతాతిదీధితులును, వియచ్చరకోటినేత్రంబులు మిఱుమిట్లుగొలుపఁగ నకా
చలశృంగసముత్తుంగంబగు రథం బెక్కి యరాతివాహినీసందోహంబునకుం దుల్యంబైన నిజసేనాసమూహంబు లిరుగడల
నడువ బాణుం డక్షీణప్రతాపంబు దీపింపననికి వెడలె నయ్యవసరంబున॥ చ॥ వరదుఁడు దారభక్తజనవత్సలుఁడై నహరుండు

## శ్రీ బాణాసురునకిసహాయభూతుండగు శివునకుఁ గృష్ణునకు యుద్ధమగుట. శ్రీ

బాణునిం। గరమనురక్తి నాత్మజులకంటె దయాళుతఁ జూచుఁ గానఁదా। దరమొనరించు వేడ్కఁ బ్రమథుల్ గుహుఁడున్ నిజ
భూతకోటియు। న్సరవి భజింపను జ్వలనిశాతభయంకరశూలహస్తుఁడై॥ సీ॥ ఖురపుటాహతి రేఁగు ధరణీపరాగంబు పంకే
రుహాప్తబింబంబుఁ బొదువ। విపులవాలాటోపవిక్షేపజాతవాతాహతి వారివాహములు విరియఁ। గుఱుచతిన్నని వాఁడికొ
మ్ములఁ జిమ్మిన బ్రహ్మాండభాండకర్పరము వగుల। నలవోక ఖణిఖణిల్లని ఱంకె వైచిన రోదసీకుహరంబు భేదిలంగ। గళచలద్ఘ
ర్మఘంటికా ఘణఘణప్ర। ఘోషము నదిక్తటంబులాకులత నొంద। లీలనడ తెంచు కలధౌతశైలమనఁగ। నుక్కుమిగిలిన వృష
భేంద్రు నెక్కి వెడలె॥ వ॥ ఇట్లు వెడలి సమరసన్నాహసముల్లాసంబు మొగంబులకు వికాసంబు సంపాదింపం బ్రతిపక్షబలం
బులతోడం దలపడిన ద్వంద్వయుద్ధంబయ్యె నప్పుడప్పురాతనయోధులయాయోధనంబుఁ జూచు వేడ్కఁ జనుదెంచిన సరసి
జసంభవశక్రసురయక్షసిద్ధసాధ్యచారణగంధర్వకిన్నరకింపురుషగరుడోరగాదులు నిజవిమానారూఢులై వియత్తలంబు
ననిల్చి రట్టియెడఁ గృష్ణుండును హరుండును, మారుండును గుమారుండును, గూపకర్ణకుంభాండులును గామపాలుండును,
బాణపుత్త్రుండగు బలుండును సాంబుండును, సాత్యకియును బాణుండును, రథికులు రథికులు, నాశ్వికులు నాశ్వికులును, గజా
రోహకులు గజారోహకులును, బదాతులు పదాతులును దలపడి యితరేతర హేతిసంఘట్టనంబుల మిడుంగురులు చెదరం బర
స్పరాహ్వానబిరుదాంకితసింహనాదహుంకారశింజినీటంకారవారణఘీంకారవాజిహేషారవంబులను, బటహకాహళ
భేరీమృదంగశంఖతూర్యఘోషంబులను, బ్రహ్మాండకోటరంబు పరిస్ఫోటితంబయ్యె నయ్యవసరంబున॥ చ॥ జలరుహనాభుఁ
డార్చి నిజశార్ఙ్గశరాసనముక్తసాయకా। వలి నిగుడించి నొంచె బురవైరిపురోగముల న్రణక్రియా। కలితులగుహ్యకప్రమథ
కర్బురభూతపిశాచఢాకినీ। బలవదరాతియోధులను బమ్మెరపోయి కలంగిపాఱఁగన్॥ వ॥ ఇట్లేసి యార్చిన కుంభినీధరుభు
జావిజృంభణసంరంభంబునకు సహింపక నిటలాంబకుండనలకణంబులుమియు నిశితాంబకంబులం బీతాంబరుని నేసిన వాని
నన్నింటి నడుమనం బ్రతిబాణంబు లేసి త్రుంచిన నంగనుం గోని మఱియును॥ మ॥ అనలాక్షుండు త్రిలోకపూజ్యుఁడగు బ్రహ్మా
స్త్రంబటెంబోసియా। వనజాతేక్షణుమీఁదఁ గ్రోధముహిమవ్యాకీర్ణుఁడై యేసె నే। సినఁ దద్దివ్యశరంబు చేత నెమరల్చెన్ గ్రృ
ష్ణుఁడత్యుగ్రలీలన్। జనితాశ్చర్యరసాబ్ధిమగ్నులగుచుం శక్రాదులగ్గింపఁగన్॥ శా॥ వాయవ్యాస్త్రము పేర్చి పైనలిగిదు
ర్వారోద్ధతి న్నేయఁడై। తేయఁ ధ్వంసియుఁ బార్వతాశుగము చే। ద్రెంచెం గ్రతుధ్వంసి యా। గ్నేయాస్త్రంబడరించె నుగ్ర
గతి లక్ష్మీనాథుపై దాని వే। మాయం జేసెను నైంద్రబాణమునఁ బద్మాక్షుండు లీలాగతిన్॥ మఱియును॥ ఉ॥ పాయనికిన్కతో
హరుఁడు పాశుపతాస్త్రము నారిఁ బొసినన్। దోయరుహాయతాక్షుఁడును దోడన లోకభయంకరోగ్ర నా। రాయణబాణ
రాజము రయంబున నేసి మరల్చె దానిఁ జ। క్రాయుధుఁ డెత్తెఁ జంగునఁ బురారిశరావలి రూపుమాపినన్॥ క॥ ఊహకలంగియు
విగతోత్సాహుండగు హరుని మీఁది జలజాక్షుఁడు స। మ్మోహనశిలీముఖంబు। వ్యాహతజయశాలియగుచు నడరించె నృపా॥
అట్లేసిన॥ క॥ జృంభణశరపాతము చే। శంభుఁడు నిజతనువు పరవశంబై సోలన్। జృంభితుఁడై ఘననిద్రా। రంభత వృషభేం
ద్రు మూపురముపై వ్రాలెన్॥ వ॥ ఇట్లు వ్రాలిన నంజక్రపాణి పరబలంబుల నిశితబాణపరంపరలం దునిమియు, నొక్కయెడం గృ
పాణంబులం గణికలు చేసియు, నొక్క చో గదాహతులం దుత్తుమురుగా మొత్తియు, నివ్విధంబునఁ బీనుంగుపెంటలుగావిం
చెనంత॥ చ॥ తఱిని మురాంతకాత్మజుఁడు దారబలంబున బాహులేయుపైఁ। గటికరి దాఁకఁ దీవ్రశరకాండపరంపర లేసి నొం
పఁగా। నెఱకలు గాడి పెల్లొరుగ నెత్తుటఁ జొత్తిలి వైరులార్వఁగాఁ। బఱచె మయూరవాహనము పైకొని తోలుచు నాజిభీ
తుఁడై॥ ఉ॥ పంచిరణావనీస్థలవిపాటితశాత్రవవీరుఁడై నయా। సాంబుఁడు హేమపుంఖసితసాయకజాలము లేర్చి భూరికో।

పంబున నేసినం జెదరి బాణతనూభవుఁడోడిపాఱె శౌర్యంబును బీరము నందగవు నా నడివో వబలంబులార్వఁగన్ ॥మ॥ వరబాహాబలశాలియాహలి రణావష్టంభసంరంభవిస్ఫురదుగ్రాశనితుల్యమైన ముసలంబుం బూన్చి ప్రేసె న్వడిం। బోరికుంభాండకకూపకర్ణులశిరంబుల్ వ్రస్సె మేపంబునై। తుత్తురుకర్ణంబుల చాతనుం దొలుఁగ సంధుల్ వీడి వే చావఁగన్ ॥వ॥ అట్టియెడ సైన్యంబు దైన్యంబు నొందియ నాథలై చెడి విఱిగి పాఱి నం గని బాణుండు సాత్యకిం గేడించి ప్రళయాగ్నియుంబోలె విజృంభించి చెయివీఁచి బలంబులను అలంబునకుఁ బురికొల్పి తానును ముంగలియై నడువ నప్పు డుభయసైన్యంబుల న్యోన్యజయకాంక్షులం దలపడి దక్షిణోత్తరసముద్రంబుల వీఁకం దాఁకినం బోరు ఘోరం బయ్యె నట్టియెడం గదలనడఁచియుఁ, గుఠారంబులం బొడిచియు, సురియలం గ్రమ్మియు, శూలంబులం జిమ్మియు, శక్తులముంచియుఁ, జక్రంబులం ద్రుంచియు, ముసలంబుల మొత్తియు, ముద్గరంబుల మొత్తియుఁ, గుంతంబులం గ్రుచ్చియుఁ, బంతంబులెచ్చియు, బరిఘంబుల నొంచియు, బట్టసంబులం ద్రుంచియు, శరంబుల నేసియు, గరవాలంబుల వ్రేసియు, సత్రాసులై పాసియు, విత్రాసులై డాసియుఁ, బెనంగి నం దునిసిన శిరంబులును, దునుకలైన కరంబులును, దెగిన కాళ్లును, ద్రెస్సిన వ్రేళ్లును, దుమురులైన యెముకలును, బ్రోవులైన ప్రేవులును, సులిసిన మేనులును, నలిగిన జానువులును, నెగిలిన వర్మంబులును, బగిలిన చర్మంబులును, వికలంబులైన సకలావయవంబులును, వికీర్ణంబులైన కర్ణంబులును, విచ్ఛిన్నంబులైన నయనంబులును, వెడలు రుధిరంబులును, బడలువడు బలంబులును, గొండలవడు వునంబడు మాంసఖండంబులును, వాచ యచుకొను ప్రాణులును, వ్రాలిన తేరులును, గూలిన కరులును, నొలిన గుఱ్ఱంబులును, బలలఖాదనకుతూహలజనితమదాంధీభూతపిశాచఢాకినీభూతభేతాళసమాలోలకోలాహలభయంకరారావబధిరీకృతసకలదిశావకాశంబును నై సంగరాంగణంబు భీషణం బయ్యె నయ్యవసరంబున ॥చ॥ శరకుముదంబులుల్లసితచామరఫేనములాతపత్రభా। సురనవపుండరీకములు శోణితతోయములస్థి సైకతో। త్కరము భుజాభుజంగమనికాయము కేశకలాపశైవల। స్ఫురణరణాంగణంబను రెంబూరితశోణనదంబు పోలికన్ ॥వ॥ అట్టియెడ బాణుండు కట్టలుకం గృష్ణుని పైఁ దన రథంబు బరపించియు ఖర్వబాహాసహస్రదుర్వారగర్వాటోపప్రదీప్తుండై కదిసి ॥మ॥ ఒకరేనూఱుకరంబులన్ ధనువులత్యుగ్రాకృతిం దాల్చి తత్కటకమొకొట కటసాయకద్వయము వీఁకం బూన్చి నాలోననం। దకహస్తుండు దదుగ్రచాపచయవిధ్వంసంబుఁ గావించి కొంజకఁ దత్సారథిఁగూల నేసి రథముం జక్కాడె శౌర్యోద్ధతిన్ ॥గీ॥ ప్రళయజీమూతసంఘాతభయదభూరి। భైరవారావముగ నొత్తెఁ బాంచజన్య। మఖిలజనులు భయభ్రాంతులై చలింపఁ। గడఁగి నిర్భిన్నరాక్షసీగర్భముగను ॥వ॥ అట్టియవక్రవిక్రమపరాక్రమంబున వెగడుపడి బాణుండు వ్రేలు మొగంబువడి సేయునది లేక విన్ననై యున్న యెడ ॥సీ॥ అత్తఱిఁ గోటరియను బాణజనయిత్రి సుతుఁ గాఁచు మతము సన్మతిఁ దలంచి। వీడి శిరోజముల్ వ్రేలంగ నిర్ముక్తపరిధానయై మురాసురవిభేది। యెదుర నిల్చినఁ జూడమదిఁ జాలరోసి పరాఙ్ముఖుఁడై యున్నయనువు లేచి । తల్లడించుచు బాణుఁడుల్లంబుగలగంగఁ దలచీర వీడ యాదవులు నవ్వ। నవ్యకాంచనమణిభూషణములు రాలఁ। బాదహతి నేల గంపింపఁ బాఱియాత్మ। పురము వడిఁ జొచ్చె నప్డు

## శ్రీ వైష్ణవజ్వరముచేఁ బరాజితంబై - శైవజ్వరము శ్రీకృష్ణుని స్తుతించుట.

డు భూతగణము లాకులత తోడ నెక్కటియలుగుట యును.క॥ శిరములు మూఁడును ఘనభీకరపదములు మూఁడు గల్గి కనలి మహేశ। జ్వరము రుఘోరాకృతితో। నరుదెంచుచునుండఁ గృష్ణుఁ డల్లన నగుచున్ ॥చ॥ పసువడి వైష్ణవజ్వరముఁ బంచిన నయ్యుభయజ్వరంబులు। న్వైరవునులావు చేవయును వీరము బీరముగల్గి ఘోరసం। గరమొనరింప నందుఁ గరకంఠకృతజ్వరముగ్రవైష్ణవ। జ్వరమునకోడి పాఱె ననివారణ వైష్ణవి వెంటనంటఁగన్ ॥గీ॥ పాఱి నేదిక్కుఁ గానక ప్రాణభీతిఁ। జేరి యేడ్చుచు నా హృషీకేశుపాద। కంజములకెఱఁగి ననుఁ గావు కావుమనుచు । నిటలతటలసితాంజలిఘటితయగుచు॥ ఇట్లు వినుతించె॥ సీ॥ అవ్యయు ననఘు ననంతశక్తినిఁ బరులైనట్టి బ్రహ్మరుద్రామరేంద్ర। వరులకీశ్వరుఁడైన వానిసర్వాత్మకు జ్ఞానస్వరూపు సమానరహితు। వరదు నిజగదుద్భవస్థితిసంహారహేతుభూతుని హృషీకేశు నభవు । బ్రహ్మచిహ్నంబులై పరగు సుజ్ఞానశక్త్యాదుల నొప్పు బ్రహ్మంబు నీశు। నజు *షడూర్మిరహితు నిజయోగమాయావి। మోహితాఖిలాత్మముఖ్యచరితు। మహితతేజు నాదిమధ్యాంతహీనుని। జిన్మయాత్ముని నుభజింతుఁ గృష్ణ॥ వ॥ అదియునుం గాక లోకంబున దైవంబుల నేకప్రకారంబులై యుండునది యెట్టిదనినఁ; గలాకాష్ఠాముహూర్తంబులుగల కాలంబును, సుకృతదుష్కృతానుభవరూపంబులుగల జీవకర్మంబులును, స్వభావంబును, సత్త్వరజస్తమోగుణాత్మకంబైన ప్రకృతియును, సుఖదుఃఖాశ్రయంబైన శరీరంబును, జగజ్జంతునిర్వాహకంబైన ప్రాణంబును సకలపదార్థపరిజ్ఞానకారణంబైన యంతఃకరణంబును మహదహంకారశబ్దస్పర్శరూపరసగంధతన్మాత్రతత్కార్యభూతగగనపవనానలసలిలధరాది పంచభూతంబులు నాదిగాఁగల ప్రకృతివికారంబులును

* షడూర్ములు। అశన-పిపాస-శోక-మోహ-జరా-మరణములు.

న్నింటిసంఘాతంబును, బీజాంకురన్యాయ్యంబునం గార్యకారణరూపప్రభావంబును నై, జగత్కారణశంకితంబై యుండు, నదియంతయు భవదీయ మాయావిడంబనంబు గాని యున్నయది కాదు- తదీయమాయానివర్తకుండవై నీవు నానావిధదివ్యావతారాదిలీలలం జేసి దేవగణంబులను, సత్పురుషులను, లోకనిర్మాణచణులైన బ్రహ్మాదులను బరిరక్షించుచు లోకహింసాప్రవర్తకులై నదుష్టమార్గగతులం గ్రూరాత్ములహింసించుచు, విశ్వవిశ్వంభరాభారనివారణంబు సేయుటకుం గదా భవదీయదివ్యావతారప్రయోజనంబు గావున నిన్ను శరణంబు వేఁడెద॥ సీ॥ చండమై నుహితవీక్షణమున్సహంబై యుధాగమై వెలుఁగొందు తావకీన। భూరిభాస్వత్తేజమునఁ దాప మొందితిఁ గడుఁ గృశించితి నన్నుఁ గరుణఁ జూడు। మితరదేవోపాస్తిరతిమాని మీపాదకమలము ల్సేవించు విమలబుద్ధి। యెందాఁక మదిఁ దోఁపదం దాఁక నీజగత్ప్రాణులు నిఖిలతాపము నఁబడుట। యవిరళానన్యగతికులనరసి ప్రోచు। బిరుదుగల నీకు ననుఁ గాచుటరు దె దేవ। ప్రవిమలాకారసంసారభయవిదూర। భక్తజనపోషకరితోషపరమపురుష॥ చ॥ అని నఁ బ్రసన్నుఁడై హరియనంతుఁడు దైత్యవిభేది వానికిట్లని యెమదీయసాధనమనన్యనివారణమాటనీమదిం। గని ననునార్తిఁ జొచ్చితివి గావున మజ్వరతీవ్రదాహవే। దననినుఁ బొందదింకఁ బరితాపముదపక్కు మునీమనంబునన్॥ వ॥ అని మఱియు నప్పుండరీకాక్షుండిట్లను- నెవ్వరేని యు నీయుభయజ్వరవివాదంబును, నీవు మత్ప్రపత్తిం జొచ్చుటయుఁ జిత్తంబులఁ దలంతు రట్టిపుణ్యాత్ములు శీతోష్ణజ్వరాదితాపంబులం బొరయరనియానతిచ్చిన నమ్మహేశ్వరజ్వరంబు పరమానందభరితహృదయంబున నారథాంగపాణికి సాష్టాంగదండప్రణామం బాచరించి నిజేచ్ఛం

## శ్రీకృష్ణునిచేఁ బరాహతుండగు బాణాసురునిఁ గాపాడుటకు శివుండు కృష్ణుని స్తుతించుట.

జనియె నంత బాణాసురుండు నక్కడ॥ సీ॥ కమనీయకింకిణీఘంటికాదిసహస్రఘణఘణధ్వనిచేత గగనము గలన న్యజనాలోకనాభీలతరళోగ్రకాంచనధ్వజపతాకలు వెలుంగ। బృథునేమిఘట్టనఁ బృథివిఁ గంపింపంగ వలనొప్పఁ బటుజవాశ్వములఁ బూన్చి। నట్టియున్నతరథంబత్యుగ్రగతి నెక్కి- కరసహస్రములభీకరతరాసి। శరశరాసనముఖదివ్యసాధనములు। దనరఁ జలమును బలమును తక్కటముగాఁగ। హర్షమిగురొత్తకయ్యంపుటాయితముగ। బురము వెలువడె బలిపుత్రుఁ డురుజవమున॥ క॥ చని రణభూమిని మధ్యం। దినమార్తాండప్రచండదీప్తాకృతితోఁ। దనరుచుఁ బరిపంథిబలేం। ధనదవశిఖియైన కృష్ణుఁ దాఁకెం బెలుచన్॥ ఉ॥ తాఁకి భుజావిజృంభణము దర్పము నేర్పును నేర్పడంగ నొక్కూఁకున వేయుచేతులను హుగ్రశరావలి పింజపింజతోఁ। దాఁకఁగ నేసిన న్మురవిదారుఁడు తోడన దచ్ఛరావళిన్। నాఁకగొనాఁకఁ ద్రుంచెనిశితార్ధశశాంకశిలీముఖంబులన్॥ అంత॥ చ॥ నుతనవపుండరీకనయనుం డననొప్పము రారిరోషఘూర్ణితమహితారుణాబ్జదళనేత్రుఁడు దానయుపంచెదైత్యుపై। దితిసుతకాననప్రకరదీపితశుక్రమురక్షితాంచితా। శ్రితజనచక్రమున్సతతసేవితశక్రము దివ్యచక్రమున్॥ వ॥ అదియునుం బ్రచండమార్తాండమండలప్రభావిడంబితంబును భీషణశతసహస్రకోటిదంభోళినిబిడనిశితనిష్ఠురధారాసహస్రప్రభూతజ్వలనజ్వాలికాపాస్తసమస్తకుటిలపరిపంథిదుర్వారబాహుగర్వాంధకారంబును, సకలదిక్పాలదేవతాగణజేగీయమానంబును, సమంచితదానవజనలోకభయంకరదర్శనంబునగు సుదర్శనం బసురాంతకప్రేరితంబై చనియారామకారుండు కదళికాకాండంబుల నేర్చుచందంబునం బేర్చి సమదవేదండశుండాదండమండితంబును, గనకమణివలయకేయూరకంకణాంకితంబున గు తదీయబాహాసహస్రంబుఁ గరచతుష్టయావశిష్టంబు గాఁ దునుమునవసరంబున॥ గీ॥ కాలకంఠుఁడు బాణుపైఁ గరుణ గలఁడు। గాన నఖిలాండపతిఁ గృష్ణుఁ గదియవచ్చి। పురుషసూక్తంబు చదివి సంపుటకరాబ్జుఁ। డగుచుఁ బద్మాయతాక్షు నిట్లని నుతించె॥ వ॥ దేవా నీవు బ్రహ్మస్వరూపంబగు జ్యోతిర్మయుండవు, నిఖిలవేదవేదాంతనిరూఢుండవు, నిర్మలుండవు, సమానాధికరహితుండవు, సర్వవ్యాపకుండవైన నిన్ను నిర్మలాంతఃకరణులైనవార లాకాశంబుస గిదియవలోకింతురదియునుం గాక పంచోపనిషన్మయంబైన భవదీయదివ్యమంగళమహావిగ్రహపరిగ్రహంబు సేయు నెడ నాభియందాకాశంబును, ముఖంబునం గృశానుండును, శిరంబున స్వర్గంబును, శ్రోత్రంబుల దిశలును, నేత్రంబుల సూర్యుండును, మనంబున సోముకాములును, బాదంబుల వసుంధరయు, నాత్మయందహంకారంబును, జఠరంబున జడధులును, రేతంబున నంబువులును, భుజంబుల నింద్రుండును, రోమంబుల మేఘమహీరుహౌషధివ్రాతంబును, శిరోజంబున బ్రహ్మలును, జ్ఞానంబున సృష్టియు, నవాంతరప్రజాపతులును, హృదయంబున ధర్మంబును, గలిగిన మహాపురుషుండవై లోకకల్పనంబుకొఱకు నీయకుంఠితతేజంబు గుప్తంబు చేసి జగదుద్భవంబుకొఱకుఁ గైకొన్న భవదీయదివ్యావతారవైభవం బెఱింగి నుతింపనెంతవారము- నీవు సకలచేతనాచేతననిచయంబులకాద్యుండవు, నద్వితీయుండవు, పురాణపురుషుండవు, సకలసృష్టిహేతుభూతుండవు, దినకరుండు కాదంబినీకదంబావృతుండగుచు భిన్నరూపుండై బహువిధచ్ఛాయలం దోఁచువిధంబున నీయఘటిత

ఘటనానిర్వాహకంబైన సంకల్పంబునఁ ద్రిగుణాతీతుండవయ్యును సత్త్వాదిగుణవ్యవధానంబులననేకరూపుండవైసుణవం
తులైనసత్పురుషులకుఁదమోనివారకంబైనదీపంబురూపంబునం బ్రకాశించుచుండువు భవదీయమాయావిమోహితులై
నజీవులుపుత్త్రదారగృహక్షేత్రసంసారాదిరూపంబైనపాపపారావారమహావర్తగర్తంబులమునుంగుచుం దేలుచుండురు
దేవా భవదీయదివ్యరూపానుభవంబు సేయంజాలక నింద్రియపరతంత్రుండై భవత్పాదసరసీరుహంబుల నేర్పునఁ జేరనె
ఱుంగనిమూఢాత్ముండాత్మవంచకుండనంబడు విపరీతబుద్ధిం జేసి ప్రియుండవైననిన్ను నొల్లక నింద్రియార్థానుభవంబు సే
యుటయమృతంబుమానివిషాలాహాలంబు సేవించుటగాదె జగదుదయపాలనలయలీలాహేతుండవై శాంతుండవై సుహృజ్జ
నభాగధేయుండవై సమానాధికవస్తుశూన్యుండవై ననిన్ను నేనునుం బ్రహ్మయుంబరిణతాంతరంగికరణులైనమునిగణంబులు
నుభజించుచుందుమునుటయు॥ గీ॥ అవ్యయుండవనంతుండవచ్యుతుండ। వాదిమధ్యాంతశూన్యుండవఖిలధృతివి। నిఖిలమం
దెల్లవర్తింతు నీవుపగిలి। నిఖిలమెల్లను నీయంద నెగడుఁగృష్ణ॥ సీ॥ అనిసన్నుతించినహరియాత్మ మోదించి మొగమునఁజిఱున
వ్వు మొలకలెత్త। లలితబాలేందుకళామాలికిట్లను శంకర నీమాట సత్యమరయ। నేదినీకిష్టమైయొసఁగెదుఁ జానినవేడుమునీ
కిచ్చువీఁడవధ్యుఁ। డదిమెట్టిదనినఁ బ్రహ్లాదుండునుద్భక్తుఁడతనికివరమునీయన్వయమున। జననమందినవారలఁజంపననుచుఁ।
గడఁగిమన్నించితినినదిగారణమున। విశ్వవిశ్వంభరాభారవిపులభూరివరభుజాగర్వమడఁపంగవలయుఁగాన.క॥ కరములు
నాలుగు చిక్కఁగ। బరిమార్చితి వీఁడు నీదుభక్తులకగ్రే। సరుఁడై సొగడొందిజరా। మరణాదిభయంబుదక్కి మనునిటమీఁదన్॥
వ॥ అనియానతిచ్చిననంబికావరుండుసంతుష్టాంతరంగుండయ్యెనబ్బలినందనుండు రణరంగవేదిం గృష్ణదేవతాసన్నిధిం బ్ర
జ్వలితచక్రకృశానుశిఖాజాలంబులందు నిజబాహాసహస్రశాఖాసమిత్ప్రచయంబులును, దక్షతోద్వేలకీలాలమహితా
జ్యధారాశతంబులును, బరభయంకరవీరహుంకారమంత్రంబులతోడ వేల్చి పరిశుద్ధింబొంది విజ్ఞానదీపాంకురంబున భుజా
గర్వదర్పాంధకారంబు నివారించి యనవరతపూజితస్థాణుండగు బాణుండు భుజవనవిచ్ఛేదజనితవిరూపితస్థాణుండయ్యు
ను, దదీయవరదానకలితానందహృదయారవిందుండగుచు గోవిందచరణారవిందంబులకుం బ్రణామంబులాచరించియనం

## శ్రీ అనిరుద్ధుఁడుషాకన్యాసమేతుఁడై ద్వారకాపురముఁ బ్రవేశించుట. శ్రీ

తరంబ॥ క॥ పురమునకేగియుషాసుం। దరికిని ననిరుద్ధునకు ముదంబున భూషాం। బరదాసీదాసజనా। వరవస్తువితాన మొసఁగి
వారనిభక్త్రిన్॥ క॥ కనకరథంబున నిడికొని। ఘనవైభవ మొప్పఁగన్యకాయుక్తముగా। ననిరుద్ధుని గోవిందుం। డను మోదింపం
గఁదెచ్చియర్పించె నృపా॥ ఉ॥ అంతమురాంతకుండుద్రిపురాంతకువీడ్కొని బాణునిల్పియ। త్యంతవిభూతివైనిజబలావలితోఁ
జను దేరనాయుషా। కాంతుఁడుమున్నుగాఁబటహకాహళతూర్యనినాదపూరితా। శాంతరుఁడై వెసంజనియె నాత్మపురీ
ముఖుఁడైముదంబునన్॥ మ॥ కనియెన్గోపకుమారశేఖరుఁడురంగత్ఫుల్లరాజీవకో। కనదోత్తుంగతరంగసంగతలసత్కాసార
కన్యాపరిశోభననిత్యోన్నతసౌఖ్యధారకనుదంచద్వైభవోదారక। న్జనసంతాపనివారకన్సుజనభాస్వత్తారకన్ద్వారకన్॥
వ॥ కనిడాయంజనిపురలక్ష్మికృష్ణసందర్శనకుతూహలయై చేసన్నలంజీఱుచందంబున నందంబునెందు నుద్ధూతతరళవిచి
త్రకేతుపతాకాభిశోభితంబును, మహనీయమరకతతోరణమండితంబును, గనకమణివినిర్మితగోపురసౌధప్రాసాదవీధికా
విలసితంబును, మౌక్తికవితానవిరచితమంగళరంగవల్లీవిరాజితంబును, శోభనాకలితవిన్యస్తప్రశస్తకదళికాస్తంభసు
రభికుసుమమాలికాక్షతాలంకృతంబును, కుసుమసలిలసిక్తవిపణిమార్గంబును, శంఖదుందుభిభేరీమృదంగపటహకాహ
ళాదిమంగళారావకలితంబును, వందిమాగధసంగీతప్రసంగంబును, గలిగియతిమనోహరవిభవాభిరామంబైనయప్పు
రంబున సచివపురోహితసుహృద్బాంధవముఖ్యులెదురుకొన భూసురాశీర్వాదంబులును, బుణ్యాంగనాకరకలితలలితాక్ష
తలను, గైకొనుచుం గామినీమణులు గర్పూరనీరాజనంబులు నివాళింప నిజమందిరంబుఁ బ్రవేశించి యప్పుండరీకాక్షుండుప
రమానందంబున సుఖంబుననుండెనంత॥ క॥ శ్రీకృష్ణునివిజయంబగు। నీకథఁబఠియించువారలెప్పుడు జయముం। గైకొని యి

## శ్రీ నృగమహారాజుచరిత్రము. శ్రీ

హపరసౌఖ్యము। లాకల్పోన్నతివహింతురవనీనాథా॥ క॥ అని చెప్పిన శుకయోగికి। జననాయకుఁడనియెఁ గృష్ణచరితము విన
నా। మనమెపుడుఁ దనియదింకను। వినవలతుం గరుణఁ జెప్పవే మునినాథా॥ అనినం బరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండి
ట్లనియె. సీ॥ ధరణీశ యొకనాఁడు హరితనూజులు రతీశ్వరసాంబగదచారుచారుభాను। లాదిగా యదుకుమారావలియుద్యా
నవనమునకతివైభవమున నేఁగి। వలనొప్పనిచ్చానువర్తులై సుఖలీలఁ జరియించి ఘనపిపాసలను బొంది। నెటఁదప్పిసలిలను
న్వేషించుచును వేగవచ్చుచో నొకచోట వారిరహిత। కూపమునునందులో నొకకొండవోలె। విపులమగు మేనియూసరవె

ల్లిఁ గాంచి। చిత్తమున విస్మయం బందితత్తరమున। దాని వెడలించు వేడుకఁ దగులుటయును॥ చ॥ పరువిడి పోయి తెచ్చి ఘనపాశ
చయంబుల నంట గట్టియ। గ్గురుభుజులం దడుంగ దిసికోయని యార్చుచు దాని నెమ్మెయిం। దరలఁగఁ దీయ లేక దగ దట్టముగా
మదిమట్టగిల్ల నొం। డొరు గడవంగ వేచని పయోరుహనాభునకంతఁ జెప్పినన్॥ చ॥ వినిసరసీరుహాక్షుఁ డతివిస్మితుఁడై జన
శూన్యకూపమం। ల్లనఁ గదియంగ నేఁగి *కృకలాసము నెక్క తృణంబవోలె గో। బ్బున వెడలించె వామకరపద్మమునన్న దియం
తలోనఁ గాం। చనరుచి మేను గల్గి పురుషత్వముతోఁ బొడసూపి నిల్చినన్॥ వ॥ ఇట్లు నిల్చినం జూచి కృష్ణుం డతనివృత్తాంతం
బంతయు నెఱింగియు నక్కడి జనంబులుఁ గుమారవర్గంబును దెలియుకొఱకు నతని చేత నతద్వృత్తాంతం బంతయు నెఱిం
గించువాఁడై యిట్లనియె॥ చ॥ కనమురురత్నభూషణనికాయుఁడవై మహనీయమూర్తివై। యనుపమకీర్తిశోభితుఁడవై విల
సిల్లుచు ధాత్రి మీఁదఁ బెం। పొనరిన నీకు నేమి గతి నూసరవెల్లి తనంబు చొప్పడెన్। విననిది చోద్యమయ్యె సువివేకచరిత్ర
మెఱుంగఁ జెప్పుమా॥ క॥ అని యడిగిన మురరిపుపద। వనజంబులఁ దనకిరీటవరమణులొఱయన్। వినయమున మ్రొక్కి యిట్ల
ను। ఘనమోదముతోడ నిటలఘటితాంజలియై॥ గీ॥ విశ్వసంవేద్య మహితయి విశ్వమందుఁ। బ్రకటముగ నీ వెఱుంగని దొ
కటి గలదె। యయిన నా చేత విననిష్టమయ్యెనేని। నవధరింపుము వినుపింతునంబుజాక్ష॥ ఉ॥ ఏనిక్ష్వాకుతనూజుఁ డన్నృగుఁడ
నా నే పారు భూపాలుఁడన్। దీనవ్రాతమునర్థిఁ బ్రోచు ధరిత్రీనాయకుల్గ్లాల్పి స। మ్మానింపన్ జతురంతభూభరణసాఘ
ర్త్యుండనై సంతత। శ్రీనిండారిన వాఁడనుల్లసితకీర్తిస్ఫూర్తిశోభిల్లఁగన్॥ చ॥ పలుకులఁ దన్నుఁ దాఁ బొగడఁ బాతకమందు
రటుండఁ దార కా। వలి సికతా వ్రజంబు హిమవారికణంబులు లెక్కవెట్టఁగా। నలవడుఁ గాని యేను వసుధామరకోటికి దాన
మిచ్చు గో। వులగణుతింప ధాతయును నోపఁడు మాధవ యేమి చెప్పుదున్॥ అదియునుం గాక॥ చ॥ పొలుచు సువర్ణశృంగఖుర
ముల్దనరన్ దొలుచూలులై సువత్సలుగల పాడియావులను దాత్తతపోవ్రతవేదపాఠముల్। గలిగి కుటుంబులై విహితకర్మ
ములం జరియించు పేదవి। ప్రులకు సదక్షిణంబుగ విభూతిఁ దలిర్పఁగ నిత్తునచ్యుతా॥ వ॥ మఱియు న్యాయసముపార్జితవిత్త
మ్ములఁ గో భూ హిరణ్య రత్న నివాస రథ హస్తి వాజి కన్యా సరస్వతీ వస్త్ర తిల కాంచన రజత శయ్యాది బహువిధదానంబుల
నూనంబులుగా ననేకంబులు సేసితిఁ బంచమహాయజ్ఞంబు లొనరించితి, వాపీకూపతటాకవననిర్మాణంబులు సేయించితి, ని
వ్విధంబునం జేయుచో నొక్కనాఁడు॥ క॥ అనఘాత్మకశ్యపాఖ్యుం। డను విప్రునకేన కల్మషాత్ముఁడనై యి। చ్చిన గోవు దప్పి
నా మంద నెగలసినఁ దెలియ లేకఁ దగ నా గోవున్॥ క॥ ఒండొక భూమీసురకుల। మండనునకు దాన మీయ మసలక యావి
ప్రుండా గోవుం గొని చను। చుండన్ మును ధారఁ గొన్న యుర్వీసురుఁడున్॥ క॥ మఱి రోష మొదవ దోవతి। వదలిన బిగియించి
కొనుచు వడిఁ జని యిది నా। మొదవు నడివీధిఁ దొంగిలి। వదలక కొనిపోయెదిట్టి వారును గలరే॥ చ॥ అనవుడు నాతఁ డిట్లనియె నా
తని తో నిపుడే నృపుఁడు దీనినీ। జనపతిచేత ధారఁ గొని సాధుగతిం జననీ దియింటయె। ట్లనినన తండు నే ను సుధరాధిపు చేమఁ సుధా
రఁ గొన్నయా। వని వినిపింప నిద్దఱకు నయ్యె నపారవివాదమచ్చటన్॥ వ॥ ఇట్లు విప్రు లిద్దఱుం దమలోనం దంతకంతకు మచ్చరం
బునం బెచ్చు పెరిగి కలహించి నాయున్నయెడకుం జనుదెంచి మున్ను నా చేత గోదానంబుఁ గొన్న బ్రాహ్మణుం డిట్లనియె॥
సీ॥ మనుజేంద్ర ప్రజల ధర్మప్రవర్తనముల నడువకుండఁగ నాజ్ఞ నడుపు నీవు। మనమున నే ధర్మమని యాచరించితిమును నా
కునిచ్చిన మొదవు దప్పి। వచ్చి నీ మందలోఁ జొచ్చిన నిప్పుడీ భూసురునకు ధారఁ బోసి యిచ్చి। తగవు మాలితివీవ దాతవునపహ
ర్తవైననిన్నే మనన వనినాథ। యనిన మాటలు చెవులు సోఁకినఁ గలంగి। భూసురోత్తమ యజ్ఞానపూర్వకమున। నిట్టి పాత
కమొంటసె నే నెఱిఁగి సేయఁ। గొను మునీకిత్తు నొక లక్షగోధనంబు॥ క॥ అని మఱియును నవ్విప్రుని। సునయోక్తుల నను
నయించుచును నిట్లంటి। న్ననుఁ గావు నరకకూపం। బునఁ బడఁ గాఁ జాలఁ బురుషపుంగవ యనినన్॥ గీ॥ ఎంత వేఁడిన మచ్చరం
బంత పెరిగి। మొదలు నాకిచ్చినట్టియీ మొదవె కాని। యొనయ నీ రాజ్యమంతయు నిచ్చితేని। నొల్లననివిప్రుఁ డచ్చటనుండక ఱి
గె॥ వ॥ అట్లు తండఱిగిన నా రెండవ బ్రాహ్మణునిం బ్రార్థించిన నతండును జలంబుడింపక పది వేలేరికోరు పాఁడి మొదవు లిచ్చి
ననై ననుదీనినకాని యొల్లనని నిలువక చనియె నంతఁ గాలపరిపక్వంబై నన్ను దండధరకింకరులు గొనిపోయి వైవస్వతుమం
దిరంబు దిట్టిన నతండు నన్ను నుద్దేశించి యిట్లనియె॥ మ॥ మనుజేంద్రోత్తమ వంశపావన జగన్మాన్య క్రియాచారనీ। ఘనదాన
క్రతుధర్మముల్ద్రిభువనఖ్యాతంబులై చెల్లెడిన్। మును దుష్కర్మఫలంబు నొందిపిదపన్ బుణ్యానుబంధంబులై। దను సౌఖ్యం
బులఁ బొందు పద్మజుని యాజ్ఞం ద్రోవఁగా వచ్చునే॥ వ॥ అని వేగంబునం ద్రోపించిన నేనపుడపుడ నింబడి యోనికృష్ణంబైన
యూసరవెల్లి రూపంబు గైకొంటి నింత గాలంబు తద్దోషనిమిత్తంబున నిద్దురవస్థం బొందవలసెఁ బ్రాహ్మణులకుఁ బుణ్యాపా
పంబులను భావ్యంబులు గాని యూరక పోనేరవు నేఁడు సమస్తదురితనిస్తారకంబైన భవదీయపాదారవిందసందర్శనంబు

* కృకలాసము। ఊసరవెల్లి-తొండ.

నేఁ జేసియీ ఘోరమగ్గ్రశలంబాసినిర్మలాత్మకుండనై తిననిపునగిపునగి ప్రణామంబులాచరించిమఱియునిట్లనియె॥ గీ॥ కృష్ణ వాసుదేవ కేశవపరమాత్మ। యప్రమేయవరదహరిముకుంద।నిన్నుఁ జూడఁగంటినీకృపఁగనుఁగొంటి। నఖిలసౌఖ్యపదవు లందఁగంటి॥ వ॥ అనియనేకభంగులంగొనియాడి గోవిందునిపదంబులు దనకిరీటంబులు సోఁకం బ్రణమిల్లి దేవా భవదీయపాదారవిందంబులు నాహృదయారవిందంబునం బాయకుండునట్లుగాఁ బ్రసాదింప వేయనితదనుజ్ఞాతుండై యచ్చటిజనంబులు సూచియుచ్చు తానందంబునుం బొందనతుల తేజోవిరాజితంబైన దివ్యవిమానమం దాసీనుండై దివంబునకఱిగె నంత నవ్వాథవుండునచ్చటనున్నపార్థివోత్తములకు ధర్మబోధంబుగా నిట్లనియె ॥ సీ ॥ నరనాథకులకాననముదహించుటకు నునవనీసురులవిత్తమగ్నికీల। జననాయకులనిజైశ్వర్యాబ్ధి నింకింప బ్రాహ్మణక్షేత్రంబు బాడబంబు। పార్థివోత్తములసంపచ్ఛైలములఁ గూల్ప భూసురధనము దంభోళిధార। జగతీవరులకీర్తిచంద్రికమాయింప సూర్యోదయము ధరాసురులధనము।విప్రతతిసొమ్ముకంటెను విషము మేలు।గరళమునకును బ్రతికృతిగలదు గాని।దానిమాన్పంగ భువినౌషధములు లేవు।గాన బ్రహ్మస్వములుగొంటగాదు పతికి॥ క॥ ఎఱుఁగమినైనను భూసుర।వరులధనంబపహరింపవలవదు పతికి।న్మఱపునననలముముట్టిన।దరికొని వెసఁగాల్పకున్నె తనువెరియఁగన్ ॥ వ ॥ మఱియును దనధనంబు పరులచేతఁ గోల్పడినవిప్రుండు దుఃఖంబున రోదనంబు సేయ రాలినయశ్రుకణంబులనవనిరేణువు లెన్నిదడియు నన్నివేలేండ్లు దను పేతొపరుండైన పతి దారుణవేదనలుగలకుంభీపాకనరకంబు నొందు-మఱియును గ్రిందటఁబదితరంబులవారును, ముందటఁబదితరంబులవారును మహానరకవేదనలం బొందుదురు-స్వదత్తంబైనఁ బరదత్తంబైనన గ్రంథంబులోభంబునం జేసి దుశ్శీలుండై భుజించునప్పాపాత్ముండు రువది వేలసంవత్సరంబులు మలకూపంబునం గ్రిమిరూపంబున వర్తించునట్లగుట నెఱింగి విప్రుండెంతతప్పు చేసిన నెన్నిగొట్టిన, నెన్నిదిట్టిన నతనికెదురుపలుకక వినయంబున వందనం బాచరించు పుణ్యాత్ములు నాదుపాలింటి వారదియునుంగాక నేనును బ్రతిదివసంబును భూసురుల నతివినయంబునఁ బూజింతు-నిట్లు సేయక విపరీతవర్తనులైన తామసుల నేను వెదకి దండింతు నదిగావున మీరలు బ్రాహ్మణజనంబులవలనం బరమభక్తిగలిగి మెలంగుండని యానతిచ్చి యాదవప్రకరంబులు సేవింప నఖిలలోకశరణ్యుండైనయప్పుండరీకాక్షుండు నిజనివాసంబునకుం జనియెనని చెప్పి శుకుండిట్లనియె॥ క॥ ఈకథఁ జదివినవారలు।గైకొని విను వారు విగతకలుషాత్మకులై। లౌకికసౌఖ్యమునొందుదు। రాకైవల్యంబు గరతలామలకమగున్॥

## ——శ్రీ బలరాముఁడు సుహృద్బంధుజనదర్శనార్థమై వ్రేపల్లెకుఁ బోవుట. శ్రీ——

సీ॥ నరనాథవిను మొకనాఁడు తాలాంకుండు చుట్టాలబంధులఁ జూచువేడ్క।సుందరకాంచనస్యందనారూఢుఁడై భాసిల్లుచున్న వ్రేపల్లెకఱిగి। చిరకాలసంగతస్నేహులై గోపగోపాంగనానికరమాలింగనములు।సముచితసత్కృతుల్సలుపఁగైకొని మనోత్సుకలీల నందయశోదలకును।వందనం బాచరించినవారు మోద। మందిబిగియారఁ గౌఁగిల్లనెంతఁ జేర్చి। సముతదీవించియంకపీఠమునఁ జేర్చి।శిరము మూర్కొని చుబుకంబుఁ గరముపుడికి॥ వ॥ మఱియు నానందబాష్పధారాసిక్తకపోలయుగళంబులతోడం గుశలప్రశ్నంబులనిట్లని-రన్నా నీవును నీచిన్నితమ్ముండగు వెన్నుండును లెస్సయున్నవారె-మమ్మెప్పుడును రసిరక్షింపవలయు మాకు నేడుగడయు మీర కాక యొరులుగలరే యనిసముచితసంభాషణంబులం బ్రొద్దుపుచ్చుచుండిరంత॥ క॥ గోపాలవరులు ప్రమదం।బాపోవనిమదినివర్తితాఖిలగేహ। వ్యాపారులగుచు హలధరు।శ్రీపాదంబులకు నతులు సేసిరివరుసన్॥ క॥ సిరియుం వారికిఁ గరుణో।దారుండై నడిపెసముచితక్రియలంతం।గోరితనయాడు గోపకు।మారులచేచ అచిబలుఁడు మందస్మితుఁడై ॥ క॥ నిజసుందరదేహద్యుతి।రజతాచలరుచులఁ దెగడ రాముఁడువార।ల్భజియింప నేఁగి యొకచో।విజనస్థలమునవసించి విలసిల్లు నెడన్॥ కవిరాజవిరాజితము॥ చరణములం గనకస్ఫుటనూపురజాలముఘల్లనుచుం జెలఁగ।న్గరములఁ గంకణముల్మొలయన్నలిఁ గొనసియాడఁగు చాగ్రముల।న్సరులు నటింపఁగురుల్గునియన్విలసన్మణికుండలకాంతులు వి।స్ఫురితకపోలముల న్బెరయన్వ్రజసుందరులంద అమందగతిన్॥ కవిరాజవిరాజితము॥ చనిబలభద్రుని శౌర్యసముద్రుని సంచితపుణ్యునగణ్యునిఁ జం।దనఘనసారపటీరతుషారసుధారుచికాయు విధేయసుధా। శనరిపుఖండను సన్మణిమండను సారవివేకునశోకు మహా।త్మునిఁ గని గోపిక లోపికలేక యమప్రభునిట్ల నిరుత్కలికన్॥ చ॥ హలధర నీసహోదరుఁడు దంచితకంజవిలోచనుండు స।ల్లలితపురాంగనాజనవిలాసవిహారసమగ్రసౌఖ్యము।ల్గలిగి సుఖించు నేమము నెకానొకవేళ నమేనిబుద్ధిలోఁ।దలఁచునె నూతనప్రియులఁ దార్కొని యేమియుఁ బల్కకుండునో॥ క॥ జననీజనకులననుజులఁ।దనుజులబంధువుల మిత్రతతి విడిచెపుడు।శ్మనమున నొండుదలంపక।తనునమ్మనవారి విడువఁదగునే హరికిన్॥ సీ॥ సలలితయామునసైకతస్థలమునను డించి మమ్మె మునియూరడించె। విపులబృందావనవీథి మాచుబుకముల్పుడుకుచు నేమనిబుజ్జగించెఁ। బుష్పవాటికలలోఁ బొల్పుమా

పచయుఁ గ్రమ్మ నంటుచు నేమ నియాదరించె। గా సారముల పొంతఁ గౌఁగిటముఁ జేర్చి నయ మొప్ప నేమ నినమ్మఁ బలికె। సన్నియును షట్ అచెఁ గాఁ బోలు వెన్నుఁ డాత్మ। గోరి తా జాయలగు వారిఁ గేరి విడుచు। నట్టి కృష్ణుఁ డుతము లెట్టు వెట్టు ననక। యేలనమ్మి రిపుర సతుల్ బేల లగుచు॥ మ॥ అనియిబ్బంగి సరోజలోచనుని నర్మాలాపముల్ నవ్వులున్నను బంధుల్ పరిరంభణంబులు రతివ్యాసంగముల్ పోషణముల్। వినయంబుల్ సరసోక్తులుం దలఁచి యువ్విళ్లూరు చిత్తంబులన్। జనితానంగశరాగ్ని చేశమరవ్యథంబొంది శోకించిరన్॥ వ॥ అంతబలభద్రుండు వారలమనంబుల సంతాపంబులు వారింపను పాయంబుల సుసరస వచనుండనుచుఁ గృష్ణుని సందేశంబులు చెప్పుచు విగతఖేదలం జేసి యచ్చట వాసద్వయంబు నిలిచి వసంత వాసరంబులు గడుపుచుఁ గాళిందీతీరంబున॥ సీ॥ మాకందజంబీర మందార ఖర్జూర ఘనసార శోభిత వనములందు। నేలాలతా లోలమాలతీ సల్లికా వల్లీమతల్లికా వాటికలను। దరళతరంగ శీకర సాధుశీతల సైకత వేదికాస్థలములందు। మకరంద రసపాన మదవదిందిందిరపుంజరంజిత మంజుకుంజములను। విమల రుచి గల్గు సానుదేశములయందు। లలితశశికాంత ఘనశిలాతలములందు। లీల నిచ్ఛా విహారవిలోలుఁ డగుచు। సుందరీజనములు గొల్వఁ జూడనొప్పె॥ గీ॥ అట్లు విహరింప వరుణ నియాజ్ఞ చేసి। వారుణీదేవి నుద్యద్భావంబు నొంది। నిఖిలతరుకోటరములందు నిర్గమించి। మించు వాసనచేత వాసించె వనము॥ అట్టియెడ॥ మ॥ కరమొప్పారు నవీనవాసనలనాఘ్రాణించి గోపాలసుం। దరులుం దానును డాయ నేఁగి యతి మోదంబొప్ప సేవించి యా। తరలాక్షుల్ మణిహేమకంకణ ఝణత్కారానుకారంబులై। కరతాళంబులు మ్రోయఁ బాడుచును వేడ్కన్ నాడుచున్ సోలుచున్॥ సీ॥ తనమీఁద విరుదాంకితములై నగీతముల్ పాడుచు రాబలభద్రుఁ డంత। మహితకాదంబరీ మధుపానమదవిహ్వలాక్షుండు లలితనీలాలకుండు। నాలోలనవపుష్పమాలికోరస్థలుఁ డనుపమమణికుండలాంచితుండు। ప్రాలేయసంయుక్తపద్మంబుగతి నొప్పు సలలితాననఘర్మజలకణుండు। నసుచు వనమధ్యమున సలీలానురాగ। శీలుఁడై జలకేళికిఁ జేరి యమున। నింమరమ్మని పిలువఁ గాళిందియతని। మత్తుఁ డనిసరకుసేయక మసలుటయును॥ చ॥ ఘనకుపితాత్ముఁడై యమునఁ గన్గొని రాముఁడు వల్కె డాయజీ। ఱినఁ జను దేకతక్కితివు జేనినునిండఁగఁ జూడ మద్భుజా। సునిశితలాంగలాగ్రమున సొంపడియింపుడు నూరు ద్రోవలై। చన వెసఁ జించివైతునని చండపరాక్రమ మొప్పను గ్రుద్ధుఁడై॥ వ॥ అట్లు కట్టలుక రాముం డుద్దామంబగు బాహుబలంబున హలంబు సాఁచి యుమ్మహావాహినిం దగిల్చి పెకల్చి రాఁ దిగిచిన నన్నదిభయభ్రాంతయై సుందరీరూపంబు గైకొని యతిరయంబునఁ జనుదెంచి యయ్యదువంశతిలకుండగు హలధరుని పాదారవిందంబులకు వందనంబాచరించి యిట్లనియె॥ మ॥ బలరామా ఘనబాహు నీ యతులస్తంభద్విక్రమం బంగన। ల్దెలియంజాలెడి వారె యీ యఖిల ధాత్రీభార ధౌరేయని। శ్చలసత్వుండన సుండవీశ్వరుఁడు నిర్వర్ణింప నీ సత్కళా। కలితాంశప్రభవుండ నీ గురుభుజాగర్వంబు సామాన్యమే॥ చ॥ అనివినుతించి యేను భవదంఘ్రిసరోజములాశ్రయించెద। న్ననుఁ గరుణింపు మన్న యమునం దనుఁ డన్నదిఁ బూర్వమార్గమై। చను మని కామినీనికరసంగతుఁడై జలకేళి సల్పె నిం। పెనయఁగ రేణుకాయుతమదేభము చాడ్పున నమ్మహానదిన్॥ గీ॥ అంతజలకేళి సాలించి సంతసంబు। నందుచుండ వినీలవస్త్రాదిరత్న। మండనంబులు గాంచనమాలికయును। దెచ్చి హలికిచ్చె నిరమొనదీలలామ॥ క॥ అవియొల్లఁ దాల్చి హలధరుఁ డపరశశినొప్పె వల్లవాంగనలును దా। దివిజేంద్రుఁ బోలి మహితో। త్సవమున వర్తించుచుండె సౌఖ్యోన్నతుఁడై॥ క॥ అవనీశ యిట్లు హలమునఁ। దివిచినఁ గాళింది వ్రయ్య దెలియఁగ నేఁడు। న్నవినుత కెక్కె నురాముని। ప్రవిమలతరమైన బాహుబలసూచకమై॥ వ॥ అంత బలభద్రుండు వ్రజసుందరీసమేతుండై నందఘోషంబున నంబరితోషంబు నొందుచుం

## శ్రీకృష్ణుండు-పౌండ్రకవాసుదేవుని మీఁద దండెత్తి వానిం జంపుట,

డెనంత నక్కడఁ గరూశాధిపతియైన పౌండ్రకుండు తన దూతం బిలిచి యిట్లనియె॥ సీ॥ నను జేశబలగర్వమున మదోన్మత్తుఁడై యవనిపై వాసుదేవాఖ్యుఁ డనఁగ। నేనొక్కరుండఁ గాక యితరులకీనామ మలవడ నేయనియకటు మిగిలి। తెగి హరిదా వాసుదేవుండనను కొంటయటఁ బోయి నీవవల్లనుము దూత। పట్టాయతాక్షుని పాలికిఁ బొమ్మన్న నతిగి వాఁ డంబుజోదరుఁ డుపెద్ద। కొలువు గైకొనియుండ సంకోచపడక। వినుము మారాజు మాటగా వనజనాభ। యవనిరక్షింప వాసుదేవాఖ్య నొంది। నట్టియే నుండ సిగ్గువోఁ గట్టి నీవు॥ క॥ నాపేరును నాచిహ్నము। లేపున ధరియించి తిరిగెదివి పంతమెయిం। తేపాఱఁ దఱి కించిన। నేపంతమెఱుంగ గొల్లఁ డేమిటనైనన్॥ గీ॥ ఇంత నుండియైన మొదిటేదన్నెఱిఁగి నా। చిహ్నలెల్ల విడిచి చేరికొల్చి। బ్రతుకుమనుము గాక పంతంబులాడెనా। మొదలుమనుము ఘోరకదనమునకు॥ క॥ అనుమర్త్యాపలు సభ్యులు విని యొండొరు మొగము సూచి విస్మితులగుచున్। జనులార యిట్టి క్రొత్తలు। వినఁబడియెడి నిచట లెస్స వింటిరె యనఁగన్॥ అట్టియెడఁ గృష్ణుండు వానికిట్లనియె॥ మ॥ వినరా మీనృపుఁ డన్నచిహ్నములు నే వేవచ్చి ఘోరాజిలోఁ। దనమీఁద న్వేసనై వఁగంకముఖగృధ్రవ్రాతము

ల్మ్మాఁగాఁ నసిలోదర్పము దూలి కూలి వికలంబై *సారమేయాలికిన్ నయంబున న్నశనంబ వయ్యెద నుమేనన్నట్లు గా వాని
త్రోర్ ॥క॥ అనియుద్రేకముగా నాఁడిన మాటలకులికి వాఁడు డెందమునఁ గలఁగన్ । జనితనయేలిక కంతయు । వినిపించెను నతని ను
దికి విరసముగ దురన్ ॥వ॥ అంతఁ గృష్ణుండు దండయాత్రోత్సాహుండై వివిధాయుధకలితంబును, విచిత్రకాంచనపతాకకే
తువిలసితంబునునగు సుందరస్యందనంబునఁ బటుజవతురంగంబులఁ బూన్చి దారకుండు దెచ్చిన నెక్కి యతిత్వరితగతిం గా
శికానగరంబునకఁ జేగినం బౌండ్రకుండును రణోత్సాహంబు దీపింపన క్షౌహిణీద్వయంబుతోడం బురంబు వెడలె నప్పుడత
నిమిత్రుండైన కాశికాధిపతియును మూఁడక్షౌహిణులతోడం దోడుపడువాఁడై వెడలె నిట్లాప్తయుతుండై వచ్చువాని॥
సీ॥ చక్రగదాశంఖశార్ఙ్గాదిసాధనుఁ గృత్రిమకౌస్తుభ శ్రీనివాసు । మకరకుండలహారమంజీరకంకణమణిముద్రికావనమా
లికాంకుఁ । దరళవిచిత్రపతంగపుంగవకేతుఁ జెలువొందు పీతకౌశేయవాసు । జవనాశ్వకలితకాంచనరథారూఢు నిరణపు
త్పూహాలుని సన్మణికిరీటు । నాత్మసమవేషు రంగవిహారకలిత । నటసమానునిఁ బౌండ్రభూనాథుఁ జూచి । హర్షమిగురొత్తన
వ్వేఁ బద్మాయతాక్షుఁ । డంతవాఁడును నుద్వృత్తుఁ డగుచు నడరి ॥క॥ పరిఘశరాసనపట్టస । శరముద్గరముసలకుంతచక్రగ
దాతోమరభిండివాలశక్తి క్షురికాసి ప్రాసపరశుశూలముల వేసెన్ ॥చ॥ పరువడివై చినన్ దనుజభంజనుఁ డంతయు గాం
తకాలభీకరమహితోగ్రపావకుని కై వడియే చివిరోధిసాధనో । త్కరములనొక్కటన్నరని కాయములన్ని గుడించి త్రుంచి
ఘాస్వరగతినొత్తైసంచలితశాత్రవసైన్యముఁ బాంచజన్యమున్ ॥ఉ॥ వారనియుల్కతోఁ గినిసి వారిజనాభుఁడు వారిసైన్య
ముల్ । మారిమసంగినట్లును నుమాడినఁ బీనుఁగుపెంటలై వెసం । దేరులు వ్రాలె నశ్వములు ద్రెళ్లె గజంబులు ద్రుళ్లె సద్భ
టుల్ । ధారుణిఁ గూలి రిట్లు నెఱిఁ దప్పి చనెన్ హతశేషసైన్యముల్ ॥ వ ॥ అట్టియెడ మేదోమాంసపంకంబులు రుధిరప్రవా
హంబులునై సంగరాంగణంబు ఘోరంబయ్యె నయ్యవసరంబున నగ్గయ్యంబునకుం గాలుఁ ద్రవ్వు నప్పౌండ్రకునింగనుం
గొని హరి సంబోధించి యిట్లనియె ॥మ॥ మనుజేంద్రాధమ పౌండ్రభూపసుత నీమానంబు బీరంబు నేఁ । డనిలో మాపుదు నెద్దు
రొవ్వి పెలుచన్నాఁ బోఁతు పైరం కెవై । చినచందంబున దూత చేత ననునాక్షేపించి వల్దన్న పే । రును చిహ్నంబులు నీవయి
న్విడుతునంచున్ బలెక్కనేఁ డాజిలోన్ ॥క॥ అదిగాక నీదుశరణము । పదపడియేఁ జొత్తు నీవు బలవిక్రమసం । పదగలపోటరి వేని
యుఁ । గదలక నిలుమనుచు నిశితకాండములంతన్ ॥మ॥ చలమొప్పన్ని గుడించి వానిరథమున్ జక్కాడి తత్సారథిన్ । దలవేఁ
ద్రుంచి హయంబులన్నటికి యుద్దండప్రతాపక్రియన్ । ప్రళయార్కప్రతిమానచక్రమున నప్పౌండ్రున్ వ్రేసంద్రుంప
వాఁ । డిలఁ గూలెన్ గులిశాహతి న్నెరగు శైలేంద్రాకృతిన్ భూవరా ॥చ॥ మడపక కాశికావిభుని మస్తకముద్ధతిఁ ద్రుంచి బం
తికై । వడినదిపింజపింజగ అవన్ని శిఖాళి నిగుడ్చి వానియౌ । దలఁ బురిలోనవై చెనవలీల మురాంతకుఁ డిట్లు వైరులన్ । గడఁగి జ
యించి చిత్తమునఁ గౌతుకమున్గిసురొత్తన త్తఱిన్ ॥క॥ సురగంధర్వనభశ్చర । గరుడోరగసిద్ధసాధ్యగణము నుతింపన్ । మ్మఱలి
ను దెంచి హరి నిజ । పురమున సుఖముండెనతివిభూతిఁ దలిర్పన్ ॥క॥ వనజోదరుచిహ్నంబులు । గొనకొని ధరియించి పౌండ్రకుఁ
డు మచ్చరికై । యనవరతము హరి వనతలఁ । పునఁ దగులుటఁ జేసి ముక్తిఁ బొందెన రేంద్రా ॥ సీ॥ అక్కడఁ గాశిలో నారాజు
మందిరాంగణమునఁ గుండలకలితమగుచుఁ । బడియున్న తలఁ జూచి పౌరులు మంత్రులు దమరాజు తలయని దగనెఱింగి । చెప్పి
న నానృపుజీవితేశ్వరలును సుతులు బంధువులును హితులుగూడి । మొనసి హాహాకారమున నేడ్చి రత్తఱిఁ దత్తనూభవుఁడు సు
దక్షిణుండు । వెలయఁ దండ్రికిఁ బరలోకవిధులొనర్చి । జనకుననిలో వధించిన చక్రపాణి । నడరి మర్దింపఁ దగసను పాయంబు ద
లఁచి । చతురుఁడగునట్టి దనపురోహితునిఁ బిలిచి ॥క॥ అతఁడుం దానునుఁ జనిపశు । పతిపదసరసిజములకును బ్రమదముతో నా । న
తుఁడై యద్దేవుని బహు । గతులం బూజింపన తఁడు గరుణాన్వితుఁడై ॥క॥ మెచ్చితివరమేమైనను । నిచ్చెదనను వేఁడుమనిన నీ
శ్వర నన్ను । న్మచ్చిక రక్షింతువుపార । పొచ్చెము సేయక మహేశ పురవరయభవా ॥క॥ దేవా మజ్జనకుని వసు । దేవాత్మజుఁ డా
జిలో వధించెను నే నా । గోపించుని ననిలోపల । నేవిధమున గెల్తునానతీ వె పురారీ ॥ గీ॥ అనిన శంకరుఁ డతనికిన నియె ననఘ నీవు
ఋత్విజులును భూసురావళియును । ప్రీతి †నభిచార మొనరింప భూతయుక్తుఁ । డగుచు ననలుండు దీర్చు నీయభిమతంబు ॥గీ॥
అనిన నా చంద్రమౌళి వాక్యములభంగి । భూరినియమముతో నభిచారహోమ । మొనరఁ గావింప నగ్ని యథోచితముగఁ । జె
లఁగి దక్షిణవలమానశిఖల వెలిఁగె ॥వ॥ అందుఁ దామ్రశ్మశ్రుకేశకలాపంబున శనిసంకాశంబులైన నిడుసకోఱలును నిప్పులు
ప్పతిల్లు చూపులును, ముడిపడు బొమలును, జేవురించు మొగంబును, గలిగి యతిరౌద్రాకారంబున బ్రజ్వరిల్లుచుఁ గుండంబు
వెలువడి దైనందిన నిహన్యమాన ప్రాణిరక్తారుణమృత్యుకరవాలంబు లీలం జూపట్టు నాలుక సెలవుల నాఁకుచు నగ్నికీలాభీ
లంబగు శూలంబు కేలం దాల్చి భువనకోలాహలంబుగా నార్చుచు నుత్తాలతాలప్రమాణపాదద్వయహతులం దూలు పెం

* సారమేయాలికిన్ । కుక్కలగుంపునకు. † అభిచారము । మారణహోమము, పరహింసాకర్మ.

ధూళినింగిఁ బ్రింగభూతంబులు సేవింప ॥నగ్న వేషమైనిజవిలోచనసంజాత సముద్ధూతనిఖిలభయంకర జ్వాలికాజాలం
బులస్వజాలంబులోలిం బ్రేల్చుచును ద్వేలగగనగమనంబుననగధరనగరంబునకరుగు దేరఁ బౌరజనంబులు భయాకులమా
నసులై డావదహనునింగనిపఱచువనమృగంబులచాడ్పునంబఱచి సుధర్మాభ్యంతరంబున జూదంబాడుచుదామోదరుంగని ర
క్షరక్షేతియార్తరవంబులం గృష్ణకృష్ణ పెనుమంటలంబురంబుగాల్పం బ్రళయాగ్నిచను దెంచెనను వారిఁజూచి మీరోడ
కోడకుండుం డనిభయంబునివారించి సర్వరక్షకుండై నపుండరీకాక్షుండు జగదంతరాత్ముండు గావునఁ దద్వృత్తాంతంబం
తయుఁదన చిత్తంబున నెఱింగి కాశీరాజపుత్రప్రేరితమైనయమ్మహాకృత్తిని నిగ్రహింపందలంచి నిజపార్శ్వవర్తియైయు
న్నయద్దివ్యసాధనంబుగనుంగొనియప్పుడు ॥సీ॥ భీమమై బహుతీవ్రధామమై హతరిపుస్తోమమై సుమహితోద్దామమగుచుఁ।
జండమై పిహితమార్తాండమై పాలితాజాండమై విజయప్రకాండమగుచు। దివ్యమై నిఖలగంతవ్యమై సుజనసంభావ్యమై స
ద్భక్తసేవ్యమగుచు। నిత్యమై నిగమసంస్తుత్యమై వినమితాదిత్యమై నిర్జితదైత్యమగుచు । విలయసమయసముద్ధూతవిపుల
భాస్వ। దళికలోచనరోచనానలసహస్ర। ఘటితపటుసటాజ్వాలికాచటులసత్వ। భయదచక్రంబు కృత్తిపైఁ బంపెశౌరి॥
వ॥ అదియును బ్రళయవేళాసంభూతజీమూతసంఘాతప్రభూతఘుమఘుమాటోపనినదాధరీకృతాతిమస్వహాకహాకహసి
ఛిడనిస్వననిర్ఘోషపరిపూరితబ్రహ్మాండకుహరంబున భ్రంలిహకీలాసముత్కటపటుచిట చిటస్ఫుటస్ఫుటస్ఫులింగచ్ఛటా
ఛీలంబును, సకలదేవతాగణజయజయశబ్దకలితంబు, ననంతతేజోవిరాజితంబును, నగుచుఁ గదిసినం బంటింపకఁ గంటగించు
చు గెంటి వెంటనంటినఁదనత్రొంటిరౌద్రంబువిడిచి మగుడి కాశీపురంబుసొచ్చి పౌరలోకంబు భయాకులతం బొంది వాపోవ
రోషభీషణాకారంబుతోనప్పుడు ఋత్విజ్ఞికాయయుతంబుగా సుదక్షుని నిందహించెన త్తఱిచక్రంబు మదన్నగరసౌధ
ప్రాకారగోపురాట్టాలకాదివివిధవస్తువాహననికరంబులతో భస్మంబుగావించి మఱలియమరులు వెఱగంద కమలలోచ
నుపార్శ్వవర్తియై నిజప్రభావపుంజంబు వెలుఁగొందఁగొల్చియుండె నని చెప్పి మఱియు నిట్లనియె ॥క॥ మురరిపువిజయాంకిత
మగు। చరితము సద్భక్తిఁదగిలి చదివిన వినిన। న్దురితములఁ బాసి జనులిహ। పరసౌఖ్యములతని చేతఁ బడయుదు రధిపా॥ అనిన ను

శ్రీ బలరాముండు ద్వివిదుఁడను వానరుని సంహరించుట. శ్రీ

కయోగికి రాజిట్లనియె ॥క॥ బలభద్రుఁడ ప్రమేయుం। డలఘుఁడనంతుండు నవనియద్భుతకర్మం। బులు వినియుఁడ నియదింక ను
దెలియఁగ నాకాన తిమ్ము దివ్యమునీంద్రా ॥ అనిన రాజునకు శుకుండిట్లనియె ॥క॥ జననాయక వినుసుగ్రీ। వుని సచివుఁడు మైం
దునకు సహోదరుఁ డనఁగా। వినుతికి నెక్కిన ద్వివిదుం। డను ప్లవగుఁడు నరకసఖ్యుఁ డతిదర్పితుఁడై ॥ సీ॥ చెలికాని పగఁదీర్పఁ
దలఁచి కృష్ణుండేలుపురములు జనపదంబులు దహించి। సరిదుపవనసరోవరములు గోరాడి మందలఁగొందలనుందఁ జేసి। ప్రా
సాదములు ద్రొబ్బి పరిఘులు మాయించి చతురంగబలముల సమయఁ జేసి। పురుషుల సతులను భూధరగుహాలలోఁ బెట్టి వాకిలి
గట్టిబిట్టు నెంచి। ఫలితతరువులఁ ద్రుంచి సాధుల నలంచి। కోటలగలించి పడుచుల నీటముంచి। ధరణి నిబ్భంగిఁ బెక్కుబాధలసలం
చి పఱవఁజేయు చునొక నాఁడు సల్లవగవరుఁడు॥క॥ చతురమృదుగీతరవము। న్నతివీతెంచినఁ జెలంగి నగచరుఁడారై । వతగిరి
కందరమునకా। యతగతిఁ జనియందు నెత్తమాడెడువానిన్॥చ॥ లలితపనీలవస్త్రునివిలాసవతీయుతుఁ జంద్రచంద్రికా। క
లితమహోన్నతాంగు మణికాంచనదివ్యవిభూషణోన్నతున్। విలసితవారుణీసమదవిహ్వలలోచనుఁ గాంచె సీరని। గ్ద
లితరిపుక్షితీశ నిజధామునిరామునిఁ గామపాలునిన్॥ సీ॥ కనుఁగొని తత్పురోగమభూమి రుహశాఖ లెక్కియూఁచుచుఁ జాల
వెక్కిరించుఁ। గికురింతలిడుఁ బంప్లుగీటుచు నవ్వుచుఁ గొమ్మకొమ్మకును రుకుచు నదల్చుఁ। దోఁకయూరక మేను సోఁకఁగ నులి
వెట్టు వెడవెడ నాలుక ప్రేల్లఁ బెట్టు। బరుల నఖంబుల గిరగిరఁ గ్రోఁకుచుఁ బోరిపారి ఫలములు గఱదివైచు। గోళ్లు తెగఁగొఱ్ఱ
యుమియుచు గుదముసూపు। బలసి మర్కటజాతి యిప్పగిదిఁ జేయఁ। గోపమున హలధరుఁడొక గుండు వైవ। దానిఁ దప్పించుకొ
నిప్రల్లదమున నగని॥క॥ నగి శ్రీయాసవకలశముఁ గొని। జగతీరుహశాఖ లెక్కి చాపలమునన। జ్జగతిపయిపై చెదద్ఘటి। మగలఁ
గనదిచూచికోపమగ్గల మొదవన్ ॥ మఱియును॥ క॥ సీరినిఁదనమనమున నొక। చీరికిఁగైకొనక కదిసి చీరలు చింపన్। వారక దా
భువిజనములఁ। గారించుట మాన్పఁ దలఁచి ఘనకుపితుండై ॥ వ॥ ఇట్లు కోపోద్దీపితమానసుండై కనుంగొని హలాయుధుండప్ప
డు ॥ చ ॥ ముసలముఁ దీవ్రశాతహలముం ధరియించి సమస్తచేతన। గ్రసనము నాఁడు సొంగులయ కాలుని భంగిన డచ్చిని
ల్పవాఁ। డసదృశవిక్రమక్రమవిహారమెలర్ప సమీపభూజము। న్వెసఁ బెకలించి మస్తకము ప్రేసెఁ జలంబు బలంబు చొప్ప
డన్॥ ఇట్లు ప్రేయబలుం డప్పుడు॥చ॥ ఉరువడిదండతాడితమహోరగు భంగిఁ గడంగి వీరసా। గరమున నేఁచి హేమకటకం
బుల నొప్పు సునందనామభీ। కరముసలంబునన్ ద్వివిదుకంఠము ప్రేసినఁ బొల్చెవాఁడు జే। గుహుగలకొండచందమునఁ గో

యెనియార్చి సురల్ నుతింపఁగన్ ॥ మత్తకోకిల ॥ అంతవాఁ డొకయింతమూర్ఛిలి యంతలోఁ దెలివొందుచున్ । గ్రాంత
భూరిభుజావిజృంభణుఁడై మహీజము పూనిపై । త్యాంతకాగ్రజు వ్రేసె వ్రేసిన నాగ్రహంబున దానినింతలింతలై ధరగా
ల్కఁ జేసె నసహాయవిక్రమశాలియై ॥ క ॥ మఱియును చలము పెనుగక తరు । చయఁ డొకతరు వెత్తి వ్రేయఁ దాలాంకుఁ డనా । నరమునఁడు
సమున వెండియుఁ । దొరఁగించెఁ గుజంబుల శతదుదోర్ద్ధోమసునన్ ॥ క ॥ ఆచందంబున వనచరుఁ । డే విమహీరుహచయంబు లెల్ల
ను హలిపై । నై వితరుశూన్య నగుటయుఁ । జావిశిలావృష్టి గురిసె నురలగ్గింపన్ ॥ క ॥ బలుఁడప్పుడు రాలుపుములై । యిలరాలఁ
గఁ జేసి యార్చె నేపు మిగకయా । నలిముఖుఁడు దాలసన్నిభ । ములుగల బాహుయుగదండములను గ్రుంగై ॥ క ॥ పడిఁ బిసుగు
నోలుసిడికిటఁ । బొడిచిన వడి నెడక బలుఁడు ముసలముహలము । న్విడిచి పిడ్లవంగుని మెడ గడు । వెడ వెడ బిగియించె గ్రుడ్లు వెలికు
ఱుకంగన్ ॥ క ॥ వదనములఁ జెవుల రుధిరము । మెదడును దొరుగంగ వాఁడు మేదినిమీఁదం । బదికిలఁబడి యొక యింతయు మెదలక
నిదుకంగలేక మృతిఁ బొందె నృపా ॥ గీ ॥ వానిపాటునకప్పుడు వనసుచేత । మసుచునా శైలరాజనుల్లలఁగనాడె । సురగణంబు
లు రాముపై సురభికుసుమ । వృష్టి గురియించి రతులసంతుష్టి మెఱసి ॥ వ ॥ ఇవ్విధంబున భువనకంటకుండైన సప్తశాఖామృగేం
ద్రుని వసుంధరకుం బలిచేసి సకలజనంబులు పరమానందకందళితహృదయారవిందులై తన్ను నందింప నయ్యాదునందనుండు
నిజనగరంబునకు జనుదెంచె నని శుకుండు వెండియు నమ్మనుజపతి కిట్లనియె ॥ సీ ॥ కోరి సుయోధను కూఁతురు సర్వలక్షణములు

—— శ్రీ బలరాముండు దన హలంబున హస్తినాపురముఁ గంగలోఁ ద్రోయఁ బూనుట. శ్రీ ——

గల్గి లక్షణ యనంగ । మహి నొప్పు కన్యకామణి వివాహంబునఁ జక్రహస్తుని తనూజాతుఁడైన । సాంబుఁడు బలసాహసమున
నెత్తుకపోవఁ గౌరవులీక్షించి కడఁగి క్రొవ్వి । పడుచువాఁ డొకఁ డదె బాలికఁ గొని పోవుచున్నాఁడు గైకొనక మిగిలి । యిట్టి
దుర్మదుఁ గయి ముట్టిపట్టి తెచ్చి । జనులు వెఱఁగందఁ జెఱఁ బెట్టి యనుతుమేని । యాదవులు మనల నేమి సేయంగఁ గలరొ । యను
చుఁ గురువృద్ధజనముల యనుమతమున ॥ వ ॥ ఇట్లు గడంగి యుద్ధసన్నద్ధులై బలశౌర్యోపేతులగు కర్ణ శల్య భూరిశ్రవ యజ్ఞకేతు
సుయోధనాదులు సమున్నతరథారూఢులై కూడ నడిగిన వారలం గనుంగొని జాంబవతీనందనుండు మందస్మితవదనారవిం
దుఁడగుచు సింగంబు భంగి గర్జించుచు మణిదీప్తంబైన చాపంబుఁ బూని నిల్చిన వారు నా సాంబుని నదల్చి నిలు నిలుమని పలికి ॥
గీ ॥ చండకోదండముక్తనిశాతవిశిఖ । జాలమున దండపఱుపి యాభీలముగను । నందనందననందనస్యందనంబు । ముంచిరచలేంద్ర
మును ముంచుమంచు పగిది ॥ మఱియును ॥ శా ॥ శౌర్యాటోపవిజృంభణంబున సరోజాతాక్షసూనుం డసురా । హార్యస్థైర్యుని
మీఁద నేయ నతఁ డుద్యద్భూరిబాహాబలా । వార్యుండై శితసాయకాలి ననివారాయం జేసె నద్దేవతా । తూర్యంబుల్ దివి మ్రోసె
నంతనతఁ డస్తోకప్రతాపోన్నతిన్ ॥ వ ॥ ఇట్లు గడంగి బాణజాలంబులు పఱగించి యందఱకు నన్నిరూపులై రథరథ్యసూతధ్వజ
పతాకాతపత్రంబులు చూర్ణంబులుగావించి విరథులం జేసి వారల మెయిఁ బువులు బువ్వులుగావించి యొక్కొక్కని పెక్కు
బాణంబులను గ్రుచ్చిపో నేసిన వారలు శోణితదిగ్ధాంగులై కుసుమితకింశుకంబులం బోలియుండిరంత ॥ ఉ ॥ వారల నేకులయ్యు బల
వంతులు నయ్యును హూగ్రసంగరో । దారపరాక్రమప్రకటదక్షులయ్యుఁ గుమారకుంజర । ద్వీరుని నొక్కనిం జెనకి ప్రే
లును వంపఁగలేక సిగ్గునం । గూరిన చింత నెండొరులు గూడుచు విచ్చుచు వెచ్చనూర్చుచున్ ॥ మగుడిన మరసన్నద్ధులై సంరం
భించి ॥ ఉ ॥ అందఱు నొక్కపెట్టనను జాంతకనందనుఁ జుట్టుముట్టి యం । దందని శాతసాయకచయంబుల నశ్వరథంబునుగ్ర
లీ । లం దునుమాడి చాపము రయంబునఁ ద్రుంచి హయాళిఁ జంపి సూ । తునిఁ దెగటార్చి యంతవిరథుండగు నట్టి సాంబుఁ జొచ్చిప
ట్టిరన్ ॥ గీ ॥ బాలకుఁడు చేయునది లేక పట్టువడియెఁ । గౌరవులు తమమనమునఁ గౌతుకంబు । లొలయ సాంబుని కన్యకాయుక్త
ముగను । బురమునకుఁ దెచ్చిరతుల విభూతి మెఱసి ॥ అంత ద్వారకానగరంబున ॥ ఉ ॥ జాంబవతేయు వార్తయదుజాతులు నా
రదయోగి చేసమ । స్తంబును విన్నవారగుచు సంగరకౌతుకముప్పతిల్లఁ జి । త్తంబులఁ గౌరవాన్వయకదంబము నొక్కటను
కడంచు గ్రో । ధంబులనుగ్రసేన జనపాలుననుజ్ఞ సమస్తసైన్యముల్ ॥ గీ ॥ కూడికొనుచుంగ గనివారితోడ బలుఁడు । ధార్తరా
ష్ట్రులు మనసునెంచ యనుడాసి । నట్టిబంధులు వారిపై నెట్టియలుక । యెత్తిచను చుంటయిది నీతి యేతలంప ॥ వ ॥ అని వారల వా
రించి తత్క్షణంబ బంధుప్రియుండైన బలరాముం డనలార్కసంకాశంబగు కాంచనరథం బెక్కి యనురక్తులైన భూసురులును
యుద్ధవాదులగు కులవృద్ధులును సేవింపం గరిపురంబునకుం జని తత్పురోపకంఠవనంబున సురభికుసుమఫలభరితతరుచ్ఛా
యావిరచితచంద్రకాంతశిలాతలంబునం దుపవసియించి మహితగ్రహమధ్యగతుండైన పూర్ణచంద్రు ననుకరించి యుండె
నంతఁ గార్యబోధనంబు సేయుటకై కౌరవ్యుల యొద్దకుం బ్రబుద్ధుండైన యుద్ధవుని బంపి చనఁ జనియతండు ఆంబికేయునకు
భూసురాచార్యాపగాతనూభవసుయోధనులకుం బ్రణమిల్లి వారిచేత నభినందితుండై యిట్లనియె ॥ సీ ॥ భూరియశోధనులా

రతాలాంకుండు చనుదెంచి నగరోపవనమునందు | నున్నవాఁడనిన వారుత్సాహమున బలుఁ బొడఁగను వేడుకబుద్ధిఁ దోఁప | దన
రారఁగా నుత్కళ్ఠానిచ నియర్ఘ్యపాద్యాదిసత్కృతులు నెయ్యమునఁ జేసి | ధేనువు నిచ్చి సన్మానించియందఱు నందందవంద
నం బాచరించి | యుచితభంగిని యచటఁ గూర్చున్నయెడను | గుశలమే మీకు మాకును గుశలమనుచుఁ | బలికె రాముఁడు కురున
రపాలుఁ జూచి | యచటి జనములు వినఁగ నిల్లనియెఁ దెలియ || ఉ || మానరనాథు నాజ్ఞ నిజమస్తములం ధరియించి కౌరవుల్మా
నుగఁ జేయుటొప్పగుఁ గుమారకు నెక్కటిఁ బెక్కుయోధపుల్ పూని నలావు మై నెదిరి పోరజయించుట మీఁది తప్పుత | పై
ననుగా చె బాంధవహితాత్మకుఁడై మనుజాధినాథుఁడున్ || క || అనుమాటలు విని కౌరవ | జననాయకుఁ డాత్మఁ గలఁగి చాలుఁ
బురే యే | మనఁ గలడు కాలగతిచక్కనఁ గాలం దొడుగు పాదుకలు దలకెక్కెన్ || గీ || మనము బంధువరుస మన్నించుమన్నఁ
గాదె రాజ్యభోగగరిమఁ బొడలి | వసుధఁ బేరు గలిగి వాసికి నెక్కెట | దమకు ననుభవింపఁదగినయట్టి || వ || సితచ్ఛత్ర చామర
శంఖకిరీటచిత్రశయ్యాసౌధసింహాసనంబులు గైకొనుట మననుండె మేలంబునఁ గాదె యట్టిపోసరి వారునుం బోలె నూర
క గర్వించు యదుకులులతోడి సంబంధ సఖ్యంబులు చాలుఁ బాములకుఁ బాలుపోసి పెంచిన విషంబు దప్పనేమమ్ముఁ దమపను
పు సేయుమనుట సిగ్గు లేకుంటఁ గాదె యదియునుం గాక దివ్యాస్త్రకోవిదులై నగంగానందన సురుకృపాశ్వత్థామ కర్ణాది
యోధవీరులకు లోఁబడ్డవానిని ముహేంద్రునకైనను విడిపింపవచ్చునే యహహా వృథాజల్పంబుల కేమి పనియని మర్యాప
లాడుచు దిగ్గన లేచి నిజమందిరంబునకుం జనియె నప్పుడు హలాయుధుం డమ్మాటలకదరిపడి || ఉ || కౌరవు లాడిపోయిన యగౌర
వభాషలకాత్మఁ గినుకయే | పారఁగనుల్ల సత్ప్రశయభానునికై వడి మండి చండరో | షారుణితాంబకుండగుచు యాదవవృద్ధు
లఁ జూచి పల్కెఁ బెం | పారిన రాజ్యవైభవమదాంధులమాటలు మీరు వింటిరే || గీ || శ్రీమదాంధులు సామంబు చేతఁ జక్క | బడు
దురే యెంచ బోయఁడు పసులఁ దోలు | పగిదినుగ్రభుజావిజృంభణసమగ్ర | సుమహితాటోపమునిలోనఁ జూపకున్న || క || కౌర
వులసమయఁ జేయను | డారతయమవీరవరులు దామోద్ధురుఁడున్ | రారా వలదనియచ్చట | వారించితిఁ గాదె బంధువత్సల
యుక్తిన్ || అదియునుం గాక || సీ || ఏ దేవు భృత్యులై యింద్రాది దిక్పాలవరులు భజింతురు వరుసతోడ | నే దేవు మందిరంబే పారి
దేవతాతరు సభావిభవ సుందరతఁ జెందు | నే దేవు పదయుగం బే ప్రొద్దు సేవించు నఖిలలోకైకమాతైన లక్ష్మి | యే దేవు చారుస
మిద్ధకళాంశసంభవులము పద్మజభవులు నేము | నట్టి దేవుండు దుష్టసంహారకుండు | హరి ముకుందుఁడు పంపు సేయంగ నొప్ప |
నుగ్రసేనుని రాజ్యసమగ్రగరిమ | యంతయును దా రయిచ్చినదఁట తలంప || చ || అదియును గాక యెవ్వని పదాంబుజచారుర
జోవితానమా | త్రిదివవరాదిదిక్పతికిరీటములం దనలంకరించు భూ | విదితముదీర్ఘతీర్థము పవిత్రమునయ్యెడు నట్టి కృష్ణు చేఁ |
బొదలిన రాజ్యచిహ్నములఁ బొందఁగ రాదఁట యేమి చోద్యమో || క || తాముఁ దలఁపఁగ తలలఁట | యేమఁట పాదుకలమఁట
గణింపఁగ రాజ్య | శ్రీమదము ననిట్లాడిన | యీ మనుజాధములమాట లేమనవచ్చున్ || అని క్రోధమానమానసుండై యప్పుడు ||
క || ధారుణి నిటమీఁద దఁట ని | ష్కౌరవముగఁ జేయకున్నఁ గాదని యుగ్రా | కారుండై బలభద్రుఁడు | సీరము వెసఁ బూన్చి లావు చే
వయు నెసఁగన్ || వ || ఇట్లు పూన్చి కౌరవరాజధానియైన కరినగరంబు కడతలఁ గరతలహలాగ్రంబును జొనిపి పూనియప్పట భే
దనవిస్తారంబగు నాభూఖండంబు భుజాబలగర్వసుర్వారుండై తిగిచి గంగాప్రవాహంబునం బడఁద్రోయఁగమకించిన నప్పు
డు మహాజలమధ్యవిలోలంబగు నావచందంబున నన్నగరంబు వడంకుచు గోపురవప్రప్రాకారసౌధాట్టాలక తోరణధ్వజ
ద్వారకవాటకుడ్యవీధీయుతంబుగా నెడ్డగిలి పడం బౌరజనంబులకుఁ బుడమి నడుగులిడంగ రాక వడవడ వడంకుచు నార్తులై
కుయ్యిడుచున్నట్టియెడ నమ్మహోత్పాతంబు గనుంగొని తాలాంకుండు కినుకవోడమి కావించిన యుపద్రవంబుగా నె
ఱింగి దానికిఁ బ్రతీకారంబు లేమిని గళవళంబున భయాకులమానసులై పుత్రమిత్రకళత్రబంధుభృత్యపౌరజనసమేతంబు
గా భీష్మసుయోధనాది కౌరవ్యులు వేగంబున నతని చరణంబులు శరణంబులుగాఁ దలంచి సాంబుని గన్యకాయుక్తంబుగాన
నేకమణిమయభూషణాంబరజాలంబులతోఁ దోడుకవచ్చి దండప్రణామంబు లాచరించి కరకమలంబులు మోడ్చి యిట్లని
రి || క || రామ సమంచితముక్తా | దామయశఃఘనసుధాధామరుచి | స్తోమ జయసీమ జగదభి | రామ గుణోద్దామ నిఖిల
రాజలలామా || క || నీమహిమ లెఱిఁగి పొగడఁగ | నే మెంతటివారమఖిలనేతవు ద్రిజగ | త్క్షేమంకరుఁడవు సుమతివి | తామసు
లము మమ్ముఁ గావఁ దగు హలపాణీ || క || భూచక్ర మెల్లఁ దాల్చిన | యాచక్రీశ్వరుఁడు దావకాంశుఁడు బలదేవ | చక్రికి నగ్ర
జుఁడవు | నీ చక్రియలు సుమ జెల్లు నీకు జితారీ || క || రక్షింపుము రక్షింపుము | పేక్షింపక నమితనిఖిలబృందారక గో | రక్షణదాచ
రణా సిత | లాక్ష భయాతురుల మమ్ము నరయుమనంతా || వ || మఱియును దేవా యీ సచరాచరంబులైన జగంబులు నీలీలావి
నోదంబులం జేసి దుష్టమర్దనంబును, శిష్టజనరక్షణంబునుం జేయుచు జగదుత్పత్తిస్థితిలయహేతువైన నీకు నమస్కరింతు

మని వెండియు నిట్లనిరి॥ గీ॥ అవ్యయుండవు సర్వభూతాత్మకుఁడవు। సర్వశక్తిధరుండవు శాశ్వతుఁడవు। విశ్వకరుఁడవు గురుఁ
డవు విపులకీర్తి వయిన నిన్ను నుతింప బ్రహ్మకును దరమె॥ చ॥ అని వినుతించినన్ బ్రముదితాత్మకుఁడై హలపాణి వారలం।గ
నుఁగొని మోడకోడకుఁడు కార్యగతిం దగిలి ట్లు మీరు చే।సిన యవినీతిచేత నిటు చేసితి నింక భయంబు దక్కి పొం।డనిన సుయో
ధనుండు వినయంబున నల్లునిఁ గూఁతురిం దగన్॥ క॥ అనుచుచు నరణము దాసీ।జనముల వేయింటి లత్తు సైంధవములఁ దా।నిను
నుడియేనుంగులఁ గాం।చనరథముల నాఱువేల సమ్మతి నిచ్చెన్॥ వ॥ ఇట్లిచ్చి యనిచినం బలభద్రుండు గొడుకునుం గోడలినిం
దోడ్కొనుచుఁ బరమానందంబు నొందుచు నక్కడి జనంబులు పదివేలవిధంబులఁ బొగడ నిజపురంబునకఱిగి యచ్చటి యా
దవులతోడఁ దాఁ గరిపురంబునకుం బోయిన విధంబును, వారలాడిన దురాలాపంబులును, నెఱింగించి సుఖంబున నుండె. వా
రణపురంబు నేఁడును దక్షిణం బెగసి యుత్తరభాగం బొకించుక గంగకై క్రుంగి బలభద్రు మాహాత్మ్యంబుఁ దెలుపుచున్నయ

## శ్రీ షోడశసహస్రస్త్రీసంగతుండైన శ్రీకృష్ణుని మహిమను నారదుండు దెలిసికొనుట. శ్రీ

దియని యమ్మహాత్ముని భుజవీర్యంబ వార్యంబని చెప్పి శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె॥ చ॥ నరవర యొక్క-
నాఁడు వినునారదసంయమి మాధవుండు దా।నరకునిఁ ద్రుంచి వాని భవనంబున నున్న పదాఱువేల సుం।దరుల నొక్క-నాఁ
డె ప్రమదంబున నందఱకన్నిరూపులై।పరిణయమయ్యె నా విని శుభస్థితిఁ దద్విభవంబుఁ జూడఁగన్॥ వ॥ అట్లు తలంచి కృష్ణ
పరిపాలితంబైన ద్వారకానగరంబు డాయంజని ముందట॥ సీ॥ శుకశారికా శిఖిపికకూజిత ప్రసవాంచితోద్యానవనౌఘము
లును।గలహంససారసకమలకైరవసుకల్హారశోభితకమలాకరములుఁ।గలమాదిసస్యసంకులవరేక్షుక్షేత్రభూరిలసన్నదీ
తీరములును।గిరిసానుపతితనిర్ఝరశరసందోహసంతతహేమంతసమయములును।ఖనులసంభవకాంచనకారరచిత।చిరత
రైశ్వర్యనగరలక్ష్మీకరాబ్జ।ఘటితనవరత్నమయహేమకటకమనఁగ।సొబగుమీఱిన కోటయుఁ జూచి మౌని॥ వ॥ మఱియును స
ముత్తుంగమణిసౌధగవాక్షరంధ్రనిర్గతఘనసారచందనాగరుధూపధూమపటలవిలోకనసంజనితపయోధరాభిశంకాం
గీకృతతాండవకేళీవిలోలపురకామినీజనోపలాలితనీలకంఠసముదయంబులును, జంద్రకాంతమణిస్ఫటికస్తంభసంవృత
మరకతపద్మరాగఘటితనవరత్నకాంచనప్రాసాదశిఖరాగ్రవిన్యస్తబహుసూర్యవిభ్రమకృదంచితశాతకుంభకుంభని
చయంబును, సనుస్తవస్తువిస్తారసమర్పితవైశ్యాగారవీధీవేదికాకలితంబును, మహితతాపనివారణతరళవిచిత్రకేతనా
బద్ధమయూరశింజినీనినదపూరితాశాంతరిక్షంబును, సరోజనాభపూతనాచేతనప్రహారాదినూతనవిజయసందేశలిఖిత
స్వర్ణవర్ణావలివిభాసితగోపురమణివిటంకప్రదేశంబులును, యాదవేంద్రదర్శనోత్సవాహూయమానసమాగతనానాదే
శాధీశభూరివారణదానజలప్రభూతపంకనిరసనైకగతాగతజనసమ్మర్దకరకంకణనికర్షణవికీర్యమాణరజఃపుంజంబును
వినూత్నరత్నమయమంగళరంగవల్లీవిరాజితప్రతిగృహప్రాంగణంబును, గుంకుమసలిలసిక్తవిపణిమార్గంబును, వంది
మాగధసంగీతమంగళారావవిలసితంబును, భేరీమృదంగకాహళశంఖతూర్యరవాధరీకృతసాగరఘోషంబును నై యమ
రావతీపురంబునుంబోలె వసుదేవనందననివాసంబై, యనలపుటభేదనంబునుంబోలెఁ గృష్ణమార్గసంచారపూతంబై, సం
యమినీనగరంబునుంబోలె హరితనూభవాభిరామంబై, నైఋతినిలయంబునుంబోలెఁ బుణ్యజనాకీర్ణంబై, వరుణనివా
సంబునుంబోలె గోత్రరక్షణభువనప్రశస్తంబై, ప్రభంజనపట్టణంబునుంబోలె మహాబలసమృద్ధంబై, యలకాపురంబునుం
బోలె ముకుందవరశంఖమకరాంకకలితంబై, రజతాచలంబునుంబోలె నుగ్రసేనాధిపార్యాలంకృతంబై, నిగమంబునుం
బోలె వివిధవర్ణక్రమవివిక్తసంచారంబై, గ్రహమండలంబునుంబోలె గురుబుధకవిరాజమిత్రవిరాజితంబై, సంతతక
ల్యాణవేదియుంబోలె వైవాహికోపేతంబై, బలిదానవకరతలంబునుంబోలె సంతతదానవారియుక్తంబై, యొప్పునప్పు
రంబు ప్రవేశించి యందు విశ్వకర్మనిర్మితంబైన యంతఃపురంబున నుండు షోడశసహస్రహర్మ్యంబులందు॥ సీ॥ పటికంపు
కంబముల్ పవడంపుపట్టెలు మరకతరచితముల్ మదిరలమర। వైడూర్యమణిగణావళులును బద్మరాగంబుల మొగడలకాంతు
లొలయ।సజ్జాతివజ్రాలసజ్జాతరుచులతో భాసిల్లు నీలసోపానములును।గరుడపచ్చలవిటంకములును ఘనరుచి వెలసినశశి
కాంత వేదికలును।వరలు మౌక్తికఘటితకవాటములును।విమలస్వర్ణమయ సాలభంజికలును।మించు కలరవ మెసఁగఁ
గ్రీడించు మిథున।లీల నెప్పు కపోతపాలికలు గలిగి॥ గీ॥ చేటికానీకపదతులాకోటిమధుర।నినదభరితంబులు చిరమాణిక్యదీప।
మాలికలు గల్గి చూపట్టు లీలనొక్క।జలజలోచనునిజసౌధతలమునందు॥ గీ॥ కనకకంకణఝణఝణత్కారకలిత। చంద్రబిం
బాననాహస్తజలజఘటిత।చామరోద్ధూతమారుతచలితచికుర।పల్లవునిఁ గృష్ణువల్లవీపల్లవునిని॥ వ॥ మఱియు హాటకనిష్కం
బులట్టులందు వెలుంగొందఁ గంచుకంబులు శిరోవేష్టనంబులుఁ గనకకుండలంబులు ధరియించి సంచరించు కంచుకులును, స

మానవమోహరూపగుణ విలాసవిభ్రమకలితలయిన విలాసినీసహస్రంబులుఁ గొలువఁ గొలువున్న యప్పద్మలోచనుం
గాంచనసింహాసనాసీనుం గాంచెనప్పుండరీకాక్షుండును నారదునింగనుంగొని ప్రత్యుత్థానంబు సేసి యప్పుడు॥ క॥ ముని
వరుపాదాంబుజములు। తనచారుకిరీటమణినితానము సోఁకన్। వినమితుఁడై నిజసింహా। సనమునఁ గూర్చుండఁ బెట్టి సద్వి న
యమునన్॥ క॥ దనపాదకమలతీర్థ। మ్మునలోకములం బవిత్రముగఁ జేయుపురా। తనమౌనిలోకగురుఁడ। మ్మునిపదతీర్థంబు మ
స్తమునధరియించెన్॥ వ॥ ఇట్లు బ్రహ్మణ్యదేవుండును, నరసఖుండును నైన నారాయణుండ శేషతీర్థోపమానంబయిన ము
నీంద్రపాదతీర్థంబుధరియించినవాఁడయి సుధాసారంబులైన మితభాషణంబుల నారదునకిట్లనియె॥ క॥ పపనిపంచినఁ జే
యుదుఁ దాపసవరయనుఁడు నతఁడు దామోదర చి। ద్రూపక భవదవతార। వ్యాపారము దుష్టనిగ్రహార్థము గాదే॥ గీ॥ అఖిల
లోకైకపతివిదయార్ద్రవృత్తివి। విశ్వసంరక్షకుండవు శాశ్వతుఁడవు। వెలయ నేపనియైనఁ గావింతుననుట। యార్తబంధుండ
విదినీకునద్భుతంబె॥ గీ॥ అబ్జసంభవహరదేవతార్చనీయ। భూరిసంసారసాగరోత్తారణంబు। నవ్యయానందమోక్షదాయక
మునైన। నీపదధ్యానమాత్మలో నిలుపనీవె॥ వ॥ అనియభ్యర్థించి యద్దేవునివలనఁ బ్రసన్నతవడసి తన్మందిరంబు వెడలి ముని
వరుండమ్మహాత్ముని యోగమాయాప్రభావంబు దెలియంగోరి వేఱొకచంద్రబింబాననాగేహంబునకుం జని యందు నె
త్తమాడుచున్న పురుషోత్తము నుద్ధవసహితుంగని యద్భుతంబు నొందుచు నచటనతనిచేత సత్కృతుండై యచ్చోటు వాసి
చని॥ క॥ మునివరుఁడు గాంచె నొండొక। వనజాయతనేత్రి నిజనివాసంబున నం। దనయుతుఁ జిష్ణుసహిష్ణు। న్వినుతగుణాలంక
రిష్ణువిష్ణుం గృష్ణున్॥ క॥ నారదుఁడటఁ జనికనెనొక। వారిజముఖియింటనున్నవాని మురారిన్। హారిన్ దానవకులసం। హారిన్న
మలామనోవిహారిన్ శౌరిన్॥ వ॥ ఇట్లు కనుంగొనుచునుండ నొక్కయెడ నమ్మునీంద్రునకు ముకుందుండు ప్రత్యుత్థానంబు
చేసి మునీంద్రా సంపూర్ణకాములైన మిమ్మునపూర్ణులమైనయేమేమిటఁ బరితృప్తి నొందం జేయఁగలవారము భవదీయద
ర్శనంబున నిఖిలశోభనంబులనందెదమని ప్రియపూర్వకంబుగాఁ బలికిన నానందనందను మాటలకు నానందకందళితహృద
యారవిందుండును, మందస్మితసుందరవదనారవిందుండును నగుచు నారదుండు వెండియుం జని॥ క॥ అనఘాత్ముఁడు గనుఁగొ
నెమొక। వనితామణిమందిరమున వనకేళీసం। జనితానందుని ననిమిష। వినమితచరణారవిందు విభు గోవిందున్॥ క॥ పరమేష్ఠి
సుతుఁడుగనెనొక। తరుణీభవనంబునందుఁ దనుఁ దానమనోం। బురుహమునఁ దలఁచుచుండెడి। నరకాసురదమను శూరుసం
దనుమారున్॥ మఱియునుం జని చని॥ సీ॥ ఒకచోట నుచితసంధ్యోపాసనాసక్తు నొకచోటఁ బౌరాణికోక్తికలితు। నొకచోటఁ
బంచయజ్ఞోచితకర్ముని నొకచోట నమృతోపయోగలోలు। నొకచోట మజ్జనోద్యోగానుషక్తుని నొకచోట దివ్యభూషోజ్జ్వ
లాంగు। నొకచోట ధేనుదానోత్కలితాత్ముని నొకచోట నిజసుతప్రకరయుక్తు। నొకచోటను గానవినోదచిత్తు। నొక్క
చోటను జలకేళియుతవిహారు। నొక్కచోటను సన్మంచకోపయుక్తు। నొక్కచో బలభద్రుతోఁ జొక్కుచుండు॥ మఱియును॥
సీ॥ సకలార్థసంవేదియొకయింటిలోపలఁ జెలువతో ముచ్చటలెప్పుచుండు। విపులయశోనిధి వేఱొక్కయింటిలో సరసిజా
ననఁ గూడి సరసమాడుఁ। బుండరీకాక్షుండు నొండొకయింటిలోఁ దరుణికి హారవల్లరులు గ్రువ్వుఁ। గరుణాపయోనిధి మఱి
యొకయింటిలోఁ జెలిఁ గూడి విడియము సేయుచుండు। వికచకమలనయనుఁ డొకయింటిలో నవ్వుఁ। బ్రవిమలాత్ముఁ డొకటఁ
బాడుచుండు। యోగిజనవిధేయుఁ డొకయింట సుఖగోష్ఠి। సలుపు ననఘుఁ డొకటఁ జెలఁగుచుండు॥ ఇట్లు చూచుచుం జని చని॥
క॥ చతురాననందనుఁడం। చితమతి సని కాంచె నొక్కచెలి గేహమునన్। క్రతుకర్మాచరణుని నా। శ్రితభయహరణుని సు
రేంద్ర సేవితచరణున్॥ క॥ వృత్రారినుతుని బరమప। విత్రుని నారదుఁడు గాంచె వేఱొకయింటం। బుత్రకపౌత్రకదుహితృ
కళత్రసమేతుని ననంతులక్షణవంతున్॥ క॥ సుందరమగు నొకసుందరి। మందిరమునఁ బద్మభవకుమారుఁడు గాంచె। న్నంద
తనందున్సుజనా। నందున్గోవిందు నుతసనందు ముకుందున్॥ క॥ జలజభవభవుఁడు గనెనొక। నలినాక్షినివాసమందు నతభ
ద్రేభున్। జలదాభున్ గతలోభున్। నలకాళిజితద్విరేఫు నంబుజనాభున్॥ మ॥ ఒకయింటన్ గజవాజిరోహకుఁడునై యొ
క్కింటభంజానుఁడై। సకలాత్ముండు పరుండు షోడశసహస్రస్త్రీనివాసంబుల। న్నొకచోఁ టింటను దప్పకుండ నిజమాయో
త్సాహుఁడై యుండన। య్యకలంకుం బరమున్ మహాపురుషు బ్రహ్మణ్యున్నతాజ్ఞానసున్॥ క॥ అస్తోకచరితు నమితస। మస్తసు
ధాహారు వేదమస్తకతలవి। న్యస్తపదాంబుజయుగళు న। పాస్తాశ్రితనిఖిలపాపుఁ బరమున ననంతున్॥ గీ॥ పరమభాగవతుఁడు
పరమేష్ఠితనయుండు। మనుజలీలఁ జెందిమహితసౌఖ్య। చిత్తుఁడైనయాహృషీకేశుయోగమా। యాప్రభావమునకు నా
త్మనలరి॥ క॥ మాయారెహరిహరివరదయ। మేయగుణా యనుచు నాత్మ మెచ్చి మునీంద్రుం। డాయదునాయకు సుజనవి। ధే
యునకిట్లనియె దేవ త్రిజగములందున్॥ క॥ నీమాయఁ దెలియువారలె। తామరసాసనసురేంద్రతాపసులైనన్ ధీమంతులు ని

జభక్తిసుధామాధుర్యమునఁ బొదలుధన్యులు దక్కన్॥ క॥ అనిహర్షించుచు మునీంద్రునేఁ బనివినియెన్ సనిఖిలలోకపావనమును స
జ్జనహితమై చనుమీకీర్తనముఖలజగంబులందుఁ దగ నెఱిఁగింతున్॥ క॥ అనితద్వచనసుధాసేచనమున ముదితాత్ముఁడగుచు
సంయమిచిత్తంబునఁ దన్మూర్తిన్ వగనిడు కొనిచని యెనుహరిను తైకగుణయుతుఁడగుచున్॥ క॥ ఈపగిదిలోకసంతతమతి నా
పరమేశ్వరుఁడు మానవాకృతిఁ ద్రిజగద్దీపితచారిత్రుఁడు బహురూపములం బొందెసుందరులనరనాథా॥ చ॥ అనిహరియి
ట్లుషోడశసహస్రవధూమణులన్ బ్రియంబున న్మనసిజకేళిఁ దేల్చినయమానుషలీలనమగ్రభక్తితోఁ బనినఁబరించినన్గలు
సువిష్ణుపదాంబుజభక్తియున్మహాధనపశుపుత్రమిత్రవనితాముఖసౌఖ్యములున్న రేశ్వరా॥ వ॥ అని చెప్పి యప్పారాశర్య

⟶ శ్రీ జరాసంధభీతులయిన రాజులపంపున విప్రుండు కృష్ణసన్నిధికి నేతెంచి విజ్ఞాపనము చేయుట. శ్రీ ⟵

నందనుండభిమన్యునందనునకిట్లనియె-నాదివసాగమసమయంబునఁ బద్మబాంధవాగమనంబు గమలినీలోకంబునకు మును
కలుగ నెఱింగించు చందంబునం గలహంససారసరథాంగముఖజలవిహంగంబుల రవంబులు చెలంగ నరుణోదయంబున
మంగళపాఠకసంగీతమృదుమధురగాననినదంబును, లలితమృదంగవీణావేణునినాదంబును, వీతేర మేలుకని తనచిత్తంబు
నఁ జిదానందమయుం బరమాత్ము నవ్యయు నవికారు నద్వితీయు నజిశు ననంతు నచ్యుతు నమేయు నాద్యంతవిహీనుఁ బరమ
బ్రహ్మంబునైన తన్నుం దా నెక్కయించుక చింతించి యనంతరంబ విరోధిరాజన్యనయనకల్హారంబులు ముకుళింప భక్తజనన
యనకమలంబులు వికసింప నిరస్తనిఖిలదోషాంధకారుండై నగోవిందుండు మొగిచిన లోచనసరోజంబులు వికసింపంజే
యుచుఁ దల్పంబుడిగ్గి చనుదెంచి యంత॥ సీ॥ మలయజకర్పూరమహితవాసితహేమకలశోదకంబులఁ జలకమాడి। నవ్యలస
న్మృదుదివ్యవస్త్రంబులు వలనొప్ప రింగులువారఁగట్టి। మకరకుండలహారమంజీరకేయూరవలయాదిభూషణావలులుదా
ల్చి। ఘనసారకస్తూరికాహరిచందనమిళితపంకము మేననలరనలఁది। సుహితసౌరభయుతకుసుమములు మఱిమి। పొసఁగ
ఱూపైనశృంగారరసమనంగ। మూర్తిఁగైకొన్నకరుణాసముద్రుఁ డనఁగ। రమణనొప్పుచు లలితదర్పణము చూచి॥ గీ॥ కడఁగి
సారథి దెచ్చిన కనకరథము। సాత్యకిహితప్రియోద్ధవసహితుఁడగుచు। నెక్కి నిజకాంతి దిక్కులఁ బికటిల్లఁ। బూర్వగిరిఁ
దోఁచుభానునిఁ బోలి వెలిఁగె॥ సీ॥ అభినవనిజమూర్తి యంతఃపురాంగనానయనాబ్జములకు నానందమొదవ। సలలితముఖ
చంద్రచంద్రికాతతి పౌరజనచకోరములకుత్సవము సేయ। మహనీయకాంచనమణిమయభూషణదీప్తులు దిక్కులఁ దేజరి
ల్ల। నల్లనల్లన వచ్చి యరదంబు వెసడిగ్గి హలకులిశాంకుశజలజకలశ। లలితరేఖలు ధరణి నలంకరింప। నుద్ధవుని హస్తతలమూ
నియొయ్యనఁ జని। మహితగతి దేవతాసభామధ్యమమున। రుచిరసింహాసనమునఁ గూర్చుండె నెలమి॥ చ॥ అతివిభవంబునం
దనరియాత్మతనుద్యుతి దేజరిల్లఁగా। హితులు పురోహితుల్వసుమతీశులు మిత్రులు బాంధవుల్ బుధు। ల్సుతులును మాగధు
ల్కవులు సూతులు మంత్రులు భృత్యులున్ సభా। స్థితిఁ గొలువంగ నొప్పెను డుసేవితుఁడైన సుధాంశుఁడోయనన్॥ క॥ కరుణా
ర్ద్రదృష్టిఁ బ్రజలం। బరిరక్షించుచు వివేకభావకళాచా। తురి మెఱసి యిష్టగోష్ఠిం। బరమానందమున రాజ్యభారకుఁడగు
చున్॥ వ॥ ఇవ్విధంబునం బ్రతిదివసంబునుండ నెక్కనాఁడపూర్వదర్శనుండైన భూసురుండొక్కరుండు చనుదెంచి సభా
స్థానంబునం గొలువున్న ముకుందునిం బొడఁగని దండప్రణామం బాచరించి వినయంబునఁ గరంబులు మొగిచి యిట్లనియె॥
క॥ కంజవిలోచన దానవభంజన యోగీంద్రవిమలభావనసద్బో। ధాంజనదృష్టినిదర్శన। రంజితశుభమూర్తి కృష్ణ రామావ
రజా॥ గీ॥ అవధరింపు జరాసంధుఁ డతులబలిమిఁ। దనకు మ్రొక్కనిధారుణీధవుల నెల్ల। వెదకి తెప్పించి యిరువది వేలనాఁకఁ।
బెట్టినాఁడు గిరివ్రజపట్టణమున॥ గీ॥ వారుపుత్తేర వచ్చినవాఁడ నేను। నరవరోత్తమ నృపుల విన్నపము గాఁగ। విన్నవించెద నా
మాటవినినమీఁద। ననఘ నీదయవారి భాగ్యంబు కొలఁది॥ అని ధరాధిపుల విన్నపంబు గా నిట్లనియె॥ ఉ॥ వారిజనాభ భక్తజన
వత్సల మత్తను దాసురేంద్రసం। హారసరోరుహాననపురారిముఖామరవంద్యపాదపం। కేరుహ సర్వలోకపరికీర్తితదివ్యమ
హాప్రభావసం। సారవిదూరనందతనుజాతరమాహృదయేశమాధవా॥ గీ॥ ఆర్తజనులనమ్మున నరసి రక్షించుమ। హాత్మభక్త
జనభయాపహరణ। నిన్ను మదినుతించి నీకు మ్రొక్కెదము నీ। చరణయుగము మాకు శరణమనఘ॥ క॥ బలియుర దండింపఁగ
దుర్బలుర ననురక్షింప జగతిపై నిజలీలా। కలితుఁడవై యుగయుగమున। నలవడ నుదయింతు కాదె యభవ యనంతా॥ క॥ నీమదిఁ
దోఁపని యర్థం। బీమేదినియందుఁ గలదె యీశ్వర భక్తస్తోమసురభూజ త్రిజగ। త్క్షేమంకర దీనరక్షఁ జేయు మురారీ॥ క॥ నీ
పంపు సేయకుండఁగ। నాపద్మభవాదిసురలకైనను వశమే। శ్రీపతి శరణాగతులం। జేపట్టి నిరోధము డుగఁ జేయుము కృష్ణా॥
క॥ అభవుఁడవయ్యును జగతిం। బ్రభవించుట లీలగాక భవమొందుటయే। ప్రభువులకుఁ బ్రభుఁడవు మము। సభయాత్ముల నర
సి కావఁ జను నార్తిహరా॥ క॥ కదనమున నీభుజావళి। కెదురింపఁగలేక పాఱఁడే విక్రమసం। పద చెడిఁగ జరాసంధుఁడు। పదు

నేనిమిదిమార్గ్లధరణీపాలురునవ్వ ॥వ॥ఇట్లుతనపడినబన్నములందలంపక సింహంబుసమదదంతావళంబులనరికట్టి కారించుచందంబునమమ్ముం జెఱంబెట్టిబాధించుచున్నయప్పాపాత్మునిమర్దించికారాగృహవాసబద్ధులమగు మానిర్బంధంబులంబాపిసుతదారమిత్రవర్గంబులంగూర్చియనన్యశరణ్యులమైనమమ్మురక్షింపుమునివిన్నవించిరని బ్రాహ్మణుండువిన్న

## శ్రీ నారదుండు శ్రీకృష్ణునివద్దికేతెంచిధర్మరాజుచేయురాజసూయమును నెరవేర్పుమని చెప్పుట. శ్రీ

పంబుసేయునవసరంబున॥సీ॥శారదచంద్రికాసారంగరుచితోడజడముడికెంపుచేఁజఱచినవ్వ। శరదంబుదావృతసౌదామనీలతాశోభఁగాంచనకటిసూత్రములగ।లలితపూర్ణేందుమండలకలంకముగతిమృదుమృగాజినరుచిమించుఁజూపఁ। కల్పశాఖాగ్రసంగతపుష్పగుచ్ఛంబులీలఁగేలనునతుమాలికమర।భూరిపుణ్యనదీతోయపూరణమునఁ। దగుకమండలువొక్కహస్తమునఁదనర। వెల్లజన్నిదములుతశోభిల్లవచ్చె।నారదుండువివేకవిశారదుండు॥క॥చనుదెంచెనట్లుమునినిజ। తేనుకాంతులనఖిలదిగ్వితానము వెలుఁగ।న్వనజాప్తుఁబోలినయ్యాదు।జనములుగృష్ణుండు లేచిసంప్రీతి మెయిన్॥క॥వినయమునమ్రొక్కికనకా।సనమునఁగూర్చుండఁబెట్టిసముచితవివిధా।ర్చనములఁదనిపిమురాంతకుఁ।డనియెన్వినయంబుఁదోఁపనమ్మునితోడన్॥గీ॥ఎచ్చటనయుండివచ్చితిరిచ్చోటునకు।నఖిలలోకైకసంచారులనుటఁజేసి।యీరెఱుంగనియర్థంబునిఖిలమందు।నఱయలేదంత్రుమిమ్మొకఁడడుగవలయు॥ గీ॥ పాండునందనులిప్పుడేపగిదినేచట। నున్నవారలోయెఱిఁగింపుఁడన్నమౌని।గరసరోజాతములుమోడ్చికడఁకతోడఁ।బలికెఁగసులాతఁజూచిసద్భక్తిమెఱసి॥వ॥ దేవానీవువిశ్వనిర్మాణకర్తవైమాయివైసకలకార్యోత్పాదనాదిశక్తియుక్తుండవైపావనుండవైపావకుండుదారువులందునంతర్హితప్రకాశుండైయున్నచందంబునవర్తించుచున్ననీమదురత్యయంబైనమాయాశతంబులఁబెక్కుమార్గ్లపొడగంటి-నదియు నాకద్భుతంబుగాదదియునుంగాకనీసంకల్పంబునజగంబుద్భవంబైభవత్పరతంత్రంబగునట్టినీకిష్టంబైనవస్తువుసాధుతరంబుగాఁదెలియనెవ్వండుసమర్థుండేపదార్థంబుప్రమాణమూలంబైనందోఁచునదియునులోకవిచక్షుణుండవైననీదురూపంబునకతీయునుముక్తిమార్గంబునెఱుంగకసంసారపరవశులైనజీవులమాయాంధకారంబునివర్తింపఁజేయసమర్థంబగునీదివ్యలీలావతారంబులంగలుగుకీర్తియనుప్రదీపంబుప్రజ్వలింపంజేసికృపసేయునట్టి నీకునమస్కరించెద నదిగావుననీప్రపంచంబుననీవెఱుంగనియర్థంబుగలదేయనికృష్ణునకునారదుండిట్లనియె॥సీ॥అయినన్నువినుపింతునవధరింపుము దేవపాండుతనూజుండుపారమేష్ఠ్య।కామానుమోదియైకావింపఁగలఁడుసద్రాజసూయమహాధ్వరంబువేడ్క। శవణింపలోకవిడంబనార్థముగాకపరికింపఁదనకాత్మబాంధవుఁడవు। భక్తవత్సలుఁడవుపరమపూరుషుఁడవుయజ్ఞరక్షకుఁడవుయజ్ఞభోక్త।వసుభవత్సేవచాలచేసుగతినడయ।నైననీమేనబావధర్మాత్మజుండు।నతనియజ్ఞంబురక్షింపనంబుజాక్ష।వలయుపిచ్చేయుమసుమతిచ్చేయుమచటికివలనుమెఱసి॥క॥నీపేరువినినసెడివినఁ।బాపంబులుమాసిపోవుఁబద్మాక్షజగ।ద్దీపకనీదర్శనమున। నేపారవెభక్తజనులకిహపరసుఖముల్ ॥మ॥భవదీయోజ్జ్వలకీర్తిదిగ్వితతులన్భాసిల్లుయుష్మత్పదో। ద్భవనైర్మల్యజలంబులుత్కలికఁబాతాళంబునంబాలుభో।గవతీనామమునందనర్చిధరణింగంగానదీరూపమై। దివిమందాకినియైజగత్త్రయమునందీపించుఁగాదేహరీ॥క॥ఆముఖవేళసమస్తధ।రామండలిఁగల్గుమేటిరాజులుమాని।స్తోమంబునుభవదీయమ।హామహిమముఁజూడసగాదేహరీ॥క॥కలరనిచెప్పిననమ్ముని।పలుకులకున్మదము నొందిపంకజనాభుం। డెలనవ్వు మొగమునకుఁజెలు।వ్వొత్తాగ్రతఁబొందన్॥

## శ్రీ శ్రీకృష్ణుండుద్ధవునియాలోచనచొప్పునధర్మరాజుపాలికిఁబోవుట. శ్రీ

॥క॥ఉద్ధవమహితవివేకస।మిద్ధవచోవిభవకార్యమేగతినడుచున్। వృద్ధవరానువోలయఁగఁబాటించియుద్ధవునకిట్లనియెన్॥గీ॥అనఘచారిత్రనీవునాయక్షియుగము। వంటివాఁడవుమనకునవమతంబుగ।బోద్ధవ్యముగాఁగఁజెప్పుపురుషనిధానా॥గీ॥అనఘచారిత్రనీవునాయక్షియుగము ...

తబహులార్థసాధనంబగుననిపలికిన నారదుండును యాదవజనంబులును సభికులునుం బొగడిరంత॥ సీ॥ తరలవిచిత్రకస్థగిత
ప్రభావళిఁదనరారుగరుడకేతనము వెలుఁగఁ। గాంచనచక్రసంగతఘంటికాఘణఘణనినాదమునదిక్కరులు బెదర। సల
లితమేఘపుష్పకవలాహకసైన్యసుగ్రీవతురగవిస్ఫురణదనర। బాలసూర్యప్రభాభాసమానద్యుతిదిగ్వితానంబులఁదీఁటు
కొనఁగఁ। బ్రకటరుచి నెప్ప లేరుదారకుఁడు దేర। నెక్కి వెడలెడునపుడు పెంపెనయఁ జెలఁగె। శంఖకాహళపటహనిస్సాణ
డిండిమాదిరవములుభరితదిగంతములుగ॥ క॥ నను జేశ్వరునకుఁదాలాంకునకును గురువృద్ధజనులకును మ్రొక్కి ప్రియం
బుననను పఁగాంచనస్యందన సామజవాజిభటకదంబము గొలువ ॥ గీ॥ వందిమాగధసూతులై వారరవము। వసుమతీసుర
కోటిదీవనల మ్రోఁత। యనుగమింపంగ సతులు సౌధాగ్రశిఖర। జాలములనుండి ముత్యాలసేసలాలుక॥ క॥ లీలం జనికృష్ణుఁడు
వాహ్యాళిన్నవకుసుమఫలభరానతశాఖా। లోలఘనసారసాలర। సాలవనస్థలమునందుఁ జతురతవిడిసెన్॥ వ॥ అట్టియెడ స
రోజనాభుశుద్ధాంతకాంతాజనంబులు॥ సీ॥ వికచమరందనవీనసౌరభలసన్మందారకుసుమదామములుమఱిమి। చారుసు
గంధకస్తూరికాఘనసారమిళితచందనపంక మెలమినలఁది। కనకకుండలకనత్కంకణనూపురముద్రికాభూషణములుధ
రించి। యంచితముక్తాఫలాంచలమృదులదివ్యాంబరములు చెలువారఁగట్టి। యర్ధచంద్రుని నెకసక్కెమాడునట్టి। యలికఫ
లకములందిలకములలరఁదీర్చి। పెంపుదీపింపనుడురాజబింబముఖులు। నవచతుర్విధశృంగారమవధరించి॥ గీ॥ జలజలోచనుకడ
కునుత్కలికతోడ। దనరుశిబికంబు లెక్కినందనులుఁదామ। గడఁక నేతేరఫణిహారజనులు వేత్ర। కలితులై పౌరులను నెడ
గలుగజడియ॥ క॥ అసమాస్త్రుండుపులుఁగడిగిన। కుసుమాస్త్రములఁ బరిహసించు కోమలతనువుల్। మిసమిస మెఱుఁగవేశ్యా
వినరముదాసీజనంబువిభవ మెలర్పన్॥ గీ॥ హరుల వేసడములఁ గరులను నెక్కి తో। నలును దేరబహువిధాయుధములు। దా
ల్చిసుభటకోటితగిలిరానంతనిపు। రాంగనలు సితాంబుజాక్షుకడకు॥ అంత॥ క॥ నారదుఁ నిమాధవుఁడున। తారంబునవీఁ
డుకొలుపనతఁడు సుహృదయాంభోరుహమునఁగృష్ణునకును। వారక మ్రొక్కుచును వెసదివంబునకరిగెన్॥ క॥ నరవరుల
దూతయునుమురహరుచేనభయప్రదానమందిధరిత్రీ। వరులకడ కేఁగిపద్మో। దరువచనము సెప్పి సమ్మదంబునఁ దేల్చెన్॥
వ॥ అంతఁ గృష్ణుండు నిజకాంతాతనయబంధుసుహృజ్జనసమేతుండై కదలిచనునెడ॥ చ॥ కటపటరత్నకంబళనికాయకుటీర
ములుల్లసిల్లను। తత్కటపటుచామరధ్వజపతాకకిరీటసితాతపత్రవి। స్ఫుటఘనహేతిదీధితినభోమణిఁగప్పఁగఁదూర్యఘో
షములచ్చటులతిమింగిలోర్మిరవసాగరఘోషమునాక్రమింపఁగన్॥ క॥ కరిహరిరథసుభటసముత్కరములు సేవింపమురవి
దారుఁడుగడచెన్। సరిదుపవనదుర్గసరో। వరజనపదపురపుళిందవనగోష్ఠములన్॥ వ॥ ఇట్లు గడచి చనుచు నానర్తకసౌవీరమ
రుదేశంబులు దాఁటి, యిందుమతినిదర్శించి, దృషద్వతినుత్తరించి, సరస్వతీనది డాఁటి, పాంచాలమత్స్యవిషయంబులలోను

## ——శ్రీ పాండవులు శ్రీకృష్ణునెదుర్కొనిదోడ్కొనిపోవుట. శ్రీ——

గాఁజనిచనియింద్రప్రస్థనగరంబుడాయంజనితత్పురోపకంఠవనంబున విడిసిన॥ క॥ హరిరాక నెఱిఁగి ధర్మజుఁ। డఱలేనిము
దంబుతోడననుజులుబంధుల్। గురుజనసచివపురోహిత। పరిచారకకరిరథాశ్వభటయుతుఁడగుచున్॥ క॥ చిందములు మొఱ
యఁగాయక। బృందంబులనుతులు సెవులబెరయఁగభక్తిన్। డెందమునదగులఁగఁబరమా। నందంబునహరి నెదుర్కొనఁగఁజను
దెంచెన్॥ వ॥ అట్లు చనుదెంచి ధర్మనందనుండు సమాగతుండైన సరోజనాభునిం బెద్దతడవు గాఢాలింగనంబు చేసి రోమాం
చకంచుకితశరీరుండై యానందబాష్పధారాసిక్తకపోలుండై నిర్భరానందకందళితహృదయారవిందుండై బాహ్యంబును
అచియుండెనప్పుడుహరి వాయునందనవాసవతనూభవులం గౌఁగిటం జేర్చి సమ్మదంబందిమాద్రేయులు దండప్రణామంబు
లాచరించిన సత్కరించి యప్పుండరీకాక్షుండు విప్రవృద్ధజనంబులకును నమస్కారంబులు సేసి వారలుగావించు వివిధార్చన
లంబరితుష్టుండై కేకయసృంజయాదిభూవిభులమన్నించి సూతమాగధాదులక నేకపదార్థంబులొసంగి చతురంగబలస
మేతుండై వివిధమణితోరణాదివిచిత్రాలంకృతంబునతివైభవోపేతంబునైనపురంబు ప్రవేశించి రాజమార్గంబునం జను
చుండఁ బౌరకామినులట్టియెడ॥ సీ॥ కొఱ నెలపైఁదోఁచు నిరులు నాఁ జెలు వొందినొసలిపైఁగురులుతుంపెసలుగునియ। హాట
కమణిమయతాటంకరోచులు గండభాగంబునఁ గంతులిడఁగ। స్ఫురితవిద్రుమనిభాధరబింబరుచితోడదరహాసచంద్రికసర
సమాడ। నెుండొంటితోరాయు నుత్తుంగకుచకుంభములు మొగంబులకును బుటము లెగయ। బడుగునడుములువడకంగనడు
గులిడుచు। రవమునుట్టెలుమణినూపురములు మెఱయఁ। బొల్పుకచబంధములు భుజంబులనటింపఁ। బమ్మెదలువీడియాడ
సంభ్రమముతోడ॥ వ॥ అట్లు కృష్ణసందర్శనకుతూహలపరస్పరాహూయమానలై గురుపతిసుతబంధుజనంబులు వారింప
నతిక్రమించి సమున్నతభర్మహర్మ్యశిఖరాగ్రంబులెక్కి కృష్ణుం జూచి తమలోనిట్లనిరి॥ సీ॥ విశ్వగర్భుండు నా వెలయు వే

ల్పిలయశోదానందములకుఁ బ్రియసూనుఁడయ్యె। బ్రహ్మాదిసురులకు భావింపఁగా రాని బ్రహ్మంబు గోపాలబాలుఁడయ్యె। వే
దశాస్త్రంబులు వెదకి కానఁగలేనిగట్టి వ్రేతలరోలఁ గట్టువడియె। దివిజులకమృతంబు దివిరియిచ్చినభక్తసులభుండు నవనీ
తచోరుఁడయ్యె। నెనయఁగనలాసతికిఁ జిత్తమిూనివేల్పు। గొల్లయిల్లాండ్రయుల్లములు వల్లవింపఁ జేసెననికామినులు సౌ
ధశిఖరములను గూడితమలోనముచ్చటలాడిరధిప॥ మఱియును॥ సీ॥ గోపాలబాలురఁ గూడియాడెడినాఁడు వ్రేపల్లెలోప
లనేపురేఁగి। చల్లలమ్మఁగఁబోవుపడుతులకొంగులువట్టి మెలుఁగుచెక్కిళ్ల పైమీఁటిమీఁటి। కలికిమైముద్దాడఁగౌఁగిటఁజేర్చిన
పూఁబోఁడికుచములుపుడికిపుడికి। పాయనియనురక్తి డాయఁజీటినయింతియధరసుధారసంబానియాని। యమసమాధిస
రాష్టాంగయోగయుక్తులైనయోగీశ్వరులుగాననట్టిజెట్టి। వల్లవీజనవకల్పవల్లియయ్యె। ననుచుఁ బొగడిరి కృష్ణునయ్యాబ్జ
ముఖులు॥ వ॥ అనియిబ్భంగి సరోజలోచనలు సౌధాగ్రంబులందుండియ వ్వనజాతాక్షునిదివ్యమూర్తిఁ బహుభావంబులను
గీలించి సం।జనితానందరసాబ్ధిమగ్నలగుచు సంప్రీతిఁదద్భువ్యక్తి। రత్నలైచల్లిరి నవ్యలాజములు మందారప్రసూనావలుల్॥
వ॥ తదనంతరంబున శోభనపదార్థంబులు గొనివచ్చి ధరామరధరావరవణిక్పుంగవులు దామోదరునకుఁ గానుకలు దెచ్చి స
మర్పించిరి- పుణ్యాంగనాజనంబులు పసిండిపళ్లెరంబులఁ గర్పూరనీరాజనంబులు నివాళింపనంత నిపురంబు సొత్తెంచెనం
తఁ గుంతిభోజనందనయుం గృష్ణునిం గని పర్యంకంబు డిగ్గి కౌఁగిలింపనాయదువల్లభుండు మేనత్తకు దండప్రణామంబాచరిం
చెఁ బాంచాలియు ముకుందునకునభివందనంబొనరించెనంతఁ గుంతి పంపున గోవిందుభామినులకు రుక్మిణి మొదలగువారికి
గంధాక్షతకుసుమతాంబూలంబులిడి బలితమకూల మణిభూషణంబులం బూజించె యుధిష్ఠిరుండును గమలనయనుసవధూ
జనులననుగతబంధుమిత్రపుత్రసచివపురోహితపరిచారికానికరంబుల నుచితంబులగుస్థలంబుల విడియించి పనియమించి దిన
దినప్రవర్ధమానాభినవవివిధోపచారంబులు గావించెనంత॥ క॥ హరియు యుధిష్ఠిరు సముచిత। పరిచర్యలకాత్మనలరి పా

**శ్రీ ధర్మరాజు శ్రీకృష్ణునియాలోచన చొప్పున దిగ్విజయార్థము గాభీమాదులఁ బంపుట.**

ర్థుఁడు దానుఁ। సరసవిహారక్రియలను। సురుచిరగతిఁ గొన్నినెలలు సుఖముండె నృపా॥ అంత॥ సీ॥ ధరణీశ
యొకనాఁడు ధర్మతనూజుఁడు ప్రవిమలనిజసభాభవనమందు। హితులుమంత్రులుపురోహితులును సుతులును మిత్రులు
బంధువుల్ క్షత్రవరులు। పరిచారకులు సూతపాఠకకవిబుధవరులును మునులును వరుసఁ గొలువఁ। జిరలీలనవరత్నసింహాస
నస్థుఁడై కొలువుండి వినతుఁడై నలిననాభు। భువనరక్షణదక్షునచ్యుతచరిత్రు। యమకులేశ్వరుమురదైత్యమదవిభేది।
నాప్తునయవేదిఁ జతురుపాయప్రవీణుఁ। జూచియిట్లని పలికెనస్తోకచరిత॥ గీ॥ అనఘచారిత్ర రాజసూయాధ్వరం
బు। నెమ్మిఁ గావించు వేడుక నెమ్మనమున। నెనయుచున్నది యది నిర్వహింపనీవ। కాక నాకాత్మబంధువుల్గలరె యొరులు॥
ఉ॥ ఎవ్వరు నీపదాంబుజము లెప్పుడు గొల్తురు భక్తినిష్ఠులై। యెవ్వరు నిన్నుఁ బ్రేమ నుతియింతురు భూరివివేకశాలులై। య
వ్విమలాత్ములందు మురదంచితశోభననిత్యసౌఖ్యముల్। నివ్వటిలంగఁ గృష్ణ నిను నేర్చి భజించిన జిత్తవోపునే॥ వ॥ అనినఁ
గృష్ణుండు ధర్మనందనునకిట్లనియె॥ చ॥ నయగుణశాలి పాండునృపనందన నీతలఁపొప్పు నీక్రతుక్రియ ముని దేవతా పితృసు
కృత్యము నైనిఖలోగ్రశాత్రవక్షయమును బాంధవప్రియముసంచితపుణ్యము నిత్యకీర్తియున్। జయమును గల్గుదీనఁ గురుస
త్తమ వేగ నుపక్రమింపుమా॥ క॥ మనుచరితనీసహోదరులనుపమదివ్యాస్త్రవేదులాహవభూమిన్। జనకిననైరిన్నృ
పాలురఁ। దునుమఁగఁ జాలుదురు శౌర్యదుర్దమభంగిన్॥ క॥ గెలువుము విమతనృపాలుర। వెలయుము బుధవినుతమైనవిశ్రు
తకీర్తి। నిల్పుము నిఖిలధరామండలి నిభవచ్ఛాసనము దృఢంబుగఁ జెల్లన్॥ క॥ నీపంపుకార్యమొరులం। జూపక నేఁ జేయని
న్నుఁ జుట్టనవ్రేలన్। జూపఁగవచ్చునె సకలధ। రాపతులకు నీకుఁ జేయరానిది గలదే॥ కావున॥ క॥ విమలమతిఁ బట్టిముఖరా। జసు
నకుఁ దెప్పింపవలయుసంభారంబుల్। సమకూర్పుము నీయనుజుల। సమదగతిం బంపు నిఖిలశత్రుల గెల్వన్॥ క॥ అనుమాటలు
విని కుంతీ। తనయుఁడు మోదమును బొంది తామరసాక్షున్। వినుతించి శౌర్యకలితుల। ననుజుల దెసఁ జూచి పలికె హర్షముతో
డన్॥ క॥ సృంజయభూపాలకులును। కుంజరరథవాజిసుభటకోటులు నినుఁగొ। ల్వం జనుమని సహదేవుని। నంజక పొమ్మనియె
దక్షిణాశ జయింపన్॥ క॥ ప్రకటచతుర్విధసేనా। ప్రకరంబులు గొలువఁ బంచెఁ బడమటిదిశకు। న్నకులున్ దళితరిపుభూపకు
లున్నార్యంబు మెఱసి పార్థివముఖ్యా॥ క॥ దుర్జనభంజను శౌర్యో। పార్జితవిజయప్రకాండు సాహసనిపుణు। న్నర్జుననమహిత
యశోనిధి। నర్జునునుత్తరపుదిశకు ననిపె నరేంద్రా॥ గీ॥ మహితశౌర్యనిధులు మత్స్యకేకయభద్ర। భూతలేంద్రబలసమేత
ముగను। దర్పమొప్పఁబంపెఁ దూర్పుదిక్కునకును। ద్దామనిహతవైరిధాముభీము॥ చ॥ పనిచిన వారలేఁగి ఘనబాహుపరాక్ర
మవిక్రమంబులన్। ననుపమశౌర్యులైన చతురంతమహీశుల నోర్చి కప్పముల్। గనకవినూత్నరత్నతురగప్రముఖాఖిల

స్తుజాతము|గ్లానిచను దెంచిధర్మజునకున్ బ్రణమిల్లిరుదాత్తచిత్తులై॥ చ॥తమతమసోయివచ్చినవిధంబులుభూపతులక్షజ
యించుటల్ |గ్రమమునఁ జెప్పనంమలజరాతనయుండరి వెట్టఁడయ్యెనం|చమరవరేణ్యనందనుఁడహంకృతిదక్కఁగవిన్నవిం
చిరన్ యమసుతుఁడూరకుండెవికలాత్మకుఁడై వినియంతఁగృష్ణుఁడున్॥గీ॥ధర్మనందనుఁజూచియుత్కలికతోడఁ|బలికెమా
గధుఁబోరఁజంపఁగనుపాయ| మొకటిగలదెఱుఁగఁ దెలిపెదనుద్ధవుండు|నాకుఁ జెప్పినచందంబునయచరిత్ర॥ చ॥వినుమ
గధేశ్వరుండెపుడువిప్రజనావళియందుభక్తియున్| వినయముగల్గియుండియును వేఁడినచోవృథసేయకిచ్చు నే| పునవిజ
యుండునుంబవనపుత్రుఁడు నేనును బ్రాహ్మణాకృతిన్|జనిరణభిక్షు వేఁడినవశంవదుఁడై యతఁడిచ్చుకోరికల్ ॥అట్టియెడ॥
గీ॥తగిలియప్పుడుమల్లయుద్ధమున వాని|బిలుకుమార్పింపవచ్చునుభీము చేత|ననినధర్మజుఁడిది లెస్సయనినవిప్ర|వేషములుదా

## శ్రీకృష్ణభీమార్జునులుజరాసంధునివధింపఁబోవుట.

ల్చియతిగిరివిశదయశులు॥ వ॥అప్డుకృష్ణభీమార్జునులుబ్రాహ్మణ వేషంబులుదాల్చి త్రేతాగ్నులుంబోలెఁ దమశరీర తేజో
విశేషంబులు వెలుంగనతిత్వరితగతింజనిగిరివ్రజపురంబుసొచ్చియందునతిథిపూజలుశ్రద్ధాగరిష్ఠచిత్తుండై కావించుచున్న
జరాసంధునింగనుంగొనియిట్లనిరి॥క॥ధరణీశయతిథిపూజా|పరుఁడవునీవనుచుదిశలఁబలుకఁగవినిమే| మరుదెంచితిమిమ
దీప్సిత|మలసేయకనిమ్ము సువ్రతాచారనిధీ॥క॥అతిథిజనంబులభక్తిన్|సతతముఁబూజించియుచితసత్కారములు|న్నతినడు
పుసుజనులును శా|శ్వతకీర్తులుధరణిఁబడయఁజాలుదురనఘా॥ క॥ పరికింపఁగ దేహంబుఃస్థిరమనినిజబుద్ధిఁదలఁచి చిరతరకీ
ర్తిస్ఫురణన్ బ్రస్తుతి కెక్కని|పురుషుఁడుఃజీవన్మృతుండుఃభూరివివేకా॥క॥ధారుణిలోనవదాన్యుల|కీరానిపదార్థ మొకటి
యొందనుగలదే|కోరినఁదనమేనెముకలు| ధీరుండై యిచ్చెమునుదధీచనవినమే॥క॥అడిగినవ్యర్థ సేయకతన| యొడలాఁక
లిఁగొన్నయెలుకకోఁగిరముగనే|ర్పడనిచ్చికీర్తిఁగనెనని|పుడమిన్మనువినమెయులకపోతముననఘా॥ క॥ఆయింద్రాగ్నులు
శ్యేనక|వాయసరూపములఁదన్నువలఁతిగవేఁడ|న్ధీయుతుఁడై మును శిబితన|కాయము ఛేదించియిచ్చెఁగడువడివినమే॥ గీ॥ధీ
రమతులురంతిదేవహరిశ్చంద్ర|బలులనుంఛవృత్తిబ్రాహ్మణునిని|మున్నుఁ జెప్పవినమెసన్నుతచరితులు|సన్ననైన నేఁడుసు
న్నవారు॥వ॥ అనినవినిజరాసంధుండువారలరూపంబులును మేఘగంభీరభాషణంబులునుగుణకిణాంకంబులునుమహాప్ర
భావంబులునుజూచితనమనంబునవీరలు బ్రాహ్మణవేషధారులై నరాజేంద్రులుగాఁదలంచి యిమ్మహాత్ములుగోరినపదా
ర్థంబకాదుప్రాణంబులేనియునిత్తునదియునుంగాకతొల్లిబలీంద్రుండువిప్రవ్యాజంబుననడిగినవిష్ణుదేవునకునాత్మపదభ్రం
శత్వంబెఱింగియువిచారింపకజగత్త్రియంబునిచ్చికీర్తిపరుండయ్యె- క్షత్రబంధుండనువాఁడు బ్రాహ్మణార్థంబు ప్రాణప
రిత్యాగంబుచేసెనిర్మలంబగుయశంబువడసె-నదిగావుననానిత్యంబైనకాయంబువిచారణీయంబుగాదు-కీర్తివడయుట లె
స్సయనివిచారించియుదారుండై కృష్ణార్జునభీములంగనియిట్లనియె॥ క॥ భూరిగుణులారమీమదిఁ|గోరికెలెఱిఁగింపుఁడేమి
గోరిననైనన్|ధీరతనొసఁగుటయేకా|దారయనాశిరముఁద్రుంచియైననునిత్తున్॥ఉ॥నావుడుకృష్ణుఁడమ్మగధనాథునకిట్ల
నుభూవరేణ్యనీ|భావముసూనృతవ్రతశుభస్థితిఁజెందు టెఱుంగవచ్చెమా| కీవలెనాజిభిక్షమితఁడింద్రతనూభవుఁడేను
పేంద్రుఁడ|న్నావనివీఁడెయిందొకనిఁబైకొనియొక్కటిపోరఁగాఁదగున్॥చ॥ అనవినివాఁడునవ్వియహహావినవింతలువు
ట్టెమున్ననా|న్నని మొనయోర్వఁజాలకభయంబునఁబాఱితనేకమార్గ్లవం| చనమథురాపురిన్విడిచిసాగరమధ్యమునందు
డాఁగవే|వనరుహనాభనీబిరుదువాఁడితనంబులునాకువింతయే॥క॥ఇన్నేలఁ జెప్పమాయలఁ|బన్నినబోవిడువగోపబాలక
బలసం|పన్నునిమాగధభూవరు|నన్నెఱుఁగవెతొల్లినందనందనపోరన్॥ఉ॥కానరణోర్వినన్నెదుఱఁగష్టముగానఁగడంగి
గోత్రభిత్సూనుఁడుభూరిబాహుబలదుర్గముఁడయ్యునుబిన్నయీమరు|త్సూనుఁడుమామకప్రకటదోర్బలశక్తికిఁజూడఁ
మల్లమా|వీనినెదుర్తునంచుఁజెయివీఁచెజరాసుతుఁడుగ్రమూర్తియై॥క॥కరువలిసుతునకునొకభీ|కరగదనిప్పించిమొక్క

## శ్రీకృష్ణసహాయుండగుభీముండుజరాసంధునితోయుద్ధము సేయుట.

గదఁదనకేలన్|ధయించినలుపురునుమ|త్సరమున వెలికేఁగియచటసమతలభూమిన్॥సీ॥పర్వతద్వంద్వంబుపాథోధియుగ
ళంబుమృగపతిద్వితయంబువృషభయుగము|పావకద్వయమదంతావళయుగళంబుడలపడువీఁకనుద్దండలీలఁ| గదిసియ
న్యోన్యభీకరగదాహతులనుగ్రంబుగవిస్ఫులింగములు చెదరఁ|గెరలుచుసవ్యదక్షిణమండలభ్రమణములనుసింహచంక్ర
మణములను|గదిసిపాయుచుడాసిడగ్గరుచుమింటి|కెగసిగ్రుంగుచుఁగ్రుంగి వేయెగసిభూమి| వగులనార్చి ఛటఛటోద్భట
మహోగ్ర|ఘనగదాఘట్టనధ్వనిగగనమగల॥అంత॥ మ॥ గదసారించిబృహద్రథాత్మజుఁడుహుంకారప్రఘోషంబు
నన్|జదలల్లాడఁగఁబాదఘట్టనమునన్సర్వంసహాభాగమున్| గదలన్వాయుజు వ్రేసె వ్రేయనతఁడుగ్రక్రోధదీప్తాస్యుఁ

నై యదిరిప్పించి విరోధిమస్తకము వ్రేయ న్వాఁడు పోఁడట్టుచున్॥ చ॥ ⊛మడపక భీమసేనుఁడును మాగధరాజుఁ గడంగి బె
బ్బులుల్ వ్రిడివడు లీలనొండొరుల వీఁపులు మూఁపులును *ప్రకోష్ఠములున్ దుతలూరుజానుజఘనప్రకరంబులు బిట్టు వ్ర
య్యఁగా, విదుసులఁ బోలు పెన్నదలఁ బెట్టుగ వ్రేయుచుఁ జాయుచు న్వెసన్॥ లయవిభాతి॥ జెడగడరఁ జెన్నదలు పొడిపొడిగఁ
దాఁకఁ జెనుపిడుగులవనిం దొరుగ నుడుగణము రాలన్। మిడుగురులు చెదర నభమండలహరిదంతములు వెడలఁ జలధు లల్లలఁగఁ
బుడమి చలియింపన్। వెడచరువ మొత్తియును దడఁబడఁగ నొత్తియును నెడమఁ గుదుల్లొంచి తిరుగుడు వడఁగ వ్రేయన్। వడవ
డవడంపు చను సుడివడక డాసి చలము డుగక పుడొండొరులు వడిఁ జెడక పోరన్॥ వ॥ ఇవ్విధంబునం బోరుచుండ నొండొరులఁ గ
దాసండంబులు మసురులై నం బెండువడక సమదదిగ్వేదండశుండాదండమండితప్రచండంబులగు బాహుదండంబులప్ప
ళించి ముష్టియుద్ధంబునకుఁ డగ్గరి॥ లయగ్రాహి॥ కాలవెసఁ డాఁచియును గీలెడలఁ ద్రోచియును దాఁకములు దూఁకి బెడకేలవ
డి వ్రేయన్। ఫాలములు గక్షములు దాలువులు వక్షములు లీల నెముకల్మెదడు నేలఁబడు మురై వే। రాలవిపులక్షతవిలోలమగునె
త్తురులు జాలుగొని యోలిఁ జెనుగాలువలుగొన దే। తాలమదభూతములు ఖేలనలఁ జేతులను దాళములు దట్టుచును లీలవడి నా
డన్॥ ఉ॥ ప్రక్కలు చెక్కలు న్మెడలు పాణితలంబులఁ జేఁబగుల్పుచు న్మక్కులు నక్కులు న్నెవులు ముష్టిహతి న్నలియంగ గ్రు
ద్దుచున్। డొక్కలుఁ బిక్కలున్ను నకతోరపదాహతి నొంచుచున్నెఱుల్। దక్కక క్రక్కఁ గొండొరులఁ దార్కొని పేర్కొని
పోరి రుగ్రతన్॥ ఉ॥ హుమ్మని మ్రోఁగుచుం జెలుచ హుంకృతులిచ్చుచుఁ జాసి డాసి కో। కొమ్మనుచున్ దడల్ల గిలిగుల్ల లతిత్తు
లుగాఁబడం బులన్। గ్రుమ్మచు ముష్టిఘట్టనల క్రుక్కుచు నార్పులు దండడింపఁగా। సొమ్మలవోవుచున్ దెలియుచున్ వాడిఁ
జేవయు లావుఁ జూపుచున్॥ వ॥ ఇవ్విధంబున వజ్రవజ్రసన్నిభంబులగు నితరేతరముష్టిఘట్టనంబు న్నాంగులై రక్తసిక్తశరీ
రంబులతోఁడఁ బుష్పితాశోకంబుల వీఁకను జేగురుగొండల చందంబునం జూపట్టి పోరుచుండఁ గృష్ణుండు జరాసంధుని జన్మమ
రణప్రకారంబు లాత్మ నెఱుంగుటం జేసి వాయుతనూభవునకలయిక లేక లావును జేవయుఁ గల్గునట్లుగాఁ దద్గాత్రంబునం
దన దివ్యతేజంబు నిల్పి విరోధినిరసనోపాయం బూహించి సమీరణనందనుండు సూచుచుండ నొక్కశాఖాగ్రంబు రెండు
గాఁ జీల్చి వానినట్లు చీరి చంపుమని సంజ్ఞగాఁ జూపి చెప్పిన నతండు నాకీలు దెలిసి యవక్రవిక్రమపరాక్రముండై మాగధుం
బడఁ ద్రోచి వాని పదంబు పదంబునఁ ద్రొక్కి బాహుయుగళంబున రెండవపదంబు గదలకుండం బట్టి మస్తకపర్యంతంబుఁ జెళ
పెళ యను చప్పుళ్లుప్పతిల్ల మత్తదంతావళంబు దాళవృక్షంబు చీరు చందంబునఁ బాదజానుజంఘోరుకటివక్షోదరాంసక
ర్ణనయనంబులు వేఱు వేఱ భాగంబులుగా వ్రయ్యలు వాపి యార్చినఁ బౌరజనంబులు గనుంగొని భయాకులులై హాహాకా
రంబులు సేసిరంత॥ క॥ అనిలజుని దేవపతినం। దనుఁడును బద్మాక్షుఁడును నుదారత నాలిం। గనములు సేసి పరాక్రమ। మునక

## కారాగృహవిముక్తులగు రాజులు శ్రీకృష్ణుని స్తుతించుట.

ద్భుతమంది మోదమునఁ బొగడి రొగిన్॥ క॥ వనజాక్షుఁడంతఁ గరుణా। వననిధియును భక్తలోకవత్సలుఁడును గా। వున మాగ
ధసుతు సహదేవునిఁ బట్టముగట్టెఁ దన్మహోన్నతపదవిన్॥ క॥ మగధాధినాథునకు ము। న్నగపడి చెఱసాలలను మహాదుఃఖ
ములన్నొగులుచుఁ దన పాదాంబుజ। యుగళము చింతించుచున్న యుర్వీశ్వరులన్॥ వ॥ అయ్యవసరంబునఁ గృష్ణుండు దనది
వ్యచిత్తంబున మగధరాజనిరుద్ధుల చెఱలు విడిపించిన వారలు పెద్దకాలంబు కారాగృహంబులఁ బెక్కుబాధలం బడి కృశీభూ
తశరీరులగుటం జేసి రక్తమాంసశూన్యంబులై త్వగస్థిమాత్రావశిష్టంబులును, ధూళిధూసరంబులైన దేహంబులును, గే
శపాశంబులు మాసి జటాబంధంబులైన శిరోజంబులును, మలినవస్త్రంబులునుం గలిగి చనుదెంచి రప్పుడు॥ సీ॥ నవపద్మలోచ
నుభవబంధమోచను భరితశుభాకారు దురితదూరుఁ। గంకణకేయూరుఁ గాంచనమంజీరు వివిధశోభితభూషు విగతదోషుఁ।
బన్నగాంతకవాహు భక్తమనోహారు నతచంద్రజూటు నున్నతకిరీటు। హరినీలనిభకాయు వరపీతకౌశేయుఁ గటి
సూత్రధారు జగద్విహారు। హారవనమాలికామహితోరువక్షు। శంఖచక్రగదాపద్మశార్ఙ్గహస్తు। లలితశ్రీవత్సశోభితలక్ష
ణాంగు। సుభగచారిత్రు దేవకీసుతునిఁ గాంచి॥ చ॥ భరితముదాత్ములై విగతబంధనులై నిజమస్తముల్ధరా। సురరిపుపాదప
ద్మములు సోఁకఁగఁ జాఁగిలి మ్రొక్కి నమ్రులై। కరములు మోడ్చి యో పరమకారుణికోత్తమ సజ్జనార్తిసం। హరణవివేకశీలమ
హితాశ్రితపోషణ పాపశోషణా॥ గీ॥ వరదపద్మనాభ హరికృష్ణ గోవింద। దాసదుఃఖనాశ వాసుదేవ। యవ్యయాప్రమేయ
యనిశంబు గావింతు మిందిరేశ నీకు వందనములు॥ ఉ॥ ధీరవిచారమమ్ము భవదీయపదాశ్రయులన్ జరాసుతో। గ్రనిబంధ
నోగ్రపరితాపము మీకరుణావలోకనా। సారముచేత నార్చితివి సజ్జనరక్షయు దుష్టశిక్షయు। న్నారయ మీకు సాధ్యములు

⊛మడపక। వెనుకదీయక. *ప్రకోష్ఠము। మోఁచేతి క్రిందినుంచి మణికట్టుదాఁక నుండెడు ప్రదేశము.

యాదవవంశపయోధిచంద్రమా॥ సీ॥ అవధరింపుము మాగధాధీశ్వరుండు మాకుం బరమబంధుండు గానిపగరగాండు। ప్రక
టితరాజ్యవైభవమదాంధీభూతచేతస్కులము మమ్ముం జెప్ప నేల। గమనీయజలతరంగములకై వడిదీపశిఖవోలి చూడనస్థిర
ములైన। సకలసంపదలు నమ్మి పరసాధనక్రియాగమమేదితద్బాధకంబులైన। బలసియన్యోన్యవైరానుబంధములను। బ్రజ
లం గారించుచును మత్తభావచిత్తులగుచు నాసన్నమృత్యుభయంబు దక్కి। మత్తులై తిరుగుదురు దుర్మనుజులంత॥ చ॥ కడపటి
సేఁతనైహికసుఖంబులం గోల్పడి టిత్తకోర్కి వెంబడిం బడి యెండమావులం బిపాసులు నైసలిలాసఁ డాయుచు। న్దైడు మనుజు
ల్భవాబ్ధి నరిఁ జేరంగలేక నశింతురట్టియీ। యిడుములం బొందఁ జాల ముర మేశ త్రిలోకశరణ్య మాధవా॥ ఉ॥ వేదవధూశిరో
మహితవీథులం జాలనలంకరించు మీ। పాదసరోజయుగ్మము శుభస్థితి మా హృదయంబులందు ని। త్యోదితభక్తి మైం దగిలి యుం
డును పాయ మెఱుంగం బల్కఁ గదా। మోదరభక్తదుర్గ్భవను హూజదధిశారణసృష్టికారణా॥ క॥ అనితను శరణము వేఁడిన। జ
ననాథులవలను జూచి సదయులభక్తా। వనచరితుండు పంకజలో। చనుండిట్లను వారితోడ సదయామతియై॥ చ॥ జనపతులారమీ
పలుకు సత్యము రాజ్యమదాంధచిత్తులై। ఘనముగ విప్రులం బ్రజలం గారియఁ బెట్టుటఁ జేసి కాదె వే। గనహుషరావణార్జును
లు గాలము నొందిరి గాన ధర్మసా। లనమునఁ గాక నిల్చునె సులంబు బలంబు దిరాయువున్నతుల్॥ వ॥ అది గావున మీ మనంబు
ల దేహంబు నిత్యంబు కాదెలిసి॥ ఉ॥ మీరును ధర్మ మొందగవు మేరయుఁ దప్పక భూజనాళిఁ బెం। పారుచు సౌఖ్యసంపదలనందఁ
గం బ్రోచుచు భూరియజ్ఞము। ల్గారవవృత్తి మత్సరముగానొనరించుచు మామకాంఘ్రిపం। కేరుహము ల్భజించుచు నకల్బిషు
లై చరియింపుఁ డిమ్ములన్॥ వ॥ అట్లైన మీరలు బ్రహ్మసాయుజ్యప్రాప్తులయ్యెదరు మదీయపాదారవిందంబులందుం జలింపని
భక్తియుం గలుగు నని యానతిచ్చి యా రాజవరుల మంగళస్నానంబులు సేయించి వివిధమణిభూషణమృదులాంబరమాల్యా
నులేపనంబులొసంగి భోజనతాంబూలంబుల సంతృప్తులం జేసి యున్నతరథాశ్వసామజాధిరూఢులం గావించి నిజరా
జ్యంబులకుం బూజ్యులం జేసి యనిచిన॥ క॥ నరవరులీ చందంబున। మురసంహరుచేత బంధమోక్షులై ను। స్థిరహర్షంబులతో
నిజ। పురములకుం జనిరి శుభవిభూతి దలిర్పన్॥ క॥ హరిమంగళగుణకీర్తన। నిరతముగా వించుచును వినిర్మలమతులై। గురు
బంధుపుత్రజాయా। పరిజనములరంగఁ గృష్ణుఁ బద్మదళాక్షున్॥ వ॥ అని బహుప్రకారంబులం బొగడుచుఁ దమతమ దేశంబు
లకుం జనిన॥ క॥ నలినదళలోచనుఁడు దమఁ। దెలిపిన సద్ధర్మపద్ధతిని దగవరులై। యిలం బరిపాలించుచు సుఖ। ము
లం దిరి మహిత నిజవిభవత్వములలరన్॥ వ॥ ఇట్లు కృష్ణుండు జరాసంధవధంబును రాజలోకంబునకు బంధమోక్షణంబును
గావించి వాయునందన వాసవనందనులుం దానును జరాసంధతనయుండగు సహదేవుండు సేయు వివిధంబులగు పూజ
లు గైకొని యతని నుండ నియమించి యచ్చోటు గదలి కతిపయప్రయాణంబుల నింద్రప్రస్థపురంబునకుం జనుదెంచి త
ద్ద్వారప్రదేశంబున విజయశంఖంబులు పూరించినం బ్రతిపక్షభయదంబును బాంధవప్రమోదంబునునగు నమ్మహా
ఘోషంబు విని పౌరజనంబులు జరాతనయు మరణంబు నిశ్చయించి సంతసిల్లిరి వారిజాక్షుండును భీమసేనపార్థులతోఁ బు
రంబు ప్రవేశించి ధర్మనందనునకు వందనం బాచరించి తాము పోయిన తెఱంగును, నచ్చట జరాసంధుని వధియించిన ప్రకారం
బును సవిస్తరంబుగా నెఱింగించిన నతండు విస్మయవికచలోచనంబుల నానందబాష్పంబులు గురియ నమ్మాధవు మాహా
త్మ్యంబునకుం దనయందలి భక్తిస్నేహదయాదిగుణంబులకుం బరితోషంబు నొందుచుఁ గృష్ణునిం జూచి యిట్లనియె॥ సీ॥ కమ
లాక్ష సర్వలోకములకు గురుఁడవై తేజరిల్లెడు భవదీయమూర్తి। యంశాంశసంభవులగు లోకపాలురు నీయాజ్ఞఁ దలమో
చి నిఖిలభువనపరిపాలనిపుణులై భాసిల్లుచున్నారలట్టి నీకొక నృపునాజ్ఞ సేయుట రయనీమాయ గాదె నిక్క మేయేకమై
యద్వితీయమై యవ్యయంబు। నైన నీ తేజమునకొకహానిగలదె। చిన్మయాకార నీపాదసేవకులకు। నాత్మపరభేదబుద్ధి యెం

——శ్రీ ధర్మరాజు చేసెడు రాజసూయయాగంబున శ్రీకృష్ణుండు శిశుపాలుని వధించుట.——

దైనఁ గలదె। పుండరీకాక్ష గోవిందభువనరక్ష॥ వ॥ అని గోవిందునిం బొగడి యద్దేవుననుమతంబునం గుంతీసుతాగ్రజుండు ప
రతత్త్వజ్ఞానులైన ధరణీసురులను ఋత్విక్కులుగా వరియించి॥ సీ॥ సాత్యవతేయ కశ్యపభరద్వాజాసితాహ్వాతి విశ్వామి
త్ర వీతిహోత్ర। మైత్రేయపైలసుమంతుమధుచ్ఛందగౌతమసుమతిభార్గవవసిష్ఠ। వామదేవాకృతవ్రణకణ్వజైమిని
ధౌమ్యపరాశరాపర్వకవషు। లసితవైశంపాయనాసురికశ్యపక్రతువీరసేనగర్గత్రికవ్య। ముఖ్యులైన బుధులు మునులను
గృపుఁడు గాంగేయ సంభజాంబికేయవిదుర। కురుకుమారబంధుపలవృద్ధధారుణీ। సురనరేంద్రవైశ్యశూద్రవరుల॥ క॥ ర
ప్పింప వారు హర్షము లుప్పతిల నేగుదెంచి యుచితక్రియలం। దప్పక కనుంగొనుచుండఁగ। నప్పుడు విధ్యుక్తనియతులై భూమి
సురుల్॥ గీ॥ కడఁగి సవనభూమిఁ గనకలాంగలములు। నర్థి దున్నఁ బాండవాగ్రజునకు। నచటఁ దీక్ష జేసియించితస్వర్ణ ను। యో

ప్రకరణములు నలోపముగను॥ ఇట్లు నియమంబున సముచితక్రియాకలాపంబులు నడుపుచుండి రప్పుడు॥ క॥ సకలావనీశులిచ్చి
న। యకలంక సువర్ణ రత్న హయ ధన వస్త్ర। ప్రకరంబులు మొదలగు కా। నుకలందుకొ నన్నరయోధుని నియమించెన్॥ సీ॥ అ
ర్థిజాతము గోరినట్టి వస్తువు లెల్లఁ దగఁ బంచియిడఁగ రాధాతనూజు। సరసాన్నపానాది సకలపదార్థముల్ పాకము ల్సేయిం
పఁ బవనతనయుఁ। బంకజోదరు నెడ్దఁబాయక పరిచర్యఁ దవిలి కావింప వాసవతనూజు। సవననిమిత్తమై సంచితద్రవ్యము
ల్పెంపుతో వేగఁ దెప్పింప నకులు। దేవ గురు వృద్ధ ధాత్రీసురావలులను। నరసి పూజింప సహదేవు నఖిలజనులఁ। బొలుచున్న
ష్టాన్నతతులఁ దృప్తులను జేయ। ద్రౌపదిఁ దగ నియోగించె ధర్మసుతుఁడు॥ అయ్యవసరంబున॥ చ॥ హరి శిఖి దండపాణి నికషా
త్మజ పాశి సమీర గుహ్యకే। శ్వర శశిమౌళి పంకరుహసంభవ చారణ సిద్ధ సాధ్యకి। న్నర గరుడోరగామరగణంబులు వచ్చిన
ఖంబుఁ జూచియ। చ్చెరువడి తొల్లి యెవ్వరును జేయు మఖంబులు నింత యొప్పనే॥ క॥ అదిగాక నిందిరాపతి। భువనములు సేవిం
చునట్టి భాగ్యము గలుగన్। మదిఁ బడయరాని బహుసం। పదలెవ్వియుఁ గల వె యనుచుఁ బ్రస్తుతి సేయన్॥ అప్పుడు॥ చ॥ అమర
సమానులై తనరు యాజకవర్గము లోలి రాజసూ। యమఖవిధానమంత్రముల నగ్నిముఖంబుగఁ జేసి ధర్మజుం। గ్రమమున
వేలుపింపఁ గ్రతురాజసమాప్తిదినంబు నన్నృపో। త్తముఁడు గడంగి యాజక సదస్యుల ద్విజకోటిఁ బెంపునన్॥ వ॥ పూజిం
చునప్పు డందగ్రపూజార్హు లెవ్వరని యడిగిన సదస్యులుం దనకుఁ దోఁచిన విధంబులం బలుక వారి భాషణంబులు వారించి వి
వేకశీలుండును, జతుర వచన కోవిదుండును నగు సహదేవుండు భగవంతుండును, యదుకుల సంభవుండును నైన శ్రీకృష్ణునిం
జూపి యమ్మహాత్ముని సంతుష్టుం జేసిన భువనంబు లన్నియుం బరితుష్టిం బొందు నని చెప్పి ధర్మజుం జూచి యిట్లనియె॥ ఉ॥ కాల
ము దేశముం గ్రతువుఁ గర్మముఁ గర్తయు భోక్తయున్ జగ। జ్జాలము దైవమున్ గురువు సాంఖ్యము మంత్రము యజ్ఞ మాహు
తుల్। వేల్పులు విప్రులుం జనన వృద్ధి లయంబులు హేతుభూత ము। ల్లీలలఁ దానయై తగ వెలింగెడి నెక్కటి తేజ మీతఁడున్॥ చ॥ ఇ
తఁ డెయితండు గన్నులొకయించుక మోడ్చిన నీ చరాచర। స్థిత భువనంబు లన్నియు నశించు నితండవి విచ్చి చూచిన। స్వతతము
లై జనించుఁ బ్రభవిష్ణుఁడు విష్ణుఁడునై నయట్టి యీ। క్రతుఫలదుండు గాక రుఁ డొకం డెటు లర్హుఁడు శిష్టపూజకున్॥ ఉ॥ ఈ
పురుషోత్తముం జగదధీశు ననంతు నిసర్వశక్తుఁ జి। ద్రూపకు నగ్రపూజఁ బరితోషము సేయ సమస్తలోకము। ల్వే పరితుష్టి
బొందుఁ బృథివీవర కావున నీవు కృష్ణునిన్। శ్రీపతిఁ బూజ సేయుమెడ సేయక మాటలు వేయు నేటికిన్॥ క॥ అని సహదేవుఁడు ప
లికిన। విని యచ్చటి జనులును సుజవిభులును ఋషులు। న్మనుకొని మనమున మోదము। దనుకఁగ నిది లెస్స యనిరి ధర్మజుఁ డం
తన్॥ క॥ మునిజన మానస మధుకర। వనజాతములైన యట్టి వారిజదళలో। చను పదపద్మప్రక్షా। ళన మొగిఁ గావించి తజ్జలంబు
లు భక్తిన్॥ క॥ తానును సతియు ననుజులు। మానుగ ద్రుపదాత్మజయును మస్తకములఁ బెం। పూనిన నియతి ధరించి మ। హో
నందముఁ బొందిరతిశయ ప్రీతి మెయిన్॥ క॥ పంచత్కాంచన రుచిరో। పంచిత వస్త్రముల నూతనార్క ప్రభల। న్మించిన రత్న
ములం బూ। జించెన్ ధర్మజుఁడు కృష్ణు జిష్ణు సహిష్ణున్॥ వ॥ ఇట్లు పూజించి యానంద బాష్పజల బిందు సందోహ కందళిత నయ
నారవిందంబులం గోవిందుని సుందరాకారంబు దర్శింపఁ జాలకుండె. నట్లు పూజితుండై తేజరిల్లు పుండరీకాక్షుని వీక్షించి విహ
స్తంబులు నిజమస్తకంబుల ధరించి వినుతి సేయుచు నఖిలజనంబులు జయజయశబ్దంబు లిచ్చిరి. దేవతలు వివిధ తూర్యఘోషం
బులతోడం బుష్పవర్షంబులు గురియించి రయ్యవసరంబున॥ క॥ దమఘోషసుతుఁడు సద్విభ। వముఁ జూచి సహింపక లుకవ
త్రిలఁ గాంచి। తముడిగ్గి నిలిచి నిజహ। స్తము లెత్తి మనోభయంబు దక్కినవాఁడై॥ వ॥ అప్పు డప్పుండరీకాక్షుండు వినుచుండ స
భాసదులం జూచి యిట్లనియె॥ క॥ చాలుబు రే యహహో యా। కాలము గడుపంగ దురవగాహంబగునే। తేలాతెప్పెను నేఁడీ బా
లకు వచనముల చేతఁ బ్రాజ్ఞుల బుద్ధుల్॥ వ॥ ఇట్లు తప్పిన తెఱంగెట్లనినఁ బాత్రాపాత్ర వివేకంబు సేయ నేర్చిన విజ్ఞాననిపుణు
లు, నున్నతసత్త్వగుణగరిష్ఠులు, బహువిధతపోవ్రతనియమనిష్ఠులు, ననల్పతేజులు, మహదైశ్వర్యోత్కీర్తిధరులుఁ, బరతత్త్వవే
దులు, నఖిలలోకపూజ్యులు, విగతపాపులుఁ, బరమయోగీంద్రులు నుండ వీరిం గైకొనక వివేకరహితులై గోపాలబాలునిం
బూజ సేయుటకు నెట్లు సమ్మతించిరి? పురోడాశంబు సృగాలంబునకర్హంబగునే? యదియునుం గాక॥ సీ॥ గురుదేవశూన్యుం
డుఁ గులగోత్రరహితుండుఁ దలిదండ్రు లెవ్వరో తడవఁగాన। మప్పులఁ బొరలెడు నాదిమధ్యావసానంబులం బరయమానంబు
లేమ। బహురూపి సెన్నై పెక్కుభంగుల వర్తించు వావివర్తనములు వరుస లేవు। పరికింప విగతసంబంధుండు సలజ్జోయ మానిమి
త్తంబున మానిసయ్యెఁ। బరగ మున్ను యయాతిశాపమునఁ జేసి। వాసికెక్కదు యాదవవంశ మెల్ల। బ్రహ్మతేజంబు నెల్లఁ
గోల్పడిన యతఁడు। బ్రహ్మఋషి సేవ్యుఁ డగునె గోపాలకుండు॥ క॥ జారుఁడు జన్మావధియును। జోరుఁడు మువ్వెంకలాఁడు సు
మహితపూజా। చారక్రియలను నష్టుఁడె। వారక నితఁ డనుచు నశుభవాక్యస్ఫూర్తిన్॥ చ॥ అనితనుఁ డనాదిసముద్రాంభ

కుఁడా శిశుపాలువాక్యములు విని సుధీజనాళికిం గొనఁ డువిశ్రుతభైరవరావమాత్మఁగై। కొనని వ్యాగేంద్రరీతి మునికోటియు
రాజులు పద్మనాభునా। డినయపినీతిభాషలకు డెందమునన్నగుఁ డంత నెంపుచర్మ॥ ఉ॥ వీనులు మూసికొంచు విని విస్మయమం
చు ముకుందమాధవ। శ్రీనిధివీని నేగతికిఁ జేర్చెదొయంచు దురాత్ముఁ దిట్టుచు। న్నా నరనాథులున్మనుజులు నచ్చట నిల్వక పోవఁ
బాంఢుసఁ। తానములప్రమేయబలదర్పను మోహాద్ధతరోషచిత్తులై॥ వ॥ అప్పుడు కేకయస్పృంజయభూపతులుం దామును వి
విధాయుధపాణులై యదల్చి నిల్చిన వాఁడును ఁబిఱుతివక యదల్చి పలుకయు వాలునుం గైకొని భుజాగర్వమహార్వారుండయి
గోవింపునిందకు నువర్తనులైన వారలం గుపితుండై నిందింపనమ్ముకుందుం డాగ్రహంబున లేచి తనకట్టెదుటనె దివ్యయున్న
శిశుపాలునిరూక్షేక్షణంబుల నిరీక్షించుచు నక్షణంబ తన్మస్తకంబు ధారాకరాళంబైన చక్రంబున నవక్రపరాక్రముండై
రుధిరంబు దొరుగం దునుమ నమ్మహాకలకలం బాకర్ణించి, చైద్యబలంబులునుం దదీయపక్షచరులైన భూపతులును భీతులై ప
ఱచిరయ్యవసరంబున॥ క॥ మునివరులును జనపతులును। గనుఁగొని వెలుఁగం దగంజైద్యగాత్రమునందు। న్ననుపమతేజము వె
లువడి। వనజోదరు దేహమందు వడిఁజొచ్చె నృపా॥ అనిన మునివరునకు భూవరుం డిట్లనియె॥ క॥ కమలాక్షుని నిందించిన। దను
ఘోషతనూభవుండు దారుణమలభూ। పమునుం బొందక యే క్రియ। సుమహితను లిఁగృష్ణునందుఁ జొచ్చె మునీంద్రా॥ అనిన
శుకయోగిరాజయోగి కిట్లనియె॥ మ॥ మధుదైత్యాంతకుమీఁది మత్సరమునన్మత్తిల్లి జన్మత్రయా। వధి నేప్రొద్దుఁ దదీయరూ
పగుణదివ్యధ్యానపారీణధీ। నిధియై యాటన్నిశుపాలభూవిభుఁడు దానిర్ధూతసర్వాఘుఁడై। విధిరుద్రామలకందరాని పదవిన్వే
నొందెను ర్వీశ్వరా॥ వ॥ అంత ధర్మనందనుండు ఋత్విగ్గణంబులను సదస్యులను బహుదక్షిణలం దనిపి వివిధార్చనలం
బూజించి యవభృథస్నానక్రియాపరితోషంబున॥ సీ॥ మురజమృదంగగోముఖశంఖడిండిమపణవాదిరవములంబరమునిం
డఁ। గవిసూతమాగధగాయకవందివైతాళికవినుతులందంద బెరయ। వితతమద్దళవేణువీణారవంబులగతులకు నర్తకీగతు
లు సెలఁగఁ। దరళవిచిత్రకధ్వజపతాకాంకితస్యందనగజవాజిచయము లెక్క। సుతసహోదరహితపురోహితజనంబు।
గటకకేయూరహారకంకణకిరీట। వస్త్రమాల్యానులేపనవ్రాతములను। విభవమొప్పారఁగై చేసి వెడలి రంత॥ వ॥ యదుసృం
జయకాంభోజకేకయకురుకోసలభూపాలముఖ్యులు చతుర్విధసేనాసమేతులై ధరణిఁ గంపింపవెన్నంటి నడతేర ఋ
త్విక్సికాయంబులును సదస్యులును బ్రహ్మఘోషంబులాలయమున్నిడికొని శోభమానానూనప్రభాభాసమానసువర్ణము
యమాలికామధ్యగతదివ్యమణిహారంబులు కంఠంబులం దేజరిల్ల నున్నతజవాశ్వంబులం బూన్చిన పుష్పరథంబు కళత్రస
మేతుండై యెక్కి యతిమనోహరవిభవాభిరాముండై చనుదెంచుచుండె నప్పుడు వారాంగనాజనంబులు దమతమవార
లం గూడికొని॥ సీ॥ కనకాద్రిసానుసంగతకేకినులభాతిఁ గ్రొమ్ముళ్లు వీఁపునఁ గునిసియాడఁ। దరలతాటంకముక్తాఫలాంశువ్య
తుల్పె కుక్కటద్దములతోఁ జెలిమి సేయఁ। బొలసియదృశ్యమై పోనిక్రొమ్మెఱుఁగులగతులఁ గటాక్షదీధితులు దనర। మంచుపై
నెగయనూకించు జక్కవలనఁ జన్నులు జిలుగు*కంచెలలనమర। మహితకుచభారకంపితమధ్యలగుచు। నర్థిమొలనూళ్లుమె
ఱయఁ బయ్యెదలు జాఱఁ। గరసరోజాతకంకణక్వణనములును। జరణనూపురఘోషముల్సందడింప॥ వ॥ మఱియు నయ్యెంద
వదనలందందమందగమనంబున నంజెందు ఘర్మజలబిందుసందోహకందళితమందహాసచంద్రికాసుందరవదనారవిందంబు
లనిందిందిరరుచిరచికురబృందంబులు దిందరవందరలై సందడిఁ గొననమందానందహృదయలై సువర్ణశృంగసంగతంబులై
నసంకుమదమలయజఘుసృణసురభితోయంబులు పలుతోయంబుల సముదాయంబులై తమతోయంబులవారిం జల్లుచుఁ జెం
దొవలకెందమ్మివిరులరచియించిన చిమ్మనగ్రోవులం దావులుగల పూదేనియలు నించి వావులు దెలిపి శేవలు మీఱఁ గ్రేవలనుం
డియిమ్ములం గపిసి చిమ్ముచు మృగమదకర్దమంబును గుంకుమపంకంబునుం గొంకక బింకంబుల జంకెలోలయ బంకజసన్ని
భంబులగు మొగంబుల నేమఱించి చమురుచనుల్లంబులు పల్లవింపం బెల్లడరి యందియలు ఘల్లుఘల్లని మొఱయఁ గ్రేళ్లుదాఁ
టుచుం బాఱుచుం జాఱుచంద్రికాధవళఘనసారధూళిమిళితరజనీపరాగంబు రంజిల్లంగ రంబులం బుచ్చికొని శిరంబులం జ
ల్లుచుఁ జిత్తంబుల నమ్మత్తకాశినులవృత్తంబులగు కుచంబుల కెత్తువస్తురేయని బిత్తరించి పువ్వుగుత్తులం దత్తరంబున వ్రే
యుచుఁ బరిహసించుచు నన్యోన్యకరకిసలయకనకకరండభరితంబులగు పన్నీటం జెంగావిజిలుగు పుట్టంబులు దట్టంబులు
గాఁ దోఁగిన మర్మంబులు బయలుపడిన నగ్గలంబులగు సిగ్గులకు నొప్పిదంబులగు తమకను రెప్పలకడ్డంబు సేయుచుఁ బురుష
లుసుందాము నారామలభిరామలీలారసోక్తులైన యనంతరంగంబుల సంతసంబునఁ బంతంబులిచ్చుచు వసంతంబులాడి ర
వ్వేళ నక్షులవిమానారూఢులై యింద్రపురంధ్రీజనంబులుం బోలె హాటకశిబిక లెక్కి నిజచేటికాజనంబులు సేవింపం జను దెం
చు భూకాంతకాంతాజనంబులు తమకు సరసంబులగు నగ్ఘంబులైన ధరణీపాలవధూలలామంబులాదరించు చెలులపైఁ బన

* కంచె, రవికె.

సఖీజనంబులకుం బురికొల్పి చల్లించుచు భావగర్భితంబులగు వారిచతురసరసోక్తులకుం దరహాసచంద్రికలు ముఖకమలలీలావి
లోకనలక్ష్మిం బ్రోదిసేయం జెలువలరం జనిరి యివ్విధంబున నిజసామ్రాజ్యవిభవంబు పూర్ణంబుగా నజాతశత్రుండు గంగా
ప్రవాహంబున కరిగి యందు నిజవధూయుక్తుండై శాస్త్రోక్తప్రకారంబున వేదఘోషంబు లెసంగ నవభృథస్నానం బాచ
రించె నాసమయంబున॥ క॥ అనిమిషదుందుభిశుంభ। త్స్వనములు వీతెంచెఁ బుష్పవర్షము గురిసెన్। ముని దేవపితృమహీవర।
వినుతులరవ మెసఁగె నపుడు విమలచరిత్రా॥ క॥ నరు లెట్టి పాపులైనను। గరమర్థిని నెద్ది చేసి గతకల్మషులై। చరియింతు రట్టి
యవభృథ। సురుచిరమగఁ గావించి రెలమి నఖిలజనంబుల్॥ గీ॥ అంత ధర్మతనయుఁ డభినవక్షౌమదు। కూలసురభికుసుమమాలి
కాను। లేపనములు రత్నదీపితభూషణా। వళులు దాల్చి వైభవమున నొప్పె॥ అంత నవభృథస్నానానంతరంబున మఱి చను
దెంచి॥ ఉ॥ పాండుతనూభవాగ్రజుఁడు పాండుయశోనిధి దానమానమా। ర్తాండనిభుండు యాజకసదస్యమహీసురయో।
గిబంధురాణ్మండలిఁ బూజఁ జేసి బుధమాన్యచరిత్రుఁడు వారి కిచ్చెనో। ద్దండదుకూలరత్నకనకోజ్జ్వలభూషణముఖ్యవస్తు
వుల్॥ వ॥ ఇట్లు నారాయణపరాయణులై దేవసమానప్రకాశప్రభావంబుల సకలనరనారీలోకంబు లనర్ఘ్యరత్నమయ
భూషణమాల్యానులేపనంబులు ధరియించి పరమానందభరితాత్ములై యొప్పియుండి రంత॥ చ॥ సునిశితభక్తి తన్మఖముఁ జూ
డఁగ వచ్చినయట్టి దేవతా। మునిధరణీసురప్రకరభూవరవైశ్యజశూద్రకోటి య। జ్జనపతిచంద్రు చేసు వితతసత్కృతులం బరి
తోషచిత్తులై। వినయముతోడ ధర్మజుని వీడ్కొని పోవుచు నెమ్మి భంగులన్॥ చ॥ హరిచరణాంబుజాతయుగళార్చకులై పె
నుపొందు పాండుభూ। వరసుతు రాజసూయమఖవైభవమున్ నుతియించుచున్ సమా। దరమున నాత్మభూములకు దారత నేఁ
గిరి ధర్మసూనుఁడున్। సరసిజనేత్రు నిన్ను పఁజాలక నుండుమటంచు వేఁడినన్॥ వ॥ ఇట్లు పాండవాగ్రజు ప్రార్థనం గైకొని
దామోదరుండు సర్వయాదవులనుం గుశస్థలికిం బోవం బనిచి కతిపయపరిజనంబులుం దానును నతనికిం బ్రియంబు గాఁ దన్న
గరంబునం బ్రమోదంబున నుండె నని చెప్పి సుతీయు నిట్లనియె॥ చ॥ జనవర పాండుభూపతనుజాతుఁడు చుస్తరతన్మనోర
థాబ్ధిని సరసీరుహాక్షుఁ డను తెప్పకతంబున దాఁటి భూరిశో। భనయుతుఁడై మనోజ్వరఁ బాసి ముదాత్ముఁడై వెలింగె న।
వ్వనరుహనాభదాసజనవర్యులకుం గలవే యసాధ్యముల్॥ అట్టియెడ॥ గీ॥ రాజసూయకాధ్వరప్రభావమునకు। నఖిలజను
లు మోదమందిరపుడు। కలుషమానసుండు కులపాంసనుఁడు సుయో। ధనుఁ డొకండు దక్క ధరణినాథ. వ॥ అనిన విని శుకయో
గీంద్రునకుఁ బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె॥ గీ॥ అఖిలజనుల కెల్ల నానందజనకమై। యొనయు సుఖము గురుకులేశ్వరునకుఁ। గర
మసహ్యమైన కారణ మెట్లది। యెఱుఁగఁ బలుకు దీని సిద్ధచరిత॥ చ॥ అనిన మునీంద్రుఁ డిట్లను ధరాధిపుతోఁ గురురాజు పాండు
నం। దనుల దెసన్ననేక దురితంబులు నిచ్చలు సేయుచుండునై। నను నొకనాఁడు పంకరుహనాభదయాపరిలబ్ధసర్వశో। భన
జితదేవదైత్యనరపాలకరాజ్యరమామహత్త్వమై॥ చ॥ వెలయ ననూనసంపదల విశ్రుతకీర్తుల మిన్నుముట్టఁ జెంపలరిన
పాండుభూవరసుతాగ్రజుఁ డంతిపురంబులోన ను। జ్జ్వలమణిభూషణాంశురుచిజాలము వర్వఁ బయోజనాభును। తక్కలిక
భజించుచున్న నసుఖస్థితి భూరిమనోహరాకృతిన్॥ వ॥ ఉండంగ నుంగొని యదియునుం గాక లలితాష్టమీశశాంకబింబంబు
లవిడంబించుచు నింద్రనీలరుచినిచయంబున నపహసించు కుటిలకుంతలంబులును టనంబు సేయు పందనరు నిటలఫలకంబులును,
బుష్పచాపచాపప్రచారంబుల యేపు చూపు భ్రూయుగోపాంతమ్ములై సౌదామనీదామరుచిస్తోమంబులై కర్ణాంతసీమంబు
లై యంజనంబులతోడఁ గంజిల్లు నేత్రకంజంబులును, నవమల్లికాముకుళవిభాసితదంతమరీచికానిచయోద్దీపితమందహాస
చంద్రికాధవళితంబులును, ముకురోపమితంబులును, గర్ణకుండలమణిమరీచిజాలంబులు బెరసి బహుప్రకారంబులం బర్వం
బొలుచు కపోలపాలికలును, విలసితగ్రైవేయకముక్తాఫలహారనిచయంబులకిమ్ము చూపక మిసమిసని పసగల మెఱుంగులు గి
రిగొని మీఁటిన నంబసులవనం బొగడందగి మొగంబులకుం బుటంబు లెగయను త్తుంగపీనకుచభారంబుల వ్రేఁగులాఁగలేక దూ
గాడుచుం గరతలధరి మేయంబులగు మధ్యభాగంబులును, ఘనజఘనమండలావతీర్ణ కాంచనకాంచీకలాపకింకిణీకలనిన
దోల్లసితంబులుం గల కటిప్రదేశంబులును, సల్లలితహల్లకపల్లవకాంతుల మొల్లంబులఁ గొల్లలుగొని యభిరామంబులై
శోభిల్లు పదపాణితలంబులును, నలసగతులం బదంబులందనరు మణినూపురంబులు గోపురంబులఁ బ్రతిస్వనంబు లొలయ
మొఱయ నలరు చరణారవిందంబులును రత్నవలయకంకణాంగుళీయకాదివివిధభూషణమణిద్యుతినిచయంబులున్నమరీచిక
రనిచయంబుల ధిక్కరింప వెలుంగు కరకంజంబులును మృగమదఘనసారహరిచందనాగరుకుంకుమపంకంబుల భాసురంబు
లగు వాసనలు నాసారంధ్రంబులకు వెక్కసంబులై సోలయ సౌభాగ్యంబులుం గలిగి చైతన్యంబు నొందిన మాణిక్యపుబొ
మ్మలవిధంబులం గగనమండలంబు నిర్గమించి వసుధాతలంబున సంచరించు చంద్రరేఖల చెలువున శృంగారరసంబు మూర్తీ।

భవించిజగంబులమోహపఱచు మోహినీదేవతలచందంబునవిలసించుమాధవవధూసహస్రంబుల సంగతిసౌదామినీలతయునుంబోలిమెప్పుచుండెడుద్రుపదరాజనందనవిభవంబును రాజసూయమహాధ్వరోత్సవంబునుం జూచి చిత్తంబుత్తలపెట్టసుయోధనుండు సంతాపానలంబునం గ్రాగుచుండెనంతనొక్కనాఁడు ధర్మనందనుండు నిర్మలంబగు సభాభవనంబునకుంజని॥ సీ॥ సుతసహోదరపురోహితబాంధవామాత్యపరిచారభటకోటిబలసి కొలువఁ। గలితమాగధమంజుగానంబుపాఠకపఠనరవంబులు ప్రమదమెసఁగఁ। గంకణఝణఝణత్కారంబు శోభిల్లసరసిజాననలు చామరములిడఁగఁ। నయవినిశ్చితసభామధ్యంబునను భాసమానసింహాసనాసీనుఁడగుచు। నమరగణములు గొలువఁ బెంపారుననిమి। షేంద్రుకైవడినొఱసియుపేంద్రుఁడలర। వరుసఁగొలువున్నయత్తఱిసురభిమాన। క్రోధమాత్సర్యధనుఁడు సుయోధనుండు॥ ఉ॥ కాంచనరత్నభూషణనికాయముఁదాల్చిసముజ్జ్వలప్రభో।దంచితమూర్తినొప్పిఫణిహారులుముందటఁగ్రందువాయవా।రించపసహోదరుల్ నృపవరేణ్యులు పార్శ్వములన్భజింపనే। తెంచెను రాజసంబున యధిష్ఠిరుపాలికివైభవోన్నతిన్॥ వ॥ అట్లుచనుదెంచినయమాయామోహితంబైనసభాస్థలంబునందు॥ క॥ సలిలములులేనితావున। వలువలువెసనెగయఁదిగిచివారకతోయంబులుగలచోటనుచేలం। బులుదడియఁగఁబడియెనిజవిభుత్వముదలఁగన్॥ క॥ ఆవిధమంతయుఁగనుఁగొని। పావనినవ్వటయునచటిపార్థివులునుగాం। తావలియునుయమతనయుఁడు। వావిరిచేసన్నఁదమ్మువారింపంగన్॥ వ॥ ఇట్లుదామోదరాను మోదితులై మహారావంబుగాఁ బరిహాసంబులు చేసిన సుయోధనుండు చిత్తంబు చిన్నఁబోయి లజ్జావనతవదనుండై కుపితమానసుండగుచునయ్యెడనిలువక వెలువడి నిజగజపురంబునకరిగెనయ్యవసరంబున దీవిశాలురైనసభాసదులగునచ్చటిజనంబులకోలాహలంబు సంకులంబైననజాతశత్రుండు చిత్తంబున విన్ననైయుండె నప్పుండరీకాక్షుండు భూభారనివారణకారణుండగుటంజేసిమర్యోధనునపయశంబునకుఁగావనండయ్యెనయ్యెడ॥ క॥ హరిధర్మసుతునివీడ్కొని। తరుణీహితబంధుజనకదంబము గొలువ। న్బరితోషమునఁ గుశస్థల। పురమునకుంజనియె మోదమున నరనాథా॥ చ॥ జనవరబంధమోక్షణము చైద్యవధంబును పాండురాజనం। దనుమఖరక్షణంబునునుదారతఁ జేసినయట్టి దేవకీ। తనయు చరిత్రభాషణకథాపరనాత్ములుగాంతురిష్టశో। భనబహుపుత్రకీర్తులును భవ్యవివేకము విష్ణులోకమున్॥ క॥ అనిశుకయోగీంద్రుండి। మ్మ

శ్రీ సాల్వుండు శివప్రసాదంబున సౌభకవిమానంబు వడసి ద్వారకాపురిమీఁదవండెత్తుట. శ్రీ

నుజేంద్రునిఁజూచిపలికె మఱియును శ్రీకృ। ష్ణునియద్భుతకర్మంబులు। వినిపింతున్ జిత్తగింపు విమలచరిత్రా॥ సీ॥ వసుధేశవినవయ్యవైదర్భిపరిణయవేళమర్మదశిశుపాలభూమి। వరునకుఁదోడ్పడ నరుదెంచి సైనికావలితోడఁదొడరిదోర్బలముడూలి। హరిచేతనిర్జితులైనరాజులలోనఁ జైద్యునిచెలికాఁడు సాల్వధరణి। పతిజరాసంధాదిపార్థివప్రకరంబు వినుమత్సరానలవిపులశిఖల। ధాత్రినిటమీఁదవీతయాదవముగాఁగఁ। గడఁగి సేయుదుననిమరా। గ్రహముతోడఁ। బంతములువల్కి యటఁజనిభరితనిష్ఠఁ। దపముగావింపఁబూనిసుస్థలమునందు॥ క॥ ధృతివదలకయుగ్రస్థితిఁ। బ్రతిదినమును బిడికెడవనిరజమశనముగా। నతినియమముతో నాపశు। పతిశంకరుఫాలనయను భర్గును మేశున్॥ క॥ చెదరనినిజభక్తినిద। త్పదపద్మములాత్మనిలిపిపాయక నొకయేఁ। డుదితక్రియభజియించిన। మదనారియువానిభక్తిను హిమకువశుఁడై॥ క॥ భోరునఁ బ్రత్యక్షంబై। గౌరినవరమేమిమైనఁగొసరక నిత్తున్। వారక వేఁడుమటన్నను। నారాజతపోధనుండుహరునకుఁ బ్రీతిన్॥ గీ॥ వందనంబాచరించియానందవికచ। వదనుఁడై కేలుదోయిఫాలమునఁజేర్చి। శ్రితదయాకారనన్నురక్షించెదేని। నెఱుఁగవినిపింతువినుముమదీప్సితంబు॥ గీ॥ గరుడగంధర్వయక్షరాక్షససురేంద్ర। వరులచేసాధ్యపడక నావలయునెడల। నభ్రపథమునకఱిగెడునట్టిసుహిత। వాహనము నాకుదయచేయువరదయీశ॥ వ॥ అనియభ్యర్థించిన నంబ్రసన్నుండై హరుండువానికోర్కెకనురూపంబైనవిమానంబునిర్మింపమయునినప్పగించిననతండునట్లచేసి కామగమనంబును నతివిస్తృతంబుగాలోహంబునననిర్మించి సౌభకంబను నామంబిడి సాల్వునకిచ్చిన వాఁడును బరమానందంబునుంబొందితద్విమానారూఢుండై యాదవులవలని పూర్వవైరంబుఁదలంచి దర్పాంధచేతస్కుండై ద్వారకానగరంబుపైఁజనినిజసేనాసమేతంబుగాఁదత్పురంబువేధించి॥ సీ॥ సరిమపవనసరోవరములుమాయించిబావులుగలఁచికూపములు చెరిచి। కోటలు వెసవీటతాటముల్గావించిపరిఘలుపూడ్చివప్రములుద్రొబ్బి। యట్టళ్లుధరఁగూల్చియంత్రముల్దునుమాడికాంచనధ్వజపతాకములనఱికి। భాసురగోపురప్రాసాదహర్మ్యంబు శాలాంగణములు భస్మములుచేసి। విమలకాంచనరత్నాదివివిధవస్తు। కోటి నెల్లను నందందఁగొల్లఁబుచ్చి। ప్రజలఁ జెఱఁబెట్టిదొరలను భంగపెట్టి। తఱిమిఱుబ్బుంగిఁబెక్కుబాధలనలంచి॥ చ॥ మదమున నంతఁ బోవక విమానయుతంబుగనభ్రవీథికిన్। గొదగొనినేపు మైమెగసికొంకకశక్తిశిలామహీరుహా। ప్రదరములోలిమైగురిసిబంధురభూమిప

రాగశరకరల్ । వదలక చల్లుచున్న ప్రళయవాయువు చేదిశలావరించుచుర్న ॥ అట్టియెడ ॥ క ॥ చటులపురత్రయదనుజో । త్కట
దుస్తర బాధ్యమాన ధారుణిగతిన । స్ఫుట భేదనమంతయతిస్ఫుటపీడం జెందివగలసుడివడుచుండర్ ॥ చ ॥ కని భగవంతుడు క్షర
థిశిఖామణియున్నగురౌక్మిణేయుఁడ । జ్జనములనోడకుండుఁడని సంగర కౌతుక మొప్పదివ్యసాధనములఁ బూని సైనిక కదంబ
ముగొల్వ ననూనమీన కే । తనరుచిరగ్రాలనున్న తరథస్థితుఁడై వెడలె రణోర్వికి ॥ అయ్యవసరంబున ॥ చ ॥ సమధికబా
హుశౌర్యజిత చండవిరోధులు పాఅనున్నత । కుమగదభానువిందశుకసాత్యకిసారణచారుదేష్ణసాం । బసుకరకేతనాత్మజ
శ్వఫల్కతనూభవ తత్సహోదర । ప్రముఖయమాత్తముల్ప్రమతభంజనులై కృతవర్మమున్నగర్ ॥ క ॥ వారణవాజిస్యం
దన । వీరభటులేఁ గజనిరివిశ్వము వడఁకర్ । ఘోరాకృతివివిధాయుధ । భూరివ్యూహులరకబింబమున్నబలింపర్ ॥ వ ॥ చనియా
గోవిందనందనస్యందనంబునుం బలసందోహంబునుం దలకడవియదు సైన్యంబులు సాల్వబలంబులతోడం దారొకని బెర
యునప్పుడు దేవదానవసంకులసమరవిధంబునం దుములంబయ్యె నివ్విధంబున ॥ మ ॥ వితతజ్యాచయటంకృతుల్మదజలావి
ర్భూతశుండాలఘీం । కృతులుస్యన్దఘటహుంకృతుల్మహితభేరీభాంకృతుల్భీషణో । ద్ధతనిస్సాణఘణంకృతుల్ప్రకటయోధ
వ్రాతసాహంకృతుల్ । సుతలంబుర్దివినిండ నొప్పె రిపుసంక్షోభంబుగా భూవరా ॥ మ ॥ హరిరింఖారథనేమిసంస్ఫుటపద
వ్యాఘట్టనోద్ధూతమ । స్తరధూళీపటలప్రభూతనిబిడధ్వాంతప్రవిధ్వంసకృ । త్కరశాతాసిగదాదిహేతిరుచులాకాశం
బునిండర్వియ । చ్చరదృష్ట్యుల్మిఱుమిట్లుగొల్పసమరోత్సాహంబుసంధిల్లఁగర్ ॥ చ ॥ తలకొని సైనికుల్గడచితార్కొని పేర్కొని
డాసిపాసియుం । కిలిగొనకిన్నుమలమ్ములఁ బగిల్చినొగిల్చితరేతరుల్తల । ల్నలియఁగనొత్తిమొత్తినయనంబులనంబులురాలఁ
లనా । దలలులలాటముల్ఘనగదాహతినొంచి కలంచిపాఱఁగర్ ॥ అయ్యవసరంబునఁ బ్రద్యుమ్నుండుగనుంగొని ॥ మ ॥ అన
యంబున్నలుషించి సౌభపతిమాయాకోట్లుచంచచ్ఛరా । సననిర్ముక్తనిశాతదివ్యమహిలాస్త్రశ్రేణిచేదక్షణం । బునఁ
లాగతిన భ్రుగుల్మనములన్నుభషింపమాయించెన । వ్వనజాతాప్తుఁడు భూరిసంతమసమున్వారించుచందంబునర్ ॥ మఱి
యును ॥ చ ॥ అతిరథికోత్తముండననుదంచితకాంచనపుంఖపంచవిం । శతివిశిఖంబులన్నతని సైనికపాలుని నొంచియుగ్రుఁడై
శతశతకోటికోటినిభసాయకముల్వరగించి సాల్వభూ । పతికకుదంబునొంచిలయభైరవుకైవడిఁ బేర్చి వేఁడియుర్ ॥ చ ॥ పఁ
పదియమ్ములన్మనుజపాలవరేణ్యులనొంచిరోషము । న్నదురగమూఁడుమూఁడు శితకాండములన్రథదంతివాజులన్నదియఁగ
నేసిమొక్కొకని శాతశరంబుల సైనికావలి । న్మడములడంచియిట్ల తఁడమానుషలీలఁబరాక్రమించినర్ ॥ క ॥ దుర్మానవహరు
నచ్యుత । కర్మమునకునుభయసైనికప్రకరంబుల్నిర్మలమతినుతియించిరి । భర్మాచలధైర్యుపిగతభయుఁ బ్రద్యుమ్నర్ ॥ అ
య్యవసరంబున ॥ ఉ ॥ సాంబుని సాల్వభూవిభుఁడు సాయకజాలములేసినొంచిన । జ్జాంబవతీతనూభవుఁడు చాపముసజ్యము
చేసిడాసిసాల్వుం బదియేనుతూపులనన్నోన్నతవక్షముగాడనేసితీ । క్ష్ణాంబకవింశతిన్నతని సౌభకమల్లలనాడనేసినర్ ॥
చ ॥ గదుఁడుమహోగ్రవృత్తినిజకార్ముకనిర్గతవిస్ఫురద్విధుం । ధువదనాభబాణవితతుల్వరగించి విరోధిమస్తముల్గు
దులుగరుచ్చియెత్తుచునకుంఠితవిక్రమకేళిలోలుఁడై । చదలసురల్నుతింప రథిసత్తముఁడొప్పె నరేంద్రచంద్రమా ॥
ఉ ॥ సాత్యకి చండరోషమునసాల్వమహీవరుభూరిసౌభసాం । గత్యచతుర్విధోగ్రబలగాఢతమఃపటలంబుభాసురా । ది
త్యమయూఖపుంజమువితీవ్రశరంబులమాపి సైనిక । స్తుత్యపరాక్రమప్రకటదోర్బలుఁడై విలసిల్లె భూవరా ॥ ఉత్సాహ ॥ భా
నువిందుఁ డుద్ధతిన్విపక్షుపక్షుసైన్యదు । ర్మానకాననానలోపమానచండకాండసం । తానము నేసిచూర్ణితంబు చేసెఁ జాప
వి । ద్యానిరూఢిదేవతావితానమిచ్చ మెచ్చఁగాన్ ॥ ఉత్సాహ ॥ చారుదేష్ణుఁడాగ్రహించి శత్రుభీషణోగ్రదో । స్సారదర్ప
మేర్పడన్ని శాతబాణకోటిచే । దారుణప్రతాపసాల్వదండనాథుమండలి । న్మారి రేఁగినట్లు బిల్లుమార్చి పేర్చియార్చినర్ ॥
క ॥ శుకుఁడామోఘనవిజయో । త్సుకమతిబాహాబలంబుసొప్పడవిశిఖ । ప్రకరంబులఁ దనుశౌర్యా । ధికుఁడనవిద్వేషబలతతిం
బరిమార్చెర్ ॥ ఉ ॥ సారణుఁడేపుమైఁ గదిసిశాత్రవవీరులుసందడింపదో । స్సారమెలర్పఁ గుంతశరశక్తిగదాకురికాదిహే
తుల । న్వారకవాజిదంతిరథవర్గములందునుమాడికాల్పురం । న్వీరముతోడఁ బెంపెఱసు వీటికిఁ గాపురముగ్రమూర్తియై
క ॥ అక్రూరుఁడుదదనుజులున । వక్రపరాక్రమము మెఱసి వైరుల బాహా । విక్రమమునవధియించిరి । చక్రప్రాసాదివివిధస
ధనములచేర్ ॥ మ ॥ కృతవర్మక్షితినాయకుండువిశిఖశ్రేణింబ్రమత్తార్యధి । శ్రితవర్మంబులఁ జించి మేనులశతచ్ఛిద్రంబుల
జ్జేయున । వ్యుతకర్మంబని సైనికుల్పొగడశత్రువ్యూహముచోసంగర । క్షితిధర్మంబుఁ దలంచికాచెరథికశ్రేష్ఠుండు భూమీశ్వరా ॥
వ ॥ అత్తఱిసాల్వుండు గోపోద్దీపితమానసుండై యుండ మాయావిడంబకంబైనసౌభకంబప్పుడు ॥ సీ ॥ ఒకమాటునభమునఁ
బ్రకటంబుగాఁదోఁచునొకమాటు ధరణిపై నెనరనిలుచు । నొకమాటు శైలమస్తకమునవర్తించు నొకమాటు జలధిఁ జరియించును

దక్షిణమున, నొక్కట తోయంబున నొక్కటియై యుండును, నొక్కెడఁ గనుఁగొనఁ బెక్కులగుచు, నొకమాటు సాల్వసంయుక్త
మై పొడసూపు నొకతోయ మన్నియును డిగి తోఁచు, నొక్కెడ తేపకొ అవియు డుగకఁ ద్రిప్పిన, గతిమహోగ్రవృత్తిగా నవ
చ్చు, నటియుఁ బెక్కగతుల నరివరుల్ల లఁగంగఁ, దిరిగె సౌభకంబు ధీవరేణ్య॥ వ॥ ఇవ్విధంబున సౌభకంబు వర్తించుటం జే
సియును సైన్యంబుల చేఁ దైన్యంబు నొందిన నిజసైన్యంబులకు నలంబురి కోల్పి సాల్వుండిష్టుడు॥ క॥ స్ఫురదనలాభశరంబులు,
పొరిపొరిఁ బుంఖానుపుంఖములుగా నేయ, న్దెరలియును లియును మురిసియు, విరిసియుఁ బిఱుతివక పోరె వెసయను బలముల్॥
క॥ అయ్యెడ మానము వదలక, డయ్యక మగపాటితో దృఢంబుగఁ బోర, న్దయ్యె మెఱుంగును యొక్కటి, కయ్యంబపు డయ్యెఁ జే
వగల యోధులకున్॥ క॥ మును ప్రద్యుమ్ను సమారుని, ఘననిశితాస్త్రముల చేతఁ గడు నొచ్చిన సాల్వు సిమంత్రి ద్యుమానా
ముఁడు, సునిశితగదచేన మర్చి, సమహితశక్తిన్॥ చ॥ వెరవును లావు చేవయును వీరము బీరము గల్గి డాసియా, సరసిజనాభ
నందను పిశాలభుజాంతరమున్ బగిల్చిన, న్విరపిరఁ బోవ మేను నిడువెండ్రుకఁ బెట్టఁగఁ జేతిసాధనో, తక్కరములు దేరి పైవడ
లఁగ న్నులు మూయఁ మమూర్ఛ నొందినన్॥ గీ॥ సమరధర్మవేది సమధిక నయవాది, దారకుని సుతుండు దైర్యయుతుఁడు, రథ
ము దోలికొని చరణభూమి వెడలి వే, చని మూర్ఛ దేరి శంబరారి॥ ఉ॥ సారథిఁ జూచి యిట్లనియె శాత్రవవీరులు సూచి నవ్వఁ
గాఁ, దేరు రణక్షితి న్వెడలఁ దెచ్చితిఁ దెచ్చితి దుర్యశంబు పం, కేరుహనాభుఁడున్ హలియుఁ గేలిగొనన్ యదువంశసంభవు,
ల్పేరము దప్పియిప్పగిదిఁ బెల్లురి పోవుమ రేరణంబునన్॥ అనిన నతండతనికిట్లనియె॥ క॥ రథిరిపు చే నొచ్చినచో, రథియును సార
థియునొవ్వ రథియును గావ, న్పృథుసమరధర్మ మిఁక న, వ్యథచిత్తుఁడవగుచుఁ గడఁగు వైరుల గెలువన్॥ అనిన విని॥ ఉ॥ సంచిత
భూరి బాహుబలశౌర్యుఁడు సారథిమాట కాత్మ మోదించి యుదాత్తకాండరుచిదీపిత చాపముఁ దాల్చి మౌర్వి సారించి గుణ
ధ్వని న్మహాదరి ప్రకరంబుల భీతి ముంచి తో, లించె రథంబు మేదిని చలింపఁగ నాద్యుమమీఁద నేర్పునన్॥ అట్లు డగ్గరి॥ చ॥ అరి
నను వష్ట బాణముల నాగ్రహవృత్తిఁ బగిల్చె నాల్గిటన్, తురగముల న్వధించి యొక తూపున సారథిఁ ద్రుంచి రెంటని, స్ఫురతర
కేతుచాపములు చూర్ణముఁ జేసి యొకమ్మునన్ భయం, కరముగఁ ద్రుంచెన ద్ద్యుమునికంఠము కుంఠిత విక్రమోద్ధతిన్॥ మ॥ కని
సాంబప్రముఖాది యోధవరులుత్కంఠాత్ములై మీనకే, తను నగ్గించి సువర్ణపుంఖ నిశితాస్త్రశ్రేణి సంధించి సా, ల్వుని సై
న్యావలి మస్తముల్ వేరపు తావుల్ నేర్పడ నొక్కెడ మె, త్తున వేత్రుంచిరి తాటిపండ్లు ధరఁ దోడ్తో రాల్చు చందంబునన్॥ అట్టి
యెడ॥ స్రగ్ధర॥ కూలుస్తట్లంబు లేనుంగులు ధర దొరఁగు సన్నపన్నైను సద్గుసూచై, ప్రాలుర్ దేరుల్ హతంబై వడిఁ బడు సుభట
వ్రాతముల్ శోణితంబుల్ గ్రోలున్ మాంసంబు నంజున్గొఱుకు నెముకలన్ గుంపులై సోలుచున్ స్వే, తాళ క్రవ్యాదభూతోత్కరము
లు జతలై తాళముల్ దట్టియాడున్॥ మఱియు నొక్కొక్కయెడ॥ సీ॥ ఖండితశుండాలగండముల్ నక్రముల్ స్ఫారితుండంబులు
భుజగసమితి, పనతలంబులు గచ్ఛపంబులు దంతముల్ ముక్తులు గుంభనిర్ముక్తమౌక్తి, కములు రత్నములు వాలములు జలూకము
ల్మెడలు భేకంబులు మెదడు రొంపి, ప్రేవులు పవడంపు దీవులు నరములు నాచు మజ్జంబు ఫేనంబులస్థి, సైకతము లురక్తచయ
ము తోయంబులు, వెరలు నెడల నెరలు మొఱలు ఘనత, రంగరవము గా మతంగజాయోధన, స్థలము జలధిఁ బోల్పఁ దగె నరేం
ద్ర॥ వ॥ ఇవ్విధంబున యదుసాల్వబలంబులు చలంబున నంబర స్పరజయకాంక్షులం దలపడి పోరు పూర్వపశ్చిమసముద్రంబుల
సరణి నిరువదియేడు దినంబులతి ఘోరంబుగాఁ బోరు నెడ నింద్రప్రస్థపురంబుననుండి ద్వారకానగరంబునకు నగధరుండు
చను దేర ముందఱం గానవచ్చు దుర్నిమిత్తంబులు గైకొని కృష్ణుండు దారకునిం జూచి యిట్లనియె॥ శా॥ కంపించె ద్వారక దుర్నిమి
త్తముల నేకంబుల్ మహాభీలము, ల్మింట న్మేదినిఁ దోఁచుచున్నయవి నెమ్మి న్గాండవప్రస్థమే, నుంటన్ జైద్యహితక్షితీశ్వరులు
మాయోపాయులై మత్పురి, న్గెంటింపన్ జనుదేరఁ బోలు మరుపో నీ తేరు వేగంబునన్॥ వ॥ అని యతిత్వరితగతిం జనుదెంచి త
త్పురంబు డగ్గరి మహాబలపరాక్రమంబులం బ్రతిపక్షబలంబులతోఁ దలపడి పోరు యదుబలంబులును, నభోవీధిని భేద్యమా
యావిడంబకంబున బ్రతివీరు లెంతకాలంబున కేయుపాయంబున సాధింపరాని సౌభకవిమానంబునందున్న సాల్వునిం గ
ని తద్విమానంబు డాయం దన తేరు దోల సారథిని నియమించి కదియం జనుమురాంతకుని వీక్షించి యదుబలప్రకరంబులు పర
మానందంబునుం బొందిరి-మృతప్రాయంబై యున్న సైన్యంబు గనుంగొని సౌభకపతి విక్రమక్రియాకలాపుండగుచు ను
రువడించి॥ చ॥ మిణుగురులెల్లెడం జెదర మింటను మంటలు వట్టు ఘంటికా, ఘణఘణభూరినిస్వనని కాయమునన్ హరిదంత
శాలముల్ వ్రణకమహోగ్రశక్తిఁ గొని వారకదారకు మీఁద వైవడా, రుణగతి నింగి నిండి నిజరోచులతోఁ బడుచుక్క కైవ
డిన్॥ క॥ పడిఁ జనుదేరఁ గఁగని యా, ప్పుడు గదధరుఁ డతుల లీలవోలె న్దానిన్, బ్బెడిపొడి మై ధరఁ దొరుఁగఁగ, నడుమన వెసఁ ద్రుంచె
నొక్క నారాచమునన్॥ చ॥ గురుభుజుఁ డంతఁ బోవక యకుంఠిత శూరత శత్రుసైన్యము, ల్దెరలఁగ సుగ్రతన్గొ అవిఁ ద్రిప్పిన

న్వైవడిమింటఁదిగ్గిర। న్దిరుగుచుమర్మిరీత్యమగుదీపితసౌభకుసాల్వుఁజండబా। ణ్యకరకిరణాభషోడశనిశాతశరంబులఁగాఁడ
నేసినన్॥ చ॥ కమవడివల్గి వాఁడునిజకార్ముకముక్తజలదస్వనంబుకై। వడిమొఱయించుచున్వెడఁదవాతిశరంబులఁబద్మ
లోచను। న్నెడమభుజంబుగాఁడవడినేసెఁదెంపఁటిచేతిశార్ఙ్గము। న్విడిచెరథంబుపైగగనవీథిసురల్భయమందిచూడఁగన్॥
క॥ ఓహో హా యనిభూతావలు। హాహాకారములుసేయనంతటఁదేర। న్నాహరిఁగనుఁగొనియతఁడు। త్సాహంబునఁబల్కె
బాహుశౌర్యస్ఫూర్తిన్॥ చ॥ నలినదళాక్షుమత్సఖుఁడునాఁదగుచైద్యుఁడుగోరినట్టికో। మలినవిఁదిలివైతగవుమాలివరించి
తివంతఁబోకదో। గ్ధలమునధర్మనందనుసభాస్థలినేమఱియున్నవానిన। చ్చలమునఁజంపినట్టికలుషంబులునేఁడురణాంగ
ణంబునన్॥ క॥ తలఁపడిపోఁజక బాహా। బలమొప్పగనాదుదృష్టిపథమునధృతితో। నిలిచిననిష్ఠురవిశిఖా। చ్ఛలముంచిమదీయ
సఖునిసూడిటుదీర్తున్॥ చ॥ అనినమురాంతకుండుదరహాసముమోమునఁదొంగలింపసా। ల్వునిఁగనిమోరిలాపులసువ్వగ
లవోటరివోలెఁబ్రేలెదే। మనిననుఘాటుసన్నిహితమాటమెఱుంగవుమూఢచిత్తపా। ప్మనిగడఁగేలఁద్రిప్పియభియాతునిశ
స్త్రనిద్రవేసెనుద్ధతిన్॥ అప్లు ద్రవేసిన॥ క॥ పెనుమూర్ఛనొందివేసము। కున్ననవాతనునెత్తురొల్కఁగొంతవడికినో। య్యనఁదెలి
సినిలువరింపక। చనివాఁడునదృశ్యమయ్యెసౌభముఁదానున్॥ అయ్యవసరంబున॥ గీ॥ గగనమందుండియొకఁడార్తుఁడగుచు
వచ్చి। నందనందనుపాదారవిందములకు। వందనముచేసియానకదుందుభినిమ। హోగ్రుఁడైపట్టితెచ్చెసాల్వుండుగడఁ
గ॥ గీ॥ దేవమీకెఱింగింపఁగాఁదివిరియిటకు। దేవకీదేవినన్నుఁబుత్తెంచెననఁగ। వినిసరోరుహనాభుండుఘనవిషాద। మగ్నుఁ
డయ్యెనుగురుమీఁదిమమతఁజేసి॥ క॥ నరగంధర్వసురాసుర। వరులకునిర్జింపరానివాఁడుబలుండే। మఱకనహీనబలునిచేఁబ
రికింపఁగనెట్లుపట్టుఁబడెనెక్కొయనుచున్॥ మఱియును॥ క॥ భావంబుగలఁగనహహా। దైవకృతంబెవ్వరికినిఁదప్పింపఁగరా।
దేవిధినైననునన్నిశో। కావిలమతిఁబలుకుచున్ననత్తఱివాఁడున్॥ వ॥ అప్పుడుదనమాయాబలంబునంగ్రస్మఅందోదికృతక
వసుదేవునింగల్పించియతనింబంధించికొని తెచ్చిపుండరీకాక్షునిరీక్షింపు-భవజ్జనకుండువీఁడెయిప్పుడు నీవుగనుంగొనవీని
తలఁద్రుంతునింక నెవ్వనికింగామనియెదు కావంగలశక్తిగలదేనియుం గావుమని దురాలాపంబు లాడుచు మృత్యుజి
హ్వాకరాళంబైనకరవాలంబుగేలంబూనిఝళిపించుచునమ్మాయావసుదేవునిశిరంబుదునిమితన్మస్తకంబుగొనివియద్వ
ర్తియైచరియించుసౌభకవిమానంబుసొచ్చెనంతగోవిందుండుగొంతతడవుమనంబునఘనంబగుశోకంబునంగుందుచుండి
యాత్మసైనికులుదెలుపందెలివొందియదిమాయోద్దీపితంబైనసాల్వునియుపాయంబనిమెఱింగియుండెనంతం దనకువ
సుదేవుండుపట్టుఁబడెననిచెప్పినదూతయునమ్మాయాకళేబరంబునక్షణంబవిచిత్రంబుగామాయంబైపోయెఁ దదనంత
రంబ॥ క॥ మునులవుడుగొందఱిచటికిఁ। జనుదెంచివిమోహితమైనజలజాక్షు। న్గనుఁగొనిసమధికభక్తి। న్వినయంబునఁబ
లికిరంతవిష్ణుంజిష్ణున్॥ సీ॥ కమలాక్షసర్వలోకములందుసర్వమానవులుసంసారనానావిధైక। దుఃఖాబ్ధిమగ్నులైతుదిఁ
జేరనేరకవికలత్వమునఁబొందువేళనిన్నుఁ। దలచిమఃఖంబులుదరియింతురట్టిసద్గుణనిధివైదేవకోటకెల్లఁ। బట్టుకొమ్మైపర
బ్రహ్మాఖ్యఁబొగడొందిపరమయోగీశ్వరప్రకరగూఢ। పరచిదానందదివ్యరూపమునవెలుఁగు। ననఘునీవేడనీచజన్మాత్మజని
తఘనభయస్నేహమోహశోకంబులేడ। ననుచుసంస్తుతిచేసివారఱిగిరంత॥ చ॥ హరితనమీఁదఘోరనిశితాశుగజాలము
లేయుసాల్వభూ। వరువధియింపఁగోరిబహువానిదనిర్గతభూరివృష్టివి। స్ఫురణననూనతీవ్రశరపుంజములన్గగనంబుఁగప్పి
క్రొచ్చరరిపుమాలిరత్నమునుజాపమువర్మముఁద్రుంచివెండియున్॥ మ॥ వితతక్రోధముతోడఁగృష్ణుఁడుజగద్విఖ్యాతశౌ
ర్యక్రియో। ద్ధతశక్తిన్వడిఁద్రిప్పిమింటమెఱుఁగుల్దట్టంబుగాఁబర్వను। గ్రతచంచద్గదవైచిత్రుంచెవెసఁజూర్ణంబైధరన్
రాలనా। యతభూరిత్రిపురాభమున్మహితమాయాశోభమున్సౌభమున్॥ వ॥ ఇట్లుకృష్ణుండమ్మాయావిమానంబసుమయ
నిర్మితమాయావిమానంబునిజగదాహతిసింతెంతతునియలైసముద్రమధ్యంబునందొరుఁగఁజేసినసాల్వుండుకోఱలువెఱి
కినభుజగంబుభంగిగండడంగివిన్ననై విగతమాయాబలుండయ్యునుబొలివోవనిబీరంబునవసుధాతలంబునకుడిగ్గియాగ్ర
హంబున॥ క॥ కరమునఁబవినిభమగుభీ। కరగదధరియించికదియఁగాఁజనుదేర। న్మురహరుఁడుద్ధతిసాల్వుని। కరముగదాయు
క్తముగనుఖండింపఁజెన్నృపా॥ క॥ అంతంబోవనికినుకన। నంతుఁడువిలయార్కమండలాయతరుచిమ। ద్ధాంతంబగుచక్రంబు
ని। తాంతంబుగఁబూన్చిసాల్వధరణిపుమీఁదన్॥ క॥ సురుశక్తివైచివెసభా। సురకుండలముకుటరత్నశోభితమగుత। చ్ఛిరము

శ్రీకృష్ణుండుదంతవక్త్రునిసంహరించుట.

వడిఁద్రుంచెనింద్రుఁడు। వరకులిశముచేత్రవృత్రువధియించుక్రియన్॥ వ॥ ఇట్లుమాయావియైనసాల్వుండును సౌభకంబు
నుగృష్ణుచేతంబొలియుటఁగనుంగొనినిజసఖులగుసాల్వపౌండ్రకశిశుపాలభూపాలకులకుఁబరలోకమైత్రివాటించి దం

తవ క్షుత్పిండతిభీషణాకారంబుతో నప్పుడు॥ చ॥ పెటపెటఁ బండ్లు గీఁటుచును బెట్టుగ రోయుచుఁ గన్ను గ్రేవలన్ జిటచిటవిస్ఫులింగములు చింద మహోద్ధతిపాదఘట్టన న్నటనిటనై ధరిత్రి వడకాడ వడిన్ గదఁ గేలఁ ద్రిప్పుచు న్మిటమిటమండు వేసవి నిమించు దివాకరుఁ బోలి యుగ్రతన్॥ చ॥ వడిఁ జను దేరఁ జూచి యదువల్లభుఁ డుల్లము పల్లవింప నప్పుడు గద గేలఁ బూని రక్షమున్ రయ మొప్పఁగ డగ్గి యుగ్రతన్ గడఁగి విరోధికి న్నెదురుగాఁ జన వాఁడతి నీచవర్తియై యడరుచు నట్టహాసముఖుఁడై పవలచేఁ గదఁ ద్రిప్పుచున్ హరిన్॥ వ॥ కనుంగొని పరిహాసోక్తులు గా నిట్లనియె నీవు మదీయభాగ్యంబు కతంబునం జేసి నేఁడు నా దృష్టిపథంబునకు గోచరుండవైతివి మిత్రద్రోహివై నన్నిన్ను మాతులేయుండవని మన్నింపక దేహంబునందు వర్తించు నుగ్రవ్యాధిని యౌషధాదిక్రియల నివర్తింపం జేయు చికిత్సకుని చందంబున బంధురూపశత్రుండవు గావున దంభోళిసంరంభగంభీరంబైన మదీయగదాదండహతిం బరేతనివాసంబునకనిచి మున్ను నీచేత నిహతులైన నా మసఖుల ఋణంబుఁ దీర్తు నని మర్మభాషలాడుచు డగ్గరి॥ చ॥ పెనుగదఁ బూన్చి కృష్ణు తలఁ బెట్టుగ మొత్తిన నంత శౌరి తా నన లెడి గంధసింధురము కైవడి దానవభంజనుండు పెంపున నిజభాసమానగదఁ బూని బలంబునఁ ద్రిప్పి దంతవక్త్రుని యురమున్ బగిల్చిన గుదుల్కొనుచు న్రుధిరంబు గ్రక్కుచున్॥ వ॥ తత్క్షణంబ పర్వతాకారంబగు దేహంబుతో *మొఱలుచు నేలం గూలి కేశపాశంబులు చిక్కులువడం దన్నుకొనుచుఁ బ్రాణంబులు విడిచె నప్పుడు నిఖిలభూతంబులు నాశ్చర్యంబు నొందం దద్గాత్రంబుననుండి యొక్క యతిసూక్ష్మతేజంబు వెలువడి గోవిందుని దేహంబు ప్రవేశించె నయ్యవసరంబున నగ్రజుమరణంబు గనుంగొని కుపితుండై కనుంగవ నిప్పులుప్పతిల్ల విదూరుండు గాలానలజ్వాలాభీలకరాళంబై వ్రాలు కరవాలంబును బలుకయుం గేలం దాల్చి దామోదరు దెసకుం గవయుటయుం గనుంగొని॥ చ॥ జలరుహలోచనుండు నిజసాధనమై తనరారు చక్రము న్వలనుగఁ బూన్చి వైవ నది వారక వాని శిరంబుఁ ద్రుంచెన; బ్బలియుఁడు సౌభసాల్వశిశుపాలసహోదర తత్సహోదరావలుల వధించి తత్సఖుల ముచాగిన నేకుల ద్రుంచె నీగతిన్॥ అయ్యవసరంబున॥ క॥ నరముని యోగి సురాసుర గరుడోరగ సిద్ధ సాధ్య గంధర్వ నభశ్చర కిన్నర కింపురుషులు హరిమహిమ నుతించిరచ్ఛుతానందములన్॥ వ॥ మఱియు నప్సరోజనంబులు నృత్యంబులు సలుప వేల్పులు గుసుమవర్షంబులు గురియ దేవతూర్యంబుల వార్యంబులై మొఱయ యదువృష్ణిప్రవరులు సేవింపఁ బరమానందంబునుం బొంది నిజవిజయాంకితంబులైన గీతంబులు వందిజనంబులు సంకీర్తనంబు సేయ నతిమనోహరవిభవాభిరామంబును నూతనాలంకారయుక్తంబునైన ద్వారకానగరంబు శుభముహూర్తంబునం బ్రవేశింపం జను నెడ॥ క॥ పురసతులు విరులు లాజలు సురుసౌధాగ్రములనుండి గురియఁగ వికచాంబురుహాక్షుండంత న్నిపుర వరమార్గిం జొచ్చె వైభవం బలరారన్॥ వ॥ అట్లు యోగీశ్వరేశ్వరుండును, షడ్గుణైశ్వర్యసంపన్నుండును, నఖిలజగదీశ్వరుండును నైన పురుషోత్తముండు సుఖంబున నుండె నంత॥

## బలరాముండు తీర్థయాత్రకుఁ జనుట.

క॥ కౌరవపాండవపృథుసమరారంభ మెఱింగి తీర్థయాత్ర నెపముగా సీరాంకుఁడు భయమలులకు నారయ సముఁడగుటఁ జేసి యరిగె నరేంద్రా॥ వ॥ అట్లు చని మొదలం బ్రభాసతీర్థంబున నవగాహనంబు చేసి, యందు దేవర్షిపితృతర్పణంబులు సంప్రీతిం గావించి విమలతేజోధనులగు భూసురప్రవరులు దనతో నరుగుదేరం గదలి చని క్రమంబున సరస్వతియు, బిందుసరోవరంబును, వజ్రతీర్థంబును, విశాలానదియు, సరయువు, యమునయు, జాహ్నవియును గనుంగొనుచు, నచటనచట నవగాహనంబులును, దేవర్షిపితృతర్పణంబులును, బ్రాహ్మణసంతర్పణంబులును, భూసురయుక్తుండై నడుపుచుం జని సకలలోకస్తుత్యంబును, నిఖిలమునిశరణ్యంబున గు నైమిశారణ్యంబు సొచ్చి యందు దీర్ఘసత్రంబు నడుపుచున్న మునిజనంబులం గనుంగొనిన, వారలు ప్రత్యుత్థానంబు చేసి రామునకు వినతులై యాసనార్ఘ్యాదిపూజావిధానంబులు గావించిన నతండును బ్రముదితమానసుండగుచు సపరివారంబుగాఁ గూర్చున్న యెడ॥ క॥ ఆ నెఱిఁ దనుఁ గని ప్రత్యుత్థాననమస్కారవిధులు దగ నడపక పెంపూని నసీతముపై నాసీనుండగు సూతు శేముషీవిఖ్యాతున్॥ వ॥ అట్లున్న యతని సమీపంబున నున్న విప్రవరులం జూచి రాముండు రోషించి, వీఁడు నన్నుం గని లేవకుండుటకు హేతు వెయ్యదియొకో, యీ ప్రతిలోమజాతుండు మునిగణసభాస్థలంబునందా నెక్కుముఖ్యుండువోలె మఱభిమానంబున శక్తిమను మనివలనం గొన్ని కథలు గాథలుగాఁ గఱచి విద్వద్గణ్యుని విధంబున విఱ్ఱవీగెడు నిట్టి నీచాత్ముం డభ్యసించు విద్యలెల్లను మనంబున విచారించి చూచిన మదకారణంబులు గాని సత్త్వగుణగరిష్ఠంబులు గావు ధర్మసంరక్షణంబు సేయ నవతరించిన మాకు నిట్టి దుష్టనిర్దళనంబ వశ్యకర్తవ్యంబని తలంచి హస్తంబున ధరించిన కుశాగ్రంబున నా సూతుని వధించిన నక్కడి మునీంద్రులెల్ల హాహాకారంబులతోడం దాలాంకుని జూచి యిట్లనిరి॥ క॥ అనఘ యితనికి బ్రహ్మాసనమిచ్చుటఁ జేసి నీవు చను దేనితఁడా సనముడిగఁడయ్యె నింతయు మును నీ మది నెఱుఁగ నర్థి

* ఒఱలుచున్ శోకించుచు.

మంగలదేహారీ॥క॥ఎటింగెటింగి బ్రహ్మహత్యా।దురితంబుననీమనంబుదూఁకొనేఁబాపో। త్తరణప్రాయశ్చిత్తము।దొరఁ
కొనికావింపుమయ్యదుర్జనహరణా॥వ॥అదియునుం గాక పరమపావనుండ వైననీవుధర్మంబుదప్పిన నెవ్వరుమాన్పంగలరు
కావునఁబ్రాయశ్చిత్తంబుగైకొనినదుపమన్నధర్మంబునిలువదట్లుగావునదీనికింబ్రతీకారంబువుట్టింపుమనిన నతండు నా
రలంగనుంగొనితామసంబుననిట్టిపాపంబు సేయంబడియె-దీనికిముఖ్యపక్షంబైనప్రకృతియెఱింగింపుండు పీనికినాయువు
నుబహుసత్వంబునునొసంగిన మీకిష్టంబగునేనమైననాయోగమహిమచే బునర్జీవితుంగావింతునన నమ్మునులునీయో
గమాహాత్మ్యంబునమాకెవ్విధంబుననైననితండుమృత్యుగతుండుగాకుండునట్లుగావింపుమనిననతఁడందఱంజూచి య
ప్పుడు॥ క॥ధాత్రీవరసమధికచా।రిత్రుఁడుహలపాణివలికెధృతినాత్మా వై।పుత్రనామాసియనెడిప।విత్రశ్రుతివాక్యసరణిపి
శదంబగుటన్॥క॥ఈసూతసుతునకిపుడుమ।హాసత్వమునాయువునుననామయమునువి।ద్యాసామర్థ్యముగలిగిను।ధీసత్త్వ
ములారయిాత్మతిలిన్ విలసిల్లున్.వ॥అనిసూతుంబునర్జీవితుంగాఁజేసిమునులంజూచియిట్లనియె॥గీ॥ఏనెఱుంగకచేసినయా
యవజ్ఞ।శాంతిపొందంగనేయభీష్టంబుమీకు। దానిఁగావింతుననిన మోదంబునొంది। పలికిరత్తాపసులుహలపాణిఁజూచి॥
చ॥హలధరయిల్వలుండనుసురారితనూజుఁడుపల్వలుండునాఁ।గలఁడొకదానవుండుబలగర్వములంబ్రతిపర్వమందునఁ।
జలమునవచ్చిమాసవనశాలలమూత్రసురాప్రపూయవిట్పలలములోలిమైఁగురిసిపాడఱజేయునుయజ్ఞవాటముల్॥వ॥
కావుననానుష్టదానవుంద్రుంచుటయమాకుంగరంబుసంతసంబగునంతమీఁదనీవువిమలచిత్తుండవైభారతవర్షంబునంగల
తీర్థంబులుద్వాదశమాసంబులవగాహనంబు సేయుమట్లైనసర్వపాపనిష్కృతియగుననిపలుకునంతంబర్వసమాగమంబై
న॥సీ॥ మునులుయజ్ఞక్రియోన్ముఖులౌటఁగనుఁగొనిపఱతెంచియసురతద్భవనములను।రక్తవిణ్మూత్రసురామాంసజాలం
బునించిహేయంబుగావించి పెలుచఁ। బెంధూళిరాలును జెల్లలునురలెడిచక్రానిలముపీఁచిచదలనపుడు। కాటుకకొండ
సంగతిఁబోల్పమేనుతామ్రశ్మశ్రుకేశసమాజములును।నవ్యచర్మాంబరముభూరినాసికయును।కలకుమిడిగ్రుడ్లునిప్పలు
గ్రక్కుదృష్టు।వ్రేలుపెదవులుదీర్ఘకరాళజిహ్వ। కయునుముడివడ్డబొమలునుగలుగువాని॥ మహాస్రగ్ధర॥ కనియుగ్రోద్దా
లాంకుఁడుదృత్కటచటులనటత్కాలదండాభశూలున్।జనరక్తాసిక్తతాలున్సమధికసమరోత్సాహలోలున్గభోరా।శ
నితుల్యోదగ్రదంష్ట్రాజనితశిఖికణాచ్ఛాదితాశాంతరాళున్। హననవ్యాపారశీలున్నతిదృఢఘనమస్తాస్థిమాలున్గరా
ళున్॥ఉ॥ వెండియుఁగ్రొమ్మెఱుంగులుడువీధివెలుంగఁగనుల్లసద్గదా। దండముగేలఁద్రిప్పచునుదారతరాబలభద్రుఁడా
సురో। ద్దండవిఘాతుకున్ముసలదారుణలాంగలముల్దలంపమా।ర్తాండనిభంబులైయెదుఱందదక్షణమాత్రనఁదోఁచినన్వే
సన్॥వ॥అట్లుసన్నిహితంబులైనతనకార్యసాధనంబులగునిజసాధనంబులుధరియించియప్పుడు॥చ॥గగనమునంజరించుసు
రకంటకుకంఠముచేతినాగటన్। దగిలిచిరోఁకలెత్తిబెడిదంబడరన్నడునెత్తిమొత్తినన్। భుగభుగనెత్తురొల్కనిలబోరగి
లంబడెవజ్రధారచేఁ। దెగిధరఁగూలుభూరిజగతీధరమున్బురణింపబెట్టుగాన్॥ అట్లుపల్వలుండుమడిసిన॥క॥మునివరులు.
గామపాలుని।వినుతించిరివేయువేలవిధములవృత్రున్।మనిమినయింద్రునినమరులు।వినుతించినరీతినపుడువిమలచరిత్రా॥
గీ॥అంతనభిషిక్తుఁజేసియత్యంతసురభి। మంజులామ్లానకంజాతమాలికయును। నంచితాభరణమృదుదివ్యాంబరములు।
నర్థినిచ్చినఁదాల్చియాహలధరుండు॥ క॥దేవేంద్రుఁబోలియొప్పెను। ధీవిలసితుఁడగుచుమునితతిన్వీడ్కొనితన్। సేవించు
చుఁగతిపయవి।ప్రావలిచనుదేరఁగౌశికాఖ్యంబునకున్॥వ॥చనియమ్మహానదింగృతస్నానుండైయచ్చోటుఁబాసిసరయు
వునందుఁగ్రుంకులిడిప్రయాగనవగాహనంబుచేసిదేవర్షిపితృతర్పణంబులాచరించిపులస్త్యాశ్రమంబుసొచ్చిగోమతిందద
ర్శించిగండకీనదినుత్తరించివిదళితభవపాశయగువిపాశయందుఁదోఁగిశోణనదంబుననాప్లావితుండై గయనాడిగంగా
సాగరంబుదర్శించి మహేంద్రనగరంబునకరిగి॥ క॥ రాముఁడుగనుఁగొనెభార్గవ। రామున్రజనీశకులధరావరనగను।
త్రాముమన్నన్నుతఘుగుణ।స్తోమున్దారుణ్యసీమసుజనలలామున్॥ గీ॥కనినమస్కరించికౌతుకంబెలరార।నతనివీడుకొనిమ
హాయుధుండు।గోమసుమిగిలిసప్తగోదావరికినేగి।యందుఁదీర్థమాడియచటఁగదలి॥ వ॥ వేణాపంపాసరస్సులంజూచిభీ
మనదికేఁగియందుఁగుమారస్వామినిదర్శించి, శ్రీశైలంబునకుంజనివేంకటాచలంబుదర్శించి, కామకోటిశక్తినిరీక్షించి,
కాంచీపురంబుఁగాంచి,కావేరికింజనియమ్మహావాహినినవగాహనంబుచేసి॥ స్రగ్ధర॥సేవించెన్రంగధామున్నిశ్రితనివహ
పయస్సింధుసంపూర్ణసోము। న్గావేరీమధ్యసీమున్ఘనకలుషమహాకాలకూటోగ్రభీము। న్దేవారిశ్రీవిరామున్దివిజవినుత
సందీపితానంతనాము।న్ధీవిజ్ఞానాభిరామున్త్రిభువనవిలసద్దైవతాసార్వభౌమున్॥ వ॥ అచ్చోటువాసివృషభాద్రినెక్కి
హరిక్షేత్రంబుద్రొక్కి,మధురాపురంబునకఱిగి, సేతుబంధనంబుమెట్టియచటంబదివేలపాడిమొదవులభూసురులకిచ్చి

రామేశ్వరుం దర్శించి, తామ్రపర్ణికిం జని మలయాచలం బెక్కి యగస్త్యునిం గని నమస్కరించి, దక్షిణసముద్రంబు దర్శించి కన్యాఖ్యదుర్గాదేవిని నుపాసించి, పంచాప్సరసంబను తీర్థంబున నుపప్లావ్యం బాచరించి, గోకర్ణంబున నిందుమౌళిని దర్శించి ద్వీపవతియైన కామదేవి నిరీక్షించి, దాటి పయోష్ణి నిదర్శించి, నిర్వింధ్య గడచి, దండకావనంబున కరిగి, మాహిష్మతీపురంబు న వసియించి, మనుతీర్థంబునం దాడి, క్రమ్మఱం బ్రభాసతీర్థంబునకు వచ్చి యచ్చటి బ్రాహ్మణజనంబుల వలనం బాండవధార్తరాష్ట్రకులఖండనంబునం బసకలరాజలోకంబులుం బరలోకగతులగుటయు వాయునందనసుయోధనులు గదాయుద్ధసన్నద్ధులగుటయు నెఱింగి వారల వారింపం దలంపున నచ్చటికిం జని॥ గీ॥ ధర్మనందనుం డనకుం వదనము సేయు। కృష్ణులను మాద్రిసుతుల నీక్షించి యేమియుం బలుకక వ్యగ్రగదాదండపాణులగుచుం। గ్రోధమునం బొంగు భీమదుర్యోధనులను॥ చూచి వారలం డాయంజని యిట్లనియె॥ సీ॥ వీరపుంగవులార వినుండు మీలో పలభూరిభుజాసత్త్వమునను నొకండు। ప్రకటితాభ్యాససంపద్విశేషంబున నొక్కండు నధికుండై యుంటం జేసి। సమబలు లటు గానం జర్చింపంగా నింపుజయ మొక్కనికి లేదు సమరమందుం। గాన నూఱక పోరంగా నేల మీకు నివారింప నన్యోన్యవైరములను। నడరి తొల్లింటి మత్సపలాత్మలందుం। దలచిత ద్భాషణము లుపద్యములు గాక। మొక్కలంబునం బోర నాముష్టి కాను। రారి వీక్షించి వీరిశుభాశుభములు॥ వ॥ ఎట్లు గావలయు నట్ల య్యెడుం గాక యని యచ్చోట నిలువక నుగ్రసేనాదిబంధుప్రకరంబులు పరితోషంబున నెదుర్కొన ద్వారకాపురంబునకు వచ్చి యందుండి మఱుడినై మిశారణ్యంబునకుం జని యమ్మునిపుంగవులను మలింపనచ్చోట నొక్క మఖంబు గావించి బహుదక్షిణ లొసంగి యంచితజ్ఞానపరిపూర్ణులగునట్లుగా వరం బిచ్చి రేవతియునుం దానును బంధుజ్ఞాతియుతంబుగా నవభృథస్నానం బాచరించి యనంతరంబ. చ॥ విలసితమాల్యచందననవీనవిభూషణరత్నవస్త్రము। ల్పొలుపుగం దాల్చి యంచితవిభూతిం దలిర్చెను బూర్ణచంద్రికా। కలితసుధాంశులేఖ యొనకం బెసంగ న్నిజబంధులోచనో। త్పలచయ ముల్లసిల్లం బరిపాండురచారుయశోవిలాసుండై॥ వ॥ ఇవ్విధంబున ననంతుండును, నప్రమేయుండును, మాయామానుషవిగ్రహుండును, ననంతబలశాలియునైన బలదేవుం డతివిభవంబున నిజపురంబు ప్రవేశించి సుఖంబున నుండె నని చెప్పి వెండియు నిట్లనియె॥ క॥ హలధరుం డమర్త్యచరితుం। డలఘుభుజాబలుం

## కుచేలోపాఖ్యానము.

డౌనప్పు నద్భుతకర్మంబులు పెక్కు నాల్గుమొగములుగల మేటియు లెక్కవెట్టంగలండె నరేంద్రా॥ చ॥ అనిన మునీంద్రుం గన్గొని ధరాధిపుం డిట్లను బద్మపత్త్రలో। చనుని యనంతవీర్యగుణసంపద వేమఱు విన్ననైనను। న్దనియదు చిత్తమచ్యుతకథావిభవంబొకమాటు వీనులన్। విని నను మోజపుష్పశరపిన్ఢుండునై నవిరాళి నొందండే॥ అదియునుం గాక॥ చ॥ హరిభజియించు హస్తములు హస్తము లచ్యుతుం గోరి మ్రొక్కు తచ్ఛిరము శిరంబు చక్రధరుం జేరినచిత్తము చిత్త మిందిరా। వరుం గను దృష్టి దృష్టి మురవైరి నుతించిన వాణి వాణి యాక్షురుకథలానుకర్ణములు కర్ణములై విలసిల్లుం బో భువిన్॥ క॥ హరిపాదతీర్థసేవాపరుండై విలసిల్లునట్టి భాగవతుని విస్ఫురితాంగము లంగములా। పరమేశ్వరు నెఱుంగ నాకుం బలుకు మునీంద్రా॥ సీ॥ అనుడు వేదవ్యాసతనయుండా యభిమన్యుతనయునిం జూచి యిట్లనియెం బ్రీతి। జనవర గోవిందసఖుండు గుచేలుండు నా నొప్పువిప్రుండు మానధనుండు। విజ్ఞానరాగాదివిరహితస్వాంతుండు శాంతుండు ధర్మవత్సలుండు ఘనుండు। విజితేంద్రియుండు బ్రహ్మవేత్త దారిద్ర్యంబు బాధింప నొరులం గార్పణ్యవృత్తి। నడుగం బోవక తనకు దానబ్బినట్టి। కాసుపదివేల నిష్కములుగాం దలంచి। యాత్మ మోదించి పుత్త్రదారాభిరతుండు। మొకవిధంబున నడుపుచునుండు నంత॥ సీ॥ లలితపతివ్రతాతిలకంబు నంశాభిజాత్యదద్భార్య పుస్సహదరిద్రపీడ చేం గడునొచ్చి పెదవులు దడుపుచు శిశువులాంకటి చిచ్చు చేం గృశించి। మలమలమాండుచు మానసంబెఱియుంగం బట్టెడోరెము మాకుం బెట్టు మనుచుం। బత్రభాజనధృతపాణులై తనుం జేరి ఫేడపీనులు చుట్టుం జూడినట్లు। మైన నొకనాండు వగచి నిజాధినాథుం। జేరి యిట్లని పలికె నోజీవితేశ। తట్టుముట్టాడు నిట్టి పేదఱిక మిట్టు। నొంప దీనికుపాయమూహింపవైతి॥ అని మఱియు నిట్లనియె॥ గీ॥ బాలసఖుండైన యప్పద్మపత్త్రనేత్రుం। గాన నేంగి దరిద్రాంధకారమగ్ను। లైన మముసుద్ధరింపుము హరికృపాకటాక్షరవిదీప్తి వడసి మహాత్మ నీవు॥ మఱియును॥ చ॥ వరదుండు సాధుభక్తజనవత్సలుం డార్తశరణ్యుం డిందిరా। వరుండు దయాపయోధి భగవంతుండు కృష్ణుండు దాం గుశస్థలీ। పురమున యాదవప్రకరముల్ భజియింపంగ నున్నవాండు యిట్లరిగిన నిన్నుం జూచి విభుం డప్పుడ యిచ్చు ననూనసంపదల్॥ మ॥ కలలోనం దను మున్నెఱుంగని మహాకష్టాత్ముండై నట్టి మర్త్యులుం డాపత్సమయంబున న్నిజపదాబ్జాతంబు లుల్లంబులోం। దలంపన్నంతన మెచ్చి యార్తిహరుండై తనైనన నిచ్చున్ సునిశ్చలభక్తి న్భజియించు వారికిడం డే సంపద్విశేషోన్నతుల్॥ క॥ అని పలికిన సమ్మానిని। సునయోక్తుల కలరి భూమిసురుం డా కృష్ణుం గ్దన నేంగుట యిహపరసాధనమగు నని మదిం దలంచి తన సతితో డ్క్॥ గీ॥ నీవు సెప్పిన యట్ల రాజీవనేత్రుం బొ

దపర్కంబులా శ్రయింపంగఁజనుట। పరమశోభనమా చక్రపాణికిపుడు। గాను కేమైనఁగొంపోవఁగల దెమనకు॥ గీ॥ అనినన
య్యింతియాఁగాక యనుచు విభుని। శిథిలవస్త్రంబు కొంగునఁ బృథుకతండు। లములనొకకొన్ని ముడిచి నెయ్యమున ననుపఁ। జ
నియెగోవిందదర్శనోత్సాహియగుచు॥ అప్లుచను మందనమనంబున॥ సీ॥ ద్వారకానగరంబు నేరీతిఁజొత్తును భాసురాంతర్గ
పురవాసినైన। యప్పుండరీకాక్షు నఖిలేశు నెట్లు గాంగిదర్శింపఁగలనొ తద్వారపాలు। రెక్కడి విప్రుఁడవిం దేలవచ్చెదవనియ
డ్డపెట్టిరేనపుడు వారి। కేమైనఁ బరిదానమిచ్చి చొచ్చెదనన్న నూహింపనర్థశూన్యుఁడ నేను। నైన నా భాగ్యమతని దయా
ర్ద్రదృష్టి। గాక తలపోయఁగా నొండుగలదె యాతఁ। డేల నన్నును పేక్షించు నేటిమాట। లనుచు నా ద్వారకాపురమపుడు సొ
చ్చి॥ వ॥ అప్లు ప్రవేశించి రాజమార్గంబునం జనిచని కక్ష్యాంతరంబులు గడచిచని ముందట॥ సీ॥ విశదమై యొప్పు షోడశసహ
స్రాంగనాకలితవిశాలసంగతిఁ దనర్చి। మహనీయతపనీయమణిమయగోపుర ప్రాసాదసౌధహర్మ్యములు సూచి। మనము
బ్రహ్మానందమును బొందఁగడు నుబ్బి సంతోషబాష్పముల్లడికొనంగఁ। బ్రకటమై విలసిల్లు నొక వధూమణిమందిరమున నింతు
లు చామరనులు వీవఁ। దనరు మృదుహంసతూలికా తల్పమందుఁ। దానుఁ బ్రియయును బహువినోదములఁ దనరి। మహితలా
వణ్యు సన్మోహనమ్మథుం ము। నంగఁ జూపట్టు పుండరీకాయతాక్షు॥ సీ॥ ఇందీవరశ్యామువందితసుత్రాముఁ గరుణాలవాలు భా
సురకపోలుఁ। గౌస్తుభాలంకారుఁ గామితమందారుసురుచిరలావణ్యు సురశరణ్యు। హర్యక్షనిభమధ్యు నఖిలలోకారాధ్యు
ఘనచక్రహస్తు జగత్ప్రశస్తుఁ। ఖగకులాధిపయాను గౌశేయపరిధానుఁ బన్నగశయను నబ్జాతనయను। మకరకుండలసద్భా
సుమంజుభాసు। నిరుపమాకారు దుగ్ధసాగరవిహారుఁ। భూరిగుణసాంద్రు యదుకులాంభోధిచంద్రు। విష్ణురోచిష్ణుజిష్ణుస
హిష్ణుఁగృష్ణు॥ మ॥ కనిడాయంజనునంతఁ గృష్ణుఁడు దరత్కంజాతుఁ డప్పేదవి। ప్రుని నల్లంతదరిఁ బ్రపీడితుఁ గృశీభూతాం
గుఁ జీర్ణాంబరు। న్ననతృష్ణాతురచిత్తు హాస్యనిలయున్ఖండోత్తరీయున్గుచేలుని నల్లంత నె చూచి సంభ్రమవిలోలుండై దిగెఁ దా ద
ల్పముల॥ క॥ కరమర్థి నెదురుగాఁజని। పరిరంభణమాచరించి బంధుస్నేహస్ఫురణ దోడ్తెచ్చి సమాదరమునఁ గూర్చుండఁ
బెట్టెఁ దన తల్పమున॥ గీ॥ అప్లు కూర్చుండఁబెట్టి నెయ్యమునఁ గనక। కలశ సలిలంబు చేఁ గాళ్లు గడిగి భక్తిఁ। దజ్జలంబులు దన
మస్తకమునఁ దాల్చి। లలితమృగమదఘనసారమిళితమైన॥ గీ॥ మలయజము మేన జొబ్బిల్ల నలఁదియంత। శ్రమము వాయం
గఁ దాళవృంతముల విసరి। బంధురామోదకలితధూపంబులొసఁగి। మించుమణిదీపములనివాళించి మఱియు॥ వ॥ సురభికుసు
మమాలికలు సిగముడిచి మఱి మిక కర్పూరమిళిత తాంబూలంబులిడి ధేనువు నొసంగి సాదరంబుగా స్వాగతంబడిగిన నవ్వడవి
ప్రు మేనంబుల కాంకురంబులంకురింప నానందబాష్పజలబిందుసందోహుండయ్యె - నట్టియెడం బద్మలోచనుండు మన్నించు
నంగనామణియగు రుక్మిణి కరకంకణంబులు మెఱయం జామరలు వీవం దజ్జాతవాతంబున ఘర్మసలిలంబుని వారించుచుండం
జూచి శుద్ధాంతకాంతాజనంబులు మనంబున నద్భుతం బందియిట్లనిరి॥ ఉ॥ ఏమితపంబుఁ జేసెనొకొ యీ ధరణీదివిజోత్తముం
డుత్తొ। ల్బామున యోగివిస్ఫురమపాస్యకుఁడై తనరారు నీ జగ। త్స్వామి రమాధినాథు నిజతల్పమునన్వసియించియున్న
వాఁ। డీ మహనీయమూర్తికెనయే మునిపుంగవులెంత వారలు॥ అదియునుం గాక॥ చ॥ తనమృదుతల్పమందు వనితామణి
నైన రమాలలామపొం। దును నెడఁ గాఁదలంపక యదుప్రవరుండెమ తేఁగి మోదము। న్దనుకఁ గౌఁగిలించి యుచితక్రియ
లన్బరితుష్టుఁ జేయుచు। న్వినయమున న్భజించె ధరణీసురుఁ డెంతటి భాగ్యవంతుఁడో॥ అయ్యవసరంబున॥ క॥ మురసంహారుఁ
డుసుచేలుని। కరముగరంబునఁ దెమల్చి కడకన్మనమా। గురుగృహమున వర్తించిన। చరితములనికొన్నినుడివిచతురతమఱి
యు॥ సీ॥ బ్రాహ్మణోత్తమ వేదపాఠనలబ్ధదక్షతగలచారువంశంబువలనఁ। బరిణయంబైనట్టి భార్యసుశీలవర్తనములఁ ద
గభవత్సదృశయగునె। తలఁప గృహమేధి ధనదారపుత్త్రాదులం దమనీచిత్తంబు చెందకుంట। తోఁచుచున్నది యేను మదిలోక
సంగ్రహార్థంబు కర్మాచరణంబు సేయు। గతిమనంబునఁ గామమోహితుబుగాక। నర్థిమై విహితకర్మంబు లాచరించి। ప్రకృ
తిసంబంధమును బాసి భవ్యనిష్ఠఁ। దవిలియుందురు కొందఱుత్తములు భువిని॥ అనిమఱియు నిట్లనియె॥ క॥ ఎఱుఁగుదె గురుమం
దిరమున। వెఱవొప్పఁగ మనకు నతఁడు వెలయఁగఁ దెలుప। న్నెఱుఁగఁగ వలసిన యర్థము। లెఱిఁగి పరిజ్ఞానమహిమ లెఱుఁగు
ట లెల్లన్॥ అనిమ్మఱియు గురుప్రశంస సేయఁ దలంచి యిట్లనియె॥ గీ॥ తివిరి యజ్ఞానతిమిరప్రదీపమగుచు। నవ్యయంబైన బ్ర
హ్మంబు ననుభవించు। భరితసత్పుంసు సత్కర్మనిరతుఁడ తుల। భూసురశ్రేష్ఠుఁడనఘుండు బుధనుతుండు॥ వ॥ అమ్మహాత్ముని
వలన సకలవర్ణాశ్రమంబుల వారికి నేను విజ్ఞానప్రదుండన గురుండనై యుండియు గురుభజనంబు పరమధర్మంబనియాచ
రించితినది గావున॥ క॥ భూసురుల కెల్ల ముఖ్యుఁడ। నైన సకలకులాశ్రమంబులందుల నెపుడున్। ధీమజ్ఞానప్రదుఁడన। దేశికుఁ
డననొప్పుచుందు ధృతి నెల్లెడలన్॥ గీ॥ అట్టివర్ణాశ్రమంబులయందు నర్థ। కుశలులగు వారి నిఖిలైక గురుఁడనైన। నామహా

౧౩౫

క్యంబు చేభవార్ణవము పెలుచ। దాఁటుదురు మత్పదాంబుజ ధ్యానపరులు॥ వ॥ అదియునుంగాక సకలభూతాత్మకుండ నైన
యేను తపో వ్రత యజ్ఞ దాన శమ దమాదులచేత సంతసింపను గురుజనంబులఁ బరమభక్తి సేవించు వారలం బరిణమింతు నని చె
ప్పి నుఱియు మనము గురుమందిరంబున నున్న యెడ గురుపత్నీ నియుక్తుల మై యింధనార్థం బడవికిం జనిన యెడ॥ సీ॥ ఘుమఘు
మారావ సంకుల ఘోర జీమూత పటల సంఛన్నాభ్ర భాగ మగుచుఁ। జటుల ఝంఝానిలోత్కటసముద్ధూత నానావిహం
గసంతాన మగుచుఁ। జండదిగ్వేదండ తుండనిభాఖండ వారిధారాపూర్ణ వసుధ యగుచు। విద్యోతమానో గ్రశిఖిద్యోతకిరణ
జిద్విద్యుద్ద్యుతిచ్ఛటావిభవ మగుచు। నడరి జడి గురియ నినుఁడు నస్తమింప। భూరినీరంధ్ర నిబిడాంధకార మేచి। సూచికాభేద్య
మై వస్తుగోచరంబు। గాని యట్లుండె వనము నవ్వానఁ దడిసి॥ గీ॥ బయలు గొందియుఁ బైనుమిట్టుపల్లములును। రహితసహిత
స్థలంబు లేర్పడు పరాక। నున్నయత్తఱిమన మొకరొకరిచేతు। లూఁత గాఁగొని నడుచుచు నుండ నంత॥ క॥ బిసబిసనప్పు
డు నడుగక। విసరెడి వలిచేత వడఁకు విడువక మనము। న్వసచెడి మార్గముఁ గానక। మసలితి మంతటను నంశుమంతుఁడు వొడ
మర॥ క॥ తెలతెలవారెడి వేళ। న్గలకలను నిపలికెఁ బక్షిగణ మెల్లెడల। న్మిలమిలని ప్రొద్దు పొడుపున। ధళధళ యను మెఱుఁగు దిగ్వి
తానము నిండెన్॥ క॥ అప్పుడు సాందీపుఁడు మన। చొప్పరయుచు వచ్చి వానసోఁకున నువలి। న్దెప్పిగ్లుటఁ గని ఖేదం। బుప్పతిలం
బలికె నకట యో వటులారా॥ చ॥ కటకట యిట్లు మాకొఱకుఁ గాఁ జనుదెంచి మహాటవిన్సము। త్కటపరిపీడ నొందితిరి గావున
శిష్యులు మా ఋణంబు నీ। గుటకిది కారణంబు సమకూరెడిఁ బోయిట మీఁద మీకు వి। స్ఫుటధన బంధు దార బహుపుత్ర విభూ
తి జయాయు రున్నతుల్॥ క॥ అని గారవించి యాయన। మనల న్దోడ్కొనుచు నాత్మమందిరమునకు। న్జను దెంచుట లెల్లను నీ।
మనమునఁ దలఁ తే యటంచు మఱియు న్బలికెన్॥ వ॥ అనఘా మన మధ్యయనంబు సేయుచు నన్యోన్య స్నేహ వాత్సల్యంబులం
జేయు కృత్యంబులు మఱువవు గదా యని యవి యెల్లం దలంచి యాడు మాధవు మధురాలాపంబులు విని యతనిం గనుంగొని కు
చేలుండిట్లనియె॥ క॥ వనజోదర గురుమందిర। మున మన మువసించు నాఁడు ముదమునఁ గావిం। పని పను లెవ్వియుఁ గల వే। విను
మవి యట్లుండ నిమ్ము విమలచరిత్రా॥ క॥ గురుమతిఁ దలఁపఁగ ద్రిజగ। ద్గురుఁడ వనం దగిన నీకు గురుఁడనఁ దా నెం। డొరుఁడె
వ్వఁడింతయును నీ। కరయంగ విడంబనంబులగుఁ గాదె హరీ॥ వ॥ అని సాభిప్రాయంబుగాఁ బలికిన పలుకులు విని సమస్తభా
వాభిజ్ఞుండైన పుండరీకాక్షుండు మందస్మిత సుందర వదనారవిందుండగుచు నతని ంజూచి నీ విచ్చటికి వచ్చునప్పుడు నాయందు
లభక్తిం జేసి నాకు నుపాయనంబుగా నేమి పదార్థంబు దెచ్చితి వప్పదార్థంబు లేశమాత్రంబైనఁ బది వేలుగా నంగీకరింతు న
ట్లుంగాక నీచవర్తనుండై మద్భక్తిం దగులని దుష్టాత్ముండు హేమాచల తుల్యంబైన పదార్థంబు నొసంగిన నదియు నా మనమ్ము
నకు సమ్మతంబు గాదు కావున॥ క॥ దళ మైనఁ బుష్ప మైనను। ఫల మైనను సలిల మైనఁ బాయని భక్తి। న్గొలిచిన జను లర్పించిన। నెల
మిన్ను చిరాన్నముగ నేయేను భుజింతున్॥ క॥ అని పద్మోదరుఁ డాడిన। వినయోక్తుల కాత్మ నలరి విప్రుఁడు దాఁదెచ్చిన యటు
కులు డగ సర్పింపను నేరక మోము వాంచి పలుకక యున్నన్॥ వ॥ అవ్విప్రుండు చనుదెంచిన కార్యంబు కృష్ణుండు దన దివ్యచి
త్తంబున నెఱింగి యితండు పూర్వభవంబున నైశ్వర్యకాముండై నన్ను సేవింపండైన నిక్కుచేలుండు నిజకాంతాముఖో
ల్లాసంబునకై నా యొద్దకుం జనుదెంచిన వాఁ డితనికి నింద్రాదులకుం బడయరాని బహువిధంబులైన సంపద్విశేషంబు లీతు
ణంబ యొడఁగూర్పవలయు నని తలంచి యతండు జీర్ణవస్త్రంబు కొనముడిచి తెచ్చిన యయ్యటుకుల ముడియఁ గని యిది యేమ
దని యొయ్యన నమ్ముడియఁ దనకరకమలంబుల విడిచి యయ్యటుకులు గొన్ని పుచ్చికొని యివియ నేకలోకంబుల నన్నుఁ బరితృ
ప్తిం బొందింపఁ జాలు నని యప్పుడు॥ క॥ మురహరుఁడు పిడికెడు టుకులు। గరమొప్పఁగ నారగించి కౌతుకమతి యై। మఱియును
బిడికెడు గొనఁ ద। త్కరమప్పుడు వట్టెఁ గమలకరకమలములన్॥ క॥ సొంపారఁగ నితనికి బహు। సంపద లందింప నివియ చాలు
ను నీ కభి। కుంపఁగ వలవదు త్రిజగ। త్సంపత్కర దేవదేవ సర్వాత్మ హరీ॥ వ॥ అని యిట్లు వారించిన నక్కుచేలుండు నా రాత్రి గో
వింద మందిరంబునఁ దనకు హృదయానందకరంబులగు వివిధపదార్థంబు లనుభవించి మృదుల శయ్యాతలంబున నిద్రించి తన
మనంబునం దన్నుసమధిక స్వర్గభోగానుభవుంగాఁ దలంచుచు మఱునాఁ డరుణోదయంబున మేల్కని కాలోచిత కృత్యంబు
లు దీర్చి యిందిరారమణుండు దన్నుఁ గొంతదవ్వనిపి యామంత్రితుం జేయఁ జనుచు నందనందన సందర్శనానందలోలాత్ముం
డై తన మనంబున నిట్లనియె॥ క॥ నా పుణ్య మరయ నెట్టిదొ। యా పుణ్యనిధిం బ్రశాంతు నచ్యుతు నఖిల। వ్యాపకు బ్రహ్మణ్యునిఁ
జిద్రూపకుఁ బురుషోత్తముని బరుంగనుఁ గొంటిన్॥ సీ॥ పరికింపఁ గృపణస్వభావుండ నైనట్టి నే నెడ నిఖిలావనీశుఁ డైన। యిందిరా
దేవికి నెనయంగ నిత్యనివాసుఁ డై యొప్పు నవ్వాసుదేవుఁ। డేడ నన్నర్థి మైఁ దోడఁ బుట్టినవాని కైవడిఁ గౌఁగిటఁ గదియఁ జే
ర్చి। దైవంబుగా నన్ను భావించి నిజతల్పమున నునిచి సత్క్రియలు వానినడిపి। చారునిజవధూకర సరోజాతకలిత। చామరానిల

విగతవిశ్రముఁ జేసి। శ్రీకుచాలిప్తచందనాంచితకరాబ్జతలములనునడుగులొత్తివత్సలత మెఱసి॥ కావున।ఉ॥ శ్రీనిధియిట్లునన్నుఁబచరించిఘనంబుగవిత్తమేమియు।న్నీని తెఱంగుగానఁబడె నెన్నదరిద్రుఁడుసంపదర్థుఁడై।కానకతన్నుఁ జేరఁడనికాక శ్రితార్తిహరుండుసత్కృపాం।భోనిధిసర్వవస్తుపరిపూర్ణునిగాననుఁ జేయకుండునే॥వ॥అనితనమనంబునవితర్కించుచునిజపురంబునకుంజనిచనిముందట॥సీ॥భానుచంద్రప్రభాభాసమానస్వర్ణచంద్రకాంతోపలసౌధములును।గలకంఠశుకనీలకంఠసముత్కంఠమానితభూజితోద్యానములును।ఫుల్లసితాంభోజహల్లకకల్హారకైరవోల్లసితకాసారములును।మణిమయకనకకంకణముఖాభరణవిభ్రాజితదాసదాసీజనంబు।గలిగిచెలువొందుసదనంబుగాంచివిస్మ।యమునుబొందుచునెట్టిపుణ్యాత్ముఁడుండు।నిలయమొక్కొ।యపూర్వమై నెగడెనుహిత।వైభవోన్నతలక్ష్మీనివాసమగుచు॥ అనితలపోయుచున్నయవసరంబున॥గీ॥దివిజవనితలఁబోలెడు తెఱవలపుడు।డాయ నేతెంచియించువిచ్చేయుఁడనుచు।విమలసంగీతనృత్యవాద్యములు చెలఁగ।గరిమఁదోడ్కొనిచనిరంతిపురమునకును॥ వ॥ఇట్లుచనుదేరనతనిభార్యయైనసలీలలామంబుదనమనంబునానందరసమగ్నయగుచునిట్లనియె॥సీ॥తనవిభురాకముందటఁగనిమనమునహర్షించివైభవంబలరమనుజకామినీరూపంబుగైకొన్నయిందిరావనితచందంబునఁదనరుచున్న। కలకంఠితనవాలుకన్నులక్రేవలనానందబాష్పంబులంకురింప।నతనిపాదంబులకాత్మలోమ్రొక్కి భావంబుననాలింగనంబుఁజేసె। నాథరాదేవుఁడతులదివ్యాంబరాభరణవిభూషితవైరతిరాజుసాయ।కములగతి నొప్పుపరిచారికలుభజింప।లలితసౌభాగ్యయసునిజలలనఁజూచి॥క॥ ఆనారీరత్నంబును।దానునునను రాగరసముదళుకొత్తఁగని।త్యానందమునొందుచుఁ బెం।పూనినహరిలబ్ధవైభవోన్నతి మెఱయన్॥సీ॥కమనీయపద్మరాగస్తంభకంబులుఁగోమరారుపటిక్కంపుకుడ్యములునుమరకతవరరత్నమయకవాటంబులుఁగీలితహరినీలజాలకములు।దీపితచంద్రకాంతోపలవేదులునంచితవివిధపదార్థములును।వసుహంసతూలికాతల్పంబులును హేమలాలితశయనస్థలములఁదనరు। సమధికోత్తుంగభద్రపీఠములుసిరులు। మానితోన్నతచతురంతయానములును।వలయుసర్వవస్తుపరిపూర్ణవాటికలునుగలిగిచెలువొందుమందిరంబెలమినొప్పి॥వ॥సుఖంబుననుండునట్టియెడందనకుమనోవికారంబులుపొడమకుండవర్తించుచునిర్మలంబగుతనమనంబుననిట్లనునింతగాలంబత్యంతమరంతంబగుదారిద్ర్యదుఃఖార్ణవంబునమునింగియున్ననాకుంగడపటంగలిగినవిధంబుననిప్పుడు॥గీ॥ఎన్నఁగ్రొత్తలైనయిట్టిసంపదలునా।కబ్బుటెల్లహరిదయావలోక।నమునఁజేసికాదెనలినాక్షుసన్నిధిఁ।కర్థినగుచు నేనునడుగుటయును॥క॥నను నావృత్తాంతంబును।దనమనమునఁగనియు నేమియుఁడవకననుఁబొమ్మనియీసంపదలెల్లను।నొనరఁగనెడఁగూర్చినన్నునెడయనిఁజేసెన్॥వ॥అట్టిపురుషోత్తముండుభక్తిసమ్మతులైనసజ్జనులులేశమాత్రంబగుపదార్థంబైనభక్తిపూర్వకంబుగాసమర్పించిననదికోటిగుణితంబుగాఁగైకొనిమన్నించుటకునిదిదృష్టాంతంబుగాదెమలినదేహుండునుజీర్ణాంబరుండునని చిత్తంబునహేయంబుగాపాటింపక నా చేసున్నయటుకులాదరంబుననారగించినన్నుంగృతార్థునింజేయుటయతనినిర్హేతుకదయయకాదెయట్టికారుణ్యసాగరుండైనగోవిందునిచరణారవిందంబులయందమలభక్తిప్రాభవంబులగుంగాకయనియప్పుండరీకాక్షునియందుఁబూర్వభక్తితాత్పర్యంబునందగిలిపత్నీసమేతుండై నిఖిలభోగంబులయందనాసక్తింబొరయకరాగాదివిరహితుండునునిర్వికారుండునునై యఖిలక్రియలయందుననంతునియనంతధ్యానసుధారసంబునంజొక్కుచువిగతబంధనుండైయపవర్గప్రాప్తినొందెమఱియును॥గీ॥దేవదేవుఁడఖిలభావజ్ఞుఁడాశ్రిత।వరదుఁడైనహరికిధరణిసురులు।దైవతములుగానధారుణీదివిజులకంటెదైవమొకఁడుగలఁడెభువిని॥క॥మురహరుఁడిట్లుకుచేలుని।జరితార్థునిఁజేసినట్టిచరితమువినున।త్పురుషులకిహపరసుఖములు।హరి

## శ్రీకృష్ణుఁడుసకుటుంబముగాగ్రహణస్నానమునకుఁబోవుట.

భక్తియుయశముగలుగునవనీనాథా॥అనిమఱియుఁబరాశరపౌత్రునకర్జునపౌత్రుండిట్లనియె॥గీ॥దుష్టశిక్షణంబుదురితసంహరణంబు।శిష్టరక్షణంబుసేయఁదలఁచి।భువినిమనుజుఁడగుచుఁబుట్టినశ్రీకృష్ణు।విమలచరితమెల్లవిస్తరింపు॥అనినశుకుండిట్లనియె॥సీ॥ధరణీశబలుఁడునుసరసిజోదరుఁడునవోన్నతసుఖలీలనుండునంతఁ। జటులోగ్రకల్పాంతసమయమందునుబోలెద్యుగసహ్యమైసముద్దీప్తమగుచు।రాజిల్లుసూర్యోపరాగంబుచనుదెంచుటెఱిఁగిభూసురులెల్లవరుసఁగదలి।మనుజమదగ్నిరాముఁడుపూనిముయ్యేడుమారులుఘనబలోదారుఁడగుచు।నిజభుజాదండమండితనిబిడనిశిత। చటులదంభోళిధారచిరభాస్వత్కుఠార।మహితనారాచనిర్భిన్నమనుజపాల।దేహనిర్ముక్తరుధిరప్రవాహములను॥గీ॥ఏనుమడుపులఁగావించెనెచట నేని।నట్టిపావనసుక్షేత్రమగుశమంత।పంచకంబునకపుడుసంభ్రమముతోడఁ।జనిరిబలకృష్ణులునుసంతసంబెలర్ప॥వ॥ఇట్లునిష్కల్మషులైనరామకృష్ణులులోకధర్మానుపాలనవర్తనులైద్వారకానగరరక్షణంబునకుఁబ్రద్యుమ్నగదసాం

